# విజయము

డిసెంబరు 1952 లో గవర్నమెంటు టెక్నికల్ పరీక్షలకు వెళ్ళిన పారిశ్రామిక విద్యాలయపు విద్యార్థినుల పరీక్షా ఫలితములు ప్రకటితమైనవి. విజయము పొందినవారి పేర్లు, శ్రేణులు సూచిస్తూ యిందు ప్రకటించుచున్నాము.

## కుట్టుపని హయ్యర్ గ్రేడ్

పరీక్ష వ్రాసిన 12 గురిలో 7 గురు ద్వితీయశ్రేణిలో ఉత్తీర్ణులైరి.

ద్వితీయశ్రేణి : ఎమ్. జయలక్ష్మి, ఇ. సుందరమ్మ, ఎన్. ఇందిరాదేవి, ఎన్. సావిత్రి, వి. రామమ్మ, డి. నాగలక్ష్మి. కె. రోహిణీనాయక్.

## కుట్టుపని లోయర్ గ్రేడ్

పరీక్షవ్రాసిన 13-గురులో 8 మంది కృతార్థులైరి. అందులో ఒకరు ప్రథమ శ్రేణిలోను, 7 గురు ద్వితీయ శ్రేణిలోను కృతార్థులైరి.

ప్రథమశ్రేణి : — ఆర్. పద్మ.

రాజధానిలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలైన విద్యార్థిని యీమె ఒక్కతే.

ద్వితీయశ్రేణి : టి. అమృతమ్మ, వి. ఎన్. కల్పకం, వి. విమల, ఆర్. రాజాబాయి, డి. రాజ్యలక్ష్మి, ఎస్. సుశీల, ఎ. తిరులక్ష్మి.

## ఎంబ్రాయిడరీ లోయర్ గ్రేడ్

పరీక్ష వ్రాసిన 7 గురు విద్యార్థినులు ద్వితీయ శ్రేణిలో ఉత్తీర్ణులైరి.

ద్వితీయశ్రేణి : ఎ. తిరులక్ష్మి, బి. గోదావరి, ఎన్. ఇందిరాదేవి, టి. సుభద్రమ్మ, ఎన్. సావిత్రి, వి. రామమ్మ, డి. నాగలక్ష్మి.

కృతార్థులైన విద్యార్థినుల కందరకు మా అభివందనములు. వీరికి తోడ్పడ్డ ఉపాధ్యాయవర్గమునకు మా కృతజ్ఞతాభివందనములు.

—ఆంధ్ర మహిళా సభ.

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్‌మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు, నృత్యము, గానము. |
| పారిశ్రామిక విద్యాలయము (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) | : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చు కూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము. |
| వస్త్రములపై అద్దకపుపని | : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభలో నడుపబడుచున్నది. |
| టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ | : స్త్రీలకు టైపు, షార్టుహాండు—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ. |
| మహిళా మందిరము | : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక. |
| నిర్మలాదేవి గ్రంథాలయము | : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము. |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ, శిశువుల, సంరక్షణశాల, ఉచిత వైద్యశాల—అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్‌ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణకు ఏర్పాట్లు జరుగనున్నవి. |
| ముద్రణశాఖ | : ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి వుచితంగా నేర్పబడును. |

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

# ఆంధ్రమహిళ

సంపుటి 10 :: మే '53 :: సంచిక 1



వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే.,బి.యెల్.,
సంపాదకురాలు : శ్రీమతి చన్న ఘంటమ్మ, యం.యే.,యెల్.టి.,

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్.

సంవత్సర చందా :: ఆరు రూపాయలు.

## గమనిక

ఈ విజయ సంవత్సరారంభంతో, "ఆంధ్ర మహిళ" పత్రికకు 9 సంవత్సరములు నిండి, 10 వ సంవత్సరము ప్రారంభమైనది. ఈమారు ఆంధ్ర మహిళాసభ దసరా ఉత్సవాలతోపాటు "ఆంధ్ర మహిళ" 10 వ వార్షిక సంచిక ప్రకటించే ఉద్దేశముతో, వర్షా వర్షము మే-నెలలో వెలువడే "ఆంధ్ర మహిళ" జన్మదిన సంచిక ఆపుచేయడమైనదని, రచయితలకు, చందాదారులకు, ఇతర చదువరులకు మనవి జేయుచున్నాము.

—సంపాదకురాలు.

## ఢిల్లీ ఆంధ్ర సంఘం

### ప్రత్యేక పరిషత్తు

ఈ సంఘపు ఆధ్వర్యాన నూత్న ఆంధ్రరాష్ట్ర సర్వతోముఖాభివృద్ధి సావకాశములను గురించి, శాస్త్రవిషయకమైన చర్చకై ఒక ప్రత్యేక పరిషత్తు, జూలై నెల మొదటి వారములో, ఢిల్లీలో జరుగును - 1. భూగర్భశాస్త్రము, ఖనిజసంపదలు. 2. శీతోష్ణస్థితులు. 3. నీరు, విద్యుత్తు అభివృద్ధి. 4. పరిశ్రమలు, వ్యాపారము, రవాణా. 5. పంటలు, భూములు, వ్యవసాయం. 6. ఆర్థిక చరిత్ర, పురాతత్వం, 7. భాష, సాహిత్యం, లలితకళలు. వార్తా పత్రికలు, మున్నగు విషయములపై చర్చలు జరుగును, పత్రములు సమర్పింపబడును. చర్చలలో పాల్గొన నిచ్చగించువారు, పత్రాలను పంపదలచు కొన్నవారు, సంఘకార్యదర్శికి, 59. బాబరురోడ్డు, న్యూఢిల్లి విలాసానికి వ్రాసి వివరములు తెలిసి కొనవచ్చును.



అశోకా
స్నో &
బ్రిలియన్
టైన్.




లావణ్యము, యవ్వన వికాసము, మృదుత్వము,
దీర్ఘమయిన కురులు, మనోహరమైన
లావెండరు, పరిమళమును ఒసగునవి.

అశోకా ఆమ్లా హెరాయిల్ & పొమేడ్

సుదీర్ఘ కుంతలములు, చల్ల
దనము, వసంతకుసుమ
పరిమళము, ఔషధగు
ణము వీటి ప్రత్యేకత.




అశోకా (బొరేటెడ్) టాల్కం & టాయిలెట్ పౌడర్సు

ఉత్తమశ్రేణికిచెందిన వస్తుచయముతో తయారైనవి. హాయి, నూతనో
త్సాహము, మృదుత్వము, తన్మయత్వమునొందించు పరిమళము.







FOR FINEST COSMETICS

విజయా కెమికల్సు,
కాస్మెటిషియన్సు.
15, క్లెమెన్సు రోడ్డు,
పురుశువాకం, మదరాసు-7

# ఆంధ్ర మహిళా సభలో శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగార్కి సన్మానము



ది 13-4-1953, సోమవారం సాయంకాలము ఆంధ్ర మహిళాసభలో శ్రీమతి "ఉభయభాషాప్రవీణ" ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగార్కి సన్మానము జరిగిన సందర్భములో తీసిన ఛాయాచిత్రము. కుడిప్రక్క నుండి. దిగువవరుసలో వరుసగా: శ్రీమతి బత్తులకామాక్షమ్మగారు, సన్మానసభ అధ్యక్షురాలు శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారు. శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు, మహిళాసభ సభ్యురాండ్రు.

పైపేర్కొన్న స్త్రీత్రయము. వెనుకవరుసలో కుడి నుండి మొదటివారు శ్రీమతి రత్నాల కమలాబాయిగారు, కూడా, కేసరిగారి గృహలక్ష్మి స్వర్ణకంకణ బహుమానము నుు బొందిన వారే.

శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు తెలుగు భాషాసమితివారు జరిపిన గ్రంథరచన పోటీలో, "ఆంధ్ర కవయిత్రులు" అను గ్రంథమును రచించి, ప్రభుత్వము వారిచే రూ 500. పారితోషికము బొందుట మా చదువరులకు విశదమే. ఈ పారితోషికము ది 12-4-53 న గోఖలే హాలులో జరిగిన బహిరంగ సభలో గవర్నరు శ్రీ ప్రకాశ గారు విజేతలకు ప్రసాదించినారు.

ఉభయభాషలలో పాండిత్యం, పాండిత్యమునకు తగిన రచనా ప్రాభవం, వీనిరెంటికి మెరుగుపెట్టే అనర్గళ వాగ్ధాటి గలిగి, స్త్రీజనులకు ఆదర్శనీయమైన విదుషీమణి శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు. ఈమె దీర్ఘాయురారోగ్యాశ్వర్యాభివృద్ధిగా, దీర్ఘసుమంగళిగా వర్ధమాన కీర్తితో వర్థిల్లవలెననెడి శుభాశీస్సులతో, ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు వీరిని పసుపు కుంకుమలతో సన్మానించిరి.




సంపుటి 10 :: మే '53 :: సంచిక 1

# మరియొక సంవత్సరము

ఈ మే నెలతో "ఆంధ్ర మహిళ" పత్రికకు 9 సం॥ నిండి, 10-వ సంవత్సరము ప్రారంభమైనది. పుట్టిన రోజు పండుగకు ఆడంబరంగా అలంకరించుకోవడం "ఆంధ్ర మహిళ"కు అలవాటు. అయితే యీమారు పుట్టినరోజు ఆంధ్రమహిళాసభ దసరా ఉత్సవాలతో జతచేసి జరుపుకోవాలనే కుతూహలంతో, జన్మదిన సంచికను వార్షిక సంచిక అనే నామాంతరంతో దసరాలలో ప్రకటించవలెనని నిర్ణయించినాము. ఈ విషయము ఏప్రిల్ సంచికలోనే గమనికగా మా చదువరులకు తెలియజేసియున్నాము. గనుక ఆశాభంగముండదని ఆశిస్తున్నాము.

అయినా లెక్క ప్రకారం మరియొక సంవత్సరం నిండింది గనుక, గతాన్ని ఒకసారి పునఃస్మరణ చేసుకోవడం అసమంజసం కాబోదు. ఏ ఆశయాలతో ఆంధ్ర మహిళ పత్రికను స్థాపించినామో, ఆ ఆశయాలకే కట్టుబడి, ఇంతవరకూ అన్నివిధాలా సభ్యతాపరిమాణాలను పాటిస్తూ నిర్వహిస్తున్నామని మేము విశ్వసిస్తున్నాము. అందుకు మా చదువరుల అభిమానము, రచయితల సహకారము కారణమని వేరుగా చెప్పనక్కరలేదు.

చదువరుల కోర్కెపై ఇప్పుడు పత్రికలోని కథల సంఖ్య హెచ్చించినాము. ఇదివరలో రెండు కథలు మాత్రమే ప్రకటించునది. ఇప్పుడు తప్పకుండా మూడు కథలు. ఒకొక్కక్కమారు నాల్గు కథలుకూడా ప్రకటిస్తున్నాము. అనువాద కథలకన్నా స్వంత కథలకే ఎక్కువ ప్రాధాన్యమిస్తున్నాము. ఇది కథానికాయుగం- కథలలో కథావస్తువులు ఎప్పుడూ ఒకేవిధంగా అమ్మయొక్క త్యాగమో, భార్యయొక్క శీలమో, బీదల ఆకలిబాధలో, భగ్నమైన ప్రణయమో గాకుండా, మానవ జీవితాలలోని అనేక ఘట్టాలు, ఉదాత్తమైనవి, హాస్యరసపూరితమైనవి, విషాదకరమైనవి, తీసుకుని, ఒక రెండు మూడు పేజీలలో కథానికా రూపంగా చిత్రించడం ప్రయత్నించవలసినదిగా మా రచయితలను కోరుతున్నాము. అటువంటి రచనలకు ఎక్కువ ప్రాధాన్యత యీయగలమని హెచ్చరిస్తున్నాము.

ఇప్పటివరకూ నాటిక ఒకటే పత్రికలో ప్రకటించుచున్నాము. రెండు మూడు పేజీలకు మించని చిన్న నాటికలైతే, రెండు నాటికలు మాసమాసము ప్రచురించుటకు ప్రయత్నిస్తాము.

"రాజకీయాలు" ప్రపంచ రాజకీయ రంగములోని ముఖ్యాంశముల సరళమైన విమర్శయని మా చదువరుల్లు చాలామంది తమ అభిప్రాయాన్ని తెలియజేయడం మాకు సంతోషకరమైన విషయము. "ప్రస్తుతపరిస్థితులు" లోక

వ్యవహారములపై ఒక హాస్యరసపూరితమైన విమర్శగా మా పాఠకుల నాకర్షించటం కూడ మాకు ఇష్టం కారణం. విజ్ఞానముమీద వ్యాసాలు ప్రకటించుచున్నాము. "విజ్ఞానపు వేయిపడగలు" శీర్షికకు మేము వాంఛించిన కీర్తిని విషయము లభింపకపోవుట కొంత నిరుత్సాహాన్ని కలిగించినది. ఉత్సాహముగల విజ్ఞాన పాఠకులు, పండితులు, ఇక భవిష్యత్తు లోనైనా యీ శీర్షిక యొక్క బాధ్యతను వహించవలసినదిగా కోరుచున్నాము. ఇతర వ్యాసములను, విషయ ప్రాధాన్యత ను బట్టి ప్రకటిస్తున్నాము. "సినీమా", "గ్రంథసమీక్ష" శీర్షికలు "బాలానందం" శీర్షిక యంత క్రమంగా ప్రకటించ లేకుండా ఉన్నాము. భవిష్యత్తులో ఈ విషయంలో మరికొంత శ్రద్ధ వహించగలుగుతామని ఆశిస్తున్నాము. సాధ్యమై నంతవరకు వారి రచనలను ప్రచురించి రచయిత్రులను ప్రోత్సహించుచున్నామని మా సోదరీమణులు గ్రహించియే ఉంటారు.

ప్రత్యేక శీర్షికగా కాకపోయినా, కొన్ని నెలలపాటు శ్రీ కె. ఎమ్. సౌందర్యవల్లిగారి కీర్తనలు పత్రిక ముఖంగా సోదరీ మణులకు అందించాలనుకుంటున్నాము. వానిని సహృదయముతో స్వీకరిస్తారనికూడా ఆశిస్తున్నాము.

అల్లిక పనులు అనే శీర్షికలో బొమ్మలతోసహా నెల నెలా ఒక వ్యాసం ప్రకటించాలని కుతూహల పడుతు న్నాము. దానిని గూర్చిన ప్రయత్నము చేస్తున్నాము. సోదరీమణులెందరో యీ కుట్టుపనులలో ఆరితేరి ఉంటారు. తమకు తెలిసిన విషయాన్ని పాఠ రూపంలో అందిస్తే కృతజ్ఞతతో ప్రకటించుచుంటాము.

ఇంకా ఎన్నో ఎన్నో విధాలుగా స్త్రీలకు అవసరమైన విజ్ఞానము, లోకజ్ఞానము అందివ్వాలనీ, సారస్వతాభి లాషులు, విద్యాధికులునగు సోదరీమణుల రచనలను పత్రికా ముఖంగా ప్రచారం చేయాలనీ ఆశిస్తున్నాము. సహృద యుల ప్రోత్సాహము, సహకారము ఎప్పటికన్నా ఎక్కువగా యికమీద మాకు లభించగలదని కాంక్షిస్తూ, ఇప్పటి వరకూ మాకు అన్నివిధములా సహకార ప్రోత్సాహములొసంగిన పలువురకు మా కృతజ్ఞతాభివందనములర్పిస్తున్నాము.

---

# గోపాలపురం సంగీతకళాశాల
## వార్షికోత్సవం

18 వ తేదీన గోపాలపురం బాలకోన్నత పాఠశాలలో గోపాలపురం మద్రాసు సంగీత కళాశాల సప్తమ వార్షికో త్సవం న్యా. టి. యల్. వెంకట్రామయ్యగారి అధ్యక్ష తను జరిగెను.

కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమతి ద్వారకా పార్థసారథి గారు, వార్షిక నివేదికను వినిపించిరి. తరువాత వీణ, ఫిడేలు జూనియర్ ఆర్కెస్ట్రా వీణసోలో కళాశాల ఆర్కెస్ట్రాలతో ప్రదర్శనములు జరిగెను.

అధ్యక్షుడు శ్రీ వెంకట్రామయ్యర్ కళాశాల కృషిని ప్రశంసిస్తూ, యిట్లు చెప్పిరి. "విద్యార్థులు రాగములను సమర్థతతో పాడుట చూస్తే ఇక్కడ ఉపాధ్యాయులు సమర్థులో విద్యార్థులు సమర్థులో చెప్పలేకుండా వున్నాను. ఇది వుభయుల సమర్థతను వ్యక్తపరుస్తున్నది సంస్కృతి అనేది నశించని, క్షీణించని సంపద. రాజ్యాలెన్ని నశిం చినా, సంస్కృతివల్లనే మనదేశం పేరు ప్రతిష్ఠలు నిల్చి వున్నాయి. సంగీతానికి దక్షిణాది పెట్టింది పేరు. సంప్ర దాయ సంగీతం ఒకసారి పోయిందంటే మరల పునరుద్ధ రించడం దుస్సాధ్యం అవుతుంది. గనుక యిటువంటి కళాశాలలను ప్రోత్సహించవలసి వుంటుంది. నమూహం మీద మన సంగీతం నేర్చుకొనుటకు వీలు లేదు. ఎవరి అభిరుచి వారిది. వ్యక్తిగత అభిరుచికి ప్రోత్సాహమిస్తూ నడుపుచున్నందుకు కళాశాల నిర్వాహకులను అభినంది స్తున్నాను".

తరువాత అధ్యక్షులు కుమారి కమలాదేవికి శ్రీమతి పి. సంపూర్ణమ్మ గారిచ్చిన "రోలింగ్‌షీల్డు" ను బహూక రించిరి. శ్రీ పి. పార్థసారథిగారి వందన సమర్పణతో సభ ముగిసినది.

---

# ★ నా అనుభవం ★

"విమల"

కుమారికి ప్రకృతి సౌందర్యాన్ని తిలకించడమంటే అభిలాష ఎక్కువ. అవి పరీక్షల రోజులు. రోజూ పైడాబా మీద కూర్చొని చదువు కొనేది సాయంకాలము. సూర్యాస్తమయ సమయము కనుల పండువుగా కనిపించేది. ఆకాశమంతయు బంగారు ఛాయలతో నిండుకొని సూర్యకిరణాల సౌందర్యమును ద్విగుణీకృతము గావించేది. కుమారి చేత పుస్తకము పట్టేదే కాని సగం ధ్యానం యెప్పుడు పరీక్షలైపోతాయా యెప్పుడు ప్రకృతి అందాన్ని పరీక్షిద్దామా అని వుండేది ఆమెకు ఏదో చిన్న చిన్న బొమ్మలు గీయుటలో కూడా సరదా. "అబ్బా! పరీక్షలైన వెంటనే సూర్యాస్తమయ సమయం చిత్రం వేయాలి. ఊహూ! ప్రకృతి సౌందర్యాన్ని, అది మనస్సుకు కలిగించే ఆనందాన్ని గురించి వ్యాసము వ్రాసి పత్రికకు పంపాలి", అని అనుకుంటూ వుండేది డాబామీదకు చదువు కొనుటకు వెళ్ళినప్పుడల్లా.

ఇలా రోజులు గడిచాయి. పరీక్షలైనవి. సరే! ఆ రోజు తప్పకూండా డాబా మీదకు వెళ్ళి సూర్యాస్తమయ సమయాన్ని కన్నులారా చూస్తూ వ్రాయాలను కుంది. "కుమారి! నీకు పరీక్షలైపోయినవి కదమ్మా! కాస్త యీ పంచాంగము లోని శ్లోకాలు వేరే తెల్ల కాగితము మీద వ్రాసిపెట్టమ్మా. పూజ అయ్యేక చదువు దామంటే పంచాగము లోని అచ్చు మరీ చిన్నది, కండ్లు సరిగా ఆనవు. ఎప్పటి కప్పుడే యిలా అయిపోతున్నది. వ్రాస్తావు కదమ్మా" అంటూ పంచాగం తీసి అందిస్తూ అన్నది వాళ్ళ అమ్మమ్మ "సరే అమ్మమ్మా" అంటూ అందుకుంది పంచాంగం. డాబా మీదకు తీసికొని వెళ్ళి ఆవేళకి అది పూర్తిచేసి "రేపు తప్పకుండా వ్యాసం వ్రాయాలి" అను కుంది.

ఆ మర్నాడు మహిళల క్లబ్బులో టీపార్టీ, కుమారి తల్లి ఆ క్లబ్బులో కమిటీ మెంబరగుట వల్ల తనకు పార్టీకి అంతగా వెళ్ళాలని లేక పోయినా మిగిలిన వాళ్ళు యేమనుకుంటారో అని తప్పని సరిగా తక్కిన పనులన్నీ పెందలాడే చక్కబెట్టి చిట్టి తమ్ముణ్ణి, చెల్లాయిని, కుమారికి ఒప్ప చెప్పి క్లబ్బుకు వెళ్ళింది. కుమారి తన వ్యాస రచనకు కలిగే ఆటంకము తలచుకొని ఒకసారి నవ్వుకుంది. "తానొకటి తలుస్తే దైవమొకటి తలుస్తాడం"టారు, ఇదే కాబోలనుకుంది. మూడవ రోజు నాన్నగారు ఆఫీసుకు వెళ్ళే ముందు అయిదున్నర కల్లా సిద్ధంగా వుంటే తాను ఆఫీసు నుంచి వచ్చిన వెంటనే సినీమాకు వెళ్దామన్నారు. ఇలా యెన్ని రోజులు వ్యాస రచనకు వీలు లేకుండా గడచాయో ఆమెకే తెలియదు. ఎలా అయితే నేమి ఒక మంచి ముహూర్తాన మొదలు పెట్టి ప్రకృతి సౌందర్యం యెందుకు మానవులను యెక్కువగా ఆకర్షిస్తుందో విపులీకరిస్తూ "సమస్య" అని నామకరణం చేసి ఒక వ్యాసం పూర్తి చేసింది. విద్యార్థులు, విద్యార్థినులు వ్రాసిన నాటక, పద్య, గద్యములతో నిండిన "విజ్ఞాన"మనే పత్రిక యింట్లో తెప్పించడం మూలంగా చూచి ఆ పత్రికకు వ్యాసం పంపించాలని ఆమెకు ఉత్సాహం కలిగింది.

వ్యాసం పంపి అప్పుడే నెల కావచ్చింది. కాని దానిని ప్రచురిస్తామని తెలియ జేయుట కాని లేక తిరిగి పంపి వేయడం కాని జరుగలేదు పోస్టు బంట్రోతు వచ్చే సరికల్లా కుమారి యెక్కడున్నా పరుగెత్తుకొని వచ్చేది తనకు తప్పకుండా "విజ్ఞానం" ఆఫీసు నుండి జాబు వస్తుందని. నాలుగు రోజులు పోయిన తర్వాత పోస్టు బంట్రోతు యేదో ఒక కార్డు యిచ్చి వెళ్ళాడు. గంపెడాశతో అందు కుంది కుమారి. తీరా చూస్తే "విజ్ఞానం" ఆఫీసు మేనేజరు కారణాంతరములచే వాళ్ళ పత్రిక ప్రచురించుట ఆపి వేసినామని, తిరిగి యెప్పుడు ప్రచురించ గల్గుదుమో చెప్పలేమంటూ, వ్రాశాడు. కుమారి రచనను గురించి యేమీ వ్రాయలేదు. కుమారి ముఖం చిన్నబోయింది. ఇంట్లో అంతా ఆ జాబును చూచి నవ్వేరు.

మళ్ళీ యింకొక కథను వ్రాసి యింకేపైనా పత్రికకు పంపాలని దృఢ సంకల్పం చేసుకుంది. "అభాగిని" అంటూ ఒక కథ వ్రాసి "వికాశం" అనే వార పత్రికకు పంపింది. పంపిన మరునాటి నుండి పత్రికా సంపాదకుల దగ్గర నుండి జాబుకు యెదురు చూస్తూ వుండేది. రెండు మూడు నెలలు గడచినై. చిట్ట చివరకు ఆర్థిక పరిస్థితులు బాగుండ నందున దివాలా తీసి పత్రిక సంపాదకులు మకాం ఎత్తివేసినట్లు తెలిసింది. ఈ సంగతి తెలియగానే కుమారిని వాళ్ళ యింట్లో అంతా ఆక్షేపణ చేశారు.

కుమారికి అప్పటి నుండి పత్రికలకు కథలు వ్రాయాలని వున్నప్పటికీ మనసులో అదో విధమైన బెంగగా వుండేది. తీరా తాను వ్రాసి పంపితే ఆ పత్రికలు కూడా ఆగిపోతాయేమోనని సందేహము కలిగేది. పాపం అప్పటికీ యిప్పటికీ ఆమె కిది ఒక సమస్యగానే వుండిపోయింది.



# రాజకీయాలు

* శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు *

మార్చి నాలుగో వారం మొదలుకుని ఏప్రిల్ మూడో వారం వరకూ ప్రపంచ రాజకీయాల్లో జరిగిన సంఘటనలివి :- కోరియాలో యుద్ధఖైదీల వరటాకు ప్రధానాటంకం తొలగిపోయి గాయపడ్డ ఖైదీల వరటా జరగటం, పాకీస్థాన్ ప్రధాని నజీముద్దీన్ బర్తరఫ్ కావటం, చాంగ్ ప్రభుత్వంపై బర్మా చేసిన ఫిర్యాదును సమితి ఆమోదించటం, ఆఫ్రికాలోని బ్రిటిష్ వలసల్లో అశాంతి పెరిగిపోవటం, దక్షిణాఫ్రికా ఎన్నికలలో మలాన్ ప్రభుత్వం గెలవటం.

*　　　*　　　*

యుద్ధఖైదీల ఇష్టానిష్టాలతో నిమిత్తం లేకుండా వారిని తమతమ దేశాలకు పంపవలసిందేనని వాదిస్తూవచ్చిన చైనా కిందటి నెలలో ఆషరతును వదిలిపెట్టి, అటువంటి వారిని తటస్థదేశాల ఆధ్వర్యంకింద ఉంచటానికి అంగీకరించింది. ఈప్రతిపాదనను ఇండియా ఇంతకుముందే చేయగా చైనా, రష్యాలు అంగీకరించలేదు. బహుశా స్టాలిన్ మరణంవల్ల అంతర్జాతీయ కమ్యూనిస్టునాయకత్వంలో కలిగిన లోటు మూలంగా నవచైనా బలపడవలసిన అవసరం ఎక్కువ కావటంవల్లనూ, చాంగ్ కై షెక్ మొదలైన వాళ్ళను ఆధారంగా చేసుకుని అమెరికా సైనికవర్గాలు వేస్తున్న పన్నాగాల ప్రమాదాన్ని బర్మా మొదలైన దేశాలు స్పష్టంగా గ్రహించ కలిగినందువల్లనూ, ఇండోచైనాలో వీట్మిన్ బలం పెరిగి అక్కడినుంచి చైనాకు ప్రమాదం వచ్చే అవకాశాలు తగ్గినందువల్లనూ చైనా ఈ పద్ధతికి అంగీకరించి ఉంటుందని చెప్పవచ్చును. ఖైదీల పాలనా భారాన్ని వహించే తటస్థదేశంవిషయమై ఇంకా ఒప్పందం కుదరలేదు కాని, గాయపడ్డ ఖైదీలనూ, వ్యాధిగ్రస్తులనూ మార్పిడి చేసుకునేందుకు ఒప్పందం కుదిరి అమలుజరుగుతున్నందువల్లనూ, ఏప్రిల్ 25 నుంచీ యుద్ధవిరామ ఒప్పందంపై తిరిగి సంప్రదింపులు జరపటానికి ఉభయపక్షాలు అంగీకరించినందు వల్లనూ, మొత్తంమీద కోరియా సమస్యాపరిష్కారం చూపువేపలోకి వచ్చినదని నమ్మటానికి ఆధారం కనిపిస్తున్నది.

*　　　*　　　*

రష్యానూతనప్రధాని మాలెంకోవ్ కూడా శాంతివాంఛను ప్రకటించారు. చైనా, రష్యాల వైఖరికి ప్రధాని నెహ్రూ సంతోషం ప్రకటించి, ఇది వృధాకారాదనే ఆశను వెల్లడించారు. చైనా, రష్యాల ప్రకటనలపట్ల అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్, విదేశాంగమంత్రి డలెస్‌లు ప్రకటించిన వైఖరులు ఒకటిగాలేవు. స్వయంగా సేనాపతి అయిన ఐసెన్‌హోవర్ దూరప్రాచ్య యుద్ధంలో గల సాధకబాధకాలను కొంత గుర్తించకలిగారు కనుకనే ఆయన వైఖరి కొంత సరళంగా ఉన్నది. కమ్యూనిస్టు వ్యతిరేకభావం తప్ప మరొకటిలేని డలెస్ దురుసుగా, "మాషరతులకు ఒప్పుకోనక పోతే అన్నిరంగాల్లోనూ ముందుకు సాగవలసివస్తుంది" అనిఅన్నారు. దీనిని బ్రిటిష్‌లార్డ్సు సభలోనే తీవ్రంగా నిరసించటం జరిగింది.

శాంతి ప్రయత్నాలకు దోహదంగా అంతర్జాతీయ కమ్యూనిస్టు ప్రచారసంస్థను (కొమిన్‌ఫారం) రద్దుచేయాలన్న సూచనచేయ బడుతున్నది. పశ్చిమసామ్రాజ్యాన్ని దెబ్బతీయటానికి ఆసియా, ఆఫ్రికాల జాతీయ శక్తులు పని చేస్తున్నవి కనుక, రష్యా ప్రపంచం మెప్పుకోసం ఆపని చేసినా చేయ వచ్చును.

కోరియా సమస్య ఈమాత్రమయినా దారిలో పడటానికి కారణం చైనా నిర్ణయమేనని ఇప్పుడు స్పష్టపడ్డం కనుక,

అమెరికా ఇప్పటికయినా చైనాను గుర్తించి, చాంగ్ కై షెక్‌ను వదిలివేసి తద్వారా చైనాకు భయకారణం లేకుండా చేస్తే పరిస్థితి చాలావరకు చక్కబడుతుంది. అట్లా కాకుండా, మలయా, ఇండోచైనాలనుకూడా దానికి ముడివేస్తే, వ్యవహారం చెడిపోవచ్చు.

* * *

పాకిస్థాన్ ఏర్పడినప్పటి నుంచీ మొగలాయ దర్బార్ పద్ధతిలోనే వ్యవహారాలు సాగుతున్నవి. లియాకత్ అలీ ప్రభుత్వంపై సైనికోద్యోగుల కుట్ర, లియాకత్ అలీహత్య, మతయుద్ధ ప్రచారాలు, బ్రిటీష్ సేనానులతో మంతనాలు, అల్పసంఖ్యాకులయిన ఇతర మతస్థులమీద దండనీతి ప్రయోగం, హిందూమంత్రి మండల్ పలాయనం, ఆ ఉన్మాదం పెరిగి ముస్లింలే అయిన అహమ్మదీయ తెగమీదనే దౌర్జన్యాలు జరగటం, సంపన్న దేశం కరువుకు గురికావటం ఇట్లా జరుగుతూ వచ్చినవి. ఇప్పుడు సరికొత్త సంఘటన ప్రధాని నజీముద్దీన్ భర్తరఫ్.

ఆర్థికదుస్థితిని కానీ, అరాజక పరిస్థితులను కానీ పరిష్కరించే సామర్థ్యం నజీముద్దీన్‌కు లేదని చెపుతూ గవర్నర్ జనరల్ ఏప్రెల్ 17 న ఆయన్ని బర్తరఫ్ చేసారు. దీనికి వ్యక్తిగత కారణాలుకూడా లేకపోలేదు. ఇది అక్రమమని అనటం మినహా నజీముద్దీన్ ఏమీ చేయలేక పోయినారు. ఆయనమీద చేయబడ్డ ఆరోపణలు చాలావరకూ నిజమే కావచ్చునని 1947 లో వచ్చిన బెంగాల్ కరువు సూచిస్తున్నది. అప్పుడు నజీముద్దీనే బెంగాల్ ముఖ్యమంత్రిగా వ్యవహరించారు.

అయితే కొత్త మంత్రివర్గం నజీముద్దీన్ లోపాలను సవరించి నడుచుకోలేకపోతే పరిస్థితులు చేయిదాటి పోవచ్చును. ఇప్పటికే తూర్పు- పశ్చిమ పాకిస్థాన్‌ల విభేదాలు, అంతఃకలహాలు, ఆహార క్షామాలతో బాధపడుతున్న పాకిస్థాన్ ప్రజల ఆగ్రహంనుంచి గవర్నర్ జనరల్ వారిని రక్షించటం సందేహాస్పదం.

* * *

చాంగ్ కై షెక్ సేనలు ఉత్తర బర్మాలో చేరి నానా గల్లంతూ చేస్తున్నవి. ఇప్పుడది బర్మా స్థావరాలమీద దండయాత్ర చేయటం దాకా వచ్చింది. వీటిని తొలగించమని బర్మా ఎన్నిసార్లు ఫార్మోజానూ, అమెరికానూ కోరినా ప్రయోజనం లేకపోయింది. అందువల్ల సమితికి ఫిర్యాదు చేసుకున్నది. సమితి కొమింటాంగ్‌ను పేరు పెట్టి నిందించడానికి వెనకాడిందికాని, ఉన్నవాళ్ళు దురాక్రమణదారులేనని మాత్రం స్పష్టపరిచింది. అమెరికా, ఫార్మోజాలూ, కొమింటాంగ్ సేనలు బర్మాలో ప్రవేశించటానికి ఆస్కారం కలిపిస్తున్న సయాం ప్రభుత్వమూ సమితి ఆదేశాన్ని ఎంతవరకు పాటిస్తున్నదో చూడవలసివున్నది. అది పాటించకపోతే ఆగ్నేయాసియా అంతటిలోనూ అమెరికన్లకు పచ్చి మంచినీళ్ళు ఇచ్చేవాళ్ళు కూడా లేకుండా పోతారు.

అమెరికన్ వర్గం, వారి తాబేదార్ల వైఖరివల్ల ఇండోచైనాలో కమ్యూనిస్టేతర ప్రజలో అసహ్యం ఎక్కువయిపోతున్నదని కాంబోడియా 'రాజు' తన అమెరికా పర్యటనలో వెల్లడించాడు. లావోస్ అనే మరొక రాష్ట్రంలో కూడా వీట్మిన్ సైన్యం విజయాలమీద విజయాలు సాధించటం అక్కడి పరిస్థితులను నిరూపిస్తున్నది. చైనాతో వ్యాపారంమీద అమెరికా విధించిన షరతులను సింహళం ధిక్కరించటం కూడా ఈ విషయాన్నే సూచిస్తున్నది.

* * *

కెన్యాలో కికూయూ జాతీయులను అణచటానికి బ్రిటన్ మలయాలోవలె సైనిక పద్ధతులను అనుసరిస్తున్నది. వారి నాయకుడు కెన్యాటాకు 7 సం॥ల కఠినశిక్ష విధించింది. అక్కడ వ్యవహారం అంతకంతకూ ముదిరిపోతున్నది. మధ్యఆఫ్రికా ఫెడరేషన్ (దక్షిణ, ఉత్తర రోడీషియాలు, న్యాసాలాండ్)ను ఆఫ్రికన్ల ఇష్టానికి వ్యతిరేకంగా సాధించటానికి బ్రిటన్ గట్టిగా ప్రయత్నాలు చేస్తూనే ఉన్నది. ఎంతో ఆదర్శప్రాయమయిన వలస రాజ్యమని బ్రిటన్ గొప్పలు చెప్పుకునే నైగిరియాలో ఆఫ్రికన్లకు నామమాత్రపు అధికారాలే ఉన్నందువల్ల తీవ్రరాజకీయ సంక్షోభం ఏర్పడుతున్నది. గవర్నర్ హడావుడిగా లండన్ వెళ్ళి సంప్రదింపులు జరపటం జరుగుతున్నది. మలయాలో యథాపరిస్థితిగానే ఉన్నది.

దక్షిణాఫ్రికా ఎన్నికలలో మలాన్ ప్రభుత్వపు గెలుపుతో అతడి జాతివిద్వేష విధానాన్ని తెల్లజాతులు సమర్థిస్తున్నట్లు విశదమయింది.

ఐక్యరాజ్య సమితి కార్యదర్శి పదవికి స్వీడన్ పౌరుడు హామర్ షెల్ట్‌ను అగ్రరాజ్యాలు ఏకగ్రీవంగా ఎన్నుకొనటంతో ఒక పెనువ తీరిపోయింది.

* * *

ఆంధ్రరాజధాని నిర్ణయం విషయమై ఆంధ్ర ప్రాంత శాసనసభ్యుల సమావేశం జరపవలసిందని ప్రధాని నెహ్రూ మద్రాసు స్పీకరుకు ఆదేశించినట్లు తెలుస్తున్నది. కాని వారెవ్వరికీ దానిమీద సమాధానం కుదిరినట్లు కనిపించదు. హైదరాబాదును భాషారీత్యా విభజించి తెలుగు ప్రాంతాలను ఆంధ్రలో కలపాలన్న తీర్మానాన్ని ఏప్రిల్ 11 న హైదరాబాదు కాంగ్రెసుపార్టీ తీర్మానం చేసింది. బళ్ళారి తాలూకా భవిష్యత్తు నిర్ణయానికి హైదరాబాదు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి నియమితులయినారు. మిగిలిన బళ్ళారిని తీసుకుంటున్న మైసూరునుంచి, అక్కడి తెలుగు ప్రాంతాలను ఆంధ్రకు ఇప్పించే ఆలోచన మాత్రం కనిపించదు.

భాషారాష్ట్రోద్యమ తీవ్రత ఇప్పుడు కర్నాటకానికి పాకింది. అక్కడ నిరాహార దీక్షలు, పోలీసు కాల్పులూ జరుగుతున్నవి. ఈ అక్టోబరు నాటికి కేంద్రం ఒక నిర్ణయం చేయకపోతే అన్ని పదవులకూ రాజీనామాలివ్వబోతున్నామని కర్నాటక కాంగ్రెసు హెచ్చరిక చేసింది. ఆంధ్ర రాష్ట్ర స్థాపన తర్వాత దానివిషయం చూస్తామని నెహ్రూ ప్రకటించారు.

★

# ★ ప్రస్తుత పరిస్థితులు ★

—: శ్రీమతి అచ్యుతుని గిరిజ :—

## పెళ్ళి— రిజిస్ట్రేషను :

బొంబాయి ప్రభుత్వం ఒక కొత్త బిల్లు ప్రవేశ పెట్టబోతున్నది. ఇంకమీదట జరిగే ప్రతి పెళ్ళి తప్పని సరిగా రిజిస్టరు అయి తీరాలని యీ బిల్లు సారాంశం. మత సిద్ధాంతాల ప్రకారం, సాంప్రదాయానుసారం సుముహూర్తమంటూ పెట్టి పెళ్ళి జరిపినా, ముందో వెనకో రిజిస్టరు చేస్తేనే తప్ప న్యాయశాస్త్రరీత్యా ఆపెళ్ళి సక్రమమైనదిగా వొప్పుకోరు.

ఈ రోజుల్లో కొంతకు కొంత మత సిద్ధాంతాలను, సాంప్రదాయాలను పాటిస్తున్నది పెళ్ళిళ్ళ విషయంలోనే వర్జం, వారం చూసుకుని మంచి ముహూర్తం పెట్టించి, బంధు మిత్రుల సమక్షాన అగ్నిసాక్షిగా పాణిగ్రహణం చేయటం మనలో అలవాటు. కొత్తబిల్లు ప్రకారం పై విధంగా పెళ్ళి జరపరాదని శాసించలేదు. కాని రిజిస్టరు చేస్తేగాని ఆపెళ్ళి చెల్లదని అంటున్నారు. అంటే వేదోక్తంగా సాంప్రదాయానుసారం జరిపిన పెళ్ళి మేజువాణీ మాదిరి ఒక వేడుక క్రిందికి దిగుతుంది. అంతను మించిన ప్రయోజనం వుండదు. అందువల్ల క్రమేపి ప్రాధాన్యత కూడ తగ్గుతుంది. ప్రభుత్వమేమో వద్దనలేదుగదా ప్రజలకు అభిమానం నమ్మకం వుంటే సాంప్రదాయానుసారం ముహూర్తానికి పెళ్ళివేడుక జరుపుకుని, ముందో వెనకో రిజిస్టరు చేయించుకుంటే సరిపోదా అని సందేహం రావచ్చు. ఎన్నివిధాల మర్యాదలు చేసినా, అలకలు తీర్చినా మూట కట్టిడబ్బు సమర్పించుకున్నా నాగవల్లి నిష్ఠూరం రాక మానదు. ఇంత వ్యయ ప్రయాసలకు వోర్చి, అడుగులకు మడుగులు వొత్తుతూ చేసినా అదంతా వుత్త వేడుక, విలువలేదంటే, చూస్తూ చూస్తూ అంత బాధపడటానికి యెవరు పూనుకుంటారు? అందువల్ల క్రమేపి రిజిస్టరు తోను ఒక పార్టీతోను పెళ్ళి తంతు ముగిసిపోయే పరిస్థితులు వస్తున్నవి.

ఇంచు మించుగా ప్రతి స్త్రీకి కొద్దిగానో గొప్పగానో

సొత్తు అంటు లభించేది పెళ్ళి సమయంలోనే. కొత్త వుబలాటానికికాని, వేడుకకనిగాని, లాంఛనమని పట్టింపుతో గాని పెళ్ళి సమయంలో వధువుకు సొమ్ములు, మంచి బట్టలు విరివిగానే లభించుతున్నవి యిప్పటికి. ఇంకమీదట రిజిస్ట్రరాఫీసుకు వెళ్ళి సంతకాలతో పెళ్ళి అయిపోతుందనే చుట్టపక్కాలు యెవరు రారు. చదివింపులు, బహుమానాలు వుండవు. అత్తగార్లకు, ఆడపడుచులకు ముట్టవలసిన ముద్ర ముడుపులకు అవకాశం లేకపోవటాన కోడలికి సొమ్ము అసలే పెట్టరు. ఉభయపక్షాల పెద్దలకు ఖర్చు, ప్రయాస తగ్గటాన యిబ్బంది లేకపోయినా వధువుకు రావలసిన సొత్తు తగ్గటాన ముమ్ముందు ఆమెకు కొంత ఆర్థిక బాధ కలుగుతుందని తోస్తుంది,

ఇహపరాలలో యేదృష్టితో ఆలోచించినా మానవుడి జీవితంలో పెళ్ళి ఒక ముఖ్య ఘట్టం. జీవితం పొడుగునా పొందవలసిన సంతోష సౌఖ్యాలన్నింటికి పెళ్ళి మూలం. అందుచేతనే విచ్చలవిడిగా వ్యక్తిగత స్వేచ్ఛను యివ్వక మతము, ధర్మము, సంఘము, నీతి, నియమం అంటూ పెద్దలు యెన్నో కట్టు దిట్టాలు చేశారు. కాని ఆ కట్టుదిట్టాలలో యిమిడి జీర్ణించిపోయిన స్వల్ప అవకాశాలను యెడా పెడా బయటికి లాగి మితిమీరిన వ్యక్తిగత స్వాతంత్రాన్ని సృష్టించుకుని, పెళ్ళిని చివరకు బొమ్మలాటగా పరిగణించి అధికార దుర్వినియోగం చేసుకుంటున్నారు కొందరు స్వార్థపరులు. దాంతో ఈమాటు సంఘమేగాక ప్రభుత్వంకూడ వివాహవిషయంలో ప్రసక్తి కలిగించుకుని మార్పులు తీసుకురావలసివచ్చింది. రోజు రోజుకు వచ్చిపడే ఒడుదుడుకులను సర్దుకు పోతు, వివాహంపట్ల గౌరవం కనపరుస్తు, గృహస్త జీవితం ఆనందమయంగా గడపిన ప్రజాసామాన్యం పూర్వం వున్న మాదిరిగానే యిప్పుడు కూడ వుంటారు. ఏచట్టాలు వచ్చినా పోయినా వీళ్ళకు యే యిబ్బంది వుండదు. కేవలం అహంభావంతోనో, అజ్ఞానంతోనో సంసారం నరక తుల్యంగా చేసుకున్నప్పుడే యీ చట్టాల అవసరం. ఆపరిస్థితులలో పీడితులకు న్యాయం కలిగించటానికే న్యాయశాస్త్రం, చట్టాలు కావాలి. అందరికీ ఒకేవిధంగా అవకాశం న్యాయం కలిగించటానికి కొంతవరకు అందరిని ఒక కట్టడిలో ఒకే దోవలో వుంచాలి. విడాకులకు వ్యక్తిగత స్వేచ్ఛ నివ్వక కొంత న్యాయశాస్త్ర బద్ధమైన కలాపం సూచించారు. ఆ విధంగానే పెళ్ళి జరపడానికి కూడ ప్రభుత్వంతో సంబంధించిన కలాపం కొంత వున్నదంటే అవకతవక పెళ్ళిళ్ళు అసంబద్ధపు పెళ్ళిళ్ళు జరగకుండ ఆగిపోవటానికి అవకాశం వున్నది. చాటుగా మాటుగా జరుగుతున్న బహుభార్యా విధానం పూర్తిగా నశించగలదని నమ్మవచ్చు. మొత్తంమీద ప్రతి పెళ్ళి రిజిష్టరు అయి తీరాలన్న బిల్లు మతసిద్ధాంతాలలోను, ఆర్థిక పరిస్థితులలోను, వ్యక్తిగత స్వేచ్ఛలోను, చాలామార్పు తీసుకువస్తుంది.

సాధారణంగా పెళ్ళి విషయంలో వధూవరుల ఆరోగ్య విషయం ఒక సామాన్య అంశంగా కూడ చర్చించబడటం ములేదు. ఆరోగ్యం బాగావుంటేనే చీటికీ మాటికీ వచ్చే చికాకులను, హెచ్చు తగ్గులను నవ్వుతు వోర్చుకోగల సహనం కలుగుతుంది. పుట్టే బిడ్డలు ఆరోగ్యంగా వుంటారు. కాని మిగతా విషయాలే కుదరక బాధపడుతుంటే యింక యీ డాక్టరు సర్టిఫికెట్టు బెడద ఒకటా అని కోపగించకండి. దానిని గురించి భయపడవలసిన అవసరం లేదు. ఏ జబ్బూ, బాధా లేని మనుష్యులు ప్రస్తుతం మన దేశంలో లేనేలేరు. ఇంకో శతాబ్దం వరకయినా యిట్లాగే వుంటారు. లేకపోతే కళ్ళజబ్బు ఉన్నవాళ్లు, కళ్ళజబ్బు వున్నవాళ్ళనే పెళ్ళి చేసుకుంటే కలిగే సంతానం తప్పని సరిగా జబ్బు కళ్ళవాళ్ళు అవుతారన్న సూత్రాన్ని అనుసరించి కొంతకు కొంత పరిశీలించి వర్తించితే, కలగబోయే ముప్పు కొంతవరకయినా తప్పుతుందేమోనని ఆశ తప్పనిసరి రిజస్ట్రేషనువల్ల యెటు ప్రభుత్వానికి ఆదాయం పెరుగుతుంది. కాబట్టి ఆడబ్బు కొంత వధూవరుల ఆరోగ్య పరిశీలనకు వుపయోగించితే ప్రజల ఆరోగ్యం చాలావరకు బాగుపడుతుంది. జబ్బులు వ్యాపించవు. ఆరోగ్యవంతులయి ప్రజలు హాయిగా వుంటే, ప్రభుత్వ ఆరోగ్యశాఖ డబ్బు నిలవచేయగలుగుతుంది.

# "సెల వొస్తే...."

శ్రీ సి. హెచ్. శరత్కీర్తి

(ఉదయం రవి యింట్లో)

[రవి గదిలో కుర్చీలో పడుకొని సిగరెట్ కాలుస్తూ పేపరు చదువుతూ ఉంటాడు. వయస్సు పాతిక లోపు. రాజ్యం మరో కుర్చీలో కూర్చుని పుస్తకం చదువుతూ ఉంటుంది. వయస్సు ఇరవై గాని పైన గాని ఉండవచ్చు. యిద్దరికి మధ్య టేబుల్ ఉంటుంది.

ఇద్దరు ఒక్కసారి 'హుమ్' అంటూ టేబిలు తోస్తారు. ఇద్దరూ తోయడంవల్ల శబ్దం అవుతుంది గాని టేబిలు కదలదు.]

రవి : (కొంటెగా) అబ్బా! కాలు విరిగింది.

రాజ్యం : (రవి కాలుకేసి ఓమారు చూసి, మళ్ళీ పుస్తకం లోకి చూస్తూ) ఈ నాటకాల కేమిగాని రవి! ఈవేళ ఏమైనా ప్రోగ్రాముందా మన రాజావారికి.

ర : (సర్దుకొని ఠీవిగా కూర్చుని) హుఁ రాజాగారేమిటి! ప్రోగ్రాము లేకపోవడమేమిటి! ప్రోగ్రామంటే ప్రోగ్రామా బలేప్రోగ్రామనుకో. ఒకటా, రెండా, మూడా, దశమా, శతమా, దశశ............

రా : (కంగారుగా లేచి వచ్చి రవి నోరు మూసి) బాబూ ఆపండి. ధోరణి మారుతోంది. మీకు ప్రోగ్రాముంటే నాకెందుకు? పొయ్యగడ్డలుంటే నాకెందుకు? (మళ్ళీ వచ్చి కూర్చుంటుంది)

ర : అది మహాపతివ్రతలకుండే లక్షణం. అయితే రాజ్యం, నాటకం అంటున్నావు. ఏమన్నా వ్రాస్తావా ఏమిటి? ఏదైనా పత్రికకు పంపిస్తాను. అది అచ్చుపడితే నీధర్మమా అని "ఫలానా ఆవిడగారి ఆయన" అని నన్ను చెప్పుకుంటారు. చూశావూ మీబావ చెప్తుండేవాడు కోర్టులో చెప్పమంటే "బుల్లెంకమ్మ భర్తంటారండి" అనేవాట్ట వెనకటికి ఒకాయన. అల్లాగా.

రా : మరే, పెళ్ళాం పేరు చెప్పి కులుకుదాం అనుకున్నారుగాని నేనేమీ నాటకం వ్రాయటం లేదులెండి. అయినా నీ అంతటి వాడిని చేపట్టడమే ఈ జీవితనాటకానికి నాంది అనుకో.

ర : మరి పెళ్ళంటే ఏమనుకున్నావు వెర్రిదానా? పెళ్ళి అంటేనే సంసారం. సంసారం ఒక నాటకం లాంటిది. 'సంసారం సాగరం దుఃఖమ్' అన్నారు. అంటే సముద్రం పొడుగ్గాను, గంభీరంగాను వుంటుందన్నమాట. అందులోను మనం తృణ............

రా : రవీ! నీకీమధ్య యింక్రిమెంటు వచ్చిన దగ్గర నుంచీ ఆనందమో, అడివోగాని అభినయము, అతి ధోరణీ యెక్కువయ్యాయిసుమా!

ర : బాగా చెప్పావు. నీకు యెక్కువ అవలేదని బాధగా వుందా? అంత ఈర్ష్యాసూయంబులు సుజనంబులకున్ తగవుసుమా! కాని రాజ్యం మా కంపెనీలో కూడా అచ్చంగా నీలాగే అనుకుంటున్నారుసుమా!

రా : యేమంటున్నారేమిటి?

ర : ఆ! యేముందిలే! మన రవిగారికి ఈమధ్య కవితా ధోరణి యెక్కువైందేమిటీ! కొంపతీసి ఈ కంపెనీ ఉద్యోగానికి గాని స్వస్తిచెప్పి ఏకవిరాజో అయి కూర్చుంటూరా యేమిటి, చెప్మా అని ఒకటే గుసగుసలు, ఒకటే పొగడ్డం, ఆపైన ఒక్కటే మెచ్చుకోవడం, ఆతర్వాత....

రా : మెచ్చుకోవడంగాదు. మన్నూకాదు. హడలి బేజారెత్తి చావేలేక, చాల్లేకపోతే బలాదూరని మొహార్బానీకి అల్లా అంటున్నారు కాబోలును.

ర : (కొంచెం కోపంగా) ఆ! మరే పాపం!

రా : నాకెందుకులే మధ్య. మెచ్చుకొంటే నాకెందుకు? మేకతోళ్ళు కప్పుతే నాకెందుకు? ఈపూట కూరలేమైనా తెచ్చి పడవేద్దురూ, యింట్లో మహా యిబ్బంది గావుంది పూట పూటకీని.

ర : అది! అసలు సంగతి! రానీ యింకా కూరలొకటేనా వెచ్చాలేమైనా తేవాలేమో వెతుకుతావా? యెక్కడకు వెళ్ళినా, వెడతానని అనినా, అనుకున్నా, ఆఖరికి బంజరభూమికి వెడదామన్నా గాని బిడారి ఒంటెలాగ బిఛానా మోయక తప్పదంటావు? అంతేగదూ!

రా : అల్లా బెంగపెట్టుకుని బెంబేలు పడిపోతారేమిటండీ! యెల్లాగూ యెక్కడకో వెడతానన్నారు కదా అని తెమ్మన్నానుగానీ......

ర : అయితే బజారుకు వెడతానని యెక్కడుందీ అంట!

రా : అయితే కొల్లేరు చాంతాడంత ప్రోగ్రాము యింట్లో యిల్లాలు దగ్గరేనా! కొంపతీసి అవేమైనా నాటకం రిహార్సల్సు కాదుగదా!

ర : నాటకం రిహార్సల్సు అంటే జ్ఞాపకం వచ్చింది. ఇవ్వాళ తెనాలిపేటలో తెనుగు కవుల మహాసభవుంది. దానికి మనం తప్పక ఆటెండవాలి.

రా : ఇకనేం! తెనాలిపేట కెళ్ళే దారిలోనే వుంది కూరల మార్కెట్టు.

ర : (కొంచెం సేపు ఆలోచించి) చంపేస్తావు. నేనల్లా వెళ్ళడానికేదీ! కొంపతీసి అలా వెడతాననుకు నేవు. అంత సులువుగా వెడితే యింకేంగావాలీ! ఆదారుచ్చుకుంటే, మన పనులన్నీ గోదారుచ్చుకొన్నట్టే!

రా : మరేంపనులు ములిగాయి బాబూ మనకి బజార్లో!

ర : (సీరియస్‌గా) అయితే నీకు కూరలు తేవడం తప్ప నాకింకేమీ పనుల్లేవంటావా? శ్రద్ధగా విను. యిక్కడ నుంచి బయలుదేరుతానా! తిన్నగా తక్కెరాలవారి వీధిలో దిగి, దర్జీవాడితో బట్టలు అర్జంటని చెప్పి, అక్కడనుంచి సరాసరి సరిపిల్లివారి సందులోదిగి సైకిలుకు గాలి కొట్టించుకొని, మళ్ళీ బరాబరి బమ్మెరవారి లైనులో ఉన్న కొండపల్లివారి కొట్లో చేటకి రిపేరు చేయించుకొని, తిరిగి.........

రా : ఆగండి! తిరిగి తిన్నగా హుటాహుటీని హోటలుకు పోయి, యిడ్లీ సాంబారు భుజించుకొని, అక్కడ నుంచి యెకాయెకీని యింటికి వచ్చి యెంగిలిపడి, అప్పటినుంచీ రమారమీ రాత్రి అయ్యేవరకు నిద్రతీయడం అంతేకదూ!

ర : (విస్తుబోయి కొయ్యబారినట్లు చూస్తాడు.)

రా : అల్లా చూస్తారేం! మీరు వెళ్లబోయే తెలుగు కవుల అబద్ధాల మహాసభకు మీరు తొలిపలుకు పుచ్చుకుంటే నేను స్వస్తివాచకం పలికాను. అంతేగా!

ర : రాజ్యం! నీకిన్ని తెలివితేటలు యెల్లా అబ్బాయో గాని నన్ను ఒట్టి దద్దాయి క్రింద కట్టేశావుసుమీ! నా మాటంటే.........

రా : నేనేం కట్టలేదు. అహామస్మియని మీరే కట్టుకుంటున్నారు.

ర : ఇదొకటా పైగా, ఏలాగో వివరించి చెప్పావా వినవేడుకయ్యేన్.

రా : చెప్పనా.

ర : చెప్పు.

రా : తక్కెరాలవారి వీధిలో ఉన్న దర్జీవాడు బట్టలు యిచ్చి నాలుగు రోజులైంది.

ర : మరాసంగతి నాతో చెప్పలేదేమి? చెప్పందే నాకేం తెలుస్తుంది.

రా : ఇదొక అబద్ధం. ఆ తెచ్చినవన్నీ తొడుక్కు చూసుకొని, సరిపోయాయని సంబరపడి, అయినదానికన్నా పావలా యెక్కువ యిచ్చి పంపింది మీరేగా!

ర : అవునవును. మర్చిపోయానుసుమా! అయినా నిజాకెట్లు ఇంకేమీ లేవూ వాడిదగ్గర.

రా : మరే. మీరు కుట్టించేవి కొల్లబోతున్నాయని.

ర : నేనే కుట్టించుకున్నానని నీకంత బాధగా వుండని నాకేం తెలుసు. పోనీలే, నెక్స్టు స్టెప్ పూర్తి చెయ్యి.

# "సెల వొస్తే...."

రా : సైకిలులో గాలి రాత్రే కొట్టారు. నేనే యింటి వారిని అడిగి పంపు పట్టుకొని వచ్చాను. అంచేత సరి పల్లెవారిసందు మొహమైనా చూపెట్ట నక్కరలేదు. అవునా?

ర : భేష్! బాగా ఆన్సరు చేసావు. కాని మోర్ యింపార్టెంటు బేటరీ రిపేయిర్ మాట మర్చిపోయినట్టున్నారు రాణీ మేమ్ సాబ్.

రా : బేటరీ రిపేయిర్ లేదు బండలూలేదు. బమ్మెరవారి సందులో యెవరో మన మెరుగున్న పోతరాజు వుండి వుంటాడు. అందుకని కాకపోతే మూడు నెలలాయె అది మూలపడి, యిప్పుడు నేను కూరలు తెమ్మన్నానని అది జ్ఞాపకం వచ్చిందిగాబోలు!

ర : నువ్వు జ్ఞాపకం చెయ్యమంటే చెయ్యవాయెను. ఎన్నని నేను చూసుకునేది చెప్పు! నే నేమన్నా సున్నకుసున్నా హాళ్ళికి హాళ్ళీ చుట్టావు. మీటింగైనా ఉందంటావా లేదంటావా?

రా : యింకా మాయమాటలేనా. మీరు చెప్పిన మీటింగు మూడు రోజులక్రితమే అయిపోయిందిగా. యింక వెళ్ళడ మెందుకు?

ర : అయిపోయిందని యెవరు చెప్పారు?

రా : ఆంధ్ర పత్రిక కరెస్పాండెంటుగారి భార్య చెప్పింది. వాళ్ళాయిన యిక్కడ సభవిషయాలన్నీ నిన్ననే పంపించేసారని.

ర : యిహ నేం యింట్లో కూర్చుంటే యేంగాక! బాగానే న్యూస్ పోగుచేస్తున్నావు. యింగువ కట్టిన గుడ్డలో ప్రతిభ పోనిచ్చావుకాదు, నాలుగు ముక్కలు నేర్చి నందుకు.

రా : పోనీలెండి, మీయిష్టం వచ్చినట్లు అనండి. ఉన్న దున్నట్లు చెప్పితే వుప్పెన ఊరిమీదకే వస్తుందిట!

ర : ఇంతకూ నాచేత కూరలు మోయించడానికేగా ఈ శ్రమ అంతాను. కాని యేం చేస్తాను? ఏమిటో కావాలో తేవాలో వరుస వారీగా శెలవియ్యి.

రా : నే నేం కలగన్నానా బజారులో యేయే కూరలు ఉన్నాయో? యేముంటే అవే తెండి. ఈపూటకు వుల్లిపాయ పులుసు, పప్పు చేస్తాను.

ర : ఫస్టు! యికనేం. అయితే రాజ్యం, నువ్వు తల్చుకుంటే కలనే కనక్కరలేదు. ప్రత్యక్షంగానే కనగలవుగా!

రా : ఆ! నేను కనటానికి మోజు పడడం లేదులే!

ర : పడకపోతే మాత్రం తప్పుతుందా?

రా : (కొంచెం కోపంగా) ఆఁ మరే!

ర : అంత పుక్రోషం యెందుకు? కనడం అంటే చూడడం అని కూడా అర్థం వున్నదని తెలీదూ!

రా : చిత్తం! పెంద్రాళే రండేఁ!

## ౨

(మరికాస్సేపటికి రవి యింట్లో)

ర : (హడావిడిగా జోళ్ళు పెద్ద శబ్దం చేసుకుంటూ వస్తాడు) రాజ్యం.

రా : పలుకదు.

ర : రాజ్యం.

రా : ............

ర : రాజ్యం, ఓ రాజ్యం, ఓహో రాజ్యం, నా రాజ్యం, స్వరాజ్యం, మదీయ రాజ్యం, భవదీయదాసుండు...

రా : (లోపలినుంచి వస్తుంది నెమ్మదిగా) అబ్బబ్బ! మీ ధోరణి మీదేగాని యివతలవాళ్ళ అలికిడైనా ఆలకించరు కదా! ఏమిటా కేకలు కొంపమునిగిపోయినట్లు.

ర : అందుకనేనా యేమిటంత హడావుడిగా వస్తున్నావు? అడుగులో అడుగు వేసుకుంటూ కైలాస సరోవరంలో రాజ హంసలాగ.

రా : చాల్లెండి. మీ కవిత్వాని కేమిగాని కూరలేమైనా తెచ్చారా?

ర : మరి వూరికినే చేతులూపించుకుంటూ వచ్చాననుకున్నావా నీలాగ?

రా : నేనె ఊరికే రాలేదు. యివిగో మంచినీళ్ళు.

ర : (మంచినీళ్ళు త్రాగి) చూడు సంచీలో ఉన్నాయి కూరలు. వీటికోసం చచ్చేననుకో యెండలో తిరగలేక.

రా : అయ్యో పాపం! అందుకనే గాబోలు చేతిలో సంచైనా కనిపించలేదు. ఏదో కొద్దిగా తెస్తే సరిపో యేదిగా.

ర : కొద్దో గొప్పో తీరా బయలు దేరిన తరువాత.

రా : యింతకూ సంచీయేదీ.

ర : అదిగో డ్రాయరుమీద ఉందిగా. యెదురు చూసి చూసి నీకుసంచీ కన్పించడం లేదల్లే వుంది పాపం!

రా : (సంచీతీసి కూరలన్నీ క్రింద బోర్లిస్తుంది) అరపంపు దొండకాయలు, ఆరు జొన్నకండెలు, అణా పచ్చిమిరప కాయలు, సవాశేరు వుల్లిపాయలు, యివ్వేనా బాబూ తెస్తి.

ర : (మాట్లాడడు ముఖం అటువైపుకి త్రిప్పుకొని వూరికే గుండెలు పైకి క్రిందికీ యెగరేస్తూ ఉంటాడు)

రా : ఓ సబ్బ! సంతంతా చక్కపెట్టేసి నట్టే వగురుస్తు న్నారే.

ర : సంత అంతా సంకనెట్టేసు కొచ్చేందుక్కు నేనేం హిరణ్యాక్షుడననుకున్నావా?

రా : కాదు హిరణ్య గర్భుడ వనుకున్నాను.

ర : అంటే యేమిటో నీవుద్దేశం.

రా : అంటే యేముంది. కొల్లేటి చాంతాడంత పనులు కొంచెం సేపట్లో చేసేసుకొని, సంతర్పణకు సరిపడ్డ కూరలు క్షణంలో తెచ్చి పారేసారంటే ఆ విశ్వకర్మకు వినా, యెవరికి చేతవుతుంది చెప్పండి.

ర : అయితే, నేనూరికే చక్కరకొట్టేసి వచ్చాననుకున్నావా?

రా : లేదులెండి. చెప్పులు కొనుక్కుని తెచ్చుకొన్నారని గ్రహించాను.

ర : పాపం! నీకేమీ కొనలేదని బాధగా వుంది కాబోలును.

రా : లేదులెండి. మీసాను భూతికెవరూ చెయ్యిచాపడం లేదిక్కడ. నాకేమీ కొన అక్కరలేదు.

ర : కొనడం అంటే జ్ఞాపకం వచ్చింది. తక్కిరాల వారి అల్లుడు సైకిలు మంచిది కొన్నాడుసుమా!

రా : అందుకనా ఇంత త్వరగా వచ్చారు. పాపం మనం ఫ్రులుముకోలేదని బెంగమల్లేఉంది.

ర : మరే! ఫులుముకొందామన్న పంకమూలేదు. పంకమున్న మా రాజులు పామా పామరు.

రా : ఒకళ్ళు పామలేదని యెదురు చూడ్డం యెన్నాళ్ళు? మన పంకం.....

ర : అయినా నేనా ఉద్దేశంతో అనలేదు. అంత వుక్రోష యెందుకు.

రా : అనక పోయినా అర్ధమౌతోంది.

ర : అతితెలివి తేటలున్న వాళ్ళకు అల్లాగే అర్ధమౌతుంది.

రా : మోతాదుగా వున్న వాళ్ళనే చేసికోవలసింది.

ర : తీరా చేసుకొన్నాగా.

రా : (కన్నీళ్ళతో) ఈసారి చేసుకుందురుగాని లెండి.

ర : ఛీ! ఏమిటా మాటలు రాజ్యం. నీకేం మతిపోయిందా? నోటికి యెంతవస్తే అంత. ఎన్నేళ్ళు వస్తే యేం! జ్ఞానం లేకపోయినతరువాత.

రా : నా యేళ్ళకేం. ఆయువుంటే సరి అవే హెచ్చవుతాయి. మీ జీవితానికి యెదుగు బొదుగు ఉండదుకాని (విసురుగా లోపలికి పోతుంది.)

ర : (గట్టిగా) పోనీలే. యేంచేస్తావు పాపం! యిప్పుడఘూరించి ఏం లాభం.

## 3

(మరి కాస్సేపటికి రవి యింట్లో)

(రవి రాజ్యం చెరొక పడకకుర్చీలో పడుకుని వుంటారు. యిద్దరూ విసన కర్రలతో విసురుకుంటూ ఉంటారు. ఒకరికేసి ఒకరు చూసుకుంటూ ఉంటారు. అనుకోకుండా ఇద్దరి చూపులు కలుస్తాయి.)

ర : అబ్బ! వెధవ ఉక్క చంపేస్తోంది.

రా : చేతకాకపోతే సరి!

· కాకపోయిన దేమిటి?

రా : భోజనం.

ర : ఊజ్జీ సరిపోయిందిగా.

రా : నా కాకలిలేదు. మీకు పడ్డిస్తాను.

ర : నాకూలేదు. నీకు కొంచంగా ఆకలివుంటే నడు తిం దువుగాని.

(తాతయ్య వస్తాడు.)

తా : అమ్మాయీ రాజ్యం! యేం చేస్తున్నావమ్మా, ఈ మధ్య రావడంలేదు. ఈవాళ శెలవురోజు కదా, అర గాడుకూడా వుంటాడు. యిద్దర్నీ చూసినట్లుంటుందన్ని బయల్దేరాను. ఏడీ అరగాడు వున్నాడా?

ర : యిక్కడ వున్నాడు తాతయ్యా.

తా : వున్నావాబాబూ! అమ్మా రాజ్యం! నాకు కాస్తంత మంచినీళ్లు తెచ్చి పెట్టమ్మా. కంఠం యెండిపోతోంది. మరీ యెండలు మండిపోతున్నాయి. కులాసాగా వుం టున్నారురా బాబూ!

రా : (వెళ్ళి మంచినీళ్ళు తెచ్చి యిస్తుంది.)

ర : (ఏదో అనబోయి రాజ్యం రావటం చూసి మాట్లా డడు.)

తా : భోజనాలు అయ్యాయా అమ్మ?

రా : (మాటలాడదు.)

తా : ఏమర్రా ఇద్దరు ఉలుకరూ పలకరూ.

ర : (తాతయ్య కళ్ళల్లోకి గుచ్చినట్లు చూస్తుంటాడు.)

తా : అల్లా చూస్తావేంరా బాబూ! మైనాగోరింకలా కూచుని మాటాడ కుండా.

ర : చిలక నేర్పింది.

తా : ఏమమ్మా రాజ్యం, భోజనాలయ్యాయా?

రా : (మాటలాడదు)

తా : ఇహ నేం మంచి ఆటపట్టుకే అందుకొన్నాను కాబోలు. ఈవాళ మీ యింట్లో ఏకాదశి చేస్తున్నట్లు న్నారే.

ర : యేం, యిూకేస్తే నా యింట్లో [illegible] చేస్తా మనుకొన్నావా?

తా : సరే. [illegible] మహారాజుని [illegible] వుండేదే దొంతలో [illegible] పోయి [illegible].

ర : లేదు పచ్చినా [illegible]. ఈనాడు నా యింట్లో వంటా [illegible].

తా : అదేమర్రోయ్. అదేం [illegible]?

ర : ఆనాటి నమూన.

తా : ఏమిటమ్మాయి, అల్లా అంటావేమిటి?

రా : అగోచరమైతా[illegible]రంటే. ఈవాళ ఫ్లిపోయి [illegible], సత్ర్యాన్ని చేశారు. అందుకని అల్లా అంటారు కాబోలు.

తా : బూజిప పూనసన్నట్టేవుంది. వెధవ భాష. వెధవ భాషనీ. మరీ తెలివి మీరిపోతున్నారు ఈకాలపువాళ్లు.

ర : మరే. మీ కాలపువాళ్ళమల్లె యిల్లాలి మాట మాత్రం మీరలేకపోతున్నాం! ఆగోసాయి చిట్కా ఏమిటో చెప్పదూ!

రా : యిల్లాలు. యిలకోడిని. వాళ్ళు సినకుంగాా కొట్టి కోపండం వేశేశారు. వీళ్ళు విడేసి వృద్ధరించి పూరేగిం చేస్తున్నారు. గోసాయి చిట్కా లట. గోసాయిచిట్కాలు యెరుగనమరు. కాదారి కిటుకులు యెరుగనమరు.

ర : అన్ని కిటుకులు నాకే తెల్సును. యెవరికీ యేం తెలి యదు. పాపం. నంగనాచి వంగనుల్లులు.

రా : వంగనుల్లు యెవరో సమానం అందరికే తెలుసు.

ర : చిటకాలెనరెరుగనమరో నుట్టాలంపిరు రాబోనుగనము.

రా : అందుకనే ముందే వద్దుమొర్రో అన్నాను. నా మాటలు వినేదెవరూ?

ర : అక్కడికి నేనే మహా కావాలని దేవుళ్లాడినట్టు.

తా : ఏమిట్రా? యేమిటి? ఆగండి. ఆడద్దన్న దేమిటి, కావాలన్న దేమిటి?

రా : లేదు పాపం మేము పాకులాడాం.

ర : కాదు పాపం మేమే ప్రాధేయపడ్డాం.

రా : అవును. ముహూర్తానికి అవును.

ర : కాదు, ఒక్క నాటికి కాదు.

రా : పోనీలెండి. నేనే కావాలన్నాను.

ర : అక్కర లేదులే. నేనే అవాలనుకొన్నాను.

రా : కావాలని దేవుణ్ణి ప్రార్థించాను కనుకనే మందులమారి దాన్నని బిరుదులిచ్చారు.

ర : అవాలని అఘోరించాను కాబట్టే మాయల మరాఠీ అని తోక తగిలించుకొన్నాను.

తా : యేమిట్రా ఒకళ్ళూ ఆపరూ. పనస చదివినట్లు అల్లా అంటున్నారేమిటి?

ర : మరి నువ్వుమాత్రం చెప్పమంటే చెప్పవేం మరీ?

రా : అన్ని మంత్రాలు మనకే వచ్చు.

ర : తంత్రాలు మాత్రం తెలియవులే. అదీ నయమేగా. (తాతయ్యకేసి చూస్తాడు)

తా : ఒరేయి! యింతకీ నే తంత్రం పెట్టేందుకు వచ్చానంటావా?

ర : పెట్టిన వాళ్ళనే అన్నానులే. నీకేందుకు ఆవులుకు.

తా : ఆకురాయిలా అంటావురా బాబూ.

ర : నేను మరే. నేను ఆకురాయిని. మీరు అనాస పళ్ళూనూ.

తా : యేమిటి రాజ్యం. ఏమిటిదంతా. నాకయోమయంగా వుంది.

ర : విభూతి పెట్టిస్తానులే.

రా : యింతకూ నేకూరలు తెమ్మనడం మరిచిపోయింది.

ర : యింతకూ నేవెళ్ళడం తప్పించింది.

రా : అవేనా తెస్తే అని అడగడం పొరపాటైపోయింది.

ర : అడగని దానికూడా చెప్పడం గ్రహపాటై పోయింది.

తా : బాగుందర్రా, బాగుంది.

ర : బాగావుంటే విను.

తా : యింతకూ నే యిల్లా రావడం యీలాంటి సమయంలో.

ర : నీ కలవాటై పోయింది.

తా : యేం చక్కగా మాట్లాడుతావురా నాయనా. యెక్కడా తడుముకోవుగదా! అమ్మాయీ రాజ్యం యికనే వెడతాను.

ర : మరే. శాంతంగాని సబబు చెప్పకుండా వెడతావా?

తా : శాంతంగా సాయంత్రానికన్నా అవుతుందా అని? అబ్బాయి! అసలు నువ్వన్నదే చెప్పమ్మా, మంచివాడివి.

ర : తక్కెరాల వారి అల్లుడు సైకిలు మంచిది కొన్నాడూ! అన్నాను. అంతే! అప్పటినుంచి పట్టుకుందా యిల్లాలు.

రా : ఒంకిన ముల్లులా అనండి.

తా : వుండు రాజ్యం. అతడేమన్నాడని అల్లా అంటావు.

రా : లేదు పాపం! అన్నీ నేనే అన్నాను. యెవరు ఏమీ అనలేదు. అందరూ నన్నే అంటున్నారు అనండి.

తా : నిన్నెవరన్నా రమ్మా అల్లా యిదవు తావు.

ర : విన్నావా తాతయ్యా!

తా : అబ్బాయి యెవరో సైకిలు కొనుక్కుంటే మీకెందుకురా కంఠశోష? కావలస్తే నువ్వూ కొనుక్కో కూడదూ!

రా : అదికాదు తాతయ్యా! తక్కెరాల వారమ్మాయినసలు వీరికిస్తానన్నారుట మొదట. ప్రారబ్ధ ఖర్మాన అది తప్పి మన పాలబడ్డారు. మన మల్లాంటివేమీ పెట్టి పూజించలేదని దెప్పి చంపుతున్నారు.

ర : దెప్పి చంపుతున్నారని చెప్పకపోతే, పెట్టి పూజించమని చెప్పకూడదూ!

తా : ఒరేయి నీకేదన్నా కావాలంటే అబ్బాయి నడగ కూడదా. నీకేమన్నా కొత్తమామగారా, కుర్ర దాన్నంటే మధ్య అదేం బోధపడుతుంది చెప్పు?

ర : నేను మాత్రం కానిమాటలేమన్నాను.

రా : ఏమీ అనలేదు పాపం.

# "సెల వొస్తే...."

తా: ఏమన్నావురా నాయనా.

ర : అతి తెలివి అన్నాను.

రా: పాపం.

ర : ఈసారి మోతాదుగా వున్నవాళ్ళను చేసుకుందురు గాని లెండి అంది. ఛీ! అవేం మాటలన్నా. తప్పా తాతయ్యా.

తా: ఛీ! అలాంటి మాటలు అనవచ్చా. వినవచ్చా.

రా: చూశావా, చూశావా తాతయ్యా, యెల్లా దాస్తున్నారో, అన్నమాట చెప్పకుండాను.

ర : యేమన్నా రేమిటి?

రా: ఏళ్లట. యేళ్ళు వచ్చేస్తున్నాయిట నాకు. జ్ఞానం రావడంలేదుట.

తా: అదేమిట్రా. దానికిగాని నీకు రావటంలేదూ ఏళ్లూ. దానికివస్తే మరో మూడు నీకు వచ్చినట్లుగా. యెంత చెప్పినా నీకన్న చిన్నదేగా అది.

ర : తనేం తక్కువందా అడుగు.

రా: నే నేమన్నా నేమిటి?

ర : జీతంట. జీతం తక్కువట. ఎదుగూ బొదుగూ లేదుట. యిప్పుడు విచారించి యేం లాభం? చేతులుకాలిం తరువాత ఆకులు పట్టుకున్నట్టు. చెప్పు తాతయ్యా.

రా: నేను చెప్పలేదు. ఒకళ్ళ పెట్టుకోసం యెదురు చూడ్డం యెందుకు? మనమే కొనుక్కోవచ్చుగదా అన్నాను.

ర : పాపం.

రా: పోనీలెండి.

తా: యికనేం యిద్దరు సమానంగానే అనుకున్నారు. నువ్వు దాన్ని ఏళ్ళు పెట్టి దెప్పితే అది నిన్ను జీతం చూపించి దెప్పింది. సరిగా సరిపోయింది. కావాలని చేసుకున్న సంసారంలో కీచులాటలు మాత్రం తప్పవు తాయ్రా. నడవండి. అందుకనే మగువని వయస్సు, మగవాడిని జీతం అడగకూడదంటారు పెద్దలు. మీ యిద్దరు శాస్త్రాన్ని ఋజువు చేసి పుణ్యం కట్టుకున్నారు లెండి యివ్వాళ......

ర : నువ్వు కష్టపడకుండా అంతా పుణ్యం కట్టుకున్నావుగా.

తా: మరే. మాటలకేంలే. నడవండి. అపరాహ్నం అయింది. అన్నం తిందురుగాని. కుర్రతనపు పనులూ మీరున్నూ. పండక్కి సైకిలు కొనిపించి యిచ్చేబాధ్యత నాది నడు నాయనా.

ర, రా: నువ్వుకూడా తిందువుగాని రా తాతయ్యా.

తా : నేను తినకుండా చేసుకొన్నారుగా దంపతులు.

ర : లేదులే. రాజ్యం! దొండకాయ వేయించు తాతయ్యకు. తాతయ్యకు ఇష్టం.

రా: మీరు తెచ్చారని తాతయ్యకు యిష్టమవాలిగా బోలు తప్పని సరిగా.

ర : పోనీలే. నీవు వండేవనైనా తింటాడుగా.

తా : మళ్ళీ మొదలా. నేనేదైనా తింటానుగాని రాత్రికి మీ వుభయులను భోజనానికి రమ్మనమని మీ బామ్మ చెప్పింది. మీరు వస్తానంటే నేను తింటాను.

ర, రా : (ఒకళ్లకేసి ఒకళ్లు చూసుకొంటారు.)

తా : ఏమర్రా మాటాడరూ.

రా: ఆయన యిష్టం.

ర : అవిడయిష్టం.

తా: యెవరు యిష్టం అక్కరలేదు. నా యిష్టం యిద్దరు ఒక్కసారి వస్తాం అనండి. అంటే నేనుంటా నిక్కడ.

రా, ర : సరే, వస్తాం.



## శ్రీ కస్తూరిబా మహిళా పాఠశాల

పెద్దాపురంలో శ్రీమతి సరోజనీదేవి గారిచే స్థాపింప బడిన పై పాఠశాల సప్తమ వార్షికోత్సవము శ్రీ దాసరి రామచంద్రరావు బి.ఎ (డిప్యూటీ కలెక్టరు) గారి అధ్యక్షతను, ఆర్య వైశ్య సత్ర భవనములో 27-3-53 శుక్రవారమునాడు జరిగినది. ఆ సభాకార్యక్రమములో బ్రహ్మశ్రీ ఓరుగంటి నరసింహయోగిగారు దివ్య ప్రేమను గూర్చి మహోపన్యాసము నిచ్చినారు. పై పాఠశాలలో తరిఫీదు పొందబడిన చిన్న బాలికలు. శ్రీ చింతామణిభట్ల పద్మావతీ దేవిచే రచింపబడిన 'జడ ప్రకృతి' యను నాటికను, పుష్పవిలాసమను నృత్యనాటికయు, జైహిందను రాష్ట్రగీతమును కడుమనోజ్ఞముగా ప్రదర్శించిరి. శంకరపార్వతిగా అన్నపూర్ణ, దేవి సుగుణమణియు, రాధాకృష్ణులుగా వాణీ, సత్యవతులు, అత్యపూర్వమైన భంగిమలం బ్రదర్శించిరి. శ్రీ చింతామణిభట్ల లక్ష్మీబాయమ్మగారు, వెటర్నరీ డాక్టరుగారు, శ్రీమతి పాపాయమ్మగారు ఇంకను కొందరు బాలికల ప్రోత్సాహమునకై బహుమతుల నొసంగిరి. పై కార్యక్రమముతో పాఠశాల సప్తమ వార్షికోత్సవము జయాజయా రావములతో జరిగినది.

విజ్ఞానం:

# ★ విద్యుచ్ఛక్తి వికాసం ★

* శ్రీ వేమరాజు భానుమూర్తి *

విద్యుచ్ఛక్తి ఈనాడు మానవునకు నమ్మిన బంటు. నేటి నాగరికతకు జీవగర్ర. మానవజాతికి మహోపకారి అయిన ఈ విద్యుచ్ఛక్తిని అసలు ఎవరు ఏవిధంగా కనిపెట్టారో ఇప్పుడు తెలుసుకోవడానికి ప్రయత్నిద్దాం.

మానవుడు కనిపెట్టిన మొదటి విద్యుత్తు స్థిర విద్యుత్తు. దీనిని ఇంగ్లీషులో 'స్టాటిక్ ఎలెక్ట్రిసిటీ' అంటారు. ఆరు వందల సంవత్సరాలకు పూర్వం థేల్స్ అనే ఒక గ్రీకు వేదాంతి వుండేవాడు. ఆయన గుగ్గిలంతో ఏవో పరిశోధనలు చేస్తున్నాడు. ఈ గుగ్గిలానికి అసాధారణ లక్షణాలేమిటో ఉన్నట్టు కనుగొన్నాడు.

ఒకసారి ఒక గుగ్గిలం కడ్డీ తీసుకవచ్చి దానిని బట్టతో గట్టిగా రుద్దాడు. ఉన్నట్టుండి ఈ కడ్డీ చిన్న చిన్న ఈకలను, జీలుగబెండు ముక్కలను, తనకేసి ఆకర్షించుకొంది. ఈవిధంగా ఆకర్షించబడినవి ఆ కడ్డీకి అంటుకుపోయాయి. ఇలా కొంచంసేపు వున్నతరువాత అవి వూడిపోయాయి. కాస్సేపువుండి గుగ్గిలం కడ్డీని మళ్ళీ రుద్దాడు. అది మళ్ళీ పక్షి ఈకలను, బెండు ముక్కలను తనకేసి ఆకర్షించింది.

ఇవి ఈవిధంగా ఆకర్షించబడ్డానికి కారణం విద్యుచ్ఛక్తి. కాని ఇలా జరగడానికి కారణం ఏమిటో థేల్స్ సరిగా వివరించలేకపోయాడు. ఈసంగతి చిన్నప్లినీ అనే రోమనుకి కూడా తెలుసు. ఈ ప్లినీ క్రీ.శ. 114 వ సంవత్సరంలో కాలధర్మం చెందాడు. ఏదైన బట్టపెట్టి రుద్దినప్పుడు ఈ గుగ్గిలం కడ్డీ ఎంత విచిత్రంగా ప్రవర్తిస్తుందో గమనించాడు. అంతేగాదు, సూదంటురాయి లోహములను ఆకర్షిస్తుందనే సంగతి అతనికికూడా అప్పుడే తెలుసు, కాని, సూదంటురాయి లోహాలను ఆకర్షించడానికి, గుగ్గిలం కడ్డీ పక్షి ఈకలను ఆకర్షించడానికి గల సంబంధాన్ని గురించి ఆయన ఆలోచించలేదు. ఈ స్థిర విద్యుత్తునే ఘర్షణ విద్యుత్తు అని కూడా అంటారు. దీనికి సంబంధించిన భౌతిక శాస్త్ర భాగాన్ని ఇంగ్లీషులో "ఎలక్ట్రో స్టాటిక్స్" అంటారు.

ఇంగ్లండు దేశాన్ని మొదటి ఎలిజబెత్ రాణి పరిపాలిస్తున్న కాలంలో డాక్టర్ "విలియమ్‌గిల్‌బర్ట్" అని ఒక వైద్యుడు వుండేవాడు. ఆయన చాల తెలివైనవాడు. ఆయన విద్యుచ్ఛక్తి స్వరూప స్వభావాలను తెలుసుకోడానికి ప్రయత్నించిన వారిలో అగ్రగణ్యుడు. కేవలం గుగ్గిలమే కాకుండా గంధకం కడ్డీ, గాజు కడ్డీకూడా బట్టతో రుద్దినప్పుడు గుగ్గిలం కడ్డీవలెనే ప్రవర్తిస్తాయి అని తెలుసుకున్నాడు.

ఈవిధంగా ఈబాపతు వివిధపదార్థాల స్వభావాలకు సంబంధించిన శాస్త్రభాగానికి "ఎలక్ట్రిక్స్" అన్నాడు. ఈ "ఎలక్ట్రిక్స్" అనేది గ్రీకుమాట. దీనికి అర్థం గుగ్గిలం అని. మనం ఇప్పుడు వాడుకచేసే "ఎలక్ట్రిసిటీ" అనేమాట ఇందులోంచే పుట్టింది. ఈసందర్భంలో తాను గమనించిందంతా గిల్‌బర్టు గ్రంథస్థం చేశాడు. తరువాత, తరువాత, "విద్యుచ్ఛక్తి"ని గురించి పరిశోధనలు చేసినవారికి ఈ పుస్తకం ఎంతో వుపకారంగా పరిణమించింది.

"స్థిరవిద్యుత్తు" చాల తేలిక. శీతకాలంలో ఏరోజునైనా తివాసీమీద కొంచెందూరం నడిచి. పక్కనే ఉన్న మరో కర్ని ముట్టుకున్నా, తలుపునున్న లోహపు గడియను ముట్టుకున్నా. విద్యుచ్ఛక్తి ప్రవహించినట్టు వళ్ళు జల్లు మనటం అనుభవంలోనికి వచ్చేవుంటుంది. ఎవరేనా సరే రబ్బరు దువ్వెనను తీసుకు వచ్చి ఉన్నిగుడ్డతో గట్టిగా రుద్దితే అది చిన్న చిన్న కాగితం ముక్కలను ఆకర్షిస్తుంది. అంటే ఉన్నితో రుద్దినప్పుడు ఈదువ్వెన్నకు ఋణవిద్యుత్తు పుడుతుంది. అలాగే గాజు కడ్డీని తీసుకువచ్చి పట్టుగుడ్డతో రుద్దినప్పుడు దానికి ధనవిద్యుదావేశం కలుగుతుంది. ఒకే రకం విద్యుదావేశం కల రెండు వస్తువులను దగ్గరకు తీసుకువస్తే అవి ఒకదానిని ఒకటి తిరస్కరించు కుంటాయి. పర

# విద్యుచ్ఛక్తి వికాసం

స్పర వ్యతిరేక విద్యుదావేశం కల రెండు వస్తువులు పరస్పరం ఆకర్షించుకుంటాయి. ఈ విధంగా ధనవిద్యుదావేశం లేక ఋణ విద్యుదావేశం గాని కల వస్తువులు ఎట్టి విద్యుదావేశం లేని వాటిని ఆకర్షిస్తాయి.

జీలుగ బెండుతో చిన్న వుండచేసి దానికి దారం పోసి వేళ్ళాడ కట్టండి. ఆతరువాత ఒక రబ్బరు దువ్వెనను తీసి ఉన్ని గుడ్డతో గట్టిగా రుద్దండి. అప్పుడు ఈ దువ్వెనను ఆబంతిదగ్గరకు తీసుకు వస్తే ఆబంతి దువ్వెనకేసి ఆకర్షింపబడి దానికి అంటుకు పోతుంది. అప్పుడు ఈ బంతి దువ్వెన్నకు కల విద్యు దావేశంలో తాను కొంత స్వీకరిస్తుంది. తరువాత ఏక విద్యుదావేశం కల రెండు వస్తువులు పరస్పరం తిరస్కరిస్తాయి కనుక ఈ బంతి దువ్వెన్నకు దూరంగా నైదొలగుతుంది. అప్పుడు కనుక ఇందాకటి ఉన్ని గుడ్డను తీసుకు వచ్చి ఈ బంతిదగ్గరగా పెడితే అది దీని కేసి ఆకర్షింప బడుతుంది. ఇందుకు కారణం లేకపోలేదు. దువ్వెనకు రుద్దడం వల్ల ఈ బట్టకు విద్యుదావేశం కలిగింది. అందుచేతనే దువ్వెన నుంచి ఋణ విద్యుదావేశం పొందిన బెండుబంతి, విద్యుదావేశంగల బట్టకు ఆకర్షితమైంది.

విద్యుచ్ఛక్తి అనేది వస్తుతః ద్రవంకాదు కాని దానికి ద్రవ లక్షణాలున్నాయి. ఋణవిద్యుత్తు, ధనవిద్యుత్తు అనబడేవి రెండూ విద్యుచ్ఛక్తి ద్రవంవలె వక వస్తువు నుంచి మరొక వస్తువుకు ప్రవహిస్తుందనే అభిప్రాయంతో ఏర్పాటు చేయ బడ్డాయి.

ఏదయిన వస్తువులోవుండే స్థిర విద్యుత్తును ఒక లోహకం ద్వారా బయటకు తీసుకురావచ్చు. ఒక వాహకంద్వారా ప్రవహించే విద్యుచ్ఛక్తిని విద్యుత్ ప్రవాహం అని కూడా అంటారు. ప్రవాహ రూపమైన ఈ విద్యుత్తునే "డైనామిక్ ఎలక్ట్రిసిటీ" అని కూడా అంటారు.

స్థిరవిద్యుత్తు కనిపెట్టబడేవరకూ విద్యుత్ ప్రవాహం ఎవరూ ఆలోచించలేదు. 18 వ శతాబ్దం ప్రారంభంలో "బోలోనా" విశ్వవిద్యాలయంలో "ఎనాటమీ" నభ్యసించిన లూజీగాల్వినీ ఈ విద్యుత్ ప్రవాహాన్ని గురించి విశిష్టమైన పరిశోధనలు సాగించాడు. అందుకనే కొంత కాలం ఈ విద్యుత్తు ప్రవాహాన్ని "గాల్వనిజం" అనేవారు. 1786 వ సంవత్సరంలో గాల్వనీ అప్పుడే చంపిన ఒక కప్పను తీసుకువచ్చి దాని కాళ్ళకు ఒక రాగి కొక్కెం తగిలించాడు. దాన్ని ఒక పట్టాకు తగిలించాడు. ఈ రెండు లోహాలు ఒక దాని కొకటి తగలగానే ఆ చచ్చిన కప్ప కాళ్ళు హఠాత్తుగా కదిలాయి. కప్ప కాళ్ళలో విద్యుచ్ఛక్తి వుందని అది ఈ రెండు లోహపుముక్కలు తగలగానే బయటికి వచ్చేసిందని గేల్వనీ అభిప్రాయపడ్డాడు. ఆరోజుల్లో గేల్వనీ చేసిన యీ ప్రయోగం గొప్పతనం గుర్తింపకుండా కప్పల డ్యాన్స్ మాస్టరని అవహేళన చేసేవారు.

1800 సంవత్సరంలో "కౌంట్ అలగ్జాండ్రో ఓల్టా"అనే ఆయన గేల్వనీ ప్రయోగంలోని గొప్పతనం ఈయన లోకానికి వివరించాడు. గేల్వనీ చేసిన ప్రయోగంలో కప్ప కాలు కదలడానికి కారణం దాని శరీరంలో వుండే విద్యుచ్ఛక్తి కారణం కాదని, రెండు పరస్పర విరుద్ధ లక్షణాలుకల లోహపు ముక్కలకు సంబంధం కలగడంతోనే విద్యుత్ ప్రవాహం ఏర్పడిందని వివరించాడు. ఈయన కూడా వివరించాడు.

ఒక రాగి పలకని తుత్తునాగం పలకని కలిపితే విభిన్న లక్షణాలుకల విద్యుచ్ఛక్తి పుట్టుతుందని ఓల్టా తన ప్రయోగాల ద్వారా నిరూపించాడు. ఇందులో ఒక పలకకు ధన విద్యుదావేశం, ఇంకొకదానికి ఋణ విద్యుదావేశం వుంటుందని ఈయన తేల్చాడు. ఈ రెండు లోహాలని ఉప్పుద్రవమందు తడిపిన కాగితంముక్క కాని, గుడ్డముక్కగాని పెట్టి వాటి చివరలను కలిపినట్లయితే విద్యుచ్ఛక్తి వాటి మధ్యనుంచి ప్రవహిస్తుంది.

ఈఓల్టా ఒక బేటరీని నిర్మించాడు. దానిని "ఓల్టేక్సెల్" అంటారు. దీనినుంచి విద్యుచ్ఛక్తి ప్రవాహం వుత్పత్తి అవుతుంది. విద్యుత్ ప్రవాహాన్ని సృష్టించడానికి తయారు చేయబడ్డ తొలి పరికరము యిది.

1749 లో బెంజిమన్ ఫ్రాంక్లిన్ గాలి పడగల సాయంతో మెరుపుతో కొన్ని ప్రయోగాలను సాగించాడు. వాటిని బట్టి విద్యుత్ ప్రవాహాన్ని ఒక చోటునుంచి మరొక

చోటికి తీసుకు వెళ్ళవచ్చునని రుజువైంది. ఉరుములు, మెరుపులుతోటి అట్టహాసంగా వర్షం కురిసే రోజున ఒక గాలిపడగను ఎగరవేశాడు. ఆరోజున గాలి పడగకు కట్టిన ధారం విద్యుచ్ఛక్తి ప్రవాహాన్ని ఆకాశంలో నుంచి నేల మీదకు చేరవేయగలదని రుజువు అయింది. దానిని బట్టే ఎత్తైన ఇళ్ళకు విద్యుద్వాహకమైన తీగలను బిగించి పిడుగు వల్ల ప్రమాదం రాకుండా చేసుకోడానికి వీలు కలిగింది.

హాన్స్‌క్రిస్టియెన్ ఓర్‌స్టెడ్ అనే ఆయన కోపెన్ హాగెన్ విశ్వవిద్యాలయంలో ఆచార్యుడు. విద్యుచ్ఛక్తికి అయస్కాంత శక్తికీ గల పరస్పర సంబంధం ఏమిటో యీయన కనుగొన్నాడు. 1820 లో ఈయన గేల్వనిక్ బేటరీ ఒకటి తీసుకొని దానితో ప్రయోగాలు చేస్తున్నాడు. ఆసందర్భంలో ఆయన ఒక తీగద్వారా విద్యుత్ ప్రవాహాన్ని పంపించాడు. ఈ తీగె సమీపంలో అప్పుడు ఒక దిక్సూచి (కంపాస్) వుంది. తీగద్వారా విద్యుత్ ప్రవహించినప్పుడు, ఈ "కంపాస్" ముల్లు కొంత కదలడాన్ని ఆయన గమనించాడు. దీనిని బట్టి తీగ గుండా విద్యుచ్ఛక్తి ప్రవహించినప్పుడు, అయస్కాంత క్షేత్రం ఏర్పడుతున్నదని రుజువయింది. ఇది ఇలా వుండగా ఏ వాహకమైనాసరే, విద్యుచ్ఛక్తి ప్రవహిస్తున్నంత కాలం అయస్కాంతంగా వ్యవహరిస్తుందని కూడా ఓర్‌స్టెడ్ కనిపెట్టేడు. ఇలాంటి సందర్భాలలో ఏర్పడగల అయస్కాంత క్షేత్రం శక్తి సామర్థ్యాలు దానిని ఏర్పాటు చేసిన విద్యుచ్ఛక్తి ప్రవాహంపై ఆధారపడి వుంటుంది.

ఇదిలావుండగా జోసెఫ్ హెన్రీ అనే ఆయన 1830 లో మొదటి విద్యుదయస్కాంతాన్ని కనిపెట్టేడు. విద్యుచ్ఛక్తి ప్రవాహాన్ని తీసుకువెళ్ళే తీగ పరికరాలలో ఏర్పడే అయస్కాంత క్షేత్రం బలం, ఆతీగనే చుట్టగాచుట్టినట్టయితే చాలా ఎక్కువ అవుతుందని ఆయన అభిప్రాయపడ్డాడు. ఈయన కనిపెట్టిన విద్యుదయస్కాంతమే, ఇప్పుడు టెలిఫోనులలో, ఎలక్ట్రిక్ గంటలలో అనేక ఇతర యంత్రాలలో అతి ప్రధాన భాగంగా పరిగణించింది. దీని సాయంతో టన్నుల కొలది ఇనుమునీ, ఉక్కునీ ఒకచోటి నుండి మరియొక చోటికి చేరవేస్తున్నారు కూడా.

ఆరోజుల్లోనే మైకేల్ ఫెరడే ఇంగ్లండులో విద్యుచ్ఛక్తితో ప్రయోగాలు మొదలెట్టాడు. ఒక అయస్కాంతపు సమీపంలో తీగచుట్ట కదిలినట్టయితే ఆ తీగచుట్టలో విద్యుత్ ప్రవాహం బయలుదేరుతుందని కనుగొన్నాడు. ఈ తీగ కదులుతున్నంత కాలం ఈ ప్రవాహం ఇలాగే వుంటుందని కూడా ఆయన కనుగొన్నాడు. ఇంతే గాకుండా విద్యుత్ ప్రవాహాన్ని కలిగివున్న తీగచుట్ట సమీపంలో ఇంకొక తీగచుట్టకూడా కదులుతున్నట్టయితే ఈ రెండవ దానిలోకూడా విద్యుత్ ప్రవాహం బయలుదేరుతుందని ఫెరడే నిరూపించాడు.

ఫేరడే చేస్తున్న ప్రయోగాల ఫలితంగా మనకు ఇప్పుడు విద్యుచ్ఛక్తిని పుష్కలంగా వుత్పత్తి చేస్తున్న డైనమో లభించింది. ఒక పెద్ద మేగ్నెట్ మధ్య ఒక తీగచుట్టను గిఱ్ఱున త్రిప్పినట్టయితే విద్యుచ్ఛక్తి వుత్పత్తి అవుతుంది. ఒక పెద్ద అయస్కాంతపు ధ్రువాలమధ్యవున్న తీగలచుట్ట ద్వారా విద్యుచ్ఛక్తిని పంపించినట్టయితే ఈ తీగచుట్ట గున తిరుగుతుంది. దీని ఫలితంగా మనకు ఎలక్ట్రిక్ మోటార్ లభించింది.

ఫేరడే పుణ్యమా అంటూ లభించిన డైనమో ఫలితంగా విద్యుచ్ఛక్తి పుష్కలంగా లభిస్తే ఈ మోటారు పుణ్యమా అంటూ పరిశ్రమలకు విద్యుచ్ఛక్తి బహుళ వినియోగం సాధ్యమయింది.

విద్యుచ్ఛక్తికీ, అయస్కాంతత్వానికి అతి సన్నిహితమైన సంబంధం యింకొకటివుంది. అసలు విద్యుత్ ప్రవాహమనేది అనేక రకాల విద్యుదయస్కాంత ప్రసార విశేషాలలో ఒకటి. "రేడియోతరంగాలూ", మామూలుగా మన కంటికి కనబడే కాంతి, "ఎక్స్" కిరణాలు, "కాస్మిక్" కిరణాలు, రేడియమ్, యురేనియమ్ వగైరా లోహాలనుంచి వెలువడే "అల్ట్రావైలెట్" కిరణాలు, "ఇన్‌ఫ్రారెడ్" కిరణాలు ఇవన్నీ కూడా ఈ విద్యుదయస్కాంత ప్రసారాల కోవకు చెందినవే. ఇన్ని రూపాలుగా ప్రత్యక్షమయ్యే ఈ విద్యుదయస్కాంత ప్రసారాల పరస్పర సంబంధాన్ని క్లార్క్ మేక్స్‌వెల్ అనే ఆంగ్ల విజ్ఞాని 1855 ప్రాంతాలలో సిద్ధాంతరీత్యా నిరూపించాడు.



# కొవ్వూరు మహిళా సమాజము.

## 17. వ వార్షికోత్సవము.

16-4-53 తేదీ గురువారం సాయంకాలము 5 గం॥లకు మహిళాసమాజము (త్రివిక్రమ భవనము) నందు పైవార్షికోత్సవము "ఉభయ భాషాప్రవీణ" "విద్వత్కవయిత్రి" శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారి యాధిపత్యమున జరుపబడినది. "ఉభయ భాషాప్రవీణ" శ్రీమతి బత్తులకామాక్షమ్మగారు సభాప్రారంభము చేసిరి. సభకు పురస్త్రీలు పెక్కురు విచ్చేసిరి. రజుకు బాలసరస్వతీ సమాజాధ్యక్షురాలు దేవులపల్లి సత్యవతమ్మగారు, సుభద్రమ్మగారలు మున్నగు నితరగ్రామవాసులు కూడావచ్చి సభను జయప్రదముగావించిరి. సంస్కృతభాషావశ్యకత, ఆంధ్రసంస్కృతిని గురించి యధ్యక్షురాలు విపులముగా నుపన్యసించిరి. మహిళాసమాజములు, స్త్రీల కర్తవ్యము, సత్యముగా దేశసేవను గురించి సత్యవతమ్మగారు, బాలికల విద్యాభివృద్ధిని గురించి పాఠశాలయుపాధ్యాయిని "భాషాప్రవీణ" ఎ. వి. వెంకట సుబ్బమ్మగారు నుపన్యసించిరి.

కార్యదర్శిని "ఉభయ భాషాప్రవీణ" ఎమ్. వేదవల్లి తాయారమ్మగారు తాము 1944 సం॥ నుండి నిర్వహించుచున్న సంస్కృత బాలికా పాఠశాల నివేదిక (1951–52 సం॥ లు)ను ఆదాయవ్యయములను తెలిపిరి.

ప్రస్తుతముగల పాఠశాలభవనమునకు విశాలమగు స్థలము లేనందున మరికొంత స్థలమును ముఖ్యముగా కొనవలసియున్నదనియు, అందులకు పురవాసు లెల్లరు సహకరించవలెననియు చెప్పిరి.

పాఠశాల విద్యార్థినులకు వచ్చిన అతిథులకు అల్పాహారవిందు గావింపబడెను. సమాజపక్షమున అధ్యక్షురాలికి చిన్న సన్మానము జరిపిరి.

తరువాత పాఠశాల బాలికలు "ఆంధ్ర మాతృస్తవము" "గాంధీజీ నిర్యాణము బుర్రకథ" "సామక" తెలుగు నాటకము, లాయి శాంతకుమారి అను బాలిక భరత నాట్యము, కడు మనోహరముగ ప్రదర్శించి ప్రేక్షకుల నానందపరచిరి.

తరగతులలో ప్రథమ, ద్వితీయ శ్రేణిలో వచ్చినవారికి, నాటకము మొదలగు వానియందు పాల్గొనిన బాలికలకు బహుమతులీయబడెను.

కార్యదర్శిని వందన సమర్పణ, "జనగణమన" గీతములతో కార్యక్రమము ముగిసినది.

* * *

## జంషెడ్‌పూర్‌లో

# శ్రీమతి దుర్గాబాయి

జమ్‌షెడ్‌పురాంధ్ర నాటకసాహిత్య సంఘపాఠశాల రజతోత్సవ ప్రారంభ మహోత్సవము జరుప, ప్రణాళికా సంఘ సభ్యురాలు శ్రీమతి దుర్గాబాయి 14-4-53 రాత్రికి జంషెడ్‌పూర్ విచ్చేసెను.

15-4-53 ఉదయం గం 8 లకు సరస్వతీ సమారాధనము, విద్యార్థులకు మిఠాయి పంచుట అయినవి. నాటి సాయంకాలము స్థానిక టాటాకంపెనీ జనరల్ మేనేజరు డి. హెచ్. కుటార్‌గారి అధ్యక్షతను, రజతోత్సవము ప్రారంభించుచు శ్రీమతి దుర్గాబాయి గంభీరోపన్యాసము గావించుచు, ప్రవాసాంధ్రుల కార్యదీక్షా దక్షతను కొనియాడి ప్రణాళికా సంఘము చేయుచున్న కృషిని విపులముగా విశదీకరించెను.

అధ్యక్షోపన్యాసము గావించుచూ శ్రీ కుటార్ ఆంధ్రుల కార్యతత్పరత మెచ్చుకొనుచు శ్రీమతి దుర్గాబాయికి స్వాగతమొసంగెను.

16-4-53 తేదీని అఖిల భారత మహిళా కాన్ఫరెన్సు వారును ఆంధ్రమహిళాసంఘము వారును ఆదివాసి, మహిళా సంఘము వారును ప్రత్యేక సభలనేర్పాటు చేసి శ్రీమతి దుర్గాబాయికి సన్మాన పత్రమును సమర్పించిరి.

శ్రీమతి దుర్గాబాయి టాటా పరిశ్రమాలయమును, దిమ్నా నీటి సరఫరా కేంద్రమును, ఆంధ్రభక్త శ్రీరామ మందిరమును, ఇతర స్థానికాంధ్ర పాఠశాలలను చూచి అమితామోదము పొందెను.

శ్రీమతి దుర్గాబాయి రాక స్థానికాంధ్రులకేకాక అన్ని సంఘముల వారికి, అన్ని రకముల వారికి అత్యధిక మైన ఆహ్లాదమును కల్పించెను. స్థానిక పత్రికా విలేఖరులతో 16-4-53 దిని శ్రీమతి దుర్గాబాయి ఒక ఘంట ముచ్చటించెను.



# శ్రీ దుర్గాబాయి, దేశముఖ్ దంపతులకు

## ఢిల్లీ ఆంధ్ర వనితామండలివారి

# స్వాగతము

—:o:—

ఉగాది పండుగోత్సవ సందర్భములో ఢిల్లీ ఆంధ్ర వనితామండలి వారు నూతన దంపతులు శ్రీయుత చింతామణి దేశముఖ్, శ్రీమతి దుర్గాబాయిగార్లకు ఢిల్లీ కాన్‌స్టిట్యూయన్‌ట్ క్లబ్బులో (8-3-1953) స్వాగత మిచ్చారు. ఈ సంస్థ 1953 జనవరి మొదటి తేదీన నెలకొల్పబడినది. ఆంధ్ర వనితామండలివారు దంపతులకు ఈ క్రింది స్వాగత పత్రము సమర్పించి తమ తమ ఆనందాభిలాషలను వెల్లడించారు.

దేశముఖ్ దంపతులారా !

అటు సంతోషముతోను, ఇటు సగర్వంగాను ఆంధ్ర వనితామండలి సభ్యురాండ్రము మేమంతా మీ వివాహ సందర్భంలో శుభాకాంక్షలను, హృదయ పూర్వక అభినందనలను సమర్పిస్తున్నాము. ఈ వివాహం కలసి మెలసి పని చేసిన అనేక ప్రముఖ భార్యాభర్తలను మాకు జ్ఞప్తికి తెస్తోంది. విదేశీయులలో ఎలిజబెత్తు, రాబర్టు బ్రౌనింగు, సిడ్నీ, బెట్రీసువెబ్బు, క్యూరీ దంపతులు; భారతీయులలో మైత్రేయి యాజ్ఞవల్క్యులు మాకు జ్ఞాపకానికి వస్తారు. సర్వసౌఖ్య సమన్విత మయిన వైవాహిక జీవితాన్ని, విజయవంతమైన ప్రజాసేవను, మేము మీకు కోరుతున్నాము.

శ్రీ దేశముఖ్ రిజర్వు బ్యాంకు గవర్నరు పదవిని పొందిన ప్రథమ భారతీయుడు. ఈ క్లిష్టదినాల్లో మూడేండ్లనుంచీ మనదేశపు ఆర్థికమంత్రి పదవి నిర్వహిస్తున్నారు. ఇంట్లో జమాఖర్చులను నిర్వహించే గృహిణులమైన మాకు జాతికి ప్రధాన గృహిణిగా ఆయనకుండే సాధక బాధకాలు మాకు తెలుసును. ఆయన ప్రతీ ఏటా దేశం కోసం తయారుచేసి పార్లమెంటుద్వారా సమర్పించే బడ్జెటులు మా గ్రహణశక్తికి చాలా అతీతమైనా వాటికి చాలా శ్రమ, పాండిత్యము, దూరదృష్టి అవసరమని మేము ఎరిగి ఉన్నాము. "అమిత శ్రమతో కూడిన బాధ్యతల్ని వహిస్తూగూడా యవ్వనపు కళల్ని ఆయన ఎలా నిలబెట్టుకోగల్గుతున్నారా?" అని మాకు చాలా ఆశ్చర్యం వేస్తూంటుంది.

శ్రీమతి దుర్గాబాయి దేశానికి చేసిన సేవ విశిష్టమైనదనీ, బహు ముఖ్యమైనదనీ ఆంధ్ర దేశంలో ఆమె పేరు గత రెండు దశాబ్దాలుగా ప్రతీ ఇంటికీ పరిచితమైనదే. కడు చిన్నవయస్సునుంచీ కూడ ఆమె కాంగ్రెసు ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించింది. హిందీభాషా వ్యాప్తికై ప్రచారం చేసి, స్వచ్ఛంద సేవాదళాలను నిర్వహించి, గాంధీజీ ప్రశంసలకు పాత్రురాలైనది. మద్రాసులో ఉప్పు సత్యాగ్రహాన్ని నడిపిన సందర్భంలో ఆమె నిర్బంధించబడింది. ఇట్లా ప్రతిచోటా నిర్వహణా ప్రతిభను, సాహసాన్ని ప్రదర్శించింది. ఇక ఆమె ప్రత్యేక చాకచక్యాన్ని శ్రీ నెహ్రూ ఇంత త్వరలోనే గుర్తించి ప్లానింగు కమీషన్ సభ్యురాలినిగా నియమించడంలో ఆశ్చర్యం ఏమున్నది? కనుకనే ఆమె స్వేచ్ఛగా వుండాలనుకొని పదవికి రాజీనామా ఇచ్చినాకూడా నెహ్రూజీ ఆమోదించలేదు.

వేలకొలది స్త్రీలను, బాలికలను, కళలలోను, వృత్తి విద్యలలోను ప్రవీణులనుగా తయారు చేస్తున్న మద్రాసు ఆంధ్ర మహిళాసభ, ఆమె నిర్మాణసామర్థ్యానికి ఒక శాశ్వత నిదర్శనం. అనేక మంది స్త్రీలు నిత్యము వైద్య చికిత్సను పొందే ఆ "నర్సింగుహోము" జన్మకు ఆమె కృషియే కారణం. ఇవన్నీ ఆమె ప్లానింగు కమిషన్ సభ్యురాలు కాకపూర్వం సాధించినవే. ఢిల్లీలో మా బాలబాలికలకు ఒక పాఠశాల అవసరమని భావించి ఆమె తన యథామార్గంలో పని చేస్తున్నది. పాఠశాల కొరకు ఒక స్థలాన్ని సంపాదించింది. ప్లానింగు మంత్రి శ్రీనందా, భవనానికి శంఖు స్థాపన చేశారు. అతి త్వరలోనే సర్వాంగంగా భవనం సిద్ధమయి మన పిల్లలు ఆ బడిలోకి పోయే ముచ్చట చూడ గల్గుతాం. వయస్సులో పిన్న అయినా ఆమె జీవితమంతా దేశ శ్రేయస్సుకోసం సాధించిన కార్యాలే. ముమ్మందు ఆమె మరింతఘన కార్యాలను కూడా సాధించ గలదు.

## ఢిల్లీ ఆంధ్ర వనితామండలివారి స్వాగతము

వీరిద్దరికి పరమేశ్వరుడు చిరాయు సంపదలను ప్రసాదించు గాక !

స్వాగత పత్రానికి ముందుగా శ్రీ దేశ్‌ముఖ్‌గారు రెండు మాటలు తెలుగులో చెప్పారు. తెలుగు భాష రానందున అంతటితో ముగిస్తున్నా నన్నారు. అయినా ఆయన మాట్లాడిన రెండు చాల చక్కగా చెప్పారు. తరువాత శ్రీమన్‌దుర్గాబాయిగారు ఆంధ్ర వనితా మండలి వారు సమర్పించిన స్వాగత పత్రానికి సమాధానంగా ఇలా అన్నారు "ఈ మా వివాహ కలయికతో దేశంలో మేమేదో ఘన కార్యాలను సాధిస్తామని, కృషి చేస్తామని మీరంతా ఆసిస్తున్నారు. ఇలాగే ఇంచుమించుగా నాకు వచ్చిన ప్రతి వుత్తరంలోను వుంటోంది. ఢిల్లీ ఆంధ్ర వనితామండలి వారు మాకు జరిపిన ఈ గౌరవానికి కృతజ్ఞత తెల్పుతున్నాను. మీరంతా ఆశించిన విధంగా మే మెంతవరకు చేయగలం అనేదొక ఆలోచన. అలా చేయగల్గి నప్పుడే యిలాంటి గౌరవాలకు అర్హుల మవుతాము. తప్పకుండా శక్తివంచన లేకుండా మీమీ ఆశయాలకు తోడ్పడతాం." ఇంకా, తాము ప్రతి వుద్యమంలో కూడా తానొక సభ్యురాలై పౌరోహిత్యం చేసి, పని చేయడమే గాని, ఇలా ఒక వేదిక మీద సభికుల ముందు కూర్చుని ఉపన్యసించవలసి రావడం తన జీవితంలో ప్రథమ పర్యాయమని, కలలో కూడా అనుకోనని సంఘటనని చెప్పుతూ తమ ఉపన్యాసమును ముగించారు.

తరువాత చిన్న పిల్లల చేత హాస్య నాటికలు, సోది, బుఱ్ఱ కథలు మొదలయిన ప్రదర్శనాలను జరిపారు. విశేషం ఏమంటే ఈ ప్రదర్శనలలోని ప్రతిదానిలోను, అన్నిటా ఆంధ్రులు ఆంధ్ర రాష్ట్రం కోసం ఎంత ఆరాటపడుచున్నారో వ్యక్తపరిచారు. ఇంకొక విషయం. మామ అల్లుళ్ళ హాస్యంలో మామ తన మేనల్లునికి సంస్కృతం నేర్పు కోమని బోధిస్తాడు. ఎన్ని చెప్పినా తిరస్కరిస్తుండడం గమనించి "ఓరి శుంఠా మన దేవభాషట్రా వద్దంటావు. సంస్కృతం నేర్చుకుంటే మన చింతామణి దేశ్‌ముఖ్ అంతటి వాడివవుతావురా" అని ఆవేశ ధారి చేత అనిపించారు. సభకు చాలా మంది పార్లమెంటు సభ్యులు తదితర ప్రముఖులు వచ్చి కార్యక్రమమును జయప్రదంగా కొనసాగించారు.

"మా తెనుగు తల్లికి" అనే మంగళ గీతంతో సభ ముగిసింది. ★



ఋతు, కాల, భావానుగుణంగా రాగాల సృష్టియే భారతీయ గానకళావైశిష్ట్యం. ప్రతి రాగం ఒకభావాన్ని, ఒకకాలాన్ని స్ఫురింపజేస్తుంది. రాగాలకాలం భావస్ఫురణలకు అనుగుణంగా రూపొందించబడిన చిత్రాలు యుగయుగాలనుంచి ప్రచారంలోవున్నవి. అకాల రాగాలావన గానమాధుర్యాన్ని నశింపజేస్తుంది.

# తేనీరు

రాత్రింబగళ్లలో ఎప్పుడైనా, ఎలాంటి స్థితిలో వున్నా, తేనీరు ఉత్తేజం కలిగిస్తుంది.

# మాల్కోసు

ఇది మాల్కోసు రాగభావమునకు సాంప్రదాయకమైన చిత్రణ. గంభీర పురుషాకృతి ననుసరించు కల్పన గల ఈ రాగము రాత్రి వేళల పాడుకొందురు. ఈ రాగాలాపన సంగీత ప్రియత్వముచే లలితుడైన ఒక వీరుని మనకు గోచరింపజేయును. ప్రణయమందలి పరిపూర్ణానందానుభూతి ఇందలి ముఖ్యభావము.




# అమృతాంజనము

గాని,

" యథాయథా………………కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగుచున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

# ★ ఉదయ సంధ్య ★

• శ్రీమతి రంగిరాల హేమంతాదేవి •

రేపు పెండ్లి చేస్తే ఎట్లా కాపురం చేస్తుందో? అంటూ అమ్మ విసుగ్గా నాన్నగార్కితో ఫిర్యాదు చేస్తోంది. నేను కాలేజీనుంచి గుమ్మంలో అడుగుపెట్టేసరికి నన్నుగురించే అనుకుని తల పైకెత్తి చూశాను. అప్పుడే నాన్నగారు కోర్టునుంచి యింటికి వచ్చి డ్రస్సు మార్చుకుంటున్నారు. "ఏమమ్మా యిప్పుడేనా రావటం?" అన్నారు ముభావంగా. 'ఉఁ' అని సమాధానం చెప్పి యింట్లోకి వెళ్ళాను. లలితా, బాబు అప్పుడే స్కూలు నుంచి వచ్చి కేరింతలు కొడుతూ ఫలహారం చేస్తున్నారు. నేను ముఖం, కాళ్ళూ చేతులు కడుక్కొని సరాసరి నాగదిలోకి వెళ్ళాను. ఇంతలో నరసు కాఫీ తెచ్చి బల్లమీద పెట్టి "అమ్మాయిగారూ కాఫీ చల్లారి పోతోంది" అని చెప్పి వెళ్ళిపోయింది. నాపెండ్లిని గురించి అమ్మవాళ్ళు పడుతున్న ఆదుర్దా చూస్తే వీళ్ళకింత వెర్రి పట్టుకుంది ఏమిటాని నాలో నేనే నవ్వుకున్నాను. ఇంతలో అమ్మ నాన్నగార్ని క్లబ్బుకు పంపి "ఇంకా ఇట్లాగే పెట్టుకూర్చున్నావుటే కాఫీ చల్లారి పోయింది. మాయదారి పరధ్యానం ఎప్పుడు వదుల్తుందోకాని" అంటూ కాఫీ వేడి పెట్టి తీసుకురావటానికి లోపలికి వెళ్ళింది. ఇట్లా ప్రతి విషయంలోను యాదాలాపంగా వుండటం నాకు చిన్నప్పటి నుంచి వున్నదని మా అమ్మ అంటుంది. కాని నాలో ఈ గుణం వున్నట్లు యింటరు ఫస్టియరు చదువుతుండగా తెలుసుకున్నాను. "అబ్బా! ఏమిటి నీ కేసరదాలు లేవే" అంటూండేవారు మీనాక్షి, విమల వాళ్లు. నిజమే నాకెందుకో వాళ్ళకున్నంత వుత్సాహం వుండదు. వాళ్ళని ఆనంద పరిచే సుఖాలు నాదృష్టిలో అశాశ్వతమేమో అనిపిస్తుంది. మరి శాశ్వతంగా సుఖం ఎక్కడ లభిస్తుంది? నేను పుట్టినప్పటి నుంచి యిప్పటి వరకు ఎంతైనా సుఖపడుతున్నానని అందరు అనుకుంటారు. కాని నామట్టుక్కి నాకు ఒకరోజు నిశ్చింతగా, సుఖంగా గడవలేదు.

అసలు ఒక విధంగా బ్రతుకులోనే బరువుందేమో ననిపిస్తోవుంటుంది. మాయింటికి దసరా పండక్కి వచ్చే హరిదాసు నాకంటే ఎక్కువ సుఖపడతాడని నేను అనుకుంటాను. ఎందుకంటె, వాడికి కష్టాలు బాగా వంట బట్టాయి. కష్టసుఖాల తారతమ్యత బాగా తెలుసు. సుఖం అనేది జీవితానికి ఎంత అవసరమో, సుఖమంటె ఏమిటో అతనికి తెలిసినట్టు నాకు తెలియదని నేను ఒప్పుకుంటా. గడ గడ లాడే చలిలో తెల్లవారక మునుపే లేచి శుచిగా స్నానము చేసి నిశ్చింతగా ఆ ఒంటి తీగ తంబురతో గొంతును కలిపి భూపాల రాగంలో పాడే తీయని ఆపాటలోని మాధుర్యాన్ని, మూడో అంతస్తు పరుపులలో బండ నిద్రలలో మునిగి తేలుతూ బెదురుగా గాలికి వినిపించే ఆ రాగఛాయల దెసలకు మనస్సు పరుగులెత్తగా, నాలో జీర్ణించిన సోమరితనం కటువుగా, నిర్బంధముగా మనస్సును నిద్రలోకి లీనం చేస్తుంది. ఏమిటి ఈఅధికారం మనస్సుకి? తెల్లవారి లేచింది మొదలు నిత్య కర్మలలో, లోపం కనిపిస్తూనే వుంటుంది. అసలు బ్రతుకే లోపం. పదిగంటలకు అప్రమత్తతతో ఈ శరీరాన్ని కాలేజీ ఆవరణలో ప్రవేశపెట్టాలి. ఎందుకో ఈ చదువులు? ఇంతలో పద్మజ హడా విడిగా పరుగెత్తుకుంటూవచ్చి "ఈవేళ కెమిస్ట్రీ స్టూడెంట్సు అంతా పిక్నిక్కి వెడదామనుకుంటె నువ్విట్లాగే కూర్చున్నావేమిటి?" అంటూ హడా విడిగా కబురు తెచ్చింది. "నాకు రావాలని లేదే పద్మా" అని అన్నాను. 'నువ్వెప్పుడూ ఇంతే ఒక్కనాడు కూడ సరదాగా వుండవు. ఈసారి నువ్వు తప్పకుండా రావాలి. నువ్వు రాకపోతే మేముకూడ మానేస్తాము. మాకోసం అయినా అడ్డు చెప్పకుండా త్వరగ తయారవు. నేను మళ్ళీ ఒక్క అరగంటలో వస్తాను" అంటూ ఆ సాయంత్రం మెరుపులా మాయమయింది పద్మ. 'అబ్బ ఎందుకో దీనికింత ఆనందం. పిచ్చి పిల్ల' అనుకుని పోనీ వెడదాం అని లేచాను. స్నానము చేసి చుక్కి జరీ చీర కట్టుకుని రెడీగా కూర్చున్నాను పద్మజకోసం. సరిగ్గా 5గంటలకు బిల-బిల లాడుతూ పదిమంది పిల్లల్ని వెంట పెట్టుకుని అతిసంతోషంగా వచ్చింది పద్మ. సరే తప్పుతుందా అన్నట్లు వాళ్ళతోపాటు నేకూడ కార్లో కూర్చున్నాను.

ఒక్క క్షణంలో అందరం కృష్ణవొడ్డుకి తయారయ్యాం. మా వాళ్ళలో కొంత మంది బ్రిడ్జిఎక్కి సీతానగరం పోదామని పట్టు పట్టారు. నాకుమాత్రం ఎక్కడికీ వెళ్ళాలని లేదు. నీరెండలో తళుకు లొరసి పోతూన్న కృష్ణా నదిని చూస్తూంటే నేను కూడ ఒక చిన్న అలనై ఆమెలో కలిసి పోవాలని అనిపించింది. రెండు చిన్నపక్షులు అల్లంత దూరాన్నించి కంటికి కనిపించనంత ఆహార పదార్థాన్ని మోసు కొస్తున్నాయి. ఎందుకో? ఎవరి కోసమో? అవలీలగా అఖండ కృష్ణానదిని దాటి ఆకాశాన్నంటే ఆ పర్వతములలో బహుశా వాటి నివాస మనుకొంటాను. ఆ వైపుకే ఎగిరి పోతున్నాయి. మా వాళ్ళు బ్రిడ్జి దాటి కృష్ణ అవతలి ఒడ్డు చేరుకున్నారు. "నీమూలాన్ని నేను ఆగిపోయాను" అంటూ నీరసంగా గునిసింది పద్మ. అప్రయత్నముగా మనస్సులో దూరతీరాల్లో వున్న మధుబాబు జ్ఞప్తికి వచ్చాడు. మనస్సు కొంచెం కలవర పడింది. "అదిగో మన వాళ్ళు అవతల ఒడ్డున ఎట్లాకనిపిస్తున్నారో" అంటూ ఆశ్చర్యంగా పద్మ నన్ను తట్టి చూపించింది. వాళ్ళకు నాకు ఎంత దూరముందో ఇప్పుడు అర్థమయింది. నీరసంగా ఒక చిరునవ్వు నవ్వాను. "లేనిపోని పిచ్చి వేషాలు వెయ్యక మనం కూడ వెడదాం పద" అన్నది పద్మ కొంచెం విసుగ్గా. బహుశా నామౌనాన్ని భరించలేక అనుకుంటాను. ఏదో విధంగా మాట కలపాలని. "పోనీ నువ్వు వెళ్ళు" అన్నాను. నన్ను ఒక్కర్తెని ఒదిలి వెళ్ళదని తెలిసి. "చాల్లే! బండతనం రేపు కాబోయే డాక్టరు గారితో ఎట్లా వుంటావో" అంది పద్మ నవ్వుతూ. "అవును నాకు ఆయన్ని చూడగానే అదోలా అనిపించింది. అదీకాక వాళ్ళకింత చదువు చదివిన పిల్ల అక్ఖరలేదట. అందుకనేగా సంక్షేపించు కొన్నాము" అన్నాను, నిశ్చలంగా. మనస్సులో మధుబావ కొంటెనవ్వు మళ్ళీ ప్రత్యక్షమయింది. "మీ బావ యిప్పుడెక్కడ వున్నాడే?" అంటూ నాముఖంలోకి చూచింది పద్మ. "సెంట్రల్ గవర్నమెంటులో పని చేస్తున్నాడు" అన్నాను. అప్రయత్నంగా "పోనీ మీ బావను చేసుకోరాదు" అన్నది పద్మ, నాముఖంలో అవతరించిన జీవకళ గుర్తించి. నేను ఏమి చెబుతానో దానికి తెల్సు. బావకి ఆస్తి పాస్తులు ఏవీ లేవని, చిన్నప్పటి నుంచి నాన్నగారి మాట విని యింటి పట్టున వుండలేవని, నెలకు 300 తెచ్చుకుంటున్నా ఒక్క కాని కూడ మిగుల్చు కోలేని ఖర్చు మంతుడనిన్ని. ఇవన్నీ పద్మకు నాతో బాటే చిన్నప్పటి నుంచి తెల్సు. నాకళ్ళు చెమ్మగిల్లినై. 'నాకు బ్రతకాలని వుండదే పద్మ' అన్నాను. 'ఛా! వూరుకో అవేం మాటలు' అంటూ ఓదార్చింది. సూర్యుడు అస్తమించాడు. మావాళ్ళు తిరిగి మావద్దకు చేరుకుంటున్నారు. నాగుండె బరువుతో కృంగి పోయింది. అంతవరకు ఎడతెగని ఆనందాన్ని కన్నులు పండువుగా అందించిన పవిత్ర కృష్ణా నది నాహృదయంతో పాటు క్రమ క్రమంగా ఆవరించ నున్న గాఢాంధకారాన్ని అనుభవించి తీరాలన్నట్లు భయంకరంగా కనిపిస్తోంది. నా హృదయం ఆక్రోశించి జీవితంలో వెలుగు నీడలు, కష్టసుఖాలు ఏవిధంగా మనుష్యులను సుఖదుఃఖాలతో ముంచుతాయో గ్రాహ్యమయినది. ఈ వాతావరణంలో మనం పొందుతున్న, మనకుండే సుఖమేమిటో నాకు అర్థం కావటం లేదు. మీ కారు వచ్చిందే పద అంటూ పద్మ, మీనా తొందరచేసేరు. నిర్జీవ జీవంలాగ వార్ని అనుసరించాను. కారు కదిలింది. కాస్తదూరం వెళ్ళేసరికి బజారు, విద్యుద్దీపాల వెలుగు తాత్కాలికంగా నాలోని నిశిని పారద్రోలింది.

మీనాక్షి ధర్మమా అని అందరం ఆరంజిక్రష్ త్రాగాము. మళ్లా యథాప్రకారంగా కారు ఒక్కక్షణంలో మా యిల్లు చేరింది. మళ్లా మామూలు.

"ఎప్పుడు వస్తానని వ్రాశాడు?" అని అమ్మ నాన్నగార్ని అడుగుతోంది. నన్ను గుమ్మంలో దించి మిగతా వారిని దించి రావటానికి వెళ్ళింది కారు.

"రేపటినుంచి పదిహేను రోజులు శలవుపెట్టేడుట, బహుశా రెండు మూడు రోజులలో వస్తాడేమో" అని సమాధానం యిచ్చారు నాన్నగారు. మనస్సులో మాట నిజమయింది. అప్పటికప్పుడే సంతోషం. దానివెనకనే సిగ్గు. అంతసేపూ గుమ్మంలోనే వున్నానన్న అభిమానం నన్ను వుక్కిరి బిక్కిరి చేసాయి. నెమ్మదిగా నడిచి నా గదిలోకి వెళ్ళబోతున్నాను. 'బావ వస్తాడండి' అంటూ లలిత నా కాళ్ళకు అడ్డం వచ్చింది, దాని మాటలు విననట్లుగా తలవంచుకుని కాళ్ళు, చేతులు కడుక్కొని భోజనానికి కూర్చున్నాను. "అదేమిటే! అన్నమే ముట్టుకోలేదు." అన్నది అమ్మ సందేహంగా. "అసలు నాకు ఆకలిగా లేదమ్మా సాయంకాలం అక్కడ పిక్నిక్ జరిగింది" అన్నాను, మజ్జిగ అన్నం తింటూ. నాన్నగారు యింకా కూర, అన్నం దగ్గిరే వున్నారు. ఆయన నావంక ఒక్కసారి చూశారు. నాకు యిక అట్టేసేపు వుండాలని అనిపించలేదు. లేచి చెయ్యి కడుక్కొని విసురుగా గదిలోకి వెళ్ళబోతున్నాను.

"అతను సరాసరి యిక్కడకు వస్తానన్నాడా, లేక బావగారింటికి వెళ్ళి యిక్కడకు వస్తానన్నాడా?" అంటూ అమ్మ అడగటం వినిపించింది. వినాలని ఆతురతతో అడుగు వెనక్కు పడింది.

"సరాసరి యిక్కడికే వస్తాడనుకుంటా" అంటూ నాన్నగారు మజ్జిగడిగారు. నెమ్మదిగా మేడమీద కెళ్లాను. బాబు, లలిత ఇంగ్లీషు పద్యం వల్లిస్తున్నారు. "అక్కయ్యా! ఈ పద్యం అప్పచెప్పుకోవు" అంటూ యిద్దరు నన్ను చుట్టి ముట్టి వేశారు. సరదాగా వాళ్ళమధ్య కూర్చుని "లల్లి" చేత పద్యం ఒక్క తప్పు లేకుండా ఒప్పగించుకున్నాను. బాబు వెనక్కు తగ్గాడు. "బాబూ నువ్వింకా చదవాలి" అన్నాను.

"నువ్వెప్పుడూ అది బాగా చదివిందంటావు, నన్ను యింకా చదవాలి అంటావు" అని మూతి ముడుచుకుని వెనక్కు జరిగాడు బాబు. "అదికాదు బాబూ! బాగా చదవకపోతే ఎట్లా వస్తుంది?" అంటూ వాణ్ణి బుజ్జగించాను. 'దానికంటే నేనే బాగా చదువుతాను' అని సమర్ధించుకుంటూ వుక్రోషంతో "లల్లూ నిన్నటి లెఖ్ఖ మళ్ళీ చెయ్యాలి. లేకపోతే మాష్టారు గారితో చెపుతాను" అంటూ దాన్ని ఏడిపించటం మొదలు పెట్టాడు. వీళ్ళ పోట్లాట నాకు విసుగు పుట్టించింది. లేచి గదిలోకి వెళ్ళాను. తరువాత రాజీ కుదిరింది కాబోలు ఎక్కడా చడీ చప్పుడు కాకుండా వెళ్ళి పడుకున్నారు. నాన్నగారి గదిలో లైటు వెలుగుతోంది. ఎవరో యిద్దరు అతి విపులంగా వాళ్ళ కేసు విషయం చెపుతున్నారు. మధ్య మధ్య ఏవేవో అడుగుతున్నారు నాన్నగారు. నేను మంచం మీద పడుకున్నాను. లలిత రాసుకున్న లావెండరు, తలనూనె వాసన యిక్కడికి వేస్తోంది. ఇంతలో అమ్మ మాటలు వినపడ్డాయి. వంటావిణ్ణి పంపించి మేడ మీదకు వచ్చి బాబుకు, లలితకు బట్టలు సరిగా కప్పుతూ 'నిద్రపోతున్నావుటే' అన్నది నన్నుద్దేశించి. 'లేద'ని అందామని నోటిదాకా వచ్చింది కాని మాట్లాడకుండా కళ్ళు మూసుకుని పడుకున్నాను. 'అమ్మాయి పడుకుందా?' అంటూ నాన్నగారి మాటలు కూడ వినిపించాయి. నేనంటే నాన్నగార్కి పంచప్రాణాలు. నా మనస్సు వాళ్ళ దగ్గరికి పరుగెత్తింది. "అమ్మాయికి తెలుసో మధు వస్తాడని?"

"తెలియకేం. సాయంత్రం అది ఇంటికి వచ్చేటప్పడికేగా మీరు వుత్తరం విషయం చెబుతున్నారు."

"చలపతి రావుగారి సంబంధం కనుక్కున్నాను."

నాలో నిరుత్సాహం రేకెత్తింది. వీళ్లు మమ్మల్ని ఎందుకు విడదీయాలో నాకర్థం కావటంలేదు. మళ్ళా ప్రారంభించారు నాన్నగారు.

"ఆయనకు దాదాపు నూట యాభై ఎకరాల పొలంవుంది. చెన్నపట్నంలో ఒక పెద్ద మేడవుంది. చాలా మంచివాడని అందరు చెపుతున్నారు, అయితే—" అంటూ ఆపారు నాన్నగారు.

"అయితే" అంటూ ఆతురతగా రెట్టించింది అమ్మ. ఆవిడ కెందుకో ఆదుర్దా. "ఆయనకు మొదటి భార్య పిల్లలు యిద్దరున్నారుట," అంటూ సాంతం చేసారు విషయాన్ని నాన్నగారు.

నాకు చెర్రకోపం వచ్చి దివాల్ను లేచాను. నాపెండ్లి విషయం మీకనవసరం అని కచ్చితంగా చెబుదామనుకున్నా. యింతలో "రెండో పెండ్లి వాడయితే ఏమున్నా మనకొద్దు" అన్న అమ్మ సమాధానం విని యథాప్రకారం పడుకున్నా. బావ వున్నప్పటి వాతావరణం కళ్ళకు కట్టింది. బహుశా మునపటికంటె యిప్పుడు అధికంగా సిగరెట్లు కాలుస్తూ వుండి వుంటాడు. అక్కడ సిగరెట్లు పెట్టెలు దాచేవారుండరుగా. దూరాన్న ఒంటి గంట బైము వినిపించింది. అమ్మా నాన్న పడుకున్నట్లున్నారు. మాటలు వినిపించటంలేదు. నిద్రపోదామని ప్రయత్నించా నాకు తెలియకుండానే నిద్రపట్టిం దెప్పుడో.

నాలు రోజుల తరువాత "ఎప్పుడూ రావటం?" అంటూ సావిట్లో అప్పుడే వచ్చిన బావను పల్కరిస్తోంది అమ్మ. నేను వెళ్ళి అతి వుత్సాహంగా పల్కరించి కబుర్లు చెపుదామనుకున్నాను ఈ నాల్గురోజులు. కాని ఏమీ మాట్లాడబుద్ధి కాలేదు. పల్కరించ బుద్ధి కూడా కాలేదు. మళ్ళా యథాప్రకారంగా నామూగతనం ప్రవేశించింది. "లలితా, బాబు ఏరి?" అంటూ అడుగుతున్నాడు మధు. తన్ను బహుశా అడగడేమో బావ. "బడికి వెళ్ళారు వచ్చే వేళయింది" అంటూ అమ్మ లోపలికి వెళ్ళింది. ఎందుకో గడియారపు టిక్ టిక్ శబ్దాలు నాకు అతి స్పష్టంగా, తొందరగా అవుతున్నట్లు వినిపిస్తోంది.

"కాఫీ తీసుకో! ఏమిటి ఢిల్లీ విశేషాలు?" అంటూ అమ్మ సోఫాలో కూర్చుంది, "ఏముంటయి" అంటూ

కాఫీ త్రాగటం పూర్తిచేసాడు బావ. నాకెందుకో అక్కడికి వెళ్ళాలనిపించలేదు. పైగా వెళ్ళకూడదని నిశ్చయానికి వచ్చింది నా మనస్సు. 'అదెట్టింగు, సూట్ కేసు లోపల పెట్టరా' అంటూ లోపలికి వెళ్ళింది అమ్మ.

అడుగుల సవ్వడయింది, గబ గబా టేబిల్ పైన వున్న బావ ఫోటో వెనక్కు త్రిప్పి పెట్టాను. "కులాసాగా వున్నావా?" అంటూ కుర్చీ లాక్కుని కూర్చున్నాడు మధు. నేను తల పైకెత్తకుండానే "ఊఁ" అని సమాధానం యిచ్చాను. ఎందుకో నాకు ఈసందర్భం ఇష్టంగా లేదు. "చెప్పున తయారవు, మనం పెళ్ళికూతుర్ని చూచి వద్దాము" అంటూ లేచాడు మధు. నా తలమీద పిడుగు పడ్డట్లుగా అనిపించింది. తల పైకెత్తాను. మధు వెళ్ళిపోయాడు. ఇప్పుడతనువుంటే బాగుండుననిపించింది మనస్సుకు. క్షణం క్రితం నాలోవున్న భావం నన్ను వెక్కిరించింది. నిరాశ అంతా ముఖాన్ని ఆవరించింది. ఇంతటి అదృష్ట హీనురాల్ని బావ చేసుకోక పోవటమే మంచిదనుకున్నాను. నిస్సహాయంగా లేచి ముఖం కడుక్కుని పెళ్ళికూతుర్ని చూడటానికి ముస్తాబయి బయలుదేరాము. దారిలో అమ్మ కాలేజీలను గురించి, మా చదువులను గురించి, నాపెండ్లి సంబంధాలను గురించి బావతో కబుర్లు ఏకరవు పెట్టింది. నాకివన్నీ అతనితో చెప్పటం అనవసరమనిపించింది. ఇంతలో వాళ్ళ యిల్లు వచ్చింది. అతి మర్యాదగా వాళ్ళు పిల్లని చూపించారు. పిల్ల పేరు రాధ. రాధను చూచిన తరువాత నాలో కొంచెం సంతోష రేఖలు పొడమాయి. కాని సందేహంతో మనస్సు వెనక్కు లాగింది. కట్నం రెండు వేలతో మధు పెండ్లికి వప్పుకున్నాడంటే నాదుఃఖం పొంగి పొరలి ఆకాశానంటింది. యిప్పుడు జీవితం పూర్తిగా ఎడారి. అందచందాలులేని రాధ బావ హృదయాన్ని ఆకర్షించింది పెండ్లి యావత్తూ అతి క్లుప్తంగా జరిగింది. పెండ్లి సందడితోపాటు నాహృదయ సముద్రపు ఆటు, పోటులు తగ్గాయి. ప్రశాంతమైన సాయంకాలపు నీరెండలు యథాప్రకారంగా నాగదిలో ప్రసరించాయి. ఎండలు విపరీతంగా మండిపోతున్నాయి. తప్పినా, ప్యాసయినా ఈ ఏటితో చదువు మానివేద్దామని నిశ్చయించాను. జీవితంలో సంతోషించతగ్గ విషయం ఏమీలేదని దృఢపడింది.

బావ వాళ్ళత్తారింటికి వచ్చి ఒక వారం రోజులలైంది. రాధకు జబ్బుగా వుందని ఆరోజే తెలిసింది. అమ్మ, జమీందారుగారి ఆడవాళ్ళు చూడటానికి వస్తామని కబురు చేయటంవల్ల ఎడతగని సందడిలో మునిగివుంది. ఆశ, నిరాశలేని నిర్లిప్త మౌనస్థితికి వచ్చింది మనస్సు. జీవితంలో నాకై నిర్మించి యిచ్చిన మార్గముగుండా నడిచి వెళ్ళటమే నా విధి. జమీందారుగారు, వాళ్ళబ్బాయి, వాళ్ల ఆడవాళ్లు అంతా చూడటానికి వచ్చారు. తతంగమంతా అనుకున్నట్లుగానే ముగిసింది. అమ్మ ససేమిరా ఒప్పుకోలేదు ఈ సంబంధం. పిల్లవాడు చాలా అనాకారి అని, పైగా చదువు కూడా లేదని, ఇంట్లోకల్లా ఈసంబంధం విషయంలో మాట్లాడనిదాన్ని నేనే. అమ్మా, నాన్నా, వగచారు. నా ఖర్మాన్ని దూషించారు. చేతులారా బంగారు బొమ్మని కోతికివ్వలేమన్నారు. అన్నిటికీ నా మూగతనమే జవాబయింది. ఇంతలో బావ భార్యకు సీరియస్‌గా వున్నదని కబురుచేశాడు. చూచి రావటానికి నేనూ, అమ్మా వెళ్ళాం. ఇంటిల్లపాది, అతి ఆదుర్దాగా వున్నారు. ఇద్దరు, ముగ్గురు డాక్టర్లను పెట్టారు. కాని పోయిన స్పృహ తిరిగి రాలేదు. బావను ఓదార్చి యింటికి తీసుకువచ్చాము కృంగి కృశించిన నా శిథిల హృదయంలో చిన్న ఆశా జ్యోతి వెలుగు కనిపించింది. పద్మ పెళ్ళయి రెండు నెలలు అయింది. ఆరోజు భర్తను తీసుకొని మాయింటికి వచ్చింది. కలకత్తాలో భర్తకు ఉద్యోగమనిన్నీ, వెడుతున్నానని చెప్పటానికి. చిన్ననాటి నెచ్చెలి పద్మ వెడుతుందంటె ఎంత ఆపుకుందామన్నా దుఃఖం ఆగలేదు. ఆరోజు రాత్రి వాళ్ళిద్దరకు మాయింట్లో విందుచేసి నేను బావ స్టేషన్‌కి కూడ వెళ్లాము. బావ నవ్వులు మళ్లా నా హృదయాన్ని మేలు కొలిపించాయి. "కొంచెంసేపట్లా తిరిగి వద్దామా బావా" అన్నాను రైలు వెళ్లిన తరువాత. మధు సూటిగా చూచాడు. ఆరాత్రంతా కృష్ణానది యిసుక తిన్నెలమీద మూగ వోయిన నాగొంతు ప్రేమ గీతాలు పాడి, గడిపి, తెల్లవారింది. యింటికి వచ్చాము. సావిట్లో అప్పుడే నాన్నగారు కాఫీ త్రాగుతున్నారు. నాముఖం ఎవరకు కనబడకుండా గబ.గబా యింట్లోకి వెళ్లేను, తర్వాత మధు, నాన్నగారి నవ్వులు వినిపించాయి.





# ★ "ఈ రోజు గడిస్తే" ★

• శ్రీమతి ఆచంట శారదాదేవి •

"రైలు అందిందా?" అని, ఆదుర్దాగా అడిగాడు తండ్రి. అప్పుడే గుమ్మంలో అడుగు పెడుతూన్న కొడుకును చూసి.

'ఆఁ!' అంటూ నీరసంగా ముభావంగా జవాబు చెప్పాడు కృష్ణారావు. మేడమెట్ల దగ్గర చెప్పులు విడిచివచ్చి హాల్లో కూర్చున్నాడు. గుండె పగిలిపోతున్నట్లనిపించింది. రెండు చేతులతో తలగట్టిగా పట్టుకున్నాడు. కాని, ఏమీ మాట్లాడలేదు. చేతుల్లో కాగితాలు సరిచూసుకుంటూ తండ్రి లేచి మేడమీదకు వెళ్ళాడు. హాల్లో గడియారం ఎనిమిది కొట్టింది.

కృష్ణారావు, అప్పుడే భార్య కుముదాన్ని రైలెక్కించి వచ్చాడు. కుముదం పురిటికి పుట్టింటికి వెళ్తోంది. అంటే ఇంకా ఆరు నెలలదాకా తిరిగి రాదన్నమాట. ఈ ఆరు నెలల్లో తనకి సెలవు దొరికి, తను కుముదాన్ని చూడటానికి వెళ్ళగల్గుతాడన్న ఆశ అతనికేమీ లేదు. ఒక్కరోజు సెలవడిగినాసరే, అతని మేనేజరు ముఖం ఆదోలా పెట్టుకుంటాడు. అంచేత అసలతనికి సెలవడగాలనే అనిపించదు.

పెండ్లయిన ఈ ఆరేళ్ళలోనూ ఇన్నాళ్లు కుముదాన్ని విడిచివుండవలసిన అవసరమెప్పుడూ కలుగలేదు. పుట్టింటికెప్పుడైనా ఒక్కత్తె వెళ్ళినా, వెళ్ళిన అయిదారు రోజులకే మళ్ళీ తిరిగొస్తుండేది. ఈసారి ఎందుకో అతనికి చెప్పలేని బెంగపట్టుకున్నది. కుముదం ఒక్కతె వెళ్ళిపోగానే ఇల్లంతా బావురుమంటున్నది, హాల్లో కూర్చున్న అతనికి లోపలనుంచి కుముదం గొంతు సన్నగా వినబడుతున్నట్లేవున్నది.

ఏమీ తోచక, బల్లమీద పేపరు తీసుకుని చూడడం మొదలెట్టాడు. ఒట్టినే కూర్చోలేక పత్రిక ముఖానికడ్డం పెట్టుకోడం! చూపులు వార్తలమీదేవున్నా ఆలోచనలు మాత్రం ఎక్కడెక్కడికో పోతుంటాయి.

హృదయంలో నిండుకొన్న ఈ వ్యధ.... వేయి సూదులు గుచ్చుకొంటున్నట్లున్న ఈబాధ....ఇది మాసిపోవడంయెలా?.... ఈ రోజు గడిస్తే ఈ బాధ ఉండదు కావచ్చు, అమితమైన ఆవేదన కలిగినప్పుడల్లా అతను అట్లాగే అనుకుంటూ వుంటాడు. ఈ ఒక్కరోజు గడిస్తే! ఈ ఒక్కరోజు ఈ బాధ ఓర్చుకోగలిగితే! రేపు ఈ బాధ ఇంతతీవ్రంగా వుండదు.

ఎంతతీవ్రమైన బాధకైనా మనిషి క్రమంగా అలవాటు పడిపోతాడు. ఓర్చుకోగల్గుతాడు. లేకపోతే అసలుజీవించనేలేడేమో! అదే అతని నమ్మకమూ, అనుభవమూ. కాని, ఈ ఒక్కరోజు మాత్రం!

అతనికి ఏమిటేమిటో జ్ఞాపకం రాసాగినవి. ఎప్పుడో ఎవడో గోసాయి, వద్దంటుంటే, బలవంతంగా, చేయిచూసి చెప్పాడు:

"నీ భార్యకి తొలికాన్పు గండం, జాగ్రత్తగా వుండాలి. తాయెత్తు కట్టించుకుంటావా?"—అని.

అప్పుడు తను వినిపించుకోలేదు, కాని, ఆమాటలే ఇప్పుడు జ్ఞాపకం వచ్చి, గుండె అదురుతోంది. తనకి జాతకాల్లో నమ్మకం వుండనికాదు; అయినా....అయినా....

కుముదం వెళ్ళేప్పుడు సంతోషంగా వెళ్ళివుంటే తనకింత బాధగా వుండేదికాదు, ఇంత బెంగ పడేవాడుకాదు. ఆఖరికి కుముదం తనమీద కోపం గట్టిగా ప్రకటించి చికాకుపడినా, తనకింత బాధవుండేదికాదు. అందరు ఆడవాళ్ళలాగా గట్టిగా నోరుచేసుకొని కంటతడి పెట్టుకొని వుంటే, అందరిలాగే ఏ కొత్తచీరో, రవికో, కొని ఆ మరుగున ఆమెను సముదాయింపగలిగుండేవాడు. కాని, కుముదానిదా పద్ధతికానేకాదు. పల్లెత్తు మాట అనకుండా, కళ్ళతోనే మనిషిని ఆరువేలమైళ్ళదూరంలో వుంచడం ఆమెకే చేతనవునేమో!

# "ఈ రోజు గడిస్తే"

నిన్నమాత్రం.... ముక్తసరిగా మూడేమాటలు మాట్లాడినది. ఆఫీసులో అంతా కలిసి సినిమాకి వెళ్లాలనుకున్నారు; వెళ్లారు, తనూ వెళ్ళాడు. తను రానన్నా, వాళ్ళు వినిపించుకోలేదు. వెళ్ళక తప్పలేదు.

రాత్రి పదిగంటలకి ఇంటికి వచ్చేసరికి తను అనుకున్నట్లుగానే కుముదం ఒక్కతె, తనకోసం కనిపెట్టుకు కూర్చుంది. ఇంట్లో చెప్పకుండా వెళ్ళడం తనకెప్పుడూ అలవాటు లేదు. కంగారు పడతారేమోనని అనుకుంటూనే వున్నాడు. వెళ్ళగానే కుముదం కంగారుగా "ఎక్కడికి వెళ్ళారు? ఎందుకింత ఆలస్యం?" అని గబ గబ ప్రశ్నలు వేస్తుందనుకున్నాడు. కాని కుముదం ఏమీ తొణకలేదు.

"వడ్డించనా?-ఏమైనా ఆలస్యం ఉందా?" అని మాత్రం అన్నది.

"అబ్బే— ఏం లేదు.... వస్తున్నాను. ఆకలిలేదు గాని....!" అని తొత్తరంగా అంటూ లోపలికి వెళ్ళాడు.

భోంచేసేప్పుడు కూడా ఆమె ఏమీ మాట్లాడలేదు. ఊరికే కావలసినవి వడ్డిస్తూ ఊరుకుంది. ఆ మౌనంలోనే అతనికి అర్థమౌతూంది: తుపాను రేగిందని. ఉండబట్టలేక తనే మొదలెట్టాడు ఉపోద్ఘాతం:

"ఆఫీసులో అంతా సినిమాకి వెళ్లతుంటే నేనూ వెళ్ళాను. బలవంతం చేశారు. మొన్న ఒకతనికి ఏదో ప్రైజొచ్చిందిలే. అతను అందరినీ తీసుకువెళ్ళాడు" అన్నాడు.

కుముదం జవాబు చెప్పలేదు. కావలసినదేమో వడ్డించి మాట్లాడకుండా లోపలికి వెళ్ళింది. అయిదు నిమిషాల తరువాత ఓ చిన్న ప్రశ్న వేసింది:

"పద్మజ కూడా వచ్చిందా?"

"ఆఁ!" అని ముభావంగా అన్నాడు. ఈసారి అతనికి కోపం వచ్చింది, ఏమిటీ ప్రశ్న! పద్మజ తన ఆఫీసులో పనిచేయటం తన తప్పా? అందరూ వెడుతోంటె ఆమెను మాత్రం రావద్దని తానెలా చెప్పుతాడు? కోపంతో రెండు ముద్దలు గబగబ మింగేశాడు. ఏం మాట్లాడలేదు. లేవబోతోంటే ఆమె అన్నది:

"మా నాన్న వచ్చారు. రేపు ప్రొద్దున్నే వెళ్ళుతున్నాము. మీకు తెలుసునుగా?"

అతని గుండె గతుక్కుమన్నది. ఆమె మాట్లాడిన మూడు మాటల్లోని ధ్వని అతని కర్థమైంది. "నేను రేపు వెళ్ళిపోతున్నాను. మళ్లీ ఇప్పట్లో రానుగదా! ఈ ఒక్క రోజు ఎందుకు ఆలస్యంగా రావాలి? నాకు ఇష్టం లేదని తెలిసి పద్మజతో ఎందుకువెళ్ళాలి?" అని ఆమె మౌనం ప్రశ్నిస్తున్నది.

దీనికి తను సంజాయిషీ చెప్పుకోగలడు. తను కావాలని వెళ్ళలేదుగదా! కాని, ఆమె జవాబు చెప్పే అవకాశం ఎప్పుడూ ఇయ్యదు. ఎప్పుడూ అంతే!

"తమలపాకులు వేసుకుంటారా?"

"అక్కర్లేదు"

—అంతే. ఆ రాత్రి అంతటితో ముగిసింది.

తెల్లవారి పెట్టెసర్దుకుంటూ ప్రయాణ సన్నాహంలో వుండిపోయింది ఆమె. ఆరేళ్ళబట్టి ఎరిగున్న మనిషి తన నింతమాత్రం అర్థంచేసుకోలేకపోయిందన్న బాధతో అత నుండిపోయాడు. వెళ్ళేటప్పుడుకూడా, ఆమె అతనిని పలకరించలేదు. మామగారు మాత్రం, బండీ అదీ సిద్ధం చేయించి, తనతో చెప్పాడు.

"వెళ్ళివస్తాం నాయనా! సెలవు దొరికితే ఓసారి రావాలి!"అని.

కృష్ణారావుకి ఏమీ తోచలేదు. అప్పుడే అతని హృదయంలో ఏదో శూన్యత ఆవరించుకున్నది. "ఉండండి! నేనూ వస్తాను స్టేషనుదాకా!" అన్నాడు, తొందరగా. ఒక్క అంగలో వంకెన చొక్కా తీసుకొని, తనూ బండి యెక్కాడు.

స్టేషనులోనైనా కుముదం మౌనం వదలి చిరునవ్వుతో వీడ్కొంటుందేమో ననుకున్నాడు. ఆమె పలకకపోయినా తనే పలకరించి సంతోషంగా ఆమెను సాగనంపాలనుకున్నాడు. కాని అల్లా ఏమీ జరగలేదు. స్టేషనులో అడుగు పెడుతూనే పరికాశరావు ఎదురైనాడు.

"ఏమోయి! ఇల్లా వచ్చావు? ఓహో! మీ ఆవిడ పుట్టింటికెడుతోందేమిటి? ఆయన మీ మామగారా?" అని అందుకున్నాడు. ఇక ఆ తరువాత రైలు కదిలే వరకు తనని వదలనే లేదు:

"నెహ్రూ వస్తాడుటగా— ఎల్లుండి!"

"ఊఁ! వస్తాడు కాబోలు". ఇప్పుడాసంగతి ఎవరికి పట్టింది. కాని, ప్రకాశరావు మాత్రం విడిచిపెట్టలేదు. అదే ధోరణిలో రాజకీయాలు మాట్లాడుతూ, తన అభిప్రాయాలు చెబుతూ గడిపేశాడు. ఆఖరికి రైలు కదలబోతుండగా తనే తప్పించుకుని ఎల్లాగో కుముదం పెట్టె దగ్గరికి చేరుకున్నాడు. అంతకు ముందే కొన్న మల్లిదండ ఒకటి ఆమె చేతికిచ్చాడు. ఆమె పువ్వులు అందుకొని బల్లమీద పెట్టేసింది. వాటికేసి చూడలేదు.... రైలు కదిలిపోయింది.

అంతే! అదే బాధ. ఆమె తనమీద నిష్ఠూరం మోపి, మౌనంగా వెళ్ళిపోబట్టి తనకి హృదయంలో ఏదో శూలం గ్రుచ్చుకొన్నట్లు ఇంతబాధ! మామూలుగా నవ్వుతూ, కబుర్లు చెప్పుతూ వీడ్కొని వుంటే ఇంత బెంగ వుండేది కాదు. కాని ఏంజేస్తాడు! ఆమె స్వభావమే అంత. ఈ కాస్సేపూ గడిచిపోతే ఇంక ఇంత బాధ వుండదు, రేపు ఆమె మనస్సు మారవచ్చు. ఆమె ఉత్తరం వ్రాయవచ్చును. కాని ఇవ్వాళ, ఈ కాస్సేపు, ఈ బాధ ఓర్చుకొనడం ఎట్లా?

ఆశ్చర్యం! ఆరేళ్ళక్రిందట ఇట్లాగే అసలు మళ్లీ కలుసుకుంటామన్న ఆశకూడా లేకుండా, విడిపోతున్నప్పుడుకూడా, ఆమె ఇదేవిధంగా ముక్తసరి మాటలతో మౌనంగా అతన్ని పంపించివేసింది.

"మీ నాన్న కట్నంలేని పెళ్ళికి ఒప్పుకోరుగా?"అన్నది అంతే!

ఆ ఎత్తిపొడుపుతో మళ్లీ పల్లెత్తుమాట అనకుండా సాగిపోయింది. నిజమే! అప్పట్లో తండ్రికి ఎదురు తిరగగలుగుతాననే ధైర్యం అతనికి సుతరామూ లేదు. అందుకనే ఆమె వ్యంగ్యవాక్యాలకి నోరు మెదపలేక బాధపడుతూ ఊరుకున్నాడు. అయితే, అదృష్టం బాగుండి అటు తరువాత అన్ని సమస్యలు, వాటంతటవే, విడిపోయినాయి. తాను ఆఖరికి కుముదాన్ని పెళ్ళిచేసుకోగలిగాడు.

కాని, ఆవేళ ఆమె అతన్ని పంపించివేసినపుడెంత పరితపించాడో ఈ రోజు అంతే బాధపడుతున్నాడు. అప్పుడేమని తనకు తానే ఓదార్చుకున్నాడో, ఇప్పుడూ అదేమాట అనుకుంటున్నాడు: ఈ రోజు గడిస్తే!

అబ్బ! తల పగిలిపోతోంది. ఒక కప్ కాఫీ తాగితే! హాయిగా కాఫీత్రాగి, సిగరెట్ కాలిస్తే! అన్ని బాధలకీ అతనికి తెలిసినమందు అదొక్కటే. చేతిలో పేపరు బల్లమీద పారేసి జేబులో సిగరెట్టు పెట్టె తడుముకుంటూ లోపలికి వెళ్ళాడు. ముందువాగదిలో లక్ష్మి కూర్చుని చదువుకుంటోంది. చుట్టూ పుస్తకాలు పడివున్నాయి. నిద్ర లేక కళ్లు ఎర్రబడినట్లున్నాయి. పుస్తకంచూసి, నోటు బుక్కులో ఏమిటో రాసుకుంటోంది.

"లక్ష్మీ! ఒకకప్ కాఫీ చేసి పెడతావా?" అని అడుగుతూ ఎదురుగా వెళ్ళి గడపమీద కూర్చున్నాడు.

"బాబోయ్! ఇప్పుడు నావల్లగాదు, నాకు మధ్యాహ్నం పరీక్షవుంది తెలుసా!" అంది, మళ్ళీ జాలిపడి 'వెళ్ళి అమ్మనడుగు' అన్నది.

"మధ్యాహ్నం పరీక్షయితే, ఇప్పుడు కాఫీ చెయ్యకూడనికేం?" అన్నాడు వెటకారంగా.

"సరేలే! చదువుకోక్కర్లేదాయేం! ఇవ్వాళేగా! ఈ ఒక్కరోజు గడిచిపోతే రేపటినుంచి ఏబాధాలేదు.... పరీక్షముందర యెల్లావుంటుందో ఏమన్నా తెలుసానీకు? సరిగ్గా నూటఆరు డిగ్రీల జ్వరం వచ్చినట్లుంటుంది" అన్నది బడాయిగా.

కృష్ణారావు నవ్వుకున్నాడు. తనకేం తెలుసు! పరీక్ష అంటే ఏమిటో తెలియకుండానే ఎమ్. ఏ. బి. ఎల్. ప్యాసైనాడుగదూ!

లక్ష్మి మళ్ళీ అన్నది: "అన్నయ్యా! ఈ లెక్క కొంచం చేసిపెడతావా? ఎంత తంటాలు పడ్డా రావటంలేదు."

"అమ్మయ్యో! నేను లెక్కలు వదిలిపెట్టి చాలారోజులైంది, నన్ను చంపకు" అన్నాడు. లక్ష్మి నవ్వుతో, తన పుస్తకాల్లో మునిగిపోయింది. అతను సిగరెట్ ముట్టిద్దామా, వద్దా, అని ఆలోచిస్తో అట్లాగే కూర్చుండిపోయాడు.

ఉన్నట్టుండి, ప్రక్కఇంటినుంచి సంగీతం వినిపించింది. "సస రిరి గగ మమ...." హార్మోనియమ్ మ్రోగుతోంది. లక్ష్మికి వెర్రెత్తినట్లయింది.

"అబ్బబ్బా! ఈ అమ్మాయి సరిగా రోజూ నేను చదువుకునే టప్పుడే మొదలెడుతుంది." అని విసుక్కున్నది.

"సరేలే, బాగానేవుంది. పాపం! ఆ అమ్మాయి నేర్చుకుంటోంది" అన్నాడు అతను నవ్వుతో.

# "ఈ రోజు గడిస్తే"

"ఊఁ.... ఇవ్వాళ ఒక్కరోజు ఉండకోగూడదూ! అయినా ఆ అమ్మాయికి సంగీతం వస్తుందన్న ఆశ నాకేమీ లేదు." అన్నది దిగులుగా.

"సరే ! నీవు పరీక్ష ప్యాసు అవ్వాలన్న ఆశగూడ ఆ అమ్మాయి కేమీ లేదేమో!" అన్నాడు అతను కొంటెగా.

లక్ష్మి ముఖము చూసింది. అతను నవ్వు కుంటూ, వంటింటివైపు వెళ్ళాడు.

'అమ్మా!'

తల్లి పోపుపెడుతున్నదో లేనిదో తనపని చేస్తున్నది. వంటిల్లంతా చిందరవందరగా, ఒకవిధంగా వుంది. అమ్మ ముఖం అలసిపోయి వాడినట్లున్నది. వండని పొయ్యిలోనుంచి పొగ గది అంతా వ్యాపిస్తున్నది. అతనిని చూడగానే ఆవిడ కంగారుపడుతూ అన్నది: "అప్పుడే తొమ్మిదైందా నాయనా !"

"అబ్బే.... లేదమ్మా !"

చీకటి గుహ లావున్న ఆ వంటిల్లు, అలసిపోయిన ఆమె ముఖము చూడగానే "నాకో కప్ కాఫీ కావాలి చేసిపెట్టు"మని అడగటానికి అతనికి నోరు రాలేదు. అమ్మకేసి జాలిగా చూస్తూ వుండిపోయాడు.

"రామాయమ్మ రాలేదా అమ్మా?" అన్నాడు.

"లేదురా.... వాళ్ళబ్బాయికింకా జ్వరం తగ్గలేదుట. రేపు వస్తానన్నది" అని పోపు వేయిస్తూ చెప్పింది తల్లి.

"అయిపోయింది. ఇంకో అయిదు నిమిషాల్లో వడ్డిస్తాను." అని మళ్ళీ అన్నది.

కృష్ణారావుకి తల్లిమీద అపరిమితమైన ప్రేమ, జాలి, ముంచుకొచ్చినాయి. పాపం, ఈ సంసార భారం నెత్తిన వేసుకుని ఎన్నాళ్ళనుంచి ఎంత కష్టపడుతున్నది. అయినా ఆమెకు తాను ఏవిధంగాను సహాయం చేయలేకపోతున్నాడు. ఏవిధంగాను ఆమె శ్రమ దూరం చేయలేదు. నిస్సహాయంగా తల్లికేసి చూశాడు. తల్లి కొడుకు భావం గ్రహించింది. సముదాయిస్తున్నట్లన్నది:

"ఇవ్వాళ ఒక్కరోజే గదరా ! ఈ ఒక్కపూట గడిస్తే రేపు రామాయమ్మ తప్పకుండా వస్తుంది."

కృష్ణారావు ఏం మాట్లాడలేదు. మెల్లిగా అడుగులు వేస్తూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

పదిగంటలకి భోంచేసి, ఆఫీసుకి వెళ్ళాడు. మనస్సు ఇంకా కలతపడుతూనేవుంది. కుముదం ఇంత పట్టుదలగల మనిషని అనుకోలేదు !

బల్లదగ్గర కూర్చుని, పరధ్యాన్నంగా, ఆ రోజు వచ్చిన ఉత్తరాలు చూడడం మొదలెట్టాడు.

ఇంతలో, విశ్వపతివచ్చాడు. గబగబ మోపెడు కాగితాలు తీసి విసురుగా బల్లమీద పారేసి అతనిప్రక్కనే కుర్చీలో చతికిలపడ్డాడు. ఆ వాలకంచూసి కృష్ణారావుకి నవ్వువచ్చింది.

"ఏమిటీ అంత ఆయాస పడుతున్నావ్?" అని ప్రశ్నించాడు.

విశ్వపతి విసుక్కుంటూ జవాబు చెప్పాడు:

"ఏ ముందీ ! మేనేజరుగారు సాయంకాలంబండిలో బెంగుళూరు వెళుతున్నారు. ఈ కాగితాలన్నీ ఇవ్వాళే సరిచూసి ఆయనచేత సంతకం పెట్టించుకోవాలి!" అన్నాడు.

"ఓహో ! అదా !" అన్నాడు కృష్ణారావు.

ఒక్కనిమిషం ఊరుకుని మళ్ళీ అన్నాడు విశ్వపతి: "పోనిద్దూ, ఇవ్వాళ కొంచెం పడితే, ఆయనెల్లాగు ఊరికెళుతున్నాడుగదా ! ఇంకా పదిహేను రోజులువాకారాడు. హాయిగా నిద్రపోవచ్చు.... ఈ రోజు కాస్తా గడిస్తే...." అంటూ, తన్ను తాను ఓదార్చుకున్నాడు.

'అయితే, ఎందుకూ ఇప్పుడు మేనేజరు బెంగుళూరు వెళ్ళడం?' అని, కుతూహలం లేకపోయినా, ఏదో అడగాలని అడిగాడు కృష్ణారావు.

"ఎందుకేమిటోయ్ ! ఆయనకేం—సరదాగా తిరిగొస్తాడు. శృంగార పురుషుడు" అన్నాడు విశ్వపతి వ్యంగ్యంగా.

మేనేజరు ప్రస్తావన వచ్చినప్పుడల్లా వ్యంగ్యంగా మాట్లాడడం ఆఫీసులో అందరికీ అలవాటే. ఆయన చరిత్ర అంత మంచిదిగాదని అనుకోడంలో అందరికీ ఒక విధమైన తృప్తి. ఒకవేళ ఆయనక్రింద పనిచేయవలసి వచ్చిన ఖర్మానికిది ఒక విధమైన ప్రతీకారమేమో !

కృష్ణారావుకి మాత్రం ఇటువంటి సంభాషణ ఎప్పుడూ నచ్చదు. అతను విశ్వపతి మాటలు విననట్లు ఊరుకున్నాడు. ఆ కాగితాల కట్టలలో తనవంతు కాగితాలు తీసుకొని అందులో మునిగిపోయాడు.

సాయంత్రం సముద్రపు ఒడ్డునించి సైకిలుమీద ఇంటి త్రోవ పట్టాడు. పౌర్ణమి కావటంచేతనేమో, ఎగసి ఎగసి పడే అలల హోరు భయంకరంగా ఎంత దూరానికో విని పిస్తున్నది. గాలి జోరుగా వీస్తున్నది. సైకిలు వంకర్లు తిరుగుతోందిగాని, ఆ చల్లగాలికి అతని హృదయం కొంత చల్లబడ్డది.

ఇంటికివచ్చి, గేటు తీసి సైకిలు లోపల పెడుతోంటే, అనంతాచార్యులు గారెదురుపడ్డారు—మందుల సంచితోసహా. కృష్ణారావు కొంచం ఆగి అన్నాడు:

"ఏమండీ, ఎట్లావుంది తాతయ్యకి?"

అనంతాచార్యులుగారు, గంభీరంగా ఏదో ఆలోచిస్తూ, అన్నారు: "ఇవాళ మాత్రం కొంచం బలహీనంగా ఉన్నారు. మందు ఇచ్చాను. ఇవ్వాళ కాస్తా గడిస్తే ఇంకేం ఫరవాలేదు. అయినా కాస్త, జాగ్రత్తగావుండండి. రేపు మళ్ళీ వచ్చి చూస్తాను"— అంటూ సంచీ ఊగించుకుంటూ సంతృప్తితో వెళ్ళిపోయాడు.

కృష్ణారావు ఏమీ కంగారు పడలేదు. ఇది మామూలే. అనంతాచార్యులు 'ఇవ్వాళ జాగ్రత్తగా వుండండి. ఇవ్వాళ కాస్తా గడిస్తే—' అంటూనే మూడేళ్ళనుంచి జరుపుకు వస్తున్నాడు. అయినా, సైకిలు లోపల పెడుతూనే తాత గారిదగ్గరకు వెళ్లాడు.

"ఏం తాతయ్యా! ఎట్లావుంది?"

"ఏదో వుంది, ఎట్లావుందేమిటి?" అంటూ తాతయ్య నిస్సారంగా జవాబు చెప్పాడు. కృష్ణారావు అక్కడే మంచందగ్గర కూర్చున్నాడు ఏవో కబుర్లుచెపుతూ. కాస్సేపటికి తాతయ్య అన్నాడు:

'మనుమరాలు ఊరికి వెళ్ళిల్లినందే? ఇంట్లో ఏమీ సందడిలేదు!'

కృష్ణారావుకి మళ్ళీ ఒక్కసారి బెంగముంచుకొచ్చింది. ఇల్లంతా బావురు మన్నట్లు తోచింది. తాతగారి ప్రశ్నకు సమాధానంగా "ఆఁ" అంటూ అక్కడినుంచి లేచి వెళ్ళి పోయాడు.

స్నానంచేసి డాబామీదకు వెళ్ళాడు. అప్పుడే ప్రొద్దు వాలుతోంది, పడమటివేపు కందగడ్డలాంటి సూర్యబింబం మబ్బుల్లోనుంచి సగం మాత్రమే కనిపిస్తోంది. ఆకాశమంతా 'ఈరోజు అయిపోతోంద'ని ఎఱ్ఱని సిరాతో వ్రాసినట్లుంది, నిలువుగా ఎదిగిన కొబ్బరిచెట్లమీద ఎర్రని కాంతి మిలమిల మెరుస్తున్నది. ప్రశాంతమైన ఆ సంధ్య మనస్సుకేదో హాయిని చేకూరుస్తున్నది.

ఆశ్చర్యం! ఎంతమంది ఈ రోజు గడిచిపోవాలని కని పెట్టుకు కూర్చున్నారు! పొద్దుటినుంచి ఎంతమంది నోటి నుంచి అదేమాట విన్నాడో! పరీక్ష వ్రాయలేక లక్ష్మి, పనిచేసుకోలేక అమ్మ,— అందరికీ ఒక్కటే ఆలోచన. వెర్రిగాని, ఈరోజు గడిచిపోతే, ఇంకోరోజు రాదూ? ఈ పరీక్ష అయిపోతే ఇంకొక పరీక్ష రాదుగాబోలు! అతనికి నవ్వొచ్చింది.

కుముదం వెళ్ళిపోయిన బెంగ అప్పటి కతనికి కొంచం అలవాటయింది. ప్రొద్దున్న సూది మొనలాగ్రుచ్చుకొని వేధించిన బాధ అప్పుడు బండబారి మనస్సుకొక విధమైన నిర్వికారత కలిగించింది.

చూస్తూ ఉండగానే, ప్రొద్దువాలి, చీకటిపడి, వెన్నెల వచ్చింది. వెన్నెట్లో ఆకాశాన తెల్లని మబ్బులు దూదిపింజెల్లా అటూ ఇటూ కదలుతూ, ఒకదానినొకటి హత్తుకొంటున్నాయి. ఇందాకటి సంధ్య బాగున్నదో, ఇప్పటివెన్నెలే బాగున్నదో, కృష్ణారావు నిర్ణయించుకోలేక పోయాడు. కాని, ఈ రాత్రి గడచి పోతుంది. చూస్తూవుండగానే తెల్లవారిపోతుంది. మళ్ళీ, ఉదయిస్తోన్న సూర్యుడు ఎదురొతాడు.

అతనికి విచారమేసింది. అమ్మో! ఇంత అందమైన ఈరోజు గడచిపోతుందా!!

క్రింద నుంచి తల్లి కేకేసింది: "నాయనా! టెలిగ్రాం వచ్చింది!"

గబగబ క్రిందకు వెళ్ళి, టెలిగ్రాం విప్పి చూసుకున్నాడు. "ఏంలేదమ్మా, మీ కోడలు సుఖంగా చేరిందట. అంతే'' అని ఆతృతగా ఎదురు చూస్తున్న తల్లితోచెప్పి, మళ్ళీ మేడపైకి వెళ్ళాడు.

## "ఈ రోజు గడిస్తే"

ఇప్పటికి అతని హృదయం నిర్మలమైన సరస్సువలె ఉప్పొంగింది. కుసుమం ఉత్తరంలో మూడు ముక్కలే ఉన్నాయి.

'కులాసాగా చేరాను — ఉత్తరం వ్రాస్తారా?"

—అంతే! కాని, ఇప్పుడామె ఆరు పేజీలు వ్రాసినా అతనికంత కంటె ఎక్కువ ఆనందం కలిగి వుండేదికాదు. అతనికా క్షణంలో ఆమె మీద ప్రేమ కట్టలు త్రెంచుకొని పొంగి వచ్చింది. సంతోషంతో కన్నులు మూత పడ్డాయి. అల్లాగే నిద్రపోయాడు.

ఆ నిద్రలో, ఆనందంలో, ఆ రోజు గడచిపోయింది.



# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

• శ్రీమతి కె. యం. సౌందర్యవల్లి •

2. రాగం - శంకరాభరణం - ఆదితాళం.

ఆరో॥ స రి గ మ ప ద ని స — అవ॥ స ని ద ప మ గ రి స.

ప॥ గురుపదస్మరణమే జీవనము
దురితములడప సుసాధనము మనసా ॥గురు॥

అ॥ప॥ నిరతము నామ సుధారసమాను ఘనుడై
వరముని నారద వాత్సల్య పాత్రుడౌ ॥గురు॥

చ॥ సీతాపతి చరణసేవా దురంధరుని
పూతాత్మ నయగుణ పుణ్యచారిత్రుని
పారికిదూరుని పండితపామర
వ్రాతము బ్రోవగవచ్చిన శ్రీత్యాగ ॥గురు॥

| | 1—4 | O—2 | O—2 |
|---|---|---|---|
| ప॥ | ;గ పా మ గా గ రి మ గ రి స సా | ; ని సా ద నీ | సా ; ; రీ |
| | గు రు ప ద స్మ . ర . . ణ మే | జీ . వ న | ము |
| | ; గ పా మ గా రీ గ మ గా రీ సా సా | ; ని సా ద నీ | సా ; ; ; |
| | గు రు ప ద స్మ ర , . . ణ మే | జీ వ న | ము . . . |
| | ; స రీ గ మా పా పా దా నీ | సా ; స ని ద ప | ప ప మ గ సా సా |
| | దు రి త ము ల డ ప సు | సా ధ . న , | ము . మ . న . సా |
| | రి గ గ పా మ గా రీ గ మ గా రి స సా | ; ని సా ద నీ | సా ; ; ; |
| | . . గు రు ప ద స్మ ర . . . ణ మే | జీ . వ న , | ము , , , |
| | ; స రీ గ మా పా పా ద ని సా | మ మ గ రి స ని ద రి | స ని ద ప మ గ రి స |
| | దు రి త ము ల డ ప . సు | సా . . ధ . న . | ము . మ . న . స . |
| | రి గ॥ (గపామగా) | | |
| | . . ॥గురుపద॥ | | |

| | 1—4 | O—2 | O—2 |
|---|---|---|---|
| అ॥ప॥ | ; ప పా గ మా పా ద ని సా సా | ; సా సా స స | స ని స రి స ని దా |
| | ని ర త ము నా మ . సు ధా | ర స మా ను | షు . ను . ద్రై . . |
| | పా ప పా గ మా పా ద ని సా సా | ; స సా సా స | ని స రి గ మ. వ గ రి |
| | . ని ర త ము నా మ . సు ధా | ర స మా ను | షు . సు . . . ద్రై . |
| | సా, స రి స స స ని ద ప దా నీ | పా స ని దా పా | ప ప మ గ సా సా |
| | . వ ర ము ని నా . . . ర ద | వా త్స . . ల్య | పా . . . త్రు డౌ |
| | రి గ ॥గపా॥ | | |
| | . ॥గురు॥ | | |
| చ॥ | దా; దా దా దా; దా దా | పా ద ని స నీ ద | పా ప మ గా మా |
| | సీ తా ప తి చ ర ణ | సే . వా . . . | దు ర ం ధ రు ని |
| | పా, మా, గ గరిమగ రి స సా | ; స మా గ మా | పా పా ; పా |
| | పూ తా త్మ న . య . . గు ణ | పు . ణ్యా చా | రి త్రు ని |

అనుపల్లవి మాదిరిగా :
పా త క దూ రు ని పం డి త పా
మ ర వ్రా త ము బ్రో వ గ వచ్చిన శ్రీత్యాగ॥గు॥



## ఆంధ్రి మహిళాభినందన

కవిసోదరులు శ్రీ కోటసోదరకవులు.

ఎమ్మెయి సోదరీమణుల కెంత శుభంబగు నంతకంటె శ్రీ
యమ్మగుధాత్రి, కాంధ్ర మహిళా భ్యుదయమ్మునకీవు మేటిసా
యమ్మొనరింపు మాంధ్రమహిళాభిద పత్రిక సర్వకాలముల్,
ఇమ్మహి వంశమూలమనరే విభుధావళి కామినీతతిన్॥
ప్రాచీన భారత వనితామ తల్లుల రమణీయమౌ చరిత్రలనుదెలిపి,
సంగీత సాహిత్య సదమలాలంకార లలిత కళా విమర్శలను నేర్చి,
గృహపాత్ర పరిశుభ్ర మహితౌషధక్రియా నిర్మాణ చతురత నేర్చి మంచి,
ప్రస్తుతంబనుకూల రాజకీయాంశముల్ రచ్చల పైకెక్కి ముచ్చటించి,
ఆంధ్రమహిళపేరు సార్థకమువహింప
తెలుగుసీమనెల్ల మెలగుమమ్మ.
పుట్టినింటికవల మెట్టినింటికిగూడ.
భవ్యమైనకీర్తి వరలునట్లు.
గౌతమీనది నీశిరోకనకమకుట
మపరపుర్వాబ్ధులందులరు నెయ్యంపు చెలులు.
తనరు కావేరి నీకు పద్మాసనంబు.
ఔరా! లోపంబుగలదె నీ కాంధ్రమహిళ.



# ★ చంద్రుడు ★

• శ్రీమతి వి. యస్. ఆర్. నాయకమ్మ •

చంద్రగ్రహం మనకు దాపునందున్నట్టిది. అందువల్లనే మన పూజ్యులగు పూర్వీకులకు అధిక ప్రియమైనట్టిదైనది. బహు పురాతనకాలమునుండీ_ మానవులకు చిరుతప్రాయము నుండీ ఆకర్షణీయమైనట్టిదైనది. బాల్యములో మనదృష్టి రాత్రిళ్ళు ప్రప్రథమముగా యీగ్రహంపైబడును. త్వరగా దీనితో పరిచయమేర్పడును. మామా, మామా, అంటూ చుట్టరికమేర్పరచుకొందుము. ఈగ్రహాన్ని చంద్రుడనీ_ సుధాకరుడనీ_ శశేడనీ_ నిశాకరుడనీ_ శశాంకుడనీ_ మృగాంకుడనీ_ రజనీపతియనీ_ శశియనీ_ యింకా అనేక పేర్లతో పిలుస్తున్నాం.

సౌరమండలము నుండి చంద్రుడు గనుక అంతరించిపోతే ప్రపంచమందున్న ఓడరేవులన్నింటిలోనూ హాహాకారాలు వినవస్తవి. హార్బరునుండి ఓడ బయటికిబోదు, బైటనుండి హార్బరులోనికి రాదు. సముద్రయానము_ సముద్రంపై జరిగేవ్యాపారము స్తంభిస్తుంది. ఆటుపోటులన్నీ చంద్రునికి సంబంధించి వున్నై.

ముందుమనం సూర్యాస్తమయ సమయంలో పశ్చిమదిశ కేసి ఆకాశంలో చూస్తే తదియ చంద్రుడు కానవస్తాడు. హిందూ ధర్మశాస్త్రాల్లో దీనిదర్శనం మహత్తుగలదని వర్ణింపబడ్డది. ప్రశాంతమైన రాత్రి సమయమందైతే చంద్రుని మిగతాభాగంకూడా అస్పష్టంగా కానవస్తుంది. ఈశేషాంశం పృథ్వీద్వారా పరిక్షిప్త ప్రకాశం వల్లకానవస్తోంది. ప్రతి రాత్రి క్రమక్రమంగా తూర్పుదిక్కునకు జరుగుతూవుంటుంది. పౌర్ణమినాటికి పూర్ణ వృత్తాకారందాల్చి పూర్ణ చంద్రుడని పిలువబడుతోంది. పూర్ణచంద్రుడు సరిగ్గా సూర్యాస్తమయ సమయానికి వుదయించును. ఇది పదిహేను రోజులకు జరుగుతుంది. ఈపక్షమునకు శుక్లపక్షమని పేరు. మళ్ళీ యీవృత్తాకారం క్షీణించసాగును. అది నాలుగోవంతు మిగిలేవరకూ క్షీణిస్తుంది. యీ చంద్రుడు ప్రాతఃకాలాకాశమున చాలాపైగా కాన్పించే కాంతి. మళ్ళీ రోజురోజుకూ, రోజులు గతించుచుండ అర్ధ చంద్రాకారమేర్పడును. ఈ ఆకారంకూడా క్రమ క్రమంగా సూర్యుని పరిదాపులకు పోతుంది. క్షీణిస్తుంటుంది. చివరకు సూర్యుని మహాతేజస్సులో లీనమై అదృశ్యమై పోతుంది. మళ్ళీయిది నవ్యచంద్రుని రూపంలో కానవస్తుంది. ఈ కార్యక్రమంకూడా పదిహేను రోజుల్లో జరుగుతుంది. దీన్ని కృష్ణపక్షమంటున్నారు. ఈ విధంగా యీ చక్రం యెప్పుడూ తిరుగుతూంటుంది. చంద్రుని తళుకు బెళుకులు పూర్తిగా చంద్రుని అప్రకాశిత భాగంపైబడునట్టి సూర్యుని తేజస్సుపై ఆధారపడి యున్నై. అక్కడకీ సూర్యుడు యిచ్చినంత కాంతిని చంద్రుడు గ్రహించలేడు. ఈకొలది అంశంలోకూడా కొంత భాగాన్ని భూమిపైకి విసురుతోంది. చంద్రునిలో సూర్యునిద్వారా నిక్షిప్తమైన ప్రకాశం మినహా మరే విధమైనటువంటి కాంతి లేదనుకోవటానికి వీల్లేనంతగా_ వెన్నెల కాంతులను విరజిమ్ముతుంటాడు చంద్రుడు. ఎప్పుడైనా పగటిపూట చంద్రుని దిక్కుకేసి చూచినట్లైన మేఘాలకాంతీ, చంద్రునికాంతీ ఒకటిగానే కానవచ్చును. ఆరులక్షల చంద్రగ్రహాల నొకచోట జేర్చిన, ఒక సూర్యునికాంతికి సమానమగునేమో!

మనోహరమైన_ ఆనందదాయకమైన_ చంద్రుని శీతల రజనీకాంతులు చాలామంది కవులహృదయాల నాకర్షించినై. మాఘమహాకవి చంద్రుని అత్యద్భుతంగా వర్ణించాడు. చంద్రునిచే యాకర్షింపబడని కవి సామాన్యంగా వుండడనుకొంటాను. పురుష పుంగవుడనుకొనబడే రామచంద్రుని ఆటవస్తువుగా చంద్రుణ్ణి వర్ణించారు కవులు.

అన్యగ్రహాలన్నింటికన్నా చంద్రుణ్ణే_ మనం యెక్కువగా యెందుకు ప్రేమిస్తామనే ప్రశ్న యెదురౌతున్నది. అంటే అదేమనకెక్కుడు దాపు నందున్న యిరుగు పొరుగు గ్రహమన్నమాట. యెప్పుడైనా, యేదైనా, ధూమకేతువు భూమికి చంద్రునికన్నా దాపుకొచ్చినప్పటికీ అన్యగ్రహాలు నక్షత్రాలు మనకు చంద్రుడున్న దూరానికన్నా కొన్ని లక్షల రెట్లెక్కువ దూరంలో వున్నై.

గగన మండలంలో కాన్పించే వాటన్నింటికన్నా చంద్రగ్రహం చాలా చిన్నదన్న విషయం గుర్తుంచుకోవాలిమనం.

నక్షత్రాలుగానీ, గ్రహాలుగానీ, దూరదర్శినీ యంత్రాల సహాయం లేక కానుపించనంతగా వున్నప్పటికీ వాటన్నింటికన్నాకూడా చంద్రగ్రహం చిన్నది. చంద్రుడు భూమికి 2,39,000 మైళ్ళదూరంలో వున్నాడు. యీదూరం అనుకున్నదానికంటే చాలాతక్కువే. చంద్రుని బరువుభూమి బరువులో $\frac{1}{81.5}$ వంతు. దీనిఘనత్వం భూమి ఘనత్వం ప్రకారం .601 వుంది. దీనపైభాగపు గురుత్వాకర్షణాశక్తి, భూమియొక్క గురుత్వాకర్షణాశక్తికి 1/6 వంతు వుంది. అయినప్పటికీ భూమిపై గల వస్తువుల బరువు ఆరు సేరులుంటే ఆవే వస్తువులు చంద్రగ్రహంలో ఒక సేరు బరువు వుండును. ఇక్కడ అయిదడుగుల ఎత్తుదూకగల మనిషి అక్కడ ముప్పదిఅడుగుల ఎత్తు దూకగలడు.

చంద్రుడు భూమికేమైనా కొంచెం వేడిని ప్రసాదిస్తున్నాడంటే అది శ్రీయుత లార్డ్ రోస్ కథనానుసారం— సూర్యుడు కలుగజేసే దానిలో $\frac{1}{80000}$ వంతు వుంటుంది. ప్రొఫెసర్ సి.సి. హచింన్ 1888 సంllలో దీనిని $\frac{1}{185000}$ భాగంగా గ్రహించాడు.

భూమి వ్యాసకొలత 7914 మైళ్ళు. చంద్రుని వ్యాస కొలత 2160 మైళ్ళు. అంటే భూమివ్యాసానికి చంద్ర వ్యాసం నాలుగోవంతు వున్నదన్నమాట. భూమిని యేబది సరిసమానమైన గోలాకారపు ముక్కలు చేసినట్లయితే ఒక్కొక్కటీ చంద్రుని అంత వుండునన్నమాట. మనకుగాన వచ్చే చంద్రుని అర్ధగోళాకారము యొక్క విస్తీర్ణం, భూమివిస్తీర్ణములో 1/27 వంతు వుండును. చంద్రుని యొక్క వాస్తవిక ప్రత్యక్ష విస్తీర్ణములందు యెప్పుడూ కూడా పెద్దగా పరివర్తన జరిగినట్లుండదు.

చంద్రుడెప్పుడూ తరుగుచూ పెరుగుచూ వుండుటవల్ల యెప్పుడూ తిరుగుతూ వుంటాడనుకొంటారు. ఈ ప్రయాణ మెట్లున్నా, భూమీ చంద్రుడు యెప్పుడూ ఒకే దూరం లో వుంటారు. చుక్కలను చూస్తూవుంటే భూమి చుట్టూ చంద్రుడు చక్కర్లు గొట్టుచుండడం తేలిగ్గా అర్థమవుతుంది. చంద్రుడు చుక్కలలో యెప్పుడూ తనస్థానాన్ని మారుస్తూ వుంటాడు. ఇట్లు పృథ్వి నలువైపులా 27.3 రోజులలో పూర్తిగా తిరిగి రాగలుగుతాడు.

భూమీ మరియు సూర్యుడూ ఆపేక్షక స్థానం మారుతుండును. అనగా పరిభ్రమణమందు సూర్యుడు రెండు పర్యాయములు భూమీ చంద్రుల భ్రమణపథాన్ని దాటుతూ రేఖాస్థానంలోని కొస్తున్నాడు. అటిసమయం శుద్ధపక్షమైనట్లయితే, భూమి సూర్యునికీ చంద్రునికీ మధ్యకొచ్చినప్పుడు చంద్రుడు భూమిలో కప్పబడి పోతున్నాడు. తత్ఫలితంగా సూర్యప్రకాశం చంద్రునికి అందదు. అప్పుడు దాన్నే మనం చంద్రగ్రహణ మంటున్నాము. అప్పుడప్పుడు చంద్రుడు భూమిలో పరిపూర్ణంగా కప్పబడకుండా వుండును. అది పూర్ణగ్రహణం గాదన్నమాట. ఇందుకు విరుద్ధంగా భ్రమణపథాన్ని దాటుకుంటూ రేఖాస్థానంమీద చంద్రుని సమయమున వచ్చినట్లయితే చంద్రుడే సూర్యునికీ భూమికీ మధ్యలో పడతాడు. చంద్రుని యొక్క నలుపు భాగం భూమినుండి సూర్యుని కాంతిని నిరోధిస్తోంది. ఈవిధంగా సూర్యగ్రహణం యేర్పడుతోంది. ఎక్కువగా సూర్యుని కొద్దిభాగమే కాన్పించకుండా వుంటూ వుంటుంది. అప్పుడప్పుడూ చంద్రుడు సూర్యుణ్ణి పూర్తిగా కప్పివేస్తుంటాడు. అటువంటప్పుడే నిండు సూర్యగ్రహణ మంటారు. ఇలాంటి దెప్పుడో ఒకప్పుడే గాని సామాన్యంగా యెప్పుడూ జరుగదు. అది అపూర్వ విషయం. చంద్రుని అర్ధప్రత్యక్షాకారం— సూర్యుని అర్ధప్రత్యక్షాకారానికి సరిసమానంగానే వుంటుంది; కాని దూరంగా వుండడం వల్లనూ, తిరుగా బోర్లాగా వుండడం వల్లనూ, రెండు గ్రహాలవాస్తవిక ప్రత్యక్షాకారాల్లోనూ పరివర్తన వుంటోంది. అప్పుడప్పుడూ చంద్రుని ప్రత్యక్షాకారం సూర్యుని ప్రత్యక్షాకారం కంటే పెద్దదిగా వుంటోంది. అంటే ఆ సమయములందు సూర్యబింబం చంద్రబింబంతో ఆచ్ఛాదితమై పోయిందన్నమాట.

చంద్రగ్రహణ సమయమున ప్రప్రథమంగా చీకటిఛాయలు ప్రస్ఫుటమౌతై. క్రమక్రమంగా అవి శేషాంశంపై కూడా వ్యాపిస్తుంటై. అంటే అర్ధవృత్తం మిగులుతోందన్న మాట. పూర్ణగ్రహణమైతే అదికూడా అదృశ్యమవుతుంది. అంటే చంద్రబింబమంతా కప్పబడుతుందన్నమాట. అనగా చంద్రునిపై సూర్యరశ్మి పడకుండా భూమి అడ్డొచ్చిదన్న మాట. అయినప్పటికీ చంద్రబింబం లీలగా కాన్పిస్తూనే

వుంటుంది. వాస్తవానికి వుపరిభాగం మాత్రం దృష్టిగోచర మవుతుంది. చంద్ర కాంతులు సూర్యరశ్మిపై ఆధార పడివున్నై.

చంద్రుడు ఓడలు నడుపు వారికెక్కుడుపకారి. అనంత, అగాధ జలరాసిలో ఓడెక్కడున్నదీ అన్న జ్ఞానం ఓడ నడపు నావికులకు చాలాఅవసరం. సూర్యునివల్ల అక్షాంశ రేఖ తెల్సుకోబడుతోంది. అది ఆ స్థానంయొక్క కాలాన్ని కూడా తెలియజేస్తుంది కాని, రేఖా సమయంబులు తెలియ కండా వున్నప్పుడు ఓడెక్కడున్నదీ గ్రహించడం దుర్లభం. రేఖ సమయాన్ని తెలియజేసే యంత్రాన్ని "క్రోనోమీటు"రంటారు. అంటే కాలకొలత యంత్రమన్న మాట. క్రోనోమీటరు ఆర్డరులో లేక, ఒక నిముషమైనా తేడా వచ్చిందంటే ఓడ దారితప్పి పదిపదిహేను మైళ్ళదూ రంపోయి తికమక పడిందన్నమాటే. కాబట్టి అందునిమిత్తం ప్రపంచాని కంతకూ కాన్పించే రేఖా గడియారం అత్యవస రమన్నమాట. యదార్థాని కట్టి గడియారం వుందికూడాను. దానిలో డయల్ కూడా వుంది. అనేక చిహ్నాలున్నై. ముల్లుకూడా వుంది చుట్టూతిరుగుతూ. క్రోనోమీటర్ను సరిజే యడానికి నావికులుపయోగించే గడియారంముందు వెస్ట్ మినిష్టర్లో గలగడియారం యెందుకూ పనికిరాదు. అనం తాకాశమేదానికి డయల్. మినుకు మినుకుమను నక్షత్రా తేడయల్ పైనవున్న చిహ్నాలు. చంద్రుడేదాని ముల్లు. క్రోనోమీటరును సరిజేసుకోవాలనుకున్నప్పుడు నావికుడు దాపునందున్న నక్షత్రానికీ చంద్రునికీ గలదూరాన్ని కొలు స్తాడు. సముద్రపంచాంగంలో చంద్రు డానక్షత్రానికి మూడువంతుల దూరమైనప్పుడు రేఖా సమయాన్నిస్తుంది. దీన్ని క్రోనోమీటరు సంకేతాలతో కలిపితే జరిగిన తప్పు దిద్దుబడుతుంది. నేటి ఓడనావికులవద్ద చాలాక్రోనోమీటర్లు వుంటై. అంతేగాని ఈ చంద్రగ్రహ సంబంధమైన ప్రయో గాన్ని ఆచరణలో పెట్టడంలేదు.

భూగోళ శాస్త్ర విశారదులు ఆఫ్రికా అంతర్భాగవిష యంలో తెల్సుకున్న దానికన్నా యినుమిక్కిలిగా జ్యోతి శ్శాస్త్ర విశారదులు చంద్రమండలాన్ని గురించి తెల్సు కున్నారు. చంద్రమండల మందలి భూభాగాన్ని రాసిచూ పించినారు. దానికొక నామకరణం కూడా చేశారు. చంద్ర గోళంలో సముద్రాలు, పర్వతాలు, అగ్ని పర్వతాలు కూడా వున్నట్టు కనుగొనబడెను. సముద్రాలు నామ మాత్రమైనట్టివే. అంటే వాటిల్లో నీటిబొట్టన్నా లేదు. వాటి పేర్లివి.:- సముద్రాలు.— క్రాయిసియం; ఫొకండిటేటిస్; ట్రాంక్విలిటేటిస్; సెరినిటేటిస్; ఇంబ్రియం; సాయినస్; నెబ్యులం; హ్యూమరం; న్యూబి యం; నెక్టేరిస్. పర్వతాలు.— కాకెసస్; ఆల్ప్స్; ఎపి నాయిన్స్; కార్పెంథియన్; కార్డిల్లెరా; పిరెనీస్; రూక్; అమరఫల్; లీబినిజ్. అగ్నిపర్వతాలు — పాసిడోనియాస్; లిన్నె; అరిస్టాటిల్; ఆల్ఫన్స్ గ్రేట్ వేలీ; ఎకిస్ట్రిస్; ఓటొలి కస్; ఆర్కిమిడీజ్; ప్లేటో; ఎంటోసినిజ్; కోపర్నికస్; కెప్లర్; ఎరిస్టాకస్; గ్రిమాల్డీ; గెసిండీ; ష్కిక్డ్; వారజెం టీన్; క్లెలియస్; టాయకో; ఎలోఫ్సంస్; టాంల్మీ; కెథె రినా; సాపరిలస్; థియోఫిల్; పిటేంపియస్; హోయిజినస్; ట్రీసన్కర్;. ఇవన్నీ చంద్రమండలం యొక్క అర్థవృత్తము నందున్న నదిపర్వతములు, సముద్రస్థానములు. రెండవ ప్రక్క చూడ్డం అసంభవం. అంటే చంద్రునియొక్క ఒక భాగమే యెప్పుడూ భూమివైపు వుంటుంది. ఒక్కసారి భూమిచుట్టూ తిరిగినంత సేపట్లోనే తనచుట్టూతాను ఒక పర్యాయం తిరుగుతుంది. భూమిచుట్టూ తిరుగునప్పుడు మాత్రం భ్రమణవేగం ఒకేరీతిగా వుంటుందిగాని, తన చుట్టూతాను తిరుగుతున్నప్పుడు మాత్రం భ్రమణవేగంలో హెచ్చుతగ్గులు వుంటూవుంటై. అందువల్ల ఒక్కొక్క ప్పుడు మనవైపునెమ్మదిగా తలాడిస్తున్నాడా అన్నట్లుం టుంది. ఇందువల్ల రెండో అర్థవృత్తంప్రక్క భాగాలు కొద్ది గా కానవస్తై. పౌర్ణమినాడు చంద్రుని స్థానలంగా కన్పిం చవు. ట్రీసన్కల్ క్రేటరిలో చాలాపర్వత పంక్తులు కాన వస్తై. జ్వాలాముఖి పర్వతాలయొక్క వ్యాసం 24 మైళ్ళు. మధ్యలో పెద్దపర్వతమొకటుంది. దీనిశిఖరం సూర్యరశ్మిచే ప్రకాశిస్తుంది.

పర్వతాల్లో లీబినిజ్ అన్నింటికన్నా ఎత్తైయినది. సమీప కొండచరియనుండి దీని వున్నత శిఖరం యెత్తు 41900 అడుగులు. ఎత్తైయిన మనపర్వతాలు చంద్రమండ

లమందలి ఎత్తైన మనపర్వతాలకన్నా చాలా ఎత్తైనవే. ఎవరెస్ట్ శిఖరం యెత్తు 29 వేలఅడుగులేగద యిదేమిటని పాఠకులు ఆశ్చర్య పడవచ్చు. కాని సంగతేమిటంటే సముద్రపు లోతుకూడా కలపాలన్న మాట. చంద్ర మండలంలో యెప్పుడో అగ్ని పర్వతాలు ప్రేలినట్లు ప్రేల్చిన వల్లమనకు విదితమవుతోంది. ఇప్పటికన్నా పూర్వమెప్పుడో చంద్ర మండలము ప్రద్యోగంగా వుండనుకుంటాం. సూర్యచంద్ర మండలాల్లో- సూర్యమండలం పెద్దది. చిన్నది చంద్రమండలం. సూర్యుని తాపం అత్యధికం. కాని ఆవుష్ణోగ్రత కూడా క్రమక్రమంగా తగ్గుతోంది. పృథ్వీపరిభాగం బలమైన రాతి ప్రదేశంతోను మట్టితోను నిర్మింపబడి యున్నది. అదీగాక అత్యధిక భాగం సముద్రాలతోను, మహాసాగరాలతోను, ఆక్రమింప బడియున్నది. ఇందువల్ల మనకు తాపమంతగా వున్నట్లు అనిపిండంలేదు. అయినప్పటికీ భూమండలమున నన్ని ప్రదేశాల్లో వుష్ణోగ్రత యెక్కువగానే వుంది. బాగావేడెక్కిన ఒక పెద్దవస్తువు చల్లబడడానికి యెక్కువసమయం తీసుకుంటుంది. అలాగే చిన్నవస్తువు తొందరగా చల్లబడుతుంది. సూర్యగ్రహం పెద్దది. అందువల్లనే దీని అంతర్భాగంలో ఇంతవరకు చాలినంత వేడివుంది. కాని చంద్రమండలం చిన్నది. అందువల్లనే తన వేడిమి నంతటినీ కోల్పోయింది.

చంద్రమండలంలో జీవించడం సాధ్యమా, అసాధ్యమా అన్న విషయాన్ని మనమిప్పుడు పరిశీలించి చూడాలి. పెద్ద పెద్ద గొప్ప గొప్ప దూరవీక్షణ యంత్రాలుకూడా అక్కడ జీవించడం సాధ్యమా కాదా అన్న విషయాన్ని తేల్చలేకున్నాయి. అక్కడ పెద్ద పెద్ద చెట్లుండవచ్చు- ఏనుగులవీ విహరిస్తూ వుండవచ్చు. కాని దూరదర్శిని యంత్రం మాత్రం మనకీవిషయంకూడ తెలియజేయజాలకపోతోంది. చంద్ర మండలమందలి చిన్నవస్తువుకూడ గొప్ప మందిరంలాగా వుంటుంది. అందువల్లనే అక్కడ చెట్లూ- మానవులూ వున్నప్పటికీ మనం దూరదర్శిని యంత్రంద్వారా తెల్సుకోజాలం.

చంద్రమండలంలో జీవించడం అసంభవమంటారు జ్యోతిర్విద్యావేత్తలు. ఇది నిజంకూడానేమో! జీవించడానికి ముఖ్యాధారం నీరు. నీరు లేకున్న ప్రాణులూ, చెట్లూ వుండడమే అసంభవం. అందువల్ల చంద్రమండలంలో నీరు జరిగేంతవరకు ప్రాణికోటి జేరడం సంభవమేకాదు గదా! యెవరూ కూడ యింతవరకూ చంద్రమండలంలో నీరున్నదని చెప్ప సాహసించలేదు. సముద్రాలనుకునేవి యెడారులు. వాటిలో నీటిచుక్క కూడా లేదు. దూరదర్శినీ యంత్రాలతో అక్కడున్న సాగరాలనేవాటినే చూస్తాంగాని, యేళ్ళూ సెలయేళ్ళూ వున్నట్టు పత్తాకూడా కానరాదు.

జీవించడానికి ముఖ్యమైనట్టి మరొకటి గాలి. చంద్ర మండలంలో యిదికూడా కొరతగానే వున్నట్టుంది. తత్కారణంగా వుచ్ఛ్వాస నిశ్వాస క్రియలు అసంభవాలు.

ఏదేని ఒకవస్తువు ఒక చోటినుండి యెగురుతున్నదంటే దానివేగమా ప్రదేశపు ఆకర్షణశక్తినిబట్టి హెచ్చుతగ్గులు గావుంటుంది. అందువల్ల నావస్తువు ఆప్రదేశాన్నుండి యితరప్రదేశాలకు పోజాలదు. కాని యెగిరే వస్తువుయొక్క వేగం ఆప్రదేశపు ఆకర్షణశక్తికన్నా యినుమిక్కిలిగా వున్నప్పుడు ఆప్రదేశమావస్తును తనకంట్రోల్లో వుంచుకోజాలదు. దీనిని క్రిటికల్ వెలోసిటీ అంటారు. ఇదిచంద్ర మండలంలో సెకన్‌కు $1\frac{1}{2}$ మైళ్ళు మాత్రమే వుంది. యీ వేగం బహు సులువుగా ఓషజన్, నత్రజన్ యింకా తదితర వాయువులను పొందగలదు. తత్ఫలితంగా చంద్రమండలంలో యీ గ్యాస్‌లు వుండజాలవు. గాలి నీరు కొరతగావడంవల్ల అందమైన ప్రకృతి దృశ్యాలు అపురూపమైపోతున్నవి. వాన- గాలి- చలి- మంచు మొదలైనవే పర్వతాలను ఛేదించి మానసానంద సుందరదృశ్యాలను సృష్టిస్తాయి. మరి ఇవికూడా అక్కడ లేవాయె. అగ్నిపర్వతములు మొదటున్నట్లే యిప్పుడూ వున్నాయి.

చంద్రమండలంలో యేదైనా భవననిర్మాణం జరిగితే శతాబ్దాలు గడిచినా కట్టినప్పుడున్నట్లే వుంటుంది. కిటికీలకద్దాలవసరంలేదు. గాలీ, వాన, వుండదు గనుక నిప్పుకూడా వుండదు. అంటే గాలే లేనప్పుడు కట్టెలు మండేదెలా? చంద్రమండల వాసులకు యెగురుతున్న గ్రద్ద కానరాదు. వాసన తెలియదు. శబ్దం వినరాదు. అని సుప్రసిద్ధ జ్యోతిర్విద్యావేత్త సర్ రాబర్ట్ యస్‌వాల్ అను మహనీయుడు చెప్పాడు.

నియమిత సరిహద్దులోనే, స్థితిగతిలోనే, జీవించగలుగు జీవి మానవుడు. తాపక్రమం కొంచెం హెచ్చినా తగ్గినా మానవుడు జీవించడం దుర్లభం. అనంతాకాశమండలమున అనేక గ్రహాలు, వుపగ్రహాలు, తారలు వున్నయ్. వుష్ణం వీటిలో కొన్నింటియందు అధికంగా వుంటుంది. కొన్నింటి యందు తక్కువగా వుంటుంది. వీటన్నింటిలోకూడా జీవ గతప్రాణులూ, వృక్షాలూ వున్నవో లేవోకూడా తెలియదు. విజ్ఞానం దీనికి సమాధాన మివ్వడంలేదు. పృథివీమాత ప్రతి భాగమందూ జీవులు ఆటలాడుతున్నయ్. అనేక పరివర్తిత స్థితిగతులలోకూడా మనం జీవులను గాంచుతున్నాం. అత్యధిక వుష్ణప్రాంతాలలోనూ, మంచుతో గప్పబడియున్న అమిత చలిప్రదేశాల్లోనూ కూడా జీవులనుగాంచుతున్నాం. సూర్యకిరణాల పొడకూడా సోకనట్టి గుహాలో సైతం ప్రాణులను చూస్తున్నాం. అనంత అగాధ జలరాశిలోకూడా ప్రాణులను చూస్తున్నాం.

ధరణీ మండలం మినహా మరితా యే గ్రహంలోనూ కూడా జీవంగల ప్రాణినిగాని, వృక్షాన్ని గాని, చూడజాలం. అసంభవమైనట్టి విషయమిది. మానవులూ, వృక్షాలూ అభివృద్ధిగానుడానికి భూమండలం మినహా మరేదీ వుపయుక్తమైనట్టిది గాదు. భూమాతయే మనకుపయుక్తమైన ప్రదేశం.

గ్రహాలను గనుక మనం అత్యధికదాపునుండి చూడగలిగితే అందు మనం జీవించడానికుపయుక్తంగా వుంటుందో లేదో తెల్సుకోవడం సంభవమవుతుంది. కాని ఆప్రాణులు ఆ గ్రహాల స్థితిగతులకుపయుక్తంగా వున్నవో లేవో అర్థమవుతై. కొలంబస్‌కు క్రొత్త ప్రపంచ ప్రాణులను జూచినప్పుడు గల్గిన ఆశ్చర్యానికన్నా కొన్నివేలరెట్లు ఆశ్చర్యం మనకూడా కల్గుతుందప్పుడు. ఆ గ్రహాల్లో మానసికశక్తి బుద్ధిబలం యిక్కడకంటే అధికంగా వుండడానికి సంభవమా? ఇవన్నీ నిశ్చయంగా చెప్పజాలం. దైవలీలలవగతం జేసుకోవడం సులభసాధ్యమా? కాదు! కాదు!!



# చిత్ర జగం

• శ్రీ పేకుమళ్ళ కామేశ్వరరావు •

తానొక అసాధ్యుడనని చిత్రకూటారావు అభిప్రాయం. అతనికి అసలు చదువుకన్న సినీమా చదువు జాస్తి. దానిలో తరగతులు, పరీక్షలు లేవు గాని ఉంటే స్కూలు ఫైనల్ ఎప్పుడో పాసయ్యేవాడు. అసలు చదువులో పాపం నాలుగో ఫారం రెండోమారు చదువుతున్నాడు. వయస్సు పదహారు నిండేయి.

చిత్రకూటారావుకి తెలియని ఫిల్ము స్టారు పేరులేదు, ఫిల్ము పేరులేదు, ఫిల్ము కంపెనీ పేరు మొదలే లేదు. అతని గదినిండా, పెట్టెలనిండా, పుస్తకాలనిండా సినీమా బొమ్మలే!

రాజమహేంద్రవరం వచ్చిన ప్రతి ఫిల్ము అతను చూడ నిదే వెళ్ళదు. కొత్తఫిల్ము వచ్చిందంటే మొదటి రోజు ప్రదర్శనానికి వెళ్ళితీరేడన్నమాటే! 'సంసారానికి' ఇరవై సార్లు, అంతకు మునుపు 'బాలరాజు'కి ముప్పైసార్లు వెళ్ళేడు. ఇతనికి టిక్కెట్టుకి డబ్బు ఎవరిస్తారని ప్రశ్న. ఒక్కొక్కప్పుడు అమ్మకి తెలియకుండా నాన్నని, నాన్నకి తెలి యకుండా అమ్మని టోపీలో వేస్తూంటాడు. ఇంటికి వచ్చి పోతూండే బంధువుల, స్నేహితుల దగ్గర సినీమా వాఙ్మయం ఏకరువు పెట్టి బేలు వేస్తాడు. అవికాకపోతే ఇంటర్‌వల్ సమయాన గేటు దగ్గర కనిపెట్టుకొని ఉండి తొంబలో దూరిపోతాడు. గేటుచెక్కర్లతో కొంత స్నేహం సంపా దించేడు. కాబట్టి వాళ్ళు ఒకొక్కప్పుడు చూసీ చూడ కుండా విడిచిపెట్టివేస్తారు.

రాత్రి దీపం దగ్గర కూర్చుని చిత్రకూటారావు మోహానికి ఎదురుగా పుస్తకం పెట్టుకొన్నాడు. అప్పుడప్పుడు పుస్త కంలో మాటను గొణుగు తున్నాడు. కాని మనస్సులో ఒక ఆలోచనాఫిల్ము ప్రవహిస్తూంది. "ఎవరికీ చెప్ప కుండా చెన్నపట్టణం పారిపోవాలి. సినిమా స్టూడియోలో చేరిపోవాలి. నాయకుడి పాత్ర ధరించాలి. అప్పుడు నాచుట్టూ బోలెడు మంది స్త్రీ పురుషులు చేరి ఇతను ఎంత అందగాడో, ఎంత బాగా నటిస్తాడో, 'ఇంతాచేస్తే కుర్రాడు' అని మెచ్చు కొంటూంటారు. అప్పుడు నేను సిగరెట్టు దమ్ము తీసి ఠీవిగా మాట్లాడుతూనే ముక్కు, నోట పొగ వదులుతాను. నన్ను ఇన్ని ఇబ్బందుల పాలు చేస్తున్న మానాన్నకి మాత్రం కబురుపంపించను. గింజుకోనీ! మా అమ్మకి మాత్రం, చాటుగా వచ్చి నన్ను చూసి వెళ్ళవ లసిందని ఉత్తరం రాస్తాను." ఇంతలో పిల్లొకటి గదిలోకి తొంగి చూసింది. చిత్రకూటారావు ఒక్క గంతువేసి లేచి దానిని తరుము కొంటూ పోయేడు. తిరిగి వచ్చి తలుపులు బిడాయించి నిద్రపోయేడు.

ఒక మంచి రోజు చూసి చిత్రకూటారావు తన చెల్లెలి పులిగోళ్ళ పతకం లంకించు కొన్నాడు. బజారులో అమ్మి డబ్బులు చేత వేసుకొన్నాడు. "ఈ రోజే ప్రయాణం. నేను ముందు ముందు సినీమాలలో ఎన్ని సాహస కృత్యాలు చెయ్యాలో ఏమిటో! అటువంటి వాణ్ణి డబ్బిచ్చి టిక్కెట్టు కొంటానూ! తప్పు తప్పు!" అనుకొంటూ మెయిల్ ఎక్కేడు. రైలు నడుస్తూండగానే ఒక పెట్టెలోనుంచి మరొక పెట్టెలోకి మెట్ల మీంచి నడచి వెళ్ళేడు. ఒకొక్కప్పుడు అందరి కాళ్ళు అడ్డు ఉండగా కనబడకుండా సీట్లు కింద నక్కేవాడు. మరొకప్పుడు రైలు పెట్టె కింద బ్రహ్మదేవుడికేనా కనబడకుండా దాగుకొని బండి ఆగనిచ్చి పైటికి వచ్చేవాడు.

చెన్నపట్టణం ప్లాటుఫారం మీద దిగేడు. గేటుదాటి ఆకాశాన్ని అంటుతుందా అన్నట్టు ఉన్న సెంట్రల్ స్టేషన్ కప్పుని చూసి ఆశ్చర్య పోయేడు. మొదటిసారి ట్రామ్ బండిని విచిత్రంగా చూసేడు. రోడ్డుమీద మితిలేని కోలాహలాన్ని, మోటారుకార్ల వరుసలను చూసి ఏదో కొత్త ప్రపంచకంలోకి వచ్చిపడ్డాను అనుకొని తమాయించు కొన్నాడు. రిక్షావాడు దగ్గరకిరాగా "హోటేలు లాడ్జికి తీసుకుపో!" అంటూ దర్జాగా చెప్పేడు. వాడు తీసుకు వెళ్ళి ఒక హోటేలు ముందు రిక్షా ఆపేడు. చిత్రకూటారావు దిగి, లోపలికి వెళ్ళి, గుమ్మం ప్రక్కని టేబుల్ దగ్గర

కూర్చుని డబ్బులు వసూలు చేస్తున్న ఆసామీని "గదికి అద్దె ఎంత?" అని ప్రశ్నించేడు.

"రెండు రూపాయలు."

"నెలకా?"

"ఏమి, పిచ్చివాడివా నువ్వు! ఒక్క రోజుకి!"

చిత్రకూటారావు పిచ్చెత్తిన వాడిలాగే చూసేడు. కాని తమాయించుకొని తల ఆడించి "సరే!" అన్నాడు.

అతను గదిలో ప్రవేశించి తక్షణం తాళం వేసి హేర్ కటింగ్ సెలూన్‌కి వెళ్ళేడు. షోకుగా క్రాపింగు చేయించేడు. అతి నవీనంగా ఉండ దలిచేడు. తలకి వాసననూనె పులిమేడు. మొహానికి పల్చగా ఫేస్ పౌడరు కొట్టేడు. షోకు కళ్ళజోడు, అత్తరువు పూసిన చేతిరుమాలు, బనియను పైన పల్చని షర్టు, పంట్లాము, బాటా జోళ్ళు ధరించేడు.

అతనికి ఫిల్ము స్టూడియోలు, ఫిల్ము కంపెనీల పేర్లు కంఠగతమే కాని అవెక్కడెక్కడ ఉన్నదీ తెలియదు. కాబట్టి ఇతరుల నడిగి తెలుసుకో దలిచేడు. అనేక స్టూడియోలు, ఫిల్ము కంపెనీలు నక్షత్రాల పేర్లు కలిగి ఉండడంచేత ఒకటి తోచింది. ఇరవై యేడు నక్షత్రాల పేర్లు జాబితాగా వ్రాసి స్టూడియో, ఫిల్ము కంపెనీల పేర్లు అయిన వాటిని ఉంచి, మిగతవాటిని కొట్టి పారవేసేడు. ఇతరుల నడిగి మిగత వాటి ఉనికి తెలుసు కున్నాడు.

బస్సు దిగి ఒక సినీమా ఆఫీసుకి వెళ్ళేడు. దాని తాలూకు స్టూడియో మరొకచోట ఉంది. వెలుపలి గేటు దాటి, లోపలి గేటు దగ్గరకి వెళ్ళేడు. గేటుని అంటిపెట్టుకొనిఉన్న భోగట్టా ఆఫీసుకి వెళ్ళి ఇటు అటు తొంగి చూస్తూవుంటే "ఎవరు మీరు?" అన్నాడు గుమాస్తా.

"నేను చిత్రకూటారావుని."

"ఎవరికోసం దయచేసేరు?"

గుమాస్తా అంత మర్యాదగా మాట్లాడుతూంటే చిత్రకూటారావు తన రొట్టె నేతపడిందనుకొని "ప్రొప్రయిటర్ కోసం" అన్నాడు.

"వారు ఇప్పుడు ఇక్కడ లేరు. ఉన్నా, ఫిల్ము రిలీజు తొందరలో ఉంటారుగాబట్టి వారం రోజుల దాకా ఇంటర్వ్యూలు ఇవ్వరు. మీరు కావలిస్తే ఇంటికివెళ్ళి చూడండి" అని అతి మర్యాదగా చెప్పేడు.

"ఇంటి నెంబరు" అని చిత్రకూటారావు అడగ్గా, గుమాస్తా చెప్పిన దాన్ని కాగితంమీద గుర్తించుకొన్నాడు. మళ్ళీ బస్సు ఎక్కేడు. ప్రొప్రయిటర్ మేడ గేటుని చేరుకొన్నాడు. గేటు దగ్గిర గూర్ఖావాడు మొలని కత్తితో సిద్ధంగా ఉన్నాడు.

చిత్రకూటారావు శుద్ధ తెలుగులో ప్రశ్నించేడు.

గూర్ఖావాడు ఏదో మారు పలికేడు.

చిత్రకూటారావు "మీకు ఇంగ్లీషు వచ్చా?" అన్నాడు. గూర్ఖావాడు చేతితో రాదని సంజ్ఞ చేసి "తమిళం" అని ప్రశ్నార్థకంగా చేతిని ఆడించేడు.

చిత్రకూటారావుకి అర్థం కాలేదు. అక్కడ సామాన్య భాషాసమస్య వచ్చింది. కాని అతనికి చటుక్కున స్ఫురించి తన పేరున్న చీటి ఇచ్చేడు.

గూర్ఖావాడు 'ప్రొప్రయిటర్' అని చేతితో లేడని సంజ్ఞ చేసేడు.

చిత్రకూటారావు ఆలోచనలో పడ్డాడు. 'ప్రొప్రయిటర్ స్టూడియోలో లేడు, ఇంటి దగ్గరా లేడు. ఇంక ఆకాశంలో పట్టుకోవాలంటే నాకు రెక్కలు లేవు. వసుదేవుడంతటి వాడే గాడిద కాళ్ళు పట్టుకొన్నాడట! కాబట్టి నేను వెళ్ళి గుమాస్తాగారి కాళ్ళు పట్టుకొంటాను.' అని బయలు దేరి తిరిగి ఆఫీసుకి వచ్చి, గుమాస్తాతో తన పని సవిస్తరంగా తెలియజేసుకొని, ప్రొప్రయిటర్ ఎక్కడ వున్నారో తెలియగోరేడు_

"అలాగా! సరి సరి! మీ ఫోటో ఎడ్రసు ఇచ్చి మీఊరికి పోండి. మీకు ఇంటర్‌వ్యూ రావచ్చు". అన్నాడు.

"ఓహో! ఇదొకటా! సరి! సరి అలాగే!" అంటూ చిత్రకూటారావు బైటికి వచ్చేడు. అప్పటి కప్పుడే కడుపులో కాలుతుండగా దగ్గరున్న హోటేలుకి వెళ్ళి, ఆకలి మంట చల్లార్చేడు.

అతను ఫొటో స్టూడియోకి వేళ్ళేడు. అక్కడి ఆసామితో "నేను సినీమార్ధిని నాకు ఫొటో కావాలి" అన్నాడు.

"అయితే నేను కొన్ని స్టిల్సు తీసి ఇస్తాను. ఒక్కొక్క భంగిమకు పదిహేను కాపీలు దగ్గిర పెట్టుకోండి. అందరి, మొహాన్ని తలొక దొంతర కొట్టండి. ఎక్కడ తగులుతే అక్కడ తగులుతుంది", అని ఆర్టిస్టు ఉపాయం చెప్పేడు.

సినీమార్ధి వివిధ భంగిమలలో ఫొటోలు తీయించుకొని, డబ్బు చెల్లించి స్టిల్సు చేత పట్టుకొన్నాడు.

అతను మరొక స్టూడియోకి బయలుదేరేడు. స్టూడియో మొదటఉన్న ఆఫీసు చేరుకొన్నాడు. వరండాలో నాలుగు కుర్చీలు, మధ్య నొక మేజాబల్ల ఉన్నాయి. కుర్చీమీద కూర్చున్నాడు. కొత్తగా సిగరెట్టు అలవాటు చేసుకొంటున్నాడు. ఒక బంట్రోతు వచ్చి "ఏమిపని సార్!" అని అడిగేడు.

"ఆఫీసు మేనేజరుగారితో మాట్లాడాలి" అని పేరు చీటిని ఇచ్చేడు సినీమార్ధి. బంట్రోతు వెళ్ళాడు.

ఎదుటనున్న తోటలోని మొక్కలను, పువ్వులను చిత్రంగా చూస్తూ సిగరెట్టుతో సరసాలాడుతున్నాడు చిత్రకూటారావు. రకరకాల మోటారు కార్లు వస్తున్నాయి, వెళుతున్నాయి. వింత వింత డ్రెస్సులు, వన్నెలుగల మగవాళ్ళు, ఆతరువాత పెద్దలు, పిన్నలు కార్లలో తిరుగుతున్నారు. వారిలో కొందరిని చూసిచిత్రకూటారావు ఉలికి పడ్డాడు. "ఇది వరలో వెండి తెరమీద చూసిన మొహాలే ఇవి"! వారి పేర్లను స్ఫురణకి తెచ్చుకొని రూఢి చేసుకోడం కోసం పక్కని తిరుగుతూన్న వాళ్ళని అడిగేడు. నిశ్చయ పరుచుకొని ఆనందించేడు. తాను కూడ కారుమీద తిరిగే కాలాన్ని గురించి కలలు కన్నాడు. ఆఫీసునుంచి ఏజవాబు రాలేదు.

ఇంతలో ఒకాయన వచ్చేరు. పక్కన కుర్చీమీద కూర్చున్నాడు. ఎర్రగా, లావుగా ఉన్నాడు. అదనంగా కోటొకటి ఉంది. ఆయన ఎదుట కూర్చున్న కుర్రవాణ్ణి చూసి భోగట్టా కోసం "ఎవరండిమీరు?" అని అడిగేడు.

చిత్రకూటారావు "మీరెవరు?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

"నాసంగతి చెప్పకుండా మీసంగతి తెలుసుకోదలుచుకోలేదు. క్లుప్తంగా వినదలుచుకొంటే, నేనొక అభాగ్యజీవినని మాత్రం తెలుసు కోండి" అన్నాడు.

"ఎందు చేత?"

"ఇప్పటికి ఈ సినీమాకంపెనీల చుట్టు నీడాదిపై బడి తిరుగుతున్నాను. ఒక్కడినీ ఈ పట్టణంలో పడుంటే పెళ్ళాం పిల్లల గతేమిటని, వాళ్ళని కూడా ఇక్కడికి తీసుకు వచ్చి మకాం పెట్టేను. ఈ ఆఫీసులచుట్టు ప్రదక్షిణాలు చేస్తూంటాను" అన్నాడు ఎదుటాయన.

చిత్రకూటారావుకి నవ్వు వచ్చింది. తనలో "వట్టి తెలివి తక్కువ వాడు కాకపోతే ఇన్నాళ్ళనరకు ఏదోఒకటి కుదరక ఉండిపోతాదా! నేను నాలుగు రోజులలో ఎక్కడో ఒకచోట ఫిక్సైఅప్ అయిపోనా?" అనుకొంటూ, పైకి "పేరు"? అన్నాడు

నా పేరు "శివశరణం."

చిత్రకూటారావుకి బాగా అర్ధం కాలేదు. 'చాకిరి' అంటూన్నాడేమో అని అనుమానం కలిగింది. "మీరు శివచరణమా లేక శివశరణమా?" అనిసూటిగా ప్రశ్నించేడు.

"అనేకమంది నా పేరు విని అలాగే పొరపాటు పడుతూంటారు. మా పెద్దలు శివశరణ మనే పేరు పెట్టేరు. వారు పెట్టిన పేరు ఎంత తగినదో ఆత్మానుభవంవల్ల గ్రహించగలుగుతున్నాను. అన్యధా శరణం నాస్తి శివేన శరణం మమ" అన్నారు.

ఆమాటలు విని చిత్రకూటారావు "వట్టి క్రాక్ !" అని లోపల అనుకొని శ్లోకాలు గీకాలు చూస్తే కాస్త చదువు కొన్న మనిషిలాగే ఉన్నాడని తలచి "ఏమైనా చదువు కొన్నారా?" అన్నాడు.

"బి. ఏ. చదువుకొన్నాను."

చిత్రకూటారావు విస్తుపోయేడు. తనలో "బి. ఏ. చదువుకొన్నాడు, పాపం ! ఎందుకు? తలకాయలేదు. తెలివి లేకపోతే దమ్మిడీకి మారకపోవచ్చుకదా" అనుకున్నాడు.

"నాచేత మీరు ఊరికే వాగిస్తున్నారుకాని, మీసంగతి రవ్వంతైనా చెప్పలేదు. ఆఖరికి మీ నామధేయంలోని

సువర్ణాక్షరాలనుకూడ తెలియజేయలేదు" అన్నాడు శివశరణం.

"నా పేరు చిత్రకూటారావు అంటారు"

"అలాగా! చాల సంతోషం! మీరు ఏదేనా పనిమీద వచ్చేరా ఇక్కడికి?"

"ఏదైనా ఒక ఫిల్ములో హీరోగా బుక్ అయిపోదామని వచ్చాను." అన్నాడు సినీమూర్థి.

శివశరణానికి నవ్వొచ్చింది. కాని ఏడుపుగామారి, చివరికి జాలిగా పరిణమించింది. అయితే పైకి ఏమనాలో తోచలేదు. ఎదుటనున్నవాడా కుర్రవాడు! ఏమంటే ఏమి తప్పు పట్టుకుంటాడో అని జడిసి "ఎన్నాళ్ళనుంచి ప్రయత్నం చేస్తున్నారు" అని సవినయంగా అడిగేడు.

"ఏదీ నిన్ననే మెయిల్ దిగాను!"

"ఇంతేనా?"

"మరొక నాలుగు రోజులలో బుక్ అయిపోతాను."

"చాల సంతోషం! ఎక్కడేనా జ్యోతిషం చెప్పించుకొన్నారా?"

"నాకటువంటివాటిలో మొదటినుంచి నమ్మకంలేదు."

"పోనీ ఏ ప్రొప్రయిటరుగాని, డైరెక్టరుగాని వాగ్దానం చేసేరా?"

"అబ్బే! ఇంకా ఎవ్వరినీ చూడందే!"

"మరయితే నాలుగు రోజులలోనే బుక్ చేస్తారని ఎట్లా గ్రహించారు?"

"మీకు తెలియక పోవచ్చుకాని నాకు తెలుసు" అన్నాడు చిత్రకూటారావు ఆత్మవిశ్వాసంతో.

శివశరణం తనలో తాత్వికంగా విచారించాడు. "ఈ ఎండమావులను నమ్మి ఎంతమంది కుర్రవాళ్ళు, పెద్దవాళ్లు, ఆడవాళ్ళు, డబ్బు, కాలం, జీవితం వృధా చేసుకుంటున్నారో!" అనుకొన్నాడు.

"మీరు ఏదో ఆలోచిస్తున్నారు పైకి చెప్పకుండా!"

"అబ్బే! ఏమీ లేదు. మీకింకా అనుభవం కలగాలని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను."

"చట్టి పూర్వకాలపు మనిషి!" అనుకొని సినీమూర్థి "అదెందుకొచ్చిన వేదాంతం!" అని కొట్టిపారేశాడు.

"నిజమే అయ్యుండవచ్చు కాని—మీ రెవరినైనా డైరెక్టరుని చూశారా?" అని ప్రశ్నించాడు.

"డైరెక్టరుతో మనకేం పని! తిన్నగా స్టూడియో ప్రొప్రయిటర్ నే వలలో వేసుకుంటే తీరిపోతుంది!" అని చిరునవ్వు నవ్వేడు.

"పోనీ ప్రొప్రయిటర్లను, డైరెక్టర్లను కూడ కలుసుకొని చూడండి!"

ఆమాట చిత్రకూటారావుకి నచ్చలేదు. తన ప్రజ్ఞని రుచి చూపించదలుచుకున్నాడు. "అసలు వీళ్ళు 'చిత్రజగం' అనే ఫిల్మును తియ్యబోతున్నారు. ఆసంగతి తెలుసా?" అన్నాడు.

"నేనూ ఆసంగతి మొన్న మొన్ననే విన్నాను. దాని కోసం కూడ కొంత ప్రయత్నం చేస్తున్నాను" అన్నాడు శివశరణం.

ఇంతలో బంట్రోతువచ్చి "మేనేజరుకి ఎవరిని చూడడానికి టైంలేదు, దరఖాస్తు, స్టిల్సు ఇచ్చి వారంరోజులయేక కనబడమన్నారు" అని ఉమ్మడిగా చెప్పేడు. చిత్రకూటారావు దరఖాస్తు, స్టిల్సు అందజేశాడు. శివశరణం కాళ్ళకు బుద్ధిచెప్పదలిచేడు. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ పోయేరు.

చిత్రకూటారావు ఆరోజంతా భోజనం మానివేసి, ఫలహారాలతో కాలక్షేపం చేస్తూ, సినిమా ఆఫీసులు, స్టూడియోలవెంట తిరిగేడు. బరువైన కాళ్ళతో రాత్రి లాడ్జి చేరుకున్నాడు. బల్లమీద శరీరం వాల్చాడు. "ఎక్కడ పట్టినా చిక్కని ఆశ కనబడుతూంది" అనుకుంటూ నిద్రాదేవత వడిలో సమస్తమూ మరిచిపోయేడు.

అతను పొద్దున్నే లేచి ముస్తాబై ఎప్పటి పనిమీద బయలుదేరేడు. ప్రతిచోట స్టిల్సుగుత్తడం ఇస్తూండేవాడు. కొండంత ఆశతో ముందుకు సాగిపోయేవాడు. అతను వెళ్ళిన చోటల్లా శివశరణం తారసిల్లేవాడు. ఇద్దరూ కాస్త

# చిత్ర జగం

రాతాఖానీ !

చిత్రకూటారావు నాలుగ్రోజులు అదేమోస్తరుగా విధి …రామం లేకుండా తిరిగేడు. ఆశ విషయంలో మొదటి రోజున ఎట్లాగుందో చివరి రోజునా అట్లాగే ఉంది. "కాని చెన్నపట్నంలో బ్రతికేదెట్లా? తెచ్చిన పైకం పూర్తయిపోయింది. లాడ్జికి గుడ్‌బై కొట్టి రాత్రుళ్ళు సత్రం అరుగుమీద ఒరగవలసిన గతి పట్టింది. పోనీ ఎవరి పంచనైనా పండుకొందామంటే వీధి అంచుదాక ఇంటిగోడే ఉంటుంది కాని పంచ ఉండనియ్యరు ఇక్కడి ధర్మాత్ములు. మనిషి నీళ్ళు పోసుకోకపోయినా, చింకిగుడ్డలు కట్టుకున్నా, నిద్రకి పరుపులేకపోయినా కుదురుతుందికాని, కడుపుకి ఏదో ఒకటి పారెయ్యకపోతే కుదరదు. అప్పటికీ భోజనం మాని ఫలహారాలతో గడుపుతున్నాడు. ఈ మహా పట్టణంలో పిడికెడు పెట్టే ధర్మాత్ములులేరు. డబ్బు పుచ్చుకొని తిండిపెట్టేవాటికి ధర్మసత్రాలని పేరు. నాయకుడి పాత్ర కాకపోయినా ఆఖరికి ఎక్‌స్ట్రాగా నేనా తీసుకుంటారని రూఢి కనపడదు. స్టూడియో పైగోడలేకాని లోపల యెట్లాగుంటుందో చూడలేదు. అంతా అగమ్యగోచరంగా ఉంది." అని తలపోశాడు.

వారు చెప్పినవారం పూర్తయిందికదా అని అతను రెండోసారి దర్శించిన సినీమా స్టూడియోకి బయలుదేరి వెళ్ళి మేనేజరతో "మీరు వారం అయేక ఒకసారి కనబడమన్నారు" అని వినయంగా అన్నాడు.

"మిమ్మల్ని నేను కనబడమనలేదు. మీకు అవసరమైతే వచ్చి తెలుసుకోండి అన్నాను. అసలు ఇంకా పనులు మొదలుపెట్టలేదు. మరి పదిహేను రోజులకుకాని ప్రారంభం కాకపోవచ్చు" అన్నాడు.

సినీమార్థికి మెలకువో కలో తోచలేదు. తనలో "కనపడమన్నమాట మరొక రూపం దాల్చింది. ఒక వారం రెండు వారాలయింది. ఇవి కొత్తరకం లెక్కలు కాబోలు, ఈవరకబడిని రెండు వారాలు నాల్గు వారాలు కావని మనం వాదించలేము." అనుకుంటూ అయోమయంగా గడప దాటగా, శివశరణం ఎదురుపడ్డాడు.

వెల వెల పోతూన్న చిత్రకూటారావు మొహం చూసి శివశరణం "మీరెక్కడేనా బుక్ అయేరా?" అన్నాడు నమ్మకంలేకుండానే.

"బుక్ కాదు, బొగ్గయేను."

"మీకూ కొంచెం అనుభం కలుగుతూందన్నమాటే! ఇంకేమి! ఇవన్నీ ఎండమావులు! ఇక్కడ మీకు ఎవ్వరూ కూడా, నువ్వు రావద్దనీ, నీకు ఇచ్చేదేమీ లేదని చెప్పరు. మీరు ఎన్నిసంవత్సరాలపాటు గుమ్మం ఎక్కినా వద్దనరు. నెల, రెండు నెలలని వాయిదా వేస్తూనే ఉంటారు. విసుగెత్తి మీరు తగ్గవలసిందే! ఈమోస్తరుగా ఆశపడుతూ వచ్చే పోయేవాళ్ళ సంఖ్య వందలమీద, వేలమీద ఉంది. ఆక్టరేమిటి, టెక్నీషియనేమిటి, రచయితలేమిటి, ఉద్యోగాన్వేషకులయితే ఏమిటి, ఈ చిత్రం ఇప్పటికి ఏడాదినుంచి చూస్తున్నాను."

తనవంటి ఆశాపరులు చాలమంది ఉన్నారని తెలిసిన మీదట సినీమార్థికి కొంచెం స్వస్థత కలిగింది.

"మీ ముందు కార్యక్రమమేమిటి?" అని యథాలాపనగా అడిగేడు శివశరణం.

తన బాధలు వెళ్ళబోసుకోడానికి ఒక స్నేహితుడు దొరికేడుకదా అని చిత్రకూటారావు సంతోషించేడు. తన చరిత్రను, ఇప్పటి తన అవస్థను సంగ్రహంగా తెలియజేశాడు.

శివశరణం విని నిశ్చేష్టుడై విచారించేడు.

సినీమార్థికి "నేను ఏదైనా హోటేలులో చిప్పలు కడుగుకొని బతకాలని చూస్తున్నానండి. ఇంటికి వెడితే తిట్లు, తన్నులు తప్పవు. జీవించడానికి మరొక మార్గం లేదు" అన్నాడు.

శివశరణానికి చటుక్కున ఏదో స్ఫురించింది. "మీకు వార్తా పత్రికలు చూసే అలవాటుందా?" అని అడిగేడు.

"అందులో ఏముంటుంది. ఒకవేళ బేడ ఇచ్చి కొన్నా బొమ్మలు చూస్తే చూడాలికాని అంతకన్నా ఏముంటుందిలెండి?"

"అది సరే! నిన్న చదివినదొకటి జ్ఞాపకానికి వస్తూంది. మీతండ్రి పేరు శంభుదాసయ్యేనా?" అని అనుమానిస్తూ అడిగేడు శివశరణం.

"ఆc! ఆc! మీకెలా తెలిసిందండి. ఏమేనా యక్షిణీ విద్య ఉందా యేమిటి?" అని చిత్రకూటారావు ఆశ్చర్య పడుతూ అడిగేడు.

"సరి! సరి! మీది రాజమహేంద్రవరమే కాదూ!"

"ఔనౌను! ఏమివచ్చింది?"

"సరే అయితే! మిమ్మల్ని గురించే మీ తండ్రిగారు ప్రకటన చేసేరన్నమాట! నిన్నటి దినపత్రికలో ప్రకటన మిమ్మల్ని గురించే! మీ చరిత్ర కొంత చెప్పేవరకు నాకు స్ఫురించలేదు. దానిలో అచ్చువేసిన ఫొటోకి మీకు చాల పోలికలున్నాయి. మీరు చెప్పినదాన్ని బట్టి రుజువయింది. ఆప్రకటన ఏమిటంటే__ మీతండ్రిగారు మిమ్మల్ని ఇంటికి రమ్మనీ, మరేమీ భయపడవద్దనీ, మీఅమ్మ మీకోసం బెంగ పెట్టుకొని తిండి మానివేసిందనీ, మీ అన్నలు, చెల్లెళ్ళు, మీ బంధువర్గం మీ కోసం ఎంతో ఆత్రంగా ఎదురుచూస్తు న్నారని ఉంది" అన్నాడు.

తల్లిమాట జ్ఞాపకం రాగానే చిత్రకూటారావుకి దుఃఖం ఆగలేదు. వలవల ఏడ్వ మొదలుపెట్టేడు.

"విచారించి దేనికీ ప్రయోజనంలేదు. కాబట్టి మీరు ఇంటికి వెళ్ళడానికి ఎంతమాత్రమూ సంకోచించవద్దు. ఈ ఎండమావులను నమ్ముకొని మోసపోవద్దు. ఈనాడే ఇంటికి బయలుదేరండి!" అన్నాడు మిత్రుడు.

అటువంటి చక్కని ఆధారం దొరికినందుకు చిత్రకూటారావు దేవుడికి మనస్సులో వెయ్యి దండాలు పెట్టుకున్నాడు.

"మరయితే టిక్కెట్టు మాటేమిటి?" అని అడిగేడు శివశరణం.

"టిక్కెట్టు మాట మనకి లేనేలేదు. హరిబ్రహ్మాదులు పట్టుకోలేరు"

"వద్దు వద్దు! అటువంటి సాహసం వద్దు. నేను మీతండ్రి గారిపేర మీకు డబ్బు పంపవలసిందని టెలిగ్రాం ఇస్తాను. సుఖంగా వెళ్ళవచ్చు" అన్నాడు.

చిత్రకూటారావు కృతజ్ఞతకి మాటలు చాలలేదు.

ఇద్దరూ కలిసి పోస్టాఫీసుకి బయలు దేరేరు. దారిలో శివశరణం "ఇదొక చిత్రజగం! దీని నాయకులు మీరు సుమండీ!" అన్నాడు.

అర్థంగాక చిత్రకూటారావు దిక్కులు చూశాడు. ★




# అమెరికాలో స్కౌట్ బాలికలు

• శ్రీ డోరతీ సి. స్టారిటన్ •

"యుద్ధాలు మానవుల మనస్సుల లోనే ప్రారంభ మవుతున్నందున, శాంతి నిర్మాణానికి పునాదులు కూడ మానవుల మనస్సులలోనే నిర్మించ వలసివున్నది" అని ప్రపంచ వైజ్ఞానిక సంఘం నిబంధనావళి యొక్క ఉపోద్ఘాతంలో పేర్కొన బడింది. బాల బాలికల లేత హృదయాలలో శాంతి నిర్మాణానికి పునాదులను నిర్మించడమే ప్రపంచ స్కౌటు బాలబాలిక సంఘం యొక్క ప్రధాన లక్ష్యం. అమెరికా స్కౌటు బాలికల సంఘం కూడ పైనపేర్కొన్న ప్రపంచ సంఘం క్రింద పని చేస్తున్నది.

బాలికలకు ఇచ్చే స్కౌటింగు శిక్షణలో ప్రభుత్వానికి ఎట్టి సంబంధంలేదు. వివిధ జాతులకు, వివిధ సంస్కృతులకు చెందిన యువ జనులు పరస్పరం స్నేహ సంబంధాలను పెంపొందించు కోడానికి ఈ కార్యక్రమం తోడ్పడు తున్నది. అమెరికాలో 4,00.000 మంది వయోజనులు వలంటీర్లుగా చేరి ఈ దీర్ఘ కాలిక కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు. ద్వేషభావంకంటె ప్రేమభావం మహత్తరశక్తి కలదని విశ్వసించి, వారు అసంఖ్యాకంగా ఈ ఉద్యమంలో చేరుతున్నారు. వివిధ దేశాలలోని వారు ఒకరిని గురించి ఒకరు బాగా తెలుసుకొని, ఒకరి విషయాలు ఒకరు అర్థం చేసుకొని గాఢమైన స్నేహ సంబంధాలను నెలకొల్పుకోడానికి అవకాశం కలుగుతున్నది. తద్వారా వైషమ్యం, దుఃభిమానం తొలగి పోగలవు.

అంతర్జాతీయ సద్భావం ముందు స్వగృహంలోనే ప్రారంభంకావాలనే సిద్ధాంతాన్ని గుర్తించి అమెరికాలోని స్కౌటు బాలికల సంఘాల వారు తమ బాలికలు ఇరుగు పొరుగు వారితో స్నేహ సంబంధాలను పెంపొందించు కోడానికి దోహద మిస్తున్నారు. స్కౌటు బాలికలు వివిధజాతులు, వివిధ సంస్కృతులకు చెందన బాలికలతో కలిసి మెలిసి పనిచేయడానికి ఈ కార్యక్రమం అవకాశం కల్పిస్తున్నది. స్కౌటు బాలికలు తమ ఇరుగు పొరుగు సంఘాలతో కలిసి మెలిసి వుండడంవల్ల వారి సంస్కృతులను గురించి తెలుసుకో గలుగుతున్నారు. అనేక వేలమంది స్కౌటు బాలికలు విదేశాలలోని అనేక మందితో ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా స్నేహ సంబంధాలను పెంపొందించు కొంటున్నారు.

అమెరికా జాతీయ స్కౌటు బాలికల సంఘంవారు తమ బాలికలకు విదేశాల వారితో ప్రత్యక్ష సంబంధాలు ఏర్పడడానికి తోడ్పడు తున్నారు.

స్కౌటు బాలికల ఉద్యమాన్ని మొట్టమొదట అమెరికాకు తీసుకు వచ్చిన మహిళ సంస్మరణార్థం నెలకొల్ప బడిన "జూలియట్ ప్రపంచ సౌహార్ద నిధి" స్కౌటు బాలికలిచ్చిన పెన్నీ పెన్నీ విరాళాలతో సేకరించ బడింది. ఏడు సంవత్సరాల నుంచీ 17 సంవత్సరాల వయస్సు గలవారి వరకూ ఆ నిధి సేకరించ బడింది. అందులో ఎక్కువ మొత్తం స్కౌటు బాలికల అంతర్జాతీయ వినిమయ కార్యక్రమానికి ఉపయోగించ బడుతూంది.

రెండవ ప్రపంచ యుద్ధం ముగిసినప్పటి నుంచీ ప్రతి సంవత్సరం అమెరికా స్కౌటు బాలికల ప్రతినిధులు విదేశా

లలో జరిగే సమావేశాలకు. క్యాంపులకు ఎక్కువగా పంప బడుతున్నారు.

అమెరికాలో సంవత్సరానికి రెండుసార్లు అంతర్జాతీయ స్కౌటింగు సమావేశాలు జరుప బడుతున్నాయి. ఆసందర్భంలో అమెరికాలోని వివిధ ప్రాంతాలకు చెందిన స్కౌటు బాలికలు విదేశాలనుంచి వచ్చిన స్కౌటు బాలికలను కలుసుకోడానికి అవకాశం కలుగుతున్నది. స్విట్జర్లెండు లోని ఆడెల్ బోడెన్‌లో ప్రతి సంవత్సరం జరిగే జూలియట్ స్మారక సమావేశాలకు ప్రపంచంలోని వివిధ ప్రాంతాలకు చెందిన యువజనులు హాజరవుతున్నారు. వాటిద్వారా ఒకరి ఆచార వ్యవహారాలను ఒకరు శ్రద్ధతో తెలుసు కొంటారు.

క్రిందటి సంవత్సరం అమెరికా స్కౌటు బాలికల సంఘం వారు 11 మంది ప్రతినిధులను విదేశాలలోని స్కౌటు క్యాంపులకు పంపారు. విదేశాలకు చెందిన 12 మంది స్కౌటు ప్రతినిధు లను అమెరికాకు ఆహ్వానించారు.

స్కౌటు ఉద్యమ నాయకత్వ శిక్షణను గురించి తెలుసుకోడానికి అనేకమంది స్కౌటు బాలికలు యూరప్‌లోని అనేక దేశాలకు వెళ్ళి వచ్చారు. ప్రపంచ స్కౌటు బాలికల సంఘానికి చెందిన ఒక ఉద్యోగి ఇప్పుడు దూరప్రాచ్యంలో యువజనోద్యమాలను [illegible] తున్నారు.

విదేశీ ప్రయాణం చేయటం స్కౌటు బాలికోద్యమ నాయకురాళ్ల సంఖ్య పెద్దది కాకపోయినా, వారి పర్యటనలు అనేక మేలుసుందికి ప్రయోజనాలను చేకూర్చాయి. లాటిన్ అమెరికా, యూరప్, ఆసియాలనుంచి వచ్చిన స్కౌటు ప్రతినిధులు అమెరికాలో ఆయా దేశాల అనధికార రాయబారుల వంటివారు. అధికంగా వచ్చినవారు అనేక నగరాలను పట్టణాలను సందర్శిస్తారు. స్వదేశానికి తిరిగి వెళ్ళేటప్పుడు, అమెరికా ప్రజల ఆచార వ్యవహారాలను గురించి, అభిప్రాయాలను గురించి ప్రత్యక్షానుభవాలు కలిగి వెడతారు. అదేవిధంగా అమెరికానుంచి విదేశాలకు వెళ్ళివచ్చిన స్కౌటు బాలికలు ఆదేశాలను గురించిన అనేక విషయాలు తెలుసుకొని వస్తారు.

మానవులలో అనేక తరతమ భేదాలున్నప్పటికీ వారందరూ ఇంచు మించుగా ఒకే పద్ధతి చెందిన వారని నిరూపించడానికి స్కౌటు బాలికల ఉద్యమం తోడ్పడుతున్నది. బాలబాలికల హృదయాలనుంచి భయాన్ని పారద్రోలి, ప్రేమభావాలకు స్థానంకల్పించడం ద్వారా, ప్రపంచ శాంతి సాధనా రంగంలో ప్రముఖపాత్రలు నిర్వహించడానికి వారికి అవకాశం కల్పించ బడుతున్నది.



# యుక్తిగల కోడలు

—: కుమారి మన్నం సుభాషిణి :—

అనగా అనగా ఒక ఊళ్ళో సుబ్బమ్మ అనే ఆవిడ ఉండేది. ఆవిడకి రామయ్య అనే కొడుకున్నాడు. సుబ్బమ్మ చాలా గయ్యాళి. అందుచేత ఆమె పేరంటేనే ఆవూళ్ళో అందరికీ హడల్. తన భర్త పోయినప్పటి నుంచి ఆవిడకి ధనాశ ఎక్కువైంది. అయితే ఆమెదగ్గర ఒక చిల్లిగవ్వ అయినాలేదు. రామయ్యకు తండ్రిలేడనే కొఱత తీర్చి, తాను అష్టకష్టాలు పడి పెంచి, పెద్దజేసి చదివించినది. రామయ్య అలా చదివి, చదివి గొప్ప పండితుడయ్యాడు. ఇంతలో అతనికి పెళ్ళి యీడు వచ్చింది. ఎవ్వరూ తమ పిల్లల్ని ఇస్తామని రాలేదు. సుబ్బమ్మ గయ్యాళి తనమునకు భయపడ్డారు. ఆవూళ్ళో ధనవంతుడైన బ్రాహ్మణుడొకడు అతని విద్యకు సంతోషపడి తన ఏకైకకుమార్తెైన స్వర్ణమ్మ

నిచ్చి అతివైభవంగా పెళ్ళి చేసాడు.

సరే! ఇంకేం ! ! ! సుబ్బమ్మకి సిరిసంపదలతో మంచి కోడలు వచ్చింది. కాని ఏరోజు స్వర్ణమ్మ అత్తవారింటి గడప మెట్టిందో అప్పటినుండి సుబ్బమ్మ అన్నిపనులు ఆమెచేత చేయించి నానాహింసలు పెట్టూ ఉండేది. కూర్చుంటే తప్పు, లేస్తే తప్పు, పాపం! పూర్వజన్మలో తాను చేసుకున్న ఖర్మఫలమని అనుకొనేది. స్వర్ణమ్మ చేత రకరకాల పిండివంటలు చేయించి తాను, కొడుకు బాగా తినేవారు. కాని ఒక్కముక్కయినా కోడలికిచ్చిన పాపాన పోలేదు.

ఇదిఇలా ఉండగా వాళ్ళింటి దొడ్లో మంచివంకాయలు కాస్తూ ఉండేవి. సుబ్బమ్మ అస్తమానమూ కోడలిచేత నూనె వంకాయకూర, వాంగీబాత్, పచ్చడి అవీ, ఇవీ చేయించు కొని బాగా తినేది. పాపం స్వర్ణమ్మకు కూడా వంకాయలంటే పంచప్రాణాలు. ఆ పాత్రలు తోముటానికి వేస్తే ఎక్కడ మిగిలినదంతా స్వర్ణమ్మ నాకుతుందేమో అన్న అసూయతో తానే శుభ్రంగా నాకేసి మరీ వేసేది.

ఒకరోజున ప్రక్కవూళ్ళో వాళ్ళ చుట్టాలకి ఎవరికో పెళ్ళి జరిగింది. స్వర్ణమ్మను తీసుకొని వెళ్ళటానికి ఇష్టం లేక తాను, రామయ్య బయల్దేరారు. వెళ్ళే ముందు ఆహార సామాగ్రి అంతా జాగ్రత్తగా దాచి 'ఒసేయి, స్వర్ణా మేము ఇంకో రెండు రోజులలో వస్తాము. ఇంట్లో జాగ్రత్తగా ఉండు' అని చెప్పి వెళ్ళిపోయారు.

స్వర్ణమ్మ కిప్పుడు స్వాతంత్ర్యము వచ్చింది. కడుపు నిండా అన్నీ బాగా చేసుకొని తినవచ్చు ననుకొంది. ఇల్లం తా వెదికింది. పాపం ఏమీ దొరకలేదు. ఏవో రెండు పాత్రలు, కొంచెము బియ్యము మాత్రం ఉన్నవి. దొడ్లో కివెళ్ళి చూస్తే నిగనిగ లాడుతూ మంచివంకాయలు కనబ డినవి. అవన్నీ కోసుకుని, ఇరుగు పొరుగు వాళ్ళనడిగి తనకు కావలసిన ఆహార సామాగ్రి తెచ్చుకొని కూరచేసు కొని తినేసింది. మరునాటిరోజు తెల్లవారేసరికి సుబ్బమ్మ, రామయ్య బండి దిగారు. వచ్చీ రావడంతోటే సుబ్బమ్మ దొడ్లో వంగ మొక్కలను చూడటానికి వెళ్ళింది. ఒక వంకాయైనా కనబడలేదు. వెంటనే కోడల్ని పిలిపించి రామయ్యతో ఆమెమీద ఇంకా లేనిపోనివి కల్పించి అత నికి స్వర్ణమ్మపై ద్వేషం కలిగేటట్లు చేసింది. తల్లి చేతిలో కొడుకు కీలుబొమ్మ అయ్యాడు.

ఒకరోజున సుబ్బమ్మకేంబుద్ధి పుట్టిందో స్వర్ణమ్మను చంపించి, ఆమె నగలంతా తీసుకొని వాటినమ్మి గొప్ప ధనవంతురాలు కావచ్చుననుకొంది. రామయ్యను పిల్చి, "ఒరేయి! రామయ్యా! చూశావుట్రా నీభార్య గడుసుతనం! మనం ఊళ్ళో లేనప్పుడు ఇరుగు పొరుగువాళ్ళ దగ్గర మితిలేని అప్పులు చేసిందట. వాళ్ళంతా ఇప్పుడు నా ప్రాణం తీస్తున్నారు, అలాంటప్పుడు నేనెలా ఈవూళ్ళో తలెత్తుకుని తిరగటం? ముందు నేనైనా చావాలి, లేకపోతే అదైనా చావాలి" అని దొంగ ఏడ్పు మొదలు పెట్టింది. తల్లి బూటక నాటకం చూడగానే రామయ్య గుండె నీర యింది. తన తల్లి చెప్పేదంతా నిజమేననుకొన్నాడు.

మరునాటి రోజు వేకువఝాముననే ఒక గోనె సంచిలో స్వర్ణమ్మను దూర్చి బయటికి రాకుండ త్రాడువేసి బాగా కట్టేశాడు. దగ్గరవున్న అడవికి తీసుకెళ్ళి కాల్చేద్దామను కున్నారు. తీరా అడివికి చేరుకొనేసరికి అగ్గిపెట్టె తీసుకు రావడం మర్చిపోయారు. ఆరోజు అమావాస్య, కటిక చీకటిఅవటంచేత ఇద్దరూ కలసి అగ్గిపెట్టె తేవటానికి ఇంటికి వెళ్లారు. పాపం! ఇక్కడ స్వర్ణమ్మకు ఊపిరి పీల్చుటకు కష్టంగా ఉంది. తనకు చిన్నప్పటినుండి విఘ్నేశ్వరుడంటే ఎక్కువ భక్తి ఉండేది. వెంటనే విఘ్నేశ్వరుని చాలా దీనంగా ప్రార్థించింది. ఆ దయా మయుడు ఆమె ప్రార్థన విని జాలిచెంది ఒక ఎలుకను పంపాడు. ఆ ఎలుక వచ్చి గబగబ ఆ త్రాడునంతా కొరికి మూట విప్పి పారిపోయింది. "బ్రతికి బయట పడ్డాను భగవంతుడా!" అని సంతోషిస్తూ, ఆసంచినిండా రాళ్ళు రప్పలు నింపి మామూలు మూటలా తయారుచేసింది. ఏం జరుగుతుందో చూద్దామని చెట్టుపైకెక్కి కూర్చుంది. కాస్సేపటికంతా తల్లి కొడుకులు తిరిగివచ్చారు. ఆ సంచికి నిప్పంటించి పీడ వదిలిందిరా అని ఇంటికి వెళ్ళారు.

దూరంగా మనుష్యుల అలికిడి విని, వెంటనే నెమ్మదిగ చెట్టుదిగి దగ్గరగా ఉన్న కాళికాలయంలోకి వెళ్ళి దేవి విగ్రహం వెనకాల రహస్యంగా కూర్చుంది మన స్వర్ణమ్మ. కొంత సేపటికి ఏవో మాటలు వినిపించాయి. వాళ్ల మాట లను బట్టి దొంగలని గ్రహించింది. ఆ దొంగల నాయకుడు ముందుకు వచ్చి, 'దేవీ! ప్రతి రోజు మాకు మంచి దోపిడి కలిగేట్టు వరమియ్యవమ్మా' అని ప్రార్థించాడు. స్వర్ణమ్మ ధైర్యంగా విగ్రహం వెనకాలనుంచి 'ఓ దాసులారా! మీభక్తికి మెచ్చాను, ఈరోజు మీరు తెచ్చిన సొమ్ము, నగలంతా నాకు అర్పించి నట్లయితే మీకు భవిష్యత్తులో మంచి లాభం కలుగుతుంది' అని చెప్పింది. ఆదొంగలు నిజంగా దేవియే వాళ్ళతో మాట్లాడిందని సంతోషంగా వాళ్లు దొంగిలించిన నగలు, సొమ్మంతా విగ్రహం ముందుంచి నమస్కరించి వెళ్ళిపోయారు. కొంత సేపయ్యాక స్వర్ణమ్మ ఆ నగలు, ధనం అంతా మూట కట్టుకొని ఇంటికి వెళ్ళింది. చచ్చిపోయిందనుకున్న కోడలు కనబడ్డంతోటే సుబ్బమ్మకు చాల ఆశ్చర్యం కలిగింది. 'ఎలా బ్రతికి వచ్చావే స్వర్ణా?' అని అడిగింది. స్వర్ణమ్మ ఇలాచెప్పింది. "మీరు నన్ను తగలబెట్టగానే స్వర్గలోకంలో నుండి దేవతలు నన్ను తమపాటలతోను, నృత్యములతోను తమ లోకానికి ఆహ్వానించారు. వాళ్ళమాట కాదనలేక వాళ్ళతో వెళ్ళాను. ఆహా! హా!.... అప్పటి వింతలు, విశేషాలు గురించి ఏమని చెప్పను? నన్ను బాగా సత్కరించి వచ్చే టప్పుడు నాకీ బహుమతులు ఇచ్చి సాగనంపారు" అని తన మూట విప్పి చూపించింది. సుబ్బమ్మకు పేరాశ ఎక్కువైంది. తానుకూడా వెళ్లి సంపాదించుకుని రావచ్చు ననుకొని "అమ్మా! స్వర్ణా! నన్ను కూడ ఒక సంచిలో వేసి కట్టి తగులబెట్టవే. నేనుకూడ ఆలోకంవెళ్లి చూసివస్తాను" అని చెప్పింది. అత్తగారి అమాయకత్వానికి మనస్సులో నవ్వుకుని ఇదే మంచి సమయం అనుకొని అత్తగార్ని తీసుకొనివెళ్లి కాల్చేసి వచ్చింది. బయటికి వెళ్లివచ్చిన రామయ్య తన భార్యను చూడగానే ఆశ్చర్యంతో 'ఎలావచ్చావు?' అని అడిగాడు. పెళ్లయిననాటినుండీ అత్తగార్ని కాల్చినంతవరకూ నిజంసంగతి అంతా పూసగ్రుచ్చినట్లు చెప్పేసింది. అప్పుడు రామయ్య నిజాన్ని గ్రహించి ఆమెను తానుకూడ హింసించినందుకు క్షమార్పణ అడిగి, ఆమెయుక్తికి మెచ్చుకొన్నాడు. అప్పటినుండి వాళ్లిద్దరు సుఖంగా ఉంటున్నారు. చూశారా! పిల్లలూ! యుక్తిచేత ఎంతటి కష్టమైన బాధను కూడా పోగొట్టుకోవచ్చు.



## యశోగానము

శ్రీ చక్రవర్తి రంగస్వామి

మన సంస్కృతి కడుగొప్పది
మన చరిత్ర బహుదొడ్డది
మన పూర్వులు విజ్ఞానులు
మన దేశము పుణ్యభూమి ॥౧॥

* * *

మహోన్నత హిమాలయాది పర్వతములు,
పావన గంగాది మహానదులు.
శిల్పకళా మండితాలు
తాజమహల్ ఎల్లోరాలు
మన అమూల్య సంపదలోయ్! ॥౨॥

ఎన్నటికీ ఆరని ఆ
అమరజ్యోతి గాంధీజీ,
విశ్వకవి రవీంద్రబాబు,
మహాయోగి అరవిందుడు
మన భారత రత్నాలోయ్! ॥౩॥

* * *

మన రాజకీయవేత్తలు
జవహర్లాల్, రాజేంద్రులు
మన నేటిమహానాయకులోయ్
సాటిలేని
మేటి మహానాయకులోయ్!! ॥౪॥



సినిమా:

# ★ ప్రకాశ్ వారి కన్నతల్లి ★

కన్నతల్లి కరుణారసం, ఓర్మి, సోదరుని భ్రాతృప్రేమ మొదలగునవి ఈ చిత్రంలో మూర్తీభవించి యున్నవి.

నటీనటులు:— జి. వరలక్ష్మి, టి. డి. వసంత. అన్నపూర్ణ, శాంత సి. వరలక్ష్మి, ఎ. నాగేశ్వరరావు, నంబియార్, ఆర్. నాగేశ్వరరావు. పి. నాగేశ్వరరావు, శివరాం, మోహన్, సుధాకర్ మొదలగువారు.

దర్శకుడు:— ప్రకాశరావు. రచన :- సుంకర. వాసిరెడ్డి, శ్రీ శ్రీ, ఆరుద్ర. పాటలు :- పైనలుగురు, తాపీ. ఆరుద్ర, ఫోటోగ్రఫీ :- జాగీర్దార్, సంగీతం:- పి. నాగేశ్వరరావు, సౌండు:- ముకుందన్, స్టుడియో :- ప్రకాశ్.

కథాసారం: — చలపతి మధ్యతరగతి కుటుంబీకుడు. సంబరాలకోసం, తలకు మించిన అప్పులు చేసి అయినింటి పిల్ల, శాంతను పెళ్ళాడుతాడు. కాని పరిస్థితుల ఒత్తిడికి తట్టుకోలేక యిల్లువిడిచి వెళ్ళిపోగా, భార్య అయిన శాంత, ఓర్పుతో తన యిద్దరు పిల్లల్ని పెంచి పెద్దచేస్తుంది. పెద్దవాడు రాము వ్యాపారాన్ని పెట్టి తమ్ముడ్ని చదివిస్తాడు. ఏలాగైనా వాడిని "కలకటేరు" చదువు చదివిస్తానని తల్లితో అంటాడు.

తమ్ముడి, కలకటేరు చదువుకై 10 వేలకు ఆశపడి యిష్టంలేని పిల్లను పెళ్ళాడుతాడు. ఆ డబ్బుతో కలకటేరు చదువుకు తమ్ముడ్ని పట్నం పంపుతాడు. కాని శంకర్ పట్నంలో చెడుసావాసాలు మరిగి త్రాగుబోతవుతాడు. ఏలాగో ఈవార్తలు చెవినిపడి నమ్మలేక అన్న రాము పట్నం వస్తాడు. కైపెక్కి వున్న (శంకర్) తమ్ముడిచే చెంప దెబ్బలు తిని తెగతెంపులు చేసుకొని యింటి ముఖం పడతాడు రాము. తల్లి కర్తవ్యాన్ని ఆలోచించి, తన కిచ్చిన డబ్బుతో శంకర్‌ని రప్పిస్తుంది. క్రోధావేశుడైన శంకర్ అన్నను తనవాటా పంచమని అడుగుతాడు. మాటా మాటా పెరిగి అన్నపై చెయ్యి జాస్తాడు. ఆరాత్రి వదినగారి నగలు దొంగలించి పరారయిపోతాడు. తల్లే ఆపని చేయించిందని, అదను చూసుకొని కోడలు అత్తని సాధించడం మొదలు పెడుతుంది. ఈ బాధలు భరించలేక గొడ్లపాకలో వుంటుంది శాంత.

గౌరి చిన్నతనం నుంచి శంకర్‌ని ప్రేమించింది. ఇంకొకరిని వివాహ మాడ నిచ్చగించని గౌరి పరారి అవుతుంది. ఈ నింద శాంతపై మోపుతారు. గౌరిని వెతుకుతూ శాంత బయలుదేరుతుంది. గౌరిని కలుసుకొని బుద్ధిచెప్పి శంకర్‌ని ఎలాగేనా తెస్తానని వాగ్దానం చేసి శంకర్ దగ్గిరికి బయలుదేరుతుంది శాంత. ఇక్కడ శంకర్ తాను వుంచుకున్న వేశ్యను హత్య చేస్తాడు. ఆ నేరాన్ని తనపై వేసుకొని, కొడుక్కి బుద్ధిచెప్పి పంపిస్తుంది. ఇంతలో సన్యాసుల్లో కలిసిన చలపతి, గంజాయి కేసులో పట్టుబడి, ప్రక్క జైలుఖానాలోనే వుంటూ ఉన్న తన భార్య వృత్తాంతాలని అర్థంచేసు కుంటాడు.

ఇంక నటీ నటవర్గాన్ని గురించి: — కన్నతల్లిగా వరలక్ష్మి, జేష్టపుత్రుడుగా నాగేశ్వర్రావుల పాత్రలు ఈ చిత్రానికి జీవాన్ని పోశాయని చెప్పవచ్చు. వరలక్ష్మి ఎటువంటి పాత్రనైనా చక్కగా నిర్వహించగల జాణ. నాగేశ్వర్రావు, సూటు, బూటుమీదకంటే పల్లెటూరి బొటు నాయుళ్ళ వేషాలుకే ఎక్కువగా తగుతాడు, "సంసారం" లోకన్న "కన్నతల్లి"లో చక్కగా తన ప్రతిభను చూపెడనవచ్చు. ఇంక తక్కినవారందరూ తమ తమ పాత్రలను అర్థం చేసుకొని నటించేరు. చిన్నితనంలో రాముగా సుధాకర్, శంకర్‌గా మోహన్ తమ ముద్దు ముద్దుమాటలతో ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించేరు. నంబియార్ ఆ పాత్రకు సరిపోలేదు. అతనికన్నా మరొకరుంటే చిత్రం యింకా రాణించేదేమో! "దీక్ష" కన్న "కన్నతల్లి" లో ప్రకాశరావుగారి దర్శకత్వం శ్లాఘ్యనీయంగా వుంది- ఛాయాగ్రహణం, శబ్దగ్రహణం బాగానే వున్నాయి. కాని సంగీతం మామూలు పంథాలోనేవుంది. శ్రీ శ్రీ, ఆరుద్రగారి "ఎంత మంచి దానవోఅమ్మా" అన్న పాట చెవులకెంతో యింపుగా వుంది. డైలాగ్సు ఒకదానికొకటి అన్వయించి వినుటకింపుగా వున్నాయి. ముఖ్యంగా వరలక్ష్మిచే అనిపించిన "ఏమిట్రా? ఏవంటావు?" అన్న మృదుమధుర వాక్కులు ప్రేక్షకుల హృదయాలను కరగిస్తున్నాయి. భర్త, భార్యా బిడ్డల్ని, అర్ధరాత్రి వదలివెళ్ళినప్పుడు కలవరంతో లేచి "పోయావుకదూ! నీసుఖం నీవుచూచుకున్నావు" అన్న మాటలు ప్రతిఒక్క హృదయానికి జాలిగొలుపుతాయి. సీనరీలు మాత్రం కొన్ని కొన్ని పాతగా వున్నాయి. సెంట్రలు, మెరీనా, మొదలైనవి అన్ని పిక్చర్సులోనూ తరుచుగా చూపేవే. వేరే కొత్త సీనరీలు తీస్తే మరీ బాగుండును. చూచినవే చూడ్డం అంటే ప్రేక్షకులకు విసుగు పుడుతుంది. ఆఖరి జైలుదృశ్యం బాగుంది, మొత్తంమీద చిత్రం బాగానే వుంది.

★

Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 24-A, Luz Church Rd., Madras 4

# విజయం

ఆంధ్ర మహిళా సభనుండి, మార్చి 1953 లో ఇంటర్మీడియెట్ పరీక్షకు వెళ్ళిన విద్యార్థినీ బృందము.



పరీక్షకు వెళ్ళినవారు ఏడుగురు. ఇందు 5 గురు విజయముగాంచిరి. వారిలో ముగ్గురు ద్వితీయ శ్రేణిలోను, ఇద్దరు తృతీయశ్రేణిలోను ఉత్తీర్ణులైరి.

ద్వితీయశ్రేణి

జి. లలిత. కె. కమల. ఎస్. వి. విజయ.

తృతీయశ్రేణి

డి. కస్తూరి. కె. ప్రభావతి.

కంపార్ట్‌మెంటల్

వి. శాంత.

కృతార్థులైన విద్యార్థినులకు మా అభినందనములు. వీరికి తోడ్పడ్డ ఉపాధ్యాయినీ వర్గమునకు మా కృతజ్ఞత.

జూన్ విడుదల

పక్షిరాజా వారి ...

# ఒక తల్లి పిల్లలు



చిత్రప్రియా రిలీజు

BHARAT STUDIO

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎక్మిషన్, ఇంటర్ మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు. నృత్యము, గానము. |
| పారిశ్రామిక విద్యాలయము (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) | : కుట్టు. ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చు కూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము. |
| వస్త్రములపై అద్దకపుపని | : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభలో నడుపబడుచున్నది. |
| టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ | : స్త్రీలకు టైపు, షార్టుహాండు—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ. |
| మహిళా మందిరము | : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక. |
| నిర్మలాదేవి గ్రంథాలయము | : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము. |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ, శిశువుల, సంరక్షణశాల, ఉచిత వైద్యశాల—అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్‌ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణకు ఏర్పాట్లు జరుగనున్నవి. |
| ముద్రణశాఖ | : ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి వుచితంగా నేర్పబడును. |

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

# ఆంధ్రమహిళ

సంపుటి 10 :: జూలై '53 :: సంచిక 3



వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే.,బి.యెల్.,
సంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ. యం.యే.,యెల్.టి.,
ఆంధ్రమహిళా సభ. మైలాపూర్.

సంవత్సర చందా :: ఆరు రూపాయలు.




సంపుటి 10 :: జూలై '53 :: సంచిక 3

# శ్రీ॥ శే॥ డాక్టర్. కె. ఎన్. కేసరి

చెన్నపట్టణ పౌరులలో ఆంధ్ర ప్రముఖులుగా నెన్నదగిన శ్రీ కేసరిగారి మృతివల్ల, నగరవాసులైన తెలుగు ప్రజలకు ఒకపెద్ద అండతొలగినదని చింతించని వారుండరు- ప్రస్తుత పరిస్థితులలో, తెలుగువారికి ఇది తీరని దురదృష్టమని ఒప్పుకొనక తప్పదు.

శ్రీ కేసరిగారు సంపాదించిన ప్రాముఖ్యత రాచకీయరథాలను అతి చమత్కారముగా నడిపించడంవల్ల కాదు. అధికారస్థానాల నలంకరించి ఆశ్రిత పక్షపాతాన్ని చూపడంవల్ల కాదు. బల్లగ్రుద్ది ఉపన్యాసాలనిచ్చి ప్రజలను విభ్రాంతులను చేయడం వల్లకాదు—నిశ్శబ్దముగా. నిశ్చలంగా, ఆయన కొనసాగించిన నిర్మాణాత్మకమైన సేవాకార్యక్రమము, ఏకదృష్టితో ఒక్కడుగా ఆయన సాధించిన నిస్వార్థసేవలే, ఆయనకీ ప్రాముఖ్యతను ప్రసాదించినవి.

సాయుధ దళాలు ఆయన భౌతికదేహాన్ని అంత్యయాత్రకు నడిపించకపోగాక, వేలంవెర్రిగా వేలాది మూకలు ఆయన భౌతికదేహపు అంత్యదర్శనాన్కి గుమిగూడక పోగాక - అధికారస్థానాలనుండి సంతాపతీర్మానాలు, అభివందన సమర్పణలు, వడగళ్ళ వానవలె కురియక పోగాక—అందుకు తగిన రాష్ట్రవైశాల్యవిఖ్యాతి ఆయన బడయకపోయినా, వందలాదిసామాన్య ప్రజ, వ్యక్తిగతంగానూ, సామాజికంగానూ, శ్రీ కేసరిగారొనర్చిన సేవాకృషి పొందినలాభాలను, అశ్రుశిక్తమైన మౌన వేదనతో యీనాడు స్మరిస్తూ కృతజ్ఞతాంజలులు సమర్పించకపోరు.

క్రొత్త సంవత్సరము ప్రారంభమై, పిల్లలు తిరిగి పాఠశాలలకు వెళ్తున్నారంటే, చెన్నగరంలో కేసరిగారిని తలచుకోని తెలుగు తల్లిదండ్రులెవరు? రాష్ట్రవిభజనవైషమ్యాలకు, రాజకీయకుతంత్రాలకు ఆహుతిగానున్న, చెన్నపట్టణపు తెలుగు బాల బాలికల విద్యాసమస్యను, ఒకవిధంగా గండము తీర్చి గట్టెక్కించినది శ్రీ కేసరి మహాశయుడనడాన్ని కాదనగలవారెవరు? మైలాపూరులోని కేసరి విద్యాలయము, త్యాగరాయనగరులోని కేసరి ప్రాథమిక పాఠశాల, యీయన దాతృత్వాన్ని, సేవాతత్పరతను చాటి చెప్తున్నాయి.

స్వయంకృషివల్ల, బుద్ధిబలంవల్ల, దరిద్రదేవతను జయించి, లక్ష్మీకటాక్షమునకు గురియైన అదృష్టవంతులు పెక్కుమంది ఉన్నారు. అయితే, అట్లా అబ్బిన సిరిసంపదలను, తన్మూలమున లభించిన అవకాశములను, పరోపకారమునకు సద్వినియోగముచేసిన మహా పురుషులు అతి స్వల్పసంఖ్యాకులు. అట్టి స్వల్పసంఖ్యలో జేర్చదగినవారు శ్రీ కేసరిగారు.

కష్టకాలంలో కరుణజూపిన ఒక మాతృదేవికి కృతజ్ఞత జూపునిమిత్తం ఆనాటినుండి యీనాటివరకు స్త్రీజన సేవ జీవితములో ఒకలక్ష్యంగా నిర్వహించిన దీక్షాపరుడు. శ్రీ కేసరి. 50- ఏళ్ళనాడు స్థాపించిన కేసరీ కుటీరము, 25- ఏళ్ళనాడు స్థాపించిన స్త్రీల మాసపత్రిక గృహలక్ష్మి, విదుషీమణులను సన్మానించుటకై ఏర్పరచిన గృహలక్ష్మి స్వర్ణకంకణము, యీ సేవాదీక్ష దాల్చిన వివిధ రూపములు.

## కీ॥ శే॥ డాక్టర్. కె. ఎన్. కేసరి

డాక్టర్. కె. ఎన్. కేసరి



జననం

26-4-1875.



మరణం

8-6-1953.

సేవాభిలాషతో స్థాపించబడిన కేసరి విద్యాసంస్థలు ఉన్నత కళాశాలలుగా వర్ధిల్లాలని, కేసరి కుటీరము ఒక ఉన్నతమైన ఆయుర్వేద పరిశోధనశాలగా రూపొందాలని, గృహలక్ష్మి పత్రిక చిరంజీవిగా స్త్రీజన సేవ కొనసాగించాలనీ ఆశించడంకన్న యీ తరుణంలో శ్రీ కేసరిగార్కి ఆత్మసంతృప్తి కారణం వేరొకటి ఉండబోదు. ఈ ఆశయసిద్ధి బాధ్యత ముఖ్యంగా చెన్నపురి ఆంధ్ర పౌరులపై నున్నదని వేరుగా చెప్పనక్కరలేదు- ఇట్టి ఆశయ సిద్ధిని కాంక్షిస్తూ, "ఆంధ్ర మహిళ" యీ అమర జీవికి శ్రద్ధాంజలులను సమర్పిస్తున్నది.

# ఆంధ్ర మహిళా సభ

## సర్వసభ్య సమావేశము.

—:o:—

ది 10—6—1953 బుధవారము సభాభవనములో, 4 గం॥కు వ్యవస్థాపక కార్యదర్శిని శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారి అధ్యక్షతన, మహిళాసభ సర్వసభ్య సమావేశము జరిగినది. వెనుకటి సర్వసభ్యసమావేశపు నివేదిక, 1952—53 మహిళాసభ వివిధ శాఖల కార్యక్రమ నివేదిక, 1951—52 జమాఖర్చుల నివేదికలు సభ్యురాండ్రకు సమర్పించబడినవి.

అటుపైన జరిగిన వివిధ కమిటీల ఎన్నికల వివరములు యీ దిగువ ప్రకటించుచున్నాము.

### నూతనపాలకవర్గము.

సంయుక్తకార్యదర్శిని : శ్రీమతి రత్నాలకమలాబాయి.

శ్రీమతి జమునాబాయిగారి స్థానంలో, వీరిని సంయుక్త కార్యదర్శినిగా, సభ్యురాండ్ర సలహాపై, ట్రస్టు బోర్డువారు నియమించినారు.

| | |
|---|---|
| క్లబ్బుశాఖ : | శ్రీమతి పి. సంపూర్ణాదేవి. |
| పారిశ్రామికశాఖ : | ,, క. రంగనాయకమ్మ. |
| క్రీడాశాఖ : | ,, ఎ. విమలారావు. |
| సారస్వత, గ్రంథాలయశాఖ : | ,, కె. లక్ష్మీరఘురామ్. |
| కళాశాఖ : | ,, జి. కమలామణి. |

### సబ్ కమిటీ

1. శ్రీమతి శకుంతలమ్మ.
2. ,, గౌరీ సుబ్బయ్యనాయుడు.
3. ,, టి. అహల్య.
4. ,, డి. స్వర్ణమ్మ.
5. ,, జి. లక్ష్మీకాంతమ్మ.
6. ,, జి. లీల.
7. శ్రీమతి ఎ. అనసూయ.
8. ,, ఎ. రాజేశ్వరమ్మ.
9. ,, కె. పద్మావతి.
10. ,, పుష్పా చౌదరి.
11. ,, టి. జి. హైమావతి.

ట్రస్టుబోర్డుకు సభాప్రతినిధిగా వెనుకటి వలెనే శ్రీమతి పురం అన్నపూర్ణమ్మగారిని, నర్సింగ్‌హోమ్ కమిటీకి సభాప్రతినిధిగా శ్రీమతి వెనిగండ్ల లక్ష్మీపార్వతిగారిని సభ్యురాండ్రు ఏకగ్రీవముగా ఎన్నుకొనిరి.

కార్యనివేదిక పూర్తిపాఠంవచ్చేసంచికలో ప్రకటింపబడును.

అ. చన్నఘంటమ్మ,
కార్యదర్శిని.



శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్,
ఢిల్లీలో ఆమె తన ఆఫీసు పనిలో నిమగ్నయైయున్నప్పుడు.

—:o:—

# ఆంధ్రమహిళాసభలో

## శ్రీ దేశ్‌ముఖ్ దంపతులకు విందు.

ఆంధ్ర మహిళాసభ వ్యవస్థాపక కార్యదర్శిని శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారు, శ్రీ చింతామన్ దేశ్‌ముఖ్‌గారితో సహా విశ్రాంతి నిమిత్తము, జూన్ రెండవ వారములో మదరాసునకు వచ్చియున్నప్పుడు, వారి గౌరవార్థము, మహిళాసభ కార్యనిర్వాహకవర్గ సభ్యురాండ్రు, సభాభవనములో ఒక విందు జరిపించిరి. విందు అనంతరము శ్రీమతులు అనసూయ, సీత సోదరిలు పాటలు పాడిరి.

—★—

---

# కృతజ్ఞత

ఆంధ్ర మహిళాసభకు శ్రీమతి పువం శోభగారు రూ 500 లు విరాళములిచ్చి పోషకురాలైరి. వీరికి మా కృతజ్ఞతాభివందనములు.

—ఆంధ్ర మహిళాసభ.

---



# రాజకీయాలు

• శ్రీ గోళ్ళపూడి రామచంద్రరావు •

మే నెల చివరివారం మొదలుకుని జూన్ మూడో వారం వరకూ జరిగిన ప్రముఖజాతీయ, అంతర్జాతీయ రాజకీయ సంఘటనలుఇవి—ఆంధ్ర ప్రాంత శాసన సభ్యుల సమావేశం తాత్కాలిక రాజధానిగా కర్నూలును నిర్ణయించటం, కొరియా యుద్ధవిరమణకు అవకాశాలు ఎక్కువ కావటం, యూరప్‌లో సోవియట్ విదేశాంగ విధానంలోనూ, సోవియట్ యూనియన్ ఆంతరంగిక విధానంలోనూ మార్పులు రావటం, పోర్చుగల్‌లో భారత ప్రతినిధి కార్యాలయాన్ని మూసివేయటం, ఇండోచైనాలో ఫ్రాన్సు నిర్మించిన 'పేకముక్కల ఇల్లు' కూలిపోవటం, భారతీయ జనసంఘ నాయకుడు డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ కాశ్మీర్ ప్రభుత్వ నిర్బంధంలో ఉంటూ వ్యాధిగ్రస్తుడై హఠాత్తుగా మరణించటం.

*　　*　　*

మద్రాసు శాసనసభకు ఆంధ్ర ప్రాంతాల నుంచి ఎన్నికయిన శాసన సభ్యులంతా జూన్ మొదటి వారంలో మద్రాసులో సమావేశమై 5 రోజులపాటు చర్చలు జరిపి చివరకు కర్నూలును 'తాత్కాలికరాజధాని' గా నిర్ణయించారు. రాజధాని నిర్ణయం మీద కమ్యూనిస్టు పార్టీ మినహా మిగిలిన పార్టీలన్నిటిలోను కొద్దో, గొప్పో చీలికలు వచ్చినవి.

పత్రికలు, పార్టీలు, పారిశ్రామికులు స్పెక్యులేషన్ వ్యాపారస్తులు, రాజకీయపు గూడుపుఠాణీలనే వృత్తిగా తీసుకుని బతుకుతున్న వాళ్ళు అంతా కలిసి గోళ్ళతో పోయేదానికి గొడ్డళ్ళను ఉపయోగించారు. స్వప్రయోజనాలకు ప్రజలపేరుని ఉపయోగించి, ప్రాంతీయ విద్వేషాలు రెచ్చగొట్టారు. చివరకు కమ్యూనిస్టులుకాని పార్టీలన్నీ కలిసి, వాళ్ళు కోరుతున్న విజయవాడను తోసి రాజని, ఇకముందు నిత్యవ్యవహారంగా ఉండబోయే పార్టీ పోరాటంలో మొదటి విజయాన్ని సాధించారు. అయితే, ఈ విజయంతోపాటుగా తమ పార్టీల ప్రముఖుల్ని కొందరినీ ఆవేశం లేకుండా ఆలోచించగల రాయలసీమ ప్రజల్ని, సర్కారు ప్రజలనూ దూరం చేసుకున్నారు.

రైలు ఎక్కాలని ఒట్టువేసుకున్న వాళ్ళు తప్పితే, తెలుగు దేశంలో ఏమూల ప్రజకయినా విజయవాడ అందరికీ కేంద్రంగానూ, అందుబాటులోనూ ఉన్నట్లు తెలుసు. ఇరవై మైళ్ళలోపల రాజధానికి కావలసిన భవనాలు, మంచినీటి సప్లయి ఉన్నట్లు తెలుసు. కాని ఇటీవల 8 సం॥ల నుంచీ మద్రాసు ప్రభుత్వ వ్యవహారాలు గమనిస్తున్న రాయలసీమ పారిశ్రామికులకూ, రాజకీయ పెత్తందార్లకూ రాజధాని తమకు అందుబాటులో ఉంటే తాము ఆడింది ఆటగా ఉంటుందన్న అభిప్రాయం కలిగింది. ఈ 'గ్రామ పెత్తందారీ' బుద్ధితో వాళ్ళు తమ వ్యాపార జూదాలకు 'ప్రభుత్వసహాయం' సాధించవచ్చునని ఆశించారు. సర్కారు జిల్లాల్లో ఎన్నికల్లో పరాజయం పొందిన రాజకీయ పార్టీల నాయకులకు ఈ పెత్తందార్ల ఆలోచన మంచి అవకాశం చూపించింది. వెంటనే శ్రీ బాగ్ ఒప్పందం పేరు చెప్పుకుని కొందరు, ఆంధ్రైక్యత పేరు చెప్పుకుని కొందరు, ప్రజాస్వామ్య పక్షాల (కమ్యూనిస్టేతర) సంఘటన పేరు చెప్పుకుని కొందరు, దరిద్ర రాయలసీమ ప్రజల పేరు చెప్పుకొని కొందరు రంగంలోకి దూకేరు.

కాని వాళ్ళలో వాళ్ళకు తలకాయలు ఇమడలేదు. తిరుపతి అన్నారు. కాదన్నారు. అనంతపురం అన్నారు. కాదన్నారు. చివరికి ఈ వర్గాల్లో ఎవ్వరికీ ఆట్టే బలం లేని కారణంవల్లనేమో, ఎవ్వరూ ఊహించని కర్నూలును ఎంచుకుని, పార్టీ క్రమ శిక్షణ నుపయోగించి గెలిపించారు. రహస్య వోటింగుకు అంగీకరించలేకపోయినారంటే,

ఈ పార్టీ ప్రముఖులకు ఒకరిమీద ఒకరికి ఎంత విశ్వాసం ఉన్నదో తెలుస్తుంది.

* * *

అసలు కర్నూల్‌లో పెట్టేది ఏమిటి? తాత్కాలిక రాజధాని అంటే భారత ప్రభుత్వ ఉద్దేశం ఏమిటి? అది స్పష్టంగా మన నాయకమ్మన్యుల్లో ఒక్కరయినా భారత ప్రభుత్వాన్ని అడిగి తెల్సుకున్నారా అంటే, అదేమీ జరగ లేదు. మార్చిలో భారత ప్రభుత్వ ప్రకటన వెలువడ్డ రోజునే 'మెయిల్' పత్రిక ఈ విషయాన్ని తక్షణం ఆంధ్రులు తెల్సుకోవలసిందని హెచ్చరించింది. అసలు ఈసంగతి ముందుతెలిస్తే, ఈ రాజకీయ పార్టీల నాటకా లకు అవకాశమే ఉండేది కాదేమో!

అయితే అసలు సంగతి తెల్సుకోకుండానే మాటలతో కోటలు మాత్రం కట్టారు. హైద్రాబాద్ విశాలాంధ్ర రాజ ధాని అవుతుందని కాంగ్రెస్ నాయకులు అనగా (అసలు వారికా హామీ ఇచ్చిందెవరో?) ప్రకాశంగారు ఆంధ్ర ప్రాంతాన్ని హైద్రాబాదులో కలిపివేసే విషయమై హైద్రా బాద్ నాయకులతో సంప్రదించి వచ్చారు! మద్రాసులో వీరెంత స్థానం సంపాదించిందీ, బళ్ళారి ఆంధ్రులను ఎట్లా ఆదుకుంటున్నదీ చూసిన మీదట హైద్రాబాదు మనకు వీళ్ళ నాయకత్వాన వస్తుందని ఎవరు నమ్ముతారు?

* * *

కర్నూలును రాజధానిగా చేయటంవల్ల రాయలసీమ అభివృద్ధి అవుతుందని కర్నూలు వాదుల వాదం. సర్కారు జిల్లాలను అభివృద్ధి చేసింది ఏమిటి? కృష్ణా గోదావరి ఆనకట్టలేకాని మరేమీ కాదు. ఈ ఆనకట్టల కింద — అక్కడ మాత్రమే, ఈ జిల్లాల మెట్టతాలూకాలలోకాదు- ప్రాంతాలు అనేక నగరాలను అభివృద్ధి చేయగలిగినవి. దేశంలో ప్రతి కొత్త ప్రాజెక్టు కనీసం ఒక్కొక్క కొత్త నగరాన్ని, పారిశ్రామిక కేంద్రాన్ని సృష్టిస్తున్నది అందు వల్ల రాయలసీమకు కావలసింది ప్రాజెక్టులేకాని రాజధాని కాదని కమ్యూనిస్టులు, రాయలసీమలో కొంచం జాగ్ర త్తగా ఆలోచించే వాళ్ళు చెపుతున్నారు. అంతా ఇవ్వటానికి అంగీకరించిన హైకోర్టును తీసుకుని, ఆంధ్ర విశ్వవిద్యా లయంవారు ఏర్పాటు చేయదలచిన ఉన్నత విద్యాకేంద్రం తీసుకుని, ప్రాజెక్టుల విషయమై ఖచ్చితమైన హామీలను తీసుకుని ఉంటే రాయలసీమ నాయకులు తమ ప్రజలకే కాక, యావత్తు ఆంధ్రులకూ మేలు చేసివుండే వాళ్ళు.

కర్నూలు నగరంలో భవనాలకు మరీ కొరత అయి పోయింది. హైకోర్టును కూడా మద్రాసులో ఉండనివ్వ నని గర్జించిన సంజీవరెడ్డిగారు ఈ సమస్యను ఎట్లా పరిష్కరిస్తారో చూడాలి. ఆయన ఊరి కొక ఆఫీసు వేయించినా, అన్నీ తెలుగు దేశానికే వెళ్ళేట్లు చేస్తే కృతార్థులమే.

* * *

రాజధాని విషయంలో జరిగిన రభస చూసిన మీదట, ఇక ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ వ్యవహారాలు ఎట్లా ఉండగల వన్న విషయమై చాలా సందేహాలు ఏర్పడుతున్నవి. రాజధాని నిర్ణయానికి జరిగిన కుట్రలు, గూడుపుఠానీలు, ఒప్పందాలు చూస్తే, కర్నూలు వాదుల్లో ఉన్న పరస్పర అవిశ్వాసం, అపనమ్మకం చూస్తే వీళ్ళు ఒక కట్టుగా మొదటి ప్రభుత్వాన్ని స్థాపించగలిగి నప్పటికీ, ఒకరి నొకరు అథఃపాతాళానికి తోయాలని ప్రయత్నించటమో, లేక అందరినీ తృప్తి పరచటంకోసం యధేచ్ఛగా అవి నీతిని సాగనివ్వటమో, చేయగలరని తోస్తున్నది. అందు లోనూ వెనకటి అనుభవాన్నిబట్టి, రెండో పద్ధతే అనుసరి స్తారని చెప్పటానికి ఎక్కువ అవకాశం కనిపిస్తున్నది. మొదటి పద్ధతిననుసరించారా, ఏడాది లోపల కొత్త ఎన్ని కలో, కేంద్ర పాలనో తప్పదు. రెండవ పద్ధతిననుసరిం చారా, సర్కారులలో పట్టిన గతే యావత్తు ఆంధ్ర దేశం లోనూ పడుతుంది.

* * *

ఆంధ్ర నాయకులు రాష్ట్రం కోసం అంతఆర్భాటమూ చేసి, రాయలసీమ అంతటిలోకీ పెద్ద నగర మయిన బళ్లారి మనకు లేకుండా పోతోంటే అంటనట్లుగా వ్యవహ రిస్తున్నారు. తెలుగు ప్రాంతాలయిన మోక, రూపనగుడి ఫిర్కాలలో నుంచి బళ్లారి వెళ్ళటానికి 'దారి' అడిగి, తమ చాణక్య ప్రజ్ఞలు బయటపెట్టి, కాంగ్రెస్ నాయకులు బళ్లారిని జారవిడిచారు. అక్కడ ఆంధ్ర శాసనసభ్యుల సమావేశం జరగాలని అక్కడి ప్రజలు కోరితే మొత్తం 140 పై చిల్లర శాసనసభ్యుల్లో డజను మంది కూడా వెళ్ళలేదు. అందుకనే బళ్ళారిలో ఉన్నది తెలుగు మూకలే నని అనటానికి భారత విద్యామంత్రి అజాద్ సాహ సించాడు.

కొరియాలో చివరకు భారతదేశపు విధానమే జయించింది. యుద్ధం నిరుపయోగమని గ్రహించిన ఉభయ పక్షాలు, సమాధాన పడటానికికూడా ఇండియా సూచించిన మార్గమే సరయినదని గుర్తించటమే కాక, ఇండియా నిజంగా తటస్థమార్గాన్ని, సవ్యమార్గాన్ని అనుసరిస్తున్నదని గుర్తించినవి. అందువల్ల యుద్ధఖైదీల మార్పిడి విషయమై చివరకు ఒకఒప్పందం కుదుర్చుకుని, 5 తటస్థ రాజ్యాలు సంఘం ఖైదీల ఇష్టాలను గుర్తించి, వారుకోరితే స్వదేశాలకు పంపటమో, లేకపోతే వారుకోరిన తటస్థదేశాలకు పంపటమో, చేయాలని నిశ్చయించినవి. ఇంకా ఖైదీల భవిష్యత్తును రాజకీయ సమావేశం నిర్ణయిస్తుంది. ఈ తటస్థసంఘం తరఫున అవసరమయిన యావత్తు బలాలను, సిబ్బందినీ ఇండియా ఒక్కటే పంపాలని అంగీకరించినవి. ఇండియా, స్వీడన్, స్విట్జర్లాండ్, పోలెండ్, జెకోస్లవేకియాలు దీనికి అంగీకరించినవి. పూర్తి యుద్ధవిరమణ ఒప్పందం దాదాపుగా కుదిరి పోయింది.

కాని ఇంతలో సింగ్మన్ రీ ప్రభుత్వం, తటస్థ రాజ్యాల సంఘానికి అప్పగించవలసిన 33 వేల యుద్ధఖైదీలలో 25 వేలమందిని విడుదలచేసి, తనసైన్యంలో జేర్చుకొనబోతున్నట్లు ప్రకటించింది. అసలు మిత్రరాజ్యాలు యుద్ధ ఖైదీలను అందరినీ స్వదేశానికి పంప నిరాకరించటానికి కారణం ఖైదీలను బలవంతాన తమసైన్యంలో జేర్చుకోవాలన్న దురుద్దేశమేనని కమ్యూనిస్టులు చేసిన ఆరోపణ ధృఢపడుతున్నది.

సింగ్మన్‌రీ చర్య సమితి అధికారాన్ని ధిక్కరించటమనీ, యుద్ధవిరమణ ఒప్పందం కుదరకుండా చేయాలని, చేసిన విద్రోహచర్య అనీ ప్రధాని నెహ్రూ, బ్రిటీష్ ప్రధాని చర్చిల్, పెకింగ్ అధికారులు, సమితికార్యదర్శి హమర్ షెల్డ్ ప్రభుతులు స్పష్టపరిచారు. సింగ్మన్‌రీని మిత్ర రాజ్యాలు అదుపులో పెట్టకపోతే యుద్ధవిరమణ అసాధ్యమని నెహ్రూ హెచ్చరించారు. అమెరికాలో మెకార్థీవంటి కమ్యూనిస్టు విద్వేషులు సమర్థిస్తున్నప్పటికీ ఐసెన్‌హోవర్ దీనిపట్ల కఠినవైఖరి అవలంబించ బోతున్నట్లు తెలుస్తున్నది. మిత్రసేనాని గట్టి హెచ్చరికలు కూడ చేశాడు.

ఈ కారణం వల్ల రీ కొంత అదుపులోకి వస్తున్నట్లు తెలుస్తున్నది. అవసరమయితే రీ ప్రభుత్వాన్ని బంధించి, ఒప్పందం అమలు జరపాలని అమెరికా, బ్రిటన్‌ల నుంచే కొందరు సూచించటాన్నిపట్టి ఒప్పందం చివరకు సానుకూలపడుతుందని ఆశించవచ్చు.

*　　*　　*

ఇటీవల సోవియట్ యూనియన్ యూరప్‌లో అనుసరిస్తున్న విధానంలోనూ, సోవియట్ అంతరంగిక విధానంలోను ప్రధాన మార్పులు కొన్ని వచ్చినవి.

జర్మనీపై అగ్రరాజ్య సంయుక్త ఆక్రమణకు స్వస్తి చెప్పిన రష్యా మళ్ళీ పశ్చిమ జర్మనీలో ఉన్నట్లు హైకమిషనర్ కార్యాలయాన్ని నెలకొల్పింది. ఇది తిరిగి సంయుక్త ఆక్రమణ పద్ధతిని ప్రవేశపెట్టటానికి నాంది అని భావించబడుతున్నది. తూర్పు జర్మనీలో కమ్యూనిస్టు వ్యవస్థ మార్పు బడ్డది. శ్రామిక నియంతృత్వపద్ధతిలో కాకుండా, కొంత వరకూ పశ్చిమ రాజ్యాలకు వచ్చిన వ్యక్తి స్వాతంత్ర్యం, అభిప్రాయ స్వాతంత్ర్యాలకు అవకాశం ఇవ్వనిశ్చయించినట్లు కనిపిస్తున్నది. ఉపాధ్యాయులు కమ్యూనిస్టులయి ఉండాలన్న నిర్బంధం కూడ తొలగించబడ్డది. కొన్ని ఆర్థిక సంస్కరణలు కూడ చేయ బడ్డవి. ఈ మార్పుల కాలంలోనే తూర్పు బెర్లిన్‌లో పెద్ద కొట్లాటలు జరిగినవి. కొంతవరకు తమ తీవ్ర విధానాలు, కొంత పశ్చిమ రాజ్యాల కుట్రలు వీటికి కారణమని తూర్పు జర్మనీ అధికారులు చెపుతున్నారు.

ఇంతేకాక, తమకు గర్భశత్రువని కమ్యూనిసుదేశాలు ఇంతవరకు చెపుతూ వచ్చిన యుగోస్లావియాతో రాయభారం సంబంధాలు నెలకొల్పుతానని రష్యా ప్రతిపాదించగా, యుగోస్లావియా దానికి అంగీకరించింది.

సోవియట్ విధానం మారటంలో ఉద్దేశం పశ్చిమ రాజ్యాల యూరప్ రక్షణ వ్యవస్థను చీలదీయటమయినా కావచ్చును. లేదా సామమార్గాల్లో తన సరిహద్దు దేశాల్లో మంచి అభిప్రాయాన్ని కలిగించుకుంటే, అదే తనకు పెద్ద రక్షణగా భావించటమయినా కావచ్చును.

జూన్ మూడో వారం చివరలో సోవియట్ యూనియన్ యూరపియన్ రష్యా ప్రాంతంలో విదేశీయుల సంచారానికి గల అనేక నిర్బంధాలను తొలగించింది. అసలు రష్యా విదేశీయుల నుంచి తన ప్రజలను ఎడంగా ఉంచటంలో ఉద్దేశం తమ దేశం పారిశ్రామికంగా పశ్చిమ దేశాలకన్నా తక్కువగా ఉన్నందువల్ల, తమ ప్రజలు

పశ్చిమ రాజ్యాల పైమెఱుగులకు ఆకర్షింప బడకుండా ఉంచాలనటమేననీ, సోవియట్ ఆర్థికవ్యవస్థస్థాయి పశ్చిమ రాజ్యాలతో సమానమైనప్పుడు ఈ 'కేటాయింపు' తొల గించబడుతుందనీ మైకెల్ గార్డీవంటి విదేశీయులు (గార్డీ— విసాటుమాస్కో) వ్రాశారు. రష్యా అంతటిలోకీ పారిశ్రా మికస్థాయి ఎక్కువగా ఉన్న యూరపియన్ రష్యాలో ఇది అమలు జరగటం ఈఅభిప్రాయాన్ని బలపరుస్తున్నది.

పోర్చుగల్ ఇండియాలోని తన వలసలను శాంతి యుతంగా భారతదేశానికి అప్పగించాలన్న ప్రతిపాదనమీద సంప్రదింపులు జరపటానికే అంగీకరించనందువల్ల అటు వంటి దేశంలో భారత ప్రతినిధి ఉండి ప్రయోజనం లేదని చెప్పి భారత ప్రభుత్వం లిస్బన్‌లోని తన ప్రతినిధి కార్యాలయాన్ని జూలై 2 వ వారంలో మూసివేసింది. అయితే ఇది పూర్తిగా తెగతెంపులు చేసుకొనటం మాత్రం కాదు.

ఇండోచైనాలో ఫ్రాన్స్ స్థాపించిన 3 స్వతంత్ర దేశాల స్వాతంత్ర్యపు బంగారాన్ని జూలై మూడో వారంలో కాంబోడియా రాజు బయట పెట్టాడు. ఆయన ఇండియాకు ఉన్న స్వాతంత్ర్యం తమకు ఇవ్వాలని చెప్పి, దేశంవదలి సయాం పారిపోయినాడు. కాని ప్రజలు ఫ్రెంచి వాళ్ళమీద ఎదురు తిరగబోతుంటే, వాళ్ళను ఆపటానికి స్వదేశానికి పరిగెత్తుకుని వచ్చాడు. ప్రజల బెదురును విదే శీయులకూ, విదేశీయుల బెదురును ప్రజలకూ చూపి అధి కారం కోసం నాటకాలాడటం ఆసియా, ఆఫ్రికా దేశాల నాయకులకు పరిపాటే.

* * *

భారతీయ జనసంఘ నాయకుడు డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ జమ్ము ప్రజాపరిషత్ ఆందోళనను సమర్థించ టానికి కాశ్మీరు వెళ్ళి అక్కడ నిర్బంధించబడి, ఆకస్మి కంగా ప్లూరసీ వ్యాధితో జూన్ 22 అర్ధరాత్రి మరణిం చారు. నిర్బంధంలో ఇటువంటి ప్రముఖ నాయకుడు మరణించటం కాశ్మీరు ప్రభుత్వానికీ, దానిని అభిమానించే నెహ్రూకు చాలా చిక్కులు కల్గించ వచ్చును.

—★—

# ★ ఆహ్వానము ★

* శ్రీమతి అయ్యగారి రాఘవమ్మ *

1. జీవనమోహనాకృతిమృదూక్తులకాంతులనొప్పచుండు శ్రీ
మానితమూర్తి ఓ తెనుగుమాతరో! మంగళమమ్మ మంగళ
శ్రీనిధియై వసంతమదిప్రీతిగవచ్చెను రమ్ము రమ్ము నీ
కైనవపల్లవోన్నత విరాజితపీఠమలంకరించెడిన్.

2. తెనుగుతోటలందు తెల్లనిమల్లెలు
పరిమళంబులెగసి విరియుచుండె
పూలుకోసినిన్ను పొందుగాఁబూజింప
నందనుండువచ్చె నందమొప్ప.

3. కొత్తగానువచ్చు కొమరునిచేతిలో
పచ్చనౌవసంత మందిరమున
అధివసింపుమమ్మ ఆననంబల్లన
తీరిపోవుమాదు నీరసములు.

4. జాతేజాగృతిగానకున్నదిక స్వేచ్ఛాజీవితంబెక్కడో
మాతా! కన్గొనుమమ్మ మేలుకొలుపమ్మా నీసుపుత్రుల్ హతా
శాతాపాత్ములు: వీరునున్నహదురాశారాతిభూతాలలో
ఏతావున్ గనలేరు లేరికపిదే, తోడ్పాటుగావింపుమా!





మూలం : శ్రీద్విజేంద్రలాల్‌రాయి. అనువాదం : శ్రీమతి మాణిక్యవల్లి

## ప్రధాన పాత్రలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| అమరసింహుడు | .... | మేవాడ్‌రాణా. | గోవిందసింహుడు | .... | మేవాడ్‌సర్వసేనాని. |
| రుక్మిణి | .... | మేవాడ్‌రాణి. | అజయసింహుడు | .... | అతనికొడుకు. |
| మానసి | .... | మేవాడ్‌యువరాణి. | కల్యాణి | .... | అతనికూతురు. |
| సగరసింహుడు | .... | అమరసింహునిపెత్తండ్రి. | | | (సగరసింహునికోడలు) |
| మహబత్‌ఖా | .... | సగరసింహునికొడుకు. | గజసింహుడు | .... | జోధపురపురాజు. |
| సత్యవతి | .... | అతనికూతురు. | హిదాయతాలీ | .... | మొగలు సేనాపతులు. |
| అరుణసింహుడు | .... | అతనిమనుమడు. (సత్యవతికొడుకు) | అబ్దుల్లా | | |
| | | | హుస్సేను | .... | హిదాయతాలీ సేవకుడు. |

——: 0 :——

### ప్రథమాంకం

### రంగము- ౧

స్థలం : గోవింద సింహుని యిల్లు.

సమయం : మధ్యాహ్నం.

గోవిందసింహుడు : అజయా, మొగలు సైన్యం మేవాడపై దండెత్తి వస్తున్నదా ?

అజయసింహుడు : అలాగనే రాణాజీ విన్నారట.

గో : ఎవరి వల్ల ?

అ : తెలియదు నాన్నగారూ.

గో : రాణాజీ యేమన్నారు ?

అ : సంధి చేసుకోడం మంచిదన్నారు. ఈ విషయం ఆలోచించడానికి దర్బారుకు రమ్మని సామంతులకు కబురు చేశారు. అప్పుడే మిమ్మల్ని కూడా రమ్మని చెప్పమన్నారు.

గో : ఎందుకు ?

అ : సలహా తీసుకొనేందుకు.

గో : సంధివిషయంలోనా ?

అ : అవును నాన్నగారు.

గో : సంధి ? అజయా ! సంధి అనే పదమే నాకు కొత్తది. ఇక్కడకు యేకంగా పాతికేళ్లగా యుద్ధం చేస్తున్నాను. వీర సైనిక పారావారంలో యీదులాడుతూ తరంగాలను పోలి ధవళ కాంతుల నీను కత్తుల కెదురొడ్డినిలవడమే నావృత్తి. సంకుల సమర భూమినుండీ యేతెంచు మధుర గంభీర దుందుభి స్వనాలూ, ఘోటకారావాలూ, గజరాజుల ఘీంకారాలే గాని సంధి సమాచారం యెన్నడూ నా చెవి జొరలేదు. (స్వగతము) సంధి ? (తల

పంచుకొని ఆలోచించి) అజయా, రాణాజీ సంధి చేసుకోదలచడానికి కారణం ?

అ : సస్యశ్యామలమయిన దేశాన్ని రక్తారుణం చేయడం యిష్టం లేక. అది ధర్మం కాదని వారి అభిప్రాయం.

గో : అలాగని మొగలుల చెప్పులు నెత్తిన పెట్టుకుంటారా ప్రతాప సింహ మహారాణా కోరి వరించిన పేదరికం సంస్థానంలో యేనాడు భోగవిలాసాల తాండవం ప్రారంభమయిందో ఆనాడే అనుకొన్నాను మేవాడ్ పతనం తథ్యమని. నా కొడుకు హయాంలో దేశం శత్రు పాదా క్రాంతం కాగలదని ఆ మహాపురుషుడు చెప్పనే చెప్పాడు. యవనులా బలగర్వంచే ఉన్మత్తాంధులై ఉన్నారు. ఇక యీసారి సర్వనాశనం తప్పదు.

అ : దానిని తప్పించాలనే రాణాజీ సంధి తలపెడుతున్నది.

గో : నువ్వూ వారి పక్షమేనా అజయా! మేవాడీయుల బానిసబ్రతుకు బ్రతకాలని వాంఛిస్తున్నావా ? మేవాడ్ నేటివరకు స్వతంత్రంగా ఉంది. నాకంఠంలో ప్రాణం ఉండగా దాని స్వాతంత్ర్యానికి భంగం రాదు. ఎన్ని కష్టాలనైనా ఎట్టిఒడిదుడుకులనైనా తట్టుకొని సగర్వంగా యెగురుతున్న మేవాడ్ రక్తవర్ణ పతాకం నేడు మొగలుల రక్తవర్ణ నేత్రాలు చూసి భయపడుతుందా ? అసంభవం. సరే నువ్వు వెళ్లి రాణాజీతో నే వస్తానన్నానని చెప్పు.

(అజయుడు వెడతాడు. గోవిందసింహుడు వ్రేలాడుతున్న కత్తి నందుకొని మెల్లిగా, ఒరనుండి తీసి దానినుద్దేశించి)

ప్రియతమా, నీవు నా హస్తాన్నలంకరించినంత కాలం ప్రతాప సింహ మహారాణా కీర్తికి కళంకం రాదు. చాల కాలంగా నిన్ను మరచి పోయాను. అయ్యో, యెట్లా ధూళి గమ్మిందో! కానీ, యీసారి నిన్ను మేవాడ్ యుద్ధానికి తీసుకు వెడతాను. అక్కడ కాలాహివలె విజృంభించి మొగలుల వేడి రక్తాన్ని తాగుదువు గాని ఏం ? క్షమించి ఒక్కసారి కౌగలించుకో.

(కత్తిని గుండెల కానించుకొని ఆలోచనా నిమగ్నుడై మందంగా పచారు చేస్తూ)

అబ్బే, లాభం లేదు. ఇప్పుడు నీ గౌరవం కాపాడలేను.

(కత్తి కింద పెట్టి రెండు చేతులతోనూ తలపట్టుకొని కూచుంటాడు. కళ్లంట నీళ్లు కారుతూ వుంటాయి)

పరమేశ్వరా యెంత అశక్తుణ్ణి చేశావు! (లేచినుంచుని కింద కత్తి తీసుకొంటాడు. కల్యాణి వస్తుంది.)

కల్యాణి : (కత్తి చూసి చలించి) అదేమిటి నాన్నగారూ?

గో : చూస్తున్నావుగా కత్తి తల్లీ!

క : ఇప్పుడు దాని అవసరమేమొచ్చింది ? నాన్నగారూ మీ చేతిలో కత్తి చూస్తే భయంగా వుంది. దానిని యథాస్థానంలో పెట్టి వేయండి త్వరగా.

గో : (కత్తి కొనను భూమి కానించి ప్రీతిపూర్వకంగా దానిని చూస్తూ) చూడు కల్యాణీ, యిది యెంత మనోజ్ఞంగా ఉందో! దానికేం కావాలో తెలుసా ?

క : ఊహుం.

గో : రక్తం.

క : ఎవరిది ?

గో : ముసల్మానులది.

క : వారంటే మీకంత ద్వేషం యెందుకు నాన్నగారూ?

గో : ఆ మాట నీ జన్మ భూమి మేవాడ్‌ను అడుగు. ఈ స్వాంతంత్ర రాజ్యాన్ని తమ అధీనం చేసుకోవాలని యేడు వందల యేళ్లగా యవనులు రాక్షసుల్లా దండెత్తి వస్తున్నారు. కాని పర్వతాన్ని తాకిన పయోధి తరంగాల్లా ప్రతిసారీ ప్రతిహతులవుతూనే వున్నారు. అడిగేవారు లేక కాని వట్టిపుణ్యాన మేవాడ్‌పై కత్తి కట్టడం యెందుకు చెప్పు ? అయితే ఒకటిలే. బలగర్వం ఒంటికెక్కిన మనుషునికి న్యాయాన్యాయ విచక్షణ తెలియదు. అట్లాంటప్పుడు అన్యాయాన్ని కట్టి పెట్టించగలది (కత్తి చూపిస్తూ) యిదే.

(కల్యాణి యేడుస్తుంది)

గో : ఏం తల్లీ, యేడుపెందుకు ? భయమేస్తున్నదా ? పిచ్చి తల్లీ దీన్ని దాచేస్తానుండు (కత్తి ఒరలో పెట్టి) రా, లోపలికి రా. (వెళ్ళిపోతాడు) (తెర)

# మేవాడ్ పతనం

## రంగము-2

(ఉదయ పురపు వీధి. మధ్యాహ్నం మూడుగంటలవేళ కొందరు చారిణులతో సత్యవతి ప్రవేశిస్తుంది. అజయసింహుడూ త్రోవను వెదుకుతూ అంటాడు)

అరె మేవాడ్ పతాకము సతతము యెగురుచు నుండును
కను వీధిన్
ప్రతాప చిహ్నము రక్త వర్ణము ప్రతాపు శౌర్యము చాటన్
మొగలుల గర్వము చూర్ణము చేసీ మహీ విలసిల్లినదీ
కీర్తికి ప్రతాపసింహుని విశుద్ధ యశము స్థిరతఘటించినదీ॥అ॥
ధన్యచరిత శ్రీ పద్మినిదేవి సౌందర్య ప్రభలా
భ్రమ నురికిన యామ్లేచ్ఛ శలభముల్ గసిమసి యయ్యెన్
మిగులా
వీరమాత మా మేవాడ్ భూమీ వీరుల రక్తము పారెనటన్
రుధిర జలములా కలయిక యమునా గంగా సంగమ మయ్యె
నిటన్
యవన పాలసుని చితారు దుర్గము వెడల నడచినా ఘనుడూ
అతని కుమార్తెన్ దెచ్చిన సాహసి బాప్పా రావల్ మా వాడూ
సస్యశ్యామల మా మేవాడూ నిత్యసుఖద మా మేవాడూ
అన్న నీర ఫలక్షీరములిచ్చుట మదుర తమకులే గదకూడా
అంబరచుంది మహీధర శోభిత, సుకపిక కలరవ వనరమ
కాశ్రిత
శీతల మంద సుగంధితపవన, బాసిత సౌందర్యోజ్జ్వల భవన
అరణ్య కుసుమము లాదరమున కైసేతురు నారీమణులిచటన్
సౌశీల్య దయాసాహసములలో వారికి సాటివేరెచటన్ ॥అ॥

(అజయసింహుడు వస్తాడు.)

సత్యవతి : (అజయునుద్దేశించి) మీరు సైనికోద్యోగులా ?

అ : అవునమ్మా. నేనొక సేనాధిపతిని.

స : అయితే నేవిన్నమాట నిజమేమో చెప్పగలరా ?

అ : ఏం విన్నారమ్మా మీరు ?

స : మొగలు సైన్యం మేవాడ్ పై దండెత్తి వస్తున్నదని.

అ : ఇంకా రావడం లేదమ్మా. మనం సంధికి అంగీకరించక పోతే వస్తుంది. మేవాడ్ యుద్ధం చేస్తుందో, సంధికి సమ్మతిస్తుందో తెలుసుకోడానికి మొగలు సేనాధిపతి దూతను పంపాడు.

స : మీరు సమరసన్నాహంలో ఉన్నారా ?

అ : అవును, రాణాజీ యింకా యేమీ నిర్ణయించలేదు.

స : రాణాజీ అభిప్రాయం యేమిటంటారు ?

అ : నాకు తెలిసినంతమట్టుక్కు వారు సంధికి సుముఖులు. ఓనిర్ణయానికి వచ్చే ముందు మా నాన్నగారితో ఆలోచిస్తారు.

స : మీ తండ్రి యెవరు ?

అ : మేవాడ్ సర్వసేనాని.

స : మీరు మహాసేనాధిపతి గోవిందసింహుని పుత్రులా ? సంతోషం. ఈ విషయంలో వారి అభిప్రాయం యేమిటో ?

అ : వారి అభిమతం యుద్ధం.

స : చాలు, మిమ్మల్ని శ్రమపెట్టాను. ఇక వెళ్ళిరండి.

(అజయుడు వెళతాడు)

ప్రతాపసింహ మహారాణా కొడుకు మొగలులతో సంధి చేసుకోవటమా ? పనికిరాదు. (చారిణులతో) నే వచ్చేవరకూ ఆ చెట్టు కింద కూర్చోండి.

(సత్యవతి ఒక పక్కనుండీ చారిణులు రెండవపక్క నుండీ వెళతారు.)

## రంగము-3

(ఉదయపుర రాజసభ ప్రాతఃకాలం : అమరసింహుడు సింహాసనంపై కూర్చుని వుంటాడు. సభ సామంతులతో నిండి వుంటుంది. గోవిందసింహుడు ఒక పక్క నిలుచుంటాడు.)

జయసింహుడు : మహారాజ్, మొగలు సైన్యం మేవాడ్ ను సమీపించిన నాడు యేం చేయాలన్న విషయంలో రాజపుత్రులకు అభిప్రాయ భేదాలు లేవు. మేమంతా యుద్ధానికి సిద్ధం.

రాణా : జయసింహా, యీ చిన్న రాజ్యం యే బలం చూసుకొని ఒక మహారాజ్యం యొక్క బృహత్సైన్యాన్ని యెదుర్కొంటుంది ?

# మేవాడ్ పతనం

జ : క్షత్రియ వీరుల భుజబలం చూసుకొని.

కృష్ణదాసు : మీ తండ్రి ప్రతాపసింహులు యేబలంతో యెదిరించారు ?

రా : వారు మానవ మాత్రులు కాదు, కృష్ణదాస్.

శంకర్ : వారూ రాజపుత్రులేకా ?

రా : కాదు శంకర్. వారు దైవప్రేరితమైన అతి మానుష శక్తి స్వరూపులు. ఉరుముల ప్రౌఢత్వం భూకంపపు ఉద్వేగంతో సముద్ర తరంగాల ఉరవడితో ఆకస్మికంగా మన మధ్య అవతరించారు. ఎలా వచ్చారో అలా వెళ్ళిపోయారు. అందరూ వారి పలె చేయలేరు.

కృ : అందరూ చేయలేనిమాట నిజమే. కాని వారి కుమారుడు చేస్తాడని తప్పక ఆశిస్తారు. దేశ స్వాతంత్ర్య సంరక్షణకై మీ తండ్రి ప్రాణాన్నర్పించేరు. మీరు యిచ్ఛాపూర్వకంగా దాన్ని ఒదులుకొంటారా ?

రా : అది ఒక మధురమైన అనుభూతి మాత్రమే. కృష్ణదాస్ ! కొన్ని యేండ్లగా దేశం ధనధాన్య సమృద్ధమై వుంది. ప్రజలు శాంతి సౌఖ్యాన్ని చూరగొంటున్నారు. బాహ్యదృష్టికందని అనుభూతి కోసం వారిని కష్టాల పాలు చేయరూ ? నాకు మాత్రంగా పన్ను చెల్లించి హింసా కాండను ఆపడం మంచిది కాదూ ?

శ : ఏమన్నారు మహారాజ్. సాక్షాత్తూ శ్రీరామచంద్రుని వంశీయులు మొగలులకు పన్ను చెల్లించాలా ?

రా : అర్థం లేని పట్టుదలలకుపోకుండా కాస్త కప్పం కట్టి యీశాంతి సౌఖ్యాన్ని కాపాడ్డం మంచిది. ఏమంటారు గోవిందసింహజీ ?

గో : ఏం చెప్పను ? శాంతి, సుఖం అంటే అర్థం తెలీదు నాకు. బాల్యంనుండీ నాకూ, కష్టాలకూ జత. నేను పెరిగినదే ఆపదలమధ్య. మహారాజ్, ప్రతాపసింహ మహారాణా నీడనై పాతిక సంవత్సరాలు ఆకలి దప్పుల్ని సరకు చేయక అడవుల్ని బట్టితిరిగాను. ఇతరుల కోసం శ్రమపడ్డం, కీర్తినిర్మాణకై పేదలం కావడం నిజంగా అదృష్టం - బంగారంలాంటి రోజులు గడిచిపోయాయి! -

జ : గోవిందసింహజీ ! ఆగి పోయారేం ? చెప్పండి.

గో : ఏం వుంది చెప్పడానికి ? పరిస్థితులు తారుమారయాయి. త్యాగ దేవత కుటీర స్థానంలో భోగవిలాసాలకు నాట్యశాల కట్టించారు. ఆత్మ గౌరవపు పవిత్ర మందిరం రాళ్లు పెల్లగించి అయిశ్వర్య గృహాలు కట్టిస్తున్నారు. జయ జయ ధ్వానాలతో మారు మ్రోగే మేవాడ్ పర్వతాలొకప్పుడు కీర్తి కాంతుల ధావళ్యంచే హిమాలయాల కీడువచ్చేవి. నేడు వాని నీడలో పెరిగే విలాస వనం పొగయై వాని పలుమకొంటుంది. జయసింహజీ నాటి మహిమ క్షీణించింది ; కీర్తి కాంత మృత్యు శయ్యపై వుండి — దీనయై చూస్తున్నది.

కేశవసింహుడు : గోవిందసింహజీ, మీరుండగా దానికేం.

గో : లేదు కేశవసింహజీ, ప్రస్తుతం నేనెందుకూ పనికి రాను. కేవలం వృద్ధుణ్ణి. మనసులో ఉత్సాహమే కాని దేహంలో బలం లేదు. కత్తి పట్టుకొంటేనే కరం వణుకుతోంది.

ఆహా ! తిరిగి ఆపర్వత రాజాల నాశ్రయించి ఆమధుర దుఃఖం అనుభవించ గలిగితే ! దేశీయులకై అరణ్యవాసం చేయగలిగితే ! హా, హత విధీ !

రా : శాంతించండి గోవిందసింహజీ. విషయాన్ని వాస్తవిక దృక్పథంతో పరిశీలించండి. దేశం యావత్తూ చక్రవర్తికి వినమ్రమయింది. ఇక యీ చిన్న రాజ్యం యేం చేయగలదు చెప్పండి ?

గో : నే చెప్పవలసినదేమో ముందే చెప్పాను. విశేషించి చెప్పేదేం లేదు.

రా : (సామంతులనుద్దేశించి) ఇప్పుడు యుద్ధం చేయడం దండుగ. అంచేత సంధి చేసుకొందాం. ఎవరక్కడ ?

(సేవకుడు వస్తాడు)

మొగలు దూతను పిలూ (సేవకుడు వెడతాడు)

గో : మహారాణా ప్రతాప్ ! మహారాణా ప్రతాప్ ! స్వర్గసీమ నుండి యీ మాటలు వింటున్నావా ? హీనమైన యీ మాటలు వినపడకుండగ అశనిపాతమేనా ధ్వనించదేం ! అమ్మా, మేవాడ్ ! తొల్లి జనకజవలె

భూమాత ఆక్రమణాన్ని కొంతైనా మ్లేచ్ఛ హస్తాలనుంచి తప్పించుకో తల్లీ!

(సేవకునితో మొగలు దూత వస్తాడు)

రా : (దూతతో) మేం సంధికి అంగీకరించేమని మా సేనాధికారితో చెప్పు.

(కరవేగంతో సత్యవతి వస్తుంది)

స : (దూత నుద్దేశించి) ఆగు! ఆగు! (సామంతులకేసి తిరిగి) మీరంతా సమరసన్నాహం చేయండి. రణక్షేత్రానికి రాణాజీ రాని పక్షంలో సేనా నాయకత్వం నే వహిస్తాను.

గో : (ఆనందాశ్చర్యాలతో) ఎవరు తల్లీ నువ్వు? ఈ ఘోరాంధకారం బాపే మెరుపులా వున్నావే! కోమలమైన యీ వజ్ర గంభీర స్వరం యెవరికైనా వినపడుతున్నదా?

రా : నిజం చెప్పండి, మీరెవరు?

స : నేనొక చారణిని మహారాజ్! మేవాడ్ కీర్తిని గానం చేస్తూ గ్రామాలలో తిరుగుతూంటాను. ఇంతకు మించి నాగురించి చెప్పనవసరం లేదు.

సామంతరాజులు : ఆశ్చర్యం!

స : (సామంతులతో) రాణాజీ ఉదయ సాగర తీరాన విహార వనంలో కూచుని సుఖస్వప్నాలు కంటూంటారు. మిమ్మల్ని రణ రంగానికి నే నడుపుతాను, రండి.

గో : ఆశ్చర్యం! నాలో యౌవ్వన బలం పరవళ్లు త్రొక్కుతున్నట్లున్నదే! ఈ ఆనందం, ఉత్సాహం యేమిటి! (సామంతులనుద్దేశించి) ప్రతాపసింహ రాణా పుత్రునికి అపకీర్తి రానివ్వకండి. సుఖేచ్ఛను చంపి, ఆట బొమ్మల్ని ధ్వంసం చేయండి. అస్త్రధారణ చేయండి. (రాణా చేయిపట్టుకొని) రండి, మహారాజ్.

రా : గోవిందసింహజీ, నడవండి (మొగలు దూతతో) ఏమోయ్, మేం యుద్ధానికి సిద్ధమని మీ యజమానితో చెప్పు. (సేవకునితో) గుఱ్ఱం సిద్ధపరచు.

స : జై! మేవాడ్ మహారాజ్‌కీ జై!

అందరూ: జై! మేవాడ్ మహారాజ్‌కీ జై!

రంగము - ౪

(మొగలు సేనాపతి డేరా. మధ్యాహ్న సమయం. సేనాని హిదాయత్ అలీ సర్దారు హుస్సేన్‌తో మాట్లాడుతూ వుంటాడు)

హిదాయత్ : హ్హా, హుస్సేన్! యీ కాఫిర్లను గెలవడం ముక్కొత్తి తీసినంత తేలిక.

హుస్సేన్ : అది మీరనుకున్నంత తేలిక కాదు హుజూర్. ఏడువందల యేళ్లుగా యీ చిన్న రాజ్యం ముస్లిం మహా రాజ్యం యెదుట తలయెత్తుకువుంది. అక్బరు చక్రవర్తి క్కూడా అది లొంగలేదు.

హి : హ్హా, హ్హా. అక్బరుకు చేతనైన సేనాపతెవరూ దొరకలేదు. అప్పుడు ఖాన్ ఖానా హిదాయత్ అలీఖా వుంటేనా!

హు : మానసింహుడు తక్కువ వాడనా?

హి : హ్హా, హ్హా, హ్హో, మానసింహుడా? పాపం ఆయనికి యుద్ధం చేతవునా అసలు?

(వంట మనిషి వస్తాడు)

వం. మ : వంటయింది, హుజూర్.

హి : మానసింహుడన్న మాటేమిటి, మావంటవాడు కూడా సేనాపతవచ్చు. ఏ వంటావు జాఫర్ మియా?

వం. మ : వంటయింది, హుజూర్.

హి : ఫౌజు కెదురెళ్లి యుద్ధం చేయగలవా?

వం. మ : ఫుంజును కోసే వండాను సాబ్.

హి : అది సరే. నువ్వు కత్తి పుచ్చుకుని యుద్ధం చేయగలవా అని అడుగుతున్నాను.

వం. మ : కైమా నా? గొర్రి కైమా చేశాను హుజూర్.

హి : బాగుంది. మేం కూడా గొర్రి కైమా చేస్తాం. సరే నువ్వు పో. (వంట మనిషి వెళతాడు)

హి : ఇక్కడ గొర్రె కైమా చేస్తాను హుస్సేన్.

హు: ఏ గొర్రెలు?

హి : ఈ రాజపుత్రులు. వీళ్లూ గొర్రెలే.







—★—

వెనుకటిగాథ : బసవయ్య చాలాపూర్వాచారపరాయణుడైనప్పటికీ 12 సంవత్సరాల వయసులో విధవ అయిన లక్ష్మికి మళ్ళీ పెళ్ళి చేయాలని చాలా ప్రయత్నించి విఫలుడౌతాడు. రంగనాథం లక్ష్మిని వివాహమాడుటకు నిశ్చయించుకొని కట్నాల విషయంలో సరసుడు మానిచేస్తాడు.

లక్ష్మి తన స్వశక్తితో ప్రయత్నించి చివరకు నర్సు ఉద్యోగంలో ప్రవేశించి మంచి పేరు సంపాదించు కుంటుంది. రంగనాథం వేటలో గాయపడి హాస్పిటల్లో లక్ష్మి ఆదరణకు పాత్రుడై క్రమంగా స్వస్థత చెందుతాడు. లక్ష్మి రంగనాథంని పోల్చుకుంది కాని రంగనాథం మాత్రం లక్ష్మి అని తెలుసుకో లేక పోతాడు. లక్ష్మితో మాటల సందర్భములో "పిల్ల నచ్చితే కోరికతో కట్నం నాకెందుకని ప్రసంగిస్తాడు" రంగనాథం. ఇక చదవండి.]

—:o:—

ఒక నెలరోజులు తరువాత రంగనాథానికి-వుద్యోగంలో జాయిన్ గావచ్చునని డాక్టర్లు చెప్పారు. సంపూర్ణారోగ్యం లభించింది. గాయం గుర్తుకూడా లేకుండా మాసింది. ఆయాసం లేకండా మైళ్ళ కొలదీ నడవగలుగుతున్నాడు. ముఖంలో రక్తం పరుగిడుతోంది. వెనుకటికన్నా కొన్ని పౌన్లు బరువు యెక్కువైనాడు. వెళ్ళిపోయే ముందొక రోజున లక్ష్మి రూముకెళ్ళి-"నేను రేపు వెళ్ళిపోతున్నాను లక్ష్మీ!" అని అన్నాడు. "వెళ్ళండి, సుఖంగా వుండండి, మళ్ళీ యెప్పుడూ యిటకు రాకండి"—అని అన్నది లక్ష్మి.

"యీ నర్సింగ్‌హోమ్ లో నాకిక్కడ లభించిన ఆనందం నా జీవితంలో యింతవరకెప్పుడూ లభించలేదు. మళ్ళీ యేదైనా రోగమొచ్చి యిక్కడనే వుండిపోతే బాగుండునుగదా అని అనిపిస్తోంది—"అన్నాడు.

"మళ్ళీ ఇక్కడకు భగవంతుడు రానివ్వకుండునుగాక!"

ఒక్క ముహూర్తకాలము యిరువురూ మౌనంగా వున్నారు. "నీకు నామీద బొత్తిగా దయలేదు లక్ష్మీ" అన్నాడు రంగనాథం.

"బొత్తిగా లేదు."

"ఆ దయంతా నా అస్వస్థత మీదనేనా?"

"మరేమనుకున్నారు? ఈశ్వరకృపవల్ల ఆరోగ్యంచేకూరింది. యిహనాకు మీతో సంబంధంయేమిటి?"

"నీవు చాలా రతిసురాలవు లక్ష్మీ!"

"తమకం పేనా?"

"నిన్ను దేహి అని అడుగుతున్నాను. నీవు నన్ను మృత్యుముఖంనుండి కాపాడినావు. ఇప్పుడిక నీవే నా జీవితాన్ని స్వార్థపరచగలవుకూడాను."

"యెట్లా?"

"బహిరంగంగా బయిటికి చెప్పాల్సిందేనా లక్ష్మీ?"

"కాకుంటే మీమనోగత భావాలు నాకెలాబోధపడతై?"

"నీకు తెల్సు లక్ష్మీ! కాని, నేనొక అయోగ్యుడనని అనుకుంటున్నావు. నిజంకూడాను. నేనొక వందజన్మలు యెత్తినప్పటికీకూడా నీయంతటి యోగ్యత నాకురాదు. కాని ఉపాసనకు భక్తి అవసరం. నా అణువణువూ నీ చరణములోన... ...."

లక్ష్మి మధ్యలో మాటకడ్డుతగిలి—"కాని నేను స్వతంత్రురాలను గానని మీరు తెల్సును. మాయింటిదగ్గర పెద్దవాళ్ళు యిష్టపడనంతవరకు నేను చేయగలిగిందేంలేదు. యీవిషయం చెప్పడానికి నాకు సిగ్గుకూడా వస్తోంది. కాని మా అమ్మా వాళ్ళకు పదివేలు కట్నమిచ్చే పురుషుడు దొరికనంతవరకు నా పెండ్లికి యిష్టపడరు. నెలకేభై రూపాయలు యింటికి పంపుతున్నాను. పెళ్ళి అయితే

మరి నేనేమి యింటికి వాళ్ళకు పంపలేనుగదా! అంటే మీరే నన్నేపనీ చేయనీయరుగా. అదీగాక అవకాశంకూడా నాకంతగా చిక్కదుగా. కాబట్టి నెలకేదైనా అరవై రూపాయల వడ్డీ వచ్చేనంతటి మొత్తం వారికివ్వకుంటే వారెప్పుడూ యిష్టపడరు."

రంగనాథం దీర్ఘ నిట్టూర్పు వదలి—"లక్ష్మీ! నేను నోరెత్తి మాట్లాడలేనంతటి షరతుపెట్టావు. నావద్దర డబ్బే గనుక వుంటే పదివేలేమిటి- పదిలక్షలు తెచ్చి నీకాళ్ళదగ్గర పోతును. నాచేతిలో దమ్మిడీలేదిప్పుడు. కాని.... లక్ష్మీ! అయితే ప్రేమకు విలువ లేనాయేమిటి? ఆలోచించిచూడు"

లక్ష్మికూడా బలంగా శ్వాసవిడిచింది— "నాకా ప్రేమ అమూల్యమైనట్టిదే. ఆ ప్రేమయొక్క విలువే నాజీవిత రంగం. కాని నాతల్లిదండ్రులకా ప్రేమ గ్రుడ్డిగవ్వకుకూడా పనికిరానిది."

ఇరుపురూ మళ్ళానాలుగైదు నిముషాలుపాటు మౌనం గాపున్నారు. అప్పుడు అంధకారంలో మార్గం కనిపెట్టిన మహానియుడు లాగా "పూజ్యులగు నీ తల్లిదండ్రులతో మాట్లాడేవను గాబట్టి వారికిద్దరు యేదోచెప్పు" అని అన్నాడు రంగనాథం.

లక్ష్మి చేయిత్రిప్పుచూ "వృధా వారేవిధంగానూ సమ్మతించరని నాకుతెలుసు వారెలా సమ్మతిస్తారో మీకుతెల్సు. వారికన్నింటికన్నా ముందు ఆహారసమస్య వుందిగదా అది కూడా పరిష్కరించ గలందులకు నెల కేభై రూపాయలు యిస్తానంటారు అయినప్పటికీ వారువప్పుకోరు. మానవుల దేముంది రేపు మీరివ్వలేకపోవచ్చు లేకుంటే మీవుద్యోగం పూడిపోవచ్చు అప్పుడువారు యెవరివాకిట్లోకిపోతారు?"

ఇక్కడా నిరాశే. ఈసారి మౌనం పదినిముషాలు పాటు రాజ్యంజేసింది. అప్పుడు లక్ష్మి వినయంగా "మీకు నాచేతితో ఫలహారాలిచ్చే సమయమెప్పుడు వస్తుందో నాకు తెలియకున్నది" అనిఅన్నది. రంగనాథం నిండాల్గై "నీనోటికొచ్చినట్లు నన్ను తిట్టేస్తే మంచిదింత కంటే" అని అన్నాడు.

లక్ష్మి వ్యంగ్యంగా "ఇంతకాలానికి తమరొక్కరు నా ప్రియులుగా జన్మించారు. కాబట్టి అట్టిప్రియులను కూడా తిరస్కరిస్తానా?"

"లక్ష్మీ! నీకొక్క నమస్కారంగాని .... హృదయ పూర్వకంగా నాకుసమాధానమివ్వు. నిన్ను యెప్పటికైనా పొందగలనో లేదో—అది నాఅదృష్టంపై ఆధారపడి వుంది గాని, నీకు నామీద ప్రేమవుందా లేదా? చెప్పు. నీ సమాధానం నాకుచాలా సంతోషాన్నిస్తుంది."

"మీకు నాప్రాణాలర్పించడానికి సిద్ధంగా వున్నా" నన్నది లక్ష్మి సజల నేత్రయై.

రంగనాథం గభాలున కుర్చీలోనుండి లేచి, అమితానందంతో బిగ్గరగా "యింకొక్కమాట. నీ ప్రేమలో నాకు సురక్షిత స్థానం లభిస్తుందన్నమాటేగా?" అని అడిగాడు.

లక్ష్మి గద్గదకంఠమున— "మీరీమాట అడిగి నాభావాలు వెలిబుచ్చు కోవడానికి మంచి అవకాశం కలుగజేసారు. నన్నెవరైనా చూడగానే పడిచావడానికి నేనంత అందగత్తెనాకాను. యెవరైనా కపటప్రేమతో మోసగిస్తారనుకోవడానికి పసిపిల్లనుగాదు. కర్తవ్యాన్ని గుర్తించే పురుషులు చాలా అరుదుగా వుంటారు. అయినా నాకేంభయం లేదు మీనుంచి. మీబోటి సహృదయులు, విశాల హృదయులు, నాజీవితంలో నాకు దొరకనట్టివారు తటస్థపడ్డారు కాబట్టి హృదయ పూర్వకంగా నేను చెప్పేదేమంటే మీరు తిరస్కరిస్తే తప్ప, నేను మీప్రేమను హృదయంలో భద్రపరచు కుంటాను. మీరు మరోచోట పెండ్లి జేసుకున్నారని తెలిసినప్పుడు నా మనస్సును ఓదార్చుకుని, హృదయాన్ని చీల్చి ఆప్రేమను విసరి పారనూకెద. ముందుగా మాత్రం నేనేం జేయను." అని అన్నది రంగనాథంతో.

*　　*　　*

పగలు గడవసాగింది. మొండి పట్టుదలతో రంగనాథాన్ని యెందుకు నిరాశాపరుణ్ని చేశానా అన్న పశ్చాత్తాపం యెక్కువైంది లక్ష్మికి. 'మున్సిఫ్‌కి నెలకు నాలుగైదు వందలొస్తాయనుకుంటాను. కాస్త పొదుపుగా ప్రవర్తిస్తే అయిదేండ్లలో పదివేలు కూడబెట్టగలుగుతాడు. డబ్బు తీసుకుని మాత్రం దాన్నేంజేయాలి? ఒక వేళ యిది రంగనాథానికి జరిమానా అనుకున్నప్పటికీ.... యింత మాత్రంతో కట్నాల సమస్య తేలిపోదు. నాతల్లి దండ్రులు కట్నం లేకండానే పెండ్లిచేయడాని కిష్టపడ్డారని రంగనాథానికి వుత్తర మెందుకు వ్రాయగూడదు?' అని ఆలోచించింది. అసలు విషయమంతా విచక్షణగా యెందుకు వ్రాయకూ

డదు? ఆయనకూ నాకూ వాటేమిటి? జరగాల్సిన తమాషా జరిగింది. అక్కడాయన బాధపడుతున్నాడు. యిక్కడ నే నేడుస్తున్నా. గడుపుదామన్నా ఒక్కక్షణం గడవటం లేదు. యెంత తపస్సు చేశాడో - పాపం మానవుడు? ఆ పుత్తరంజూస్తే కన్నీటితో రాశాడా అనిపిస్తోంది. ఇహ నీ నాటక మింతటితో ముగిస్తా.

పుత్తరం వ్రాయడానికి నిశ్చయించుకుని డ్రాయరు ముందు కూర్చుంది. ఇంతలో బైట పరిచితమైన రంగనాథం కంఠధ్వని వినబడ్డది. అక్కణ్ణుంచే— "శ్రీమతి గారు లోన వున్నారా లేరా?" అని అడిగాడు. లక్ష్మి బైట కొచ్చింది, అమితానందంతో వెంటనే రంగనాథం చేయి పట్టుకుని లోనికి తీసుకొచ్చింది. అతడు కుర్చీలో కూర్చున్నాడు. నెమ్మదిగా— "లక్ష్మీ! నేను గొప్ప అదృష్టవంతుణ్ణి. ఒక లాటరీలో నాకు పాతికవేల రూపాయలు వచ్చినవి. ఆ 25 వేల రూపాయలూ మీ తల్లిదండ్రులకు సమర్పించుట కొచ్చాను. నీవి బండిలోనే నాతో బయలుదేరాలి. చాలా నిరాశతో యిక్కణ్ణించి వెళ్ళాను, మనస్సులో నిన్నెంతగా అనుకున్నానో ఇప్పుడు గుర్తులేదు. నెలకొక్క దమ్మిడీకూడా మిగలటంలేదు. పది వేలు పది సంవత్సరాలకన్నా కూడబెట్టగలిగేవాణ్ణి గాను, కాని అదృష్టమెలాగుందో తెల్సుకోడానికొక లాటరీ టిక్కెట్టు కొన్నాను. ఇంతకుముందు లాటరీ టిక్కెట్లు చాలాసార్లు కొన్నానులే. ఆశలేదు, అయినప్పటికీ కొన్నాను. నిన్న టెలిగ్రాం ద్వారా ఇరువదైదు వేల రూపాయలు నాకొచ్చినట్లు తెలియజేసారు. తరువాతొక గంటకల్లా అలహాబాదు బ్యాంకు నాపేర పాతికవేల రూపాయల చెక్కు పంపింది. ఇహనాలస్యం జేయకు. నే నీ పాతికవేలూ తల్లిగారి చరణాబ్జములకడ వుంచి, ఆమె ఆశీర్వాదం తీసుకుంటాను. అక్కడే మనిద్దరమూ ప్రణయ బంధంలో బంధింపబడదాం." అని అంటూ చెక్కు పర్సులోనుంచి తీసి డ్రాయరుపై బెట్టాడు.

లక్ష్మి సంతోషంగా "యీడబ్బు అమ్మకిచ్చేక, హాయిగా ఖుష్పెటుకుంటా మనిపిస్తోంది. సరేగాని ముందు మీరు స్నానంచేసి డ్రెస్సుమార్చుకుని, కొంచెం భోంచేయండి. కాస్సేపు విశ్రాంతి తీసుకున్న తరువాత వెళ్దాం. లేకుంటే అమ్మనే యిక్కడకెందుకు పిలిపించ గూడదు? నిజానికి దంతా నాకల్పన. అందుకే రోజూ పశ్చాత్తాపపడుతున్నా" అని అన్నది.

రంగనాథం ఆశ్చర్యపోయి "నిజం? అబ్బ! యెంత మోసగించావు? యెంత టక్కరివి? యెంతకఠినురాలవు? ఒకవేళ యీలాటరీయే రాకుంటే నేను నీసమ్ముఖం ముందు తలపగుల గొట్టుకుంటూ వుండవలసిందేగా"

"కఠినత్వం ముందు ప్రదర్శించి ప్రారంభించిందిమీరే"

"నేనా?"

"అవునండి. శ్రీయుతులే. బాలవిధవను పెళ్ళాడ్డానికి అయిదు వేలిస్తేనేగాని చేసుకోనన్నారుగదూ, ఆబాలవిధవ యీ లక్ష్మి!"

రంగనాథ మప్పుడు రెండుచేతుల్తో తలపట్టుకుని "కాస్త పంకా వదులు లక్ష్మి. తలతిరిగి పోతోంది. నాబోటి పశువులకు బుద్ధిచెప్పాల్సిందే. నన్ను స్తంభానికి కట్టివేసి వేయికొరడా దెబ్బలు కొట్టినా తప్పులేదనిపిస్తోంది. కాబట్టి ఆకాస్త శిక్షకూడా నాకు కానివ్వవూ మెదిలితే ఒట్టు. నీకు తగ్గ యోగ్యుడనుగాను లక్ష్మి. అబ్బబ్బ! నీబోటి దేవతా స్త్రీయెడ లింతటి అన్యాయమా?" అని అన్నాడు.

లక్ష్మి పంకావదిలి ... అమాంతంగా కౌగలించుకుని ఇప్పుడిహ నామాటలు మరచిపోండి. అప్పటివరకూ మీకు స్త్రీవిలువ అర్థంగాలేదు. నాకేమో సేవా సావకాశం లభించలేదు. మీరుతిరస్కరించిన పిల్లయే మిమ్ము కౌగలించుకుంది. అది అదృష్టంకాదు? నాకా తిరస్కారంలోనే ఆనందం కలుగుతోంది. 



# భార్య మంచిదయితే....

శ్రీ కొంపల్లి బ్రహ్మానందరావు.

అప్పుడే కాలేజీ నుంచి ఇంటికి వచ్చి బట్టలు మార్చుకుంటూండగా, భార్య సరస్వతి ప్రవేశించింది, మూర్తి ఉన్న గదిలోకి.

"నా కోసం సూరి వచ్చాడా?" అని అడిగాడు అద్దం ఎదుట తల దువ్వుకుంటూ.

"ఊహుఁ రాలేదు" అని జవాబు వచ్చింది.

"పోనీ మరెవరయినా వచ్చారా?" అని అడిగాడు మూర్తి వెనక్కు తిరిగి భార్య వైపు చూసి.

"ఏమో, వచ్చినట్టులేదు. అయినా మిద్దెమీద గదిలో చూసి రండి."

మూర్తి మాట్లాడలేదు. పని ముగించుకొని, పెట్లో నుంచి పర్సు తీసి జేబులో పెట్టుకుని మేడమీది గదిలోకి పోయి చూశాడు. గదిలో ఎవరూ లేరు. మళ్ళీ దిగి వచ్చి "అయితే నేను పోతున్నాను. ఎవరయినా వస్తే క్లబ్బుకు రమ్మను" అని చెప్పి వెళ్ళిపోయాడు.

వెళుతున్న మూర్తితో ఏదో చెప్తామని ప్రయత్నించింది, సరస్వతి. కాని నోట్లోనుంచి మాట బయటికి రాకముందే మూర్తి గేటు దాటి బయటికి వెళ్ళిపోయాడు. బరువైన హృదయంతో ఆమె వెనక్కు తిరిగి ఇంట్లోకి పోయింది.

వసారాలో లైటు ముందు కూర్చుని భర్త రాకకై ఎదురు చూస్తూంది. టైం ఎనిమిది గంటలయింది. ఆమె కెదురుగా అత్తగారు కూర్చుని ఉంది. పది నిముషాలు గడిచింది. బస్సులోంచి మూర్తి దిగాడు. కూర్చున్న సరస్వతి లేచి నిలబడింది. మూర్తితో బాటు మరిద్దరు లోపలికి వచ్చారు. వాళ్ళను పైగదిలోకి పొమ్మని తనుక్రింద బెడ్ రూంలోకి పోయాడు. ఈలోపల సరస్వతి మరచెంబూ నీళ్ళతో ఎదురుగా వచ్చి "కాళ్ళు కడుక్కోండి" అంది.

మూర్తి కాళ్ళు కడుక్కొని భార్య పెట్టిన భోజనాన్ని తింటానికి ఉపక్రమించాడు. "అంత త్వరగా ముగిస్తున్నారేమండీ!" అని అడిగింది చల్ల పోసుకుంటూన్న భర్తను.

"టైం లేదు. త్వరగా పోవాలి."

"ఇప్పుడే గదండీ ఇంటికి వచ్చిందీ" అని అసంపూర్ణంగా వదిలేసింది.

"సూరి వాళ్ళు వచ్చి కూర్చున్నారు. చదవ వలసినవి చాలా ఉన్నయ్" అని విస్తరి ముందు నుంచి లేచాడు.

మూర్తి జవాబు సరస్వతిని తృప్తిపర్చలేదు. మెట్ల మీద చప్పుడు విని వాకిటి తలుపు వేసుకుని లోపల్కి వెళ్ళిపోయింది.

అత్తగార్కి వడ్డించి, తను వడ్డించుకుంది ఆమె. "అబ్బాయి పైకి పోయాడా?" అని అడిగింది భోంచేస్తూ అత్తగారు.

"వెళ్ళారు" అని జవాబిచ్చింది.

"వాడికి చదువుమీద రంధి ఎక్కువయిపోయింది. మరి ఆ దైవ విధి ఎలాగుందో! సరేగానీ, ఒసేయ్, వాడికి సమయానికి అన్నీ అందిస్తూ ఉండు. పరీక్షలు కూడా దగ్గర పడుతున్నాయి."

సరస్వతి మాట్లాడలేదు. భోజనం ముగించి లేచింది.

ఆరోజు ఆదివారం. ఉదయం భోంచేసి వెళ్ళిన మూర్తి మధ్యాహ్నం క్రిందకు దిగి భార్య ఇచ్చిన కాఫీ త్రాగాడు. మళ్ళీ పైకి వెళ్ళి చదువులో నిమగ్నుడయ్యాడు. సాయంత్రం అయిదు అయే సరికి మళ్ళీ క్రిందకు వచ్చి స్నానంచేసి మంచి బట్టలు ధరించాడు. క్లబ్బుకుపోవాలనే ఉద్దేశ్యంతో.

"పిక్చరు ప్యాలెస్‌లో మంచి సినిమా ఉందిట. వీలు ఉంటే........" అని పూర్తి చెయ్యకుండా వదిలేసింది, భర్త ఏమంటాడో అని ఎదురుచూస్తూ.

## భార్య పంచిన యితే....

"నేను చదువుకోవాలి. నువ్వు వెళ్ళేట్లయితే వెళ్ళు అభ్యంతరంలేదు."

"మీరు రాకుండా నేను ఎలా వెళతాను, వద్దులెండి" అంది.

"ఫర్వాలేదు. నువ్వూ, అమ్మా వెళ్ళండి. జేబులో పర్సు ఉంది తీసుకో."

"ఈమారు అంతా కల్సి వెళదాంలెండి."

"సరే మీయిష్టం వచ్చినట్లు ఏడ్వండి" అని వీధిలోకి పోయాడు మూర్తి.

చెమ్మగిల్లిన నేత్రాలను కొంగుతో అద్దుకొని బలవంతంగా వెనక్కు తిర్గి లోపలికి వెళ్ళింది.

రాత్రి కొంచం పొద్దుపోయాక మూర్తి ఇంటికివచ్చాడు. రోజూ లాగానే మౌనంగా భోజనం ముగించాడు. భార్య ఇచ్చిన వక్కపొడి వేసుకుని పై రూంలోకి పోవటానికి సిద్ధమయ్యాడు.

"ఈ రోజు క్రింద పడుకుందురూ! వెన్నెల రాత్రి కబుర్లు చెప్పుకుంటూ నిద్రపోవచ్చు."

"నాకు వీలు ఉండదు. నోటనీ రికార్డు పూర్తిచెయ్యాలి. ఎప్పటికో నిద్రపోతాను. నాతోపాటు నువ్వుకూడ మేల్కొటం ఎందుకూ?"

"ఈరోజు ఆదివారం కదా. కొంచం విశ్రాంతి తీసుకోండి. పొద్దస్తమానమూ చదువు గురించే అయితే, ఆరోగ్యం పాడవు తుంది."

"నా జీవితం ఇప్పటికే చాలా పాడైంది. ఇంక చదువు కూడా మందగించించంటే, వేరే చెప్పనవసరం లేదు."

"ఏం? ఎందుకు చెడిపోయింది?"

"ఇంట్లో భార్యతో సరసాలూ, ముచ్చట్లూ మొదలు పెడితే ఈ ఏడు బుర్ర గొరిగించుకొన్నట్లే."

సరస్వతికి అర్థమయింది, భర్త ధోరణి. అయినా పరీక్ష చేద్దామనే ఉద్దేశ్యంతో, "భార్యతో ముచ్చట్లు చేస్తే చదువులు నాశనం అవుతాయా" అని అడిగింది.

"తప్పకుండా"

"అయితే ముచ్చట్లు చెప్పుకుంటూ ఉన్నవారంతా నాశ నమ్మారా?"

"ఆహాఁ నా దృష్టిలో చాలామంది."

"చాలా పొరపాటు పడుతున్నారు. భర్త యొక్క చదువును భార్య ఏవిధంగానూ చెరచదు. ఎంతసేపటికీ భర్త పైకి రావాలనే దృష్టితో చూస్తుంటుంది భార్య."

"ఒకరి సంగతి నాకు అనవసరం. నామట్టుకు నాకు నిన్ను వివాహం అంత త్వరగా చేసుకున్నందువల్ల నా చదువు వెనక పడ్డమాట నిజం. ఇంక నా కాలం అంతా నీతో గడుపుతుంటే పరీక్షల దారిన పరీక్షలు పోతాయి, మన దారిన మనం పోవాలి."

"నాకు తెలీక అడుగుతాను, కట్టుకున్న భార్య ఏవిధంగా అడ్డువస్తుందో చెప్పండి! భార్యతో కులాసాగా కబుర్లు చెప్పి ఆమెను తృప్తిపర్చి మీదారిన మీరు చదువుకోవచ్చు"

"తీపి రుచి చూచిన తరువాత, చేదు రుచి చూడలేం. సుఖభోగాలకి అలవాటయినతరువాత చదువు సంధిరాదు."

ఆరాత్రి తనతో ఉండమని సరస్వతి బ్రతిమలాడింది. కాని మూర్తి ఇష్టపడలేదు. భార్య తన చదువుకు పూర్తి భంగకరమని నమ్మిన మూర్తిని ఒప్పించటానికి ఆమెకు సాధ్యం కాలేదు. భార్యను కట్టుకున్నది ఆమెకు పూర్తి తృప్తినిచ్చి తను తృప్తి పొందటానికి, అని మూర్తి తెలుసుకోలేకపోయాడు, తన విద్య ధోరణిలో ఉండి.

రోజూలాగానే మూర్తి స్నేహితులతో పైన, భార్య క్రింద, పడుకున్నారు.

మరునాడు సరస్వతి అత్తగారు తనని పిల్చి, "అబ్బాయి రాత్రి క్రింద పడుకున్నాడా? పైనే పడుకున్నాడా?" అని అడిగింది.

జరిగిన సంగతి అసంపూర్ణంగా చెప్పింది ............ కోడలు ఏదో బాధపడుతున్నట్లుగా గ్రహించింది అత్తగారు.

"ఒరేయి అబ్బాయి ఇలారా" అని పిల్చింది మెట్లమీద నుంచి దిగుతూన్న మూర్తిని.

"భార్యను ఇంటికి తెచ్చుకున్నావుగదా, నీపాటికి నువ్వు ఇల్లు పట్టించుకోకుండా ఉంటే ఏమనుకున్నావురా?" అని అడిగింది.

"నేను దాన్ని ఇంటికి తెచ్చుకోలేను. నువ్వే సరదాపడి తెచ్చుకున్నావ్."

"అదేమిట్రా అలా అంటావు, నేను సరదాపడవ మేమిటి? పెళ్ళి చేసుకున్నది, కాపురానిక్కి తెచ్చుకోవ టానిక్కి గదూ!"

"ఇప్పుడప్పుడే ఆ కాపురం సంగతి నావద్ద ఎత్తవద్దు. వద్దంటూంటే చిన్నప్పుడే నామెడకు కట్టారు. నా చదువు పూర్తయి ఒకచోట స్థిరపడిందాక ఆ గోడు పట్టించుకో దల్చలేదు."

"ఏమో నాయనా, మీకు తెలీదు. పెద్దవాళ్ళు చెప్తే వినరు. వయస్సు నిండిన పిల్ల ఇంట్లో ఎన్ని అగచాట్లు పడుతుందో అని జ్ఞానం ఉండక్కర్లే! రామయ్యగారి కోడలు చూడు. నిన్నగాక మొన్న కాపురానిక్కి వచ్చిందో లేదో, అప్పుడే ఒక పిల్లవాడు కూడా." అని అంది తల్లి. కాని తల్లి మాటలను పెడచెవినిపెట్టాడు. భార్య, చదువుకు ఒక పెద్ద ఆటంకం అని అతుక్కు పోయింది మూర్తి మనస్సులో.

మూర్తి తన కాలాన్నంతా చదువుమీదనే వినియోగించి పరీక్షకు వెళ్ళాడు. పరీక్ష బాగా వ్రాశానని తృప్తి పడ్డాడు. ఫలితాలకోసం ఎదురు చూచాడు. రెండు నెలలు తర్వాత వచ్చినయ్.

కాని మూర్తి చదువు బురదలో పన్నీరయింది. మూర్తి పరీక్ష పోయింది. అతను దిగజారిపోయాడు. దిగుల్తో మంచం ఎక్కాడు.

అయిపోయిందానిక్కి దిగులు దేనికని తల్లి చెప్పింది. పడ్డ శ్రమ అంతా వృథా అయినందుకు మూర్తి పరిస్థితి విషమించింది.

పెద్ద డాక్టర్లంతా పరీక్ష చేశారు. రెండు రోజులు అతని పరిస్థితి ఎక్కువయింది. ప్రాణాపాయంలో కొట్టుకున్నాడు.

దుఃఖంలో మునిగిన భార్య సరస్వతి అస్తమానమూ మూర్తి మంచందగ్గిర కూర్చుని కంటికి రెప్పగా పరిచ ర్యల్లో లోపం రాకుండా కాపాడుకుంది. అదృష్టవశాత్తు బతికాడు మూర్తి.

కొన్నిరోజులయిన తరువాత కోలుకున్నాడు. మళ్ళీ చదువుసంధిలో పడ్డాడు.

"బాగా కోలుకున్నంతవరకూ చదువుకు స్వస్తి చెప్ప కూడదూ?" అని అడిగింది సరస్వతి ఒకరోజున భర్తను.

"వీల్లేదు" అన్నాడు మూర్తి.

"అంతబాగా చదివారుకదా, ఎందుకునెగ్గలేదు?"

"ఖర్మ" అన్నాడు మూర్తి.

"ఖర్మగాదు. చేతులారా చేసుకున్నపని" అంది అటు తిరిగి.

"బాగా చదవలేదంటావు అంతేనా?"

"కాదు చదవటానికి చదివారు. కాని అది బుర్రకి ఎక్కే విధంగా చదవలేదు. భార్యతో కలిసి ఉండి చదివే చదువు వేరు. ఊళ్ళో మిత్రులతో తిరుగుతూ చదివిన చదువు వేరు."

"అంటే నీతో సరిగా ఉండకపోవటం వలన తప్పా నంటావా?"

"పూర్తిగా కాకపోయినా కొంత అవిధంగా తలచ వచ్చు. నిజానిక్కి మీ చదువుకు నేను ఎలా అడ్డం వచ్చే దాన్ని? కమ్మగా భోజనం చేసిపెడ్తే, తృప్తిగా పూర్తిచేసి, నాతో కొంతసేపు గడిపి, తరువాత మీ చదువుకు పోండి. నేను కాదంటానా? అలాచేస్తే మీ హృదయానిక్కి, మెద డుకూ కొంత ఉపశమనం దొరుకుతుంది. అంతేగాని, పొద్దస్తమానమూ అదే సంధి అయితే, విసుగూ, విసుగు మీద విరక్తీ ప్రారంభమయి బుర్రకు ఎక్కదు. నా దృష్టిలో మీరు తప్పిన కారణం అదే అంటాను."

"నువ్వు చెప్పినట్లు చేస్తే ప్యాసు అవుతానంటావు?"

"తప్పకుండా, చూడండి" అంది నవ్వుతూ.

ఆదేశానుసారం మూర్తి ఇంట్లో హాయిగా ఉండి, పరీక్షకు వెళ్ళాడు.

పరీక్ష ఫలితాలు వచ్చాయి. మూర్తి అమితానందంలో మునిగాడు.

"ఆడది అనుకుంటే క్షణంలో సాధిస్తుంది. మొద ట్లోనే నేను చెప్పినట్లు వింటే ఎంత బాగుండేది!" అన్న మాటలు భార్య నుంచి వచ్చినయ్,

కొడుకూ, కోడలూ కలసి భోజనం చేస్తూ ఉంటే తల్లి మురిసి పోయింది.



# ★ భోజనంవద్ద మొగమాటం ★

• శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ •

భారత స్త్రీల గౌరవ ప్రతిష్ఠలను ఇనుమడింప జేసిన వాటిల్లో అతిథిసత్కారం ఒకటి. మన పురాణేతిహాసాల్లోని ఆతిథ్యగాథలు చూస్తే వీనిఖ్యాతి విదితమవుతుంది. అనసూయ త్రిమూర్తులకు పెట్టిన భోజనమూ, ద్రౌపది శిష్య సహితుడగు దూర్వాసమహర్షికి చేసిన విందూ సుప్రసిద్ధాలు. ఆతిథ్యమంటే ఇంటికి వచ్చిన బంధుమిత్రాదులకు గాని తదితర పెద్ద మనుష్యులకు గాని గౌరవ పురస్సరంగా భోజనం పెట్టడం అని చెప్పాలె. తనయింటికి భోజనమునకు వచ్చినవారిని ఇష్ట మృష్టాన్నములతో సంతృప్తి నొందించడమే ఆతిథ్యమనిపించుకుంటుంది. అతిథి కేది ఇష్టమో అది కుడువ బెట్టినప్పుడే ఆ అతిథి సత్కారం సఫలమవుతుంది. పసిపాపలైన త్రిమూర్తులకు భక్ష్య భోజ్యాదులతో విందు చేస్తే వాళ్ళేమి ఆరగిస్తారు? చిన్నమృణ్మయపాత్రతో వేడి వేడి బువ్వ మెత్తగా గుజ్జనగూడులాగా వండి వామూ ఉప్పూ, పప్పూ పాతచింతకాయ పచ్చడీ వేసి కమ్మని ఆవు నెయ్యి వేసి గుజ్జుగా కలిపి ఆం తినమంటూ లాలిస్తూ తినిపిస్తేనే త్రిమూర్తులకు సరైన భోజనం పెట్టినదవుతుంది. అనసూయాదేవి నిజంగా సతీ అనసూయ బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు అటువంటి భోజనము పెట్టి ఉండాలె. లేకపోతే వారు అంతగా ఆమె ఎడ ప్రసన్నులై ఉండరు.

పాండవులు అరణ్యవాసం చేస్తున్న రోజుల్లో కొద్దిగా పదివేలమంది శిష్యులతో దూర్వాసుడు ద్రౌపదికి అతిథిగా వచ్చాడు. దూర్వాసుడంటే ఎవరో మనందరికీ తెలుసు. నాటినుండి నేటిదాకా లోకంలోని కోపధారులందరికీ నిజ నామము నే బిరుదుగా ప్రసాదించిన ధూర్త మహర్షి అతడు. ఆ కోపోజ్వల దివ్యమూర్తి అతిథిగా వచ్చాడని వినగా శ్రీకృష్ణభగవానుడు ద్రౌపది ఒసంగిన ఏబలుసాకు పులుసు కూరో నలుసంత మెసవి షడ్రసోపేతమైన భోజనం చేసినట్లుగా సంతృప్తి చెంది శిష్యసహితుడగు దూర్వాసమహర్షికి ఆతిథ్యమీయగల మహనీయశక్తి ద్రౌపదికి ప్రసాదించాడు కనుక గాని లేకపోతే మొగమాటం మెరుగని దూర్వాసుని శాపానికి ద్రౌపది ఇంధనం కావలసివచ్చేది. అటువంటి విషమ పరిస్థితులనుండి ద్రౌపదిని రక్షించాడు శ్రీకృష్ణుడు.

ఆనాడే గాదు యీనాడు ఇటువంటి విషమపరిస్థితులు ప్రతిగృహిణినీ ఎదుర్కొంటూనే ఉంటాయి. ఇటువంటి పరిస్థితులను సమర్థించుకొన్న గృహిణే ఉత్తమ ఇల్లాలు. నిజానికి దేవుడికైనా మానవుడికైనా వారికిష్టమైనవి వారికి ఆరగింప చేసినప్పుడే వారు సంతృప్తి చెందుతారు. చూడండి విఘ్నేశ్వరుడున్నాడనుకోండి! ఆయనకు ఉండ్రాళ్లంటే మహా ఇష్టం. ఇరవైయొక్క రకాల పత్రితో పూజించి ఇరవై ఒక్క ఉండ్రాళ్ళు నివేదన చేస్తేనే ఆయన సంతృప్తి చెందుతాడు. ఎబ్బే! గుండ్రాళ్లలాగా యీ ఉండ్రాళ్లు నైవేద్యం పెట్టటమేమిటని ఇంతకూర పూరీ ఇంట్లో తయారు చేసో హోటలునుండి తెప్పించో నివేదన చేస్తామంటే వల్లగాదు. విఘ్నేశ్వరుడు ఉగ్రుడై మనం తలపెట్టిన కార్యాలు నిర్విఘ్నంగా నెరవేరకుండా చేస్తాడు.

చూశారూ! ఇతరులకు భోజనం పెట్టడంలో ఎన్నో చిక్కులున్నాయి. భోజనం విషయంలో కొందరికి విధి నిషేధాలుంటాయి. కొందరికి భిడియమూ మొగమాటమూ ఉంటుంది. నిజంగా ఇంటికి వచ్చిన బందుమిత్రాదులకు అన్ని మర్యాదలూ చేయడం ఒక యెత్తూ, భోజనం పెట్టడం ఒక ఎత్తూను. ఈ భోజనం విషయంలో తృప్తి పొందించడంలోనే ఉన్నది గృహిణి చాకచక్యమంతా. అన్ని వస్తువులు సమృద్ధిగా ఉండి వంటచేయడానికీ, ఇతర పనులు చేయడానికీ, నౌకరులున్న గృహిణికి ఒకరికి భోజన భాజనాదులు అమర్చడంలో అంత కష్టం లేదు. కేవలం దరిద్రులయింటికి బంధువులు రావడమూ వారికి విశేష మర్యాదలు చేయడమూ అంతగా ఉండదు. ఇక కష్టమంతా మధ్యరకం కుటుంబానిదే. సహాయం చేయడానికి పనివాళ్ళు ఉండరు. ఇంట్లో వస్తువులు సమృద్ధిగా ఉండవు. వచ్చిన బంధువుకో, మిత్రునికో పుష్టిగా భోజనం పెట్టాలె. అట్లా పెట్టకపోతే కుటుంబగౌరవానికే లోపం. గృహిణిత్వ ధర్మానికే లోపం. కనుక ఆ వచ్చిన పెద్ద మనిషికి లక్షణమైన భోజనం పెట్టడానికి శతవిధాల ప్రయత్నిస్తుంది. గృహిణి యీభోజనం

# భోజనంపట్ల మొగమాటం

పెట్టడంలో ఆ వచ్చిన పెద్దమనిషి ఉభయులకు ఇష్టుడూ కావలసినవాడూ అయితే అట్టే పేచీలేదు. వ్యవహారం సమరసంగానే జరుగుతుంది. అట్లాకాకుండా కేవలం భార్యకు మాత్రమే అయినవాడైతే ఇంటికి వస్తువులు రావు. భర్తకు మాత్రమే ఇష్టుడైతే ఇంటి ఆమె తలకు వాసెనకట్టుతుంది. కనుక భార్యాభర్తలిరువురు సమరసభావంతో పెట్టే భోజనమే సొంపైనదీ ఇష్టైందీను. ఇంతవఱకు భోజనం పెట్టే వారి సంగతి ఆలోచించాము. ఇక భోజనం చేసే వారి సంగతి ఆలోచిద్దాం.

ఆహారం పట్లా వ్యవహారం పట్లా మొగమాటం పనికి రాదని సామెత ఉన్నా సాధారణంగా పరాయి యింటి భోజనం చేసే సందర్భంలో చాలామంది మొగమాటమే పడతారు. వడ్డించిన వస్తువులన్నీ తింటేనూ ఇష్టమైన వస్తువు మళ్లీ వేయించుకుంటేనూ ఎవరేమనుకుంటారో అనే కొందరికి సంకోచంగా ఉంటుంది. కనుక ఇష్టం వున్న వస్తువూ అవసరమైన వస్తువూ కూడా వేయించుకోకుండా వద్దు వద్దని చేయి అడ్డం పెడుతారు. ఈ సందర్భంలో వారు కలుపుకున్న వస్తువును ఒక కంట కనిపెట్టి వద్దన్నా కొద్దీ వడ్డించే ఇల్లాలైతే యీ మొగమాటస్తులకు కడుపు నిండుతుంది. అట్లా వడ్డించకుండా వెనుక తీస్తే వారు అర్థాకలితో లేవడమే తటస్థిస్తుంది. ఈ మొగమాటస్తులు పంక్తిని కూర్చుంటే బాగా భోజనం చేసేవాళ్లకీ చిక్కే. ప్రక్కన కూర్చున్నవాళ్ళు అన్నీ వద్దువద్దని అంటూ ఉంటే తాము కావాలని వడ్డించుకుంటే వీళ్లేదో కరువును పడివచ్చినట్టున్నారని ఎక్కడ అనుకొని పోతారో అని పంక్తిలో ఉన్నవాళ్లందరికీ భయమే. అందువల్ల తక్కినవాళ్ళుగూడా సగం తిండే తినడం సంభవిస్తుంది. ఒకనాడు ఒక గొప్ప యింటి అమ్మాయిలు ఒక చోటికి భోజనానికి వచ్చారు. వారి తిండే అంతేనో, లేక ఇంటివద్ద కొంత భోజనం చేసే వచ్చారో, కాక మొగమోటమో, మరల తెచ్చిన వస్తువులు వడ్డించుకోకపోగా మొదట విస్తరిలో వడ్డించినవే పూర్తిగా తినకుండా కోళ్లు కెక్కిరించినట్టు కెక్కిరించి గన్యాంత సంజినట్టే సంజి కూర్చున్నారు. ప్రక్క కూచున్న వాళ్ళకు ఏది తినడానికీ, ఏ వస్తువు వేయించుకోడానికీ తిండిపోతు లని ఎక్కడ అనిపోతారో అని చచ్చే భయమైపోయింది. వాళ్ళ అవస్థ చూచి ఆ యింటి ఇల్లాలు వాళ్ళు నాజూకు మంతులఱ్రా వాళ్ళనుచూచి మీరు బిడియపడకండని కొసరి కొసరి మారు వడ్డించి తక్కినవాళ్ళకు పుష్టుగా భోజనం పెట్టింది. విందుభోజనాల్లో ఇటువంటి తమాషాలెన్నో జరుగుతుంటాయి. కొంతమంది ఎవరిఇల్లైనాసరే, స్వగృహామే అనుకొని ఎంతో ధారాళంగా తమకు కావలసిన పదార్థాలు చెప్పి వేయించుకొని లక్షణంగా భోజనం చేస్తారు. అటువంటివారితో ఏలాంటి ఇబ్బందిలేదు. వెనుకటికి ఒకాయన ఉండేవాడు. ఆయనకు మొగమాట మనేది కలికానికైనా ఉండేదికాదు. ఆయనవూరినుంచి వస్తూనే సరాసరి వంట యింట్లోకివెళ్ళి ఇంటి ఇల్లాలిని కుశలప్రశ్నగా ఆమాటా యీమాటా అడిగి ఇదిగో అమ్మాయి ఇవ్వాళ కూరేమిటనే వాడు. ఆమె బంగాళాదుంపలంటే చక్రాలు తరిగి వేయించమనో, వంకాయలైతే గుత్తికాయ చేయమనో, ఆకుకూరైతే పప్పో వడియాలో వేసి చేయమనో పురమాయిస్తూ, అమ్మాయి, నూనె తగిలితే నాకు దగ్గువస్తుందిగాని నేతి పోపులే పెట్టమ్మా అనేవాడు. బాపగారు భోజనానికి వచ్చేటప్పటికి ఏవేళవుతుందో కాస్త పాలు ఎక్కువేసి డికాక్షన్ తక్కువేసి ఒక కప్పు కాఫీ తీసుకరా అమ్మా అనేవాడు. రాత్రిళ్లు మజ్జిగ పోసుకోను, ఒక పావుశేరు పాలు పోయించుకొని ఉంచమనేవాడు. ఇంక శనివారం రాత్రి భోజనం చేయను అనేవాడు. అంటే రాత్రికి ఏ ఫలహారమో చేయమన్నమాట. ఇంట్లో అన్ని వస్తువులు ఉన్న యిల్లయితే ఇటువంటివారితో ఏమీ కష్టం లేదు. కావలసినవి అడిగి లక్షణంగా పుచ్చుకుంటారు. ఇది వారికీ సుఖమే ఇల్లాలికీ సుఖమే. ఇక ఇల్లాలికి వచ్చే చిక్కు అల్లుడితో. ఆ అల్లుడైనా పాతవాడైతే పరవాలేదు. అమ్మాయి అతని రుచులన్నీ అవగతం చేసుకొని అమ్మా బంగాళదుంపల ముద్దకూర ఆయన అసలే ముట్టుకోరు, ప్రతిపూట అప్పడం వడియం ఉంటేనే కాని వారు ముద్ద యెత్తరు వట్టి పప్పులో ఊరు మిరపకాయలు కొరుక్కోవడమంటే వారికెంతో యిష్టం, చెన్నపట్నం చదువుకు వెళ్లినప్పటినుంచీ పెరుగు పచ్చళ్లూ మజ్జిగపులుసులు వారికి బాగా అలవాటైనాయంటూ వివిధ విధాలుగా తన భర్తకిష్టమైన పదార్థాలుతల్లికి తెలియజెప్పి, ఇష్టమైన వంట

# భోజనంవద్ద మొగమాటం

కములు తయారు చేయించి, భర్తకు భోజనం పెట్టేస్తుంది. కొమార్తె కనుక పాత అల్లుడితో అట్టే కష్టం లేదు. అత్తగారికి కలిగే ఇబ్బంది అంతా క్రొత్త అల్లుడితోనే. అసలు అత్తగారికి కొత్త అల్లుడంటే మహా ముచ్చట. అందువల్లనే "అల్లుడికి చేసిన సంబారమంతా కొడుకుకు పెట్టి కోలుపోయినా" నన్న సామెత పుట్టింది. అవును అల్లుడు వచ్చాడని ఒకటికి నాలు ఆధరువులు చేసి ఉంటుంది. ఆ విధంగా రోజూ ఇంట్లో ఉండే కొడుక్కు పెడితే కొంపదివాలేకదూ. అందుకే ఆసామెత వచ్చింది.

కొత్తగా వచ్చిన అల్లుడికి ఏవి ఇష్టమో అత్తగారికి తెలియదు. అయితే ఆయన కిష్టమైనవే చేసి పెట్టవలెనని ఆమె అభిలాష కనుక ఒక దుంపకూరవేయించి, ఒక కాయ గూర తిరుగమోతవేసి, ఒక తియ్య పచ్చడి పుల్ల పచ్చడి చేసి, పప్పు పులుసూ చారూ చేసి అప్పడం వడియం ఊరుమిరపకాయలు వేయించి ఒక కారపు పిండివంట ఒక తీపి పిండివంట చేసి పుల్ల పెరుగు పోగిచి తియ్య పెరుగుతోడుబెట్టి అటుక మీది ఊరగాయలుగూడ తీసి విస్తరినిండా వడ్డిస్తుంది. అయితే అత్తవారింట్లో భోజనం చేసే పద్ధతులు వివాహానికి పూర్వంనుంచి ఎన్నాళ్ళుగా ఊహించి మనసులో పెట్టుకొని ఉంటాడో కాని, కొత్తగా పెండ్లైన ఆ పెండ్లి కొమారుని మొగమాటానికి అంతు ఉండదు. ఇంటివద్ద వెల్లుల్లికారం తినేబాపతైనా సరే, అత్తవారింట భోజనం అనగానే వడ్డించిన వస్తువులు మరల వడ్డించుకోడు. విస్తరిలో మొదట వడ్డించినవైనా కొన్ని రుచి చూచీ కొన్ని చూడకా, కొన్ని కలుపుకొని కొన్ని కలుపుకోక, కొన్నిటిని తినీ, కొన్ని తినకా కాస్త చూస్తూ అట్లా ఇట్లా నంజి అటూ ఇటూ తోసి పది నిముషాల్లో భోజనం ముగించి అత్తగారి కిక్క మొహం వేసి చూస్తూ ఉండగా లేచిపోతాడు. అదే ఒక నాటకాకి గానే భావించి అత్తగారు మనస్సమాధానం చేసుకుంటుంది. మా ఊళ్ళో ఒక తాతగారు ఉండేవారు. వాళ్ళ ఇంటికి ఒకనాడు మనుమరాలి పెనిమిటిని మనుమడు వెంట తీసుకొని వచ్చారుట. అతనికి ఆయిదారు బజ్జీలు రెండు జాంగ్రీలు ఫలహారం పెట్టారుట. అతను ఒక్క జాంగ్రీలో కొంచెము, మూడు బజ్జీలు మాత్రమే తిని అరకప్పు కాఫీ మాత్రం త్రాగి లేచిపోయినాడట. ఆ ముసలాయనకా పోకడ చూస్తే ఒళ్ళు మండి 'ఏమబ్బాయి ఇవేమన్నా మా కాలంలో లాగ అరిశెలా, జంతికలా, చేగోడీలా, మినపసున్ని ఉండలా, ఇరవైయేళ్ళ పడుచుకుర్రవాడివి ఆరు బజ్జీలు, రెండు జిలేబీ చుట్టలూ తినలేవుటోయి' అని అన్నాడుట. ఆ అబ్బాయి ముసిముసి నవ్వులు నవ్వుతూ నాకు నయించదండీ తాతగారూ అన్నాడుట.

ఇక అధికార్లకు పెట్టే భోజనాలు వారి మొగమాటాలూ మరోవిధంగా ఉంటాయి. అది సమృద్ధిగా వస్తువులుదొరకని పల్లెటూరైతే ఆ ఇల్లాలి ఇబ్బందులు అనంతము. ఆ అధికారి, తానూ, తనగుమాస్తాలు తన బంట్రోతులూ భోజనాలు చేయడమే కాకుండా తనతో పనిఉండివచ్చిన ఇతర పెద్దలనుగూడా 'మీరుగింట చూపరా నా పెద్ద చెయ్యి' అన్నట్టు భోజనానికి లేవమంటాడు. అందరూ షడ్రసోపేతంగా భోజనం పెట్టవలసినవాళ్ళే. కాదంటానికి గృహ యజమానికి మొగమాటం. చేసిపెట్టలేక ఇల్లాలికి కష్టం ఇదే విషమ పరిస్థితి. తీగ లాగుతే డొంకంతా కదులుతుంది. ఇప్పటికే ప్రసంగం ప్రస్తావానికి మించింది. సెలవు.

(రేడియో ప్రసంగం)



# ★ అదృష్టము ★

* శ్రీమతి పి. కె. లక్ష్మి *

"అమ్మా సరోజా నీవుకూడా ఉత్తరం వ్రాయి ఆ ఉత్తరంకూడా ఈరోజే పోస్టు చేస్తాను" అని అన్నారు వెంకట్రావుపంతులు. "అల్లాగే నాన్నా" అని సరోజ ప్రకాశరావుకు ఉత్తరం వ్రాసేందుకు తనగదిలోకెళ్ళింది. వెంకట్రావుపంతులుగార్కి సతీసు బాబు కొడుకు, సరోజ కూతురు. సతీసుడు బి. ఏ. చదువుతున్నాడు. 25 సం॥ల వయస్సు. సరళ కేశవరావుగారి ఏకైక పుత్రిక. సతీసు భార్య. ఆమె పుట్టింట్లోనేఉంటోంది. సరోజ 18 సం॥ల వయస్సు బాలిక. ఆమెను వకీలు విశ్వేశ్వరరావుగారి కనిష్ఠ పుత్రుడైన ప్రకాశరావునకు ఇచ్చి వివాహం చేశారు. వివాహానంతరం కట్నంలో కొంత డబ్బు ఇవ్వలేదన్న మిషచేత అత్తవారింటికి రాకపోకలు తగ్గించాడు ప్రకాశరావు. ఎన్ని పండుగులకు రమ్మనమని పిల్చినా ఒకటే ఫలితం రాకపోవటమే.

ఆ పండక్కి సతీసు చదువైపోయి భార్యతో సహా వచ్చాడు. వెంకట్రావుపంతులుగార్కి తన కుటుంబం యావన్మందితో సంతోషంగా పండుగ చేయాలనికోర్కె. ఎప్పుడూ ఎవరో వకరు రాకపోవటమో ఏదో వకలోపమో! కొడుకూ, కోడలూ వచ్చారని, అల్లుడు కూడావస్తే తమ కుటుంబం అంతా సంతోషంతో కాలం గడపవచ్చని వారి ఊహ. అతడొక్కడే ఉత్తరం వ్రాస్తే రాడేమోనని కూతురిచేత కూడా ఉత్తరం వ్రాయిస్తున్నాడు ముందుగా. తను తీసుకురావటాన్కి ఆతర్వాత వెళ్ళినా నెపం తన మీద ఉండదని.

ప్రకాశరావుకు సరోజంటే తగని ప్రేమ. తండ్రి కూడా తన తల్లి మాటంటే వజ్రబాణంతో సమానమైన విలువగల దానిగా తలుస్తాడుగదా! ఇంత చిన్నతనంలోనే తల్లి నెదిరిస్తే ఏం విఘాతాలు సంభవిస్తాయోనని భార్య యందున్న ప్రేమను గుప్తపరచి, తల్లిని గౌరవిస్తున్నాడు. సావిత్రమ్మగారి కోరికమీదనే సరోజను పెండ్లి చేసాడు ప్రకాశానికి. సరోజ అందచందాలు, గుణాలు, ఆబాలికయొక్క నడవడిక మొదలైన విషయాలన్నింటినీ పరీక్షించి, కొడుక్కి తగ్గ పిల్లని నిశ్చయించిన తర్వాతే పెండ్లి చేసారు. కాని వెంకట్రావుపంతులుగారు కట్నం లోపం చేసారని, ఆ కోపం సరోజ మీద తీర్చుకోవాలని నిశ్చయం చేసుకొంది సావిత్రమ్మ. అంతేగాని ఆవిషయం సరోజకేమీతెలియదని, ఆమె. తనకుమారుడు కులాసాగా ఉండటమే వివాహపవిత్రోద్దేశమని తెలియదా? కాదు, ధన కాంక్ష. వారు సంతోషంగా ఉంటే, తనకు ద్రవ్యం ముట్టదేమోనని భయం. ప్రపంచంలో ఎంతమంది తల్లిదండ్రులు చేసిన పనులకు అత్తవారిళ్ళల్లో కుమార్తెలు బాధపడుట మనం చూడటం లేదు. సరోజ జీవితనావ సావిత్రమ్మగారి క్రోధ ప్రవాహంలో ఎట్లా,ఎటుకొట్టుకు పోతుందో ఎవరు చెప్పగలరు?

అప్పుడే వచ్చిన ఉత్తరం చూచి తన్మయుడయ్యాడు ప్రకాశం, ఆ ఉత్తరం ఎన్నిసార్లు చదివాడో ఆవంటరి గదిలో ఎవరికి తెలుసు? ఆ పండుక్కి తప్పకుండా అత్తవారి ఊరు వెళ్లాలని నిశ్చయించుకున్నాడు. ఆ ఆలోచనలో ఇతర ప్రపంచం ఏమీ తెలియటంలేదు. భార్యను చూడాలని ఆమె తలపులలో నిమగ్నుడైన ప్రకాశానికి తల్లి కంఠధ్వని విని తిరిగి బాహ్యప్రపంచంలోకొచ్చాడు. కంఠధ్వని ప్రక్కగదిలోనుంచని, తల్లిదండ్రులు తనను గురించే మాట్లాడు కొంటున్నారని గ్రహించి శ్రద్ధగా విన్నాడు వాళ్ళ సంభాషణ. ఆమాటల ఫలితం తన మామగారు ఆరోజే వస్తున్నట్లు ఆ ఉత్తరం ద్వారా తెలిసికొన్నారని, ఆయన వచ్చినట్లయితే వెళ్ళటమా మానటమా అని వారు ఆలోచించు కొంటున్నారని తెలిసింది. అప్పుడే "మీరెవరూ రాకపోయినా నేను మాత్రం వెడుతానని" చెపుదామని గది గుమ్మందాకా వచ్చి, హృదయ వేగాన్ని తగ్గించి విరమించాడు. మధ్యాహ్నం 12 గంటలకు విశ్వేశ్వరరావుగారి వియ్యంకుడైన వెంకట్రావుపంతులుగారు వచ్చారు. వియ్యపురాలి ఆదరణవల్ల వెంకట్రావు ఆ పండుక్కి, వచ్చుటకు వారు సమ్మతిస్తారేమో ననుకున్నాడు. ఆ రాత్రి 7 గంట లైంది. అప్పుడే వచ్చిన వియ్యంకుణ్ణి,తనఅల్లుడ్ని క్షేమాలు అడిగాడు. ఇంతట్లో సావిత్రమ్మగారు వచ్చి, అన్నయ్యగారు ఎప్పుడు భోంచేసారో, భోజనానికి లేవండని హెచ్చరించింది. స్థిమిత పడ్డాక చెప్పవచ్చనుకున్నాడు పంతులుగారు. అంతా భోజనాలకు వెళ్ళిపోయారు. నవ్వులు, సరసాలు, మధ్య మధ్య సూటీపోటీగా దెప్పుళ్ళు, వేళాకోళాలతో భోజనాలు ముగించారు. వెంకట్రావుగారు ఆవిధంగా జరుగుతుందనుకోలేదు. ఏం చెప్ప

తారో, దెబ్బలాడుతారో అని భయపడ్డాడు. అటువంటి దేమీ జరగనందుకు భగవంతునికి ధన్యవాదాలర్పించాడు ముందుకూడా నీవేగతని.

సావిత్రమ్మగారు కూడా వచ్చింది వాకిట్లోకి. "ఆఁ అదుగో అక్కయ్యగారు కూడా వచ్చారు" అన్నాడు పంతులుగారు. "ఆఁ ఏం నాతో ఏమైనా పనుందా?" అంది సావిత్రమ్మ.

వి : మనల్ని పంపుక్కి తీసుకు వెళ్ళటానిక్కి వచ్చారు.

సా : మన నిశ్చయాన్ని ఇదివరకు రమ్మనమని చెప్పినప్పుడే తెల్పాడు కదూ!

వెం: అమ్మా! అక్కయ్యగారూ మీ నిశ్చయాన్ని చెప్ప లేదనికాదు. నేనుకూడా ఇవ్వాలనే ఉద్దేశ్యంచేతే అంగీకరించాను. నాకు నింపపడే యోగం ఉండబట్టీ, పంట నాశన మవబట్టీ, వ్యాపారంలో వస్తుందనుకొన్న డబ్బురాక పైపెచ్చు చేతిడబ్బు కట్టుకోవలసిరాబట్టీ ఇయ్యలేకపోయాను, ఈ సంవత్సరం పంటలో తప్పక యిస్తాను. పెండ్లి అయిన ఈ 8 మాసాలనుంచీ సరోజనుచూస్తే నాకడుపు తరుక్కుపోతోంది. ఎప్పుడైతే మీ ఉత్తరం చూచిందో ఆరోజునుంచీ మనోవ్యాధితో బాధపడుతోంది. ఎప్పుడూ ఆగదిలోనే కాల క్షేపం చేసుకొంటుంది. అది ఆ మనోవ్యాధితో మంచిస్తుందేమోనని నా భయం. బావగారు, అక్కయ్యగారు ఇవి చేతులు కావు, కాళ్ళనుకొని నన్ను మన్నించండి. మీకు నమ్మకం లేకపోతే నేను మీ బాకీ యావత్తూ తీర్చాకనే సరోజను కాపురానికి తీసుక్కువెళ్ళండి. ప్రకాశం రాక పోకలకు నిర్బధం తొలగించండంటూ కాళ్లావేళ్ళా పడి బ్రతిమలాడాడు. మామ గారి మాటలు విన్న ప్రకాశం నిశ్చేష్టుడయ్యాడు. సరే లెండని దంపతులంగీకరించారు.

వి : బావగారూ మీరు వెళ్ళండి. ఎల్లుండి మేము బయలుదేరుతాము.

వెం: నిజమేనా? బావగారూ.

వి : నిజంగానే నండీ. మీ చెల్లెలకు చీరలు వగైరా కొని ఉట్టేపెట్టండి.

వెం: మీకు అంతదయ రావాలేగాని చీరలకేంలోటు? దేముడిచ్చినంతలో నాకు మాత్రం ఇంకెవరున్నారు.

సా: మీబావగార్కి జామాదు మర్చిపోతారేమోనని కాబోలు నన్ను గురించి ప్రత్యేకించటం. అంతటితో ఆ సంభాషణ నిల్చిపోయి అంతా సంతోషంతో నిద్రపోయారు. తండ్రి రాజమండ్రీ వెళ్ళినదగ్గిరనుంచీ సరోజకు ఒకటే ఆందోళన. తన అత్తవారు అంతాగాని, కనీసం తన భర్తయినాగాని వస్తారా? రారా అని. అప్పటికి ఉదయం 8 గంటలయింది. శాంతమ్మ వంట చేస్తోంది. సతీసు సరళలు గదిలో కూర్చుని హాస్య విలాసాలలో మునిగి ఉన్నారు. సరోజ గది కిటికీలో కూర్చుని ఆలోచిస్తోంది. చెప్పుల చప్పుడు విని, సరోజ తండ్రిని చూచింది. ఆమె నిస్పృహతో మంచంమీద కూలిపోయింది. శాంతా! అన్న తండ్రి పిలుపువిని, సతీసు, వంటింట్లోంచి శాంతా వచ్చారు. పంతులుగారు అక్కడ కుర్చీలో కూర్చున్న అనంతరం ఏమన్నారని సతీసు, శాంతా వక్కసారే ప్రశ్నించారు.

వెం : రేపు వస్తారట.

శాం: అంతానా?

సతీసు: బాగా మాట్లాడారా నాన్నా?

వెం : ఆఁ ఏమో వారిష్టం, అల్లుడే వస్తాడేమో!

శాం : స్నానానికి లేవండి నీళ్ళు చల్లారిపోతాయి.

వెం : సరే,తోడు వస్తున్నా సరోజేదీ?

శాం : ఇక్కడేఉండాలి, సరళా, ఆ,వస్తున్నా సత్తయ్యా. అని అత్తగారి వెన్కవెళ్ళింది. సతీసు గదిలోకి వెళ్ళాడు. సరోజ ఏంచేస్తూందోతెలసినపంతులుగారు స్నానానికివెళ్లాడు దొడ్లోకి. ఆరాత్రంతా సరోజకు నిద్రలేదు,భాగవతము చదువుతోంది. అది నరకాసురవధఘట్టం, ఆ కృష్ణుడు మూర్ఛపోవటమూ అప్పుడు సత్యాదేవి ధనుర్బాణాలు తీసుకొని బాణం సంధించ బోవటం, నరకాసురుడు తనలో "రాకేందు బింబమై"అని అనుకొన్న ఆపద్యం ఎన్నిసార్లు చదివిందో. ఆహా ఎంత పూజ్యురాలు సత్యాదేవి! తన ప్రతిభ భర్తసమక్షంలోనే వెల్లడి చేసుకొందుకు ఎన్ని జన్మలు తపస్సు చేసివుండాలి. ఆహా రేపేగదా వారువస్తానన్నరోజు. పెండ్లి లోతప్ప మళ్ళావార్ని చూసే అదృష్టం కల్గలేదుకదా. ఎంత దురదృష్టవతిని. భర్తప్రేమకు దూరమైన నాజన్మ కాల్చనా, ఆ సత్యాదేవికీ నాకూ పోలికెక్కడ. అని ఆలోచిస్తూ, కొంతసేపు చదువుతూ కొంత సేపు నిద్రకు ప్రయత్నిస్తూ ఆరాత్రి వేగిస్తోంది. సరోజకు తెల్లవారి నట్లేతెలియదు. అప్పుడే వదిన అభ్యంగన స్నానంచేసి సరోజను లేపడం

కోసం వచ్చింది. ఇంతలో వాకిట్లోబండి ఆగిన చప్పుడు విని, మిగిలినవారంతా వచ్చారు. ప్రకాశరావు బండి దిగం గానే ఒక్కసారి కలయజూసి, తలవంచుకున్నాడు. సరోజ ఈసంగతే గమనించలేదు. మామూలుగా గదిలో వంటరిగా ఆలోచిస్తోంది. "శాంతా నీకు్తే" అన్న తండ్రి పిలుపు విని, తెల్లవారినట్టు తెలుసుకొని, మెలకువగా ఉన్నట్టు తనవారు గ్రహించరేరని అప్పుడే ప్రక్కమీద వాలింది. ప్రకాశరావు కాళ్లకడుక్కొని కూర్చున్న తరు వాత కుశలప్రశ్నలడిగి అమ్మా నాన్నగార్లు రాలేదేమన్నాడు. "అమ్మకు కొంచెం సుస్తీగాఉంది, నేనే వచ్చాను" అని ప్రకాశరావు బదులు చెప్పేడు. ఈ లోగా సరళ కాఫీ గ్లాసు పట్టుకొచ్చి నిల్చుంది. "మీ అన్నయ్యగారేగా ఇయ్యి" అన్నాడు సతీసు. కాఫీ ఇచ్చి సరోజను పిల్చేందుకు వెళ్ళింది సరళ. అల్లుడికి అభ్యంగనస్నాన ప్రయత్నంమీద అంతా లోపలికెళ్ళారు.

సరళ సరోజ గదిగుమ్మం వద్ద నుంచుని "వదినా తలుపు" అంది. సరోజ తలుపు తీసింది. సరోజను చూసి సరళ నిర్ఘాంతపోయింది. కళ్ళు ఎరుపులై వాచి నిద్రలేమిని తెల్పుతున్నాయి. కొంచెం సంబాళించుకొని, వదినా అట్లా వున్నావేం? ప్రకాశం అన్నయ్య వచ్చాడు.

స : ఆ! నిజంగా!

సరో; అవును వదినా నిజం దొడ్లో స్నానం చేస్తున్నాడు ఇంకా చూడు అని ఇద్దరూ బయలుదేరారు. సరోజకు ఎదురయ్యాడు ప్రకాశం. సరోజ ఎవరైనా చూస్తారేమో నని సిగ్గుపడి గదిలోకి తప్పుకొని అతనికేసి చూసింది. ప్రకాశం నిశ్చేష్టుడయ్యాడు. సరోజను ఇప్పుడు గుర్తు పట్టేందుకు వీలులేదు. అప్పటి సరోజకు, ఇప్పటిసరోజకు, ఎంత తేడా ఉంది! ఈఅవస్థకు కారణం తనేగదా! అని నిట్టూర్పు విడిచి బట్టలు ధరించేందుకు తనకిచ్చిన గదిలోకి వెళ్ళాడు.

"అప్పుడే 11గంటలైంది వంటైందా అమ్మా" అన్నాడు సతీసుగుమ్మల్లోనుంచుని. "అయిందిబాబూ వడ్డిస్తున్నారండి బావకు సరళనడిగి పట్టుబట్ట ఇవ్వండి" అని వడ్డన ప్రయ త్నం మీదుంది శాంత. ముందు పంతులుగార్కి తర్వాత ప్రకాశం, ఆపైన సతీసు వారి ఎదురుగా సరోజ, సరళలు. వడ్డనపూర్తైంది. భోజనాల ఉపక్రమణ, కబుర్ల ఉపక్రమణ ఒకేసారి జర్గాయి. ముందున్న సరోజను చూస్తూ, జవాబిస్తు న్నాడు ప్రకాశం. పక్కనున్న సరళ గమనిస్తోంది. "వదినా ముందు భోంచెయ్యి. అన్నయ్య ఇక్కడేఉంటాడు, తర్వాత చూడవచ్చుగాని. అన్నీ అట్లానే ఉంచేసావు" అని నిష్ఠురంగా అంది. ఆమాటకు సరోజ భర్త ముఖంలోకి చూసి నవ్వింది. ఆనందంగా సంతోషంగా భోజనాలు ముగించాక ఆగదిలో పక్కవెయ్యమ్మా అతను కొంచెంసేపు నిద్ర పోతాడని అంది శాంత. సరే అనివెళ్ళింది సరోజ. వెంకట్రావుగారి ఆనందం వర్ణనాతీతం.

ఆరాత్రి వివాహానంతరం కలుసుకొన్నారు ఆదంపతులు. "సరోజా నావల్లనేగదా నీకు తీరనిబాధ కల్గించాను" అని అన్నాడు ప్రకాశం.

స: నాబాధకేమిగాని అంతా క్షేమమా అంది.

ప్ర: ఆ, అట్లా ఉన్నావేం ! కళ్ళు ఎరుపులైనవేం. నాకోసం బెంగపెట్టుకున్నావా ! నిన్ను మర్చిపోయాననుకున్నావా ! తన్నుతను మర్చిపోయే అవివేకి ఎవరైనా ఉంటారా !అని ఆమె పడ్డకష్టాన్ని ఊహించాడు ప్రకాశం. అంతా ఆనంద సముద్రంలో మున్గిపోయారు.

పండుగనాడు జరీపంచలతో నానా రకాలైన పిండివంట లతో ప్రియురాలి ప్రేమతన్మయంలో నిమిషంగా గడిచింది. మరునాడుకూడా ఏలోపమూ లేకుండా గడిచింది. ఆరోజు ప్రకాశం ప్రయాణం. సరోజ దుఃఖం చూడలేక అనేక విధాలు ఊరడిస్తున్నాడు. ఎట్టకేలకు బ్రతిమాలి లాలించి ఒప్పించాడు. వెంటనే ఉత్తరం వ్రాస్తానని, సమాధానం వ్రాయమని చెప్పాడు. కన్నీటితో మరువరుగదా? మరు వరుగదా! అని సరోజ పదే పదే హెచ్చరించింది. "ఏం భయంలేదు" అని అనేకసార్లు ఊరడించాడు ప్రకాశం. చివరకు వాకిట్లోకి బండి వచ్చింది. వెళ్ళక తప్పదు, శలవా అన్నాడు. కన్నీటితో విడువలేక విడువలేక కౌగిలి వది లింది సరోజ. బండీవద్ద కంతా వచ్చారు. అందరివద్దగిరా శలవు తీసుకున్నాడు ప్రకాశం. ఉత్తరం వ్రాయిబాబూ అంది శాంత. రెప్పవాల్చకుండా సరోజకేసి చూస్తూనే ఉన్నాడు ప్రకాశం. అందరి దృష్టిపథం దాటింది బండి. ఆ ప్రేమదం పతుల్నిఏంచేస్తాడో గదా భగవానుడు.

ప్రకాశరావు ఇంట్లో అడుగు పెడుతూనే "అమ్మా" అన్నాడు. "బుచ్చిబాబూ అమ్మకు జ్వరం వచ్చింది. పెద్ద బాబు ఊళ్ళోలేరు," అంది దాసీ సుబ్బి. గబగబా తల్లి

మంచందగ్గరకొచ్చి పిల్చాడు, "అమ్మా, అమ్మా" అని. ఆమెకు వొళ్ళు తెలియని జ్వరం. డాక్టరు దగ్గిరకెళ్ళి తెలుసుకున్నాడు టైఫాయిడ్ అని. ప్రకాశాన్కి- ఖంగారు ఎక్కు-వైంది. వెంటనే ఏలూరుకు టెలిగ్రాం ఇచ్చాడు.

నిన్ననేగదా ప్రకాశం వెళ్ళింది, ఇంతలో ఈ టెలిగ్రాం ఏమిటని అంతా హడలిపోయారు. విప్పి చదివాడు సతీసు. "మాతల్లికి జబ్బుగా ఉందని ఇంటిలో మరో మనిషి ఎవరూ లేరని సరోజను తీస్కు-రావలసిందని" ఉంది. "సరోజను తీసుకొని నీవు వెళ్ళు. నాన్నగారు ఎప్పుడు వస్తారో ఊరునుంచి, త్వరగా సిద్ధమవండి" అని బండి తీస్కొ-చ్చేంయ్క- వెళ్ళేడు సతీసు.

ఇంటిలో అడుగు పెట్టంగానే వెన్క-టి - సంగతులన్నీ సరోజను భయపెట్టినవి. వెంటనే ధైర్యం తెచ్చుకొని లోనికివెళ్ళింది. అదిమొదలు సరోజ అత్తగారి పరిచర్యలో లీనమైంది. నెలరోజులైంది సరోజ అత్తగారింటికొచ్చి. అప్పుడప్పుడు "సరోజా నిద్రలేకపోతే జబ్బు చేస్తుంది సుమా జాగ్రత్త" అనేవాడు ప్రకాశం. "మీఎదట ఉంటే ఏంభయములేద" నేది నవ్వుతూ. ఆనెలలోనే సరోజ అప్తురాలైంది అందరికీ. సరోజంటే ఆరవప్రాణమైంది. సావిత్రమ్మగార్కి- సరోజ సేవాఫలితంగా తిర్గి ఆరోగ్యం కల్గింది. ఎవరినోటంట విన్నా సరోజ సేవాఫలమే తన ఆరోగ్యాన్కి- కారణమని వినేది. తనకు సరోజ యందున్న భావాన్కి- సిగ్గుపడి, అంతా ప్రేమగామార్చి సరోజ సంతోషమునకు ప్రయత్నించేది. సరోజ ఆఇంటి ఇలవేల్పైంది. ఆమె మాట వేదాక్షరమైంది. ఆమెజీవిత నావ ఈవిధంగా ఒడ్డుకుచేరునని ఎవరనుకొన్నారు? అది ఆమె అదృష్టఫలితమే!

—★—

# పిక్క--మక్కి

• శ్రీ టి. ఆర్. శేషాద్రి •

సాధారణంగా విద్యార్థులలో అనేక పరిభాషలు, పర్యాయపదాలు ఉంటాయి. మాటవరుసకి వాళ్లలో వాళ్ళు మాట్లాడు కొంటారు, తిట్టు కొంటారు కూడా- ఆయా భాషలలోనే; "సరి, సరి" ఆవిషయాలన్నీ మనకెందుకంటారేమో. కాని వాళ్ళు వాడే వివిధ పదాలకు వ్యంగంగా ఏదో ఒక అర్థం గోచరిస్తూనే ఉంటుంది.

సాధారణంగా, తరచుగాలెండి మనకు వినిపించేవి, "పిక్క- పెట్టడం," "మక్కి- ఎక్కించడం" వగైరా. వీటి విషయమై విశేషంగా చర్చిస్తే విపరీతార్థం వినబడుతుంది.

పూర్వం విద్యార్థులు వేదపఠన సాగించే సమయంలో కొన్ని చింతపిక్క-లు ప్రక్క-ను పోసుకునేవారట. వేదం ఒకపరి చదివినంత మాత్రాన అబ్బేది కాదు. అందుచేత వారు ఒకసారి చదివి, చింతపిక్క-ల్లో ఒక పిక్క-తీసి వేరే పెట్టేవారు. ఇలాగే ఒక్కొ-క్క- పిక్క-నే బయట వేరుగా పెట్టి ఎన్నిసార్లు చదివేరో లెక్క-పెట్టేవారట. ఇలా పిక్క-లు పెట్టడం అనేమాట కాలక్రమాన అనేక విద్యార్థుల నోట జారి "పిక్క- పెట్టడం"గా మారింది.

తమపరి ఒక గురువు, అతనివద్ద గురువాజ్ఞ ప్రకారం నడిచే ఒక శిష్యుడు పూర్వకాలంలో ఉండేవారట. గురువుగారొకనాడు తన శిష్యుని పిలిచి ఒక తాటాకు గ్రంథాన్ని వేరొక తాళ పత్రంమీద ఉన్నదున్నట్లుగా ఎక్కి-ంచమన్నారు. కొంతవరకు రాసిన తరువాత శిష్యుని కొక ధర్మసందేహం పట్టుకుంది. ఏమిటంటారా, "అసలు కాపీలో" కర్మవశాత్తూ చనిపోయిన ఒక ఈగ (మక్షి) ఒక అక్షరం మీద అంటుకొనివుంది. శిష్యుడు గురువుగారిని సమీపించేడు, గురూజీ, ఉన్నదున్నట్లుగా రాయమంటారా? లేక కొద్దిగా మార్పు చేయమంటారా?" అని అడిగేడు. "నీమొహం! ఉన్నదున్నట్లు రాయి" అని కఠినమైన ఆజ్ఞ ఇచ్చారు గురూజీ. తాపత్రయపడి ఒక ఈగను పట్టుకొన్నాడు శిష్యుడు. దానిని సరిగా అదే అక్షరంపై వేసి నిలబెట్టేడు. గురువుగారు తనను మెచ్చుకొంటారనుకొన్నాడు.

"ఇదంతా ఏమిటని" ప్రశ్నించారు గురూజీ. "మక్షికి మక్షిని స్థాపించేను" (ఈగ ఉండవలసిన స్థానంలో ఈగనుంచేను) అని జవాబు అందింద్ది ఆయనకు. అప్పటి నుంచే "మక్షికి మక్షి" అనేపదం "మక్కి-కి మక్కి-" అని వాడుకలోకొచ్చింది.






రచన: "శ్రీ పి. వి. పల్లి"

[వెనుకటి గాథ : కూతురు జానకి ఇష్టప్రకారము రంగాచారి ఆమెను బి. ఎ. వరకు చదివిస్తాడు. ఎమ్. ఏ. చదివి ఉద్యోగము చేస్తున్న, జానకి మేనమామ కుమారుడు శేఖరానికి ఆమెనిచ్చి వివాహము చేయ తలంపుతో నున్నాడు. శేఖరం చదువుకున్న ఆమెను భార్యగా స్వీకరించనని నిక్కచ్చిగా చెప్పేడు. జానకి ఈ విషయంలో బాధ్యతంతా తనకు వదలివెయ్యమని తండ్రి నూరడించింది.

కాలేజీ ఎసోషియేషన్ సమావేశంలో జానకి వేదికనుండి స్త్రీవిద్య మీద అద్భుతంగా ఉపన్యసిస్తూ ఉంది. సంఘంలో స్త్రీలు ముందుకు వచ్చి పురుషులతో సమానంగా వ్యవహరించడం ఇష్టంలేని శేఖరం యీ ఉపన్యాసము ముగియక పూర్వమే యింటిత్రోవ పట్టాడు. ఇక చదవండి.]

—:0:—

సూర్యుని లేత కిరణాలు ఆకుపచ్చని రంగు చీరమీద పడి, ప్రతిబింబిస్తున్నాయ్. గులాబీరంగు సిల్కు జాకెట్టు తలలో సంపెంగపూల చెండు, జానకి అందాన్ని యినుమడింప చేస్తున్నాయి. కిటికీలోనుండి వచ్చే పిల్లగాలులకి ముంగురులు ఎగురుతూంటే, చేతిలోని పుస్తకం వేపు దృష్టి నిలుపుతూ పుటలు తిరగవేస్తూంది జానకి.

తలుపు చప్పుడు నిశ్శబ్దాన్ని పటాపంచలు చేసింది. పుస్తకం మూసి తలెత్తి చూచింది జానకి. తన స్నేహితురాలు సుశీల వచ్చింది.

"హల్లో సుశీలా! యెప్పుడొచ్చావ్ మద్రాసునుండి?"

"Last night"

"చాలా కాలమైందే యీవూరు వచ్చి. రా- కూర్చో"

సోఫామీద యిద్దరూ ఆసీనులయ్యారు. వంటవాడిని పిలిచి రెండు కప్పులకాఫీకి ఆర్డరిచ్చింది జానకి.

"మరేమిటి విశేషాలు?" ప్రశ్నించింది జానకి సుశీల మొఖంలోకి చూస్తూ-

"ఏమున్నాయ్— ఏమీ లేవు.—"

"అన్నట్టు ప్రభాకరం కులాసాయేనా- మీరిద్దరు కలిసి వచ్చారా?—"

"ఆయన రాలేదు. ఏవో ఆఫీసు గొడవలున్నాయట రమ్మని యెంత పిలిచినా రానన్నారు."

"అవునుమరి. ఉద్యోగమాయెను. మనం అనుకున్నట్లుగా, తీరిక వుండొద్దూ—"

వంటవాడు తెచ్చిన కాఫీ త్రాగుతూ......

"మీ ఇంటిదగ్గిర వంటవాడేనా వంట లేక ఆడమనిషిని పెట్టుకున్నారా?—" తిరిగి ప్రశ్నించింది జానకి.

"ఆఁ అంతపాటా! నేనే వండాలంటారు నేను వండితే

గాని ఆయనగారికి రుచించదట.”

“వెరీగుడ్, వండితే తప్పేముంది? మన పని మనం చేసుకుంటాం.”

“నీవూ యిలాగే అంటున్నావ్!”

“తప్పేముంది సుశీలా. ఆయన చెప్పినట్లు నువ్వెందుకు చెయ్యరాదు?”

“అయితే మన శరీరం పాడవదూ. వంటపొయ్యి దగ్గర వేడికీ, పొగకీ మనం ఓర్చలేం. మన అందం పాడవుతుంది. నల్లగా కురూపిల్లలా తయారవుతాం. ఈమధ్యనే- నిక్కచ్చిగా చెప్పేశాను- నేను వండనని.”

“పిచ్చిదానా, యెంత పొరపాటు చేశావ్. ఆయన యెంత నొచ్చుకున్నాడో-!”

“యేమన్నా అనుకోనీ జానకీ. ఆపనిమాత్రం నావల్ల కాదు —”

“చదువుకున్న దానివి నువ్వూ యిలాగే అంటే చదువు లేనివాళ్ళు యేమన్నా అనగలరు. వాళ్ళని యేమీ అనలేం. జ్ఞానం సంపాయించడం భర్తమాటకు యెదురాడడానికా?”

“అవునుగాని జానకీ, బి. ఏ. పూర్తిచేశావుగదా, ఏమి చేస్తావ్- యేదన్నా.........”

“అలాంటివి నాకిష్టంలేదు.”

“ఈవూరు రాగానే మా అమ్మ నీ పెళ్ళి విషయం చెప్పింది...”

“యేమని చెప్పిందేమిటి?......”

“మీ శేఖరం బావని పెళ్ళి చేసుకోబోతున్నావని...”

“చదువుకున్న పెళ్ళామయితే తన కెదురుతిరుగుతుందని సంశయిస్తున్నాడు......”

“అయితే నువ్వేమన్నావ్?......”

“సుశీలా- నేనననేదేముంది? చదువుకున్నంత మాత్రాన భర్తకు ఎదురు తిరుగుతామా?”

“మా ఆయన కూడా యిలాగే- మీ శేఖరంలాగే అంటూ వుంటారు. ఓనాడు ‘సరదాగా తిరిగొద్దాం కారులో’ అంటే వీల్లేదన్నారు. ఇంకోనాడు సినిమాకు కూడా వద్దన్నారు. అందుచే నాకు బాగా కోపం వచ్చింది సుమా.”

“కోపం వచ్చి యేంచేశావేమిటి?”

“యేమన్నా చేద్దామనిపించింది. మన సరదాలని అరికట్టజూచే భర్తల్ని యేమన్నా అనాలి......”

“నువ్వు పొరపడుతున్నావు సుశీలా! ఆయనెందుకు వద్దన్నారో నువ్వు గ్రహించలేదు. అందుకే యిలా అంటున్నావు. ఆయన మతంకనిపెట్టి నువ్వు తిరగాలి. అంతేగాని యెదురు తిరిగి నువ్వు యేమిటి సాధించగలిగావు? ఏసరదాలని తీర్చుకోగలిగావు?”

“అదేమిటో- తెలుసున్న ఫ్రెండ్సు, యెవరన్నా కనిపించినప్పుడు వాళ్ళతో మాట్లాడితే ఓమాటు కొట్టినంత పని చేశారు. నేనుకూడా చదువుకున్నదాన్ని కనుక సోషల్‌గా వుండాలని వుంటుంది. ఇంటరు కంప్లీటు చేశానుకదా! ఆయనకు నేను సోషల్‌గా వుండడం యిష్టంలేదు. యెవడి పెళ్ళామో లేచిపోయిందట. యిలా సోషల్‌గా వున్నందువల్లనే- అవును ఆవ్యక్తియందు అతడి మనస్సు లగ్నమైనది. కనుకనే ఆపని చేసింది. మగాళ్లు మాత్రం అలా సంచరించడం లేదూ?__”

“అయితే వాళ్ళు తప్పుడుగా చరిస్తున్నారని, మనం కూడా అలా చరిస్తే యేం ప్రయోజనం. ఇటు స్త్రీగాని అటు పురుషుడు గాని అటువంటి సాంప్రదాయాలని తెచ్చిపెట్టుకోగూడదు. ఎవరి శీలాన్ని వారు కాపాడుకోవాలి. ఒకరు చెప్పినంతమాత్రాన ప్రయోజనంలేదు. ఎవరి మనస్సును వాళ్ళు స్వాధీనంలో వుంచుకుని మెలగాలి.”

“ఏమిటో నువ్వుచెప్పుచున్నది యేమీ అర్థంకాలేదు. ఆయనకి నేనంటే- యెప్పుడూ అదోలా వుంటుందిట. ఎప్పుడూ చిరమరలే.”

“వెర్రిదానా, అతనికి నచ్చినపని నువ్వుచేస్తే ఆయన అలా యెందుకుంటారు? మన అభిమతానికి వాళ్ళు నచ్చినా నచ్చకపోయినా, వాళ్ళ అభిమతానికి తగట్లుగా మనం సంచరించాలి. లేకపోతే వాళ్ళకీ మనకీ భేదాభిప్రాయాలు రావడం, కలహాలు లేవదీసుకోవడం, యిత్యాది వాటివల్ల

మన జీవితాలే భగ్నం అయిపోతాయి. మనం చదువుకున్నంతమాత్రాన పురుషులు మన వెంట వుండాలనీ, మన మాట ప్రకారం నడుచుకోవాలనీ అనుకోవడం పొరపాటు. ఎవరో ఒకరు ఒకరి అభిమతానికి తగ్గట్టుగా నడుచుకున్నంతకాలం వారి జీవితాలు సుఖవంతంగానే వుంటాయి. భర్త చెప్పినట్లు భార్య నడుచుకోవడమే మంచిది. అయితే భార్య తన సామర్థ్యము నుపయోగించి, భర్త మనస్సుకు నచ్చినట్లుగా తిరిగినంతకాలం, భార్యకి యెదురాడలేడు భర్త. ఈ రహస్యాన్ని తెలుసుకోలేక నువ్వు నీ జీవితాన్ని కంటకం చేసుకుంటున్నావు. నీ చదువుని వృథా పుచ్చుతున్నావు. చదువుకున్నందువల్ల నీ జీవితాన్ని పూల బాటమీద నడిపించుకోవాలిగాని, చదువుకున్నాననే అహంభావం చేర నీకు తోచిందే నువ్వు చేస్తే ప్రయోజనం లేదు.—"

"సరే వస్తా జానకీ."

"సాయంత్రం అలా షికారు పోదాం రా..."

"ఓ యెస్!"

ప్రక్కగదిలో పేపరు చదువుకుంటూన్న శేఖరం పఠనం ముగించి, యీ సంభాషణనంతా విన్నాడు. అయితే తను మొదట అనుకున్నది ఉత్త అనుమానమేనా? తన క్లాస్ మేట్స్ యెంతో మంది సోషల్ గా వుంటున్నామని చెడు తిరుగుళ్ళు తిరుగుతూండడం తను కళ్ళారా చూశాడే. చదువుకున్న వాళ్ళకున్న పోగాలమే యిది అని నిర్ధారణ చేసుకున్నదే ఆనాడు. అంత దూరం యెందుకూ- తన స్నేహితుడు మధు పెండ్లాడిన భార్య ఇంటరు చదివింది- పెళ్ళయిన రెండు నెలలకే సుదర్శనంతో లేచిపోయిందే! సూర్యం పెండ్లాడిన విద్యావతి వాణ్ణి ఖాతరు చెయ్యకుండా యిష్టం వచ్చినట్లు తిరుగుతూండడం తను స్వయంగా చూచిందే గదూ! అయితే, యీ ఆడవాళ్ళు మొదట పెళ్ళయేవరకు యిలా తీపిమాటలాడి, తీరా పెళ్ళి అవగానే 'నాయిష్టం వచ్చినట్లు నేను సంచరిస్తా'నని ఎదురు తిరుగుతారేమో! ఏమయినా చదువుకున్న స్త్రీని పెండ్లాడ్డం కంటకప్రాయమే కాగలదు."

"అయితే నువ్వు చదువుకున్నందుకు యీమాత్రం జ్ఞానాన్ని సంపాదించావు?" ప్రశ్నించింది అంతరాత్మ.

"నేను కళ్ళారా చూచిందాన్ని ఏలా అబద్ధ మనుకో గలను?" జవాబిచ్చాడు శేఖరం.

"ఏదో కొద్దిమంది చేసిన పనుల్ని చూచి, అందరూ అలాంటి వారని భ్రమించడం పొరపాటు." మందలించింది అంతరాత్మ.

"కాదు నేను నమ్మింది నిజమే." ఎదురు తిరిగాడు శేఖరం.

"అక్కడే నువ్వు పొరబడుతున్నావు. చదువుకున్న స్త్రీ జ్ఞానాన్ని సంపాదించిన స్త్రీ, తనజీవితాన్ని యెప్పుడూ, కంటకప్రాయం గావించుకోదు. చేజేతులారా తన జీవితాన్ని భగ్నం చేసుకోదు. యేవ్యక్తియో చేసిన పనిని పురస్కరించుకుని, అలా అందరూ చేస్తారని నువ్వు తీర్మానించుకోవడంలో సబబులేదు. ఒక్కసారి నీలో నీవు ఆలోచించుకో. నీ జ్ఞానాన్ని ఉపయోగించి అసలు విషయాన్ని తెల్సుకో. అందుకు జానకి ఒక ఉపకరణం" అంతర్ధానమయింది అంతరాత్మ.

* * *

బహుశా రెండు గంటలు కొట్టింది గోడ గడియారం. అంతా ప్రశాంత వాతావరణం. కిటికీలోంచి ప్రసరిస్తున్న చల్లని చంద్ర కిరణాలు ముఖంమీద పడుతూంటే, జానకి గాఢ నిద్రలో మునిగివుంది. కాని వరండాలో పడుకున్న శేఖరానికి మాత్రం నిద్రరాలేదు. తను యేదో చెప్పలేని బాధ ననుభవిస్తున్నాడు. ఇంకా తన సమస్య సమస్యగానే ఉండిపోయింది. ఓ ఒడ్డుకు చేరుకోలేక పోతున్నాడు. మనస్సులో జరుగుతున్న భీకర సమరానికి తట్టుకోలేక ప్రశాంతత కోసం పచార్లు చేస్తున్నాడు. ఎదురుగా వున్న గదిలో కిటికీ ఒడ్డున పడుకున్న జానకి ముఖం తనని మరీ కలవర పెడుతున్నది. జానకి సౌందర్యరాశి. నిండు జవ్వని. తనూ యౌవ్వనంలో ఉన్నాడు. తను చేపట్ట గలడు జానకిని. తనవూహాకి జానకి అభ్యంతరం పెట్టదు. కాని, తను యావజ్జీవితం జానకితో గడపాలి. అక్కడే వచ్చింది చిక్కు. జానకి అన్నట్లుగా, తనతో తిరుగుతుందా? తను చెప్పినట్లు

లేని మనస్సుకి నచ్చినట్లు సంచరిస్తుందా? తనకు యెదురు తిరగదు కద? యేమో యెవరు చెప్పగలరు? తనకి యేం నమ్మకం?

జానకి కదిలింది. ఒత్తిగిలింది. ఎవరో వరండాలో కన బడ్డట్టయింది. లేచి చూచింది. మరెవరో కాదు శేఖరమేనని గ్రహించింది.

"ఏం అలా పచారు చేస్తున్నావ్ శేఖరం?"

"ఆఁ... యేంలేదు. నిద్దర పట్టకపోతేను—"

"ఏం... ఒంట్లో యేం బాగో లేదా?"

"అబ్బే! బాగానే వుంది—"

"మరి?"

"యేం లేదు జానకీ. ఓ ఆలోచనవచ్చి—"

"అప్పుడే మూడోగంట కావస్తోందే! యిక్కడ నిద్దర పట్టకపోతే డాబామీద పక్క వేస్తా, పడుకో. చల్లగా ఉంటుందక్కడ" అంటూ బెడ్డింగు పట్టుకొనివెళ్ళి డాబామీద వేసింది. గుడ్డిగా నడిచాడు జానకి వెనకాల. "ఒస్తా పడుకో.... నిద్రలేకపోతే నీఆరోగ్యం చెడుతుంది. మొన్నటిదాకా జ్వరంతో బాధపడ్డావు..."

మెట్లు దిగుతోంది జానకి.

నోటి చివరదాకా వచ్చింది. "జా...న...కీ..." పిలుద్దామా మానుదామా? అనే ఆలోచనలో పిలువలేకపో యాడు శేఖరం.

* * *

దగ్గుతూ యివతలకొస్తున్న రంగాచారిగారు, మెట్లు దిగి వస్తున్న జానకినిచూచి "డాబామీద కెందు కెళ్ళావమ్మా?" అని ప్రశ్నించారు.

"శేఖరం బావకి వరండాలో నిద్ర పట్టలేదుట. డాబా మీద పక్క వేసి వస్తున్నా."

"అతనేడీ?"

"డాబామీదనే వున్నాడు. పాపం ఇంతసేపూ ఇక్కడే పచార్లు చేస్తూ వున్నాడు. ఎంచేతో నిద్రపట్టలేదుట." కూతురు అమాయకంగా మాట్లాడుతున్నందుకు తనలో తానే యిదయి పోయారు. అయితే యేదో అనుమానించ బోయి- మళ్ళీ వూరుకున్నారు—

ఎప్పుడూ- అంటే జానకితో షికార్లుగా వెళుతున్న యీ నెల రోజులనుండీ- కారులో వెళుతూంటే, తను వెనక సీటులో కూచునేవాడు. డ్రైవరు, జానకి- ఫ్రంటు సీటులో కూచునేవారు. జానకే కారు నడుపుతూండేది. కాని, యివాళ మాత్రం డ్రైవరును వెనక సీటులో కూచోమని, తాను జానకి ప్రక్కని కూచున్నాడు శేఖరం. జానకి కారు నడుపుతూంటే, తను ఆమె ప్రక్కని కూచున్నంతసేపూ ఏదో అనిపించేది.

ఇసుక తిన్నెమీద కూచుని, అలల తాకిడికి తట్టుకో లేక సముద్రముమీద యిటూ అటూ ఊయెల లూగుతున్న నావలని చూస్తున్నారు, యిద్దరూను.

"జానకీ- యివాళ మంచి ఇంగ్లీషు పిక్చరొచ్చింది. వెళదామా?"—

"అలాగే- కాని యింకా గంట టైముంది- తరవాత వెళదాం."

"బావా- జీవితాలు కల్లోల పూరితా లెందుకవుతాయ్?"

"................"

"మనం కలిగించుకున్నవా?- లేక స్వతసిద్ధంగానా—"

ఈ ప్రశ్నకు యేం జవాబు చెప్పాలో తెలియలేదు శేఖరానికి.

"స్వతస్సిద్ధంగా - అంటే మన కర్మల ననుసరించి... అనుకుంటా......."

"అదికాదు... మనం అనుకున్నట్టుగా ఈ కర్మ అనేది మన చేతులారా చేసుకున్న కార్యము వల్ల నేకదా నిరూపిత మవుతుంది..."

"అవుననుకో......"

"అయితే.., మన జీవితాలు సుఖవంతం కాలేకపోవ డానికి మన మనస్సే సాక్ష్యం- అంటావా?......"

"అవుననుకో..."

"ఏవో మూఢనమ్మకాలను మనస్సులో వుంచుకుని,

మనం మన చేతులారా మన జీవితాల్ని దుఃఖభాజనాలు చేసుకోవడం లేదా?_ అందిన ఫలాన్ని కాలదన్ని, అందని ఫలాన్ని ఆశించడం, లేనిపోని అనుమానాలతో అందుకున్న ఫలాన్ని పారెయ్యడం_ యిత్యాదులన్నీ మన మానసిక పతనాలకి కారణాలు కావా?"

"జానకీ... అలా నడిచి కాస్త దూరం వెళ్దాం రా..."

ధోరణి మార్చాడు శేఖరం.....

సినిమానుండి వచ్చి ఒకరిచేతు లొకరు పట్టుకుని గుమ్మం యెక్కుతూంటే, వంటవాడు చూచి సంబరపడిపోయాడు. రంగాచారిగార్ని లేపి_ అదో పెద్ద ఘనకార్యంలా చెప్పాడు.

"బాబుగారూ_ అమ్మాయిగారూ, శేఖరంగారూ ఒకరిచేతులొకరు పట్టుకుని రాసుకుంటూ_ నవ్వుకూ_వస్తున్నా రండీ..."

"అలాగా!......" నిరాశచెందిన హృదయంలో ఆశ అంకురించింది. తన నమ్మకం_ అంటే జానకి తన పట్టు సడలించుకుంటుందని_ స్థిరపడిపోతుందన్న ఆశ కలిగింది.

వంటవాడు వడ్డిస్తుంటే_ యెదురెదురుగా టేబిలు ముందు కూర్చుని భోంచేస్తూ కిలకిలా నవ్వుకుంటున్న జానకీ, శేఖరులను చూచి రంగాచారిగారు చేత్తో నోరు మూసుకుని నవ్వుకుంటూ వెళ్ళి వెల్లకిలా పడుకున్నారు. ఒక్కసారి ఆవులించి గుండెమీద చేతులు వేసుకుని కళ్ళు మూశారు.

మామూలుగా వరండాలో పండుకుని మళ్ళీ ఆలోచనల్లో పడ్డాడు శేఖరం. ఇవాళ తను నిర్ణయం చేసుకోవాలి. తన "నమ్మకం" గూర్చి తేల్చుకోవాలి. ఇంతకీ జానకిని వివాహం మాడితే తన జీవితం బాగుపడుతుందా?_ తను అనుకున్నట్లుగా కంటకప్రాయం కాదుకదా? జానకి సుగుణవంతురాలే_ ఉదారురాలుకూడా. విద్యాగర్వంలేదు. ఎంతో సాత్మికురాలు. అయితే తను యింతకుముందు అనుకున్నట్లు_ పెళ్ళి అయ్యేదాకా యిల్లా సాత్మికంగా ఉండి, ఆతరవాత కొంపతీసి యెదురు తిరుగుతుందేమో!? అబ్బే అటువంటి మనిషి కాదు. చాలా ఉత్తమురాలు. తన మేనమామ కూతురే అయినా, అట్టే జానకితో తనకి పరిచయం లేదు. యెప్పుడూ_ తన తల్లికీ, మామయ్యకీ పడేదికాదు. యేదో తనని అన్నాడని, శేఖరం తల్లి, అన్నగారితో మాటలు మానేయడం జరిగింది. ఆతరవాత_ తన తల్లి చనిపోయినతర్వాత రంగాచారిగారే ఓమారు తన యింటికి రావడం_ అక్కడనుండి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూండడం_ అంతే. అంచేత తనకి జానకిని గూర్చి ఆలోచనే లేకపోయింది. కాకపోయినా జానకి, తన దృష్టిలో అందగత్తె. అంచేత తను జానకిని చేపట్టినందువల్ల తన జీవితం సుఖాంతం కావచ్చు. యీవిషయం గూర్చి తనకి ఆవేదన అక్కర్లేదు. అయితే, యీనాటిదాకా, చదువుకున్నదాన్ని పెండ్లాడనని శపథం చేస్తూవచ్చాడే. మరి అందరూ_ తనని ఆడిపోస్తారేమో_ ఛీ! ఛీ_ అలా యెన్నటికీ కాదు. తను యింతవరకూ తప్పుడు అభిప్రాయంలో పడ్డాడు. యిప్పుడు తన తప్పు తాను తెల్సుకున్నాడు. అప్పుడు_ ఆ మూఢత్వంలో_ అలా సంచరించాడు. ఇప్పుడు యీవిధంగా_ తను నిశ్చయించుకొన్నట్లుగా విద్యావంతురాలిని వివాహమాడి తన జీవితం బాగు చేసుకుంటాడు అంతే.

నిజంగా, విద్యావంతురాలు సంసారాన్ని చక్కబరుస్తుందనడంలో_ అనుమానం అక్కర్లేదు. భర్త సంపాదించినధనాన్ని పొదుపుగా ఖర్చుచేస్తూ, అనవసరమైనవాటిని తగ్గించుకుంటూ, అవసరమైనవాటికి వెనుదీయకుండా_ సంసారాన్ని నడిపిస్తుంది, చదువుకున్నదయితే. భర్త, పగలల్లా ఉద్యోగంలోని చికాకులతో, పాడయిన మనస్సుతో ఇంటికొచ్చేసరికి_ ఉచిత రీతిని ఆదరించే విధానం చదువుకున్న స్త్రీకి తెలిసినట్లుగా_ మరో స్త్రీకి తెలియదు. తన స్నేహితురాలితో_ చెప్పిన విషయాలనుగూర్చి_ మనం యేమీ అనుమానించలేం.

ఆలోచనని ముగించుకుని, ఒక్కసారి ఆవలించి, ఒళ్ళు విరిచాడు మంచంమీద లేచి కూచుని. జానకి మంచంవేపు చూచాడు. అక్కడలేదు జానకి. మంచం కాళీగావుంది.

"అయితే, యెక్కడికెళ్ళింది జానకి?" ప్రశ్నించుకున్నాడు. ఏమో?___

వరండాలో నిలబడి_ నాలుగు ప్రక్కలా కలియ చూశాడు. ఎదురుగావున్న పూల మొక్కల మధ్యనున్న సిమ్మెంటు బల్లమీద కూచుని ఏదో ఆలోచిస్తూంది.

# చదువుకున్న జానకి

"జానకి అక్కడికెందుకెళ్ళాలి?- యెవరికోసం తను అక్కడ వున్నది?" శేఖరం మళ్ళీ మనస్సుకి పని కల్పించాడు. అప్పుడే రెండు గంటలు కావచ్చింది. అయితే వెన్నెల మాత్రం పిండారబోసినట్లుగా వుంది.

"యెలాగైనా- జానకి అక్కడికి యెందుకువెళ్ళిందో తెల్సుకోవాలి..." నిశ్చయం చేసుకుని, జానకికి వెనుకగా వున్న చెట్టుమాటున దాగొన్నాడు. ఎవరైనా వస్తారా?__

ఒక పావుగంట కాలం గడిచింది. జానకి ఒళ్ళు విరుచుకుని ఒక్కసారి ఆవులించింది. విరహ గీతం ఆలాపించింది. అందులో శేఖరం పేరు ప్రతిధ్వనించింది.

"అరె- తననుగూర్చి విలపిస్తూంది?- తను యేదో అనుమానపడ్డాడే. అది పుట్టి భ్రమా?__ తను కలలో వున్నాడా?__ కాదే- తను చెట్టుక్రిందవుండి జానకిని చూస్తున్నాడు."

"బావా- నన్ను అనుమానిస్తున్నావా?-"

యెలా చూచింది తనని? తన కోసమే ఆమె అక్కడుందా? అలా అయితే తనని యెందుకు పిలవరాదూ?

"నేను వచ్చానని నీకేం తెల్సు?__"

"కళ్ళున్నాయిగా చూడడానికి-"

"నేను ఇక్కడికి వస్తావని నీకేం తెల్సు?__"

"నువ్వు మంచంమీద కొర్లుతూండడం కనిపెట్టా. పాపం, యేదో బాధపడుతున్నావనుకున్నా. జోలపాట పాడి, నిదురబుచ్చుదామనుకున్నాను; కాని, నిద్దురపోతే, బాధ పడతావని యిక్కడికొచ్చా, నువ్వు యిక్కడికి నన్ను వెతుక్కుంటూ వస్తావని ఊహించాను. నా ఊహ నిజమయింది."

"అమ్మ దొంగా! యింతవరకూ... జరిగిందన్నమాట..."

శేఖరంలోకి దీర్ఘంగా చూచింది జానకి.

వెన్నెట్లో అస్పష్టంగా కనుపించినా, ఆ చూపుమాత్రం శేఖరాన్ని కలవరపెట్టింది.

"నన్ను క్షమించు జానకీ... యేదో మూఢనమ్మకంలో పడిపోయాను. కాని నీప్రవర్తనబట్టీ, నువ్వు యిచ్చిన ఉపన్యాసాలనుబట్టీ, నీస్నేహితురాలు సుశీలకి యిచ్చిన అమూల్యమగు సందేశాల్నిబట్టీ నిజం తెల్సుకున్నాను. స్త్రీ చదువుకున్నదైతే, యిరువురి జీవితాలూ ధన్యత దాలుస్తాయని గాఢంగా నమ్మాను."

జానకి, శేఖరం హృదయంమీద వ్రాలిపోయింది. తన బాహుబంధంలో యిముడ్చుకున్నాడు జానకిని... చంద్రుడు నవ్వుకుంటూ మబ్బుల చాటుకి మాయమయిపోయాడు.



అజ్ఞానాన్ని, మూఢవిశ్వాసాలను, లేమిని, అనిశ్చిత పరిస్థితులను, పరపీడనాన్ని నిర్మూలించే కార్యక్రమమే అభివృద్ధి. __మిస్టర్ ఆషబీ.

ప్రపంచంలో ఏ ఒక్కనికీ తీసిపోని మహాపురుషులు, రాజకీయవేత్తలు శాస్త్రజ్ఞులు, చిత్రకారులు మన దేశంలో వున్నారు. __శ్రీ కొంతిరామమూర్తి.

ఏజాతి ఆత్మ విశ్వాసాన్ని వదులుకో పోదో ఆ జాతి యెప్పుడూ పురోగమిస్తూంటుంది. __శ్రీప్రకాశం.

వ్యక్తి జీవితంగాని, సమాజ జీవితంగాని; జాతి జీవితంగాని....గమనం ముందుకుసాగిపోవడం జీవితానికి సహజ ధర్మం. నిలకడ దాని తత్త్వానికే విరుద్ధం. __శ్రీ నెహ్రూ.

కన్నం వెయ్యడమే దొంగతనం కాదు, కష్టపడకుండా పరాయివాళ్ల కష్టం మీద బ్రతికే వాళ్లందరూ దొంగలే. __బెర్నార్డ్‌షా.

సంస్కృతి అంటే, ఆత్మవికాసము; ఒకరు మరొకరి పట్ల ప్రవర్తిస్తున్న ప్రవర్తన__పరేంగిత పరిజ్ఞానశక్తి - యీ మూడింటి సమాహారము. __శ్రీ నెహ్రూ.

ప్రతిమానవునికీ వాని అంతరాత్మ ఎప్పుడు ఏదో సూచనలిస్తూంటుంది. కాని ఆ అంతర్వాణి హీన స్వరంలో వినబడుతుంది. దానిని అణచి వెయ్యడం మొదలు పెడితే కొంతకాలానికి అది ఇక వినిపించనే వినిపించదు. __గోల్డ్‌స్మిత్.

[సంకలన : "హైమవతి"]




దివ్య దివ్య దివ్య




దివ్య దివ్య దివ్య

# అమృతాంజనము

గాని,

" యథాయథా.................కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగు చున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

# బాలానందం

## ★ ఉడుత ఉపదేశం ★

• శ్రీ కే. నరసింహమూర్తి •

భూమండలములో అధర్మములు, అన్యాయములు పెచ్చుపెరిగినపుడు భగవంతుడు భూలోకములో అవతరించి వాటిని రూపుమాపి, శాంతిని నెలకొల్పు చుండును. ఈవిధముగానే కొన్ని శతాబ్దములకు పూర్వము భారతదేశములో మూర్ఖపు జనులు ఎక్కువైరి. అన్యాయములు మితి మీరి పోయెను. ఆరోజులలో బలవంతుడే భగవంతుడు. బలహీనులు, పేదవారు సంఘములో స్థానము లేక బలవంతుల చేతను పీడింప బడుచుండిరి.

అట్టి క్లిష్ట సమయములో దేశములో ధర్మమును నెలకొల్పుటకుగాను మహాత్ముడైన మహావిష్ణువు శుద్ధోదనుడను రాజుయొక్క ఏకైక పుత్రుడుగా బుద్ధుడను పేరుతో భారతదేశములో జన్మించెను. లేకలేక కలిగిన ఆ బిడ్డను శుద్ధోదనుడు అతిగారాభముతో పెంచుచుండెను. క్రమ క్రమముగా బుద్ధుడు పెరిగి పెద్దవాడై దేశములో ప్రజలు పడుచున్న బాధలను చూచి తన హృదయములో ఎంతగానో దుఃఖించెను. తనతోటి మానవసోదరులు అష్ట కష్టములు పడుతూఉంటే తాను అంతఃపురములో అష్ట అయిశ్వర్యములు అనుభవించుట అధర్మమని తలచెను. అందువలన అతడు ఒక అర్ధరాత్రి వేళలో భార్యా పిల్లలను రాజ్యమును వదలి, మానవబాధలకు ముఖ్యకారణం కనుగొనవలెనని బయలుదేరెను. ఆనాటినుండి అతడు ఎన్నో సార్లు తపస్సుచేసాడు. ఎందరో మహామునులను, పండితులను సంప్రదించాడు. ఎన్నో పుణ్య క్షేత్రాలను దర్శించాడు. కాని తాను ఏవిషయమై సర్వసంగ పరిత్యాగుడై వచ్చాడో, అట్టిమానవ బాధలకు కారణం మాత్రం తెలుసుకొనలేక పోయాడు. తుదకు అతడు విసిగి వేసారి ఇంటికి వెళ్దామని బయలుదేరాడు.

అతడు అలావచ్చుచుండగా త్రోవలో ఒకనది కనపడింది. ఆసమీపంలోనే ఒక ఉడుత తనతోకను నీటిలో ముంచుతు తిరిగి నేలపైదులుపుతూ ఉంది. బుద్ధునకు ఏమీ బోధపడలేదు. బుద్ధుడు వెంటనే ఆ ఉడుతను పిలిచి "ఓ ఉడుత! నీవు ఏమి చేయుచున్నావ్!" అని అడిగాడు. వెంటనే ఆ ఉడుత "స్వామీ! నేను ఈ నది నీటినంతటినీ ఇలా తీసేసి ఈనదిని కాళీచేస్తాను" అనిఅంది. బుద్ధుడు పక్కున నవ్వి "ఓ ఉడుతా! ఇంత పెద్దనది నీటినంతటిని, నీచిన్న తోకసహాయంతో ముంచి, నేలమీద తిరిగి పడేసి, కాళీ చేసేస్తావా? ఎంతవెఱ్ఱితనము" అని అన్నాడు. వెంటనే ఆ ఉడుత బుద్ధుని అపాదమస్తకమును చూచి "ఓ స్వామీ! తమరు చూడగా గొప్పయోగీశ్వరులవలె నున్నారు. నేను ఈనది నీటిని కాళీచేయవచ్చును. చేయలేకపోవచ్చును అది వేరేసంగతి. కార్యముజరుగదు అనిమొదటనే నిశ్చయించి ఆకార్యమును చేయుట మానివేయడం కేవలం పిచ్చితనం. మహాకవి కాళిదాసుగారు ఏమన్నారు! తిరిగి ప్రయత్నించమని చెప్పలేదూ? పట్టుదలగలిగిన ఎడల ఎటువంటి కఠిన

కార్యము నైనను నెరవేర్పవచ్చును. అటువంటి పట్టుదల లేక చికాకుపడువారు ఎటువంటి సులభకార్యము నైనను నెరవేర్పలేరు. ఇదిదైవసందేశం స్వామీ! అల్పజంతువను తమవంటి మహానుభావులకు బోధించు నట్టిదానను కాదు క్షమించండి."

వెంటనే మహావిష్ణుస్వరూపుడైన బుద్ధుడు "ఓ ఉడుత రాజమా! నీవు ఆకారమునకు చిన్నజంతువు ఐనను బుద్ధికి బృహస్పతివి. నాకు చక్కని నీతిని బోధించితివి" అని తిరిగి తపస్సునకు బయలుదేరి కొన్నాళ్ళకు గయలో గల బోధవృక్షము క్రింది జీవన్ముక్తికి కారణం గ్రహించి ఆ తారక మంత్రము మానవులకు బోధించి వారికి మోక్షమార్గము చూపెను. కావున ఓ! బాలులారా! మీరుకూడా ఏదైనా కష్టకార్యమును నిరుత్సాహ పడకుండా పట్టుదలతో చేసిన ఎడల జయము పొందగలరు.

——:o:——

గేయకథ:

## ★ గొడుగుకథ ★

శ్రీ పి. వెం. రమణాదేవి

సూర్యుడస్తమించ గానె
ఎండవేడి తగ్గిపోయె.
వానకారు మబ్బు లెన్నో
ఆకసమునఅలము కొనియె.

చల్లగాలి మేఘములను
చిన్న వర్షముగను మార్చె.
ఒకయింటి పెరటతిరుగు
కండచీమ తడియజొచ్చె.

"అయ్యో! నాదుమేను మిగుల
తడయుచుండె వాననీట.
వణకు కూడ పుట్టెనాకు;
జ్వరము తగులుఁ నిశ్చయముగ".

ఇట్లు తలచి కండచీమ
పెరటి నెల్ల కలయ దిరిగి,
కాంచె నొక్క కుక్క గొడుగు;
యింటి పెంట కుప్ప మీద.

సంతసమున కుక్కగొడుగు
క్రిందచేరి వానబాధ
యించుకేని లేక చీమ
వెచ్చగాను నిదురపోయె.

ఇంతలోనె కందిరీగ
ఒకటి వానబాధ కోర్వ
లేక వచ్చిచేరె చీమ
యున్న కుక్క గొడుగుక్రింద.

చీమనికని కందిరీగ
తన్ను కుట్టు నను భయంబు
నిరికొనంగ చాలసేపు
తలచి యొక్క యుక్తి పన్నె.

చప్పుడేమి చేయ కుండ
మెల్లగాను కుక్క గొడుగు
మొదలు కొరికి దానితోడ
రివ్వుమంచు యెగిరిపోయె.

చిటపటమని పడు చినుకులు
మేలుకొలిపె చీమ నిదుర
కుక్క గొడుగు తోడ బోవు
కందిరీగ కాన బడియె.

ఏమి చేయలేక చీమ
విస్తుపోయి చూచుచుండ,

దేహ మంత తడిసి పోయె
కందిరీగ యుక్తి వలన.

అప్పు డొక్క యుక్తిశాలి
దీనిగాంచి యెండ వాన
బాధ లేమి కలుగ కుండ
గొడుగులు కనిపెట్టె నంత.



#  గర్వభంగము 

* శ్రీ ఐ. వి. గోపాలరావు *

పూర్వం శ్రీరాముడు రాజ్యం పరిపాలిస్తున్నప్పుడు జరిగిన కథ:—

రావణాసురుడు గొప్ప తపస్సు చేసి యనేకములైన గొప్ప వరములు బ్రహ్మదేవుని వలన పొందాడు. అందుచేత రావణాసురుడు నావంటివాడు లేడని గర్వించి అందరిని హింసిస్తుండేవాడు. ప్రక్కనేయున్న వాలి దీనినంతటిని కనిపెట్టి సమయముకొఱకు వేచియుండెను. రావణాసురుడు అందరిని సులభముగా జయించుచుండెను. కాబట్టి యొకనాడాతనికి తనవంటి వానితో యుద్ధము చేయవలెననెడి కోరిక గలుగుట వలన, యొకనాడు గొప్ప బలవంతుడగు వాలితో యుద్ధము చేయుటకు నిశ్చయించి బయలుదేరాడు. వాలి తన నియమము ప్రకారము సంధ్యావందనము చేయుటకు ఉదయముననే తూర్పు సముద్రమునకు బోయెను. పర్వతాకారముగనున్న వాలిని జూచి రావణుడు దొంగతనముగా వానిని పట్టి తీసికొని పోనెంచి వెనకనుండి మెల్లిగా వచ్చుచుండుటను వాలి జూచి తగిన సమయము వచ్చినదని యేమియు చలించక ఆమాదిరిగనే కూర్చుండెను. రావణాసురుడు వాలిని సమీపించి వానిని తన బాహువులతో గట్టిగా పట్టుకొనెను. వాలి దీనిని గ్రహించి దుష్టునితగినట్లు శిక్షించవలెనని రావణాసురుని తన హస్తములతో గట్టిగా బిగించి తన సంధ్యావందనానంతరము సముద్రములోనికి తీసికొనిపోయి వానిని ఒక్కసారిగా వార్ధిలో ముంచెను. ఈ విధముగా మూడు దిక్కులకు బోయి మూడు సముద్రములలోను రావణుని ముంచి ఎగురుచు తన పట్టణము సమీపమున వానిని బడవైచెను. రావణాసురుడు లజ్జచే పారిపోనెంచెను. వాలి అపుడు రావణాసురుని జూచి తప్పు క్షమింపమని కోరెను. రావణుడపుడు యదార్థము చెప్పి మరి తనమీద ఎప్పుడును దండెత్తనని వాలి వద్దనుండి వాగ్దానము తీసికొని తన దారిని బోయెను. కాబట్టి బాలలూ! ఎంత గొప్పవారైనను ఎవ్వరు ఎప్పుడు గర్వించకూడదు.





# పండు ముత్తైదువ

* శ్రీ డి. వి. రామలింగేశ్వరరావు *

అనగా అనగా ఒక అగ్రహారములో సూరయ్య వెంకమ్మ అను ఇద్దరు దంపతులు గలరు. వారింటి ప్రక్కనే వెంకన్న సుబ్బమ్మ అను మరిద్దరు దంపతులు ఉండిరి. ఒకనాడు కాలక్షేపమునకై సుబ్బమ్మ వెంకమ్మ యింటికి వచ్చెను. కొంత సేపటికి సుబ్బమ్మ "మాపెద్ద బావగారింటి వద్ద నుండి నిన్ననే మాయత్తగారు వచ్చినది. పండు ముత్తైదు వనగా ఆవిడయే! అటు వంటి పండు ముత్తైదువకు కోడలి నగుట నాభాగ్యము." అనిచెప్పి వెళ్ళిపోయెను.

వెంకమ్మ వెఱ్ఱిది, వట్టి అమాయకురాలు. తన అత్త గారు విధవది అగుటచే పండుముత్తైదువ అంటే ఆమెకు తెలియదు. సుబ్బమ్మకు వున్నభాగ్యము తనకు కలుగవలె నని అనుకొని ఆలోచించెను. ఒకసారి వెంకమ్మ అమ్మమ్మ మామిడికాయను బియ్యపు డబ్బాలోవేసి పండించినట్లు వెంకమ్మకు జ్ఞాపకమువచ్చెను. కాని తనఅత్తగారిని బియ్యపు డబ్బాలో మామిడికాయ వేసినట్లు వేయుటయెట్లు ?

సరే, ఆరాత్రి తనఅత్తగారినోటిని గట్టిగా గుడ్డతో కట్టి వేసి బలవంతముగా బియ్యపుడబ్బాలో కూరెను. డబ్బా మూతవేసి గదికితాళమువేసి సంతోషముతో పండుకొనెను. మరునాడు ప్రొద్దున "ఈ పాటికి మాఅత్తగారు పండివుండు నని" అనుకొని గది తలుపుతీసి డబ్బాతెరచెను. తీస్తేఏమి వున్నది! పాపము వూపిరి సలుపక చనిపోయిన తనఅత్త గారి శవము కనుపించెను.

తరువాత సుబ్బమ్మ వచ్చి సంగతి తెలుసుకొని "పండు ముత్తైదువనిన వృద్ధురాలయిన పుణ్యస్త్రీ (బ్రతికియుండిన భర్త కలది) కాని బత్తాయిపండువలె ఉండునదియా? లోక జ్ఞానములేనివారు ఇట్లే చెడిపోవుదురు" అనెను. 

# ★ నా ఉడిపి ప్రయాణం ★

• శ్రీమతి గజ్జల రాజమ్మ. •

కళాశాల మూసిన రోజు సాయంకాలము నేను, శారద, దేవకి ముగ్గురం కలిసి బీచికి వెళ్ళాం. అందరూ ఊళ్ళకు వెళ్ళే హడావిడిలో వున్నారు.

మానాన్నగారు రెండోపెళ్ళి చేసికోవడం మూలాన నాకు మావూరు వెళ్ళడం అంతసరదా అనిపించదు. మానాన్నగారుకూడా నేను అక్కడికెళ్ళి పిన్నిచేత మాటలు పడేదాని కన్న ఎక్కడో సంతోషంగా వుంటే చాలంటారు. ప్రతి శెలవులకి నామిత్రుల యిండ్లకువెళ్ళి కొత్త వింతలు, విశేషాలు చూచి ఆనందించేదాన్ని. ఇక శెలవులైపోతుండనగా మావూరువెళ్ళి నాలుగు రోజులుండి వచ్చేదాన్ని. ఈ సారి కూడా దేవకి వాళ్ళవూరు, మలయాళానికి రమ్మనిగోల చేసింది.

శారద వూరు ఉడిపి. ఉడిపి మహాక్షేత్రము. నాకు అక్కడికి వెళ్ళాలని బుద్ధిపుట్టింది. దేవకిని ఎట్లోఒప్పించి యిద్దరం కలిసి ఉడిపి వెళ్ళడానికి నిశ్చయించు కున్నాం. శారదతో మరునాడు వస్తామనిచెప్పాం. శారద ఆరోజు వెళ్ళిపోయింది. మరునాడు నేను, దేవకి, బండి యెక్కి మరుసటి దినం తెల్లవారి 10 గంటలకు ఉడిపి చేరాం.

శారద స్టేషనుకు వచ్చి మమ్మల్ని ఆప్యాయంగా ఆదరించి ఇంటికి తీసుకెళ్ళింది. శారద కుటుంబం మధ్య తరగతికిచెందినది. వాళ్ళ నాన్న ఆవూరి మునసబ్ కోర్టులో హెడ్డుగుమస్తా. శారద వొక్కతేకూతురు, ఇద్దరు తమ్ములు వున్నారు. మానాన్నగారు గొప్పపదవిలో వున్నా నేను శారదతో చాల చనువుగా వుంటానని మిగతావాళ్ళకు గిట్టదు. నాకు శారదంటే చాలాప్రేమ.

మేము వెళ్ళినందుకు వాళ్ళ అమ్మ,నాన్నకు చాలాసంతోషం అయింది. శారదతల్లి మమ్మ ఎంతో ప్రేమగాచూచింది. చిన్నప్పుడే తల్లిని గోల్పోయిన నాకు ఆవిడ మాతృప్రేమ ఆనందమును కలుగజేసినది.

భోజనాలయాక కొంతసేపు విశ్రమించినాము. సాయంకాలము నాలుగయే సరికల్లా ముగ్గురం ముస్తాబయి ఊరి వింతలు చూడడానికి వెళ్ళాం, నా కెమెరా తీసుకువెళ్ళాను. ఆదేశంలో కొండలోయలు, అడవిప్రాంతాలు గలవు. కంటికి సొంపైన దృశ్యాలను తీశాను. మరల దేవాలయానికి వెళ్ళాం. ఆ దేవాలయం చిన్నదైనను చూడ ముచ్చటగా వుంటుంది. రాత్రి శ్రీ కృష్ణుని విగ్రహాన్ని బంగారు తొట్టిలోవుంచి భక్తులు జోలపాటలుపాడి ఊస్తారు. చాల బావుంటుంది ఆదృశ్యం.

ఆవూరు వెళ్ళిన నాలుగో రోజు నేను, నా మిత్రురిద్దరు కలిసి ఊరిబయటకు షికారువెళ్ళాం. ఒక మైలు వెళ్ళేసరికి గొల్లగూడె మొకటి కనిపించింది. మేము ఆపల్లెలోపలికి వెళ్ళాం. ఆ వూరినడుమ పెద్దమఱ్ఱిచెట్టు. ఆచెట్టుచుట్టూ ఒక అరుగు. ఆ అరుగుపై ఒకపటముంచి ఆవూరి ఆడా, మగా, పిల్లా,పీచూ. అంతాచేరి కన్నడములో పాటలుపాడి భజనలు చేస్తున్నారు. నాకు ఇలాంటి వింతవిషయాలు తెలుసుకోవలెనని సరదామెక్కువ. శారదను అడిగాను. నాకు కన్నడంరాదు. శారద వో వృద్ధ గొల్లవాని పిలిచి యేమి విశేషమని అడిగింది. మేము ఆ పటము పక్కకు వెళ్ళిచూచాం. ఆ పల్లె జనమంతా మమ్మ వింత పుర్గాల్ని చూచినట్లు చూడసాగారు. ఆపటంలో వొవృద్ధుడు పాట పాడుచుండ, శ్రీకృష్ణుడు నృత్యము చేయుచుండెను. ఆ వృద్ధగొల్లవాడు శారదతో కన్నడములో చెప్పినది నాకు ఆవిడ తెలుగులో చెప్పింది.

పూర్వము సుమారు నూరేళ్ళ క్రితం ఆపల్లెలో చెన్నప్పయను గొల్లవాడొకడుండేవాడట. రోజూ అతడు ఆవులు మేపుకొని సాయంకాలం యింటికొచ్చి ముంగిట్లో కూర్చొని "ఉడిపి కృష్ణరాయారా, రా. నేను పాట పాడెదను, నీవు నాట్యమాడుదువు. రా," అనేవాడట. వానికి భార్యలేదు. కూతురొకతె నాన్నకు వండిపెడుతూ వుండేది. ముసలాడు కేకపెడుతూనే ఘల్లుఘల్లుమనిగజ్జెలు మోగిస్తూ చిన్నికృష్ణుడు వచ్చి నాట్య మాడేవాడట ముసలివాడు తన్మయుడై పాటలుపాడేవాడు. కొంతసేపు ఇలా ఆటా, పాటా, అయిన తరువాత ముసలివాని కూతురు గంజితెచ్చి కొబ్బరి చిప్పలలోపోసి, యెండినమామిడికాయ ముక్కలు నంజుకోను వేసేదట. శ్రీకృష్ణుడు మరింతగంజి పోయించుకొని త్రాగి ఆతండ్రి కూతుళ్ళతో కొంతసేపు ఆడుకొని మరీవెళ్ళేవాడట.

ఉడిపిలో ఆకాలంలో గుళ్ళోపూజ సన్యాసి చేసేవాడట. ఇపుడు కూడా అక్కడ సన్యాసులే పూజచేస్తారు. ఆసన్యాసి

గొప్ప పండితుడు, శాస్త్రాలంతా తిరగవేసినవాడు. ఆచార శీలుడు. ఈ గొల్లవాని సంగతి ఆపుట్టుపట్ల అందరికి తెలిసింది. ఎవరైనా అన్యులు చూస్తే చిన్నికృష్ణుడు ఆడడుట, అప్పుడు గొల్లవాడు పరాయివాళ్ళను పంపివేస్తూ వచ్చేవాడట. ఈకథంతా సన్యాసికి శిష్యులు చెప్పారు. ఆయన ఆశ్చర్యపోయాడు. "నావంటి పండితుడు ఈప్రాంతంలో లేడు. నేను యెంత నియమ నిష్ఠలతో సక్రమంగా పూజ చేస్తాను. నాకు ప్రత్యక్షం కాకుండా గొల్లవానికి ఎలాకనబడుతాడు భగవంతుడు. నాశిష్యులను పంపి విచారింపవలయును. లేక వీరు తెలియక చెప్పుచున్నారేమో!" అని యోచించి గొల్లవాని రప్పించినాడు. గొల్లవాడు భయంతో గడగడవణుకుచూ సన్యాసి ముందర నిలబడ్డాడు. సన్యాసి గర్వంతో "ఓరీ! నీకు కృష్ణుడు కనిపించి నాట్యమాడుతాడటరా? నిజమేనా! లేక జనులను మోసగించను ఈ దొంగవేషాలు వేస్తున్నావా?" అని గద్దించాడట. గొల్లవాడు "స్వామీ! ఏపాపము యెరుగను. నాచిన్నతనం నుండి నేను పాడితే నాదేవుడు కృష్ణమూర్తి వచ్చి నాట్యమాడేవాడు. నాకు జనులను మోసగించి యేమికావలయును? నాదేవుడు నన్ను మోసం చేయనంతవరకు నాకు భయములేదు." అనిచెప్పాడు. సన్యాసికి కోపము, ఈర్ష్య ఎక్కువయినవి. అతడు అలక్ష్యభావముతో "నీకుఅంత సులభముగా కనపడే ఆ దేవుణ్ణి యిప్పుడు కనబడమను చూద్దాం" అన్నాడు, "పరాయి వాళ్ళుంటే నాచిన్నిదేవుడు రాడు" మీరు ఆయన భక్తులు గనుక మీకుకనబడ వచ్చు, మీశిష్యులను బయటికి పంపివేయవలయును" అని మునలాడన్నాడు. సన్యాసి హేళనగానవ్వి "ఓరీ నీదేవునికి అంత పక్షపాతమా? నాశిష్యులను పంపివేసెదను, నాకు కనపడక పోడు దేవుడు. ప్రతిదినం నియమము తప్పక పూజచేస్తే నాకు కనబడడా?" అని అహంకారముతో అని శిష్యులను పంపివేసెను.

గొల్లవాడు కండ్లు మూసుకొని పాడనారంభించెను, ఎంతసేపు పాడినా గజ్జల సవ్వడి రాలేదు. వేణునాథం వినిపించలేదు. సన్యాసి ముఖములో కోపము, పరిహాసం, అలక్ష్యం అన్నీ తాండవిస్తున్నవి. గొల్లవాడు కండ్లు విప్పి "హా నా తండ్రీ! నామీద నీకెందుకింత కోపము? నేను నీకు యేమి యపచారము చేసితిని. చెప్పు. నాచిట్టితండ్రీ!" అని ఏడవనారంభించినాడు. పొరలి పొరలి వచ్చు దుఃఖమును అణుచుకోలేక పడిపోయాడు. స్వామి రాలేదు, సన్యాసి శిష్యులను పిలిచి "ఈ పిచ్చివానిని బయటికి నెట్టండి" అని వెళ్ళిపోయాడు. గొల్లవాడు యింటికి వెళ్ళి అన్నం, నీరు, ముట్టుకోక ఏడుస్తూ పడుకొన్నాడు. కొంత సేపయాక ఘల్లు ఘల్లు మని గజ్జల సవ్వడి విని అదిరిపడి లేచాడు గొల్లవాడు. చిన్ని కృష్ణుడు, పీతాంబరమును దాల్చి, వనమాలాలంకృతుడై మందస్మిత వదనారవిందుడై అధరమునందు వేణువు నుంచుకొని నిలబడి యున్నాడు. గొల్లవాడు ఒక్క గంతులో వెన్న దొంగను పట్టుకొని ఎత్తుకొద్దాడి ఆనంద భాష్పములను జల జల కారుస్తూ తానే నాట్యమాడ మొదలిడెను. ఆ యానందము కొంచెముపశమించిన వెనుక "తండ్రీ? నేను దేవళంలో అంతగా పిలుస్తే రాకపోతివే నీకేల అంత బిగువు?" అని నిగ నిగ మెరిసే ఆ కపోలమును తనివితీర ముద్దాడెను. "తాతా! నన్ను అందరి ముందరా వచ్చి ఆడమంటివా? నీవు నాప్రియుడవు. నేను అందరికీ సులభుణ్ణి కాను," అన్నాడు. యథాప్రకారం ఆటా, పాటా, గంజి త్రాగడం అంతా జరిగింది. ఇక్కడ సన్యాసి అహంకారం కొద్దీ ముసలివాణ్ణి తిరస్కరించినాడు కాని మనస్సులో "ఇంత మంది చెప్పినది అబద్ధమగునా? మరి నాకేల కనబడలేదు. నేను అంత పాపాత్ముడనా? ఎట్లైనను ఆ ముసలివాణ్ణి మంచి చేసుకొని ఆ దృశ్యం చూడవలయును" అని అనుకున్నాడు. కాని పరువుకారం అయిన్ని ముసలివానింటికి పోనిచ్చుటకు సమ్మతించలేదు. రాత్రిం బవళ్ళు యిదే చింత పడిందాయనకు. ఒక రోజు సాయంకాలము యెవ్వరికీ తెలియకుండా వెళ్ళి ముసలివాని గుడిసె వెనుక భాగంలో వుండే కిటికీలోనుంచి చూచాడు. ఆహా! అద్భుత మైన దృశ్యం కనపడింది. సన్యాసి పరవశుడై నిలుచుండిపోయెను. ఇంతలో భగవంతుడు అంతర్ధానమైపోయెను. ముసలివాడు చకితుడై నాలుగు మూలలూ కలయ చూచి సన్యాసి నిలుచుండుట కనుగొని ఆయనను లోనికి తీసుకెళ్ళెను. నమస్కరించి "యేమి విశేషమని" అడిగాడు. సన్యాసి భాష్ప పూరిత నేత్రుడై "నాయనా చెన్నప్పా! నీవు ఎంత భాగ్యశాలివి. బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరులకైనా అబ్బని ఆభగవంతుని సాంగత్యం నీ కబ్బినది, నేను అహంకారముతో నీభక్తిని తూలనాడితిని, నన్ను క్షమించు. ఎట్లైన నాకు ఆయన దర్శన మొక్కసారి యగునట్లు చేయుము," అని చాలా దీనముగా అడిగాడు.

"అలాగే రేపు నా దేవుని అడుగుతాను" అన్నాడు. మరునాడు భగవంతుడు వచ్చిన వెంటనే ముసలివాడు

సన్యాసి కోసమై బ్రతిమాలెను. గోవిందుడు ఎంతో సేపు సన్యాసికి దర్శనమిచ్చుటకు ఒప్పుకోలేదు. ఎట్టకేలకు "నేను యే రూపములో కనబడినా సమ్మతించవలయును" అని చెప్పాడు హరి. మరునాడు సన్యాసితో శ్రీ హరి చెప్పిన మాటలు ముసలివాడు చెప్పాడు.

సన్యాసి సంతోషంతో గుడికి వెళ్ళి స్నానంచేసి పళ్ళు, పూలు అంతా సిద్ధం చేసి వుంచి కళ్ళు మూసుకొని జపం చేయుట మొదలెట్టాడు. ఒంటినిండ గజ్జితోనూ, తోక తెగి నెత్తురు కార్చుకుంటూ ఒక నల్లకుక్క వచ్చి సన్యాసి పై వుత్తరీయమునకు తన తోకను రాచుకొంటూ నిలబడింది. సన్యాసి కళ్ళు విప్పి చూచాడు. కోపము మితిమీరిపోయినది. ప్రళయకాలరుద్రుని వలె పక్క నున్న దండముతో ఆ కుక్కను చావ మోది తరిమి వేసెను మరల స్నానము చేసి శిష్యులను కాపలాపెట్టి జపమునకు కూర్చుండెను. ఆ రోజంతా ఆహారము చేయక చూచి చూచి సన్యాసి కళ్ళు కాయలు కాచెనుగాని ఆ పరంధాముడు రాలేదు. సాయకాలం ముసలివాని యింట్లో మాధవుడు వచ్చిన వెంటనే "తాతా! మంచి వానికే నన్ను దర్శనమీయమంటివి చూడు నా వొళ్ళంతా హూనం చేశాడు. నాదేహమంతా కందిపోయింది యని చూపెట్టాడు. అతి కోమలమైన ఆ శరీరము కమిలి అక్కడక్కడ నెత్తురు గాయాలు కన్పించినవి. ముసలివాడు ఆదరించి ఆ గాయాలకు మందు వేసి విసరెను. శ్రీకృష్ణుడు కొంత సేద తీర్చుకొని ఆటా, పాటా అంతా యథావిధిగా జరిగిన వెనుక వెళ్ళిపోయాడు. సన్యాసి మరునాడువచ్చి "చెన్నప్పా నిన్న సాయంకాలం వరకు చూచి చూచి నాకళ్ళు కాయ కాచిపోయినవి. దేవుడు రాలేదు. ఏమికారణమో చెప్పు" అన్నాడు. "స్వామి నామాట తోసేయక గోపాలుడు వస్తే మీరు ఆయన వొళ్ళు హూనం చేశారట. నాతండ్రి దేహమంతా కమిలిపోయినది." అని బోరున యేడ్చాడు. "నాయనా! నిన్నపొక గజ్జి కుక్క తప్ప వేరొక పిట్టయైనరాలేదే? నామడుగు చెడినందుకు ఆ కుక్కను కొట్టిన మాట నిజమే" అన్నాడు. "నా దేవుడు యే రూపములో కనబడినా ఒప్పుకోమనలేదా!" అని అన్న ముసలివాని పాదములపైబడి ఆసన్యాసి చాలా విచారించాడు. పిదప అహంకారం చంపుకొని సన్యాసి ఏకాగ్రచిత్తంతో కొలిచి ముసలివానికి సేవచేస్తూరాగా భగవంతుడు ప్రత్యక్షమై అతనికి మోక్షమొసగినాడట. ఆపల్లె జనులంతా ఆముసలివాణ్ణి దేవునిగా భావించి ఉత్సవాలు జరుపుకుంటారట. ఇప్పటికీ ఉడిపి గుళ్ళో పూజచేసే సన్యాసులు వచ్చి ఈతియనాళ్ళను జరుపుతారట. ఈ కథ విని మేము ముగ్గురం కొంతవరకు నిశ్చేష్టులై మళ్ళీ తెప్పరిల్లుకొని ఆగొల్లవాని భక్తిని ప్రశంసిస్తూ ఇల్లు చేరాం. 

# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

• శ్రీమతి కె. యమ్. సౌందర్యవల్లి •

——:o:——

కీర్తనము

కళ్యాణిరాగం — రూపకతాళం.

ఆరో॥ స రి గ మ ప ద ని స — అవ. స ని ద ప మ గ రి స

ప॥ వరకవి శ్రీత్యాగగురుని, వర్ణింపవె మనసా ॥వర॥

అ. ప॥ ధరసుతా విభుడగు రాముని, తారకనామము బాడిన॥

చ॥ అహరహమును హరిపూజల
నానందముతోజేసి
ఇహపరసుఖ మొసగనరుల
కిలనుకీర్తనామృతమొసగిన ॥వర॥

| 0 | /4 | 0 | /4 |
|---|---|---|---|
| ప॥; ప మ | ; గా రీ సా . | రీ . రి | గా గా గా ; |
| వ ర | క వి శ్రీ | త్యా . | గు రు ని ; |
| ; గా | ని ద ని ద పా మా | గ రి ప మ | గ రీ సా ని స రి |
| వ | ర్ణిం . . . ప వె | మ . న . | సా . . . . . |
| గ మ (ప మ) | | | |
| . . వ ర | | | |
| అ॥ప॥; ని స | స సా స ని ద ప మ | పా ద ని | సా ; సా సా |
| ధ ర | సుతా . . . వి భు | డ గు . | రా ము ని |
| సా ; | సా నీ దా పా | పా ప మ | ద ద ప మ గ రి ని రి |
| తా | ర క నా . | మ ము . | బా . . . డి . న . |
| గ మ . (పమ) | | | |
| . . (వర) | | | |
| చ॥; ప ప | పా పా పా పా | పా ద ని | ద ప పా పా మా |
| అ హ | ర హ ము ను | హ రి | పూ . . జ ల |
| ; మ ప | దా నీ సా సా | స ని సా | రి స ని ద ని స సా |
| నా . | నం ద ము | తో . . | . . . . చే . సి |

అ. ప. వలె

ఇహపర సుఖమొసగ నరుల

కిలనుకీర్తనామృత మొసగిన ॥వర॥

# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

కీర్తన-6

రాగం తోడి, రూపకతాళం.

ఆరో॥ స రి గ మ ప ద ని స అ॥ స ని ద ప మ గ రి స

ప॥ గీతాశాస్త్ర తత్వవేద్యుడే, సంగీతశాస్త్ర తత్వవేద్యుడే

అ॥ ప॥ పాతకముల దీర్చు త్రోవజూపు త్యాగరాజు సంగీత॥

చ॥ గానసుధారసము నొసగి, మానవమాత్రులనుత్రోవ
మానసమున రాముదలచి. ధ్యానమలర జేసినకవి ॥గీ॥

| 0 | /4 | 0 | /1 |
|---|---|---|---|
| ప॥ ; సా | సా ప ప మ గ రీ | సా సా | దా నీ సా స రి |
| గీ | త శా . . . స్త్ర | త త్వ | వే ద్యు దే సం |
| గ మ పా | పా ప ప మ గ రీ | సా సా | స, రీ ప మ గా ॥స॥ |
| . . గీ | త శా . . . స్త్ర | త త్వ | వే . ద్యు . దే ॥స॥ |
| అ॥ప॥ ; ప ద | నీ దా పా మా | దా పా | నీ సా ; సా |
| పా . | త క ము ల | దీ . | ర్చు త్రో వ |
| దా రీ | సా స ని దా దా | స ని ద ప | మా ద ప ప మ గ రి |
| చూ | పు త్యా. . గ | రా. .. | జు సం. . . . . |
| గ మ పా | | | |
| . . గీ॥ | | | |
| చ॥ ; మా | మా మా మా ; | ; గా | మా మ గ రి గ మా |
| గా | న సు ధా | ధా | . ర నొ . స గి |
| ; గ మ | దా మా మా ; | గా గా | గా ప మ గ రి సా |
| మా . | న వ మా | త్రు ల | ను త్రో . . . వ |

అ. ప. వలె
మానసమున రాముదలచి
ధ్యానమలర జేసినకవి ॥గీత॥

---

## ★ అన్వేషణ ★

* శ్రీ బి. వి. నరసింహారావు *

వెన్నెల విరిసినరేల
కన్నుల నర్తుులురాల

ముగ్గురు చెలులనుకూడి
మురిపెంపుల వగలాడి
రాధారాణీ వచ్చెను
మాధవు కనుగొన జొచ్చెను.

వేణువు నూదేవాడే
ప్రాణము చేదేవాడే
ప్రభువుల దర్శన వేనే
పడతికి జీవితమేనే ॥

# ★ దుర్గమ దుర్గాలు ★

రచన : శ్రీ బి. విశ్వేశ్వరరావు బి.ఎస్.సి.

శాంత పెండ్లి విషయం విషమసమస్యై కూర్చున్నది శివరామదాసుకు. ఆఫీసులో కూర్చుని నాల్గు పంక్తులు వ్రాసేటప్పటికి అనుకోకుండా కలం నిలబడిపోయేది. అతని తలలో ప్రకృతి విలయ తాండవం చేసేది. పనిలో అశ్రద్ధయిపోవుటచే అధికారుల దావానలం చెలరేగింది. పట్టభద్రుడైనా గుమాస్తాగా కృశించిపోతున్నాడు. తానో యింత చదువుకున్నవాడు, అందుచే శాంతని ఏపట్టభద్రుని చేతుల్లోనో పెట్టాలనివుంది. కట్నాలియ్యకపోతే కళ్యాణం కాదాయె!

ఆవేళ ఆదివారమగుటచే శివరాందాసు ఇంట్లోకూర్చొని ఆఫీసు కాగితాలు చూచుకుంటున్నాడు. ఇంటికి యెదురుగుండా ఆవీధిలోని అమ్మలక్కలు సమావేశం అయి లేని సమస్యలను వితర్కిస్తున్నారు. కమలమ్మ, శాంత తల్లి వీధిలోనికి తుక్కు పారబొయ్యడానికి వచ్చేసరికల్లా సభ ప్రెసిడెంటు సుబ్బమ్మ "ఏమండోయి కమలమ్మగారు-రండీ" అంది కథ కోసం. "ఇంట్లో పని వుంది" అంది కమలమ్మ. ఆమెకి కమిటీలు అంటే రుచిలేదు.

"ఏమిషే, మాకు బూరెముక్క లెప్పుడు పెట్టావ్-నోరు తెరుచుకొని కూర్చున్నాం?" అంది వెంకమ్మ పెద్ద రికంచేస్తూ.

"మీపెద్దల ఆశీర్వాదం యెప్పుడు ఫలిస్తే అప్పుడు" అంది కమలమ్మ.

"అదేమిషే! మన తాహత మంది కాని పెద్ద పరుగులికి పోతే అలసిపోముటే- మొన్న సుబ్బారావు పెద్ద కొడుకు, సుదర్శనం కిస్తామన్నారుటగా? ఆఁ! వాళ్ళెక్కడవాడు. M. Sc. చదువుతున్నాడు. ఏ మూడ్నాల్గువేలో లాగుతాడు— మనం తూగగలముషే" అంది వెంకమ్మ కథ పెంచడానికి.

కమలమ్మ మౌనం. వెంకమ్మ యెత్తుకుంది. "నా మొగుడు బి.ఏ. ప్యాసయ్యాడని— నీ బొటికూ్క్కడా రమ్మంటే వస్తాడా బి.ఏ. గాడు- ఏం సత్యకాలమే!"

కమలమ్మ కప్పుడే గుడ్లలో నీరుతిరిగింది. శాంత పిలవగానే లోనికి వెళ్ళిపోయింది. చావిట్లోకి వచ్చి పయిట కొంగుతో కన్నీరు తుడుచుకొంది కమలమ్మ.

అమ్మలక్కలకి అంశం దొరికింది విమర్శనలకి—

"అంతకంతకి అలా పెరిగిపోతున్నది పిల్ల— మాపిల్లలందరికి పెద్దవాళ్ళవకుండానే ముడిపెట్టేశాము. ఇదేంటమ్మా. యిలాంటిదెప్పుడూ చూడలేదు. కాని తాహతుకు పోవడం" అని అంది రెండుచేతులతో దోచే గూడ్సు క్లార్కు భార్యామణి.

శివరాందాసు చెవుల్లో ఇవన్నీ పడ్తున్నాయి. అతని ఆలోచనలు ముందుకు సాగుతున్నాయి. కాని అతని కలం నడవడంలేదు. ఒక్క నిట్టూర్పు విడిచాడు.

"ఏ పుల్లయ్యకో-గిల్లయ్యకో యిచ్చేయాలి కానీ ఏమిటీ వెర్రివేషాలు- ఇంట్లో కుండలు డింకీ కొడుతున్నాయి! పుట్టికి యెగరలేనమ్మ స్వర్గానికి ఎగిరిందట! ఇదంతా ఆయనగారి ప్రతాపమే!" అంది యిచ్చకాల బుచ్చమ్మ.

శివరాందాసు మరి ఆమాటలు వినలేక పోయేడు. చెవులు రెండూ గట్టిగా మూసుకొన్నాడు. అతని హృదయాన్ని కణ కణ కాల్చిన సూలాల్తో పొడిచినట్లయింది. కాగితాల దగ్గర నుండి కదిలి మంచంమీద పడుకున్నాడు చేతులు తలమీద పెట్టుకొని. ఇంతలో శాంత గదిలోకి వచ్చి "నాన్నా, అమ్మ కాఫీకి రమ్మంది" అని అంది. అతను పల్కలేదు. తండ్రి ముఖంలోకి చూసింది. అతని చెక్కిళ్ళపై కన్నీటి చుక్కలు నిలచి ఉన్నాయి. విచారంతో "నాన్నా! నాన్నా!" అని పిలచింది శాంత. అతను కళ్ళు విప్పి చూశాడు. కాగితాలన్నీ యెగిరి గదిలో చిందరవందరగా పడున్నాయి.

"నాన్నా కాఫీకి"

"ఇవాళనుండి కాఫీ పెట్టవద్దన్నానుకదమ్మా"

"నీకొక్కరికే నాన్నా--నీకు పనిజాస్తి"

## దుర్గమ దుర్గాలు

"నాకూ వద్దు"

ఇంతలో కమలమ్మ భర్తకి కాఫీ పట్టుకొని రానే వచ్చింది. శాంత పయికి పోయి 'ఆంధ్ర మహిళ' తీసి చదువబోయింది. అమ్మా, నాన్నా తన పెళ్ళి విషయం మాట్లాడుతున్నారు. వారిలో నిరుత్సాహము— అశక్తి సుగోచరమగుతున్నాయి. శాంత వారి మాటలు విని ఆలోచించింది. తన స్నేహితురాలు దగ్గరనుండి తెచ్చిన "ఆంధ్ర మహిళ" తిరగేసింది. దానిలో "స్త్రీ విద్య—వరకట్నాలు" అనే వ్యాసాలు పదేపదే చదివింది. నిరుత్సాహాన్ని పారద్రోలి- ధైర్యంతో తానాలోచించిన పథంలో ముందంజ వేయదలచింది. విమల దగ్గరకెళ్ళింది. ఆమె S. S. L. C. ప్యాసయింది. ఆమె దగ్గర ఎ-బి-సి-డీలు మొదలు పెట్టింది. రెండవ ఫారం చదువుతున్న చిన్న తమ్ముడు- ఐదవ ఫారం చదువుతున్న పెద్ద తమ్ముని సహాయంతో విద్య నేర్వడానికి కంకణం కట్టింది.

శాంత నిద్రాహారాలు మాని చదువులో కృషిచేస్తున్నది. ఏడాది గడిచింది. రెండో యేడు మెట్రిక్యులేషన్‌కు కూర్చొని ఉత్తీర్ణురాలైంది. ప్రతీ సబ్జక్టులోను 60, 70 మార్కులు వచ్చాయి. విమల తండ్రి కాలేజీ లెక్చరర్. శాంతని యింటరు చదవమన్నాడు. తాను స్కాలర్‌షిప్ ఇప్పిస్తానన్నాడు. శాంత తండ్రి దాని కంగీకరించాడు. శాంత కాలేజీలో చేరింది. కాలేజీ వాతావరణం ఆమెకు కొత్తగా యుండటమువల్ల కొంత బాధ అనిపించిందామెకు. కాని రాను రాను దాని కలవాటు పడిపోయింది.

నళినీకాంత్ బి. యస్. సి. విద్యార్థి, కాలేజీ మెట్లు దిగుతున్నాడు. శాంత తొందరగా మెట్లెక్కబోయి జారి పడింది. నళినీకాంత్ ఆమెను లేవనెత్తి, పడిన పుస్తకము చేతికిచ్చాడు. శాంత "థేంక్స్" అంది కంగారుగా. నళినీకాంత్‌ను కాలేజీ యందరికీ తెలుసు. అతను సజ్జనుడు- సరస్వతీదేవి ముద్దు బిడ్డడు— కాలేజీలోని ప్రథమ బహుమానాలన్నీ అతనివే!

"దెబ్బ తగలలేదు గదా" అన్నాడు.

"లేదు- థేంక్స్" అంది శాంత సిగ్గుతో.

వారి నేత్రాలు మధుర భావాలతో కలిసాయి. సహజముగా శాంత అందమయినది. శ్వేతవర్ణి. ఆ సువిశాల కాటుక కళ్ళకి మానవులను మైమరపించే గుణం వుంది.

కాలేజీ యూనియన్ ఎలక్షన్సు వచ్చాయి. నళినీకాంత్ తరపున ప్రెసిడెంటు పదవికై ప్రచారం చేసింది శాంత. నళిని ప్రెసిడెంటు అయాడు. శాంత గర్ల్సు రిప్రజెంటేటివు అయింది. శాంతా నళినీకాంతుల హృదయాల్లో తెలియని ప్రేమబంధమేదో యేర్పడింది.

ఆనాడు కాలేజీలో సందడిగాయుంది. కొత్త లెక్చరర్ వచ్చాడు. శాంత లేబరేటరీలోనికి వెళ్ళింది. గంటకొట్టారు. సూటులో కొత్త లెక్చరర్ ప్రత్యక్షమయాడు. శాంత నిర్ఘాంతబోయింది. ఆమె గుండె దడదడ కొట్టుకుంది. "అతను! అతను! సుబ్బారావుగారి కొడుకు — సుదర్శన్ ఎమ్. ఎస్. సి.!— కట్నాల పేరాశతో అందాలరాశిని తన్ను పెండ్లికి తృణీకరించాడు!"— కాని సుదర్శన్ శాంతను పోల్చలేదు. అతను శాంత రాత్రీ మెట్లెక్కుతుందని కలలోగూడ అనుకోలేదు!

విధి! సుదర్శన్ దృష్టి శాంతమీద పడింది. ఇప్పుడు పూర్వపు శాంత కాదు- నూత్నజోత్సాహిత! అందరికీ ప్రేక్టికల్ 5 నిముషాలు బోధిస్తే- శాంతకి అరగంట చెప్పేవాడు సుదర్శన్. శాంత ఏవగించుకొనేది.

శాంతని ఆనాడు తన గృహానికి ఆహ్వానించాడు నళినీకాంత్. శాంత లోకాన్ని చూసి భయపడినా అంగీకరించింది. నళినీకాంత్ గృహాన్ని చూసి శాంత ఆశ్చర్యపోయింది. అతని వేషభాషలు- అందరిలో కలసి మెలసి తిరగడంచూస్తే అతను సామాన్య కుటుంబీకుడేమో అనుకుంది. కానీ— నళినీకాంత్ ధనవంతుని ఏకైక బిడ్డడు— శాంత ఆదివ్య భవనములోనికి ప్రవేశింపడానికి సందేహించింది. 'ఏమి' అన్నట్టు నళిని చూసాడు.

"బీదవాళ్ళకు- ధనవంతులకు హస్తిమస్తికాంతరము తేడా వున్నది - నేను బీదదాన్ని రాలేను క్షమించాలి" అంది శాంత.

"అవును తేడా వుంది" అన్నాడు నళిని. శాంత ఆశ్చర్యపోయింది.

"తేడావుంది- హృదయంలో- కాని లోపరికి రా" అన్నాడు నళిని.

నళినీకాంత్ శాంతని తన గదిలోనికి తీసుకొనివెళ్లాడు. గదంతా కళా నిలయంలా వుంది. ఒక ప్రక్క పూర్తి కాని శిల్పాలున్నాయి. రెండవ ప్రక్కన చిత్రలేఖన

సామగ్రి యుంది. బల్లపైని శిల్పాలు- గోడలకి చిత్రాలున్నాయి. ప్రతిచిత్రం- ప్రతిశిల్పం ఒకటే తెల్పుతున్నాయి. అది "మానవత్వం."

"ఇదంతా మీ కళాసృష్టియేనా" అంది శాంత ఆశ్చర్యంగా.

"అవును- నా సాంగత్యంవల్ల కళ కింకా చిన్నెలు, వన్నెలు తీర్చాలి శాంత"

"అయితే మీరు కళాకారులు కూడానా?"

"కళ నాగరికతకు ప్రథమసోపానం— నాగరికత అంటే సూట్లు వేసుకోడం కాదు- మేకప్ కాదు! విశాల హృదయంతో హయ్యర్ లెవెల్స్‌కు పోవడం."

"అబ్బా!" అంది ఏదో పట్టరాని ఆనందంతో శాంత.

రోజులు దొర్లుతున్నాయి. శాంతా నళినీకాంతుల హృదయసీమల్లో ప్రేమ వెల్లి పొర్లి పొంగుతున్నది. అసలే శాంత సౌందర్యవతి. నళినీకాంతుని కళాహస్తములలో ఆమె నూత్న ప్రభలతో వెలుగుతున్నది. నళిని ఆమెను మోడల్‌గా చిత్రాలు గీస్తున్నాడు. పత్రికలు అతన్ని శ్లాఘించాయి. శాంత జీవిత ప్రాంగణంలో రంగవల్లికలు విరిసాయి.

సుదర్శన్ కాలేజీలో శాంతను జూచి చిరునవ్వు నవ్వుతుండేవాడు. శాంత ఏవగించుకొనేది. సుదర్శన్ తన హృదయాన్ని శాంత కెరిగింప దలచాడు.

శాంత యింటికి ప్యూను ఆనాడు వుత్తరం తెచ్చాడు. శాంత విప్పి చూసింది. సుదర్శనుని ప్రేమ లేఖ. దానిని నేలకు విసిరి కొట్టింది.

కాలం దొర్లుతూంది. సుదర్శన్ శాంతని వదలదలచలేదు. నయాన్ని కాకపోతే భయాన్నయినా లొంగదీయ దలచాడు.

కొన్నిరోజులైె శాంత కాలేజీలో కనబడటంలేదు. సుదర్శన్‌కు ఆనాడు ఉత్తరం వచ్చింది- "శాంత" అని యుండడం చూసి ఆతృతగా విప్పాడు.

సుదర్శన్,

నమస్కారము- నీవు గొప్పవాడివి- నేను బీదదానిని. మన యిద్దరికీ హస్తిమసికాంతరం తేడా యున్నదని ఆనాడు చెప్పేవు. (సుదర్శనునకు ఆశ్చర్యం వేసింది. 'ఎవరా శాంతని') విశాల హృదయుడే లోకంలో గొప్పవాడు! నాగరికుడవు నువ్వు, అజ్ఞానివి- ధన కఠారితో మానవ సమానత్వాన్ని తెగనరికావు! కట్నాలకాంక్షతో పేదగృహ మేధుల్ని సమాధిచేయదలచావు! నీవు చదువుకున్న మూర్ఖుడివి! నీకు లోకజ్ఞానంలేదు! నీలాంటివాడ్ని పెళ్ళాడడం కంటే ఆత్మహత్యచేసుకుంటేమేలు! స్త్రీ ముందడుగు వేస్తే ఏ స్త్రీ సమస్య దుర్గమ దుర్గంకాదు! నేను ఎవరనుకున్నావు? నీకు తెలుసు!- నీవు పెండ్లికి తృణీకరించిన శాంతను!- శివరామదాసుగారి పుత్రిక. నీచేతులు కాలాయి నాకు పెళ్ళయిపోయింది. నేను నళినీకాంతుని హృదయేశ్వరిని! జమీందారు శశిభూషన్ దాసుగారి ముద్దు కోడల్ని!

—శాంత.

వణుకుతున్న అతని చేతులలో నుండి ఉత్తరం జారిపడింది.



## చిత్ర సమీక్ష:

# "ఇన్స్పెక్టర్"

టి. కె. యస్. బ్రదర్సు "ఇన్స్పెక్టర్" నాటకాన్ని జూపిటర్ వారు మొదట అరవంలోను, తరువాత తెనుగులోను సినీమాగా తీసారు. ఈ తెలుగు చిత్రాన్ని మే, 24. తేదిన మద్రాసు చిత్రాటాకీసులో పత్రికల వారికి ప్రదర్శించేరు.

కథ క్లుప్తంగా యిది :— భారత స్వాతంత్ర్య సిద్ధికి పూర్వం ఒక ఇన్స్పెక్టరు వుండే వాడు. అతనికి పెళ్ళి కాని కమల అనే ఒక చెల్లెలుంది. ఆమె మంచి నాగరీకురాలు, విద్యావతి కూడా. ఆమె స్నేహితుడు, అనాథ అయిన రాజుకు ఇన్స్పెక్టరు తన సోదరి నిచ్చి పెళ్ళి చేద్దామనే ఆశతో రాజును తన యింట్లో పెట్టుకుంటాడు.

రాజు విశాల హృదయుడు, వుదాత్తమైన ఆశయాలు కలవాడు. కళకోసమై పాటు పడాలని, కళా దేవతని ఆరాధించి కీర్తిగడించాలన్న వుద్దేశంతో కమలను ప్రోత్సహించి డాన్సు నేర్చు కోమని, డాన్సు మాష్టర్ని కుదిర్చి తన స్వగ్రామానికి వెళ్ళి వస్తానని చెప్పి బయలు దేరుతాడు.

ఇక్కడ తన మేనత్త ప్రమాదావస్థలో వుంటే ఆమెను కాపాడి, మేనత్త కూతురయిన పల్లెపిల్ల లక్ష్మి మనస్సులో ప్రేమ భావాల్ని అంకురింప చేస్తాడు. అక్కడ కమల డాన్సు మాష్టరు వలలో చిక్కి అతనికి లొంగి పోతుంది. స్త్రీలోలుడైన డాన్సుమాష్టరు కమల శీలాన్ని చెరచడంతో ఆగక, రాజా ప్రేయసియైన, లక్ష్మిజాడతెలుసుకొని, రాజాతో తనకున్న స్నేహాన్ని తెలియపరుస్తూ పల్లెపిల్ల అయినలక్ష్మినికూడ, తనవలలో చిక్కించు కోబోతాడు. అంతవరకూ తనుచేసే దుర్మార్గతలు ఎవరికీ తెలియకుండేలా, కమల దగ్గిరా, లక్ష్మి దగ్గిరా, రాజా దగ్గిరా, ఇన్స్పెక్టరు దగ్గరా వేరు వేరు విధాలుగా ప్రవర్తించి తిరుగుతూన్న అతని కుతంత్రాలన్నీ ఒక్కసారిగా బయట పడతాయి. రాజా ప్రేయసి లక్ష్మిని డాన్సుమాష్టరు బలాత్కరించబోగా ఇంతలో కమల అతనిని పిస్తోలుతో కాల్చి చంపి లక్ష్మిని రక్షిస్తుంది. ఇన్స్పెక్టరు, హంతకురాలైన సహోదరిని జైలుకు పంపి తన కర్తవ్యాన్ని నిర్వర్తించుకుంటాడు. రాజా, లక్ష్మి పెళ్ళితో కథ ముగుస్తుంది.

ఈచిత్రం చూస్తున్నంతసేపు నాటక ఫణీ లోనే నడుస్తున్నదిగాని, సినిమాగా అనిపించలేదు.

ఇందులో తెలుగు నటులు అంజలి, సుధాకర్, తక్కినవారందరూ అరవ నటులే. సుధాకర్ తన పాత్ర కొద్దిదైనా చాలా చాకచక్యంగా సమర్థతతో నటించేడు. పల్లెటూరి పిల్ల వేషాలకి ప్రసిద్ధికెక్కిన అంజలి అతి సహజంగాను, చక్కగాను నటించింది. అంజలి పలుకుతున్న పలుకులొక్కొక్కటి ప్రేక్షకుల కెంతో ఉత్సాహాన్ని, ఆనందాన్ని కలుగజేశాయి. పి. కె. సరస్వతి సహజంగానే సమర్థతతో నటించింది. కోపాన్ని ప్రదర్శించే టప్పుడు చాలా బాగా నటించింది. తక్కిన వారందరూ తగు మాత్రం అనవచ్చు.

చిత్రం పెద్దగా పొడిగించుటకు కారణం డాన్సులు ఎక్కువగా వుండడాన్ని. డాన్సులెక్కువ వుండుటచే, చిత్రం బోరుని పించింది. కొన్ని డాన్సులు తగ్గించి వుండవలసింది. శబ్ద గ్రహణం అంత వినసొంపుగా లేదు. ఛాయా గ్రహణం తగు మాత్రంగావుంది. సీనరీలు అంతగా చెప్పుకోతగ్గవి లేవు. చిత్రం యొక్క యితివృత్తం అయితే బాగుంది. కాని చిత్రాన్ని నాటక ఫణీలో తీయడాన్ని ఈచిత్రం ప్రేక్షకుల్ని ఆకర్షించక పోవచ్చును. ఈచిత్రం ఆర్. ఎస్. మణి దర్శకత్వంలో చమ్రియావారి ద్వారా ఆంధ్ర దేశ మంతటా మే 27 వ తేదిని విడుదలైంది.

ఇందులో కాలక్షేపానికిపొడిగించిన డాన్సులు, అనవసరమైన హాస్యఘట్టాలు తీసివేసిన చిత్రం ఆకర్షణీయంగా వుండి వుండును. ప్రేక్షకులకు విసుగు లేకుండా చిత్రాన్ని చూడ్డానికి అవకాశం కలిగి వుండును.

— లక్ష్మి.



గ్రంథ సమీక్ష:

## స్వీకారము

ఈ దిగువ పుస్తకములు మా కార్యాలయమునకు చేరినవి.

### ఖండకావ్యము:

గ్రంథకర్త: శ్రీ. అన్నాపంతుల చిరంజీవి శాస్త్రి.
ప్రచురణ కర్తలు: శ్రీ. బాలవైశ్య సంఘము, మాడుగుల.
వెల 0 - 8 - 0

### గోపూజా వ్రత కల్పము:

గ్రంథకర్త — బ్రహ్మశ్రీ తరిగొప్పుల కృష్ణారావు.
ప్రచురణ కర్తలు:— శ్రీకృష్ణాశ్రమము వారు. శారదా ప్రెస్. చోడవరము.

### పార్వతీపరిణయము

గ్రంథకర్త—శ్రీ పురాణపండ,
ప్రచురణాలయం:— శ్రీ భారతీముద్రాలయం, అలమూరు.
వెల:— 0-8-0

ఆంధ్ర నాటక సాహిత్య సంఘము పాఠశాలా
జమ్ షెడ్ పురము.

### రజితోత్సవ సంచిక.

ఇందు పెద్ద పెద్ద కవులు, కవయిత్రులు, బాలలు వ్రాసిన పెక్కు రచనలు కలవు. ముఖ్యంగా చదువ వల సిన రచనలు శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న గారు వ్రాసిన 'బాల ప్రవాసులు — విద్యాసమస్యలు' శ్రీ కోట సుందర రామశర్మగారు వ్రాసిన 'ప్రవాసాంధ్రులు — తెలుగు తనము' అన్న రచనలు చదవడానికుత్సాహంగా నున్నవి. ప్రవాసాంధ్రుల కందరకు ఈ వ్యాసాలు నూతనోత్సాహాన్ని కల్గించి క్రమ పదమునుచూపు చున్నవి.

---



ఆంధ్ర మహిళాసభ నుండి, మార్చి 1953 లో విశ్వ విద్యాలయపు ఎడ్మిషన్ పరీక్షకువెళ్ళిన విద్యార్థినీ బృందము.
కృతార్థులైన వారి పేర్లు జూన్ నెల పత్రికలో ప్రచురించెదము.

Regd. No. 4759

Phone: 86961

# ANDHRA MAHILA PRESS

*(Managed by the Andhra Mahila Sabha)*

PRINTERS, PUBLISHERS AND BOOK-BINDERS



*Undertakes:*

ALL TYPES OF PRINTING

**JOB WORKS & BOOKS**

IN

*Telugu, English, & Tamil.*

ALSO

Offers to train women in Composing, Printing and Book-Binding



*for Moderate Rates, Neat Execution & Prompt Attention*

## Get Your Work done

AT THE

# ANDHRA MAHILA PRESS

**24-A, LUZ CHURCH ROAD,**

**MYLAPORE** **MADRAS-4**

Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 24-A, Luz Church Rd., Madras 4



ఆంధ్ర మహిళాసభలో, నర్స్, మంత్రసాని తరగతులు ప్రారంభించిన సందర్భములో తీసిన ఛాయాచిత్రము.
ముందువరుసలో కూర్చున్నవారు శిక్షణపొందుచున్న విద్యార్థినులు.



ఆంధ్ర మహిళాసభా సభ్యురాండ్రు, కుమారి నిర్మలాజ్యోషి, ఇతర అతిథులతో.

# ఆంధ్రమహిళ

సంపుటి 10 :: ఆగస్టు '53 :: సంచిక 4



ఇంకా, గద్యాలు, పద్యాలు, బాలానందం, గ్రంథసమీక్ష. చిత్రసమీక్ష.

వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే.,బి.యెల్.,
సంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే.,యెల్.టి.,

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్.

సంవత్సర చందా : : ఆరు రూపాయలు.




సంపుటి 10 :: ఆగస్టు '53 :: సంచిక 4

# సంధి ఒడంబడిక

మూడు సంవత్సరాల ఘోర యుద్ధానంతరము, ఒక సంధి యొడంబడికయంటూ కొరియా యుద్ధరంగములో జరుగడము, అత్యంతము హర్షనీయాంశము. అగ్రనాయకుల మనస్సులలో ఏ సందేహాలు పట్టి బాధిస్తున్నప్పటికినీ, ఇరుపక్షముల ప్రధాన సేనాధిపతులు ఎంత ముభావముగా, ఎంత యంత్రసన్నిభముగా సంధి పత్రముపై సంతకములు పెట్టినాగాని, తాత్కాలికంగానైనా, యుద్ధవిరమణ యనేది పీడిత ప్రజానీకమునకు ఉపశమన కారణముగానూ, ఆశాజనకముగానూ ఉండకపోదు. వెనుదిరిగి ఒక్కసారి జరిగిన వినాశనాన్ని గుర్తిస్తే ఎంత హృదయ విదారకముగా ఉంటుంది? అంతర్యుద్ధముగా మొలకెత్తి అంతర్జాతీయ యుద్ధంగా మారిన యీ యుద్ధ రంగంలో క్షతగాత్రులైనవారు, వికలాంగులైనవారు, వ్యాధిగ్రస్తులైనవారు, లక్షలాది సైనికులటుండనిచ్చి, ఎంత మంది అమాయికపు సామాన్యప్రజ నశించినారు? ఎంత మంది నిర్వాసులైనారు? తీవ్రమైన ఆహార కొరతవల్ల ఎందరు ప్రాణులు కృంగి కృశించుచున్నారు? ఎన్ని పట్టణాలు, ఎన్ని ముఖ్య కర్మాగారాలు రూపుమాసి పోయినవి? దీనికి బాధ్యులెవరు? కమ్యూనిస్టుల దురంతాలను, దురాక్రమణను అణచడానికి చేసిన ధర్మయుద్ధమని అమెరికనులంటారు. ధనికవాద దురాక్రమణను అణచడానికని కమ్యూనిస్టులు వాదిస్తారు. రక్తప్రవాహముతోనైనా కొరియా అంతా ఒకే రాజ్యముగా స్థాపించాలని రీ రొమ్ము గుద్దవచ్చు- వీరి వీరి ఆదర్శములెంత ఉత్తమమైనవైనప్పటికీ, వీరి ఆశయాలు ఎంత ధర్మచింతతో కూడుకొనినవైనప్పటికీ, యుద్ధముద్వారా సాధించగలిగినది నశింపు మాత్రమేనని వీరందఱూ ఎంత శీఘ్రముగా గుర్తిస్తే అంత శీఘ్రముగా ప్రజాశ్రేయస్సు కలుగుతుంది.

"పరస్పర విభేదాలను పరిష్కరించుకోవడానికి ఇట్టి వృధా సంగ్రామములకు ప్రజలు ఇకమీదనైనా పూనుకోకుండా ఉండడానికి మనమంతా శ్రద్ధాభక్తులతో ప్రార్థిద్దాము" అని అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ పల్కిన పల్కులు పాటించదగినవి. "సంధి జరిగినదని సంతృప్తి పడరాదు- అప్రమత్తులమై ఏ అవాంతరాలైనా ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉండాలి" అన్న డల్లెస్ వాక్యాలు, నమ్మిక ద్రోహము చేస్తాడేమో అని రీ యందు అందఱకూగల సందేహము, సంధి షరతులనుగూర్చి చర్చించి పరిశీలించుటకు జనరల్ ఎస్సెంబ్లీ ఎక్కడ సమావేశము కావాలి, ఏదేశపు ప్రతినిధులు అందు పాల్గొన నర్హులు అనే విషయములపై అప్పుడే ప్రారంభమైన భేదాభిప్రాయములు, వాదోపవాదములు అధ్యక్షుడు సూచించిన సలహాకు కేవలము వ్యతిరేకముగా ఉండడమే కాకుండా, శాంతిని సుస్థిరము చేయడం ఏ దేశపు ప్రముఖ నాయకులయొక్క మనఃపూర్వకమైన ఆశయము కాదేమో అని అనుమానము కలిగించక తప్పదు. ఒక సిద్ధాంతానికీ మరియొక సిద్ధాంతానికీ, ఒక జాతికీ, మరియొక జాతికీ, ఒక సంస్కృతికీ మరియొక సంస్కృతికీ, ఒక వ్యక్తికీ మరియొక వ్యక్తికీ, అభిప్రాయాలలో, ఆశయాలలో, ఉనికి మనికిలలో భేధాలుండడం సహజమే. ఇతరులలోని మంచిని గ్రహించి, చెడుగును క్షమించి, మనలోని క్రౌర్యాన్ని, ద్వేషాన్ని త్యజించిన నాడుగాని సామరస్యము సంఘటిల్లదు- ఈవిధంగా సామాన్యప్రజ తమ ఇరుగు పొరుగువారితో సామరస్యము కలిగి, శాంతియుతమైన సంఘ జీవితాన్ని గడుపుతూనే ఉన్నారు. జాతి నాయకులమని సామాన్య ప్రజను వశపరచుకొన్న మేధావులు మాత్రము యీ సామరస్యాన్ని సాధించలేక, శాంతియుతమైన ప్రజల జీవితములో యుద్ధములనే భీభత్సాన్ని ప్రవేశ పెట్టడం చాలా అన్యాయమని చెప్పాలి. ప్రజానాయకులన్నవారు తమ గురుతర బాధ్యతను గుర్తించి ప్రవర్తించిననాడు గాని శాంతి సుస్థిరము కానేరదు.

## ఆంధ్ర మహిళా సభ నర్సింగ్ హోమ్‌కు

## ఉయ్యాలల విరాళము.

శ్రీమతి దువ్వూరి వరసమ్మగారు, ఆంధ్ర మహిళా సభ ప్రసూతి శాఖకు రెండు ప్రసవపు బల్లలు (Obstetric beds or delivery cots), నాల్గింగా అమర్చిన ఒక ఉయ్యాల సెట్టు, కొనుటకుగాను రూ 1000/-లు విరాళముగానిచ్చిరి.

శ్రీమతి టి. జి. హైమవతిగారు రెండు ఉయ్యాలలు కొనుటకుగాను రూ. 80/-లు. విరాళమునిచ్చిరి.

శ్రీమతులు కందామాణిక్యాంబ, రమాబాయి రామారావుగారలు ఒక్కొక్కరు ఒక్కొక్క ఉయ్యాల కొనుటకుగాను రూ. 40/-లు. విరాళమునిచ్చిరి.

వీరునల్వురు గూడ ఆంధ్ర మహిళా సభ యావజ్జీవ సభ్యురాండ్రుగా, చిరకాలమునుండి ఆంధ్ర మహిళా సభ అన్ని కార్యకలాపాలలోనూ అన్నివిధములా తోడ్పడుచున్నవారేను. వీరి దాతృత్వమునకు మా హృదయపూర్వక కృతజ్ఞత.

ఇంకా, ప్రసూతి శాఖకు 15-ఉయ్యాల తొట్లు కావలసియున్నది. లోపలి పరుపుతోసహా ఒక్కొక్క ఉయ్యాల రూ. 40/- మాత్రమే. ఉదార హృదయులగు సోదరీమణులు, ఒక్కొక్కరు యీ మొత్తమును విరాళముగానిచ్చి, తమపేర ఒక ఉయ్యాల కొనుటకు తోడ్పడవలసినదిగా మనవి చేయుచున్నాను.

అ. చన్నఘంటమ్మ.

## చిన్న చిన్న మొత్తములలో ధనము నిల్వ చేయుట.

ది 16-7-1953 సాయంకాలము ఆంధ్ర మహిళాసభ భవనములో, నేషనల్ స్మాల్ సేవింగ్సు విధానము, అందు స్త్రీలయొక్క సహకారము అను విషయముపై, యూనియన్ డిప్యూటీ ఆర్థిక మంత్రి శ్రీ అరుణ చంద్ర గుహగారు, చెన్నపట్టణములోని సంఘసేవా సంస్థల స్త్రీ ప్రతినిధులతో చర్చించిరి. వారు చెప్పిన దానిలో ప్రధాన విషయము— రాజకీయ స్వాతంత్ర్యమును పొందినాగాని, భారతదేశము ఇంకనూ ఆర్థికముగా స్వాతంత్ర్యము పొందలేదు. దారిద్ర్యమును, వస్తువుల కొరతను తగ్గించి, ఆహార పదార్థములయొక్క, మిగతా అవసర వస్తువుల యొక్క ఉత్పత్తి అధికము చేయాలంటే ఎన్నో ప్రాజక్టులు నిర్మాణము చేయవలసియున్నది. ఈ నిర్మాణమునకు ప్రభుత్వమునకు కోట్ల కొలది రూపాయలు ఖర్చు కావలసి యున్నది. దీనికి ప్రజల సహాయము కావలసియున్నది. చిన్న చిన్న మొత్తములను నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్ల ద్వారా ప్రభుత్వమువద్ద దాచుట వలన, ప్రభుత్వమునకు తోడ్పడుటయేగాక, చివరకు పావలాల పరిమాణములో గూడా దాచుకుని, ఒక పెద్ద మొత్తముగా కొంతకాలము తరువాత తీసుకొనుటకు ప్రజలకు అవకాశము కలుగుతుంది. కొంత అనవసర ఖర్చును చాలించుకుని, వీలైనంత రొక్కమును ఈ విధముగా ప్రభుత్వము వద్ద దాచుట వలన తమ సంతతికి, అవసర సమయానికి కొంత ధనము దాచి యుంచుటయేగాక, అభివృద్ధి ప్రణాళికల నిర్మాణమునకు సహాయ పడడం ద్వారా, భవిష్యత్ప్రజా క్షేమానికి తోడ్పడ్డ వారగుదురు.

ఈ సేవింగ్సు విధానము ఎక్కువ ప్రచారములోనికి వచ్చుటకు సేవా సంస్థల సహకారము కావాలి. స్త్రీలలో పొదుపరి తనము సహజముగనుక, స్త్రీల సహకారము మరీ ఎక్కువ కావాలి. ఈ ప్రచారమును సాగించుటకు కేంద్ర స్థానిక సలహా సంఘాలు నియమించి, ఇందు పాల్గొను సేవా సంస్థలకు ఒక కొంత కమిషను లభించే ఏర్పాట్లు చేయబడుతవి. అని కూడా శ్రీ గుహగారు విశద పరచిరి.

# ఆంధ్ర మహిళా సభ

## పారిశ్రామిక శాఖలు: పరీక్షఫలితములు

కుట్టు :

పారిశ్రామిక శాఖ కుట్టు, ఎంబ్రాయిడరీ పరీక్షలకు వెళ్ళి కృతార్థురాండ్రైన విద్యార్థినుల పేర్లు మే నెల ఆంధ్ర మహిళలో ప్రకటించియున్నాము. హయ్యరు గ్రేడ్ కుట్టు పరీక్షలకు వెళ్ళిన వారిలో మరి యిద్దరు కృతార్థులైనట్లు ప్రభుత్వ కార్యాలయమునుండి పునః వర్తమానము ఇటీవల మాకందుటవల్ల వారియొక్క పేర్లు ఇందు ప్రకటించుచున్నాము.

కె. భాగీరథి. ఎ. సీతాదేవి.

వీరితో జేరి కృతార్థులైనవారి సంఖ్య 9.

పరీక్షకు వెళ్ళినవారి సంఖ్య 12.

నేత :

ఈ శాఖనుండి నేతలో లోయర్ గ్రేడ్ ప్రభుత్వ పరీక్ష వ్రాసిన జి. తిమ్మాబాయి కూడ కృతార్థురాలైనదని తెలుపుటకు సంతోషించుచున్నాము.

వస్త్రములకు రంగువేయుట – అద్దకపు పనులు :

భారత ప్రభుత్వ పునరావాస శాఖ వారి యాజమాన్యమున మహిళా సభలో పై చేతి పరిశ్రమలో తర్ఫీదు పొందిన రెండవ దళము విద్యార్థినులకు, జూలై 20, 21 తేదీలలో ప్రభుత్వ పరీక్షలు జరిగినవి. శిక్షితులైన 13 గురు విద్యార్థినులు కృతార్థులైనట్లు తెలుపుటకు సంతోషించుచున్నాము. అందులో 4 గురు 80 శాతమునకుపైగా మార్కులు సంపాదించి ప్రథమశ్రేణిలోను, మిగతా 9 గురు 60 శాతమునకుపైగా మార్కులు సంపాదించి ద్వితీయ శ్రేణిలోను కృతార్థులైరి. వారి పేర్లు దిగువ ప్రకటించుచున్నాము.

ప్రథమ శ్రేణి :

| | | |
|---|---|---|
| కె. సరోజ, | బి. కమల, | కె. భారతలక్ష్మి, |
| | పి. కౌండమణి. | |

ద్వితీయ శ్రేణి :

| | | |
|---|---|---|
| ఎస్. ఎ. పుష్పామేరి, | డి. పుష్పారాణి, | సి. జయకాంతం, |
| కె. గజలక్ష్మి, | ఎమ్. ఎమ్. మంగయార్కరసి, | కె. వనజ, |
| కె. రమామణి, | వి. జయలక్ష్మి, | సి. పంకజం. |

విజయము గాంచిన విద్యార్థినులకు మా హృదయపూర్వక అభినందనములు. వీరి కృషికి తోడ్పడ్డ ఉపాధ్యాయ వర్గమునకు మా కృతజ్ఞత.

ఆంధ్ర మహిళా సభ.



వస్త్రములకు రంగువేయుటలో శిక్షితులైన విద్యార్థినులు పరీక్షాధిప - అధ్యాపక బృందము.

నర్సింగ్‌హోమ్ శాఖ :

ది 1–7–1953 నుండి, ఆంధ్ర మహిళాసభ నర్సింగ్ హోమ్ శాఖలో నర్స్ – మంత్రసాని శిక్షణ తరగతులు ప్రారంభమైనవి. 12 మంది యువతులు, యీ శిక్షణ తరగతులలో జేరిరి. సభ ఆవరణలోనే వీరికి భోజన వసతులు ఏర్పరచడమైనది. అర్హతగల వైద్యోపాధ్యాయినులు వీరికి శిక్షణ గరపుతున్నారు.

1952 సం॥ సెప్టెంబరు నెలనుండి ఇచట ఉచిత వైద్యశాలలో రోజుకు రమారమి 40 మంది స్త్రీలు, బాలబాలికలు ఉచిత చికిత్స పొందుచున్నారు. ఇప్పుడు ప్రసూతి వైద్యశాఖ కూడ ప్రారంభించినాము. 10 మందికి సరియైన సదుపాయములు ఏర్పరుపబడినవి.

యునిసెఫ్- వారు ధర్మంగా పంపిన పాలను, యీ నర్సింగ్ హోమ్ ఆవరణలో రోజుకు రమారమి 75 మంది బాలబాలికలకు, గర్భిణీ స్త్రీలకు పంచబడుచూవుంది. ఆగస్టు ప్రారంభమునుండి బియ్యముకూడా పంచబడును.

ది 15–7–1953 న నర్సింగ్ హోమ్ క్రొత్త వార్డుకు, యూనియన్ డిప్యూటీ ఆర్థిక మంత్రి శ్రీ అరుణ్‌చంద్ర గుహగారు శంకుస్థాపన చేసినారు. ఈ ఉత్సవానికి ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అధ్యక్షత వహించినారు.



పాలు తీసుకొనుచున్న బీద పిల్లలు, యువతులు.

---

## కృతజ్ఞత

శ్రీమతి నిమ్మగడ్డ లక్ష్మీదేవిగారు (దుగ్గిరాల) ఆంధ్ర మహిళా సభకు రూ 100/-లు చందా చెల్లించి యావజ్జీవ సభ్యురాలైరి.

శ్రీ ఎస్. సుందరరామ శాస్త్రి, (బొంబాయి) ఆంధ్ర మహిళా సభకు రూ 101/-లు విరాళమిచ్చి, సభకృషికి ప్రోత్సాహమొసంగిరి.

వీరికి మా కృతజ్ఞత.

ఆంధ్ర మహిళా సభ.

# ఆంధ్ర మహిళా సభ

కళాశాఖ :

అఖిలభారత సంగీత నాటక ఎకాడమీ సెక్రెటరీగారైన కుమారి నిర్మలాజ్యోషి యీ మధ్య దక్షిణాది పర్యటన సందర్భములో ది 7–7–1953 న, ఆంధ్ర మహిళాసభ కళాశాఖను చూడవచ్చిరి. మహిళాసభ కళాశాఖ విద్యార్థినులు, సభ్యురాండ్ర పిల్లలు, కలిసి, భరతనాట్య, ఇతర నృత్య ప్రదర్శనములను గావించిరి.



నృత్య ప్రదర్శనములో పాల్గొన్న బాలికలు.

---

# స్వతంత్ర దినోత్సవము

ఆగస్టు 15- శనివారమునాడు, భారత స్వాతంత్ర్య దినోత్సవము ఆంధ్ర మహిళా సభా భవనములో జరుగును.

ఉదయము 9 గం॥లకు, శ్రీమతి బెన్నూరి కృష్ణవేణమ్మగారిచే పతాకావిష్కరణ ;

తరువాత, సభ్యురాండ్రచే జాతీయ గీతాగాన కాలక్షేపము జరుగును—

అందఱు విచ్చేసి ఉత్సవమును జయప్రదము గావింపగోరుచున్నాము—

అ. చన్నఘంటమ్మ.



# రాజకీయాలు

• శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు •

జూన్ నాలుగో వారం మొదలుకుని జులై మూడో వారం వరకూ జాతీయ, అంతర్జాతీయ రాజకీయ రంగంలో నడిచిన ప్రధాన సంఘటనలు ఇవి:— రష్యా అగ్రరాజ్య విదేశాంగ మంత్రుల సమావేశానికి పశ్చిమ రాజ్యాలు ఆహ్వానించటం, సోవియట్ హోం మంత్రి బెరియా పదవీ భ్రష్టుడు కావటం, కొరియాలో యుద్ధ విరమణ కుదిరినట్లే కనిపించి తప్పిపోతూ ఉండటం, ఇండో చైనాలో పరిస్థితి ముదిరిపోవటం, రాజధాని నిర్ణయవిషయమై పునరాలోచన చేసే ఉద్దేశ్యాన్ని వివిధ పార్టీలు సూచించటం.

* * *

అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్‌ల విదేశాంగ మంత్రులు జూలై నెల మొదట్లో వాషింగ్‌టన్‌లో సమావేశమై ఆస్ట్రియా, జర్మనీ సమస్యలపై అగ్రరాజ్య విదేశాంగ మంత్రుల సమావేశం జరపటానికి రమ్మని రష్యాను ఆహ్వానించారు. ముందు అగ్రరాజ్య అధిపతులు నలుగురూ సమావేశమై సమస్యలను స్థూలంగా పరిశీలించిన మీదట వివరాలను చర్చించే నిమిత్తం విదేశాంగ మంత్రుల సమావేశం జరపాలన్న చర్చిల్ సూచనకు ఇది విరుద్ధంగా ఉన్నది. అయితే విదేశాంగమంత్రుల సమావేశంవల్ల అగ్రరాజ్యాధిపతుల సమావేశం నిలిచిపోవాలనిలేదని అమెరికా అధికారులు సూచించారు.

అమెరికన్ నాయకులు ప్రస్తుతం రష్యాతో సమాలోచనలు జరపటానికి అంత ఇష్టపడటంలేదు. తూర్పు బెర్లిన్‌లో కిందటి నెల జరిగిన కల్లోలాలు, హంగరీ వంటి తూర్పు యూరప్ దేశాల ప్రభుత్వాల్లో వచ్చిన మార్పులు, సోవియట్ హోం మంత్రి బెరియా బర్తరఫ్ మొదలైన సంఘటనలను చూస్తున్న అమెరికన్ రిపబ్లికన్లు ఈ సంఘటనలన్నీ సోవియట్ వర్గంలో ముసలం పుట్టిన సూచనలని భావిస్తున్నారు. ఏక్షణానికైనా సోవియట్ వ్యవస్థ తలక్రిందులయిపోవచ్చుననీ, కాబట్టి ఓపికపట్టి అదును కోసం వేచివుండాలనీ అభిప్రాయపడుతున్నారు.

అయినప్పటికీ రష్యాతో సంప్రదించడానికి అమెరికా అంగీకరించిందంటే అది చర్చిల్ సూచనవల్లనేనని బ్రిటిష్ ప్రభుత్వం చెప్పుకోచూస్తున్నది కాని, బ్రిటిష్ రాజకీయ వర్గాలు మట్టుకు, త్వరలో ఎన్నికల గండాన్ని ఎదుర్కొనబోతున్న పశ్చిమ జర్మన్ చాన్సెలర్ ఆడెనావర్‌కు తోడ్పడాలన్న ఉద్దేశ్యంతోనే అమెరికా దానికి ఒప్పుకున్నట్లు భావిస్తున్నారు.

తూర్పు జర్మనీ, సోవియట్ యూనియన్‌లు జర్మనీ ఐక్యతకు అనేక అనుకూల చర్యలను తీసుకుంటూ సంప్రదింపులకు రావలసిందని పశ్చిమరాజ్యాలను ఆహ్వానిస్తున్నారు. ఈ ఆహ్వానాలను పశ్చిమ రాజ్యాలు పెడచెవిని పెడితే, వచ్చే ఎన్నికల్లో వాళ్ళ మిత్రుడు అడెనావర్‌కు తీవ్రజాతీయాభిమానం ఉన్న పశ్చిమ జర్మనీలో మంచి నీళ్ళు పుట్టవు. అందువల్ల తమ తప్పేమీ లేదని చూపించటానికి ఈ సంప్రదింపుల నాటకం ఆడిచూద్దామని అమెరికా ఊహిస్తున్నది. తూర్పు జర్మనీమీద తమ పలుకుబడి ఉండటం కన్నా, పశ్చిమ జర్మనీ పశ్చిమరాజ్యాల యుద్ధ వ్యూహంలో చేరకపోవడం రష్యాకు ఎక్కువ ప్రయోజనకారి అని రష్యావైఖరికి అర్థం చెప్పవచ్చును. అయితే బ్రిటన్, ఫ్రాన్సులు కూడా ఇందు యీరష్యానే సమర్థిస్తున్నవి.

జర్మనీ ఆయుధ ధారణ యావత్తూ యూరపుకు భయకారణంగా ఉన్నదనీ, దీనికి బదులు జర్మనీని ఏకం చేసి ఎవరికీ హాని కలిగించలేని స్థితిలోనే అట్టేపెట్టాలనీ, బ్రిటిష్ లేబర్ నాయకుడు అట్లీ చెప్పిన దానితో అనేకమంది ఏకీభవిస్తున్నారు. ఇంత మంది ఇష్టానికీ, జర్మన్ ప్రజల

ఇష్టానికి వ్యతిరేకంగా అమెరికా ఏమిచేయగలుగుతుందో చూడవలసివున్నది. అగ్రరాజ్య విదేశాంగ మంత్రుల సమావేశంవల్ల ఆట్టే ప్రయోజనం ఉండదనీ, రాజ్యాధిపతుల సమావేశమే లాభకరమనీ, అట్లీ ప్రభృతులు హెచ్చరిస్తున్నారు.

*  *  *

సోవియట్ హోం మంత్రి లెహెంట్రీ బెరియా జులై 9 వ తేదీన పదవినుంచి తొలగించబడి అరెస్టు చేయ పడ్డాడు. కమ్యూనిస్టు పార్టీకీ, ప్రజలకూ ద్రోహం చేశాడనీ, విదేశీయులతో కుట్రలు పన్నాడనీ అతడిమీద నేరారోపణ జరిగింది. దీని తరవాత సోవియట్ కేంద్ర కమిటీ సభ్యులను కొందరినీ, రాష్ట్ర కమ్యూనిస్టు నాయకులను కొందరినీ కూడా పదవినుంచి తొలగించటం జరిగింది.

స్టాలిన్ నాటినుంచీ సోవియట్ పోలీసు శాఖ నాయకుడుగా ఉండి, అతడి ఆంతరంగికుల్లో ఒకడుగా ఉన్న బెరియా పతనం ఆశ్చర్యం కలిగించటం సహజమే. ఇదంతా వ్యక్తిగత ప్రాబల్యానికి రష్యాలో జరిగే పోరాటాలకు నిదర్శనమనీ అప్పుడే సోవియట్ వ్యతిరేకులంతా తీవ్రప్రచారం సాగించారు. వివిధ దేశాల్లోనూ కమ్యూనిస్టు పార్టీలు నడిచే తీరుతెన్నులను గమనించేవారికి, అందులో వ్యక్తిప్రాబల్యానికి అతి స్వల్పావకాశాలు మాత్రమే ఉన్నట్లు తెలుస్తున్నది. పార్టీ వ్యవస్థ, పార్టీ అవసరాలకు తరువాతనే ఏదయినా అని తెలుస్తున్నది.

బెరియాను సుప్రీంసోవియట్ ఏకగ్రీవంగా నిరసించింది. పోలీసు శాఖాధికారిని తరిమివేయటానికి సైన్య శాఖాధికారుల సహాయాన్ని ప్రధాని మాలెంకోవ్ తీసుకున్నాడని కొందరు ఆరోపించారు. ప్రస్తుతం రష్యాను పాలిస్తున్నది. మార్షల్ ఝుకోవ్, మార్షల్ వొరొషిలోవ్ మార్షల్ బుల్గనిన్ లేననీ, కొంత కాలానికి మరొక ప్రచండ సోవియట్ సేనాని నెపోలియన్‌వలె విజృంభించి, నెపోలియన్ ఫ్రెంచి విప్లవాన్ని భగ్నం చేసినట్లుగా, కమ్యూనిస్టు వ్యవస్థను నాశనం చేస్తాడనీ కూడా చెప్తున్నారు. కాని వాళ్లు రెండు అంశాలు గమనించటం లేదు. (1) వొరొషిలోవ్ ప్రభృతులు ముందు ఆరితేరిన కమ్యూనిస్టు విప్లవ వాదులుగా తయారయి, ఆ తరువాత ఆ విప్లవ విజయానికి ప్రజాబలాన్ని నడిపించిన వాళ్లే కాని, నెపోలియన్ వంటి 'కైజీతం' సైనికోద్యోగులు కాదు. 2) మాలెంకోవ్ నాయకత్వాన సోవియట్ కమ్యూనిస్టు పార్టీ అనుసరిస్తున్న విధానం.

మాలెంకోవ్ అధికారంలోకి వచ్చినతరువాత సోవియట్ కమ్యూనిస్టుల ప్రసంగాల్లోనూ, పత్రికలలోనూ పార్టీ ప్రాధాన్యతనుగురించే ఎక్కువ ప్రస్తావన కనబడుతున్నది కాని, వ్యక్తుల సేవనుగురించికాదు. పోలీసుఅధికారులు కొంతమంది డాక్టర్లమీద తప్పుడుకుట్రనేరాలు మోపారని చెప్పి ఆడాక్టర్లను విడుదలచేయటం, యూరపియన్ రష్యా అంతటిలోను సంచరించేఅవకాశం విదేశములకు ఇచ్చి తమప్రజలకు ఇతరులతో సన్నిహిత సంబంధాలను ఏర్పాటుచేసుకునే అవకాశాలు కలిగించటం, ప్రజలకు అభిప్రాయ ప్రకటన స్వేచ్ఛ ఉండాలని అంగీకరించటం, తమ సహచర దేశాల్లో కమ్యూనిస్టు పార్టీలు పొరపాట్లు చేసినవని బహిరంగంగా అంగీకరించటం, అక్కడ 'వీర కమ్యూనిస్టు' వాదాన్ని సడలించటం—మొదలైన చర్యల్లో ఏ ఒక్కటీ కూడా, సైన్యబలంతో సర్వత్ర నియంతృత్వాన్ని నడపటానికి అనుకూలించదని అంగీకరించక తప్పదు. నిజానికి ఇవన్నీ కూడా, ప్రస్తుతం సోవియట్ వ్యవస్థలో ఏమయినా సర్వత్ర నియంతృత్వ లక్షణాలు ఉంటే వాటిని తొలగించి, ప్రజాస్వామిక జీవితానికి దోహదం చేయటానికే ఉపయోగిస్తవి.

బెరియా ఏవిషయంలో పార్టీకి ద్రోహకరంగా ప్రవర్తించాడో ఖచ్చితంగా ఇప్పుడే చెప్పలేము కాని, ఈ విషయమై ఒక విధంగా ఊహించవచ్చు. వ్యక్తి ప్రాధాన్యత అన్నది స్టాలిన్ హయాంలో చాలా పైకి వచ్చినట్లు కనిపిస్తుంది. దీనికి స్టాలినే కారకుడని వ్యతిరేకులు అంటారు. ఈ సందర్భంలో, భారత దేశంలో గాంధీజీకి అంత వ్యక్తిగత ప్రాధాన్యత ఎట్లా వచ్చిందో ఆలోచించటం అవసరం. ఆయన్ని మహాత్ముడని, పిలవమని ప్రజలకు ఎవరు చెప్పారు? పండితనెహ్రూను అభిమానించాలని ఎవరు ఉత్తరువులు చేశారు? రష్యాలో స్టాలిన్ సాధించిన ఘన కార్యాలను పట్టి రష్యన్ ప్రజలు ఆయన్ను ప్రశంసించటం సహజం. అయితే వ్యక్తిగత ప్రాధాన్యత కోరదగింది కాదు కనుక, మళ్ళీ అదికాకుండా స్టాలిన్ వెనకనే వచ్చిన మాలెంకోవ్ జాగ్రత్త పడుతున్నాడు.

ఇట్లాగే సోవియట్ యూనియన్‌లోని రష్యనేతర ప్రాంతాల్లో రష్యన్ సంస్కృతిని, కమ్యూనిజంతో

పాటుగా, అమలు జరపటానికి "వీరకమ్యూనిస్టు"లు మితిమీరి ప్రయత్నించినట్లు కనిపిస్తుంది. సోవియట్ మధ్య ఆసియా ప్రాంతంలో అప్పుడప్పుడు కనిపిస్తున్న ఇస్లాం ఉద్రేకం దీనికి ఫలితమని చెప్ప వచ్చును. ఇదే విధంగా యుక్రేన్ రాష్ట్రం కూడా కొన్ని ఇబ్బందులు పడ్డది. ఈ విధానాన్ని మాలెంకోవ్ మార్చదలిచినట్లు అజర్ బైజాన్ మొదలైన చోట్ల కమ్యూనిస్టు నాయకత్వంలో జరిగిన మార్పులు సూచిస్తున్నవి.

"వీర కమ్యూనిస్టు" తత్వాన్ని క్రమంగా సౌమ్య పరచటానికి స్టాలిన్ చాలా ప్రయత్నాలు చేశాడు. అనేక సార్లు పార్టీ సభ్యులకు హెచ్చరికలు చేశాడు. కమ్యూనిస్టు దేశాలు ధనిక వాద దేశాల పొరుగునే నివసించగల వన్న స్టాలిన్ సూత్రం జయప్రదం కావటానికి కూడా, కమ్యూనిస్టు విధానం కొంతవరకయినా ధనికవాద ప్రజాస్వామ్యాల దృష్టిలో సౌమ్య మయినట్లు తోచాలి. ఈ సౌమ్యత అన్నది కేవలం ధనిక వాద దేశాలను తృప్తి పరచటానికే కాక, ఆత్మ రక్షణావసరాల కోసం కమ్యూనిస్టు వ్యవస్థలో ఏర్పడ్డ కఠోర నియమాలను సడలించి సమాజాన్ని తాత్కాలిక సంకోచస్థితి నుంచి విడిపించి ముందుకు సాగ గలిగేట్లు చేయటానికి కూడా అవసరమే.

అవాంతరాల కోసం కమ్యూనిస్టు వ్యవస్థలో ఏర్పడ్డ నిరోధాలు సర్వత్ర నియంతృత్వ లక్షణాలని కమ్యూనిస్టు వ్యతిరేకులు చెపుతూ, అవి కమ్యూనిస్టు వ్యవస్థ అసలు లక్షణాలేననీ, కమ్యూనిజం నశించి నియంతృత్వం ఏర్పడ్డదనీ ప్రచారం చేస్తున్నారు. కాని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ వాటిని గడిచి బయట పడగలనని నిరూపించటానికి ప్రయత్నిస్తున్నది. తాత్కాలిక సంకుచిత్వాన్ని వదిలించు కోలేక నాశనమయిపోయిన హింటూ సంఘం గతి దీనికి పట్టకుండా ఉండటం మానవ జాతి భద్రతకు చాలా అవసరం. ఈ ప్రయత్నాల్లో సహకరించే ఇంగితజ్ఞానం, ముందుచూపు బెరియా వంటి కొందరికి లేకపోయి ఉంటుందని డాక్టర్ల మీద అతడు బనాయించిన కేసు నిరూపిస్తుంది.

*     *     *

ఇండోచైనాలో సైనికంగా ఫ్రాన్స్ ఓడిపోయిందని కొత్త ఫ్రెంచి సేనాని జనరల్ నవార్ బయట పెట్టాడు. అదనపు సేనలు లేకపోతే వియ్ట్మిన్‌లను అణచలేననీ, వాళ్ళు ఎక్కడ పడితే అక్కడ ఎదురు దెబ్బ తినుగు స్థితిలో ఉన్నారనీ అతడు బయట పెట్టాడు. ఫ్రాన్స్ నిలబెట్టిన కీలుబొమ్మ ప్రభుత్వాల సేనలు కూడా తమ ప్రభుత్వాల బండారాన్ని గ్రహించి, తిరగబడి వియ్ట్మిన్‌లో కలిసిపోతున్నవి. బలంతో చేతకాక సామాన అయినా పని చేసుకుందామని ఫ్రాన్స్ ఏవో స్వాతంత్ర్య ప్రతిపాదనలు అంటూ చేసిందికాని, అవి తాను నిలబెట్టిన కీలుబొమ్మ ప్రభుత్వాధిపతులకే నచ్చలేదు. కాంబోడియా రాజు ఎదురే తిరిగాడు. లావోస్ యువరాజు ఎదురు తిరుగుతాడేమోనని పారిస్‌కు 'వైద్య చికిత్స' కోసం తీసుకుని వెళ్ళారు. ఆఖరికి బావ్‌దాయ్ కూడా వారి పద్ధతి మీద సంప్రదింపులు జరపటానికి పేచీ పెడుతున్నాడు.

కొన్ని నెలల క్రిందటే బ్రిటిష్ లేబర్ పార్టీ సభ్యుడు రిచర్డ్ క్రాస్మన్ ఇండోచైనాను గురించి మాట్లాడుతూ ఈ విధంగా హెచ్చరించాడు: "చైనాలో మోస్తరుగా ఇండోచైనాలో కూడా విప్లవం జయించింది. చైనాలో ఆ సంగతిని గుర్తించిన మనం ఇండోచైనాలో దేనికి వెనకాడాలి"?

విప్లవమంటే ఉలికి పడే అమెరికన్ విదేశాంగ మంత్రి ఫ్రెంచి పాలనను సమర్థిస్తూ, చిన్న దేశాలు స్వాతంత్ర్యం కోరటం ప్రమాదమని శ్రీరంగనీతులు చెప్పగా, దానికి ఇండియాలోని స్వతంత్ర కాంబోడియా సమితి తీవ్ర నిరసన తెలిపింది.

మలయాలో పోరాటానికి దరీ, దాపూ కనిపించటం లేదని హైకమిషనర్ టేంప్లర్ ఆందోళన ప్రకటించాడు. కెన్యాలో కూడా ప్రజా పోరాటాన్ని ఎదుర్కొంటున్న బ్రిటన్ మధ్య ఆఫ్రికాలో మరొక మలయాను సృష్టించుకుంటున్నది. ఆఫ్రికన్ల ఇష్టానికి వ్యతిరేకంగా మధ్య ఆఫ్రికా ఫెడరేషన్‌కు ఏర్పాటు చేస్తున్నది.

*     *     *

జూన్‌లో కర్నూలు తాత్కాలిక రాజధానిగా ఆంధ్ర శాసన సభ్యుల సమావేశం నిశ్చయించింది. అయితే, ఈ నెలలో మద్రాసు శాసన సభ ఆంధ్రరాష్ట్ర బిల్లును చర్చిస్తున్నప్పుడు ఆవిషయమై కమ్యూనిస్టేతర పక్షాలకు అభిప్రాయ భేదాలు బయలుదేరినవా, కృషికార్ లోక్ పార్టీ మళ్లీ తిరుపతి, లేకపోతే వాల్తేరు అంటున్నది. ప్రజా

సోషలిస్టులు వాల్తేరు పక్కకు మొగ్గుతున్నారు. ఈ సభా నిర్ణయం కేవలం సూచన ప్రాయమే అయినప్పటికీ, నైతికంగా దాని విలువ చాలా ఉంటుంది. అందులోనూ కర్నూలు నిర్ణయాన్ని మార్చాలన్న నిర్ణయం జరిగితే, దాని ప్రభావం అపరిమితంగానే ఉంటుంది. తొలి నిర్ణయం నాడు సభ్యులకు వోటింగుస్వేచ్ఛ ఇవ్వని సంజీవరెడ్డిగారు తమ మిత్రుల్లో కలిగే మార్పును ఊహించుకోలేక, ఈ సమావేశంలో స్వేచ్ఛను ఇచ్చామన్నారు. కాని తరువాత పరిస్థితులు వారికి అంత హితవుగాలేవు. విజయవాడ, గుంటూరుల పేర సవరణలు ప్రతిపాదించబడ్డవి.

మద్రాసు శాసనసభ ఆంధ్ర రాష్ట్ర బిల్లుకు మరొక ముఖ్య సవరణ చేసింది. సరిహద్దు సంఘాలు ఒరిస్సా, మధ్యప్రదేశ్‌లోని ఆంధ్ర ప్రాంతాల విషయమై కూడా పరిశీలించాలని సిఫార్సు చేసింది. ఒరిస్సాలోని ఆంధ్ర ప్రాంతాల దుస్థితిని థార్ కమిషన్ వివరించేఉన్నది కనుక, కేంద్రం దీన్నయినా దయవుంచి పాటిస్తుందేమో!

కొరియాలో ఏవిధంగానయినా యుద్ధ విరమణ జరక్కుండాచేసి, అమెరికన్ సహాయంతో కొరియా అంతటినీ ఆక్రమించుకోవాలని దక్షిణకొరియా నాయకుడు విశ్వప్రయత్నాలు చేస్తున్నాడు. దక్షిణ కొరియా ఒప్పందాన్ని పాటిస్తుందని మిత్రరాజ్య ప్రతినిధులు ఇచ్చిన హామీలను ఖండిస్తున్నాడు. అమెరికన్ నాయకులకు అతడి పట్ల తాత్కాలికంగానయినా కఠినమైన ఖరి చూపక తప్పటంలేదు. తటస్థరాజ్యాల సంఘంలో ఉన్న 5 దేశాలు ప్రతినిధులను పంపటానికి చేస్తున్న సన్నాహాలు చూస్తే ఒప్పందం కుదరవచ్చునని తోస్తున్నది. అయితే దీనివల్ల యదార్థ ఫలితాలు రావటమన్నది అమెరికన్ల చిత్తశుద్ధిమీదనే ఆధారపడి ఉంటుంది.

* * *

మన పొరుగు దేశమయిన నేపాల్ మరొకసారి కల్లోలానికి గురి అయింది. పశ్చిమ నేపాల్‌లో కమ్యూనిస్టుల నాయకత్వాన తిరుగుబాటు జరగ్గా, ఉత్తర ప్రదేశ్ పోలీసులు వెళ్ళి అణచవలసి వచ్చింది. ఇంతకు ముందొకసారి కూడా ఇదే విధంగా భారత సేనలు వెళ్ళి సాయపడ్డవి. అక్కడ రాజకీయ పరిస్థితులు చాలా అధ్వాన్నంగా తయారయినవి. సొంతపార్టీ అయిన నేపాల్ నేషనల్ కాంగ్రెసు నిరసనకు గురి అయి ప్రధాని పదవిని విడిచిపెట్టవలసిన ఎం. పి. కోయిరాలా మహారాజు కటాక్షంవల్ల తిరిగి ప్రధాని అయినాడు. దానిని యావత్తు రాజకీయ పక్షాలు నిరసిస్తున్నవి. ఢిల్లీ తుపాకుల బలంతో ఈ 'స్వతంత్ర' దేశం ఎన్నాళ్ళు ఈ విధంగా నిలబడి ఉంటుంది అన్న విషయం ఆలోచించదగ్గదే.

* * *

ఇటీవలే ఇజ్రేల్‌తో సంబంధాలు తెగతెంపులు చేసుకున్న రష్యా మళ్ళీ ఈ నెలలో రాయబార సంబంధాలు ఏర్పాటు చేసుకున్నది. యుగోస్లావియాలో రాయబారిని నియమించింది. గ్రీసులో రాయబారిని నియమించ నిశ్చయించింది. నల్లసముద్రంలో తనకుకూడా అధికారం ఉండాలని టర్కీతో ఇన్నాళ్ళుగా సాగిస్తున్న వాదాన్ని వదులుకున్నది. ఈ చర్యలు ఆయా దేశాల ప్రజలు-కనీసం- సోవియట్ యూనియన్ పట్ల- సద్భావాన్ని కలిగించగలవు.

★

---



---



మూలం : ద్విజేంద్రలాల్ రాయి.

అనువాదం : శ్రీమతి మాణి

—: o :—

[వెనుకటిగాథ : మేవాడ్ రాణా అమర సింహుడు మొగలు సైన్యం నెదుర్కొనుట కష్టమని, సేనాని అయిన గోవిందసింహుని యొక్కయు సామంతుల యొక్కయు అభి[ప్రాయ]ములకు వ్యతిరిక్తముగా సంధికి ఒప్పుకొనును. అమరసింహుని కుమార్తె సత్యవతి అజయసింహుని [ద్వారా] మొగలులు దండెత్తి వచ్చుచున్న సంగతి తెలుసుకొని రణక్షేత్రానికి రాణా రానిపక్షంలో సేనానాయక[త్వము] తాను వహిస్తానని, సమరసన్నాహం చేయపురి గొల్పుతుంది.

మొగలు సేనాని హిదయత్ ఆలీ సర్దారు, హుస్సేన్‌తో మాట్లాడుతూ "కాఫర్లనుగెలుచుట [కు]తినడంకంటే తేలిక" అంటూ హేళన చేస్తాడు.

ఉదయసాగర తీరాన మేవాడ్‌యువరాణీ మానసి తనచెంతకు వచ్చిన భిక్షుకి కుమారుని చూచి చక్కదనమునకు మురిసి వానిని తమకీయమని కోరుతుంది. భిక్షుకి బిడ్డ తనను వదలిపుండలేడనుటచే [రో]జుకోసారి వానిని ఆమె తగ్గరకు తీసుకొనిరావలసినదిగా కోరుతుంది. ఇక చదవండి.]

—★—

(భిక్షుకి వెడుతుంది)

మా : ఈ భిక్షుకి ఆశీర్వచనం యెంత మధురంగా ఉంది! జయభేరి రణ గాంభీర్యాన్ని మించియు మాతృ ఆశీర్వాదంకంటె స్నిగ్ధంగా పసిపిల్లల పసిడి పలుకులకంటె తియ్యగా వుంది.

(అజయసింహుడు వస్తాడు)

అ : మానసీ !

మా : రా, రా, అజయా. బలే సంతోషంగా వుందీ రోజు. నా ఆనందంలో నీవూ కొంత పాలు పంచుకో.

అ : నీ ఆనందానికి కారణం ?

మా : అబ్బ, యెంత సంతోషంగా వుందని. [న]దివలె నిండుగా వుంది గుండె. ఈవేళ భిక్షుకి ఆశీర్వదించింది అజయా.

అ : మానసీ, ప్రపంచంలో నిన్ను మనసా [దీవించని] వారుండరు. మేవాడ్ రాకుమారి ప్రశంస [లో] చెవిని పడుతూనే వుంది.

మా : నిజంగానా? అయితే మరి నేనెప్పుడూ [వినలేదే]

అ : ఒక్కసారి యిల్లు విడిచి బయటికి పోతే [తెలుస్తుంది]

మా : వెడుతూనే వున్నా నజయా. అక్కడొక అతిథి శాల కట్టించాలే. నిత్యం అక్కడికి వెళ్ళి స్వయంగా

అతిథులకు భోజనం పెడుతున్నాను. అట్లా చేయక పోతే మనస్సు తృప్తిగా వుండదు.

అ : నీ జీవితం ధన్యం మానసీ. నీ దగ్గర సెలవు తీసుకో డానికి వచ్చాను మానసీ ఈవేళ.

మా : ఎక్కడ కేమిటి ప్రయాణం?

అ : రణరంగానికి,

మా : ఎప్పుడు వెళ్ళడం?

అ : రేపు ప్రొద్దుట.

మా : మళ్ళీ యెప్పుడు?

అ : ఏమో, తిరిగి వస్తానో రానో యెవరు చెప్పగలరు?

మా : అదేం?

అ : అక్కడ మరణించవచ్చుగదా.

మా : ఓహో ! (తల వంచుకొంటుంది)

అ : మానసీ, ఒక వేళ నే తిరిగి రాకపోతే?

మా : రాకపోతే?

అ : నీకు విచార మెయ్యదూ?

మా : వేస్తుంది.

అ : ఎంత నిర్లక్ష్యం మానసీ—

మా : ఆగావేం! అజయా, చెప్పు.

అ : నిన్నెంతగా ప్రేమిస్తున్నానో తెలుసా?

మా : తెలియకేం, అమితంగా ప్రేమిస్తున్నావు.

అ : మరి నన్ను నీవు?

మా : ప్రేమిస్తున్నానే.

అ : అయితే నీప్రేమ యింకెవ్వరిపైనా లేనట్లేనా?

మా : ఎందుకు లేదు? మానవ మాత్రు లందరిపైనా వుంది.

అ : కాఠిన్యం ! నిర్దాక్షిణ్యం !

మా : అజయా! నిన్ను తప్ప యింకెవర్నీ ప్రేమించ కూడదూ? నీ వొక్కడవే నాహృదయంపై అధికారం చెయ్యాలనా?

అ : (నిట్టూర్చి) మానసీ! నీకింకా ప్రపంచ జ్ఞానం రాలేదు

మా : కోపం వచ్చిందా అజయా? నా నేర మేమిటి, మానవుల్ని ప్రేమించడమే తప్పా? అయితే నన్ను శిక్షించు, అజయా నీకు తోచిన విధంగా శిక్షించు.

అ : నిన్ను శిక్షించడమా— నేను?

మా : అవును నీవే. ఇటు చూడు అజయా. నీవు రణ భూమికిపోతున్నావు. అక్కడ నీవు చంపేవారి సంఖ్య అధిక మయిన కొద్దీ నీ కీర్తి అతిశయిస్తుంది. అలాగే నేను ప్రేమించే వారి సంఖ్య పెరిగిన కొలదీ నా తప్పు పెద్ద దవుతూ వుంటుంది. కాదూ?

అ : క్షమించు, మానసీ. నేను మూర్ఖుణ్ణి. ఆకాశ సదృశ మైన నీహృదయాన్ని అరచేతి వంటి నా హృదయంలో యిమిడ్చి జూశాను. నీవు సర్వప్రపంచాన్నీ ప్రేమించు. నీ వుదార హృదయంలో విశాల విశ్వాసాన్ని నిల్పుకో. ఇంక సెలవా, మరి?

మా : మంచిది, అజయా, వెళ్ళిరా. ప్రపంచంలో అన్యా యం, అత్యాచారం ప్రబలి నప్పుడు ధర్మ సంస్థాపనార్థం అప్పుడప్పుడు యుద్ధాలు తప్పనిసరి అవుతూ వుంటాయి. కాని సంగరం బహు నింద్యం. సాధ్యమైనంత వరకూ నీ పవిత్రతను కాపాడుకో. (అజయసింహుడు వెడతాడు)

మా : వెళ్ళు, అజయా నీవు రణక్షేత్రానికి వెళ్ళు. నా శుభ కాంక్ష నీకు రక్షా కవచమై కాపాడుతుంది. అయితే యుద్ధంలో మరణించే వారందరి మాటా యేమిటి? వారి భార్యలు, తల్లులు, పిల్లలు నావలెనే భగవంతుని ప్రార్థిం చరా తమ వారిని కాపాడమని? ఎందరి ప్రార్థనలు నిష్ఫలమవుతవో ! ఎందరి ప్రయత్నా లువ్యర్థ మవుతవో ! దీనికి ప్రతి క్రియ లేదా? (సజల నేత్రాలతో పైకి చూస్తుంది. కొంత సేపటికి ముఖం ప్రసన్నం అవుతుంది.) యుద్ధంలో చనిపోయే వారికి నేచేయగల సహాయ మేమీ లేదు. కాని గాయపడిన వారికి సేవ చేయవచ్చుగదా. (ఆలోచించి) అందులో తప్పేముంది? లేదు. అదే నా కర్తవ్యం?

(రాణీ రుక్మిణి వస్తుంది)

రాణి : చూశావా, మానసీ?

మా : ఏమిటమ్మా?

రా : మా నాన్నగారు యుద్ధానికి వెళ్ళారు.

మా : విన్నాను.

రా : మొగలులతో యుద్ధానికి.

మా : అవునమ్మా విన్నాను.

రా : ఇంత నిర్లక్ష్యమే మామ్మా. "అవునమ్మా విన్నా" నని మెల్లిగా చెబుతున్నావు. అదేమన్నా వెన్న తినడంలా సున్నితమైన పననుకున్నావా? యుద్ధంలో వేలకొలది చచ్చిపోతారు. తెలుసా?

మా : చనిపోవచ్చు.

రా : చనిపోవచ్చు కాదు. చనిపోతున్నారు. యుద్ధానికి వెళ్ళిన వాళ్ళంతా పోతున్నారు. ఇంక వెళ్ళని వాళ్ళ సంగతి యేం కానుందో?

మా : మనమేం చేయగలమమ్మా?

రా : నీ పెళ్ళి స్థిరపరచాను. కాని చేసే దోవ కనిపించదు. ఈ గల్లంతులో యెలా చెప్పు?

మా : నిజమే.

రా : నిజమే అని వూరుకుంటే యెల్లా? పెళ్ళి కాకపోతే యేమవుతుందో తెలుసా?

మా : హాయిగా వుంటుంది.

రా : అలాగా! నాకు తెలియదులే! ఆడ పిల్లకి పెళ్ళి కాకపోతే నిద్దరడుతుందా తల్లికి? జోధపురపు సంబంధం ఒప్పుకున్నాను. ఇంతలో మాయ యుద్ధ మొచ్చి పడింది. పెళ్ళి పనేదో కానిచ్చుకుని వెళ్ళరాదూ యుద్ధానికి? ఎందుకు వారు నా మాట వినరు.

మా : విచారించకమ్మా. యెందుకొచ్చిన పెళ్ళి. నే నో మంచి పని తలపెట్టాను.

రా : ఏమిటది?

మా : రణ క్షేత్రానికి వెడతానమ్మా.

రా : ఎందుకు?

మా : యుద్ధంలో పెక్కురు మరణిస్తున్నారని చెప్పావు చూడమ్మా నీవు. శాశ్వతంగా కన్ను మూసిన వారికి నే చేసేదేమీ లేదనుకో. కాని గాయ పడిన వారికి శుశ్రూష చేయవచ్చు.

రా : దారుణం! అజయసింహుని జోస్యాలేనా యిక?

మా : అక్కె, యిందులో అతని ప్రమేయమే లేదు. అతడు సంహారానికి వెళ్ళాడు నే సంరక్షణకు వెడతాను.

రా : అది సాధ్యమే?

మా : ఎందుకు కాదు?

రా : ఉహుం నీవు గడపదాటి కాలు కదపటానికి వీల్లేదు.

మా : నేవెళ్ళి తీరాలమ్మా. నీవు నిశ్చింతగా వుండు. విద్యుక్త ధర్మం పిలుస్తున్నప్పుడు నే నింకోరిమాట వినిపించుకోనని నీకు తెలుసు. ఇంక వెళ్ళమ్మా నే ప్రయాణ సరంజాం చేసుకుంటాను.

రా : ప్రయాణం యెవరితో?

మా : అజయ సింహుని సైన్యంతో.

రా : ఇంకేం? నే అనుకున్నంతా అయింది. సమయానికి నాదుకూడా లేరు. కబురు చేసే విధం కనుపించదు.

మా : నాన్నగారే యిక్కడ వుంటే నన్నెప్పటికీ అడ్డం పెట్టేవారు కారు. కరుణా మూర్తులు, వారి స్వభావం నాకు బాగా తెలుసు.

రా : వారి భయం లేకే నువ్విలా తయారయ్యేవు. ముందేదో వుప్పెన కనిపెట్టుకుని వుంది.

మా : నువ్వేం బాధపడకమ్మా. మానవుడు తోటి మానవుణ్ణి హింసిస్తున్నాడు. ఓడినంత మట్టుకు యీ దురాచారాల్ని అరికట్టాలి. అమ్మా, వెళ్ళు. విచార కారణం లేదు.

రా : కలియుగం నాలుగు కాళ్ళా నడుస్తున్నది.

(వెళ్ళిపోతుంది)

మా : నాకీ ఆలోచన ఎలా తట్టిందో? పూర్వం యీ ఊహా జ్యోతి నాహృదయ మందిరంలో యెక్కడో మినుకు మినుకు మంటున్నది కాబోలు. ఇప్పుడు దాని కాంతి దేదీప్యమానంగా ప్రజ్వలించింది. ఇదొక నూతనోత్సాహం! పరమానందం! దీని ముందు వైవాహిక జీవిత సౌఖ్యం యేపాటిది!

(తెర)

## రంగము-౬

(మేవాడ రణ క్షేత్రం. సాయంకాల సమయం. హిదాయత్ ఆలీ డేరాలో కూర్చుని హుస్సేన్‌తో మాట్లాడుతూ వుంటాడు. ఒర తీసిన కత్తులు చేపట్టి ద్వారంలో యిద్దరు సైనికులు నిలిచి వుంటారు. బయట సమర కోలాహలం)

హిదా: హుస్సేన్ మేవాడ సేన యెంతుందంటావ్?

హు: అయిదు వేల లోపు.

హి: హ్వా, హ్వా, హ్వా, హ్వా ఇంకా రాజపుత్రులు పరుగుచ్చుకోలేదూ?

హు: నహీ, జనాబ్.

హి: పొద్దుణించి యుద్ధం చేస్తున్నారు. ఇంకా పరుగుచ్చుకోలేదూ?

హు: అచ్ఛా, వారు దీని అంతం చూస్తారు.

హి: వీళ్ళకీ యుద్ధం చేతయినట్టుందే.

హు: ఇంకా అందుకు సందేహమా?

హి: రాజపుత్రుల గోలే కాని మన సిపాహీల సందడి వినిపించదేం? వాళ్ళు యుద్ధం చేస్తున్నట్టేనా?

హు: ఎందుకు చేయడంలేదు? ఒక్కసారి బయటికి వెళ్ళి స్వయంగా చూడకూడదూ. సేనానాయకులాయిరి!

హి: ముమ్మాటికీ సేనా నాయకుణ్ణే. కాదని యెవరంటారు? వాళ్ళకు మా బావ యినాయత్ ఖా ఒక్కడు చాలు. బయటికి వెళ్ళండి వెళ్ళండి అంటావ్. వాళ్ళు నా ముందర యేం అగ గల్రోయ్ పాపం!

హు: చిత్తం! చిత్తం! అవుగో వినండి రాజపుత్రుల సింహనాదం! అదిగో వారి కోలాహలం!

హి: హుస్సేన్, యేం జరుగుతోందో కాస్త వెళ్ళి చూసొద్దూ.

హు: బాగుంది!

హి: ఒద్దొద్దు. వెళ్ళకు హుస్సేన్. నాకిదో దురలవాటయి పోయింది. చీకటి పడితే ఒక్కణ్ణే వుండలేను.

హు: ఇంకేం చేయగలరు?

హి: చూడు మళ్ళీ గోల వినిపిస్తోంది.

హు: అవును క్రమంగా దగ్గరవుతోంది కూడాను.

హి: ఆఁ.

హు: ఎవరో వస్తున్నట్టున్నారు.

హి: అయ్యబాబోయ్! (హుస్సేనుని పట్టుకొంటాడు)

(ఒక సైనికుడు వస్తాడు)

హి: ఏమిటి విశేషాలు?

సైని: ఫౌజుదారు సమ్‌షేరుబా పోయాడు, ప్రభూ.

హి: ఎంతపని జరిగింది. ఇనాయత్ ఖా బాగున్నాడుకదా!

సై: చిత్తం!

హి: సరే వెళ్ళు. (సైనికుడు వెడతాడు)

హి: ఇదేదో బెడదగానే వుందే.

హు: ఏమి టనుకున్నారు మరి? ఆవేళ మేవాడ్ ఓడించడం చిన్న చిటిక వేయడంతో సమాన మన్నారు జ్ఞాపకముందా? ఇప్పుడు తెలుస్తోందా రాజపుత్రులు గొర్రెలవునో కాదో చూడండి వాళ్ళింకా దగ్గిరికొస్తున్నారు.

హి: చివరి కేమవు తుందో?

హు: అదే తెలియడంలేదు.

(రెండవ సైనికుడు వస్తాడు)

హి: ఏమిటి సమాచారం?

సై: చక్రవర్తి సైన్యం పారిపోతోంది, హుజూర్.

హి: అగోల అదేనా? (ఇంతలో మూడవ సైనికుడు వస్తాడు. అతడి నుద్దేశించి)

ఏం జరిగింది?

మూ.సై: ఇనాయత్ ఖా చచ్చిపోయాడు, ప్రభూ.

హి: ఆఁ! ఆఁ! నిజమే! ఎంత పని జరిగింది! అదిగో మళ్లీ రాజపుత్రుల గోల. చూడు హుస్సేన్, అది మరి దగ్గరవుతోంది.

హు: ఒక్కసారి మీరు వెళ్ళి చూద్దురూ.

హి: ఉండవోయ్! అదిగో విను!

హు: వినక చేసేదేముంది. సందడి మరీ సమీపిస్తుంది.

(తెరలో "పరుగెత్తండి, పరుగెత్తండి")

# మేవాడ్ పతనం

హి: ఎటు?

హు: ఇటు.

(హుస్సేన్ పరుగెత్తుకు పోతాడు. హిదాయత్ ఆలీకి పరుగెడు తుండగా తుపాకి గుండు తగలడంవల్ల క్రింద పడిపోతాడు. మేవాడ్ పతాకంను ధరించి అజయసింహుడు అతని వెంట కొందరు రాజపుత్ర సైనికులు వస్తారు.)

అ: జై! మేవాడ్ రాణాకు జై!

సై: జై! మేవాడ్ రాణాకు జై!

హి: (చేతులు జోడించి) శరణు! శరణు! నన్ను చంపకండి హుజూర్. కావలిస్తే ఖైదులో పెట్టుకోండి.

అ: ఎవరు నువ్వు?

హి: చక్రవర్తి సేనాపతిని.

అ: అయితే యుద్ధభూమిని విడిచి యిక్కడున్నావేం?

హి: ఆఁ ఎందు... కున్నా... నంటే... మరి...మరి... మరిచి పోయాను. చంపెయ్యకండి జనాబ్ నన్ను.

అ: ఈ ధైర్యశాలి వచ్చాడండి మేవాడ్‌ను జయించ డానికి! (హిదాయత్‌తో) భయపడకు. నీప్రాణాని కొచ్చిన ముప్పు లేదు. (సైనికులతో) విజయ నాదం చేయండి.

హి: ఓ చేసుకోండి. అందుకు నేనేం అడ్డు పెట్టను.

(సైనికులతో అజయ సింహుడు వెళ్ళిపోతాడు)

అమ్మయ్య, ఒ......తి......కా......ను. దాహం! నీళ్ళు! నీళ్ళు!

అంతర రంగం.

(రణ భూమి. అర్ధరాత్రి సమయం. ఎక్కడ చూసినా శవాల పోగులు, క్షత గాత్రుల సమూహాలు. సైనికులతో మానసి యిటు నటు తిరుగుతూ వుంటుంది. ప్రతి సైనికుని చేతిలోను కాగడా వుంటుంది.)

మా: ఇదుగో, కొందరు అటు వెళ్ళండి. ఇక్కడ నే చూస్తున్నాను.

(సైనికులు వెడతారు)

మా: హైరా, ఎన్ని సాహస్యాలు! ఎక్కడ చూసినా ఏడుపులు, మూలుగులు, యెంత దారుణంగా వుంది. పరమేశ్వరా నీ రాజ్యంలో మనిషి మనిషిని తినాలని శాసించావా? లోకంలో యీ హింసాకాండకు అంతు లేదా? బహుశా ఇది నీకు వినోద కాలక్షేపం అయి వుంటుంది. లేకపోతే ప్రపంచంలో పాప పిశాచం విజృంభించి, భయంకరమైన వికటాట్టహాసం చేస్తూంటే, చూస్తూ వూరు కోవడం యేమిటి? అబ్బా, యేమి కరుణ దృశ్యం! ఎంత మర్మ భేదకంగా వుంది! వినువీధి పెంటలు చూసే శక్యం గాకుండా వున్నది. రామచంద్రా, వికలాంగుల రోదనలు వినలేను!

ఒకడు: అయ్యో, బాధ.

మా: అన్నా, దెబ్బ యెక్కడ తగిలింది. అయ్యో, పాపం, ఎంత కష్టం!

అతడు: ఇక్కడిక్కడ. అమ్మా, నువ్వెవరమ్మా?

మా: ఎవరయితే యేం లే. నీవు మాట్లాడకుండా పడుకో. (గాయానికి కట్టు కట్టి ఒక సైనికునికి సంజ్ఞ చేయగా ఒక గిన్నె తెచ్చి యిస్తాడు) ఇదుగో మందు తాగు. నీకేం భయం లేదు. (అతడు త్రాగుతాడు. అక్కడే మూలుగుతున్న మరొక సైనికునితో) నీబాధ పోయేలా మందిస్తాను. మాట్లాడకుండా పడుకో.

(అక్కడే బాధపడుతున్న మరొకణ్ణి సమీపించి,చూసి) ఫరవా లేదు. బ్రతకొచ్చు. (ఒక సైనికునితో) ఇతణ్ణి చూడు.

హి: దాహం! దాహం! నీళ్ళు! నీళ్ళు!

మా: (హిదాయత్‌ను సమీపించి ఒక సైనికుని వద్దనుండి మంచినీళ్ళ గ్లాసు తీసుకుని యిస్తూ) ఇవిగో మంచినీళ్లు త్రాగు.

హి: (త్రాగి) అమ్మా, బతికాను.

(సైనికులతో అజయ సింహుడు వస్తాడు)

అ: ఎవరది యీ అంధకారంలో? — మేవాడ్ రాకుమారియా!

మా: ఎవరు వారు? అజయా.

అ : (సమీపించి) నేనే మానసీ.

మా: అజయా నాకు కొందరు సైనికుల్ని యివ్వు. మావాళ్ళు చాలటంలేదు.

అ : సాహాయ్యం చెయ్యాలేమిటి?

మా: క్షతగాత్రుల్ని సేవా శిబిరానికి చేర్చాలి.

అ : సరే. (సైనికులతో) వీర్ని తీసుకు వెళ్ళి సరంజాం చేయండి.

(సైనికులు వెళ్ళిపోతారు)

మా: ఎంత ఆనందం!

అ : ఎటువంటి తేజస్సు!

మా: ఎక్కడ?

అ : నీ ముఖ చంద్రబింబంలో వికట ఆర్తనాదావృతమైన మన జన్మభూమిలో, మృత్యుదేవత లీలా క్షేత్రంలో, భయంకరమైన యీ స్మశానంలో, నక్షత్ర ద్వితీయమైన యీ అంధకారంలో ఆ జ్యోతి యెట్లా ప్రకాశిస్తున్నదో! తుపానావృత సాగరముపై ప్రకాశించు ప్రభాత సూర్యుని పగిది, కాల మేఘాలలో స్థిరత్వం దాల్చిన తటిల్లత గీతి, దుఃఖోపశమన కారియగు కరుణ పోల్కి — ఔరా! యేమి మూర్తి! ఆ సౌందర్యం, శోభా, గరిమా, అపూర్వం! — మానసీ! (ఆమె చేయి తన చేతిలోనికి తీసుకొంటాడు)

(తెర)

## ద్వితీయాంకం

### రంగము- ౧

[ఆగ్రాలో నగరసింహుని యిల్లు. ప్రాంతఃకాలం నగరసింహ, అరుణసింహులు మాట్లాడుకొంటూ వుంటారు.]

నగర: అరుణా, దేవారిక యుద్ధంలో అమరసింహుడు జయించాడు. మొగలు సైన్యాన్ని గడ్డిపరకవలె యెగర గొట్టేశాడు. ఆశ్చర్యం!

అరుణ: మామ, అరుణసింహుడు ధన్యుడండీ.

స : చిన్నప్పుడు యెలా తిరిగే వాడనుకున్నావు. ఇంతటి వాడు అవుతాడని కలలో నైనా అనుకోలేదు.

అ : సాధారణంగా మహిమాన్వితులు మొదట్లో అలాగే వుంటారు. వాల్మీకి మహర్షి మొదట్లో దొంగ కదా.

స : ఎవరా మహర్షి? తులసీ దాసు కొడుకా?

అ : వాల్మీకి మహామునినే యెరుగరా తాతగారూ?

స : ఏమో, యెక్కడా చూచిన జ్ఞాపకం లేదు.

అ : త్రేతాయుగం నాటి మహర్షిని చూడ్డమేమిటండీ!

స : త్రేతా యుగమా! అయితే అప్పటికి మనం పుట్టనే లేదు. పేరు విన్నాలే, మంచి రసికుడట మనిషి.

అ : చాల్లెండి తాతగారు! వారు రామాయణ మహా గ్రంథాన్ని రచించిన పుణ్యపురుషులు.

స : రామాయణమా? ఏమిటి దానిలో ఉన్న గొప్ప?

అ : రామ కథనే యెరుగరా మీరు? శ్రీరామ చంద్రుడు మన మూల పురుషుడు. రామాయణంలో ఆయన పవిత్ర చరిత్ర కీర్తించ బడింది. మీకు తెలీదూ? రామ! రామ!

స : ఏమిటోరా అబ్బాయి. అవన్నీ చదవడానికి నాకు తీరికేదిరా? నాకాలం అంతా యుద్ధంలో నే గడిచి పోయింది.

అ: మీరు యుద్ధం చేసే వారాండి?

స : పెద్ద పెద్ద యుద్ధాలే చేశాన్రా బాబూ! అప్పటికి నీవు పుట్టనైనా లేదు.

అ : ఎవ రెవరితో చేశారండి?

స : ఆఁ, అవన్నీ జ్ఞాపకమున్నాయా యిప్పుడు! అప్పటికి మీ అమ్మ —

అ : మా అమ్మ యెక్కడుండండీ, తాతగారూ?

స : అదే తెలియదు నాయనా, ఎప్పుడు చూసినా "మేవాడ్" అని పలవరిస్తూ వుండేది. ఒకరోజు హఠాత్తుగా మాయ మయింది. ఎక్కడుందో యిప్పటికీ తెలియలేదు.

అ : మా నాన్నగారు?

స : గజసింహునితో గుజరాతు యుద్ధానికి వెళ్ళి మరణించాడు.

# మేవాడ్ పతనం

అ : మా అమ్మ మేవాడ్‌లో వుంటుంది కాబోలండీ.

స : ఉండవచ్చు.

అ : తాతగారు, చిన్న తాతగారు దేశం కోసం ప్రాణం యిచ్చారు గదా, మరి మీరు దేశాన్ని ఒదిలి వచ్చే శారేం?

స : ఏమిటోరా, పాపం వాడు చిన్నతనంలోనే పోయాడు. వాడంటే నాకెప్పుడూ గౌరవమే. కాని నామాట వినే వాడు కాడు. నేనేం చేయను చెప్పు?

అ : ఇప్పుడు ఎవరు చూసినా ఆయన కీర్తిని గానం చేసే వారే.

స : ప్చ్, దానివల్ల లాభ మేమిటిరా. తాను గతించాడు. ఇప్పుడు లేచి వచ్చి తన కీర్తి గీతాలను వినలేడు కదా! వాడిస్వభావమే వేరురా. నాకు బాగా జ్ఞాపకం. ప్రతాపుడూ నేనూ చిన్నపిల్లలం. ఒక ముంగీ, పామూ పోట్లాడు కుంటున్నాయి. నేను ముంగిస జయిస్తుందనగా వాడు పాము గెలుస్తుందన్నాడు. కొంత సేపయిన తరువాత ముంగి పాము నెత్తి పైకెక్కి కూచుంది. పాము తల నేల నేసి కొట్టుకు చచ్చింది. ముంగిసకు ఆహారమైన పాము దాని ముందర యెంతో కాలం నిలవలేదు. కనుక నే నేను ముంగి పక్షం పలికేను. ప్రతాపుడు మాత్రం కాదన్నాడు. ఈ విషయంలోను అంతే అనుకో.

అ : మరి యీ దేవారక విజయం మాటు?

స : అసలు అది వీర వంశంరా. అయినా! దాని సహజ బలాన్ని యెంతకని నిరోధించగలరు? (నిట్టూర్చి) ఏమిటో, హిందువుల సంఖ్య నానాటికీ క్షీణిస్తున్నది. హిందువుల్ని తమ మతంలోనికి మార్చుకొనియైనా మహమ్మదీయులు తమసంఖ్యను వృద్ధి చేసుకొంటూరు. కాని హిందువులట్లా చేయరు. భూమాత హిందువుల్ని మరిచి పోతున్నది.

అ : ఏమిటండీ?

స : ఏముంది నాయనా. నీ మేనమామ చూడు. ఇట్టే ముసల్మానై ఊరు కున్నాడు. అలాగే అబ్దుల్లా హిందువవు తాడా? ఎన్నటికీ కాడు.

అ : తాతగారూ, [illegible] నాకేమీ?

స : అది సాధ్యం లేదు బాబూ. నా [illegible], నాకేమీ సాహసం [illegible], నిదానం [illegible]. అయినా నాకెంత [illegible]. [illegible] నేను మహమ్మదీయుల పక్షం అవలంబించాను. [illegible] [illegible] స్వీకరించాడు.

అ : అట్లా. మీకు ఆ ఆలోచన వుంటే వుండవచ్చు. లేకపోతే [illegible] [illegible] కీలుబొమ్మ పుత్రికలు!

(సైనికులు సేనాని అబ్దుల్లా వస్తాడు)

స : నమస్తే. అబ్దుల్లా సాహెబ్ !

అ : నమస్తే, రాణా సాహెబ్ !

స : రాణా యెవరండోయ్?

అ : తమరే.

స : దేనికి?

అ : మేవాడ్‌కు.

స : మేవాడ్‌కు రాణా అమరసింహుడు కాదూ?

అ : ఇకముందు మీరే.

స : కారణం?

అ : చక్రవర్తి యిష్టం. మీరు చిత్తూరు వెళ్ళాలి.

స : ఎందుకు?

అ : అది మీరాజధాని కనుక.

స : అమరసింహుని రాజధాని, ఉదయ పురమా?

అ : చక్రవర్తి అమరసింహుని సింహాసన భ్రష్టుని చేసారు.

స : ఎట్లు?

అ : బల ప్రయోగం వల్ల.

స : అయితే నే పోయి ఆయనతో పోరాడాలా? ఒద్దు, సాహెబ్, నాకు రాణా పదవి ఒద్దు.

అ : ఎందు కొద్దూ? మీజీవిత మంతా యుద్ధం లోనే గా గడిచింది? వెళ్ళి యుద్ధం చేయండి.

స : ఊరుకోరా, నిన్నెవ్వ రడిగారు? (అబ్దుల్లాతో) ఒద్దు

బాబూ, నేయుద్ధం అపి చెయ్యలేను. అందుకనే కిక్కురు మనకుండా మొగలుల పశమయ్యాను. చేత నయితే నాదేశం కోసమే పోరాడి వుందును.

అ : రాజా సాహెబ్, భయపడకండి. అసలు యుద్ధావసరమే రాదు. అథవా వచ్చినా మేం వున్నాం. మీరు మేవాడ్ రాణాగా చిత్తూరు పోతే చాలు.

స : అమర సింహుడు చిత్తూరుపై దండెత్తితే?

అ : ఇన్నాళ్ళూ దండెత్తని వారు అప్పుడు యెత్తుతారా?

స : వహ్వా. బాగుంది మీవాదం. ఒకప్పుడు జరగని పని ఇంకెప్పుడూ జరగదా? ఇదే సూత్రం అన్నిటికీ వర్తిస్తే యిక ప్రపంచంలో "ఆశ"కు ఆస్కారం వుండదు.

అ : మీ రనేది అర్థం కావడం లేదు.

స : ఏ ముందయ్యా. నీవు బ్రహ్మచారిగా వున్నంతసేపు భార్య వుండదు. అంటే యింకెప్పుడూ వుండదనే. (అరుణునితో) యెందుకురా నవ్వు తావూ. (అబ్దుల్లాతో) పాము యిదివర కెప్పుడూ కరవలేదు కాబట్టి యికముందు కరువదా?

స : తమరు కోప్పడు తున్నట్లున్నారు.

అ : అహాఁ. మీకు జవాబు చెబుతున్నాను. దానికేంగాని క్షమించి రాణా మాట యెత్తకండి.

అ : సరే చక్రవర్తి వున్నారుగా. మీ అభిమతమేదో వారితో చెప్పుకోవచ్చు.

స : కానివ్వండి. అన్యాయంగా అమరసింహుని పదవిని ఆక్రమించు కోమని నా మెడలు వంచుదామని కాబోలు చూదాంగా, అరుణా పద. (తెర)

## రంగము-౨

(ఉదయపుర రాజాంతఃపురం. ప్రభాత సమయం మానసి ఆలోచనా నిమగ్నయై కూచుండగా అజయసింహుడు వస్తాడు.)

మా: వచ్చావా, అజయా? ఎంత కాలానికి! కులాసాగా ఉంటున్నావా?

అ : ఏదో ఉంటున్నాను.

మా : నిన్ను గురించి నాన్నగార్ని అడిగాను. నీతో యేం చెప్పలేదూ?

అ : లేదు. ఒంటరిగా వున్నావేం, మానసీ?

మా: ఏముందీ. యేదో ఆలోచిస్తూ కూచున్నాను.

అ : దేనిని గురించో నే తెలుసుకో వచ్చా?

మా: నిరాటంకం గాను. అజయా, మొన్న యుద్ధంలో నాకొక పరమ సత్యం తెలిసింది, అజయా. ఈ మానవ జాతి దీనాతి దీనమైనది సుమా. అంతే కాదు అమిత దుర్బల మైనది కూడ. ఒక్క కత్తిపోటు కాగలేని అల్ప జీవులు, కాస్త జర్వంవస్తే పసి పిల్లలవలె అసహాయులై పోతారు గద! 'జాతస్య మరణం ధ్రువం' అసలు మానవ రక్తంలోనే మృత్యు బీజాలు మిళితమై ఉన్నాయి. ఇది తెలిసే పరస్పరం ప్రేమించు కోనక ద్వేషించు కొంటా రెందుకో! ఏమిటజయా అలా చూస్తావు? నాముఖంలో ఏముంది?

అ : ఆనాటి తేజఃపుంజాలు. అవి అట్లనే ప్రకాశిస్తున్నాయి సుమా మానసీ.

మా: తేజస్సా? ఏనాటిది?

అ : దేవారక రణభూమిలో నాటిరాత్రి – ఆ అంధకారంలో నీవు కరుణ స్వరూపమైన దివ్యతేజో మూర్తివిగా ప్రకాశించావు. ఆ క్షణమే నాప్రేమ నిష్ఫలమనే నిరాశతో ఒక్క నిట్టూర్పు విడిచాను.

మా: నిరాశ యెందుకజయా?

అ : నీవు నాకు దక్కవని! నిజం చెబుతున్నాను, మానసీ. నీవొక దేవతా మూర్తివి. నీఆత్మ జ్యోతి అపూర్వ ప్రభల్ని ప్రపంచం భరించ లేదు. బహుశా అందుకే పరమేశ్వరుడు సుకుమార సుందరమైన శరీరంతో దానినాచ్ఛాదించి వుంటాడు. ఆ కాళరాత్రి ఆ భీభత్స రణాంగణంలో ఒక అపూర్వ రూపకానికి మహానాయకివై నిలిచావు - మానసీ, నాకు నిన్ను ప్రేమించే అర్హత లేదు. కాబట్టి భక్తి పురస్సరంగా ఆరాధిస్తాను. దానిని గుర్తించి, ప్రతిఫలంగా స్వల్పాతి స్వల్పమైన కరుణ –

# మేవాడ్ పతనం

కరుణాలేశం ప్రసాదించు. ఏం, నా ప్రార్థన మన్నిస్తావా?

(మానసి చేతిని తన చేతుల్లోకి తీసుకొంటాడు. ఇంతలో రాణి వస్తుంది)

రా: అజయసింహా!

(అజయుడు మానసి చేయి విడిచి దూరంగా తొలుగుతాడు.)

మా: ఏమిటమ్మా?

రా: అజయా, యింకెప్పుడూ అమ్మాయితో ఏకాంతంగా మాట్లాడొద్దు.

అ : క్షమించండి.

మా: క్షమించడం దేనికి?

రా: మానసీ, నీవు యువరాణివి. తెలుసా? నడు, లోపలికి.
(మానసి వెళ్ళిపోతుంది)

రా: అజయా, నీవు గోవింద సింహాజీ తనయుడవు. మేం నిన్ను నా కుటుంబంలోని వానిగా యెంచుకొంటున్నాం. కాని యిప్పుడు మానసీ, నీవూ బొత్తిగా చిన్నపిల్లలు కారు. దాని దగ్గరకు వచ్చేటప్పుడు నువ్వీ విషయం జ్ఞాపకం పెట్టుకోవాలి. అసలు మీరు కలుసుకోకపోవడం మంచిది.

అ : ఆజ్ఞాను వర్తిని (నమస్కరించి వెళ్ళిపోతాడు)

రా: వెళ్ళావా, అజయా! నా మానసిని నీకివ్వగలిగితే! అది సాధ్యమా? అద్చే యెన్నటికీ కాదు. (నిశ్చయంగా) అసాధ్యం గురించి ఆలోచన దేనికి?

(అమరసింహరాణా వస్తాడు)

రా: మీరే వచ్చారా, నే మీదగ్గరికి రావాలను కొంటున్నాను.

రా: అది సరే కాని. మానసిని యేమైనా అన్నావా?

రా: లేదే!

రా: మరి అది యేడుస్తోందేం?

రా: బాగుంది! ఎందుకూ?

రా: ఏమో, వెళ్ళి చూడు.

రా: పిచ్చిపిల్ల! ఏమన్నావని? అసలు మిమ్మల్నే నాకు. దానిగురించి యేమీ ప్రసక్తేను కోదు. నాకైతే, అర్థం కూడా తెలియదు. అది నేనొచ్చేసరికి అజయసింహునితో_

రా: నోరుముయ్! మానసి విషయంలో ఆలోచించి మాట్లాడు. అది యెవరను కున్నావు?

రా: ఎవరు?

రా: అది నేను చెప్పలేను. అది యెవరో, యెక్కడనుండి వచ్చిందో యెవరికీ తెలియదు.

రా: అయ్యో, కర్మమా! తీరికూర్చుని యేడుపెందుకో. మా వేపుకు తింటుంది పిల్ల (వెళ్ళబోతుంది)

రా : ఇటు చూడు__ (రాణి నిలుస్తుంది.)

రా : ఈ రోజునుండి మానసి నేమీ అనకు. అది కేవలం దేవతా మూర్తి. ఈ ప్రపంచం మీద దయ కొద్దీ స్వర్గాన్ని విడిచి వచ్చింది. దాన్నేమైనా అంటే మనల్ని విడిచి పోతుంది. (రాణి నిస్పృహతో చూస్తూంటుంది. రాణా ఒక యెత్తైన పీఠ మలంకరిస్తాడు.) జీవితం ఒక కల (ఆకాశం పరికిస్తూ) ఆకాశం చూడు యెంత మనోజ్ఞంగా వుందో. ఆ నీలవర్ణం అతి స్వచ్ఛంగా ఉంది. ఆ మేఘాలు చూడు యెలా నడుస్తున్నాయో యేనుగు గున్నల్లాగ! కాని ఈ సౌమ్య స్వరూపానికి స్థిరత్వం లేదు. ఎప్పుడో ఒకప్పుడు భీభత్సాకారం దాల్చి వురుముతుంది. వర్షం కురుస్తుంది. పిమ్మట తిరిగి నిశ్చల శాంతి? (గోవింద సింహుడు వస్తాడు)

(సశేషం)

---

ఆలోచన అజ్ఞానపు తెరను చించుతుంది. విజ్ఞాన సంపాదనకు దారి తీస్తుంది.
కోరికలు గూడుకట్టుకొనియున్న మనస్సుకి ఆనందం వుండదు!
లోకం చెప్పెడి మంచిపనులను, నీ మనస్సుకి మంచివిగా తోచినట్లయితేనే చేయి!
ప్రపంచం ఒక అద్దము. నీవు నవ్వితే అదీ నవ్వుతుంది, నీవు కోపగిస్తే అదీ కోపగిస్తుంది:

— చ॥ స॥ నా॥ శర్మ.

# ★ కొన్ని సమస్యలు ★

* శ్రీమతి చుండూరి రమాదేవి *

నాడాదివారం. ఆదివారం ఆలుబిడ్డలతో ఆనందంగా కాలక్షేపం చేసే పర్వదినం. గుమస్తా జీవితంలో ఆదివారమనేది అధికారదేవుడిచ్చిన మహావరం. ఆదివారం నాటి కార్యక్రమం ఏమిటంటే, వారం రోజులనుండి పడ్డ బడలిక తీర్చుకోటానికి ప్రొద్దెక్కి లేవటం, గృహలక్ష్మి అందిచ్చిన అమృతోపమానమైన కాఫీ కసింత గొంతుకులో పోసుకొని అల్లా బజారుకెళ్ళి తిరిగి తిరిగి ఏపన్నెండింటికో యిల్లు చేరటం, భోంచేసి కాస్త నడుంవాల్చి ఒక్క కునుకు తీసేటప్పటికి యిల్లాలు ఏ బజ్జీలో, ఏ దోశలో గరంచా సిద్ధం చేయటం, ఒక్కొక్కటే నోట్లో వేసుకుంటూ, అర్ధాంగితో ఆమాటా యీమాటా ఆడుతూ, చివరికి ప్రణయకలహంలోకి దింపటం. మహా సరదాగా వుంటుంది. ఒకొక్కప్పుడు ప్రణయకలహం "ఇంతింతై వటుడింతయై" అన్నట్లుగా పెరిగి పెరిగి చివరికి ప్రళయ కలహంలోకి దిగటంకూడా కద్దు.

అట్లాంటి దివ్యమైన ఆదివారం రోజున మా అబ్బాయి పుట్టిన రోజు పండుగొచ్చింది. మా జానకికి వూపిరాట్టం లేదు. తలంట్లు, పిండివంటలు, కొత్తబట్టలు, మధ్యమధ్య పిల్లల హంగామా. చెడుగుడి ఆడుతోంది. మధ్యాహ్నం భుక్తాయాసంగా వుండి యిట్టే కన్నుమూసేనో లేదో, "ఏమండోయ్, మీరిల్లా పడుకొని గుర్రుకపెడుతోంటే ఎట్లా అప్పుడే మూడయింది. ముత్తయిదువులు వచ్చే వేళయింది. మీరింట్లో వుంటే సిగ్గుపడతారు. ఫలహారం చేసి బయటికి నడవండి" అంది మా శ్రీమతి. నా తలమీద పిడుగు పడ్డట్టయింది. "ఇదేమిరా భగవంతుడా, కాస్త విశ్రాంతిగా పడుకోకుండా యీ యెండలో ఎక్కడికి పోను?" అనుకుని. "చూడు జానీ, నా యెత్తంత ధనం పోసినా యిప్పుడు కదలలేను. సామానుగదిలోకి ఎవరూ రారుకనుక అక్కడైనా కాస్సేపు పడుకుంటాను, అలికిడి చెయ్యకుండా వుంటాను. మీ వేడుకలన్నీ అయిందాకా బయటకు రాకుండా వుంటా" నని ఆమెనే ఏలాగో వొప్పించాను.

ఆవిడ ఏకళనుందో సరేనని సామానుగదిలో కాస్తంత చోటుచేసి, పక్కవాల్చి, ఫ్లాస్కులో కాఫీ, టిఫిను ఓ మూల పెట్టి, తలుపు చేరేసి చకాచకాపోయింది. నిద్ర చెడిపోయింది. బద్ధకంగా అరమూత కన్నులతో పడుకున్నాను. అవతల కార్యకలాపాలు మహా జోరుగా సాగుతున్నాయి! అందులో ఆడవాళ్ళ గొంతుకలు సామాన్యమైనవి కాదుగా.

"కాంతమ్మగారూ రండి రండి, మీ అమ్మాయి రాలేదేం?"

"వస్తుందండి, తీరా వాకిట్లోకొచ్చేసరికి వెన్నవాడు వచ్చాడు, తూపించుకుని వస్తుంది" "అయితే జానికమ్మగారూ, మీరు అచ్చన్న దగ్గరేనా వెన్న తీసుకునేది?"

"కాదండీ, వాడు సమయానికి రాడు. మధ్య మధ్య ఇబ్బంది కలుగుతుంది. అంచేత స్టోర్సు నుంచి నెయ్యి తెప్పిస్తాను."

"అబ్బ, స్టోర్సు నెయ్యి మహా చెడ్డ వాసనండీ. మా పిల్లలు వూరికేనన్నా తింటారుగాని బజారు నెయ్యి వేసుకోరు. వాడితోనే తంటాలు పడుతున్నాం."

"అంత వాసనగా వుండదండీ, మేం వేసుకోడంలే, వెన్నమాత్రం అంత శ్రేష్ఠంగా ఏడుస్తోందీ? ఏదో ఒక నెయ్యి లేకపోతే మా పిల్లలు ముద్ద యెత్తరు."

"ఏమండోయి కాంతమ్మగారూ, మీ సరోజ వేసుకున్న గౌను రెడీమేడ్ కదూ?"

"అవునండీ"

"అందుకనే అలా వుంది. చౌకనుకుంటాం గాని రెడీమేడ్‌వి బాగుండవండీ, మనం చెప్పి కుట్టించుకుంటే పూసినట్టుగా వుంటాయి. నేనెప్పుడూ రెడీమేడ్‌వి కొనను"

"మా పిల్ల అల్లా వూరుకోదండీ, దానికెప్పుడు తోస్తే అప్పుడే కొత్త గౌను కావాలి. లేకపోతే నానా హంగామా చేస్తుంది. అప్పటికప్పుడు ఎవరు కుట్టిస్తారు. అదీగాక రెడీమేడ్‌వి చౌకగాదే, మనం గుడ్డకొని కుట్టించుకుంటేనే చౌకగా గిడతాయి."

"ఓహోహో, సీతమ్మగారూ రండి రండి. ఎన్నాళ్ళకెన్నాళ్ళకి! మా మీద సీతకన్ను వేశారు."

"సీతమ్మగారూ, ఆ చీర యెంతండీ, ఎక్కడ తీశారు?"

"మావారు పట్నంనుంచి తెచ్చారు. సూరువది"

"అందుకనే బాగుంది. మీకేం అదృష్టవంతులు. ఎప్పుడూ పట్టుచీరలే కడతారు."

"ఇంతుందన్న మాటేగాని ఆ లక్ష్మమ్మగారు అనుపైన గుడ్డే కొనదు. ఎప్పుడూ చౌకబారు చీరలేకాని, పట్టుపని పాతిక రూపాయల గుడ్డయినా కొనదు."

"మనకెందుకు వూరుకోండి ఆవిడ వస్తోంది. వింటే బాగుండదు."

ఈ విధంగా మహిళా మణులు వారు వచ్చిన పనే మర్చిపోయి చర్చను ప్రారంభించారు. నాకు మాత్రం బుర్రకు పనికలిగించారు. ఏమంటారా?

వెన్నరాచిన నెయ్యిగాని ఏనాడైనా వారి బిడ్డలు తింటున్నారా? ఏ నెయ్యైనా సరే లేకుండా ముద్ద ముట్టని వారి పిల్లలు సుఖపడుతున్నారా?

ఎప్పుడు రావలిస్తే అప్పుడే గొల్లు కొనిపించుకునే వారి బిడ్డల గారాబమెక్కువా? అమ్మా నాన్నా అనడంగా కట్టించేవాకా వేచియుండేవారి బిడ్డల గారాబమెక్కువా?

గుడ్డలు విరివిగా ఏ కంపెనీ చీరలో వాడే వాళ్ళు శ్రీమంతులా? ఏడాదికి ఏమూడో నాలుగో పట్టు చీరలతో కాలక్షేపం చేసే వారు శ్రీమంతులా? అన్న ఈ సమస్యలు మాత్రం బుర్ర బద్దలు కొట్టుకున్నా ఏనాటికీ తీరేట్లు కనిపించటంలేదు. పైపైన ఒడ్డేసుకుని మా ఆయనకి చెప్పినప్పుడే బయటికిపోతే బాగుండేది. అనవసరంగా బుర్ర పోగొట్టుకొనే స్థితిలో పడ్డాను. ఆనాటి పరివారం అల్లా ముగిసింది.

---

# ★ నిర్ణీత ధరలు ★

• శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి •

అది వేసవికాలం. ఎండలు చాలా ఎక్కువగా వుంటున్నాయి. రోజూ పగలల్లా ఎంత ఎండకాచినా సాయంకాలము మూడు గంటలయేసరికి మేఘము పట్టి కొంత చల్లపడుతూండేది. అప్పుడప్పుడు కొంచము వానకూడ పడేది. ఆ రోజు నాలుగు గంటలయినా ఎండ తీవ్రత తగ్గలేదు. బైటికి రావడమంటే భయంగావుంది. కాని పనులున్నప్పుడు ఎండా, వానా చూచే స్వభావము కాదు నాది. అందులోనూ ఆ రోజున ఒక స్నేహితురాలింట్లో టీపార్టీ వుంది. తప్పక వెళ్ళాలి. నాలుగయేసరికి రంగనాథం, సుబ్బారావు వస్తామన్నారు. వాళ్ళు వచ్చేసరికి స్నానంచేసి బట్టలు వేసుకొని సిద్ధంగా వుంటే కలసి పోవచ్చునని, తువ్వాలు భుజంమీదేసుకొని తొందరగా పెరట్లోకి పోతున్నాను స్నానానికి. "ఒరే, రామం, ఎక్కడికేనా బయలుదేరుతున్నావా? ఇవాళ సాయంకాలము పిల్లని తీసుకొని వాళ్ళు వస్తామన్నారు. కొంచమింట్లో వుండు. ఎక్కడికీ పోబోకు" అని మాఅమ్మ ఒక వార్నింగు ఇచ్చింది. అమ్మ చెప్పేదాకా నాకు జ్ఞాపకమే రాలేదు. పది రోజుల క్రిందట ఎవరో సోమయాజులు గారు తమ పిల్లను తీసుకొని పెళ్ళి మాటలకి ఆ రోజున వస్తామని వుత్తరము వ్రాసేరు. సరే .... ఇక ఎలాగా ఇది తప్పని తద్దినం అని "ఎక్కడికీ వెళ్ళనమ్మా" అన్నాను

సరిగ్గా అన్నట్లే అయిదు గంటలకి వీధిలో జట్కా ఆగిన చప్పుడు వినబడింది. "రండి, రండి" అని మా అమ్మా, నాన్నా వచ్చిన వారిని చావిడిలోనికి ఆహ్వానిస్తున్నారు. వచ్చినవారికి కాఫీ ఫలహారములు ఇచ్చారులావుంది. ప్లేట్లు, కప్పులు మహ జోరుగా చప్పుడవుతున్నాయి. తినడమేనా చాతకాని పల్లెటూరి బైతులు లాగున్నారేమిటా అని అనుకున్నాను. ఇంతలో మా చిన్నతమ్ముడు పరిగెత్తుకుంటూ నాదగ్గరకు వచ్చేడు. "అన్నయ్యా, అన్నయ్యా, నాన్న నిన్ను రమ్మంటున్నారు. ఎవరో చుట్టాలొచ్చారు. రా — — —వేగం రా" అని ఒకటే తొందరపెడుతున్నాడు. దగ్గరవున్న అద్దంలో ముఖం చూచుకొని మరోమారు క్రాపు సరిచేసుకొని బయలుదేరేను.

చావిట్లో కాలు పెట్టేసరికి అందరి కళ్ళూ నామీదే వ్రాలాయి. "రావోయ్ రామం, ఇతడేనండి మా మేనల్లుడు బి.ఎ. పాసయ్యాడు. ఇంకా చదువుతానంటున్నాడు." అన్నాడు, మా మామయ్య. వచ్చిన వారికి నన్ను పరిచయం చేస్తూ "ఈడూ, జోడూ, సరిగ్గావుంది," అంది మా అమ్మ ప్రక్కనేకూర్చున్న లావుపాటి ఆవిడ. ఆ తరువాత మాటల సందర్భంలో తెలిసింది, ఆవిడే నాక్కాబోయే అత్తగారని. ఇంక మిగిలిన వారిలో పెళ్ళికూతురు తండ్రి సోమయాజులుగారు. మంచి స్ఫురద్రూపి, మాటకారి. కాని విషయంలో పెద్దరికమంతా తన అన్నగారికే ఇచ్చి తాను నామ మాత్రంగా కూర్చున్నాడు. "రామం, వీరే సోమయాజులుగారు, వీరి పిల్ల సుందరిని నీకు ఇవ్వాలని వుందని ఆమధ్య వుత్తరము వ్రాసేరని నీతోచెప్పేను కదూ" అని అన్నారు, మా నాన్నగారు. "ఏదో లాంచనం కాని మా సుందరిని చూడ్డానికేముంది. సుందరి, నిజంగా సుందరే" అన్నారు, పెళ్ళికుమార్తె పెద్దనాన్నగారు. ఆమాట అతను అనాలని అన్నారు, కాబోయే కన్యాదాత నన్నుద్దేశించి. సరే ఇక పరీక్షచేసి నా అభిప్రాయం చెప్పాలి కదా వారికి, ముఖ్యంగా మా నాన్నగారికి. అక్కడే కుర్చిలో కూర్చున్న సుందరిని అంతదాకా చూడలేదని, కాదు బాగుగా పరీక్షించలేదన్న మాట. సుందరి పొడుగ్గా సన్నంగావుంది. రంగు తెలుపే అని చెప్పవచ్చును. కళ్ళు, ముక్కు తీరుగానే వున్నాయి. వాళ్ళ నాన్నగారంత స్ఫురద్రూపి కాకపోయినా చక్కనిదనే చెప్పవచ్చును. ఇంక కుంటీ, మూగా వగైరా పరీక్షలన్నీ మాఅమ్మ ఎలాగా చేస్తుంది. అందుచేత నా అభ్యంతరము లేదని వారికి తెలియజేసి వేగం అక్కడనుండి బయట పడుదామనుకున్నాను. నాకు ఆవతల పనుంది. పెద్ద వారంతా వచ్చారు కదా అని కూర్చున్నాను. "మీకిష్టమైతే నాకూ ఇష్టమే, మరి నే వెళ్ళివస్తా నాన్నా" అని లేచిపోయేను. తరువాత తతంగం ఏమి జరిగిందో నే నడగనూ లేదు. మా వాళ్ళు చెప్పనూ లేదు.

ఓమారు అలా మార్కెట్టు వేపు పోయివద్దాము రారా

అన్నాడు మామయ్య. సరే.. పద అని బయలుదేరాను. మార్కెట్టు మా యింటికట్టే దూరములేదు. రెండు వీధులు దాటగానే కూరల మార్కెట్టు. అది వేసవికాలం అవడముచేత కూరలట్టే తాజాగాలేవు. ధరలు కూడ ఎక్కువగానే ఉన్నవి. అలాగే కొనుక్కుపోతున్నారు జనం. కూరల మార్కెట్టుకీ, వెండి, బంగారము, ఇత్తడి మొదలైన సామాను అమ్మే మార్కెట్టుకీ మధ్య కొంచెం ఖాళీ జాగా వున్నది. అక్కడ మామిడి కాయలు, పళ్ళు, కుప్పలు, కుప్పలుగా పోసేటు ఎప్పుడూ ఆ స్థలం పళ్ళ మార్కెట్టుగానే ఉపయోగ పడుతూండేది. ఈ రోజున వున్న విశేషం ఏమిటంటే. ప్రతి కుప్పదగ్గరా ఒక బోర్డు కట్టబడి వుంది.

వానిపై 1. వ రకంగతి బంగినపల్లి మామిడిపళ్ళు వంద 1.కి రు16-0-0, 2.వ. రకంగతి వంద1.కిరు 12-0-0 1. వ. తరగతి సువర్ణరేఖ మామిడి పళ్ళు వంద 1.కి రు 13 - 0 - 0. 2. వతరగతి వంద 1.కి రు 9-0-0 ఇలాగ వాటి నాణ్యాలనూ, విలువలనూ వ్రాసివున్నాయి. అందరూ దాటి ప్రకారమే కొనుక్కొంటున్నట్లుంది. మా పక్కింటి శాస్త్రి అన్నిటికన్నా తక్కువ రకముగల బోర్డు కొరకు వెదకుతున్నాడు. ఇంజనీరు గారబ్బాయి 1.వ తరగతి బంగినపల్లి పళ్ళు నాలుగు వందలు ఒక బస్తాలో వేయిస్తున్నాడు. "బేరీవగరనుండి బేరాలాడి కొనే పద్ధతి ఎప్పటి నుండి పోయిందా" అని ఆశ్చర్యపోయాను. అలా ఆలోచిస్తూండగానే వెండి, బంగారు మార్కెట్టుదాటాము. అది దాటగానే లంకదిబ్బ వుంది. దానిని పూర్వం రామలీల వుత్సవాలు చేసేటప్పుడు లంకగా ఉపయోగించేవారట. ఇప్పుడు అలా జరగక పోయినా లంకదిబ్బనే పేరు ఆ స్థలానికి వుండిపోయింది. సాయంకాలము చల్లగాలికి చాలా మంది అక్కడకు చేరుతారు. వూరికి నడుమ నుండుటచే దానికి చాల ప్రాముఖ్యమొచ్చింది. అక్కడ మున్సిపాలిటీ వారు ప్రజోపయోగము కొరకు ఒక రేడియో కూడా పెట్టారు. అది వినడానికి చాలామంది హాజరవుతూంటారు. మామయ్య, నేను రోజూ అక్కడికే వెళ్ళి కూర్చుంటాము.

"కాని, ఇదేమిటి. ఇక్కడ ఇంత పెద్ద పెద్ద గదులు ఎప్పుడు కట్టారు. నిన్నటిదాక ఇది వట్టి మట్టిదిబ్బే. ఆ గదులలో చాలమంది మనుష్యులున్నారే! అంతా మగవాళ్ళే. ఆడవాళ్ళు ఒక్కరేనా కన్పించరేమి. ఇదిగో శాస్త్రిగారి కుమారుడు. అదిగో రంగనాథం, సుబ్బారావు కూడా వున్నారు. వీళ్ళంతా ఇక్కడ ఏమిచేస్తున్నారు? ఇక్కడ ఏదైనా కొత్తగా మార్కెట్టు ఓపెన్ చేసారా? వీళ్ళంతా కొనడానికి వచ్చేరా? మరి .... ఇందరికీ తెలిసిన ఈ మార్కెట్టు సంగతి తనకు తెలియలేదెందుచేత?

అదిగో అక్కడ ఏవో బోర్డులున్నాయి. ఎవరో గట్టిగా గొంతుక బ్రద్దలయ్యేలా అరుస్తున్నారు. ఏమిటో వినాలి.... "మంచిబేరము. వృథాగా జారవిడువకండి, నూతన సంవత్సరానికి తగ్గింపుధరలు" .. వేటికి ఈ తగ్గింపు ధరలు బట్టలకా, తినుబండారాలకా: అవేవీ ఇక్కడ కనబడవే? అంతా మనుష్యులే! కాని మామయ్య నడుగుదాము. "మామయ్యా; మామయ్యా" ఏడీ మామయ్య ఎక్కడా కనిపించడేం. సరి.. ఈ జనసమర్థంలో విడిపోయాము. నేనే వెళ్ళి చూస్తాను. అదిగో అక్కడ చిన్నవాళ్ళంతా కుర్చీలలో కూర్చున్నారు. పెద్దలు అనగా తండ్రులు దగ్గర నిలబడ్డారు. ఏదేనా ఫొటో తీయించుకొంటున్నారా? అబ్బే అలాలేదే. ఇదిగో ఈ ముందర అట్టలపై యేమిటో వ్రాసివున్నది. దగ్గరకు వెళ్ళి చూదాము.

నెంబరు. 1. వరుడు, బ్రాహ్మణుడు, వయస్సు 20 సం॥ చదువు B. A. కట్నం 5000 రు॥. నెంబరు2. వరుడు, నాయుడు, వయస్సు 25 సం॥ చదువు M. A. కట్నం 6000 రు॥. నెంబరు 3. వరుడు, నియ్యోగి, వయస్సు 18. సం॥ చదువు లేదు. జీతం 100 రు కట్నం 3000 రు॥-

ఇలా ఒక పదిబోర్డులు చదివేసరికి సంగతి అర్థమైంది. అయితే ఈ వరుల మార్కెట్టులో నా ధర ఎంతా?" అని అనుకున్నాను. సరే అదీ చూద్దామని అలా వెడుతున్నాను. ఓ పాతిక గజాలు నడచేనో లేదో మామయ్య కనిపించేడు. "ఏరా, రాము ఇంతసేపు నీకోసమే వెదుకుతున్నాను. రా -- తొందరగా మీనాన్న చికాకు పడుతున్నాడు బేరాలు పోతున్నాయట" అన్నాడు. "ఏమిటి మామయ్యా ఇదంతా! బేరాలు పోవడమేమిటి. నాన్న ఏదేనా వ్యాపారము పెట్టాడా" అన్నాను. "ఏమిరా; ఏమీ తెలియనట్లడుగుతున్నావు. ఈ రోజున వరుల ధరలు తగ్గుముఖం పట్టేయట. ఎంతకో ఒకంతకి నిన్ను అమ్మేయాలని చెప్పాలని వావ తొందరపడుతున్నాడు" అన్నాడు.

"వరులకి ధరలేమిటి మామయ్యా. నీకేమైనా పిచ్చా?" అన్నాను. "నాకు పిచ్చో, నీకు పిచ్చో ఆ బోర్డులు చూడు. ఇప్పుడు అన్నింటికీ గవర్నమెంటువారు ధరలు నిర్ణయించేరు. అంతకుమించి వేరుములేదు. మామిడి పళ్లు లగాయతూ మగపిల్లల వరకూ అంతా అంతే. అదుగో మీనాన్న. "బావా ; ఇదిగో రామం" అన్నాడు మామయ్య.

నన్ను చూడగానే నాన్న ఇంతముఖం చేసుకొని "రారా నాయినా, ఇలా ఈ కుర్చీలో కూర్చో" అన్నాడు. ఇందాకటి బోర్డులు జ్ఞాపకమొచ్చి పైకి చూసేను. నెంబరు 1 వరుడు, బ్రాహ్మణుడు, వయస్సు 20 సం॥ చదువు B.A. ఆస్తివుంది .కట్నం 5000 రు॥ అని వ్రాసివుంది. వొళ్లుజల్లుమంది. "నాన్నా నన్ను అమ్మజూపుతున్నావా? నా ఖరీదు అయిదువేలా?" అని కోపంతో గట్టిగాఅరిచేను.

"ఏమిటిరా రామం అలా పలవరిస్తున్నావు. సరిగ్గా పడుకో" అన్నది అమ్మ. "హోయి, భగవంతుడా! ఇదంతా కల" అనుకున్నాను. మరునాడు పుదయము అమ్మను అడిగేను, సోమయాజులుగారి సంబంధము మాట యేమయిందని. "వారు మనతో తూగలేరురా" అంది. "అంటే" అన్నాను అర్థంకాక. "ఏమీలేదు, మనము కోరిన కట్నం ఇయ్యలేమన్నారు" అంది.

"నిన్న రాత్రి నాకొచ్చిన కలకీ, ఈ జరుగుతున్న సంఘటనకీ భేదమేమిటి? ఎలాగూ తప్పనప్పుడు ఈ వేలం పాటకన్నా అలా ధరలు నిర్ణయించేస్తే అదే నయమేమో" అనిపించింది



# తలవని తలంపు

• శ్రీమతి బి. సరోజినీదేవి •

అదొక పెద్ద బంగ్లా. ఆబంగ్లా వెనుక పెద్ద తోటవుంది. అది గ్రీష్మ ఋతువు అగుట చేత ఆతోటలోని చెట్లు అన్నీ చిగిర్చి, పూవులతో ఎంతో రమణీయముగా వుంది. అది సాయం సమయం. సూర్యబింబము తనపని అయిందని ఆకాశ గర్భంలో ఇమిడుతున్నాడు. అటువంటి సమయములో ఓబాలిక, బాలుడు, బొమ్మరిండ్లు కట్టుటలో నిమగ్నులయివున్నారు. "లీలా నాయిల్లు పూర్తి అయిపోయింది నీదియింకా అవలేదా"? "నాది అయిపోయిందిబావా! చూడు నీయిల్లుకన్నా నాయిల్లు ఎంతబాగుందో! ఇదిగో నాయింట్లో మాఅమ్మాయిని వుంచాను." "అయితే మాయింట్లో మా అబ్బాయిని వుంచాను" "బావా మీ అబ్బాయి నిన్ను ఏమని పిలుస్తాడు?" "మా అబ్బాయి నాన్న అని పిలుస్తాడు" "అయితే మా అమ్మాయి నన్ను ఏమని పిలుస్తుంది?" "నిన్ను అమ్మా అని పిలుస్తుంది" "నన్ను అమ్మా అని పిలుస్తుందా?" అంటూ ఆలోచనలో పడింది లీల. "ఏం లీలా ఏమిటి ఆలోచిస్తున్నావు?" "బావా నాకు అమ్మా, నాన్న వున్నారా?" అంటూంటే కండ్లంట నీళ్లు గిర్రునతిరిగిపోతున్నాయి. "లీలా ఏడుస్తున్నావా? అవును నీకు అమ్మా, నాన్న, చిన్నప్పుడే పోతే మా అమ్మా, నాన్నగారు నిన్ను పెంచుతున్నారు. ఏడవకు లీలా" అంటూ శ్యాము ఆమె కళ్ళనీళ్లు తుడిచి దగ్గరకు తీసుకున్నాడు. లీల 9 సం॥ల బాలిక, శ్యాము 12 సం॥ల బాలుడు. ఇద్దరూ మేనత్త మేనమామ బిడ్డలు. లీలకు చిన్నప్పుడే తల్లి, దండ్రులుపోయిన అభాగిని. మేనమామ యింట్లో పెరుగుతోంది. లీల అందమయిన బాలిక, పాలబుగ్గలాంటి బుగ్గలు. లేత గులాబీలాంటి పల్చటి పెదిమలు, సోగకండ్లు, నొక్కు నొక్కుల జుట్టు, చిన్నపిల్ల అయినా అందరి హృదయాలను ఆకర్షించే బాలిక. శ్యాము కూడ లీలను మించిన అందగాడు.

క్రిష్ణాపురం జమీందార్ వెంకట్రావుబహద్దూర్ కుమార్తు శ్యాము. అది పల్లెటూరు అవుటచేత అక్కడ చదువులేని కారణముచే శ్యాముని 12సం॥ అప్పుడే మద్రాసు పంప నిశ్చయించారు. లీల బావ వెళ్ళిపోతాడని ఎంతో ఏడ్చింది. ఆఖరుసారిగా యిద్దరు తమ బొమ్మరిండ్ల దగ్గర కలుసుకొన్నారు "లీలా నేను చదువుకు మద్రాసు వెళ్లిపోతున్నాను నీ బొమ్మరింటితోపాటు, నాదికూడ చూస్తావా?" "బావా రెండు బొమ్మరిండ్లు నా రెండు కండ్లుగా చూసుకొంటాను, కాని నాతోటి యింక ఆడుకొనేవాళ్ళు ఎవరు?" "లీలా విచారించకు నేను ప్రతీశలవులకి వస్తాను. నేను బాగా చదువుకొని గొప్ప ఉద్యోగంచేస్తే నీకు గొప్ప కాదా లీలా?" అంటూ ఆమెను దగ్గరకు తీసుకొన్నాడు శ్యాము. ఇంతలోకి శ్యాము తల్లి సరస్వతమ్మగారు ఆతోటలోకివచ్చి ఆ దృశ్యాన్నిచూచి సహించలేక పోయింది. "ఆదేమిటే ఆడపిల్లవుకాదూ" అంటూ ఆ 9 సం॥ పిల్లను ఈడవడ, ఆదవడ తన యిష్టమొచ్చినట్లు కొట్టింది. ఆ దెబ్బలకు ఆ బాలిక గాలిలో ఆకులా ఒణికి పోయింది. శ్యాము తెల్లపోయిచూస్తు "అదేంటి అమ్మా లీలను అలా కొట్టావు" "ఛీ ఊరుకో దానికి సిగ్గులేకపోతే నీకయినా లేదు. దిక్కులేక మనకొంపజేరితే దాన్ని పట్టుకొని వేళ్ళాడుతావా? పద రైలువేళ అయింది" అంటూ అతన్ని తీసుకొని వెళ్ళిపోయింది. ఆ దెబ్బలబాధ భరించలేక ఆ లేత హృదయం ఎంత ఏడ్చిందో వారికేమికావాలి.

"ఏమే, శ్యాము III ఫారం చదువుచున్నప్పుడు వెళ్ళిపోయాడు. ఇప్పుడు M.Sc. చదువుచున్నాడు వాడిని చూచి ఎన్నో ఏళ్ళయిపోయింది. ఈ శలవులకు అయినా రమ్మనమని వ్రాద్దామా?" "ఏమయినాసరే వాడికి పెండ్లినిశ్చయించి రమ్మనమని వ్రాద్దాము. ఇప్పుడు వచ్చినట్లయితే లీలని తప్ప ఇంక ఎవరినీ చేసుకోనంటాడు. రాంపూర్ జమీందారు గారి అమ్మాయిని, యిస్తామంటున్నారు, అది నిశ్చయించి రమ్మనమని వ్రాయండి." అంది సరస్వతమ్మ. "అదేమిటే అలా అంటావు ఇంట్లో ఎదిగినపిల్ల వుండగా. దానికయినా ఎవరువున్నారు?" అన్నాడు శ్యాము తండ్రి. "మీకేమయినా మతిపోయిందా, దిక్కూ మొక్కూలేని పిల్లని వాడికిచ్చుటకు వీలులేదు." "సరే నీయిష్టం వాడిని రమ్మనమనివ్రాస్తాను." "అవుతే ఆపిల్లనినిశ్చయించండి" అంటూ ఆమె వెళ్ళిపోయింది. ఈ మాటలు అన్నీ గదిలోంచి లీల వింది. ఇప్పుడు మునుపటి లీలకాదు, మంచి యౌవ్వనంలో వుంది. 18 సం॥ యువతి. ఈమాటలు వినేసరికి ఆమెకళ్లు నీళ్ళతో నిండిపోయాయి. గబగబ తోటలో బొమ్మరిండ్ల దగ్గరకు వెళ్ళింది. "బావా నీవు నాకుకాక యింకొకరి ఆధీనమవుతున్నావా? చిన్నప్పుడు మన ఆటలు, పాటలు, తల్చు

కొంటే ఇప్పుడు కళ్ళకు కట్టినట్లుంది. నీవు వెళ్ళిపోయేనాడు నాకళ్ళనీళ్ళు తుడుస్తూ లీలా మీబావ గొప్ప ఉద్యోగముచేస్తే నీకు గొప్పకాదా? అంటూ దగ్గరకు తీసుకొన్నావు. యింతలోకి అత్తయ్య వచ్చి నన్నుకొట్టి, నిన్ను తీసుకొని వెళ్ళిపోయింది. నామూలాన్నుంచి నీవు పాడైపోతావని శలవలకు రానీయకుండా ఇన్ని సంవత్సరాలనుంచి అక్కడే వుంచేసింది" అంటూ తన బావ బొమ్మరిల్లు చూచి ఎంతో విలపించింది.

ఆరోజు శ్యాము వస్తాడని లీలకు తెలిసింది "బావా నీవు ఎంత మారిపోతావో, నిన్ను గుర్తుపట్టగలనా? నిన్ను చూచి 10 సం॥ దగ్గర అయిపోయింది. నీవు యిప్పుడు ఎంత అందముగా వుంటావో?" అని బావని గురించి ఆలోచనలో పడిపోయింది. వెనుకనుంచి సరస్వతమ్మ లీలా అనిపిలుచుటచేత ఆమె ఉలిక్కిపడి వెనక్కుచూచింది."ఏంఅత్తయ్యా పిలచావు." "అవును నిన్ను ఈరోజు మద్రాసు మాచెల్లెలు దగ్గరకు పంపుదామని అనుకొంటున్నాను." అంది సరస్వతమ్మ. "నన్నా! ఎందుకు అత్తయ్యా నాకు వాళ్ళని బాగాతెలియదే?" "ఆమె కూడా నాలాంటి అత్తయ్యే, 10 రో॥లు వుండి రా?" లీల ఇంక ఏమీలు చెప్పలేకపోయింది. మద్రాసు పంపివేసారు. ఆ యింట్లో లీలను చాలా ఆదరంగా చూస్తున్నారు. ఆ యింట్లో అమ్మాయి సరళ బి. ఏ. చదువుతోంది. లీలంటే అపరిమితమైన ప్రేమ. లీలకు ఇక్కడ చాల ఆనందముగానే వున్నది. కాని బావని చూడలేదని మనస్సు దహించుకుపోతోంది.

శ్యాము చాల ఆనందముతో మద్రాసు నుండి బయలుదేరాడు. ఎప్పుడు వెడతానా, ఎప్పుడు లీలను చూస్తానా అన్న ఆతృతతో వున్నాడు. "లీలా, చిన్నప్పుడే నీవు ఎంతో ముద్దుగాను, అందంగానూ వుండేదానివి. ఇప్పుడు 18 సం॥ల యౌవ్వన వతివి అయ్యావు. ఇంకా ఎంత అందంగా వుంటావోకదా? మన బొమ్మరిండ్లు, ఆటలు, అన్ని తలుచుకొంటూ వుంటే ఆనందం పట్టలేకపోతున్నాను." అని అనుకుంటూ యిల్లు చేరాడు. తల్లిదండ్రులు కొడుకుని చూచి ఎంతో మురిసిపోయేరు. ఎన్నో కబుర్లు చెప్పారు. కాని అతనికి వారి మాటలు ఏమీ వినబడుటలేదు. అతనికళ్లు ఎవరికోసమో వెతుకుతున్నాయి. "పెద్దది అగుటచే అగుపడుటకు సిగ్గుపడుతోంది" అనుకున్నాడు. సాయంత్రము తోటలో బొమ్మరిండ్ల దగ్గర కలుసుకోవచ్చునని తృప్తి పడ్డాడు. సాయంత్రము అయింది. బొమ్మరిండ్ల దగ్గరకు వెళ్ళాడు. కాని, లీల అగుపడలేదు. ఎక్కడయినా దాంకుందేమో అని పువ్వులచెట్లు అన్నీ గాలించాడు. కాని అగుపడలేదు. చాల కోపముతో బొమ్మరిండ్లను తన్నేద్దామని వచ్చాడు. వాని కండ్లకు అవి దీనంగా కనపడ్డాయి. క్రిందకి వంగి చూచాడు. ఇలా వ్రాసి వుంది. "బావా, నావి భగ్నప్రేమ అయింది. నీవు శ్రీమంతుడవు. నీకు శ్రీమంతుని కుమార్తెతో పెండ్లి జరుగుతుంది. నిన్ను చూద్దామని ఎంతో ఆశ పెట్టుకున్నాను కాని నిరాశ అయింది. ఎప్పుడు ఈ అభాగి లీలను మర్చిపోకు. మన ఆటలు మరువకు. ఆఖరుసారి నిన్ను చూడలేకపోయాను. నేను ఎక్కడ ఉన్నా నా హృదయం నీది. యింకా ఎన్నో వ్రాద్దామని అనుకున్నాను. కాని టైము అయిపోయింది. శలవు. నీ లీల.''

అతనికి మతిపోయినట్లు అయిపోయింది. ఇంట్లోకి వెళ్ళి ఎంతసేపో విలపించాడు. ఇంతట్లోకి తల్లి వచ్చి పెండ్లి సంగతి చెప్పింది. "అమ్మా, నన్ను క్షమించు. నేను లీలను తప్ప ఇంక ఎవరినీ చేసుకోలేను" "అయ్యో పిచ్చివాడా, లీల నిన్ను చేసుకొనుటకు ఇష్టపడలేదు. ఆమెకు పెండ్లి అయి అత్తవారింటికి వెళ్ళిపోయింది" "ఆ! ఏమిటి! అమ్మా నిజంగా లీలకు పెండ్లి అయిందా? అమ్మా అవుతే క్షమించు. నేను ఒక సం॥ వరకు పెండ్లి చేసుకోను. తరువాత మీ యిష్టం. ఈ సంవత్సరం నేను ఉద్యోగం చేస్తాను" అంటూ మద్రాసు వెళ్ళిపోయేడు. తల్లి దండ్రులు ఏమీ అనలేకపోయారు.

శ్యాము పచ్చయప్పాస్ కాలేజీలో లెక్చరరుగా ఉన్నాడు. అప్పుడే కాలేజీ నుండి యింటికి వచ్చి గది తాళం తీసి మంచంమీద పడ్డాడు. ''లీలా నన్ను ఎంత మోసం చేశావు? ఆ వ్రాతలన్నీ నటనేనా? నీ ప్రేమ అంతా కృత్రిమమైనదా? అలా అని తెలుస్తే నిన్ను ప్రేమించేవాణ్ణి కాదుకదా? బావా నా హృదయంలో ఇంకొకరికి చోటు లేదని వ్రాశావు. ఎందుకొచ్చిన వ్రాతలు. ఛీ, ఈ ప్రపంచములో ఏ స్త్రీని నమ్మకూడదు." అనుకొని కళ్లు మూసాడు. ఇంతట్లోకి ఎవరో వీధి తలుపు కొట్టిన చప్పుడయింది. లేచి తలుపు తీసాడు. ఇద్దరు స్త్రీలు. ఒకామె తన స్టూడెంటు. "నమస్తే మేష్టారు" "రా అమ్మా లోపలికి" అంటూ రెండు కుర్చీలు చూపెట్టి కూర్చోమన్నాడు. ఇద్దరూ కూర్చున్నారు. "దేనికమ్మా

వచ్చావు?" "రేపు దీపావళి రోజున నా పుట్టిన రోజు మిమ్మల్ని మధ్యాహ్నం టీపార్టీకి రమ్మనమనిప్రార్థిస్తున్నాను శలవు" అంటూ ఇద్దరూ లేచి వెళ్ళిపోయారు. శ్యాముకి ఆ రెండో అమ్మాయిమీదే దృష్టి వుంది. "అబ్బా! ఆ అమ్మాయి యెంత అందంగా వుంది. మా లీల కూడా పెద్దది అవుతే ఇలాగే వుండి వుండాలి. సరే ఎవరు ఎలా గుంటే మనకేం?" అనుకొని పడుకొన్నాడు.

ఆరోజు దీపావళి. సరళ పుట్టినరోజు. సరళ చాలా హడావిడిగా కుర్చీలు. టేబుల్సు అన్నీ సర్దుతోంది. మధ్య మధ్య లీలను వేళాకోళం చేస్తోంది. కాని ఆరోజు లీల ముఖం చాలా వాడిపోయివుంది. ఇంతట్లోకి సరళ లీల దగ్గరకు వచ్చింది. "ఏం లీలా విచారంగా వున్నావు. మీ ఊరు వెళ్ళిపోతావనా?" "సరళా మా ఊరు వెళ్ళి నే నేంచెయ్యను?" "ఏం మీ బావ ఉన్నాడని, ఆడుకొనే వారని చెప్పేదానివే?" "అవును. ఇప్పుడు మా బావ భార్యతో సహా వున్నాడు." "పోనీ లీలా నీవు మా అన్నయ్యని పెండ్లి చేసుకో?" "సరళా క్షమించు నాకు చిన్నప్పుడే పెండ్లి అయిపోయింది" ఇంతట్లోకి అతిథు లందరు వచ్చారు. సరళ బయటకువెళ్ళిపోయింది. శ్యాము కుర్చీమీద కూర్చున్నాడేకాని ఎవరికోసమో వెతుకుతు న్నాడు. అతిథులందరూ వెళ్ళిపోయారు, కాని శ్యాము వెళ్ళలేదు, సరళ శ్యాము మిగిలారు. "సరళా నీతోటి నిన్న వచ్చిన అమ్మాయి అగుపడదేం?" "పిలుస్తా నుండండి" అంటూ "లీలా," అంటూ పిల్చింది. లీలా అనేసరికి శ్యాముకి తనలీల జ్ఞాపకం వచ్చింది. సరళ, లీల వచ్చి కూర్చున్నారు. "ఇదిగోండి మా లీల. ఈరోజు అత్తవా రింటికి వెళ్ళిపోతుంది. అందుకని విచారంగా వుంది" "ఏవూరు అత్తారు?" "క్రిష్ణాపురం" ఇంతట్లోకి సరళ తల్లి పిలచుటచేత లోపలికి వెళ్ళిపోయింది, "లీలా నీకు పెండ్లి అయిపోయిందా?" అన్నాడు శ్యాము "నీభర్త పేరు" ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు "లీలా సిగ్గుపడుతున్నావా? చెప్పు నీ భర్త పేరేమిటి?" "మా బావ పేరు చెప్పుటకు సిగ్గు ఎందుకు, శ్యాము" "శ్యామా," "అవును," అయితే, నీవు నా లీలవా? లీలా ఇలా చూడు, నేనే నీ బావను, నీ భర్తను, శ్యాముని." "ఏమిటి బావా, నీవు నా శ్యామువా? బావా మునుపు నా శ్యామువే కాని ఇప్పుడు నా హృద యానికి, శరీరానికి కాదు." "అవుతే నీవు అంతేనా లీలా? నేను ఒక్క మాటమీదే వున్నాను. నీకు పెండ్లి అవలేదా లీలా?" "బావా నీకు ఎంత నిజమో నాకూ అంతే. ఇది అంతా అమ్మ మోసం" ఇంతట్లోకి సరళ వచ్చింది. వారిద్దరూ ఇంత స్నేహంగా మాట్లాడుకోవడం చూచి ఆశ్చర్యపోయింది. "మీరిద్దరూ స్నేహితు లయ్యారే?" "అవును సరళా, ఈ దీపావళి మాకు పవిత్రమైనది అయింది. బావా మరదళ్ళము తలవని తలం పుగా ఇక్కడ కలుసుకొన్నాము." "అయితే ఇతనేనా లీలా నీ బావా, నీ భర్తాను?" "అవును సరళా" "అబ్బా! మీరిద్దరూ ఎంత పుణ్యాత్ములు. అయితే ఇప్పుడు మా మేష్టారు మా అన్నయ్యా అన్నమాట."



## కీర్తన–7

రాగం- మోహన - ఆదితాళం

ఆ: స రి గ ప ద స — అ: స ద ప గ రి స

ప॥ అంబుజనాభుని అమరగానంబున
అర్చించినఘనుడే! సుజనుడే ॥అం॥

అ॥ తుంబురువలెసదా, తోషితుడై తన
తంబుర చేకొని, తన్మయత్వమున ॥అం॥

చ॥ గానసుధారస, ధారనొసగి కలి
మానవులకుభవ, తాపముదీర్పగా
దీనదయాపరు, దినకరవంశజు
మానకగొల్చిన, మానితత్యాగరాజు ॥అం॥

| 0—2 | 1—4 | 0—2 |
|---|---|---|
| ప॥ ; సా స సా స రి స రీ స ద పా | ; ప దా స ద ప | ప గ ద ప గ రి సా |
| అ ం బు జ నా . . . . ఘ ని | అ మ ర గా. | నం . . . బు . న |
| ; గా ప దా సా సా ప దా ; | సా ; ; సా | ద ప ప గ గ ప ద స |
| అ ర్చిం చి న ఘ ను | డే ; ; సు | జ . ను . డే . . . |
| రి గ ॥సా॥ | | |
| . . ॥అం॥ | | |
| అ॥ప॥ ; దా సా రీ గా గా పా గా | ; గ రీ స సా | స ద రి స ద ప దా |
| తుం బు రు వ లె స దా | తో . షి తు | డై . . . త . న |
| ; దా రి సా స ద రి స ద పదా, | ; సా ద, పా | ప ప గ రి గ ప ద స |
| తంబురచే . . . కొ . ని | త్మ న . య | త్వ . ము. న . . . |
| రి గ ॥సా॥ | | |
| . . ॥అం॥ | | |
| చ॥ ; దా దా దా దా ; దా దా | ; ప దా స సా | స ద రి స దా పా |
| గా న సు ధా ర స | ధా . ర నొ | స . గి . క లి |
| ; ప ద స ద పా ప గ ద ప గ రి సా | ; స రీ గ పా | దా ; సా ద ప |
| మా- న వు . ల . కు . భ . వ | తా . ప ము | దీ . ర్ప గా . |
| దా | | |

అ . ప . వలె

దీనదయాపరు దినకరవంశజు
మానక గొల్చిన మానిత త్యాగరాజు ॥అం॥

## కీర్తన–8

నాదనామక్రియరాగం - రూపకతాళం

ఆ. స రి గ మ ప ద నీ — అ. ని ద ప మ గ రి స నీ

ప॥ త్యాగగురునిసాటి ఎవ్వరే ధరాతలంబున ॥త్యా॥

అ॥ రాగరహితుడై సకల రాగ సుధారసమున్గ్రోలిన ॥త్యా॥

చ॥ ముద్దుగ తంబురచేకొని, మోదమలర రామాయని
పద్దుతప్పక భజనచేసి, భక్తిపథము నెరుగదెల్పిన ॥త్యా॥

| | 0—2 | 1—4 | 0—2 | 1—4 |
|---|---|---|---|---|
| ప॥ | సా రీ | మ గ రీ , మా , | మా మా | , గ మ పా ద ప మ |
| | త్యా గ | గు రు · ని | సా టి | ఎ . . . . · వ్వ |
| | గా ; | ; ! ; , మ | మ గ మ ద | ప మ గ మ గ రి స ని |
| | రే | . . . ధ | రా . , . . | త . లం · బు న . |
| | సా రీ | | | |
| | త్యా గా॥ | | | |
| అ॥ప॥ | ; దా | పా ప ప మ గ మా | పా ; | పా ; ; ద వ |
| | రా | గ ర · హి . తు | డై . | . . . |
| | ; ద మ దా | పా ప ప మ గ మా | పా ; | ; మా ద ప దా |
| | . . రా | గ ర . హి . తు | డై | స క . ల |
| | ప ద ని ని | దా పా , ద ప మ | మ గ మ ద | ప మ గ మ గ రి స ని |
| | రా · . , | గ సు ధా : . | ర . స . | ము. గ్రో . . లి న . |
| | నీ రీ॥ | | | |
| | త్యా గ॥ | | | |
| చ॥ | ; పా | ద, పా పా ; | దా పా | పా ద ప ప మ మా |
| | ము | ద్దు గ తం | బు ర | చే కొ . ని . . |
| | ; పా | ద ప మా మా మా | గా మా | మా ప ప మ మా గ |
| | మో | . ద మ ల ర | రా మా | య ని · . . . |

అ. ప. వలె

పద్దుతప్పక భజనజేసి భక్తిపథము నెరుగదెల్పిన ॥త్యా॥




# అమృతాంజనము

గాని,

" యథాయథా...............రాశీభవశత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగు చున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!



# బాల వినోదం



## ★ భారతి సాహసం ★

• శ్రీ ఎల్. ఎం. బాబూ •

అడయారులో కళాక్షేత్రం
చూడ చక్కగా ఉంటుంది
బాలలు యెంతోమంది అక్కడ
బాగుగ చదువుతు ఉంటారు.

పరీక్షలన్నీ అయిపోగానే,
పాపలు కొందరు చేరారు.
సాగర తీరము పోవాలంటూ
చక్కగ ఆలోచించారు.

పాపలందరూ ముస్తాబయ్యి,
పెద్దమఱ్ఱికడ చేరారు.
కొమ్మల ద్వారా చెట్టెక్కి
కోతీ కొమ్మచ్చాడారు.

అక్కడనుండీ సాగరతీరం,
చకచక నడచీ వెళ్ళారు.
యిసుకలో ఎగిరి గంతులువేస్తూ
బొమ్మారిల్లు కట్టారు.

కొంటీ బాలలు కొందరువెళ్ళి
నీటిలొ దిగుతూ ఆడారు.
కెరటము వచ్చి ఒడ్డును కొట్టగ
మాలతి జాలూ జారింది.

మాలతి కొట్టుకు వెళ్ళగనే.
బాలలు పెద్దగ అరిచారు.
బాబీ, బేబీ, అంతాచేరి
ఏమీతోచక నిలిచారు.

భారతి పరుగున పైకొచ్చి
బాలలగుంపును పిలిచింది.
పల్లెలు ఉంచిన డుంగనుచూసి,
పట్టండంటూ తోసింది.

డుంగనీటిలో జరుగగనే,
భారతి ఈదుకు వెళ్ళింది.
మాలతిచేతిని పట్టుకొని,
ఒడ్డుకు తీసుకు వచ్చింది.

బాలలందరూ సాయంకాలం,
కళాక్షేత్రమూ చేరారు.
భారతిచేసిన సాహసమంతా,
పంతులుగారికి చెప్పారు.

పెద్దలు లేనిదె ఎప్పుడును.
పోరాదెక్కడి కన్నారు.
భారతిచేసిన మేలునకు,
హారమునొక్కటి యిచ్చారు.

(నా బొమ్మల కొలువునుండి)

# ★ బలే టోపీ ★

* శ్రీమతి వి. శశిరేఖ *

చాలా కాలం క్రిందట విజయనగరం సంస్థానాన్ని ఆనందగజపతి మహారాజు పరిపాలిస్తూ వుండేవాడు. ఆనందగజపతి కళా పోషకుడుగా అమితమయిన కీర్తి సంపాదించేడు. అతడి కాలంలోనే విజయనగరాన్ని విద్యలనగరం అని కూడా అనేవారు.

ఆనందగజపతి ఎంత కళా పోషకుడో అంతగా భోజన ప్రియుడు కూడాను. మిఠాయి తయారు చెయ్యడంలో ఉత్తరాది వారిది పైచెయ్యని, కాశీనుంచి దేవీ కుటుంబాన్ని విజయనగరం తెప్పించేరు. కోటలో వుంటూ వుండడం, రాజకుటుంబానికి వింత వింత మిఠాయి తయారు చేసి యిస్తూ వుండడం దేవీ కుటుంబానికి పని.

ఇలావుండగా దేవీ మిఠాయి గురించి వూర్లో ఎన్నో కథలు చెప్పుకోసాగేరు. మల్పా నోట్లో వేసుకుంటే చచ్చిన ప్రాణం లేచి వస్తుందని, రసుగుల్లా ఓమారు రుచి చూస్తే ఆర్నెల్లు ఆరుచి మరువ లేమని యిలాటివి. ఈ కథలు వింటూవుండి వూళ్ళో వున్న పెద్దకుటుంబాల యింటి వాళ్ళు మగవాళ్ళని వేపుకు తినడం మొదలెట్టేరు. ఇంట్లో వాళ్ళ బాధ పడలేక పెద్దలు నలుగురు కలసి మహారాజా వారికి వారు ఖుషీగా వున్న సమయం కనిపెట్టి గోడు విన్నవించుకున్నారు.

ఆమర్నాటినుంచి కోట యివతల బజార్లో దేవీగారి మిఠాయి కొట్టు వెలసింది.

దేవీ మిఠాయి అంటే వక్క యీ విజయనగరంలోనే కాకుండా చుట్టు పట్ల రెండు మూడు జిల్లాల్లో మంచి ప్రసిద్ధి. చుట్టు పట్ల వూర్లనుంచి యీవూరు ఎవరొచ్చినా జేబులో నాలుగు డబ్బులుంటే చాలు దేవీ మిఠాయి కొనుక్కోకుండా పోరు.

సుందరరావుగారు యీవూరు తాలూకాఫీసుకి రెండేళ్ళ కిందట బదిలీ అయి వచ్చిన నాడు, సాయంత్రం ఆఫీసు నుంచి ఇంటికివస్తూ ఒక శేరు మోతీచూర్ లాడూ, ఒక శేరు మల్పా తెచ్చేడు.

సుందరరావుగారి రెండో అబ్బాయి ఆనంద్‌కి మోతీచూర్ మాట తల్చుకుంటే నోరు వూరుతూ వుండేది. పది పదిహేనుమార్లు వాళ్ళ నాన్నగారిని అడిగేడు మోతీచూర్ తెమ్మని, కాని తాలూకా ఆఫీసు గుమస్తాకి మిఠాయి పిల్లలకి మాటి మాటికి ఇవ్వడానికి డబ్బెక్కడుంటుంది. వాళ్ళ నాన్నగారు సరే తెస్తాననే వారే కాని తెచ్చిన పాపాన్న పోలేదు ఎప్పుడూను.

ఇలా వుండగా ఆనంద్‌కి మెరుపులా వక ఆలోచన కలిగింది. తక్షణం బజారుకి పరిగెత్తేడు. సరాసరి అసలు దేవీ దుకాణం ముందు ఆగేడు. వున్న మిఠాయి సరుకంతా చూసేడు. దుకాణదార్ని పిల్చి "అదిగో ఆ జాంగ్రీ వుందే శేరు ఎంత?" అని అడిగేడు. శేరు మూడు రూపాయలని తెలుసుకుని "మోతీచూర్ లడ్డూ శేరు ఎంత?" అని అడిగేడు. అదీ మూడు రూపాయిలే అన్నాడు దుకాణదారు.

వెంటనే ఆనంద్ వక శేరు జాంగ్రీలు కట్టమన్నాడు. ఇంతసేపూ వీడేంకొంటాడా పెడతాడా అని చూస్తున్న దుకాణదారు, తునకాలు మరో మారు గుడ్డ పెట్టి శుభ్రంగా తుడిచి జాంగ్రీలు తూచి పొట్లాం కట్టేడు. ఆనంద్ ఆ పొట్లాం చేత్తో పట్టుకుని "అరరె జాంగ్రీ కాదు. మోతీచూర్ లాడూ ఇమ్మన్నాడు" దుకాణదారు కాస్త విసుక్కున్నా మోతీచూర్ కూడా పొట్లాం కట్టేడు.

ఆనంద్ జాంగ్రీల పొట్లాం దుకాణదారుకిచ్చేసి లాడూ పొట్లాంపట్టుకొని వెళ్ళిపోసాగేడు. దుకాణదారు గబుక్కునికొట్టుదిగి ఆనంద్‌ని పట్టుకొని "యిప్పట్నుంచి యిలాంటి పనులు మొదలెడితే ఎలా బతుకుతావు. డబ్బివ్వకుండా వెళ్తున్నావే" అన్నాడు.

"ఏం డబ్బు?" అన్నాడు ఆనంద్.

"లాడూది" అన్నాడు దుకాణదారు.

"లాడూ డబ్బు నంతు వాటి ఖరీదు చేసే జాంగ్రీలు యివ్వలే?"

"మరి జాంగ్రీలడబ్బో"

"జాంగ్రీలు నేను తీసుకెళ్తేగా"

"వారెవా"

"వారెవా ఎంటి, అడుగు ఎవన్నడుగు తావో"

యిలా వాళ్ళు తగువులాడుతూ వుండగానే పది మంది మూగేరు. అందులో చాలా రాచకీయవేత్తలు ఘరానా వర్తకులు వున్నారు. అందరూ ఆనంద్ శర్మానికి మాత్రం ముక్కుమీద వేలేసుకుని పోయారు. ఆనంద్ ధైర్యానికి తెలివితేటలకి మెచ్చుకుని దుకాణదారే ఆ మిఠాయి బహుమతిగా యిచ్చేసాడు.



—:o:—

# ★ ఉపాయము ★

శ్రీ గోటేటి శ్రీరామారావు.

తిరువూరనే ఒక గ్రామంలో సోమిశెట్టి అనే వర్తకుడుండే వాడు. ఆతడా గ్రామములోనే ఒక చిన్న చిల్లర కొట్టు పెట్టుకొని వెచ్చాలమ్ముకొంటూ జీవిస్తున్నాడు.

తిరువూరు గ్రామానికి పట్టణము పదిమైళ్ళ దూరంలోఉంది. ఏసరకు తెచ్చుకోవాలన్నా - అతడా పదిమైళ్ళూ కాలిబాటనే పోయి తెచ్చుకోవాలి. కాని రోడ్లు లేవు. రోడ్లు లేనప్పుడు బళ్ళేవిధముగా పోతాయి —?

అందుకా సోమిశెట్టి తన నూతన సరకులను మోయుటకొరకు గుర్రాన్ని కొన్నాడు. ఆ గుర్రము తనకన్నివిధాలా ఉపయోగపడుతూ లాభకరంగా ఉంది. అందుచే నాతడు దానికి రోజూ మంచి మేతను పెట్టేవాడు. గడ్డిబుట్ట ఎంతఖరీదైనా కొని తెప్పించి వేసేవాడు. గుగ్గిళ్ళు వగైరా పెట్టేవాడు.

ఎల్లప్పుడూ ఒకే లాగుంటుందా? - కొంత కాలానికి గుర్రము ముసిలిదయిపోయింది. ఇదివరకటిలా సామాను మోయలేక పోయేది. అందుచేత శెట్టికి గుర్రమువల్ల ఉపయోగ మేమీలేదనుకొన్నాడు. అందుకని తిండి పెట్టటం కూడా దండగే అనుకొన్నాడు. దాన్నింటినుంచి పొమ్మన్నాడు. ఆ గుర్రం వలవలా ఏడ్చింది. కాని, శెట్టి దాని ఏడుపేమీ వినుపించుకోలేదు. "నీవు సింహామంతటి బలము కలిగియున్ననాడే నా యింటికి రమ్మని" కసిరాడు.

చేసేదేమీ లేక గుర్రం ఇల్లువిడిచి పోయింది. ఆలా పోయి పోయి ఒక అడవి చేరుకొంది. ఆ అడవిలో గుర్రం పోతూండగా నక్క బావగా ఎదురయ్యారు. దిగాలుగా పోయే గుర్రాన్ని చూసి "అశ్వం బావా! అశ్వం బావా! ఏం యిలా ఎక్కడకు పోతున్నావయ్యా?" అంది నక్క. అందుకు గుర్రం విచారిస్తూ తన గాథ చరిత్రనంతా చెప్పుకొంది. నక్క గుర్రాన్ని ఊరుకో, శెట్టి 'నీకేమీ ఫర్వాలేదు, నేనున్నా

నుశే!" అంది. అందులోనూ జిత్తుల మారి నక్కకు ఉపాయములకులోటేమిటి? ఇంతలో నక్కకు మెరపులాంటి యోచన తట్టింది.

గుర్రాన్ని చచ్చినట్టు ఊపిరి బిగించి పడుకో మంది. గుర్రమావిధంగానే చేయ నిశ్చయించింది. నక్క ఆ అడవి మృగరాజు (సింగము) వద్దకు వెళ్ళి "ఓ రాజా! మీకొక్కడ మంచి ఆహారాన్ని చూశాను. ఒక గుర్రమిక్కడ పడివుంది. మీరు కడుపారా భుజించవచ్చు. కాన నావెంట రండం" టూ తోడ్కొని వచ్చింది. నక్క రావటము చూసి గుర్రము చచ్చినట్లు పడుకొంది.

నక్క సింహంతో "ఇక్కడ యీ ఆహారం తినటానికి వీలుండదు. కనుక మీ ముందు కాళ్ళను గుర్రంతోకకు కడతాను. మనము గుహ లోనికి పోయి యథేచ్ఛగా తినవచ్చు" అంది. ఆవిధంగా ఒప్పుకొన్న సింహం ముందు కాళ్ళను గుర్రంతోకకు కట్టింది. నక్క కూయని కూయ గానే గుర్రం వాయువేగాన్ని పరుగెత్తింది. సింహ ము గాండ్రు గాండ్రు మంటూ అరవటం మొదలుపెట్టింది. అడవిలో జంతువులన్నీ హడిలి చెల్లా చెదరయి పోయాయి. అలా ఆ గుర్రము సింహాన్ని తన యజమానింటికిలాక్కు పోయింది.

శెట్టి ఈదృశ్యాన్ని గాంచి ఆశ్చర్యపోయాడు. సింహాన్ని అవలీలగా లాక్కొచ్చిన బలం గల గుర్రాన్ని అభినందించుతూ మళ్ళీ యథాప్రకా రంగా గుర్రానికి మేత వేస్తూ ప్రేమగా చూడ సాగాడు. చూశారా! నక్క యెటువంటి ఉపా యం పన్నిందో - ఉపాయంవల్ల నేకార్యాన్నైనా సులభంగా సాధించ వచ్చు.

—: o :—

## * చిన్ని కృష్ణుడు *

— "సు ధా కి ర ణ్"

చిఱుతపాదాల గజ్జెలు చిందులాడ
అలరుకటిపైన మువ్వలు అల్లలాడ
బోసినవ్వుల మోము విలాసమొనగ
ఫాలమందలి తిలకంబు లీలనొప్ప
శిరమునందలి పింఛము మెఱసిపోవ
కరమునందలి వేణువు కాంతులీన
లీల నృత్యంబుసేయ నీలాల కురులు
తళతళమటంచు మెఱయ పీతాంబరంబు

ధవళ హారాలు కంఠాన తళుకుమసగ
శీతలాపాంగ దృక్కుల చిన్నవాడు
ముద్దులొలికెడి శ్రీకృష్ణ మోహనుండు
చిన్నిపాపల చూడ వేంచేయునేమొ!
స్నేహమొనరింపగా దయచేయునేమొ!
నిండువేడుక బాలలూ! రండు! రండు!!
తీయతీయని ఫలములన్ తెండు! తెండు!!

—————

# ★ ఆత్మకథ ★

రచన:
శ్రీమతి నాయని స్వప్నకుమారి

అది డ్రాయింగు రూమ్. అందులో ఒక బల్ల. దానిపైన మల్లెపువ్వులాంటి తెల్లని గుడ్డ. దానిమీద ఫ్లవర్ వాజ్ కొన్ని పత్రికలు ఉన్నవి. అక్కడ ఒక కుర్చీమీద సుధాకరరావు కూర్చుని తీక్షణంగా ఒక కవరు చూస్తున్నాడు. మధ్య మధ్య అక్క రాలేదేమో అని వీధివంక చూస్తున్నాడు. అంతలో 12 గంటలు కొట్టింది గడియారం.

"ఏం సుధా! కాలేజీ లేదా ఈ రోజు?" అంటూ ప్రవేశించింది శశి. ఆవిడది సన్నగా పొడుగ్గా ఉండే రూపం. తీర్చిదిద్దిన ముఖం. సౌందర్యవతి కాకపోయినా కురూపి మాత్రం కాదు. సన్నటి వాయిల్ చీర కట్టి తల వెంట్రుకలను జారుముడి వేసింది. చేతిలో "స్టెతస్కోపు" ఆమె డాక్టరని చెప్తున్నది. అప్పుడే పని పూర్తి చేసుకుని వైద్యశాలనుండి తిరిగి వచ్చింది శశి.

సుధాకరుడు అక్క ప్రశ్నకు లేదన్నట్లుగా తల త్రిప్పి, మళ్ళీ కవరు ముఖం చూచి "ఎవరక్కా ఈ రామారావు?" అనడిగాడు.

"ఏమిటీ! ఎక్కణ్నుంచి వచ్చింది" అని ఆతురత చూపించింది శశి.

"విశాఖపట్నంనుండి, శుభలేఖ. రామారావుగారమ్మాయి పెళ్ళట, ఎవరక్కయ్యా?" అని కుతూహలంగా అడిగాడు.

"ఏది ఆ కవరిటువ్వు" అంటూ అందుకుని తృప్తిగా అటూ ఇటు త్రిప్పి మార్చి మార్చి చూసింది. ఆమె కళ్లు రెండూ సంతోషమూ భక్తిభావమూ నిండి మెరిసినవి.

తమ్ముడు ఇంతసేపూ ఆవిడవైపు ఆశ్చర్యంగా చూస్తున్నాడు. శశి కథ మొదలుపెట్టింది.

"ఆయన ఒక మహానుభావుడు. నేను యింత వృద్ధిలోకి రావడానికి కారణం ఆయన. తాతగారి ఆస్థి అంటూ ఉండికూడా అమ్మ దిక్కులేందయిపోయింది. అటూ యిటూ లేని నిర్భాగ్యులమయిన మనల్ని చేరతీశారు. అతను నాన్నగారి ప్రాణమిత్రుడు. ఆయన ఋణం యెట్లాతీర్చుకోవాలో అర్థం కావడం లేదు. ఆయన గురించి నాన్న గార్ని గురించి అమ్మ చెప్తూఉండేది పాపం.... అంటూ చెప్పేది ముగించకుండానే, గడియారంవంక చూచి "లే తమ్ముడూ ఒంటిగంట అవుతోంది భోంచెయ్యాలి" అని అన్నది.

"ఆ చెప్పేదేదో పూర్తి చెయ్యిమరి."

"ఇప్పుడేకావాలా? అంతా మొండిపట్టు. సాయంత్రం నాకు పనిలేదులే. భోంచేసితీరిగ్గా కూర్చుని చెప్పుకుందాం" అని లేచింది శశి.

ఇద్దరిభోజనాలు పూర్తయినవి. తిరిగివచ్చి డ్రాయింగ్ రూములో కూర్చున్నారు. సుధాకర్ ఒక్కక్షణమైనా వ్యర్థం చెయ్యకూడదన్నట్లుగా అక్క మొఖంచూచి "అమ్మనెందుకు తాతావాళ్ళు నిర్లక్ష్యంగా చూచారు? నాన్ననెందుకు గౌరవించలేదు? మనకు రామారావుగారు సహాయం చెయ్యవలసిన అవసరం యేమిటి?" అనిప్రశ్నించాడు.

తమ్ముడూ! నాకు 12 సంవత్సరాలప్పుడు, నేను స్కూల్లో రెండవఫారం చదువుతున్నాను. నీకు మూడు సంవత్సరాలు. అమ్మ, నాన్న, రామారావు గారింట్లో ఒక భాగంలో ఉండేవారు. నాన్న ప్రొద్దున్నేపోయి మధ్యాన్నం ఒంటిగంటకు వచ్చేవారు. చాలాకోపం. చిరాకుగా ఉండేవారు. నాకింకా అశుభం శుభం తెలియదు. నాన్న వస్తున్నారని తెలిస్తేచాలు అమ్మ నన్ను అక్కడ ఉండనిచ్చేది కాదు ప్రక్కయింటికి పంపేది.

అమ్మ చాలానీరసంగా ఉండేది. నాన్నకూడా చాలా నీరసంగా యెప్పుడూ దగ్గుతూ ఉండేవారు. క్రమక్రమంగా నాకు ఊహ తెలుస్తున్నది. నేను నాల్గవ ఫారం చదువుతున్నాను.

ఒకరోజు నేను స్కూలు నుంచివచ్చి అమ్మదగ్గర నా జీతం కట్టకపోతే పేరుకొట్టేస్తారని మారాంపెట్టున్నా.

ఇంతలో నాన్నవచ్చి "నేను సంపాయించలేక చస్తుంటే, ఈ పిల్లకు జీతమా ! నాప్రాణం తీస్తున్నది. నేనుచస్తేగాని పీడ వదల" అని చాలాచాలా కేకలేశారు. ఆసమయంలో నాన్నముఖం చూడలేకపోయాను. ఆ తరువాత రామారావుగారిడంతా కనిపెట్టి నాకు నెలనెల జీతం కట్టేభాధ్యత తనదని అమ్మతో చెప్పారు. అమాటలువిని అమ్మ కండ్లవెంట నీళ్ళు పెట్టుకుంది.

ఆరాత్రి నాకు సరిగ్గా 12 గం॥ లకు మెలకువ వచ్చింది. ఎవరివోమాటలు వినిపిస్తున్నవి. ఇంకెవరివి? అమ్మా, నాన్నా మాట్లాడుకుంటున్నారు.

"పిల్లలిద్దరూ నిద్రపోయారా?" అని నాన్నగారిప్రశ్న.

"ఆ నిద్రపోయారు. ప్రొద్దుట ఊరికే దానిఎదురుగుండా మాటలన్నారు. అది చాలాసేపు ఏడ్చింది. దానిజీతం మీస్నేహితుడు రామరావుగారు కట్టారు" అని జాలిగా సమాధానమిచ్చింది.

"ఆ ! రామరావుగారు కట్టానన్నారా ! అతనికి మనం చాలా ఋణపడి వున్నాం సరూ ! అతను నాకెన్నిసార్లో ఆదుకున్నాడు. ఛీ ! పాడుబ్రతుకు భార్యా బిడ్డలకు కడుపునిండా కూడు, కట్టగుడ్డ యివ్వలేని దౌర్భాగ్యుణ్ణికదూ! ఛీ ఇటువంటి బ్రతుకు బ్రతికేకంటే చావడంమేలు"...అని దగ్గుతెరవచ్చి తట్టుకోలేక పోయారు.

"చాలా ఉద్రేకంగా మాట్లాడుతున్నారు. మీఆరోగ్యమన్నా చూచుకోరు. రోజులన్నీ ఒకేమోస్తరుగా ఉంటాయా? ముందుకు మంచిరోజులున్నాయి మనకు. మీరు ఆవేశంగా మాట్లాడుతూ మీఆరోగ్యానికి భంగంకలుగ చేసుకోకండి" అనిప్రాధేయ పడ్డది అమ్మ.

"పిచ్చిదానా ! ఇంకా నీకీపాడులోకంలో బ్రతకాలని ఉన్నదా? ఈలోకంలో డబ్బున్నవాళ్ళదే రాజ్యం. పొట్ట పొడిచినా అక్షరంలేని మూర్ఖుడుకూడా డబ్బుతో చాలా గౌరవం పొందుతున్నాడు. ఎవరైనా డబ్బునిచూచి మానవుని గౌరవిస్తున్నారు కాని చదువుకుని ఉన్నతభావాలు కల్గిఉన్న యువకుణ్ణిగానీ యువతినిగాని కాదు. ఇటువంటి లోకంలో తుచ్ఛులు బ్రతకాలికాని మనబోటి మానాభిమానాలుకల్గినవారు బ్రతకడానికి తావులేదు సరూ !

కాస్సేపు తమాయించుకుని నాన్నమళ్ళీ అన్నారు.

"నాకు ఈప్రపంచంలో నీవు ఒక్కదానివి కనుపిస్తున్నావుసుమా ! తండ్రి గొప్పభాగ్యవంతుని కిస్తానంటే ఈ నిర్భాగ్యుణ్ని పెండ్లాడావు. నీకు కడుపునిండా కూడూ కట్టబట్ట ఇవ్వలేక పోయినప్పటికీ ఇంకా ఈ నిర్భాగ్యుణ్ని పట్టుకుని ఊగులాడు తున్నావు. నీవెంత సుగుణ శీలవో కదా!" అమ్మ ఆయన్ని మధ్యలోనే ఆపి. "పాతగాథలన్నీ త్రవ్వుకుంటున్నారు. పిల్లలు లేస్తారు తెలుసా ! ఆరోగ్యం సరిగా లేదుకదా నిద్రపోకూడదూ ! మీకు విశ్రాంతి అవసరం" అంటూ మరిపించాలని చూసింది.

అంతవరకూ చెవులు రిక్కపెట్టుకుని వింటూనే ఉన్నాను. నిజంగా తమ్ముడూ ! నా జీవితంలో నేనప్పటివరకు అమ్మ కొట్టినా నాన్న కోప్పడినా మాట్లాడకుండా ఊరుకు నేదాన్ని. కాని ఆరోజు రాత్రి మనస్సేమీ బాగుండలా. అట్లా ఆలోచిస్తున్నా యెప్పుడు నిద్రపట్టిందో తెలియదుకాని తెల్లగా తెల్లవారిన తరువాత "బడికి వెళ్ళాలి లేవే" అంటూ అమ్మ లేపింది.

మామూలుగా కాలకృత్యాలు తీర్చుకుని బడికి వెళ్ళాగాని యేమీ తోచలా ! మనస్సంతా యెవరో కెలుకుతున్నట్లున్నది. ఇంటికి తిరిగొచ్చాక అమ్మతోమాట్లాడకుండా 5 సంవత్సరాల నిన్ను ఆడించమన్నా అమ్మ మాట వినకుండా గదిలో తలుపులు వేసుకుని ఆలోచిస్తున్నా !

"అమ్మా నాన్నా ఇటువంటిస్థితిలోనికి రావడానికి కారణం? అమ్మ అంటే తాతయ్యా కెందుకు యిష్టంలేదు? అమ్మ భాగ్యవంతుని చేసుకోకుండా నాన్ననెందుకు చేసుకోవాలి?" అన్న ఆలోచనలు నామనస్సులో యుద్ధం చేసినయ్.

ఇంతలో అమ్మవచ్చి "పిలిస్తే పలకవేమే ! చీకటికొట్లోకూర్చున్నావేమే" అని ముఖమెత్తి చూచింది. నా కండ్లు యెఱ్ఱపడి ఉన్నవి.

"అదేమిటమ్మా అట్లా ఉన్నావు ! ఎవరయినా యేమయినా అన్నారా? స్కూల్లో పిల్లలతో పోట్లాడావా? లేక నీకేమైనా కావాలా?"

"అమ్మా నేనొకటి అడుగుతా చెప్తావా!" అన్నాను.

"ఏమిటమ్మా" అని అడిగింది.

"అమ్మా ! రాత్రిజరిగిన మీసంభాషణ విన్నాను. నాన్నగారేమిటో తాతాగారు నిన్నుభాగ్యవంతుడికివ్వాలని చూస్తే నీవు అది నిరాకరించి నాన్నను చేసుకున్నావని, తాతగారు నీ సంబంధమే లేకుండా వదులుకున్నారని మాట్లాడుతున్నారు. - అమ్మా ! యెవరైనా కన్నబిడ్డలు తప్పులు చేస్తే కన్నతల్లీ దండ్రీ వాళ్ళను వదిలివేస్తారా? నిజంగానా అమ్మా !" అని ప్రాధేయ పడ్డాను.

"చిన్నదానికి నీకెందుకు లేమ్మా ఈ అజలన్నీ" అని మందలించ బోయింది.

"లేదమ్మా, నాకు చెప్పితీరాలి. లేకపోతే నీతో మాట్లాడను. అన్నం తినను." అని మూతిబిగించి కూర్చున్నాను.

"అంతపట్టుదల యెందుకమ్మా ! మరిచెప్తావిను. నా దుఃఖభాజనమైన జీవితగాథ" అనిమొదలు పెట్టింది.

"మీతాతగారు సుందరరావుగారు చాలాపేరు పొందిన డాక్టరు. ఆయన రాజమండ్రీలో "ప్రాక్టీసు" పెట్టారు. భార్య పేరు సుశీల. నిజంగా సుశీలే. ఆదంపతులకు నేను ముద్దుబిడ్డను, చాలా గారాబంగా పెరిగాను. మానాన్న చాలా డబ్బు సంపాదించాడు.

నాకు 10 సంవత్సరాలు. నేనుస్కూల్లో చదువుతున్నాను మాఅమ్మకు చాలాజబ్బు చేసింది. నాన్న తను మందులివ్వడమే కాకుండా గొప్పగొప్ప డాక్టర్ల చేత మందు లిప్పించారు. కాని అవి ఫలించలేదు.

గడ్డుగోజులు కాబోలు. భగవంతుడు నాజీవితమంతా ఈవిధంగా వ్రాశాడు గనుకనే అమ్మ నన్ను నాన్న చేతుల్లో వదిలి ప్రాణాలు విడిచింది.

అమ్మ చనిపోయిన తరువాత నాన్నే నన్ను పంచ ప్రాణాలుగా చూచేవారు. ఎంత ప్రేమగా చూచినా అమ్మచూచి నట్లు ఉండేది కాదు. అమ్మలేదన్న దిగులుతో నాన్న "ప్రాక్టీసు" చూచుకోకుండా ఉండేవారు. అప్పుడు మాతాతగారు వాళ్ళంతా కలసి మానాన్నకు మళ్ళీ పెండ్లిచేశారు.

మాపిన్ని వచ్చింది. చాలా నాజూగ్గాఉండేది. నాన్నకసలు రెండవపెండ్లి అంటేనే అయిష్టంగా ఉండేది. బలవంతాన చేశారు. అందుచేత ఆమెతో యెక్కువ మాట్లాడేవారుకాదు. ఏపనికావాలన్నా నాతోచెప్పి చేయించుకునేవారు. వెళితే వైద్యశాల. లేకపోతే నాగదిలో గడిపేవారు.

ఏస్త్రీ తనభర్త సరిగా మాట్లాడకుండాఉంటే సహిస్తుంది! దీనికంతా నేనే కారణమని ఆమె ఊహ. ఈ ఊహాలే నాకష్టాలకు పునాదులు. మొట్టమొదట్లో యెంత ప్రేమగా ఉండేదో ఆ ప్రేమంతా ద్వేషంగా మారిపోయింది.

నాకు క్రమక్రమంగా యుక్తవయస్సు వచ్చింది. స్త్రీ శక్తిస్వరూపిణి కదా ! శక్తి తలుచుకుంటే కొనసాగనిదేది? క్రమ క్రమంగా నాన్నను కూడా లోపరుచుకున్నది. అన్నాళ్ళు నాకు అండగా ఉన్న నాన్నకూడా ఆమెవల్లో పడి నాకు విముఖతగా కనపడేవారు. ఇంట్లో మెలగడానికే భయంగా ఉండేది.

ఇంక మీనాన్నతో పరిచయం వినమ్మా ! మాయింటికి యెదురుగుండా ఒకయింట్లో ఒకరూములో మీనాన్నగారు, రామారావుగారూ చదువుకుంటూ ఉండేవారు. నేనప్పుడు 5 వ ఫారం చదువుతుండేదాన్ని. రోజూ బడికి పోవడానికి బయలుదేరినప్పుడల్లా నాముఖంచూస్తూ ఉండేవారు.

నేనంత పట్టుదలగా పట్టించుకో లేదు. ఆసంవత్సరమంతా అట్లాగే గడచింది. నేను స్కూలుఫైనల్ చదువుతున్నాను.

ఆరోజు ఆదివారం స్కూలు లేదు. ఇంట్లో కూర్చుని చదువుకుంటున్నాను. ఇంతలో ఒక కుఱ్ఱవాడొచ్చి ఒక ఉత్తరం పడేస్తూ "అమ్మాయిగారు, ఆ అబ్బాయిగారిమ్మన్నా"రని యెదురింటిని చూపిస్తూ అన్నాడు. నాకు చాలా భయమేసింది. పిన్నియెక్కడ చూస్తుందో అని చప్పున ఉత్తరం తీసి పుస్తకంలో పెట్టేశాను. తర్వాత తీరిగ్గా ఎవరూలేనప్పుడు దాన్ని విప్పాను.

అదంతా "ప్రేమలేఖ". పూర్తిగా దాన్ని చదవడానికే భయంవేసి చదవకుండానే చించిపారేశాను. అట్లా చాలా ఉత్తరాలు వచ్చాయి. నేను స్కూలుఫైనలు చదువుతుండ

గానే మా నాన్నగారు నాకు వివాహప్రయత్నాలు చేయడం మొదలుపెట్టారు. చాలా గొప్ప గొప్ప సంబంధాలు వచ్చాయి. అవన్నీ పిన్ని పడగొట్టింది. నాకింకా వివాహం చేసుకుందామన్న ధ్యాసలేనందున నేనావిషయాలంత పట్టించుకోలేదు. మాపిన్ని నావివాహంలో ఎందుకంత అయిష్టత చూపుతుందో కూడా నేనాలోచించ లేదు.

ఒకరోజున నేను స్కూలునుండి వచ్చేసరికి మళ్ళీ ఉత్తరం వచ్చింది. "క్షేమలేఖ" నితెలిసి కూడా చూడాలని బుద్దిపుట్టి విప్పిచూచాను. అందులో ఉన్నది ఇది :నమ్మా!

చి. సరోజకు,

ఆశీర్వదించి. నీకుచాలా ఉత్తరాలు నాస్నేహితుడు "మాధవరావు" వ్రాశాడు. ఒక్కదానికి కూడా నీవు జవాబు వ్రాయలేదు. నిన్నుచూచిన దగ్గరనుండి నాస్నేహితుడు నిన్ను వివాహం చేసుకోవాలని ఉత్సాహ పడుతున్నాడు. ఆవిషయమే నీకు ఉత్తరాలద్వారా తెలియ పరచాడు. నీవంగీకరించినది లేనిదికూడా మాకు మళ్ళీ తెలియ పరచలేదు. నా స్నేహితుడు నీ వియోగాగ్నిచే తపించిపోతున్నాడు. అన్నం తినడు. చదువు చూచుకోడు. నిన్ను స్మరిస్తూ కాలం గడుపుతున్నాడు. నీ తండ్రిని అడగాలని నాతలంపు. కాని మీ పిన్నమ్మ అడ్డం వస్తుందని నా అనుమానం. కాబట్టి అతనిని రక్షించే భారం నీది. నీవు ఆలోచించి తిరిగి సమాధానమిచ్చినా సరే లేక నన్ను కలుసుకుని మాట్లాడినాసరే. నీశ్రేయోభిలాషి.

"రామారావు"

అనిఉన్న ఉత్తరంచూచి సమాధాన మేమిద్దామా అని ఆలోచిస్తున్నాను. ఆ రాత్రంతా నిద్రపట్టక ఉత్తరంగురించి ఆలోచిస్తున్నాను. ఇంతలో ప్రక్కగదిలో నుండి మాటలు వినిపిస్తున్నవి. నా గది ప్రక్కదే మానాన్నగారి గది. ఆ సంభాషణ చాలా తీవ్రంగా జరుగు తున్నది. పిన్ని, నాన్న మాట్లాడు కుంటున్నారు. ఆ మాటాడేదంతా నావిషయమే నని తెలిసి చెవులు నిక్కించుకుని వింటున్నాను.

"ఎంతకాలం చదివిస్తారు అమ్మాయిని?" పిన్నిప్రశ్న.

"అది చదువుకునేవరకు" నాన్నగారి సమాధాం.

"దానికి పెండ్లిచేయరా ! పెద్దదవుతుంటే చూస్తు ఊరుకుంటే అప్రతిష్ట కదా!" అనియెంతో అనురాగంగా అడిగింది పిన్ని.

"వచ్చిన సంబంధాలన్నీ పడగొట్టావు. మళ్ళీ ప్రశ్నిస్తావేమి. నీవు బ్రతికుండగా సరోజినికి వివాహమయ్యే యోగంలేదు" కర్కశంగా నాన్నగారి మాటలు వినిపించినయ్.

"నేనేమి చేశానండీ. నన్నంటారు. మీ అమ్మాయి శ్రేయస్సుకోరేగా వాటిని కాదన్నది." అన్నది కోపంగా.

"శ్రేయస్సు కోరేదానివి కాబట్టే వచ్చిన సంబంధాలు పోగొట్టేవు. వచ్చేసంబంధాలు రాకుండా చేశావు. నీ కన్నబిడ్డయితే ఇటువంటి పనులు చేసే దానివా? సుశీలే ఉంటే దానికీపాటికి వివాహమై మంచిస్థితిలో ఉండేది. నీవు తల్లివా? సవతితల్లి తల్లి అవుతుందా? ఇదంతా నాకర్మ. నిజంగా నీకుదానిపైన అనురాగం ఉంటే మంచి సంబంధము వచ్చేటట్లు చూడు. లేదా వచ్చేవాటిని పడగొట్టకుండా చూస్తూఊరుకో" అని విసురుగా సమాధాన మిచ్చారు.

"అమ్మాయికి మంచిసంబంధం చేయాలనేగా వచ్చేవన్నీ పడగొట్టింది. అవునులెండి సవతితల్లి అనేఅంటారుగాని కన్నతల్లి అనిఅంటారా?" అంటూ వెక్కి వెక్కి యేడవడం మొదలు పెట్టింది.

"మంచి సంబంధం అనిఅంటావే, ఎక్కడున్నవని వచ్చిపడడానికి. మీ ఊరుదగ్గరేమన్నా ఉంటే చూడరాదు?"

"నే చెప్పిన సంబంధం చేస్తారా?" అని మా పిన్ని కుతూహలంగా ప్రశ్నించింది.

"ఆమాటమీదనే నిలబడాలి తరువాత కాదంటే లాభం లేదు"

"సరే! దానియిష్టంవద్దా? దాని కిష్టంలేని పని నేను చెయ్యలేను" గాభరాగా నాన్నగారి మాటలు వినిపించాయి.

"ఇంకా అమ్మాయి ఇష్టాయిష్టాలతో పనేమిటండి. మనం అమ్మాయి బాగోగులు చూడకుండా చేస్తామా ! మీరు "ఊ" అనండి రేపు రప్పిస్తాను" అన్నది పిన్ని.

"ఎవరా అబ్బాయి? ఏమిచదువు కున్నాడు? ఆస్థిపాస్తు

ఉన్నవా? అందగాడేనా" అని నాన్నగారి ప్రశ్నలు వర్షంలాకురిసినయ్.

"అదేమిటండీ అట్లా అడుగుతారు. మా చిన్నాయన కొడుకు. ఆస్థి బాగా ఉన్నది. రేపు మీరే చూస్తారుగా వాడి అందం" పిన్ని నవ్వుతూ అన్న మాటలు వినిపించినయ్.

"అట్లాగే" నాన్న నిరుత్సాహంగా పలికిన మాటలు వినిపించినయ్— ఇక ఆ రాత్రంతా కంటిమీద కునుకు లేదు.

తెల్లవారి మామూలుగా లేచి కాలకృత్యాలు తీర్చుకుని స్కూలుకు పోయాను. స్కూల్లో అంతా ఇదే ఆలోచన. ఆ ఉత్తరానికి సమాధానమేమని వ్రాసేది? నా సౌఖ్యాన్ని చూచేదా? నాకోసం తపించే "మాధవరావు" ప్రాణాలను రక్షించేదా! నా తల్లీ తండ్రీ ఆజ్ఞలకు బద్ధురాలనై ఉండేదా! ఆఖరికి ఇంటికి వెళ్ళి మళ్ళీ ఆలోచించి సమాధానం వ్రాయాలని తీర్మానించుకున్నాను.

నేను ఇంట్లో అడుగుపెట్టగానే ఎన్నడూరాని పిన్ని యెదురుగుండా వచ్చి నాచేతుల్లో పుస్తకాలు అందుకున్నది. చాలా ఉత్సాహంగా స్నానంచేసి బట్టలుమార్చి చక్కగా ముస్తాబవమ్మా పెండ్లివారు వస్తారని చెప్పింది. ఇంతహడావుడికి కారణం ఇదా! అని అనుకుంటూ, ఇంక ఆమె ఆజ్ఞనుమీరి ఆమె ఉత్సాహాన్ని పాడుచెయ్యడమెందుకని పిన్ని చెప్పినవన్నీ చేయబోయాను. నేను స్నానం చేసి ముస్తాబయ్యేసరికి నాగదిలో కాఫీ ఫలహారం తయారుగా ఉన్నాయ్.

ఇంతలో పెండ్లికొడుకు వాళ్ళ బంధువులు దిగారు. మా పిన్ని చాలా ఆనందంగా తిరిగింది. పెండ్లికొడుకుని చూపించారు. అబ్బా! నేనేమిచెప్పేదమ్మా! అతడు అందగాడు కాకపోలేదు. అందరూ అనుకున్నట్లు నాకు ఈడూజోడూ సరిపోయేట్లే ఉన్నాడేమో! కాని, అతని ముఖంలో కొట్టవచ్చే ఏదో కర్కశత్వం నా హృదయాన్ని కలచివేసింది. అతడంటే నాకిష్టం కలుగనీయకుండా చేసింది. దానికితోడు ఎదురంటి మీనాన్నగా రాపగనే నాస్మృతిలో కేతం వేసుకుని కూర్చున్నారు. ఈ సంఘర్షణమధ్య నా మనస్సు చాలా బాధపడ్డది.—

తర్వాత నాన్నగారు అడిగారు "అతను నచ్చాడా"అని.

"నాకిష్టం లేదు నాన్న" ఆవేశంతో చెప్పాను.

"నీకిష్టమేమిటి! ఇంతకంటే మంచివాడు దొరుకుతాడా? ఆస్థిపాస్తులున్నాయ్. దగ్గర సంబంధం ఈడూ జోడూ!" అని మా పిన్ని ఉపన్యాసాలు మొదలుపెట్టింది—నిజమే మరి! కాని నా మనస్సుకు సమాధానం ఆవిడ మాటలేం చెప్పకలవు?—

"నాకు నచ్చలేదు నాన్న!" ఒక్కగాని ఒక్కబిడ్డనే? చూస్తూ చూస్తూ తడిగుడ్డతో గొంతుకోస్తారా? వెక్కి వెక్కి ఏడుస్తూ ప్రాధేయపడ్డాను—కాని కారణాలు చూపించలేని నా నిరసనకు మా నాన్నగారు సుముఖులు కాలేదు. నాకు ప్రపంచమంతా తిరుగుతున్నట్లు కనపడింది. గబగబ లేచి నాగదిలో కెట్లా వచ్చానో నాకే తెలియదు. నా తల్లిదండ్రులు మాట్లాడుకునే మాటలు కూడా వినపడలేదు—

నా గదిలోకొచ్చి కుర్చీలో కూలబడి ఏడవడానికికూడా శక్తిలేక నాలో నేనే కుమిలిపోతున్నాను. నాకెదురుగుండా మాతృమూర్తి సుశీల జాలిగా "నిన్ను రక్షించడానికి నాకు శక్తి లేదమ్మా!" అన్నట్లు చూస్తున్నది. గోడమీద ఫొటో.

ఇంతలో గాలికి కిటికీరెక్కలు తెరుచుకున్నవి. ఎదురుగుండా, మీ నాన్నగారిగది కనపడ్డది. అది చూడగానే ఉత్తరం జ్ఞాపకం వచ్చింది. వెంటనే ఉత్తరం చూచి నిశ్చయించుకున్నాను. అతను బీదవాడైనా సరే అతని కోసం ఈ తుచ్ఛభోగభాగ్యాలన్నీ వదులుకుని అతన్ని చేపట్టి అతని ప్రాణాలను రక్షించాలి. అప్పటికప్పుడు రామారావుగారి, మా ఇంట్లో పరిస్థితులన్నీ వివరిస్తూ, "మీ స్నేహితుడైన మాధవరావుగారిని వివాహం చేసుకోడానికి అంగీకరించా"నంటూ ఉత్తరం వ్రాశాను.

(సశేషం)

# ★ చెల్లమ్మ ★

* శ్రీ అయపిళ్ళ రామారావు *

చెల్లమ్మ గారంటే చిన్నవారనుకుంటారేమో! అసలామె పేరే చెల్లమ్మ. షష్ఠిపూర్తి అయినా కాయ శరీరంగల మనిషి. ఆమెకు తెలియని వయస్సులోనే భర్త కాలం చేశాడట పాపం! ఆటుతరువాత ఆమెకు మిగిలింది పట్నంలో పూర్వకాలపు మేడ, కొద్ది భూవసతీను. చెల్లమ్మగారి మేడంటే అంత పట్నంలోనూ తెలియని వాళ్లెవరూ! ఆ మేడకుండే రంగు ఆ వూళ్ళో ఇంకో మేడకు లేకపోవటమే అందులోని విశిష్టత. మేనల్లుడు కామేశ్వరం తప్ప నా అనేవాళ్ళు లేరు చెల్లమ్మగారికి.

చిన్నతనంలో చదువు రాని కారణం చేత కామేశ్వర్రావుకు నౌకరీ చేసే భాగ్యం లేకపోయినా రిజిష్టారు ఆఫీసులో సాక్ష్య సంతకాలు పెడుతూ అనుదినం ఒకటి రెండు రూపాయిలు తన స్వంత ఖర్చుకు తెచ్చుకుంటూ చెల్లమ్మనే నమ్ముకున్నాడు. కామేశ్వర్రావుకు కళత్ర నష్టమయ్యాక చెల్లమ్మ ప్రయత్నించినా జబ్బు మనిషనీ, నాలుగు పదులు నిండినవాడనీ ఎవరూ పిల్ల నివ్వటంలేదు. చివరకు చెల్లమ్మగారికి మగసహాయం లేదనుకోకుండా వెళ్ళబుచ్చు తున్నాడు కాలాన్ని.

ఇరవై కుటుంబాల వాళ్ళుండగా ఒకటి రెండు వాటాలు ఖాళీగానే వుంటూంటాయి ఆ మేడలో. చిత్రం ఏమంటే ఆ మేడలో అయిదు రూపాయిల వాటా మొదలు అరవై రూపాయిల వాటా వరకూ ఉన్నాయి. అంటే ఇంచుమించుగా అన్ని తరగతుల కుటుంబాలూ వుంటాయన్న మాట. చెల్లమ్మగారంటే ఆ మేడలోనివాళ్ళకే కాక ఇరుగు పొరుగుల ఇళ్ళ వాళ్ళకి కూడ సింహస్వప్నం. ఆమె యెడల భయం, భక్తీ లేనివాళ్ళు ఎవరన్నా వుంటే ఆమె ఇట్టే పట్టేస్తుంది. ఆమె ఇంటి యజమాని అనే భయం కన్న ఆమె నోటిమాటకు జడిసేవారే అధికం. అటుకులు దంపాలన్నా, అప్పడాలు వత్తాలన్నా చిన్నా పెద్దా అనే భేదం లేకండా వెళ్ళి సహాయం చేస్తుంటుంది చెల్లమ్మ. శుభానికయినా, అశుభానికయినా ఆమె సహాయాన్ని అపేక్షించని వారు అరుదు ఆ పరిసరాల్లో. ఆమె దయను పొందటానికి ఆమెను అనుదినం ఏదో విధంగా కలుస్తూ తమ మంచిచెడ్డలు వెళ్ళ బోసుకుంటూండాలి. మామ్మగారనో, అమమ్మగారనో, అత్తగారనో ఏదో వరసను ఆమెను పిలుస్తూ వారిళ్ళలో ఏకూరలొండుకున్నారో ఎవరెవరు బంధువులొచ్చారంటే ఆమెకో ఆనందం. అట్లా ఆమెతో కలియని వాళ్ళంటే ఏదో ఓ సమయంలో స్వయంగా వెళ్ళి మంచి చెడ్డలడిగేస్తుంది. పూర్వాచారాలంటే అర్థం తెలీక పోయినా చాదస్తాలు మాత్రం ఆమెకున్నాయి. ఆ యింట్లో ఆమె ఎప్పుడు నిద్రపోతుందో ఎప్పుడు లేస్తుందో అనిపిస్తుంది. రాత్రి అందరి రాకపోకలూ అయ్యాక పెద్ద తలుపులు స్వయంగా మూసి పండుకుంటుంది. వీధి ద్వారానికి ప్రక్క భాగంలోనే ఆమె వుంటూంది గనక ఆమెకు చెప్పి వెడితే వచ్చే వారికి ఎంత రాత్రయినా విసుక్కోకుండా తలుపు తీస్తుంది.

రెండవ అంతస్తులో జానికమ్మగారు, భర్త, కుమార్తె వనజ సుమారు మూడు మాసాలనుండి ఉంటూన్నారు. జానికమ్మ భర్త వెంకటచలంగారు కలెక్టరాఫీసులో హెడ్ గుమాస్తా. వనజ ఇంటరు చదూతోంది. జానికమ్మ స్వయంగా తన దగరకు వచ్చి ఏసంగతులూ చెప్పని మూలాన మనసులో కోపం వున్నా అద్దె అధికంగా ఇస్తూన్నారన్న కారణం చేత ఏమీ అనలేకపోయేది చెల్లమ్మ. ఎవరన్నా తనతో కష్టసుఖాలు చెప్పకపోతే వారిలో ఏవో లోపాలున్నాయనే భావిస్తుంది చెల్లమ్మ. జానికమ్మ తరచు స్నేహితులిళ్ళకో, మీటింగులకో వెడుతూంటుందిగాని తనతో మాట్లాడకపోవటం ఆమెకు ఇష్టంలేదు. వనజ ప్రవర్తన ఆమెకు మొదటినుంచీ ఆశ్చర్యంగానే కనిపిస్తోంది. ప్రయత్నించినా ముక్తసరిగా ఒకటి రెండు మాటలు తప్ప అధికంగా మాట్లాడలేదామెతో వనజ. అందుక్కారణం వనజ ప్రవర్తనలో ఏదో విపరీతం వుండుటమే అని భావిస్తూండేది. వనజ కాలేజీకి వెళ్ళే సమయంలో అదోలా చూస్తూ దగ్గరఉన్నవారితో "చూశారా ఆవేషం! దొరసాన్లల్లే ఆ రెండు జడ లేంఖర్మం"

అనో "కాళ్ళకు ఆజోడుంటేగాని నడవలేదు కాబోలు! "అనో ఏదో వంక పెట్టి చూపిస్తూ వుండేది.

ఆవేళ కాలేజీ శెలవు. జానికమ్మ ఎవరింటికో వెళ్ళింది. వెంకటచలంగారు ఆఫీసుకెళ్ళారు. వనజ వంటరిగా వుందింట్లో. ఉదయం తలంటుకున్న జుట్టు చక్కగా దువ్వుకుని వదులు జడలుంచి జార్జెటు చీరతో ముస్తాబయింది వనజ. ఆమెకు పూలదండలంటే యిష్టమవడం చేత ఒక దండను మెళ్ళో వేసుకుంది. "గ్రామఫోను రికార్డ్లు" లో తనకిష్టమైన వాటిని ఒకచోట ఉంచి ఒక్కొక్కటే వేస్తూంది. "గ్రామఫోను" లో "ఎంతఘాటు ప్రేమయో" అనే పాట వస్తూంది. ఆ పాటలోని మాధుర్యంలో లీనమై నాట్యం చేస్తూంది వనజ. పాపం, ద్వారం ఎద్దనుంచి చెల్లమ్మగారు చూస్తూన్న సంగతి గమనించనేలేదు వనజ. రికార్డు తిరుగవేస్తూన్న సమయంలో "ఏమమ్మా వనజా మీ అమ్మ నిన్నొక్కర్తెనే విడిచి వెళ్లిందా" అన్నది చెల్లమ్మ. "నన్నెవరన్నా ఎత్తుకెడతారన్న భయం మా అమ్మకు లేదండీ చెల్లమ్మగారూ" అంది వనజ. పేరు పెట్టి పిలిపించుకోటం ఇష్టంలేదు చెల్లమ్మగారికి. "మేం ఎరగవమ్మా ఈ విడూరాలూ" అంటూ వెళ్లిపోయింది. వనజ తలుపు దభీమని వేయటం చెల్లమ్మకు వంటిపైన దెబ్బ పడినట్టయింది. ఇంకేముంది! వనజ సానివాళ్ళల్లే తైతక్కలాడుతోందని ఇంటింటికీ తెలిసిపోయింది. ఆమె మాటకు "ఊఁ" కొట్టటమేకాక బలపరచేంత వరకూ చెప్పే విధానం తెలుసు చెల్లమ్మకు. అది మొదలు వనజను గురించి ఏవేవో మాటలు పొక్కడం ప్రారంభించాయి మేడలో.

తొందరగా వెడుతూన్న జానికమ్మతో "ఏం జానికమ్మా ఆ అమ్మాయికి భయం భక్తీ చెప్పకపోతే ఎట్లా" అన్నది చెల్లమ్మ "పోనిస్తురూ చిన్నపిల్ల" చెల్లమ్మ ఏసందర్భంలో వనజ గురించి అంటూందో తెలియక జవాబిచ్చి వెళ్ళిపోయింది జానికమ్మ. వెంటనే ప్రక్కింటి వెంకాయమ్మను పిల్చి "చూశావా! చిన్నపిల్లట. పెళ్ళయివుంటే ముగ్గురు బిడ్డల్నెత్త వలసిన యీడుంటే. అయినా చేజేతులా అట్లా ఆడపిల్లను పాడుచేస్తుందమ్మా" అన్నది చెల్లమ్మ.

కొద్ది రోజులు గడచాక ఒక రోజున వనజ సూటు, బూటు వేసుకున్న యువకుడితో సైకిళ్ళ పైనవచ్చి కిలకిలలాడుతూ మేడ మెట్లెక్కుతూంటే చూసి గుండెలో రాయి పడేసుకుంది చెల్లమ్మ. జానికమ్మ మరునాటి వరకు రాదని ఆమెకు తెలుసు. వాళ్ళ నాన్నగారు ఆఫీసునుండి వచ్చేందుకు చాల వ్యవధి వుంది. తన ఇంట్లో ఇల్లాంటి అఘాయిత్యాలు జరగటం అంటే ఒప్పుకోదు చెల్లమ్మ. వెంటనే వెంకాయమ్మతో "నాకేందారమ్మా! ఈ పిల్ల అన్నిటికీ తెగించేసింది" అని సంగతంతా చెప్పింది. "జానికమ్మా వస్తే పిల్లను అదుపులో వుంచకపోతే బాగుండదని చెప్పేయండి పిన్నిగారూ" అన్నది వెంకాయమ్మ. "అయినా ఆడవాళ్ళకి చదువేమిటమ్మా. ఉద్యోగాలు చెయ్యాలా! ఊళ్ళేలాలా" అని చెల్లమ్మంటే. "మానాడిలాంటివి లేవమ్మా. ఏంకాలమొచ్చిందో గాని "అన్నది వెంకాయమ్మ. వారి సంభాషణ అటా జరుగుతూ ఉండగానే గలగల్లాడుతూ వనజా, ఆయువకుడు, నవ్వుకుంటూ బయటకెడుతూంటే "ఉవ్వా" అని నోళ్ళు నొక్కుకున్నారు ఇద్దరూ. రాత్రి వనజ మాత్రం తిరిగి వచ్చేయటం కనిపెడుతూనే వుంది చెల్లమ్మ. ఎంత వేగం తెల్లవారును ఎంత వేగం అందరకూ ఈసంగతి చెప్పనూ! అనుకుంటూ రాత్రి గడిపేసింది చెల్లమ్మ. ఆమరునాడు తెల్లవారు సరికి మేడలోని వారందరకూ ప్రాకిపోయింది వనజ సంగతి. ఎవరికి తోచిన విధంగా వారనుకుంటూనే వున్నారు.

"ఇల్లాటి అవకాశం కోసం ఎన్నాళ్ళయి చూస్తూందో" అని ఒకరు "మగవాళ్ళ కాలేజీల్లో ఆడవాళ్ళ చదువేఁవిటమ్మా" అని ఒకరు, "చదువుకున్న వాళ్ళంతా ఇంతేనమ్మా" అని ఒకరు అనేక విధాలుగా అనుకుంటున్నారు. పైగా ఆ వుదయం వనజ నాన్నగారు ఆఫీసుకెళ్ళిన తరువాత తనూ, చేతిలో 'సూటికేసూ' తొలినాటి యువకుడితో కలసి వెళిపోతూండటం చూసింది చెల్లమ్మ. "అయిందీ ఇల్లు తాళమన్నా వేసిందో లేదో" అని వెళ్ళి తాళం వేసి ఉండటం చూసి "ఏఁవర్రోయి వాడితో పోయిందర్రా అదీ" అంటూ గుక్క తిప్పకుండా అందరితోనూ ఒక విచిత్రంగా చెప్పేసింది చెల్లమ్మ. అందరూ ముక్కు మీద వేలేసుకున్నారు. ఆ సాయంత్రం జానికమ్మ, వెంకటచలం వచ్చేరింటికి. జానికమ్మ భర్త ఉండగా అక్కడకి వెళ్ళటానికి జంకింది చెల్లమ్మ. ఆ మరునాడు వెంకటచలం ఆఫీసుకెళ్లాక ఒక్కొక్కరే జానికమ్మను చూసి వచ్చేస్తున్నారు. జానికమ్మ మాత్రం మామూలుగానే వుంది. ఎవరూ వనజ సంగతి ఆమెను అడగటానికి సాహసించలేకపోయారు. జానికమ్మ స్వయంగా చెప్పుకుని

ఏడుస్తుందేమో, ఆమెకు ధైర్యం చెప్పాలనుకున్నారు వాళ్లంతా, రాస్తసేపు మౌనంగావుంది ఒక్కొక్కరే వెళ్లిపోయారు. చెల్లమ్మ మాత్రం పూర్తిగా ఊరుకోలేక పోయింది. ''ఏం జానికమ్మ, వనజ అలా వెళ్లటం బాగుందా?'' అన్నది. "దానికేం! రెండురోజులుండి వచ్చేస్తుంది" అంటూ తన పని చూసుకునేందుకు వెళ్ళింది జానికమ్మ. చెల్లమ్మ అగౌరపడినట్లు భావించి మాటాడ కుండానే వెళ్లిపోయింది.

"చూసేవా! పైగా రెండు రోజులుండి వచ్చేస్తుందట, అదంతా ఉత్తదమ్మా. ఈలోగా వెదికించి అదే వచ్చేసిం దని చెప్పటానికి ఈ యెత్తంతా'' అని వెంకాయమ్మ తోనూ మంగాయమ్మతోనూ చెప్పింది చెల్లమ్మ.

చెల్లమ్మకిదంతా ఏదోవింతగా తోచింది. నిష్కారణంగా పిల్లపాడయిపోయిందని ఆమె నమ్మకం. తన యింటికి ఏ అపవాదురానుందో అని భయపడుతూంది. అట్లా రెండు రోజులు గడచాయి. మూడవ రోజు రాత్రి తొమ్మిదిగంటల సమయంలో చెల్లమ్మ మామూలుగా వీధి తలుపెయ్యటానికి వచ్చింది. రోడ్డు పైన వనజ, ఆ యువకుడు ఇంకెవరితోనో మాట్లాడుతూండటం చూచింది. ఇహ దొంగదొరికేడన్నట్లు సంతోషించింది. సాహసించి ఆ దొంగను తనేపట్టి అందరికీ చూపాలన్న ఉద్దేశం మెరపులా మెరసిందామెలో. మూడవ మనిషి కదలి పోగానే వనజతో కూడావున్న యువకుడు పోకుండా పట్టేయాలని ఆమె సంకల్పం. కొలదిసేపట్లోనే ఆ యిద్దరూ లోనికి వస్తూండటం చూసి ఒక్క ఉదుటునా ఆ యువకుణ్ణి పట్టేసి "దొంగ దొరికేడర్రోయి. రండి రండి. ఓ వెంకాయీ, మంగాయీ, రావుడూ వేగం రండి" అంటూ కేకలేస్తుంది. మొదట్లో త్రుళ్ళుపడినా వనజ మాత్రం నవ్వుతూనుంచునే వుంది. ఇంతలో మేడలోని వారంతా వచ్చేశారాస్థలానికి. వెంకాయమ్మ భర్త సీతారామయ్య 'టార్చిలైటు' వేశాడా యువకుడిమీదకు వనజ ఆపుకోలేని నవ్వుతో మాట్లాడుతూ "బలే దొంగ మామయ్యా! పట్టండి! నడిపించండి పోలీస్‌స్టేషనుకు" అన్నది.

"ఏవిటీ! అతను మీ మావయ్యా?" అని చేతిని వదలేసింది చెల్లమ్మ తెల్లబోతూ. ఆ సంఘటన చెల్లమ్మ కోగుణపాఠమయింది.

విజ్ఞానం:

# ★ చంద్రలోకయాత్ర ★

శ్రీ వేమరాజు భానుమూర్తి

ఈ విశాల విశ్వంలో అత్యంత ప్రాధాన్యం వహించే సౌరకుటుంబంలో మనకి ఇరుగు పొరుగున అందుబాటులో ఉన్నది చంద్రగ్రహం. సాధారణంగా చంద్రుడు అని మనం వ్యవహరించే ఈ గోళం మన భూమికి ఉపగ్రహం. చంద్రునికీ మనకూ ఉండే అతిదగ్గర దూరం రెండులక్షల నలభైవేల మైళ్ళు. చంద్రలోక యాత్ర చేసి విశ్వ రహస్యాలను తెలుసుకునే జిజ్ఞాసువు లెవరైనా అత్యంత ఆధునిక మైన విమానం ఎక్కి- శబ్దాన్ని మించిన వేగంలో అంటే గంటకు ఏడు వందల మైళ్ళు వేగంతో నిరంతరాయంగా ప్రయాణం చేస్తే చంద్రోపరితలం చేరడానికి సుమారు రెండు వారాలు పట్టుతుంది. ఇంక కాంతివేగంతో అంటే సెకనుకు లక్షా ఎనభైఆరువేల మైళ్ళ దూరం ప్రయాణం చేసేటట్టయితే ఒకటిన్నర క్షణంలో చంద్రుని చేరుకోవచ్చు. అతి గహనమైన బ్రహ్మాండంలో మిణుకు మిణుకు మంటూండే కొన్ని కొన్ని నక్షత్రాలు మనభూమికి నాలుగైదు కోట్ల కాంతి సంవత్సరాల దూరంలో ఉన్నాయంటే చంద్రుడు మనకు ఎంత దగ్గరవాడో ఇట్టే తేలికగా అర్థమవుతుంది.

అసలు చంద్రలోక యాత్ర ఆలోచన మానవులకు అనాది సిద్ధమైనదనే చెప్పవచ్చు. సామ్రాజ్య వాదులు అంటే ఇతర ప్రాంతాలను తమ కైవసం చేసుకుని, రాజకీయాధికారాన్ని స్థాపించి, అక్కడి ప్రజలను బానిసత్వంలో పడవేసి మత శ్రేయస్సుకోసం పరస్తకసామ్రాజ్యాన్ని స్థాపించుకుని పీల్చి పిప్పిచేసేవారు విస్తరణ కాంక్షతో చంద్రలోక యాత్ర సాధ్యమా కాదా అని ఆలోచిస్తే నిరంకుశ నియంతల పీడనను భరించలేక సామాన్య ప్రజలు "దుష్టుడికి దూరంగా ఉండడం" మంచిదనే సాకుతో మన భూమి నుంచి ఇతర గ్రహాలకు 'పారిపోవడం' సాధ్యమౌతుందేమోనని, అందులో ఇతర గ్రహాలన్నింటికంటే దగ్గర కనుక చంద్ర గ్రహానికే వెళ్ళడం మంచిదని ఆలోచించడం మొదలు పెట్టారు. ఇక వైజ్ఞానికులు వృత్తిధర్మంచేత గ్రహలోక రహస్యాలు స్వయంగా చూచి తెలుసుకోవడం కోసం గ్రహలోకయాత్ర సాధ్యమాతుందా? అని పరిశోధనప్రారంభించారు. ఏమైతేనేమి! ఇంతకీ, చెప్పవచ్చింది అంతర్గ్రహయానం సాధ్యమాతుందా? అన్న జిజ్ఞాస ఇప్పటి మానవులకు మాత్రమే కలిగింది కాదని.

ఇంతకీ చంద్రలోకయాత్ర సాధ్యమాతుందా, కాదా అన్న సంగతిని చర్చించబోయేముందు, చంద్రుని భౌతిక లక్షణాలను గురించి ఇంతవరకు వైజ్ఞానికులు తెలుసుకున్న వివరాలను కాస్త సంగ్రహంగా ప్రస్తావిస్తాను.

విశ్వ రహస్యాలను అవగాహన చేసుకోవడానికి వైజ్ఞానికులు కనిపెట్టిన ఉత్తమ సాధనాలలో దూరదర్శినీ యంత్రం (ఇంగ్లీషున టెలిస్కోప్) ఒకటి. దీని సహాయంతో పరిశీలించగా చంద్రుని బండారం చాలా వరకు బయట పడింది.

నిజం చెప్పాలంటే ఖగోళవాసులైన దివ్యులందరిలోకి చంద్రుడొక్కడే చర్మ చక్షువులకు కొంచెం వివరంగా కనిపించేవాడు.

దూరదర్శినీ యంత్రంలోనుంచి జాబిల్లిని చూచినప్పుడు, గోళాకారంగా ఉండే చంద్రోపరితలమంతా ఎగుడు దిగుడుగా ఉంటే పర్వతశ్రేణులలో నిండి ఉన్నట్టు కనబడుతున్నది. అయితే ఈ చంద్రునిలో ఒక అర్ధభాగం మాత్రమే మనకు ఎల్లప్పుడూ కనబడుతూఉంటుంది. ఇది ఇలా జరగడానికి కారణం భూమి ఆకర్షణ శక్తి ప్రభావమే.

చంద్రునిలో వాతావరణం వుండకపోతుందా? అని కనుక్కోడానికి మనవైజ్ఞానికులు ఎంతో కృషిచేశారు వారి పరిశోధనల ఫలితంగా చంద్రునిలో వాతావరణమేమి లేదని చెప్పడానికి అవకాశాలు లభించాయి. మన భూమి మీదవలె ఋతువుల ననుసరించి పంటలు మారడం వగైరా

# చంద్రలోక యాత్ర

ప్రకృతి లక్షణాలేమీ లేకుండా చంద్రోపరితలం జీవరహితమైన వట్టి మరుభూమి అని తేలింది. వాతావరణం శూన్యం కావడంచేత అక్కడ శబ్దం ఉద్భవించడానికేమి, ప్రతిధ్వనించడానికేమి వీలులేదు. పైగా చంద్రునిలో పగలు ఉష్ణోగ్రతకీ, రాత్రి ఉష్ణోగ్రతకీ ఎంతో తేడా ఉంది. అసలు వాతావరణమే ఉండని ఏ గ్రహోపరితలంలో అయినా ఇలాంటి శీతోష్ణ తారతమ్యం ఉండకతప్పదు.

చంద్రునిలో వాతావరణమేమీ ఉండకపోవడంచేత కలిగే ఫలితం నిరంతర ఉల్కాపాతం. వాతావరణపు నిరోధం ఏమీ లేకపోవడంచేత ఈ ఉల్కలు దాదాపు సెకనుకు మూడు మైళ్ళ వేగంలో వచ్చి చంద్రోపరితలాన్ని ఢీకొంటున్నాయి. ఒకవేళ చంద్రలోకయాత్ర చేసే మానవుడికే కనుక ఈ దెబ్బతగలితే ఏమయ్యేది నేను వేరుగా చెప్పవలెనా?

చంద్రునిలో మనకు మామూలుగా కనబడే మచ్చలన్నీ ఎగుడు దిగుడుగా ఉండే పర్వతశ్రేణులలో ఉండే లోయలవల్ల ఏర్పడ్డ నీడలని దూరదర్శినీ యంత్రంతో పరిశీలించడం వల్ల మనకు తెలిసింది. ఈ పర్వతాలన్నీ ఎప్పుడో కాగి చల్లారిన అగ్నిపర్వతాలని విజ్ఞుల భావన. చంద్రునిలో ఈ పర్వతశ్రేణులకు ప్రక్కనే పెద్ద పెద్ద మైదానాలు కూడా ఉన్నాయి. బీటలూ అనేకం ఉన్నాయి. వాటిల్లోనుంచి కొన్ని రంగు కిరణాలు కూడా ప్రసారిత మవుతున్నాయి. ఇవి బహుశా మొదట్లో కరిగిన ముద్దగా ఉండే చంద్రుడు గడ్డకట్టే సమయంలో పైభాగం పగలడంచేత ఏర్పడిన బీటలు కావచ్చు. చంద్రునికి స్వయం ప్రకాశత్వమేమీ లేదు. సూర్యకాంతి ప్రతిఫలించినప్పుడే మనకు చంద్రుడు దృగ్గోచరమవుతాడు. సూర్యునికీ చంద్రునికీ మధ్య మన భూమి వచ్చినప్పుడు చంద్రగ్రహణం పట్టుతుంది!

ఇదీ ఇంతవరకు చంద్రునిలో మనకేసి తిరిగి ఉన్న అర్థగోళాన్ని గురించి తెలిసిన దాని సారాంశం.

ఇప్పుడు చంద్రలోక యాత్ర అసలు సాధ్యమౌతుందా? అనే విషయాన్ని గురించి చర్చిద్దాం.

అసలు ఈ విషయాన్ని గురించి హెచ్. జి. వెల్స్, ప్రభృతులు ఆధునిక పరిశోధనలు ఆధారంగా అనేక నవలలు రచించారు.

రెక్కలు లేకపోయినా విమానాలను నిర్మించుకొని గాలిలో ప్రయాణం చేయడం ఎప్పుడైతే సాధ్యమయిందో అప్పుడే మనభూగోళాన్ని విడిచి ఇతర గ్రహాలకు వెళ్లడం కూడా సాధ్యమవుతుందని మానవులు నమ్మడం ప్రారంభించారు. క్రమంగా ఎక్కువ వేగంలో, ఎక్కువ బరువును, మోసుకొని ఎవ్వరికీ అందనంత ఎక్కువ ఎత్తున ఆకాశంలో ప్రయాణం చేయడానికిగల అవకాశాలను గురించి వైమానిక శాస్త్రజ్ఞులు ప్రయోగాలు చేస్తూ వచ్చారు. వీరి కృషి సాఫల్యమే శబ్దాన్నిమించిన వేగంతో ప్రయాణం చేసే జెట్ కామెట్ విమానాలు. ఇవికాకుండా రెండవ ప్రపంచ యుద్ధకాలంలో రేడియో తరంగ చోదితములైన 'రాకెట్' యంత్రాలుకూడా నిర్మించబడ్డాయి. వీటి సాయంతో మనం భూమిని వదలిపెట్టి చంద్రలోకయాత్ర చేయవచ్చునని ఆశ కలిగింది. అయితే ఈ ప్రయాణాలు ఏ పరిస్థితులలో సాధ్యమవుతాయో పరిశోధనలు జరుగుతున్నాయి.

ముఖ్యంగా అమిత వేగంతో వెళ్ళే జెట్ విమానాలలో కూర్చుని ప్రయాణం చేసేవారికి ఎలాంటి అనుభూతులు కలుగుతాయో యోచించి అందువల్ల కలిగే ప్రమాదాల నుంచి మానవులను కాపాడడానికి తీసుకోవలసిన చర్యలను గురించి అమెరికా విమానదళం ఇటీవల కొన్ని ప్రయోగాలు చేసింది.

ఈ ప్రయాణంలో ముఖ్యమైంది, ఇందులో ఉన్న మానవుడు తన బరువును కోల్పోవడం. ఈ సందర్భంలో అమెరికా విమానశాఖ శాస్త్రజ్ఞులు రెండు ప్లాస్టిక్ డ్రమ్ములలో చిట్టెలుకలను పెట్టి ఆ డ్రమ్ములను ఒక ఎయిరోబీ రాకెట్టు ముఖంలో అమర్చారు.

ఈ రాకెట్టు 37 మైళ్ళ ఎత్తుకు పోయిన తరువాత దాని ముఖంభాగం విడిపోయి పేరాచూట్ సహాయంతో ఈ డ్రమ్ములో సురక్షితంగా భూమి మీదికి చేరే ఏర్పాటు చేశారు. ఆసమయంలో నిరవరోధంగా క్రిందికి పడే ప్లాస్టిక్ డ్రమ్ములలో ఉన్న చిట్టెలుకలకు ఏమీ బరువు లేకుండా పోయింది. అప్పుడు వాటిని ఆ డ్రమ్ములలోనే అమర్చిన

# చంద్రలోక యాత్ర

జూలీ కెమేరాతో ఫోటోలు తీయడం జరిగింది. వీటి పరిశీలన ఫలితంగా బరువులేకుండా ప్రాణులు జీవించగలవని తేలింది.

ఇంతకీ మన భూమిని వదలిపెట్టి ఏ రాకెట్టు, లేదా విమానం అయినా అంతరాళంలోకి ఎగిసిపోవాలంటే సెకనుకు ఒక మైలుకుమించిన వేగంతో భూమ్యాకర్షణ శక్తిని మించిన శక్తితో అది ప్రయాణం చెయ్యాలి. లేకపోతే ఆ తరువాత భూమ్యాకర్షణ ప్రభావాన్ని తప్పించుకు పోవడం కష్టం. భూమిమీద పుట్టిన జీవులన్నింటి భౌతిక దేహాలను భూమ్యాకర్షణ బలం, భూతలంనుంచి పైకిపోకుండా నిరోధిస్తున్నది. మన భూమిమీద జీవానుకూలమైన తాపక్రమం జీవవికాసానికి తోడ్పడుతున్నది. ఇక్కడి వాతావరణపు పీడనకు అనుగుణంగా జంతువుల రక్తపు పోటు ఉంటున్నది.

అందుచేతనే అంతర్గ్రహ యాత్ర చేయబూనడం ప్రమాదకరమని, అందుచేత చంద్రలోకయాత్ర చేయదలచిన మానవులు శారీరకంగా మార్పుచెందాలని, ఈనపుల్లలనంటి సన్నటి కాళ్ళు, నిమ్మకాయంత తల, విద్యుత్తరంగాలను ప్రసరించే కళ్లు మొదలైన వాటిని పెంపొందించుకోవాలని వైజ్ఞానిక నవలా రచయితలు వ్రాస్తుండేవారు. కాని ఇటీవల పరిశోధనలను బట్టి శరీరాంగాలలో మార్పులు అక్కరలేకుండానే తమతో అనుకూలవాతావరణాన్ని తీసుకుని పోవచ్చునని రుజువైంది.

అసలు చంద్రలోకయాత్రకు చాలా కాలమై సన్నాహాలు జరుగుతున్నాయి. దానికై అంతర్జాతీయ సంస్థ నెలకొల్పబడింది. అప్పుడే తొలి 'విమానం'లో తనకు ఒకసీటు రిజర్వు చేయవలసిందంటూ అనేకవేల దరఖాస్తులుకూడా వచ్చిపడ్డాయి.

చంద్రలోకపు భౌతిక పరిస్థితులేమిటో ఇందాకా చూశాముకదా. అందుచేత చంద్రలోకయాత్రను జయప్రదంగా సాగించాలంటే, - చంద్రునిలో గాలి, నీరు, వాతావరణం లేకపోవడం చేత— ప్రతివారు తమతోపీల్చడానికి గాలి, త్రాగడానికి నీరు, తినడానికి తిండి తీసుకు వెళ్ళాలి. అక్కడ పగటి తాపక్రమానికి రాత్రి తాపక్రమానికి వ్యత్యాసం చాలా ఉండడం చేత ఆ తాపక్రమ విపర్యయాలను తట్టుకోగల వాయుపూరితమైన దుస్తులు తీసుకు వెళ్ళాలి. వాతావరణం లేకపోవడంచేత చంద్రలోకంలో సూర్యరశ్మి వల్ల కాస్మిక్ కిరణాలవల్ల ఉల్కలవల్ల ప్రమాదం సంభవించకుండా ప్రత్యేకమైన దుస్తులు, కవచాలను తీసుకుని వెళ్ళాలి. ఏమైనప్పటికీ మానవ శరీరం ఎంతో సున్నితమైన యంత్రం కనుక చంద్రలోక యాత్రికులు తమతో భౌతిక పరిస్థితులను మాత్రం తప్పక తీసుకు వెళ్ళవలసి వుంటుంది.

భూమిని విడిచిపెట్టి ఎలాంటి సామగ్రితో ఇతరలోకాలకు వలస వెళ్ళదలచిన వారైనప్పటికీ మానవులు తమ బరువును అన్నింటికంటె ముందుగా వదలి పెట్టక తప్పదు. భూమ్యుపరితలం నుంచి పైకి అంతరిక్షంలోకి ప్రయాణం సాగించిన కొలదీ బరువు క్షీణిస్తుంది. కొంతసేపటికి బరువుండనే ఉండదు. కాని చంద్రునిపై అడుగు పెట్టేసరికి చంద్రలోక యాత్రికుడికి భూమిమీద తనకున్న భారంలో ఆరోవంతు తిరిగి లభిస్తుంది. ఈ బరువు భూలోకంలోకంటే గురు లోకంలో రెండు రెట్లుంటుంది. కాని గ్రహాంతరాళంలో ఉన్నంతసేపు మాత్రం ఎలాంటి బరువూ ఉండదు. ఇందుకు కారణం గ్రహాంతరాళంలో గురుత్వాకర్షణ బలం పూజ్యం. ఇంతకీ బరువు అనేది గురుత్వాకర్షణ బల ఫలితమే కదా. అందుచేత గురుత్వాకర్షణ లేనిచోట దేనికీ బరువుండదు.

బరువు లేని ఆ విచిత్ర పరిస్థితి ఎలా ఉంటుందో తెలుసుకోవడం కోసమే అలమొగార్డోలో హోలోమన్ ఎయిర్ డెవలప్‌మెంట్ కేంద్రంలో చిట్టెలుకలను రాకెట్టులో పెట్టి మహావేగంతో వదలి చూచారు. భూమి తిరిగి వచ్చిన తరువాత ఆ చిట్టెలుకలలో ఏమీ మార్పు కలుగకపోవడాన్ని వారు గ్రహించారు. ఏమైనప్పటి బరువులేని పరిస్థితులలో ఎలుకలలో కొంతకాలం పాటు ఎట్టి మార్పులు రాలేదన్నంత మాత్రాన, రోజులకొలది ఆ స్థితిలో ఉన్నప్పుడు మానవులలో మానసికంగా ఎట్టి వికారాల కలుగవని చెప్పడానికి లేదు. పై తాపక్రమం, ఒత్తి మారగానే రక్తప్రవాహ బలం మారుతుంది. దానివల్ల నా మండలమునందు మార్పు వస్తుంది. మన వాయు మండలాన్ని దాటక పూర్వమే రక్తం సలసల మరిగి నీరు ఆవిరికాగ

## చంద్రలోక యాత్ర

మానవుడు క్షణంలో అనువులు బాయటం తథ్యం. అట్టి ప్రమాదం రాకుండా వాయుసంపీడిత దుస్తులను ధరించాలి. అందువల్ల వాతావరణపు ఒత్తిడి తగ్గుతుంటే ఆ దుస్తులలో గల వాయుపీడనం హెచ్చి రక్తపు పోటును అదుపులో ఉంచుతుంది.

ఇంతవరకు జరిగిన, జరుగుతున్న పరిశోధనలనుబట్టి చంద్ర గోళానికి ప్రయాణం ఒకటి రెండు దశాబ్దాలలో సాధ్యం కావచ్చు. కాని ఆ ఇతర కాలాలలో మానవుడు సుఖంగా జీవించాలంటే అనుకూల వాతావరణాన్ని తనతో తీసుకు పోవాలి. అందుకు ముందుగా ప్రతి విషయాన్ని ఎంతో జాగ్రత్తగా పరిశీలించి, ఎంతో జాగ్రత్తగా తన ప్రయాణ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసుకోవడం అవసరమని వేరుగా చెప్పవలెనా.



కాలేజీలో చేరిన అమ్మాయికి అమ్మవద్దనుంచి

# ★ చిరంజీవికి లేఖలు ★

• శ్రీమతి జి. వి. కమలామణి •

చిరంజీవి శ్రీ కి.... అమ్మ అనేక ప్రేమాశీస్సులు.

తల్లీ !.... ....

నీవు సురక్షితంగా పట్నంలో ప్రవేశించినట్టూ, మొన్నటినుంచీ కాలేజీకి వెళ్లుతూన్నట్టూ వ్రాసిన ఉత్తరం చూసి చాలా సంతోషించాను. నీమాటలతో, ఆట పాటలతో, ఎప్పుడూ ఘల్లుమంటూ నిత్యోత్సవంగా ఉండే ఇల్లు, నీవు వెళ్ళినదగ్గరనుంచీ, నిశీథిని నిద్రబోతూన్నట్టుగా, ఎంతో చిన్నబోయినట్టుగా, కనబడుతూ, మనస్సుకుత్సాహమే లేకుండా ఏదో చెప్పలేనంత బెంగగా వుంది. కాని నిన్ను ఉన్నత విద్యాభ్యాసానికని పొరుగూరు పంపినామనీ, "ఏదేశమేగినా ఎవరింటిదీపాప" అని అందరూ అడుగుతూ, ఈ పాపను దిద్దితీర్చిన తల్లి "ఎంత పుణ్యశాలిని! ఎంత ప్రజ్ఞాశాలిని!" అని మెప్పు దెచ్చే కన్యారత్నంగా నీవు తయారవుతావనీ, అనుక్షణం తలపోసుకుంటూ ఒక నూతనోత్సాహం, సంతృప్తి తెచ్చుకుంటున్నాను. ఎక్కడున్నా, నా ఆశలు కొనసాగించి, సఫలం చెయ్యవలసిన కొమ్మవు నీవు!

అమ్మా, "విద్యావిహీనః పశుభిసమానః" అన్నారు. పశువులనుండి మానవులకు విశిష్టత కలిగించేది విద్య. స్త్రీలు కూడా మానవులే! విద్య ఒక విలక్షణ శక్తిని ప్రసాదిస్తుంది. విద్యాభివృద్ధి అయిన కొలదీ ఆ శక్తి హెచ్చుతుంది. అయితే బాధ్యతలను గుర్తించి, అది సక్రమపద్ధతిని సద్వినియోగం చేయకపోతే. అమిత ప్రమాదకరం సుమా. ఉన్నత విద్యావంతులు, High power Station ను నడుపుతూ, అధికారులుగా నున్న వారితో సమానమన్నమాట. విద్యుచ్ఛక్తిని, గాలి, వెలుగు వేడిగా మార్చి, ఎన్నో విధముల జీవితములో ఉపయోగపరచి, తనకూ, ఎదిరికీ సదుపాయ లాభములను కలిగించవచ్చును. ఆ శక్తినే అవక తవకగా, అశ్రద్ధగా వాడితే తాకినాగూడా ప్రాణాంతకం కావచ్చునుగదా! కనుక విద్య పెరిగినకొలదీ, నీలోని శక్తీ, నీకు గల బాధ్యతలూ పెరిగినవని తెలుసుకుంటూ, వివేకవతివై, మానవాభ్యుదయ పథమున మసలుకోవాలని మరువకు.

ఆతరువాత నీవు, యువతీయువకులు కలిసి చదివే కాలేజీలో చదువుతున్నావు. అది పురాతన కాలంనుంచీ మనదేశంలో అలవాటుగా వస్తూన్న ఆచారం కాదుగాని, కాలపరిస్థితులనుబట్టి, ఆచార వ్యవహారాలు మారడమూ, వాటికనుగుణ్యంగా పాత్రలు అనుసరించడమే శ్రేయస్కరమన్న నమ్మికతోనే. నిన్నా కాలేజీలో చేర్పించినాము. అది శ్రేయస్కరమంటేకూడా చాలదేమో! అత్యవసరమన్నా అతిశయోక్తి కాదు.

ప్రపంచమంతటాకూడా. ఆర్థికంగా ఎన్నో మార్పులు వచ్చాయి, రాబోతున్నాయి. ఆర్థిక పరిస్థితితోబాటు సంఘాచారాలు కూడా మారడం సహజం. స్త్రీ పురుష భేదం లేకుండా సమాన మానవత్వ మంగీకరించబడి, ఏవ్యక్తి కావ్యక్తి స్వశక్తిమీద ఆధారపడుతూ, పరస్పర సహకారంతో సకల కార్యాలూ నిర్వహించవలసిన కాలపరిస్థితుల్లో సంఘంలో అందరూ కలిసి సంచరించడం అలవాటు చేసుకోవాలిగాని, "స్త్రీ అసూర్యంపశ్యగా పురుషులకంట బడకుండగా రాణీవాసపు ఘోషా జీవితం సాగించా"లనడం, అర్థంలేని అసందర్భపు మాటేగదా! స్త్రీ పురుషులు కలిసి మెలిసి సంచరించడం, అగ్నితో చెరలాటమన్నదీ, అనేకవిధ ప్రమాదములున్నవన్నదీ నిజమే. కాని ప్రమాదములు లేనిదెక్కడ? నిత్యం, మనము నిప్పు, నీరుతో చెలగాటము లాడుతూనే బ్రతుకుతున్నాము. ఇదీ అంతే. రెండు పొయ్యిలూ, మూడు కుంపట్లూ పెట్టి పంచాగ్నిహోత్రమధ్యంలో చక్రంలా చర చరా తిరుగుతూ, సునాయాసంగా పంచభక్ష్యపరమాన్నాలూ తయారు చేయగలిగితేనే ఘనత. అంతేగాని, "వంటయింట్లో పొయ్యి ఉంటుంది, కొంగు అంటుకుంటుందేమో! నీళ్ళు ఒలకబోసి దానిమీద కాలువేసి జారిపడతానేమో! వంట యింట్లోకే పోను, వండనే వండను" అంటూ తప్పించుకు తిరిగితే, అసమర్థత పెరగడం, ఒకరిమీద బరువుగా ఆధారపడి బ్రతకడమే జరుగుతుందిగాని, ప్రమాదాలు లేకుండా ఆగిపోతాయా? పొయ్యిదగ్గిరికిపోయి వండడం మానినా, శీతాకాలంలో కుంపటిదగ్గిర కూర్చుని కొంగు అంటించుకున్నవాళ్లెందరులేరు? దేవునికి దీప హారతి ఇస్తూ, చీర

చెరగంటించుకున్న మహారాణిని నే నెరుగుదును. వంట యింట్లో కన్నాకూడా స్నానాలగదిలో కాలుజారి పడడం తరుచు తటస్థిస్తుంది. వంట మానినా స్నానం మానం గదా! ఏవిధమైన ప్రమాదమైనా ఫలానిచోటనే ఉందని గాని, లేదనిగాని నిర్దేశించడం శుద్ధ పొరపాటు.

సృష్టిలో సగము మంది స్త్రీలు. సగము మంది పురుషులు. ఒకరినొకరు చూడకుండా, తారసిల్లకుండా తప్పించుకు తిరగడం ఎప్పుడూ జరుగదు. అటువంటప్పుడు కాలేజీలో కలిసి చదవడం ఒక్కదానిలోనే అనర్థకాలు కలుగుతాయనుకోవడం కేవలం మూర్ఖత్వం. ఇంతకూ ఇల్లువదిలి బయటికి పోకుంటే మాత్రం, మగవారి కంట బడకుండా పరదాలో బ్రతుకుతున్నామా? అన్నదమ్ములో, పినతండ్రి, పెత్తల్లి, మేనమామ, మేనత్త కొడుకులో, ఇంకెందరో బంధువర్గంలోని యువతులతోనో కలిసి మెలిసి మాట్లాడుతూ మసులుకోవడంలేదా? కాలేజీలోని సహాధ్యాయులైనా, ప్రపంచంలోని మరి ఎవ్వరైనా అంతే సుమా! అసలు ఉత్తమ స్త్రీ, పురుషులందరినీ తన సోదరులుగా భావిస్తూ, నిశ్చింతగా, నిర్భయంగా వారి మధ్య మసులుకుంటుందట. అధమస్త్రీయే పురుషులంతా దుర్మార్గులు కావాలని ఆశిస్తూ, వారిని కవ్వించాలనే తెర చాటు కోరుతుందట.

అసలు ఎప్పుడూకూడా, జీవితమంటే కత్తిమీద సాము చేయడం వంటిది. అందులోనూ, ప్రస్తుతకాలంలో, జీవితం సాగించాలంటే, కత్తిమీద తేనె నాకుతూ బ్రతకవలసినట్టుంది. ఆ తేనే లేకుంటే జీవితం సాగదు. ఏపాటి ఆత్రపడి హెచ్చినా నాలిక తెగిపోయి, బ్రతుకుకే భంగం రావచ్చును. కనుకనే చిన్ననాటి నుంచీ అది అలవరచుకుని, శాంతి భద్రతలతో బ్రతక నేర్వాలి. ప్రమాదమేదో తెలుసుకుని, జాగరూకతతో, అలవాటుగా సంచరించ నేర్వడమే ఎప్పుడూ క్షేమకరం.

అయితే, మరొక్క మాట. కాలపరిస్థితినిబట్టి మనుగడలో అనేక మార్పులు వచ్చినా, కొన్ని ప్రకృతి ధర్మాలూ, కొన్ని మానవ ధర్మాలూ, కొన్ని నైతిక విలువలూ, ధృవతారల్లాగ స్థిరంగా నిలిచి మినుకు మినుకు మని దారి చూపిస్తూ, కోహినూరు వజ్రంలాగ ధగ ధగ మెరుస్తూ, అమూల్యమైనవిగా ఉంటూనే ఉంటాయి. వాటిని మరువకుండా మనస్సులో నుంచుకుని హద్దుమీరకుండా ఒద్దికగా ప్రవర్తించితే, ఘనతే కలుగుతుందిగాని, అపాయం సంభవించదు.

నీవెక్కడనుంటేనేం; ఎందరిలో నుంటేనేం; ఎప్పుడూ ఒక్కటే జ్ఞాపకముంచుకో. "వారు నాకేసి చూశారు, వీరు నన్ను పలకరించబోయారు" అంటూ వెకిలితనంతో కిచకిచలూ, వెంగలితనంతో రుస రుసలూ ప్రారంభించకు. అందువల్ల అనవసరంగా అందరికీ అలుసుకావడమేగాని సాధించే ప్రయోజనమేమీ ఉండదు. చూడదగిన సువస్తువుగా చూసారనుకో, పరిచయం చేసుకోదగిన వ్యక్తిగా భావించి పలుకరించారనుకో! ఒక్కొక్కప్పుడు, కొందరు కొందరు దుష్టబుద్ధితో బాధించాలనేచూసి పలుకరించబోతారన్నదీ వాస్తవమే. అప్పుడైనాకూడా సుహృద్భావంతోనే దానిని గ్రహించడం ఉత్తమమని నీకు నా సలహా. కిట్టని వారు కాలే కొరవితో కొట్టబోయినారని, తిరిగి మనమూ కణకణలాడే నిప్పును చేతితో తీసి విసరితే ముందు మన చెయ్యే కాలుతుందిగాని, ఆ కొరవి ఆరుతుందా? దహించ వచ్చే కార్చిచ్చును తొలగినిలిచి, జడి నీటితోనే చల్లార్చాలి. ఎవ్వరైనా కుటిలబుద్ధితో కొంటెమాటలాడినా, వంకర చూపు చూసినా, దానికి సౌమ్యంగా కన్నెత్తిచూసి, స్వచ్ఛ మానసంతో సమాధానం చెపితే, సిగ్గుతో వెనుదిరిగి పోతారేగాని, తిరిగి ఎవ్వరూ బాధించరారు.

ఇంకొక్కవిషయం. మగవారిలాగే వేష భాషలతో సంచరించాలనుకునే విద్యావతులను కొందరను చూశాను. పురుషులతో సమాన వ్యక్తిత్వము కోరినామనీ, సమానముగా చదువుతున్నాముగదా అనీ, నైజలక్షణాలని వెనక్కు నెట్టి, అన్నిటికీ వారి ననుకరిస్తూ ముందుకు త్రోసుకుపోతే, హాస్యాస్పదులు కాకతప్పదు. ఆడంగి మగవాడిని చూస్తే, స్త్రీకెంత అలుసో, మగరాయుడు మగువను చూస్తే పురుషులకీ అంత అసహ్యమే! స్త్రీ పురుష భేదం లేకుండా మానవులందరికీ సమాన వ్యక్తిత్వం అవసరమైనా, జీవితపు అవసరాలు కొన్ని సమానమే అయినా, స్వాభావికంగా, శారీరకంగా అనేక వ్యత్యాసాలున్నాయి. అది విస్మరించి సంచరించడం అనువుగానిపని. మగవారితో సమానంగా చదువుతున్నాము గదా అని నున్నని చెక్కిళ్ళు వద్దనీ, గరుకు గడ్డం, బిరుసు మీసం రావాలనీ, రోజూ కత్తితో గీసుకుంటే ఎలాగుంటుందో, మోటగా మాట్లాడుతూ, చొరుచుకుని కొన్ని కొన్ని పన్నులు నిత్యం చేసినా అలాగే ఉంటుంది. ఒకరి ననుకరిం

మన తక్కువతనాన్నీ వారి ఎక్కువతనాన్నీ అంగీకరించడమే స్త్రీ పురుషులలోగల భేదం, హెచ్చు తగ్గులు కాదనీ భిన్నభిన్న ప్రకృతులేననీ. దేనివిశిష్టత దానిదేననీ చూపించగలగడమే విద్యనేర్చిన ఫలము. నూటికి నూరుపాళ్లా స్త్రీత్వం అచ్చుపడేలాగ, మాధుర్యం, మార్దవం చిప్పిలుతూ వేషభాషలూ, మనిషి తీరూ ఉంటేనే ఆకర్షణా, గౌరవమూ కలుగుతాయి. స్త్రీలాగ వేషభాషలుండాలన్నానంటే కొందరు కొందరు 'సొసైటీలేడీల' లాగ మేకప్పులతో, వన్నెలవిసనకర్రలుగా తయారై, అర్థంలేని నంగి మాటలు, రబ్బరు బొమ్మలాగ కీచు కీచు మంటూ ఆడాలనుకొనేవు సుమా! అంతకన్నా అనర్థకమైనది ఆడదానికి మరొకటి లేదు. రంగు రంగుల, కీచు కీచు బొమ్మలు, పసివాళల నాకర్షిస్తాయే కాని పెరిగి పెద్దవారైన ప్రాజ్ఞులు వాటితో ఎప్పుడూ ఆడుతూ, ఆనందంగా కాలం గడపబోరు. పసిపాపల మనస్తత్వంగల కొందరు మగవారు అటువంటి వారిని కొన్నాళ్ళు కాంక్షించినా, పాపలలాగే త్వరలోనే చేతిలోని దానిమీద విసుపుతో విసరివేసి మరొక బొమ్మ వెంట పారాడుతూ పోతారు. అటువంటి బొమ్మగా బ్రతికే, నిరుపయోగ జీవితంలో కొంతైనా వ్యక్తివికాసం, ఆత్మ గౌరవం గల స్త్రీకి సౌఖ్యముంటుందా? ఉచితమైన వేషం, ఉత్తమమైన భాషయే, జీవిత సౌఖ్యానికీ, ఔన్నత్యానికీ సహాయపడేవి! అది సాధించగలిగితేనే నీ విద్యాభివృద్ధి ఫలించినదని నే నానందపడగలను.

ఆఖరున చెపుతున్నానుగాని అన్నిటికన్నా ముఖ్యమైనది మరొక్కమాట. కాలేజీలో నీచదువెంత శ్రద్ధగా చదువుతావో, హాస్టలులో నీగది సవరణకూడా అంత శ్రద్ధగా చేసుక్తోవడం అలవరుచుకో. ఇంటి సవరణ, బాల్యంనుంచీ బాలికలు నేర్వవలసిన విద్య అనీ, మగవాని కన్నా ఆడుదాని కవసరమనీ నిస్సంశయముగా చెప్పవచ్చును. ఏమంటే, అన్నగూడా తన ఆఫీసులో బల్లమీద కాగితాలు సరిగా సర్దిపెట్టుకోవడ మవసరమేగాని, ఇంట్లో ఒకషర్టు తీసుకుందుకు బీరువా అంతా కలగా పులగం చేసి బయటికి వెళ్ళినా మరేమంత నష్టంలేదు. అవన్నీ తిరిగి సర్ది, సవరించే భార్య వస్తుంది. అలాగచేసే వదిన వస్తే, వాళ్ళిద్దరూకూడా ఆనంద గౌరవాలనుభవిస్తారు. కాని, అదే నీవైతే? నీవు విడిచిన చీరలు మడిచిపెట్టి గృహ కృత్యాలు నిర్వహిస్తాడా నీ వచ్చే భర్త? అలాగచేసే భర్త వస్తే నీ కానంద గౌరవాలు కలుగుతాయా? ఏది చేసినా, ఎంత ప్రతిభావంతులైనా, జీవితం సంపూర్ణం కావాలంటే స్త్రీ పురుషులిద్దరూ జంటగా కలిసి ఇల్లేర్పరచుకోవాలి. ఇల్లు దిద్దే బాధ్యత ఇల్లాలిదే. స్త్రీకది సహజోద్యోగం. ఏ ఇంటి విశేషమైనా ఆ యింటి ఆవిడ దానిమీదే ఆధార పడి ఉంటుంది. అందుకే "ఇల్లుచూసి ఇల్లాలిని చూడు" మన్న సామెత పుట్టింది. మొన్నటి వరకూ నాచాటునా, నాతో కలిసీ, నాలుగూ చక్కబెట్టడమేగాని, నీవు విడిగా ఏదీ చేసి ఎరగవు. అది కూడా కొంత అలవాటు కావడము నీ భావి జీవితాని కుపయుక్తమనే అభిప్రాయముతోనే మేము నిన్ను హాస్టలులో జేర్పించి పొరుగూరి చదువు చదివించ నిశ్చయించుకున్నది. "ఉట్టికెక్కలేనమ్మ స్వర్గాని కెగురునా" అని ఈనాడు హాస్టలులో నీగదీ బట్టలే సర్ది సవరించుకోకుంటే, ముందుముందొక ఇల్లంతా దిద్దుబాటు చేసి చక్కబెట్టుతావని ఎలాగనుకోవడం?

నీకు ప్రాజ్ఞత కలగాలనీ, కేవలం ఆర్థికసమస్యా పరిష్కారార్థం ఎవ్వడో ఒకడిని నీవు భర్తగా చేపట్టనక్కర లేకుండా, నీకు తగిన వరుడు వచ్చేవరకూ, నీస్వశక్తితో నీవు బ్రతుకగలిగిన సావకాశం కలిగించాలనీ జీవితం సఫలమయ్యే ఆ శుభసమయం వచ్చినప్పుడు, నీవు వరించిన పురుషుని చేపట్టి, కలిసి ధర్మార్థ కామమోక్షాలను పంచుకుంటూ, సరసను అర్ధనారీశ్వరిగా నిలిచి గృహమును స్వర్గతుల్యంగాచేసే సామర్థ్యం నీకు కలగాలనీ అన్న ఆదర్శంతోనే నీకక్షరాభ్యాసం చేశాము. తల్లి శ్రద్ధాబుద్ధులతో విద్యా విశేషాలు నేరుస్తూ, విద్యాభివృద్ధితోపాటు వివేకంకూడా పెంచుకుంటూ, నీవు పుట్టి పెరిగిన దేశానికి మెప్పుదెచ్చేలాగ వెయ్యేళ్లూ వర్ధిల్లుతావని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ, ఇప్పటికీఉత్తరం ముగిస్తున్నాను.

ఇట్లు,
అమ్మ.
(రేడియో ప్రసారితం)



౨. ౧౯౪౭ సం॥ రమునకు పూర్వము ప్రకటింపబడిన గ్రంథములు ఈ పోటీకి పనికిరావు.

౩. అచ్చు పుస్తకాలయితే ఒక్కొక్క దానికి ఆరేసి కాపీలు, వ్రాత ప్రతులయితే రెండేసి కాపీలు పంపించవలసి వుంటుంది.

౪. గ్రంథాలు ౧౯౫౪ జనవరి ౧-వ తేదీకి, తెలుగు భాషా సమితి కార్యదర్శి, ౨౭ యూనివర్సిటీ బిల్డింగ్సు, మదరాసు—౫ కు అందజేయాలి.

౫. ప్రతి ఒక్క విషయములోని ఉత్తమ గ్రంథమునకును రు. ౫౦౦ లు బహూకరింపబడును.

౬. శాస్త్రీయ విషయములకు సంబంధించిన గ్రంథాలలో శైలి సరసముగాను, సామాన్య ప్రజానీకానికి సుబోధకంగాను, తెలుగు నుడికారమున కనుగుణముగాను ఉండవలెను. సాంకేతిక పదముల వాడుక విషయములో-ఈ వరకే వాడుకలోనికి వచ్చిన తెలుగు పర్యాయపదములను గాని, అంతర్జాతీయ పారిభాషిక పదములనుగాని వాడవచ్చును. తెలుగు పదములను వాడినచో మొదటి సారి ఇంగ్లీషు మూలమును ప్రక్కన చూపవలెను. అట్టి పదముల పట్టికను, ఆంగ్ల మూలములతో సహా అనుబంధములో చేర్పవలెను.

౭. లిఖిత ప్రతులు విస్పష్టముగ బోధపడు దస్తూరిలో సులభముగ చదువుటకు వీలగునట్లు వ్రాయవలెను. కొట్టివేతలుగాని, హంసపాదులు గాని లేకుండ పుస్తకమును బైండు చేయించి పంపించవలయును.

౮. పోటీకి పంపు అచ్చు పుస్తకములు తిరిగి రచయితలకు పంపబడవనిన్నీ, ఒక లిఖిత ప్రతి మాత్రము బహుమతులు నిర్ణయింప బడిన అనంతరము తిరిగి పంపివేయబడగలదనిన్నీ పోటిలో పాల్గొను రచయితలు గమనింప వలెను.

తెలుగు భాషా సమితి.



సొసైటీ పిక్చర్సు వారి

# ప్రపంచం

(53-వ పేజీ నుండి)

స్టోరి, స్క్రీన్ ప్లే శ్రీమతి సి.పి. మునాస్. డైలాగ్సు-శ్రీ ఎమ్. హెచ్. యం. మునాస్. తర్జుమా- శ్రీ.శ్రీ. దర్శకత్వం- ఎల్. ఎన్. రామచంద్రన్. సంగీతము-ఎమ్. ఎస్. జ్ఞానమణి. టి.పూర్ణానందము.

ముఖ్య నటీనటులు:— వి. రామశర్మ, కె. రఘు రామయ్య, జి. వరలక్ష్మి, టి. కనకం, కె. లక్ష్మీకాంతం, యస్. జానకి, జె.వి. సుబ్బారావు, మొదలగువారు.

కథా సారం:— చలపతి అనే పేదయువకుడు మీనా అనే ఒక అమ్మాయిని ప్రేమించి పెళ్లాడుతాడు. వారికి శంకర్, మోహనులను యిద్దరు కుమారులు కలుగుతారు. శంకరుకి వివాహము చేసి, కుమారులిద్దరికీ తగిన ఆస్తినిచ్చి చలపతి జీవితాన్ని చాలిస్తాడు. శంకర్‌కి ఒక కుమార్తె, ఒక కుమారుడు కలుగుతారు. మోహన్ సహాధ్యాయిని అయిన లలిత మోహన్ని వివాహ మాడాలని చూస్తుంది. కాని దూర దేశాన్నించి వచ్చిన మేనమామ కూతుర్ని వివాహ మాడాలని లలితతో తన వివాహాన్ని అంగీకరించదు మోహన్. ఆ నిస్పృహతో లలిత మోహన్ కారు క్రింద పడి మరణిస్తుంది. మోహన్ వివాహం లీలతో అవుతుంది. శంకర్ భార్య మరణించగా, పిల్లల్ని లీల పోషణలో వుంచుతారు.

ఇలా వుండగా మోహన్ అమెరికాకు ప్రయాణమవుతాడు; లీల చందర్ (బావగారి కొడుకు) తో చనువుగా, విచ్చల విడిగా తిరుగుతుంది. లోకం ఎన్నో విధాలు చెప్పుకుంటుంది. ఇంతలో మోహన్ దూరదేశాన్నించి తిరిగివచ్చి, వీరిప్రవర్తనచూచి లీలను అనుమానించి, చందర్ని గృహాన్నుంచి పంపివేస్తాడు. తరువాత నిజం తెలుసుకొని పశ్చాత్తాప పడి లీలను క్షమాపణ కోరుతాడు.

ఇది ఈలా వుండగా శంకర్ ద్వితీయ వివాహ ప్రయత్నంలో ప్రేమ అనే పసి పిల్లను పెళ్ళాడ చూస్తాడు. ముసలివానితో వివాహాని కిచ్ఛగించక, ప్రేమ ఆత్మహత్య చేసుకునేందుకని, సముద్రంలో దుముకుతుంది. ఆసమయంలో చందర్ ప్రేమను రక్షిస్తాడు. పిదప చందర్ వివాహంతో సుఖాంతమవుతుంది కథ.

స్వంత ఆశను కలిగించలేదు "ప్రపంచం" చిత్రం. ప్రపంచంలో ఒక నూతన ప్రపంచాధ్యాయాన్ని, కళాశోభను కలిగించగలదనుకున్న "ప్రపంచం" మామూలు చిత్రాలకన్నా తీసికట్టనిపించింది. ఎంతమందికో అవకాశాన్ని కల్పించి, అనవసరంగా చిత్రాన్ని పెంచి, చిత్రం మొదటినుంచి, చివరిదాకా అంతా అయోమయంగా, కదంబంగా తయారు చేసేరు. నటీనటులైతే పేరున్నవారే, కాని వారికి తగుపాత్రల నిర్ణయాన్ని చేయలేకపోయారు. రైతుకూలీల వుత్సవంలో చూపిన పులితో చెరలాటం, ముష్టియుద్ధం మొదలైనవి కొన్ని కొన్ని దృశ్యాలు చూడదగినవి. శబ్ద గ్రహణం, ఛాయా గ్రహణం, అంతసంతృప్తి కరంగా లేవు. సంభాషణలు వినుటకు యింపుగా వున్నాయి. సంగీతం పాత ఫక్కీలోనే వున్నది. పాటల వరుసలన్నీ హిందీ వరుసలే. మొత్తం మీద చిత్రం అంత సంతృప్తికరంగా లేదు.

—"రవికాంత్"

---

# దసరాలలో చేతిపనుల ప్రదర్శన

## ఉత్తమమైన వస్తువులకు బహుమతులు.

1953, అక్టోబరు నెలలో, దసరా ఉత్సవాల సందర్భములో, మిగతా కార్యక్రమముతోపాటు, చేతిపనుల ప్రదర్శన మొకటి ఏర్పాటు చేయబడును. ఆంధ్ర మహిళా సభ వారి పారిశ్రామిక శాఖలో తయారైన కుట్టు, ఎంబ్రాయిడరీ, నేత, ఉల్లు వస్తువులు, స్టేషనరీ పరికరములు యీ ప్రదర్శనములో చూపబడును.

ఇంకా— సభ్యురాండ్రు తయారుచేసిన అందమైన సామగ్రి— కుట్టు, ఎంబ్రాయిడరీ, లేసు, ఉల్లు, పూసల వస్తువులు ఇంకా విచిత్ర వస్తువులు, గీసిన బొమ్మలు మున్నగునవి యీ ప్రదర్శనమునకు పంపగోరుచున్నాము. ఈ వస్తువులు ఇదివరలో ఏ ప్రదర్శనమునకును పంపనివిగాను, ఇతః పూర్వము ఏ బహుమతియు బడయనివిగాను ఉండవలెను. ప్రవేశరుసుములేదు. ఉత్తమమైన ప్రదర్శనమునకు బహుమానమీయబడును.

క. రంగనాయకమ్మ.

పారిశ్రామిక శాఖ సభ్యురాలు.

ఆంధ్ర మహిళాసభ.

# ఏలూరులో స్త్రీలకు కళాశాల.

విద్యామంత్రి శ్రీ ఎమ్. వి. కృష్ణారావుగారు, 5-7-1953 న, శ్రీమతి చింతలపాటి సత్యవతీదేవి సెంట్ థెరిసాస్ కళాశాలకు ప్రారంభోత్సవము జరిపినారు.



శ్రీమతి చింతలపాటి సత్యవతీదేవి సెంట్ థెరిసాస్ నూతన కళాశాల భవనములు. శ్రీమతి చింతలపాటి వరప్రసాద మూర్తిరాజుగారు నూరు ఎకరముల భూమిని యీ కళాశాల నిర్మాణమునకు విరాళముగానిచ్చినారు.



నూతన కళాశాల అధ్యాపక వర్గము, పరిపాలక వర్గము. శ్రీమతి చింతలపాటి సత్యవతీదేవిగారితో

8 ANNAS

Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 24-A, Luz Church Rd., Madr



చిన్న మొత్తములలో ధనము దాచుకొని, ప్రభుత్వమువారి కార్యక్రమములలో సహాయపడు నిమిత్తము ప్రజలను ప్రోత్సహించి, ధనము వసూలుచేయు నిమిత్తము స్త్రీలు నడుపవలసిన ఉద్యమమునకు కేంద్రసలహా సంఘమొకటి ఏర్పరుపబడినది. ఈ సంఘముయొక్క ప్రథమ సమావేశము, ఆగష్టు 3-వ తేదీన శ్రీమతి హన్నాసేనుగారి అధ్యక్షత క్రింద ఢిల్లీలో జరిగినది. ఒకవంక ప్రభుత్వమునకు, మరియొకవంక ప్రజాసంస్థలకు, యీ సలహా సంఘము చిన్న మొత్తముల నిల్వసేకరణనుగూర్చి సలహాచెప్పుచుండును. ప్రధాని నెహ్రూ యీ సంఘ సభ్యులకు ఉపన్యసించునప్పటి దృశ్యము. శ్రీయుతులు చింతామన్ దేశ్‌ముఖ్, టి. టి. కృష్ణమాచారి, శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్, శ్రీమతి హన్నాసేన్, తదితరులు యిందుగలరు.





చిన్న మొత్తముల నిల్వసేకరణ కేంద్ర సలహాసంఘపు సభ్యురాండ్రు,
ఆగస్టు 3 న ఢిల్లీలో ప్రథమ సమావేశమైన సందర్భములో.

భారత ప్రభుత్వపు వృత్తి పునరావాసశాఖవారి యాజమాన్యాన
వృత్తి విద్యలలో శిక్షణ.

# ఆంధ్ర మహిళాసభలో యీ సంవత్సరము నాల్గు గృహ పరిశ్రమలలో శిక్షణ

రెండు సంవత్సరాలుగా ఆంధ్ర మహిళాసభలో, భారత ప్రభుత్వ పునరావాస శాఖవారి ఆధ్వర్యమున, స్త్రీలకు, వస్త్రములకు రంగువేయుట, అద్దకపు పనిలో శిక్షణ జరుగుచున్నదని మా చదువరులెరింగిన విషయమే—ఇందు ఇంతవరకు మొదటి సంవత్సరము 11 గురు, మొన్న జూలైలో 13 గురు శిక్షితులై కృతార్థురాండ్రైరనికూడా యీ పత్రికా ముఖముగా తెలియజేసియున్నాము.

ఇక యీ సంవత్సరమునుండి, కుట్టు, చేనేత, నిట్టింగ్ పరిశ్రమలలో కూడ భారత ప్రభుత్వ యాజమాన్యాన శిక్షణ జరుగుచున్నది. ఇందు మొత్తము 80 మందికి శిక్షణ నిచ్చు ఏర్పాటులున్నవి. రమారమి మూడవ ఫారమ్ విద్యార్హత గల యువతులు యిందు శిక్షణకు అర్హులు.

వీరిలో కొందరికి భారత ప్రభుత్వ పునరావాసశాఖవారు, మరికొందరికి భారత ప్రభుత్వపు రక్షణ శాఖవారు విద్యార్థి వేతనములు ఇచ్చుచున్నారు. సెప్టెంబరు 15-వ తేదీ లోగా ఇందు జేరదలచినవారు దరఖాస్తు పెట్టుకొనవచ్చును. ఇంకనూ కొద్ది స్థానములే ఖాళీగా ఉండుటవలన, ఇందు జేరగోరువారు త్వరపడవలసినది.

అ. చన్నఘంటమ్మ,
కార్యదర్శిని.

---

# కృతజ్ఞత

## ఆంధ్ర మహిళాసభ నర్సింగ్‌హోమ్, అడయార్.

## ఉయ్యాలల విరాళములు

గతమాసము ఆంధ్ర మహిళ పత్రికలో విజ్ఞాపనను చూచి వెంటనే కొందఱు సోదరీమణులు ఉయ్యాలలు కొనుటకుగాను తమ విరాళమును పంపిరి.

| | | | |
|---|---|---|---|
| శ్రీమతి వెనిగండ్ల పుష్పాచౌదరిగారు. | — | 2 ఉయ్యాలలకు | రూ. 80-0-0 |
| శ్రీమతి కె. వి. చెల్లాయమ్మగారు. | — | 5 ఉయ్యాలలకు | రూ. 200-0-0 |

వీరికి మా కృతజ్ఞత.

అ. చన్నఘంటమ్మ.

# ఆంధ్రమహిళ

సంపుటి 10 :: సెప్టెంబరు '53 :: సంచిక 5



ఇంకా, గద్యాలు, పద్యాలు, బాలానందం.


వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే., బి.యెల్.,
సంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే., యెల్.టి.,

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్.

సంవత్సర చందా :: ఆరు రూపాయలు.


Flawless


AFGHAN
SNOW
AN IDEAL
DAY CREAM
Cleanses & Nourishes




సంపుటి 10 :: సెప్టెంబరు '53 :: సంచిక 5

# గోదావరి పొంగు

స్వయంనిర్మితమైన జీవిత ప్రమాణాలక్ష్యాల నందు కొనబోతూ మానవుడు విశ్రాంతి రహితమైన జీవిత పంథా ననుసరించుటతో ప్రారంభమైన అశాంతి స్పందనలు, ప్రకృతి గర్భమును తాకి, అతి భయంకరమైన రూపమున ప్రతిబింబిత మౌతున్నవా యనునట్లు, యీ నాడు ప్రకృతిలో ఏ సంఘటన చూచినా విపరీతమైన స్థాయిలోనే గోచరిస్తూవున్నది. ప్రళయ భీభత్సాన్ని కండ్లకు గట్టినట్లు జూపిన మొన్నటి గోదావరి పొంగు, సజీవియైన మానవ మాతృడు కని విని ఎరుంగని ప్రమాణాలలో విజృంభించి, వందల కొలది గ్రామాలను తుడిచిపెట్టి, కోట్ల కొలది ధన నష్టము, ధాన్య నష్టము కలిగించి, వేన వేల ప్రజలను నిరాశ్రయులనుగా జేసినది. వరద ప్రాంతాలనుండి బాధితులయొక్క అగచాట్లను గురించి హృదయ విదారకమైన వార్తలు వస్తూఉన్నవి.

మన భూభాగములో, అతివృష్టి అనావృష్టులు, పెనుగాలితుపానులు, నదీవరదలు, యీనాడు దైనిక సంఘటనలుగా ఉన్నాయి. ఒక్కొక్క ప్రాంతములో క్షామ పీడితులు, నిర్వాసులు, నిస్సహాయులునగు ప్రజల సంఖ్య దినదినమూ వృద్ధిజెందుతూవుంది. ఆరేళ్ళయినా నిండని అతి బాల్యదశలోనున్న మన ప్రజా ప్రభుత్వము ఎప్పటికప్పుడు ఎడతెరపి లేకుండా, ఎక్కడో ఒక్కచోట సహాయకార్యక్రమము ప్రారంభించవలసిన సమస్యను ఎదుర్కొవలసివస్తూవుంది. నూతన నిర్మాణమునకు వినియోగించవలసిన అర్ధబలము, ప్రజాబలము, బుద్ధిబలము యిలా ఏనాటికానాడు సహాయకార్యక్రమాలలో, పునరావాస కార్యకలాపాలలో వినియోగించవలసిన పరిస్థితులు ఏర్పడడం మన ప్రత్యేక దురదృష్టంగా భావించుకోవాలి.

ఈ ఆరేళ్ళ అనుభవాలవల్ల మన ప్రభుత్వము, ప్రజలుకూడ, తక్షణ సహాయ కార్యక్రమాలలో ఆరితేరినట్లు గోదావరి వరద బాధితులకు జరుగుచున్న సహాయమువల్ల తెలుసుకోవాలి. భారతప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వము, ప్రజాసంస్థలు, ప్రజాసామాన్యము, ధన వస్తు రూపములలో విశేషముగా విరాళములు పోగుచేసి, పునరావాసమునకై తీసుకొనుచున్న చర్యలు చాలా ప్రశంసనీయమైనవి.

ఆంధ్రరాష్ట్ర అవతరణదశలో, ఆంధ్రప్రాంత ధాన్యాగారమని చెప్పకోదగ్గ ఉభయ గోదావరిజిల్లాలకు వాటిల్లిన యీ ప్రమాదము ఆంధ్ర ప్రజలను నిరుత్సాహవంతులుగా జేయకపోదు. అయినా వివిధప్రాంతాలనుండి యీ విపత్సమయములో తమకు లభించుచున్న సానుభూతి సహాయాలు వారికి కొంత ఉత్సాహము కలిగింపగలవు. ప్రభుత్వము ప్రజలు యీ స్థాయిలోనే పునరావాస క్రియలు జరుపగలిగితే, కొలదికాలములోనే వరదకు పాల్పడ్డ ప్రదేశంలో సాధారణ పరిస్థితులు తిరిగి ఏర్పడకమానవు. ఈ కష్టసమయంలో ఆంధ్ర ప్రజలంతా ఐక్యభావముతో సంచరించి, పక్షవిభేధాలను విడచి, భవిష్యత్తులో ఇట్టి విపత్తులు సంభవించకుండా, శాశ్వతమైన పునర్నిర్మాణముపై తమ దృష్టిని కేంద్రీకరించడం అవశ్యము.

# చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-

## ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారము చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహాలనిచ్చుటకు, సభ తరపున కొందఱు యువతులు నియమింపబడుదురు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని వివరములు తెలిసి కొనవచ్చును.

ఇంకొక విషయము— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయడల సభకు $1\frac{1}{4}$ % కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

సభలో టి. జి. హైమవతిగారు, దీనిని గూర్చిన వివరములన్నీ మీకు తెలుపగలరు.

అ. చన్నఘంటమ్మ,
కార్యదర్శిని.

---

# ఆంధ్ర మహిళాసభ పారిశ్రామిక శాఖ.

## గోదావరి వరదబాధితులకు ప్రత్యేక విద్యాసౌకర్యములు — ఉచిత విద్యార్థి వేతనములు.

ఈ సంవత్సరము పారిశ్రామికశాఖలో, గోదావరి వరదబాధితులగు యువతులకు, మాసమునకు ఒక్కొక్కరికి రూ. 25/— చొప్పున, ఉచిత విద్యార్థివేతనమును ఏర్పాటుచేయుటకు ఆంధ్ర మహిళాసభ ట్రస్టుబోర్డువారు తీర్మానించిరి.

1. 1953 సెప్టెంబరు నుండి, 1954 జూలై వరకు, 11 నెలల పాటు యీ ఉచిత వేతనము యీయబడును.

2. భారత ప్రభుత్వ పునరావాస శాఖవారి యాజమాన్యమున జరుగుచున్న గృహపరిశ్రమలలో యీ 11. మాసములు శిక్షణ యీయబడును.

3. ఇందు జేరెడి విద్యార్థినులకు మల్లమదేవి హాస్టలులో ఉచిత వసతి సౌకర్యము లీయబడును.

4. ఐదు, ఆరు తరగతుల కనీస విద్యార్హత కలిగియుండవలెను.

5. సెప్టెంబరు 8 వ తేదీలోగా వరద బాధితుల సహాయసంఘ అధ్యక్షులద్వారాగాని. ఉభయ గోదావరిజిల్లా కలెక్టర్ల ద్వారా గాని తమ దరఖాస్తులు పంపుకోవలెను.

అ. చన్నఘంటమ్మ,
కార్యదర్శిని.

# ఆంధ్ర మహిళా సభలో

## ఆగస్టు 15 స్వతంత్ర దినోత్సవము

సభ్యురాండ్రంతా జేరి ఆంధ్రమహిళాసభలో స్వతంత్ర దినోత్సవము వైభవముగా జరిపించినారు. శ్రీమతి దెన్నూరు కృష్ణవేణమ్మగారు జాతీయ పతాకమును ఆవిష్కరించగా, విద్యార్థినులు జండావందనము చేసి, జాతీయ గీతములను పాడిరి - శ్రీమతి కృష్ణవేణమ్మగారు, స్వాతంత్ర్యానికి ముందు, శాంతిసమరములలో వారి అనుభవములను వివరించి, స్వాతంత్ర్య సముపార్జనలో సర్వము త్యాగము చేసిన వీరులను, పుణ్యపురుషుడు బాపూజీని స్మరించి వారి ఆదర్శములను జ్ఞాపకము చేసికొనవలసిన పర్వదినమిదియని ప్రబోధించిరి. అటుపైన సభ్యురాండ్రు, విద్యార్థినులు జాతీయ గీతములను పాడిరి.

*　　　　*　　　　*

## వరలక్ష్మీవ్రతము

ఆగస్టు 21 - శుక్రవారం సాయంకాలం, మహిళా సభ సభ్యురాండ్రు, విద్యార్థినులు జేరి సభా భవనములో వరలక్ష్మీవ్రతమును చేసిరి. సహస్రనామార్చన, పూజ జరిగినది.

## ఆంధ్ర మహిళాసభ - నర్సింగ్‌హోమ్ అడయారు.

పై ఆవరణలో ఆగస్టు మొదటినుండి, ప్రసూతి శాఖ ప్రారంభించబడినది. బీద యువతులకు ఉచితముగా ప్రసవ చికిత్స సదుపాయములు ఏర్పరుప బడినవి. రూ. 50 గాని, అంతకు తక్కువ గాని మాసపు ఆదాయముగలవారికి, ఇక్కడి చికిత్స పూర్తిగా ఉచితము.

ఇంకా ఇందు గూర్చిన వివరములు ఆంధ్రమహిళాసభ కార్యదర్శినికి వ్రాసి తెలిసికొనవచ్చును.

ఉచితముగా జరిగే చికిత్సా కార్య క్రమానికి, ఇంకా నర్సుల శిక్షణకు, వారి భోజన వసతులకు అయ్యేవ్యయమునకుగాను ఎక్కువగా ధనము కావలసి యున్నది. మందులు మొదలగు వస్తురూపముగా గాని, ఇంకా చిన్న మొత్తములలో, పెద్ద మొత్తములలో విరాళములుగా ఇచ్చి గాని, యీ సేవా కార్యక్రమానికి తోడ్పడవలసినదిగా విజ్ఞాపన.

అ. చన్నఘంటమ్మ,
కార్యదర్శిని.



హైదరాబాదులో హిమయత్ సాగర్ కమ్యూనిటీ ప్రాజెక్టుకు సంబంధించిన శిక్షణ కేంద్రములో సాంఘిక విద్యా నిర్వాహకులుగా (Women Social Education Organisers) శిక్షితులగుచున్న స్త్రీలు, పొలాలలో నీళ్ళు జల్లుచున్న దృశ్యము.

# ఆంధ్ర మహిళా సభలో



ఆగస్టు 15- స్వతంత్ర దినోత్స
వమున జండా ఎత్తిన శ్రీమతి
కృష్ణవేణమ్మగారు, సభ్యు
రాండ్రు.





జండా వందనము చేసిన
విద్యార్థినీ బృందము.



# రాజకీయాలు

• శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు •

జులై నాలుగో వారం మొదలుకుని ఆగస్టు మూడో వారం వరకూ అంతర్జాతీయ రాజకీయాల్లో చాలా ప్రముఖ సంఘటనలే నడిచినవి. వాటిలో ముఖ్యమైనవి—కొరియాలో యుద్ధవిరమణ ఒప్పందం కుదరటం, కాశ్మీర్‌లో షేక్ అబ్దుల్లా బర్తరఫ్, అరెస్టులు, పర్షియాలో డా॥ మొసాదిక్ బర్తరఫ్, అరెస్టులు, మొరాకోలో సుల్తాన్ తొలగింపు, ఇండియా, పాకిస్తాన్ ప్రధానులకు కాశ్మీర్‌పై సమాధానం కుదరటం, రష్యా హైడ్రోజన్ బాంబును కనిపెట్టడం, ఆంధ్రరాష్ట్రి రాజకీయ పక్షాలలో అంతః కలహాలు.

*   *   *

ఇరవై సం॥ల పైగా కాశ్మీర్ ప్రజానాయకుడుగా ఉన్న షేక్ అబ్దుల్లా ఆగస్టు 8 వ తేదీన పదభ్రష్టుడయి, ఆతరవాత అరెస్టుకూడా చేయబడ్డాడు. విదేశీయుల దుష్ట సలహాలకు లోనయి, కాశ్మీర్ భద్రతకు ప్రమాదకరంగా ప్రవర్తిస్తున్నాడన్న నేరాన్ని ఆరోపించి కాశ్మీర్ రాజ ప్రముఖ్ కరణ్‌సింగ్ అబ్దుల్లాను ప్రధాన పదవినుంచి తొలగించాడు. అబ్దుల్లా మంత్రివర్గానికి చెందిన బక్షీ గులాం మహమ్మద్ ప్రధానిగా క్రొత్త ప్రభుత్వం ఏర్పాటయింది.

కాశ్మీర్ ఇండియాలో అంతర్భాగమేననీ, కాశ్మీర్ అభివృద్ధి ఇండియాలో చేరటంవల్లనే సాధ్యమవుతున్నదనీ అనేకసార్లు చెప్పి, ఒకప్పుడు దానిని మనసారా నమ్మిన అబ్దుల్లా రానురాను ఇండియాను శంకించటం ప్రారంభించాడు. అతడి సందేహాలకు ఇండియాలో కొన్నివర్గాలు చూపుతున్న వైఖరి కారణం కావచ్చునుకాని, కాశ్మీర్ పట్ల నెహ్రూ అనుసరిస్తున్న విధానాన్ని సమర్థిస్తున్నవాళ్లే ఎక్కువమంది ఉన్నారన్న విషయాన్ని అబ్దుల్లా మరచిపోవటం విచారకరం. ఇండియా పాకీస్థాన్‌లు రెండింటినీ నమ్మలేని సంకట స్థితిలో అబ్దుల్లా పడిపోయినాడు. కాని ఇతరులజోక్యం లేకుండా ఉంటే, కాశ్మీరుకు ఇండియా పాకీస్థాన్‌లలో దేనిలోనో ఒక దాంట్లో జేరటం మినహా గత్యంతరంలేదనీ స్వతంత్ర దేశంగా కాశ్మీర్ నిలవలేదనీ గుర్తించగలిగేవాడు. కాని ఏదో విధంగా కాశ్మీర్‌లో స్థావరం సంపాదించటానికి కనిపెట్టుకునిఉన్న విదేశీయులు కొన్ని కాశ్మీర్ స్వాతంత్ర్యానికి తాము 'అండ'గా నిలబడతామని ఆశలు చూపించటంలో అబ్దుల్లాకు మతిపోయింది.

ఐక్యరాజ్యసమితి కాశ్మీర్ స్వాతంత్ర్యానికి హామీ ఇచ్చేట్లుగా చూస్తామని కొన్ని విదేశ వర్గాలు అబ్దుల్లాకు దుర్బోధలు చేసినట్లు తెలుస్తున్నది. విదేశాల దుర్బోధ వాస్తవమేనని అధికార రీత్యా అంగీకరించబడ్డది. అబ్దుల్లా వైఖరివల్ల కలిగే ప్రమాదాన్ని దేశంలోని అన్ని రాజకీయ పక్షాలూ గుర్తించి నిరసించినవి. దేశంలో వామ పక్షాలన్నీ కాశ్మీర్‌లో అమెరికన్ సామ్రాజ్యవాదులు కుట్రలు పన్నుతున్నట్లు బహిరంగంగా ఆరోపించినవి.

*   *   *

మూలసూత్రాలనే మరచిపోయిన అబ్దుల్లా కాశ్మీర్‌లో తనకు వ్యతిరేకులెవరూ లేకుండా చేసుకునేందుకు ప్రయత్నించాడు. ఢిల్లీ ఒప్పందాన్ని పూర్తిగా అమలు జరిపించలేదు. నేషనల్ కాన్ఫరెన్సు ఎన్నికలనే నిలుపుచేయించాడు. మంత్రివర్గంలో సమిష్టి బాధ్యత సంగతి ఉపేక్షించి తనను వ్యతిరేకించిన మంత్రులను రాజీనామా నివ్వమని

నిర్బంధించాడు. వారు రాజీనామా నివ్వలేదు. ఈ ప్రతిష్ఠంభనలో రాజప్రముఖ్ జోక్యం కలిగించుకుని అబ్దుల్లాను తొలగించాడు.

ఇండియాలో చేరిపోయిన ఒక సంస్థానపు ప్రధానిని రాజప్రముఖ్ బర్తరఫ్ చేయటం పెద్ద విపరీతమైన విషయమేమీ కాదు. అబ్దుల్లా ప్రత్యర్థులపైన అవలంబించిన వైఖరినే, మన దేశంలో వివిధ రాష్ట్రాలలోనూ అధికారంలో ఉన్న వర్గాలు అనుసరిస్తున్నారు. అది సాఫీగా సాగనిచోట్ల కేంద్రప్రభుత్వపాలన అమలు జరుగుతున్నది. ఇక ముందు దేశంలో ఇటువంటి సంఘటనలు జరగవన్న హామీ ఏమీ లేదు. ఇంక పోతే, మనం గమనించవలసిన విషయమల్లా అబ్దుల్లా మార్పుకు కారణమేమిటో ఇకముందయినా వాటిని తొలగించటానికి ఏం చెయ్యాలో ఆలోచించటమే.

* * *

పాకిస్థాన్ దాడివల్ల కాశ్మీరు ఇండియాలో జేరేటప్పుడు కాశ్మీర్ ప్రజలు తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకోవచ్చునని ఇండియా హామీ ఇచ్చింది. "భవిష్యత్తు అంటే ఇండియా, పాకిస్థాన్‌లలో దేనిలో నొకదానితో జేరటమే కాని, స్వతంత్రంగా ఉండటానికి అవకాశం లేదు" అని ఇండియా ఖచ్చితంగా ఏమీ చెప్పలేదు. బ్రిటిష్‌వాళ్ళు ఇండియానుంచి వెడుతూ సంస్థానాలకు స్వతంత్రంగా ఉండేందుకు ఇచ్చిన అవకాశాన్ని ఉపయోగించుకునేందుకు అన్ని సంస్థానాలూ ప్రయత్నించినవి. మీర్ లాయక్ అలీ, రామచంద్రకాక్, సి. పి. రామస్వామి అయ్యర్ ప్రభృతులు చేసిన ప్రయత్నాలను ఆప్రాంతాల ప్రజలు, భారత ప్రభుత్వ సాయుధ బలం భగ్నపరచినవి. కాశ్మీర్ మహారాజు ప్రయత్నాన్ని పాకిస్థాన్ దండయాత్ర భగ్నపరచింది. ఈ పరిస్థితుల్లో, కాశ్మీరు భవిష్యత్తు అంటే స్వాతంత్ర్యం కాదు అని ఖచ్చితంగా చెప్పవలసిన బాధ్యత- నిజంగా ఇండియా ఉద్దేశం అదే అయివుంటే- ఇండియామీద ఉన్నది. కాని ఇండియా ఆపని చేయలేదు.

అంతేకాదు- కాశ్మీరు ఐక్యతకు ఏవిధంగానూ భంగపాటు కలగదని భారత నాయకులు అనేకసార్లు స్పష్టపరిచి ఉన్నారు. అంటే విభజనకు ఏపరిస్థితుల్లోనూ అంగీకరించటం జరగదని అన్నారన్నమాట

కాని ఈ సమయంలో న భ ంత దళ నాయకులు కొందరు కాశ్మీరును విభజించాలనీ, కాశ్మీరు లోయ ఎటుపోయినా జమ్మూ, లద్దఖ్‌లు ఇండియాకు రావలసిందేననీ ఆందోళన ప్రారంభించారు. ఇది భారత ప్రభుత్వ విధానానికి వ్యతిరేకమనటం తప్ప, ఇతరత్రా దోషమేమీ లేదు. అయితే, అబ్దుల్లా వర్గం దృష్టిలో ఇది ఇండియా ఆడినమాట తప్పటంగానే ఉండకతప్పదు.

అబ్దుల్లా ఇండియాను శంకించాడేకాని, పాకిస్థాన్‌ను అభిమానించినట్లు చెప్పటానికి ఆధారాలేమీ లేవు. అబ్దుల్లా బర్తరఫ్‌కు తరవాత కూడా, అబ్దుల్లా అనుచరులు పాకిస్థానీ అభిమానులు కలవలేకపోయారన్న అంశం గమనించతగ్గది. ఇదేసమయంలో కాశ్మీరు విషయమై, "కాశ్మీరు విభజన" సూత్రాన్ని ఆధారంగా పెట్టుకుని ఒప్పందం జరగబోతున్నట్లు బలమయిన పుకార్లు బయలుదేరినవి. ఈ పుకార్లను అధికార్లు ఖండించారు కాని, కాశ్మీరును విభజించకుండానే స్వతంత్రంగా ఉండటానికి ఉభయదేశాలు అంగీకరించినవన్న నమ్మకం కాశ్మీరులో వ్యాపించింది. ఈ ఉద్దేశ్యంతో తాము పనిచేస్తున్నట్లు అబ్దుల్లా అనుచరుడు మసూదీ అబ్దుల్లా అరెస్టుకు ముందే ప్రకటించియున్నాడు.

పరిస్థితులు ఇంతవరకు వచ్చినప్పటికీ, విదేశీయుల జోక్యం లేకుండా ఉంటే, అబ్దుల్లా వర్గం తమ తప్పును తెలుసుకుని ఉండేదేమో! కాని ఏగోవిధంగా కాశ్మీర్‌లో తిష్టవేయాలని ప్రయత్నిస్తున్న అమెరికా ఈ అవకాశాన్ని వదులుకోదలచలేదు. అమెరికన్ డెమాక్రెట్ పక్ష నాయకుడు స్టీవెన్సన్ కాశ్మీర్ వెళ్ళివచ్చాడు. సమితి పరిశీలకులుగా ఉన్న ఉద్యోగులు కుంభకోణాలు చేశారు.

కాశ్మీరులో అమెరికన్ వర్గపు కుట్రలు జరిగినవని చెప్పడానికి పరోక్షంగా తగినంత సాక్ష్యం ఉన్నది. 1. కాశ్మీర్ తగాదా ప్రారంభమయిన మొదట్లో అమెరికా, బ్రిటన్లు కాశ్మీరును సమర్థించినవి. బ్రిటిష్ సేనానులు 'తివాచీల పరిశ్రమ'కోసము, అమెరికన్ సైనికోద్యోగులు సంప్రదింపులకోసము, పాకిస్థాన్‌ను నింపివేశారు. 2. ఈ సైనికోద్యోగుల సంచలనాన్ని ప్రధాని నెహ్రూ నిరసించటం, బ్రిటిష్ ప్రధాని అట్లీ సంజాయిషీ చెప్పుకునేందుకు ప్రయత్నించటం జరిగింది. 3. అట్లీ, ట్రూమన్‌లు ఇండియా,

పాకీస్థాన్‌లను 'ఒప్పందం' కుదుర్చుకోవాలని ఒత్తిడిచేయగా పండిత నెహ్రూ హెచ్చరించటం జరిగింది. 4. మధ్యప్రాచ్య రక్షణ వ్యవస్థలు పాకీస్థాన్‌ను జేర్చుకునేందుకు పశ్చిమ రాజ్యాలు చేసిన ప్రయత్నాలను ప్రధాని నెహ్రూ తీవ్రంగా ఖండించారు. 5. కాశ్మీరు మధ్యవర్తులుగా పనిచేసిన పశ్చిమ రాజ్య ప్రతినిధులు డిక్సన్, గ్రాహాంలు కాశ్మీరులో భారత సేనలనుకూడ లాంగించి, 'అంతర్జాతీయ' సేనలను నిలపాలని ప్రతిపాదనలు చేయటం, 6. అమెరికా పెత్తనంకింద ఉన్న ఐక్యరాజ్యసమితి కాశ్మీరు వివాదంలో ఇండియా, పాకీస్థాన్‌లకు సమాన ప్రతిపత్తి ఇవ్వాలని ప్రయత్నించటం, 7. సమితి పర్యవేక్షకుడుగా ఉన్న జనరల్ డెల్వాయ్ కాశ్మీరునుంచి అక్రమంగా పాకీస్థానుకు ఆభరణాలను దొంగిలించ ప్రయత్నించి పట్టుబడటం, 8. అబ్దుల్లా అరెస్టు సందర్భంలో కాశ్మీరు ప్రభుత్వం హేక్ అనే ఒక సమితి ఉద్యోగిని నిర్బంధించటం, సమితి ఉద్యోగులు దుష్ప్రచారం చేస్తున్నారనీ, తమ స్థానం వదలిన సమితి ఉద్యోగులను అరెస్టు చేస్తామనీ చెప్పి కాశ్మీరు ప్రభుత్వం హెచ్చరించటం, 9 ఈ సందర్భంలోనే కాశ్మీరునుంచి వెళ్ళగొట్టబడ్డ ఎడ్నా ఫాంటేన్ అనే చిత్రకారిణి, హైద్రాబాదుకు ఆయుధాలు రవాణా చేసిన వైమానికుడు సిడ్నీ కాటన్, ఇండోనేషియాలో తిరుగుబాటు పురికొల్పిన వెస్టరింగ్ ప్రభృతులంతా పశ్చిమదేశాలకు చెందినవాళ్ళే అయి ఉండటం.

* * *

అమెరికన్ల జోక్యాన్ని నిరూపించే పెద్ద విషయం మరొకటి ఉన్నది. అది కాశ్మీరు జనవాక్య నిర్వహణమీద ఆగస్టు మూడోవారంలో ఇండియా, కాశ్మీరు ప్రధానులు ఢిల్లీలో కుదుర్చుకున్న ఒప్పందమే. 1954 ఏప్రిల్ నాటికి జనవాక్య నిర్వహణకు ఏర్పాట్లు చేయాలనీ, ఇదివరకు జనవాక్య నిర్వాహకుడుగా ఐక్యరాజ్యసమితి నియమించిన ఎడ్మిరల్ నిమిట్స్ (అమెరికన్) స్థానే, ఆసియా, యూరపుల్లో ఏదయినా చిన్న దేశపు ప్రతినిధి నొకరిని నియమించాలనీ ఉభయ ప్రతినిధులూ అంగీకరించారు.

పాకీస్థాన్ ప్రధాని మహమ్మద్ అలీ అబ్దుల్లా అరెస్టు వార్త విన్న వెంటనే పరుగులమీద ఢిల్లీ వచ్చి, ఈ ఒప్పందం చేసుకోనటం చూస్తే, పశ్చిమరాజ్యాల కుట్రలు తమకు కూడ ప్రమాదకరమని పాకీస్థాన్ కూడా గుర్తించిందా అన్న సందేహం కలుగకమానదు. మధ్య ప్రాచ్యంలో పశ్చిమ రాజ్యాలు జరుపుతున్న అత్యాచారాలను గమనిస్తున్న పాకీస్థాన్, కాశ్మీర్ సంఘటనతో తెలివి తెచ్చుకుని ఉండవచ్చు. లేదా, ఇండియా ప్రమాదాన్ని తప్పించుకున్నదని గుర్తించి దానికి వచ్చివుండవచ్చు. ఈ ఒప్పందాన్ని పాకీస్థాన్ ప్రభుత్వంలో మిలిగినవాళ్ళు ఎంతవరకు ఆమోదిస్తారు అన్నది కూడ ఒక పెద్ద ప్రశ్నే. పశ్చిమరాజ్యాల 'అదృశ్య హస్తం' మహమ్మద్ అలీని కూడ పడదోయిస్తుందేమో చెప్పలేము.

* * *

మొత్తానికి అబ్దుల్లా బర్తరఫ్ నెహ్రూ అక్కడ అనుసరిస్తున్న విధానానికి దెబ్బేనని చెప్పవలసి వుంటుంది. అయితే ఈ దెబ్బకు కారణం నెహ్రూ విధానంలో గల లోపం కాదు. ప్రజాస్వామ్యపు పేరుతో ధర్మ పన్నాలు చెపుతూన్న పశ్చిమ రాజ్యాలే కారణం. ఈ దేశాల పట్ల భారత దేశవిధానం ఇకముందు కరుగ్గా లేకపోతే, ముందు ముందు ఎన్ని ప్రమాదాలయినా రావచ్చును. మన దేశంలో జోక్యం కలిగించుకుంటున్నప్పుడు ఉపేక్షించటం ప్రమాదకరం.

* * *

పర్షియాను ఆంగ్లో ఇరానియన్ నూనె కంపెనీ సంకెళ్లలోనుంచి విడిపించిన ప్రధాని మొసాదిక్ ఆగస్టు మూడో వారంలో పదవినుంచి కూలదోయ బడ్డాడు. రాజు మొసాదిక్ విధానానికి అడ్డు పడకుండా అతడి అధికారాలను తగ్గించడానికి మొసాదిక్ ప్రజల అనుమతిని రెఫరెండం ద్వారా కోరాడు. ప్రజలు అనుమతించారు. రాజు సైనిక విప్లవం చేయించి, నెగ్గనందువల్ల దేశంవిడిచి పారిపోయాడు. కాని అతడి సేనాని జహీదీ మళ్లీ ఒక తిరుగుబాటు చేసి మొసాదిక్‌ను కూలదోశాడు. మొసాదిక్ దేశ ద్రోహ నేరాలకు విచారించబడతాడట.

మొసాదిక్ కానీ, మరి ఏయితర మధ్యప్రాచ్య నాయకులు కానీ సంస్కరణలు జరపటంలో భూస్వాములు తమవద్ద

వాదుల ప్రతిఘటనను ఎదుర్కోవలసి వుంటుంది. ఇంత వరకూ పర్షియాలో భూస్వాములు, మతవర్గవాదులు చీలి ఉన్నారు. కాని ఇటీవల మతవర్గవాదీ, మాజీ పార్లమెంట్ స్పీకరు అయిన కషానీ రాజరిక వాదులయిన భూస్వాములతో కలవటం సంభవించి, మొసాదిక్ పతనం సాధ్యపడింది.

మొసాదిక్ పర్షియానుంచి బ్రిటన్‌ను సాగనంపిన తరువాత చాలా కాలం వరకూ పశ్చిమ రాజ్యాల సహాయాన్నే పొందాలని ప్రయత్నం చేశాడు. కాని అది ఎంత మాత్రమూ సహకరించక, ఒత్తిడిపెట్టి పర్షియాను లొంగదీయ ప్రయత్నించినవి. బ్రిటన్‌లో ఒప్పందం కుదుర్చుకోకపోతే తాము సహాయం నిలుపు చేస్తామని అమెరికా ఇటీవలే హెచ్చరిక చేసింది.

ఈ పరిస్థితులన్నిటినీ చూసిన మీదట, పరదేశాలను పీడించి బతికే పశ్చిమ సామ్రాజ్యవాదులు తమకెన్నటికీ తోడ్పడరని మొసాదిక్ గ్రహించి ఉంటాడు. అందువల్లనే భారత పార్లమెంటు సభ్యుడు సి. జి. కె. రెడ్డిగారు తనను కలుసుకోగా, ఆసియా రాజ్యాలన్నీ కలిసి సైనిక, ఆర్థిక సమాఖ్య ఏర్పాటు చేసుకుంటేనే కాని బతకలేనని స్పష్టంగా అభిప్రాయం ప్రకటించాడు. నూనె విషయమై రష్యాలో భారీ ఎత్తున ఒప్పందం చేసుకునేందుకు చివరకు తెంపు చేసి నిశ్చయించుకున్నాడని "న్యూస్ వీక్" (అమెరికా) పత్రిక ప్రకటించింది.

ఈ కారణాలవల్ల మొసాదిక్‌ను తొలగించి తీరవలసిందేనని పశ్చిమ రాజ్యాలు నిశ్చయించుకుని పని జరిపించినవి. జనరల్ జహేదీ తిరుగుబాటు జరిగినప్పుడు టెహరాన్‌లోనే వున్న డచ్చి ప్రయాణీకులు కొందరు, టెహరాన్‌తో చెప్పుకోతగ్గ విశేషమల్లా ఎక్కడ చూసినా అమెరికన్ యుద్ధ విమానాలు కనిపించటమేనని హాలెండ్ చేరుకున్న మీదట ప్రకటించారు.

ఈ విధంగా అభ్యుదయగామి అయిన మొసాదిక్, నెహ్రూవలె దేశీయుల మోసానికి గురిఅయినాడు. నెహ్రూ బలం లేనందువల్ల పడిపోయినాడు.

మొరాకోలో ఫ్రెంచిఅధికారులు జాతీయవాదిగా మారుతున్న కీలుబొమ్మ సుల్తాన్‌ను ఆగష్టు మూడో వారంలోనే పద భ్రష్టుడిని చేసి, మరొక కీలుబొమ్మను ఆ స్థానంలో నిలిపారు. ఈ విశృంఖల చర్యను ఆసియా, అరబ్ రాజ్యాలు నిరసించి, భద్రతా మండలికి ఫిర్యాదు చేయ నిశ్చయించినవి. కాని అక్కడ ఎంత వరకు న్యాయం జరుగుతుందో సందేహాస్పదం.

కొరియాలో ఆగష్టు మొదట్లో యుద్ధ విరమణ ఒప్పందం పై సంతకాలు జరిగినవి. మిత్ర రాజ్యాల తరఫున జనరల్ క్లార్క్, కమ్యూనిస్టుల తరఫున కిం ఇర్ సూంగ్, చైనా వలంటీర్ల సేనాని సంతకాలు చేశారు. దక్షిణ కొరియా సంతకం చేయలేదు కాని, క్లార్క్ సంతకం చేస్తుండగా సాక్షి మాత్రంగా ప్రతినిధిని పంపింది. ఖైదీల పరటా సాగుతున్నది.

మిగిలిన సమస్యల పరిష్కారానికై జరిగే రాజకీయ సమావేశంలో ఎవరెవరు పాల్గొనాలి అన్న అంశంమీద చర్చలు జరుగుతున్నవి. ఇండియా పాల్గొన వీలులేదని అమెరికా, దక్షిణ కొరియాలు వాదిస్తున్నవి. మిగిలిన పశ్చిమరాజ్యాలన్నీ ఉండాలని కోరుతున్నవి. సంప్రదింపులు జరపటంలో అమెరికా లోగడ అనుసరించిన విధానాన్ని బ్రిటన్ మొదలైన దేశాలు తీవ్రంగా నిరసించినవి.

*　　*　　*

పార్లమెంటు ఆంధ్ర బిల్లుపై చర్చ జరుపుతూ, ప్రస్తుతానికి కర్నూలులోనే రాజధాని ఉండాలని నిశ్చయించింది. శాసన సభ్యులు కోరితే దానిని మార్చుకోవచ్చును. కాని శాసన సభ్యులు మాత్రం ఇంత వరకూ తమలో తమకు పొంతన కుదరక చాలా కలహించుకుంటున్నారు. కృషిక్ లోక్ - కాంగ్రెసుల చీలిక మరీ పెరిగి పోవటమే కాక, ప్రజా సోషలిస్టు పార్టీలోనే పెద్ద చీలికలు ఏర్పడుతున్నవి కాంగ్రెసు పార్టీలోకూడా సంజీవరెడ్డిగారికి ప్రతికూలంగా శంకరరెడ్డిగారి నాయకత్వాన బలిష్టమయిన వర్గం ఏర్పడినట్లు కూడా తెలుస్తున్నది.

ఈ కారణాలనుపట్టి ఆంధ్రరాష్ట్రం డేరాల కార్యాలయాలనుంచి, కేంద్రప్రభుత్వ ఆధ్వర్యాన పరిపాలించబడుతుందని తోస్తున్నది.



మూలం : ద్విజేంద్రలాల్‌రాయి. అనువాదం : శ్రీమతి మాణిక్యవల్లి.

—:o:—

[జరిగిన గాథ : మొగలు ఆధిపత్యాన్ని గుర్తించి, మొగలులతో యుద్ధం తప్పించాలని మేవాడ్ రాణా అమర సింహుడు చేసిన ప్రయత్నం విఫలమవుతుంది. సర్వసేనాని తనయుడు అజయ సింహుడు రణోద్యోగియై రాకుమారి మానసి వద్ద సెలవు తీసుకొనుటకు వచ్చి ఆమెకు తన ప్రేమను వెల్లడిస్తాడు. మానసి క్షతగాత్రుల సేవకై రణరంగానికి బయలుదేరుతుంది. రాజపుత్రుల్ని చిటికలో జయిస్తానని ఉత్తర కుమార ప్రజ్ఞలు పలికిన మొగలు సేనాధిపతి హిదాయతుల్లాకు యుద్ధంలో చావు తప్పి కన్ను లొట్టపోతుంది. అమర సింహుని పెత్తండ్రి సగర సింహుని మేవాడ్ రాణాగా చిత్తూరు పంపవలెనని ఢిల్లీ చక్రవర్తి ప్రయత్నం చేస్తాడు. అజయ సింహుడు తిరిగి మానసిని కలుసుకొని తన ఆరాధన నంగీకరించమని ప్రార్థిస్తుండగా రాణి వచ్చి వారి సమావేశాలకు అభ్యంతరం చెబుతుంది. మానసి లోపలికి వెళ్ళి యేడుస్తూ వుంటుంది. కుమార్తె ఏడుపుకు కారణం తెలుసుకొనుటకై రాణి వద్దకు వచ్చిన రాణా ఆమె కేవలం ఒక దేవతా మూర్తి అని చెబుతుండగా సర్వసేనాని గోవింద సింహుడు వస్తాడు. ఇక చదవండి.]

———

రా : గోవిందసింహాజీ, యిలా వచ్చారేం?

గో : మహారాజ్, దేశంపైకి తిరిగి శత్రుసేనలు వచ్చాయి.

రా : రానే వచ్చాయా? అనుకుంటూనే వున్నాను దేవార యుద్ధంతో కాలేదని. రాజపుటానా సర్వనాశం కానిదే వాళ్ళకు నిద్ర పట్టదు. కానివ్వండి.

గో : మహారాజ్, మన వారిని సన్నద్ధ పరచవద్దు?

రా : దేనికి?

గో : సమరానికి.

రా : అబ్బే, దానివల్ల లాభంలేదు.

గో : ఏదోవిధంగా ఎదుర్కోక పోతే దేశం వెంటనే శత్రు వశమై పోతుంది.

రా : కానివ్వండి,

గో : మహారాజసలు యుద్ధం చేయ దలచలేదా?

రా : ఊహుఁ.

గో : మహారాజ్, యేస్వల్ప సైన్యమో, వున్నదానితో రక్షణ...

రా : ఏం రక్షణో. దేవార యుద్ధంలో మన సేనలు సగానికి పైగా హత మయ్యాయి. ఇక యిప్పుడు సైన్యం యెక్కడినుండి వస్తుంది?

(సత్యవతి వస్తుంది.)

సత్యవతి : భూమిని చీల్చుకు వస్తుంది, మహారాజ్. సేన విషయంలో మీరు చింతించకండి.

రా : నీవా, చారణీ?

స : అవును మహారాజ్, చారణినే. దేశం పైకి తిరిగి

శత్రుసేనలు వచ్చాయని విన్నాను. చూస్తే రక్షణ చర్యలు తీసుకుంటున్నట్టు కనపడలేదు. సరే మహారాజు నిద్రపోతూ వుంటారని మేల్కొలపడానికి వచ్చాను.

రా : ఇక సమర సన్నాహం లేదు, చారణీ. ఈ సారి సంధి చేసుకుంటాం.

స : మహారాజ్, దేవార విజయం పిమ్మట సంధి తలంపా? కీర్తి శిఖరం నుండి అవమాన కూపానికి దిగజారుతారా?

రా : ఏం విజయమో. దాని కెంత మూల్యం చెల్లించాం? ఎందరి వీరుల రక్తం ధారపోశాం.

సి : దానికి విచార మెందుకు? వీరుల రక్తమే జాతికి జీవం. వీర మరణాలు కరువైన దేశం కోసం విచారించాలి కాని వీర రక్తంతో కల్యాణ తిలకం దిద్దుకొన్న దేశం కోస మెందుకూ?

రా : యుద్ధం వ్యర్థమనే నా అభిప్రాయం. ఈ పోరాటానికి అంతమంటూ లేదు. అదీగాక నలుగురు సైనికుల్ని అడ్డు పెట్టుకొని ఒక సేనా సముద్రాన్నెదుర్కో బోవడం ఉన్మాదం.

స : మహారాజ్, దాన్ని ఉన్మాదం అంటున్నారా? కానివ్వండి. మీ మనసు కొచ్చినట్లే పిలవండి. పేరులో యేముంది? కాని ఆ పిచ్చియే వుత్తమ ధర్మం. ప్రపంచ మంతా దాని పాదాలకు జోహారు చేస్తుంది. కేవలం దైవశక్తి దాని మకుటం. అట్టి వెర్రికి లోబడ్డం కంటె ప్రపంచంలో మరో మహాకార్య మేముందో వేలు మడచి చెప్పగలరా?

రా : రణానికి అంతిమ పరిణామం మృత్యు—

స : ఏమన్నారు మహారాజా! ప్రతాప సింహుని పుత్రులనవలసిన మాటలేనా యివి? బానిసత్వ మరణాలలో నే దివరణీయమో మీరు నిర్ణయించలేనిదికాదు. మరణ భయంచే మన మాణిక్యాన్ని దొంగలపాలు చేస్తామా? ఈ మేవాడ్ మన పూర్వపురుషుల పుణ్యఫల సర్వస్వం. మన పూర్వ గౌరవ ప్రతిష్టలకు దివ్యస్మృతి చిహ్నం. మహా మాణిక్యం కంటెను విలువైనది. ఇట్టి మాతృదేశాన్ని రక్షించను ప్రయత్నమైనా చేయక పరులపాలు చేస్తామా? లేవండి మహారాజ్. శత్రు సైన్యం సమీపించేసింది.

రా : నీ వెవరమ్మా. చారణివి మాత్రం కాదు. ముఖ వర్చస్సుపలుకుల గాంభీర్యానికి మెరుగు పెడుతుండగా భావప్రకటన తుపానునుస్ఫురింపజేస్తున్నది. సూర్యదేవుని తేజస్సు, ప్రభంధనుని ప్రబల బలం, వజ్రపు భీషణత్వం నీలో మూర్తీభవించాయి. మహాసాగరము వోలె ఘూర్ణిల్లు నీ వెవ్వరు తల్లీ?

స : మహారాజ్, అడిగిగారు కాబట్టి చెబుతున్నాను. ఇక మరుగుపడి వుండవలసిన అవసరమున్నూ లేదు. నేను సత్యవతిని.

రా : ఏమీ! పెదనాయనగారి సత్యవతివా?

స : అట్లని చెప్పడానికి తల సిగ్గుతో కృంగి పోతున్నది మహారాజ్. కాని తండ్రి పాప పరిహారానికై నా చేతనైనంత చేస్తున్నాను. నాన్నగారు తన సోదర పుత్రుని సింహాసనచ్యుతుని చేయడానికి "నేనే రాణా"నంటూ చిత్తూరు వెళ్ళి కూర్చున్నారు. సగర సింహుడు మొగలుల బానిస; అతడికి మేవాడ్‌తో యెట్టి సంబంధం లేదని నేను ఆయనకు వ్యతిరేకంగా ప్రజలలో ప్రచారం చేస్తున్నాను. మేవాడ్ పౌరు లెన్నడూ పితృఋణం తీర్చడంలో యేమర లేదు. అందుకు నా కింత కంటె ఉత్తమ మార్గ మేమున్నది?

రా : సోదరీ—

స : మహారాజ్, దేశం కోసం భోగ భాగ్యాల్ని, తండ్రీ తనయుల్ని ఒదులుకున్నాను. తద్య శోగానం చేస్తూ తిరుగుతున్నాను. అట్లాంటి నా మేవాడ్‌ను అల్పం, అనావశ్యకం అయిన వస్తువులా ఒది లేస్తారా? (రుద్ధ కంఠంతో కళ్ళు తుడుచు కొంటుంది)

రా : దుఃఖించకమ్మా. నీవు రాజకుమార్తెవు. నా సహోదరివి. నీవు యేదేశ సేవకై నీ జీవితం అంకితం చేశావో ఆదేశాధిపతి నీ సోదరుడు దానికోసం ప్రాణార్పణం చేస్తాడు. గోవింద సింహాజీ సమర సన్నాహం చేయండి.

## రంగము-3

[స్థలం: మేవాడ్, అబ్దుల్లా డేరా. సమయం: రాత్రి.]

అబ్దుల్లా : ఈ దేశంలో పర్వతాలు చాల ఉన్న వే!

హిదాయత్ : చిత్రం.

# మేవాడ్ పతనం

అ : నువ్వు ఓడి పోయినప్పుడు రాజపుత్రులు యేదిక్కు నుండి యెదుర్కొన్నారు?

హి : ఇదేమిటీ! నేనెప్పుడోడిపోయాను?

అ : శత్రువులకు పట్టు బడ్డావుకా. మరి దాని పేరేమిటి?

హి : హాఁ, అదా! వాళ్ళ మొహం. వాళ్ళు నన్ను పట్టు కోడమేమిటి. నేనే వాళ్ళకు పట్టు బడ్డాను.

అ : అదేమిటి?

హి : చెబుతా వినండి మరి. యుద్ధానికి నా సైనికులు ముందుగానే సంరంజాం చేసుకున్నారు. ముందు వాళ్ళంతా పక్కలు వేసుకున్నారు. తరువాత బాగా ఆలోచించి కత్తులు తీసుకున్నారు. పక్కమీద కత్తులో వొంపు, ఒరలో వొంపు పెట్టుకున్నారు. అప్పుడు అందరూ కూచుని శాయితీగా మీసాలు దువ్వు కున్నారు. అప్పటికి వంట అయింది. నా సైనికులు తిండి తిననిదే కాలు కదపలేకపోయేవాళ్ళు. అంచేత తీరిగ్గా భోజనాలు చేసి, తలలు దువ్వుకుని మళ్లీ మీసాలు మెలిగెట్టుకున్నారు. ఇంతలో రాజపుత్ర సైన్యం డేరా దగ్గిర కొచ్చేసింది. దాంతో మా వాళ్లు వెంటనే యుద్ధానికి వెడుతూ కంగార్లో కత్తులకు బదులు ఒరలు తీసు కెళ్ళారు.

అ : అందరూ అదే పొరపాటు చేశారా?

హి : ఆఁ! అదంతా భగవన్మాయ!

అ : వాళ్ళింకో పని చేయవలసింది.

హి : ఏమిటది?

అ : మస్తుగ భోంచేసి కత్తులు పక్కలో పెట్టుకుని ఓ నిద్దరపోయి లేవ వలసింది.

హి : అలాగే చేద్దును వీలయితే.

అ : పాపం... వ్యవధి లేకపోయింది కాబోలు! సరే. తరువాత?

హి : అంతే. ఇంకేముంది?

అ : కావలిస్తే ఖైదు చేసుకోండి; ప్రాణం మాత్రం తీయ వద్దని ప్రార్థించేరేమో తమరు!

హి : అబ్బే, లేదు! లేదు! ఆఁ! జ్ఞాపక మొచ్చింది. కొంచం యించు మించు అలాగే చెప్పానేమో. మర్చి పోయాను.

అ : అందువల్ల ఉర్దూ సాహిత్యానికి లోటు రాదులే. తరువాత వాళ్ళు నిన్ను వశం చేసుకొన్నారు.

హి : చిత్తం తమరు సరిగ్గా ఊహించారు. అయితే అంటకు ముందు ఒక ముసలి రాజపుత్రుని గుండు పొరపాటున నాకు తగిలి పడిపోయాను.

అ : అప్పుడే కాబోలు రాజకుమారి నీ శుశ్రూషకై వచ్చిందట.

హి : ఆఁ! ఆఁ! ఆవిడ వీరుని కూతురు. వీరులెన్నెలా గొర వింగాలో తెలుసు. అదీగాక నా అందం వుంది చూశారూ, జనాబ్ (క్రీగంట హుస్సేన్‌కి సంజ్ఞ చేస్తాడు.)

హు: అచ్ఛా తమ అందం మెచ్చుకో దగిందే!

అ : అంచేత బహుశా ఆమె.........

హి : అబ్బ! ఏం చెప్పను జనాబ్!

అ : ఆమె మంచి అందగత్తె కాబోలు.

హి : ఊఁ. మరేమనుకున్నారూ!

అ : నీతో యేమందేమిటి?

హి : అబ్బే, నాతో మాట్లాడానికి ఆవిడికి ధైర్యం యేదీ? నేనే తన "ప్రాణం" అని చెప్పాలనుకున్నట్టుంది. "ప్రా" అని మెల్లిగా అంది. అబద్ధ మాడ్డం యెందుకు "ణం" అని కూడా అందో లేదో చెప్పలేను. నా వైఖరి చూసి తన ఆటలు సాగవని తెలుసుకునుంటుంది.

అ : తరవాత?

హు: భయంతో చచ్చిపోతున్న సేనాధ్యక్షు వరేణ్యుల్ని రాణాజీ ఒదిలి పెట్టేశారు.

హి : లేపోతే మళ్ళీ నా ప్రతాపం చూపించనూ!— హా, హా, హా, హా.

అ : భేష్, తమరు వీరులనడంలో సందేహంలేదు.

హి : ఏం వీరుణ్ణిలెండి. కాని, అబ్బా! ఈ సైనిక కళ నేర్చుకోడానికెంత డబ్బు ఖర్చుపెట్టానో!

అ : (వినిపించుకోనదు) ఆ కొండలు యెంత నల్లగా వున్నాయో ! ఇక్కడ అన్నీ పర్వతాలే.

హి : ఉత్త పర్వతాలేకాదు. కొన్ని నదులూ ఉన్నాయి.

అ : రేపు బాగా చూడాలి.

(దూరంలో తుపాకి చప్పుడు)

అ : (అదిరిపడి) అదేమిటిసి

హి : హుస్సేన్ —

హు: రాజపుత్ర సైన్యం చుట్టుముడుతున్నట్టుంది.

అ : సైన్యాన్ని సిద్ధపరుచు, హుస్సేన్.

## రంగము- ౪

[స్థలం : చిత్తూరు దుర్గం. సమయం : రాత్రి]

(అరుణసింహుడు నిద్రపోతూ ఉంటాడు. నగరసింహుడు పచారు చేస్తూ వుంటాడు)

స : వీళ్ళు చిత్తూరు దుర్గంలో నన్నో విధంగా ఖైదు చేశారు. మాంధాత కాలంనాటి ఆవృక్షాల్ని చూస్తే భూతాలేమో అన్న భ్రమ కలుగుతుంది. చీకటి పడితే మరీ భయంకరంగా వుంటుంది. తుపాను పట్టినప్పుడు ఆ చెట్లు అచ్చు భూతాల్లాగే వుంటాయి. పొద్దు గూకితే అంధకార బంధురమే కదా. నక్షత్రాలైనా కనబడవు. అయితే యిక్కడికి రావడం ఒకిందాన మంచిదే అయింది. రామ చరిత్రను విన్నాను. రామాయణం యెంత మంచి పుస్తకం. ఈ చారిణు లెవరో మా పూర్వ పురుషుల కీర్తిని గానం చేస్తున్నారు. వారెంత శూరులు. వారి భుజ బలాన్ని యేవిధంగానూ కాదనలేం. ఏమిటి, నాకీ రోజు యింత భయంగావుంది? ఏముంది. యిక్కడ మనుష్య సంచారం లేదు. ఆపైని తుపాను. భయం వెయ్యక యేం జేస్తుంది? ఏ పారా! పారా జవాన్ !

(పారా బంట్రోతు వస్తాడు)

స : ఇదుగో, బహు జాగ్రత్తగా వుండు. ఎవరినీరానివ్వకు. అయ్యొ బాబోయ్ ! అదేమిటి?

పారా : ఎక్కడ మహరాజ్ ?

స : అదిగో, అక్కడ. బాబోయ్ !

పా : ఏం లేదు. గాలి హోరు, మహారాజ్.

స : ఇక్కడ తరుచు హోరు గాలి వీస్తుందా?

పా : చిత్తం, మహారాజ్.

స : ఏం మహారాజా ! నిద్రలేక చస్తూంటేనూ. ఏమిటోయ్ మీ దేశంలో చీకటి కూడా యెక్కువలాగున్నదే?

పా : చిత్తం ప్రభూ.

స : ఇంత చీకటి దేనికో ! చూడు, నువ్వు మేలుకునే వుండు సుమా. ఏ మంటో వెయ్యి. ఈ చీకటి కాస్త తగ్గనైనా తగ్గుతుంది. ఈ చీకట్లో నాకు నిద్రపట్టదు. నువ్వు ఒర తీసిన కత్తితో నలు వెంపులా తిరుగుతూ వుండు. ఎవరైనా వస్తే ఒక్క వ్రేటు! ఇదుగో, జాగ్రత్త ! పొరబాటున నా తల నరికేవుసుమా ! వెళ్లు

(పారా జవాను వెడతాడు.)

స : ఈ అరుణుడెలా నిద్రపోతున్నాడో ! ఎలా వస్తుందో వాడికంత నిద్ర ! కదలడు, మెదలడు. ఓమాటు ఊఁ ఆఁ అన్నా బాగుండును, కాస్త ధైర్యంగా వుండును. ఈవేళ నేను నిద్రకు నోచుకోలేదు. అబ్బా, మా పూర్వులీ దుర్గంలో యెలా వుండేవారో ! నిజంగా వారి ధైర్య సాహసాలు దొడ్డవి. ఏ పారా !

(పారా బంట్రోతు వస్తాడు.)

స : ఏం లేదు. మేలుకునే వున్నావు గదా ! నిద్దరోయేవు సుమా. నీవు మేలుకున్నా నన్ను అనుమానుకి మధ్య మధ్య యేదైనా చప్పుడు చేస్తూ వుండు. వెళ్ళు.

(పారా బంట్రోతు వెడతాడు.)

స : అరుణా ! అరుణా !

అ : ఎందుకండీ.

స : ఆఁ. ఆఁ. ఏం లేదు. కాస్త జాగ్రత్తగా నిద్రపో నాకు భయంగా వుంది.

అ : భయం దేనికి? మీరు నిద్రపోలేదూ? (ఒత్తిగిలుతాడు)

స : ఎవరక్కడ? అరె ! ఏమిటది? ఏ పారా ! పారా ! పడుకున్నావూ. అరుణా ! అరుణా !

# మేవాడ్ పతనం

అ : ఏమిటండీ, యీ వాళ నిద్రపోనివ్వరా?

స : ఎవరో మాట్లాడుతున్నారు ఆలకించరా.

అ : ఏమీలేదు, ఓరుగాలి (ఒత్తిగిలుతాడు)

స : ఓరుగాలా? అరె, యెక్కడేనా గాలి మాట్లాడుతుందా? వినరా! అయ్యబాబోయ్!

అ : ఏమిటండీ?

స : భూతంరా!

అ : ఎక్కడ?

స : అదుగో! (చూపెడతాడు)

అ : ఏమో నాకేం కనుపించడం లేదు. మీరు మేలుకునే కలగంటున్నారు.

స : (తేరిపార చూసి) నేను బుద్ధి పూర్వకంగా రాలేదు. వాళ్ళు బలవంతాన పంపేరు. కాదు సోదరా నేను రాణాను కాదు. రాణా అమర సింహుడే. నన్ను చంపకు, విడిచిపెట్టు.

అ : తాతగారూ!

స : అదుగో, వారెవరు? చిత్తూరు రాణా భీమసింగ్! జయమల్లు! ప్రతాపుడు! సోదరా ఇక్కడ్నించి రేపే వెళ్ళిపోతా. నన్ను ముట్టొద్దు అదెవరు? శరణు! శరణు! (పడిపోతాడు. అరుణసింహుడు వచ్చి లేవదీసి పట్టుకుంటాడు. పారా వాడు వస్తాడు.)

అ : (పారావానితో) తాతయ్యా స్పృహ తప్పి పడిపోయారు. నీళ్ళు తీసుకొని రా. (సశేషం)

---

# ★ సందేశం ★

• శ్రీమతి కూచిభొట్ల కామేశ్వరి •

మాధవి అనే గోపిక, కృష్ణపాద ధ్యానం చేస్తూ సమీపంలో గానం చేస్తున్న షట్పదాన్ని చూచి,

గొల్ల చేడియ వెల్ల చూడగ
పిల్లగ్రోవిని పెదవి చేరిచి
కల్ల పిల్లడు క్రమ గీతుల
నెల్లవారలు నెడదగుందగ

పాడుచుండును, తుమ్మెదా
ప్రణయగీతులు పలుకవా

కనగ బృందావనము మధ్య
కనులపండువు గాగ నిలిచి
మనసుకరిగే మధుర గీతి
పనులు మరపింపగ పాడు

వానితోడా, తుమ్మెద
ప్రణయవార్తలు చెప్పవా

నెమలికుంచియ నెగడియాడగ
సుమశరీరము సోకుచుండగ
విమలవాగ్ఝరి వీనులందున
కొమరుమీరగ గోపబాలుని

చెంతనే వసియింతునా
అంతభాగ్యము కలుగునా

ప్రకృతినిండగ ప్రణయగాథలు
త్రవ్వుచుంటిని త్వరగ కృష్ణుని
చెంతజేరుచు చింత చెప్పుచు
తోడగైకొని తొలుతరమ్ము

పలుకవమ్మా తుమ్మెదా
కంటనీటిని గాంచవా

మిత్రపుత్రిక మెఱుగునీళ్ళవి
చిత్రగమనము చేయుచుండు
మాత్రలో మామాట దెలసి
ఆత్రతన్నను నరయునట్లు

వానితోడా, తుమ్మెదా
ప్రణయగీతులు పాడవా

అదే సమయంలో శోభా అనే గోపిక వచ్చి చెలి కత్తెతో,

ద్విజుల మంత్రోత్తేజములతో
ప్రజల జేజే రావములతో
భజన సేసే భావములతో
కాళ్ళ గజ్జెలు ఘల్లురనగా

మాధవుం డరుదెంచుగా
మాధవీ
నీ భావ మలరించుగా

కవుల స్వేచ్ఛాగానములతో
మధుపఝుంఝుం ధ్యానములతో
చంద్ర చంద్రిక చవులెసంగగ
సరస మెరిగిన శాంతమూర్తి

మాధవుం డరుదెంచుగా
మాధవీ
నీకోర్కె ఫలియించుగా.

# నాగయ్యా

రచన :- "కొత్తపెంట"

నాగయ్యా ఆ జాలరిపేటలో పేరుమోసిన పెద్ద మనిషి. నీటిమీద వేటంటే పాటవంచూపి వేనవేల జనాలచేత ముక్కుమీద వేలేయించిన మేటి వేటగాడు. కూడేనా మానేడుగాని కులవిద్య విడువలేక పోయాడు. నలువురి జాల్లర్లతోను తాను తెప్పమీద వెళ్ళి దొరికిన మీను, తాబేళ్లు, సొరలు సంతకి తీసుకుపోయి తన వంతుకు వచ్చిన నాలుగు డబ్బులు పిల్లా జెల్లాకి పెట్టేవాడు.

కాలక్రమాన్న నాగయ్యకి నలుగురు కొడుకులు గూడ కలిగారు. తన నలుగురి కొడుకుల్ని గారాబంగా పెంచి పెద్ద చేశాడు. వాళ్ళకి యుక్తవయస్సు రాగానే నీటిమీద వేట, అందుకు కావలసిన యీత, నావ కట్టడందగ్గర్నుంచి నేర్పాడు. ఇక తాను కూలి నాలి చెయ్యలేక ఊరికే కూర్చోడం కష్టమనిపించినా చేతికి కొడుకులు నలువురూ అందొచ్చారు కాబట్టి కాస్సేపు కాళ్లాపుకూర్చునేవాడు. నలువుర్ని ఏకమాటమీద నడిపించి తాను కుటుంబ భారాన్ని మోస్తుండేవాడు. ఉచ్చులు, వలలు, తెప్పలు, తెడ్ల దగ్గర్నుంచి తాను సిద్ధంచేసి నలువురి కొడుకుల్ని సాయంకాలం అయేసరికి సముద్రం మీదికి వేటకి సిద్ధం చేసేవాడు.

రోజూ సముద్రాన్ని యింతమంది ఎంత దోలుచుకు పోయినా అదేం చిత్రమోకాని అక్షయపాత్రలా నిండుతూనే ఉంటుంది మీనులతో!

సాయంకాలాన్నే సముద్రం మీదికి దారి తీసి వేట ఆడాడి తెల్లవారి పొద్దు బారెడు మీదికెక్కిందనగా యిల్లు చేరేవారు నలువురూ. తెచ్చిన వేట చూపుతూ తమ శక్తి సామర్థ్యాలు చూపి సాధించిన మహత్కార్యంలా తండ్రి కేసి చూసేవారు. నిగనిగ లాడే ఆ పండు మీసాల సందుల్లోంచి కాస్సేపుంటే యింకా రత్నాలు రాలిపోతాయా అన్నట్లు చిఱునవ్వు ముడతలువారిన నాగయ్య ముఖంపై మెఱపులా మెరిసేది. "ఇయాల యిదేనట్రా యేట" అంటూ కొమరులు తెచ్చిన కొల్లనంతా చూసి సంతకి బేరానికిచ్చేవాడు.

రోజూ కొడుకులు వేట తేవడం, తాను సొమ్ము చేయడం, వేట చూసి భావగర్భితమైన ఆ చిన్న చిఱునవ్వు పరిపాటి ఆయిపోయినది. ఓనాడు మామూలుగా వేటాడె వచ్చేసరికి "రేపు మీతో నేనూ సంద్రముమీది కొస్తాన్రా" అన్నాడు ముసలాడు చుట్ట ఉప్ ఉప్ అంటూ.

మర్నాడు యథాప్రకారంగా ఉచ్చులు, పెద్ద వలలు, దిట్టమైన నావ, తెడ్లు. వీటికి తోడు పెద్ద నూనె తొట్టి-వత్తి సిద్ధం చేసేడు ముసలాడు. సాయంకాలం అయేసరికి పొద్దు యింకా ఉన్నదనగానే తానుకూడ నలువురు కొడుకులతో తెప్ప ఎక్కాడు. బాబు కూడ తమతో వస్తున్నాడని మురిసిపోయారు నలువురు కొడుకులు. చాల దూరం వెళ్ళారు. ఎంత దూరం పోయినా యింకా, "తెడ్ల నెయ్యండ్రా" అని అంటూనే ఉన్నాడు తండ్రి. మినుకు మినుకు లాడుతూ మింటికేసి యున్న నక్షత్రాలు, జలజలలాడుతూ ఉఱుకు సొబగులతో ఊసులాడుతూన్న గంగ తప్ప మరేమీ వారికి కానరాలేదు. కాస్సేపయేసరికి యీ మహాంతరాళానికి మహోదధికి మధ్యవారు కారాగారంలో బంధిపబడినట్లు భీతిల్లారు. ఆ నక్షత్రాలు యీ కారాగార కవాటాలకు నేర్పుమై నాటిన స్నిగ్ధమణుల్లా మెఱసిపోయాయి.

బాగా దూరం పోయిన తర్వాత "ఏమిటి బాబూ! యీ యాల్టి యేట. నీకు మరీ మతిపోతోందనిపిస్తుంది. ఈవలిగట్టునుండి ఆవలి గట్టుకే నేటివల" అన్నాడు నలుగురిలో నాల్గోవాడు భీతాహంతో. ముసలాడు ఓ చిన్న చిరునవ్వునవ్వి "ఊఁ నేదుండై" అంటూనే చుట్ట ఎఱ్ఱగా కణకణలాడేటట్టు పొగ బాగా పీల్చి నావని పోనీసాగాడు. కొంత దూరం పోయిన తర్వాత తెప్పనాపి తాను తెచ్చిన నూనె తొట్టినిండా బుడ్డిలోని నూనె పోసి పెద్ద గుడ్డవత్తి అందులో మధ్యనుంచి వెలిగించాడు. దీపం ఆరిపోకుండా తగు ఏర్పాట్లు చేసాడు.

ఓ గంట గడచిన తర్వాత, "ఓ రయ్యా! ఇక మీరోసం సూపాలిరా! బేగి ఒడ్డుకి పోవాలి" అంటూ ఒడ్డుకేసి తెప్ప మళ్ళించి "తెడ్డెయ్యండ్రా" అన్నాడు ముసలాడు. "ఏం బాబు! కొంప ముంచినావు, మేము

వద్దంటూంటే వచ్చినాం నింగీ నీరు కలిసేదాక, నువ్వు మరీ బాబు నీకేటి తెల్దు" అని విసుక్కుంటూ రెండు నిముషాల్లో నలువురు తెడ్లు వేసారు. ముసలాడు నీటి పాటు పోటు గమనిద్దామని తన చెయ్యి నీటిలో పెట్టి చూచాడు. చూసీ చూడ్డంతోనే "బేగి పోనీంద్రా" అంటూనే వేసిన వలల్ని తీసేసి దొరికిన ఆ వేటతో తిరుగు ముఖం పట్టాడు. "ఇదేటి బాబూ! యీ యాల్టి యేట మరీ అర్దాన్నం ఐపోనాదే. ఇంత సేపటికి యిదా కూడు. నీటి బాబూ మమ్మల్ని సంపినావ్" అంటూండగనే, "ఊఁ ఉండ్రా మీశత్తి సూపి తెడ్ల నెయ్యండ్రా"అని హెచ్చరిక చేసేడు. ఇంతలో "ఒల్లకోరా, ఎనకాల పెద్ద మెకం ఒత్తుంటే ఏటాకో లాలుమీకు! బేగి పోవాలి. పేణాలతో యిల్లు సేరుకుంటే అదే పదేలు. బాబుకేటో తెలక సముద్రంమీదికి సాముకని వచ్చినాం. బతికుంటే బలుసాకు కూరాయను" అన్నాడు మొదటివాడు. నలువురు లేని బలాన్ని తెచ్చుకొని మహావేగంగా పడవని పోనీసాగారు. నావ నలుగురి బాహుబలాన్ని సంధించుకునే సరికి గాలి దేవుడుగూడా తన చెయ్యి సాయానికి అందిచ్చాడు. మహావేగంగా తెప్ప వస్తోంది. నాగయ్య నింగికేసి ఓసారి నిగిడించి చూసి త్వరత్వరగా పోనిమ్మని తొందరచేసాడు. నావలోని దీపం దేదివ్యమానంగా సముద్రరాజు తాల్చిన మహనీయమణిమయ స్వర్ణ మకుటంలా ఆ అంధకార బంధురమైన అంబుధిపై వెలుగొందసాగింది. కాస్సేపయే సరికి నీటి పోటు అధికమై దూరాన సాగరోదర సంజనితమైన గిరిశిఖరాల పరిసరాల గంగ ఉవ్వెత్తున తెప్పున తెళ్ళి ఉరకలు వేస్తోంది. ఈ మహోర్పాటాన్నంతటినీ చూసి నలువురు కొడుకులు చాల వెఱపొందారు. వెంటబడి వస్తున్న మెకాన్ని సరకుగొనక ముసలాడు అతి జాగ్రత్తగానే నేర్పుమై నావను ఒడ్డుకేసి మఱలించుకుపోతున్నాడు.

తీరం ఇంకా చాలా దూరంలో ఉంది. వేటాడ్డానికెళితే వెంటబడి తఱుముకుంటూ వస్తోంది ఓ చిన్న కొండలాంటి ఓ పెద్ద చేప. దూరాన్నుంచే ముసలాడు దీని రాక పసిగట్టాడు కాబట్టి ముందుగానే జాగ్రత్తపడి పడవను తీరానికి తరలించుకుని పోతున్నారు. అంధకార బంధురమైన ఆ అంబుధిపై- ఆ కటిక చీకటిలో వెళ్తూన్న కాగడా యీ చేపను ఎఱగా పరిభ్రమింప చేసింది. దూరాన్నుంచే యీ దీపాన్ని చూచి ఆకలిబాధ తీర్చుకుందుకు తగిన ఆహారం లభించింది గదా అని మహోత్తుంగ తరంగ సంఘములమధ్య ఉద్వేగంతో ఉరకలు వేస్తూ వస్తోంది. తీరం దరిచేరాలంటే ఉరుతర విక్రమాఢ్యులకుకూడ కాని పనిగా కనుబట్టిందా ముసలాడికి. ఆలోచించడానికవకాశం గూడ క్షణమాత్రం లేదు. అల్లంత దూరాన తేలియాడుతూ తెప్ప నమాంతంగా మ్రింగివేయదగు ఆర్భటితో అతి శీఘ్రంగా వస్తున్న మృత్యుదేవతలా కనిపించిందా మెకం వారికి. ముసలా డిది పనికాదని చక్కని ఉపాయం పన్నాడు. అంతవఱకు తన ముంగట వెళ్తున్న నూనె తొట్టి నొక్కపాటున గంగలో త్రోసివేసి తానంతవరకు వచ్చుచున్న మార్గానికి లంబంగా తెప్పని తిప్పాడు చుక్కాని సహాయంతో. బాహుబలం చూపి ప్రాణభయానికి వెఱపొందక నలువురు కొడుకులు అతి వేగంగా తెడ్లని వేస్తున్నారు. గాలిదేవుడు కూడా సాయమైనాడు కాబట్టి గడియలలో తెప్ప తీరానికి సమానాంతరంగా సముజ్వల వేగంతో ఆ కారుచీకటిలో పయనిస్తోంది,

దీపం పోగానే, దారీ తెన్నూ తెలియక, తెప్పజాడలేక తన ఆహారం అచ్చట మునిగినదని దురాశపడి విపరీత ఉత్సాహంతో మత్స్యం తరలించుకువస్తోంది తనంతవఱకు వస్తున్న మార్గమంటే. క్రమ క్రమేణ తీరం సమీపించింది. కాని చేప మాత్రం తన ఉపద్రవ ఉద్వేగాన్ని సడలించక ఆహారంపై నుండే ఆపేక్షచేత నేరుగా పోసాగింది. ఆ చీకటిలో తీరమేదో నీరమేదో గోచరం కాలేదాజలచరానికి. దీనికితోడు దాని గమనోద్వేగంకూడ మితిమీరిపోయింది. చివఱికి చేప ఒడ్డుననున్న యిసుక తిన్నెలలో కెక్కిపోయింది. పాపం! దాని కాహారానికి బదులుగా విహారానికిసుకతిన్నెలు ప్రాప్తమైనాయి. కొంతసేపటికి ఊపిరాడక ఉన్మాదంతో యిసుకనంతా రిమ్మివేయసాగింది. ఏంచేస్తే నేం లాభం! ఎంత ప్రయత్నించినా మళ్ళీ యిసుకలోంచి సముద్రాన్ని చేరలేకపోయింది చివరికి తీరం గూడ చేపకి అందని దూరంలో నిల్చిపోయింది.

అట. ముసలాడు తీరానికి సమానాంతరంగా పోయి పోయి చుక్కాని మళ్ళించి తీరాన్ని చేరుకున్నాడు. తెల తెలవారుతుండనగా కాస్సేపు సేదతీర్చుకున్న తర్వాత తాము తెచ్చిన ఉచ్చులు, వలలు, జాగ్రత్తచేసుకొని సముద్రంలో దొరికిన వేటని మాత్రం పెద్ద బుంగలో నుంచి బొంగులు బుజాన వేసుకొని యింటిదెసకై పయనించారు తండ్రి కొడుకులు.

దారిలో— "ఏం బాబూ ! ఏటానేదు - ఏటినేదుగాని ఒళ్ళు పులిసివోయేలా శమపడ్డాం" అన్నాడు పరిహాసంగా బుల్లోడు. "ఏట లేకపోతే పోనాదిగాని పేణాలతో తిరి గొచ్చాం అందరం అదేసాలు మనకి" అని సమర్ధించ చూచాడు మరొకడు. ముసలాడు మీసం మెలివేస్తూ చిన్న చిరునవ్వునవ్వి "బేగి యింటికి పోయి మళ్ళీ తిరిగి రావాలి మన పెద్దోణ్ణి, చిన్నోణ్ణి యింకా మనోళ్ళ నలుపుర్ని తోడు తీసుకొని రావాలిరా" అన్నాడు కొడుకులతో. "ఏంటి బాబూ, రేయంత పన్ని ఎంటాడిన మెకం దొరి కిందనేటి" అన్నాడు అమాయికంగా చిన్నవాడు. "ఎక్కడ పడ్డాదేటి బాబూ! మనం వలేనా వినలేదు గదా ! ఏనాగో బగొంతుడి దయొల్ల యిల్లు సేరేంగాని" అన్నా డాదుర్దాగా రెండో వాడు. తమ బాబు చెప్తున్న మాటలు విని దిగ్భ్రాంతులై తాము చేసి చూసిన కార్యాలనే మరచి నిర్విణ్ణులయారు కొడుకులంతా. వేటకు కావలసిన పరికరాలేమీ వారుపయోగించకుండగనే వేటాడి మెకాన్ని సాధించేదెట్లు? పోతే వేటకు బయలు తామంతా ప్రాణా లతో తీరం చేరే రా మెకంబారిపడకుండా. అంత మాత్రం మాత్రమే వారి కవగతమైన విషయవిశేషం.

కొడుకులను వెంటబెట్టుకొని నాగయ్య తీరం వెంబడి తనంతవఱకు తెప్పమీద వచ్చిన దారివైపు తిరిగి పోసా గాడు. దూరాన్న ఏదో ఒడ్డునంతా భీభత్సం చేస్తున్నట్లు చూచారు. "అదే నేటి బాబూ మెకం. సాల పెద్ద సేపే. ఒడ్డుకొచ్చానే ఎగబడ్డాదేటో రేయంతా తీరం గానక" అన్నాడు పెద్దోడు. కొడుకుల్తో నాగయ్య తాను సాధించిన వేట దరికి చేరాడు. "ఏటి బాబూ ! ఎంత పెద్ద మెకం ఉంది. తెప్పతో సహా మన్ని ఒక్క గుక్కలో యిముడ్చు కోగలదే. ఏటి బాబు ! దాని రెక్క సూడు తాటిమాన్నాగ" అని ఆశ్చర్యం వెలిబుచ్చారు తమ తండ్రి నాగయ్య ఆ మేటి వేటగాడిముందు.

"ఒరే బాబు, యిక మనం పోయి సద్ది తిని మనోళ్ళ తోడు తేవాల్రా" అన్నాడు. తమ బాబు సాధించిన ఆవేట, చూపిన ఆ ధైర్య సాహసాలు, అందుకుతోడు యుక్తి వేనోళ్ళ వాళ్ళని పరిభ్రమింపచేశాయి. నిర్విణ్ణులై, నిశ్చే ష్టులై, తెరువబడిన నోళ్ళతో ఆ చేప వైపు రెప్పవేయ కుండా చూడసాగారు. మరోసారి నాగయ్య వాళ్ళని పిల్చి "బేగి మనోళ్ళని తీసుకు రావాలిరా" అన్నాడు. వాళ్ళంతా యింటికి వెళ్ళి కాలకృత్యాల తర్వాత కడుపార భుజించిన తర్వాత నాగయ్య తన కొడుకుల్ని పంపాడు. వాళ్ళంతా వెళ్ళి మిగతా జాలర్లతో తమ బాబు రమ్మన్నట్లు చెప్పారు.

పొద్దు బారెడు మీదికెక్కిందనగా ఒడ్డుకేసి పయన మయ్యారు జాలర్లంతా. మత్స్యాన్ని చూసి ఆశ్చర్యంతో అంతవఱకు నోటిలోనున్న చుట్టతీశాడా పేట పెద్ద. "ఏట్రా బుల్లోడా ! ఏనా యీడ్చుకొచ్చినావురా దీన్ని? అబ్బోస్, రెక్క సూడ్రా ఎంత బలంగుందో" అన్నాడు. కొంతమంది జాలర్లే అంత పెద్ద మత్స్యాన్ని తామదివఱ కెచ్చట చూచి యెరుగమని ముక్కుమీద వేలేసుకున్నారు. అందరూ ఆశ్చర్యంగా చూచి నాగయ్య యుక్తికి, అసా ధారణ శౌర్య ధైర్యాలకు మెచ్చుకొన్నారు. దూరం నుంచి మనుమని చేయిపట్టుకుని వార్ధక్యంచేత వణుకుతూ వస్తు న్నాడో ముదుసలి. "నాగూ" అని పిల్చి "బాబూ! ఏటంటే నీదిరా ! ఎదవలు యీళ్ళ ఏశేటి. గొప్ప యుక్తి సేసి నావురా" అని చిరునవ్వు నవ్వాడు. తరువాత నలువురూ కలిసి గొడ్డళ్ళతో దాన్ని చీరి నాగయ్య అనుజ్ఞమీద తలో యింత యిళ్ళకి పట్టుకెళ్ళారు. మిగతా భాగాన్ని సంతకి బేరానికిచ్చాడు. తన యుక్తి, ధైర్య సాహసాలు చూపి సాధించిన ఆ వేట అనుకోనంత ధనాన్కి విక్రయించ గలిగాడు.



# పరధ్యానము

రచన-: "రాధిక"

అది తీయని పాట
మరువరాని—
ప్రియుని మాట
ఏమని చెప్పుదు
నా బాస.
నాడు పల్కిన చోట
నేడీ విధాన
కుమిలి కుమిలి
పురులు గ్రప్పి
నేడ్వ నేల.

*    *

హృదయ వీణ
అపస్వరాలు
హృదయేశ్వరుని
పలువరింతలు
మనసున
చికాకు కొలపి
అంత రాళమున
భగ భగ—
మంటలు కొల్పి
మాడిపోవనేల.

*    *

పల్కిన మాటే
పరధ్యానమై
జతగానితో
జగడమాడి
నా శిరముపై
నే శపించుకుని
హరించుకు పోతే—
చూచేవారెవరు?
సహించేవారెవరు?
కన్నీరు—
కార్చేవాడెరు?

*    *

నమ్మానని నమ్మించి
నాకు నీవేనని
ఒప్పించి—
చెలికానితో
శబద మాడినదంతా—
పరధ్యానంతో
ప్రేమంతా
పటాపంచలా??
హా విధీ!
ఏమిది?........
అది తీయని పాట
మరచిన
ప్రియుని మాట
ఏమని చెప్పుదు
నాకథ..........!!!



# ప్రబోధము

గో. రామకృష్ణారావు.

భారత వనితా
భవ్యసు చరితా
లేవోయి రావోయీ ॥లే॥
సోదరి వేమలకు
సౌఖ్యము కూర్చుటకు
వేగమె రమ్మోయీ ॥వే॥

వనితలకెల్లను విద్యను నేర్పగ
వలయును శిక్షను బోధనచేయగ
యువతీమణి రమ్మోయీ ॥యు॥
దేశప్రజల మేలుగాంచి
దేశసేవ చేయనెంచి
రమ్మ రమ్మోయి రమణీ ॥ర॥

# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

• శ్రీమతి కె. యమ్. సౌందర్యవల్లి •

కీర్తన-9

రాగం. కేదారం. రూపకతాళం.

ఆ. స మ గ మ ప ని స॑   అ. స॑ ని ప మ గ మ ద మ గ రి స

ప॥ స్వామిపాదపూజసేయ సమయమిదే ॥స్వామి॥

అ॥ కామితార్థములనొసంగు, నామామృత తత్వముదెలియు ॥స్వామి॥

చ॥ భువనమోహనగానంబున, అవనిజాప్రాణనాధు
స్తవముసేయకలియుగమున, అవతరించిన త్యాగరాజ ॥స్వామి॥

| 0-2 | 1-4 | 0-2 | 1-4 |
|---|---|---|---|
| ప॥ ; సా | సా సా గా మా | పా మా | మా గా గ రి సా |
| స్వా | మి పా . ద | పూ జ | సే . . . య |
| ; ని̣ స | ధా̣ నీ̣ సా ; | | |
| స మ | య మి దే . | | |
| ; సా | సా స మ గ మ ప ని | ని సా॑ ని | ప మ మ గ గ రి సా |
| స్వా | మి పా . . . ద . | పూ . . | జ . సే . . . య |
| ; ప స | స స రి రి గా సా | | |
| స॑ మ | య మి . దే . . | | |
| అ॥ ; గా | మా పా నీ పా | పా సా॑ | నీ సా॑ ; సా॑ |
| కా | మి తా . ర్థ | ఫ ల | మొ సం గు |
| సా ; . | రి సా ని పా మా | గ మ ని ప | ప మ మ గ గ రి సా |
| నా | . మా . మృ త | త . త్వ . | ము తె . లి . యు . |
| సా . | | | |
| స్వా . . | | | |
| చ॥ ; గ మ | ప ని మ పా మ గ గ | రీ మా | మ గ గ రి సా సా |
| భు వ | న . మో . . న . | గా . | న ం . . బు న |
| ; ప స | ప ప ప మా గ గ రి | సా నీ̣ | సా ; సా ; |
| అ వ | ని జా . . . . . | ప్రా ణ | నా ధు |

స్తవము సేయకలియుగమున
అవతరించిన త్యాగరాజ ॥స్వామి॥

# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

## కీర్తన-10

కాంభోజి రాగం - ఆదితాళం.

ఆ. సరిగమపదస   అ. సనిదపమగరిస

ప॥ పామర హితముగా బాడిన త్యాగగురు
పదములు గొల్వగ రారే!

అ॥ భూమిజ జానకీ చిత్తచోరుడౌ
రామునిగుణముల, రక్తికల్గునటుల ॥పా॥

చ॥ మరి మరి రఘువరు, మానసమున నిల్పి
పరి పరి విధముల, పదభజనము సల్పి
గురుతరముగ నాద సుధ గ్రోలగదెల్పి
కరమరుదుగా భక్తి, కలుగగ పురికొల్పి ॥పా॥

| 0-2 | 1-4 | 1-4 |
|---|---|---|
| ప॥ ; సా రీ గ మా పా దా స సా | ; నీ నీ ద ప | ప ప మ గ గా మమ |
| పా . మ ర హి త ము గా | బా . డి న | త్యా . గ . గు రు |
| గ రి సా రీ గ మ గ గ రి మ గ రి స స | ; పా దా సా | ॥ ॥ |
| . . ప ద ము లు . గొ . . . ల్వ గ | రా . రే | ॥ ॥ |
| అ॥ ; మ గ పా దా సా స రి గా మ రి | ; రీ గ రి సా | స ని రి స నీ , ద |
| భూ . మి జ జా న . కీ . . | చి త్త చో . | రు . డౌ . . . |
| ; ప ద రీ సా స స ని ద మ గ ప ద | సా మ పా ద పా | ప ప మ గ గ రి రి రి |
| రా . ము ని గు . ణ . ము . ల . | . ర . క్తి గ | ల్గు . న . టు . ల . |
| గ స ॥పా॥ | | |
| . . ॥పా॥ | | |
| చ॥ ; ద సా ని దా దా దా నీ దా | ; దా నీ దా | ద పా నీ ద పా |
| మ రి మ రి ర ఘు వ రు | మా న స | ము న ని ల్పి , |
| ; గ మా ప దా నీ దా ప మ గ మ | ; గ మా ప దా | ద సా ని నీ దా |
| ప రి ప రి వి ధ ము . . ల | ప ద భ జ | న ము . స ల్పి |

అ. ప. వలె,

గురుతరముగ నాదసుధ గ్రోలగదెల్పి
కరమరుదుగ భక్తికలుగగ పురికొల్పి ॥పా॥

# కిన్నెర

## సచిత్ర మాసపత్రిక

ఎడిటర్: పందిరి మల్లికార్జునరావు ★ అసిస్టెంట్ ఎడిటర్: పందిరి మీరాబాయి

ఆంధ్రాభ్యుదయానికి కంకణంకట్టుకున్న పత్రిక కిన్నెర. ఆంధ్ర జనానీకం పత్రిక కిన్నెర. ఆంధ్ర సేవకై పుట్టిన పత్రిక కిన్నెర. మన సంఘం, మన ఆర్థిక జీవనం, ఈ విషమ పరిస్థితులలో ఏవిధంగా పునర్నిర్మాణం కావలసిందీ, మన జీవిత సమస్యలూ, వాటిని యెట్లా పరిష్కరించ వలసినదీ వర్ణించే హృదయంగమములైన కథలతోను వినోదాన్ని, విజ్ఞానాన్ని చేకూరుస్తుంది కిన్నెర.

భాష సాహిత్యం, శిల్పం, కళ, ఆర్థిక రాజకీయ విషయాలు, శాస్త్ర విషయక వ్యాసాలు, కథలు, నాటికలు మొదలైనవాటితో సర్వాంగ సంపూర్ణంగా ముచ్చటైన ఆకారంతో ప్రకటింపబడుతుంది.

విడి కాపీ 6 అణాలు —— సంవత్సర చందా 4 రూపాయలు.

మేనేజరు కిన్నెర, 16, జోన్సు స్ట్రీట్, మదరాసు-1.

---

## మన నైజగుణాలలో మార్పు రానినాడు, రాజ్యాంగ చట్టములో భద్రపర్చిన

# ప్రాథమిక హక్కులు గగన కుసుమాలే ఔతాయి.

శ్రీమతి వారణాసి యశోదాదేవి, ఎమ్.ఎ., ఎమ్.లిట్., డి. లిట్.

ప్రపంచంలో మానవునకు సహజముగా వుండవలసిన హక్కులను ప్రాథమిక హక్కులందురు. ఇవి కొన్ని దేశములలో, ముఖ్యముగా ఇంగ్లండులో, చట్టరూపమున లేకున్నను, కాలక్రమాగత పద్ధతుల వలన ప్రజలు వానిని ప్రపంచములో అందరికంటె యెక్కువగా అనుభవిస్తున్నారు. ఫ్రాన్స్, బెల్జియం, స్విట్జర్లాండ్ మొదలగు ఐరోపియను రాజ్యములలో ప్రాథమిక హక్కులు చట్టములో చెప్పబడి యున్నవి. కాని, యివి ఆచరణలో ఆకాశపు పుష్పములే. ఇవి అమలు జరుపుటలో లోటు వచ్చిన ప్రజలకు ప్రభుత్వమునుండి రక్షణ లేదు. అమెరికా సంయుక్త రాష్ట్రముల రాజ్యాంగములో ప్రాథమిక హక్కులు సవ్యముగా నున్నవి. ఇందు ప్రజలకు ప్రభుత్వపు నిరంకుశత్వము నుండి రక్షణయు గలవు. ఇచ్చట ప్రభుత్వము, సుప్రీంకోర్టు, శాసనసభలు, సరిసమానమైన బలము కలిగి యున్నవి.

స్వతంత్రభారత రాజ్యాంగ చట్టము 1949 సం॥ నవంబరు 26 వ తేదీన అమలులోనికి వచ్చినది. ఇందలి 22 భాగములలో మూడవ భాగములో 13 నుండి 36 వరకు గల క్లాజులలో ప్రాథమిక హక్కులు అన్నియు యిమడ్చబడి యున్నవి. న్యాయస్థానము, ప్రభుత్వము పట్ల మత, జాతి, కుల, లింగస్థల బేధములులేని సమత, ప్రభుత్వ వుద్యోగములకు సమాన అవకాశములు, అస్పృశ్యత లేకుండుట. సైనిక, సారస్వత సంబంధమైనవి తక్కయితర బిరుదులు ప్రభుత్వము యియ్యకుండుట, 14 యేండ్ల లోపు పిల్లలు గనులు, కర్మాగారములలో పని చేయరాదను నియమము, మానవునకు వ్యక్తి స్వాతంత్ర్యమువై స్వేచ్ఛ, మత విషయములలో స్వేచ్ఛ, మతాధిపతులకు సంస్థలు స్థాపించు హక్కు, ప్రభుత్వ సంస్థలలో మత బోధ యొంచరాదను నియమము, మైనారిటీల రక్షణ, హక్కులు--- యివియే మన ప్రాథమిక హక్కులు. అత్యవసరమైనప్పుడు యీ హక్కులను పాటింపకుండుటకు ప్రభుత్వము హక్కు కలిగి యున్నది. ఈ రాజ్యాంగమునకు బైట మనకు హక్కులు లేవు కాని, అమెరికాలో రాజ్యాంగ చట్టమునకు 9 వ అమెండుమెండు ప్రకారము, రాజ్యాంగమునకు బైట కూడ ప్రజలకు ప్రాథమిక హక్కులు కలవు. జర్మన్ రాజ్యాంగములో 144 ఆర్టికల్ లోవలె మన చట్టములో మానవుని స్వేచ్ఛకు సంబంధించిన హక్కులను శాసన సభలకు వదిలి వేశారు. అమెరికాలోవలె మన దేశములో కోర్టులకు శాసనసభలపైన అధికారములేదు.

మన రాజ్యాంగ చట్టము అమలులోనికి వచ్చి రెండేండ్లు పైన యైనది. ఒక సంవత్సరము లోపుగానే ప్రాథమిక హక్కులకు ఒక అమెండుమెంటు వచ్చింది. ప్రభుత్వమునకు, కోర్టులకు యీ హక్కుల విషయమై వివాదములు పొడసూపుచున్నవి. మన రాజ్యాంగ పరిషత్తులో ప్రాథమిక హక్కులకై మిక్కుటముగ పోరాడిన పెద్దలే యిప్పుడు- అవి రాజ్యాంగమునకు అడ్డు వచ్చుచున్నందున- తామే విచారిస్తున్నారు. రాజ్యాంగ చట్టము యిప్పటి వరకు అమలు లోనికి రాకుండా వున్నట్లయితే ప్రాథమిక హక్కులు అందులో వుండి వుండవని కొందరి వూహ. కాని యేసంగతి యైనను వూహించటం, చెప్పటంకంటె ఆచరణలో పెట్టటం కష్టమని అందఱకు తెలిసినదేగదా! అదేవిధముగా ప్రభుత్వముకూడ నూతన చట్టములను అమలులో పెట్టినప్పుడు ప్రజలలో కొంత కలవరము, తిరుగుబాటు యెదుర్కొనవలసివస్తుంది. కాని అడ్డంకులను దాటి పురోగమిస్తూ వస్తే, కాలక్రమాన ప్రజలలో మార్పు, శాసనముల ఫలితము దక్కుతుంది. అంతవరకు, ప్రభుత్వము ప్రజా విమర్శనలు గమనిస్తూ ముందంజవెయ్యాలి.

సైనిక, యుద్ధసంబంధమైన చట్టములలో తప్ప, సాంఘిక, మత, నైతిక, రాజకీయ, వ్యక్తిగతమైన శాసనములన్నింటిలోను, శాసనము అమలులోకి రాగానే, పరిణామము కనవడదు. ప్రజలందరూ దానిని పాటింపరు. కొందరు వుల్లంఘించుటకు కూడ ప్రయత్నింతురు. సామాన్య ప్రజలకు శాసన వివరములు అర్థమై వారు అవలంబించుటకు కొంత వ్యవధి అవసరము. అందులోను అనేకవిధములైన బేధములుగల మనదేశములో అట్టి

వ్యవధి మరింత అవసరమైయున్నది.

శాసనరీత్యా కాకుండానే దేశంలోనే మార్పులురావచ్చు. కాని యిట్టి మార్పులు బహు నిదానంగా జరుగుతాయి. దేశం మొత్తంమీద ఒక్కరీతిగా రావు. ప్రజలలో ప్రచారము తోడుగా చట్టమువలన యేదైన మార్పు వచ్చుటకు సుమారు 5, 6 యేండ్లు పట్టిన, ప్రజలలో శాసన సహాయము లేకుండా మార్పు రావలెనన్న దాదాపు 15 యేండ్లు పట్టునని చెప్పవచ్చును. విషయము మహత్తరము, పరమ పవిత్రమైనగాని, ప్రజలలో చలనము వక్కరీతిగా కలగదు. స్వరాజ్య సంపాదన అన్న మహద్విషయము మహాత్ముని వంటి నాయకుని నాయకత్వమున, సామాన్య ప్రజానీకాన్ని చట్టము అవసరము లేకుండా వక్క త్రాటిని కట్టగలిగింది. కాని చిన్న సంస్కరణలకు, శాసన సహాయములేకపోతే, ప్రజలలో గొప్ప చలనము రాదు.

నైజ గుణములో మార్పుకు తోడు చట్టము చేయడం కూడ తోడ్పడుతుంది. బ్రిటిషు ప్రభుత్వము మనదేశంలో చాలా చట్టాలు తెచ్చింది. ఆ చట్టములు, మిషనరీల ప్రచారము, కాలక్రమమున దేశంలో అనేక సంస్కరణలు తెచ్చినవి. ఉదాహరణములుగ, సహగమన నివారణ చట్టము, వివాహ సంబంధమగు చట్టములు చెప్పవచ్చును. ప్రభుత్వము విక్టోరియా రాణి ప్రకటన తర్వాత తాము సాంఘిక మార్పులలో కలుగచేసి కొననన్నది. అటు తర్వాత మన దేశంలో శాసన సభలు కొన్ని సంస్కరణలు ప్యాసు చేసినవి. వాటిలో ముఖ్యముగా శారదా చట్టమును వుదహరించవచ్చును. దానివల్ల అప్పట్లో దేశమంతటా గగ్గోలు పుట్టింది. శ్రోత్రియులు మతం మంట గలిసిందన్నారు. చెట్లకిందా పుట్టల కిందా పసిపాపలకు సహితం వివాహ తంతు నడిపించారు. కాలక్రమాన జనులలో వుడుకు చల్లారింది. శారదా సవరణ చట్టంతో ప్రజలలో మార్పు బాగా వచ్చింది. మారు మూల పల్లెలలో యిప్పటికీ రహస్యముగా బాల్య వివాహాలు జరుగుతూవుండవచ్చును. కాని సామాన్య ప్రజలందరు ఆ శాసనము యొక్క వుపయోగాన్ని, ప్రయోజనాన్ని పొందుచున్నారనుట నిర్వివాదాంశము. అదేవిధంగా మన దేవాలయాలు, మతసంస్థల విషయము తీసికోవచ్చును.

మనుష్యులలో మార్పు వచ్చుటకు కొంత నిర్బంధం అవసరము. ఆ నిర్బంధము శాసన రీత్యా జరగాలి. వుదాహరణగా అస్పృశ్యతా నివారణ ప్రచారము దేశంలో యిప్పటికీ 30 యేండ్లు పైగా వున్నది. కాని రాజ్యాంగ చట్టములో యిమడ్చబడిన తర్వాత దాని విలువ యితోధికమైనదనుట నిస్సందేహము. ఇటీవల శ్రీ శ్రీకంఠగారు శాసనసభలో చెప్పినట్లు తగిన ప్రచారము వుంటే, అంటరాని తనమును ప్రభుత్వ తోడ్పాటుతో, శాసన భయముతో మరో శతాబ్దములో రూపు మాపవచ్చును.

కాబట్టి మన ప్రాథమిక హక్కులు యింకను బలపడవలెనన్ననూ, ఆచరణలో మిధ్యకాకుండా వుండవలయునన్న ప్రజలలో బాగా ప్రచారం జరుగవలెను. ప్రజలు వాటిని బాగుగ అవగాహన చేసికోవాలి. ప్రజాభిప్రాయము బలవత్తరమైన పక్షమున, ప్రభుత్వముగాని, శాసనసభలుగాని యెదురాడుటకు జంకును. వ్యక్తిస్వాతంత్ర్యమునకు సంబంధించిన ఆర్టికలు 19 కు యిటీవల సవరణ వాక్స్వాతంత్ర్య విషయమై గొప్ప మార్పు తెచ్చింది. ప్రభుత్వమునకు, రాజ్యాంగమును నడపుటకు ఇట్టి చిన్న మార్పులు అవసరమగుచుండును. కాని అదే పనిగా అమెండుమెంట్లు ప్యాసుచేస్తూవుంటే రాజ్యాంగ చట్టము విలువ తగ్గుతుంది. కాబట్టి తప్పనిసరియైనప్పుడే అట్టి పద్ధతులు అవలంబించాలి. ప్రాథమిక హక్కులు ప్రభుత్వము నిరంకుశమైనప్పుడు ప్రజలకు రక్షణ యిచ్చును. కాని ప్రభుత్వమునకు వ్యతిరిక్తముకావు. ఈ హక్కులు ప్రజలలో నీతిని అణకువను గొక్కువ చేయును. ఈ దృష్టితో శాసనము ద్వారా సిద్ధించిన హక్కులు అమలు జరుపుటకు ప్రజల గుణాలలో మార్పుకూడ అవసరమే.

(రేడియో ప్రసంగం)



# ★ సమాధానం ★

• శ్రీ డి. సూర్యం •

ఈ ప్రశాంత వాతావరణంలో నీలేఖకు సమాధానం వ్రాయాలనుకున్నా. నాభర్తకూడ నాతోనే ఉన్నారు. మా నిత్యజీవితంలో సాయంత్రం ఈ సముద్రతీరం దగ్గర కొన్నిగంటలు వ్యయం చెయ్యడం మాకు అలవాటైపోయింది.

నువ్వు చెబుతావు "నేను చాలా అందంగా ఉంటా"నని. "లోకం చెబుతుంది నేను బాగా పాడుతా"నని. మధు నాలో ఉండే ఈ రెండు గుణాల్ని చూచే స్నేహం చేశాడు. ఆనాటి స్నేహమే ఈనాడు మమ్మల ఇద్దర్నీ జీవితంలో భాగస్వాములుగ జేసింది. నా వివాహం అయినప్పనుంచి నన్ను నీకు తెలుసు. అందుచేతనే చాలాసార్లు ప్రశ్నించావు. "నువ్వు గ్రుడ్డివాడిని ఎందుకు పెండ్లాడావు?" అని. ఆ ప్రశ్న నన్ను చాలా బాధ పెట్టేది. ఆ ప్రశ్నకు సమాధానం ఎన్నోసార్లు ఇవ్వాలనుకున్నా. ఇయ్యలేకపోయా. ఆ ప్రశ్న నువ్వేకాదు మధు వెనుకటి జీవితం తెలియని చాలామంది ప్రశ్నించారు. ఏఒక్కరికీ సమాధానం ఇయ్యలేకపోయాను. కొన్ని కొన్ని ప్రశ్నలకు అసలు సమాధానాలుంటాయని నేను అనుకోను.

మధుతో నాకు పరిచయం అయినప్పటినుండి నాకు జీవితంమీద 'ఆశ' అనేది జనించింది. ఆ ఆశావృక్షం చిలువలు పలువలు వేసుకొని మిస మిసలాడే నిండు యౌవ్వనంలో తొణికిసలాడుతూంటే తుఫాను దానిమీద కసి తీర్చుకుంది. మోడువారి జీవనంలేని వృక్షంలా మిగిలిపోయింది. ఆ వృక్షాన్ని ఏ కళాకారుడో గుర్తిస్తాడు. సామాన్య మానవునకు మోడువారిన వృక్షంలా కనబడుతుంది. అతను అలా అనుకుంటాడు.

ఈనాడు మధు ప్రపంచాన్ని చూడలేడు. కాని అతని హృదయంలో ఉండే నయనద్వయాలతో ప్రపంచాన్నే కాదు, అందలి నిగూఢ భావాల్ని కూడ అవగాహన చేసుకుంటాడు. ఈనాడు ఘోషచేసేసముద్రం ఎలా వుంటుందో అతను చూడలేడు. ఊహించి గీతాలాపన చెయ్యగలడు. ఎదురుగా కనిపించే ఆకాశం నీలంగా వుంటుందో పచ్చగా వుంటుందో తెలియదు. కాని ఒక నాడు ప్రకృతినంతా అతని గదిలో నాలుగు గోడలమధ్య బంధించాడు. ప్రకృతి యంతా పచ్చటి తివాచీలలా, ప్రజల్ని మెరిపించే వ్యక్తుల్లా అతని గదిలో పాతుకు పోయింది. బల్లమీద ఉండే ప్రతికుంచె అతని చేతిలో ఇరుక్కోవాలని ఉవ్విళ్లూరుతూండేవి. అతడు వాటన్నిటికి జానిస, సర్వాధికారి. "అతనికోసం కుంచెలు, కుంచెలకోసం అతను జీవిస్తున్నారా-" అని అనిపిస్తుంది. అతనంటూండేవాడు "రీటా! ఈ కుంచెలు నాతో మాట్లాడుతాయి"- అని. నన్ను అతను ఎన్నోరూపాల్లో చిత్రించాడు. ఆగదిలో ప్రతిమూలా దొరుతూ ఉండేవి. వాటిని చూస్తే నాకు కోపం, సిగ్గు, సిగ్గుతో కూడుకున్న కోపం వచ్చేవి.

"రీటా! సృష్టికర్త తన నైపుణ్యాన్నంతా ఉపయోగించి, నిన్ను సృషించాడు. లోకం నీ అందాన్ని చూసి మురిసిపోతుంది. నీ అందాన్ని చూచే నీకు దాసుడినయ్యా. ఈనాడు నా రీటాని నేను సృష్టించుకున్నా. నా రీటాల కన్నుల్లో నృత్యంచేసే అందాన్ని చూడు. రీటా! ఈ రీటాలన్నీ నావి" అని ఆ రీటా చిత్రాలన్నిటిని నాకిచ్చేశాడు.

అతని మాటలు మధురంగా మృదువుగా నిర్మలనదీ ప్రవాహంలో ప్రవహిస్తాయి. ఆ మాటలు, నన్ను, ఆ చిత్రాన్ని, నా సర్వస్వాన్నీ మరచిపోయేటట్లు చేశాయి. కవితాకన్య అతని నాలుకమీద, గజ్జెలు కట్టుకొని ఘల్లు ఘల్లున నాట్యం చేసేది.

పెళ్లికాక మునుపే మమ్మల్ని భార్యా భర్తలనుకునేవారు. నేను లేకుండా అతను ఏ 'ఒపేరా'కు వెళ్లేవాడు కాదు. నాతో చెప్పకుండ ఏపనీ చేసేవాడుకాదు.

మా ఇరువురి భావములలో ఏవిధమైన తేడా లేదు. నేను చెప్పిన ప్రతీదీ కాదనడు. కాని నన్ను 'రీటా' అని ఎందుకు పిలుస్తున్నాడో తెలిసేదికాదు. అందులో ఏదో నిగూఢమైన భావం ఉండాలి. లేకపోతే అతను అంత చులకనగ మాటలను ఉపయోగించడు. ఎన్నో సార్లు తెలుసుకోవాలని ప్రయత్నించా. "ఏం? 'రీటా' అనే పదం నిన్ను బాధ పెడుతోందా?-" అని అతనంటే తిరిగి సమాధానం చెప్పలేకపోయేదానిని. అతను ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడుతాడు. ఆ నవ్వుముఖం చూస్తే అతనికి విచారమంటే ఏమిటో తెలియదని, అసలు

విచారమనే పదం లేనేలేదని అనిపిస్తూండేది నాకు. నేను రీటాగురించి ప్రస్తావన తెస్తే విచారం ఎరుగని అతని ముఖంలో విషాదరేఖలు కనబడేవి. వాటిని నేను భరించలేకపోయేదాన్ని. అవి నన్నెంతో భయపెట్టేవి. తిరిగి అతని వంక చూడలేక పోయేదాన్ని. ఏదో తప్పు చేసినట్లుగా బాధపడేదాన్ని. "అతని నాప్రశ్న ఎప్పుడూ ప్రశ్నించకూడదు" అని అనుకునేదాన్ని.

ఒకనాడు 'ఒపేరా'లో ఆంగ్లచిత్రం చూడటానికి వెళ్లాం. అలా అతనితో ఆంగ్లచిత్రాలు చూడటానికి నాకు పరిపాటై పోయింది. అతనితో చిత్రాలకి వెళ్ళడమంటే నాకెంతో ఇష్టం.

ఆచిత్రంలో కథానాయకి పేరు రీటా. ఆమె నర్తకిగా కనబడుతుంది. కారణాంతరాలవల్ల ఆమె చంపబడు తుంది. అది ఆ చిత్రంలోని ఇతివృత్తం

ఆ చిత్రం చూస్తున్నంతసేపూ నాతో ఒక్క మాటైన మాట్లాడలేదు. అతను అట్లా ఎప్పుడూ ఉండేవాడు కాదు. సినిమా పూర్తి అయిన తరువాత బాధగా లేచాడు. బీచికి వెడదా మన్నాడు. ఎదురు చెప్పలేకపోయాను.

చాలా ప్రశాంతంగా ఉంది సముద్ర తీరం. ఏదో మాట్లాడటం మొదలు పెట్టాడు. అతని ధోరణంతా పూర్తిగా మారిపోయింది. అతను నాదగ్గర ఆవిధంగా మాట్లాడటం ఇదే ప్రప్రథమం. ప్రతీమాట విచారంలో శిరస్నానంచేసి వస్తున్నట్లున్నాయి. ముఖంలో పూర్వపు కళ లేదు. అతను మధు కాదేమో అని అనిపించింది. ఎప్పుడూ ఆనందాన్నిచ్చే సముద్ర ఘోష ఆనాడు నన్ను భయపెడుతున్నట్లనిపించింది. నా మనస్సును సమాధాన పరుచుకోలేకపోయాను. పాట పాడమన్నాడు. తిరిగి ఈ ప్రపంచంలోకి వచ్చాడనుకున్నాను. పాడాను. చాలా సేపటికి "చాలా బాగుంది నీ పాట రీటా!" అన్నాడు. 'రీటా ఎవరు?' అని తిరిగి ప్రశ్నించాలనుకున్నా. ధైర్యం చాలలేకపోయింది.

"రీటా! నిన్ను రీటా అని ఎందుకు పిలుస్తానో తెలుసునా?" అన్నాడు నా సమాధానం కోసం ఎదురు చూడకుండా. అతను అలా చంద్రునికేసి చూస్తూ భారంగా "నా రీటా చనిపోయింది, ఆమె అలా చెప్పకుండా చని పోతుందని అనుకోలేదు. ఆమెతో చేతులు కలిపి నృత్యం చేశా. ఆమె నా రీటా, ఆమెచనిపోయింది, కాని ఎవ్వరూ చంపలేదు." అన్నాడు. చంద్రకాంతిలో అతని కళ్లనుండి రాలే కన్నీళ్లు ఆణిముత్యాల్లా మెరిశాయి. "రీటా! ఆమె జ్ఞాపకార్థం నిన్నా పేరుపెట్టి పిలుస్తూంటాను. నీకావదం బాధ కలిగిస్తుందా" అన్నాడు. నేను మాట్లాడ లేకపోయా.

తరువాత తిరిగి రీటా ప్రస్తావన రాలేదు. పూర్తిగా నా పేరేమిటో మరచిపోయా.

మేము పెళ్లి చేసుకోవాలని స్థిరపరచుకున్నాం. అనాటి నుండి మా జీవితం నూతన మార్గాన్ని అన్వేషించింది. అనుకోని అవాంతరం వచ్చిపడింది. అతను దారుణమైన స్ఫోటక వ్యాధికి గురి అయ్యాడు. ఆ స్ఫోటకానికి తన రెండు కళ్లూ బహూకరించుకున్నాడు. అతనేమీ బాధ పడ లేదు. ఇదివరకు వలెనే నవ్వుతూ మాట్లాడుతూ ఉండే వాడు. నాకుమిగిలిందల్లా విషాదమే. మధు నన్ను చూడ లేడు. నా కళ్ళని వర్ణించ లేడు. నాపెదవులపై చిరు నవ్వుని నాట్యమాడించలేడు.

"రీటా! నువ్వు నిజంగా ఇదివరకులా అందంగా వున్నావా? నీ కళ్ళు నా రీటాలలా ఉన్నాయా? నా రీటాల కళ్ళు మెరుస్తున్నాయా? ఆకాశం ఇదివరకులా నీలంగా ఉందా? ఇప్పుడు వెడితే సముద్రతీరం నన్ను గౌర విస్తుందా? ఇంక నా జీవితంలో నాకుంచెల నుపయోగించ లేనా? నువ్వైనా నాతో మాట్లాడుతూంట రీటా! ఇక నువ్వురావు నాదగ్గరకు. నన్ను ఒంటరివాణ్ణి చేసి వెళ్ళి పోతావు. రీటా! వెళ్ళిపో, ఎక్కడికో, ఎప్పుడో, ఎక్కడో ఆనందంగా............" అని ఇంక మాట్లాడ లేకపోయాడు. ఆమాటలు నాకు బాణాల్లా గుచ్చుకున్నాయి. నా నోట మాట రాలేదు. నేను మాట్లాడ గలననే సంగతి కూడా మరచిపోయాను.

మరునాడు నేను మధుని పెండ్లాడాను. మొదట్లో వివాహ మాడటానికి నిరాకరించాడు. తరువాత అందరి మధ్య నన్ను గౌరవించాడు. చాలామంది మధు పూర్వ జీవితం తెలియనివారు మా వివాహానికి ఆశ్చర్యపోయారు. తెలుసున్నవారు ఆనందించారు. ఆనాటినుండి మే మిద్దరం జీవితంలో భాగస్వాములమయ్యాం. మధు కళ్లు లేకపోయినా బాధపడేవాడుకాడు. కాని అప్పుడప్పుడు "నేను రీటాను సృష్టించలేను. సృష్టికర్త తన కోపాన్నంతా ఈ విధంగా

(తరువాయి 32-వ పేజీలో)

# ★ ఆత్మకథ ★

రచన :

శ్రీమతి నాయని స్వప్నకుమారి

వెనుకటిగాథ :—శశి కాలేజీ నుండి వచ్చేసరికి ఆమె సోదరుడు, సుధాకర్ ఆమె చేతికి శుభలేఖ నొకటి అందిస్తూ, "రామారావుగా రమ్మాయి పెళ్ళట, ఎవరక్కయ్యా?" అని కుతూహలంగా అడిగేడు శశి. ఆ కవరు విప్పి చూచి సంతోషంతో తమ్ముడికి కథంతా చెప్పడం మొదలుపెట్టింది.

"నాన్నకి ఉద్యోగం లేక చాలా బాధపడుతూవుంటే రామారావుగారు మమ్మల్ని ఆదరించి వారింట్లో పెట్టుకున్నారు. నాన్నకి 60 రూ॥ ఉద్యోగం యిప్పించేరు. ఆయన ఎప్పుడూ దిగులుగా వుండేవారు. జీవితంపైనే ఆశ వుండేదికాదాయనికి. వీరి పరిస్థితిని చూస్తే నాన్న, అమ్మ యింత బీదస్థితిలోకి రావడానికి కారణం తెలిసేదికాదు నాకు. ఒకనాడమ్మనడగ్గా ఈవిధంగా చెప్పింది అమ్మ."

"నా చిన్నతనాన్నే తల్లి చనిపోయింది. మా నాన్న నన్నెంతో గారాబంగా చూచేవారు. అమ్మ చనిపోయిందన్న బెంగతో నాన్న దిగులుగా వుండేవారు. తాతగారి బలవంతంపై నాన్నకు మరో వివాహం చేసేరు. మారుటి తల్లి బాధలతో నా ప్రాణం విసిగేది. అప్పుడు రామారావుగారు మా యింటి కెదురుగా వుండేవారు. ఆయన నా బాధలన్నీ చూచి వారింట్లో ఉన్న మాధవరావుగార్కి నన్నిచ్చి వివాహం చేయాలన్న వుద్దేశ్యంతో మాధవరావుగారిచే నాకు వుత్తరాలు వ్రాయించేవారు. ఈలా వుండగా ఒక రోజు నాన్నగారు ఒక సంబంధాన్ని నిశ్చయించి వార్ని వివాహమాడుటకు నిశ్చయించేరు. కాని నా కిష్టంలేదని స్పష్టపరచి, లోగడ మాధవరావుగారు వ్రాసిన వుత్తరాలు జ్ఞప్తికి తెచ్చుకొని ఎలాగైనా, ఎంత బీదవాడైనా ఆయన్నే వివాహమాడాలని నిశ్చయించుకొని, నా నిశ్చయాన్ని వుత్తరం ద్వారా రామారావుగారికి తెలియజేశాను." ఇదీ జరిగినకథ. ఇక చదవండి.

ఆ భయంకర రాత్రి నన్ను భయపెడుతూనే అంతమొంది తెల్లవారింది. పక్షుల కల కలా రావాలు అప్పుడప్పుడే ఉదయించడానికి సిద్ధమైన సూర్య భగవానుని ఎఱ్ఱని కాంతిలో ఉడి శోభ చాలా అందంగా ఉన్నయ్. ఉత్తరం యెట్లా పంపించాలా అని ఆలోచిస్తున్నాను.

నాన్నగారొచ్చి బుజంమీద చేయివేస్తూ "ఇష్టపడమ్మా!" అంటున్నారు. నేను తల ప్రక్కకు త్రిప్పి మాట్లాడకుండా ఊరుకొన్నాను.

ఇంతలో "ఆదేమే మొద్దులాగ సమాధానం చెప్పవేం?" అంటూ ప్రవేశించింది నాయకురాలు మా పినతల్లి.

"నాఅభిప్రాయం నిన్ననే చెప్పానుగా!" ముక్తసరిగా సమాధానమిచ్చాను. "ఆ! అభిప్రాయం ఇంకా మార్చుకో లేదా?" కర్కశంగా నాన్నగారు ప్రశ్నించారు.

"లేదు!" నిర్లక్ష్యంగా సమాధానమిచ్చాను.

"నీ భవిష్యత్తును గురించి ఆలోచించావా!" కోపంగా అన్నారు.

"అన్నీ ఆలోచించే సమాధానం చెప్తున్నాను. నా కంఠంలో ప్రాణముండగా మీరిద్దరే కాదు ఈ లోకమంతా యేకమైనా నన్ను ఆ దౌర్భాగ్యుడి కిచ్చి చెయ్యలేరు. నేను చచ్చిన తరువాత నా శవానికి, అతణ్ణి కట్టాల్సిందే. ఇది మాత్రం నిజం. బాగా ఆలోచించి మాట్లాడుతున్నాను. నేను బాగా ఉండాలంటే ఈ సంబంధాన్ని వప్పుకోకండి. ఇప్పటికింకా మించిపోలేదు నాన్నా! మీరు పెద్ద చదువు చదివారు. పిన్ని చదువు లేనిది. ఆమెకు నచ్చచెప్పి వప్పించే శక్తి మీకున్నది......" నా మాటలు పూర్తి కాకుండానే నాన్న చాలా కోపంగా "వ్యర్థ ప్రసంగం చాలించు. పిన్ని చెప్పినట్లు అతన్ని పెండ్లి చేసుకుంటే సరే, లేకపోతే నిన్ను ఇంటినుండి కదలనీయను. చావడానికి కూడ వీలు లేకుండా చేస్తాను. ఈ రోజునుండి బడి మానేసెయ్" రూక్షంగా అని వెళ్ళిపోయారు.

ఇవన్నీ నాబుఱ్ఱ కెక్కలేదు. నా ఆలోచనంతా ఉత్తరం చేరవెయ్యడ మెట్లాగా అని.

గడియారం 8-30 గం॥ లు కొట్టింది. తలుపు తెరుచు

కుని బైటికి వచ్చాను. నాన్న లేరు, బహుశా 'డిస్ పెన్ సరీ'కి వెళ్ళి ఉంటారు. పిన్ని లోపల వున్నది. బయట తలుపు తీసి చూచాను. మాధవరావుగారి రూమువద్ద ఎవరో కుఱ్ఱవాడున్నాడు. ఆ అబ్బాయిని పిలిచాను. తీరా చూస్తే నాకింతకుముందు ఉత్తరాలందిచ్చిన కుఱ్ఱవాడే. నన్ను చూడగానే పరిగెత్తుకుంటూ వచ్చాడు. నా చేతి కవరు ఆ అబ్బాయికిచ్చి, "రామారావుగారి" కిచ్చి తిరిగి సమాధానం తెమ్మన్నాను. వాడు పరుగెత్తాడు.

ఆ ఇంట్లోనే "వెంకయ్య" అనే నౌకరున్నాడు. చాలా మంచివాడు. అమ్మ పోయిన దగ్గరనుండి నన్ను ఒక కంట కాపాడుతూ వచ్చాడు. ఇంట్లో జరిగే దంతా వాడు చూస్తుండే వాడు. ఆ రోజు సాయంత్రం రామారావు గారి దగ్గరనుండి నాకు సమాధానమొచ్చింది. అందులో "నేనంగీకరించినందుకు చాలా సంతోషించారని, ఆ యమ బంధాలనుండి నన్ను రక్షించడానికి ప్రయత్నాలు చేస్తున్నారని, ఆ విషయాలు తరువాత తెలియచేస్తా"మని వ్రాసి ఉన్నది.

ఒక రోజున నాన్నగారు ఏదో ఊరు వెళ్లారు. పిన్ని ఎవరినో చూడ్డానికి వెళ్ళింది. ఇల్లంతా బావురుమంటూ ఉన్నది. నేను గదిలో కూర్చుని ఆలోచిస్తున్నాను. ఇంతలో "అమ్మా! సరోజినమ్మగారు!" అన్న పిలుపు వినబడింది. ఎవరా అని చూస్తే వెంకన్న. నన్ను కన్నతండ్రి కంటే ఆప్తుడుగా కంటికి రెప్పవలె కాపాడే పెంపుడు తండ్రి వెంకన్న. అతన్ని చూడగానే నాకండ్లవెంట నీటి చుక్కలు టపటప రాలినయ్.

"పిచ్చితల్లీ! ఏడుస్తున్నావా! కష్టకాలంలో ధైర్యంగా ఉండాలమ్మా. మీ విషయంలో చాలా అన్యాయం చేస్తున్నారమ్మా బాబుగారు. ఆమహాతల్లి సుశీలమ్మగారే బ్రతికుంటే మీరెంతసుఖంగా ఉండేవారమ్మా. మీకేదైనా సహాయం కావాలంటే చెప్పండమ్మా నేను చేస్తాను" అని అన్నాడు.

ఆమాటలు వినగానే "నిజంగా భగవంతుడు నన్ను రక్షించడానికి వెంకన్న మనస్సులో ప్రవేశించాడా!" అన్నట్లనిపించింది. వెంటనే నాకూ రామారావుగారికీ జరిగిన ఉత్తరాల సంగతి చెప్పి సహాయం చెయ్యమన్నాను.

"తల్లీ నేనిప్పుడే వెళ్ళి మాట్లాడి ఆలోచించి మీకు తప్పక సహాయం చేస్తా"నని చెప్పి వెళ్లిపోయాడు.

"మానవుల్లో మంచివారుకూడా ఉన్నారు. మంచివారే లేకపోతే నావంటి నిర్భాగ్యులెంతమంది మూర్ఖులైన తల్లిదండ్రులకు ఆహుతయిపోయేవారోకదా!" అని అనుకున్నాను.

పెండ్లి ప్రయత్నాలు చేస్తున్నారు. నెలరోజులుంది లగ్నానికి. ఆ రోజు శుక్రవారం తలంటి పోసుకుని తలార్చుకుంటున్నాను. వెంకయ్య చాటుగా నాగదిలోకొచ్చి "రామారావుగారిమ్మన్నారమ్మా ఈ కవ"రని యిచ్చి వెళ్లిపోయాడు. అందులో "వెంకయ్యతో కలసి ఆలోచించినట్లు. నేను వెంకయ్య యింటికి వస్తే అక్కడ రామారావు గారు కలుసుకుని నన్ను తీసుకుని వెళ్ళేటట్లు" ఉంది. బాగుంది, ఇంతకంటే నాకేమి కావాలి! ఆ పెండ్లి చేసుకునేదానికన్నా రామారావుగారి మాటప్రకారం నడచుకోవడం నాకు సబబుగా కనపడింది.

వెంకన్నతో వెళ్ళిపోవాలనే తోచింది. లోకం ఏమంటుందో అన్న ఆలోచన తట్టకపోలేదు అయినా దానికి ప్రాధాన్యం యివ్వలేదు. అప్పుడు తెలియలేదమ్మా ఈ ప్రపంచం నన్ను చూచి పరిహసిస్తుందని! ఆ యమయాతన నుండి బయటికి రావాలనే కోరికే నా చేత ఆ పని చేయించింది.

నేను వెంకన్నా మాట్లాడుకున్నాము 'ఆరాత్రి 12 గం॥లకు వెంకన్నతో వాళ్ల యింటికి పోయేటట్లు. అటునుండి అటే నాకోసం తపించే మాధవరావుగారితో వెళ్లేటట్లు' నిశ్చయించుకున్నాను. ఆ సంగతి వెంకన్న ద్వారా రామారావుగారికి కబురంపాను. ఇంట్లో వాళ్ళకు అనుమానం కలుగకుండా ప్రవర్తించాను. మా పిన్నితో నాన్నతో కలసి నవ్వుతూ మెలుగుతూ ఇంట్లో పని అందుకుంటూ ఉన్నాను. ఇదంతా చూచి పిన్ని చాలా సంతోషపడి "చూడండి మొట్టమొదట మొండికి తిరిగినా అమ్మాయి పరిస్థితులు అర్థం చేసుకుని దారికొచ్చింది! పిచ్చి పిల్ల దానికి మట్టుకు తెలియదూ! అమ్మ, నాన్న తన శ్రేయస్సు కొరకే చేస్తారని!" అని చేతులు త్రిప్పుతూ నాన్నగారికి చెప్పింది.

ఎప్పుడు 12 అవుతుందా? ఎప్పుడు ఆయింట్లోనుండి బయట పడదామా అన్న ఆలోచనతో గడియారం వంక చూస్తున్నాను! అనుకున్న సమయం రెక్కలు కట్టుకుని దగ్గరపడ్డది. ఇల్లంతా నిద్రలో మునిగింది. అన్నీ సక్రమంగానే ఉన్నాయ్.

ఇంతలో వెంకన్న బైట గేటు తీసుకుని ప్రవేశించాడు "అన్నీ సరిగ్గా ఉన్నవా?" సైగలతో అడిగాను. "అన్నీ బాగా ఉన్న"వని చెప్పాడు. అంతే తల్లీ! ఆ ఇంట్లో నుండి బైట పడ్డాను. ఆనరకకూపంనుండి తప్పించుకుని వెంకన్నా వాళ్ళ యింటికి వచ్చాను. అక్కడ నుంచి రామారావుగారు, మాధవరావుగారితో కలసి ఆ రాత్రికి రాత్రి రామారావుగారి ఊరికి వెళ్ళాము. పాపం వెంకన్న నేను వెళ్ళేటప్పుడు చాలా బాధపడ్డాడు. మాతో రమ్మంటే రానన్నాడు. జీవవాడైనప్పటికీ నాకెంతో సహాయం చేశాడు.

రామారావుగారి ఊర్లోనే మా వివాహం. అక్కణ్ణుంచి మీ నాన్నగారి ఊరికి వచ్చేశాము. అది ఒక పల్లెటూరు. అంతవరకు పట్టణవాసంలో పెరిగిన నాకు ఆ వాతావరణం చాలా క్రొత్తగా ఉండేది.

మీ నాన్నగారికి తల్లి లేదు. తండ్రి చాలా వయస్సు ముదిరినవాడు. మా అత్తగారు మీ నాన్నగారికి 14 సంవత్సరాలప్పుడు చనిపోయినదట. ఆమె మీద ఉన్నమమకారం చేత మామగారు తిరిగి వివాహం చేసుకోలేదు.

తరువాత, మీ నాన్నగారు బి. ఎ. పూర్తి చేశారు. ఉద్యోగం కోసం ప్రయత్నం చేశారు. ఎక్కడా దొరక లేదు కొడుకుకు ఉద్యోగం లేదన్న దిగులుతో తండ్రిమంచం పట్టారు.

ఇక మీ నాన్న బి. ఎ. పట్టా చేత పట్టుకుని తిరగని ఊళ్ళు లేవు, ఎక్కనిగుమ్మాలు లేవు. ఉన్న ఆస్థి కాస్తా ఉద్యోగాలకయిపోయింది. ఈ దిగులుతో మామయ్యగారు చనిపోయారు. ఆయన చనిపోయిన యేణ్ణర్ధానికి నీవు పుట్టావు. ఆస్థంతా పోయిన తరువాత ఇంకా ఆ పల్లెటూ రెందుకని బయలుదేరి ఈ ఊరొచ్చాము. ఇక్కడ రామారావుగారి ప్రాపకం వల్ల మీ నాన్నగారికి చిన్న ఉద్యోగం దొరికింది. నెలకు 60 రూపాయల జీతం. అప్పణ్ణుంచి ఇప్పటివరకు నా తల్లిదండ్రుల సంగతి తెలియదు. ఈ ఉద్యోగాలకు తిరగడం వల్లనే మీ నాన్నగారి ఆరోగ్యం చెడి పోయింది. నిన్ను డాక్టరు చదువు చదివించాలని మీ నాన్నగారి కోరికమ్మా! ఇప్పుడే జీతం కట్టలేకపోతే పెద్ద చదువులకు ఏం కడతారో? ఇదీ నా దుఃఖ భాజనమైన గాథ!" "అని చెప్తూ కండ్ల వెంట నీరు పెట్టుకున్న తల్లిని చూచి, నా గుండె తరుక్కుపోయింది. నేను మాట్లాడలేక పోయాను. ఇంతలో నాన్నగారు వచ్చి "అమ్మాయీ శశీ" అనే వరకూ నాకు స్పృహరాలేదు.

3

కాలం గబగబా గడచిపోయింది తమ్ముడూ! ఒక రోజున నేను స్కూలునుండి వచ్చేసరికి ఇంట్లోనుండి డాక్టరుగారు బయటకు వచ్చి రామారావుగారితో మాట్లాతున్నారు. డాక్టరుగారేదో "చాలా 'సీరియస్' కేసండీ లాభం లేదు." అనే మాటలు విన్నాను. నేను భయపడ్డాను. ఇవి మానాన్నగార్ని గురించేనా!

రెండు రోజులనుండి నాన్నకు చాలా తీవ్రంగా ఉన్న దాజబ్బు. దాని పేరు 'క్షయ' మనస్సంతా వ్యధలకు క్రుంగి, తల ఆలోచనలకు వేడెక్కిపోయి ఈ జబ్బుకు గురి అయ్యారు నాన్న! రామారావుగారు నన్ను చూచి కండ్ల నీళ్ళు తుడుచుకుంటూ "స్కూలు వదిలారా శశీ!" అంటూ పలకరించారు లేని నవ్వుతో.

"అదేమిటి పెదనాన్నా అట్లా ఉన్నారని?" ప్రశ్నించాను. "ఏమీ లేదమ్మా"! అంటూ లోపలకు నడచారు. నేనూ వారినే అనుసరించాను. లోపల నాన్నగారు మంచంమీద ఆయాసం, దగ్గుతో బాధపడుతున్నారు. అమ్మ ప్రక్కన నిలపడి తనలోతాను కుమిలిపోతున్నది. అక్కడి పరిస్థితుల్ని చూచి నాకు భయంవేసి బావురుమన్నాను.

ఆ రాత్రి సరిగ్గా 12 గం॥లు కొట్టింది. అందరం నాన్న మంచం చుట్టూ ఉన్నాము. డాక్టరుగారు కూడా ఉన్నారు. నాన్నగారు మగతగా నిద్రపోతున్నారు. ఆ పరిస్థితుల్లో అమ్మను ఒంటరిగా వదలక కనిపెట్టి చూస్తు

# ఆ త్మ క థ

న్నారు ఏ అఘాయిత్యమైనా చేస్తుందేమో అన్న భయంతో. స్త్రీ ఎవరికోసం తనసంపదలు, తన వాళ్ళను వదిలిపెట్టి వచ్చిందో వాళ్ళే లేకపోతే ఇంక ఆమె ఏమి చెయ్యాలన్నా చేస్తుంది!

నాన్నగారు మాగన్ను నిద్రనుండి కళ్ళు తెరచి తన బాల్య స్నేహితుడు, తనకోసం ప్రాణాలర్పించడానికి సిద్ధంగా ఉన్న ప్రాణస్నేహితుడైన రామారావుగారిని దగ్గరకు రమ్మనట్లుగా చూచారు. ఆ చూపు గ్రహించి రామారావు గారు నాన్న ప్రక్కన కూర్చున్నారు. మాట్లాడలేక నా చేతినీ, నీ చేతినీ అతని చేతిలో పెట్టి అమ్మను చూపిస్తూ కన్ను మూసారు. ఆ మూయడం మళ్ళీ తెరవలేదు. అమ్మ నాన్నగారి వియోగం భరించలేక నాన్నను చూడ్డానికి అదే త్రోవన పోయింది. నిన్నూ నన్నూ లెక్కచేయకుండా వదలి వెళ్ళిపోయింది. ఇంక మనల్ని పోషించే భారం ఆయన పైన పడ్డది.

రామారావుగారి కొక్క కూతురు. చాలా మంచిపిల్ల పేరు లక్ష్మి. ఇప్పుడు వివాహం కాబోయేది ఆ అమ్మాయికే నేను స్కూలుఫైనలు పాసయిన తరువాత నన్ను 'ఇంటరు'లో ప్రవేశ పెట్టారు. నీవు మూడవ ఫారం చదువుతున్నావు. నిన్ను 'కాన్‌వెంట్'లో చేర్పించారు. అందుచేత నీకు రామారావుగారంత పరిచయంలేదు. తన బాల్యస్నేహితుని కోరిక గనుక నన్ను రామారావుగారు తన సొంత డబ్బుతో 'ఎమ్. బి., బి. ఎస్.' చదివించారు. నాకు ఇక్కడ ఉద్యోగం అవడానికి కారణం కూడా ఆయనే. ఇది తమ్ముడూ కథ— ఇది నీకథా నాకథా మన ఆత్మకథ!" అంటూ శశి ముగించింది.

సుధాకర్ దిగులు ముఖంతో ఏవేవో ఆలోచిస్తున్నాడు. అతని కనుకొలకుల్లో నిలచిన నీరు తళ తళ లాడుతున్నది.

శశి నాలుక కొరుక్కున్నది. ఇంత కథ చెప్పి వాడి పసిమనస్సు నొప్పించడ మేమిటి?— చప్పున తమ్ముడివీపు నిమురుతూ "మరి మనం పెళ్ళికి పోవద్దూ ఆయన రమ్మని వ్రాశారుగా! ప్రయాణ సన్నాహాలేం చేద్దా మంటావ్" అన్నాను.

సుధాకర్ మాట్లాడలేదు. "ఏరా! పెళ్ళిని గురించి ఆలోచిస్తున్నావా?— పద! రామారావుగారితో చెప్పి నీకు కూడా ఒక పిల్లను ముడిపెట్టిస్తాను!" అన్నది. దాంతో అక్క ముఖం చూచి జీవంలేని చిరునవ్వు నవ్వుతూ అక్కడ నుండి ఇంట్లోకి కదిలాడు సుధాకర్.

★

---

# స మా ధా న ం

(28-వ పేజీ తరువాయి)

తీర్చుకున్నాడు. నేను సృష్టించిన రీటాలు క్షేమంగా ఉన్నాయా? పోనీలే రీటా! నువ్వు నాదగ్గరున్నావు. నా కింక ఏకుంచ, కలం అక్కర్లేదు." అని అనేవాడు.

నన్నత.నెంతగానో గౌరవించేవాడు. నే నతనికోసం ఎంతో పాటుపడుతున్నానని అంటాడు. నా హృదయాన్నెరుగున్న మధుకంటె నన్నెవరు ఎక్కువగా ప్రేమిస్తారు. అటువంటి నా మధుకి భార్యగా ఉండటంకంటె నాకేమికావాలి.

అతను సృష్టించిన చిత్రాలన్నీ గోడలమీదనుంచి అతన్ని దీనంగా చూస్తూంటాయి. కుంచెలు తమ సానుభూతిని వెలిబరుస్తూ ఉంటాయి. సితారు పుచ్చుకొని నిర్విచారంగా పాడుకుంటూంటాడు. రీటాలన్నీ కళ్ళు కదపకుండా వింటూంటాయి. స్వర్గంలోకూడా అతని రీటా వింటూ ఉంటుందనుకుంటాను.

కళ్ళు పోయినంత మాత్రంలో మానవులు గ్రుడ్డివాళ్లు కారు. ఉత్తరాన్ని ఒక కథలా వదిలి వించెయ్యి.

నీకు ఎప్పుడూ ప్రశాంత వాతావరణంలోనే సమాధానాలు వ్రాస్తూంటాను. నా భర్త కూడా నాతోనే ఉంటారు. మా నిత్య జీవితంలో ఈ సముద్రతీరం దగ్గర కొన్ని గంటలు వ్యయం చెయ్యడం మాకు అలవాటైపోయింది.

శలవు,

# బాలానందం

## చక్కెర కేళీ

—"శ్రీ రాజేశ్వర్"—

చక్కెర కేళీ
పర పర నములుచు
చక్కగవచ్చా
చక చక నడచి
చమత్కారముగ
చలాకి గాను.

అన్నిటిలాగే
అలవాటులలో
ఇదియొక్కపని
చెప్ప వచ్చును.

ఎప్పుడు చూసిన
అప్పుడె నుండును
బుగ్గను యెత్తుగ
చక్కెర కేళీ
మాష్టరు చూస్తే
మదిలో వేదన
మానుద మంటె
మక్కువ పోదు.

చెక్కెర కేళీ
నమిలా మంటే
చక్కగ జీర్ణం
కలుగుతుందని
అన్నాడొకనా
ముఖ్య మిత్రుడు.

కలుగునొ లేదో
జీర్ణం బాగా
చక్కెర కేళీ
అలవా టయినది.

కొన్ని నాళ్ళలో
నులి పురుగులు
పట్టుకొన్నవి
కడుపు నొప్పితో
ఇంజెక్షన్లకి
పదులొదిలినవి.

చెక్కర కేళీ
చక్కెర కేళీ
పిల్లల పాలిట
నవ్వుల కేళీ
అప్పటి మట్టుకు
సుందర కేళీ

———

# అన్నదాన మహిమ

• శ్రీమతి వణుకూరు రామలక్ష్మి •

కళింగదేశమున సంజీవమను నగరము గలదు. ఆవూరిలో నొక బ్రాహ్మణుడు కలడు. అతడు నిత్యము రామాయణము పారాయణ మొనర్చుచు కాలము గడుపుచుండెను. ఆవూరిలో కొందరు అతనిపై నభిమానముంచి తగిన కన్యను చూచి వివాహమొనర్చిరి. ఆ బ్రాహ్మణుడు తన భార్యతో సుఖముగా కాలక్షేపము చేయుచుండెను. కొంతకాలమునకు అతని భార్య గర్భము ధరించి నవమాసములు నిండిన వెనుక నొక శుభ దినమున నొక పుత్రుని గనెను. ఆ బాలకునకు జాతక నామకరణాదుల నొనర్చి శుశర్మ యని పేరుపెట్టిరి. ఆబాలుడు శైశవము దాటి యయిదవ యేట కాలు పెట్టగనే తండ్రి ఉపనయనముచేసి ఒక గురువు నొద్ద చదువ వేసెను. శుశర్మ పదునారవ యేడు నిండునప్పటికి నాల్గువేదములందును, ఆరు శాస్త్రములందును బండితుడయ్యెను. తరువాత శుశర్మ తండ్రి స్వర్గస్థుడయ్యెను. శుశర్మ తండ్రికి పితృయజ్ఞమును పూర్తిగావించి యూరిలో బిక్షాటనము చేసి తల్లిని పోషించుచు జీవయాత్ర గడుపుచుండెను. అతని తల్లి ప్రతిదినమొక బ్రాహ్మణునకు భోజనము పెట్టి మిగిలిన దానితో తానును పుత్రుడును కాలక్షేపము చేయుచుండెను. ఒకనాడు శుశర్మ తల్లిని జూచి "అమ్మా నాకు అన్నదాన మహిమ తెలిసికొనవలయునని యున్నది" అని అడుగ తల్లి యిట్లనెను. "కుమారా! అన్ని దానముల కంటెను, అన్నదానము గొప్పది. దాని మహిమ శివుడే చెప్పవలయునుగాని, మానవులకు సాధ్యము కాదు" అని చెప్పగా, శుశర్మ "అమ్మా! నేను శివుని వలన అన్నదాన మహిమ తెలిసికొందును సెలవిమ్మ"ని చెప్పి పయనమైపోయెను.

శుశర్మ ఒక అరణ్యములోనుండి పోవుచుండగా! సాయంకాలమయ్యెను. ఒక బోయవాడెదురై "స్వామీ సాయంకాలమైనది. ముందు క్రూరమృగముల బాధ యధికము గావున మాకుటీరమునకు రండ"ని పిలుచుకొని పోయెను. ఇంటికి పోయి భార్యతో నిట్లనెను, "గృహిణీ ఈతడు చాలా మంచి బ్రాహ్మణుడు. తేనెయు, వెదురు బియ్యము ఇమ్ము భుజించు"నని చెప్పెను. అందుల కామె "నేను నా భాగమీయను" అని చెప్పెను. అప్పుడా బోయవాడు తన భాగము నిచ్చెను. శుశర్మ దానిని భుజించి ఆ బోయడు చూపించిన మంచముపై నిద్రించెను. బోయడు వేరొకచోట నిద్రించెను. ఒక రాత్రివేళ నిద్రలో నొడలుతెలియక క్రిందపడగా పొంచియున్న క్రూరమృగము వచ్చి యా బోయవానింజంపి భక్షించెను. బ్రాహ్మణుడుదయమున లేచి చూచు సరికి బోయవాడు కానరాక పోవుటచే చింతించుచు పోవుచుండ వాని భార్య తన మగనిని మృగము చంపిన సంగతి తెలిపి, నా మగని నిచ్చి పొమ్మని చేయి పట్టుకొనగా "నీకు పిచ్చి పట్టినదా? నీమగనిని పులి చంపినది నేనేమి చేయుదు పొమ్మని" చేయి విదిలించుకొని పోయెను. పోయి పోయి మధ్యాహ్నమునకు ఒక గ్రామము చేరెను. ఆగ్రామమున నొక బ్రాహ్మణుని యింటికి ఆతిథ్యమునకు పోయెను. ఆ యింటి యజమాని శుశర్మను యాదరించి భోజన మిడి శుశర్మ పోవు కార్యమును తెలిసికొని వానితో నిట్లనెను. "అయ్యా! నేనీ యూరిలో చెరువునకు కట్ట వేయించుచుంటిని? ప్రతిదినము పగలు వేయించిన కట్ట రాత్రి యగుసరికి పడిపోవు చుండెను. అందువలన పనిపూర్తి కాలేదు. ఇందుకు కారణమేమో శివునడిగి తెలిసికొను"మని చెప్పగా సరేయని బయలుదేరి పోవుచుండగా, త్రోవలో క్షుదార్తుడగు ముసలి బ్రాహ్మణుడెదురై శుశర్మ పోవు కార్యమును తెలిసికొని, "అయ్యా! నాకీ ఆకలితో బాధపడు దురవస్థ ఎందుకు వచ్చెనో శివునడిగి తెలిసికొను"మని చెప్పగా సరేయని బయలుదేరి వచ్చుచుండగా, దారిలో గలనొక పుట్టలోనున్న ముసలి పాము కన్నులు కనబడక రాక పోకలకు మిగుల బాధ పడుచుండ శుశర్మ ఎదురయ్యెను. సర్పము అతని ప్రయాణ కారణము తెలిసికొని "అయ్యా బ్రాహ్మణోత్తమా! నాకీ దురవస్థ ఎందులకు

కల్గెనో తెలిసికొను"మని చెప్పగా అందుల కంగీకరించి, ముందుకు పోవుచుండ, దారిలోనొక మామిడిచెట్టు తన దురవస్థనుగూడ తెలిసికొనిరమ్మని చెప్పెను.

ఇట్లు శుశర్మ అందరకు వాగ్దానము చేసి ముందునకు పోవ పోవ నొక పెద్దకొండ కాన్పించెను. అతడాకొండ పైకెక్కి అచ్చటనొక ఆశ్రమమేర్పరచుకొని కొన్ని సంవత్సరములు శివుని గూర్చి తపము చేసెను. శివుడా తని తపమునకు మెచ్చుకొని పార్వతీ సమేతుడై ప్రత్యక్ష మయ్యెను. "భక్తుడా! నీతపమునకు మెచ్చితిని. నీకుగల యభీష్టమేమో కోరుకొమ్మ"ని పలుకగా, అందులకు శుశర్మ "స్వామీ! మీవలన అన్నదాన మహిమ వినవల యునని యున్న"దనగా, శివుడు చిరునవ్వునవ్వి "కుమారా! విరాట దేశపు రాజునకు సంతానము లేకపోవుటచే నిత్యము బ్రాహ్మణపూజ చేయుచున్నాడు. నేనిచ్చు విభూతిని, అక్షతలను గొనిపోయి ఆ రాజునకీ విభూతినిచ్చితి వేని దానిని ధరించుటవలన కుమారుడు కల్గును. ఆ కుమారుడు కల్గినవెంటనే నీవటకేగి నాభి నాళచ్ఛేదనము, జాతక కర్మయు గాకముందొక అరటిఆకున ఆశిశువునుంచి నీకడకు గొనివచ్చునట్లు చెప్పి అనంతర మాశిశువు నాభిపై యీయక్షతలనుంచిన యాశిశువే నీకన్నదాన మహిమ దెల్పునని" చెప్పెను. శుశర్మ "స్వామీ, నాకుగల సంశయములను దీర్పవలయును" అని పల్కుచు తనతో బ్రాహ్మణవృద్ధుడు, సర్పము చూతవృక్షము చెప్పిన సంగతులు విన్నవించెను. అందులకు పరమేశ్వరుడిట్లనెను. "భక్తుడా! వినుము. బ్రాహ్మణుని చెరువుకట్ట పడిపోవుటకు గల కారణమేమనగా అతడు తనపుత్రికలకు వివాహ కాలము దాటిననూ పెండ్లి చేయకపోవుటచే అతని ధర్మకార్యము పూర్తి కాలేదు. వెంటనే వారికి పెండ్లి చేసినచో పూర్తియగును. వృద్ధుడు తాను నేర్చిన విద్యలను పరులకు దెల్పక,బోధింపక పోవుటచేత నతనికా దురవస్థ వచ్చెను. ఇప్పుడయిన విద్యాదానము చేసిన తనకా కష్టము దీరును. సర్పము తన శిరమునగల మాణిక్యమును లోభియై పరులకు దానము చేయక పోవుటచే దాని కట్టి కష్టము కల్గెను. ఆ రత్నము నిప్పుడైన నెవరికైన నిచ్చిన దాని కష్టము తొలగును. మామిడి చెట్టుక్రింద ధనమున్నది. దానికి భూతములు కావలి యున్నవి. అందుచే నా చెట్టుపండ్ల నెవరు భుజింపరు. కావున దానికా కష్టము వచ్చినది. కావున ఆ ధనమును బయటికి తీసి మంచివాని కెవనికైనను దానము చేసినచో దాని ఫలము లందరుభుజింతురు. అప్పుడు దాని కష్టము తొలగును. మరియు త్రోవలో నీకాతిథ్యమిచ్చి చనిపోయిన బోయవాని సంగతి రాజపుత్రు నడిగిన తెల్పును" అని చెప్పి, విభూతియు, నక్షతలును ఇచ్చి అంతర్ధాన మందెను.

శుశర్మ తిరిగి వచ్చుచు, మామిడి చెట్టును సమీపించి శివాజ్ఞ నెఱిగింప నా వృక్షము "భూసురోత్తమా! ఆ ధనమును తీసుకొనుటకు మీరే సమర్థులుగాన మీరే గైకొను" డన నతడు "ఓ వృక్షరాజమా! నేను తిరిగి వచ్చువరకు ఆ ధనమును నీవే కాపాడుచుండు"మని చెప్పెను. తదుపరి సర్పమును చూచి శివాజ్ఞ నెరిగించెను. అంత నా సర్పము తన శిరమునగల మణిని దీసి శుశర్మకు దానమిచ్చెను. పిమ్మట తిరిగి వచ్చుచు నా వృద్ధునిజూచి శివాజ్ఞ నెరిగింప నాతడు శుశర్మకు తనకు వచ్చిన విద్యలనెల్ల జెప్పి కృతార్థుడయ్యెను. తరువాత బయలుదేరి వచ్చుచు మొదట తాను బసచేసిన బ్రాహ్మణుని యింటికి చేరి యతనితో శివాజ్ఞ నెరిగించెను. అంత నా బ్రాహ్మణుడు వెంటనే శుభలగ్నమును నిశ్చయించి తన పుత్రికలను శుశర్మకిచ్చి వివాహము చేసెను. శుశర్మ యిరువురి భార్యలతో గొంతకాలము మామగారి యింట నుండి యొకనాడు మామగారిని జూచి "అయ్యా! నేను కొలది దినములలో మీ కుమార్తెలను బిలచుకొని బోయెద"నని చెప్పి విరాట నగరమునకేగి రాజును జూచి తన దగ్గరనున్న విభూతి యొక్క మహిమ నెరిగించి రాజునకిచ్చి యిట్లనియెను. "రాజా! ఈ విభూతిని నీ భార్యచే ధరింపజేసితివేని నీకు సంతానము కల్గును. లేనిచో నా శిరస్సు నిచ్చెద" నని చెప్పి వెడలిపోయెను. అంత రాణి స్నాతయై శుద్ధ వస్త్రముల ధరించి, శివుని మ్రొక్కి విభూతిని ధరించెను. ఆ విభూతి ధరించిన నెల దినములకే రాణి గర్భవతి

# అన్నదాన మహిమ

యయ్యెను. అంత రాజు సంతోషముతో విప్రులకు బహుమతులనిచ్చెను. సుశర్మ శిశువు జనించువేళకు రాజభవనమునకేగి, రాజును జూచి "రాజా! నీకు పుత్రోదయమైన వెంటనే బంగరు పళ్ళెములో నరటియాకు నుంచి దానిపై శిశువునుంచి తీసుకు రమ్మ"నమని చెప్పెను. రాజు అట్లే చేసెను. వెంటనే సుశర్మ శిశువు హృదయముపై చిప్పిడిచ్చిన యక్షతలనుంచి "కుమారా! అన్నదాన మహిమ నా కెఱిగింపు" మనిన నా శిశువు నోరు తెరచి, ఎల్లరు ఆశ్చర్యపడ నిట్లుచెప్పెను.

"విప్రోత్తమా! అన్నదాన ఫలితము చెప్పుటకు నా తరముకాదు. అయినను నే నెరిగినంతవరకు చెప్పెదను. నేను పూర్వజన్మమున బోయవాడను. నీకొక నాటిరాత్రి నా భార్య వలదన్నను వినక తేనె, వెదురు బియ్యము నొసంగి నీ యాకలి తీర్చి, నాటిరాత్రి మృగమున కాహారమైతిని. ఆ యన్నదానమునకు ఫలితముగనే నాకీ రాజపుత్రయోగము లభించినది. ఆనాడు నన్ను ఆటంకపరచిన నా భార్య యీ గ్రామమున నొక మాలదాని యింట పందిపిల్లయై పుట్టినది. ఆ పిల్లకు తలపై తెల్లని మచ్చ యుండును. దీనిని బట్టి అన్నదాన మహిమ యెట్టిదో యూహించుకొనుము" అని చెప్పి యా శిశువు వూరకుండెను. అచ్చట నున్నవారందరు ఆ సంగతి నాలకించి ఆశ్చర్యపడిరి. సుశర్మను దైవముగ భావించిరి. సుశర్మ రాజుకడ శెలవు తీసుకొని మామిడిచెట్టు క్రింద నున్న ధనము పట్టించుకొని అత్తవారింటికేగి భార్యల నిద్దఱను వెంటగొని స్వగ్రామముచేరి, పుత్రవియోగముచే దుఃఖించుచున్న తల్లి కానందము గలిగించెను. అంతటినుండి సుశర్మ తల్లితోను, భార్యలతోను గలసి నిరంతరం అన్నదానము చేయుచు చిరకాలము సుఖముగా గడిపెను. ★

# మంచి రాముడు

"శారదానాథ్"

రాముడన్న పిల్లవాడు
చాలమంచి వాడు
తెల్లవార నిదుర లేచి
దేవుని తలుస్తాడు —

కాలకృత్యములను దీర్చి
స్నానము చేస్తాడు
చక్కగ తల దువ్వుకొని
శ్రద్ధగ చదువుతాడు —

తల్లిపెట్టు అన్నముతిని
బళ్ళోకెళ్తాడు
పంతులు చెప్పే పాఠాల్
బాగా వింటాడు —

తోడి బాలురతో మైత్రిని
కూడి తిరుగుతాడు
పేదపిల్లలన్న చాల
ప్రేమ చూపుతాడు —

గంటమ్రోగ గానె సరిగ
ఇంటికి పోతాడు
ఇంటిపనులలో సాయం
ఎంతో చేస్తాడు —

బడివేళకు మధ్యాహ్నం
బడిలో ఉంటాడు
సాయంత్రం మిత్రులతో
హాయిగ నాడుతాడు —

ప్రొద్దుపోకముందె ఇంటి
కద్ద చేరుతాడు
అన్నముతిని పుస్తకాల
నంది చదువుతాడు —

నిదుర వచ్చినంతటనే
చదువు మానుతాడు
మదిలో పరమాత్ముని తలచి
మరి నిదురిస్తాడు —

అల్లరెపుడు చేయబోడు
కల్లలెపుడు ఆడడు
చెడ్డవారితో కూడడు
దొడ్డగుణుడు రాముడు.



# ★ శిథిలాలయం ★

రచన:
శ్రీ పి. రాజేశ్వరరావు

అరుణుడు అరుణకాంతులతో ఆకసం ఆవరించాడు. అప్పుడే రైలు మలుపు తిరిగింది. నా కళ్ళు అప్రయత్నంగా ఆ మూలకి మళ్ళినయ్. గుండె ఝల్లుమనింది. ఆ మలుపు ప్రక్కనే ఉన్న డాబా అవసాన దశలో ఉంది. ఇటుకలు విడి విడిగా ఊడి పోయినయ్. ఇల్లంతా గడ్డి గాదరాలతో నిండింది. ఒక్క మెట్లుమాత్రం రూపంతో ఉన్నయ్. చూస్తుంటే నా హృదయం ద్రవించి అశ్రువులలా కారుతున్నాయ్.

అది ఐదేండ్ల నాటి కథ. ఆరోజు సాయంత్రం ఆ డాబా క్రిందనుండే నడుస్తున్నాను. దాటుతూండేటప్పటికి వెనుక నుండి 'రాజూ' అంటూ కోకిలస్వరం వినబడింది. 'ఎవరు చెప్మా పిలిచింది' అనుకుంటూ వెనుకకుతిరిగా. క్రింద ఎవరూ కనబడలేదు. తలెత్తి చూశా ఎవరో ఎందుకో నాకోసమే చూస్తున్నారు. అట్లానే నిలబడ్డా. పరాయి అమ్మాయితో అందులో యువతీమణితోఅమాంతంగామాట్లాడేస్తే కొంపలంటుకుంటాయి. ఆ అమ్మాయి కూడా నా కేసే చూస్తోందా?.. అవునులే.. భయమెందుకు మనసా - 'ధైర్యం పురుష లక్షణం' అని ఉసికొలిపే వెంకాయ్ జ్ఞాపకం వచ్చాడు. వాడే ఉంటే ఈ పాటికి తెగేసి మాట్లాడేవాడు. వాడు అంటూండే వాడు కూడా నన్ను. "ఒరే రాజమ్మా.... అమ్మాయి చూస్తున్నా వెర్రి మోహం వేళ్ళాడేస్తావేం?. చిలిపి పిల్లని చిలిపిగానే చూడు" అని మందలించేవాడు. ఒక్కొక్కటీ ఊహా పథంలో మెరిశాయి. ఒక్క సారి తల విదుచుకొన్నా. ఇంకా అట్లానే చూస్తోంది.... కంఠం సవరించుకొన్నా.

"ఏమండి నన్నేనా పిలుస్తా" అన్నా.

"అవునండి తమరినే కేకేస్తా" అని వయ్యారంగా మాట్లాడింది.

ఏమిటి? ఇంత ఇదిగా మాట్లాడుతోంది.... సమాధానం కోసం వెతుకుతున్నా....

"ఇట్లా ఇంట్లోకి రండీ" అంటూ చకచకా లేడిపిల్లలా పరుగెత్తుతూ లోపలికి దిగింది. నేను ఆలోచనతో వీధి గుమ్మంవగ్గరకు నడిచా. ఒక్క నిమిషంలో తలుపు తెరవబడింది. 'రండీ!' అని ఆహ్వానం వచ్చింది. నా కళ్ళు దేనికోసమో వెతుకు తున్నయ్. "రావోయి రాజూ ఏం జ్ఞాపకంలేదు" అంటూ ఓ నలభై ఏళ్ళ పుణ్యస్త్రీ వచ్చింది. దాంతో స్థిమితి పూర్తిగా పోయిందనుకోండి. "ఏమిరా....ఇదేదైనా వింతకల కాదుకదా!" అనుకున్నా.

"ఏమోయ్ రాజూ నువ్వు పెద్దవాడవయ్యావ్. ఏవైనా పెద్ద చదువులు చదువుతున్నావో- ఏమో! మేం జ్ఞాపకం ఎట్లాఉంటాంలే" అంటూ మొదలెట్టింది.

నా నవనాడులు నా ఆధీనంలో లేవు. ఏవేవో వింత భావాలుకలు తున్నాయ్. నన్ను ఎరుగనపోతే ఇంత పరిచయస్తులలా మాట్లాడుతారా ఏమిటి... ఏమో! నా ప్రవాహంలోనే కొట్టుకుపోతున్నా....

"ఏమే ఉషా ఇట్లారా ... ఏమోయ్ చెప్తున్నా విను. మేం ఇదివరలో మీ వూళ్ళో ఉండేవాళ్ళం. మా వారు అక్కడ 'ఓవరుసీర్'గా ఉండేవారు. ఆ వూరు నుంచి ఎనిమిదేళ్ళయింది బదిలీఅయి. ఇది మా ఉష. ఆ వూళ్ళోనుంచి వచ్చేప్పటికి మా ఉషకి ఏడవ సంవత్సరము. నువ్వు ఎప్పుడూ మా యింట్లోనే ఉండి ఉషతో ఆడుకుంటూ ఉండేవాడివికదూ .... అన్నీ మరిచావా?" అంది

అప్పటికి నా కళ్ళు తెరిచాయ్. నా సందేహాలు మంచు లాగ విడ్డాయి. వీరు మావూళ్ళోనే ఉండేవారు. నా చిన్న తనమునుండి అంటే నాకు నాలుగేళ్ళప్పటినుండి వాళ్ళింట్లోనే ఉండే వాడిని. నేను ఆవిడని అత్తా అంటూ, ఓవర్ సీయర్‌గారిని మామా అంటూ తిరిగేవాడిని. అప్పటికి వాళ్ళింట్లో ఒక ఏడాది చంటిపిల్ల ఉండేది. అదే ఉష. ఉష నేను ఆడుకుంటూ ఉండేవాళ్ళం. చిన్నప్పుడు ఉష

తమాషాగా పిలిచేది. మానాన్నగారు తెగనవ్వుకునేవారు.

"రాజూ! ఆలుకుంతానికి వస్తావా?" అంటూండేది. నాలుగేళ్ళప్పుడు నన్ను మా వీధి బడిలో చేర్పించారు. త్వరత్వరగా చదివేవాడిని. ఉషకి ఐదోఏడు రాగానే ఆ బళ్ళోనే చేర్చారు. ఇద్దరం కలిసి చదువుతుండేవాళ్ళం. నేను ఉష కంటె రెండు క్లాసులు పెద్ద! అయినా కలిసే చదివేవాళ్ళం. ఎప్పుడైనా ఒక రోజున వాళ్ళ యింటికి ఆప్సెంటు అవుతే అత్తయ్యగారు మాయింటికి వచ్చేవారు. మా అమ్మ, ఆవిడ కబుర్లు చెప్పుకొనేవారు. ఒకరోజున నేను, ఉష గవ్వలాడుతున్నాం. అమ్మ, అత్తయ్యగారు కబుర్లు చెప్పుకుంటున్నారు. అత్తయ్యగారు నాకేసి తిరిగి —

"రాజూ మరీ ఆడపిల్ల వైపోతున్నావే మోయ్" అన్నారు.

"కోడలు గడుసు పిల్ల. మావాడిని మచ్చిక చేసింది" అంది మా అమ్మ.

మాకేం అర్థంకాలేదు. మా ఆటలలో మేం ఉన్నాం. మా అమ్మ మాట వినబడింది.

"వదినగారూ ఉష, రాజు కాపురం చేస్తుంటే చూడాలని ఉందండి" అంటూనవ్వింది. "మా అత్తయ్యగారు రాజుని ఎప్పుడో కొనేశాం" అంది.

ఇద్దరు నవ్వుకున్నారు. అట్లానే కాలం గడిచింది....

నాకు పదో ఏడు వచ్చేటప్పటికి వాళ్ళకి మా ఊరు నుంచి ట్రాన్స్‌ఫరు అయింది. ఆరోజున వాళ్ళింటికి వెళ్ళా.

అత్తయ్యగారు అప్పుడే మేడ దిగుతున్నారు. ఉష కూడా తల్లి వెంటే వస్తోంది. నన్ను చూడగానే అత్తయ్యగారు అన్నారు. "రాజూ మేం వెళ్ళిపోతున్నాం మరి.... నీకు ఆడుకుంటానికి ఎవరూ పిల్లలు లేరుకదా, మాతో వస్తావా?" అన్నారు.

దాంతో నాకు ఏడుపు వచ్చింది. అప్పుడే వెళ్ళిపోతున్నారేం? ఇక ఉషతో మాట్లాట్టమెలా? "ఉషా ఎప్పుడు వెడుతున్నావు?" అన్నా గాద్గదికంగా.

"మరేం నువ్వుకూడ రావూ?" అంది అమాయికంగా.

"మానాన్న ఒప్పుకోడు" అన్నా.

"నే చెప్తాలే" అంది ముఖం అదోకలా త్రిప్పి ...

ఉష మాట్లాడితే ముత్యాలు రాలేవి. నవ్వితే నవరత్నాలు రాలేవి.... ఆ ముఖం ప్రసన్నతేజం చూస్తుంటే ముద్దొచ్చేది. ....

అంతే! మళ్ళీ కనబడలేదు.... ఇదంతా ఒక్కసారి 'సినిమా రీలులా' నా మెదడులో తిరిగింది..........

ఉషకేసి చూశా, ఎంత తేడా, వయ్యారం వచ్చాయ్! సృష్టి సౌందర్యం అంతా ఉష ముఖంలోనే యిముడ్చి నట్టుంది. ఆ చిలిపికళ్ళు కలువరేకుల్లా విచ్చాయి. వర్ణించ లేని అందం ఉంది ఉషలో.... !

"జ్ఞాపకం వచ్చింది అత్తగారు" అన్నా.

"ఏం చేస్తున్నావోయ్, అమ్మా, నాన్నగారు కులాసాగా ఉన్నారా?" అని అన్నారు.

"ఇక్కడే చదువుతున్నానండి.... అందరు ఇంటిదగ్గరే ఉన్నారు."

"మా ఉషకి పెండ్లయింది రాజూ, మా అల్లుడు మద్రాసులో ఉంటున్నాడు. వాళ్ళకీ మాకూ తగాదాలు వచ్చాయ్" అంటూ ఉపన్యాసం మొదలెట్టారు.

అయినా ఆడవాళ్ళు ఉపన్యాసాలు మొదలెట్టారంటే వదిలిపెట్టరు, వినేవాళ్ళకి ఓపిక ఉండాలికాని.......... ఆ సారాంశం ఇది.

ఉషని డబ్బున్న కుటుంబంలోనే ఇచ్చి పెళ్ళి చేశారు. వాళ్ళింట్లో కోడరికం ఎక్కువ. అల్లాడు కూడా చాల బాధపెట్టాడుట. ఆ మధ్యనే దుర్వ్యసనాలుకూడా అబ్బాయి! తెగత్రాగి వచ్చి ఉషని బాదకొట్టేవాడట! అందుకే ఇక అక్కడ ఉంచక 'ఈ పిల్లని నా కొడుకే అనుకుంటా' అని మామయ్యగారు తీసుకొని వచ్చారట! ఇక్కడ వీణ చెప్పిస్తున్నారుట. స్కూలుఫైనలు చదివించిరట. ఇంకా.... ఇంకా ఏవో చెప్పారు.

"అయితే అత్తయ్యగారూ! ఉషకి పిల్లలెవ్వరూ...." అన్నా.

"లేరు నాయనా, అందుకే ముద్దుగా చూసుకుంటున్నాం. కాని ఈ గొడవతో మా జీవితాలు నశించేట్టున్నాయ్.

ఒకఇంటివాన్ని చేశాం. అది సుఖపడుతుంది అనుకుంటే దానియోగం ఇట్లాకాలింది" అంటూ నిట్టూర్చింది.

ఉష మా సంభాషణలో పాల్గోలేదు. అట్లానే చూస్తూ కూర్చుంది.

"రాజూ ఇక్కడ ఎక్కడ ఉంటున్నావ్" అని అన్నారు.

"హాస్టలులోనేఉంటున్నా." అని సమాధానం చెప్పా.

'అమ్మా రాజు చాలా సున్నితంగా మారాడమ్మా. మిత భాషిత్వం నేర్చుకున్నాడు.' పయ్యావిభావు పయ్యారంగా మాట్లాడింది.

"ఆ ....(. నీ అంత సుకుమారం, లేదే నాకెట్లా వస్తుందిలే" అని చిలిపిగా అన్నా.

"రాజూ. మాటకారికూడా అయ్యావు." అందావిడ.

ఇంతలోనే పరిచారిక ఫలహారం కాఫీలు తీసుకొచ్చింది. మొదట్లో కొద్ది మొఖమాట పడినా నావంతు చెల్లించా.... అదయింతర్వాత కొద్దిసేపు మాట్లాడి వచ్చా.

అట్లానే శలవులున్నప్పుడల్లా వాళ్ళింటికి వెళ్ళేవాడిని. ఒక్కొక్కప్పుడు మామయ్యగారు కూడ మాసంభాషణలో పాల్గొనేవారు. పాపం! ఆయన ఉషని గురించే బెంగపెట్టుకున్నారు. ఇదివరకటిలా లేందే? పూర్తిగా చిక్కిపోయారు. వెండితీగెల్లా జుట్టు తెల్లబడింది, అత్తయ్యగారు లేనప్పుడు నేను, ఉష డాబామీద కబుర్లు చెప్పుకునేవాళ్ళం. పున్నమ వెన్నెలలు వెల్లివిరుస్తున్నయ్. ఆ డాబామీదికి ప్రాకిన మాధవీలత పువ్వులతో కలకల్లాడుతోంది. మాలతీపూల సౌరభం పీలుస్తున్నకొద్దీ హాయిని కలిగించింది. ఆ డాబామీద కబుర్లు చెప్పుకుంటున్నాం. ఉష ఆ చంద్రకాంతుల్లో 'దేవకన్య' లావుంది. ఆ అందం నన్ను ముగ్ధుణ్ణి చేసింది.

"ఐతే ఉషా. నీజీవితం ఇట్లా అణగారవలసిందేనా?" అన్నా.

'ఇందులో క్రుంగవలసినదేముంది రాజూ? ఆయన త్వరలోనే నన్ను అనుగ్రహిస్తారు. ఆయన్నే భర్తగా భావించా రాజూ!' అన్నది ఉష.

"అంతవరకు ఇట్లా బాధ పడవలసిందేనా? ఆయనకి పశ్చాత్తాపం కలుగుతుందనే భావిస్తున్నావా?" అని ప్రశ్నించా.

'రాజూ నీవు తప్పుగా అర్థం చేసుకున్నావు ఆయన్ని.... ఇప్పుడుకాకపోయినా కొద్దిరోజుల్లోనైనా ఆయన వస్తారు" అంది.

"ఉషా నువ్వు పిచ్చిదానివి, ఈరోజుల్లోకూడ అంత గ్రహింపున్నవాళ్ళుంటారనేనా? నీ తల్లిదండ్రులు ఎంతగా కుములుతున్నారో చూశావా? ఇట్లా నిరీక్షిస్తూ కూర్చుంటే నీజీవితం నిరాశ, నిస్పృహలతో గడవవలసిందేనా?" అని ఉపన్యాస ధోరణిలో సాగించా.

"అన్నా. నాజీవితం నిస్సారమైనా బాధలేదు. నేను చనిపోయినతర్వాతనైనాసరే నా భర్త అర్థం చేసుకుంటారు. అంతే నాకు కావలసినది." ముత్యాల్లాంటి కన్నీళ్ళని పమిటకొంగుతో తుడుచుకొంది.

"చెల్లీ నేను నిన్ను సరిగా అర్థం చేసుకోలేకపోయా. కలియుగంలో కూడ ఇంత అద్భుత మనస్తత్వం ఉంటుందా అని ఆలోచిస్తున్నా. అమ్మా.... ఉషారాణీ! నన్ను "అన్న"గా గ్రహించు తల్లీ. నా సాధ్యమైనంత వరకు బావని మార్చేందుకు ప్రయత్నిస్తా." "అన్నా "ఇన్నాళ్ళకి నాకు 'అన్న' వచ్చాడుగా నాకేం భయం లేదిక" అంది.

మళ్ళీ వారానికి వాళ్ళింటికి వెళ్ళా. ఓవరుసీరుగారు జ్వరంతో బాధ పడుతున్నారు. డాక్టర్లని 'కన్సల్టు' చేస్తే మనోవ్యాధే కారణమన్నారు. రోజు రోజుకూ జ్వరం అధికమవుతూనే ఉంది. ఎంత మందిస్తేనేం. పటుత్వం లేకపోయాక! డాక్టర్లు కూడా ఏం లాభం లేదని చెప్పారు.... కాని ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. ఓవరుసీరుగారు మట్టిలో కలిసిపోయారు. అత్తయ్య, ఉషల బాధలు అధికమయ్యాయ్. ఆ విడకి ఉషని గురించే బెంగ. ఏదో ఆయనకి వచ్చే 'Pension' తోనే కాలక్షేపం చేస్తున్నారు. ఆ డాబా ఒక్కటి ఉంది వాళ్ళకి ఆస్తి. వాళ్ళని ఓదారుస్తూ ఉండేవాడిని.

ఏదో పనుండి మద్రాసు వెళ్ళా. ఉష దగ్గర ఆమె భర్త 'ఎడ్రస్సు' తీసికున్నా. నాపని పూర్తయాక ఆ ఎడ్రసు ప్రకారం వెళ్ళా. తలుపు తీసికొని వెళ్ళేప్పటికి ఒక సోగకళ్ళ సుందరాంగి ఎదురుగ కూర్చుని 'డ్రెస్'

చేసుకుంటోంది. ఆమెని ఉషభర్తని గురించి అడిగా. ఆవిడ నన్ను ఎగాదిగా చూసింది. 'మీదేవూరండి' అంది.

‘‘మాదేవూరైతేనేంలెండి. ఆయన ఉన్నారా?’’ అన్నా తీవ్రంగా.

ఆవిడకి కోపం వచ్చింది కామోసు. పెద్ద సీరియస్‌గా ‘‘ఎక్కడికో వెళ్ళారు’’ అంది.

మళ్ళీ సాయంత్రం తీరుబడి చేసికొని వెళ్ళా. ఆయన్ని అంతకు పూర్వం చూడలేదు. 'ఫలానా వారు ఎవరండీ?' అన్నా. 'నేనే ఎందుకోసమండీ' అన్నాడా నవీనుడు.

నేను ప్రసంగం మొదలెట్టా. ‘‘ఓపరుసీరుగారు, నన్నె పసివాడని, చిన్నప్పటినుంచి నన్ను కూడ పెంచారని ఏవేవో చెప్పి అసలు 'Point' కి వచ్చి ఓపరుసీరుగారు చనిపోయారని ఉష నిరాశ, నిస్పృహ, నిరీక్షణాలతో కాలం గడుపుతోందని, అత్తయ్యగారు దీన్ని గురించి, బెంగతో కృశిస్తున్నారని చెప్పి వెళ్ళి ఆ సంసారాన్ని ఒడ్డుకి చేర్చ వలసిం’’దని ప్రార్థించా. ఎంత చెప్పినా ఏంలాభం? చెవిటివానిదగ్గర శంఖారావమే.

‘‘అసలు ఇంతకీ ఈ విషయంలో మీకు జోక్యమెందుకు?’’ అన్నాడు.

‘‘బావగారూ వాళ్ళని చూసినకొద్దీ నా హృదయం బ్రద్దలవుతోంది. వాళ్ళని అనుగ్రహించండ’’న్నాను. ఆయన ఏవేవో దుర్భాషలాడేడు. మద్రాసులో నా పని పూర్తయాక బయలుదేరి వచ్చేశా. ఉషతో మాత్రం నేను ఆయన్ని కలుసుకొన్నట్టు చెప్పా.

నేను శెలవుల్లో ఇంటికివెళ్ళా. మా అమ్మతో ఈ విషయం అంతా చెప్పా. ఆమె ఎంతగా విచారించిందో! ఇంటిదగ్గర ఉంటున్నానన్న తప్ప నా ఆలోచనలు, మనస్సు అక్కడే ఉంట. ఆమెకి ఉల్లాసంగా గడిపే రోజుల్లో విచారం చుట్టుకొంది. ఎట్లానో ఆ సెలవు గడిపి మళ్ళీ ఆ ఊరు చేరుకున్నా. ఆ వేళే వాళ్ళింటికి వెళ్ళి చూశా. ఇల్లంతా భయంకరంగా ఉంది. గబ్బిలాలు స్వైరం పరుగులెడుతున్నాయ్. చీకటి కోణం దాదా అవసాన దశలో ఉంది. ఇటుకలు చవుడు రాలిపోతోంది. దాని ముఖంకేసి చూసేవాడెవడు?. గట్టిగా 'ఉషా' అంటూ పిలిచా. ఏ ప్రక్కనుంచో చిన్న మూలుగు వినబడింది.

నా గుండె అదురుతోంది. ఎడమకన్ను అదురుతోంది. ఏవో అశుభ సూచనలు కనుపిస్తున్నాయ్. మెల్లగా ఆ దిశకు వెళ్ళా. ఆరిపోయే దీపకళికలాగుంది ఉష. దగ్గర కూర్చుంటానికే శక్యంకాలేదు. ఇల్లంతా మట్టి మషాణం. తలంటుకొని ఎన్నాళ్ళయిందో. ఆ గుడ్డలు ఎన్నాళ్ళయి బానని చూశాయో! చేయి చాపింది. కొన ఊపిరితో ‘‘మా అమ్మ చచ్చిపోయింది రాజూ!’’ అంది. నాకు ఒక్కసారి కంపమెత్తింది. అయ్యో! ఈ కుటుంబానికి ఎన్ని కష్టాలు కల్గాయి ఇక ఉష జీవితం ఎట్లా....?

‘‘నాకూ .. జ్వరం రాజూ’’ అన్నది.

‘‘నేను డాక్టరుని తీసికొస్తా కొంచెం ధైర్యంగా ఉండు’’ అన్నా.

‘‘అన్నాయ్! ఏం లాభంలేదు. ఆయనవస్తే ఒక సందేశం చెప్పు. నాజీవితం ఆ సంతోషి మూని కోసమే బలిదానం చేశా’’నని.

‘‘చెల్లీ చనిపోయే ముప్పుడు కూడా అతన్ని తలచుకొని ఏంలాభం?.... మనుషకిరాతుడు....’’ నా నోరు ఆ కృశించిన చేతులతోకప్పింది. 'తప్పు' అన్నట్టు ముక్కుమీద వేలు వేసుకొంది. 'ఉష ఇక చనిపోతుంది, బ్రతకదు' అన్నట్టు ఏవేవో ఘంటారావాలు వినబడుతున్నాయ్.

‘‘అన్నాయ్.... ఈ మాట చెప్పటానికే ఇంతవరకు జీవాలున్నాయ్.... ఇక వస్తాపోనన్నా.. అ..న్నా..య్..’’ అంటూ కళ్ళుమూసింది ఆ పవిత్ర జీవి.

నాకు చదువుపై విసిగెత్తింది. చదువు మానివేశా.... అప్పటినుండి ఇంటిదగ్గరే ఉంటున్నా. నాన్నగారు రిటైర్ అయ్యారు. ఏదో చిన్న ఉద్యోగం చేస్తూ వ్యవసాయంలో పడ్డా....

ఇది జరిగి ఐదు సంవత్సరాలైంది. మళ్ళీ ఇవాళ ఆ శిథిలాలయం కనబడింది నా కళ్ళకి. ఆ మెట్లు చితికిపోయాయ్.. ఆ దాదాయే కూలింది..

నా కన్నీళ్ళని తుడుచుకొన్నా... మళ్ళీ మౌనంగా ప్రకృతిలో కలిసిపోతుందే మనదనా ఉన్నట్లున్న ఆ శిథిలాలయాన్ని ఒక్కసారిచూశా....

అప్రయత్నంగా చేయెత్తి నమస్కరించా....



# పంచవర్షప్రణాళిక — కమ్యూనిటీ ప్రాజక్టులు

• శ్రీమతి పె. రామకృష్ణమ్మ •

ఏ దేశమైనను ఆర్థికముగను, సాంఘికముగను, పారిశ్రామికముగను, మరి ఇతరవిధములుగను అభివృద్ధి గాంచవలెనన్న ఆ దేశపు ప్రభుత్వము తమ దేశ పరిస్థితులను బట్టి దేశాభివృద్ధికి అనుకూలమైన ఒక ప్రణాళిక తయారు చేసి ఆ ప్రణాళికను కార్య రూపమున పెట్టవలెను. భారత దేశమునకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత భారత సర్కారు దేశాభివృద్ధికి సరియైన ప్రణాళిక తయారు చేయుటకును, ప్రణాళికను కార్యరూపమున పెట్టుటకును ప్లానింగు కమిషనును స్థాపించిరి. ప్లానింగు కమిషను దేశాభివృద్ధికి ఒక పంచవర్ష ప్రణాళికను తయారు చేసినది. 5 సంవత్సరములలో దేశమంతటియందు, పరిశ్రమల అభివృదికి, వ్యవసాయాభివృద్ధికి, విద్యుచ్ఛక్తి అభివృద్ధికి యీ విధముగా దేశమన్ని విధములుగను అభివృద్ధి గాంచుటకు ఎంతెంత ఖర్చగునో, ఏపరికరములు కావలయునో ఒక అంచనా వేయబడినది. దీనిలో గ్రామముల యభివృద్ధికి సంబంధించినది కమ్యూనిటీ ప్రాజక్టు ప్రణాళిక.

కమ్యూనిటీప్రాజక్టు అనగా నేమి? ఇది అంత సులభంగా జవాబు చెప్పదగిన ప్రశ్నకాదు. అసలు కమ్యూనిటీ అనగా నేమి? ఒక అడవికిని, ఉద్యానవనమునకును ఎన్ని విధముల బేధము కలదో సరిగా అదే విధముగా ఒక గుంపు లేక జనసమూహమునకును, కమ్యూనిటీ కిని కలదు. అడవియందు విష వృక్షములు మొదలు ఫల వృక్షముల వరకు కూడ ఒక నియమము లేక వాటి ఇష్టము వచ్చినట్లవి పెరుగుచు ఒకదాని నొకటి త్రోసిపుచ్చుటకు ప్రయత్నించుచు, తుదకు భూమి శీతోష్ణస్థితుల మార్పులను బట్టి అన్నియును ఏదోవిధముగా సర్దుకొను చుండును. కాని తోట అట్లుకాదు. నేర్పరియైన మాలి ప్రతి మొక్కను అది పూర్తిగా వికసించుటకు వీలగునట్లును, ఏఒక్క వృక్షము మరియొక వృక్షమునకు అడ్డురాకుండునట్లును, ఒక సరియయిన అంచనా ప్రకారము తోట యంతయు తయారు చేయును. ఇది యొక అందము నిచ్చి, చూచుటకు కూడ అందముగా నుండును. తను జీవించుచు, యితరులుకూడ తమ శక్తి సామర్థ్యములను బట్టి జీవించుచు వృద్ధి పొందుటకు అవకాశము కలుగ చేయుట యను నీతి ననుసరించి తోట యంతయు వృద్ధిపొందును. జన సంఘముకూడ ఈ నియమములనే అనుసరించి నడుచు కొనవలెను.

పై నుదహరించిన ఆదర్శప్రాప్తియే ముఖ్యోద్దేశముగ నుంచుకొని కమ్యూనిటీ ప్రాజక్టు ప్రణాళిక తయారు చేయబడినది. ప్రభుత్వమువద్ద ప్రణాళిక పూర్తికి మూలధనము తక్కువగా నున్నప్పటికి, ప్రజల వద్ద ఉత్సాహమూ, సాధనములు సమృద్ధిగా నున్నవి. ఇంత బ్రహ్మాండమైన పని ప్రజలు సిద్దముగ లేకపోవుటవల్లనేమి, పూర్తి అనుభవము లేకపోవుటవల్లనేమి అనుకున్న ప్రకారము జరుగక పోవచ్చును. తాత్కాలికముగ కొన్ని హద్దులు ఏర్పరుపవలసివచ్చును. గ్రామ్య జీవనము యొక్క ముఖ్యావసరములకు మొదట ప్రాముఖ్యత నిచ్చి అందచందముల నిచ్చు ఇతర విషయములను అనగా విద్యాభ్యాసము, ఇండ్లు, ఆరోగ్యము బట్ట-వీటిని కొంత కాలము వరకు ఆపుచేయవలసి వచ్చును. అనగా ఆహార పదార్థముల ఉత్పత్తికై సేద్యము చేయుచు, మంచి మంచి పూదోటల కొరకు భూమి తయారు చేయ వచ్చును.

యుద్ధ కాలమందు దేశము యొక్కయు, ప్రజల యొక్కయు దృష్టి, సాధనములు, శక్తి ఏవిధముగా కేంద్రీకరింపబడి పని జరుగునో అదే విధముగా దేశము యొక్క ప్రస్తుత ఆర్థిక పరిస్థితిని బట్టి కమ్యూనిటీ ప్రాజక్టు ప్రణాళిక అమలు జరుప బడవలెను. ప్రాణాధారమైన ఆహారోత్పత్తి ముఖ్యము. ఆకలిచే మాడుచున్నప్పుడు ఇతర ఆనంద దాయక విషయములను గూర్చి ఆలోచించుట ఉపయోగకరము కాదు. ఈ ప్రణాళిక జయప్రదముగ కొనసాగుటకు జనశక్తి, పరికరములు, సాధనములు తగినంత కలవు. ఈ విషయమై అధైర్యమునకు తావులేదు. "ఈ పని సాధ్యమా, విజయ వంతముగ పని కొనసాగించ గలమా" అను శంకలను తొలగించి ధైర్యోత్సాహములతో పూనుకొనిన నాడు ప్రస్తుత ప్రణాళిక లోని ప్రాజక్టులు నూతన యుగమునకు దారి చూపగలవు. వాద వివాదములచే నష్టమగుచున్న శక్తి యంతయు. అపుడు వేరు విధముగా ఉపయోగపడును. అపుడు ప్రజలు ముష్టి చిప్పతో ప్రభుత్వమును యాచించుటకు అవకాశముండదు.

అప్పుడే జనులు తమ తమహక్కులను, శాంతి సౌఖ్యము లను అనుభవించుచు, కలసి మెలసి యుండి దేశాభ్యుదయ మునకు తోడ్పడ గలుగుదురు. అట్లుజరిగిన నాడు ప్రభుత్వ ము ప్రజలయొక్క ఇచ్ఛా చిహ్నముగా మాత్రముండును.

కమ్యూనిటీ ప్రాజక్టు ప్రణాళికలో యీ క్రింద నుదహ రింపబడిన గ్రామాభి వృద్ధి కార్యములు చేయబడును.

## 1. వ్యవసాయ సంబంధ విషయములు.

బంజరు భూమిని సాగు చేయుట.

వ్యవసాయమునకు నీటి వసతికై కాలువలు చెరువులు మొదలగు వాని ఏర్పాటు.

నాణ్యమైన విత్తనములను రైతులకు ఇచ్చుట.

ఆధునిక వ్యవసాయ పద్ధతులను రైతులకు తెలుపుట.

పశు సంరక్షణ.

ఆధునిక వ్యవసాయ పనిముట్లను రైతులకు ఇచ్చుట.

రైతులకు ద్రవ్య సహాయము.

జంతు ఉత్పత్తిశాలలు.

క్రొత్త ఆహారవిధానములు.

చేపల పరిశ్రామాభివృద్ధి.

ఫలముల కాయకూరల అభివృద్ధి.

మట్టి, ఎరువు పరిశోధన.

అడవులను వృద్ధిపరచుట.

అడవులను పెంచుటకు తగు ఏర్పాటులు చేయుట.

## 2. రవాణా

రవాణా కనువగు రాకపోక మార్గములు.

జంతువులయొక్క ఎగుమతి దిగుమతులను ప్రోత్సాహ పరచుట.

## 3. విద్య

నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్య.

మాధ్యమిక ఉన్నత పాఠశాలలు.

సాంఘిక శిక్షణ, పుస్తక భండాగారములు.

## 4. ఆరోగ్యము, పరిశుభ్రత.

ఆరోగ్య సంబంధమైన ముఖ్య విషయముల ప్రచార మునకు ఏర్పాటు.

రోగులకు వైద్య సహాయము.

గర్భిణీ స్త్రీలకు ప్రసవ పూర్వము కావలసిన వైద్య సహాయము.

ప్రసవవైద్య సహాయము.

## 5. శిక్షణ

వృత్తిలో నిపుణత. పనివాండ్రను తయారు చేయుటకు, ప్రస్తుతమున్న పనివాండ్రకు క్రమప్రద్ధతిని తమ నిపుణత నభివృద్ధి చేసి కొనుటకు ఏర్పాట్లు.

వ్యవసాయదారులకు శిక్షణ.

అధికార ఉద్యోగాలకు తగిన శిక్షణ.

ఆరోగ్య శాఖ పరివార శిక్షణ.

ప్రాజక్టు అధికారులయొక్క శిక్షణ.

## 6. ఉద్యోగ సమస్య.

గ్రామ పరిశ్రమల అభివృద్ధి.

ప్రాజక్టు ప్రదేశముల నుండి పైకెగుమతి చేయుటకు మధ్యమ తరగతి చిన్న తరగతి చేతిపరిశ్రమలు ఏర్పాటు చేయుట.

క్రమపద్ధతిని సరకుల పంపకము, సహాయ వ్యాపార ములు, భద్రతా సంఘముల యొక్క సేవ. వీటి ద్వారా ఉద్యోగాభివృద్ధి.

## 7. గృహ సదుపాయము.

గ్రామ గృహ నిర్మాణమునకు ఆధునిక పద్ధతులు, నమూనాలు ఏర్పాటు.

నగర (పట్టణ) ప్రదేశములలో గృహ వసతి ఏర్పాటు.

## 8. సంఘ సంరక్షణ.

ప్రాంతీయ నాగరికతా ప్రతిఫల కనుగుణ్యముగా

ప్రజలకు వేడుక, వినోదముల కేర్పాటు.

విజ్ఞాన వినోదములకు, శబ్ద ఛాయాగ్రహణ యంత్రముల కేర్పాటులు.

ఆయాప్రాంతములలో అమలులోనున్న ఆటల పోటీల ఏర్పాటు.

తీర్థయాత్రలకు ఏర్పాటు.

సహకార పద్ధతి, స్వయంసహాయము వీటిని ప్రజల కలవడునట్లు చేయుటకు తగు శిక్షణ.

* * *

పైనుదహరించిన కమ్యూనిటీ ప్రాజక్టు ప్రణాళికయంతయు 5 దశలలో పూర్తియగునట్లు అంచనావేయబడినది.

1. ప్రథమ ప్రయత్నం : 3 మాసములు. ప్రాజక్టు ప్రదేశము నిర్ణయానంతరము, భూమిసర్వే, తదితర పనులకు ఏర్పాటు.

2. ఆరంభము 6 నెలలు. ఈ కాలములో ఈ క్రింద నుదహరింపబడిన కార్యక్రమము ఏర్పరుప బడినది.

ప్రాజక్టులో పని చేయువారికి తాత్కాలిక గృహవసతికి ఏర్పాటు.

రాకపోక మార్గముల ఏర్పాటు.

వ్యవసాయాభివృద్ధి పనులు ఒక పద్ధతిలో ప్రారంభించుట.

పశు చికిత్సకు తాత్కాలిక ఏర్పాటు.

ప్రాజక్టుకు కావలిసిన పరికరములను సేకరించుట.

ప్రాజక్టులో పనిచేయుటకు కావలసిన పనివాండ్రను తీసికొనుట.

ప్రాజక్టు ఆవరణలో వివిధ స్థలములందు పనిచేయుటకు పనివాండ్ర జతలనేర్పాటు చేయుట.

తాత్కాలిక ఆరోగ్య శాఖనేర్పాటు చేయుట.

ప్రస్తుతమున్న పాఠశాలలను బలపరచుట.

నూతన పాఠశాలలను తాత్కాలికముగా పాకలయందైనను ఆరంభించుట.

పాడుపడిన నూతులను, చెరువులను బాగుచేయుట.

3. ప్రణాళికను అమలులో పెట్టుట. 18 నెలలు, ఈకాలములో ప్రాజక్టు ప్రదేశమంతటను ఉండవలసిన సదుపాయములను శీఘ్రముగ ఏర్పాటుచేయుట.

4. చేసిన పనిని బలపరుచుట- 6 మాసములు.

5. ప్రథమకృషి ముగింపు- 3 మాసములు. ప్రణాళిక పూర్తికి మొత్తము 3 సంవత్సరములు.

దేశమంతటియందును 55 కేంద్రములందు ఈ ప్రణాళిక అమలు జరుపబడును. ఈ ప్రణాళిక ఆరంభమై పూర్తియగుసరికి 3 సం॥లు అగును. దీని కగుఖర్చు అంచనా 90 కోట్ల రూపాయలు. ఈ ఖర్చులో 3-వ వంతు అమెరికా సహాయము చేయుటకంగీకరించినది. రెండు ప్రభుత్వములకు నొక ఒడంబడిక జరిగినది. ఈ ఒడంబడిక ప్రకారము సంయుక్త రాష్ట్రి అమెరికా ఈ ప్రణాళికకు ఆవశ్యకమయిన ఆధునిక పనిముట్లు, యంత్రములు, సప్లై చేయును. ఇది కాక సాంకేతిక సహాయము, సలహా కూడ ఇచ్చును. దీని కంతకు ఒక అమెరికా ప్రభుత్వపు సహాయ శాఖకూడ మన దేశమందు ఏర్పాటు చేసిరి.

ప్రాజక్టులో జరుగవలసిన పనియంతయు క్రమపద్ధతిని జరుగుటకు ప్రాజక్టు ప్రదేశమంతయు ఈక్రిందివిధముగా విభజింపబడినది.

1. గ్రామము : దాదాపు జనసంఖ్య 500 లేక 100 కుటుంబములు.

2. మండి : 15 మొదలు 25 వరకు గ్రామములు కలసి ఒక మండి.

3. 4. 5 మండిలు కలసి ఒక డెవలెప్‌మెంటు బ్లాక్.

4. 3. డెవలెప్‌మెంటు బ్లాకులు కలసి ఒక ప్రాజక్టు కేంద్రము. అనగా ఒక ప్రాజక్టు ఆవరణలో రమారమి ·00 గ్రామములుండును.

## గ్రామలో నుండవలసిన ముఖ్య అంశములు.

మంచినీటికొఱకు 2 నూతులు లేక 2 గొట్టపుబావులు.

మురుగునీటికాలువలు.

వ్యవసాయాభివృద్ధి శాఖా : ప్రతి 5 గ్రామములకు ఈ శాఖకు సంబంధించిన ఒక ఉద్యోగి.

పశు వైద్యము: ప్రాజక్టు ప్రదేశములో పశు వైద్యమునకు ఒక పశువుల ఆస్పత్రి.

ఆరోగ్యము: ఆరోగ్య పరిశుభ్రతలకై ఒక ఆరోగ్య శాఖాధికారి.

కాలువలు, చెరువులు, నూతులు మొదలగు వానిద్వారా సేద్యపు భూమిలో సగము భూమినైనను సాగుచేయుట.

గ్రామమంతటిలో 3-వ భాగము గ్రామస్థుల గృహ వసతికి, పశువులమేతకు, వంటచెరకు అడవులకు వినియోగించుట.

గ్రామములన్నిటికి సరియైన రాకపోకలకు రోడ్లు వేయుట.

ప్రాథమిక పాఠశాలలు.

ప్రాథమిక వయోజన విద్యకు, వినోదక్రీడా కేంద్రమునకు ఏర్పాటు.

*　　*　　*

## మండి శాఖలో నుండవలసిన ముఖ్య విషయములు.

మధ్యమ పాఠశాల లేక ఉన్నత పాఠశాల.

ఆస్పత్రి, ప్రాథమిక ఆరోగ్య శాఖ ఒక స్థలమునుండి మరియొక స్థలమునకు తీసుకొని పోవుటకు వీలైన సంచార ఆరోగ్య శాఖ హెల్త్ విజిటర్, శానిటరీ ఉద్యోగి, మంత్రసాని,

వ్యవసాయాభివృద్ధి కేంద్రము.

తంతి తపాలాఫీసు.

రాకపోకల కార్యాలయము.

బజారు.

గ్రామపరిశ్రమల కేంద్రము.

ధాన్యము నిలువచేయుటకు గాదులు.

క్రీడా వినోద కేంద్రము.

ఉద్యాన వనము కలిసియున్న మార్గ దర్శిక ఇజారా భూమి, విత్తుల ఉత్పత్తి కేంద్రము, పశు పక్షి ఉత్పత్తి కేంద్రము.

ఉచిత పశువైద్యశాల.

## డెవలప్‌మెంటు బ్లాకులోని ముఖ్య విషయములు.

వేయి (1000) కుటుంబములకు స్నానపు గదులు, మరుగు దొడ్లతోసహా ఇండ్ల వసతికి ఏర్పాటు.

మంచినీటి సరఫరా ఏర్పాటు.

విద్యుచ్ఛక్తి.

బజారు.

అన్ని విధములైన గ్రామ పరిశ్రమలు.

తంతి, తపాలా టెలిఫోన్ ఆఫీసు.

రహదారుల శాఖా కేంద్రము.

ప్రాథమిక, మధ్యమ, ఉత్తమ తరగతి పాఠశాలలు.

వ్యవసాయ పాఠశాల.

ఒక గ్రామమునుండి మఱియొక గ్రామమునకు తీసికొని పోవుటకు వీలైన సదుపాయము కలిగియుండి, 15 మంది రోగులుండుటకు తగిన ఏర్పాట్లు కలిగి యున్న ప్రాథమిక ఆరోగ్య శాఖా కేంద్రము, ఆస్పత్రి.

కార్య నిర్వహణ ఆఫీసు, పోలీసుస్టేషను.

పశువులు, కోళ్లు మొదలగు జంతువుల ఉత్పత్తి శాల.

శిశు సంరక్షణ ఆలయములు.

పశువుల ఆస్పత్రి.

సంఘ శిక్షణ, క్రీడా వినోద కేంద్రము,

*　　*　　*

## రూరల్ కమ్ అరబన్ టౌన్‌షిప్‌లోని ప్రాజక్టు కేంద్రము ముఖ్య విషయములు.

ఇచ్చట డెవలప్ మెంటు బ్లాకులోనుండెడు సౌకర్యములతోపాటు ఈ క్రింద నుదహరింపబడినవి కూడా యుండవలెను.

ప్రాథమికోపాధ్యాయుల శిక్షణకు కళాశాల.

పారిభాషిక శిక్షా కేంద్రము.

తగవుల పరిష్కారమునకు కచేరీలు.

ట్రాక్టరులు సరఫరాచేయు కేంద్రము.

యంత్రవాహనముల కర్మాగారము.

యంత్రముల కర్మాగారము.

ఆధునిక వైద్య సౌకర్యములు కలిగియున్న ఆస్పత్రి.

లెవెలు వర్కర్సుకు శిక్షా కేంద్రము.

పశువులు, కోళ్లు మొదలగు జంతువుల ఉత్పత్తి శాల. మట్టి ఎరువుల పరిశోధన శాఖతోసహా వ్యవసాయ ప్రయోగ శాల.

*　　　*　　　*

ఈ కమ్యూనిటీ ప్రాజక్టు ప్రణాళికోద్యమానికి 1952 సం॥ అక్టోబరు 2 వ తేదీన గాంధీ జయంతి నాడు ప్రధాని నెహ్రూ ప్రారంభోత్సవము జరిపిరి. ఈ సందర్భమున వారు భారతీయులను ఈ విధముగా హెచ్చరించిరి.

"మనమందరము భారత భూమినుండి యుద్భవించితిమి. అందుచే దేశమందు దారిద్ర్యము తొలగించి దేశము సుభిక్ష మగునట్లు భూమిని మన రక్తముతో అనగా శక్తి సామర్ధ్యములతో ఫలవంతముచేయుట మన కర్తవ్యము. ప్రజలు తమ గురుతర బాధ్యతను గ్రహించి ఈ ప్రణాళిక లోని పనులన్నియు తమ తమ స్వంత పనులుగ భావించి తమ యావచ్ఛక్తులను పట్టుదలతో విని యోగించి ప్రణాళిక జయప్రదముగ కొనసాగుటకు సేవోత్సాహ దీక్షలతో పనికి పూనుకొనవలయును."

గ్రామ్య జీవనము యొక్క అంశములన్నియు నొకదాని కొకటి సంబంధించి యుండుటచే ఈ అంశములను వేర్వేరుగా ఒక్కొక్క దానిని అభివృద్ధి చేయుటకు ప్రయత్నించినచో శాశ్వతమైన ఫలితము కలుగును. అనగా ముఖ్యాంశములకు ప్రాముఖ్యత నివ్వరాదని కాదు. గ్రామోద్ధరణకై తయారుచేయు ఏ ప్రణాళికయందైనను ఈ అంశములన్నియు ఇమిడి యుండి విస్తీర్ణత కవకాశముండ వలెను. ప్రజోత్సాహముగ ప్రజానాయకులు, ప్రభుత్వము ఈ మూడింటి శక్తులను కేంద్రీకరించి దేశమందు వ్యవసాయము, విద్య, ఆరోగ్యము, జంతుసంపద నిరుద్యోగ నిర్మూలనము మొదలగు విషయముల యభివృద్ధికి పాటు పడినచో అప్పుడే ఈ ప్రణణాళిక సఫలమగును.

పోలీసు, కచేరీల ఖర్చులను సాధ్యమైనంత వరకు తగ్గించడమే కమ్యూనిటీ ప్రాజక్టు ప్రణాళిక ముఖ్యోద్దేశము. అనగా ఆహార పదార్ధములయుత్పత్తి సమృద్ధిగనుండి నిరుద్యోగము నిర్మూలింపబడినప్పుడే ఇది సాధ్యమగును. అవిద్య అనగా దారిద్ర్యము, అనారోగ్యము, అజ్ఞానము నిర్మూలింపబడవలెను. ఈ ప్రణాళిక దేశోద్ధరణకై కష్టపడి పనిచేయుట వలన, దేశమందు అశాంతి, రక్త ప్రవాహము లేకయే అభివృద్ధి సాధనకు, శాంతి యుతమైన ఒక విప్లవము కలుగజేయును.

ప్రజల యొక్క నిస్వార్ధ సేవయే గాంధీమహాత్ముని బోధలలోని ముఖ్య విషయము. కమ్యూనిటీ ప్రాజక్టు ప్రణాళిక ముఖ్యలక్ష్య మిదియే. అందుచే ఈ ప్రాజక్టులలో పనిచేయుటకు సేవాభావము కలవారిని యెంచుకొనుట చాలా ముఖ్యము. ఈ ప్రణాళికవల్ల తుదకు దేశము ఆహార ధాన్యములతో సమృద్ధిగానుండి, ప్రజల జీవనము అన్ని విధముల అభివృద్ధి పొందును.

దేశము సుభిక్షమగునట్లు, పూర్తి యైన ప్రజారాజ్య మగునట్లు చేయుటకు సర్వ శక్తి సామర్ధ్యములను ధార పోసి సేవా భావముతో శ్రమపడుట ప్రతి భారతీయుని విధి, ధర్మము.



# ★ గ్రహణములు ★

• శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్ •

గ్రహణములు.—

వాటి ప్రసరణము వలన ఎట్టి పరివర్తనము గర్భిణీ స్త్రీల యందు కన్పడునో యన్న విషయము ఇది వరలో చాలమంది పత్రికలలో 'ఇంటి అరుగులమీద' చర్చలు చేసి యున్నారు. ఇవంతా మూఢ నమ్మకాలని చిన్నవాళ్ళు త్రోసివేయుట, వృద్ధులు "మీకేమి తెలుసు?" అనుటతో సాధారణముగా చర్చలు చాలించుట ఇదివరలో జరిగిన కార్యక్రమము.

పూర్వుల ఆచారములలో, నమ్మకములలో ఏదో గుప్తమైన అర్థము సాధారణముగా వుండుట నేను గ్రహించ గలుగుతున్నాను.

1) తులసిలోని మహత్యమేమి?

2) వేప రావి చెట్లు కలసి పెరిగిన విశేషమేమి?

3) సాధారణముగా 4, 5 (ఉదయము) గంటల ప్రాంతములో జీవి ప్రాణమును వీడుట కారణమేమి?

4) ఆడమగ పిల్లలను నిర్ణయించుకొనుట తలిదండ్రుల వశమేకదా?

5) గ్రహణములు—గర్భిణీ స్త్రీలు.

ఈపై సమస్యలను గురించి మన పెద్దలు చెప్పుకొను మాటలలో, నమ్మకములలో, ఆచారములలో ఎంతోకొంత సత్యము లేకపోలేదు. కాని శాస్త్రీయమైన, సంపూర్ణముగా తృప్తికరమైన జవాబులు ఇంత వరకూ ఎచ్చటా కనబడుటలేదు.

చిట్ట చివరి విషయము—

గ్రహణములు- గర్భిణీస్త్రీలు- సోదరీమణులు ఈ క్రింది విషయములను కొంచెము పరిశీలించదగును.

Dr. Herman J. Muller (Texas University) ఒక అమెరికన్ శాస్త్రవేత్త. ఈయన 'నోబుల్‌ప్రయిజు' (Nobel Prize) బహూకృతుడు. ఈయనొక పాత విషయము తెలియచేసి యున్నారు.

సాధారణముగా మన ఇండ్లలో పండ్లమీద, మిఠాయి మీద వ్రాలు ఈగలమీద కొన్ని చిత్రమైన పరిశోధనలు చేశారు. ఈగల మీద ఎక్సురేస్ (X-rays)ను ప్రసరింపచేశారు. ఇట్లు ప్రసరింపచేసిన ఈగలకు ఎక్కువగా రాక్షస రూపముగల సంతతి పుట్టినవట. కొన్నిటికి వుండవలసిన రెక్కలకన్న ఎక్కువ కాళ్ళు, కొన్నిటికి ఒకటికి మించి తలలు గలవి, వివిధ రకములైనవి మరెన్నో పుట్టినవట.

కాబట్టి ఈయన సిద్ధాంతము - భూగోళములో విద్యుత్ కిరణములు ఎక్సురేస్ (X-rays) కు పోలినవి. Cosmic rays (సర్వసాధారణమైన కిరణములు) ఎన్నియో ఎల్లప్పుడు ప్రసరించుచుండును. అవి గర్భిణీస్త్రీలమీద ఒక్కొక్క పరిస్థితియందు ప్రసరించినప్పుడు వారికిని ఈగలకు పుట్టినట్లు రాక్షస స్వరూపములుగల బిడ్డలు (నాలుగు చేతులో, నాలుగు కాళ్ళో, రెండుతలలో, మరేదైనా వికారమో) గలిగి పుట్టుచుందురు. వర్షము కురిసినప్పుడెల్లా పిడుగులు పడుటలేదు. అట్లే ఈ గర్భిణీస్త్రీలమీద ఏవోకొన్ని పరిస్థితులయందే X'rayలు గాని cosmic rayలు గాని ప్రసరించినప్పుడు వికృతస్వరూపముగల బిడ్డలు పుట్టుదురు. అందులకే కొంతమంది శాస్త్రజ్ఞులు మన వైద్యవిధానములో X'rays జాగ్రత్తగా వాడనియెడల భవిష్యత్ మానవసంతతి కెట్టి విపత్తు కలుగునోయని ఆందోళన చెందుచున్నారు. జపానులో ఏటంబాంబు (Atom bomb) కు గురియై బ్రతికియున్న వారికి ముందు ముందు వికృతాకారముగల సంతతి కలుగవచ్చునట!

అట్లే గ్రహణాదు లప్పుడు భూమిమీద ప్రసరించు కిరణములయందు కొంత ప్రత్యేకతుండవచ్చు- సూర్యోదయమప్పుడు, సూర్యాస్తమయమప్పుడు, సూర్యకిరణముల యందు కొన్ని విశేషగుణముతో కూడుకొని యున్నవని. అందులకై సూర్య నమస్కారాదులవి మనకు నిర్ణయింపబడినవని అందరికి తెలిసిన విషయమే. ఉత్తర ధ్రువము (North pole) వద్ద ప్రతి దినమూ సూర్యోదయము చూచిన ఒక పుట్టు గ్రుడ్డికి కొన్నాళ్ళకు కండ్లు వచ్చినవట. అట్లే మెరుపులు ఆ కోనవీధిని మెరియునప్పుడు కొన్ని చిత్ర సంఘటనలు జరిగినవని శ్రీ W.O. Murphy తెలియచేశారు. స్టాక్ హోలమ్ (Stock holm) నివాసి కారల్ డివిక్సు (Carl Diviks) అను వ్యక్తికి—

వరుసగా ఆరు సంవత్సరములు. పుట్టిన దినము నాడు మెరుపులకు గురైనాడట. ఆఫ్రికాలో, నేటాలులో మెరుపులకు గురై దహించుకొని పోలేదట. చేంతాడు ముడి పడ్డట్లు చేతులు కాళ్ళు మెడకు పెనవేసుకు పోయినవట! కెనడా(Canada)లో ఒక స్త్రీ తలలోని కొప్పు పిన్నులు (Hair Pins) అన్నీ అయస్కాంతము రాయి పెట్టి ఆకర్షింపబడినట్లు కొప్పులోనుండి ఒక్కసారొచ్చి బయటకు బడినవట. ఉత్తర ఐర్లెండులో ఒక గృహము మెరుపులకు గురైనప్పుడు - ఆ యింటిలోని స్త్రీ కుట్టుమిషను ముందు చేతులో కత్తిర బట్టుకొని యున్న ఆమె అమాంతముగా మిషనుమీద కూర్చున్నదైనదట. చేతిలోని కత్తిర బలవంతముగా ఊడపెరికి నట్లైనదట. ఫ్లెచ్చరు(Fletcher) అనే ఆంగ్లేయునకు యుద్ధకాలమునందు అనుపయోగమైన చేతి వేళ్ళు మెరుపువల్ల బాగుపడినవట. ఇంకొక గ్రుడ్డివానికి కళ్ళు వచ్చినవట!

కావున ఈ గ్రహణములప్పుడు ఏమైన కొన్ని కిరణములు ప్రత్యేక పరిస్థితులయందు విపత్తు కలిగింపవచ్చును. ఆ విషయములు తెలిసియే అనుభవజ్ఞానముగల పెద్దలు గర్భిణీ స్త్రీలకు గ్రహణములప్పుడు కొన్ని నిబంధనలు ఏర్పరచి వుండవచ్చును. అవి అన్నియూ ఆమెను కదలకుండ ఇంటియందే వుంచిన, ఆమెమీద అట్టి కిరణములు ప్రసరింపకుండ యుండునని తలచి అట్టి నియమములు అమలుయందుంచినట్లు తోచుచున్నది.



# కొత్త అల్లుళ్ళు

శ్రీ ఏ. వి. రత్నం

మా అక్కయ్య పెళ్ళిఅయిన కొత్తరోజుల్లో మా బావగారిని మహాబాగా ఎగతాళి చేసేవాళ్ళం మాఇంట్లో. "బావా బావా పన్నీరు బావని పట్టుకొని తన్నేరు; వీధి వీధి తిప్పేరు వీశెడుగంధము పూసేరు; చావడి గుంజకు కట్టేరు; చప్పిడి గుద్దులు గుద్దేరు" అని ఉడికించేది మా చెల్లాయ్. ఆయన "హ్హిహ్హి" అంటూ నవ్వేవారు. మా అమ్మ, మా అక్కయ్య, నేను పక పక మని నవ్వుకునేవాళ్ళం. అయితే మా వదిన ఊరుకునేదేమిటి? మా బావగారిని వెనక వేసుకొని వచ్చేది. మమ్మల్ని దెప్పిపొడిచేది. మేం తక్కువ తిన్నవాళ్ళమా? అందులో మా రాము మరీని.

"వదినా! వదినా! వల్లంకి పిట్టా
గదిలో పెట్టా గంజినీళ్ళొయ్యా
నీ కొడుకుట్టా నాపేరెట్టా
అన్నయ్యకొట్టా నువ్వేడ్వా నే నవ్వా"

అనేవాడు గంతులేస్తూ, కాళ్లూ, చేతులూ ఊపుతూ. "ఛా తప్పు అస్తమానూ అవేంమాటలురా" అనేది మా అమ్మ.

భోజనం వడ్డించారు లేమని ఎన్నిసార్లో పిలవ వలసి వచ్చేది మా బావగార్ని. ఆయన 'మర్యాద'కు భంగమని కాబోలు నెమ్మది నెమ్మదిగా, వచ్చేవారు. వేళాకోళం చేయమంటే చేయమూ మరి. అంతా గొప్ప!

"పదేళ్ళనాటిదె పాతదూలమ్మా
పడిపోయె మా బావ పళ్వరున మీద
పళ్లన్ని పిప్పాయె నోరెర్రనాయె
వీధిలో బావగారికి వినసిగ్గులాయె
రచ్చలో మా బావకు రాసిగ్గులాయె
సభలోను బావకు తలవంపులాయె"

అంటూ చేయిపట్టుకొని, లేవదీసి తీసుకుని వెళ్లేవాడ్ని. భోజనం ఆకులో వడ్డించేవారు. పీట జరుపుకొనడం మానేసి, కూర్చునేసరికి, పెళపెళ మని కుండపెంకులు పగిలేసరికి ఫక్కున ఎగిరి గంతేస్తూ, ఒక్కసారిగా నవ్వేవాళ్ళం. ఆయన అపజయానికి లోలోపల సిగ్గుపడుతూ, గారెలు తినబోతుంటే, నెయ్యి నేను పోస్తూంటే, ఆకు నెమ్మదిగా జరిగిపోసాగింది. ఆయన తెల్లబోయాడు. పాపం చీకట్లో నల్లటి దారం కన్పించి చస్తుందాఏమిటి? "కొత్తల్లుడు"కు కోపం వచ్చేది కాదులెండి. అందుకే అంతగా మితిమీరిపోయేవాళ్ళం. పిచ్చాపాటీ మాట్లాడుకొనేవాళ్ళం. సరదాగా, సంతోషంగా ఉండేది.

ప్రొద్దున్నే లేచి, కాలకృత్యాలు తీర్చుకొని, బావగారు,

తీరుబడిగా, తెల్లటి బట్టలు వేసుకొని, సన్నగా క్రాపు దువ్వుకొని, హాలులో కూర్చొనడానికి వచ్చేవారు. ఆయనకు అనుమానమే. అయినా ఎన్నెన్ని తెలుసు కుంటారు. పడక కుర్చీలో కూర్చొనబోతే, పుటుక్కున కిందపడిపోతే, గొల్లున గోలచేసి, చప్పట్లుకొట్టి, విజయం మాదే అన్నట్టు, ఉప్పొంగిపోయేవాళ్ళం, ఆయన నాలుక కఱచుకొనేవాడు.

"తాడిపూడినుంచి కొత్తల్లుడొచ్చె
తినలేక తిన్నాడు తీపులు మూరాడు
లేవలేక లేచాడు నేలపట్టుకొని"

అని ఎక్కిరించేవాళ్ళం. ఇక పిండివంటల్లో చింత గింజలు, చిల్లరడబ్బులు పెట్టి వండేవాళ్లేమో, ఆయన నోట్లో వేసుకునేసరికి, గొంతుకడ్డపడేవి. చాటునుంచి ముసి ముసి నవ్వులు నవ్వేవాళ్ళం. కేరమ్సు, పేకా, హుషార్‌గా ఆడేవాళ్ళం. కాఫీ కిళ్లీ ఇచ్చేవాళ్ళం. ఆయన పట్టి పట్టి, చూచుకొని, మరీ వేసుకొనేవాడు.

ఆయన ఒకసారి స్నానం చేస్తున్నారు. ముఖానికి సబ్బురాసుకున్నారు. చెల్లాయ్ నెమ్మదిగా చేద, చెంబు ప్రక్కకు తెచ్చివేసింది. ఆయన వెదుక్కుంటున్నాడు. చేతికి దొరకవాయె. కళ్లు తెరిస్తే చెప్పరానంత మంట! ఆయన అవస్థ ఇంతంతకాదు.

కోపతాపాలు లేని అల్లుడు దొరికినవాళ్లు అదృష్ట వంతులు. పండుగ పబ్బాలకి రావడం పోవడం వల్ల —ఎంతగా మనం వేళాకోళం చేసినా— ఇల్లు కొత్తల్లుడు రాకతో కళ కళ లాడుతూ ఉంటుంది. మంచి అల్లుడు దొరికిన వాళ్లు అదృష్టవంతులు. లేనివాళ్లు దురదృష్ట వంతులు. కొందరు చిర్రు బుర్రు మంటూఉంటారు. అలాంటి 'ముక్కోపి' దొరికితే ఇక ఇల్లు 'చిట పట' లాడుతుంటుందేమో!

కొన్నాళ్లుపోతే అంతాపాతే. మామూలు అల్లుడై పోయి, అలగడం ఉండదు. అయితే పండుగ బహుమతులకు, బట్టలకు, గౌరవాలకు భంగం రాకుండా, సర్దుకొని రావడం కష్టమే. ఇంతకూ, అల్లుడుతోపాటు, మరొక స్నేహితు డెవరైనా వస్తే అదేమిటో మనకు బాధగా, బరువుగా వుంటుందాయె— నవ్వుతున్న అల్లుళ్లని నాలుగు రోజులుంచుకున్నా ఫర్వాలేదులెండి. అయితే కరువు రోజులు కాబట్టి, ఇదివరకంతటిగా, 'గొప్పలు' జరగడం లేదేమో అనిపిస్తుంది.

అయినా 'అల్లుళ్ల'ను తెచ్చుకోవడం పెద్దసమస్య అయి పోయింది. మార్కెట్టులో గిరాకీ ఎక్కువైపోయింది. పల్లెటూళ్లలో ఇది మరీను. అందుకే మన వాళ్లు ఎంత ఉల్లాసంగా అల్లుడొచ్చినప్పుడున్నా 'ఆడపిల్ల'ల సమస్యకు భయపడి పోతుంటారు. కట్నాలూ కానుకలూ, ఇచ్చు కొనే శక్తి లేక, "మొగపిల్లోడికేమిటండీ మహారాజు, ఎప్పుడైనా ఆయనదే పైచేయి కాబట్టి" అంటారు.

అదేమి చిత్రమో కాని, వాళ్ల సొమ్ము దాచపెట్టినట్లు— అత్తవారింట్లో— గారాలు గుడుస్తారు కొందరు. గొంతెమ్మ కోర్కెలు కోరుతుంటే, అత్తమామలు గుటకలు మింగుతుంటారు. అల్లుళ్ళ ఆడంబరం ఇంతంత కాదు. పోనీ ఇలాగే వాళ్ళ చెల్లెళ్లకి ఇచ్చారంటే, ఉహూ అదేమీఉండదు.

ఒకరినుంచి రాబట్టుకుందామనే చూస్తారు. ఇవ్వడం వచ్చేసరికి 'చాయంగల విన్నపాలు' వస్తాయ్. ఇవన్నీ తెలిసే, పాపం ఆడపిల్లవారిని తిప్పలు పెట్టడమెందుకని నా పెళ్ళి సంబంధాలు వచ్చినప్పుడు 'కట్నం' తీసుకోవ డానికి వీలు లేదన్నాను. దాంతో మా అమ్మ చివ్వునలేచి "ఇదేంట్రా, ఇంత చచ్చుగా మాట్లాడ్తావ్. బావగారి కంటె తీసిపోయావేమిట్రా నువ్వు" అంది. దాంతో నా నోరు కట్టుబడిపోయింది. బుద్ధిమంతులు ఈ క్లిష్ట సమస్యల్ని ఎట్లా పరిష్కరిస్తారో చూడవలసివుంది. మా అత్తవా రింట్లో నా స్థితి ఎలా వుంటుందోమరి. "కొత్త అల్లుడ్ని" అయినప్పుడు కాని పూర్తిగా అర్థం కావేమో ఇవన్నీ.







# "చీకటి"

నాటిక

శ్రీ పి. వి. రత్నం

రామం :— డ్రామా డైరెక్టరు.
క్రిష్ణ :— హీరో.
జ్యోతి :— హీరోయిన్.
రాంబాబు :— అభ్యుదయ రచయిత.
నారాయణ :— ట్రూప్ ఆర్గనైజరు.

ఇంకా మరికొందరు.

(రిహార్సల్స్ రూమ్‌లో)

రామం : చూడు జ్యోతి. మరికొంచెం గట్టిగా, "నన్ను అలా వేపించుకు తింటారేం?" అను ఇటువైపుకు తిరిగి.

జ్యోతి : నన్ను అలా వేపించుకు తింటారేం?

క్రిష్ణ : ఇక నోర్మూయ్. నీ నటనలు నాకు తెలుసు.

జ్యో: ఊరికే, అట్లా అనుమానపడి పోతారేమండీ? మాట్లాడినంతమాత్రం చేతనే, మనస్సులు మార్చుకునేటంత మూర్ఖురాలిని కాదు నేను.

క్రి : ఔను. మనస్సులు మార్చుకోవులే, జరగవలసిందేదో జరిగిపోయిందిగా.

రా : అదేమిటి క్రిష్ణ! ఎత్తి పొడుస్తున్నట్టు, ముఖం ముడుచుకొని మాట్లాడుతున్నట్టుండాలి. ఏదీ మళ్ళీ ఒకసారి అను.

క్రి : ఔను. మనస్సులు మార్చుకోవులే, జరగవలసిందేదో జరిగిపోయిందిగా.

రా : బ్యూటిఫుల్! Next జ్యోతి.

జ్యో: అనవసరంగా, మీ మనస్సును పాడుచేసుకుంటున్నారు. మీరు లేనప్పుడు, మీ స్నేహితుడు, ఇంటికొస్తే, పలకరించి, కుర్చీలో కూర్చోనమని, కాఫీ ఇవ్వడం తప్పు అంటారా?

రా : ఇదిగో జ్యోతీ. చూడు! ఈ సమయంలోనే, మాటలతో, చూపులతో, అతన్ని బుట్టలో వేసుకున్నట్టుండాలి. నమ్మకం కలిగించడానికి చిరునవ్వు చిలికించాలి.

జ్యో: అలాగండీ!

రా : యస్. యస్, కంటిన్యూ.

క్రి : ఇప్పటికే హృదయం పగిలి చస్తున్నాను. రాత్రింబగళ్ళు, పిచ్చివాడిలా, సంచరిస్తున్నాను. నిద్రలేదు. కొంచెమైనా, హృదయం వుంటేగా నీకు?

జ్యో: ఇక కొద్ది రోజులేగా. కొంచెం ఓపిక పట్టితే...

క్రి : ఎంతకాలం? అసలు ఎందుకు ఓపిక పట్టాలి? అటో ఇటో తేల్చి పారెయ్యమంటున్నాను. ఔను. నాకు బుద్ధి అనేది వుంటేగా?

జ్యో: ఎందుకండీ అలాంటి మాటలు? మీరట్లా వుంటే, నాకు మతిపోతుంది మరి.

క్రి : జ్యోతీ!

జ్యో: ఇంత చిన్న విషయానికి ఇంత రాద్ధాంతం చేస్తారని, నే నెన్నడూ ఊహించ లేకపోయాను.

రా : అలాకాదు. జ్యోతీ; ఇలా చూడు. ముఖం ఇట్లా

పెట్టి. మందహాసం లేకుండా, చిరుకోపంతో బాధను వ్యక్తం చేస్తూ, నీవు విసుగ్గా అనాలి.

జ్యో: సరే అలాగేనంటె. (అంటుంది మళ్ళీ)

రా : అగ్గసైజుసగారూ! ఇంకా 'టీ' కాయించలేదేమి టండీ? ఉషార్ లేకుండా వుందండి పాపం. పాపం జ్యోతికి సోడా ఇవ్వండి అలసిపోయింది. ఒరే, మూర్తీ లేవరా కొంచెం.

రాంబాబు : ఇంతవరకు కథ మంచి రసవత్తరంగా నడి చింది కదూ రామం?

రా : రాంబాబులాంటి రచయితల కలానికి కల్పనల కేమి కొదువ?

రాం : ఎన్నాళ్ళు ఈ పొగడ్తలమీద జీవించదలచావ్ రామం?

నారాయణ : ఇదిగో 'టీ' రెడీ త్వరగా త్రాగండి. ప్రతి సారీ "హస్కు" ఎక్కువై పోతోంది. లేకపోతే ఒకరి మీద ఒకరు చెప్పి పొడుపులు.

రా : ఔను. ఇలా అనుమానాలూ, ఆరోపణలూ తగ్గ నంతవరకూ....

క్రి : ఇప్పుడు మీ కొచ్చిన లోటేమిటండీ? అన్నీ అమురు తున్నాయిగా. ఇలాంటి ఛాన్స్ మరెవరి కుంటుంది!

రా : పోనీ నువ్వే డైరెక్టు చేయకూడదూ?

క్రి : నాకే ఆ మాత్రం అవకాశం ఇస్తే, మిమ్మల్ని ఏనాడో మూల కూర్చో బెట్టేవాణ్ని.

నా : ఏం రామం? నువ్వుకూడా కయ్యానికి కాలుదువ్వు తున్నావేమిటి క్రిష్ణతో.

రా : పోనీ నా తప్పు ఏమిటో జ్యోతినే చెప్పమనండి.

రాం: మీ మధ్య జ్యోతి ఏం చెప్పు తుందిలే. ఇద్దరూ కావలసినవాళ్ళే పాపం.

జ్యో: ఏమండోయ్ కవిగారూ! చాలా భావగర్భితంగా మాట్లాడుతున్నారు.... ప్రమాదం సుమండీ.

రాం: ఆ ముసి ముసి నవ్వులే ముప్పు తెచ్చి పెట్టాయ్. వచ్చే ప్రమాదం రానే వచ్చిందిగా.

జ్యో: అయితే, నిర్మొహమాటంగా మీ అభిప్రాయం ఏమిటో అనేయకూడదూ?

రా : ఔను. ఒక్క రాంబాబు మాత్రమే కాదు. ఎవరి కైనా అభిప్రాయ భేదాలుంటే ఇప్పుడే, ఇంత మందిలో అనడం బాగుంటుంది.

క్రి : అభిప్రాయ భేదాలున్నాయని ఎవరు చెప్పారు మీకు. మాటి మాటికీ ఇట్లా బెదిరించడం భావ్యం కాదు మీకు.

రా : నువ్వంత సీరియస్‌గా మాట్లాడ నవసరం లేదు. ఎవరి ప్రవర్తన ఎటువంటిదో అందరికీ తెలుసు.

క్రి : హ్హా! హ్హా!! తెలుసు. బాగా తెలుసు. అందరికీ తెలుసు. ఏనాడో తెలుసు....

రా : పిచ్చెక్కిందా?

క్రి : మీకా?

రా : షటప్.

క్రి : మర్యాదాగా మాట్లాడడం మంచిది.

నా : సైలెన్స్. సైలెన్స్ ప్లీజ్. ఇలాగైతే మనం డ్రామా వేసినట్టే....

రాం : మన ఆశాసౌధాలు కూలినట్టే.

జ్యో: బాగానే వుంది వ్యవహారం.

రాం : మన యశో రేఖలు బైట పడతాయని, మన ఆశారేఖలు చెరిగి పోవని, వెలుగులో విసూత్న భావా లతో, విశాల దృక్పథంతో....

రా : ఆపరా ఆ ప్రవాహాన్ని.

నా : రామం ఇక ఈ వేళకు రిహార్సల్స్ ఆపుచేద్దాం. మళ్లీ మంగళవారం పెట్టుకుందాం. ఇక ఈ నిప్పు ఇప్పుడు ఆరేటట్టు లేదు, లేవండి.

రాం: మరొక్క రెండు సీనులు ... మరొక నాలుగు రిహార్సల్స్ అయితే.... మన ఆశాజ్యోతులు ఆనంద జ్యోతులై, దేదీప్యమానంగా....

నా : ఇలా పేచీలు పెట్టుకో నడం మన నాట్యమండలికి పెద్ద దెబ్బ. నల్గురూ వింటే నవ్విపోతారు.

జ్యో: నిజమండీ మీరన్నది.

రా : నేనూ అదేగా చూసేది. గుట్టుగా, మట్టుగా, పనులు చేసుకోవాలంటున్నా.

క్రి : ఔనౌను. గుట్టుగా, మట్టుగా....

రా: ఏమిటీ దెప్పి పొడుపులు?

క్రి : లేకపోతే మీకు దండలేమైనా వేయమంటారా?

జ్యో: క్రిష్ణా........

క్రి : ఏం జోతీ! పాపం వారినంటే నీ మనస్సు చివుక్కు మంటోందా? అయితే మానేస్తాలె.

జ్యో: మీరట్లా మాట్లాడుతూ వుంటే....

క్రి : నన్ను బహిష్కరిస్తారు. బజారు కీడుస్తారు. అంతేనా? అయితే కానివ్వండి. డైరెక్టరుగారి కోరిక నెరవేరుతుంది.

జ్యో: మీరు ఏదో దురభిప్రాయంతో అంటున్నారు.

క్రి : నేను ఏమి మాట్లాడినా పెడర్థాలు తీసి, ప్రవర్తన బాగుండలేదనడం ఆరుమాసాలనుంచి జరుగుతున్న తతంగమేగా....

రాం: వైషమ్యాలు, విరోధాలు, విజయాన్ని చేకూర్చవని, చరిత్ర చాటుతోంది.

రా : ఇక ముసుగులో గుద్దులాట లాభం లేదు. క్రిష్ణ కావాలో, నేను కావాలో మన అభ్యుదయ నాట్యమండలి తేల్చి పారెయ్యాలి. అతనో నేనో ఉండాలంతే.

రాం: ఇలా సంకుచిత భావాలతో, స్వార్థ పరత్వంతో, సభ్యులూ, నటులూ, వుంటే సమాజం సాఫీగా నడవదు నారాయణా!

నా : తొందరపడకండి. తొందరపడకండి.

రా : నిష్కల్మష హృదయాలతో, నెమ్మదిగా, నడుచుకోవాలి. కారుణ్య దీపాలు వెలిగించుకోవాలి.

జ్యో: ఇదంతా నా వల్లనే అనుకుంటా.

క్రి : ఆహా. అదేమిటి? నేనే దీనికంతా కారకుణ్ని మొదటినుంచి చివరికంటా పన్నాగాలూ, పన్నుగడలూ, పన్నుకొని, పంజరాన్ని తయారుచేసి వుంచుకొన్నది నేనే. నేనే వెళ్ళిపోతాను....

జ్యో: క్రిష్ణా....

రా : అప్పుడు గుండెలమీద చేతులు వేసుకొని హాయిగా, నిద్రపోవచ్చు.

క్రి : నిజం! నిజం. గుండెల్ని చీల్చేస్తారని భయపడనవసరం లేదు.

జ్యో : ఛీ! ఛీ!! ఈ పాడు సమాజంలో నేను ఒక్క క్షణం వుండలేను. మనుష్యుల హృదయాల్ని అర్థం చేసుకోగల సంస్కారం, సభ్యత, మీలో వుందనుకున్నాను. నా కంటె విద్యావంతులని, విజ్ఞాన వంతులని భావించాను. ఒక స్త్రీ గురించి మీ రిట్లా కీచులాడుకోవడం సిగ్గుచేటు. నేను ఇప్పుడే ట్రెయిన్‌కి వెళ్ళిపోతున్నాను. (చరచరా లేచి వెళ్ళిపోతుంది)

అంతా: (ఒక్కసారిగా) ఆ! ఆ! జ్యోతీ!

రాం : ఇంకెక్కడ జ్యోతి? అంతా చీకటి! చీకటి



MY AMRUTANJAN

AMRUTANJAN SOVEREIGN REMEDY Best Indian Pain Balm

There are Millions of "MY"s in that MY, Applied to the 46 year old "Pocket Doctor" of INDIA.

# అమృతాంజనము

గాని,

"యధాయధా..................కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగుచున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

# మా కాపురం

• శ్రీమతి తంగిరాల శకుంతలాదేవి. •

నాకూ మారాణీకీ ప్రతి విషయంలో చిన్న చిన్న పోట్లాటలు రావడం మామూలైంది. ఎవరు సర్దుకుందామని ప్రయత్నించినా ఫలితం సున్నా. ఒంటరి సంసారం కావటం వల్ల పిల్లలతో రాణీకి ఒక్క క్షణం కూడా తీరిక వుండదు. ఏంచేస్తాం. దేవుడు పిల్లలు కావాలని ఏడ్చేవాళ్లకు పిల్లలనివ్వడు. వద్దన్న వాళ్ళకు పిల్లలనిస్తాడు. ఆలోచనలతో కొంచెం కునుకు పట్టింది కుర్చీలో, ఇంతలో.

"ఏమండోయ్ ! కాస్త పాపని ఎత్తుకోండి వంట సాగటంలేదు" అని కేకేసింది మారాణి.

ఉలిక్కిపడి "ఏమిటి రాణీ"

"కాస్సేపు పాపని ఎత్తుకోండి. కత్తిపీటదగ్గర కొస్తోంది. ఎన్నిమాట్లు అవతలికి తీయను. విసుగొస్తోంది. కాస్త పిల్లను తీసేటందుకన్నా ఎవరూ లేరాయె. తెల్లారేటప్పటికి వంటకావాలి. తెల్లారకమునుపే కాఫీ కావాలి. నా ఒంట్లో ఓపిక చచ్చింది బాబు. నే చెయ్యలేకుండా వున్నాను ఈ సంసారం"

"ఎట్లాగే అంత విసుక్కుంటే. నాదగ్గర వుండదే అది. నీదగ్గర కొస్తానని ఏడుస్తుంది. ఏది ఇట్లా ఇవ్వు" అని పాపని ఎత్తుకొన్నాను.

ఉంటేనా ఒకటే జారటం కిందికి. నేను పైకి ఎత్తుకోవటం, అది కిందికి జారటం. ఇట్లా ఒక పది నిమిషాలు గడిచాయి. నాకు విసుగొచ్చింది. బలంగా ఒక్కసారి లాగాను పాపని. అది పెద్ద పెట్టున ఏడ్పు సాగించింది.

"ఏమిటండీ, పిల్లనట్లా ఏడిపిస్తున్నారూ. కాస్సేపన్నా మనస్సుకి స్థిమితం లేదుకదా. ఇట్లా ఇవ్వండి. కాస్త పిల్లనైనా ఆడించలేరు. వంట చెయ్యాలి. పిల్లని ఆడించాలి. నావల్లకాదు బాబూ. ఎన్నాళ్లు. అంతూ తుదా అంటూ వుండాలి సంసారానికి" అని అన్నది విసుగ్గా.

"ఏం చెయ్యమంటావే, చెప్పు. అది చేస్తాను" మూతి అవోలా పెట్టి "నేనేం చెపుతాను నా యిష్టమేముంది"

"చెప్పు ఇహ. నీ యిష్టప్రకారం చేస్తాను. వంటకి మనిషి, నౌకరు ........."

"చేసేవారల్లేనే చెప్పారే !"

"అయినా ఇంద్రభవనంలాంటి ఇల్లు. అనుకున్నవన్నీ కావాలంటే ఎట్లాగే? మనకి వెనకాల భూములు పుట్రా ఏమీ లేవయ్యె. అన్నట్టు నీవు చెప్పిన సిల్కు చీర చూసానే చాలా బాగున్నది. తీసుకురానా?"

"పాపం జ్ఞాపకం పెట్టుకున్నారు సిల్కు చీర. చాలా సంతోషం. తెచ్చినా తేకపోయినా" అని అన్నది ఎంతో సానుభూతిగా.

"నిజంగా చాలా బాగున్నది రాణీ. నువ్వు కట్టుకుంటే చూడాలని వున్నది. ఏమంటావు?"

"నాకేమీ అక్కర్లేదు. ఎన్నాళ్ళనుంచో అడిగితే ఇవ్వాళ జ్ఞాపకం వచ్చింది. ఇహ తేవడానికి ఎన్నాళ్ళు పడుతుందో" అని అన్నది గునుస్తూ.

"ఎల్లుండి జీతాలిస్తారుగా......... అటునుంచి అటే తీసుకొని రానా" అన్నాను భగవంతునిముందు భక్తుడల్లే వినయంగా.

"ఏం అక్కర్లేదు. పెరుగువాళ్లు, పాలవాళ్లు కాచుకుని కూర్చుంటారు. ఉన్నది కాస్త అక్కడ ఖర్చుపెట్టుకొని రాకండి. బాకీలన్నీ తీర్చిన తరువాత చూద్దాం." అని అన్నది సందేహంగా ముఖం క్రిందికి వంచుకొని.

"ఎంత మంచిదానివే రాణీ. నీ లాంటి పెళ్లాం దొరకడం నా పూజాఫలం" అన్నాను ఎంతో సంతోషంతో.

"చాలు చాలు బాబు ఈ స్తోత్రాలు. పిచ్చిదాన్ని చేసి ఆడిస్తున్నారు. మీరు చీరకొనడం నిజమే. నే కట్టుకోవడం

నిజమే. ఏదో ఇట్లా వెళ్ళనీయండి." అని అన్నది నా అలో చనలన్నీ అప్పుడే తెలిసినట్టు.

"అదికాదే నువ్వు చెప్పు. నెలకు రెండు వందలు ఏమూలకొస్తాయె. నెలాఖరుకు ఏమీ మిగలటం లేదని నువ్వే చెబుతున్నావా. ఆఖరుకు నా సిగరెట్టు ఖర్చు కూడ నీ చేతిమీదే ఇస్తున్నావు గదా," అన్నాను ఇంటి విషయాలు ఏకరువు పెడ్తూ.

"నేనేమీ అనటం లేదండి. అందుకే కొనుక్కోలేము, కట్టుకోలేము అంటున్నానండి. సరే ఈ మాటలకేంగాని ఆఫీసు మాట మర్చిపోయినట్టున్నారె. టైము అయింది పడ్డించాను. బాబుని దగ్గర కూర్చోపెట్టుకోండి" అని అన్నది సావధానంగా.

"మరి పాపాయో" అన్నాను దాన్ని ఎవరికివ్వటానికి తోచక.

"దాని సంగతి మీకెందుకు నేనున్నానుగా అన్నిటికీ. పాపాయిని ఎత్తుకుంటాను, మీ అందరికీ అన్నాలు పెడ తాను, అన్నీ చేస్తాను, తప్పుతుందా మరి" అని అంది కొంచెం నిర్లక్ష్యంగా.

"తప్పదే మన ఇద్దరికీ ఈ సంసారం తప్పదే"

"తప్పించుకుంటే ఎందుకు తప్పదు. మహా చక్కగా తప్పుతుంది''

"అయితే తప్పించుకోవచ్చునంటావు. అదె ఎట్లాగో నీకు తెలుస్తే నాకు చెపుమా నే బయట పడతాను"

"మీరు మాత్రం సుఖంగా బయట పడాలి. నా సంగతి ఎవరికీ అక్కర్లేదు. రేపు రాత్రి 12 గంటలకి నే నీ ఇంట్లో వుంటానేమో చూడండి. మీ పిల్లలు మీరు ఏమైనా సరే"

"రాత్రి ఒంటరిగా పోతావుటే నేను పిల్లలు నీకు సహా యంగా వస్తాము. ఒకబండి కూడా కుదురుస్తా. రాజమండ్రి వెళ్ళే ట్రైన్ 2 గంటలకు వుందిగా. మీ వాళ్ళ యింటికి వెడదాం. ఏం బాగుందా వుపాయం''

"ఓ చాలా బాగుంది. ఈమాత్రానికి అక్కడికి పోవడ మెందుకు ఇక్కడే వుంటే మీరు నన్ను జాగ్రత్తగా చూడొచ్చు సహాయంగా వుంటారు. పొద్దూకులూ మీ సహాయంతోనే ఇన్నాళ్లూ వుండగలుగుతున్నాను"

"పగలక్కర్లేదు. రాత్రిళ్లేకావాలే ఎవరికైనా. రాత్రిళ్లే భయం"

"నాకేం భయంలేదు"

"నీమొఖం. నేను వెడుతున్నాను. సాయంకాలం సినిమాకు పోదాం. రెడీగా వుండు. అప్పుడు ఆలస్యం చేశావంటే కోపం వస్తుంది"

"మీరు చేస్తే.................."

"నేను చెయ్యను.తప్పకుండా వెళ్ళాలి. మరచిపోకు నే వెడుతున్నాను. తలుపేసుకో."

* * *

"ఏంరోయ్, ఎక్కడినుంచి రావడం" అని కేకేశాడు గోపి. నా గుండెలో రాయి పడింది. వీడు పట్టుకుంటే ఒక పట్టాన వదలిపెట్టడు. ఏం చెయ్యాలి. వాడు పిలిచి పలకరిస్తూంటే ఎట్లా వినిపించుకోకుండా వెళ్ళను."

"ఎప్పుడొచ్చావురా గోపీ ఈ వూరు"

"ఇప్పుడె నాలుగు గంటలకి. మీ ఆవిడా పిల్లలూ బాగున్నారా"

"ఆ అంతా బాగున్నాము. కాఫీ తీసుకొన్నావా. రా హొటల్లో కాఫీ తీసుకు పోదాము"

"నే తీసుకున్నారా. ఈ వూళ్ళో డాక్టరు దగ్గర సలహా తీసుకొందామని వచ్చాను"

"ఏమిట్రా నీకు జబ్బు"

"నాకు కాదురా. మా నాన్నకు. బ్రైను కొంచం పాడయినట్లుగా వుందిరా. ఏం చెయ్యాలో తోచటంలేదు. ఈవూళ్ళో పిచ్చాసుపత్రి వున్నదికదూ. ఎట్లా వీలుంటే అట్లా చేదామని, నీ సలహా తీసుకుందామని వచ్చానురా. ఏమంటావు"

"అయితే తొందరగా నడు. ఆస్పత్రి కట్టేసేవేళయింది" ఇద్దరమూ నడక ప్రారంభించాము. "ముందు నాకు పిచ్చె త్తుతోంది. ఇవాళ నా రాణీకి నాకూ పెద్ద యుద్ధమేవుంది. తప్పదు" అని అనుకున్నాను. వాడికి ఈసంగతి చెపితే నవ్వుతాడు. సరే ఇహ భగవంతుడిమీద భారం వేసి ఇద్దరం బయలుదేరాం. రాత్రి ఏడయింది వాడి పని పూర్తి

య్యేటప్పటికి. నాకు ఏక్షణాని కాక్షణం గుండెల్లో దడ బయలుదేరుతోంది. ఆఖరికి నా రాణీ అన్నట్టు జరిగించే. "ఎంత చిన్నబుచ్చుకుంటుందో, వీడు శనిగాడల్లే తగిలాడు ఏమీ తోచలేదు, వాడు మళ్ళీ ఈ రైలుకి వెడతాడు ఒక్కరోజు కూడా రాణీ యిష్టప్రకారం నడవడానికి వీలు పడటంలేదు. ఏం చెయ్యను."

వాడు నేను బజారు మధ్యకు వచ్చాం. వాడు మద్రాసు వచ్చి పెళ్లానికి ఒక చీరకొని తీసుకొని వెళ్ళకపోతే ఏం బాగుంటుంది అనుకుని, చీరల షాపులోకి దారి తీశాడు. సరే నాక్కూడా మంచి అవకాశం దొరికింది. రాణీకి కూడా చీర ఒకటి కొందామని నిశ్చయించాను. నా దగ్గర డబ్బు లేకపోయింది. వాడినడిగి 50 రూపాయలు తీసుకొని ఒక మంచి సిల్కుచీర, రెండు గౌన్లు తీసుకున్నా. గోపీని రైలు స్టేషనువరకు సాగనంపి, ఇంటికి బయలుదేరా.

తలుపులన్నీ తీసివున్నాయి. ఇంట్లో ఎవ్వరూ కనపడ లేదు. నెమ్మదిగా వంటగదిదాకా వెళ్లాను. రాణీ పక్కింటావిడతో మాట్లాడుతోంది. బాగానే వున్నదనుకున్నా. నేవచ్చినట్టు తెలియచేయడానికి గదిలో కొంచం చప్పుడు చేశాను.

"ఎవరూ" అంటూ మా ఆవిడ వచ్చింది.

ఇంతలో ప్రక్కింటావిడ వెళ్ళిపోయినట్లుగా అలికి డయింది. వస్తూనే "సినీమా చాలా బాగుందికదూ" అని హేళన చేసింది. అలా చేస్తుందని నేమొదటనే ఊహించా.

"రాణీ గోపీ కనపడ్డాడు. వాళ్ళ నాన్నకి పిచ్చెక్కిం దట పాపం. డాక్టరు కోసం వచ్చాడు. వాడ్ని పంపించి వచ్చేటప్పటికి యింత ఆలస్యం అయింది. సినీమాకి రేపెడదాంలే"

"నే మొదటే చెప్పాగా. మీ మాటలు నమ్మమని ఎక్కడుంది. నా యిష్టప్రకారం నడవరనికూడ తెలుసు. ఈ చీరలు ఇవన్నీ కూడ ఎందుకు. ఇప్పుడు డబ్బు ఎక్కడిది?"

"డబ్బెక్కడిదైతే నీకెందుకు? చూడు బాగున్నాయా"

"ఈమాట కొనకముందు అడగాలి, కొన్నతరువాత అడిగి ఏం లాభం. ఇప్పుడు బాగుండలేదన్నా మార్చడా నికి వీలు లేదుకదా. అయినా సినీమాకి వెళ్ళలేదని నాకు కోపం వస్తుందని కొన్నారుగాని, నిజంగా మనస్ఫూర్తిగా కొనలేదుగద. తరువాత నీపోరు పడలేక కొన్నాను అన టానికి. ఇంతేగా"

"ఇందాక చెప్పలా, చీర బాగుంది నువ్వు కట్టుకుంటే మరీ బాగుంటుందని. ఈ చీర 40 రూపాయలు. రెండు గౌన్లు పాపకి కొన్నాను. ఏం"

"మొత్తం 50 రూపాయలుదాకా అయిందన్నమాట."

"మరేమిటనుకున్నావు. నీ కోపం అంత బాధగావుం టుంది. డబ్బు, ప్రాణం కూడ అవతల పారేయవచ్చును గాని, నీ కోపం, మౌనం భరించలేను"

"నా యుక్తికి మా రాణీ పకపక నవ్వింది"

బ్రతికారా భగవంతుడా అని ఆరోజు తెల్లార్చాం.

"ఇట్లాంటివిచేసే నన్ను పిచ్చివాన్ని చేస్తున్నా"రని గునిసింది నా రాణీ.



# పుష్పకంటక బాధ

అనువాదం: శ్రీ ఆర్. సోమసుందర్.

ఓ ప్రపంచమా ! నీ పుష్పాను నేను గిల్లితిని. ఆ పువ్వును నా ఎదకదుమ ముల్లు గుచ్చుకొన్నది.

దినం అంతమొంది తమం నలుదిక్కులూ ప్రసరించి నప్పుడు ఆ పువ్వు మాడిపోవుటను నేను తిలకించాను. కాని, నా బాధ మాత్రం ఉపశమింపలేదు.

ఓ ప్రపంచమా ! సగర్వ సౌరభాన్విత కుసుమాలు యెన్నో వస్తాయి నీకు. కాని, పువ్వులను సేకరించే నా కాలం సాంతమొందింది. ఆ తమస్వినిలో నాకు నా గులాబి లేదు.... మరి బాధకూడ ఉపశమింపలేదు.

(రవీంద్రుని "తోటమాలి" నుండి)

Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 24-A, Luz Church Rd., Madras 4

ఆంధ్రమహిళ

# 10 వ వార్షిక సంచిక

మహా ఉత్సవాలలో, ఆంధ్రరాష్ట్ర అవతరణతో వెలువడుతుంది.

ఆర్టుపేపరు అట్ట, ఆకర్షవంతమైన ముఖచిత్రం,

మంచి కథలు, మనోజ్ఞమైన నాటికలు, అనుభవజ్ఞుల రచనలు,

రేఖా, ఛాయా చిత్రములు, సంఘసేవాసంస్థలు, నిర్మాణ కార్యక్రమానుభూతులు,

నిర్వాహకులచే రచనలు, ఎన్నో బొమ్మలు, వింతశీర్షికలు—

ఈ సంచికయొక్క ప్రత్యేకత.

వెల: సంచిక ఒకటికి రూ. 1—8—0

సంపాదకురాలు.

# ఐక్యరాజ్యసమితి ఎనిమిదవ మహాసభ అధ్యక్షురాలు

# శ్రీమతి విజయలక్ష్మి



ఈ ఉన్నత స్థానాన్ని అధిష్ఠించుటకు యీమెయే ప్రథమ నారి. ఆరంభమునుండి ఐక్య రాజ్య సమితి వ్యవహారములలో సన్నిహిత సంబంధమును కలిగి, ప్రస్తుత సమావేశపు ప్రతినిధి బృందంలోనూ వ్యవహారములలో పెద్దగా, అధ్యక్ష పదవికి యీమె ఎంతయు తగియున్నారు. ఆసియావాసుల గౌరవము, భారత స్త్రీల ప్రతిష్ఠ యీమె మూలంగా ఒక మెట్టుపై కెక్కినవని చెప్పవచ్చు.

సమావేశములో ప్రసంగిస్తూ, మహా సభయొక్క బాధ్యతలు చాలా క్లిష్టమైనవనియు, మొండికి పట్ట కొన్ని విషయ సమస్యలు పరిష్కారమయ్యే సూచనలు కనబడుతూ ఉండబట్టి, యీ సభకు తన యోగ్యతను నిరూపించుకునే అవకాశము ఎప్పటికన్నా ఇప్పుడు ఎక్కువగా ఉన్నదనీ, ఆమె చెప్తూ, ఒకరినిమించి మరి యొకరు పోటాపోటీలలో భయంకరమైన మారణాస్త్రాలు నిర్మించుకోవడం కన్న, యీ అస్త్రములతో పనిలేని వ్యవస్థను నిర్మించడంలో శ్రద్ధవహించాలని కూడా చెప్పియున్నారు,

ప్రేమకు సహనానికి స్థానం స్త్రీ హృదయం. కనుక, స్త్రీయైన తన సారధ్యంలో, అధికారంతో అట్టహాసం చేస్తున్న అగ్రరాజ్యాలతో, అస్త్రసన్యాసము చేయించగలిగితే యీ మహాసభ కర్తవ్యము నెరవేరినదని అనుకోవచ్చు.



# జెమినీవారి

# అవ్వయ్యార్

శ్రీమతి కె.బి.సుందరాంబాళ్ *నటించినది*



ఆంధ్రదేశపు అన్ని
ముఖ్య కేంద్రాలలో ఇప్పుడు
ప్రదర్శించబడుతున్నది



# హిందూ దేశపు తేనీరు గురించి
# ఎవరెస్ట్ వీరుల
## అభిప్రాయము...

During our ascent of Mt. Everest, Indian

tea con...

మేము ఎవరెస్టు శిఖరము ఎక్కినప్పుడు హిందూ దేశపు తేనీరు తరుచుగా మాకు సంతోషమును పుష్టిని యిచ్చినది.

సం॥ జె. హంట్
ఈ. హిల్లారి
టెన్సింగ్

కలకత్తా,
26. జూన్ 1953.

Calcutta...
26th June, 1953.



టెన్సింగ్

ఈ. హిల్లారి



**తేనీరు**

పీరు శక్తినిచ్చును.

సెంట్రల్ టీ బోర్డు వారి ప్రకటన.

CTB 113

త్వరలో వస్తుంది!



శ్రీ రాజరాజేశ్వరీ
ఫిలింకంపెనీ వారి

# లక్ష్మి

డైరెక్టర్
కె. బి. నాగభూషణం



కన్నాంబ...కృష్ణకుమారి...గిరిజ
సి. యస్. ఆర్...రేలంగి...రామశర్మ...అమరనాథ్

# ఆంధ్రమహిళ

సంపుటి 10 :: అక్టోబరు '53 :: సంచిక 6



ఇంకా, గేయాలు, పద్యాలు, బాలానందం, గ్రంథసమీక్ష, చిత్రసమీక్ష.

వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే.,బి.యెల్..
సంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే.,యెల్.టి..
ఆంధ్రమహిళా సభ, మైలాపూర్.

సంవత్సరచందా :: ఆరు రూపాయలు.




సంపుటి 10 :: అక్టోబరు '53 :: సంచిక 6

# ఆంధ్ర రాష్ట్ర అవతరణ

అక్టోబరు—1. ఆంధ్రులందఱకూ అతి ముఖ్యమైన పర్వదినముగా భావింపబడుతూవుంది. ఆంధ్రుల చిర వాంఛితమైన ప్రత్యేక రాష్ట్రమునకు యీనాడు కర్నూలు రాజధానిలో ప్రతిష్ఠ జరుగుతుంది. 40- సంవత్సరాలుగా జరుగుచున్న పోరాటము, తర్జనభర్జనలు, సంప్రదింపులు, వాగ్వ్రతివాదములు, యీనాటికి యీ ఫలసిద్ధిని పొందకలిగినవి.

న్యాయబద్ధముగా తమకు జేరవలసినవన్నీ తమ రాష్ట్రములో జేరకపోయినా, సరిహద్దుల విషయము పరిష్కారము సరిగా జరుగకపోయినా, యింకమీద యేమాత్రము ఆలస్యముజరిగినా అవివేకమై మొదలుచెడ్డ బేరముగా పరిణమించగలదేమో ననే భయముతో యిచ్చినంతవరకు పుచ్చుకుని, స్నేహభావముతో విడిపోవడం మంచిదనే ఆఖరు నిర్ణయంతో మన నాయకులు యీనాడు యీ కార్యాన్ని సాధించారు.

భాషారాష్ట్రవాద మీనాటిదికాదు. అట్టి వాదనలో అసమంజసమైనదేమీలేదు. ఏకభాషాప్రాంతముకూడా విశాలమైనదైనప్పుడు, పరిపాలనా సౌలభ్యానికేమి, ప్రాంతీయాభివృద్ధికేమి, చిన్న భాగాలుగా విభజించవలం అవసరమవుతుంది. ఈ విభజన భాషాప్రయుక్తంగా జరగడంవల్ల పై యాశయాలతోబాటు, భాషాధారమైన వాఙ్మయ, కళా, సంస్కృతుల పురోభివృద్ధినిగూడా సాధించగలుగుతామన్న వాదములో అతిశయోక్తిలేదు. నిన్నగాక మొన్న కూడ వల్లభవిద్యానగర్‌లో ప్రసంగిస్తూ మధ్యప్రదేశ్ గవర్నరు శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు, భాషాప్రయుక్త పునర్విభజనవల్ల, మనదేశములోని రాష్ట్రములసంఖ్య తగ్గునేగాని హెచ్చవని, అట్టి విభజనవల్ల దేశము ఛిన్నాభిన్నము కాగలదన్న వాదము కేవలము నిరాధారమైనదని వ్రాక్కుచ్చారు.

భాషారాష్ట్ర విభజనఅంటే, పాకిస్థాన్ విభజనవంటిదే కాగలదనీ, మళ్ళీ అంత రక్తపాతము, అంత జననష్టము, అంత ధననష్టం, అన్ని సమస్యలు పునరుద్భవిస్తాయని అనుకున్న వారి భయము ఉత్త ఊహయని ప్రస్తుతపరిస్థితులు కనువిప్పు కలిగించకపోవు. అగ్రజునికి దక్కవలసిన జ్యేష్ఠభాగముగా, వదలవలసినవన్నీ సైర్య భావంతో వదలి, ప్రశాంత వాతావరణములో వీడ్కోలునందుకున్న ఆంధ్ర సోదరులు, తమ సహజ ఔదార్యమును ఋజువుచేసుకున్నారు.

ఇల్లు అలకగానే పండుగ కాదంటారు పెద్దలు. వీడ్కోలునందుకుని విడిపోగానే ముగియలేదు సమస్య. సహజసంపదల కాలవాలమైకూడా, పంచభూతాల చేతిలో కీలుబొమ్మ తెనుగుగడ్డ. అనావృష్టి కారణంగా నిన్నటి వరకు కరువుకాటకాలలో నలిగిపోయివుంది రాయలసీమ. అఖండ గోదావరి ఆగ్రహానికి గురియై, మెడ లోతున మునిగి ఉన్నది కోనసీమ. మాట దప్పని సత్యవాదిగా కర్నూలుమట్టిగడ్డమీద గృహప్రవేశ మౌతూవుంది ఆంధ్ర రాజ్యలక్ష్మి. ఇంక, పరిపాలకులు, ఉద్యోగులు, ఎదురు కోవలసిన సమస్యలు శత సహస్రం. ఆంధ్రుల కిదియొక పరీక్షా సమయము. ఆంధ్ర శ్రేయోభిలాషుల కిదియొక దీక్షాసమయం.

# ఆంధ్ర రాష్ట్ర అవతరణ

అనుభవజ్ఞుడు, స్థిరసంకల్పుడు, బుద్ధిశాలి యైన శ్రీ చందూలాల్ త్రివేది ప్రథమ గవర్నరుగా తెనుగు గడ్డను పరిపాలించడం ఒక శుభ సూచకము. ఈ పరిపాలనలో కొన్ని సమస్యలు పరిష్కారమై, కొంత పురోగమనం కలుగవచ్చునని ఆశించవచ్చు. సత్యాగ్రహ సమరంలో వెన్నిచ్చి నిలచిన వీరుడునైన ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు గారు, ఆంధ్ర రాష్ట్రానికి ప్రథమ ముఖ్యమంత్రిగా నాయకత్వం స్వీకరించడం అన్నివిధాలా ఆశించవలసిన లక్షణం. వ్యక్తిగతమైన భేదాలు ఎలా ఉన్నప్పటికీ, ప్రత్యేక వ్యక్తులలో లోపాలెన్ని ఉన్నప్పటికీ, యీనాటికి ప్రజాస్వామికమైన ఆదర్శాలకు నిలచి, స్థైర్యముగలపార్టీ కాంగ్రెసు పార్టీ అని ఒప్పుకోవాలి. కారణాంతరాలవల్ల అందుండి విడిపోయిగూడా, దేశ క్షేమదృష్ట్యా, ప్రజాశ్రేయస్సు దృష్ట్యా, ఆ పక్షానికి తమ చేయూతనిస్తూ, యీ సమయంలో నాయకత్వం వహిస్తున్నందులకు ఆంధ్రకేసరి అభినందనీయులు.

ఏపక్షమునకు చెందినవారైనప్పటికీ, అన్నివర్గాల నాయకులకు యీ తరుణంలో ఉండవలసిన ఏకైక లక్ష్యము ఆంధ్రాభివృద్ధి. ఇతరత్రా ఎన్ని విభేదాలున్నా, శుభాశుభాలకు అందఱూ ఒకటిగా కలియడం మనకు తరతరాలుగా వస్తున్న సత్సంప్రదాయము. అట్టి సాంప్రదాయము ప్రాతిపదికగా, యీ రాష్ట్రావతరణ శుభసమయంలో, సకలవిషయములైన భిన్నాభిప్రాయాలు విడచి, ఏకమనస్సుతో, సకలశోభావంతమైన నూత్న రాష్ట్ర నిర్మాణమునకు పూనుకొనిడం నాయకులందఱి బాధ్యతా అయియున్నది. తమసంతా ఏకమై, ప్రజలందఱిలోను ఐక్యభావాన్ని నెలకొల్పి, రాష్ట్ర రాజకీయాలలో ఒక నూతనాధ్యాయాన్ని ప్రారంభించాలి. తమ చిత్తశుద్ధి, కార్యసిద్ధి, పురోభివృద్ధులపై, విశాలాంధ్ర అవతరణ, మిగతా భాషారాష్ట్రాల అవతరణకూడ ఆధారపడిఉన్నదని గమనిస్తూ, విజయసాధకములైన ప్రణాళికలను వివేకముతో అమలుపరుచుకొని మార్గదర్శకులు కావాలి. ఉద్యోగసిబ్బందిలోని అనుభవజ్ఞులైన ప్రాతవారు, ఇప్పుడే నియమింపబడిన క్రొత్తవారుకూడ, దీక్షకు, దక్షతకు ఆదర్శమూర్తులు కావాలనే ఆశయముతో, తాత్కాలికమైన కష్టనిష్ఠూరాలకు ఓర్చి సంచరించాలి.

దివంగతులు దేశోద్ధారక నాగేశ్వరరావు, దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు రాష్ట్రోద్యమ ప్రప్రథమ నాయకులు; రాష్ట్రావతరణకై ఆత్మబలిదానము చేసిన అహింసామూర్తి శ్రీ పొట్టి శ్రీరాములు. ఈ త్రిమూర్తుల ఆత్మ ఆంధ్రులైన ప్రతి ఒక్కరిలోనూ యీ శుభ తరుణములో రూపుదాల్చి, రాష్ట్ర భవిష్యత్తును తీర్చి దిద్దగలదని, అనుభవజ్ఞులైన వృద్ధనాయకుల బుద్ధి కౌశలము, కార్యశూరులైన యువక నాయకుల శక్తిసంపద, తెనుగు గడ్డకు వెలుగు దిద్దగా, తెనుగు బిడ్డ సకలసంపత్సమృద్ధితో, సర్వకామ్యసిద్ధితో, పూర్వాంధ్రశోభను మరిపించే ఔన్నత్యముతో, విరాజిల్లగలదని — రాష్ట్రావతరణ శుభసమయమున, ఆంధ్ర సోదర సోదరీమణులకు "ఆంధ్ర మహిళ" శుభాకాంక్షల నందిస్తూవున్నది.



పారిశ్రామిక విద్యాలయపు నూతన భవన ప్రారంభోత్సవ సందర్భములో త్రివేదీ దంపతులకు మహిళా సభ విద్యార్థినుల సత్కారము.

# ఆంధ్ర మహిళా సభ.




పారిశ్రామిక విద్యాలయపు నూతన భవనములలో అతిథులకు స్వాగత మీయుటాకి సన్నద్ధులైన విద్యార్థినీ బృందం.





ఆంధ్ర రాష్ట్ర ప్రథమ గవర్నరు చందూలాల్ మాధవ్‌లాల్ త్రివేది-శ్రీమతి కుసుమ త్రివేది-లజ్ చర్చి రోడ్డులో ఆంధ్ర మహిళా సభ భవనములను తిలకించుచున్నప్పటి దృశ్యము.

### ఆంధ్ర మహిళాసభ

## పారిశ్రామిక విద్యాలయపు

# నూతన భవన ప్రవేశ మహోత్సవము

ది. 23-9-1953 బుధవారం సాయంకాలం 5 గం॥లకు ఆంధ్రరాష్ట్ర గవర్నరు శ్రీ. సి. ఎమ్. త్రివేదిగారు, పారిశ్రామిక విద్యాలయపు నూతన భవనములలో కార్యకలాపాలు ప్రారంభించినారు.

3 గంటలకల్లా సభ్యురాండ్రు, విద్యార్థినులు, సన్నాయి మేళములతో లజ్‌చర్చ్‌లోని ఆంధ్ర మహిళాసభ భవనముల నుండి ఊరేగింపుతో బయలుదేరిరి. 4 గం॥ నుండి, నూతన భవన ఆవరణలో, పూజ, వేదపఠన జరిగినవి.

గవర్నరుగారు, సతీసమేతంగా, 4-30 గం॥ లకు అడయారు నందలి ఆంధ్రమహిళాసభ నర్సింగ్‌హోమ్ భవనములకు వెళ్ళి, అక్కడ శిక్షతులగుచున్న విద్యార్థినులను, సంరక్షణశాలలను పరీక్షించి, తరువాత, లజ్‌చర్చ్ రోడ్డులోని ఆంధ్రమహిళా సభ,చిన్నమాంబా విద్యామందిరము, మల్లమదేవి హాస్టల్, ఆంధ్రమహిళా ప్రెస్సును చూచి, తరువాత 5 గం॥ లకు, పారిశ్రామిక విద్యాలయపు నూతన భవనములకు వెళ్ళిరి.

భవన ఆవరణలో, విద్యార్థినుల గౌరవ వందనములు, సంభ్యురాండ్ర ఆతిథ్యము స్వీకరించి, భవనములో ఇక మీద జరుగనున్న వివిధ కార్యక్రమాల ప్రదర్శనను, చేతి పనుల ప్రదర్శనను చూచిరి.

ప్రార్థన, కార్యదర్శిని నివేదిక యనంతరము, శ్రీ త్రివేదిగారు ప్రసంగిస్తూ, ఆంధ్ర మహిళాసభ చేయుచున్న సేవను, యీసంస్థను తల్లివలె సంరక్షించు కుంటూ వస్తు ఉన్న శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్‌గారి కృషిని ప్రశంసించారు. ప్రతివ్యక్తికీ సంఘానికి సేవ చేయవలసిన బాధ్యత ఉన్నదనీ, ధనరూపంగా గానీ, కార్యరూపంగా గానీ, యీబాధ్యతను ప్రతివారూ నిర్వహించాలనీ, తీరికకాలాన్ని సేవా కార్యక్రమాలలో వినియోగించడం కన్న సద్విని యోగం ఉండబోదనీ, ఎక్కువగా స్త్రీలు సంఘ సేవకు పూనుకొనే ప్రోత్సాహము పురుషులనుండే రావాలనీకూడా వారు చెప్పారు.

ఆంధ్ర మహిళాసభకు అభివృద్ధిని ఆకాంక్షిస్తూ క్రొత్త భవనములో కార్యకలాపాలను ఆశీఃపురస్సరంగా ప్రారంభిస్తూ, పరిశిష్టరాష్ట్రములలో వ్యవహరిస్తున్నప్పటికీ ఆంధ్ర రాష్ట్రీయులను మరచిపోవద్దని సభవారిని హెచ్చరించారు.

శ్రీమతి త్రివేదీ సతిగారు కృతార్థులైన విద్యార్థినులకు సర్టిఫికెట్లు పంచిపెట్టినారు. సభ సభ్యురాండ్రు గోష్టి గానము జరిపించినారు. వందనసమర్పణ, మంగళములతో సభ ముగిసినది.



---

## కృతజ్ఞత

శ్రీమతి వేపా హేమలతమ్మగారు ఆంధ్ర మహిళాసభకు రూ. 100 - చందా చెల్లించి, యావజ్జీవ సభ్యురాలైరి.

శ్రీ పబ్బిచెట్టి రాఘవయ్యచెట్టి ధర్మసంస్థవారు, పారిశ్రామిక విద్యాలయపు బీదబాలికల భోజననిధికై, ఏటేటా యిచ్చుచున్నటుగా, యీసంవత్సరము కూడా, రూ. 50. లు ఇచ్చియున్నారు.

వీర్లకు మాకృతజ్ఞత.

అ. చన్నఘంటమ్మ.
కార్యదర్శిని.



# రాజకీయాలు

• శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు •

ఆగస్టు నాలుగో వారం మొదలుకుని సెప్టెంబర్ మూడో వారం వరకూ భారత, అంతర్జాతీయ రాజకీయ రంగాల్లో చెప్పుకోతగ్గ ప్రధాన సంఘటనలు ఇవి:— ఐక్య రాజ్య సమితి అధ్యక్ష పదవికి శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ ఎన్నిక కావటం, ట్రీస్టే పేరుతో ఇటలీ, యుగోస్లావియాలు కీచులాడుకోటం, సామ్రాజ్య వాదులను ప్రాచ్య దేశ నాయకులు హెచ్చరించటం, భారత పార్లమెంటు మరణ సుంకాల చట్టాన్ని ఆమోదించటం, తిరువాన్కూర్ కొచ్చిన్‌లో కాంగ్రెస్ ప్రభుత్వానికి ప్రమాదం ఏర్పడటం, ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ నిర్మాణం సందర్భంలో ఏర్పడుతున్న చిత్ర విచిత్ర పరిస్థితులు.

*　　*　　*

సెప్టెంబర్ 15వ తేదీన ఐక్యరాజ్య సమితి అధ్యక్ష స్థానానికి భారత ప్రతినిధి శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ ఎన్నిక అయింది. పశ్చిమ రాజ్యాల అనుచర వర్గానికి చెందని దేశపు ప్రతినిధికి ఈ పదవి లభించటం ఇదే మొదటి సారి. స్త్రీకి ఈ గౌరవం లభించటం కూడా ఇదే మొదటి సారి.

1946లో ఐక్యరాజ్య సమితి ఏర్పడినప్పుడు నిర్మాతలలో ఇండియా ఒకటిగా ఉన్నది. అప్పుడు దేశం బ్రిటన్ చెప్పుచేతల్లోనే ఉన్నప్పటికీ, పండిత నెహ్రూ నాయకత్వాన నడుస్తున్న భారత ప్రజల అభిప్రాయం కూడా ఇటువంటి అంతర్జాతీయ సంస్థ అవసరాన్ని గుర్తించింది. కాని ఆసంస్థ రాను రాను కేవలం ధనికవాదులకూ, కమ్యూనిస్టులకూ యుద్ధరంగంగా మారిపోవటంతో, ఇంచుమించుగా దాని అధికారులంతా అధిక సంఖ్యా పక్షమయిన పశ్చిమ రాజ్యాల ఆశ్రితులుగానే ఉంటూ వచ్చారు. చివరకు కార్యదర్శిగా ఉన్న ట్రిగ్వేలీని అసలు కార్యదర్శిగానే గుర్తించటానికి రష్యా వర్గం నిరాకరించటం కూడా జరిగింది. సమితి సిబ్బంది నియామకంలో కూడా అమెరికా జోక్యం కలిగించుకోనటం, ట్రిగ్వేలీ దానికి ఆమోదించటం, అంతర్జాతీయ సంస్థ అనే సంగతిని వీలయినంతవరకూ ఉభయ పక్షాలనూ కలుపురావాలన్న సంగతినీ ట్రిగ్వేలీ మరచిపోయి, దాదాపుగా పశ్చిమరాజ్యాల ప్రతినిధిగా వ్యవహరించటం జరిగింది.

అంతేకాకుండా సమితిలో చైనాకు స్థానం ఇవ్వకుండా అడ్డగించటం, పైపెచ్చు రష్యాను సంఖ్యాబలంతో కట్టివేసే ఉద్దేశంతో సమితి నియమావళిని మార్పు చేయ ప్రయత్నిస్తుండటం కూడా జరుగుతున్నది. ఇటువంటి పరిస్థితిలో సమితి అధ్యక్ష పదవి తటస్థ దేశానికి లభించటం జరిగింది.

కొరియా యుద్ధం వచ్చేవరకూ ప్రధాని నెహ్రూ అనుసరిస్తున్న తటస్థ విధానపు విలువను చాలా మంది గుర్తించలేకపోయినారు. కాని అందులో అడుగడుగునా నెహ్రూ చెప్పిన హితవును ఎవరూ ముందుగా పాటించక, ఆతరవాత పశ్చాత్తాపపడటం జరిగింది. పశ్చిమ రాజ్యాలు, కమ్యూనిస్టులు కూడా ఇండియా తటస్థ భావాన్ని అపార్థం చేసుకుని ముందు తీవ్రంగా నిందించారు. కాని తరవాత, శాంతి ఏర్పడటానికి తటస్థ రాజ్యం తప్పని సరి అయింది. అందువల్ల కొరియా యుద్ధ ఖైదీల పరటా సంఘానికి ఇండియానే అధ్యక్షురాలుగా ఎన్నుకుని, ఖైదీల కాపుదలకు ఇండియా సేనలనే రప్పించుకున్నవి. అందువల్ల సమితి అధ్యక్ష పదవికి కూడా ఇండియా ఉంటే మంచిదని ప్రపంచంలో అత్యధిక

దేశాలు నిశ్చయించుకుని ఇండియాను గెలిపించినవి. అమెరికా అనుచర రాజ్యమని చెప్పదగ్గ సయాం ప్రతినిధి కూడా పోటీచేశాడుకాని, ఓడిపోయినాడు. ఈ ఎన్నికను కూడా మొత్తం సభ్యుల్లో మూడింట రెండు వంతులు అనుకూలంగా వోటు చేయాలన్న నిర్బంధం ఉంటే, కొరియా రాజకీయ సమావేశంలో ఇండియాకు స్థానం లభించకుండా పోయినట్లే అయేది అమెరికా పట్టుపట్టి ఇండియా ప్రతినిధిని ఓడించకపోవటానికి కారణం కొరియా రాజకీయ సమావేశంలో ఇండియాకు స్థానం లేకుండా చేసినందుకు 'ఓదార్పు'గా ఇండియాకు అధ్యక్ష స్థానాన్ని ఇద్దామని ఉద్దేశించి ఉండవచ్చు. లేదా తన 'మంచి' తనాన్ని నిరూపించుకునేందుకు అట్లా చేసి ఉండవచ్చు.

* * *

ఇన్ని చిక్కులతో ఉన్న సమితి అధ్యక్షపదవిని విజయలక్ష్మి పండిట్ స్వీకరిస్తూనే, అగ్రరాజ్యాల పోరాటాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. సమితిలో చైనాకు సభ్యత్వం ఇవ్వాలన్న సూచనను వాయిదా వేయించవలసివచ్చింది. అసలు సమితి అనేది ఉండటానికి ఆధారమయిన సమితి నియమావళినే సవరించాలన్న ప్రతిపాదనపై చర్చ జరిపించటానికి అంగీకరించవలసివచ్చింది. అయితే ఆమె సమితికి ఒక్క సలహా ఇచ్చింది. జాతీయ స్వాతంత్ర్యానికి జరుగుతున్న ఉద్యమాలను గుర్తించాలనీ, అక్కడ నిరాశ కలిగించి, దౌర్జన్యాలకు దారితీసే పద్ధతులను అనుసరించటానికి సమితి ప్రయత్నించకూడదనీ ఆమె హెచ్చరించింది.

* * *

సమితి ఒకే రకపు దేశాలతో క్లబ్బు వలె మారుతున్నదని సమితి కార్యదర్శి హామర్ షెల్డ్ విమర్శించారు. చైనాకు అసలే స్థానం ఇవ్వకూడదని కొందరు ప్రతిపాదిస్తుండగా, మరికొందరు ఇండియా పేరుచెప్పి, చైనాను అగ్రరాజ్యాలలోనుంచే తొలగించాలని ప్రయత్నిస్తున్నారు. వీటో అధికారం ఉండే అగ్రరాజ్య పంచకంలో చైనా స్థానాన్ని ఇండియాకు ఇవ్వాలని వీరు చెప్తున్నారు. భారతదేశానికి అగ్రస్థానం ఇవ్వమంటే ఉచితంగానే ఉన్నదికాని, ఆమిష పెట్టి చైనాకు సున్నా చుట్ట ప్రయత్నిస్తే, అది సమితికే సున్నా చుట్టటంగా పరిణమిస్తుంది. చైనాను ఉపేక్షించ దలచినవాళ్ళకు దూరప్రాచ్య పరిస్థితి తగిన జవాబు ఇస్తున్నది.

* * *

స్వాతంత్ర్యం కోసం పోరాడే జాతీయ వాదులకు నిరాశ కలిగించే పనులేవీ చేయవద్దని విజయలక్ష్మి పండిట్ సమితిలోని పాలక రాజ్యాలను సున్నితంగా హెచ్చరించగా, ఆసియా, అరబ్ వర్గ రాజ్యాలు ఫ్రెంచి సామ్రాజ్య వాదాన్ని అతి తీవ్రంగా నిరసించినవి. ఇండోచైనా, మొరాకోలలో ఫ్రాన్సు, అమెరికాలు అనుసరిస్తున్న విధానాన్ని ఖండించినవి.

కొరియా రాజకీయ సమావేశం అప్రాంతంలో సంబంధం గల తటస్థ ఆసియా దేశాలకు స్థానం ఉండాలని చైనా ప్రధాని ఉద్ఘాటించగా, ఆసియా సమస్య అయిన కొరియా సమస్యమీద ఆసియా ప్రజాభిప్రాయం చెల్లుబడి కానందుకు భారత ప్రధాని పండిత నెహ్రూ పార్లమెంటులో విదేశాంగ విధానంపై చర్చలో నిరసన వెల్లడించారు. ఆ వ్యవహారంతో సంబంధమేమీలేని ఉత్తర దక్షిణ అమెరికాల వోట్లు ఆసియాసమస్యను ఆసియా ప్రజల ఇష్టానుసారం జరక్కుండా అడ్డగించినవని ఆయన నిందించారు. భారతదేశంలోని విదేశ స్థావరాల విషయమై ప్రస్తావిస్తూ, వాటిని కొత్తగా జరిగే పోరాటాలకు స్థావరాలుగా ఉపయోగించటమే జరిగితే, ఇండియా చర్యతీసుకోగలదని గట్టిగా హెచ్చరిక చేశారు.

ఈ సామ్రాజ్యదేశాల జోక్యాన్ని ప్రధాని నెహ్రూ కాశ్మీరు విషయమై మాట్లాడుతూ కూడా నిరసించారు. కాశ్మీర్ సమస్య పరిష్కారంకావాలంటే, దానికి అగ్ర రాజ్యాలతో సంబంధం లేకుండా చేయాలనీ, జనవాక్య నిర్వహాకుడుగా నియమించబడ్డ ఎడ్మిరల్ నిమిట్జ్ అమెరికా వాడు కావటంవల్ల అగ్రరాజ్యాలతో సంబంధం కలుగుతున్నదనీ తాను పాక్ ప్రధానితో అన్నట్లు ఆయన ప్రకటించారు. రష్యన్ వర్గం కాశ్మీరు పరిష్కారానికి అడ్డుపడ్డట్లు ఎప్పుడూ ఎవ్వరూ అనలేదు గనుక, నిమిట్జ్ నియామకం ద్వారా కలిగే అగ్రరాజ్యాల జోక్యం ఇండియా, పాకిస్థా

న్లమధ్య ఒప్పందానికే అడ్డుపడుతున్నదని అర్థం చెప్పక తప్పదు. నిమిట్జ్ పద్ధతి నెహ్రూ అన్నందుకు అమెరికాను ఇండియామీదకు ఉసికొల్పాలని పాకిస్థాన్ పత్రికలు, కొందరు నాయకులు చేసిన ప్రయత్నాలుకూడా ఈ నిశ్చయాన్నే బలపరుస్తున్నవి.

* * *

అయితే ఈ ఆసియా దేశాలన్నీ తమ సమస్యలు పరిష్కారం కావాలంటే పర్షియా మాజీ ప్రధాని మొసాదిక్ ఉద్ఘాటించినట్లు, సంయుక్త రక్షణ, ఆర్థిక ఒప్పందం చేసుకొనటం ఒక్కటే మార్గంగా కనిపిస్తున్నది. ఈ దేశాలు కలిసి కృషి చేసినప్పుడు—ఇండోనీషియా సమస్యలో మోస్తరు—విజయాన్ని సాధించినవి. విడివిడిగా ఉన్నప్పుడు—మలయా, ఇండోచైనా, కొరియా, పర్షియా, ఉత్తరాఫ్రికా లలోవలె—అపజయం పొందుతున్నవి. ఉదాహరణకు: పర్షియా, ఇండియా, చైనా, రష్యాలు ఒప్పందం కుదుర్చుకుంటే, పర్షియా ఆర్థికంగా దెబ్బతినకుండా నూనె పరిశ్రమ సాగుతూ ఉండేది. ఇండియాకు నూనె శుద్ధి కర్మాగారాలు రష్యా, పర్షియాల సహాయంతో సంపూర్ణంగా ఇండియా ఆధ్వర్యాన ఏర్పడేవి. అటుసాటి ఆసియా దేశమయిన పర్షియాను బలపరచటమేకాక, మన అభివృద్ధికి ఎంతో అవసరమైన నూనెకూడా లభించిఉండేది.

* * *

ఇటీవలనే, ఫాసిజం నుంచి విముక్తి చెందిన ఇటలీకీ, కమ్యూనిజం నుంచి విముక్తి చెందిన యుగోస్లావియాకూ ఒక చిన్నతగాదా బయలుదేరింది. 'ట్రీస్ట్' అనే మూడున్నర లక్షల జనాభాగల రేవుపట్టణంకోసం ఇవి కీచులాడుకుని కత్తులు నూరినవి. ఇటలీలో ఇంత కాలనుంచీ ఉన్న తీవ్రమితవాద ప్రభుత్వం పోయి కొంత మెరుగయిన ప్రభుత్వం ఏర్పడ్డది. కాని దేశంలో ఉన్న సమస్యల తీవ్రతనూ, ఈ కీచులాట ధోరణినీ గమనిస్తే, కేవలం ప్రజల దృష్టిని ఇతరత్రా మళ్ళించటానికి ఇటలీ ప్రధాని పెట్టిన పెటకమె ఇదనిపిస్తుంది.

భారత పార్లమెంటు సెప్టెంబర్ మూడోవారంలో మరణసుంకాల బిల్లును ఆమోదించేది. ఎవరయినా ఆస్తిగల యజమాని మరణించినప్పుడు అతడి వారసులు తమకు లభించే ఆస్తికి కొంత సుంకాన్ని ప్రభుత్వానికి చెల్లించాలని ఈ బిల్లు నిర్దేశిస్తున్నది. దీనివల్ల ఆస్తి ఏకొందరిదగ్గరో పేరుకోకుండా నివారించబడటమే కాక, ప్రభుత్వానికి మంచి ఆదాయం లభిస్తుంది. నిర్మాణ కార్యక్రమానికి డబ్బు ఇప్పుడు చాలా అవసరంగా ఉన్నది కనుక ఇది మంచితరుణంలోనే ప్రవేశపెట్టబడ్డది. ఆర్థిక వ్యవస్థలో హెచ్చుతగ్గులను కొంతవరకయినా సర్దుబాటు చేయటానికి భారత ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలలో ఇది రెండవది. జమీందారీ, జాగీర్దారీల రద్దుశాసనం మొదటిది.

* * *

ఈ బిల్లుపై చర్చ జరిగేటప్పుడు యు. పి. కాంగ్రెస్ సభ్యులొకరు స్టేట్స్ కౌన్సిల్‌లో మాట్లాడుతూ, ప్రజల ఆదాయాలను అరికట్టటానికి ప్రయత్నిస్తున్న ప్రభుత్వం ప్రజలకు ఉద్యోగాలు చూపించే బాధ్యతనుకూడా వహించవలసి ఉంటుందని హెచ్చరించారు. నిరుద్యోగ ప్రమాదం ఎంత ఎక్కువగా ఉన్నదో దేశంలో రాజకీయ పక్షాలన్నీ హెచ్చరిస్తూనే ఉన్నవి. ప్లానింగ్ కమిషన్ కూడా ఈ సమస్యను దృష్టిలో పెట్టుకుని పంచవర్ష ప్రణాళికలో సవరణలు చేయనిశ్చయించింది.

1931 వ సం॥ లో ఇట్లాగే డబ్బులోటు ఏర్పడి నిరుద్యోగ సమస్య చాలా తీవ్రంగా తయారయింది. ఆ కాలపు రచనలు, ఫిల్ములు (బాలయోగిని మొ॥) అన్నీ ఆ భీభత్సాన్ని వర్ణించినవి. అప్పటి పరిస్థితులను ప్రజల్లో ముప్పాతిక భాగం అనుభవించినవాళ్ళే. అయితే ఇప్పటి పరిస్థితి అంతకన్నా దారుణమయినది. 1931 లో నిరుద్యోగ సమస్య ఉన్నప్పటికీ వస్తువుల ధరలు చాలా తక్కువగా ఉండేవి కనుక, కుటుంబం మొత్తంలో ఏ ఒక్కరికి ఉద్యోగం ఉన్నా, మిగిలినవాళ్ళు ఆ వ్యక్తి మీద ఆధారపడి బతికే వీలు ఉండేది. కాని ఇప్పుడు ఉద్యోగాలూ లేవు. ధరలు ఆకాశానికి అంటుకుని ఉన్నవి. మనిషి బతకటానికి రెండు మూడు ఉద్యోగాలు అవసరమయ్యేట్లుగా ఉన్నవి పరిస్థితులు.

నిరుద్యోగం అనగానే చాలా మందికి కుటీర పరిశ్రమలు జ్ఞాపకం వస్తవి. కాని వ్యవహారం అంత సులభంగా తీరేట్లుగా లేదు. వందలకొలది సం॥ల నుంచి లక్షల కొద్ది

జనానికి తిండి పెడుతున్న చేనేత పరిశ్రమ ఈనాడు వాళ్లను పోషించలేకపోతున్నది. ముప్ఫయి సం॥ల పాటు దేశమంతా ఒక్క వెలుగు వెలిగిన ఖద్దరు పరిశ్రమ మునగానాం, తేలానాంగా ఉన్నది. పంచదార మిల్లులతో తాటి బెల్లపు పరిశ్రమ ఏమి పోటీ చేయకలుగుతుంది? ఇంజనీరింగ్ డిగ్రీలు గలవారిలో ఎంతో మంది నిరుద్యోగులై ఉండగా, గ్రామ పరిశ్రమలు మిల్లు పోటీకి నిలవలేకపోతుండగా, ఎలిమెంటరీ స్కూలు పిల్లలకు కూడా, ఈ 'అర్థాకలి' వృత్తులు నేర్పటానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

* * *

గతఎన్నికల్లో కాంగ్రెసు ప్రాబల్యానికి బాగా దెబ్బ కొట్టిన ప్రాంతాలు తిరువాన్కూ-ర్ కొచ్చిన్, పెప్సూ హైదరాబాదు, ఆంధ్ర, త్రిపురా ఇందులో తిరువాన్కూర్, కొచ్చిన్, హైదరాబాద్, ఆంధ్ర, త్రిపురాలలో బలమయిన వామపక్ష వర్గాలు కాంగ్రెసు నిరంకుశత్వానికి పెద్ద ప్రతిబంధకాలుగా తయారయినవి. పెప్సూలో కాంగ్రెసేతర మతవర్గాలు బలిష్టంగా తయారయినవి. పెప్సూలో కాంగ్రెసేతర మతవర్గాలు ప్రభుత్వాన్ని స్థాపించినవికాని, అవి చీలిపోయి, వాటి బలహీనతవల్ల వామపక్షాలు బలపడుతున్నందువల్ల, అక్కడ అధ్యక్షపాలన ప్రవేశ పెట్టబడ్డది. హైదరబాదులో స్వల్ప మెజారిటిలో కాంగ్రెసు ప్రభుత్వం "దినదినగండం - డిల్లీ ప్రయాణం" గా సాగుతున్నది. తిరువాన్కూరు కొచ్చిన్‌లో కూడా అతిసల్ప మెజారిటీతో సాగుతూండగా, తమిళ కాంగ్రెస్‌వాదులకూ మళయాళవాదులకు తగాదా వచ్చింది. తమిళుల తోడ్పాటు లేకపోతే కాంగ్రెసుకు మెజారిటి వుండదు. ప్రజాసోషలిస్టులు, ఐక్యవామపక్షాలవారు కూడా విశ్వాసరాహిత్య తీర్మానం ప్రతిపాదించ నిశ్చయించుకున్నారు. కాంగ్రెస్ ప్రభుత్వం ఓడిపోతే, ఎన్నికలు జరిపిస్తుందటకాని, ప్రాతికూలపక్షాలు ప్రభుత్వం నడపగలవేమో పరీక్షించి చూసేందుకు కూడా అంగీకరించదట. పార్లమెంటరీ ప్రజాస్వామ్య తత్వం తిరువాన్కూర్ కొచ్చిన్ కాంగ్రెసువాదుల్లో ఇంతబాగా కనిపిస్తున్నది.

* * *

ఆంధ్రరాష్ట్రం ఏర్పడకముందే మంత్రివర్గ ప్రతిష్టంభనలు ఎర్పడుతున్నవని చెప్పవచ్చు. పూర్తి మెజారిటి లేకపోయినా, ఉన్న పార్టీలలో తాము పెద్దకనుక తామే ప్రభుత్వం ఎర్పాటుచేయాలని కాంగ్రెసు పెద్ద సంజీవరెడ్డిగారు ఉబలాట పడుతున్నారు. అయితేవారు ఇతరుల తోడ్పాటు లేనిదే ప్రభుత్వం నడపలేరు. తమతోడ్పాటు కావాలంటే నాయకుణ్ణి అంతాకలసి ఎన్నుకోవాలేకాని, కాంగ్రెస్ పార్టీ నాయకుడినే నాయకుడుగా అంగీకరించేది లేదని, ప్రజా సోషలిస్టులు, కృషిక్ లోక్ ప్రభృతులు చెపుతున్నారు. ప్రకాశంగారు ఉండటం సమ్మతమేనని వీరూ, కాంగ్రెసులో శంకరరెడ్డిగారి వర్గమూ చెపుతున్నారు.

ప్రకాశంగారు తమ పార్టీని వదులుకుని కాంగ్రెసులో సహసభ్యుడుగా చేరాలని సంజీవరెడ్డిగారు పట్టుపట్టారు కాని, ఢిల్లిలో కాంగ్రెస్ కార్యవర్గంవారు స్వతంత్రుడుగా ఉంటేచాలు ముఖ్యమంత్రి కావచ్చునంటున్నారు. ప్రకాశంగారు ఏవిధంగా నిర్ణయిస్తారో కాని, క్షణక్షణానికీ మనసులు మార్చుకుంటున్న ఈ అతుకుబొంత ప్రభుత్వం ఎంతకాలం ఉంటుంది అన్న విషయాన్ని ఆలోచించుకోనటం మంచిది. కర్నూలు రాజధానితో పాటుగా తమ ముఖ్యమంత్రిత్వంకూడా వెనక మద్రాసు ముఖ్యమంత్రిత్వంవలెకూలి పోతుందేమో వారు ఆలోచించుకోవాలి.

ఈ సందర్భంలో ప్రకాశంగారు అవిభక్త మద్రాసులో తాము నడిపిన యు. డి. ఎఫ్. సంగతిని గమనించటం అవసరం. యు. డి. ఎఫ్. విచ్ఛిన్నానికి కారణం పరాజయంవల్ల ఏర్పడ్డ అసంతృప్తే ముఖ్యకారణమని చెప్పవలసి వుంటుంది. ఆంధ్రలోకూడా అటువంటి ఫ్రంటును నెలకొల్పి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయవలసిందని కమ్యూనిస్టులు తమకు తామే కోరారు కమూనిస్టుల సవాలులు స్వీకరించటానికి అల్పనాయకులకు ధైర్యం లేకపోవచ్చునేమో కాని, ప్రకాశంగారు మాత్రం వెనకాడ నవసరంలేదు. అదీకాక, కమ్యూనిస్టులతో సహకారం రాష్ట్ర ప్రభుత్వం స్థాయిలో జరిగితే తమకు ఎటువంటి ప్రమాదమూరాబోదు కదా.

ప్రకాశంగారు ఆంధ్రలో ప్రథమ కాంగ్రెసేతర అభ్యుదయ ప్రభుత్వాన్ని ఏర్పరచి, ఎన్నికల్లో ప్రజలు వెల్లడించిన కోరికను నెరవేర్చి, "ప్రజలే ప్రకాశం, ప్రకాశమే ప్రజలు" అన్న వాడుక చరిత్రలో నిలిచిపోతుంది. అఖిల భారత ఫార్వర్డ్ బ్లాక్ కార్యదర్శి శీలభద్రయాజిగారు ప్రజా సోషలిస్టులకు ఇందులో సహకరించాలని చేసిన విజ్ఞప్తి వృథా కాదని ఆశ. రాష్ట్ర ప్రభుత్వ స్థాయిలో కమ్యూనిస్టులు విప్లవంజరిపి ప్రభుత్వాన్ని స్వాధీన పరచుకోలేరు గదా!





మూలం : ద్విజేంద్రలాల్ రాయి. అనువాదం : శ్రీమతి మాణిక్యవల్లి.

—:o:—

[జరిగిన గాథ : మొగలు ఆధిపత్యాన్ని గుర్తించి, మొగలులతో యుద్ధాన్ని తప్పించాలని మేవాడ్ రాణా అమరసింహుడు చేసిన ప్రయత్నం విఫలమవుతుంది. రాజపుత్రుల్ని చిటికలో జయిస్తానని ఉత్తరకుమార ప్రజ్ఞలు పలికిన మొగలు సేనాధిపతి హిదాయతుల్లాకు యుద్ధంలో చావు తప్పి కన్నులొట్టపోతుంది. అమరసింహుని పెత్తండ్రి సగరసింహుని ఢిల్లీ చక్రవర్తి మేవాడ్ రాణాగా చిత్తూరు పంపిస్తాడు. రాజకుమారి మానసి, అజయసింహులు సమావేశం కావడానికి రాణి అభ్యంతరం చెబుతుంది. తిరిగి మేవాడ్ పైకి శత్రు సేనలు వస్తాయి. రాణా పెత్తండ్రి కుమార్తె సత్యవతి రాణాకు తన్ను తాను తెలుపుకొని యుద్ధానికి విముఖంగా వున్న రాణా మనస్సు మారుస్తుంది. మేవాడ్ రాణాగా చిత్తూరు వెళ్ళిన సగరసింహుడు పురాతనమైన చిత్తూరు దుర్గంలో వుండలేక ఒక అర్ధరాత్రి తన పూర్వుల భూతాలను చూసినట్టు భ్రమించి మూర్ఛపోతాడు. ఇక చదవండి.]

---

[స్థలం: ఉదయపుర రాజాంతఃపురం. సమయం: మధ్యాహ్నం]

మానసి : చూడు, కల్యాణీ, నేను కుష్ఠురోగులకో ఆశ్రమం కట్టించాను. దానిలో చాల మంది నివసిస్తున్నారు. ఇంకా వచ్చేవారు వస్తున్నారు. పాపం వారెంత ఆర్తిలో వున్నారు!

కల్యాణి : మీ జీవితం ధన్యం.

మా: అలా ప్రశంసించు కల్యాణీ. తలపెట్టిన పని కొనసాగించడానికి ధైర్యోత్సాహాలు కలుగుతాయి.

క : ఇతరు లేమంటున్నా రేమిటి?

మా: నాన్నగారు తప్ప మిగతా అందరూ తప్పుపడుతున్నారు. రాజకుమారి యిలాటి పనుల్లో రాణించదుట. రాజకుమార్తెలు సుఖానికి నోచుకోలేమ కాబోలు!

క : దానిలో మీకు సుఖం వుందా?

మా: నిస్సందేహంగాను. వాస్తవమైన సౌఖ్యం పరుల సుఖప్రాప్తికి దోహదం చేయడంలోనే వుంది. స్వీయ సుఖాకాంక్షమైన చర్యలు స్వసంతానాన్ని భ్రమింగే క్షుద్ర జంతువుల వంటివి.

క : అన్నయ్యా యిదేమాట. తను మీ శిష్యుడేగా. తనకెప్పుడూ మీ నామస్మరణే.

మా: నా నామస్మరణా?

క : అంతేకాదు. మిమ్మల్ని పూజిస్తాడుకూడా. "అప్పుడప్పుడు నా ఆత్మ హరిద్వారానికి వెళ్ళి తీర్థమాడి వస్తూవుండమని" చెప్పాడు.

మా: మరివారు రావడం లేదేం? నాకెంతో చూడాలని వుంది. ఓ సారి రమ్మని చెపుదూ.

(దాసి వస్తుంది)

దాసి : రాజకుమారీ! యెవరో అమ్మి పటాలు తెచ్చింది.

మా: అమ్మకోడానికా?

దా: చిత్తం.

మా: అయితే యిలా పంపించు.

(దాసి వెడుతుంది)

మా: మీ అన్నయ్య యేం చేస్తున్నారు?

క : ఏమో, ఎప్పుడూ ఇంట్లో వుండడు. అడిగితే ఫలానా రోగి సేవకో, ఫలానా దుఃఖితునికి ధైర్యం చెప్పడానికో వెళ్ళేనంటాడు.

(పటాల మనిషి వస్తుంది)

మా: ఏవీ పటాలు చూపించు.

(పటాల మనిషి మూట విప్పుతూ వుంటుంది)

మా: మీ దేవూరు?

ప.మ: ఆగ్రా.

మా: అబ్బా. ఇంత దూరం పటాలమ్మకోడానికే వస్తి?

ప : చిత్తం. ఈ వృత్తిలోనే దేశమంతా తిరుగుతామమ్మా.

మా: ఆపటం యెవరిది?

ప : అక్బరు చక్రవర్తిది.

క : అక్బరు చక్రవర్తిదా? ఇలాతే చూద్దాం. (చేత్తోపట్టుకొని) ఓహో యేమి తీవ్రదృష్టి!

మా: దయా స్నేహాలు కూడా ప్రస్ఫుట మౌతున్నాయి. అదెవరి పటం!

ప : మానసింహ మహారాజుది.

క : ఈయన ముఖంలో కొంచం విషాదం, నిరాశా గోచరిస్తున్నాయి.

మా: అవును కొద్దిగా విచారం కనిపిస్తూంది. కాని చూడు ఆత్మగౌరవం కూడ ప్రకటిత మవుతున్నది. అదెవరిది?

ప : జహంగీరు చక్రవర్తిది.

క : మొహం యెంత డాంబికంగా వుందో?

మా: దానితోపాటు పట్టుదలకూడ మూర్తీభవించింది. అదెవరిది?

ప : మొగలు సేనాధిపతి సర్దార్ హిదాయితాలీది. చూశారా యెంత అందమైన మొహమో?

(మానసి పరికించి చూసి నవ్వుతుంది)

క : నవ్వుతారేం?

మా: చూడు, ఆముఖ కళవళిక పరీక్షించు. వంకర టింకర జుట్టు! మధ్య పాపిడి! స్త్రీ పురుష వేషం వేసినట్లుంది. ఇతడు పట్టి మూర్ఖుడు, అహంకారి అయివుండాలి. అదెవరు?

ప : మహాబత్ ఖా.

మా: సేనాధిపతి మహాబత్ ఖా యా? (కొంచంసేపు చూసి) జన్మవీరుడు. ఆ లలాటం యెంత వున్నతంగా వుందో, యేమి తీవ్ర దృష్టి! ఇలాంటి తేజం, ధృడత్వం! ఔదార్యం, ఆత్మాభిమానం కలిసి ఒక్కరిలో ఉండడం అరుదు. కల్యాణీ, యేమిటి దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?

క : (తల వొంచుకుని) యేం లేదు.

మా: ఆపటం యెవరిది?

ప : ఉమరావోంకీ చక్రవర్తిది.

మా: సరే. అక్బర్, జహంగీర్, మానసింహ, మహాబత్ ఖాల పటాలు తీసుకుంటాను. మొత్తం యెంత యిమ్మంటావు?

ప : తమ దయ.

మా: ఇవిగో (నాలుగు మొహిరీలు యిస్తుంది)

ప : (మొహిరీల మొహరు చూపిస్తూ) వీరు అమరసింహ రాణావారు కాదండీ?

మా: అవును.

ప : ఇక్కడెక్కడా మీ బొమ్మలు లేవే?

మా: నా చిత్రాలు లేవు.

ప : ఆజ్ఞయిస్తే నే గీస్తాను.

మా: నా బొమ్మా? ఎందుకు?

ప : మీ మొహంలో కరుణ వుట్టిపడుతోంది. అలాంటి మొహాన్ని నే నెక్కడా చూళ్ళేదు. బొమ్మలు గీయడం నాకంత రాదు. కాని మీ బొమ్మ గీయగల్ను.

మా: అవసరంలేదు.

ప : దాన్లో నష్టమేముందమ్మా?

మా: అహఁ. వద్దు. అది నష్టదాయకమే. ఇక నువ్వు వెళ్ళ వచ్చు.

ప : చిత్తం. (వెళ్ళిపోతుంది)

మా: కల్యాణీ, యెవర్నంత దీక్షగా చూస్తున్నావు?

క : అబ్బే, యెవర్నీ లేదు. (పటాలు మానసి కిస్తుంది)

మా: ఇందులో తప్పేముంది? ఉండు ఆపటం పైకి తీస్తాను. (ఏరి ఓపటం కల్యాణికిచ్చి) చూడు, అదేనా? ఎందు కంత సిగ్గు కల్యాణీ? నీ భర్తేగా?

క : (ముఖం వాలేసుకుని) అయితే యేం? విధర్మి.

మా: (విషాదంగా నవ్వి) ప్రపంచంలో ధర్మం పేరుతో అయినంత రక్తపాతం మరి దేని పేరుతోనూ కాలేదు. జీవులు పరమాత్మ నుండి వలె ధర్మాలన్నీ ఒక మహా ధర్మంనుండి పుట్టినవే. అందువల్ల మానవులు ధర్మం పేరుతో విరోధం పెట్టుకొనడం తగని పని.

క : వారిని ప్రేమించడం పాపమా?

మా: ఎంతమాట ! పవిత్ర ప్రేమ మహాజ్యోతి స్వరూపం. ప్రపంచంలో దాని కిరణ ప్రసారం లేని ప్రదేశం లేదు. దయాంతఃకరణ గల ప్రతి వ్యక్తికీ దాని ప్రభావం గోచ రిస్తుంది. దుర్మార్గుల్ని, పాపాత్ముల్ని ప్రేమించడం లోనే వుంది అసలు మానవుని ఘనత. అదీగాక మహా బత్ ఖా ధర్మచ్యుతుడు కాదు. దేవుని 'బ్రహ్మ' అన డానికి వారు 'అల్లా' అంటారు. ఇది కేవలం భాషా భేదం. అంతమాత్రం చేత ఆయన పాపాత్ముడెలా అయ్యారు?

క : ఈ రోజునుండి మీరు నా గురువులు.

మా: ప్రేమ రాజ్యంలో అందం, అనాకారం, మంచి, చెడు అనే వివక్షత లేదు. జాతి భేదాలు మొదలే లేవు. పవిత్ర ప్రేమ వాయువు వలె స్వచ్ఛందమైనది. సూర్యదేవునివలె స్వయం ప్రకాశమైనది. దానికి ఆకా శానికి వలె అవధులు లేవు; అది ఒక మధుర మంగళ గీతం. ఆత్మను మృత్యువైనను నశింప చేయలేనట్లు, మహాకాలాన్ని ప్రళయం సైతం తుడిచివేయజాలని రీతి దాని దివ్యనాదాన్ని ప్రపంచంలో యే శక్తీ ఆపలేదు. అలా చూస్తావేం, కల్యాణీ ?

క : (కల నుండి మేలు కన్నట్టు వులిక్కి పడి) రాజపుత్రీ, మీ హృదయం గానమాధురిని విరజిమ్మే దివ్య వీణా తంత్రి. (కొంచెం ఆగి) యిక నాకు సెల విప్పండి. అనుమతిస్తే రేపు మళ్ళీ వస్తాను.

మా: సరే, రేపు తప్పకుండా రావాలి. ఒకసారి అజయుణ్ణి కూడా రమ్మను.

(కల్యాణి వెడుతుంది రాణి వస్తుంది)

రా: మానసీ !

మా: ఏమమ్మా?

రా: మీ నాన్న గారు పిలుస్తున్నారు.

మా: ఎందుకమ్మా?

రా: నా మాట మీద నమ్మకంలేక, నీ పెళ్ళి ముహూర్తం నిశ్చయించాలి కాదూ, దానికి నీతో మాట్లాడాలిట.

మా: ఏమిటమ్మా.

రా: ఇంకా యేమిటమ్మా యేమిటి? యన్వంత సింగును నిర్ణయించాం. ముహూర్తం నిశ్చయానికి జోధపురం మనిషిని పంపుతున్నాం.

(మానసి యేడుపు ప్రారంభిస్తుంది)

రా: ఎందుకే?

మా: ఏం లేదు, నాకు పెళ్ళొద్దు.

రా: కారణం?

మా: వివాహ సూత్రంతో నా జీవితాన్ని బంధించుకోలేను. నా ప్రేమ పరిధి అంతకంటె విశాలమైనది.

రా: అదేమిటే ! ఒంటరి బ్రతుకు కష్టం కాదూ?

మా: ఏం కష్టం? బాల వితంతువులు గడపగాలేంది కన్యలు మాత్రం బ్రహ్మచర్యం గడపలేరా? నాకు పెళ్ళి ఒద్దు. నాన్న గారితో చెబుతాను. (వెడుతుంది)

రా: ఈ పిల్లకి పిచ్చెత్తలేదు గదా? ఏమవుతుంది మరి? వారేమన్నా పట్టించుకుంటేనా. నే మొదటినుండీ భయపడుతూనే వున్నాను. అదుగో వారే వస్తున్నారు. నాలుగు మాటలూ అనేస్తాను.

(రాణా వస్తాడు)

రా: మానసి యేదీ?

రా: అలా రాలేదూ? దానికి మతోయినట్టుంది.

రా: అదేమిటి?

రా: ఏముంది జీవితాంతం పెళ్ళిచేసుకోనంటుంది.

రా: ఓహో, అలాగా? అర్థమయింది.

రా: దానికి కాస్త భయం చెప్పండి మొర్రో అంటే వినిపించుకున్నారా? ఇప్పటికేనా తెలిసిందా, మీ వుదాసీనత ఫలితం?

రా: ఊరుకుందూ, నీకేం తెలియదు.

రా: స్పష్టంగా తెలుస్తోనే వుంద దానికి మతిపోయినట్టు.

రా: ఆరకమైన ఉన్మాదం నీకుంటే సువర్ణ సింహాసనంపై కూర్చోబెట్టి పూజిస్తాను.

రా: రామ! రామ! తండ్రీ కూతుళ్ళిద్దరూ ఒకటే!

రా: రాణీ, మానసిని నేనూ పూర్తిగా అర్థం చేసుకోలేక పోతున్నాను— అయినప్పటికీ అదొక దేవతా మూర్తి అనడం నిస్సందేహం.

రా: అయితే అది—

రా: ఉహుఁ. దాన్నిగురించి నువ్వేం చెప్పవద్దు. అలా చూస్తూ వుండు. (వెళ్ళిపోతాడు)

రా: ఇంకేం, ఈ తండ్రి పిచ్చే కూతురుకీను! ఇంతకూ నా రోజులు బాగులేవు. (తెర)

## రంగము- ౬

స్థలం: గోవిందసింహుని యిల్లు. కాలం: మధ్యాహ్నం.

కల్యాణి: (పుష్పాంజలియై గోడనున్న పటం వైపుచూస్తూ) ప్రియా! ప్రియతమా! నా హృదయాంధకారాన్ని బాపిన సూర్యదేవులు మీరు. నా జీవిత కుసుమాన్ని నిలిపివుంచే ఆశా తోడిమ. మీ మూర్తి నిత్యనూతనం. మీ నామం మధుర తమం, మీరే నా సర్వస్వం. (పూలు పటంపై జల్లుతుంది. ఇంతలో గోవిందసింహుడు వస్తాడు.)

గో: కల్యాణీ!

క: (వెనుదిరిగి) నాన్నగారూ!

గో: ఆపటం యెవరిది?

క: (తల వొంచుకుంటుంది)

గో: అదిక్కడి కెలా ఒచ్చింది?

క: నే తెచ్చుకున్నాను.

గో: ఎందుకు?

క: పూజించుకోడానికి.

గో: ఎంతమాటన్నావూ!

క: ఏం, నాన్నగారూ? అందులో తప్పేముంది? (పాదాలపై వాలుతుంది)

గో: ఆ మనిషితో నీకేం సంబంధం?

క: (లేచి) నాన్నగారూ! వారు నన్నగ్ని సాక్షి.. చే.........

గో: నిన్ను చేపట్టినవాడు లేడని యెన్ని సార్లు చెప్పాలి?

క: నాన్నగారూ, యిదివరలో నేనూ అలాగే అనుకున్నాను. కాని నా భర్త.........

గో: విధర్మి మహోబత్ ఖా నీ భర్తా?

క: నాన్నగారూ, నాకు ధర్మాలు, ఆచారాలు తెలియవు. వివాహ సూత్రంతో మా జీవితాలు ఒకటయ్యాయి. ఆ పవిత్ర బంధాన్ని త్రెంచే శక్తి యెవరికుంది?

గో: మతాంతరుడై మహోబత్ ఖాయే స్వయంగా త్రెంచలేదూ?

క: లేదు. అప్పుడూ వారు నన్ను స్వీకరించ దలచారు.

గో: అలాగా? మహమ్మదీయుడైన పిమ్మట గోవింద సింహుని కూతుర్ని స్వీకరించడం మహోబత్ ఖా యిష్టా

నిష్ఠాలపై ఆధారపడివుందా! కల్యాణీ, తిరిగి చెపుతున్నాను. అతడు హిందూధర్మం విసర్జించిననాడే నిన్ను పరిత్యజించాడు.

క : లేదు నాన్నగారూ.

గో : గుడ్డి నమ్మకం. నువ్వు అతనికి ఉత్తరం వ్రాశావా?

క : ఊఁ.

(అజయసింహుడు వస్తాడు)

గో : ఇదుగో ఇది జాగ్రత్తగా విను. "నే నిన్ను పరిగ్రహించలేను" అని నీ వుత్తరం తిరగ్గొట్టేశాడు. ఇదుగో. (ఉత్తరం క్రింద జారగా కల్యాణి తీసి వుత్సాహంతో చూస్తూ వుంటుంది.)

గో : నిజమే అజయా?

అ : ఆఁ. మొగలులు తిరిగి దండెత్తి వచ్చారు.

గో : సేనాధిపతి యెవరు?

అ : పరవేజీ.

గో : సేన ఏపాటి ఉంది?

అ : దాదాపు ఒకలక్ష.

గో : (నిట్టూర్చి) ఇక మేవాడ్ రక్షణకు ఆశలేదు. (కల్యాణి దిక్కై-) యేం కల్యాణీ, తలపంచుకున్నావేం?

క : ఏం చెప్పను నాన్నగారూ?

గో : ఇంకా అతడు నీ భర్తేనా?

క : నిస్సంశయంగాను. తమను ఆదరించే భర్తల్ని అందరూ పూజిస్తారు. హింసించు భర్తను గౌరవించేదే నిజమైన సాధ్వి. వియోగాన్ని ప్రేమకు అడ్డురానీయక, తిరస్కారావమానాలను సరకు చేయక, సుఖవేశానికైనా నోచుకోలేదని తెలిపే క్షుభితహృదయులు గాక పతి పాద పూజ చేసే అతివల ప్రేమ చంద్రకళ వలె ప్రసాదమై భూధరము వలె సుదృఢమై, ధృవ తారవలె సుస్థిరమై వుంటుంది. విశ్వాసం వలె స్వచ్ఛమై, అయాచిత ప్రాప్తి యగు కరుణను పోలిన పరమ సాధ్వి పతిభక్తి మాతృప్రేమ వలె నిరాపేక్షమైనది. సర్వదా వారు నా దైవం. అదృష్టముంటే వారి చరణసేవా భాగ్యం లభిస్తుంది. లేకుంటే లేదు.

గో : నీవు నా కూతురివేనా కల్యాణీ?

క : నాన్నగారూ, మీ గౌరవానికి భంగ కరంగా యెన్నడూ ప్రవర్తించను. నేడు నేనొక అసాధారణమైన అనుభూతి పొందాను. వారు నా జీవిత సర్వస్వమని గుర్తించాను. దేశం కోసం మీరు మా జీవితం ముడుపు కట్టారు. అలాగే నేనూ నిరవధి కానందమయమయిన త్యాగమార్గంలో నడువ సమకట్టాను. నన్నడ్డగలవారెవరు? (ఆవేశంతో కంఠం ఒణుకుతుంది.)

గో : ఓహో, నీ చలితస్వభావాన్ని త్యాగమంటున్నావా?

అ : నాన్నగారూ, నిదానించి మాట్లాడండి. కోపంలో మిమ్మల్ని మీరు మరచి వున్నతమైన పవిత్రభావాల్ని తూలనాడుతున్నారు.

క : (సగర్వంగా) నాకు తగిన సోదరుడవన్నయ్యా.

గో : (అజయునితో) కల్యాణికి భర్త లేడని లక్ష సార్లు చెప్పాను.

క : పరలోకంలో కూడా వారే నాపతి అని నేనూ లక్ష సార్లు చెబుతాను.

గో : ఆ దుష్టుడు, నీచుడు, అధమాధముడు—

క : నాన్నగారూ! మీ దృష్టిలో యెలాంటి వారైనా వారు నాకు పూజ్యులే.

గో : ఆ జాతిద్రోహి, విధర్మి గోవింద సింహుని కూతురికి పూజ్యుడు! హా, హతవిధీ!

క (దృఢ స్వరంతో) నాన్నగారూ, నాకు తండ్రి, జాతి, ధర్మం యేవీ తెలియవు. నా ధర్మం పతి. శాస్త్రాల్లో స్త్రీకింతకుమించి యేమీ వ్రాయబడలేదు. నాన్నగారూ? స్త్రీ వైవాహిక జీవితంలో పడ్డాక అది అమృతసాగరమైనా విష సాగరమైనా ఈదవలసిందే. అదే ఆమెకు జీవితం, మరణం, యిహం, పరం అన్నీను. హిందువులైనా, మహమ్మదీయులైనా, ఆస్తికులైనా, నాస్తికులైనా వారిని సేననుసరించవలసిందే. కాబట్టి వారితో నరకానికి వెళ్ళవలసివచ్చినా వెనుదీయను.

గో : మంచిది. వెళ్ళు. ఈ క్షణం నుండి నీకూ నాకూ సంబంధంలేదు. నీయిష్టం వచ్చిన చోటికి వెళ్ళవచ్చు.

## మేవాడ్ పతనం

అ : నాన్నగారూ, తొందర పడకండి. కల్యాణి మీ తనూజ—

గో : అహఁ. అది నాకూతురు కాదు. వెళ్ళు. కల్యాణీ, నీ భర్త దగ్గరికి వెళ్ళు.

క : మీ యిష్టం. సెలవు నాన్నగారూ (నమస్కరిస్తుంది)

అ : తరువాత పశ్చాత్తాప పడవలసి వస్తుంది నాన్నగారూ కాస్త దూరం ఆలోచించండి. కల్యాణి అబల. అది అపరాధం చేసినా మీరు క్షమించాలి.

గో : వెళ్ళనీరా అది నరకానికి వెడుతుందిట.

అ : దానికది నరకంకాదు నాన్నగారూ. ప్రేమ గల ప్రదేశము స్వర్గమే. మీ చర్య ప్రమాదభూయిష్టమైనది. త్వరపడి యీ మాణిక్యాన్ని ఒదులుకోవద్దు.

గో : నేనన్నీ ఆలోచించా నబ్బాయ్. కల్యాణీ, నీ ధర్మం "పతి" నా ధర్మం "దేశం". దేశద్రోహులికి నా యింట స్థానంలేదు. వెళ్ళు.

క : మీ యిష్టం నాన్నగారూ (వెళ్ళబోతుంది)

అ : ఉండు కల్యాణీ. నాన్నగారూ, నాక్కూడా సెలవివ్వండి.

గో : అదేం?

అ : ఈ అబల్ని ఒంటిగా ఒదల లేను. నేను వెంట వెడతాను.

గో : అజయా, యిల్లు విడవాలనే నిర్బంధం నీకు లేదు సుమా.

అ : నాకు ఒదలాలనే కోరికా లేదు నాన్నగారూ. కాని పతి భక్తి నేరానికికల్యాణినిగృహచ్యుతను చేస్తున్నారు. ఈ హింసాయుత ప్రపంచంలో అబల ఒంటరిగా పోలేదు. దాని భర్త దూరదేశంలో వున్నాడు. కాబట్టి దాని రక్షణ భారం నేవహిస్తాను. రా, కల్యాణీ, మన జీవిత నావను యీ సంక్షుభిత సంసారసాగరంలో విడుద్దాం. దరి జేరుతామా లేదా అన్నది వేరేవిషయం. (చేతులు జోడించి) నమస్కారం నాన్నగారూ.

(ఇద్దరూ వెళ్ళగా గోవిందసింహుడు స్థాణువులా నిల్చుని పోతాడు.)

(సశేషం)

# "నిరాశ...."

"నాగశ్రీ"

మా అత్త కూతురు లలితంటే నాకెంతో యిష్టం. ఇష్టమంటే కాదు పంచప్రాణాలూ. నా కన్న లలిత 3 ఏండ్లు చిన్న. లలిత మా యింట్లోనే పెరిగింది. మా నాన్న కూడా చాలా గారాబంగా చూస్తుండేవాడు. ఒక రోజుకూడా లలితతో మాట్లాడందే, లలిత మాట వినందే ఉండలేకపోయేవాణ్ణి. స్కూలుకెళ్ళినా, షికారు కెళ్ళినా, మరెక్కడికి వెళ్ళినా యిద్దరం కలిసే పోతుండే వాళ్ళం. హాయిగా స్వేచ్ఛగా ఆనందించేవాళ్ళం. లలిత నేను ఒకే క్లాసు కూడాను. ఇద్దరం ఒకే పంక్తిని ఒకరి ప్రక్కనొకరు కూర్చుని కండ్లతో చూసుకుంటూ భోజనం చేసేవాళ్ళం. అప్పుడప్పుడు మా అమ్మ, మొగుడు పెళ్ళాల లాగ అలా గుండాలి, అని అంటుఉండేది.

ఇలాగు కొన్నాళ్లు కాలం పరుగెత్తింది.

లలితకు 16 ఏండ్లు వచ్చాయి. యిద్దరం స్కూలు ఫైనల్ ప్యాస్ అయ్యాము. ఉన్నట్టుండి అకస్మాత్తుగా వాళ్ళమ్మ చనిపోవడం వల్ల లలిత మా యింట్లో ఉండక తప్పింది కాదు. కాలేజీలో చేరాము. కాలేజీకికూడా గేటు వరకు కలసే పోయేవాళ్ళం.... మిగిలిన ఆడపిల్లలు, మొగ పిల్లలు మా వైపు చూస్తుంటే నాకానందంగా ఉండేది. లలితకదోలా ఉండేది. లలితని, లలితయొక్క లలితమనోహర కోమల సౌందర్యాన్ని చూసి ముగ్ధుడనయ్యేవాణ్ణి. గాలిలో మేడలు కట్టేవాణ్ణి. లలిత "బావా" అని పిలుస్తే స్వర్గసుఖం అనుభవించేవాణ్ణి. లలితంటే నాకసలు దేవత. లలితను తలుచుతూ ఆనంద డోలికపై హాయిగ ఊగేవాణ్ణి. ఒకనాడు మేము యిద్దరం కలిసి కాలేజికి వస్తూంటే దారిలో లలిత తోటి స్నేహితులు చూసి పక పక నవ్వేరు.... ఎందుకో నాకర్థమయింది, కాని లలిత కర్థం కాలేదు. "అదేమిటి బావా అలా నవ్వుతున్నారు" అని చిలిపిగా లలిత నన్ను అడిగింది. ఈ సారి లలిత నవ్విన నవ్వు నా జీవితాన్కి వజ్రకాంతిలా తళుక్కుమని మెరిసింది

"లలితా యీ నవ్వు చూడు" అని మొఖంలో మొఖం పెట్టి నవ్వాను. లలిత ఎందుకో పెడమొహం పెట్టింది. నాలో అసంతృప్తి రేకెత్తింది. లలితవైపు జాలిగా చూసాను.

"బావా ఏం జాలిగాచూస్తున్నావు" అని లలిత అడిగింది.

"ఇదంతా నీకోసం లలితా"

"అంటే" అనేసరికి కాలేజీ గుమ్మం దగ్గరకి వచ్చేసాము. ఎవరి క్లాసు రూమ్‌లోకి వాళ్ళం వెళ్ళిపోయేము. లెక్చరర్ చెప్పిన పాఠాలు నాచెవులకు వినపడ్డం మానేసాయి. లలితవైపు చూస్తుంటే కాలం గడచి పోయేది. క్లాసంతా తేనెతోటలో తేలినట్టుగా తోచింది.

కాలేజీ విడిచారు. మామూలుగా గేటువద్ద నా బంగారు శృంగారు లలితకోసం ఎదురు చూస్తూ నిలిచాను. కాని అందరూ వచ్చినా లలిత జాడ గోచరించలేదు.... బుర్ర గిర్రుమంది. అక్కడ నిలబడలేకపోయాను. మనసులో కలవర పడుతూ యింటి ముహం పట్టాను కాళ్ళీడ్చు కొంటూ. ఇంటివద్ద లలిత మా అమ్మ దగ్గిర బుర్ర వంచు కొని కూర్చుంది. ఎందుకో ఆశ్చర్యపోయాను. పొంచి వుండి విన్నాను.

"లలితా ! ఏం అమ్మా అలావున్నావు"

"అవునత్తా మా క్లాసు పిల్లలంతా...."

"ఏమన్నారు అమ్మాయీ"

"హేళన చేస్తారు అత్తా."

"ఏం"

"బావతో కలిసి వెల్తుంటే వాళ్ళంతా నీ 'మొగుడా' అన్నారు" అనేసర్కి మా అమ్మ లలిత వైపు చూసి "ఏం బావ భర్త కాకూడదా" అంది.

లలిత అమాయికత్వానికి ఏమనాలో నా కర్థం కాలేదు.

"నేను బావతో కలిసి కాలేజికి వెళ్ళనత్తా" అంది.

"అలాగేలే తల్లీ" అని అమ్మ వంటింట్లోకి పోయింది.

వెంటనే నేను 'లలితా నాతో రావూ' అని బ్రతిమాలుతున్నట్టు ఆమెవైపు చూసాను. కల కల లాడే చిరునవ్వుల లలిత మోము వెల వెల పోయింది.... సమీపాన్కి పోదా మనుకున్నాను. కాని ఎందుకో నా హృదయంలో ఏదో వెనక్కి తగ్గమంది. "లలితా నామీద నీకు ప్రేమలేదా" అని అడిగాను.

"లేకేం బావా, నీవు నాకు బావవి కాని భర్తవు కావు అంతే" అని బెదరి బెదరి లోనికి పోయింది.

లలిత అప్పట్నుంచి నాతో కాలేజీకి కలిసి రావడం మానేసింది. నన్ను చూసి దాక్కునేది. నాకెంతో కష్టంగా ఉండేది. నామనస్సు చివుక్కు మనేది. లలిత లేని నా బ్రతుకు వెన్నెల లేని రాత్రిలాగ వుండేది. వ్యర్ధ జీవితం లాగ గోచరించేది.

ఒకనాడు ఒంటరిగా పార్కులోన్కి వెళ్ళాను. పూవు లన్నీ వెక్కిరించి ముఖాలు ముడుచుకున్నాయి, అస హ్యించుకున్నాయి. కొంచెం ముందుకు వెళ్ళాను. అక్కడో కొలను చిన్నది ఉంది. అందులో విలాసంగా చాపలు పడు తున్నారు. పాపం.... అమాయిక చేపలు ఎఱను నమ్మి గేలాన్కి చిక్కుకున్నాయి. చలిగాలి శరీరాన్ని గుచ్చు కుంటోంది. వెనక్కు తిరిగాను ఇంటికి పోదామని 'అరె! నే నెంతగా ప్రేమించినా లలిత నన్నర్థం చేసుకోలేక పోయిందిగా' అని ఒక వేడి నిట్టూర్పు విడిచాను.

వీధి గుమ్మంలో అమ్మ నిలబడి ఉంది. నన్ను చూడ గానే "నాయనా లలితను వాళ్ళ నాన్న వచ్చి తీసుకు వెళ్ళాడురా" అనగానే నా నిండు ప్రాణాలు పైకి ఎగిరి పోయినట్టయ్యాయి. తడబడుతూ నిశ్పృహతో గదిలోనికి వెళ్ళాను. డ్రాయరుమీద కాగితాన్ని చూసాను. దానిలో ఇలా వ్రాసి ఉంది "బావా! నీవు నాకు బావవే కాని భర్తవు కావు.... స్నేహాన్కి, ప్రేమకి చాలా దూరం వుంది. పొరపాటు పడి పెడదారి పడుతున్నావు. ఇప్పటికైనా గ్రహించు బావా !"

నాలో నిరాశ తొంగి చూసింది. కళ్ళు చీకట్లు క్రమ్మాయి. పగలంతా రాత్రిగా తోచింది. లలిత నన్ను ప్రేమించినా, నిరాకరించినా నేను మాత్రం నిరుపమానంతో ప్రేమతో ప్రేమించాను, ఆశించాను. దానితో అంతిమ విశ్వాసం విడుస్తాను. ప్రేమించిన నా విధి, నా కర్తవ్యాన్ని పాలించ మని ఉద్బోధించింది. కుర్చీలో కూలబడ్డాను. గడియారం వైపు చూస్తున్నా ముల్లు గిర గిర తిరిగిపోతుంది. గడియారం కొట్టిన గంటలు నా హృదయంలో సుత్తి దెబ్బలులాగున్నాయి.... బుఱ్ఱ వంచుకొని కండ్లు మూసి ఆలోచనలో పడ్డాను....

కాలం చెప్పకుండా పరుగెత్తింది.... నా గదిలో నేను కూర్చుని పుస్తకం తిరగేస్తున్నాను.... హఠాత్తుగా వీధిలో కేక. పోస్టుమేన్ రాక. ఆత్రుతతో కవరు విప్పాను.... జాగ్రత్తగా చదివాను.... ఇలావుంది. "ప్రియమైన నాబావా! ఎల్లుండి నాపెండ్లి జరుగ బోతోంది.... అత్తా, నీవూ కలసి ఆనందంగా నీ ముద్దుల లలితని ఆశీర్వదించడాన్కి రావా లని నేను నిన్ను కోర్తున్నాను.... ఇది రహస్యంగా వ్రాసాను. నీకొక్కడికి వ్రాసాను. ఇట్లు లలిత"

నిలువునా నీరయిపోయాను. ఉత్తరం నాకుతెలియ కుండానే క్రింద జారిపోయింది. Invitation card ని మా అమ్మకి అందిచ్చివేసాను. మా అమ్మకూడా చదివింది. కొంత నిరాశ చెందినట్లుగా నాకు కన్పడింది. నావైపు నిరాశతో, నిస్పృహతో చూచింది.

"నాయనా!.... అలాగున్నావేం"

"ఏంలేదమ్మా ....ఆ.... లలితకి పెళ్ళి అవుతోంది. బయల్దేరమ్మా"

"నీకు రావడానికి ఇష్టమేనా నాయనా...."

"అదేమిటమ్మా అలాగంటావు? నా లలిత నాలలితేగా పద." పెళ్ళికి బయల్దేరి వెళ్ళాము. పెళ్ళి అతి వైభ వంగా జరిగింది. అన్యోన్య దాంపత్యాన్కి మురిసి పోయాను. నా కాయోగం లేనందుకు విధిని ఎంతగానైనా తిట్టుకున్నాను. కల్యాణ మండపం, అందులో లలిత ప్రక్కని నేను కూర్చునట్లుగా నా కళ్ళకు గోచరించింది. మ్రోగిన బాజాలు నన్నుడికిస్తునట్లు, ఊదిన సన్నాయి పరి హసించినట్లు, వర్ణించిన మంత్రాలు దెప్పి పొడిచి నట్లు తోచాయి. ఏం చేస్తాను. నా విడిదిలోన్కి పోయి విశ్ర మించాను. నా కన్నం సహించనే లేదు. సిగరెట్టు కాలుస్తూ వచ్చే పొగల సుడులతో సంభాషిస్తూ కూర్చున్నాను. ఒక బంధము ముందుకు తోస్తూంటే రెండు బంధాలు వెనక్కు లాగుతున్నాయి. జుట్టు చేతితో పట్టుకొని నేను, నామనస్సు అనుకోకుండా తగవులాడుతున్నాము. ఇంతలో.

"బావా !...." అని లలిత పిలుపు. నాకు తిరిగి తలపు....

"ఆ.... ఆ"

"ఏం చేస్తున్నావు బావా.... అబ్బ ఎన్ని శ్వేతరాష్ట్రాలు కాల్చావు ?"

"అపును అపునవును" ఆలోచిస్తూ జవాబిచ్చాను.

"గుండె ఆరిపోదూ బావా" అని ఎంతో ప్రేమతో చెప్పినట్లు.

"ఏనాడో ఆరిపోయింది లలితా నీవు లేని ఆ యింట్లో, యీ వంట్లో నా కంట్లో దీప్తి చీకట్లే"

"పొరపడకు బావా.... ఈ లలిత ఎప్పుడు బావ ప్రేమకు పాత్రురాలే.... నీతోనే పెరిగాను, నీతోనే చదివాను, నీతోనే ఆడాను. ఎలా మరువగలమో మన స్నేహం...."

"స్నేహమా .... లలి....తా...."

"అవును బావా నేను నిన్ను ప్రేమిస్తూనే యున్నాను" ప్రేమిస్తాను. కాని బావా! నువ్వు 'బావవే' కాని భర్తవు మాత్రం కావు...."

"ఆ...."

"లేనిపోని ఆలోచనలతో బుర్ర పాడుచేసుకోకు.... నీ లలితను మరువకేం.... శెలవు.... వస్తాను........" అని లలిత వెళ్ళిపోయింది. నాలో జ్యోతి ఆరిపోయింది. నా ఆశా రాజ్యంలో మేఘాలు దట్టంగా అలము కొన్నాయి. తుపాను రేగింది. ఒక్క క్షణమైనా ఉండకుండా మా అమ్మతో చెప్పి యింటి ముఖం పట్టాను. నాలో ఎన్నో రైళ్ళు వేగంగా సాగిపోతున్నాయి. చెయ్యి వేసి కలచి నట్లనిపించింది. 'నిరాశ' మిగిలింది. ఆశ ఆరిపో యింది. ఇక నేను ఒక్కడినే ఆయింటికి.... ఈ కంటికి ఆకాశంలో చుక్క క్రిందకు రాలిపోయింది. వికసించిన పుష్పం ముడుచుకు పోయింది. తుమ్మెద యెగిరింది. గాలి చల్లారింది. వీధిలో "బ్రతికే నిరాశ పాలైపోయి" అని భిక్షకురాలు పాట నాకు మిగిలింది. 'నిరాశ' లలిత నన్ను "నిరాశ" సముద్రంలో ముంచి వెడలింది. అదే నా జీవితంలో తొలి తుది 'నిరాశ'.



# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

శ్రీమతి కె. యమ్. సౌందర్యవల్లి

## కీర్తన – 11

రాగం కానడ, రూపకతాళం.

ఆ॥ సరిగమదనిస — అవ॥ సనిపదనిపమగారిస.

స॥ సద్గురు శ్రీ త్యాగవిభుని, సన్నుతింపవే॥ ॥స॥

అ॥ హృద్గతమగు నాదసుధచే, ఇహపరసుఖమును పొందిన ॥స॥

చ॥ వరగుణగణభూషితుడే, వందిత సుహృజ్జనయుతుడే
ధరణిగాయక జనహితుడే, స్వరలయాదిరాగరతుడే ॥స॥

| | 0–2 | 1–4 | 0–2 | 1–4 |
|---|---|---|---|---|
| ప॥ | ; గ మ | రీ రీ సా ; | నీ నీ | దా నీ సా సా |
| | స . | ద్గు రు శ్రీ | త్యా. | గ వి భు ని |
| | ; స ని | సా రీ ; పా | గా ; | రీ ; ; సా ॥గమ॥ |
| | స . | న్ను తిం ప | వే . | . . ॥స॥ |
| అ॥ప॥ | ; మ గ | మా దా దా దా | దా నీ | సా స ని రి స ని ప |
| | హృ . | ద్గ త మ గు | నా . | ద సు . ధ . చే . |
| | ; ద ని | పా పా పా పా | మా ప ని | ప ప మ గ గా గా . |
| | ఇ హ | ప ర సు ఖ | ము ను . | పొం ం . . ది న |
| | ; గ మ॥ | | | |
| | స॥ | | | |
| చ॥ | ; ద ని | పా పా పా పా | పా ; | మా ప ని ప మ గా |
| | వ ర | గు ణ గ ణ | భూ | షి తు . డే . . |
| | ; గ మ | రీ రీ సా సా | రీ రీ | రీ పా మా గా |
| | వ ం | ది త సు హృ | జ్జ న | యు తు డే . |

అ. ప. వలె.

ధరణిగాయక ప్రియహితుడే

స్వరలయాది రాగ రతుడే ॥సద్గురు॥

## కీర్తన - 12

ఆనందభైరవి రాగం. ఆదితాళం.

ఆ॥ స రి గ మ ద ని స — అవ॥ స ని ద ప మ గ రి స.

ప॥ నమ్మివచ్చిన నన్ను నయముగ బ్రోవవే
కమ్మనికోర్కెల కొల్లలుగానిడి ॥న॥

అ॥ ఇమ్మహి రామనామామృతపానము
సమ్మతి సలిపిన, సదయ గురుస్వామీ ॥న॥

చ॥ అంతశ్శత్రుల హతమొనరించి
సంతసమున రాము సతతము పూజించి
వింతకృతుల విధవిధముగ రచియించి
చింతనజేసిన, శ్రీ త్యాగరాజ ॥నమ్మి॥

| | 0–2 | 1–4 | 1–4 |
|---|---|---|---|
| ప॥ | ; పా పా పా ప ప పా నీ పా | మా గా మా ప మ | ప మ గ రి స రి స ని |
| | న మ్మి వ చ్చి న స · న్ను | · న య ము గ | బ్రో - - - వ . వే |
| | ; సా గ రి గా మ పా మ మా మా | ; గ మా ప మా | ప మ గ రి గా మా |
| | క మ్మ ని కో - - - ర్కె ల | కొ . ల్ల లు | గా · . . ని డి |
| | ; పా॥ | | |
| | . న॥ | | |
| అ॥ప॥ | ; సా సా సా పా సా సా నీ | . స మా గ రీ | సా నీ సా సా |
| | ఇ మ్మ హి రా మ నా · | మా · మృ త | పా · న ము |
| | ; పా సా సా రి స ని ద పా మా | ; గ మ పా మా | గా రీ గా మా |
| | స మ్మ తి స లి · · పి న | స ద య గు | రు . స్వా మి |
| | ; పా॥ | | |
| | ; న॥ | | |
| చ॥ | ; పా పా పా ప ని ని ప ప మ మా | ; గా మా ప మ | ప మ గ రి గా మా |
| | అం త శ్శ త్రు · ల · · · · | హ త మొ న | రి ం · · · చి |
| | ; సా మా గ రీ స సా సా రి ని | ; సా సా గ రి | గా మా మా ; |
| | సం · త స ము న రా · ము | స త త ము | పూ జిం చి |

అ. ప. వలె

వింతకృతుల విధవిధముగ రచియించి
చింతన జేసిన శ్రీ త్యాగరాజ ॥నమ్మి॥



# త్యాగం....!

రచన : శ్రీమతి వై. సావిత్రి.

ఏవిధంగా నైతేనేం రమ ప్రేమ విషయం బయట పడి ఆ ఊళ్ళో ఒక గొప్ప విప్లవాన్ని రేపింది! అనేక రీతులుగా అనుకోసాగారు. ప్రతి నిత్యం ఆమె చుట్టూ కుక్కల్లా వెంబడించే కాలేజీ మూక ఈర్ష్యతో భగ్నమంది. ప్రేమ కలాపాల కోసం పాటుపడే విద్యార్థి బృందం ఒకచోట సమావేశమైనారు. మనశ్శాంతి కొరకు, అనేక రీతులుగా తమ భావాలను వ్యక్తం చేసుకొన్నారు. కొంతమంది ముక్కున వేలేసుకున్నారు. మరి కొంతమంది ఇది సామాన్య సంఘటనగా తలంచి ఉపశాంతి పడ్డారు. కొంతమంది విశాల హృదయులు మాత్రం రమని అభినందించారు.

ఇంతకూ అసలు విషయం. మంచి డబ్బున్న లక్ష్మణరావు గారి ఏకైక పుత్రిక, అత్యంత విజ్ఞానవతి, రూపసి అయిన రమాదేవి తన కాలేజీలో చదువుకొనే ఒక మధ్య తరగతి నిర్భాగ్యుని ప్రేమించింది!

ఈ సమస్య అంతగా చెప్పుకో తగ్గది కాకపోయినా సంకుచిత సనాతన స్వార్థ భావాలుగల ఆ వాతావరణానిక్కి మాత్రం సహింపరాని విషయంగా పరిణమించింది. ఈలాంటి ప్రేమ వ్యక్తులను సినిమా రంగాలలో చూస్తూ బూర్జువా విలాసాలనుభవిస్తూ అటువంటి ప్రేమను కొంటూరు. ఇటువంటి వ్యక్తులకు ధనిక వర్గానికి చెందిన రమ ప్రేమసమస్య ఆశ్చర్యాన్ని కలిగించిందనడంలో సందేహమేముంది!

ఇంతకూ అంత అదృష్టం చేసుకొన్న వ్యక్తి మోహనే. అతనెవరో, ఏ వాతావరణానిక్కి చెందినవాడో విచారించిన వారు ఒక్కరూ లేరు, మనోరమ తప్ప. బాల్యావస్థలోనే తల్లి తండ్రులను కోల్పోయి తన అక్కగారింట పెరుగుతూ వచ్చాడు. ఎంత ఆత్మీయులైనప్పటికి రక్తం పంచిన తల్లి దండ్రులతో సమానులు కారు కదా! అదీకాక తన అక్కగార్కి కుచేల సంతానం లాంటి సంతానం. దరిద్ర దేవత వారింట తాండవమాడుతూఉంది. ఇక ఆ కుటుంబ పరిస్థితులు ఏవిధంగా యుంటాయో ఆలోచించండి? పాపం అమాయకుడైన మోహన్ మీద విరుచుకు పడేవారు అక్కా బావలు. క్రమంగా మోహన్ జీవితంలో అంధకారం అలముకుంటూంది. ఇటువంటి నికృష్ట వాతావరణంలో జీవితాన్ని భారంగా గడుపుతూ ఆ సంవత్సరమే S. S. L. C. ప్యాసయినాడు.

ఒకరోజు మోహన్ స్కూలునుండి ఇంటికి వచ్చేసరికి బాగా ప్రొద్దుగూకింది. గుమ్మంలో కాలు పెట్టడమే తడవుగా నోటికి వచ్చినట్లు దులపరించింది అక్క. "ఒరే గాడిదా! దున్నపోతులాగున్నావు, ఏదైనా పని చూచుకు బ్రతక కూడదూ? ఎంత కాలమని కూర్చోబెట్టి పోషిస్తాము. నీ మూలకంగా మా కొంప గుల్లవుతూంది. నీదారి నువ్వు చూసుకో బాబూ!" ఏక గర్భవాసం నుండి వచ్చిన తన సహోదరే ఆ విధంగా మాట్లాడినప్పుడు ఇక బావగారి సంగతి వేరుగా చెప్పాలా? మోహన్ ఏవిధంగానూ సమాధాన మివ్వలేకపోయాడు. తన పని చూచుకొని తన నిర్భాగ్య దశను తలపోస్తూ ఒక నిర్ణయానిక్కి రాగలిగేడు. వాస్తవంగా ఆలోచిస్తే ఆర్థిక ఇబ్బందుల ద్వారా తన్ని ఎంత కాలమని పోషిస్తారు.? వారికి భాధ్యతేమిటి? తనవల్ల ఇరువురకూ మనశ్శాంతి లేకుండా పోతోంది. ఏమైనప్పటికి ఇక ఈ వాతావరణంలో ఉండకూడదని నిశ్చయించాడు. ఆ వేళ రాత్రి ఎవరికీ తెలియకుండా బయట ప్రపంచంలోకి వచ్చాడు. ఎక్కడికి పోవాలో తనకే తెలియదు.

ఇక ఆ వయస్సులో మోహన్ పడ్డ కష్టాలు అతీతం. ఎన్నో దినాలు పస్తులతో కాలం గడిపాడు. చివరకు ఆత్మ గౌరవాన్ని చంపుకొని ధనవంతుల సహాయాన్ని అర్థించి వారాలు చేస్తూ కాకినాడలో తన స్కూలు జీవితాన్ని గడపగలుగుతున్నాడు. స్వతంత్రంగా ఉద్యోగం చేసి కాలం గడుపుదామని ఎంతగానో ప్రయత్నించాడు. కాని ఫలితం సూన్యం. ఈ రోజులలో B. A. లు చదివిన వారికే ఉద్యోగాలు లేక రోడ్లంట తిరుగుతూవుంటే ఇక అలనా పాలనా లేని S. S. L. C. ప్యాసయినఈ నిర్భాగ్యునికి ఉద్యోగం సంభవించడం! ఇక ఎటూ దారిలేక కాకినాడ కాలేజీలో తన స్కూల్ జీవితాన్ని గడపగలగడానిక్కి నిశ్చయించాడు. ధనానిక్కి నిర్భాగ్యుడైనప్పటికి చక్కని ఆదర్శ భావాలుగల వ్యక్తి మోహన్.

# త్యాగం....!

తను ఇంటరు జూనియర్ చదివే రోజుల్లో లక్ష్మణరావు గారి పుత్రికైన రమాదేవి కూడా తన తరగతిలోనే చదివేది. రమ కూడా అభ్యుదయ భావాలుగల వ్యక్తి. అందువల్లనే మోహన్‌ను ఆకర్షించగల్గింది. మోహన్ కూడా రమకు మించినవాడు. ఒక్క డబ్బులో తప్ప, తరగతిలో మోహన్‌దే పై చెయ్యి. అందువల్ల రమ తనకు తెలియని పాఠ్య విషయాలు, దానితో పాటు మోహన్ అధ్యయనం చేసే అనేక సామాజికాభివృద్ధి గ్రంథాలు మొదలైనవి తెలుసుకుంటూ వుండేది. మోహన్ యొక్క తెలివికి ఉపాధ్యాయులు గూడ ప్రశంశించేవారు. ఇందరిని ఆకర్షించడానికి కారణం మోహన్ యొక్క విశాలహృదయం. మోహన్ విద్యార్థి సంఘాలను స్థాపించి, విద్యార్థి సమస్యల కార్యకలాపాలలో పాల్గొనేవాడు. మోహన్ యొక్క విజ్ఞానం, అతనియొక్క విశాల భావాలు గమనించిన రమ, మోహన్ పరిస్థితి తెలుసుకొన్న తరువాత తన తండ్రిని ఏదో రకంగా ఒప్పించి, మోహన్ తన ఇంట ఉండడాన్కి ఏర్పాటు చేసింది. ఒకరికి తెలియని సమస్యలను ఒకరు చెప్తూ తరగతిలో తెలివిగా ఉండేవారు. వీరి స్నేహం క్రమంగా ప్రేమగా రూపొందింది. ఈ ప్రేమలత కొంత కాలాన్కి దట్టంగా అలముకొంది. ఒకరిని విడిచి ఒకరు ఉండలేని పరిస్థితులు ఏర్పడ్డాయి. తానెటువంటి వాతావరణంలో ఉన్నా తన పూర్వ స్మృతులను మాత్రం మరవలేక, తన విషాదగాథను తలపోస్తూ ఉన్నాడు. మోహన్ చివరకు ఏలాగైతేనేం వారిద్దరూ **B. A.** ప్యాసయినారు. రమాదేవి ఒకనాడు తన ఉద్దేశాన్ని వ్యక్తం చేసింది. మోహన్‌కు చాలాఆశ్చర్యాన్ని కలిగించింది! ఎందుచేతనంటే రమ లక్షాధికారిణి, మోహన్ దరిద్రుడు. లక్షాధికారిణి అయిన రమకూ మోహన్‌కు కొత్త సంభవమా? వాస్తవాన్కి మోహన్‌కు రమ మీద ప్రేమ ఉన్నప్పటికి అది సాధ్యపడని విషయం అని తెలుసు.

"రమా! నేను ధనాన్కి నిర్భాగ్యుడను. నీవు లక్షాధికారి బిడ్డవు. నీకూ, నాకూ వివాహం సంభవమా? మన వివాహాన్కి మీ తల్లి దండ్రులు అంగీకరించరు. అయినప్పటికి నన్ను కట్టుకొని నీవేమి సుఖపడగలవు రమా! ఏ లక్షాధికారినో పరిణయమాడి సుఖపడు. నీ ఆనందం నా ఆనందం కాదా రమా!"

"మోహన్ నీవు ఆ రకంగా ఎప్పుడూ మాట్లాడవద్దు. ప్రేమకు ప్రధానం ధనం కాదు. వేష భాషలు అంతకన్నా కావు. సంస్కార భావాలుగల నీవే ఈ విధంగా అంటే ఇక తక్కినవారి సంగతాలోచించు. నీకు నామీద ప్రేమ లేనప్పుడు ఏరకంగానైనా మాట్లాడవచ్చు."

"అదికాదు రమా! యదార్థ విషయం నీకు చెప్పాను గానీ నీకన్నా నాకు ముఖ్యులెవరు ఈ ప్రపంచంలో. నా జీవితం అంతా నీమీదే ఆశ పెట్టుకున్నాను. కానీ రమా! మన ఇద్దరినీ సంకుచిత భావాలు గల స్వార్థపరులు విడదీస్తారని నా భయం. అంతకు మించి వేరుకాదు"

"మోహన్ ఎన్ని అవాంతరాలు కల్గినా వాటినెదుర్కొని నిన్ను వివాహం చేసుకుంటా సరేనా?"

ఈ విధంగా వారి ప్రేమలత పెరుగుతూ ఉంది. ఇట్లా కొన్ని వసంతాలు రహస్యంగా దొర్లిపోయాయి ఎంతో మధురాతి మధురంగా. తన జీవితంలో జరిగిన ఈ ఆకస్మిక పరివర్తనాన్కి మోహన్ హృదయం ఏంత కలవరపడినా జీవితమొక కన్నుల పండువగా వెన్నెలమయంగా తోచింది. వెనుకటి జీవితమంతా ఒక ముళ్ళ కంపగా నిండి యున్నప్పుడు, తన జీవితమంతా అంధకార మయమే అనుకొన్న మోహన్‌కు జీవితంలో ఎదురైన గాలి తుపానుల నెదుర్కొని కష్టాల ననుభవించిన వాడగుట వల్ల, అత్యంత సహన శక్తిని, ఓర్పును అలవరచుకో గలిగాడు. కాలం అతని పాలిట కాఠిన్యం వహించినా వెనుకంజ వేయక తన జీవిత సంగ్రామాన్ని ఎదుర్కొంటూనే వచ్చాడు ఇంతవరకూ. ఇంతసహనశక్తి లేకపోయినట్లతే ఏనాడో ఆత్మహత్యకు తలపడేవాడు. అటువంటి పరిస్థితులలో ఈ ప్రేమకథ ఉన్న చోటనే ఉండిపోయేది. ఇటువంటి సహన మూర్తులు ఆత్మహత్యకు ఒడిగట్టరు. పరిస్థితులు విషమించి తన బ్రతుకే భయానీకంగా తోచినప్పుడు తప్ప. కష్టాలంటే ఏమిటో తెలియకుండా తమ శరీరాలు కందకుండా సూర్య రశ్మిని కూడా ఎరుగని అతి సుకుమారులు జీవితపు సవాలు నెదుర్కొనలేక అసమర్థతలో ఆత్మహత్యకు పూనుకుంటారు, వారి యొక్క కోర్కెలు అంతం కాగానే.

మోహన్ హృదయంలో రమ ప్రేమ కథ ఎన్నో ఆశలను రేకెత్తించింది. ఎన్నో గాలిమేడలు కట్టాడు. నదీ ప్రవాహంలో కొట్టుకుపోయే తనకు ఒకచేయి అందించి నట్లయిందనుకొన్నాడు. ఒకప్రక్క ఆనందంతో మోహన్

హృదయం ఉద్రూతలూగుతున్నా వేరొకవైపు ఆతనికి తీరని అనుమానం కలుగుతూ ఉండేది, గతంలో తను కళ్ళారా అనేక భగ్న హృదయాలను చూచాడు గనుక.

పాపం చివరకు అతని అనుమానమే ధృడపడింది. డబ్బే ప్రధానంగాను, ధనంతోనే పరువు మర్యాదలను కొనుక్కొనే మహానుభావులతో తనలాంటి నిర్భాగ్యులకు పొత్తు ఏలా సంభవం.? మోహన్ మాత్రం చాలామంది అసమర్థ ప్రేమికుల్లా తయారు కాలేదు.

రమ పెండ్లివార్త పిడుగులా చెవిని బడింది. అతనిలో తీవ్ర సంచలనాన్ని రేకెత్తించింది. తన హృదయాన్ని గాయపెట్టిన మాటవాస్తవం. ఐనప్పటికి లోపల్నుంచి ఉవ్వెత్తుగా ఉబికివస్తూయున్న ఉద్వేగాన్ని అణచిపెట్టాడు అతికష్టంమీద. లేకపోతే ఫలితం సూన్యం. హృద్వేగ ప్రవాదమే కట్టలు తెగి ప్రవహిస్తే ఇద్దరిలో ఏ ఒక్కరిని బలి గోరవచ్చు. మొదటినుండి ఈ లోకంలో నిర్మల ప్రేమికులు ప్రేమబలిదానానికే ఆహుతి అయ్యారు. ప్రేమించిన వస్తువు లభ్యం కాకపోతే వారి జీవితమే అంతమైనట్లు భావిస్తారు. ఇటువంటి ఆత్మహత్యలు చేసుకొనే ప్రేమకు కళంకం ఆపాదిస్తారు. అసమరులయొక్క ప్రేమలో స్వార్థం పూర్తిగా యిమిడిఉంది. లేకపోయినట్లయితే ప్రేమ లభ్యమవనంత మాత్రంచేత అది చావును కోరదు. ప్రేమించిన వస్తువు లభ్యంకానప్పుడు జీవితంమీద విరక్తి కలగడం సహజం. కాని సహనంతో ఆ సమస్యనుండి బయటపడి పది మంది ఉపయోగకరమగు పనులకు కానీ కళారాధనకు కానీ, తనయొక్క మనస్సును మరలించి ఆబాధను కొంతవరకు తగ్గించుకొనవచ్చు. నిజమైన ప్రేమంతాకూడా కన్నీటి మయమే. ఈ కన్నీళ్ళను అణచగల సహనశక్తి నలవరచుకొన్నవారే నిజమైన ప్రేమికులు. అట్టి వారి ప్రేమలో స్వార్థత్యాగం ఇమిడి ఉంది. నిర్మల ప్రేమికులు వారిరువురిలో ఏ ఒక్కరికి బాధ కలిగినా రెండవ వ్యక్తి వారి ప్రాణాలనుకూడా లెక్కచేయకుండా త్యాగం చేస్తారంటారే? వారిరువురిలో ఏ ఒక్కరి జీవితం ఆనందంగా గడపాలన్నా రెండవవారు ఎందుకు త్యాగం చెయ్యకూడదు? స్వార్థంలేని ప్రేమికులు మాత్రం త్యాగం చెయ్యగలరు. ఇదే మార్గాన్ని మోహన్ కూడా అవలంబించాడు. రమాదేవి లక్షాధికారిణి కావడం, సుఖవంతమైన జీవితాన్ని గడపడం తన ఆనందంగా తలచాడు. రమకు మాత్రం ఒక సందేశాన్ని అందజేయగలిగాడు. "రమా! నేనెక్కడున్నప్పటికీ, ఏ పరిస్థితులలో నున్నా, నీ క్షేమాన్ని ఎల్లప్పుడు కోరుతూ ఉంటాను. నీ ఆనందం నీ సుఖం నాయొక్క ఆనందంగా తలుస్తున్నాను. నీవైనా సుఖ జీవితాన్ని అనుభవించు రమా! అయినా ఈ నిర్భాగ్యుని కట్టుకొని మాత్రం నీవేమి సుఖపడగలవు? గడచిన ప్రేమగాథను మరచిపో. ప్రశాంతంగా కాలం గడుపు. ఈ నిర్భాగ్య మోహన్‌ను మరచిపో. ఇక సెలవు" తనయొక్క సందేశం ఆఖరి క్షణాలలో అందజేసి ఇల్లు విడిచి పోయాడు మోహన్.

పాపం రమ మాత్రం ఏం చెయ్యగలదు. రమే కాదు ఈపరిస్థితులలో ఏ స్త్రీ కూడా ఏం చెయ్యగలదు? నిస్సహాయురాలుగా తయారయింది. తన తల్లిదండ్రులకు తన ఉద్దేశాన్ని చెప్పింది. కడకు తన కన్నీటి కాల్వలతో చెప్పింది. ఏవిధంగా చెప్పినప్పటికీ డబ్బే ప్రధానంగా చూచే ఆ కఠిన హృదయులు మరీ రెచ్చిపోవడం మొదలు పెట్టారు. సమాజంలో స్త్రీ పురుషులకు వివాహస్వాతంత్ర్యం పూర్తిగా యున్ననాడే వారి జీవితాలు ఆనందంగా గడచి ముందుకు రాగలరు. ఉభయుల తల్లి దండ్రులకు డబ్బే ప్రధానంగా కనిపిస్తోంది. అందుకనే 'ధనం మూలం మిదం జగత్' అన్నారు. డబ్బుతో ఎన్ని పాపాలైనా పోతాయి. ఎన్ని పాప కోర్కెలైనా నెరవేరి పోతాయి. డబ్బుతో ఎందరి జీవితాలైనా అంతం చెయ్యగలరు ఇటువంటి మహానీయులు.

హృదయంలో తీరని వ్యధతో మెడలో మోయలేని బరువుతో పెండ్లికుమార్తెగా తయారయింది, చేసేది లేక రమాదేవి.

మోహన్ హృదయ భారాన్ని అణచుకోడానికి పల్లె గ్రామాలకు పోయి, తన ఆదర్శాలను వృద్ధిచేస్తూ, బీద ప్రజానీకానికి అనేక రీతులుగా సేవ చెయ్యడం మొదలుపెట్టాడు. ఇక ధనికవర్గం వారికి దెబ్బతగులుతుందనే భయంకొద్దీ చిర్రుమంది. కోపతాపాల్తో పల్లె ప్రజలంతా ఒక దళంగా తయారు కాబడ్డది. దళ నాయకుడైన మోహన్‌ను భూస్వాములంతా అనేక ఇక్కట్లకు గురిచేసారు. పేద ప్రజానీకంయొక్క కష్టాలు తొలగించడమే ప్రధాన

ఆశయంగా పెట్టుకున్నాడు. కాబట్టి అన్నిటిని సహనంతో ఎదిర్కొనగలిగాడు. అంతకూ వారి అక్కసు తీరలేదు. భూస్వాముల భూములను ఆక్రమించుకొంటున్నాడనే నెపంతో ధనికవర్గ మంతా గూడుపుఠాణీ చేసి అనేక దొంగ కేసులు పెట్టి ఒక నిశిరాత్రి మోహన్ ప్రాణాలను బలిగొన్నారు. ఆ నాడు పల్లె ప్రజానీకం మంచినీరు సమేతం ముట్టలేదు. వారి హృదయాలు యెంతగా ఘోషించాయో! భూస్వాముల యొక్క అక్రమాన్ని పల్లె ప్రజానీకమంతా అట్టుడికి పోయింది. ప్రతీకారవాంఛ ప్రతిఒక్కని హృదయంలోనూ ప్రబలించింది. ఏది ఏమైనప్పటికి ఒక ఆదర్శ నాయకుని కోల్పోయినందుకు, విచారించి ఆయన ఆశయసిద్ధి కొరకు అనేకమంది యువకులు తయారు కాపడ్డారు.

మోహన్‌లాంటి వ్యక్తుల ఆదర్శ భావాలు ప్రతీ ఒక్కరి లోను వృద్ధి పొందిననాడే మనయొక్క కష్టాలు నెరవేర గలవు.



# స్మాల్ సేవింగ్స్ ద్వారా దేశ పునర్నిర్మాణానికి పూనుకోవాలె.

## నెల్లూరు మహిళా సభలో శ్రీమతి భారతీదేవి రంగా విజ్ఞప్తి.

శ్రీమతి భారతీదేవి రంగాగారు 16-వ తేదీ మధ్యాహ్నం రెండు గంటలకు గూడూరు స్త్రీల గృహపరిశ్రమల సహకార సంఘం వారి భవనమందు సంఘ ప్రెసిడెంటు శ్రీమతి టి. సుబ్బమ్మగారి అధ్యక్షతన భారత ప్రభుత్వ స్త్రీల సేవింగ్సును గూర్చి విపులంగా వుపన్యసించారు.

"స్త్రీలు సేవింగ్సు ప్రణాళికద్వారా తమ ఆర్థిక దైన్యతను నివారించుకొనుటకు స్త్రీలకు చక్కని అవకాశం వున్నదని, ప్రభుత్వానికి ఈ రూపంగా పెట్టుబడి పెట్టడం వల్ల మన దేశ సౌభాగ్యానికి మూలమని, పంచవర్ష ప్రణాళిక సవ్యంగా అమలు జరుగాలంటే స్త్రీలు ఎక్కువ ఈవిధంగానైనా సాయపడాలని కొన్ని బ్యాంకులు వల్ల కలుగుతున్న నష్టాలను, సేవింగ్సు ప్రణాళికద్వారా కలుగు లాభాన్ని విపులంగా" చెప్పారు. సభానంతరం సంఘ సెక్రటరీ నక్కా రంగనాయకమ్మగారు పుపన్యశిస్తూ "భారతీదేవి రంగాగారు చెప్పిన ప్రతి ఒక్క ముక్క మన గూడూరు మహిళలు అమలులో పెట్టి మార్గదర్శకులు కావా"లని సభవారిని కోరారు. వందన సమర్పణతో సభ ముగిసింది. సభానంతరం కీ. శే. శ్రీ పోలయ్యనాయుడుగారి కుమార్తె శ్రీ సీతారావమ్మ గారు వారి భవనంలో భారతీదేవిగార్కి తేనీటి విందు నిచ్చారు.



# స్త్రీల పద్యరచన

## తాళ్ళపాక తిమ్మక్క — సుభద్రాకళ్యాణము.

శ్రీమతి కాంచనపల్లి కనకాంబ.

అన్నమాచార్యులు నిజముగ ధన్యుడు అదృష్టవంతుడు.

"సంగీతము సాహిత్యము
శృంగారము చక్కదనము శీలముగలపు
ణ్యాంగన కుంబ్రియుడగు కవి
పుంగవు డరయంగనెంతపుణ్యాత్ముకుడో.

తాళ్ళపాక అన్నమాచార్యులకు కవితా నాథుడు "కవౌవేంకటనాయకః" అని ప్రసిద్ధి గన్న ఏడుకొండల వేంకటేశ్వరస్వామి. ఆయన కవిత్వము భక్తిమయభరితము, భావగర్భితము. ఇక యిల్లాలు పైపద్యమున వర్ణింపబడినట్లు కవయిత్రీమణి తిమ్మక్క. ఈమె సుభద్రా కల్యాణమును ద్విపద కావ్యముగ రచించినది. అన్నమాచార్లు వేలకొలది గేయములను రచించి రాగి రేకులపై లిఖింపజేసినాడు. ఆ రాగి రేకులను దొరికినంత వరకు దెచ్చి దేవస్థానం పరిశోధనాలయములో జేర్చినారు. నాలుగు సంపుటములు తాళ్ళపాక వారి సంకీర్తనలు అచ్చయినవి. ఆ గేయముల విషయమై కృషి నేటికిని జరుగుచున్నది.

తాళ్లపాక అన్నమాచార్ల పెద్దభార్య తిమ్మక్క. ఈమెకు నరసింగన్న యనుకుమారుడు ప్రసిదకవి. చిన్న భార్య అక్కలమ్మకు పెద తిరుమలయ్యయు నిద్దరు కుమార్తెలు కలరు. మొత్తము మీద వీరిది విద్వత్కుటుంబము.

చిన్నన్న ద్విపదకెరుగును
పన్నుగ పెదతిరుమలయ్య పదములకెరగుఁ
మిన్నంది మెరసె నరసిం
గన్న కవిత్వంబు పద్యగద్య శ్రేణిఁ.

పరమయోగివిలాసము- ఉషాపరిణయములో అష్టమహిషీ కల్యాణము మొదలగునవి తాళ్ళపాకవారి రచనలే.

తిమ్మక్క సుభద్రా పరిణయమును మంజరీ ద్విపదలో స్త్రీలు, బాల బాలికలు సులభముగ కంఠస్థము చేయదగినది, పాడదగినదిగా రచించెను. ఈ సుభద్రాకల్యాణము పాట పాడెడు తీరునకుతగి తీగసాగిన దీర్ఘాక్షరములతో ద్విపదలుగా నున్నది. పాయురాదుల నోటబడి ఈ పాట చాలా తారుమారై శ్రీ కాళహస్తి రాజాగారి యాస్థానమునుండి తెచ్చిన తాళపత్ర గ్రంథములలో గనపడినది. దీని నెంతో దిద్ది తీర్చి తిరుపతి దేవస్థానం పరిశోధన శాలయందలి యుద్యోగులు అచ్చొత్తించి నాలుగేండ్ల క్రిందట జరిగిన అన్నమాచార్ల ద్వితీయ వార్షికోత్సవ సమయమున ఆయన యిల్లాలి గేయరచనమును అందజేసినారు. అటుగున కనబడిన కవయిత్రీమణుల చరిత్రలు- వారి రచనలు ఈ విధము గాను బయలు పడుచున్నవి.

ఈ తాళ్లపాకవారికి తరువాత 200 సం॥ ములకు తంజావూరు రఘునాథరాయల కాలమున నాంధ్రనాయకులు దక్షిణమున నాంధ్రభాషను ఉన్నత దశకు తెచ్చిరి. ఆ సమయమున సచ్చట కవులు, కవయిత్రీమణులు పెక్కు కావ్యముల రచించి ప్రసిద్ధి గనిరి.

మన తిమ్మక్క సుభద్రాకల్యాణము పాట రూపమున ఆనోట ఆనోట జిక్కి వందల సంవత్సరముల తరువాత తంజావూరియందు చేమకూర వెంకటకవి చెవిని బడినది. తంజావూరు లైబ్రరీలో తాళపత్ర గ్రంథములలో గూడ కనబడినదేమో! చేమకూర వెంకన్న తల్లి గాని అమ్మమ్మ గాని యీసుభద్రాపరిణయమును పాడుచుండగా విన్నాడు కాబోలు. ఇంత చక్కనిగాథ వినగానే కవిగారికి నోరూరింది. కథావస్తువు భారతగాథ శృంగార వీర రస భరితము. కథా నాయిక జగదేకవీరుడైన యర్జునుని యర్ధాంగి జగన్నాథుడైన శ్రీ కృష్ణపరమాత్మ చెల్లెలు. ఇంకేమి కావలెను. తంజావూరు ప్రభువైన రఘునాయకుల యాశ్రితుడు తాను ప్రభువు కవితాప్రియుడు కావున ఆ కథావస్తువు కేగైకొని ప్రతి పద్యమునందు చమత్కృతి గలుగగ రచించి విజయవిలాసమను పేరనొక చక్కని పద్యకావ్యముగ రచించి రఘునాథరాయలను కృతిపతి నొనర్చి యాతనికంకితమొనగి చిరస్థాయియగు కీర్తిని గడించినాడు వేంకటకవి.

కృతికర్త కృతిభర్త పురుషులగుటచే గృతినాయకుని విజయునిజేసి విజయవిలాసము రచించి విజయమునొంది

అనేకాగ్రహారముల సంపాదించినాడు. పలుకుబడులు సైతము తిమ్మక్క కవయిత్రివే. కథా వస్తువు కదైనపుడా గాథ ననుసరించినపుడు కొన్ని భాగముల ననుకరించక తప్పినదికాదు

సుభద్రా. ఎగుభుజమ్ములవాడు మృగరాజు నడుము
నడచి పుచ్చుకొను నెన్నడుము గలవాడు
గరగరనివాడు చక్కనివాడు నతడు
గొప్పకన్నులవాడు కోదండగుణకి
ణాంకంబులే బాహులమరినవాడు
బవిరి గడ్డమువాడు....
చేమకూర వెంకటకవి.

సీ. ఎగు భుజంబులవాడు మృగరాజ మధ్యంబు
పుడికి పుచ్చుకొను నెన్నడుమువాడు
నెఱివెండ్రుకలవాడు నీలంపునికరంపు
మెఱుగు చామనచాయ మేనివాడు
గొప్ప కన్నులవాడు కోదండగుణకిణాం
కములైన ముంజేతులమరువాడు
బవిరి గడ్డమువాడు పన్నిదంబిడిడాగ
వచ్చునందపువెన్ను మచ్చువాడు

గరగరనివాడు నవ్వుమొగంబువాడు
చూడగలవాడు మేలైన సొబగువాడు
వాని మేనత్త కొడుకుగావలయునాకు
నర్జునుండు పరాక్రమోపార్జునుండు.

సుభద్ర అర్జునుని గుఱించి యతి వేషముననున్న అర్జును నడుగునపుడు

సుభద్రా కల్యాణమున

అయ్య మీరేదేశ మరసిచూచితిరి.
పరగనింద్ర ప్రస్థ పట్టణమ్మునకు
ధీర మానసులు కుంతీ సుతుల్ వారు.
ఇంద్రనందను నెందునేజూడలేద
విజయకు మీరింద్రప్రస్థముగ
న్నారా పాండవులజూచినారా సుఖులై
వారందఱు నొకచోను
న్నారా వీరాగ్ర గణ్యునరుగా నరుగా!

ఇట్లే పెక్కుచోట్ల ఆమె పలుకుబడులే విజయ విలాసమునందుకొననగును. విజయ విలాసము ప్రౌఢకావ్యము. యమకాద్యలంకారములతో నిండినది. తిమ్మక్క కావ్యము పాటకనుకూలమైనది. చక్కని వర్ణనలు ఉపమలు లోకోక్తులు జాతీయములు కలవు.

అర్జునుడు తన్ను గాంధర్వ వివాహము చేసికొమ్మనగా సుభద్ర "తివిరి యేనుగునెక్కి దిద్దు చూరెదరె" అని ఉదాత్తముగ మందలించినది. ఏనుగునెక్కి సింహద్వారమున పోవలెగాని దొడ్డిదారిన వెళ్ళవచ్చునా అన్నది. ఎంత గొప్ప భావము నెంత చిన్న మాటలలో చెప్పినది కవయిత్రి.

"ఉమ్మెత్త పువువలె నుతికిన మడత
నఖముల గొనివచ్చి నాతియిచ్చినను
పాలించు ముత్యాల పణతి చిర్నగవు
సతినా సతిల పుష్పసమమైనదేమి
అతివ మధ్యమ్ము సింహమునకు సరియె"

స్వభావ వర్ణన మెంతమనోహరముగ చేసిన దీ కవయిత్రి చూడుడు.

సుభద్ర అన్నదగ్గరకు వచ్చుట

"పసిడి సలాకణ పడతి సుభద్ర
వలిపువ్వు గుత్తుల తలిరాకుబోణి
లలిత సౌరభ శోభగులుకరింపంగ
సని చక్కగా బైట నవరించుకొనుచు
నడ నడ చిన్నారి నడుము జవ్వాడ
అందెలు మ్రోయగ హారముల్ తూగ
మొలనూళ్ల ఘంటలుముద్దియల్ మ్రోయ
సందెచందలు వెలసరి పెణల్ టూల
దివ్వెలై హారముల్ తెరువుజూపగను.
హంసలనడలతో నతివ సుభద్ర
అల్లనల్లన వచ్చె అన్నముందరికి."

తిమ్మక్క భర్తయందలి భక్తి గౌరవములచే సవతిని గౌరవించుట ద్రౌపది సుభద్రను విజయునికి గూర్చు పట్టు ఇట్లు వర్ణించినది.

ఏమివస్తువునైన నీవచ్చుగాని
ప్రాణేశునిచ్చి మఱిబ్రతుకంగరాదు
అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుని
చెల్లెలు గనకనే నొల్లననరాదు.
అదిగాక సభలోన నాకౌరవులకు
మానభంగము గల్గు హీనకాలమున




# అమృతాంజనము

గాని,

"యథాయథా...............రాశీభవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్త్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగు చున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునే మోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

## స్త్రీల పద్యరచన

మానధనమొసగి శమాహాత్మ్యశాలి
అటువంటి శ్రీకృష్ణుకగును జెల్లెలట
అని మతితలపోసి అతివ మోదించె.

మంజరీ ద్విపదలుగా పురాణగాథలను రచించుట మన వారికాచారముగా నున్నది. వెంగమాంబయు నిట్టి ద్విపద కావ్యములను రుక్మిణీ కల్యాణము- భాగవతము- రాజ యోగసారము- అష్టాంగయోగసారము మొదలగు వానిని రచించి యున్నది. ద్విపదను నాలుగైదు రాగములలో బాడవచ్చును. ముఖ్యముగా స్త్రీలు పనిపాటలు చేయు నపుడు గేయములు పాడుచుండు నలవాటు కలదు. పల్లకి మోయునపుడు బోయీలు- పడవ నడుపునపుడు పల్లె వాండ్రు- వడ్లుదంపునపుడు కూలీలు పనియొక్క- భారము తోచకుండుటకై పాటలు పాడుచుండుట చూచుటలేదా! ఇట్లే ఇంట్లో పనులు చేసికొనునపుడుగాని ఉబుసు పోకకు గాని స్త్రీలు పాటలు పాడుకొనుచుండుట ఇప్పటికిని గొన్ని యిండ్లలో ఆచారముగ నున్నది.

పాడుచుండునోట భగవానుపై పాట
ఇంటచేయుచుండు నెల్లపనుల.
ప్రస్తుత మనుసరింతము.
తిమ్మక్క- ఫలశ్రుతి నిట్లురచించినది.
"అవనిలో తాళ్ళపాకన్నయ్యగారి
తరుణి తిమ్మక చెప్పి తాను సుభద్ర
కల్యాణమనుపాట కడుమంచితేట
పలుకుల నీపాట పాడినావిన్న
శ్రీహరివారికి చేరువైయుండు
నానాట పాపముల్ నాశనంబౌను
ఆప్తులు బంధువులను వొందగలరు
సప్తసంతానముల్ సమకూరగలవు."

[ఆలిండియా రేడియో విజయవాడవారి సౌజన్యముతో]



# బాల వినోదం



## చెడపకురా చెడెదవు

• శ్రీ టి. వి. నరసింహారావు •

ఒక ఊరిలో ఒక బ్రాహ్మణుడు నివసించుచుండెడివాడు. వానికి దైవభక్తి యన మెండు. ఆ ఊరిలోనే ఒక గొల్లవాడు కూడ నివసించుచుండెను. వానికి గొఱ్ఱెలు, మేకలు, ఆవులు కూడ యుండెను. వాడు ప్రతిరోజు ఈ బ్రాహ్మణునికి నమస్కరించి తనకు భగవంతుని జూపుమని ప్రార్థించుచుండెడివాడు. బ్రాహ్మణుడు రేపు మాపు అని త్రిప్పుచుండెను. బ్రాహ్మణుడు పూజారిగా యున్న పాడు కోవిల ప్రక్కనే ఒక నుయ్యి కలదు. ఒకనాడు గొల్లవాడు తనకారోజున భగవంతుని చూపి తీరవలెనని పట్టు పట్టెను. బ్రాహ్మణునికి తల తిరిగి పోయెను. ఎట్లు చూపగలడు? అందుచే గొల్లవానికి ప్రక్కనున్న నూతిని చూపి అందులో భగవంతుడున్నాడని చెప్పెను. పూర్వము బ్రాహ్మణులయందు ఎక్కువ నమ్మకముండుటచే తటాలున గొల్లవాడు నూతిలోకురికెను. గొల్లవాడు ఈత రానివాడగుటచే గుటకలు వేయుచుండెను. బ్రాహ్మణుడు పీడ వదలినదనుకొని ఇంటికి పోయెను. భగవంతుడు గొల్లవానియొక్క నిజభక్తికి మెచ్చి వానిని బ్రతికించి, వానికొక బంగారు పాత్ర నిచ్చెను. గొల్లవాడు మేల్కాంచి చూచుసరికి భూమిపై బంగారు పాత్రతో పడి యుండెను. భగవంతుని కనులారా చూసి నందుకు గొల్లవాడు సంతోషముతో బ్రాహ్మణుని యింటికి వచ్చి వానికి పారితోషికముగ కొంత బంగారమును ఇచ్చి జరిగిన దంతయు చెప్పెను.

గొల్లవాడు వెడలిపోయిన తర్వాత బ్రాహ్మణుడు దురాశతో తానుకూడ భగవంతుని చూచి బహుమతి పడయ వలెనని యెంచి తిన్నగా నూతివద్దకు పోయి దభేలున నూతిలోకురికెను. బ్రాహ్మణుడు ఈతరానివాడగుటచే గుటకలు మ్రింగి చనిపోయెను. గొల్లవాడుదయముననే బ్రాహ్మణుని యింటికి వచ్చి బ్రాహ్మణుడు రాత్రినుంచి కనబడలేదని వాని భార్య వలన విని, భగవంతుడు తనకు కనపడిన నూతి వద్దకు వచ్చెను. నూతి వద్దకు రాగానే బ్రాహ్మణుని శరీరము కన్పడుట గాంచి గొల్లవాడు భగవంతుని బ్రతిమాలుకొనెను. ఎంతటికిని భగవంతుడు కటాక్షించ కుండుటచే గొల్లవాడు తన కొఱకై ఎంతో కష్టపడి భగవంతుని చూపిన బ్రాహ్మణుడు మరణించుటచే తనెందుకు ఇంకా బ్రతికి యుండవలెనని తలచి నూతిలో కురుక సమకట్టెను. వెంటనే భగవంతుడు ప్రత్యక్షమయి బ్రాహ్మణుని బ్రతికించి, "చెడపకురా చెడెదవు," "దురాశ దుఃఖమునకు చేటు" అని చెప్పి అంతర్ధానమయ్యెను. బ్రాహ్మణుడు సిగ్గుజెంది గొల్లవానితో తద్వృత్తాంత మంతయును సవిస్తరముగ జెప్పెను. గొల్లవాడు బ్రాహ్మణుని యింటికి సాగనంపి తన గృహమునకు పోయెను. మరునాడు గొల్లవాడు, బ్రాహ్మణుడు పూజారిగా నుండిన పాడు కోవిలను బాగుచేయుటకు సమకట్టి బ్రాహ్మణునితో చెప్పెను. గోపురము పూర్తియగుసరికి పాత్రలోని బంగారమంతయు సరిపోయెను. మిగిలినది కట్టించుట ఎట్లు అని గొల్లవాడు విచారించుచు దాహ బాధకు నీరు త్రాగ పాత్రవద్దకు పోయెను. చూచుసరికి మరల అది బంగారముతో నిండిపోయెను. కోవిలను పూర్తిచేసి దానికి బ్రాహ్మణునే పూజారిగా నియమించి గంధ, ఫల, నైవేద్యములు చేయించుచుండెను.

—★—

# ఆంధ్ర గడ్డ

• శ్రీమతి లంక అమృతాంబ •

చక్కన్ని మా బాల
పరుగిడుతు వచ్చి
ఆంధ్రులను మేష్టారు
పొగిడారు పెద్దగా-

వారిలోని ఘనత
చెప్పమ్మ నాకంటు
మా బాల ననుజేరి
మరి మరీ అడిగింది.

ముచ్చటగ ప్రశ్నను
మా బాల అడిగితే
చెప్పాను నేనెంతొ
సంబర పడుతూను.

బంగారు దేశమే
బంగారు బిడ్డా
ముత్యాలు పండేను
మన భూములందు.

చాలకాలముగాను
రాజులేలినసీమ
కృష్ణరాయలపేరు
కలకాలముండును.

ధైర్య శౌర్యములకు
బాల చంద్రునిపేరు
తాంత్రి పాపయ పేరు
మరచిపోకమ్మ.

పోతన్న వ్రాసేను
ఆంధ్ర భాగవతమ్ము
నన్నయ, తిక్కన
వ్రాసిరి భారతము.

కమ్మని కవితను
చెప్పేటి కవియిత్రి
మొల్లమాటను ముందు
మనసులో నుంచుకో.

మగువ మాణిక్యాల్లో
నాగమ్మ, రుద్రమ్మ
మాంచాలి, మల్లమ్మ
మహా గట్టివారు.

'గురజాడ' కవిరాజు
లక్ష్మి నరసింహమ్ము
కందుకూరి తాత
వెలిగి పోయారు.

రాజకీయాలలో
ఆంధ్ర కేసరి ఒక
ఆజానుబాహుడని
అందురమ్మందరు.

రాజకీయములందు
రంగైన పేరును
మోసేటివారుండ
మనకేటిలోటు.

తెలివి తమసొమ్మంటు
తెల్పేటి తిమ్మరసు,
యౌగంధ రాయణులు
మనవారెనమ్మ.

ఆంధ్రులకు గర్వము
ఆంధ్ర జాతికి పేరు
సర్వేపల్లివంటి
ఆంధ్ర పుత్రులలోన.

మహిళా మహోన్నతి
వెలికి తీసిన తల్లి
ఆంధ్ర గడ్డకు బిడ్డ
దుర్గబాయేనమ్మ.

తెలుగువారి కీర్తి
తరతరాలుగ నిలుపు
త్యాగయ్య కీర్తనలు
గానవాహినిలో-

ఆంధ్ర రత్నముగన్న
విశ్వదాతనుగన్న
ఆంధ్ర గడ్డకు నీవు
ఆంధ్ర మాతకు నీవు
మనసులో మ్రొక్కుమ్మ
అంకితముగావమ్మ.

# బడి పంతులు

"రాజేశ్వర్"

అనగనగా ఒక ఊరు. ఆ ఊర్లో ఓ చిన్న బడి. ఆ బడికి ఒక పంతులు మేష్టరుగా వున్నాడు. ఆ పంతులుకి నిమ్మకాయలు నిలబడే కోర మీసాలున్నాయి. పొడుగైన గెడ్డం కూడా వుంది. ఎప్పుడూ బడిలో నిద్రపోతూ వుంటాడు. బడిలో పిల్లలు పంతులు పాఠాలు చెప్పకుండా నిద్రపోతూ వుంటాడని ఆ నిద్ర యికమీదట లేకుండా చేదామని ఆలోచించుకున్నారు. వారందరిలోకల్ల రామం చాలా అల్లరి పిల్లవాడు. అతనెలాచెప్తే మిగిలిన వారందరూ అలాగే వింటారు. బడిపంతులు మామూలుగా వచ్చి పిల్లల్ని ఎక్కాలు చదవమని చెప్పి కుర్చీలో కూలబడ్డాడు. పంతులు బాగా నిద్రపోవడం చూచి రామం ఏం చేసాడోతెలుసా? ఓ చిన్న ఎలకపిల్లని తెచ్చి మెల్లిగా పంతులు గెడ్డానికి కట్టేసి కనబడకుండా మళ్ళా గెడ్డం సర్దేశాడు.

కొంతసేపటికి పంతులు లేచి "ఎక్కాలు చదివేర్రా" అని టేబిల్‌మీద ఒక గుద్దు గ్రుద్దేడు. "మా గెడ్డాలలో ఎలకపిల్లలు ఆడుతూ వుంటే ఎలా చదవడమండి" అన్నారు పిల్లలు. పంతులు ఎన్నిసార్లడిగినా అలాగే చెప్తున్నారు. వీళ్ళకేదో పిచ్చెక్కిందని పంతులు మీసాలు త్రిప్పుతూ గెడ్డం సవరించుకుంటూ "చెప్పరర్రా మీ పని చెబుతానుండండి" అని గద్దించేడు. అయింతా పంతులు గెడ్డంలో వున్న ఎలకపిల్ల కాస్త క్రింద జారిపడింది. పంతులు వారన్నమాటలకు అంతరార్థం ఇప్పుడు తెలుసుకున్నాడు.

గెడ్డం తడిమి చూసుకుంటే సగం కొరికేసి వుంది. "ఎవర్రా ఈ ఎలకని కట్టేడు" అని పిల్లలనందర్నీ గద్దించేడు. కాని ఒకరూ జవాబు చెప్పలేదు. పంతులు ఈ విషయం పై అధికార్లకు తెలియచేస్తే తన బండారం బయటపడుతుందని గుప్ చిప్‌గా ఊరుకున్నాడు. ఆ రోజు నుండి పంతులు బడిలో నిద్రమాని సమంగా పాఠాలు చెప్తున్నాడు. బాలలూ మీరెప్పుడూ ఇటువంటి పన్లు చేయకండేం. ఒకవేళ ఇటువంటి ఉపాధ్యాయులు ఉంటే పై అధికార్లకు తెలియజేయాలి తెలిసిందా.

★

# పాపాయి కోరికలు

రచన:— కలగర్ల నరసింహ మూర్తి

ఆకాశంలో ఉన్నయ్ ఎన్నో
నల్లనిమబ్బులు తెల్లనిచుక్కలు
మిల మిల మెరిసే మేలగు చుక్కలు
చంద్రునిచూచీ తలవంచాయ్!

నాన్నా! నాన్నా! నాకోచుక్క
తెచ్చిస్తేమరి ముద్దిస్తానే!
మబ్బులుచూడు మరగున్నాలే!
కదలవు మెదలవు కాంతేలేక!

నాన్నా! నాన్నా! జాబిల్లదిగో!
నాతోనేస్తం కడతానంటు
నవ్వుతు వెన్నెల పంపింది
నాట్యంచేస్తూ రమ్మంది!

అయ్యో! నాన్నా! జాబిల్లేదీ?
నల్లనిమబ్బులు దెయ్యం మబ్బులు
చల్లని తెల్లని చంద్రుని దాచి
మెల్లగఏడుపు తెప్పిస్తున్నాయ్! (నాకు)

నాన్నా! నాన్నా! తుపాకితేతే!
ధన్‌మని పేల్చి మబ్బులచంపి
చల్లని చంద్రుని రక్షిస్తానే!
చక్కగ నాట్యం చేస్తానే!



# నువ్వు రెమ్మల ఎండు దున్న కట్ట

"శ్రీ సుమ"

పూర్వమొక రాజుగారు పెద్ద సభను చేసారు. ఆ సభ కెందరో గొప్ప గొప్ప పండితులు ఆహ్వానింపబడ్డారు. అందరితోబాటు రామలింగడు కూడ ఆహ్వానింపబడ్డాడు. రాజుగారు తానా సభనెందులకు ఏర్పాటు చేసారో ఇలామనవి చేసారు. "నా రాజ్యములోనికి గొప్ప శాస్త్రవేత్త కావాలి." వెంటనే రామలింగడు "నే నొక ప్రశ్న వేస్తాను, దానికి ఎవరు సరిగ్గా జవాబు చెప్తారో వారు సరియైన శాస్త్రవేత్తలగుదు" రని చెప్పెను. సరేనని రాజుగార భయమిచ్చారు. రామలింగడు రెండు చేతులు జోడించి "నా దగ్గర ఒక గ్రంథముంది. దానిపేరు 'నువ్వు రెమ్మల ఎండు దున్నకట్ట' దీని అంతరార్థమేమొ తెలుపవలసిన"దని మనవి చేసెను. సభకరుదెంచిన పండితులెల్లరు తెల్ల మొగములు వేసిరి. రాజుగారానాటికి సభ ముగించి రేపటికి గడువు వేసానని చెప్పిరి. అందరు వారి వారి నివాస స్థానములకు పోయిరి. ఆహ్వానింపబడినవారిలో ఒక శాస్త్రవేత్త గ్రంథ నామమును పలుమారు లుచ్చరించుకొనుచు తర్జన భర్జనలు గావించుకొనుచు రాత్రి వేళకు తన భన చేరెను. ప్రతి నిత్యము తన మనస్సును అదే ప్రశ్న వేసుకొచుండెను. కాని తగిన ఫలము లభించుటలేదు. తుదకు వేసారి "తనే రేపటి సభలో" 'నువ్వు రెమ్మల ఎండు దున్నకట్టను' గ్రహించశనక్తుడుగనియమించిన యెడల పరాభవమునకు మితిలేదు" కదా అనుకొనెను. ఈ ఆలోచనలతో కుమిలిపోయి తానా గ్రామమునుండియే నివాస స్థానమును మార్చదలచెను.

ఆ మరునాడు శాస్త్రవేత్తలందరు సభకు హాజరయ్యారు. రాజుగారు మరల శాస్త్రవేత్తలను పరీక్షించుటకు అనుజ్ఞ యిచ్చిరి. కాని ఎవ్వరూ చెప్పెడి ఆశలోలేరు. ప్రతివారు సందిగ్ధావస్థలో పడిపోయారు. ఇంతలో రాజుగారొక శాస్త్రవేత్త సభకు రాలేదని గుర్తించి రామలింగని కారణమడిగిరి. "ప్రశ్న వినేసరికి భయపడి ఈ గ్రామము విడిచి ఉంటాడు" అని రామలింగడు బదులు పల్కెను. ప్రస్తుతము రాజుగారి కేవిషయము ఏమి బోధపడలేదు. రామలింగనికి తప్ప ఎవ్వరికి తెలియదని రాజుగారతనినే అంత రార్థమేమొ సెలవిమ్మనిరి.

రామలింగడు అంత దనుక తన చంకలో గుడ్డచే కప్పబడిన ఒక కట్టను నెమ్మదిగా బయటకు తీసి దాన్ని రాజుగారి ఎదుట విప్పెను. రాజుగారిదంతా చూసి చాల విస్తుపోయిరి. గ్రంథమని చెప్పినవాడు ఇవన్నీ చూపుతాడేమని తలచారు. రామలింగడు "నా వద్దనున్న గ్రంథమిదే. ఈ కట్ట నువ్వురెమ్మల ఎండు దున్నకట్ట. ఈ కట్టలో ఎండిపోయిన దున్నపోతులుతినే నూచేను రెమ్మలు. అంటే బక్క చిక్కిన ఎడ్లకు ఈ ఎండిన నూరెమ్మలు పెడతారు" అని సెలవిచ్చాడు. రాజుగారు రామలింగని తెలివికి మెచ్చుకుని అతనేపంచి శాస్త్రవేత్తని బదులుపలిరి.



# సీను నిజాయతి

• శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి •

"నాకు అర్థంకాక అడుగుతాను, బోర్డు కట్టినతర్వాత మడిగట్టుకుని కూర్చోవాలంటె యెట్లాకుదురుతుందండి" అన్నది సుజాత లోపలవున్న అక్కసులో సగాకిని పైకిరానిస్తూ.

"చూస్తూ చూస్తూ పచ్చిఅబద్ధాలు ఆడాలంటె నోరాడటంలేదు. బోర్డుకట్టింది గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవటానికి అనుకున్నావా మరి. వస్తుంది సమయము" అన్నాడు సీను సమాధానపూర్వకంగా.

ఇలాంటిరకపు సమాధానాలు అదివరకు యెన్నో చెప్పటమయినాయి సుజాత మనస్సుకు వకటీ సంతృప్తి కలిగించలేదు. నిక్షేపంలాంటి వుద్యోగం మానేశాడు. "ఎంతకష్టం యీ రోజుల్లో వుద్యోగం దొరకటం" అంటూ నలుగురు కాకి పొడిచినట్లు పొడిచారు. ఎవరేమన్నా తన అభిప్రాయాన్ని మార్చుకోలేదు.

సీను యింటికి యెంతమందివచ్చినా "ఆ కేసులో యీ మాట నేను చెప్పను, యీ కేసులో ఆమాట నేను అనలేను, అట్లా నువ్వు చెప్పమంటే చెప్పి అబద్ధంఆడతానా, నువ్వు చెప్పిన మాటలను నేనే నమ్మటంలేదు. ఆ సాక్ష్యం విషయంలో అబద్ధాలు ఆడుతున్నాడని నాకు అనుమానంగావుంది. కేసుగెలుస్తుందని యీ విధంగా చెప్పమంటారా" అంటూ చెప్పి వచ్చినవాళ్లందర్నీ పంపించేస్తూ వచ్చాడు. వచ్చిన పెద్దమనుష్యులు తలొకమాటా అనుకుంటూ వెళ్ళిపోతున్నారు.

ఉషఃకాంతి నలువైపుల విరజిమ్ముకుంటూ వస్తోంది. సీనుకు యేవో ఆలోచనలు తట్టుతున్నాయి. తన మనస్సులో యేదో మెరుపు మెరిసినట్లనిపిస్తోంది. తన సిద్ధాంతం నిజమేనని రుజువు చెయ్యగలనని యేదో ధైర్యం వచ్చినట్లు అనిపించింది. సరిగ్గా తొమ్మిది కొట్టింది గోడ గడియారము. సూర్య కిరణాలు మంచును చీల్చుకుని బైటకు వచ్చేస్తున్నాయి. సుజాత సీనుదగ్గరకు వచ్చి కూర్చుంది.

"ఏమిటి యివ్వాళ యేదో తమాషాగా వున్నట్లు కనబడుతున్నారు" అన్నది సుజాత ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ.

సీను యేదో సమాధానం చెప్పడానికి సంసిద్ధుడయినట్లు కనిపించాడు.

వెంటనే గట్టిగా తలుపు చప్పుడయింది.

"రక్షించాలి దండాలండిబాబు" అన్నాడు ఒక వ్యక్తి వీధిలోంచి పరుగెత్తుకుంటూ వస్తూ.

సీను గాభరా పడిపోయాడు. సుజాతకు ఆశ్చర్యం కంటె, భయము యెక్కువయింది.

"బాబు నాకొడుకు కూనీచెయ్యలేదు. రక్షించాలి" అంటూ ఒక ఆడమనిషి కూడ ఏడుస్తూ సీను యింట్లోకి వస్తోంది.

సీను తత్తరపడిపోతున్నాడు సుజాత గ్రుడ్లు అప్పచెప్పి కూర్చుంది.

"బాబుగారు మా అబ్బాయి కూనీ చెయ్యలేదు. ఆ శంకరయ్యగారికి ఆ సూరయ్యాగారికి మొదటినుంచి విరోధమండి. ఇంత డబ్బుంది కాబట్టి, యెవరికో శంకరంగారు డబ్బిచ్చి, ఆ సూరయ్యాగార్ని చంపించాడండి. ఆ నేరం కాస్త మావాడిమీద పెట్టేశారు.... మావాడికేమి తెలియదండి. అన్యాయంగా పోలీసులు మా వాడిని పట్టుకెళ్లారు. రక్షించాలి" అంటూ వకటే ధోరణిలో యేడుస్తూ యేకరువు పెట్టాడు ఆ వ్యక్తి కేసు విషయము.

సీను మనస్సు పరి పరి విధాల పోతోంది. ఇంతలో రామేశం వచ్చి, "యిదియదార్థమైన కేసు నేనే నీదగ్గరకుపంపాను నీ సిద్ధాంతానికిసరిపోయినకేసు" అన్నాడుముక్తసరిగా.

థేంక్సు అనే పదంతో యీ కేసును సీను స్వీకరించాడు. సుజాత ముఖం చేటంత అయింది.

మర్నాడు సాక్ష్యం అంతా తీసుకున్నాడు సీను.

శంకరం సూరయ్యను కూనీ చేస్తే డబ్బిస్తానన్నట్లు ప్రత్యక్షసాక్ష్యం కూడా దొరికింది.

జడ్జీగారు తీర్పు యిచ్చారు.... "ముద్దాయే సూరయ్యను చంపినట్లు రుజువు చెయ్యగల సాక్ష్యం యేదీ లేనందువలన బేషరతుగా సదరు ముద్దాయిని విడుదల చెయ్యటమైనది." అంటూ.

సీను సంతోషానికి అంతు లేకపోయింది. సుజాత సంతోషం పట్టలేకపోతోంది.

"బాబు క్షమించాలి. యీ వెయ్యి రూపాయలు తీసుకోండి. నా ప్రాణాన్ని కాపాడారు. ఇక నా జీవితంలో నేను కూనీ చెయ్యను" అంటూ ఆ ముద్దాయి సీను కాళ్ళమీద పడ్డాడు.

కోర్టులో యెవరిముఖం యెవరు చూస్తున్నారో యెవరికీ అర్థంకాల.



# అభాగ్య జీవితం

శ్రీ పోలిశెట్టి నాగేశ్వరరావు

అతన్ని ఆవూళ్లో అంతా డప్పులపిచ్చివాడంటారు. కారణమేమిటంటే ఎక్కడైనా పెళ్లిబాజాలు వినిపించిన వంటేచాలు భయంతో దూరంగా పారిపోతాడు. ఊళ్లో వాళ్లంతా ఆశ్చర్యంతో ఆ దృశ్యాన్ని చూస్తూవుంటారు.

పాపం! అతని వయస్సు ముప్పయి సంవత్సరాలకు మించి ఉండదు. బాగా పెరిగిన గడ్డం, చినిగి మాసి పోయిన బట్టలతో చూచే వాళ్లకి భయంకరంగా కన్పిస్తాడు. కాని ఎవరినీ ఏమీ అనడు. ఎవరిజోలికీ పోడు. అతను పైవూరినుంచి రావటంవల్ల, అతని విషయమై ఎవరిని అడిగినా ఏమీ చెప్పరు.

ఆరోజు రాత్రి వీధిఅరుగుమీద కూర్చుని వ్రాసుకుంటున్నాను. నాదగ్గర దీపం వెలుగు తప్ప నాచుట్టూగాఢాంధకారంగా వుంది. ఆచీకటి లోంచి ఎవరో నాదగ్గరకు వస్తున్నట్టు కన్పించింది. కాని 'ఎవరోలే' అని నాపనిలో నిమగ్నుడనయ్యాను.

కొంతసేపటికి ఎవరో నాఎదుట నిల్చున్నట్లు తోచింది. తలఎత్తిచూశాను. అతను డప్పుల పిచ్చివాడు. ఏమిజేస్తాడోనని గడ గడ వణకిపోతున్నాను. ఎందుకు నాదగ్గరకువచ్చాడో అడగటానికి కూడా నాకు ధైర్యం చాలలేదు.

"ఏమిటావ్రాసేది?" అని అన్నాడు కోపంగా.

"ప్రేమగీతాలు' అని అన్నా మెల్లగా.

"ఎవరిని ఉద్ధరించటానికోయ్ నీ ప్రేమ గీతాలు? ఈనాటిసంఘంలో నాలాంటి అభాగ్యులు ఎంతమందో వున్నారు. మా జీవితాలను నీ రచనల ద్వారా లోకానికి ప్రకటించు. సంఘం కొంతయినా మారుతుందేమో! ఆలా చూస్తావేం చెప్పేది వ్రాయి" అని కసిరాడు. భయపడి నేను వ్రాయటం మొదలు పెట్టాను.

"నాదొక అభాగ్య జీవితం. అంత చిన్నతనంలో నా భార్య ఎందుకు మరణించిందో నాకు తెలును. అందుకు బాధ్యుడను నేనే. ఆమె కూడా ఒక తలికన్న బిడ్డని, ఒక సోదరుని సోదరని, నాకు జన్మించబోయే కుమారుని పవిత్రమైన మాతృదేవి అని తెలుసుకోలేకపోయాను. ఆ మహాయిల్లాలిని నానా బాధలు పెట్టి, బానిసగా చూచి చివరకు నాచేతులారా చంపుకున్నాను.

"మా నాన్న పెద్ద షావుకారు. బహు దుర్మార్గుడు. డబ్బు గడించడానికి అతను చేయని పాపంలేదు. ఎంత మంది దీపాలలో ఆర్పి ధనం కూడబెట్టాడు. దొంగపద్దులు వ్రాసి, హెచ్చువడ్డీలు కట్టి, అమాయకుల్ని మోసంచేసి, బ్లాకుమార్కెట్టు చేసి ఒక లక్ష రూపాయలు గడించి హఠాత్తుగా ఒక రోజున చచ్చాడు.

"ఆయావదాస్తీ నాకు సక్రమించింది. అప్పుడు నేను మంచి వయస్సులో వున్నాను. ఈ ధనమంతా ఎలా ఖర్చుబెట్టాలో తెలియక నాకొక పెద్ద సమస్య అయిపోయింది. బీదతనమంటే ఏమిటో నాకు తెలియదు. అందువల్ల డబ్బు దాయటానికి నేనెన్నడూ ప్రయత్నించలేదు. ప్రతిదినం నాయిష్టంవచ్చినంత సొమ్ము ఖర్చుపెట్టేవాడిని. మా అమ్మ సొమ్ము ఎప్పుడైనా యివ్వనంటే, యింటికి రానని బెదిరించేవాడిని. అందువల్ల ఆమె అడగ్గానే నాకు సొమ్ము యిచ్చేది. నాదగ్గర డబ్బుచూసి నాకుస్నేహితులు ఎక్కువయ్యారు. వారు బహుదుర్మార్గులు. ఆ సంగతి అప్పుడునాకు తెలిసిందికాదు. ముందు నాకు త్రాగుడు నేర్పారు. తర్వాత ముండలని అలవాటు చేశారు. నేను చేస్తున్న పనులు తప్పని అప్పుడూ నాకు తెలుస్తున్నప్పటికీ, నేను దురభ్యాసాలను మానలేక పోయాను. అతిత్వరలో నేను బాగాచెడిపోయాను.

"పెళ్లిచేస్తే పిచ్చి కుదురుతుందని మావాళ్ళు ఎవరినో మోసపుచ్చి నాకు వివాహం చేసారు. నేను భాగ్యవంతుడనని, పిల్ల సుఖపడుతుందని, వారు పిల్లనిచ్చారు. తర్వాత నా సంగతంతా మా అత్తవారికి తెలిసింది. మూడు ముళ్లూ పడ్డాక వాళ్లు ఏంచెయ్యగలరు? నాల్గు రోజులు ఏడ్చి పిల్లను కాపురానికి పంపించారు. దాని ఖర్మ అలావుందని పూరుకున్నారు. ఆడదాని అదృష్టమంతా భర్త మంచివాడు దొరకటంలోనే వుందికదూ! నాలాంటి దుర్మార్గుడికైనా

విడాకులివ్వటానికి స్త్రీకి స్వాతంత్ర్యం ఇవ్వనంటుంది యిప్పటికీ మన సఘం.

"నాభార్య చాలా అమాయకురాలు. కాపరానికి వచ్చే సరికి ఆమెకు పద్నాలుగేళ్ళు. ఇంతచిన్న వయస్సులో పెళ్లిచేసి కాపరానికి పంపుతాము మన దేశంలో. అజ్ఞానంతో వాళ్ళువుంటారు. దానికితోడు సంసారభారం నెత్తిమీద పడుతుంది. ఒకబిడ్డతల్లి కాగానే బలహీనమైపో తారు. మరొక కాన్పుకి మరణిస్తారు. ఇతరదేశాల్లో ఆవయస్సులో ఎంతో బలిష్టంగా వుంటారు. విజ్ఞానంతో వికసిస్తూవుంటారు.

"సరే యిక నా సంగతి. ఆమె అమాయకత్వాన్ని, అజ్ఞానాన్ని అవకాశంగా తీసుకొని పతిభక్తి బోధించాను. 'మొహానికి అర్ధణాకాసంత కుంకం బొట్టు పెట్టుకోవాలి. ఏమాత్రం ముస్తాబు కాగూడదు. ఎంత ఏబ్రాసిలాగ వుంటే అంత పతివ్రతవన్నమాట. భర్తను ఇదికావాలి అదికావా లని బాధించగూడదు. నీ భర్తఎంత బాధిస్తున్నా ఎదురు తిరగగూడదు. నా సుఖసంతోషాలకోసమే నువ్వు బ్రత కాలి. నేను ఏమిఅడిగినా, ఎంతఖరీదైన వస్తువయినా సరే. సందేహించకుండా వెంటనే యిచ్చివెయ్యాలి. ఇంకొక ముఖ్యవిషయం. నీకు వేరే దైవంలేడు. నేనే నీకు దైవాన్ని. నన్ను పూజిస్తేచాలు కోటిదేవుళ్ళను పూజించినంత పుణ్యం వస్తుంది. దుష్టుడ్ని దైవానికి కూడా ఆమెను దూరం చేశాను. దొమ్మరి గుడిసెల్లో దూరే పాపాత్ముడ్ని నన్ను ఆమె దైవంగా పూజించాలట. ఇంకా చెప్పాను. 'మీ అమ్మ వాళ్లూ, నీ భర్త బాగా చూస్తున్నాడా అని అడిగితే ఓ దివ్యంగా చూస్తున్నారు, ఆయనంత మంచిమనిషి ఈ లోకంలో ఇంకొకరు లేరని చెప్పాలి. ఇలా నడుచుకున్నావంటే ఒక్కదెబ్బతో పరమ పతివ్రత వైపోతావు. సూర్యుడూ చంద్రుడూ నీవు ఆగమంటే ఆగవలసిందే. చచ్చిపోయిన తర్వావాత స్వర్గమే. ఇంకా విను. సీత, సావిత్రి, సుమతి వీళ్ళ జాబితాలోకి ఎక్కి పోయి వారితోపాటు నీ పేరుకూడా ఆ చంద్రార్కం నిలుస్తుంది' అనికోతలు కోశాను. ఆమెనమ్మింది.

"భార్యను పేరు పెట్టి పిలవటం కూడా మన దేశంలో తప్పే. అందుకని ఆమెను "ఏమేవ్, ఏయ్" అని పిలుస్తూ వుండేవాడ్ని. పనిచేసే దాసీదాన్ని పిలిచినా వూరు కోదు. కూర ఎంత బాగావండినా ఏదో వంకపెట్టి తిట్టేవాడిని. ఆమెను తన్నని రోజులేదు. యింకా నాకు జ్ఞాపకం, రాత్రులందు ఆమెను నిద్రపోనిచ్చేవాడ్ని కాదు. నేను సాని కొంపలు తిరిగి వచ్చి పడుకుంటే కాళ్లు పడుతూ అలాగే కూర్చునేది. ఒక రాత్రి నా కాళ్లు పడుతూ కునికి పాట్లు పడింది. కోపంతో ఆమె డొక్కలో ఒక్క తన్ను గట్టిగా తన్నాను. ఆమె చాలా సేపు నొప్పితో గిల గిల తన్నుకుంది. ఏడవ కుండా కన్నీరు కళ్ళలోనే కుక్కుకుంది. నా అధికారంలో ఏడవటానికి కూడా ఆమెకు స్వాతంత్ర్యం లేదు. అబ్బా! ఎంత రాక్షసుడిని!

"ఈ సంగతి పొరుగింటి వారికి తెలిసి 'ఎందుకయ్యా అలా తంతా'వంటే 'నా పెళ్లాన్ని నేను తన్నుకుంటాను, చంపుకుంటాను నాగొడవ మీ కెందుకు?' అని సిగ్గులే కుండా జవాబు చెప్పేవాడిని. ఆమెకు పుట్టింటివారు పెట్టిన నగలన్నీ తీసుకొని సానికిచ్చాను. నోరు ఎత్తితే చావ బాదేవాడిని. అలాగే నా దెబ్బలన్నీ సహించి వూరు కునేది పాపం!

"ఆ రోజున సానింటికి వెళ్లాను. ఎంతో అందంగా అలంకరించుకొని వయ్యారంగా నడచి వచ్చి నాప్రక్కన కూర్చుంది. 'నా ప్రాణమా.... నామీద కోపమా' అన్నాను ఆమెతో. 'కాదు యివ్వాళ కొత్తనగ పెట్టుకోవాలని వుంది నా ముద్దు తీర్చరూ' అంది సాని.

"అదెంతపని అని బయలుదేరాను. సాని గుమ్మం వరకూ వచ్చి 'మీకోసం ఎదురు చూస్తుంటాను. తొంద రగా వస్తారుకదూ' అంది. సారా కొట్టుకుపోయి బాగా తాగి యింటికి వచ్చాను. ఇంట్లో నగలేమీ లేవు. నా భార్య మెడలో మంగళసూత్రం మాత్రం వుంది. యివ్వమని అడిగాను.

"అయ్యో! ఈ మంగళసూత్రమైనా నా మెడలో వుంచరా?' అని నా కాళ్లు పట్టుకుంది. అంత మాట అంటుందా అని అహంకారంతో ఆమె మంగళసూత్రం తెంపేసి, బట్టలు చింపేసి కట్టె పుల్లతో రక్తాలు కారేలాగ చావబాదేను. ఆమె ఎముకలు పిండయిపోయినయ్. నేల మీద పడిపోయింది. నేను వెంటనే సానింటికి పరుగు తీశాను. ఆమెతో రాత్రంతా గడిపాను.

"ఇంటికి వచ్చేసరికి నాభార్య యింట్లో లేదు. ఇల్లంతా వెదికాను. దొడ్డంతా వెదికాను. ఎక్కడాలేదు. నూతి దగ్గరకు పోయి తొంగి చూశాను. ఆమె శవం నీటిమీద తేలుతూవుంది. ఆమె ప్రశాంతంగా నిద్రపోతూ వున్న

ట్లుగా వుంది. నా హృదయం చలించి పోయింది. నేను చేసిన పాపాలన్నీ జ్ఞాపకానికి వచ్చినయ్. ఇన్నాళ్లూ ఎందుకామెను అకారణంగా బాధించానో నాకు అర్థం కాలేదు. ఆమె మృత్యువులోంచి నాకు జ్ఞానం కలిగించింది. లోకంమీద విరక్తి పుట్టింది. నెత్తీ నోరూ కొట్టుకుని ఏడ్చాను. కాని ఆమె తిరిగి వస్తుందా?

"నేను పెట్టిన బాధలన్నీ ఆమె శాంతంగా ధీరురాలిలాగ సహించింది. నేను బాగు పడతానని ఎన్నో విధాల ప్రయత్నించింది. ఎన్నాళ్లో వేచివుండి చూచింది. ఆ జీవితాశ కాస్తా ఆమెలో నశించిపోయాక ధైర్యంగా ప్రాణత్యాగం చేసింది.

"ఓ భారతనారీ! నీ పవిత్ర హృదయం ప్రపంచంలో ఎక్కడ లభిస్తుంది? ఓ పుణ్యస్త్రీ నీవు ధన్యురాలవు! పిరికివాణ్ని, పాపాత్ముణ్ని నేడు మాత్రం యీ ప్రపంచంలో మిగిలిపోయాను. మతి పోయింది. ఆనాటినుంచీ ఎక్కడైనా పెళ్లి బాజాలు వినిపిస్తూవుంటే నేను ఆ ప్రదేశంలో వుండకుండా పారిపోతాను. ఎందుకంటే నా సంసారంలాగే వారి సంసారం కూడా నాశన మవుతుందేమోనని భయం.

"నా తండ్రే అంత ఎక్కువ ఆస్తి సంపాదించకుండా వుంటే నా జీవితం వేరు విధంగా వుండేది. ఇక ఏమనుకున్నా లాభం లేదు. నా జీవితం యీలా నాశనమైపోయింది. నేను పిశాచంలాగ యిలా తిరుగుతూవుంటా. నా అభాగ్య జీవితకథను మాత్రం లోకానికి ప్రకటించు. నేను వెళ్ళిపోతున్నా"నంటూ డప్పుల పిచ్చివాడు చీకటిలో మాయ మయ్యాడు. నేను కలం కిందపెట్టి బరువైన నిట్టూర్పు విడిచాను.



# అదృష్టం

• శ్రీమతి కె. సీతాదేవి శర్మ •

బాధ్యతలు ఎక్కువైనకొద్దీ వేణుకు మనస్సు పరి పరి విధాలపోతూంది. అతనిలో ఉండే నిబిడీకృతమైన ఆశయాలు చిత్రరూపకంగా తగినంత ఉత్సాహంతో కని పించడంలేదు. నిశ్చలమైన ఏదో మనం అనుకోని భావాలు మళ్ళీ మన ఎదురుగా జరిగేవే అయినా మనకి తట్టని ఎన్ని ఉద్దేశ్యాలో అతని కుంచెలచివర వర్ణవికాసాలతో తాండవిస్తూంటాయి. అతని చిత్రణలో ఏదో అపురూప మైన శక్తి ఉంది. అది ఆ తరగతివారికేకాని మరొక సామాన్యులకి అర్థం కావు వెంటనే. దాన్ని తెలిసి కొన్న తరువాత 'ఎటువంటి అమూల్యమైన ఉద్దేశ్యచిత్రణ!' అని అనిపిస్తూండేది కొందరికి. అతని ఆర్థిక పసతులు మొదట్నుంచీ అంత బాగున్నా లేకపోయినా ఆ దృష్టేలేక పోయేది. పెల్లబికే యువక భావాల్తో, ఇప్పుడూ ఉత్సా హంఉన్నా, ఇతరులుకూడా ఇతరములుకూడా అతని దృష్టి లోకి రావడం మానలేకపోతున్నాయి. సంసారంకి ఎంత దూ రమై తిరిగినా సంసారం ముళ్ళకంపలాంటిదేమో బహుశా! ఎక్కడ పట్టినా ఊడిపోకుండా పట్టుతుంది. కదిలితే గుచ్చుకుంటుంది. అందులో నేటి రోజుల్లో ఎంత ఉన్నత మైన సంసారాలకన్నా ఏదో విధమైన బాధలు తప్పడం లెదు. అందులో తన బాబయ్యగారు పెద్దవారైనారు. వచ్చే పెన్షను అందరికీ చాలదు. తన సంపాదన కూడా ఉండి తీరాలి అనిపిస్తూంది. వచ్చే చిన్న మేష్టరీ జీతం చాలదుకదా! పెద్ద కుటుంబం మరి. తల్లీ, పినతల్లీ, ముగ్గురు చెల్లెళ్లూ, బాబయ్యగారూ, పెళ్లాం. ఇంకా చిన్న పిల్లాతనికి. ఇందరికీ జరగడం! మంచి ఫాయిదాగల కుటుంబమాయిరి తమది. ఆలోచనలోనే పడ్డాడు. తనతోటి స్నేహితులు అందరూ "తను బొమ్మల్ని, పత్రికలకి పంపీ, అమ్మీ, ఏదో విధంగా ప్రచారం చేసుకొనీ కాలక్షేపం చేయాలి నీలాంటి వాళ్ళుచూడు, ఆ నరహరిరావు" అని అనేవారు. తన కళాంటిపనులు కిట్టవు, పైగా పడ్డన్ని కష్టాలుపడడం, గౌర వించదగ్గ కళ్ళని కాసుకోసం నడివీధినమ్మలేను అంటాడు. ఇంగ్లాండులోనూ అక్కడా పెద్ద పేరున్న ఆర్టిస్టు సయితం ఒక్కొక్క ఇబ్బందిలో రేషను బియ్యానికి, నిత్య జీవి తావసరాలకి ప్రాణప్రదమైన బొమ్మలు అమ్మారట. ఎప్పుడూ ఎక్కడా కూడా కళోపాసికీ, లక్ష్మీదేవికీ బద్ధవైర మేమోమరి!

"ఎల్లాగేనా ఏదేనా పెద్ద ఉద్యోగం దొరుకుతే బాగుం డును. పిల్లాడెదుగుతున్నాడా. చదువూ సంధ్యాకావాలి. బట్టలు కుట్టించాలి. అన్నీ మనకి తగినట్లుగా ఉండాలి కదా! వాడికీ ఇల్లు ఇబ్బంది లేకుండా గడవాలి" అంది ఇల్లాలు భ్రమర.

"ఆ దొరుకుతున్నాయి ఉద్యోగాలు ఊరకపడి దొర్లుతూ అన్ని కథల్లోలాగ అదృష్ట చక్రం అడ్డంగా తిరుగుతుంద నుకున్నావా? మనకి అటునించి ఇటే ఇబ్బందుల్లోకి తిరి గింది. అదీ తమరి భాగ్యంవల్లే."

"సరేలెండి నా భాగ్యంమీదే మీకంత నమ్మకం ఉంచు కోండి. చూడండి మొన్న జగ్గయ్యగారి సతీమణి మనింటికి కానికి అర్ధణాకేకాకుండా పడికీ కాలుపడికీ కూడా వచ్చేది. వదినగారు ఎన్నిసార్లో జాలిపడి అవస రాలు గడిపారు. ఇప్పుడావిణ్ణి చూడండి. నిత్యం ఇంట్లో కూడా మైసూరు జార్జిట్టే తప్ప కట్టదు. ఆవిడేమిటి ఆవిడ దాసీదిగూడా చెవులకి 'న్యూఓల్డ్ఇంగ్లీషు ఫాషన్ష్టార్స్‌ట' అవ్వేపెట్టుకుంటుంది. ఎప్పుడూ మొండి మోసమ్మలా ఉండేఆవిడ చేతులకి మూడు జతల గాజులు అన్నీ ఒకే చేతికి వేసుకుని ఇంట్లోకూడా అస్తమానం రిష్టువాచీ ధరించే ఉంటుంది. రెండో చేతికి హ్యాండ్‌బ్యాగ్, న్యూ మోడల్ స్లిప్పర్స్ లేకుండా ఎక్కడికీ కదలనే కదలదు. ఆఖరికి డాక్టరింటికి కూడా వాళ్ళింట్లో వంటావిడ పూబోడి ఇప్పుడు కిరీట మాంధాతై పోయింది. ముసుగుకి జరీ అంచులు వేలాడుతో బహుసొంపు. వాళ్ళనిప్పుడు చూసే తీరాలి. అదృష్టం తిరగడమంటే అదే తెలిసిందా."

"అయితే ఈ సోదికంతటికీ ఏం కాని తమరికీ ఈ కులుకు ఏమూలో ఉన్న దన్నమాట. అంతేనా ఏం భ్రమరా?" అన్నాడు నవ్వుతూ.

"ఆహా ప్రతీ ఆడదానికీ డబ్బుండి బాగా బ్రతికితే బాగుంటుందనే ఉంటుంది. నాకేకాదు."

"ఏం అయితే మగవాడే దరిద్ర నారాయణుడంటావ్? అంతేకదూ?"

"మీతో నేమాట్లాడ గలనా సరేలెండి. నా డ్యూటీలోకి

పోవాలి కుర్రవాడు లేచినట్లున్నాడు."

*　　　*　　　*

"బాబయ్యగారూ కాస్సేపు అల్లా తిరిగొద్దామా? ఏం తోచటం లేదు." "పదనాన్నా పోనీ వర్మజీ ఇంటికి వెళ్దాం ఆయనిప్పుడింట్లోనే ఉంటాడు. బట్టలు మార్చుకురా. అక్కడ పెద్దవాళ్ళు అందరూ చేరి మాటాడుకునే టైము. కాస్సేపు అక్కడ కూర్చుందాము. రేపొకసారి రండి అన్నారుకూడా మొన్న." వేణు పంచీ పట్టులాల్చీ వేసుకుని బయలు దేరాడు. బాబయ్యగారు వీధి గుమ్మంలో నించున్నారు. "మంచినీళ్ళియ్యి భ్రమరా" అంటూ వంటింటి గుమ్మంలోంచే అడిగాడు వేణు. "లోపలికి రండి" అంది లలితామాయి పాదములమీదున్న కుంకుమ పెట్టుకుంటూనే. వచ్చాడు, మంచినీళ్ళిస్తూ అతని కేసి చూసింది ఎందుకో ఆవేశంలో తనకి పెళ్ళినాడు చూసిన వేణు భావం తోచి అల్లాగే అతి ప్రేమగా గ్లాసు తీసుకుని పక్కని పెట్టి 'ఒక్కసారి' అని తలెత్తింది. ఏమిటి? అంటూ దగ్గరకు చేర్చుకున్నాడు. అతని బుగ్గమీద కొంచెం కుంకుమ అంటుకుంది. ఎవరూ చూసుకొనేలేదు. "బాబయ్యగారూ నడవండి" అన్నాడు. ఇద్దరూ కలిసి బయలుదేరారు. "అదేమిటి నాన్నా ఏదో ఉంది బుగ్గమీద తుడుచుకో" అన్నారు. రుమాలుతో తుడుచుకుని కుంకం అనుకుని."భ్రమర బుగ్గమీద దారం పోగు ఉందంటూ తీసింది కుంకం చేయికాబోలు" అని అనుకున్నాడుపైకి. ముసలాయన లో లోపల నవ్వుకున్నాడు.

ఇద్దరూ బస్సు దిగి కొంత దూరం నడుస్తున్నారు. ఇంకా దూరం ఉంది వారింటికి, ఓకారు పుట్‌పాతంటే వస్తూ తమకి కొంత దూరంలోనే ఆగింది. అందులోంచి యిద్దరు దిగారు. తమ వెనకాలే వస్తున్నారు. తమతో కలుసుకున్నారు.

"వేణునాథంగారు మీరేకదూ" అని అడిగారు అతి మర్యాదగా వేణుని.

"అవునండి" అన్నాడు ఆలోచిస్తూ ఎందుకో అన్నట్లు.

"మిమ్మల్ని మీ ఎగ్జిబిషన్లో చూశాను. తరువాత మిమ్మల్ని కాని, మీ బొమ్మల్ని కాని ఎక్కడా చూడలేదు. అందుకే అడుగుతున్నా. ప్రసన్న బాబా వీరే మీకిదివరలో నే చెప్పిన చిత్రకారుడు." అని మళ్ళీ వేణుతో "వీరు ఒక కొత్తరకం ఫిల్ము తీయబోతున్నారు. వీరి పేరు ప్రసన్న బాబు. నేను హిందూదేశ్ వీక్లీ ఎడిటర్ని." అంటూ పరిచయం చేసుకున్నాడు.

"చాలా సంతోషం" అన్నాడు వేణునాథ్.

"కొంచెంసేపు మీ యిద్దరూ మా బంగళాకి రండి. చాలా సంగతులు మీతో మాట్లాడుదామని ఉంది'' అన్నాడు ప్రసన్నబాబు.

నలుగురూ కార్లో అతని బంగళాకు వెళ్ళారు. తోటలో కుర్చీలలో కూర్చున్నారు. బాతాఖానీకి నేటి నాగరికత ననుసరించి టీ తీసుకున్నాక, ప్రసన్నబాబు ప్రారంభించాడు. కొంత ఇష్టాగోష్టి అయాక.

"వేణునాథ్‌గారూ నేను తీయబోయే ఫిల్ముకి మీరే జీవగర్ర అన్నమాట. నేను ప్రకృతి, స్వభావము, సృష్టి ఇల్లాంటి వాటికి సంబంధించిన వాస్తవికం కనుపించే చిత్రాలను తీయాలని సంకల్పించా, అలాంటివి తీయాలంటేతగ్గ సహాయం లేందే జరగదు. మీరు దానికి తగ్గవారని రామేశం నా బెంగ సహం తీర్చాడు. ఈ ఉద్దేశం నాకు తోచినప్పుడే అన్నీ ఎల్లా తగినట్లు సమకూడుతాయో అని భయ పడ్డాను. ఈ రోజుల్లో వేషాలకి, పనులకి తగ్గవారు దొరకకపోరు. మీలాంటి నిజమైన కళా స్రష్టలు దొరకరని నా ఉద్దేశ్యంలో అనుకున్నా. నాకు మిమ్మల్ని చూపించి సగం భారం తీర్చాడు రామేశం. ఇదంతా గొప్ప బాధ్యతతో కూడుకున్నపని. ఇదివరకు ఎవ్వరూ చెయ్యనిదీను. దీనికి మీరు మరోమాట చెప్పకండి. మీరుకూడా దీనికి చేయూతనిచ్చి ప్రోత్సాహమివ్వాలి బాబుగారూ" అని అన్నాడు ప్రసన్నబాబు.

"దానికేంకాని ఇదివరకు ఆట్టే వీడి బొమ్మలికి ఎక్కువ మనదేశంలో పబ్లిసిటీ లేదు. అంతటి మహోదారమైన పని చేస్తానని మీరు పూనుకుంటే నాకేం కావాలింక, మాకు శుభోదయమే."

"బాబయ్యగారు వెరీ స్వీట్ మెన్" అన్నాడు రామేశం.

"అయితే ఆ ఫిల్ముకి నాంది ప్రస్తావన జరిగిందన్న మాటేనా" అన్నాడు వేణు.

"అన్నమాటే మరి. మీసహాయం, మీకు ఏవిధమైన ఇబ్బందీ కలుగకుండా నే చూసుకుంటా. ముందర కావా

లంటే అందాకా ఈ ఆరువేలూ ఉంచండి, రాకపోకల ఖర్చులకీ దానికీ" అంటూ చెక్కిచ్చేశాడు ప్రసన్నబాబు.

"ముందర దీనిమాట కేమిగాని పని ప్రారంభించి జర గాలి, అది కానీయండి" అన్నారు బాబయ్యగారు.

"అది కాదండీ, ముందర ఇది ఉన్నాక మనస్సుకి సంతోషం. దాన్నిబట్టి పనీని." అన్నాడు ప్రసన్నబాబు, గుడ్‌బైలు, నమస్తేలు చెప్పి మెల్లిగా ఇంటికి చేరారు.

"ఆలస్యమైపోయిందబ్బా, 10 గంటలు కావస్తూంది. ఇంకా రానేలేదు" అంటూ ఇంట్లోవారందరూ ఎదురుచూస్తు న్నారు. వచ్చారు ధనలక్ష్మీ భారంతో వణ్కు తేలికపడి. 'అమ్మా'అంటూ చెప్పబోతుండగానేబాబయ్యగారు 'అబ్బాయి కింక మంచి రోజులు వస్తాయి. ఫరవాలేదు. కష్టాలు కలకాలం కాపురముండవు. కాలం మంచిదయితే సరి" అన్నారు. వేణు జరిగిన సంగతంతా విపులంగా అందరికీ చెప్పాడు. భ్రమర వీరి అడుగుల చప్పుడు వినగానే వంటింట్లో భోజనాలు సర్దడానికి వెళ్ళిపోయింది. పిల్లాణ్ణి పడుకోబెట్టి. "కాళ్ళు కడుక్కు వస్తా" అంటూ పెరట్లోకి వంటింటివేపు వెళ్ళాడు వేణు. వంటింట్లోకి వస్తూ "భ్రమరా!" అన్నాడు. ఎప్పుడూ పనుంటేకాని అల్లా పిలవరే అనుకుంటూ "ఏం కావాలి?" అంటూ వెనక్కి తిరిగింది. ముఖం ఆనందంతో వెలుగిస్తూ దగ్గరగా వస్తు న్నాడు వేణు. "ఏమిటీ" అంటూనే నిలబడింది. "అబ్బే, ఇందాకటిదే నేను నీకిస్తున్నా అంటూ మన కష్టాలూ, ఇబ్బం దులూ అన్నీ మెల్లిగా పోతాయి ఇంక" అన్నాడు.

"ఏం మంచి ఉద్యోగం అయిందా? చెప్పరూ?" అంటూ ఆతృతగా ప్రశ్నించింది.

"అవును మంచి ఉద్యోగం. ఆర్టు డైరక్టరుగారి భార్యవి తెలుసా?" అంటూ బుగ్గమీదకొట్టాడు. "అది నా కుంకుమ ప్రభావం, లలితా లక్ష్మీ కటాక్షం."

"నువ్వేమనుకో నీ పిచ్చికి నిన్ను వదిలేశా నీ సౌభాగ్యం."

"నిజమే చప్పున రండి, ఆలస్యమైపోయింది."

"ఫర్వాలేదు. ఇంత అంత ఆకలేయదులే. అందులోనూ టీ తాగి వచ్చా. ఆరువేల చెక్కుతో. ఇంక తమరు హ్యాండు బ్యాగ్ అన్నీ............"

"పోనిద్దురూ, నేనేం జగ్గమ్మ ననుకున్నారా ఏం? నే నెప్పుడూ మామూలు భ్రమనే. ఒక్కమాదిరిగానే వెళ్ళిపోవాలి జీవితం లేమి మాత్రం లేకుండా."

భోజనాలవుతూంటే బాబయ్యగారూ, "ఈవేళ నక్కని తొక్కి బయలుదేరామమ్మా. అందుచేత ఈ పని ఇంత చక్కగా అనుకోకుండా బాగా జరిగింది. మంచిరోజులైనా చెడ్డరోజులైనా చెప్పకుండానే వస్తాయని బాగా నమ్మకం కుదిరింది నాకీవాళతో."

"నక్కని కాదు నాన్నా కుక్కనే తొక్కి బయలు దేరాం."

"ఏ కుక్కని?" అంది చెల్లాయి.

"అదుగో ఆవార నుంచుంది మాట్లాడకుండా దాన్ని."

"అదేమిట్రా ఆవిణ్ణి కుక్కంటావు సుఖంగా, ఆవిడ నిన్నేమందేం సాపం!" అంది చెల్లాయి.

"కాదే. నే బయలుదేరేప్పుడు ఆవిడే అడ్డొచ్చిందే. ఆవిణ్ణితొక్కి బయలుదేరవలసొచ్చింది. పోనీ నక్కే అనుకో ఏం" అన్నాడు వేణు.

"ఏమంటేనేం కాని పాపం, ఈమాటేనా వదినకి ఓ పట్టుచీరా, గాజుల జతా కొని తీరాలి"

"నాకేనా కొనడం! నే నేమంత నక్కనేం కాదు, నా కొక్కర్తికీ కొనడానికి" అంది భ్రమర.

"అల్లాగేనమ్మా అన్నీ కావలసినవి కొనుక్కుందాం. అందరి ఇబ్బందులూ తీరుతాయి" అన్నారు బాబయ్యగారు.

శ్రీశ్ లేచాడు. అంతా ఎల్లా ఉన్నా శ్రీశ్‌కి లినెన్ బుష్‌కోటు కుట్టించండి ముందర" అంటూ వాణ్ణి సముదా యించడానికి వెళ్ళిపోయింది భ్రమర ఆనందంతో.








JVZ-176


NOW IN TABLETS

# బైరాగి

శ్రీమతి. చివుకుల లక్ష్మి పున్నయ్య.

అతడు ఒడ్డు పొడుగుగల వ్యక్తి. ధరించిన కావిగుడ్డలు పెరిగియున్న గెడ్డం అతన్ని బైరాగిగా రూపొందించినా అతని వాలకం చూస్తే భగవన్నామ స్మరణకాని, కపటసన్యాసుల కుండే వేషాలుకాని కనుపించవు. గుబురుగా పెరిగియున్న ఆ వటవృక్షంక్రింద కూర్చొని ఎప్పుడూ ఏదో ఆలోచనా నిమగ్నుడై యుండేవాడు. అనేకులు వేదాంత సంబంధమైన చర్చలకని. లేదా విభూతి మంత్రాక్షితలకని వెళ్ళి పలుకరించాలని ప్రయత్నించేవారు. కాని వాళ్ళతో పల్లెత్తి మాట్లాడేవాడు కాడు. దినమున కొక్కసారి మధూకరమెత్తి భోంచేస్తూ అమాయకులైన రైతులు గొడ్లకాపరులతో మాత్రము యిష్టము వచ్చినప్పుడు మాట్లాడుతూ కాలక్షేపం చేసేవాడు. అలాగ సంవత్సరాలు పర్యంతం గడచిపోతున్నవి.

రాత్రి సరిగ్గా 12 గంటలయేసరికి అమృత మయమైన గానమును ప్రారంభించేవాడు. ఆగానవాహినిలో తన జీవితంలోని అనేక తరంగాలను దీనాతి దీనంగా వివరించేవాడు. కాని ఆయర్ధరాత్రి సమయంలో నిర్జన ప్రదేశంలో ఆగానమును వినేవాళ్ళు పశుపక్ష్యాదులు తప్ప మరెవ్వరుండేవారుకారు. ఇలా కొంతకాలం గడిచేటప్పటికి చుట్టు ప్రక్కల నున్నవారికి ఆ బైరాగి పుట్టు పూర్వోత్తరాలను తెలుసుకోవాలని ప్రయత్నించ సాగారు. చాటు మాటులుగా నుండి అతని గాన సుధమూలంగా అతడు సంఘము పేరుతో తల్లి దండ్రులచే ద్రోహానికి, అన్యాయానికి గురియైనవాడనియు, తన ఏకాకి జీవితానికి సంఘం యొక్క క్రూరస్వభావమే కారణమని తెలిసికో గలిగారు. కాని కొంతకాలానికి ఆ బైరాగి ఆ ప్రదేశాన్ని వదిలివేసి మరొకచోటుకు వెళ్ళాడు.

సావిత్రి, రామారావు మేనత్త మేనమామ బిడ్డలు. సావిత్రికి 8 సంవత్సరముల వయస్సప్పుడు బొమ్మల పెళ్ళిళ్ళలాగ బంధుమిత్రులమధ్య రామారావుతో వివాహం జరిగింది. కాని రెండుమూడు సంవత్సరములు గడిచినవి. రామారావు తల్లి తన కుమారునకు కట్న కానుకలిచ్చే గొప్ప సంబంధము దొరక లేదనే కొరతతో కుమారుని మళ్ళీపెళ్ళికి ప్రోత్సహించడం మొదలు పెట్టింది రామారావు ఎంతోచెప్పి చూచాడుకానితల్లి. మొండిపట్టు విడువలేదు. ఒకరోజు అర్థరాత్రి సమయాన ఎవరితోను చెప్పకుండా దేశాంతరము వెళ్ళిపోయాడు. ఎక్కడెక్కడనో వెదకించారు కాని ఆచూకీ దొరకిందికాదు.

సావిత్రి క్రమంగా యవ్వనవతి యయింది. అమాయకత్వంతో ఉట్టిపడే విశాలనేత్రాలు, గుండ్రని ముఖము, తీర్చిదిద్దిన అంగసౌష్టవముతో అప్సరసగా రూపొందించినవి. దానికితోడు సద్గుణసంపన్నురాలయినా ఆనాటి కామె దురదృష్టవంతురాలు.

వివాహమయి 10 సంవత్సరము లయినవి, పెండ్లినాటి దివ్య స్మరణతో కాలం గడపడం తప్ప భర్తకు దూరమయి పోయింది. ఏనాటికయినా తిరిగి వస్తాడని ఆశతోనే సావిత్రి జీవయాత్ర సాగిస్తున్నది. తల్లిదండ్రులు తమ అల్లుడు పరారి అయిపోయాడని విచారంతో మనస్సులో కుములుతున్నా పైకి మాత్రం సావిత్రి నిస్పృహ, నిరుత్సాహములకు గురిగాకుండా పైకి విచారమును వెలిబుచ్చేవారుకారు. అయినా యీడువచ్చిన పిల్ల కావడం వలన అప్పుడప్పుడు తన్ను గురించి తల్లిదండ్రులు పడే మానసిక బాధ సావిత్రికి అర్థమగుతూనేయుండేది.

తెల్లవారితే ఏదోపండుగ. ఇంట్లో ప్రతివారు ఎంతో ఉత్సాహంగా నున్నారు. కాని సావిత్రి ముఖంలో మాత్రము, నిరాశాపూరితమైన విషాదఛాయలు తాండవిస్తున్నవి. సావిత్రిలోని మార్పును తల్లిదండ్రులు గుర్తించి ఎంత ఉత్సాహ పరచాలని ప్రయత్నించినా లాభం లేకపోయింది. అస్తమిస్తున్న సూర్యుని చూస్తూ అరుగుమీద కూర్చొని గొణుగు కొంటూ లేచి వెళ్ళిపోయింది,

అది అర్ధరాత్రి సమయం. ఇంటిల్లిపాది గాఢ నిద్రలో నున్నారు. చీకటిలో కన్నుపొడుచుకున్నా కనుపించుట లేదు. మెల్లగా అడుగులో అడుగువేసుకుంటూ వేసియున్న

తలుపుల దగ్గరకు వెళ్ళింది. సావిత్రి "ఇంతకంటె నీ జీవితానికి గత్యంతరములేదు." అన్నట్లు అంతర్వాణి ధ్వనించింది. తలుపులు తెరిచి గాఢాంధకారమైన చీకటయినా మినుకు మినుకు మని వెలిగే నక్షత్రాల కాంతి సహాయంతో తన ప్రయాణం సాగించింది.

ఊరు బైటికి రాగానే కుక్కలు అరుస్తూ ఆమె మీదికి దూకినవి. సమీపమున నున్న చెట్టుక్రింద పండుకొని యున్న బైరాగి అటార్తుగా లేచి చేతనున్న కర్రతో కుక్కలను పారద్రోలాడు. ముసుగులో నున్న ఆ స్త్రీ వ్యక్తి కృతజ్ఞతా పూర్వకంగా తల వంచుకొని ఒక నిమిషము నిలువబడి ముందుకు రెండడుగులు ప్రయాణము సాగించింది.

"ఎవరుతల్లీ! నీవు?— ఈ అర్ధరాత్రి సమయాన బయలుదేరావు ఒంటరిగా ఎక్కడికి" అని ఆ బైరాగి అడిగాడు.

ఆమె పలుకలేదు. బైరాగికి అనుమానం వేసింది. కొంచం బిగ్గరగా "ఈ గాఢాంధకారంలో ఒంటరిగా పోవడం క్షేమకరంకాదు. ఇంటికి పో తల్లీ! నేను కావాలంటే యింటిదాకావచ్చి దిగబెడతాను" అని అన్నాడు.

"క్షమించండి బాబూ! నే నింక జీవించ దలుచుకోలేదు. కాబట్టే నా జీవిత యాత్రను అంతం చేసుకోడానికి బయలుదేరాను" అన్నది ముసుగులోని వ్యక్తి.

"ఆ! ఎందుకేమిటి తల్లీ? అభ్యంతరం లేకపోతే నీవెవరో చెప్పు"

"నేనా— సావిత్రి నా పేరు. నా జీవితంలో మరేమీ ఆశలు లేవు. కాబట్టి నే నీ మార్గం పట్టాను"

"ఏమిటి! సావిత్రియా! నారాయణగారి కుమార్తె వేనా"

"అవును"

"సావిత్రీ! తల యెత్తి చూడు— నేను రామారావును—వచ్చాను"

ఆనాడు పండుగ అత్యంత ఆనందోత్సాహంతో గడిచిపోయింది. సావిత్రి తల్లి దండ్రులు అల్లుడు, కూతుర్నిచూచి ఆనంద పరవశులయ్యారు. రామారావు తల్లి తన కుమారుని రాక తెలుసుకొని ఆనంద భాష్పములతో వచ్చి కోడలిని, కొడుకును ఆశీర్వదించి కౌగిట చేర్చుకుంది. ఆనాడు పది సంవత్సరములనుండి కొరత బడిన కళాకాంతులు ఆ యింట్లో వెల్లివిరిసినవి.



# స్వప్న వాసి

అనువాదం:— శ్రీ ఆర్. సోమసుందర్

నా స్వప్నాంబరమున తేలిపోవు సంధ్యా మేఘం నీవు. ప్రేమాభిలాషలతో సదా నిన్ను చిత్రింతును, నిన్ను లంకరింతును.

నా యనంత స్వప్నలోకవాసా! నీవు నావాడవు... నీవు నా వాడవు!

నా సాంధ్య గానాల మూర్తీ! నా హృదయాకాంక్ష ప్రదీప్తితో నీచరణ కమలాలు అరుణ రాగమును పొందినా...

నా వేదనా మదిరాస్వాదనంతో నీ అధరములు అత్యంత మధురతను బడసినాయి.

నా వివిక్త స్వప్నవాసా! నీవు నావాడవు... నీవు నావాడవు!

నాస్థిరావలోక నాగాధ సంచారీ! నాకోర్కె నీడ నీనేత్రములను నైల్యమ్మొనర్చింది.

ప్రేమైకమూర్తీ! నాగాన జాలమందు నిన్ను పట్టి బంధించినాను.

నా అమర స్వప్నవాసా! నీవు నా వాడవు... నీవు వాడవు!

[గనీంద్రుని 'తోటమాలి' నుండి.]



# "పేరు బలం"

రచన :
శ్రీమతి పి. సులోచనాభాస్కర్.

చమురు అందని వత్తి యెఱ్ఱగా వెలుగుతున్నది. చింకి చాప రేకులను ఒక్కొక్కటి లాగుతూ నీరసించిన గొంతుకతో సీతాపతి పుస్తకం వైపు చూడకుండానే, పాఠం చదువుతున్నాడు. అతని దృష్టి అంతా వీధిగుమ్మంవైపే ప్రసరింపబడుతున్నది. ఉండి ఉండి మధ్య మధ్య ఆవలింతలు, చిన్న చిన్న కునుకుపాట్లు పడుతున్నాడు. చదివిన ముక్కనే నాలుగయిదుసార్లు వివిధస్వరాలుగా చదువుతున్నాడు. మధ్య గొంతుకతోబాటు వత్తినిగూడా హెచ్చించేవాడు. కాని కాస్తసేపటికే రెండూ దిగజారిపోతుండేవి. సీతాపతికి విసుగుపుట్టి వీధివైపు మరొక్కసారి తీక్షణంగా చూసాడెవరికోసమో? మెల్లగా కాళ్ళల్లో పడుకున్న 'బొజ్జి' గాడిని చాపమీదకు దొర్లించి వంటింట్లోకి దూరి మంచి నీళ్ళ కోసం కుండలో గ్లాసు ముంచేడు. యింతట్లోకే బొజ్జిగాడికి తెలివి వచ్చి "ఆక్కే.... అక్కా...." అని దీర్ఘం మొదలు పెట్టాడు. సీతాపతి గ్లాసుతోనే గబగబ 'బొజ్జి' వద్దకు వచ్చి జోకొడుతూ గ్లాసు ఖాళీచేసేసాడు. మళ్ళీ తనూ, యెఱ్ఱ దీపం, యెదురుగుండా పుస్తకం, వళ్ళో బొజ్జిగాడు, ఆవలింతలు. మరో పది నిమిషాలకు సీతాపతి ఒంటేలుకని లేచి వీధిలోకి వెళ్ళాడు. తిరిగివస్తూ వీధి మెట్లమీద ఒక్క క్షణం నిల్చి వీధి రెండు చివరలకూ తీక్షణంగా దృష్టిని పోనిచ్చాడు. వచ్చిపోయే రిక్షాలు, కిల్లీకొట్లూ, జంటలుగా గుంపులుగా మనుష్యులూ, విద్యుద్దీపాలు రోజూలాగే వున్నాయి. సీతాపతి బరువుగా అడుగు లేసుకుంటూ లోపలికి పోయి కోపంగా పుస్తకం ముడిచి వేశాడు. అట్టమీద స్కౌట్ కుఱ్ఱాడి బొమ్మ నవ్వుతూ వెక్కిరించినట్టయింది సీతాపతికి. అది కనుపించకుండా చాపకింద పెట్టేసి తమ్ముడి ప్రక్కనే నడుం చేరవేశాడు. చిన్న నిద్రపడుతున్నది— ఊరు చివరకు విస్తరాకులు కొయ్యడానిక్కి బయలుదేరాడు సీతాపతి. పాడు చెరువులో నుంచి కేకలు వినబడగానే సీతాపతి అక్కడకు పరుగెత్తాడు. చెరువులో గేదె ఈదుతున్నది. అక్కడకు కాస్త దగ్గరలోనే తనంత కుఱ్ఱాడు మునుగుతూ తేలుతున్నాడు. సీతాపతి ఒక్కదూకు దూకి పది బారలలో పోయి లాక్కొచ్చాడు. ఉమ్మిరిగా నీళ్ళు త్రాగిన ఆ కుఱ్ఱాడికి తెలివి తప్పిపోయింది. వొడ్డున పడేసి ఏం చెయ్యడం తోచక గట్టుమీదకు పరుగెత్తి నాల్గు వైపులా చూశాడు. తను చాప క్రింద దాచేసిన స్కౌట్ కుఱ్ఱాడు సీతాపతి భుజంమీద చెయ్యివేసి ఎక్కడికో లాక్కుపోయాడు. అక్కడున్న స్కౌట్ కుఱ్ఱాళ్ళంతా తన చుట్టూ మూగేరు. వాళ్ళలో పెద్దతను వచ్చి తనకు కొత్త ఖాకీ బట్టలు యిచ్చాడు. చెరువులోపడ్డ గొల్లవాడు వచ్చి దణ్ణం పెట్టాడు—

"చిన్నా! చిన్నా!" అని కేక వినపడగానే కళ్ళు విప్పాడు సీతాపతి, ఎదురుగుండా భాస్కరం కనుపించాడు. చటాలున లేచి చాపక్రింద పుస్తకం తీసి చేతికి దొరికిన పేజీని చదివేస్తున్నాడు తొందరగా. భాస్కరం దగ్గరగా నున్న కుక్కి మంచం వాల్చి నడుం చేరవేసాడు. సీతాపతి పాఠాన్ని గొణుక్కుంటూ తలయెత్తి భాస్కరం వైపు చూశాడు. భాస్కరం బాహ్య ప్రపంచంతో సంబంధమే లేనట్టు కళ్ళు మూసుకుని, తలను చేత్తో పట్టుకుని కొళ్ళాడిస్తూ పడుకున్నాడు. సీతాపతికి చిన్న సందేహం కలిగి క్రమేణా స్వరాన్ని తగ్గిస్తూ ఆఖరుకు పుస్తకాన్ని మూసేసాడు. భాస్కరం అలాగే పడుకున్నాడు, సీతాపతి దీపం వైపు ఒక్కసారి చూశాడు. చమురయిపోయి కాలి కొడి కడుతున్నది దీపం. గదిలోకి పోయి సీసాలోని చమురు దీపంలో పోసి కొడిని కాస్త చీపురుపుల్లతో రాల్చి మెల్లగా భాస్కరం దగ్గరకు చేరుకున్నాడు సీతాపతి. జంకుతూ మంచం దండెమీద కూర్చుని, భాస్కరం బుగ్గలమీద చెయ్యివేస్తూ—

"ఏం? అన్నయ్యా, అలా పడుకున్నావు?" అన్నాడు నెమ్మదిగా. తన బుగ్గమీద చెయ్యి అలాగే పట్టివుంచేడు. భాస్కరం జవాబు మాత్రం చెప్పలేదు. సీతాపతికేమీ తోచ లేదు. వళ్ళు మామూలుగానే ఉండడంవల్ల సీతాపతి కొంత ధైర్య పడ్డాడు.

"తలనొప్పిగా వుందా?" అన్నాడు సీతాపతి.

"లేదురా" అన్నాడు భాస్కరం నిర్జీవ స్వరంతో.

సీతాపతి చెయ్యిని మరింత గట్టిగా అదుముకున్నాడు భాస్కరం. సీతాపతి చెయ్యికి వెచ్చగా తడిగా తగిలింది. భాస్కరం ముఖాన్ని తన వైపుకు తిప్పుకున్నాడు సీతాపతి. అతడి కళ్ళలో నీళ్ళు చూసేడు. సీతాపతి నోరు పెగలలేదు గొంతుక పట్టుపట్టినట్టయింది. మాట పైకి రాకుండావుంది. కాస్త సర్దుకున్నాడు సీతాపతి.

"దేనికన్నయ్యా ఏడుస్తున్నావ్?" అన గల్గేదు.

"లేదే? వేడిచేసి నీళ్ళు కాచేయ్" అన్నాడు భాస్కరం.

"ఆకలేస్తున్నది పద భోజనానికి" అన్నాడు సీతాపతి.

"తొమ్మిది వరకూ తినకుండా ఏం చేస్తున్నారు" అన్నాడు భాస్కరం ఆతృతగా. యింతలోకి గుమ్మంవద్ద అలికిడి విని అన్నదమ్ము లిద్దరూ అటు చూశారు. సులోచన యిద్దరినీ చూసి నవ్వుకుంటూ వస్తూ చాపమీద బొజ్జిగాడిని గభాలున ఎత్తుకుంటూ వచ్చింది. బొజ్జిగాడు కెవ్వున గోలపెట్టాడు.

"నేనేరా బొజ్జీ ! యేం? యేం? యేది చూడు, నేనే అక్కని" అంది సులోచన వాడి ముఖాన్ని గట్టిగా చెంపలకు నొక్కుకుంటూ.

"అదిగో !అదిగో! అక్క నీకు పొట్లాలు తెచ్చిందిరో" అంటూ లేచి కూర్చున్నాడు భాస్కరం.

"అబ్బబ్బ! అదికాదు, వాడిచెయ్యి నొక్కేసి వుంటుంది" అన్నాడు సీతాపతి.

"చెయ్యికేం వచ్చిందిరా'' అంటూ సులోచన, భాస్కరాలు బొజ్జిగాడి చేతులు చూసేరు. కుడి చెయ్యి నల్లగా కమిలిపోయివుంది.

"అయ్యోయ్యో ! ఇదేమిట్రా; నేను చూడలేదురా" అంటూ వూరడిస్తున్నది సులోచన.

"ఏం జరిగింది?" అన్నాడు భాస్కరం సీతాపతివైపు చిరాకుగా చూస్తూ.

"సాయంత్రం బొజ్జిగాడు ఎదురింటి వాళ్ళ కారుదగ్గర ఆడుతుంటే, ఆ అమ్మాయి లేదూ—'' అంటూండగనే,

"ఎవరు?" అన్నారు అన్నా చెల్లెళ్లు.

"రెండు జడలు వేసుకుంటుంది" అన్నాడు సీతాపతి,

"వాణియా ! ఏంచేసింది?'' అంది సులోచన.

"నవ్వుకుంటూ గెంతుకుంటూ స్నేహితులతో కారులో కూర్చుని తలుపు మధ్య వీడి చెయ్యి నొక్కేసింది" అన్నాడు సీతాపతి.

"ఓరి ఏడు చెవల వెధవా నువ్వేం చేస్తున్నావురా?" అన్నాడు భాస్కరం. అంతవరకు యింట్లో ఎవరు లేక పోయినా జాగ్రత్తగా తమ్ముడిని ఊరుకోబెట్టి నానా బాధ పడితే మెచ్చుకోకుండా తిట్టే సరికి సీతాపతికి ఎక్కడ లేని ఉక్రోషం దుఃఖం పొర్లుకొచ్చాయి.

"అవును మీ యిష్టం వచ్చినట్టు అనండి. నువ్వు ఉదయ మనగాపోయి మధ్యాహ్నం భోజనానికైనా రాకుండా యిందాకనే వచ్చావు. అక్కయ్య రెండు గంటల కనగాపోయి. యిప్పుడు వచ్చింది. యింతవరకు నే నెంత బాధ పడ్డానో తెలుసా? భోజనమైనా చెయ్యకుండా మీకోసం కూర్చున్నాను. వెధవని వాడ్ని ఊరుకోపెట్టే సరికి తలప్రాణం తోకకు వచ్చింది. తలుపు సందున పెట్టి చెయ్యి నొక్కేడమే కాకుండా మీదుమిక్కిలి ఆ పాడు ముండ గబ గబా వచ్చి నాలుగు నన్ను తిట్టింది" అంటూ ఏడుస్తునే ఉపన్యాసం ముగించాడు సీతాపతి. సులోచన, సీతాపతిని గూడ బుజ్జగిస్తూ దగ్గరకు తీసుకుని వంటింట్లోకి పోయింది. భాస్కరం మతి పోయినట్టుగా నిల్చుని నిల్చుని ప్రక్క గదిలోకి పోయి బట్టలు మార్చుకొని దండెం మీద గుడ్డను లుంగీ పోసుకుని, అక్కడే వున్న పాత బట్టల కుప్పమీద చేర బడ్డాడు. మరో పది నిమషాలకు వంటింట్లో నుంచి సులోచన కేక వినపించింది. భాస్కరం పలకలేదు చివరకు పళ్ళెంలో రొట్టెలు, పచ్చడి పెట్టుకుని సులోచన గదిలోకి వచ్చింది. భాస్కరం దీక్షగా యింటి వెన్నెముకను చూస్తూ వెల్లకిలా పడుకున్నాడు. సులోచన నిశ్శబ్దంగా పళ్ళాన్ని అక్కడ పెట్టి ప్రక్కగా కూర్చుంది. సీతాపతి బొజ్జిగాడి చెయ్యి కడిగి వాడిని నడిపించుకుంటూ గదిలో ప్రవేశించి నవ్వడం మొదలుపెట్టాడు. భాస్కరం లేచి కూర్చున్నాడు.

"దేనికిరా నవ్వు?" అంది సులోచన.

"అన్నయ్య నీ పైటవాణీ లుంగీ పోసేసుకున్నాడు" అన్నాడు సీతాపతి. భాస్కరం అది చూసుకుని చిన్న నవ్వు నవ్వుకుని. ''దండెం మీద లుంగీ యేదీ?" అన్నాడు భాస్కరం.

"పోనీలెద్దూ! ఏదైతేనేం? నీ లుంగీ బాగా చిరిగి పోయిందికదా అని మధ్యహ్నం తోటీది అడుగుతే యిచ్చేశాను" అంది సులోచన.

"మన బ్రతుక్కి ధర్మాలు కూడానా?'' అన్నాడు భాస్కరం.

“మనకు కల్గింది. పాపం చింకి జబ్బిడలాటిది కట్టుకుని వచ్చింది. అది చూడలేక యిచ్చేశాను” అంది సులోచన. బొజ్జిగాడు సులోచన వళ్ళో తల పెట్టుకుని పడుకున్నాడు. సీతాపతి సావిట్లోకి పోయి మంచం మీద వాలాడు.

“చాలా రాత్రి అయింది. మధ్యాహ్నం గూడా భోజనానికి రాలేదు తిను” అంటూ సులోచన పళ్ళెం ముందుకు తోసింది.

“నాకేం అవసరం లేదు. రోజు రోజుకు పరిస్థితులలో కల్గుతున్న మంచి మార్పులు చూస్తూంటేనే కడుపు నిండి పోతున్నది” అన్నాడు భాస్కరం కళ్ళల్లో నీళ్ళతో.

“అదేమిటన్నయ్యా! నువ్వే అలాగుంటే యెలాగ? ఏడుపేల?” అంది ఓదార్పుగా.

“సుఖవంతమైన యీ దినవారాలకవి ఆనందబాష్పాలు; నాకేడుపెందుకు? ఎక్కడో మిగిలిపోయిన నీళ్ళు రాస్తా వుండలేకరాలిపోయాయి. ఇక ఏడుపు రమ్మన్నా రాదు. రావడానికి కళ్ళల్లో తడి వుంటేనా? అంతో యింతో చిన్నదానివైనా చక్కా తెచ్చి పెడుతున్నావు. హాయిగా తింటున్న నాకు దుఃఖంగూడానా?” అన్నాడు భాస్కరం. ఆపుకోలేని దుఃఖంతో తల ప్రక్కకు తిప్పుకుంటూ.

“నువ్వన్నది నాకు తెల్సును; నే గడించి తెచ్చినవి తినడం నీకు చాలా సిగ్గుగావుందన్నట్లు చూట్లాడుతున్నావు. నేనే నీకు తమ్ముడినైతే, అప్పుడంతగా బాధ పడేవాడివి కావు. నువ్వుమాత్రం ఊరకనే తింటున్నావా? ఉద్యోగం కల్సిరానప్పు డేంచేస్తాం. యిలాగవుంటే భవిష్యత్తులో మనం ముందుకు సాగలేం” అంది సులోన బొజ్జిగాడి చేతిని తన చేతిలోకి తీసుకుంటూ.

“మనం భవిష్యత్తులో ముందుకు పోగలమన్న ఆశ నీ కింకా వుందేమిటి?” అని ప్రశ్నించేడు భాస్కరం. సులోచన క్రిందికి చూస్తూ పెదవుల్ని వ్రేళ్ళతో నొక్కుకుంటూ వూరుకుంది.

“చిన్నవాడు యేడ్చేడంటే వాడిదా తప్పు. ఇంటివద్ద నువ్వులేక, నేనూ లేకపోతేయెలాగ? బొజ్జిగాడికి నీ దగ్గర చేరికగదా, సాయంత్రం వేగం పనిముగించుకు వచ్చేదానివే. ఇవాళ చేతి బాధతో నీకోసం యెంత ఏడ్చాడో, సీతాపతిగాడ్ని ఎంత యేడ్పించాడో” అన్నాడు భాస్కరం.

“ఇవాళ మేనేజరుగారి మేనల్లుడు అమెరికా నుంచి వచ్చేడు. విందులు చేసుకుంటూ చూస్తున్నారు” అంది సులోచన.

“మనకి బుద్ధి వుండొద్దు, యింటివగ్గర ఏమైపోతారో నని” అన్నాడు భాస్కరం విసుగ్గా.

“అంతే! ఆ ప్లేట్లు తియ్యకుండావస్తే ఉద్యోగం ఏం జరుగుతుంది? మన సంగతులతో వారికేం పని. వాళ్ళకు కావల్సింది డ్యూటీ. అంచేత ఆలస్యమయింది. ఇంత లోకే……” అని చెప్పేసింది సులోచన.

“ఛీ! ఛీ! ఎంత మాటన్నావ్? ఈ జన్మలో కాదు పది జన్మలకైనా అటువంటి నీచంగా అనుమానిస్తాననుకోకు. నా వుద్దేశమదికాదు. త్వరగా తెల్పుకుందికి ప్రయత్నించవమని” తనుగూడా కించపడ్డాడు భాస్కరం.

“అక్కా! అక్కా! డబ్బు కావాలంటే పదిల్పు కడితే వేలకు వేలొస్తాయ్” అంటూ పరుగెత్తుకు వచ్చాడు సీతాపతి తనకు తట్టిన ఊహ చెప్పడానికి.

“అవునురా! ఓ మన డబ్బు కుక్కలు తినవు” అంది ఒక్కసారి గతాన్ని మర్చిపోయి గెల్చుకున్నట్టు మురిసిపోతూ.

“నువ్వన్నదీ నిజమే కుక్కలు మానవుని కంటె విశ్వాసమైనవి, కాతయునవి. అందుకనే అయాచిత సొమ్ము తినవు” అన్నాడు భాస్కరం. ఆ మాటలకు సులోచన పక పక నవ్వింది. దుఃఖంలో గూడ సంతోషించడం తెల్పుకుని.

“మమ్మ, వాన్ట్ మోర్” అంది పళ్ళెం వైపు రొట్టెలను చూస్తూ. భాస్కరం చేతిలో రొట్టిముక్క పళ్ళెంలో పడేసి రెండు చేతులతోనూ నమస్కరించాడు సులోచనకు.

“ఛా! అదేమిటి” అంది సులోచన.

“మరేం లేదు; ఆ యింగ్లీషు ముక్కలు ఉపయోగించటం మానివేస్తూ, బంగళాలో అది నీ కెలాగునూ తప్పదు. ఆ ముక్కలు వింటూంటే నా దేహం మీద దెబ్బలు ప్రాకినట్టుంటుంది” అన్నాడు భాస్కరం.

“మరి నువ్వెందుకు బి. ఎ. చదివేవు?” అంది సులోచన.

"అది నా తప్పు కాదు; నాన్నగారిది" అన్నాడు.

"ఏమిటీ! పెంచి పెద్దచేసి, చివర ఘడియల వరకూ కొట్టుకుని చదివించినందుకు నాన్ననే" అంది ఆశ్చర్యంగా.

"అవును సులోచనా! తన కొడుకు గ్రాడ్యుయేట్ అని మురిసి పోయేరు. అతనికదే దక్షుడు; మనకీదరిద్రమే దక్కుడు అయింది. పట్టా ఫలితం అంతకంటె యెక్కువే ఓకనుపించలేదు. మెట్రిక్యులేషన్ తరువాత వచ్చిన వుద్యోగాన్ని చేతులారా వదిలింపించేసి వద్దు మొర్రోమంటే కాలేజీకి పంపించారు. ఇప్పుడుద్యోగం కావాలంటే యెవ రిస్తారు? చక్కగా తనలాగే పౌరోహిత్యంలో దించుతే కాలం గడిచిపోను. పోనీ నేను పోయి ఆ గ్రామాలు తిరుగుదామంటే ఒకటి రెండు మంత్రం ముక్కలయినా రావాలా? ఒకరిద్దర్నయినా గ్రామాలలో తెలియాలా? తన వెంట వస్తానన్నా ఎన్నడైనా తీసుకు వెళ్ళిన పాపాన్ని పోయాడా? అహోరాత్రాలుగా పన్నెండు సంవత్సరాలు తను కష్టపడ్డాడు. నన్నుకష్టపెట్టాడు యెందుకో యీ ఫలితంలేని కష్టం. ఆఖరికి ఏముహూర్తాన అమ్మ మెళ్ళో పుస్తెల తాడు తీసి అమ్మి పరీక్షకు కట్టేరో, మరి ఆమె మెళ్ళో అది పడే యోగ్యత లేకుండా పోయింది. ఉద్యోగాలకోసం యెక్కేగుమ్మం దిగేగుమ్మం. తెల్సినవారు ఒక్కరూ పల్కరించరు. కారణం? కాఫీ పొయ్యమంటా మేమోనని. అసలు మనం ప్రక్కనుంటే కొంతమంది మనసుంచి వాళ్ళు మానుకుంటారు. అదో బాధ కూడాను. ఛాందసుడైనా మనల్ని నవీనంగానే పెంచాడులే. మొత్తంకి నీ మెట్రిక్ పూర్తయిందికాదు. దానికి బదులు అప్పట్లో సంగీతమైనా నేర్చుకున్నావా?" అని అన్నాడు భాస్కరం.

"గతంగూర్చి యింకెందుకులే" అంది సులోచన విరక్తి చెందుతూ.

"అలాగుననెయ్యకు. అందంకూడ ఒక శత్రువే; నీవు అక్కడ పనిచెయ్యడం ఎప్పుడేమి ముంచుకొస్తుందో తెలీదు. యెంతో కొంత చదువుకున్న నువ్వు అక్కడ వడ్డనల వృత్తి చూసి నేనెలా వూరుకోగలను. నీకు పెళ్లి చెయ్యాలా? లోకానికి గూడ మన పెళ్ళిళ్ళ గురించే బాధ. ఈ పన్లు చేస్తున్నవారి పిల్లనిగాని, పిల్లడ్నిగాని ఎవరు చేసుకుంటారు? ఆడవాళ్ళు గడించిన సొమ్ము తిన్నన్నాళ్ళు తిన్నాను. యింకెన్నాళ్ళు తినడం" అన్నాడు ఆవేశంతో.

"అన్నయ్యా! మనం ఎంత మాత్రం స్వభావాలతో వేరుపడొద్దు. నాకు తెలిసే సంఘచర్యలు. కాలు జారితే ఎవరూ చేయూత యివ్వరు. మరింత అతఃపాతాళానికి అణచివేస్తారు. ఇవాళ యివన్నీ ప్రత్యేకించి ఎందుకు చెపుతున్నావో తెలీకుండా వుంది. నీకు నామీదేదో అనుమానం తగిలి వుంటుంది పైకి చెప్పకుండా భరిస్తున్నావు నీ పాదాలు పట్టుకు చెప్తున్నా" అంటూ సులోచన భాస్కరం పాదాల మీద పడింది.

"అబ్బా!" అన్నాడు భాస్కరం బాధగా

సులోచన తృళ్ళిపడి భాస్కరం కుడికాలు కట్టు చూసింది.

"నీ మీద నాకేం అనుమానమని, కష్టంలో ప్రతీదీ మననం చేసుకోడం మానవలక్షణమైపోయింది" అన్నాడు భాస్కరం.

"ఆ కట్టేమిటి" అంది కాలును తడిమి చూస్తూ.

"ఈ దినం నాకింత కష్టమనిపించకపోను. నా జీవితంలో, జరిగిపోయినవి, జరుగుతున్నవి, జరగబోయేవీ అన్ని కష్టాలూ కల్సికట్ట గట్టుకుని కూడబలుకున్నట్టివాళే నా మీద దండెత్తేయి. యెవరెన్ని దౌర్జన్యాలు చేసినా కిక్కురు మనకుండా వుండవల్సి వచ్చింది. కారణం మన చదువే. మూర్ఖులమైతే ప్రతీదాన్ని మూర్ఖంగా ప్రతిఘటించే వాళ్ళం. దానికి చాలామంది దడిసే వాళ్ళే. విజ్ఞానులం, చట్టాలు తెలుసు, ఒక మనిషి మనని అన్యాయం చేసినా, దౌర్జన్యం చేసినా ఏమీ అనలేము. అంటే ఆయన పరువు నష్టపు దావా వేస్తాడు. ఆయన మీద చట్టరీత్యా చర్య తీసుకుందామంటే ధనబలం లేదు. ఉదయంనుంచి పది సార్లయినా పట్టణమంతా తిరిగాను. ఫలితం దొరక లేదు. మిలటరీకి పోదామని రిక్రూటింగ్ ఆఫీసుకు వెడితే అంతా సరిపోయాను, కాని రెండు పౌనులు బరువు చాలదు. బరువెలాగ వస్తుంది? అక్కడనుంచి కాళ్లీడ్చుకుంటూ వస్తూ దారిలో చిన్న రిష్టువాచీని మట్టేశాను. గాజుపెంకులు గుచ్చుకున్నాయ్. రక్తం కారుతున్నది. ఏమిటా అని తీసి చూశాను. మరో నిమిషానికి తగుమనుష్యులిద్దరూ వచ్చి చేతిలో వాచీ తీసుకున్నారు; దీనితో వుంగరం గూడ దొరకాలే? అది యేదీ అన్నారు. అది నాకేం తెల్సు? తెలీదంటే స్టేషన్‌కి నడవ మన్నారు! నా అదృష్టం కొద్దీ ఆవుంగరం అక్కడ వారికే దొరికింది కాబట్టి విడిచారు; దొరకనంత సేపూ నోటికి వచ్చినట్టు తిట్టారు. వారి పాపాన

వారే పోతారులే" అన్నాడు భాస్కరం గుండె రాయి చేసుకుని.

"బాగుంది యివాళ లేచినవేళ" అంది సులోచన.

"చివరకు తెలిసివున్న మంగలి షాపుకు పోయాను" అన్నాడు భాస్కరం

"దేనికి?" అంది సులోచన.

"అక్కడ కత్తులు అద్దెకిస్తారు. ఒకటి పుచ్చుకుని బయలు దేరాను"

"ఛీ! ఛీ! అదేంపని" అంది అసహ్యంగా.

"అదేమీ దొంగతనం కాదు, తప్పేమీ లేదు" అన్నాడు భాస్కరం.

"అయితే" అంది సులోచన.

"వెయ్యి తిట్లుతిని బస్సుస్టేండ్ వద్ద గెడ్డాంగీసి పావలా సంపాదించాను; తిన్నగా స్టేషన్‌వైపు పోయి ప్రయత్నాలు చెయ్యగా, ఒకమషి దొరికాడు. గెడ్డాం గీయించుకుంటారా?" అని అడిగాను తిరిగి అతను చూశాడు. వాడు నాస్నేహితుడే, నాతల సిగ్గుతో వంగిపోయింది. అతనంత కన్నా తెలియనట్టు నటించాడు. మాట్లాడకుండా గెడ్డాం గీశాను. అతని ముఖంనిండా పోతర క్కాయలే, అందులో అనుభవం తక్కువ, ఒకటి రెండు చితికి రక్తం కారింది. ఆయన ప్రక్కనున్న దొరసానిగారు వెనకా ముందూ ఆలోచించకుండా జోడుతీసి కొట్టింది. అంతే.... అమ్మలూ పీక్కుద్దర్శీ నువ్వేపెంచు.... నాకు జీవితంమీద చాల రోతగావుంది. అన్నాడు" దుఃఖంతో.

"అదేమిటన్నయ్యా! జీవితమంతా అంతేననుకుని ఓర్మి వుండాలిగాని, పిరికి వాడివై పోతావా? అసలు చేతకాని పన్లెందుకు చెయ్యాలి. పోనీ మిత్రుడైనా ఆమెను వారించలేదా?" అంది జంకుతూ సులోచన.

"అవసరం లేక వారించలేదనుకుంటాను; హోదాలో మనిషి; విజ్ఞాన దాంపత్యం, ఆమెకతను అడ్డురాకూడదు: అతని కామె అడ్డుతగలదనుకుంటాను" అన్నాడు మెల్లగా.

"పోయి పడుకుందాంపద, పన్నెండు కావచ్చింది" అంది సులోచన.

"కాలచక్రాని కడ్డా! అది దానిపని, తిరగనీయ్"అన్నాడు భాస్కరం.

"పోనీ యీపుస్తకంలో కథలు చదువుదూ వింటాను" అంటూ తను మేనేజరుగారింటివద్దనుంచి తెచ్చిన మేగజైన్ యిచ్చింది.

"పోనీ కథలు వ్రాసి సంపాదిద్దామంటే యెంతో కష్టపడి పంపిన నాల్గయిదు కథలూ తిరగ్గొట్టబడ్డాయికద" అన్నాడు భాస్కరం.

"ఆ పత్రికల స్టాండర్డ్‌కి సరిపోవద్దూ?" అంది సులోచన ఆలోచించి.

"నిజంగా అంతేనంటావా? మన స్టేండర్డ్ చాలదనుకుంటూ" అంటూ పేజీలు తిరగవేస్తున్నాడు.

"రేపు యిరవయ్యో తారీఖున నాన్నగారి తిథి తెలుసునా?" అంది సులోచన జ్ఞాపకంగా.

"డబ్బు లేనపుడిటువంటివి మర్చిపోవాలి" అన్నాడు.

"ముందు నెలజీతంలో పది రూపాయలు అడిగాను యిస్తానన్నారు" అంది సులోచన.

"యిస్తే ఆ ఒక్క దినంకి తగలేస్తాం; రెండవనెలలో ఏంచేస్తాం?" అన్నాడు.

"అందుకని పితృదేవతల వేడిపిస్తావా?" అంది సులోచన అభిమానంగా.

"అలాగన్నానా? ఆ దినం పుదయమే లేచి శుచిగా తూర్పు దిక్కుగా తిరిగి ప్రత్యక్షదైవం సూర్య భగవానుడికి పితృ మూర్తుల పేర్లు చెప్పి మూడు దోసెల జలం విడిచి, ఆ దినమంతా ఉపవాసం ఉంటే పితృదేవతలు సంతృప్తి చెందుతారని ధర్మశాస్త్రాలు ఒప్పుకుంటాయిట. ఉపవాసం నా కలవాటేగా" అంటూ తిరగవేస్తున్న పేజీలలో ఒకచోట హఠాత్తుగా ఆగేడు.

"ఇందాకా ఎదురింటి అమ్మాయి పేరేమిటన్నావు?" అన్నాడు" భాస్కరం.

"ఏం దేనికి? అలాగడుగుతున్నావ్? వాణి" అంది ఆశ్చర్యంగా సులోచన.

"యింటిపేరు తెలుసునా?" అన్నాడు భాస్కరం.

"చాలా వింతగా అడుగుతున్నావ్ పాకనాటివారు" అంది సులోచన.

"ఇదిగో అయితే ఆమె వ్రాసిన కథ మొదటి బహుమానం అయిన వంపలు కొట్టించటు. చదువుతా విను" అన్నాడు భాస్కరం.

"ఓహో! అది దీపావళి సంచిక కదూ? అవును తనొక కథ రాసినట్టు చెప్పినట్టు జ్ఞాపకం" అంది సులోచన.

"అయితే చదువుతున్నమాట. నాకంటే ఆ అమ్మాయే నయం" అన్నాడు భాస్కరం.

"చెబ్బున్నవాళ్ళనే మరింతగా వరిస్తుంది లక్ష్మి" అంది సులోచన. భాస్కరం గట్టిగా మొదటి పేరా చదివాడు. అన్నా చెల్లెళ్ళిద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"జ్ఞాపకముందా?" అన్నాడు భాస్కరం.

"ఇదెలాగవెళ్ళింది? వాటి చేతిలోకి?" అంది సులోచన.

"మొన్న యీ సంచిక దినోత్సవానికి పంపితే తిరగొట్టబడింది. అదే యిప్పుడింకో పేరుతో ప్రథమ బహుమానం పొందింది. యింతకీ నా కథ ఆమెకెవరిచ్చారు?" అన్నాడు భాస్కరం.

"ఏ! ఆమధ్య బొట్టిగాడు తిరిగొచ్చిన కథలు, ఆ కవర్లు పట్టుకుపోయి వాళ్ళ గుమ్మం మీద ఆడేవాడుగా" అంది సులోచన.

"యింతకీ పేరుబలం" అన్నాడు భాస్కరం తిన్నగా పక్కమీదకు పోతూ. ఆ రాత్రి సులోచన, భాస్కరాలు మంచి మూహూర్తమెప్పుడొస్తుందా అన్న ఆలోచనలతో అలసి అలసి, నిద్రాదేవి కౌగిట్లోకి ఒరిగారు.

---

## గ్రంథ సమీక్ష:

### బొమ్మరిల్లు

పిల్లల గేయకథల సంపుటి. గేయరచన- కవిరావు. చిత్రరచన- జి. వి. సుబ్బారావు. పిల్లలకు కథలంటే ఇష్టం. గేయకథలంటే మరీ యిష్టం — అవి బొమ్మలతో సహా ఉంటే ఎంతో యిష్టం — అటువంటి గేయకథలు మన తెలుగుభాషలో చాలాతక్కువ. కవిరావుగారు రచించిన ఈ బొమ్మరిల్లులో గేయకథలు పిల్లలకు చక్కని నీతులను తెలియజేస్తున్నాయి. పిల్లలకు అర్థమయ్యే తేలిక భాషలో రచించారు. అమ్మ, తుమ్మెద, పెండ్లి, గాలిపటగ, పాపకల, తెనుగుపాపం, నేను, అతను, తాతయ్య నసాలు — మొదలయిన గేయములు చాలా బాగున్నవి. ఇందులో గేయరచన ఎంత బాగున్నదో చిత్రరచనకూడ అంత బాగున్నది. శ్రీ జి. వి. సుబ్బారావు బొమ్మరిల్లును బొమ్మలతో, రంగులతో చక్కగా అలంకరించారు. పుస్తకం చూచుటకు ముచ్చటగానూ, చదువుటకు ఆనందంగానూ ఉన్నది. బాలలందరూ చదవ దగిన పుస్తకం.

వెల మేలుప్రతి రూ 1-8-0. మామూలుప్రతి రూ. 1-0-0. దొరకుచోటు;

సాహితీ కేంద్రము, తెనాలి, రేపల్లి.

*       *       *

### పిల్లల పాటలు.

రచన: ఆలమూరు రేంజి ప్రాథమికోపాధ్యాయులు.
ప్రచురణ: తెలుగు బాల రచయితల సంఘం.
ఆలమూరు, తూర్పు గోదావరి జిల్లా.

వెల: అమూల్యము.

ఆలమూరు రేంజి ప్రాథమికోపాధ్యాయులు శ్రీ బి. వి. నరసింహారావుగార్కి ఈ పుస్తకమును అంకితముగా నర్పించిరి. ఇందు పాటలన్నీ బాగున్నవి. బాలలకుత్తేజము, ఉత్సాహము కలిగించి, చదువగనే సులభముగ అర్థమగునట్లున్నవి.

*       *       *

### బాలసాహితి.

ద్వితీయ వార్షిక సంచిక

మునిసిపల్ హైస్కూల్, తిరుపతి.

బాల సాహితి రెండవ వార్షిక సంచిక మూడు భాషలలో, పాఠశాల విద్యార్థినీ విద్యార్థులు రచించిన చక్కని కథలు, గేయములు, బొమ్మలు, పాఠశాలకు సంబంధించిన బొమ్మలతో చక్కగా వెలువడినది. చక్కని రాజకీయ, భక్తిమయ పురాణ గాథలలో చదువుటకింపుగనున్నది.



# గోదావరి వరద బాధితుల నిధి

## మద్రాసు మహిళా సంఘం వారి విజ్ఞప్తి

గోదావరి వరద బాధితుల సహాయార్థం విరాళములు సేకరించుటకుగాను మద్రాసులో నున్న స్త్రీలు "మద్రాసు మహిళల గోదావరి వరద బాధితుల నిధి" నొక దానిని నెల కొల్పి విరాళములు ప్రోగుచేయుచున్నారు. ఇందు పట్టణములో అంతట వేరు వేరు స్థలములలో వివిధ సంఘముల నియమించి విరాళములను వసూలు చేయుచున్నారు. నవంబరు నెలలోగా వీరు కనీసం పదివేల రూపాయలు ప్రోగుచేసి, వరదలో సర్వము గోల్పోయి నిలువ నీడైనను లేకున్న కొన్ని అనాధ కుటుంబములకు కుటీరముల నిర్మింప నెంచియున్నారు. చిన్న కుటీరము నిర్మించుటకు యేబది రూపాయలు, రెండు గదులున్న కుటీరము నిర్మించుటకు 100 రూ॥ అగునని అంచనా వేయబడినది. ఒక కుటీరమునకు తగిన విరాళమిచ్చినవారి పేర కుటీరము నిర్మింపబడును. ఎల్లరు తాము చేయదగిన సహాయము చేసి తోడ్పడ ప్రార్థన.

ఎం. ఎల్. కాంతంకొండలరావు.

ఈ క్రింది విరాళములు త్యాగరాయనగర్ కమిటీ వారు వసూలు చేసిరి.

శ్రీమతి చల్లపల్లి రాణీగారు, రూ. 500/- శ్రీమతులు ఎం. కమలా సూర్యారావు, వై. సీతమ్మగార్లు ఒక్కొక్కరు రూ 116/, శ్రీమతి ఎం. ఎల్. కాంతంకొండలరావు, శ్రీ ఫూంజా తాకర్సె కంపెనీ, వి. వి. షణ్ముగ నాడార్ & బ్రదర్స్ ఒక్కొక్కరు రూ 101/- శ్రీ పంచాగ్నుల సూర్యనారాయణ, గుంటూరు పవర్ అండ్ లైట్ కంపెనీవార్లు ఒక్కొక్కరు రూ 100/- ఇండియా సిల్కు హౌస్, బాపాలాల్, కేవల్ రామ్స్, ది వై టె షాప్ గార్లు ఒక్కొక్కరు రూ 51/-, శ్రీయుతులు సి. తిరునావు కరసు చెట్టి, ఎం. ఏ. ఎతిరాజులు నాయుడు, ఆంధ్రా ఎలక్ట్రిక్ కంపెనీ, ఎస్. సుబ్రమణ్యం చెట్టి, శ్రీమతి వై. శ్రీరామమ్మగార్లు, ఒక్కొక్కరు రూ. 50/-, శ్రీ అమలచంద శోభాచంద శ్రీ జయలక్ష్మి టెక్స్టైల్స్ ఒక్కొక్కరు రూ. 35/- శ్రీ హెచ్. డి. రాజా, రాధాబాయి వేల్, ఎం. వి, పద్మ కల్యాణి, వై. రాజమ్మ, కె. రామయ్యచెట్టి, ఆర్యభవన్ హోటల్, గానన్ డంకర్లీ కంపెనీ, పాక్కలి ధారా కృష్ణయ్యచెట్టి అండ్ కో, అమర్ చంద్ నాగీర్దాస్ అండ్ కో, జె. నరసింహులు చెట్టిగార్లు ఒక్కొక్కరు 25/- శ్రీమతి వి. సరస్వతిబాయిగారు, వి. కె. రాజగోపాల్, శ్రీమతి జి. ఎల్. కాంతం గోవింద రావుగార్లు, ఒక్కొక్కరు రూ 20/- శ్రీ పి. సి. కన్నయ నాయుడు. బనారెస్ సారీ మ్యాజియం ఒక్కొక్కరు రూ 11/- శ్రీమతులు సర్వాణం, జె. తామస్, అలగన్, బాలయ్యా నాయుడు, పి. బాబుల్ రెడ్డి, పి. పాపమ్మ, కె. సుబ్రమణ్యం నాయుడు, శ్రీ టి. యం. జి. శ్రీనివాసయ్యంగారు, డా॥ డి. గోవిందరెడ్డి హరిదయాళ్ ఒక్కొక్కరు రూ.10/, శ్రీ దొరై రాజన్, ఎల్. ఎన్. అనంతరామం, లిబర్టీ స్టోరు, శ్రీమతులు మల్లిక ఈశ్వరన్, వి. పి. చౌదరి ఎం. మోహన్ రావు, మంగయ్య, రుక్మిణమ్మ, రఘుపతమ్మ, ఎం రామారావు, నారాయణదాసు, వైద్యనాథ అయ్యరు ,నిడమర్తి నరసింహం పంతులు, ఆర్. ఎస్. సుబ్రహ్మణ్యం, సి. టి. మొదలియారు, సి. ఏ. పిళ్ళై, అజీజ్ ఉద్దీన్, ఆ. శారదా జానకీరామ్ గార్లు ఒక్కొక్కరు రూ. 5/- రూ.5/- కు లోపుగా వచ్చిన మొత్తం రూ 42/-

ఈ క్రింది విరాళములు అడయారు కమిటీవారు వసూలు చేసిరి.

శ్రీమతులు ఎస్. బి. పి. అర్. రాజేశ్వరి, ఎస్ ఆర్. వై. భవానీదేవిగార్లు ఒక్కొక్కరు రూ 300/- శ్రీమతులు ఎస్. ఆర్. వి. రాజ్యలక్ష్మమ్మ, సి. బి. శేషా లక్ష్మమ్మ సి. బి. విశాలక్ష్మి రామనాథ బాబు గార్లు ఒక్కొక్కరు రూ. 200/- చంద్రకాంత్ కంపెనీవారు, రూ. 151/- మానికొండవారు, శ్రీయుతులు అబ్దుల్ రహిమాన్ ఉస్మాన్, జి. డి. దొరైపాండ్యన్ గార్లు ఒక్కొక్కరు రూ. 100/- శ్రీమతులు ఎల్. వి. బి. చౌదరి, తిమ్మరాజు చౌదరిగార్లు ఒక్కొక్కరు రూ. 58/- శ్రీ కిశోరిమాల్ కాశీరాం శ్రీమతులు ఎన్. ఆర్. నాయుడు ప్రోగుచేసినవి రూ. 51/- శ్రీమతులు పి. మార్కండేయులు, వి. కమలా ప్రసాద్ కుమారి ఎస్. ఆర్. వి. రత్నకుమారిగార్లు ఒక్కొక్కరు రూ. 50/- యద్దలం అందుకో రూ. 31/- శ్రీమతులు బ్రహ్మయ్య కానుమిల్లి సుబ్బారావు, మునగాల సరోజినీదేవి సివలింగ ప్రసాద్, లలితాంబగార్లు ఒక్కొక్కరు రూ. 25/- శ్రీమతులు వైద్యనాథన్, సుజాతా రెడ్డిగార్లు ఒక్కొక్కరు 15/- కుమారి సుమా చెటూర్ ప్రోగుచేసినవి

(తరువాయి 56-వ పేజీలో)

# సినిమా

## జెమినీవారి అవ్వయ్యార్

అధికమైన ధనవ్యయము. అనేక సంవత్సరాల పరిశ్రమ యనంతరం వెలువడింది జెమినీవారి 'అవ్వయ్యార్' "లోకమంతా తన కుటుంబమని, లోకులందరూ తన బంధువులని. లోకంలో శాంతి సౌఖ్యాన్ని విలసింప జేయడము తన జీవితధర్మమని" నమ్మిన, పరమ భక్తురాలు, కవయిత్రి, సంఘ సంస్కారిణి, పవిత్ర ఆదర్శమూర్తి అయిన 'అవ్వయి' జీవిత చరిత్రే యీ అవ్వయారు చిత్రం. చిత్ర నిర్మాతలపని ప్రజలకు వినోదము కలిగించడముమాత్రమే. ప్రజలలో ప్రబోధము కలిగించడానికి నిర్మాతలు ఎంతమాత్రమూ పూచీపడరని నిన్నగాక మొన్నబల్ల గ్రుద్ది ప్రసంగించిన వాసన్‌గారే ప్రబోధాత్మక మైన చిత్రాన్ని తీయడం చాలా ఆశ్చర్యం కలిగిస్తూవుంది. ఈ చిత్రం మూలంగా "అమూల్యమైన నైతిక ఆధ్యాత్మిక బోధ" ప్రజలకు అందజేశారనీ, "మానవజాతికి మహోన్నత సేవచేసే నీతిశతక" మిదియని, "నైతిక నాయకులను కోల్పోయి దారితెలియకుండా ఉన్న భారతీయులకు ఇలాంటి చిత్రం ఎంతైనా మార్గదర్శం కాగల" దనీ, సత్ప్రవర్తనలో సమ్మకముపోయి, కరువు కాటకాలకు లోనైన తరుణంలో ప్రదర్శింపడానికి యిదిసరియైన చిత్రమని, ఇలా పోటా పోటీలమీద చిత్ర నిర్మాతలు, దర్శకులు, నటకులు, రాజకీయపెద్దలు, సాహితీపరులు పెక్కుమంది యీ చిత్రము యొక్క ప్రబోధాత్మకతను వేనోళ్ళ మెచ్చు కుంటున్నారు. ముఖ్యంగా చిత్ర నిర్మాతలు, దర్శకులు ప్రబోధానికింత ప్రాముఖ్యత నిచ్చి మెచ్చుకోవడం, "అవ్వయ్" వారిలోకూడా పరివర్తన కలిగించినదేమో అనుకోవాలి. ఈ 'పరివర్తన' శ్మశానవైరాగ్యం, ప్రసూతి వైరాగ్యాల వంటి తాత్కాలికమైనది కాకుండా, సిసలైనదే అయితే, శ్రీ వాసన్‌గారు అనుకోకుండానే తమ చిత్రజగత్తులో ఒక సంస్కరణ తెచ్చిపెట్టారని ఒప్పుకోవాలి.

పోతన వేమనలవలే ఒక మహత్తరమైన ఆదర్శాని కని, ఉన్నతమైన జీవయాత్రను గడిపినది 'అవ్వయ్' చిత్రములో ప్రధానపాత్ర ఆమె. కవిత్వము, ప్రబోధము తక్క, సామాన్య ప్రజ కాకర్షవంతమైన ఘట్టాలు ఆమె జీవితములో లేవు. అట్టి పాత్రను తెరమీద చూపాలని వాసన్‌గారు కష్టతరమైన కార్యానికి ఉపక్రమించారు. అందువల్ల కొన్ని అద్భుతాలు, అమానుష క్రియలు,పుట్టుక మొదలు ఆమె జీవితంలో సాధించినవన్నీ ఏరి ఒక కథగా గుచ్చ ప్రయత్నించారు వాసన్‌గారు—

అయితే ఈ కథలలో సహజత్వము చూపడానికి గాని ఇందు నటించిన పాత్రలను ఆకర్షవంతముగా చూపటానికి గాని, దర్శకులు ప్రయత్నించినట్టు కనపడదు. దర్శకుల దృష్టి ఎక్కువగా అద్భుతమైన సెటింగ్లు అమర్చేమీద, తరువాత అవ్వయార్ పాత్రమీద మాత్రం కేంద్రీకరించినట్టు కనబడుతుంది. అవ్వయారు జీవితంలో ఔదత్త్యాన్ని, స్థైర్యాన్ని నటించాలంటే ఎక్కువ కష్టసాధ్యమైనపని. సుందరాంబాళ్, తన పాత్రను ఎంతవరకూ అర్థం చేసుకున్నదో నిర్ణయించడంకూడా అంత కష్టసాధ్యమైన పనేను,

అనేక ప్రదేశాలు, దేవాలయాలు, పుణ్యక్షేత్రాలు, తెరమీద విరివిగా చూపించబడ్డాయి. ఇంకా అనేకవిధాలుగా అవ్వయ్యార్ చిత్రములో ప్రజల నాకర్షించడానికి జెమినీవారు చేసిన పరిశ్రమ పూర్తిగా విశదమౌతుంది.



జెమినీవారి ప్రివ్యూథియేటరులో, పురప్రముఖులు పలువురకు "అవ్వయ్యారు" చిత్రాన్ని చూపించారు. అటువంటి ఒక సందర్భములో శ్రీ తెన్నేటి విశ్వనాధంగారు ప్రసంగిస్తున్న దృశ్యం.

## సి నీ మా

### భరణీవారి చండీరాణి.

పేరును బట్టి యీచిత్రంలోని కథావిషయానికి చారిత్ర కాధారమేమైనా వుంటుందేమో అనిపిస్తుంది. గాని ఇది కేవలం కల్పితకథ. నిర్మాత, దర్శకురాలు భానుమతి. కవలలు 'చండీ' 'చంపా'ల పాత్రధారిణికూడా భానుమతే. ఒక వ్యక్తి యిన్ని బాధ్యతలు పూనుకొని నిర్వహించడం అపురూపమే. బలహీనుఁడైన ప్రభువు, బలవంతుఁడు, యుక్తిపరుఁడు అయిన సేనాని, విశ్వాసపాత్రుడైన మంత్రి— ఇందువల్ల రాజవంశానికి ముప్పు. ఇలాంటి మామూలు చరిత్ర యీకథలోనూ నడుస్తుంది. అడవిలో పెరిగిన చండీకి ధైర్యసాహసాలు, అంతఃపురములో బందీవలె పెరిగిన చంపాకు పిరికితనము సహజంగానే కనపడుతాయి. అనాగరికమైన ఆటవిక యువతిగా చండీ పాత్రను భానుమతి చక్కఁగా నటించినది. రాణీవాసపు అబలగా, చంపా పాత్రనుకూడా బాగానే నటించినది. అయితే, ముక్తిదీక్షతో శత్రుశిబిరంలో యుక్తిపరురాలైన వీరవనితగా తనపాత్రను అంతచక్కఁగా నటించలేదని చెప్పాలి. సేనానాయకుని కుమారుడుగా రేలంగి ముఖ్య పాత్రధారియే అనాలి. అంతముఖ్య పాత్ర చుట్టూ అపహాస్యాన్ని ఆద్యంతం ముడిపెట్టడం అంతసబబుగా తోచలేదు. - ప్రచండుడుగా రంగారావు తనపాత్రను అద్భుతంగా నటించాడు. ఇంకమిగతావారికి అంత ప్రాముఖ్యత లేక పోవడంవల్ల వారినటనను గూర్చి విమర్శ అనవసరం.

పిల్లలపెండ్లి, పిల్లలదాన్సు, క్రొత్తరకమైన వినోదం. చిత్రం పెరగడాని కిదియొక సులభమైన విధానం, అంతఃపురములో పురప్రవేశం చాలా చమత్కారంగా కథా భాగంతో కలిసిపోయింది. ఇదియొక పేర్కొఁన తగిన ఘట్టం, 'చండీ' 'చంపా' లిదువురు కిశోరుని ప్రేమించడం వల్ల, చండిసాహసానికి త్యాగశీలతను కూడా పొదిపే అవకాశం కలిగింది. ప్రేక్షకులకు అన్నివిధములా తగు మాత్రము వినోదము కలిగించగలదీ చిత్రం.

"భరా"

## దసరాలలో చేతిపనుల ప్రదర్శన

### ఉత్తమమైన వస్తువులకు బహుమతులు.

1953 అక్టోబరు నెలలో, దసరా ఉత్సవాల సందర్భములో, మిగతా కార్యక్రమముతోపాటు, చేతిపనుల ప్రదర్శన మొకటి ఏర్పాటు చేయబడును. ఆంధ్ర మహిళా సభ వారి పారిశ్రామిక శాఖలో తయారైన కుట్టు, ఎంబ్రాయిడరీ, నేత, ఉల్లు వస్తువులు, స్టేషనరీ పరికరములు, యీ ప్రదర్శనములో చూపబడును.

ఇంకా— సభ్యురాండ్రు తయారుచేసిన అందమైన సామగ్రి— కుట్టు, ఎంబ్రాయిరీ, లేసు, ఉల్లు, పూసల వస్తువులు ఇంకా విచిత్ర వస్తువులు, గీసిన బొమ్మలు మున్నగునవి యీ ప్రదర్శనమునకు పంపగోరుచున్నాము. ఈ వస్తువులు ఇదివరలో ఏ ప్రదర్శనమునకును పంపనివిగాను, ఇతఃపూర్వము ఏ బహుమతియు బడయనివిగాను ఉండవలెను. ప్రవేశరుసుములేదు. ఉత్తమమైన ప్రదర్శనమునకు బహుమానమీయబడును.

క. రంగనాయకమ్మ.
పారిశ్రామిక శాఖ సభ్యురాలు.
ఆంధ్ర మహిళాసభ.

## ఆంధ్ర మహిళాసభలో క్రొత్త తరగతులు

### 1. ఆంధ్రా మెట్రిక్ :

ఈ సంవత్సరమునుండి, ఆంధ్రా యూనివర్సిటీ మెట్రిక్యులేషనుకు, ఆంధ్రమహిళా సభలో శిక్షణ ప్రారంభించబడినది. 1954. సంవత్సరములో పరీక్షకై ఇద్దరు విద్యార్థినులు శిక్షితులగుచున్నారు. జూనియర్ మెట్రిక్ తరగతి కూడా ప్రారంభించబడినది. ఇంగ్లీషు, తెలుగు, లెక్కలు, హిస్టరీ, సివిక్సు సబ్జెక్టులలో శిక్షణ జరుగుతూ వుంది. జూనియర్ తరగతికి ప్రవేశములింకా జరుగుతూ ఉన్నవి.

2. జనవరి నుండి, రేడియో మెకానిక్స్ పనిలో యువతులకు శిక్షణ నిచ్చే ఏర్పాట్లు జరుగుచున్నవి. ఇండియా ప్రభుత్వపు, వృత్తి పునరావాస శాఖవారి ఆధ్వర్యాన యీ శిక్షణ జరుగుటకు సంప్రదింపులు జరుగుచున్నవి. 18-సం॥ దాటి, ఎస్. ఎస్. ఎల్. సి. అర్హతగ యువతులు ఇందు చేరవచ్చును. వెంటనే దరఖాస్తు పెట్టుకొనవలెను.

అ. చన్నఘంటమ్మ.
కార్యదర్శిని.

## గోదావరి వరద బాధితుల నిధి

(53-వ పేజీ తరువాయి)

రూ. 13/- శ్రీమతులు అరుణాచలం, శివరామ కృష్ణయ్య, సి. రామస్వామినాయుడు, నరసింహం, ఎ. వి. చౌదరి, పి. కన్నాంబ, సావిత్రి, కృష్ణవేణీగార్లు ఒక్కొక్కరు, రూ 10/- శ్రీమతులు ఇ. వెంకటేశ్వరన్ పద్మనాభం, మూర్తి అంబుజం గార్లు ఒక్కొకరు రూ. 5/- రూ, 5/- కి లోపుగా వచ్చిన విరాళములు మొత్తం రూ1/

విరాళములను పంపగోరువారు, ఈదిగువ చిరునామాకు పంపప్రార్థన.

శ్రీమతి సి. బి. విశాలాక్షి, రామనాథబాబుగారు,
సెక్రెటరీ, అడయారు కమిటీ.
26. సెకండ్ మెయిన్ రోడ్డు
గాంధీనగర్, అడయార్, మద్రాసు.

* * *

### స్త్రీల గృహ పరిశ్రమల సహకార సంఘం గూడూరు.

ది 2—9—53 న బోర్డు హైస్కూలు ఆవరణలో స్త్రీల. గృహపరిశ్రమల సహకార-సంఘం "గోదావరి వరద బాధితుల సహాయార్థం" చాచా ప్రదర్శనాలు "కడుపు మంట" అనే నాటకాన్ని ప్రదర్శించిరి. శ్రీమతులు సుచేతా రామకృష్ణ, హైమవతి, రంగనాయకమ్మగార్లు పాటలు పాడి ప్రేక్షకుల నానందపరచిరి. అధ్యక్షులు శ్రీ శ్రీకంఠం కృష్ణారావు, (బోర్డుహైస్కూలు హెడ్మాష్టరుగారు) నాటకాన్ని ప్రశంశిస్తూ "వరద బాధితుల కొరకు గూడూరు స్త్రీలు ఈ విధంగా ముందుకువచ్చి సేవ చేయడం ప్రశంసనీయం. ఇదేరకంగా సేవచేస్తూ సంఘాన్ని వృద్ధిచేయాల"ని హెచ్చరించారు. ప్రదర్శనాల మూలంగా వసూలైన మొత్తం రూ 245/- నాటకానంతరం ప్రేక్షకులలో వసూలు చేసిం మొత్తం రూ 9-3-3. పై సంఘం మెంబర్లు 15 రోజులుగా వూరిలో తిరిగి వసూలు చేసిన మొత్తం రూ 216/- మొత్తం వసూలైన సొమ్ము ఆంధ్రప్రభ విలేఖరిద్వారా ఆంధ్రప్రభ వరదబాధితులనిధికి పంపారు.

* * *

### ఆంధ్ర మహిళాసభ - మదరాసు.

ఆంధ్ర మహిళాసభ విద్యార్థినులు జేరి గోదావరి వరద బాధితులసహాయార్థం వసూలుచేసి రెడ్ క్రాస్ వారికి రూ. 76-2-0, 68 పాతగుడ్డలు, అఖిలభారత మహిళా సంఘపు మదరాసు శాఖకు 82-2-0, 80 పాతగుడ్డలు పంపించియున్నారు.

గతమాసపు ఆంధ్ర మహిళలో ప్రకటించిన ఉచిత విద్యార్థి వేతనములు సకాలములో దరఖాస్తులు వేసుకున్న 7 గురికి ఏర్పాటు చేయబడినవి. వీరికి మల్లమ్మదేవి హాస్టలులో ఉచితభోజన వసతులు, పాఠశాలలో వుచితవిద్య అవకాశములు యీయాబడినవి.

★

## చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-

### ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచ వర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింప బడినది. ఇందుకొరకై, ఆంధ్ర మహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుప బడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారము చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహానిచ్చుటకు, సభ తరఫున కొందరు యువతులు నియమింప బడుదురు. సభకు వచ్చిగాని, పోష్టు ద్వారాగాని వివరములు తెలిసి కొనవచ్చును.

ఇంకొక విషయము —మీరు కొనవలచిన సేవింగ్స్ సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయడల సభకు 1¼% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్య కలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

సభలో టి. జి. హైమవతిగారు, దీనిని గూర్చిన వివరములన్నీ మీకు తెలుపగలరు.

అ. చన్నఘంటమ్మ,
కార్యదర్శిని.

ఆంధ్రమహిళ

# 10వ వార్షిక సంచిక.

దసరా దీపావళి పండుగలకు మధ్యకాలంలో వెలువడుతుంది.

క్రొత్తగా అవతరించిన ఆంధ్ర రాష్ట్రమును గూర్చిన వ్యాసములు, వార్తలు, చిత్రములు,

పారిశ్రామిక విద్యాలయపు నూతనభవన ప్రవేశ సందర్భములో తీసిన ఛాయాచిత్రములు,

మహిళాసభ దసరా వుత్సవములను గూర్చిన విశేషములు,

ఈ సంచికలో ఎక్కువగా ప్రకటింపబడును.

ఇంకా

ఆర్టుపేపరు అట్ట, ఆకర్షవంతమైన ముఖచిత్రం,

మంచి కథలు, మనోజ్ఞమైన నాటికలు, అనుభవజ్ఞుల రచనలు,

రేఖా, ఛాయా చిత్రములు, సంఘసేవాసంస్థలు, నిర్మాణ కార్యక్రమాలను గూర్చి,

నిర్వాహకులచే రచనలు, ఎన్నో బొమ్మలు, వింతశీర్షికలు—

ఈ సంచికయొక్క ప్రత్యేకత.

వెల: సంచిక ఒకటికి రూ. 1—8—0

దొరకుస్థలము:

(1) హిగ్గిన్‌బాదమ్స్ రైల్వే బుక్కుస్టాల్స్, (2) ఆంధ్ర మహిళాసభ, మదరాసు-4

సంపాదకురాలు.

# ఆంధ్రమహిళ



## 10-వ వార్షిక సంచిక

బిడ్డల లివరు అండు స్ప్లీను వ్యాధులకు

# పాత్రుడుగారి బాలసంజీవిని

డాక్టరు పిల్లా పాపయ్యపాత్రుడుగారి "బాలసంజీవిని" నిజముగ అమోఘమైనది. బిడ్డలకు సంభవించు లివరు అండు స్ప్లీను వ్యాధులలో ప్రథమ దశయందుగాని, కాంప్లికేటెడ్ స్థితియందుగాని తప్పకుండ గుణమిచ్చును. వైద్యవృత్తియందును నా స్నేహితులలోను బంధుకోటిలోను అనేకులు ఉపయోగించుటవల్లను "బాలసంజీవిని" యొక్క గుణాతిశయములు పరీక్షించుట కవకాశమేర్పడినది. బజారులోగల యితర లివరు ఔషధములుగూడ యిదివరలో వాడి చూచితినిగాని "బాలసంజీవిని" వాడిన పిమ్మట పైవాటినెల్ల విసర్జించి దీనినే హెచ్చుగ వాడుచున్నాను. అమోఘముగ నిట్టి మహదౌషధమును ప్రజోపయోగమునకు వినియోగించుచున్నందుకు పిల్లావారి వంశము స్తుతిపాత్రమైనది.

డాక్టర్. ఎన్. రామనాధన్‌గారు L. M. P. కావేరిపాకం.

వివరములకు:

## డాక్టరు పిల్లా పాపయ్యా పాత్రుడు & బ్రదర్సు,

నెం. 19, దక్షిణమాడావీధి, మైలాపూరు, మద్రాసు 4.

| కుంభకోణం బ్రాంచి : | తిరుచినాపల్లి బ్రాంచి : |
| --- | --- |
| నెం. 7 సారంగపాణి కోవిల్ | నెం. 15 పుగళై పిళ్లై వీధి |
| తూర్పు వీధి. | తెప్పకొలం. |

అన్ని మందుల షాపులలోను దొరకును.

---

## ఈ నాటి

## క్రొత్త అందాలు

బుట్టచేతులు, లేసు మెడల రోజులు కావివి— క్రొత్త రకపు జరీ అంచులతో సొగసైన చోళీల రోజులివి.

సిల్కులన్నీ ఒకటి కాదు— క్రేపులన్నీ క్రేపు-డీ-షీను లంతకన్నా కావు. మైసూరు సర్కారు క్రేపు చోళీలు, అసలైన క్రేపు-డీ-షీను నాణ్యతగల, నూటికి నూరు పాళ్లు స్వచ్ఛమైన మైసూరు సిల్కు నుండి తయారై-

హుందాతనము, సహజమైన తళతళలు కలిగి - దినసరి వాడుకకు చక్కగా మన్నెడివి.

*

ఆకర్షణీయమైన నమూనాలలో
రమ్యమైన రంగులతో
అద్భుతమైన
అలంకారము
నిచ్చునవి.

*

నొక్కి అడగండి: మైసూరు సర్కారు

## క్రేపు - డి - షీను.

మైసూరు గవర్నమెంట్ సిల్కు వీవింగు ఫ్యాక్టరీ, మైసూరు.

## కృతజ్ఞత

—: :—

శ్రీమతి గొల్లకోట కమలామణిగారు కళా శాఖకు రూ. 20/- మిస్ అప్రన్‌వాలా నర్సింగ్ హోమ్‌కని రూ. 20/-లు విరాళముగా యిచ్చిరి. వీరికి మా కృతజ్ఞత.

—ఆంధ్ర మహిళాసభ.

# ఆంధ్రమహిళ

సంపుటి 10 :: నవంబరు '53 :: సంచిక 7

ముఖచిత్రం: కుంభకోణంలో రామస్వామిదేవాలయమునందలి ఒక శిలావిగ్రహమునకు ప్రతిరూపం.



ఇంకా, బాలానందం, గ్రంథసమీక్ష, వ్యాసాలూ, విశేషాలూ, కథలూ, కావ్యాలూ—


వ్యవస్థాపకురాలు: శ్రీమతి దుర్గాబాయి, యం.యే.,బి.యెల్.,

సంపాదకురాలు: శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే.,యెల్.టి.,

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్.

మద్రాసు—4

సంవత్సరచందా :: ఆరు రూపాయలు

మా ఖాతాదారులకును, మా అభివృద్ధినిగోరు మా మిత్రులకును దీపావళి శుభ సందేశములు !

"దీపావళి"

అభినందనములు

★

VIJAYA CHEMICALS..."VIJAYA MANSIONS",

15, CLEMENS ROAD. PURASAWALKAM...MADRAS.7

ASOKA AMLA HAIR OIL

VIJAYA

FAS.

'దీపావళి' పండుగను ఆనందమయ మొనర్చుటకు

# అశోకా ఆమ్లా హేరాయిల్

అభిలషించుచున్నది. దీపావళి శుభదినమున అభ్యంగనములకును, శిరోజములకును ఈ తైలమును ఉపయోగింపుడు. యియ్యది సాటిలేని గుణ — పరిమళములుగల తైలము — కేశాభివృద్ధికి ఉత్తమోత్తమమైన తలనూనె.

## విజయా కెమికల్సు — విజయా మ్యాన్షన్సు,

"సౌందర్యోపకరణ తయారీదారులు" :: పరశువాకం, 15 క్లెమెన్సురోడ్డు, మదరాసు.

---

# ELNA




అత్యద్భుతమైన కుట్టు మిషను, స్విట్జర్ లాండ్ లో తయారు చేయబడినది. అందం, బలం మన్నికకు పేరు పొందినది. అందమైన కుట్టు, ఎంబ్రాయిడరీని చేసికొనవచ్చును. విద్యుచ్ఛక్తితో కుట్టుకొనవచ్చును. పోర్టబుల్ టైపురైటర్ వలె పెట్టెలో అమర్చబడినది. దయచేసి మా కార్యాలయమునకు వచ్చి దానిని పరీక్ష చేయండి.

★

*City Agents:*

**The National Engineering Co. (M) Ltd.,**

379, Netaji Subash Chandra Bose Road,

MADRAS - 1.

(TELEPHONE 55188)

★

*Sole Agents for India:*

**HOPE PRUDHOMME & CO. LTD.,**

P. B. No. 125, MADRAS - 1.

ఆంధ్రమహిళ

సంపుటి 10 :: నవంబరు '53 :: సంచిక 7

# శాంతి స్థాపనకు స్త్రీలకు అవకాశం యివ్వండి

— ——: :——

"భూలోకం— స్వర్గలోకం కూడ విసిగి వేసారిపోతున్నాయి— ప్రభువులూ, పరిపాలకులూ 'సత్యం - ధర్మం'
అంటూ మాట్లాడే బూటకపు కబుర్లు వింటూంటేను" ("Earth is sick and Heaven is weary of
the hollow words that Kings and Statesmen utter, when they talk of Truth and Justice")
అని ఒకమహాకవి ఉన్నది ఉన్నట్లు నిర్భయంగా ప్రకటించేడు.

దీని యదార్ధత్వం మనం ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాం: ప్రతీ ప్రజా ప్రతినిధీ, ప్రతీరాజ్యప్రతినిధీ ప్లాట్
ఫారాలమీదా, ప్రపంచ సభల్లోనూకూడా సత్యం — ధర్మం — శాంతి అభ్యుదయం కావాలోయని కలవరిస్తున్నాడు!
వీటిస్థాపనే తన ఆశయంఅనీ, ఈ ఆశయసిద్ధికి కృషిచేయ్యడానికే ఐక్యరాజ్య సమితిగా యేర్పడ్డామనీ అంటున్నారు.
ఐతే యదార్ధంగా సాధించిందేమిటి?

ఇటు సిలోనునుండి, అటు దక్షిణాఫ్రికావరకు విలోకించండి; 'సత్యవిరుద్ధం' అన్నమాటే వినవస్తూంది. ఇటు
కొరియానుండి అటు ట్రియిస్టీవరకు చూడండి! 'అధర్మం' అని ఆక్రోషం వినవస్తూంది. ఇటు అమెరికా ఆటంబాంబుల
అట్టహాసం నుండి—అటు రష్యా హైడ్రోజన్ బాంబుల ప్రగల్భం వరకు గమనించండి! 'అభ్యుదయం' అనుకుంటూ
మానవ జాతిని మారణహోమంలో ఆహుతి చేయాలని జరిగే యత్నాలను ఉన్మత్తకార్య కలాపం అనాలో
మరేమనాలో ఆలోచించండి. ఆధునిక పరిస్థితులేకాదు — అధునాధునిక చరిత్ర కూడ తరచండి; క్రీస్తుకు పూర్వం
అనేక శతాబ్దాలు (భారతేతిహాస గాథల వద్దనుండి) క్రీస్తుకు పరం ఇరవయ్యవ శతాబ్దం వరకు ఇలా 'శాంతి'
స్థాపనకై గావించినది యుద్ధం వెనుక మరొక ఘోరతర యుద్ధం, దాని వెంటనే ఇంకొక ఘోరతమ యుద్ధం!
ఈ హంశాలన్నీ నిష్పక్ష పాతబుద్ధితో వితర్కిస్తే — ఎక్కడో పొరపాటు జరిగిందని తెల్లమౌతూనేయుంది!
ఏవి సాధిస్తామని చెబుతున్నారో సరిగ్గా వాటికి విభిన్నాలైనా అసత్యం — అధర్మం— అశాంతి — అధఃపతనంలోకి
దింపేస్తున్నారు. ఇలా ఎన్ని శతాబ్దాలు ఓపిక పట్టినా ఒకటే ఫలితం!

* * * *

మానవసృష్టి — సృష్టించిన వార్ని పెంచి పెద్దవాళ్ళను చేసి కుటుంబానికి, దేశానికి, ప్రపంచానికి ఉప
కరించే వారినిగా జేయడం స్త్రీజాతి కర్తవ్యం. ఈ కర్తవ్యాలతోబాటు ఆమెకు సంక్రమించిన బాధ్యతకూడ గురుతర
మైంది. ఇలా తన కర్తవ్యం— బాధ్యతల్ని గుర్తించిన ఏ స్త్రీ కూడ, పై పరిస్థితులు చూస్తూ ఊరుకుండ జాలదు.

## శాంతి స్థాపనకు స్త్రీలకు అవకాశం యివ్వండి

ఇట్టి పరిస్థితుల్లో ప్రపంచ ఐక్యరాజ్య సమితి అష్టమ సభకు అధ్యక్షురాలుగా హైందవ నారీమణి శ్రీమతి విజయలక్ష్మీ పండిట్‌ను ఎన్నుకోవడం సర్వ దేశాలకూ సుభసూచికం. సత్యం — ధర్మం— శాంతి— అభ్యుదయ సాధనకిది గొప్ప దోహదమౌతుంది. ఇలా ఐక్యరాజ్యసమితిలో ఒక విజయలక్ష్మి, భారత ప్రభుత్వ ప్లానింగు కమిటీలో ఒక దుర్గాబాయమ్మ, రాష్ట్ర ప్రభుత్వ మంత్రి వర్గంలో ఒక జ్యోతి వెంకటాచలం ఇలా స్త్రీలకు నూటికి—కోటికి అవకాశం యిస్తేచాలదు. ఇలా వివిధ రాజ్యసమితిలో దిగ్విజయంగా విజయాన్ని సాధించగల లక్ష్మలు, దుర్గసామర్థ్యాన్ని తలపింప జేసే అనేకమంది అమ్మలు, మానవజాతికి ఆశాజ్యోతులు చూపించడానికి అనేకజ్యోతులూ కావాలి. శ్రీమతి మున్షీ సతీమణిలాంటివారు దాన్ని గమనించే ప్రభుత్వాన్ని స్త్రీల హస్తగతం చేయండి అని అంటున్నారు. ప్రపంచ శాంతి స్థాపన యదార్థంగా జరగాలంటే ఇదే తరుణోపాయం. ఇది పదవీస్వీకరణకు, పాశ్చాత్త అనుకరణకు కాదు. ఎందుకంటే భారతనారీమణుల ఆదర్శంలో గొప్ప ఔన్నత్యం ఉంది. ప్రపంచంలో భారతదేశానికున్న ప్రత్యేక స్థానం ఆ దేశపు స్త్రీల వల్లనే వచ్చింది. అది నిలబెట్టుకుంటూనే ముందుకు సాగగలం. ప్రాచ్య పాశ్చాత్త పద్ధతుల్లో మంచి అన్నది ఏరి సమ్మేళనం చేసి— ఐహికా ముష్మిక సుఖజీవనాలకు సులభ పంథా లేర్పరచి, మళ్ళీ సర్వ ప్రపంచానికే మార్గ దర్శకులం కాగలం.

ఇలా స్త్రీమూర్తి ఏ ఆదర్శంతోను, ఆశయంతోను, కృషి చేస్తుందీఅంటే—తన మహోన్నత స్థానాన్ని మాతృస్థానాన్ని నిలబెట్టుకొని, తన ప్రపంచ సంతానానికి దయా-సత్య — శౌచ — శాంతి — వాత్సల్య సమరస భావాలు హెచ్చించి, మానవ జీవితం మహత్తర పూర్ణమైనదని బోధించి, వార్ని సరియైన గమ్యస్థానం వైపుకు నడిపించా లనే. అందుచేత పురుషులిక అడ్డు పెట్ట తగదు. అడ్డు పెట్టినా ఆగదు. తనకు సృష్టికర్త కల్పించిన కర్తవ్యాన్ని, తన్ని మిత్తంగాసంక్రమించిన బాధ్యతల్ని తన్మూలంగా తనకుండు కున్న సహజస్థానాన్ని అధిష్టించకుండా స్త్రీ మూర్తిని ఆపగల వారెవరున్నారు? పురుషులూ ఆమె కని, పెంచినవారే గనుక వారంతా ఆవిడ హక్కు. ఆమె సర్వాధికారిణి, సర్వ శాసనకర్త్రి, సర్వశక్తి స్వరూపిణి. స్త్రీలకు ఓర్పు, శాంతిసమరస భావాలు, సహజసంపదలు. వారికి అవకాశం యిస్తే వీటిని విశాల ప్రపంచంలో కూడ స్థాపించగలరు. అందుచేత స్త్రీలకు సర్వ అవకాశాలు యివ్వండి.

## కృతజ్ఞత

———:—

మా రచయితల సహకారమువల్ల, మా చదువరుల ఆదరాభిమానమువల్ల, "ఆంధ్ర మహిళ" 9 సంవత్సరముల సేవాకార్యక్రమాన్ని విజయవంతముగా ముగించింది. మే-సంచికలో వివరించినట్లు 10—వ వార్షిక సంచిక యీ దీపావళి ముందు ప్రకటి స్తున్నాము. నిరంతర సహకారమేగాక, యీ ప్రత్యేకసంచిక ప్రకటనకు తోడ్పడ్డ ప్రతి ఒక్క రచయితకూ, రచయిత్రికీ, మా హృదయపూర్వక కృతజ్ఞత తెలియజేస్తున్నాము. భవిష్యత్తులోనూడ యీలాంటి సహకారాన్ని కాంక్షిస్తూ, స్వరాష్ట్రవాసులూ, రాష్ట్రే తరవాసులూ అయిన తెలుగు సోదరీమణులు యథాప్రకారంగా దీనియందు ఆదరము చూపగలరని ఆశిస్తూ, పండుగ సమయములో, అందరికూ తన శుభాకాంక్షల నందిస్తూ వుంది, "ఆంధ్ర మహిళ".

— సంపాదకురాలు.

## ఆంధ్ర మహిళా సభ

# దసరా ఉత్సవములు.

### దేవీ పూజ :

దుర్గాష్టమి, మహార్నవమి, విజయదశమి, పర్వదినములలో (16-10-53, 17-10-53, 18-10-53, శుక్ర, శని, ఆది వారములు) ఆంధ్ర మహిళాసభలో ఉదయము 8 గం॥ నుండి. 10 గం॥ వరకు, దేవీపూజ బొమ్మల కొలువు, పేరంటం జరిగినవి,

నిర్వాహణ: శ్రీమతి పర్వతనేని సంపూర్ణాదేవిగారు,
క్లబ్బు శాఖ సభ్యురాలు.

### ఆటల పోటీలు:

12-10-1953, సోమవారం, 2 గంటలకు సభ విద్యార్థినులకు, 13-10-53 మంగళవారం 3 గంటలకు సభ సభ్యురాండ్రకు ఆటలలో పోటీలు జరిగినవి. ఎక్కువ మంది విద్యార్థినులు, సభ్యురాండ్రు వీనిలో పాల్గొన్నారు. సమిష్టిగా మోతీ, హీరా దళములు రెండు కలసి,

కూడిక పందెం,
టగ్ ఆఫ్ వార్,
జండా ఆట,
సూదీ దారం,
పొటెటో రేస్.
} అనే 5 ఆటలలో పోటీ చేసినారు.

మొదటి రెండు ఆటలలో హీరాదళము, వెనుకటి మూడు ఆటలలో మోతీదళము గెలుచుటవల్ల, యీ సంవత్సరము షీల్డు మోతీ దళమునకు యీయబడినది. ఒక్కొక్క ఆటలో గెలిచిన దళములోని ప్రతి బాలికకు బహుమతు లీయబడినవి.

ఇంకా, వ్యక్తిగతమైన ఆటలలో మ్యూజికల్ చెయిర్స్‌లో ఎ. సావిత్రికి, బుక్ బాలన్సింగ్‌లో ఆర్. ఇందిర, బి. ప్రసన్నలకు ప్రథమ, ద్వితీయ బహుమానములు వచ్చినవి.

### సభ్యురాండ్ర ఆటలు:

ఎలిజబత్ రాణీ—సర్ వాల్టర్ రాలే ఆటలో శ్రీమతులు గంగాబాయి ఆప్టే, వి. ఎస్. రంగనాయకమ్మలకు మొదటి బహుమానము, ఎ. అనసూయ, బి. గౌరీలకు రెండవ బహుమానము వచ్చినవి.

వెయిటర్స్ పందెంలో శ్రీమతులు వి. సీత, ఆర్. అనూరాధ, ఎ. శేషగార్లకును, మ్యూజికల్ ఛెయిర్స్‌లో ఎ అనసూయగారికి. క్రాబ్‌రేస్‌లో ఎస్. మీరకు ప్రథమ బహుమానం, బి. గౌరికి రెండవ బహుమానం వచ్చినవి.

నిర్వాహణ: కుమారి ఎ. విమలారావు, క్రీడాశాఖ
సభ్యురాలు.

### చేతిపనుల ప్రదర్శనము- ఉత్సవము.

ది. 17-10-1953. 7—ఎ. రోజరీచర్చ్‌రోడ్‌లోని క్రొత్త పారిశ్రామిక విద్యాలయపు భవనములలో, విద్యార్థినులు, సభ్యురాండ్రు చేసిన చేతిపనుల ప్రదర్శన, వినోదపు ఆటల కార్యక్రమాన్ని మద్రాసు మంత్రిణి శ్రీమతి జ్యోతి వెంకటాచలంగారు ప్రారంభించిరి. విద్యార్థినులు, సభ్యురాండ్రు, ఉపాధ్యాయినులేకాక పెక్కుమంది యీ ఉత్సవమునకు వచ్చియున్నారు.

నిర్వాహణ : శ్రీమతి. కె. రంగనాయకమ్మ. కుమారి
ఎ. విమలారావు.

### వినోద కార్యక్రమము.

సభ్యురాండ్రకు, విద్యార్థినుల తల్లి దండ్రులకు గాను ది 18—10—1953, ది. 19-10-1953—సభా భవనములో నృత్య, నాటక ప్రదర్శనములు జరిగినవి. ది. 19.10-1953 న, మదరాసు రాష్ట్రి డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్, శ్రీమతి, ఓ. సి. శ్రీనివాసన్‌గారు అధ్యక్షత వహించిరి. శ్రీమతి దువ్వూరి నరసమ్మగారు బహుమతులు పంచిరి.

నిర్వాహణ: ఉపాధ్యాయినీ వర్గము.

శ్రీమతి ఓ. సి. శ్రీనివాసన్‌గారు మహిళాసభ సేవా కార్యక్రమాన్ని, విధానాలనూ అభినందిస్తూ, వినోద ప్రదర్శన అద్భుతముగా ఉన్నదనీ, అందులో శ్రీమతులు అనసూయ సీతగారలు తర్ఫీదు చేసిన 'గాజుల బేహారి' అతి సహజంగా, చాలాచక్కగా ఉన్నదనీ నుతించారు,

## నృత్యము, నటన:

చక్కగా నృత్యము చేసిన చిన్న బాలికలు కుమారి సత్యశీల కుమారి రాజకుమారి, కుమారి గిరిజలకు, బహుమతు లీయడమైనది. నాటకములలో నర్సింగ్‌హోమ్ పిల్లలు చేసిన మందుల షాపులో (తెలుగు) పనివాడుగా నటించిన శ్రీమతి లలిత; విద్యా, పారిశ్రామిక శాఖలలో 'స్వయం వరం' (తెలుగు) లో డాక్టరు భార్యగా నటించిన కుమారి పి. వి. ఇందిర; 'హిందీ బేలా' (హిందీ) లో తల్లిపాత్ర నటించిన కుమారి జ్యోత్స్న; 'మాక్ డాక్టర్' (ఇంగ్లీషు) డాక్టరుగా నటించిన కుమారి వేదవల్లి; 'మిస్. సీత' (తమిళం) దశరధునిగా నటించిన .... కుమారి వి. శారద మంచి నటకులుగాను బహుమానములు పొందిరి.

## ప్రదర్శన:

చేతిపనులను ప్రదర్శనకు పంపిన శ్రీమతి పె. విమల గారి కాగితపు పువ్వులకు, ప్రథమ బహుమానము, ఆర్. లక్ష్మి, ఎల్. కృష్ణవేణుల ఉల్లు అల్లికలకు ద్వితీయ బహుమానములు యీయడమైనది.

## స్వచ్ఛంద సేవ:

అన్ని కార్యక్రమాలల్లో ముఖ్యంగా ఆటలపోటీల నిర్వహణలో స్వచ్ఛందంగా కృషి చేసిన కుమారి వసుధ, కుమారి శారదలకు ప్రత్యేక బహుమానము ఈయ బడినది.

## ప్రత్యేక బహుమానములు:

పారిశ్రామిక విద్యాలయము నుండి ఏప్రిలు 1952 లో పరీక్షకు వెళ్ళిన విద్యార్థినులలో రాష్ట్రము మొత్తముమీద ప్రథమురాలిగా, ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలగుట వలన కుమారి ఆర్. పద్మకు బహుమాన మీయబడినది.

ఇటీవల మహిళాసభ తరఫున చా చా ప్రదర్శనములో పాల్గొన్న కుమారి జ్యోత్స్న, పి. వసుంధర, పి. గిరిజ, టి. శ్యామల, వసుంధర, వి. కల్యాణి, ఎ. రాధ, పద్మ, అరవింద, శ్రీమతి, ప్రమీల, ఉష, లక్ష్మీకాంతమ్మ, సత్యశీలలకు శ్రీ పోలిరెడ్డిగారు ప్రత్యేక బహుమానముల నిచ్చిరి.

కార్యదర్శిని అందరికీ వందనములు సమర్పించడంతో మూడురోజుల కార్యక్రమము ముగిసినది.



ది. 17–10–53 న 7-ఎ. రోజరీ చర్చిలోని క్రొత్తపారిశ్రామిక విద్యాలయపు భవనములలో, ఆంధ్రమహిళాసభ దశరా ఉత్సవాలను ప్రారంభించినప్పుడు మద్రాసు మంత్రిణి శ్రీమతి జ్యోతి వెంకటాచలంగారు చేతిపనుల ప్రదర్శనమును తిలకిస్తున్నప్పటి దృశ్యము.



# రాజకీయాలు

* శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు. *

సెప్టెంబర్ నాలుగోవారం మొదలుకుని అక్టోబర్ మూడో వారం వరకూ జాతీయ, అంతర్జాతీయ రాజకీయ రంగాలలో జరిగిన ప్రముఖ సంఘటనలు ఇవి: ఆంధ్ర రాష్ట్ర ప్రారంభోత్సవం, తిరువాన్కూరు - కొచ్చిన్‌లో శాసనసభ రద్దు, హైదరాబాదు కాంగ్రెస్‌లో 'అంతఃకలహాలు తీవ్రరూపం దాల్చటం, బ్రిటిష్ గయానాలో ప్రజాస్వామిక పద్ధతిలో ఏర్పడ్డ పీపుల్సు పార్టీ ప్రభుత్వాన్ని బ్రిటన్ కూలదోయటం, కొరియాలో భారతదేశంమీద అమెరికన్లు కారాలు మిరియాలు నూరటం, తిరిగి అరబ్-ఇజ్రేల్ తగాదా తల ఎత్తటం.

*　　　*　　　*

అక్టోబరు 1వ తేదీన కర్నూలు తాత్కాలిక రాజధానిగా ఆంధ్రరాష్ట్రం ఏర్పాటయింది. ప్రధాని నెహ్రూ ప్రారంభోత్సవం జరిపారు. ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా మంత్రివర్గం ఏర్పాటయింది. ఉత్సవాలను చూడవెళ్ళినవారు చాలామంది కర్నూలు, వ్యతిరేకులు చెప్పినంత పాడుగా ఏమీ లేదని అన్నారు. అయితే రాజధాని, ఆఫీసులు పెట్టే వసతికానీ, కనీసపు సిబ్బంది ఉండటానికయినా చాలిన ఇళ్ళు ఉన్నవనికానీ చెప్పలేదు. ఏ ఊళ్ళో అయినా అన్ని ఆఫీసులు పెట్టలేము, కనుక కర్నూల్లో అన్నీ లేవని ఆక్షేపించకూడదని కొందరన్నారు. అది కొంతవరకూ నిజమే కాని, రాజధాని శాశ్వతంగా ఏది ఉంటుందో తేల్చుకునే వరకూ అభివృద్ధి సరిగా ఎక్కడా ఉండదు. ప్రజలు ఇళ్ళు కట్టాలంటే, రాజధాని తరవాత వెళ్ళిపోయినా నష్టంలేదులే అనుకొన్నప్పుడే కట్టగలుగుతారు. గుంటూరు - బెజవాడ ప్రాంత ప్రజలకే ఆవిధంగా ధైర్యంచేసే అవకాశం ఉన్నది. కాని ప్రస్తుతం కర్నూలు ప్రజలు అట్లా భావించే అవకాశం లేదు.

ఇంకపోతే, ప్రభుత్వమే నిర్మించాలి. తాత్కాలి రాజకధానికి ఎంత తక్కువ ఖర్చు చేస్తే అంతమంచిదని సబబయిన ప్రభుత్వం ఏదయినా అనుకోకతప్పదు. శాశ్వత రాజధానిగానే కర్నూలు చేస్తారా అంటే, గుండెమీద చెయ్యివేసుకుని అవునని ఎవరూ చెప్పలేకపోతున్నారు. విశాలాంధ్ర ఏర్పడ్డా ఏర్పడకపోయినా, హైదరాబాద్ వచ్చినా రాకపోయినా, కర్నూలే శాశ్వత రాజధాని అని నిర్ణయించి, దానిని ఎసెంబ్లీచేత ఒప్పించగల నాయకులే ఉంటే నేడు కాకపోతే రేపయినా ఆంధ్ర ప్రజలు యావన్మందీ తప్పకుండా కర్నూలును అభిమానించి అభివృద్ధి చేయగలరు. అయితే "కర్నూలునుంచి హైదరాబాదుకు" అని రంకెలువేస్తున్న నాయకులు ఏంచేస్తారో చెప్పటం కష్టం.

ప్రతికూల పక్షాలవాళ్ళు గుంటూరు - బెజవాడ ప్రాంతానికి రాజధాని తరలించాలని ఎసెంబ్లీలో నవంబర్ 23 న ప్రతిపాదన చేయబోతున్నారు. కాంగ్రెసు ఇతర 'ప్రజాస్వామిక' పక్షాలను కూడగట్టటానికి చేస్తున్న ప్రయత్నాలేవీ సరిగా కలిసిరావటంలేదు. మెజారిటీ పార్టీ నాయకుడయిన తననే మంత్రివర్గ నిర్మాణానికి పిలవాలని సంజీవరెడ్డిగారు ఎన్నోసార్లు ప్రకటించినప్పటికీ, పార్టీ 'సహసభ్యుడు' మాత్రమే అయిన ప్రకాశంగారినే గవర్నరు ఆహ్వానించారు. ప్రజా సోషలిస్టుపార్టీ కేంద్ర కార్యవర్గ అభిప్రాయానికి విరుద్ధంగా ప్రకాశంగారు వ్యవహరించదలచి పార్టీనుంచి బయటికి వచ్చికూడా, ఆపార్టీ తోడ్పా

టుకోసం విశ్వనాథంగారిని మంత్రిగా వేసుకున్నారు. అయితే విశ్వనాథంగారి అర్హతలను పార్టీ కార్యవర్గ విజయనగరంరాజా సవాలు చేస్తున్నారు. ఇది ఆపార్టీని మరింత చీలదీసింది.

కృషికార్లోక్ పార్టీతో వెనక అవిభక్త మద్రాసు ఎసెంబ్లీలో రాజాజీ వెలిగించిన ఆశలు వెళ్ళబోద్దామని ఆంధ్ర కాంగ్రెసు నాయకులు ప్రయత్నించగా అది బెడిసి కొట్టింది. అధిక సంఖ్యాకులు కాంగ్రెసును ప్రతిఘటించ టానికీ, గుంటూరు రాజధానిని సమర్థించటానికీ నిశ్చయిం చారు. పార్టీనుంచి వెలివేయబడ్డ తిమ్మారెడ్డిగారికి, సంజీవ రెడ్డిగారు మంత్రిత్వ మిప్పించటంవల్ల ఆ మంత్రివర్గ నిలకడకు ఏవిధంగా ఉపకరించిందో సంజీవ రెడ్డిగారే చెప్పాలి.

కాంగ్రెసులోకూడా అనుమానాలు రావటంవల్లనో ఏమో, సర్కార్ల వాడయిన పట్టాభిరామారావుగారిని కూడా మంత్రిగా తీసుకున్నారు. ఎసెంబ్లీ సమావేశం నవంబర్ 23 నే. ఈలోపల హడావుడిగా వాటికీ వీటికీ డబ్బు ఖర్చుపెట్టటంకన్నా, కర్నూలు విషయమై స్థిరనిశ్చయాన్ని మంత్రివర్గం చేసుకుంటేనే లాభకరం.

* * *

గత నెల మూడో వారంలో తమిళ కాంగ్రెసు సోద రుల కరుణా కటాక్షంవల్ల అధికారంలోనుంచి కూలదోయ బడ్డ తిరువాన్‌కూర్. కొచ్చిన్ కాంగ్రెసు ప్రభుత్వం, ప్రతి పక్షానికి అవకాశం ఇవ్వకుండానే రాజప్రముఖ్ చేత శాసన సభను రద్దు చేయించింది. తన అధికారం నెగ్గినంతకాలమూ అది ప్రజలు ప్రజా స్వామ్య పద్ధతిలో ఎన్నుకున్న ప్రజా ప్రతినిధి సభ అయింది. తాను వోడిపోగానే అది ఎందుకూ పనికిరానిదయి, 144 వ సెక్షన్‌ను ధిక్కరించే జనసమూ హంతో సమానం అయిపోయింది. తమాషా ఏమిటంటే తననే ఎన్నుకున్న శాసనసభని రద్దుచేసి, తానే అధికారం చెలాయిస్తున్నది.

తనని దిగలాగిన శాసనసభల మీద కాంగ్రెసు ప్రభుత్వం 144 వ సెక్షన్ ప్రయోగించటం ఇది మొదటిసారి కాదు. పెప్సూలో ఇట్లాగే చేసింది. తూర్పు పంజాబులో అధి ష్ఠాన వర్గానికి ప్రతికూల మంత్రి వర్గం— కాంగ్రెసు పేరు తోనే ఉన్నప్పటికీ— ఏర్పడగా దానిని తొలగించటానికి కేంద్రపాలన ఏర్పాటయింది. హైదరాబాదులో ఇదే పరి స్థితి ఏర్పడేట్లు కనిపిస్తున్నది.

ప్రతికూల పక్షాలు సరికి సరిగా ఉన్నచోట్ల కాంగ్రెసు ధైర్యంగా ప్రజాస్వామిక పద్ధతులను అవలంబించలేకపో తున్నది. ఎదటి వాళ్ళు ఒక్కసారి అధికారంలోకి వస్తే తన పని సున్నా అవుతుందని భయపడుతున్నది. నామి నేటెడ్ ముఖ్యమంత్రుల ద్వారానయినా అధికారం సంపా దించి, దానితో ఎదటి పక్షాలను చీలదీయటానికి ప్రయత్ని స్తున్నది. మద్రాసులో యు. డి. ఎఫ్. ను చీల్చినట్టుగా కేరళలో యు.డి.యఫ్. ను చీల్చ ప్రయత్నించిందికాని సాగలేదు. ప్రజాసోషలిస్టులు యు.ఎల్.ఎఫ్. తో సహాయ నిరాకరణ చేయలేదు. ప్రపంచంలో ఎక్కడయినా సోష లిస్టులు ఇతర వామ పక్షాలలో కలిసినప్పుడే నిజమయిన పని చేయగలరని తిరువాన్కూర్ కొచ్చిన్‌లో మరొకసారి నిరూపించబడ్డది.

* * *

హైదరాబాదులో భారతసేనల సాయుధబలంతో గద్దె ఎక్కిన కాంగ్రెసు ప్రభుత్వంపని దినదిన గండంగా ఉన్నది. మంత్రివర్గానికీ, రాష్ట్రకాంగ్రెసు సంఘానికీ పేచీలు అంత కంతకూ పెరిగిపోతున్నవి. అధ్యక్షుడు రామానందతీర్థ వర్గం కమ్యూనిస్టుల అభిమానులని మంత్రివర్గ పక్షం ఆరో పిస్తున్నది. మంత్రివర్గంలో స్వార్థపరత్వం, అధికారదుర్వి నియోగం తప్ప మరేమీ లేవని రాష్ట్రకాంగ్రెసు పక్షం ఆరో పిస్తున్నది. కొందరు మంత్రులను తొలగించటం జరిగినప్ప టికీ, వారు కొంతవరకూ రాష్ట్రకాంగ్రెసును సమర్థించే వాళ్ళే అయినారు.

ఇంతలో పరిస్థితులు మరీ విషమించి స్వామీరామానంద తీర్థ అధ్యక్షపదవికి రాజీనామా ఇవ్వకపోతే కాంగ్రెసు ప్రభుత్వం నిలవలేదని 40 మంది కాంగ్రెస్ ఎం.ఎల్.ఏ. లు కాంగ్రెస్ అధిష్ఠాన వర్గానికి దరఖాస్తు పెట్టుకున్నారు. దానిమీద దర్యాప్తులు, సంప్రదింపులు సాగుతున్నవి. ఈ తగాదా విషమిస్తున్న సమయంలోనే హైదరాబాదు భూ సంస్కరణల బిల్లుమీద కాంగ్రెసు సభ్యుల్లో చాలామంది

అధికారసైఖరిని తాము ఆమోదించలేమని చెప్పటం గమనించ తగిన సంగతి.

ఇవి వ్యక్తుల స్వార్థానికి సంబధించినవి కనుక, ఈ వివాదాలు ముదిరితే, కాంగ్రెసు మంత్రివర్గం నిలబడే సంగతి అనుమానాస్పదమే అవుతుంది. హైదరాబాదు ప్రజాసోషలిస్టులు తిరువాన్కూరు వాళ్ళవలె చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకునేందుకు ప్రయత్నించక, ముందే జాగ్రత్తపడితే తమ ప్రజలకు గొప్ప సేవచేసినవాళ్ళవుతారు.

* * *

తమకు పోయేదేమీ లేనంతవరకూ ధర్మ పన్నాలు చెపుతూ, నష్టం వస్తుందన్నప్పుడు న్యాయాన్నీ, ధర్మాన్నీ బుట్టదాఖలు చేయటమన్నది ఒక్క భారత కాంగ్రెస్ లోనేకాక, కాంగ్రెసుకు ఆదర్శ ప్రాయమయిన బ్రిటిష్ ప్రజాస్వామిక వ్యవస్థలోనూ కనిపిస్తున్నది. మలయాలో ప్రజలకు స్వపరిపాలన, ప్రజాస్వామిక వ్యవస్థలను సక్రమ మార్గంలో అందజేయటానికే ప్రయత్నిస్తున్నాననీ, ఆ మార్గాలకు అంతరాయం కలిగిస్తున్నందుకే కమ్యూనిస్టులతో పోట్లాడుతున్నాననీ చెపుతున్న బ్రిటన్, తన అధికారం క్రింద, తను చెప్పిన ప్రజాస్వామిక పద్ధతిలో ఎన్నికయిన బ్రిటిష్ గయానా ప్రభుత్వం సోషలిస్టు పంథాలో నడవబోయేటప్పటికి దానిని కూలదోసింది.

బ్రిటిష్ గయానా దక్షిణ అమెరికాలోని బ్రిటిష్ వలస రాజ్యం. అక్కడ చెరుకుతోటలు, పండ్లతోటలు అల్యూమినియం గనులు ఉన్నవి. జనాభాలో భారతదేశం నుంచి వెళ్ళినవాళ్ళు, నీగ్రోలు, తెల్లవాళ్ళు బహు కొద్దిమంది మిశ్రమజాతులు ఉన్నారు. పరిశ్రమలు ముప్పాతిక మువ్వీసం బ్రిటిష్ పెట్టుబడిదార్ల చేతుల్లో ఉన్నవి. బ్రిటిష్ వలస మంత్రి లిటిల్‌టన్‌కు కూడా అక్కడ పెద్ద ఆస్తిపాస్తులున్నట్లు ప్రతీతి. బ్రిటిష్ అధికారులు అక్కడ కీలుబొమ్మ పార్టీలనూ, కీలుబొమ్మ రాజకీయ పార్టీలనూ పెట్టి నాటకం ఆడుతూ వుంటారు. ఇట్లాగే డచ్చివాళ్లు డచ్చిగయానా (సురినాం)లోనూ, ఫ్రెంచివాళ్ళు వాళ్ళ వలసల్లోనూ, అమెరికా ఈ అన్నిప్రాంతాలలోనూ గూడుపుఠానీలు జరుపుతూ వాటి సంపదలను దోచుకుంటున్నవి.

చివరకు ఈ దోపిడీదార్లు నలుగురు కలిసి ఉమ్మడిగా దోపిడి జరిపి, స్థానిక ప్రజలను అణచివుంచటానికని కారిబియాన్ ప్రాంత కమిషన్ అని ఒక వ్యవస్థను ఏర్పాటుచేయటానికి 1944 లో ప్రయత్నించారు. ఆ ప్రాంతానికే చెందిన క్యూబా, హైతీ, డామినికన్ రిపబ్లిక్‌లకు అందులో స్థానం ఇవ్వలేదంటే ఈ దోపిడీ దార్ల కమిషన్ ఎటువంటిదో ఊహించుకోవచ్చు. కాని వాళ్ళలో వాళ్ళకే పడక ఈ కమిషన్ పని సాగలేదు. ఈలోపుగా ప్రజల్లో అశాంతి పెరిగిపోయింది. డచ్చిగయానాలో సాయుధ విప్లవంకూడా జరిగి అణచివేయబడ్డది. బ్రిటిష్ హాండ్యురాస్ తమకు చెందాలని గ్వాటిమాలా పేచీ పెట్టింది.

అందువల్ల బ్రిటన్ తన వలసలు చేయి జారకుండా చేసుకునేందుకు కారిబియాన్ ఫెడరేషన్ అనే దానిని— మధ్య ఆఫ్రికా ఫెడరేషన్ పద్ధతిలో— ఏర్పాటుచేయ ప్రయత్నించింది. కాని హాండ్యురాస్ మొదలైన ప్రాంతాలు, సహకరించలేదు. అందువల్ల ఇక చేసేది లేక, కీలుబొమ్మ పార్టీలే గెలుస్తవనే ఆశతో పార్లమెంటరీ రాజ్యాంగం స్వపరిపాలన అనే నాటకం ప్రారంభించింది.

అయితే క్షణక్షణానికీ మారిపోతూన్న ఈప్రపంచంలో మసులుతున్న గయానా ప్రజలు బూటకపు పార్టీలేవో, నిజమయిన మిత్రులెవరో గ్రహించి, పీపుల్సు ప్రొగెసివ్ పార్టీని అధిక మెజారిటీలో ఎన్నికయినారు. ఈ పార్టీని భారతీయ జాతీయుడు డా॥ చెడ్డీజగన్, ఆయన భార్య చాలా పైకి తీసుకునివచ్చారు. జగన్ ప్రధానిగనూ, ఆపార్టీ ప్రముఖులు మంత్రులుగనూ, ఎన్నికై బ్రిటిషు అధికారుల నాటకాన్ని భగ్నంచేశారు.

వీళ్ళయినాకూడా అతివాద సంస్కరణలేమీ ప్రవేశ పెట్టలేదు. బ్రిటిష్ అధికారులు సృష్టించిన బూటకపు కార్మికసంఘాలకు బదులు నిజమయిన సంఘాలు ఏర్పడేందుకు చర్యలు తీసుకున్నారు. అభిప్రాయ ప్రకటనకుకూడా సరిగా అవకాశం ఇవ్వని వెనకటి పద్ధతులను మార్చటానికి ప్రయత్నించారు. తెల్లజాతీయుల అక్రమాలకు స్వస్తి చెప్ప ప్రయత్నించారు. ఆవెంటనే బ్రిటన్ యుద్ధనౌకలనూ, సేనలనూ పంపి, వాళ్ళను అధికారంలోనుంచి తొలగించి,

తానే పెద్ద ఆడంబరంగా ప్రవేశపెట్టిన ప్రజాస్వామిక రాజ్యాంగాన్ని 'తాత్కాలికంగా, రద్దు చేసింది.

బ్రిటన్ చర్యను గురించి వివరించటానికి బ్రిటిష్‌వారి పక్ష సోషలిస్టు బెవాన్ దానిని నిరసిస్తూ చెప్పిన ఈమాటలు చాలు— "మీ ఇష్టం వచ్చిన ప్రభుత్వాన్ని మీరు ఏర్పాటుచేసుకోవచ్చు. అది మాకు ఇష్టంలేని మర్నాడే యుద్ధ నౌకల్ని పంపి దానిని లాగిపారేస్తాం" కామన్వెల్తు విధానంలో టోరీలు ప్రవేశపెట్టిన సూత్రం ఇది.

అయితే లేబర్ ప్రభుత్వ విధానంకూడా ఇదేనని ఆఫ్రికా ప్రజలందరికీ తెలుసు.

* * *

కొరియా సమస్య బహు సున్నితంగా నడుస్తున్నది. ఇండియా పుణ్యాన అని స్వదేశాలకు పోవలచిన యుద్ధ ఖైదీలు స్వదేశాలకు వెళ్ళకలిగారు. అయితే తమను పట్టుకున్న వాళ్ళ ప్రచారంవల్ల మనసు మారిపోదలచని వాళ్ళను స్వపక్షాలు నచ్చచెప్పే కార్యక్రమానికి మాత్రం చాలా ఆటంకాలు కలుగుతున్నవి. మిత్రరాజ్యాధికారులు తమ దగ్గరి ఖైదీలకు యుద్ధ విరమణ ఒప్పందాన్నికూడా సరిగా తెలియచేయలేదు. తటస్థరాజ్యాల సంఘం తెలియజేయగా, దానిమీద తీవ్రంగా విమర్శించారు. ఖైదీలతో స్వపక్షం వాళ్ళు మాట్లాడే కుటీరాలు వేయటానికే ఎంతో ఆలస్యం చేసి, చివరకు ఆపని కమ్యూనిస్టులకు అప్పజెపుతామని బెదరించగా దానిని పూర్తి చేశారు. నచ్చచెప్పటం ఆలస్యం అయింది కనుక గడువుకూడా ఆవారం పెంచమని సూచించగా ఒప్పుకోలేదు. మనసుమళ్ళ మార్చుకుని స్వదేశాలకు వెళ్ళిన ఖైదీలు చాలామంది మిత్రరాజ్యాధికారుల మద్దత్‌తో సింగ్మన్‌రీ ప్రతినిధులు తమను బెదరించినట్లు వెల్లడించారు.

తటస్థ సంఘాధ్యక్షత వహించిన భారత ప్రతినిధి లెఫ్టినెంట్ జనరల్ తిమ్మయ్యాని నిష్పక్షపాత వైఖరి, భారత సేనల ఓర్పు, ఖచ్చిత పద్ధతి మిత్రరాజ్యాధికారులకు రుచించక అనేక విమర్శలను చేస్తున్నారు. అనేక ఆరోపణలు చేస్తున్నారు, అమెరికా ప్రభుత్వంకూడా వీటికి పక్కతాళం వేస్తున్నదికాని మిగిలిన పశ్చిమ రాజ్యాలన్నికూడా తటస్థసంఘాన్ని, భారత సేనలనూ ప్రశంసిస్తున్నవి. కమ్యూనిస్టు ప్రతినిధులతో మాట్లాడేది లేదని మొండికెత్తిన చైనా ఖైదీలకు శాంతంగా సంగతులు తెలియజెప్పి, బలప్రయోగం చేయకుండానే వారిని హాజరు పరచగలిగి, భారత సేనలు భారత ప్రధాని ఆదేశాల్ని సఫలం చేయకలిగినవి. ఉత్తర కొరియన్లతో పేచీగా ఉన్నదికాని వాళ్ళుకూడా దారికి వచ్చే అవకాశం ఉన్నది.

కొరియా రాజకీయ సమావేశపు ఏర్పాట్లను గురించి ఉభయ ప్రతినిధులు పాన్‌ముంజాన్‌లో చర్చించటానికి అంగీకరించారు.

♦ ♦ ♦

ఇస్రేల్ మధ్యనూ, అరబ్ రాజ్యాలమధ్యనూ, మళ్ళీ కలహం బయలు దేరుతున్నది. జోర్డాన్ సరిహద్దులమీద ఇస్రేల్ అకారణంగా దాడిచేసినట్లు సమితి పర్యవేక్షణ ఉద్యోగి ప్రకటించాడు. దీనిని సర్దుబాటు చేయటానికి అవకాశం లేకపోలేదుకాని, అమెరికా వైఖరి ఎట్లా ఉంటుందో తెలియదు. పర్షియాలో తమ కుట్ర నెగ్గి మొసాదిక్ పడిపోయినాడు గనుక, తమకు అరబ్బుల అవసరం తగ్గిందని అమెరికా భావించి వుండవచ్చు. లేకపోతే, దూర ప్రాచ్యంలోనూ, అగ్రనాయక సమావేశం విషయంలోనూ తనతో బ్రిటన్ పూర్తిగా సహకరించనందుకు కోపంతో బ్రిటన్ మిత్రులయిన అరబ్ దేశాలమీదికి ఇస్రేల్‌ను ఉసికొల్పి ఉండవచ్చు.

ఏది ఎట్లా ఉన్నా పశ్చిమరాజ్యాల కీలుబొమ్మలని చెప్పుకోతగ్గ అరబ్, ఇస్రేల్‌ల వ్యవహారం వాళ్ళ ఇష్టానికి వ్యతిరేకంగా మాత్రం సాగదు.





మూలం : ద్విజేంద్రలాల్ రాయి. అనువాదం : శ్రీమతి మాణిక్యవల్లి.

—— : o : ——

[వెనుకటి గాథ: మొగలు ఆధిపత్యాన్ని గురించి, మొగలులతో యుద్ధాన్ని తప్పించాలని మేవాడ్ రాణా అమరసింహుడు చేసిన ప్రయత్నం విఫలమవుతుంది. రాజపుత్రుల్ని చిటికలో జయిస్తానని ఉత్తర కుమార ప్రజ్ఞలు పలికిన మొగలు సేనాధిపతి హిదాయతుల్లాకు యుద్ధంలో చావు తప్పి కన్నులొట్ట పోతుంది. అమరసింహుని పెత్తండ్రి సగరసింహుని ఢిల్లీ చక్రవర్తి మేవాడ్ రాణాగా చిత్తూరు పంపిస్తాడు. రాజకుమారి మానసి, అజయసింహులు సమావేశం కావడానికి రాణి అభ్యంతరం చెబుతుంది. తిరిగి మేవాడ్ పైకి శత్రు సేనలు వస్తాయి. పెత్తండ్రి కుమార్తె సత్యవతి రాణాకు తన్ను తను తెలుపుకొని యుద్ధానికి విముఖంగా వున్న రాణా మనస్సు మారుస్తుంది. మేవాడ రాణాగా చిత్తూరు వెళ్ళిన సగరసింహుడు పురాతనమైన చిత్తూరు దుర్గంలో వుండలేక ఒక అర్ధరాత్రి తన పూర్వుల భూతాలను చూసినట్టు భ్రమించి మూర్ఛపోతాడు. రాకుమారి మానసి తను వివాహ సూత్రంలో తన జీవితాన్ని బంధించుకోలేనని తన ప్రేమ పరిధి అంతకంటె విశాలమైనదని, పెండ్లికి తన విముఖతను రాణీకి తెలియపరుస్తుంది. గోవిందసింహుడు కల్యాణిని మహాబత్‌ఖాను ఆమె భర్తగా తలంచ వద్దంటూ మహాబత్ ఖానుని ఆమెను కూడా తూలనాడుతాడు. కాని పతివ్రతా ధర్మం అంటూ గోవిందసింహుని దృష్టిలో మహాబత్‌ఖా ఎటువంటివాడైనా తనకు మాత్రం హిందువుడైనా, మహమ్మదీయుడైనా, నాస్తికుడైనా, పూజ్యుడేనని వాని ననుసరించ వలసిందే అని అంటుంది కల్యాణి. దానికి గోవిందసింహుడు ఆగ్రహ పరవశుడై ఆ క్షణము నుండి ఆమె ఇష్ట మొచ్చిన చోటికి వెళ్ళవచ్చునని, భర్త దగ్గరకే వెళ్ళమంటాడు. కల్యాణి తండ్రికి నమస్కరించి, తండ్రి దగ్గర సెలవు తీసుకుంటుంది. అజయసింహుడు గోవిందసింహుని వారించ ప్రయత్నిస్తాడు కాని లాభం లేకపోతుంది. కల్యాణిని ఒంటరిగా వదలలేక ఆమెతో పాటు అజయసింహుడు కూడా గోవిందసింహునికి నమస్కరించి వెడలిపోగా గోవిందసింహుడు స్థాణువులా నిలిచిపోతాడు. ఇక చదవండి]

## తృతీయాంకం.

### మొదటి రంగం.

ఉదయపుర రాజసభ . ప్రాతఃకాలం.

(సామంతులు నిల్చుని ప్రవేశిస్తారు)

జయసింహుడు : కామనేరక యుద్ధం చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయ దగినది.

గోకులసింహుడు : శత్రు స్థావర దిగ్బంధనం తిరుగు లేకుండా పని చేసింది.

భూపతి : వాళ్ళకి ఆ అడవి మార్గం తెలియదనుకుంటాను.

గో : పలాయన మార్గం మాత్రం చక్కగా తెలిసింది.

జ : ఇది మేవాడ్‌కు సుదినం. పర్వతాలన్నింటికీ క్రొత్త కళ వచ్చింది.

భూ: ఈ విజయ వార్తను మలయా నిలుడు భారత దేశమంతటా చాటుతున్నాడు.

(అమరసింహుడు ప్రవేశిస్తాడు)

అందరూ : జై ! అమరసింహ రాణాకీ జై !

# మేవాడ్ పతనం

(రాణా సింహాసనాధిష్ఠుడౌతాడు. సత్యవతి వస్తుంది)

రా : రా, సోదరీ, (లేచి స్వాగతం యిస్తాడు)

స : నేడు పర్వదినం మహారాజ్, మనకు.

రా : ఏం పర్వమో. (నిట్టూర్చి) సత్యవతీ, కామనేరకలో విజయం పొందింది మనం కాదు సుమా?

స : మొగలు లంటారా!

రా : అవ్వే, రాజపుత్రులే. కాని మనం అంటే ప్రస్తుతం విజయోత్సవాలు జరుపుకునేవాళ్లు మాత్రం కాదు. విజయ రమ నందుకొన్నవారంతా అక్కడే కన్నుమూశారు. రణ రంగం ముఖమైనా చూడనివారు విజయ భేరీలు మ్రోగించి వుత్సవం జరుపుతున్నారు. విజయ సాధకులలో కనీసం ఒక్కరైనా విజయోత్సవం చూడ నోచుకోలేదు.

స : నిజమే మహారాజ్. పరమేశ్వరుడు శాశ్వత కీర్తి చేవారి ననుగ్రహించుగాక! ఒక శుభవార్త, మహారాజ్.

రా : సత్యవతీ___

స : నాన్నగారు చిత్తూరు దుర్గం మీపరం చేశారు మహారాజ్.

రా : నే వింటున్నది నిజమే సత్యవతీ?

స : ముమ్మాటికీ మహారాజ్.

రా : చక్రవర్తి ఆజ్ఞయా?

స : ఆహాఁ. నాన్నగారే ఐచ్ఛికంగా ఆపని చేసి ఆగ్రా వెళ్ళి పోయారు.

రా : (సామంతుల దిక్కై.) విజయనాదం చేయండి. స్వర్గీయ బాపూజీ స్వప్నం నేటికి ఫలించింది. వారి కొడుకు బాహు బలం సాధించలేని దానిని వారి సోదరుని ఔదార్యం ప్రసాదించింది. క్రొత్త సేనను సిద్ధపరచి దుర్గం స్వాధీనం చేసుకోండి. కోట వశం కానిదే వెనుదిరుగవద్దు.

స : జై! మేవాడ్ రాణాకీ జై!

## రెండవ రంగం

ఒక గ్రామం పొలిమేర. సాయంకాలం.

(కల్యాణి, అజయసింహులు ప్రయాణిస్తుంటారు)

క : అన్నయ్యా, కాళ్ళు లాగుతున్నాయి.

అ : ఈపూట కిక్కడ ఆగుదాం. అదుగో, యేదో గుడిసె కనిపిస్తోంది. లోపల యెవరూ లేరేమో చీకటిగావుంది.

క : కొంచెం పిలిచిచూడు.

అ : ఎవరు వారు? లోపల యెవరూ లేరా?

క : ఎవరూ లేనట్టున్నారు.

అ : సరే, నువ్విక్కడే వుండు, వూళ్ళోకి వెళ్ళి దీపం తీసుకొస్తాను.

క : నేనూ వద్దామంటే యింక నడిచే ఓపిక లేదు. అన్నయ్యా, దాహ మేస్తోంది.

అ : వచ్చేటప్పుడు మంచి నీళ్ళు, తినుబండారాలు కూడా తెస్తాను.

క : త్వరగా రా అన్నయ్యా, నాకు భయమేస్తుంది.

అ : ఏం భయంలేదు. చిటికెలో వస్తాను.

(వెడతాడు)

క : అబ్బా, కాళ్ళు రక్తాలు దిగిపోయాయి. ఎప్పుడైనా నడిచి యెరుగుదును కనకనా. కాని కోరి వరించిన యీ శ్రమ సౌఖ్యంగా వుంది. సాగర సంగమాసక్తయయిన నదిలా పురోగమిస్తున్నాను. వారి దాసిగానైనా జీవించే భాగ్యముందోలేదో! ఎవరక్కడ?

(ఫకీరు వేషంలో నున్న సగరసింహుడు ప్రవేశం)

స : నేనొక రాజపుత్రుణ్ణమ్మా. భయపడకు. చూస్తే రాజపుత్ర స్త్రీలా వున్నావు. ఒంటరిగా వున్నావేమమ్మా?

క : మా అన్నయ్య యిప్పుడే అలా వూళ్ళోకి వెళ్ళాడు. ఈపాటికి తిరిగి వస్తూ వుండాలి.

స : ఇక్కడ మొగలు సైనికుల దురంతాలు యెక్కువగా వున్నాయి. ఇప్పుడు కొందరెవరో అలా వెళ్ళారు. మీ అన్నయ్య వచ్చేవరకూ నీ రక్షణ భారం నేవహిస్తాను.

తెరలో (ఈ పాత యింట్లోనా?)

ఆఁ. అక్కడే.

క : ఎవరువారు?— అన్నయ్యా! అన్నయా!

(ముగ్గురు దొంగలు ప్రవేశిస్తారు)

మొ. దొంగ: ఇక్కడ, యిక్కడ.

రెం. దొంగ : పట్టుకోండి.

(దొంగ కల్యాణిని పట్టుకోబోగా 'రక్షించ'మని ఆర్తనాదం చేస్తుంది. ఇంతలో సగర సింహుడు ముందుకు వస్తాడు.)

స : ఆగండి.

మొ.దొం : అదెవరు?

రె.దొం : ఎవరయితే యేం. ముందు వీన్ని చంపు. (సగర సింహుడు దొంగలతో కలియబడి పోట్లాడుతూ పడి పోతాడు)

క : అన్నయ్యా! అన్నయ్యా!

(అజయసింహుడు సమీపిస్తాడు)

అ : భయంలేదు కల్యాణీ, నే వచ్చాను. (కత్తితీసి దొంగలతో తలపడి వాళ్ళను పడగొడతాడు)

అ : వీళ్ళ పనయింది, వారెవరు?

క : వారెవరో నా రక్షణార్థం వీరితో పోరాడి గాయపడ్డారు.

స : మీరెవరు?

అ : గోవిందసింహుని బిడ్డలం. ఇది నా చెల్లెలు కల్యాణి.

స : ఏమీ, యీ సౌభాగ్యవతి నా కోడలా?

అ : వీరవర్యా, తమరు పూజ్యులైన సగరసింహులా, గుర్తుపట్టలేపోయాను.

## మూడవ రంగం

జోధపుర సౌధం – సమయం: ఉదయం.

(మాళవపతి గజసింహుడు, యువరాజు అమరసింహుడు, హరిదాసు, దూతవేషంలో అరుణసింహుడు కూర్చుని వుంటారు)

గ : (అరుణునితో) ఈ వివాహం మాకు సమ్మతంకాదు. చక్రవర్తి విద్రోహులతో సంబంధం పెట్టుకోడం మాకిష్టం లేదని చెప్పు. ఏం హరిదాసజీ?

హ : అవశ్యమంతే.

అ : మా మహారాణా విద్రోహి యెల్లా అయ్యారు? స్వాతంత్ర్య పరిరక్షణ విద్రోహం కాదే.

గ : ఆహం. అది విద్రోహమే. రాజపుటానా యావత్తూ చక్రవర్తికి వినమ్రంకాగా ఒక్క మేవాడ్ యెందుకు లొంగకపోవాలి?

అ : ఓహో, అర్థమయింది. స్వతంత్రంగా బ్రతికే గౌరవం ఒక్క మేవాడ్ కే దక్కింది. ఇతర రాజపుత్రులకు లేని ఆధిక్యం మేవాడ్ రాణా సొమ్మయింది. వారి శిరస్సు మాణిక్య మకుట మండితమై విలసిల్లుతున్నది. ఇది చూసి మహారాజుకు కన్ను కుడుతున్నట్టుంది. కాని రాణాజీకి అలాంటి అహంభావం యే కోశానా లేదు. వారు మీ సుహృద్భావాన్నే కాంక్షిస్తున్నారు.

గ : ఇక కట్టిపెట్టు. రాణా వట్టి మూర్ఖుడు, గర్వి, ఉన్మత్తుడు. లేకపోతే గుప్పెడు సేనతో మొగలు సామ్రాట్టు కెదురునిలుస్తాడా? ఎవరిపిచ్చి వారి కానందంలే?

అ : బాగా చెప్పారు! మీరు వర్ణించిన ఉన్మత్తలే రాణాజీకాభరణం. ఆపాత్ర నిర్వహించగల శక్తి మీలో పూజ్యం.

గ : ఏయ్, ఏమిటా ప్రలాపాలు? నిన్ను చంపకూడదు కాని—

అ : దూతను వధించరాదనే ధర్మసూత్రం తెలుసునే మీకు! ఇకనేం! ఇంతటి ధర్మం మీ నోట పలకడం విశేషమే!

గ : ఊరుకున్నకొద్దీ తాడెక్కుతున్నాడే. ఇక నీవు పోవచ్చు. మాకా సంబంధం అక్కర్లేదని మీ రాజుతో చెప్పు.

అ : ఓ అవశ్యం వెడతాను. కాని ఒక్కమాట. చక్రవర్తి పక్షాన మీరు దక్షిణాన్ని అనేక యుద్ధాలు చేశారుట. మేవాడ్ కూడా రాదలచారని విన్నాను. అంచేత మిమ్మల్ని ముందుగానే ఆహ్వానిస్తున్నాను.

(వెళ్ళిపోతాడు)

గ : ఆగు. ఒంటరిగా యెందుకు. అందరూ కలిసే వెళ్ళొచ్చు.

అ : ఖైదు చేస్తారా?

గ : అవును— అవురా, వీణ్ణి బంధించి తీసుకుపో.

అ : మాతను అత్యాచారం చేయడం క్షత్రియ ధర్మ విరుద్ధం, నాన్నగారూ.

గ : నువ్వు నాకు ధర్మోపదేశాలు చెయ్యక్కర్లేదోయ్, చెప్పినట్లు చేయ్.

అ : అధర్మమైన ఆజ్ఞను పాలించలేను.

గ : చాలావరకు ముదిరిందే స్వైరవిహారం. ఫలితాన్ని వూహించుకున్నావా? నా ఆజ్ఞ ధిక్కరించిన వారు నా సింహాసనాని కర్హులు కారు.

అ : శుభం. మొగలుల పాద దళితమైన మీ సింహాసనం నా కక్కర్లేదు. వారి చెప్పుల మోతే తప్పుతుంది అది పోతే.

గ : మంచిది. నిన్ను నా రాజ్యం నుండి బహిష్కరిస్తున్నాను.

అ : తక్షణం వెళ్ళిపోతున్నాను.

(వెడతాడు)

గ : (కొంతసేపటి తరువాత అరుణునితో) నీవు వెళ్ళవచ్చు.

## నాలుగవ రంగం

మహబత్ ఖా భవనం. రాత్రిసమయం.

మ : పరిత్యాగమైతే చేశానుకాని పూర్తిగా మరిచిపో సాధ్యం కావడం లేదు. ప్రేమ విహ్వలమైన ఆ లేత ముఖం కళ్ళకు కట్టినట్టుంది. ఒక అమూల్య నిక్షేపం చేయిజారినట్టుంది. ఉత్తరం తిరగొట్టేశాను. అయ్యో, యెంతపని చేశాను! మా కత్తులమధ్య ఆమె సుకుమార జీవితం రెండావుల మధ్య లేగలా నలిగి పోతోంది. తండ్రిపై కోపం కూతురిపై చూపి పవిత్ర ప్రేమ కపరాధం చేశాను. చేతికందిన అమృతం జారవిడుచుకున్నాను. అవకాశమే లభిస్తే క్షమా భిక్ష వేడుకుంటాను. ఎవరక్కడ?

(సేవకుడు ప్రవేశిస్తాడు)

సేవకుడు : గజసింహ మహారాజు తమ దర్శనార్థం వచ్చారు, ప్రభూ.

మ : ఇలా పంపు.

(సేవకుడు వెడతాడు)

మ : ఈయనకు నాతో యేం పని చెప్మా? పిరికిపంద! అధముడు! మొగలుల బానిస! అదుగో వచ్చారే.

(గజసింహుడు ప్రవేశిస్తాడు)

గ : నమస్తే.

మ : ఊరకరారు మహాత్ములు. తమ రాకకేదో కారణ ముండాలి.

గ : నే రాలేదు. చక్రవర్తి పంపించారు.

మ : తిరిగి వెనుకటి సందేశమేనా?

గ : అవును.

మ : మేవాడ్‌కు విరుద్ధంగా అస్త్రం పట్టనని వారితో యెన్నోసార్లు చెప్పానే. పదేపదే నాచే కాదనిపించడం దేనికో.

గ : చక్రవర్తి సైన్యం మేవాడ్‌లో ప్రతిసారీ దెబ్బతింటూంది. అంచేత వారికి కించ పట్టుకుంది. గత్యంతరం లేక మిమ్మల్ని అడుగుతున్నారు. వారి అవమానం బాపగల వీరులు మీరే.

మ : ఆమాట మీరెలా చెబుతారు?

గ : అది అందరికీ తెలుసు జనాబ్.

మ : ఉఁ. (పచారు చేస్తూ వుంటాడు)

గ : సందేహించకండి ఖాసాహెబ్. మేవాడ్ మీ జన్మ భూమి కావచ్చు; అమరసింహుడు మీ సోదరుడు కావచ్చు. కాని మీరు వారిని విడిచి చాలా కాల మయింది. స్వమత పరిత్యాగంతో మాతృదేశంతో కల స్వల్ప సంబంధం కూడా తెగిపోయింది. ఇంక దానిపై దండెత్తడానికి వెనకడీయడ మెందుకు?

మ : (లోలోపల) మేవాడ్ నా జన్మభూమి కాకపోతే బాగుండిపోను!

గ : ఇంకా ఆదేశం మాదేనని వెర్రిపడకండి. రాజపుత్రు లందరూ మిమ్మల్ని విద్రోహిగా పరిగణిస్తారు. సమర సన్నద్ధులై రావద్దు. ఒక్కసారి చుట్టం చూపుగా వెళ్ళి

చూడండి. నిజ పరిస్థితులు బోధపడతాయి. 'అదిగో మతాంతరుడైన మహీపతి' అని మేవాడీయులు వేలెట్టి చూపిస్తారు. వృద్ధులు యేవగింపుతో ముఖం ముడుచుకుంటారు. యువకులు చూపుల్లో నిప్పులు చెరుగుతారు. స్త్రీలు మీ గాలినైనా సోకనివ్వరు. ఖాసాహెబ్ రాజపుత్రులు మిమ్మల్ని తోటి సోదరులుగా చూస్తారనడం కల్ల. వెర్రిభ్రమ పెట్టుకోకండి.

మ : ఉస్. (ఆలోచిస్తూ వుంటాడు)

గ : మీకు వాస్తవమైన సన్నిహితులు మొగలులే. మీ వృద్ధిక్షయాలు వారి వృద్ధిక్షయాలపై ఆధారపడి వున్నాయి. ఆలోచించండి ఖాసాహెబ్.

(సన్యాసి వేషంలో సగర సింహుడు వస్తాడు)

స : మహాబత్!

మ : ఎవరు? నాన్నగారా! ఈవేషం యేమిటి?

స : సన్యసించాను.

మ : కారణం?

స : పరివర్తన. ఇంతవరకూ దేశానికి, జాతికి, ధర్మానికీ కాకుండా పోయాను. జీవితం అధికభాగం విజాతీయుల దయాధర్మ భిక్షంపై గడిపాను. ఇప్పుడు ఆఖరు ఘడియల్లో కళ్ళు తెరిచాను.

మ : నాన్నగారూ—

స : ఇంతకాలానికి మాతృదేవి పిలుపు వినపడింది. ఆ గద్గద స్వరంలోని గాంభీర్యం, కరుణ నీవు వూహించనైనా లేవు మహాబత్.

మ : నాన్నగారూ—

స : నే చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నానబ్బాయ్. నువ్వూ అలా చేయాలని నా కోరిక. ఈ ముక్క చెప్పిపోదామని వచ్చాను.

మ : నే నేం పాపం చేశాను నాన్నగారూ!

స : ఇంకా యేం చెయ్యాలి నాయనా! నేను స్వజనాన్నే విడిస్తే నీవు స్వధర్మాన్నికూడా విడిచావు. తండ్రిని మించిన కొడుకువయ్యావు. కాని నీపాపానికి హద్దుందా?

మ : పాప మేమిటండీ. ఇస్లాంలో నాకు నమ్మకం కలిగింది. అది ధర్మ సత్య—

స : ఆగు. నువ్వా అభిప్రాయానికెలా వచ్చావు? ఖురాను చదివి కదా? అది సద్గ్రంథమే, కాదనను. కాని మన పూర్వులు— వ్యాసుడు, కపిలుడు, శంకరాచార్యుడు— చెప్పిన ధర్మాన్ని విడిచేముందు వారి గ్రంథాల్ని క్షుణ్ణంగా చదివావా? హిందూ ధర్మం వాస్తవిక స్వరూపం అతి వుత్కృష్ట మయినది. దాని మూలసూత్రాలు ఆత్మకే కాని ప్రవృత్తికి ప్రాధాన్య మియ్యవు. తద్ధర్మానుష్ఠానంలో పరిపూర్ణులైన వారు "తనయందు అఖిల భూతములందు నొకభంగి" సమహితత్వం కలిగివుంటారు. హిందూ ధర్మ ప్రేమ విశ్వవ్యాపితమైనది. పిపీలికాది బ్రహ్మపర్యంతం దాని దృష్టిలో ఒకటే. దానిలో అహింసా సూత్రాలు గర్భితమై వున్నాయి. అదను పావనమైన ఆ ధర్మాన్ని విడిచి మహాపాపాని కొడిగట్టుకున్నావు.

మ : మీమాటలు వింటూంటే—

స : మతిపోతోంది కదూ? అవును, ధనానికి జీవితాన్నమ్ముకొన్న నా బోటివాడు ధర్మవాక్యాలు పలకడం ఆశ్చర్యకరమే. కాని ప్రతి మానవునిలోను ఉన్నతజ్ఞానం గర్భభూతమై వుంటుంది. అదృష్టం పండినప్పుడు ఆ జ్ఞాన నక్షత్రం అజ్ఞానపు మబ్బుల్ని చీల్చుకు వచ్చి హృదయాకాశాన్ని తేజోమయం చేస్తుంది. ఆ శుభసమయంలో మానవుడు క్షుద్రస్వార్థాన్ని తరిస్తాడు; త్యాగియై విశ్వప్రేమను దర్శిస్తాడు. అలాగనే ఆవేళ కల్యాణి చెప్పింది.

మ: కల్యాణి నెక్కడ చూశారు మీరు?

స : ఒకానొక గ్రామంలో ఒక పూరె గుడిసెలో.

మ : ఆమె ఆపాటుకి కారణం?

స : నీకు తెలియదేమిటి? తండ్రి యిల్లు వెళ్ళగొట్టాడు.

మ : ఆమె చేసిన నేరం?

స : నీ ఆరాధన.

మ : నాన్నగారూ! యిదే. కామూ. మీరు వర్ణించిన వుత్కృష్టాతి వుత్కృష్టమైన హిందూ ధర్మం! ముసల్మా

నుల యెడగల కోప విద్వేషాలకి అంతులేదు! పతిభక్తికి ప్రతిఫలం గృహచ్యుతియా? ప్రాయశ్చిత్తం చేసుకోమని కదూ చెప్పారు నాన్నగారూ! చేసుకుంటూ, తప్పకుండా చేసుకుంటాను. హిందూ ధర్మం విడిచినందుకు కాదు. ఒకప్పుడు హిందువుగా మనినందుకు. హిందువులై పుట్టిన పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటూ——

స : మహాబత్!

మ : నాన్నగారూ, యింతవరకూ నాకు హిందువులపై ద్వేషంలేదు. ఇంకా కొంత అభిమానమే వుండేది. ఈ దెబ్బతో అది తుడిచిపెట్టుకు పోయింది. ఇక్కడినుండి నేను నూటికి నూరు పాళ్లూ ముస్లింనే.

స : మహాబత్!

మ : నాన్నగారూ, నా నోటినుండి పట్టి మాటలు రావు. అనకనే పోవాలి కాని యిక అన్నమాటకు తిరుగులేదు. ఆ విషయం మీకూ తెలుసు.

స : మహాబత్!

మ : నాన్నగారూ, నా స్వభావం మీకు కొత్తకాదు. ఇంక యేం చెప్పే ప్రయోజనంలేదు.

(లోపలకు వెళ్ళబోయి ఆగుతాడు)

స (పళ్ళు పట పట కొరుకుతూ) చెట్టు చెడేకాలానికి కుక్కమూతి పిందె. చావు. ఆ నరక కూపంలో పడి చావు! మ్లేచ్ఛా! విధర్మి! కులకళంకా! (వెళ్ళిపోతాడు. మహాబత్ ఖా ఆవేశంతో కొంతసేపు పచారు చేస్తాడు) తరువాత.

మ : ఇలాంటి జాతి మహమ్మదీయుల చేతిలో దెబ్బతినక యేం చేస్తుంది! హిందువుల విద్వేషాన్నే మహమ్మదీయులు వేయింతలు కక్కిపోస్తున్నారు. ఇదే కాబోలు వీరి సనాతన ధర్మం విశిష్టత? ఇస్లాం విధర్ముల్ని నిశ్శంశయంగా తిరిగి తన ఒడిలో చేర్చుకుంటుంది. హిందూ మతమో! తనని విడిచిన వాడు తల్లక్రిందులా తపస్సు చేసినాసరే తిరిగి తన నీడకైనా రానివ్వదు. ఏమి అహంభావం! దాన్ని అణచలేనా? (గజసింహునితో) మేవాడ్ దండయాత్రకు సిద్ధంగా వున్నానని చక్రవర్తితో చెప్పండి.

(గజసింహుడు చకితుడౌతాడు)

మ : ఆశ్చర్యంగా వుందా? నా నిశ్చయానికి కారణం తెలుసా?

గ : చక్రవర్తి ఆజ్ఞ పాలించాలని.

మ : కాదండి. అజ్ఞాన భూయిష్టమైన హిందూ ధర్మాన్ని నాశనం చేయాలని. నా ఆశయం మీ జాతి నిర్మూలన. తెలిసిందా? ఇక వెళ్ళి చక్రవర్తితో చెప్పండి.

(గజసింహుడు నమస్కరించి వెడతాడు)

## అయిదవ రంగం

స్థలం : జహంగీరు రాజసభ. సమయం : ఉదయం.

(జహంగీరు చక్రవర్తి, హిదాయిత్ ఆలీ)

జ : ఈ పరాజయం శాశ్వత కళంకంగా వుండిపోతుంది. మూర్ఖుడు. సేనాధ్యక్షపదవి యెందుకు స్వీకరించాలి? ఎందుకు అపజయం చెందాలి?

హి : నేను గడ్డి కరిచి చెబుతాను జహాపనాహ్. మీకు ఓడి పోడమంటే కిట్టదు.

జ : మీరందరూ పట్టి శుంఠలు.

హి : అచ్చా, నిజం చెప్పారు, జహాపనాహ్.

జ : సిగ్గులేదూ! ఇంకా మాట్లాడుతావ్! యుద్ధంలో పట్టుబడి రాణా దయవల్ల బతికి బయట పడ్డావు. అబ్దుల్లా రణరంగానికి అశ్రువులనైనా అర్పించాడు. నీవు అదీ చేయలేక పోయావు.

హి : అచ్చా, జహాపనాహ్. వాడక్కడ చావ దలచాడు. కాని జహాపనాహ్, నే చావడం నాబీబీకి యిష్టంలేదు!

జ : నోర్ముయ్!

(సగర సింహుడు ప్రవేశిస్తాడు)

జ : ఒహో, వచ్చారే? రాజా సాహెబ్!

స : జహాపనాహ్!

జ : మీరు చిత్తూరు దుర్గం అమర సింహ రాణా కిచ్చారని విన్నాం.

స : ఆ వార్త నిజమే.

# మేవాడ్ పతనం

జ : అందుకు ఎవరి అనుజ్ఞ తీసుకున్నారు ?

స : దానికి ఒకరి అనుమతితో పనిలేదు.

జ : కారణం ?

స : ఆకోట న్యాయరీత్యా అమర సింహునిదే.

జ : అలాగాండీ !

స : అవును. అక్బరు పాదుషా చిత్తూర్ని ధర్మయుద్ధంలో జయించ లేదట. జయమల్లుని మాయోపాయంచే వధించారట.

జ : అలాగా ! ఈ న్యాయా న్యాయ విచక్షణ యెప్పటి నుండి? రాజాసాహెబ్ !

స : దివ్యజ్యోతిని సందర్శించిన నాటినుండి.

జ : ఏమి జ్యోతి ?

స : ఈ మధ్య ఒక మహాజ్యోతి నాకంటి పొరల్ని తొలగించింది. దానితో విశ్వరూప సందర్శనం లభించింది. రామచంద్రుని తరంనుండి నేటివరకూ జరిగిన విశేషాలు కళ్ళకు కట్టినట్లున్నాయి. బాప్పా రావలుని వీరగాథలు, నగరసింహ, చూండాజీల ఆత్మత్యాగం, కుంభరాణా శౌర్యం—వీనికి సంబంధించిన మహోజ్వల చిత్రాలు మనో నేత్రానికి గోచరిస్తున్నాయి. ఇప్పుడు నాకళ్ళకు నా ప్రతాపుని — నా సోదరుడు ప్రతాపసింహుని — కత్తి మెరుపులు స్పష్టంగా కనుపిస్తున్నాయి.

జ : తరువాత ?

స : నేనూ ఆ వీర వంశానికి చెందిన వ్యక్తినే అన్న నగ్న సత్యం గుర్తించాను. కాని యేంలాభం ? శత్రుకోటితో చేరి దేశానికన్యాయం చేశాను. చాల కాలం యిది తెలిసీ ఆత్మ వంచనుడ గానే మిగిలిపోయాను.

జ : తరువాత ?

స : నాకు జ్ఞానోదయ మయింది. కాలపుటలలో పడి నలిగి పోయిన పురాణ, చరిత్రాంశాలు కాదు నన్ను మేల్కొలిపింది, నా కళ్ళ ముందర పుట్టిన నిశుపు ప్రవర్తన. నా రక్తంలో రక్తం, నా జీవంలో జీవం, యీ పాపిష్టి దేశద్రోహి గర్భ శుక్తి ముక్తాఫలం—అడవుల్ని బట్టి తిరుగుతోంది. నేను యే దేశానికి ద్రోహం చేశానో ఆ దేశస్వాతంత్ర్య పరిరక్షణ కై పాటుపడుతూ, సర్వ సుఖాల్ని, కడుపు కన్న కొడుకును విడిచి జీర్ణ వస్త్ర ధారిణియై సంచరిస్తోంది. ఆస్పృశ్యంతో నా అజ్ఞానం పటాపంచలయింది ; హృదయం కదలి, లజ్జాభిమానాలతో శిరస్సు క్రుంగి పోయింది. ఇక అక్కడ నిలవడం దుస్సహమై చిత్తూరు దుర్గం అమరసింహుని కిచ్చి చక్కా వచ్చేను.

జ : మంచిపని చేశారు. ఆలోక యాత్రకు సిద్ధపడే వచ్చారను కుంటాను.

స : ఇంకా మెల్లిగా అంటున్నారా ? చావంటే భయపడే రోజులు పోయాయి. మొన్ననే ఒక సరికొత్త పాఠం నేర్చుకున్నాను.

జ : ఏమిటో అది ?

స : చెబుతా వినండి. ప్రపంచాన్ని పాలించే శక్తులు రెండు రకాలు. అందులో ఒకటి స్వార్థం. రెండవది త్యాగం. ఒకదానికి అహంకారం, ఊత అయితే రెండవ దానికి ప్రేమ ఆధారం. మొదటి శక్తి రాజ్యం నరకం, రెండవ దాని-రాజ్యం స్వర్గం. ఒకదాని పాలకుడు పిశాచం, రెండవదాని ప్రభువు పరమేశ్వరుడు. ఇంతవరకు యమలోకంతో ఉన్న నేను దేవలోకం చూశాను. ఆరాజ్యాధిపతి బుద్ధుడు; ఈశ్వరుడు, గౌరాంగుడు. అచ్చటి చట్టం ప్రేమా దయాభరితం, అచ్చట సేవే పరిపాలన; దయయే అనుగ్రహం; త్యాగమే బహుమానం. నేనా దేశాన్ని పూజిస్తున్నాను. ఒకప్పుడు పిరికినైన యీ చేతులు దీన రక్షణకై కత్తిబట్టాయి. కత్తిపోట్ల పూజ పుష్పాలని పించేయి !

జ : తరువాత ?

స : నా పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. అందుకే యిక్కడికి వచ్చాను.

జ : మంచిది; సిద్ధపడండి (ఒక సేవకునికి సంజ్ఞ చేయగా ముందుకు వస్తాడు)

స : ఇంత మాత్రానికి మరొకరెందుకూ, చక్రవర్తీ ? (ఒరనుండి కత్తి తీసుకుని గుండెలలో పొడుచుకుని, నేల కొరుగుతాడు. చేతులు జోడించి-) ఇదే నా పాపాలకు ప్రాయశ్చిత్తం.

(ఇంకావుంది.)




మన దేశములో పెక్కురు నిరక్షరాస్యు లుండుట వలన విద్య మిక్కిలి యభివృద్ధి గాంచవలసి యున్నది. ఈ కారణమున బాల బాలికలకేగాక వయోజనులకును విద్యాభ్యాసము గావించుటకు పరిపూర్ణ ప్రయత్నములు జరుగుచునే యున్నవి.

శ్రీ డాక్టర్ ఫ్రాంక్ వి లాబక్ గారు వయోజనుల కొరకు విద్యావిధానమును రూపొందించియున్నారు. వీరి విధానమే ప్రపంచ మంతటను ఆమోదించియున్నారు. మన తెలుగు దేశమునందును వీరి పద్ధతి ననుసరించియే వయోజనవిద్య గరపవలసి యున్నది. మరియు, వయోజ నాక్షరాస్యత కొరకు అనేక పుస్తకము లనేకమంది విద్యా వంతులు వ్రాసియున్నారు. నేటి దేశకాల పరిస్థితులతోబాటు విద్యావిధానమున్ను అనేక మార్పులు జెందుచున్నది. అయినను, పురాతనకాలమునుండియే మన తెలుగు దేశస్థులు వ్యావహారిక భాష కొరకు 18 మృద్వక్షరములు, 5 కఠినాక్షరములు, 1 అచ్చును. కలిపి 24 సాంకేతికాక్షరములను వాడుచున్నారు. అవి "అక గజ చట డమ క్షణ తద పబ శన యర లవ శష సహ" వీనిపై గుణితపు గురుతులు చేర్చి వాడుకొనుచున్నారు. అచ్చులన్నింటిని "అయరలవ" లలోజేర్చి వాడుకొనుచున్నారు. "ఎవరు = యెవరు, ఏమి = యేమి, ఓపిక = వోపిక, ఊరు = వూరు, ఐదు = అయిదు" ఇట్లు వాడుచున్నారు. మరియు నీ సాంకేతికాక్షరములే ఆంధ్రదేశ మందలి రాజకీయ వ్యవహారము లందును, వర్తక స్థానములందును వ్యావహారికముగా ప్రజల పేర్లు మున్నగునవి గణన చేయుటకు విషయ సూచికగా పూర్వకాలము నుండియు వాడబడుచున్నవి. వీనినే పలువిధములుగా కొందరు "కమ గయభాష"—"రామ భాష" మున్నగు సాంకేతిక భాషలుగా వాడుట పరిపాటిగా నున్నది. వ్యావహారికభాష కీ సాంకేతికాక్షరములు మిక్కిలి ఆధారము గలవనియే జెప్పవచ్చును. వీని నాధారము చేసికొని వయోజనులకు విద్య గరపుట సులభ సాధ్యము. మరియు, వయోజనులు కొంత వయసు గలిగినవారు. వారికి ప్రకృతి జ్ఞానము, భాషా జ్ఞానము కొంతవరకు పరిచయమై యున్నవి. అక్షర పరిచయము మాత్రము లేదు. కనుక, వారిని సులభముగా శీఘ్రకాలములో అక్షరాస్యులుగా జేయవచ్చును.

మన తెలుగుభాష 56 అక్షరములతో నొప్పుచున్నది. అందు అచ్చులు 16. "అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ" వీటిలో "ఌౡ" అనునవి నేటి వ్యావహారికములో వ్రాతయం దుపయోగింపబడలేదు. ఉభయాక్షరములు 3. "ం ఁ ః" ఇవి అచ్చులతోను, హల్లులతోను, సంబంధము గలిగియున్నవి. హల్లులు 37. "క ఖ గ ఘ ఙ, చ ౘ ఛ జ ౙ ఝ ఞ, ట ఠ డ ఢ ణ త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ఱ ల శ వ శ ష స హ" ఇందలి "ౘ ౙ" లు వ్యావహారికముగా వ్రాతలలో నుపయోగింప బడలేదు. అచ్చు పుస్తకము లందును, ఉచ్చారణ మందును, ఉపయోగింపబడుచున్నవి. "క్ష" ఈ అక్షరము వ్యాకరణమునందు హల్లులలో జేర్చుకొనబడక 'క ష' ల కలయిక వలన క్ష ఏర్పడినటుల విభజింపబడినది.

ప్రారంభములో చదువను, వ్రాయను సులభముగా నేర్చుకొనుటకు హల్లులను మృదువుగా బలుకునవి కఠినముగా బలుకునవి అను రెండు తెగలుగా విభజించవచ్చును. మృదువులు:- కగ చజ టడ తదనపబమయరల వశస. కఠినములు:- ఖఘఝఛఝఞఠఢణథధఫభ ఱళ ష హ. మృద్వక్షరములనుండి తలకట్టు గలవి, తలకట్టు లేనివి, తలకట్టు గలిగి కొమ్ములు గలవి, కడుపులో తలకట్టుగలవి అను నాలుగు విధములుగా విభజింపవచ్చును. వీనిని మృదుపఠక మందము.

## మృదు పథకము.

| | |
|---|---|
| తలకట్టు గలవి | కగచడతదనపవశ |
| తలకట్టు లేనివి | జ ట బ ల |
| తలకట్టు గలిగి కొమ్ములుగలవి | మ య |
| కడుపులో తలకట్టు గలవి | వ స |

ఈ మృదు పథకాక్షరములకును, సాంకేతికాక్షరములకును సంబంధము గలదనియే జెప్పవచ్చును. ఈ రెండింటికిని భేదము గనిపెట్టవలయున "అక్షఖళషహ" అను నారక్షరములు సాంకేతికాక్షరములందు నధికముగా గనబడుచున్నవి. మృదు పథకము నుండియే గుణితపు గురుతులుగా "ల స మ త య ర వ క"

( ౧ ఎ ౬ — ౨ ‿ ౭ ౮ )

అను నక్షరములేర్పడి యున్నవి. తక్కిన అక్షరములన్నియు తలకట్లు దీసి వాడబడుచున్నవి. మరియు, మృదుపథకము నుండియే "చ డ ద ప బ" ( ఛ ఢ ధ ఫ భ ) రూపు మారక ఒత్తులుంచుట వలన కఠినత జెంది ఒత్తుగా బలుకు చున్నవి. ఇట్లే

"క గ జ ట త — న ర ల శ"
( ఖ ఘ ఝ ఠ థ — ణ ఱ ళ ష )

రూపములు మారి కఠినముగా బలుకు చున్నవి.

మృదు పథకాక్షరముల ఉపయోగ మెంతేని గలదు. కావున దీనితో విద్యాభ్యాసమును ప్రారంభింపవచ్చును. అయినను చదువుట కంటే వ్రాయుట కష్టము. కనుక లిపి విధానము ననుసరించి అభ్యాసమును గావింప వలసి యున్నది.

### లిపి

తెలుగక్షరము లన్నియు ఎడమనుండి కుడివైపునకు వ్రాయుటకును, చదువుటకును వీలుగా నేర్పడి యున్నవి. పూర్వకాలమున అచ్చు సాధనములు లేకుండెను. కాగితములు, అచ్చు సాధనములు కని పెట్టుటకు పూర్వము తాటియాకులపై నినుపగంటముతో వ్రాయు చుండెడివారు. తాటియాకులు చినుగకుండ వ్రాయుట వలన అక్షరములు కొక గుండ్రని కత్తు వచ్చి యుండెను. గుండ్రముగా కుడివైపునకు వ్రాత జరుగుట వలన శీఘ్రముగాను గొలుసు (కలిపి వ్రాత) గాను వ్రాయుట కవకాశములు కలిగినవి.

అక్షరములన్నియు మూడు విధములుగ వ్రాయవచ్చును. కనుక సులభాభ్యాసమున కనుకూలమగు మృద్వక్షరములను త్రివిధ లిపిలో నిచట జూప బడినవి.

### త్రివిధ లిపి

మీదినుండి దిగువగా కుడివైపునకు వ్రాయునవి—
ల త ర య ద డ ట

ఎడమ నుండి దిగువగా కుడివైపునకు వ్రాయునవి—
బ జ చ శ

క్రిందినుండి కుడివైపుగా మీదునకు వ్రాయునవి—
స న ప వ మ - క గ

ఈ త్రివిధ లిపి ననుసరించి ముందుగా నేర్ప వలసిన యక్షరములను "లిపి షడ్వర్గ" మను పేరిట విభజింతము.

### లిపి షడ్వర్గము

| |
|---|
| స న ప వ మ |
| ౦ ర య |
| ల త అ |
| ద డ ట |
| గ క |
| బ జ చ శ |

ఈ వర్గములందు నేయక్షరము పిమ్మట నే యక్షరము వ్రాయుటకు సులభ మగునో జెప్పబడినవి. మరియు, చాల మాటలు, వాక్యములు తెలుసుకొన గలుగుట ఉభయాక్షరములందలి సున్నయు, అచ్చులందలి "అ" యు నిందు జెప్పబడినవి. సున్నను "వ" పిమ్మటనే నేర్పుట బాగు. ఈ లిపి షడ్వర్గాక్షరముల తోడనే మొట్టమొదట వయోజన విద్య ప్రారంభింప వలెను.

## అక్షర పరిచయము

"స" ఆకారమును నేర్పునపుడు కొడవలి చిత్రమును జూపి క్రింది నుండి మీదుగా కుడివైపునకు "ᔕ" ఆకారమును గీయించవలెను. పిమ్మట తిరుగ వేసిన గొడ్డలి చిత్రమును జూపి "✓" తలకట్టును గీయుట నేర్పవలెను, ఈ రెండింటిని చేర్చి "స" పోలిక వ్రాయించవలెను. "స" ఉచ్చరింపుటకు సంచి బొమ్మను చూపి దాని దిగువ "స" అను అక్షరముంచి "సంచి" అని పలుకునపుడు దాని మొదటి యక్షరము గనుక ఈ అక్షరమును "స" అని పోల్పించవచ్చును. ఇట్లే మొదటి వర్గము నందలి "స-న-ప-వ-మ" వీటికి గల సంబంధములు తెలిపి వ్రాయించవచ్చును. ఉచ్చరించుటకు పోలికగా సంచి, నక్క, పలక, వల, మంచము, చిత్రములను చూపి, వాటి మొదటి యక్షరములను దిగువజూపి రాబట్ట వచ్చును. రెండవ వర్గము బంతి చిత్రమును, మూడవ వర్గము చంద్రరేఖ చిత్రమును, నాల్గవ వర్గము ఆకు చిత్రమును. ఐదవ వర్గము గంట చిత్రమును, ఆరవ వర్గము బాతు చిత్రమును, జూపి అక్షరముల నేర్పవచ్చును. ఆయా వర్గము లందలి అక్షరములను పోల్చి ఉచ్చరించుటకు చిత్రము లమర్చి నేర్పవచ్చును.

(ప్రక్క పటము చూడు)

మొట్ట మొదట "స న ప" అను మూడక్షరములు వ్రాయను జదువను నేర్పి పిమ్మట "పనస" పటమును జూపి "పనస" అని రాబట్టి "పనస" అను మూల పదముతో ప్రారంభించి ఒక్కొక్క క్రొత్త యక్షరమును ప్రవేశ పెట్టవలెను. పలుమారు లా యక్షరము వచ్చునట్లును, మొదట నేర్చిన యక్షరములను తిరిగి అభ్యాసమగునట్లును జేర్చి ; పదముల తోను, వాక్యముల తోను, అభ్యాసము గావింప వలెను. "అ ఆ ఇ ఈ" అను నాలుగక్షరములు పట్టీగా వ్రాయుటకంటే ఈ పద్ధతి విసుగు లేక నాలుగక్షరములు నేర్చు నప్పటికి కొన్ని పేర్లు, వాక్యములు ఉత్సాహముగా నేర్చుట కవకాశములు గలుగుచున్నవి.

ఉదాహరణ : —

| | | |
|---|---|---|
| పనస | వనం | వమనం |
| పన | వస | మనం |
| పస | నవం | సమం |
| నసనస | పవనం | మననం |
| పసపస | నవనవ | మనపనస |
| | వనపవనం | మనసమం |

## సమ పవనం

మొదటి వర్గము యొక్క పాఠము లిట్లు చెప్పవచ్చును. వర్గాంతమున "సమ పవనం" అను సూత్రమును జెప్పి దానిని వయోజనులు జ్ఞాపకముంచునటుల వ్రాయను జదువను సాధకముగా నొసంగ వలెను. ఇట్లే ఆయా వర్గములను బోధించ వలెను.

| | | |
|---|---|---|
| మొదటి వర్గాంతమున | | సమ పవనం |
| 2 | " | రయం |
| 3 | " | అలత |
| 4, 5 | " | మంటకడ గద |
| 6 | " | గబగబ జర జర చర చర |
| | | శరగమనం |

అను పదములను సాధకముగా నొసంగవచ్చును. ఈ ఆరు వర్గములు పూర్తియగు 18 మృద్వక్షరకములును, 1 అచ్చును, 1 ఉభయాక్షరమును, మొత్తము 20 అక్షరము లభ్యాస మగుచున్నవి.

## ఒరవడి

అచ్చొత్తిన యక్షరములకును, వ్రాత యక్షరములకును కొంత భేదమున్నది. కనుక నిదివరలో నేర్చిన యక్షరము లన్నియు వ్రాయుట కనువగు "య ర ల వ మ ద న స" అను యక్షరములను ఒరవడి వ్రాయించ వచ్చును. దస్తూరీ చక్కబరచుటకు పూర్వులే యీ విధానము ననుసరించి యుండిరి.

"య ర ల వ మ ద న స" యనుచును
బరువడి నీ యక్షరముల భయ నయ తతులన్
నిరతముగ వ్రాయ నేర్చిన
వర కరుణా ! వాని వ్రాలు వత్రువ వరలున్"

అను పద్యము చాటువుగా నున్నది.

ఇది వరలో నేర్చిన పేర్లు, వాక్యములు మున్నగు నవి వ్రాత యక్షరముల శైలిలో వ్రాయించి యింతటి నుండి చెప్పబోవు పాఠము లన్నియు నీ శైలిలోనే వ్రాయించుచుండవలెను.

## స్వర గుణిత పాఠములు

పై భాగము పూర్తియైన పిమ్మట అచ్చులను వాటి గురుతులతో ప్రారంభింప వలెను. మొట్ట మొదట సులభ మైన అచ్చులను పిమ్మట కఠినమైన అచ్చులను అభ్యాస మునకనుకూలముగా నొకదాని వెంబడి నొకటి ప్రవేశ పెట్ట వలెను. "ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఒ ఓ ఔ ఐ ఋ అః"

( ా ి ీ ు ూ ె ే ొ ో ౌ ై ృ ః )

క్రమముగా ప్రవేశ పెట్టవలెను. అచ్చటచ్చట కఠినముగా పలుకు నక్షరములను, ఒత్తక్షరములను ప్రవేశపెట్టవలెను. "ఆ" అనునది "ా" ఇట్టి గురుతుగా మారి హల్లు లపై వ్రాయుట కనుకూలముగా నేర్పడిన దనియు, "ా" ఈ గురుతు ఏ అక్షరముపై వచ్చినను ఆ యక్షరముతో గలిసి "ఆ" అను స్వరమునే పలుకు చుండు ననియు బోధించ వలెను. ఇట్లే మిగిలిన స్వర ములు (అచ్చులు) గూర్చి తెలుపవలెను. మరియు, మృదుపఠకము నందలి యక్షరములతో తారీఖుల పెట్టె వంటి ఒక పెట్టెను సిద్ధపరచుకొని ఆయా అక్షరములపై దీర్ఘము, గుడి, గుడిదీర్ఘము మున్నగు గురుతులు వచ్చు నట్లుగా దానిని త్రిప్పుచు నాయా అక్షరములెట్లు పలుకున ట్లభ్యాసమును జేయింపవచ్చును. లేదా, ఆయా అక్ష రములు నల్లబల్లపై వ్రాసి, ఆయా గురుతుల నుంచి అక్ష రము లెట్లు పలుకునది సాధకము జేయింప వచ్చును.

### దీర్ఘాక్షరపు మాదిరి పాఠము

| | | |
|---|---|---|
| ఆనబ | ఆకాశం | వానాకాలం |
| కాకర | ఆనందం | లంకానగరం |
| ఆగాకర | అంబారం | భారతం |
| ఆలాపన | బంగారం | భాగవతం |

గజానానా వందనం
బావా కమలా ఫలం కావాలా
అనగా అనగా రాగం బాగా పాడ గలం

ఆనబ పటమును జూపి "ఆనబ" అని రాబట్టి "ఆ" వ్రాయుక్రమమును నేర్పవలెను. పిమ్మట కాకర పట మును జూపి "కాకర" అని రాబట్టి "ా" ఈ గురు తును నేర్పవలెను. "ఆ" "ా" ఈ రెండింటికిని గల సంబంధమును బోధించి మిగిలిన పాఠములను బోధించ వలెను. ఆయా గురుతుల మేరకు పాఠములను బోధించు నప్పుడు తమ తమ ప్రాంతము లందలి విషయ ములతో మనుష్య నామములు, గ్రామ నామములు, వ్యావహారికమున కవసరమగు మాటలు, వాక్యములు మున్నగునవి బోధించిన వయోజను లుత్సాహ పూరిత ముగా విద్య నభ్యసింప గలరు.

ఈ భాగమును పూర్తిగావించిన పిమ్మట "అక్షర మాల" క్రమము నేర్పుట బాగు. మరియు "అః" వంటి స్వరగుణితమును పూర్వపు రీతిగా పరిచయము గావింప వచ్చును. పిమ్మట "ఞ" నకారపొల్లు "ఞ" పొల్లు అభ్యా సము గావింప వలెను.

## హల్లు గుణిత పాఠములు

అచ్చుల గురుతులు పూర్తియైన పిమ్మట హల్లులలో బుట్టిన

"ల న మ త య ర వ క"

( ్ల ్న ్మ ్త ్య ్ర ్వ ్క )

క్రమమున గురుతులను ప్రవేశ పెట్టవలెను. ఈ గురుతు లెక్కువ యక్షరములపై ప్రయోగించుట కనుకూల పడి యున్నందున నిచట నీక్రమమే అనుసర యోగ్యమైనవి. వీనిని బోధించు నప్పుడు స్వరగుణిత పాఠముల వలెనే పటముల పరిచయమును జేయవలెను. "్ల" ఒత్తు జెప్పు నపుడు పల్లకి పటమును జూపి "ల" "్ల" గా మారుట బోధించవలెను. మరియు హల్లు గుణిత పాఠములు నేర్పునపుడు "ల్ల, న్న, మ్మ" అను ద్విత్వాక్షర ములనే గాక "క్ల, ప్ల, వ్న, గ్మ" మున్నగు సంయుక్తాక్షరములపై నాయా గురుతులు వచ్చునట్లు జూడ వలెను. పిమ్మట తలకట్టు దీసి వాడ వలసిన "గ, చ, జ" మున్నగు గురుతులతో పాఠములు నేర్ప వలెను. ఈ భాగము పూర్తియైన పిమ్మట పూర్వపు రీతిగా పూర్తి గుణితమును సాధకము జేయింప వచ్చును.

గ్రామీణుల దినచర్యలో అవసరమైన విషయముల తోడను, తమ యనుభవములో నున్న విషయముల

తోడను, నైతిక జ్ఞానాభి వృద్ధి బొందుటకు మత సాంప్రదాయముల తోడను, తెలుగు దనముగా పాఠము లేర్పరచి అందు పాటలు, నీతి పద్యములు, సామెతలు, కథలు, మున్నగునవి వచ్చు నట్లుగా ప్రయత్నించ వలెను.

## పరిమితి

పై విధానములలో వయోజనులు స్వశక్తితో క్షుణ్ణముగా వ్రాయుటకును, జదువుకొనుటకును దినమున కొక గంట నుండి రెండు గంటలు వంతున వెచ్చించిన 60 దినముల కాలము చాలును.

| | |
|---|---|
| తెలికాక్షరములతో మాటలు, వాక్యములు నేర్పుటకు | 10 దినములు |
| ఒక్కొక్క గురుతున కొక్కొక్క దినము వంతున అచ్చులు. అచ్చు గుణిత పాఠములు నేర్పుటకు | 12 దినములు |
| హల్లు గుణిత పాఠములు నేర్పుటకు | 8 దినములు |
| కఠినాక్షరములు మొదలగువాటి పాఠములు నేర్పుటకు | 10 దినములు |
| పునర్విమర్శన కొరకు .... ........ ........ | 5 దినములు |
| మొత్తము | 45 దినములు |

ఇవి యించు మించుగా జూపబడినవి. అయినను 60 దినములకు అంచనా చేయుటను పిమ్మట విశేష విజ్ఞానమును బొందుట కెన్ని పుస్తకములనైన జదువ వచ్చును. ఎంత పరిశ్రమనైన చేయ వచ్చును. అందులకు పరిమితిని జెప్పుట కవకాశములు చాలవు.

## గమనిక

1. ఇందలి సాంకేతికాక్షరములు తెలుగునకు సంక్షిప్త వేణిని (Short hand) వంటివి.

2 ప్రారంభ దశలో "శ" వర్ణము నేర్పుట వలన "చ, స, శ" లందు తరుచుగా గలుగు చుండు పొరపాట్లను సవరించుకొన వచ్చును.

3. అక్షర పరిచయమును కొడవలి చిత్రముతో ప్రారంభించుట వలన వయోజనులకు కొడవలి చక్కగా తెలియు పరికరమగుటయే గాక, వ్రాతను అభ్యాసమును గావించుటకు సులభముగా నుండును.

4. మృదుపథక మేర్పరచుట వలన స్వరగుణిత పాఠము లందు మిక్కిలి సహాయమును బొంద వచ్చును.

5. ఒరవడిని వ్రాత యక్షరముల శైలిలో వ్రాయించుట వలన దస్తూరీ చక్కబడుటయే గాక; వ్రాత యక్షరములకును, అచ్చొత్తబడిన యక్షరములకును భేదమును గనిపెట్ట వచ్చును.

6. లిపిపద్ధతి పాఠాంతము లందలి సూత్రముల వలన అక్షరములను జ్ఞాపకముంచుకొన నవకాశములు గలుగును.

ఈ "వయోజన సులభవిద్య" ను ప్రభుత్వమువారును దేశీయులును ఆమోదించి ప్రోత్సాహింప వలసింద, ప్రార్థించు చున్నాను. ★

# అతని ఆనందానికై ఒక సీసాను అందుబాటుగా ఉంచండి!



కడుపులో బాధలేవీ లేనందు వల్లనే బిడ్డ ఆనందిస్తున్నాడు. బిడ్డ ఆనందమే తల్లికి కూడా ఆనందం.






# గ్రైప్ సిరప్

ఉత్పత్తిదారులు :

ది మైసూర్ ఇండస్ట్రియల్ & టెస్టింగ్ లాబరేటరీ లిమిటెడ్; మల్లేశ్వరం, బెంగుళూరు.

సెల్లింగ్ ఏజంట్లు :

బెస్ట్ అండ్ కంపెనీ లిమిటెడ్ ; పోస్ట్ బాక్స్ నం. 63 మద్రాసు.

BZ—37.

---

# ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెని. లిమిటెడ్.

హెడ్డాఫీసు - మచిలీపట్నం.

## నూతన ఆంధ్ర రాష్ట్రము.

బహుళ ప్రజా క్షేమకరము గావలెనన్న, అపారధనము, పెట్టుబడి కావలెను. అట్టి పెట్టుబడులకు భీమా కంపెనీల సాయము అత్యవసరము.

28 సంవత్సరములనుండి శాస్త్రీయ నియమావళితోను, జాగరూకతతోను వ్యవహరించుచు, ఆర్థిక సౌష్టవమునకు గట్టి పునాదులతో సేవ జేయుచున్న యీ "భీమా సంస్థ" మీ యెల్లర తోడ్పాటు కొరకై, ఎదురు చూచుచున్నది.

| | | |
|---|---|---|
| చెల్లింపబడిన క్లెయిములు | .... | సుమారు రు. 70 లక్షలు. |
| జీవిత భీమా నిధి | .... | సుమారు రు. 2 కోట్లు. |
| అమలులోనున్న వ్యాపారం | .... | సుమారు రు. 10 కోట్లు. |

ప్రాణ భీమాతోబాటు, అగ్ని, ప్రమాదము, మోటారు, నౌక, మొదలయిన యితర భీమా వ్యాపారము గూడ జయప్రదముగా నిర్వహింపబడుచున్నది.

—: మదరాసు ఆఫీసు :—

"ఆంధ్ర ఇన్సూరెన్సు భవనములు"

337, తంబుచెట్టి వీధి, జార్జిటవున్.

దేశములోని ముఖ్యపట్టణములన్నిటిలోను మా వ్యవహార కేంద్రములున్నవి.

ధూర్జటి సుబ్రహ్మణ్యం, ఎం.ఏ., యఫ్.ఐ.ఏ.,
జనరల్. మేనేజరు.

# ఆంధ్ర మహిళా సభ

—:o:—

## విద్యా శాఖ:

ఈ సంవత్సరం విద్యాశాఖలో 100 మంది విద్యార్థిను లున్నారు. అందులో 32 మంది వచ్చే మార్చిలో ఎడ్మిషన్ పరీక్షకు వెళ్ళుదురు. 4 గురు ఇంటరు పరీక్షకు వెళ్లుదురు. గత మార్చిలో 40 మందికి 26 గురు ఎడ్మిషన్‌లోను, 7 గురికి 5 మంది ఇంటరు పరీక్షలోనూ విజయము గాంచిరి. ఎడ్మిషన్‌లో 12 మందికి ద్వితీయ శ్రేణి, 14 గురికి తృతీయ శ్రేణి వచ్చినది. ఇ. స్. ఎల్. సి. పరీక్షకు వచ్చే మార్చిలో 11 గురు వెళ్ళుదురు.

హిందీ ప్రాథమిక, మధ్యమ తరగతులు తిరిగి ప్రారంభించబడ్డాయి. 25 మంది విద్యార్థినులు ఇందు చదువుచున్నారు.

ఆంధ్రా మెట్రిక్యులేషన్ తరగతులు ప్రారంభింపబడ్డాయి. ప్రస్తుతము ఇరువురు విద్యార్థినులు ఇందు శిక్షితులగుచున్నారు.

## పారిశ్రామిక శాఖ:

ఇందు ప్రతి సంవత్సరముకన్న ఈ సారి విద్యార్థినుల సంఖ్య ఎక్కువగా నున్నది. నిత్యము వచ్చి యీ పనులు నేర్చుకొనువారు 60 మంది, ఒక పూట వచ్చి నేర్చుకొనువారు 30 మంది. ఇంకా ద్వారకా కాలనీ శాఖలో 6 గురు, అడయారు శాఖలో 15 గురు కుట్టు నేర్చుకొనుచున్నారు. 5 గురు కంపోజింగ్, 3 గ్గురు బైండింగ్ కూడా అభ్యసించుచున్నారు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సహకారముతో యీ విద్యాలయానికి ప్రత్యేక భవనము ఏర్పడుతూవుంది. ఇప్పటి వరకూ లజ్ చర్చ్ రోడ్డులో జరుగుతున్న యీ తరగతులు ఇకమీద క్రొత్త భవనములలో జరుగును.

గత డిసెంబరులో జరిగిన పరీక్షలలో, 12 గురు హయ్యరుగ్రేడు కుట్టు పరీక్షకు వెళ్ళి 9 గురు కృతార్థులైనారు. 13 గ్గురు లోయరు గ్రేడుకు వెళ్ళి 8 గురు కృతార్థులైనారు. 7 గురు ఎంబ్రాయిడరీకి వెళ్ళి, 7 గురు కృతార్థులైనారు. కుట్టు లోయరులో ఒక విద్యార్థిని రాష్ట్రము మొత్తము మీద ప్రథము రాలిగా ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణురాలైనది. ఈ డిశంబరులో తిరిగి 30 మంది పరీక్షలకు వెళ్ళుచున్నారు.

భారత ప్రభుత్వ పునరావాస శాఖవారి ఆధ్వర్యాన జరుగుచున్న తరగతులలో, ఈ జూలైలో 13 గ్గురు అద్దకపు పనిలో పరీక్ష వ్రాసి, 4 గురు ప్రథమ శ్రేణిలోను, 9 గురు ద్వితీయ శ్రేణిలోను కృతార్థులైనారు. ఈ ఆగస్టు నుండి, కుట్టు, నేత, నిట్టింగ్, చేతి పనులలో ఈ శాఖ ఆధ్వర్యాన శిక్షణ జరుగుతూవుంది. ఇందు ఇప్పుడు 72 మంది విద్యార్థినులు ఉన్నారు.

ఈ శాఖలలో విద్యార్థినులచే తయారు చేయబడ్డ వస్తువులు అమ్మబడును. పైవారు ఆర్డరు యిచ్చి దుస్తులు వగైరా తయారు చేయించుకోవచ్చు.

## ఆంధ్ర మహిళా ప్రెస్.

పారిశ్రామిక విద్యాలయపు శాఖలో యీ ముద్రణాలయము రెండు సంవత్సరముల క్రింద స్థాపితిమైనది. కంపోజింగ్, బైండింగ్, ప్రూఫ్‌రీడింగ్‌లలో శిక్షణ నీయడం, 'ఆంధ్ర మహిళా' పత్రిక ముద్రణ గాక, వివిధ రకములైన అచ్చు పనులు, తెలుగు, తమిళ, ఆంగ్ల భాషలలో ఇక్కడ చేయబడుచున్నవి. పుస్తకములు, ఆహ్వాన సన్మాన పత్రములు, ఇంకా అన్ని రకముల అచ్చుపనులు ఇక్కడ చేయబడును. విద్యార్థులకు నోటు బుక్కులు, ఎకౌంటు పుస్తకములు, ఫోటోగ్రాఫ్, ఆటోగ్రాఫ్ ఆల్బమ్‌లు— మొదలైన వన్నియు ఇక్కడ తయారు చేయబడి విక్రయింపబడును.



వివిధ శాఖల విద్యార్థినులు 1953 — 1954



బెనారెస్ ఎడ్మిషన్ తరగతి, — 1954 మార్చిలో పరీక్షకు వెళ్ళు విద్యార్థినులు

## వివిధ శాఖల విద్యార్థినులు



సబ్. జూనియర్ తరగతి.



సబ్. సబ్. జూనియర్ తరగతి.

## వివిధ శాఖల విద్యార్థినులు



ఎనిమిదవ తరగతి ప్రభుత్వ పరీక్షకు 1954 ఏప్రిల్‌లో
వెళ్ళు విద్యార్థినులు.



రాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయపు విద్యార్థినులు.

## వివిధ శాఖల విద్యార్థినులు



మల్లమ్మ దేవి హాస్టలులో నివసించు విద్యార్థినులు



మహిళా సభ వివిధ శాఖల ఉపాధ్యాయ వర్గం.

# వివిధ శాఖల విద్యార్థినులు

కాశీ విశ్వవిద్యాలయపు సీనియర్, జూనియర్, సబ్‌జూనియర్, సబ్ సబ్ జూనియర్ తరగతుల విద్యార్థినులు పౌరశిక్షణతరగతి.



భారతప్రభుత్వ పునరావాస శాఖవారి ఆధ్వర్యాన జరుగుచున్న వివిధవృత్తి తరగతులలో

# ఆంధ్ర మహిళా సభ



రాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయము నూతన భవనములు ది 23-9-'53 న
శ్రీ త్రివేదిగారు యీ భవనములలో ప్రారంభోత్సవము జరిపించినారు.

—— : o : ——

ఇందు, కుట్టు, ఎంబ్రాయిడరీ, నిట్టింగ్, రంగు అద్దకాలు, నేత వగైరా పనులలో శిక్షణ యీయబడుచున్నది. 200 మంది విద్యార్థినులకు యిక్కడ ఉచిత శిక్షణకు అవకాశములున్నవి. కనీసం 30 మందికైనా, ఏదో ఒక రకమైన ఉచిత విద్యార్థి వేతనములీయబడుతూ ఉన్నవి.

భారత ప్రభుత్వ వృత్తి పునరావాసశాఖవారు, కుట్టు, నిట్టింగ్, వీవింగ్, అద్దకపు తరగతులు ఇక్కడ జరుపుచున్నారు. వారియాజమాన్యాన, స్త్రీలకు రేడియో మెకానిక్స్ ట్రయినింగ్ ఇప్పించాలని సంప్రదింపులు జరుగుచున్నవి.

పైవరకు పాఠశాల మాత్రము. ఆఫీసు, స్టోరు ఇంకా నిర్మాణములోనున్నవి.

# మూర్తి శిల్పము

## (బౌద్ధయుగము)

—శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.

దేవతామూర్తులను, మనుష్య ప్రతిమలను శిలలో చెక్కు నట్టి శిల్పమునకు మూర్తి శిల్పమని వ్యవహరించుచున్నాను. దేవతామూర్తులను మనుష్యప్రతిమలను రాతిలో గండరించుటలో తెలుగు శిల్పులది అందెవేసిన చేయి. క్రీస్తుశకమునకు పూర్వమునుంచే యిట్టి మూర్తులు మనకు శిలలో కానవచ్చును. బౌద్ధము మన దేశములో మూర్తి రచనా శిల్పమునకు గొప్ప ప్రోత్సాహము నిచ్చినది. తెలుగు దేశములో బౌద్ధ స్తూపములు క్రీస్తు శకమునకు పూర్వమే వెలసినవి. అమరావతి, జగ్గయ్యపేట, భట్టిప్రోలు మొదలైనచోట్ల వెలసిన బౌద్ధ స్తూపములు క్రీస్తు శకమునకు పూర్వపువని మనకు తార్కాణ పూర్వకముగా తెలియవచ్చుచున్నవి. మొదటిమారు మూర్తిశిల్పము ఈ స్తూపపు శిలాఫలకములలో కనబడుచున్నది. జగ్గయ్యపేట స్తూపమునకు సంబంధించిన శిలాఫలక మొకటి మద్రాసు మ్యూజియములో ఉన్నది. ఆ శిలాఫలకముమీద బౌద్ధాంధ్ర శిల్పులు మాంధాత జాతకమును చెక్కినారు. ఈ జాతకములోని మూర్తులు సమతలముమీద ఇంచుకంత ఉబ్బెత్తుగా రేఖామాత్రముగా చిత్రితమైనవైనను అతి మనోహరములుగా నున్నవి. ఈ మూర్తులు లోతుగా శిలలో గండరింపబడలేదు. ఈ మాంధాత జాతకము క్రీస్తు శకమునకు పూర్వమో తరువాతనో మొదటి శతాబ్దములో చెక్కినవని కళావిమర్శకులు నిర్ణయించినారు. ఈజాతకములోని మూర్తుల, అందు ముఖ్యముగా మాంధాత యొక్క అంగసౌష్ఠవము, రేఖా విన్యాసము, చిత్రరచనాపద్ధతి, రచనామాధుర్యము ప్రశంస నీయములుగా ఉన్నవి. క్రీస్తు శకారంభ కాలముననే బౌద్ధాంధ్ర శిల్పు లిట్టి శక్తి గడించిరన్న తెలుగుదేశములో శిల్పకళా వ్యాసంగ మంతకు పూర్వము ఎన్ని వందల, వేల సంవత్సరములనుంచో జరుగుచుండి యుండవలెను. అథమ మంతకు పూర్వము వేయి సంవత్సరములనుంచియైనను ఈ వ్యాసంగము జరుగుచుండినగాని క్రీస్తు శకారంభ శతాబ్దినాటికి శిల్పకళ— అందునను మూర్తులను చిత్రించు శిల్పకళ— ఇంతటి పరిణతికి రానేరదు.

మూర్తి శిల్పరచనమునకు గొప్ప అవకాశమును కలుగజేసినది బౌద్ధమునందలి మహాయాన సంప్రదాయము. మహాయానమునకు సంబంధించిన భావములు హిందూ దేశములో నాగార్జునాచార్యులవారికి పూర్వమునుంచి అచ్చటచ్చటపరిస్ఫోటములగుచువచ్చినను వాటిని సవిమర్శముగ, సహేతుకముగ సమన్వయించి ఒక సంప్రదాయరూపముగ వెలయించినది ఆ యాచార్యులవారే, అందువలననే నాగార్జునాచార్యులవారు మహాయాన సంప్రదాయ ప్రవర్తకులని ప్రసిద్ధి కలిగినది. బౌద్ధమును సామాన్యజనుల కందుబాటులోనికి తెచ్చి, సామాన్య జనులలో సయితము నిర్వాణోపలబ్ధికి ప్రయత్నించుట కుత్సాహము రేపిన మహాయాన సంప్రదాయము తెలుగు దేశములోనే కృష్ణానదీ తీరస్థ విజయపురీ ప్రాంత బౌద్ధ సంఘారామములోనే రేకెత్తినది. అదివరకే శిల్పకళలో చేయితిరిగిన ఆంధ్ర శిల్పులకు ఈ నూతన సాంప్రదాయము క్రొత్త యవకాశము కల్పించినది. మహాయాన సంప్రదాయములో బౌద్ధదేవతా మూర్తులు అనేకములు వెలసినవి. ఈ దేవతామూర్తులకు బోధిసత్త్వులనిపేరు. శిలలో ఈ దేవతా మూర్తులను, మనుష్యప్రతిమలను గండరించుటలో బౌద్ధాంధ్రశిల్పి చూపినప్రజ్ఞ అనితరసాధ్యమయినది. అమరావతీ స్తూపపు రమణీయ శిల్ప చిత్రసంపద యంతయు క్రీస్తు శకము రెండవ, మూడవ శతాబ్దులనాటిదని నిశ్చితమయినది. ప్రాచ్యకళా విమర్శకుడైన ఫెర్గుసన్ అమరావతీ స్తూప శిల్పము భారత శిల్పకళకు పరమావధి అని, భారతశిల్పము అమరావతిలో పండి పరిణతి నొందినదని వ్రాసియున్నాడు. విన్సెంటు స్మిత్తు మొదలైన వారతని యభిప్రాయముతో ఏకీభవింపక

# మూ ర్తి శి ల్ప ము

పోయినను అమరావతిలోని బౌద్ధాంధ్ర శిల్ప మత్యంత మనోహర మయినదని, తత్కళా సంప్రదాయ మానాటి భారతీయ శిల్ప కళాసంప్రదాయములలో ఉత్తమ మయిన దని నొక్కి వక్కాణించియున్నారు. అమరావతీ శిల్పము లోని మూర్తి చిత్రములు కొయ్యబారినట్లు బిరబిగిసికొని యుండక లలితములై జీవ ముట్టిపడుచుండును. ప్రతి చిత్ర మును రసభావక్రియాన్వితమై వాస్తవికత నొత్తుకొనుచు కదులుచు మెదులుచున్నట్లుండును. గాంధారశిల్ప సంప్రదా యాభిమతముగా మొదటిమారు బుద్ధమూర్తి ఉత్త హింసూస్థానములో, ప్రాయికముగా మథుర ప్రాంతమున చిత్రితమయినదని తజ్ఞుల మతము. అయినను భారతీయ బౌద్ధు లందరికి అంగీకారమైనరీతిని బుద్ధచిత్రమురూపొంది నది అమరావతిలోనే యని, ఈ చిత్రమే బౌద్ధు లితరదేశ ములవారి కందరికి అనుకరణయోగ్యమయినదని కొందరు కళా విమర్శకుల యభిప్రాయము. ఎట్లయినను మూర్తిశిల్ప చిత్రరచనను పరిణతికి దీసికొనివచ్చినవారు బౌద్ధాంధ్ర శిల్పులు.

ఆంధ్రదేశములోని శిల్పచిత్ర కళా సంప్రదాయమునకు అమరావతీ కళయే పునాది. నాగార్జునుని కొండ, రామిరెడ్డి పల్లి, గోలి మొదలైన స్థలములలోని బౌద్ధకళ అమరా వతీ సంప్రదాయముననుసరించినదే. అమరావతీ శిల్పకళా ప్రాశస్త్యమును బాగుగా గ్రహించుటకు అమరావతీ స్తూప చిత్రశిలా ఫలకములలో ఉత్తమ మయినవి ఇంగ్లాడుకు వెళ్ళిపోయినవి. మద్రాసు మ్యూజియములోనున్న అమరా వతీ శిల్ప చిత్రములవలన—త్రవ్వి వెలుపలకి తీయుటలో రాలు ఎంత పగిలిలను, వానిమీద చెక్కిన బొమ్మ లెంత దెబ్బ తిని పాడయినను—ఆ సంప్రదాయము ప్రశస్తిని కొంతవరకు తెలిసికొనవచ్చును. అమరావతిలో పెద్ద పెద్ద విగ్రహములను చెక్కుట మూడవ శతాబ్ది చివరి పాదము నుండి ప్రారంభమని కళా విమర్శకుల అభిప్రాయము, పెద్దవి బుద్ధ విగ్రహములు, మనుష్య విగ్రహములు అమ రావతీస్తూపమునకు సంబంధించినవి ఇప్పటికిని మద్రాసు మ్యూజియములో చూడవచ్చును.

ఉత్తమములైన అమరావతీ శిల్పచిత్రములు చూడని విచారమును నాగార్జునుని కొండ స్తూప చిత్రములు పో గొట్టుచున్నవి. నాగార్జునుని కొండస్తూపమునకు సంబం ధించిన శిల్ప చిత్ర శిలాఫలకములు అనేకములు దొరికినవి. ఈ శిలా ఫలకములమీద చెక్కిన చిత్రములు నిన్ననో మొన్ననో గండరించినట్లున్నవి. ఇవికూడ అమరావ శిల్ప సంప్రదాయము ననుసరించి చెక్కినవే. త్రవ్వి వె పలికి తీయుటలో ఆర్షశాఖాధికారులు చాల శ్రద్ధవహించు చేత చాల శిలా ఫలకములు సుస్థితిలో నున్నవి. బుద్ధు జీవితమునందలి ఘట్టములను, బౌద్ధ జాతక కథల చిత్రించుటలో ఆనాటి శిల్పులు చాల నేర్పు చూపినార ఈ శిల్ప చిత్ర సంపదలోని బౌద్ధదేవతామూర్తుల చూచినకొద్ది చూడవలెననిపించును. వారి కనులలో కరుణ వదనములో శాంతము తొలకాడుచుండును. ప్రతి చి మును రస భావ స్ఫోరకమై మనతో మంతనము సలు చున్నట్లుండును. చిత్రించిన ప్రతిఘట్టమును, ప్రతికథయ మన మనస్సును చూరగొని మన కానంద మొదవిం నొక శిల్ప చిత్రకావ్యమే.

నాగార్జునుని కొండ స్తూప చిత్రములలో కానన మరొక విశేష మేమన, అందలి శృంగార నాయి నాయక చిత్రములు. శిలాఫలకముమీద ఒక్కొక్క గడిలో బౌద్ధజాతక కథనో, దానికి సంబంధించిన ఒ ఘట్టమునో, లేదా బుద్ధుని జీవితమునందలి ఒక క సందర్భమునో, లేక స్తూప ధర్మ చక్రారాధనము చిత్రించిన పిదప ఒక గడిలో స్త్రీ పురుష ప్రతి లను—విసుగుదల పోగొట్టుటకో, చూచువారికి వినోద నిమిత్తమో— చిత్రించువారు. ఇవి మిధునములు; బౌ జాతక కథలకు గాని, బుద్ధ జీవితమునకుగాని ఏమా మును సంబంధించనివి. బౌద్ధ కథలను చెక్కుట ఆనాటి బౌద్ధాంధ్ర శిల్పి ఎంతటి శ్రద్ధాసక్తులను జూపె ఈనాయికా నాయకులను మలచుటలోను అంతటి విన ణమును చూపెను. ఈనాయికా నాయకుల భంగిమ ఆవేష భూషాలంకరణ విధానము, వారి వదనముల ప్రస్ఫుటముగా గోచరించు రసభావాభిరతి చూచుట కిం గొలుపుచుండును. ప్రణయకలహము, క్రోధము, సంప్ర నము, ధూర్తలక్షణము మొదలైన ఎన్నెన్ని రకముల భావములనో ఆనాయికా నాయకుల యుద్వృత్తిలో వ్య మగునట్లు చిత్రించిన చిత్రములు అవి. ఈ చిత్రము వాత్స్యాయనుని కామసూత్రములను గ్రంథములో అభి తులైన శృంగారనాయకులను దృష్టిలో నుంచుకొ బౌద్ధాంధ్ర శిల్పులు తద్వర్ణనముల కనురూపముగ చెక్కి వని కొందరు కళాభిజ్ఞు లందురు. కాని వాత్స్యాయన కా సూత్రములలోని శృంగారనాయకులకు ఈ శిల్పములో

# బౌద్ధ యుగమునాటి మూర్తి శిల్పము



1. మాంధాత జాతకము - జగ్గయ్యపేట.



2. (శిరసుపోయిన) బుద్ధవిగ్రహము - నాగార్జునకొండ



3. మిథునచిత్రము – ధర్మచక్రారాధనము - నాగార్జునకొండ :



4. యక్షప్రతిమ

2nd, 3rd and 5th pictures are printed by the kind courtesy of the Archaelogical Survey of India, Southern Circle, Mylapore, (Madras).

1st, 4th and 6th pictures are printed by the kind courtesy of the Superintendent, Government Museum, Madras.

# బౌద్ధ యుగమునాటి మూర్తిశిల్పము



5. యక్షప్రతిమ - నాగనాగినీ చిత్రములు : స్తూపారాధనము . (నాగార్జునకొండ)





6. బుద్ధ జీవిత కథాఘట్టములు. (మొదటిది, చివరిది) మిథునచిత్రము - (నడిమిది) గోలీ



పుష్ప సంభరితమైన పూర్ణఘటము అమరావతి

By the kind courtesy of Telugu Bhasha Samithi, Madras.
& the Superintendent, Govt. Museum, Madras.

నాయికా నాయకులకు ఏవిధమయిన సంబంధము లేదని నా యభిప్రాయము. అటువంటి సంబంధము ఏమియు లేదన్నంతమాత్రమున నాగార్జునుని కొండ స్తూప శిల్పములోని ఈ మిధున చిత్రములకు గల విలువయు తగ్గదు. వాటికిగల గుణయోగ్యతయు కొరవడదు. ఈ చిత్రములు విశ్వమోహనమైనవి; అద్వితీయమైనవి; వివిధ రసభావస్ఫోరకములైనవి. పూజ్యుడయిన బుద్ధభగవానుని పురాణకథలను చిత్రించు సందర్భమున ఎడనెడఇటువంటి మిధున చిత్రములను చిత్రించుట ఆశ్చర్య కరముగనే యున్నది. మహాయాన సంప్రదాయము వచ్చి బౌద్ధధర్మమును, తన్మూలమున నిర్వాణోపలబ్ధిని సర్వజన సులభము కావించినందులకు సామాజికులలో గలిగిన యానందాతిరేకమునకు ఈ చిత్రములు సూచకములేమో! ఆనాటి యాంధ్రసామాజిక రసాత్మక జీవన ప్రవృత్తి కివి కొన్ని ప్రతికృతులు.

బౌద్ధాంధ్రశిల్పులు ఆనాటి స్త్రీజనమువలెనే బహుళాలంకార ప్రియులు. వాడుకచేయు పాత్రలు, కట్టుకొను బట్టలు, తొడిగికొను నగలు - అన్నియు రకరకములైన వన్నె చిన్నెలతో, పరికల్పనములతో, కంటి కింపుగను సొంపుగను ఉండిననేకాని వారి కభిమతముగ నుండెడిది కాదు. చూచునది, చేపట్టునది— సమస్తము లక్ష్మీకళతో తాండవ మాడుచుండ వలెను. ఈ యాశయమే వారి కళాపరమైన కృషిలోను ప్రతిఫలించినది. స్త్రీపురుషులు ధరించిన యాభరణములు, ఉష్ణీషాదులు, ఆసనములు మొదలైనవాటి తీర్పుతీరువలలో, బౌద్ధాంధ్ర శిల్పి తనకళావైదగ్ధ్యమంతయు జూపి చూపర నద్భుతాశ్చర్య రసనిమగ్నులను జేసినాడు.

అమరావతీ నాగార్జునుని కొండస్తూప శిల్పచిత్రములలో కొన్ని నగ్న స్త్రీ చిత్రములును కలవు. అయితే, మతవిషయక వృత్తములను దీసికొని వాటిని శిల్పములో చిత్రించునపుడు మాత్రము అట్టి నగ్నచిత్రములు కానరావు. బౌద్ధాంధ్ర శిల్పి బౌద్ధ ధర్మమునకు సంబంధిచిన ఇతివృత్తముల పవిత్రత నెప్పుడును చెడగొట్టలేదు. సౌందర్య మహితమై యుండవలెనేకాని శిల్పికి కళాజీవికి కళలో చూపరాని దేది? లలితకలా ప్రపూర్ణమును, రసాత్మకమునైన దివ్యసృష్టి - స్త్రీమూర్తి. స్త్రీ సౌందర్యవిలాసములను శిల్పములో చిత్రించుటలో బౌద్ధయుగము నాటి శిల్పికి ఒకలాలస; ఆ స్త్రీ మూర్తి సర్వాంగీణ సౌందర్యము నవకాశము చిక్కిన చోట నెల్ల చిత్రించి చూపవలెనని ఆంధ్రశిల్పి కంతటి కుతూహలము. అందువలననే అందందు నగ్న స్త్రీ చిత్రములు మనకు కాన్పించును. బౌద్ధాంధ్ర శిల్పి తన శిల్పకలా నైపుణ్య నిరూపణమున కెత్తిన రత్నపతాక లాచిత్రములు.

అమరావతీ స్తూపశిల్పములలోనేమి, నాగార్జునునికొండ స్తూపములలోనేమి — భంగిమలలోను, రసభావ విలాసములలోను ఒకస్త్రీమూర్తిని బోలినదాని నింకొక మూర్తిని చూడము. ఆనాటి యాంధ్రశిల్పి చాతుర్యము నరయవలెనన్న చిత్రితములైన స్త్రీమూర్తులను సాకల్యముగను, సావకాశముగను, సావధానముగను, సవిమర్శకముగను పరిశీలింపవలయును. ప్రతిమూర్తిలోను ఏదో యొక సొంపు, ఏదో యొక యందము, ఏదో యొకసౌరు, ఏదో యొక తీరు, ఏదో యొక విలాసము—అంతయు సౌందర్యమే గోచరించును. బౌద్ధాంధ్ర శిల్పనందనారామములో పూచిన పుష్పలతికలీ సుకుమారస్త్రీ చిత్రమూర్తులు. ఇంతటి సౌకుమార్య లాలిత్యములు చిందునట్లు ఆ స్త్రీమూర్తులను చిత్రించుటకు ఆనాటి శిల్పులెంతటి రసానుభూతి గలవారో. అటువంటి శిల్పకృతులను రచియించుటకు తగినంత చిత్తసంయమనము, కళాభినిరతి, ఆనందాతిరేకము, ఆత్మ విశ్వాసము ఉండవలెను. ఏతాదృశగుణవిరాజితులు గనుకనే నాటి ఆంధ్రశిల్పు లిట్టి యపూర్వశిల్ప కృతులు రచియింప గలిగినారు. వారు నిజముగా కర్మయోగులు; ధార్మిక జీవనులు. అట్లని వారు సర్వసంగ పరిత్యాగము చేసి ప్రాపంచిక జన జీవనమునకు దూరగులైన సన్యాసులు కారు. వారు యోగులై భోగము ననుభవించినవారు; అట్లని భోగలంపటులును కారు. యోగ భోగములను సమపాళముగ ననుభవించి అనుభూతిని తెచ్చుకొన్నవారు గనుకనే బౌద్ధాంధ్రశిల్ప జగత్తును రసమయముగ తీర్చి దిద్ద గలిగినారు.

అమరావతీనాగార్జునునికొండలకు తరువాత పేర్కొనవలసినవి గోలీ శిల్పములు. గోలీ గ్రామము గుంటూరు జిల్లా పల్నాడుతాలూకాలోనిది. ఇక్కడ బౌద్ధస్తూపము కానరాలేదు కాని స్తూపమునకు సంబంధించిన శిల్పచిత్ర శిలాఫలకములు కానవచ్చినవి. ఈ శిలాఫలకము లిపుడు మద్రాసు మ్యూజియములో నున్నవి. పూర్వ మీ గోలీ ప్రాంతమున స్తూప ముండియుండును. అది నాశనముకాగా ఎట్లెట్లో ఈ శిలాఫలకములు మాత్రము మన యదృష్ట

వశమున నిలిచి యున్నవి. ఈ శిలాఫలకములమీద చిత్రితములైనవి బుద్ధుని జాతక కథలే; బుద్ధ జీవిత కథాఘట్టములే. ఈ శిల్ప చిత్ర రచన కూడ అమరావతీ శిల్ప సంప్రదాయము ననుసరించినదే యని వేరే నుడువనక్కరలేదు ఇవి క్రీస్తు శకము మూడవ శతాబ్ది నాటివి. ప్రాయికముగా క్రీ. శ. 275 ప్రాంతపువి కావచ్చును; అంతకంటె కొంచెము తరువాతివైన నగునేమో. గోలీ శిల్ప చిత్రరచనలో ఆంధ్ర శిల్పులు అవలంబించిన సాంకేతిక పద్ధతికిని నాగార్జునునికొండ స్తూప చిత్ర రచనలో కనబడు సాంకేతిక పద్ధతికిని చాలా దగ్గర సంబంధ మున్నది; ఇదియు నదియు నొక్కటే యన్నను సత్యదూరము కాదు. నాగార్జునుని కొండ శిల్పములవలెనే ఈ గోలీ శిల్పములందును మిధున చిత్రములు కలవు. ఇవియు శృంగారపరమైనవే. అయితే నాగార్జునునికొండ శిల్పకృతులలోని శక్తి, జవము, గాంభీర్యము, పుష్టి- వీటిలో అంత కొట్టవచ్చినట్టు కాన్పించవు. కాని అందచందములలోను, రస భావ స్ఫూరణలోను ఇవి నీరసములని మాత్రము చెప్పలేము. అమరావతిది గోలీది ఒకటే సంప్రదాయ మిదివరలో చెప్పినట్టు. గోలీ చిత్రములు రూపనిరూపణమునను, కథావివరణ విధానమునను అమరావతీ చిత్రముల కేమాత్రమును తీసిపోవు. ఈ గోలీ శిలాఫలకములు శీత వాతా తపములకు గురియగుట వలననో మరే కారణముననో చెడిపోయినవి. ఈ కారణమున కావచ్చును ఈ చిత్రము లంత అచ్ఛస్వచ్ఛముగను, నవనవముగను కనిపించుటలేదు. ఈ గోలీ శిల్పములలోని సిద్ధార్థ ప్రతిమ కానయితే పెద్ద విగ్రహమేకాని రుచిర క్రియాసంపన్నమైనదియు కాదు; ఇందు నయగారపు పనితనములేదు. ఇది ప్రాయికముగా చాల తరువాత చెక్కినదై యుండునేమో.

అజంతా చిత్రకారులకు మూర్తి చిత్రరచనలో వరవడి పెట్టినది అమరావతీ శిల్పరచనలే. మూడుమూర్తుల అజంతా చిత్రకారులు అమరావతీశిల్ప చిత్రముల ననుకరించినారు. భంగిమలలో, రూపనిరూపణములో, సాదృశ్యచిత్రపరికల్పనములో—దీనిలో దానిలో అన్నమాటయేల, అన్నిట—కొన్ని కొన్ని అజంతా గుహలలోని చిత్రములు అమరావతీ శిల్పచిత్ర మాతృకల పుత్రికలే. అజంతా చిత్రకళా సంప్రదాయములో కానవచ్చునది అమరావతీ శిల్పచిత్రరీతియే. ఈ రీతిని ఆధారపరచుకొనియే తరువాతి శతాబ్దులలో ఆంధ్రదేశములో- ఒక్క ఆంధ్రదేశములోనేకాదు, దక్షిణాపథదేశము లన్నిటిలో—శిల్ప చిత్రకళలు చిపురు తొడిగి తీగెసాగి వర్ధిల్లినవి. ★

# గ్రామములు — విజ్ఞానప్రబోధము

శ్రీ గిడుగు సీతాపతిగారు

నేను 38 ఏండ్ల క్రిందట మా భూములుండిన ఒక చిన్న గ్రామానికి వెళ్ళాను. అప్పుడు మొదటి ప్రపంచ మహా సంగ్రామము ప్రారంభించి మహాభయంకరంగా సాగుతూ ఉండెను. నేను మా పెద్దరైతు ఇంటికి వెళ్ళగానే అతడు తన ఇంటికి చేరువగా నున్న గ్రామ మునసబింటికి తీసుకొనిపోయి అక్కడ వీధి అరుగుపై పరచిఉంచిన తుంగచాపమీదను కూర్చుండు మన్నాడు. నేను కూర్చున్న పది నిమిషములలో గ్రామమునసబు, కరణము, పదిమంది రైతులు వచ్చి నా చుట్టుచేరి దండాలు పెడుతూ కూర్చున్నారు. ఆ వూరంతటికిన్ని కాస్త చదువెరిగిన వాడు గ్రామ కరణము. అతడు కొన్ని శతకాలు, పెద్దబాలశిక్ష చదివిన వాడట. సర్వేపనీ లెక్కలూకూడా కొన్ని నేర్చు కొన్నాడట. ఆ ఊళ్ళో ఒక చిన్నబడి 10 ఏండ్లయి సాగుతూ ఉన్నా, ఉత్తరాలయినా వ్రాయగలిగినవారు గాని, చదవగలిగినవారుగాని పట్టుమని పదిమందైనా లేరు. బడిపంతులు రెండు మైళ్లు దూరంలో ఉన్న మరియొక గ్రామం నుండి వచ్చిపోతూ ఉంటాడట. తనఇష్టము వచ్చినప్పుడు రావడం తన ఇష్టము వచ్చినప్పుడు పోవడం చేస్తూ ఉంటాడట. బడిలో 30 మంది పిల్లలు చదువుకొంటూ ఉన్నట్టు పేళ్ళజాబితా ఉందిగాని, సగటున దినానికి 10 మంది పిల్లలు హాజరు కావడం మామూలు. స్కూళ్ళ ఇన్స్పెక్టరు వచ్చిననాడు మాత్రం బడిపంతులు ప్రొద్దున్నే వచ్చి ఇంటింటా తిరిగి బడిపిల్లలని రప్పించుకొని హాజరు పెడుతూ ఉంటాడట. నేను వెళ్ళిన దినం రానేలేదు. మధ్యాహ్నం 3 గంటలయింది. "మరి ఈదినం వచ్చేదేమి" టన్నారు ఒకరు. "లేదు లేదు వచ్చాడు; రేపేమో వాళ్లమ్మ తద్దినమట ఒక పనసకాయ, కందమూలదుంపలు అరటాకులు తీసుకొని పోయాడు. పొన్నూరికి పోయి బ్రాహ్మలకు చెప్పుకోవాలట. నేడూ రేపూ బడిలేదన్నాడు" అని గ్రామమునసబు చెప్పాడు. "ఈ ఊరు జనాభా ఎంత" అన్నాను "సుమారు ఏడువందలు. అందులో సుమారు 400 పురుషులు. 300 స్త్రీలు" అన్నాడు కరణము. "చదువుకొనే ఈడుపిల్లలు?" అన్నాను. "మగపిల్లలు ఒక వందమంది, ఆడుపిల్లలు 80 మంది ఉంటారు" అన్నాడు కరణము. "ఇంతమంది పిల్లలున్నా బడిలో లెక్క జాబితాకు 30 మంది పిల్లలూనూ వాస్తవం చదువు కొంటూ ఉన్న పిల్లలు 10 మందీనా ? ఏమి అన్యాయం !" అన్నాను. "ఏం చదువులు బాబూ ! ఎందుకొచ్చిన చదువులు ?" అన్నారు కొందరు. "ఈ పదేండ్లలోనూ ఒక పిల్లడయినా పెద్ద బడిలో చదువుకోడానికి బస్తీకి వెళ్ళాడా? అని అడిగాను. అప్పుడొక చిన్నరైతు ఒక 16 ఏండ్ల వాణ్ని చూపించి, "వీడొక్కడే బాబూ ! ఇక్కడ నాలుగు క్లాసులు చదివినవాడు పరీక్షలో బాగా నెగ్గినాడు. మీ పెద్దరైతు చిన్న తమ్ముడు. బస్తీకి పంపించి చదివించు ; తెలివైనవాడని ఇన్స్పెక్టరు అంటే వాళ్ళమ్మ పడనీయలేదు. బస్తీలో ఎక్కడుంటాడు ? ఏమిటి చేస్తాడు ? ఒస్తూపోతుండడానికి పదమూడు కోసులు దూరం. వచ్చిన చదువు చాల్లే భూములు దున్నుకొనే వాళ్ళకు పెద్దచదువులెందుకు? అనేసింది" అన్నాడు "పోనీ ఇక్కడేమైనా చదువు కొంటున్నాడా?" అన్నాను. "చదువూ చట్టుబండలూలేదు. వచ్చినచదువు మర్చిపోయినాడు. దుక్కిపనులకు దొంగ. చదువుకొన్నాణ్ని పశువులు కాస్తానా? నాగలి పట్టుకొంటానా? అంటాడు. చదువుకొన్నందుకిదీ ఫలం! చదువులు మీ బస్తీపిల్లలకేకాని వ్యవసాయం చేసుకునిబ్రతికే మాపిల్లల కెందుకుబాబూ!" అన్నాడు మాపెద్దరైతు. "ఏదీ అబ్బాయి ఇలారా నీవెంత బాగాచదవగలవో చూస్తాను" అని నా చేతిలో ఉన్న ఆంధ్ర పత్రికతీసి "ఇక్కడ చదువు" అని అతని చేతికిచ్చాను. అప్పుడా చిన్నవాడు పత్రికచేత బట్టుకొని ఎగాదిగా చూచి పెండ్లికూతురిలాగు సిగ్గుపడుతూ చదవడానికి మొదలు పెట్టాడు "యుద్ధము తీవ్రముగా సాగుచున్నది జర్మనీ కైజరు విజృంభణ ముచ్చదశలో ఉన్నది. అటు

# గ్రామములు — విజ్ఞానప్రబోధము

జర్మనీ సేనలు ఫ్రాన్సుదేశములోను ఇటు ఆస్ట్రియా సేనలు రష్యా సెర్బియా దేశములందును తీవ్రముగా జైత్రయాత్రలు సాగించుచున్నవి. ఇట్టి క్లిష్టపరిస్థితులలో ఇటలీవారు ఆస్ట్రియాకు విరుద్ధముగా సంగ్రామ రంగములో ప్రవేశించుటవల్ల బ్రిటిషు పక్షమువారికి కొంత మేలు కలుగవచ్చును" అని చదివి వినిపించినాడు. "ఈ దేశాలెక్కడున్నవో తెలుసా?" అని అడిగాను. తెలియదన్నాడు. "వాడి చదువుమాటకేమిటిబాబూ దిక్కుమాలిన చదువు, ఏదో సతుకుతాడు. యుద్ధం మాటలు చెప్పండి బాబూ. జర్మనీవోడు గెలుస్తున్నాడట మన కుంపినీ దొరలు ఓడిపోతున్నారంట. మన దేశం జర్మనీరాజు గెలుసుకొంటాట్ట. ఆరాజు పేరు కేసరి మన తెలుగు పేరేనంట. ఇక మనకి కొత్త ప్రభువులు వస్తారంట నిజమేనా బాబూ!" అని ఒక ముసలి రైతడిగాడు. అలాటి తెలిసీ తెలియని అవస్థలో ఉన్న గ్రామాలవారికి అప్పుడు జరుగుతూ ఉండిన మొదటి ప్రపంచ మహాయుద్ధము గురించి ఏమిటి చెప్పను? ఎక్కడ ఆరంభించేది? ఎట్లు చెప్పేది? అని నాలో నేను ఆలోచించుకొని ఏదో ఒక విధంగా వాళ్ళకి కొస్తయినా బోధపడేటట్టు చెప్పాను. చెప్తూ ఉన్నంతసేపు నోరు తెరచుకొని వింతగా చూస్తూ విన్నారు నా మాటలు. అంతావిని "మన మహాభారతం యుద్ధంకంటె గొప్ప యుద్ధమా బాబూ!" అని ఒక ముసలివాడడిగాడు. మహాభారత యుద్ధం వాస్తవంగా ఎంత గొప్ప యుద్ధమో అడిగినవాడికీ తెలియదు, నాకూ తెలియదు. గ్రంథంలో వ్రాసి ఉన్నది నేనూ చదివాను. చదివినవాడు చెప్పగా, వాడి చెవిని పడగా వాడికి బోధపడినంతవరకు అది చాలా గొప్పయుద్ధమని తలచి అంతకంటె గొప్పయుద్ధం ఉండగలదా? అన్న ఉద్దేశంతో వాడడిగాడు. "ఆహా అంతకు పదిరెట్లు గొప్ప యుద్ధం. భారతయుద్ధము ఒక చిన్నప్రదేశంలో మాత్రమే జరిగింది. ఇది అలాంటి ప్రదేశాలు నూరింతలు ఏకమైన చోట్ల జరుగుతూ ఉంది. అది 18 దినాలలో ముగిసింది. ఇది సంవత్సరంపైగా జరుగుతూ ఉంది. ఇంకా ఎన్ని సంవత్సరాలు ఇంకా ఎన్నెన్నిప్రదేశాలలో జరుగుతుందో చెప్పలేకుండా ఉన్నాం, ప్రపంచమంతా అలుముకొంటూఉంది." అన్నాను, "మీరు చదవడం అయిపోతే ఆ ఆంధ్రపత్రిక మాకివ్వండి బాబూ! నాలుగు మాసాల కిందట నేను బస్తీకి పోయినప్పుడు కొన్నాను ఒక పత్రిక నాటినుండి నేటివరకూ ఆంధ్రపత్రికలు ఒకటయినా ప్రాప్తం కాలేదు" అన్నాడు కరణము. "ఇస్తాను తప్పకుండా. చదివి, చదవడమేకాకుండా అందులోని విషయాలు మీగ్రామస్థులకు చెప్తానంటే ఇస్తాను" అన్నాను. "ఎవరికొక్కావాలి బాబూ, తమరు వచ్చారు గనుక నేడు శ్రద్ధగా కూర్చుండి వింటున్నారు." అన్నాడు కరణము. "ఉండవయ్యా మా చెప్తున్నావు. కొస్త తెలిసినవాడు గదా అని మే మేదైనా అడిగితే మీకు కబుర్లు చెప్తూ కూర్చోడమే నా పనా? అంటాడు బాబూ! ఈ కరణం." అన్నాడు ఆ ముసలివాడు. ఆ గ్రామంలో పత్రికలంటే ఏమిటో తెలియనివాళ్లు, సముద్రం చూడనివాళ్ళు, రైలు చూడనివాళ్లు, టెలిగ్రాం అంటే తెలియనివాళ్ళు, కాశీ రామేశ్వరాలు ఎటువైపున్నవో తెలియనివాళ్ళు అనేకంగా ఉండిరి. అటువంటి గ్రామం 30 ఏండ్లలో చాలా మారిపోయింది. ఎనిమిదేండ్ల క్రిందట ఆగ్రామానికే వెళ్ళి చూచాను. అప్పటి చిన్నబడి హయ్యర్ ఎలిమెంటరీ బడి ఆయినది. గ్రామంలో ఒక గ్రంథాలయం వెలిసింది. ఒక సహకార సంఘం ఏర్పడింది. ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ మొదలయిన దినపత్రికలు, ఢంకా వినోదినీవంటి మాసపత్రికలు, ఆనందవాణివంటి వారపత్రికలు తెప్పించుకుంటున్నారు, చదువుతున్నారు. గ్రామంలో చాలా చరకాలున్నవి. సన్న నూలు వడుకుతున్నారు, కాంగ్రెస్ సంఘం ఉంది. పదిమంది జైలుకు వెళ్ళివచ్చిన కాంగ్రెస్ ప్రముఖులుకూడా ఉన్నారు. రెండవ ప్రపంచ మహాసంగ్రామ వార్తలు తెలుసుకొన్నవారున్నారు. రేడియో సౌకర్యాల కోసం దరఖాస్తులు పెట్టుకొన్నారట.

ఈలాగు వృద్ధిలోనికి వచ్చిన గ్రామాలు అనేకంగా ఉన్నవి. వీటి చరిత్ర తెలుసుకుంటే గ్రామాలలో విజ్ఞాన ప్రబోధం ఏవిధంగా కాగలదో ప్రబుద్ధమైన విజ్ఞానం ఎట్లు వికసించగలదో బోధపడుతుంది. విజ్ఞాన ప్రబోధానికి ముఖ్యంగా కావలసింది విద్య. చదువురానివారికి కూడా విద్య అలవరచవచ్చు. చదువుకొన్నందువల్ల ఏవిషయములు తెలియగలవో ఆవిషయములు ఇతరులు చదివి వినిపిస్తే మాత్రము తెలియకుండా ఉంటవా? అయితే చదువుకొన్నవాడు ఇతరులమీద ఆధారపడనక్కరలేకుండ తనంతతాను గ్రంథాలు చదువుకోగలడు. చదువురానివాడు ఇతరులమీద ఆధారపడుతూ ఉంటేనేకాని ఏవిషయం తెలుసుకోలేడు.

కష్టపడి ఎవరి పనులు వారు చేసుకొంటూ కడుపునిండ తిండి, బట్టా, హాయిగా ఉండడానికి ఇల్లూ సంపాదించుకొని పెండ్లాము పిల్లలతో సుఖముగా జీవనము సాగించుకొంటూ ఉంటే చాలదా ఈ విజ్ఞానమెందుకు? ఈ ప్రబోధమెందుకు. ఉద్యోగాలు సంపాదించుకోవలసిన వారికి చ

వులూ విద్యలూ గాని ఉద్యోగాలక్కరలేని వాళ్ళకు చదువు లెందుకు అని అనే వారు చాలా గ్రామాలలో చాలామంది ఉన్నారు. అలాగనుకోడం చాలా తప్పు. పక్షులూ, మృగాలూ కూడా మేత సంపాదించుకొంటున్నవి. పక్షులు గూళ్ళు కట్టుకొంటున్నవి. అడవి మృగములు గుహలలో దూరుతున్నవి. ప్రకృతి సిద్ధంగా పక్షులకుగాని మృగములకుగాని లేని శక్తులు రెండు మానవులకు గలవు. వాక్ సక్తి, ధీ శక్తి అంటే మాటలాడే నేర్పు, బుద్ధి బలము. ఈ రెండు శక్తులున్ను మనకు ప్రత్యేకముగా ఏర్పడి ఉన్నందుకు మనము వాటిని ఉపయోగించుకోక కేవలం తిండీ, బట్టా ఇల్లూ మాత్రమే సంపాదించుకొని జీవినం సాగిస్తూ ఉంటే పక్షులకంటే, మృగములకంటే మన ఆధిక్యమేమున్నది చెప్పండి.

ప్రపంచంలో చాలామంది అలా తృప్తిపొంది ఊరుకోలేదు. ఆరువేల సంవత్సరాలక్రిందట ఉండిన భూలోకాన్ని, నేడు కనబడుతూ ఉన్న భూలోకాన్ని పోల్చి చూడగలిగితే భూతలం ఎంత చిత్రవిచిత్రంగా మారిపోయిందో తెలియగలదు. కేవలం అడవులతో ఉన్న ప్రదేశాలు అనేకం చక్కని పొలములతోను, తోటలతోను కలకలలాడుతున్నవి. కోట్ల కొలది గ్రామాలు, పట్టణాలు, నగరాలు వెలసినవి. కొండలలోనుండి రైళ్ళు నడుస్తున్నవి. ఏళ్ళపైని పెద్ద పెద్ద వంతెనలు కనబడుతున్నవి. నదుల నీరు సూటిగా పారి సముద్రములో కలిసి ఉపయోగం లేకుండా పోతూఉంటే, వాటికి అడ్డంగా ఆనకట్టలు కట్టి నదులనీరు కాలువలగుండా పొలాలకు పారించుకుంటున్నాము. గృహనిర్మాణం అద్భుతంగా అభివృద్ధిపొందింది. మనదేశంలో దివ్యమైన దేవాలయాలు, గోపురాలు నిర్మితమైనవి. అమెరికా దేశంలో ఆకాశానికి అందుకొనే అరవై డభ్భై అంతస్థుల మేడలు కడుతున్నారు. భూమి మీదను రైళ్ళు, మోటార్లు, నీటిపైని స్టీమర్లు, ఆకాశంలో విమానాలు మనలను వాయువేగంతోను, మనోవేగంతోను తీసుకొనిపోతూ ఉన్నవి. వేలకొలది భాషలు పుట్టినవి, అనేక భాషలు అభివృద్ధిలోనికి వచ్చినవి. చిత్రలేఖనం అనేక దేశాలలో కన్నులపండువగా విలసిల్లుతూ ఉంది. నాటకాలు, నాట్యాలు, సినీమాచిత్రాలు మనోహరంగా విజృంభిస్తున్నవి. సృష్టి, సృష్టికర్త, ఆత్మ, పరమాత్మ, ముక్తి, మోక్షం మొదలయిన విషయాలకు సంబంధించిన విద్యకూడా వృద్ధి పొందుతూ ఉన్నది. దూర శ్రవణశక్తి ఎట్లు మానవులకు కలిగిందో ఈ రేడియోయే మీకు నిదర్శనం గదా! ఇక దూరదర్శనం మీరున్ను చేయగలుగుతారు. అనగా దూరదేశంలో ఉన్నవారి వాక్కు వినడమే కాదు. ఆమాటలాడుతూ ఉన్నవారి ముఖము కూడా చూడగలుగుతారు. ఈవిధంగా ప్రపంచం విజ్ఞాన ఫలం పొందుతూ ఉంటే గ్రామాలు కూపస్థ మండూకాలవలె నూతిలోని కప్పలవలె తామున్నదే లోకమన్నట్లు ఎక్కడేమి జరుగుతున్నదో తెలుసుకోకుండా ఉండడం మంచిదా చెప్పండి.

విజ్ఞాన ప్రబోధం కలుగాలంటే బడులు కావాలి. గ్రంథాలయాలు కావాలి, పత్రికలు కావాలి. వాటిని చదివి అందులోని విషయాలు తెలుసుకోవాలి. రేడియో విజ్ఞాన ప్రబోధానికి గొప్పగా తోడ్పడుతున్నది. విద్యాధికులు తమ అనుభవాలు, తాము తెలుసుకొన్న విషయాలు సంగ్రహించి రేడియో ప్రసంగాలద్వారా మీకు అందజేస్తున్నారు. మునుపు పాడేవారి పాట వారికి చేరువగా ఉన్నవారే విని ఆనందించేవారు. ఇప్పుడు రేడియో ద్వారా ఎంత దూరంగా ఉన్నవారయినా వినగలుగుతున్నారు. విజ్ఞాన ప్రబోధానికి పెద్దల ఉపన్యాసాలుకూడా ముఖ్యం. సభలు చేసి పెద్దలను పిలిపించుకొని వినాలి. విద్యకు జాతిమత భేధాలుగాని, స్త్రీ పురుష భేధాలుగాని లేవు. బ్రాహ్మణుడు మొదలు హరిజనుడి వరకున్ను మగవారు ఆడవారు,గొప్పవారు పేదవారు ఏవిచక్షణాలేక అందరున్ను విజ్ఞానాన్ని సంపాదించుకొనుటకు సమానమైన హక్కులు గలవారే.

తే 1-10-53 దీని ఆంధ్రరాష్ట్రావతరణము జరిగినది. ఇది భాషాప్రయుక్తరాష్ట్ర విభజన అనే సూత్రము ననుసరించి ఏర్పడిన రాష్ట్రము. అనగా ఏ మండలమందు గల జనులలో నూటికి ఇంచుమించు 98 మంది తెలుగు మాతృ భాషగా మాట్లాడుతున్నారో ఆ మండలమంతా ఒక రాష్ట్రముగా ఏర్పడినది అన్నమాట. ఇక నీరాష్ట్రములో విద్యా శిక్షణములు— ప్రాథమిక విద్యాశ్రేణి మొదలుకొని విశ్వవిద్యాశ్రేణివరకున్ను తెలుగు భాషలోనే జరిపించుకోగలము. అంతేకాదు అన్నికార్యాలయాలలోను, న్యాయస్థానాలలోను, ప్రభుత్వశాఖా వ్యవహారాలలోను, శాసనసభా కార్యకలాపాలలోను అన్నిటను తెలుగు భాషకే స్థానముంటుంది. కేంద్రప్రభుత్వమువారితో వ్యవహరించడానికి హిందీ భాష ప్రభుత్వమువారికిన్ని, న్యాయస్థానమందలి ఉన్నతోద్యోగులకున్ను తప్పనిసరిగా రావాలని ఉంటుంది.

అంతేకాక భారతదేశ వ్యవహారాలు తెలుసుకోగోరువారి కందరికీ హిందీ భాష వచ్చితీరవలెను.

ప్రపంచ సంస్కృతి తెలుసుకొనుటకు ఆశక్తి గలవారు ఇంగ్లీషు (లేదా జర్మన్, ఫ్రెంచి, భాషలలో ఏ ఒకటి అభ్యసించవలెను, ఎన్ని భాషలు వచ్చియుంటే అంత మంచిది. ఎవరెన్ని భాషలు నేర్చుకున్నా ప్రజానీకానికి మాతృభాషయైన తెలుగులో విద్యావంతులు గ్రామాలలో పర్యటనము చేసి గ్రామస్థులకు సంస్కృతికి, విజ్ఞానానికి, నాగరికతకు సంబంధించిన విషయాలు అన్నివిధాలా అందచేయవలెను. నిరక్షరాస్యత నిర్మూలనముకావలెను. వయోజనవిద్య అభివృద్ధి పొందవలెను. గ్రంథాలయములు దేశమంతటనూ నెలకొల్పవలెను. నూతన ప్రాథమిక విద్యావిధానము ప్రతి గ్రామమందును అమలులోనికి రావలెను. నగర సౌభాగ్యముతోపాటు గ్రామ సౌభాగ్యము కూడా అభివృద్ధి పొందినప్పుడే దేశసౌభాగ్యము సర్వాంగ సంపన్నముగా అభివృద్ధి పొందగలదు.



# ఆంధ్ర మహిళాసభ, మద్రాసు.

## Women's National Savings Campaign

### Investments through the Andhra Mahila Sabha.

అమ్మా,

చిన్న మొత్తములతో నిల్వ సేకరణ చేస్తున్న **National Small Savings Scheme** ను గురించి మీరు వినియే యున్నారు. ఆఉద్యమంలో భారతదేశపు స్త్రీలంతా కలిసి పనిచేయుటకూడా మీకు తెలిసినవిషయమే. ఇట్లా మనము దాచుకున్న డబ్బు, ప్రభుత్వమువారు పంచవర్ష ప్రణాళిక అమలునకు, తద్వారా, మాతాశిశు సంరక్షణకు, వైద్య సహాయానికి, విద్యాసంస్థల నిర్మాణానికి వినియోగించగలరు. ఈవిధంగా మనం డబ్బు నిల్వచేసుకుంటూ, నిర్మాణకార్యక్రమానికి ప్రభుత్వమువారికి తోడ్పడుతాము.

ఇంకొక ముఖ్యవిషయము- ఈ నిల్వచేయడము మన మహిళా సభ తరపున చేసినచో, సభకు $1\frac{1}{4}\%$ కమీషను ఇత్తురు. పెద్ద మొత్తములు ఆంధ్ర మహిళాసభ ద్వారా నిల్వచేసిన, ఆంధ్ర మహిళాసభకు పెద్ద కమిషను వచ్చును. ఆ కమిషను, మన వైద్యశాలలో మందులు కొని బీదలకు ఉచితంగా యిచ్చుటకుగాని, లేక, మన పారిశ్రామిక విద్యార్థినులకు భోజనము ఉచితముగా పెట్టుటకుగాని వినియోగింపబడును.

అందువలన మన సభద్వారా మీరు ఈ ధనమును దాచుకొన్నచో, మీరు 3 ఘనకార్యములను నిర్వహించగల్గుతారు.

1. మీ డబ్బు నిల్వ చేసుకొనుట.
2. ప్రభుత్వమునకు నిర్మాణ కార్యక్రమములో తోడ్పడుట.
3. ఆంధ్ర మహిళాసభ సేవా కార్యక్రమములో తోడ్పడుట.

అందువల్ల, నా మనవి నాలకించి, మీరు నిల్వచేయదలచిన ఏ చిన్న మొత్తమునైనా, ఆంధ్ర మహిళాసభ ద్వారా చేయవలసిందిగా ప్రార్థించు చున్నాను.

ఇట్లు,

అ. చన్నఘంటమ్మ

కార్యదర్శిని.



# శిశు హితచర్య





డా॥ డి. లలిత చంచయ్య, M.B.,B.S.,

బిడ్డ పుట్టిన క్షణం నుండియే, పలువిధాలుగా జాగ్రత్త తీసికొని పెంచవలసివుంది. స్నానం, పరిశుభ్రత, ఆహారపానీయాదులు, దుస్తులు, వ్యాయామం, నిద్ర మొదలైన విషయములలో మొదటినుండియే, ముఖ్యంగా తల్లి కడు జాగ్రత్తవహించి పెంచుట ఎంతైనాఅవసరం. అంటే, బిడ్డకు ఎట్టి వ్యాధులు రాకుండా నివారించుతూ, ఆరోగ్యంగా, పుష్టిగా. సర్వాంగసౌష్టవంతో పెరుగునట్లు, తల్లి తన శిశువుకు తోడ్పడాలి. ఈలా తోడ్పడుటకు కొంత విజ్ఞాన విచక్షణలు అవసరమన్నమాట.

## శిశువు కండ్లు—

బిడ్డ పుట్టిన వెంటనే దాని కళ్ళను శుభ్రమైన తెల్ల తడి గుడ్డతో, లేదా దూదితో అతి జాగ్రత్తగా తుడవాలి. ఈ తడిగుడ్డ లేక దూదిని ముందుగానె నీటిలో ఉడికించి వుంచాలి. తుడిచిన తరువాత ప్రతి కంటిలో సిల్వర్ నైట్రేట్ మందును రెండేసి చుక్కలు చొప్పున వేయాలి. ఈ చర్యవల్ల బిడ్డకు ఎట్టి కంటి జబ్బులు రాకుండా నివారించవచ్చును. బిడ్డ గర్భద్వారమునుండి వచ్చునప్పుడు కంటిలో అనేక రోగ క్రిములు చేరవచ్చును. కొందరి గర్భద్వారములో సుఖ వ్యాధుల వలన పుండ్లు ఉండ వచ్చును. అలా వుంటే, మర్మావయవము విషక్రిమి పూరితమై వుంటుంది. ఈ క్రిములే శిశువు కండ్లలో ప్రవేశించినచో గ్రుడ్డి తనం సంభవిస్తుంది. తల్లికి ఈలాంటి రోగములు లేకున్ననూ సరే, పుట్టగానే శిశువు కళ్ళను గురించిన జాగ్రత్త తీసుక్కొని తీరాలి. మన దేశంలో గ్రుడ్డి వారిలో నూటికి తొంభై మందికి, నేనిదివరలో విన్నవించు కొన్నట్టుగా, జాగ్రత్త తీసుకోకపోవటం చేతనే గ్రుడ్డితనం వచ్చిందని ఎరగాలి.

పుట్టిన బిడ్డ సర్వావయవములను చక్కగా పరీక్షించాలి. గర్భంలో పెరుగుకాలములో కాని, గర్భద్వారంగుండా ప్రయాణం చేసేటప్పుడుకాని, కొన్ని లోపాలు ఏర్పడ వచ్చును. కొందరికి విరేచనద్వారం ఏర్పడకుండా ఉండ వచ్చును; మరికొందరికి కాళ్లుగాని పాదాలుగాని వంకర తిరిగి వుండవచ్చును. ఇట్టి సందర్భాలలో వెంటనే డాక్టర్ సలహా సహాయాలను పొందుట అత్యవసరము. ఉదాహరణకు:— విరోచనద్వారం ఏర్పడకుండా పుట్టిన శిశువుకు తక్షణమే శస్త్రచికిత్స చేయకపోతే, అసలు ప్రాణానికే హాని సంభవించవచ్చును. అందుచేత డాక్టరు సహాయం అత్యవసరమన్నమాట.

## శిశుబొడ్డు:—

శిశువు జనించగానే పొట్టకు దగ్గరగా బొడ్డును కోసి వేస్తారు. కొద్దిరోజులలో అది ఎండిపోయి పడిపోతుంది. కాని, ఆ బొడ్డు వూడినచోట కొంచెం పచ్చిగా, పుండుగా వుంటుంది. ఆ చోటును చేతితో తాకకుండా, పరిశుభ్రంగా వుంచాలి. బిడ్డకు స్నానం చేయించిన తరువాత బొడ్డును శుభ్రమైన బట్టతో అతిసున్నితంగా తుడిచి, తిరిగి ఆల్కహాలుతో తుడవాలి. తరువాత దానిమీద కొద్దిదూది వుంచి, బేండేజు కట్టిపెట్టాలి. పుండు ఆరక చీము పోసినా, లేదా, చుట్టూ ఎఱ్ఱగా అయినా, వెంటనే డాక్టరుచేత తగిన చికిత్స చేయించాలి.

## జిగురుకారుట:—

బిడ్డలకు, ఆడ మొగ విచక్షణ లేకుండానే, కొందరికి స్తనములు పుట్టిన కొన్నిరోజులవరకు, పెద్దవై వాటి నుండి ఒక విధమైన జిగురు కారటం కలదు. కొన్ని రోజులకు అవి తమంతట చిన్నవై, నీరుకారుట ఆగిపోతుంది. చికిత్స అవసరం లేదు; కాని మన పూర్వులు మొగబిడ్డల స్తనములను పట్టి అదిమి పిండివేశేవారు. ఈలా చేసి నందువల్ల బిడ్డలకు అపుడపుడు పుండు ఏర్పడి చాల బాధ పడుతారు.

## ఆహారం —

పుట్టిన పన్నెండు గంటల కాలం శిశువుకు ఆహారం అవసరం లేదు; కాని, కాచి చల్లార్చిన మంచినీటిలో,

తేనె గాని గ్లూకోస్ గాని కలిపి రెండు చంచాలు ఒకటి రెండు పర్యాయాలు త్రాపితే చాలు. పన్నెండు గంటల తరువాత తల్లిచేత పాలిప్పించాలి. తల్లికి పాలు చాలినంత ఉండినా, లేకపోయినా సరే, బిడ్డ కిప్పించుట మంచిది. తల్లికి పాలు పడినప్పటినుంచి, మూడుగంటలకొక పర్యాయం చొప్పున బిడ్డకు పాలివ్వాలి. ప్రతిమాటు పది హేను లేక ఇరువది నిమిషముల కాలం పాలివ్వాలి. ఒక సారి ఒకవైపు, మరొకమాటు, రెండవ వైపు మార్చి మార్చి ఇవ్వాలి. తెల్లవారు ఝామున 4 లేక 5 గంటలకు ప్రారంభించి, రాత్రి 11 లేదా 12 గంటలలోగా ప్రతి 3 గంట లకొకసారి పాలివ్వాలి. రాత్రి 11 నుండి తెల్లవారుఝామున 4 గంటలలోపల పాలివ్వటం అనవసరం. ప్రతి పర్యాయం కూడ శిశువు కడుపునిండా పాలు త్రాగు నలవాటు చేయాలి. వేసవికాలంలో అర్ధరాత్రి తరువాత నోరు ఎండి బిడ్డ ఏడ్చి నపుడు పంచదారనీళ్లు ఇస్తేచాలును. ఒక విషయం తల్లి జ్ఞాపకముంచుకోవాలి మూడు గంటలకొకసారి బిడ్డ కడుపు నిండా పాలు త్రాగటం అలవాటు చేయాలి. ఈ విష యాల్లో తల్లి సమయ సందర్భాలననుసరించి తన విచ క్షణత నుపయోగించుట ఉత్తమం.

బిడ్డ పాలు త్రాగిన వెంటనే నోటిని బాగతుడవాలి. పాలివ్వటానికి పూర్వం, ఇచ్చిన తర్వాత పాలిండ్ల మొన లను వాటిచుట్టూ ఉన్న భాగాన్ని బాగా కడగాలి. ఇల్లా చేస్తే పాలిండ్లకు జబ్బులురావు.

తల్లికి పాలు బొత్తిగా లేని సందర్భంలో గాని, బిడ్డకు సరిపోవునంత లేకపోయినాగాని, పోతపాలు పోయక తప్పదు. ఆవు పాలో గేదె పాలో, లేదా, డబ్బాపాలో పోయాలి.

ఆవుపాలల్లో, తల్లి పాలల్లోకంటె, పప్పు పదార్థం ఎక్కువగాను, చక్కెరపదార్థం తక్కువగాను ఉంటాయి. అందుచేత, బిడ్డకు ఆవుపాలివ్వవలసివస్తే, దానిని దాదాపు తల్లి పాలతో సమానంగా చేసి యివ్వాలి. అంటే, పచ్చి పాలలో సగానికి సగం నీళ్ళు పోసి, కాచి కొంత పంచదార కలిపి తాపాలి. బిడ్డ వయసును బట్టి, తూకాన్ని బట్టి, ఎంత పాలు యివ్వాలో నిర్ణయించుకోటం అవసరం. బిడ్డ పెరిగిన కొలది నీటి భాగాన్ని తగ్గించి, పాలభాగాన్ని ఎక్కువ చేస్తూ పోవాలి.

మంచి ఆవుపాలు లభించకపోతేగాని, ప్రయాణం చేస్తున్న కాలంలోగాని, మరేకారణం చేతనైనాగాని, డబ్బాపాలివ్వవలసి వస్తుంది. దుకాణాల్లో పలురకాల పాల డబ్బాలు అమ్ముతారు. వారి వారి బిడ్డలకు ఏరకం డబ్బా పాలు మంచివో డాక్టర్ సలహా తీసికొనుట మంచిది. దాన్ని ఉపయోగించే విధానంలో కూడా డాక్టర్ సలహా పొందాలి. పోతపాలు పోయడానికుపయోగించే గాజు బుడ్లను నీళ్ళతో, బ్రష్‌తో చక్కగా కడిగి, తిరిగి వేడి నీళ్ళతో కడిగి శుభ్రపరచాలి.

బిడ్డకు నెల వెళ్ళినప్పనుండి, రెండు మూడు తొనల కమలాపండు రసం తీసి, అందులో కొంచెం నీరు, పంచ దార కలిపి రోజుకు ఒకటి రెండు సార్లు తాపాలి. క్రమేణా ఎక్కువ చేయాలి. క్రమేణా రెండు ఔన్సులు రసం త్రాగే దాక ఎక్కువ చేస్తూపోవాలి. పండ్లరసం మంచి విరేచన కారి. దీనితోపాటు బిడ్డలకు చేపనూనె కూడా ఇస్తే చాల మంచిది. దీన్ని కూడా బిడ్డకు నెల నిండినప్పటి నుండే ఇవ్వాలి. ఈ రెండు బిడ్డ బాగా పెరగడానికి అత్యవసరము.

బిడ్డకు, తొమ్మిదినెలలు నిండిన తరువాత అన్నం మెత్తగావండి, మజ్జిగతోనూ పాలతోనూ రోజుకొక పూట పెట్టాలి, కాయలు కూరలు ఉడికించిన నీటితో కలిపి పెట్టుట కూడా మంచిది. ఏడాదినిండే టప్పటికి పప్పుకూర లతోపాటు అన్నం పెట్టవచ్చును. రెండుపూటలు కూడా పెట్టవచ్చును, అన్నం పెట్టే కాలంలో కూడ, పడ్లరసం చేపనూనే ఇవ్వాలి.

## తల్లిపాలు మాన్పించటం:

ఇదికొంత కష్టమైన కార్యమేను, ఏడాది లోగానే బిడ్డకు తల్లిపాలు మాన్పించాలి, లేనిచో ఇది బిడ్డకూ, తల్లీకీ, గడ్డుసమస్యగా పరిణమించవచ్చును. అంతేకాదు, అసలు బిడ్డపెరగ టానికి తల్లి పాలుచాలవు. తొమ్మిది నెలలు నిండు చుండగానే, క్రమక్రమంగా పాలు మాన్పిం చటానికి ప్రయత్నించాలి, ఆరు నెలలనుండే బిడ్డకు ఆవు పాలు పోయాలి. ఇట్టి అలవాటువల్ల, తొమ్మిదినెల లపుడు పూర్తిగా మాన్పించటం సులభ సాధ్యమవుతుంది. పోత పాలు పోయునపుడు, తల్లి బిడ్డవద్ద లేకుంటే మంచిది. కాని, తల్లి ఈ విషయంలో కూడా విచక్షణను వాడాలి, లేకపోతే, బిడ్డకు మానసిక సంబంధ వ్యాధులు రావచ్చు.

## పరిశుభ్రత

బిడ్డనుచాలా పరిశుభ్రంగా వుంచుట ఎంతైనా అవసరము. బిడ్డచర్మము చాలాలేతగా సున్నితంగా వుంటుంది. అంచేత సులభంగా చర్మవ్యాధులు, అంటువ్యాధులు సంభవిస్తాయి. దేహానికి నూనెరాసి, పిండితోనైనా సబ్బుతోనైనా తోమి స్నానం చేయించాలి. నీరు గోరువెచ్చగా వుండాలి. కాని చాలవేడిగ ఉండనే కూడదు. స్నానం చేయించేటప్పుడు బిడ్డకు చలిగాలి సోకకుండా గది తలుపులు మూయాలి. (కాని పైపక్కన వుండే కిటికీలు తెరిచే వుంచాలి.) బిడ్డ దేహం చక్కగా పరిశుభ్రమైన బట్టతో తుడిచిన తరువాతనే బయటకు తీసుకురావాలి - ముడుతలు వున్నచోట్ల, అంటే, వ్రేళ్ళ సందులు, గజ్జలు, చంకలు చెవులు, ఆసనం మొదలయిన చోట్లన్నీ. చక్కగా తోమి కడగాలి, శుభ్రంగా తుడవాలి. ఇల్లా శుభ్రంగా వుంచినందువల్ల పుండ్లురావు. ఈ చోట్లలో, బిడ్డలకు ప్రత్యేకంగా తయారుచేసిన పౌడరును వేయవచ్చును. ముఖానికి వేయ నవసరంలేదు. సెంట్లు కలిపిన పౌడర్లను వాడరాదు. ముఖ్యంగా మనదేశంలో బిడ్డలకు తలంటేటప్పుడు చెవుల్లోను కళ్ళల్లోను నూనెపోయు నట్టి దురలవాటు ఇంకనూ వున్నదనే చెప్పాలి. దీనివల్ల బిడ్డకేలాంటి లాభంలేకపోగా, చెవులలో మురికి చేరుటకు తోడ్పడుతుంది. కాబట్టి ఇట్టి దురలవాటును మానివేసి శుభ్రమైన బట్టతో బిడ్డ చెవులు ముక్కులు తుడుస్తే చాలును.

## దుస్తులు :-

మనదేశంలో, చలికాలంలో తప్ప బిడ్డలకు ఎక్కువ దుస్తులు వేయవలసిన అవసరంలేదు. తల్లులు కొందరు తమ ముచ్చట తీరుటకుగాను, బిడ్డలకు అనవసర మైన రక రకాల దుస్తులువేసి బాధ పెట్టు తుంటారు. స్వేచ్ఛగా! కాళ్ళు చేతులు ఆడించటానికీ, ప్రాకటానికీ, ఆడుకొనటానికీ వీలులేకుండా పోవటమే కాక, చమట కాయలు వస్తాయి. సూర్యరస్మి దేహంమీద పడటానికి వీలుండదు. అనవసరమైన దుస్తులువేసి, గదిలోనే బిడ్డనుంచుట వలన, బిడ్డ పెరుగుదల కత్యవసరమైన విటమిన్ "డి" అనే పోషణ పదార్థం అవసర మైనంత ఉత్పత్తికాదు. అంచేత బిడ్డకనవసరమైన దుస్తులు వేయరాదు. ప్రతిదినమూ కొంత సేపు బిడ్డను ఆరుబయట ఉంచుట చాలమంచిది. ఇంటి లోపలనుండి బయటికి తీసుకొనిపోవునపుడు, బిడ్డను కప్పి తీసుకొని పోవాలి. లోపల వుండేగాలికి బయటవుండే గాలికి శీతోష్ణస్థితులు వ్యత్యాసంగా వుంటాయి. శిశువులకు లాగులకు బదులు, డైపర్లు కట్టుట మంచిది. వీటిని ప్రతిరోజూ నీళ్లలో ఉడకబెట్టి సబ్బుతో శుభ్రపరచి ఎండలో ఆరవేయాలి.

## నిద్ర, వ్యాయామం, ఆటలు -

శిశువు పాలుత్రాగు నపుడు తప్ప, తక్కిన కాలమంతా నిద్రపోతుంది. పెరిగిన కొలది నిద్రించు కాలంతగ్గి కాళ్ళు చేతులు ఆడించుతూ ఆడు కొంటుంది. మేలుకొన్నంత సేపు ఒక్కక్షణం కూడ ఊరకుండదు. ఏదో ఒకపని చేస్తూ వుంటుంది. ఇల్లా ఆడుకొనటం వల్లనే త్రాగినపాలు జీర్ణమై ఆరోగ్యంగా పెరుగుతుంది. అలసి చక్కగా నిద్రపోతుంది. కాబట్టి ఆడుకోటం అత్యవసరం. సాయంత్రం పూట బయట పడుకోబెట్టి ఆడుకోనివ్వాలి. దొర్లిపడకుండా, మట్టి మొదలైన వాటిని తినకుండా పెద్దవారు బిడ్డ వద్ద వుండాలి. దృష్టిదోషం, పక్షిదోషం అనే మూఢనమ్మకాలను వదలి బిడ్డను ఆరుబయట ఆడించాలి. ఆరునెలలైనతరువాత, సాయత్రం రెండుమూడు గంటలసేపు ఆరుబయట ఆడుకో నివ్వాలి.

పాలిచ్చు సమయంలో తప్ప బిడ్డను తల్లి ప్రక్కన పడుకోబెట్టరాదు. ఉయ్యాలలో లేదా ప్రత్యేక పరుపుమీద పడుకోబెట్టాలి. ఆరునెలల వయస్సు వరకు బిడ్డ వెల్లికిల పడుకొని నిద్రించే అలవాటు చెయ్యాలి. తలక్రింద దిండు పెట్టరాదు.

బిడకు ఆరునెలలు నిండిన తరువాత తల్లి దండ్రుల గదిలో పడుకో బెట్టక ప్రత్యేకగదిలో పడుకో బెట్టుట మంచిది. ఈ స్వల్పచర్యవల్ల మానసిక వ్యాధులు సంభవించ కుండా నివారించ వచ్చును.

## ఏడ్పు-

బిడ్డలకేమి కావలసివుండినా, ఏడ్పు మూలంగానే తెలియజేసు కొంటారు. అంచేత బిడ్డ ఏడ్చినపుడు. దానికేమి అవసరమో, లేక మరేమి కారణమో, తల్లి తెలుసు కోడానికి ప్రయత్నించాలి. కాని, ఏడ్చినపుడంతా, బిడ్డ ఆహారం కోసం ఏడుస్తుందనుకొని కొందరు తల్లులు పాలిస్తారు.

ఇది ఎంత దురలవాటో, బిడ్డ జీర్ణకోశానికెంత హాని కరమో వారెరుగరు. ఇదిచాలా పొరపాటు. సకాలంలో కడుపునిండ బిడ్డకు పాలిచ్చివుంటే ఆకలికోసం బిడ్డ ఏడవదు. మరేదో కారణముండాలి. కడుపునొప్పి, లేదా మరేదో బాధవల్ల ఏడ్చివుండవచ్చును. తగిన చికిత్స పరామర్శ చెయ్యాలి.

పళ్ళు -

సాధారణంగా, బిడ్డకు ఆరునెలలైన తరువాత పళ్ళు రావడం ప్రారంభ మవుతుంది. కొందరికి మూడు నెలలకే మొదలు పెట్టుతుంది. మరి కొందరికి ఏడాదిదాక రావు. ఇది వంశానుగతం కావచ్చు; లేదా కాల్షియం అనేపదార్థం చాలక పోవడంవల్ల పళ్ళు రావటం ఆలస్యం కావచ్చు. కొందరికి పళ్ళు రావటం ప్రారంభించేటప్పుడు విరేచనాలు కావటం జ్వరం రావటం సంభవిస్తుంది. కొందరికి అసలే ఈ కష్టాలుండవు. విరేచనాలు, లేక, జ్వరం వచ్చినట్టయితేగాని అసలు పళ్ళు ఏడాది అయిన తరువాత కూడరాకపోతేగాని డాక్టరు సహాయం పొందాలి.

బిడ్డకు ఏడాది నిండేటప్పటికి ముందుఉండే ఆరుపళ్ళు వస్తాయి. బిడ్డ గర్భంలో పెరిగే కాలంలోనే దాని దంతాల చిగుళ్ళు ఏర్పడుతాయి. అందువలన తల్లి గర్భంతో వుండే కాలంలోనే కాల్షియమ్, ఫాస్ఫరస్, విటమిన్ "డి" విటమిన్ "సి" ఉండేపదార్థాలు భోజనంతో పాటు తీసుకోవాలి. పాలు, పళ్ళు, చేపనూనె, ప్రతిరోజు తీసుకోవాలి. తల్లి ఈ విధంగా తీసుకోవటం వలన, బిడ్డకు బలమైన చక్కని పళ్ళు వస్తాయి. పంటికి సంబంధించిన వ్యాధులురావు.

నడక మాటలు —

సాధారణంగా తొమ్మిది నెలలు నిండేటప్పటికి బిడ్డ దేనినైనా ఆధారంగా పట్టుకొని నిలుస్తుంది. మెల్లమెల్లగా పట్టుకొని నడవడం అలవాటు చేస్తే, ఏడాది అయ్యేటప్పటికి తనంతట అదే నడవడం మొదలు పెడుతుంది కొందరికి నడక ఆలస్యం కావచ్చును. బిడ్డ సంవత్సరమైన తరువాతకూడ నిలబడ్డానికి ప్రయత్నించని సందర్భములో డాక్టర్ సహాయం తీసుకొని బిడ్డ ఎముకలకు బలంవచ్చేలాగు మందు ఇప్పించాలి. నిలుచుని నడిచేటప్పుడు కొందరికి దొడ్డికాళ్ళు మొదలైన లోపాలు కనబడవచ్చు. అట్టి సందర్భములో తక్షణం తగిన చికిత్స చేయించాలి. వెంటనే చేయించితే కాళ్ళు చక్కబడవచ్చు. ఆలశ్యమైన కొలదీ ఎముకలు గట్టిపడి, సరిదిద్దడం కష్టమవుతుంది. [ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో]

# మహిళా ఉద్యమం

* శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ *

ఆంధ్రదేశంలోని అనేక ఉద్యమాలకు, అనేక సంస్కరణలకు శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు జనకులైనట్టుగానే, ఆంధ్రమహిళోద్యమానికి గూడా శ్రీ వీరేశలింగంపంతులుగారే జనకులు. 19వశతాబ్దపు కడపటి భాగంలోనూ ఇరువదవ శతాబ్దపు ప్రారంభదశలోను ఇంచుమించుగా ఏబదిసంవత్సరాలు ఈ మహనీయుని అవిరళకృషి ఆంధ్రదేశంలో సాంఘికంగా, సారస్వతంగా, నైతికంగా ఎన్నో మార్పులకు కారణమైంది. అందులో స్త్రీ ఉద్యమం గూడా ఒకటి. పంతులుగారు స్త్రీజనోద్ధరణోద్యమం ప్రారంభించడానికి ముందు ఆంధ్రదేశంలో జనాభ్యుదస్త్రీయానికి ఎవరైనా కృషి చేసినవారున్నారేమో తెలియదు. కాని ఒకవేళ అట్టివారున్నప్పటికీ అది చెప్పుకోతగ్గది మాత్రం గాదు. విద్యా విషయంగానైతేనేమి, బాలవితంతూ ద్వాహాలవల్లనైతేనేమి, వైశ్యాజన సంస్కరణలవల్లనైతేనేమి, ప్రప్రథమంగా ఆంధ్రమహిళల నుద్ధరించడానికి కంకణంగట్టిన వీరాధివీరుడు రాయబహద్దూర్ కందుకూరి వీరేశలింగంపతులుగారే.

## వీరేశలింగంగారి సేవ.

స్త్రీలకు విద్య చెప్పించకపోవటమే మర్యాద లక్షణంగానూ, బాలవితంతువులకు శిరోముండనాది సంస్కారములు చేయించి వంటయింట మ్రగ్గజేయడమే ఉత్తమధర్మంగానూ, వేశ్యలు కన్నెరిక ముండడమే ఘనతగానూ భావించబడే ఆ దినాలలో స్త్రీలకు విద్య చెప్పించవలెననీ, బాలవితంతువులకు నపుర్వివాహములు చేయవలెననీ, వారకాంతలను కన్నెరిక చేయడము నీతిబాహ్యమనీ, పెద్ద ఆందోళన లేవదీసి ఇంచుమించుగా కృతకృత్యుడైన మహనీయుడు వీరేశలింగం పంతులు. స్త్రీలకొఱకు ఆయన వ్రాసిన చంద్రమతి చరిత్రము, సత్యవతీ చరిత్రము, సతీ హితబోధిని మున్నగు గ్రంథములను నిజముగా మరువలేము. బాలవితంతూద్ధరణకు పూర్వాచార పరాయణులతో ఆయన సాగించిన పోరాటము విస్మరింపరానిది. వేశ్యాజన సంస్కరణార్థము ఎంతెంత వారిని లెక్కచేయకుండా ప్రహసనాలు వ్యాసాలు, వ్రాసి ఆయన కావించిన ప్రబోధము అసాధారణము. కావుననే శ్రీ వీరేశలింగం పంతులుగారు ఆంధ్ర మహిళలకు సర్వవిధముల ప్రాతః స్మరణీయుడైనాడు. ఆయన ప్రబోధ ఫలితంగానే ఆంధ్రమహిళోద్యమం ఆరంభమై శ్రీమతి కొటికలపూడి సీతమ్మగారివంటి విదుషీమణులు బయలుదేరి అచ్చటచ్చట స్త్రీ సమాజాలు స్థాపించడము, ఉపన్యాసాలివ్వడము జరిగింది. స్త్రీ జనాభ్యుదయైక చింతాపరులైన శ్రీ రాయసము వెంకటశివుడు పంతులుగారివంటి పెద్దలు స్త్రీలకొఱకు జనానాపత్రికను స్థాపించడము జరిగింది. ఈ ప్రబోధ ఫలితంగానే కాకినాడలో విద్యాభివర్ధనీ సమాజం, గుంటూరులో స్త్రీ సనాతన ధర్మమండలి, రాజమహేంద్రవరము, ఏలూరు మున్నగు పట్టణాల్లో స్త్రీ ప్రార్థనా సమాజాలు వెలసినవి. శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు "సావిత్రీ పత్రికను," బాలాంత్రపు శేషమ్మగారు "హిందూసుందరి" పత్రికను స్థాపించారు. శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు, కొటికలపూడి సీతమ్మగారు, బండారు అచ్చమాంబగారు మున్నగు విదుషీమణులు గ్రంథరచన చేశారు. స్త్రీ జనాభ్యుదయ చింతగల ఉదార హృదయులగు సోదరులు కొందరిచ్చిన ప్రోత్సాహం వల్లను, చేయూత వల్లను, ప్రబోధంవల్లను స్త్రీలల్లో చైతన్యం గలిగి తమ దుస్థితి తాము తెలిసికొని తమ సంఘాభ్యుదయానికి తామే పాటుబడవలెననే అభిప్రాయం ఈ దశలోనే కలిగింది. కనుక ఇదే మహిళోద్యమానికి ప్రారంభదశ అని చెప్పవచ్చును.

## స్త్రీవిద్యాభివృద్ధికి ప్రభుత్వకృషి

ఈ సమయంలోనే దొరతనం వారుగూడా-స్త్రీలలో విద్యాభివృద్ధి కలగడం ముఖ్యమనే అభిప్రాయం కలిగి ఆర్థికంగా సాయం చేయడానికి ఉపక్రమించారు. మత ప్రచారోద్దేశముతోనైనా క్రైస్తవ మిషనరీలు అచ్చటచ్చట స్త్రీ విద్యా సంస్థలు నెలకొల్పి స్త్రీలు చదువుకోడా

నికి ప్రోత్సాహం కల్పించారు. ముఖ్యంగా నిమ్న జాతుల్లో స్త్రీవిద్యాప్రబోధం కలిగించిన గౌరవం వీరిదే.

ఈ ప్రబోధంవల్ల స్త్రీలు కొందఱు పాఠశాలల్లో చేరి విద్యాభ్యాసం చేయడం కలిగింది. శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు, ఆదుర్తి భాస్కరమ్మగారు మున్నగు సోదరీమణులు ఈ ప్రబోధ ఫలితంగా విద్య నభ్యసించినవారే. వారి వెనుక ఎందరో యువతులు ఉన్నత పాఠశాలలో చదివి ఉద్యోగినులైనారు.

తరువాత అచ్చటచ్చట స్త్రీల సభలు జరుగుతూ వచ్చినవి. కాని ఏ స్త్రీయైన స్త్రీల సభకు వెళ్ళిందంటే ఆమె చాలా తెగించిన మనుష్యులలో లెక్క. అది స్త్రీ యే అయినా అక్కడ ప్రసంగించే వాళ్ళు స్త్రీలే అయినా అక్కడ ప్రస్తావింపబడేవి స్త్రీలకు సంబంధించిన విషయాలే అయినా స్త్రీల సమావేశాలకెంతో ఆక్షేపణ ఉండేది. కనుక ఏ స్త్రీ గూడా భర్త గట్టిగా ప్రోత్సాహించి బలవంత పెట్టి పంపుతే తప్ప స్వయముగా వెళ్ళడానికి సాహసించేది కాదు. ఇప్పటికీ స్త్రీలు జరిపే సభల కంటే పురుషులు చెప్పే పురాణాలకే హరికథలకే స్త్రీలు ఎక్కువగా వెళ్ళుతూ ఉంటారు. ఏమయినా నలుబదేళ్ల క్రిందట బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ జరిపినపుడు దానితో బాటు శ్రీ కొటికలపూడి సీతమ్మగారి అధ్యక్షతను ఆంధ్ర మహిళా సభ గూడా జరిగింది. తదాది ఏ మహాసభ జరిగినా దానితో బాటు మహిళాసభ గూడా జరగడం పరిపాటైంది. కజిన్సు సతి, సరోజినీ నాయుడు, కమలాదేవి చటోపాధ్యాయ విజయలక్ష్మి పండిట్ మున్నగు సోదరీమణులు స్త్రీల విద్యా సాంఘికములలో కృషి చేయడానికి అఖిలభారత మహిళా సభ నేర్పరిచిన తర్వాత ఆ మహాసభకు శాఖలుగా రాష్ట్రీయ సభలు, జిల్లా సభలు, తాలూకా సభలు, గ్రామ సభలు జరగడంతో మహిళా సభల ఆంక్ష తీరింది. ఆదుర్తి భాస్కరమ్మగారు, తుర్లపాటి రాజేశ్వరమ్మగారు, దామెర్ల కమలరత్నమ్మగారు, మనపాక కమలమ్మగారు, పెద్దాడ కామేశ్వరమ్మగారు, ఆచంట రుక్మిణమ్మగారు, ఆదిగాగల సోదరీమణులు ఆంధ్రలో రాష్ట్రమహిళాసభను ఏర్పరచిన వారిలో ముఖ్యులు. ఈ మహాసభలు ఏడాదికొక్క జిల్లాలో జరుగుచు పదిరెండు ఆంధ్రజిల్లాల నారీమణులు పరస్పరం కలుసుకొని మంచి చెడ్డలు చర్చించుకోడానికి స్నేహం పెంపొందించుకోడానికి ఎంతో దోహదమిస్తూ ఉండేవి. సెప్టెంబరులో తాలూకాసభలు, అక్టోబరులో జిల్లాసభలు, నవంబరులో రాష్ట్రసభలు, డిశంబరులో అఖిల భారతసభ జరుగుతుంటే ఇది మహిళాసభల ఋతువేమో అనిపించేది. ఆ మహిళాసభ లిప్పుడు తొల్లింటి వైభవంతో జరగడంలేదు. అయినా మహిళోద్యమానికి ఆ సభలవల్ల విశేషమయిన బలం ఏర్పడ్డది. అఖిలభారత మహిళాసభకు అంతర్జాతీయ మహిళాసభతో ఉన్న సంబంధంవల్ల ఒకపరి అఖిలభారత మహిళాసభ ప్రతినిధిగా అఖిలభారత మహిళాసభ స్థాయిసంఘ సభ్యురాలును ఆంధ్రరాష్ట్ర మహిళాసభ కార్యదర్శిని అయిన కొండా పార్వతీదేవిగారు ఖండాంతరములకు వెళ్ళివచ్చారు. ప్రస్తుతము అఖిలభారత ఉపాధ్యక్షురాలుగా పెద్దాడ కామేశ్వరమ్మగారు ఖండాంతరములు వెళ్ళి ఉన్నారు. టి. చంద్రమతిగారు, జాస్తి సీతామహాలక్ష్మమ్మగారు, కొండా పార్వతీదేవిగారు ఆంధ్రరాష్ట్ర మహిళాసభకు కార్యదర్శినులుగా ఉండి చాలా కృషి చేశారు. ఒకపరి అఖిలభారత మహిళాసభను కాకినాడలో జరిపి యావద్భారత నారీమణులకు ఆతిథ్యమిచ్చి వారు ప్రశంసలందారు. పై సభలమూలకంగా ఆంధ్రరాష్ట్ర మహిళాసభ ఆంధ్రమహిళోద్యమానికి ఎంతో దోహదమిచ్చింది.

## స్మరణీయ ఘట్టం

ఆంధ్రమహిళోద్యమ చరిత్రలో మహాత్ముని నిరాకరణోద్యమ మొక స్మరణీయఘట్టం. లోకమాన్య తిలకు ప్రభువు అనంతరం స్వాతంత్ర్య సమరం చేపట్టిన మహాత్మాగాంధీ యావద్భారత వర్షమునను దౌర్జన్య విరహిత సహాయ నిరాకరణోద్యమము నారంభించినప్పుడు పురుషులతో బాటు స్త్రీలను గూడా స్వాతంత్ర్య సమరమున కాహ్వానించిన తరుణంలో ఆంధ్రదేశంలో జరిగిన శాంతిసమరంలో పురుషులతో బాటు స్త్రీలును పాల్గొని సమ్మెలు, సత్యాగ్రహములు, శాసనోల్లంఘనములు, పికెటింగులు ప్రచారములు చేసి జైళ్ళకు వెళ్ళారు. ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు, దువ్వూరి సుబ్బమ్మగారు, దిగుమర్తి జానకీబాయమ్మగారు, సత్తిరాజు శ్యామలాంబగారు, కలగర పిచ్చమ్మగారు, పొణకా కనకమ్మగారు, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు, గుమ్మడిదల దుర్గా

బాయమ్మగారు, కొల్లా కనకవల్లి తాయారమ్మగారు, గోగినేని భారతీరంగాగారు, ఆచంట రుక్మిణమ్మగారు మున్నగు సోదరీమణు లెందరో ఈ ఉద్యమంలో తీవ్రంగా పనిచేసి ఆంధ్రమహిళలయశస్సును ద్విగుణీకృతం చేశారు. అంతవఱకు పట్నవాసపు స్త్రీలలో మాత్రమే సామాన్యముగా సాగుచున్న ఆంధ్రమహిళోద్యమము అహింసాయుత శాంతిసమరంలో గ్రామాదులకు గూడా ప్రాకింది. గ్రామీణస్త్రీలల్లో అఖండ ప్రబోధం కలిగింది. ఎందరో సోదరీమణులు ఈ ప్రబోధప్రచారం ద్వారా స్వీయపరిస్థితులు తెలిసికొన్నారు. జాతీయ భావం పెంపొందించుకున్నారు. విద్యా ప్రయోజనం గమనించారు. పాశ్చాత్య నాగరికతను ఏవగించుకున్నారు. క్రమంగా స్వదేశాభిమానం అధికమైంది. నూలు వడకటం, ఖద్దరు కట్టడం స్వదేశ వస్తువులు వాడడం పరిపాటైంది. గౌరవనీయంగా గూడ తలంపబడ్డది. నిరాకరణోద్యమంలోకంటే లవణ సత్యాగ్రహంలోను, లవణ సత్యాగ్రహోద్యమంలో కంటె క్విట్ ఇండియా ఉద్యమంలోను, ఆంధ్రస్త్రీలు అత్యధికంగా జేరి స్వాతంత్ర్య సమరంలో తమపాలు ధర్మమును పూర్తిగా నిర్వర్తించారు. ఇటీవల ఆంధ్రదేశంలో వ్యాప్తికి వచ్చిన కమ్యూనిస్టు ఉద్యమంలో గూడ స్త్రీలు వహించిన పాత్ర స్వల్పంగాదు. డాక్టరు కొమఱ్ఱాజు అచ్చమాంబగారివంటి విద్యాధిక సోదరీమణులు ఈ ఉద్యమంలో జేరి చాలా పని చేశారు.

## ఆంధ్ర వనితాలోకంలో సంఘ సేవాభిలాష

ఈ విధముగా అసహాయోద్యమాది, ప్రయోద్యమాలవల్ల ప్రబలమైన అంధ్రమహిళోద్యమము స్వజాత్యభ్యుదయ చింతతోబాటు సేవాభిలాషను గూడా స్త్రీలలో పెంపొందజేసింది. మహాత్ముని ఉద్యమములో కాకలు దీరిన ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు, దువ్వూరి సుబ్బమ్మగారు, పొణకా కనకమ్మగారు, గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు, బత్తుల కామాక్షమ్మగారు, మున్నగు సోదరీమణులు స్త్రీవిద్యా సంస్థలు స్థాపించి జాతీయవిద్యకు దోహదమిచ్చారు. కొల్లా కనకవల్లి తాయారమ్మగారు హరిజన స్త్రీలకు ప్రత్యేక విద్యాసంస్థ నెలకొల్పారు. కొందరు స్థానిక సంస్థలలోను ప్రభుత్వ శాసనసభలలోను ప్రతినిధినులుగా జేరి తద్వారా సంఘసేవకు దొరకున్నారు. శ్రీ కడప రామసుబ్బమ్మగారు కడప జిల్లా బోర్డు అధ్యక్షురాలు కావడము, శ్రీ చుండూరి రత్నమ్మగారు ఏలూరి పురపాలక సంఘాధ్యక్షురాలు కావడము, శ్రీ చోళ్ళడం అమ్మన్నరాజాగారు మద్రాసు శాసనసభకు డిప్యూటీస్పీకరు కావడము, శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు ఆరోగ్యశాఖామంత్రి కావడము, శ్రీ వావిలికొలను పద్మాసనమ్మగారు సెనేటు మెంబరు కావడము, గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు పార్లమెంటు మెంబరు కావడము ఇంకా అనేకమంది సోదరీమణులు జిల్లాబోర్డు సభలలో, శాసనసభల్లో, తదితరానేక అధికార నధికార సంస్థలలో సభ్యురాండ్రు కావడము ఆంధ్రమహిళోద్యమ సాఫల్యానికి నిదర్శనాలని చెప్పవచ్చును.

## సంపూర్ణ వికాసం

ఈనాడు ఏముఖంగా చూచినా ఆంధ్రమహిళలలో సంపూర్ణవికాసం కలిగింది. స్త్రీవిద్య సర్వ సాధారణమైంది. ఎందఱో యువతులు సహజంగా ఉన్నత విద్య నభ్యసిస్తున్నారు. ఎందఱో ఉపాధ్యాయినులుగా పనిచేస్తున్నారు. లాయర్లుగా పనిచేస్తున్నారు. రేడియో మొదలైన ఆఫీసుల్లో పనిచేస్తున్నారు. పరదేశాలకు వెళ్ళి పెద్ద పెద్ద చదువులు చదువుతున్నారు. స్త్రీ సంఘాలు స్థాపిస్తున్నారు. మహిళాసభలు జరుపుతున్నారు. మొన్న మొన్ననే రాజమండ్రి ప్రభుత్వకళాశాలకు తెలికిచర్ల వసుంధరాదేవిగారు ప్రిన్సిపాలుగా నియమింపబడినారు. ఇది ఆ కళాశాల చరిత్రలో అపూర్వము. శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు ఓటర్ల అజ్ఞానంవల్ల మరల ఎన్నుకొనబడక పోయినా పార్లమెంటు సభ్యురాలై చేసిన సేవా, కఱవు సంఘసభ్యురాలై చేసినసేవా, ప్లానింగుకమిషను సభ్యురాలుగా ఉండి చేస్తున్న సేవా, ఆంధ్రస్త్రీల యశస్సును పెంపొంద జేస్తున్నవి. అసలు దేశసేవే, కార్యదక్షతే నిర్మాణ కౌశలమే ఆమె రూపమని చెప్పవచ్చును.

## సారస్వత సేవ

కావ్యరచనలోగూడా మహిళోద్యమం సుప్రతిష్టను గడించుకొన్నది. కాంచనపల్లి కనకాంబగారు, గుడిపూడి యిందు

# మహిళా ఉద్యమం

మతీదేవిగారు, చిలకలపాటి సీతాంబగారు, స్థానాపతి రుక్మిణమ్మగారు, చేబ్రోలు సరస్వతిగారు, గంటికృష్ణవేణమ్మ గారు, మున్నగువారు చక్కని కావ్యాలు వ్రాశారు. గృహలక్ష్మి, ఆంధ్రమహిళ మొదలైన స్త్రీ మాసపత్రికలు స్త్రీల సారస్వత కృషి కెంతో ప్రోత్సాహమిచ్చాయి. చక్కగా చదివిన యువతీమణు లెందరో కథలు, నాటికలు, వ్యాసాలు, ఖండకావ్యాలు, గేయాలు వ్రాయుటకు అలవాటుపడ్డారు.

చారిత్రక విషయరచనలో నాయని కృష్ణకుమారిగారు ప్రత్యేకత సంపాదించుకొన్నారు. శ్రీమతి బెల్లంకొండ కనకమ్మగారు సంస్కృతభాషలో రామలింగ ప్రతిష్ఠ బాలరామాయణము వ్రాసి ప్రత్యేక ప్రతిష్ఠను సంపాదించుకున్నారు.

ఇటీవల సహకారశాఖలో గూడా ఆంధ్రస్త్రీలు కృషి చేస్తున్నారు-దొరతనము వారి ప్రోత్సాహమువల్ల ఏర్పడ్డ యువతీ పరిశ్రమ సహకారశాఖల్లో శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మగారు, దుర్గ వెంకటరమణమ్మగారు, త్రిపురనేని సాహుపమ్మగారు మున్నగువారు చక్కగా పనిచేసి మధ్య కుటుంబ స్త్రీల బ్రతుకుదెరువులకు మార్గం చూపిస్తున్నారు- ఇప్పుడిప్పుడే ఆరంభమవుతున్న సేవింగ్సు విధానంలో ఆంధ్ర శాఖకూడ ఏర్పడి కార్యవర్గమును ఏర్పరచినట్లు చూస్తున్నాము- భీమాకంపెనీలలో స్త్రీలు ఏజంట్లుగా ఉండి ఇదివరకే పనిచేయడము జరుగుచున్నది. అటులనే ఈ సేవింగ్సు విధానంలో గూడా పని జరుగగలదని తలంచవచ్చును.

రేడియోలో ఎడనెడ స్త్రీలు చేస్తున్న ప్రసంగములు ఆంధ్ర స్త్రీల విద్యా పరిణతిని ప్రస్ఫుటము చేస్తున్నవి. డాక్టరు కె. యస్. కేసరిగారిచే స్వర్ణ కంకణ సత్కారము పొందుట ద్వారా ఆంధ్రస్త్రీలు మహిళా ప్రపంచమున మరొక అడుగు ముందువైచిరనుట నిక్కము. లోగడ ప్రచురితములైన సావిత్రి, హిందూ సుందరి, ఆంధ్రలక్ష్మి, అనసూయ పత్రికలే గాక నేడు చన్న ఘంటమ్మగారి సంపాదకత్వమున వెలువడుచున్న ఆంధ్రమహిళ పత్రికా నిర్వహణమున ఆంధ్రస్త్రీల కౌశలమునకు తార్కాణవ చెప్పవచ్చును. సుప్రసిద్ధ గాయనీమణియై ఆంధ్ర నారీ లోకానికి ఖండాంతర ఖ్యాతి చేకూర్చిన టంగుటూరి సూర్యకుమారి ఒక అనర్ఘరత్నము.

చిత్రకారిణులుగా శ్రీమతి దిగుమర్తి బుచ్చి కృష్ణమ్మ గారును, దామెర్ల సత్యవాణిగారును, రత్నాల కమలా బాయిగారును వీరు మిగిలినవారైనారు. ఇటీవల ఆంధ్ర కవయిత్రుల చరిత్ర వ్రాసి శ్రీ ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ గారును, తంజావూరి పతనము వ్రాసి మల్లాది వసుంధరా దేవి గారును పోటీలలో గెలిచి గ్రంథ రచనయందును ఆంధ్ర యువతులకు పేరు తెచ్చారు.

ఏటేటా జరిగే హిందీ పరీక్షలలో అసంఖ్యాకంగా ఉత్తీర్ణులౌతూ ఆంధ్ర స్త్రీలెందరో జాతీయ భాషలో తమ విజ్ఞానం చూపిస్తున్నారు. కొమ్మూరి పద్మావతీదేవిగారు, కొప్పరపు సరోజినీ దేవిగారు, గుళ్ళపల్లి విశ్వేశ్వరమ్మ గారు నాటక కళలోను, సూర్యకుమారి, వరలక్ష్మి, భానుమతి, కృష్ణవేణి, సావిత్రి మున్నగువారు సినీమా రంగాలలో తమ ప్రతిభను చాటుతున్నారు. కేవలం నటనా విషయంలోనే గాక సినీమా దర్శకురాండ్రును నిర్మాతలుగా, కథా రచయిత్రులుగా, సంగీత దర్శకురాండ్రుగా కన్నాంబ, భానుమతి, సరళ, మున్నగు ఆంధ్రస్త్రీలు తమ అసాధారణ ప్రతిజ్ఞను చూపుతున్నారంటే ఆంధ్రమహిళోద్యమము ఎంత ముందుకు నడిచిందీ తెలియగలదు.

వార్ధా విద్యా విధానమున ఆంధ్ర స్త్రీలలో చాలామంది కుశలలై అచ్చటచ్చట పాఠశాలలు నడుపుట చూడగా దేశమున ఉదయించే ఏ నవీన కార్యక్రమాన్ని గూడా ఆంధ్ర మహిళోద్యమం ఉపేక్షించడం లేదనీ ఆంధ్రమహిళోద్యమం నానాట అనంతమై, సువిశాలమై సర్వతో ముఖమై విరాజిల్లుతున్నదనీ విశదమవుతున్నది.

ఈ 1953 అక్టోబరు ఒకటవ తేదీని ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడినది. ఈ సందర్భమున తమ పై బడనున్న బాధ్యతలను నిర్వహించడములోను, ఆంధ్రరాష్ట్రమును పరిపుష్టమైనదిగా తీర్చి దిద్దడంలోను ఆంధ్రస్త్రీలుత్తమ విధిని సక్రమంగా నిర్వహిస్తారనడంలో సందేహం లేదు.

## 'దీపం వెనుకనీడ'

అన్నీ మంచి విషయాలే ప్రస్తావించి ఆనందించి చెడుగును విస్మరించడం అవివేకమే అనిపించుచుంటుంది. ఆంధ్ర మహిళోద్యమము ఆంధ్రమహిళాలోకమున ఎంత ప్రబోధమునకు కారణమైనా దీపం వెనుక క్రీనీడవలె ఉన్న లోపాలను గమనించకపోతేనూ, వాటి నివారణకు ప్రయత్నించకపోతేనూ ఆంధ్ర మహిళోద్యమం సమగ్రం కాజాలదు. ఆంధ్రదేశాన అంతకంతకు మితిమీరుచున్న వరకట్నాలు, స్త్రీ సంఘానికి వేరు పురుగులై పీడిస్తున్నాయి. బాలికలు చక్కనివారైనా, చదువుకున్నవారైనా, సంగీతం వచ్చిన వారైనా, సాంప్రదాయ కుటుంబానికి చెందిన వారైనా వరులకు అత్యధిక మూల్యం చెల్లిస్తేనే గాని తాళి కట్టడం జరగడంలేదు. ఈ విషయంలో ఆంధ్ర మహిళోద్యమం చేయవలసిన కృషి ఎంతో ఉన్నది. స్త్రీలల్లో గూడా కులమతవర్గ విద్వేషాలు పెచ్చరిల్లడము అందులో ఇది చదువుకున్న వారిలోనే అధికంగా కనిపించడం అత్యంత సంతాపకరమే కాకుండా అవమానకరమూ అనర్థకం గూడా జాత్యభ్యుదయానికి భంగకరమే. పరశ్రేయస్సును సహించని యీ దుర్భావం స్త్రీలలో పెంపొందడం సంఘాభ్యుదయానికి ప్రతిబంధకం. కనుక తమతమ భేదాలు పాటింపకుండా ఆంధ్రస్త్రీలు ఏ కులమువారైనా, ఏ వర్గమువారైనా అందరు ఒకటేననీ వారందరి అభ్యుదయమే ఆంధ్ర మహిళాభ్యుదయమని ఆంధ్ర స్త్రీలు తెలుసుకోవాలె. ఈనాడు శాసనసభాది రంగములలో స్త్రీలకు ప్రత్యేక స్థానములేదు. అందువల్ల స్త్రీలకు స్థానమే లేకుండా పోతున్నది. స్త్రీలకు స్థానము లేకపోతే స్త్రీలకు అభ్యుదయంగూడా లేదు. కనుక ఆంధ్ర మహిళోద్యమం ఈ విషయమై గట్టి కృషి చెయ్యాలి. జనరల్ స్థానములలోనే తమ పలుకుబడి ద్వారా స్థానం సంపాదించుకోవాలె. కావున ఈ విషయాల్లో ఆంధ్ర మహిళోద్యమం సాగించిన కార్యక్రమం కంటె సాగించవలసిన కార్యక్రమం ఎంతో వున్నది. ఆంధ్ర మహిళోద్యమం సర్వదా జీవనదివలె ప్రవహిస్తూ ఎప్పుడు ఏపని స్త్రీలకు సంబంధించినది వచ్చినా దానిని చేపట్టి ఆంధ్రమహిళలు ఎత్తువారి చేతిబిడ్డలు కాకుండా తమ హక్కును, తమ బాధ్యతను గుర్తెరిగి మెలగవలసినవారుగా, ప్రబోధింపవలసినవారుగా ప్రబోధింపవలసిన భారము ఆంధ్ర మహిళోద్యమం మీదనే వున్నది.

ఆంధ్ర మహిళోద్యమము యూనియన్ ప్రాంతంలోనికి ఆంధ్ర దేశంలోనేగాక తెలంగాణాలోను, రాష్ట్రేతర ప్రదేశములలోను సక్రమముగా సాగుచుండడం సంతోషింపవలసిన విషయం. మొన్నమొన్నటి వరకు అంటే హైద్రాబాదు సంస్థానం ఇండియన్ యూనియన్‌లో కలిసేవరకు నిజాము రాజ్యంలో సభలు జరపడానికి, సంస్థలు నడపడానికి ఉన్న నిర్బంధాలు, అవరోధాలు ఇన్నిఅన్ని గావు. అయినప్పటికి, అక్కడ మహిళోద్యమం మాడపాటి మాణిక్యాంబగారు, బూరుగుల అనంతలక్ష్మమ్మగారు, ఇల్లిందల సరస్వతీదేవిగారు రంగమ్మ ఓబులరెడ్డిగారు, యల్లాప్రగడ సీతాకుమారిగారు, సంఘం లక్ష్మీబాయమ్మగారు మున్నగు సోదరీమణుల నిరంతర కృషి వల్ల నానాటికి వర్ధమానమగుతూ ఆంధ్రమహిళాభ్యుదయానికి కృషి చేస్తున్నది. ఇటులనే కలకత్తా, బొంబాయి, ఢిల్లీ, జమ్‌షెడ్‌పూర్ మొదలైన రాష్ట్రేతర ప్రదేశములలో గూడా ఆంధ్రమహిళోద్యమం జయప్రదంగా సాగుతున్నది. ఇక ప్రత్యేక రాష్ట్రావతరణతో ఆంధ్రమహిళోద్యమం మరింత విస్తృతమై ఆంధ్రమహిళాభ్యున్నతికి ఇతోధికంగా సహాయకం కాగలదనుటకు సందేహం లేదు.

# జానపదగేయోత్పత్తి

వింజమూరి సీతాదేవి, బి.యే., యమ్.లిట్.

జానపదగేయాలు ఎవరు వ్రాశారు? వాటికి సంగీతం ఎవరు పొదిగారు? వాటిని జానపదులకు ఎవరు నేర్పారు?—అని నాగరీకులు కొందరు నన్ను ప్రశ్నించారు. కలువపూవుల విత్తనాలు తటాకాలలో ఎవరు నాటారు? ముత్యపు చిప్పలలో వర్షబిందువులు ఎవరు వేశారు? మేఘాల్ని వర్షంగా ఎవరు కరగించారు?— ఈ ప్రశ్నలకి మీరు సమధానమీయగలిగితే, మీ సందేహాలు నేను తీర్చ గలుగుతానన్నాను. ఇవన్నీ ప్రకృతి శక్తులమహత్తు, సృష్టికర్త విలాసమూ- అన్నారు వారు. మీ ప్రశ్నలకీ అదే జవాబన్నాను నేను.

మీరూ నేనూ అయితే, మన కష్ట సుఖాల్ని మరొ కరితో చెప్పుకోగలం. మనకి ఆర్చేవారూ తీర్చేవారూ ఉన్నారు. రెక్కలమీద బ్రతికే అసంఖ్యాకులైన కర్షకులకీ కార్మికులకీ విశ్రాంతి యెరుగని ఆ రెక్కలే దిక్కు. వాళ్ళ కష్టసుఖాలని వారిలో వారే చెప్పుకోవాలి. పోనీ, చెప్పు కోకుండా ఉందామంటే, అది మానవ స్వభావంకాదు. లోపలున్న ఆ కదలికను— ఆనందమో, ఆవేశమో, కసో, కష్టమో— పైకి వెళ్ళబుచ్చుకొంటేనేకాని, హృదయ భారం తీరదు. అది మనమే అయితే, పనిపట్టి కూర్చుని, ఆ కదలికను సాహిత్య పరంగానో, సంగీత పరంగానో బహిర్గతము చేయగలం. దినమంతా కష్టపడి తేనేగాని గడవని జానపదులకి ఆ తీరిక ఉండదు. మన లాగ అలా సావకాశంగా నవ్వడం, ఏడవడమూ, పుందుగా సాహిత్యం అల్లి సంగీతం పొదగడమూ, వారికి చేతగాదు, తీరికా ఉండదు.

జానపదులకు సాహిత్యమూ సంగీతమూ వేరు వేరువి కావు. చంద్రుడూ, వెన్నెలా లాగ కలిసే వస్తాయి వారికి. పుట్టుకలూ గిట్టుకలూ, పెళ్ళిళ్ళూ మార్మనువులూ, పండుగలూ పబ్బాలూ, వ్యవసాయమూ కూలి పనులూ— నిత్య జీవితంలోని ప్రతీ ఘట్టమూ జానపదుల అమాయిక, అకల్మష హృదయ తంత్రుల్ని ఇట్టే స్పందింప చేస్తాయి. ఆయా కథావస్తువులను బట్టి తగిన నడకతో, లయతో, రసానుగుణ్యంగా సంగీత సాహిత్యాలు ఏక కాలంలోనే ఉబికి వస్తాయి. కోతలప్పుడు కొడవళ్ళ చేతబూని పని చేస్తూన్న పల్లెపడుచులు వాళ్ళ వృత్తి యేతాళంలో జరుగుతూందో, అదే చతురశ్ర గతిలో అప్రయత్నంగా పాడిన యీ బృందగీతం ఒక్కసారి చదివి చూడండి. ఒక్కొక్క పంక్తిని ఆరుముక్కలుగా కొట్టి, ప్రతి ముక్క యొక్క మొదటి అక్షరం మీదా ఒత్తి పలుకుతూ మరీ చదవండేం?

ఒణ్ణింద। పస్పేసుక్క। ఒయ్యార। మేమే।
గుణాసారి। గున్నమ్మా!
పొద్దున్న। నుపులెగిసి। పొలాని। కెళ్ళే।
గుణాసారి। గున్నమ్మ।
ఎండెక్కె। సూరీడు। కొండెక్కె। సూసే।
గుణాసారి। గున్నమ్మ।
గంపాకిం। దాకోడి। కయ్‌మాని। కూసే।
గుణాసారి। గున్నమ్మ।
గొప్పూత। వ్వేకాడ। కొప్పెంద। కోతే।
గుణాసారి। గున్నమ్మ।
గట్టెక్కె। సూత్రాడు। గవరయ్య। కాపూ।
గుణాసారి। గున్నమ్మ।
మద్దేన్నం। ఏళపుడు। మరిదప్పి। కేత్తే।
గుణాసారి। గున్నమ్మ।
సద్దీగం। జీకొంత। తాగేమరి। ఉండూ।
గుణావారి। గున్నమ్మ।
ఆకూమ। క్కాలోను। ఆకెండి। పోయే।
గుణాసారి। గున్నమ్మ।
తోడట్టు। సీరంత। బాపుల్లి। సుంచీ।
గుణాసారి। గున్నమ్మ।
కుప్పొనూ। ర్పులకాడ। కూకున్న। రేమో?।
గుణాసారి। గున్నమ్మ।
పండీన। సేల్లోకి। పయనామై। ఎల్లే।
గుణాసారి। గున్నమ్మ।
కొయ్యండి। కోతాలు। కొడవళ్ళ। తోటీ।
గుణాసారి। గున్నమ్మ।
కొయ్యించి। పొయ్యండి। గాదెల్ల। లోనూ।
గుణాసారి। గున్నమ్మ।

ఈ జానపదగేయాలు ఇంత కాలమూ ఎలా నశించి పోకుండా ఉన్నాయి? ఎప్పటికప్పుడు వాటినెవరైనా వ్రాసి

పెట్టి ఉంచుతున్నారా?— అని కూడా కొందరు ప్రశ్నించారు. వేదాలు ఎవరైనా వ్రాసి ఉంచారా? అవి ఇంతకాలమూ ఎలా జీవించాయి?—అని నేను ఎదురడిగాను. అంటె "వేదాలు అపౌరుషేయాలు, వేదపఠన గురుముఖతః ఆ నోటినుండి ఆ నోటికి సంక్రమిస్తూ వస్తూంది"— అని సమర్థించబోయారు వారు. జానపదగేయా కూడా అంతే అన్నాను. అవి కూడా వేదాల్లాగే కర్ణా కర్ణిని సంక్రమించినవే. ఆ ప్రదాయఫలితంగా జానపద గేయాల మాటలూ, వరుసలూ, మధ్యమధ్య, అక్కడక్కడ మారుతూ వచ్చాయి. చిట్ట చివరకు ఏ నాబోటి వారో వాటిని సేకరించి, వాటి సంగీత సాహిత్యాలను లికిత పూర్వకంగా పొందు పరచి, సాహిత్య లోకానికి అందజేస్తూంటారు.

ఇంతకీ, ఆ అకృత్రిమ జానపదగేయాలు రచి యిత లెవ్వరంటే, ఏం జెప్పగలను? అంమకే "A folk-song or tune composes itself" —జానపదగీతమూ, సంగీతమూ, వాటంతట అవే తయారవుతాయి.— అనవలసి ఉంటుంది.





శ్రీమతి వింజమూరి సీతాదేవి. ఎమ్. లిట్ ఈమె తెనుగు జానపద వాఙ్మయములో పరిశోధన జరిపి, డాక్టర్ ఆఫ్ లిటరేచర్ బిరుదును బడసిరి.

# రాధాసిల్క్ ఎంపోరియమ్

**14, సన్నధి వీధి, మైలాపూరు, మదరాసు-4**



నాణ్యమైన
అద్భుతమైన నమూనాలలో

రమ్యమైన, అందమైన,
ఆకర్షణీయమైన జరీ అంచులతో

ప్రసిద్ధికెక్కిన, ప్రశస్తమైన

బెనారెస్, కొల్లెగాల్
మైసూరు, ఇంకా అనేక
రకాల పట్టు, జరీ, నూలు
చీరెలు, జాకెట్టు గుడ్డలు,
పావడాగుడ్డలు మొదలైనవి
యిక్కడ లభించగలవు.




Telephone: 84188

పక్కా రంగులు!
నూతన పేషన్లలో
సరికొత్త సరుకు!!



ఈనాడే దయచేయండి.



దీపావళికి మీకు మా హృదయపూర్వక ఆహ్వానము

# RADHA SILK EMPORIUM

**14, Sannadhi Street, Mylapore,**

**MADRAS - 4.**

# ఇల్లరికం

శ్రీ కె. శశాంక్.

[కథలోని పాత్రపోషణ- రామం ఒక సామాన్య మానవుడు. మానవుడనేక రంగాల్లో, అనేక విధాలుగా ఎట్లా ప్రవర్తిస్తుంటాడో, ఆ ప్రవర్తనలో ఏమాత్రం 'ఒప్పుదల' ఉంటుందో, అది రామం పాత్రలో వ్యక్తపరచదలచాను. శంకరయ్య రెండవ పెళ్ళి చేసుకున్నంతమాత్రాన దౌర్బల్యహృదయుడన్న రామం భావం నా భావంగా వ్యక్తపరచలేదు. ఒక్కొక్కప్పుడు కొడుకుసైతం తండ్రి నెలా అపార్థం చేసుకుంటాడో, చివరికి తన తండ్రిలో ఏదైనా 'మంచి' అంటూఉంటే దాన్ని పురస్కరించుకునెలా పశ్చాత్తాప పడ్డాడో ఊహించాను.

మాలతి ఆదర్శ యువతి. అందరకీ అండలా కన్పించ గల్గే ఆమెను ఇంకా అధికంగా గొప్ప జేసి నా కథలో చూపించటానికంటే, ఆమె గొప్పతనాన్ని పాఠకులే తమ స్వతంత్ర భావాలతో ఊహించుకోవాలని, మాలతి పాత్రపోషణలో కేవలం ఆమె చేసిన పనులెలాంటివో సామాన్యంగా చెప్పేశాను.

ఇంక, శశి, కమల, రామ్‌ప్రసాద్ వీళ్ళందరిని గూర్చి అంతగా చెప్పాల్సిన అవసరం లేదు. సుశీని ఒక అమాయిక జీవిలా చిత్రించాను. మొత్తంమీద ఇందులో మానవుడన్న ప్రతివాడు కూడా మంచి చెడ్డల మిశితుడనీ, అతనిలో సమయానుకూలంగా భావాలు పొడగడ్తూంటయ్యనీ, సామాన్య సంసారుల కుటుంబం చివరికి పరోక్షంగా విచ్ఛిన్నమైనా, ఆత్మీయత అణిగిపోలేదనీ నిరూపింపదలచాను. లోపాలు లేవని చెప్పగల సాహసం లేకపోయినా, నా కృషి లోపం లేదని ధీమాగా చెప్పగలను.]

———:o:———

ఎండ మాడిపోతున్నది. గ్రీష్మ తాపాన్ని భరిస్తూ దూరంగా కూలీలు రోడ్డును మరమ్మత్తు చేస్తున్నారు. ఇంకా కొంచెం దూరంలో ఒక కుక్క నాలుక వెళ్ళబెట్టుకుని హాయిగా నిద్రపోతున్నది ఒక చెట్టు కింద. చెట్ల కొమ్మలకు కట్టిన గుడ్డ ఉయ్యాలలో కూలీ కూతురు పసికందు, స్వర్గధామంలో విశ్రమించుతూన్నట్టుగా, మైమరచి నిద్రపోతోంది. కిళ్ళీ కొట్టుదగ్గర కూర్చున్న రామం ప్రశాంతమైన ఆ ప్రకృతిలోనే ఎంతటి గాలిదుమారం రేగుతోందో, ఊహించుకుంటూ, తన తండ్రి స్వభావానికీ ఆ ప్రకృతికీ పోలిక కల్పి, తనలోతానే జుగుప్సతో దహించుకొనిపోసాగాడు....

రామం హృదయం అంతగా కల్లోలమైందంటే అందుకు కారణం లేకపోలేదు. తండ్రి రెండో పెళ్ళి చేసుకుంటున్నట్లు చెప్పాడు. సుమారు ఇరవై రెండేళ్ళవాడు, తనన్నా ఇంకా పెళ్ళి చేసుకోకుండా ఉన్నాడు, కాని ఏభై ఏళ్లవాడు! ఇంకా పెళ్ళేమిటి?— శంకరయ్య పెళ్ళిచేసుకుంటున్న సంగతి విన్న రామం హృదయం భగ్గుమన్నది. కాని అంత మాత్రాన అతను పెళ్ళికోసం తహ తహ లాడ్తున్నాడని మనం భావించటానికి వీల్లేదు. అతనికి చెల్లిళ్ళున్నారు. కులాచారమంటూ ధనా భావాన్ని కప్పిపుచ్చి, వాళ్లకు చదువు కూడా మాన్పించాడాయన. వాళ్ళ బాధ్యత తనకేమీ లేదన్నట్లుగా, నిర్భయంగా మళ్ళీపెళ్ళి చేసుకోవటం రామానికి అసహ్య మనిపించింది.

"అయ్యగారు మళ్లీ పెళ్ళి చేసుకుంటారంటగా?" అన్నాడు కిల్లీ కొట్టు వెంకయ్య.

"ఆ" అన్నాడు నిరసనగా రామం.

"అదేంది రామయగోరూ! పెద్ద తనంలో 'రామా! కృష్ణా!' అని పడుండక ఇదేం బుద్దంట?" - రామానికి తండ్రి అంటే నిరసన అని వెంకయ్యకు తెలుసు. అందుకే అంత ధైర్యంగా ఆ మాట అనగల్గాడు.

"సరే ఆ మాటలు నాతో ఎందుకూ? బుద్ధి లేకుండా మాట్లాడుతావ్? ఒక సోడా కొట్టియ్యి" అంటూ సోడా తాగి వెళ్ళిపోయాడు రామం.

# ఇల్లరికం

"హా. అబ్బాయి మాట పిల్లోడికి నచ్చదు- పిల్లోడి మాట అబ్బాయికి నచ్చదు— ఇద్దరూ ఇంక పిలకలు పట్టు కోటమే మిగిలింది," అనుకున్నాడు హేళనగా వెంకయ్య.

రామానికి తండ్రి రెండో పెళ్ళి చేసుకోవటం ఇష్టం లేదు. అందుకే ఆనాడంతా అన్య మనస్కుడై, జుగుప్సా పూరితుడై అక్కడా ఇక్కడా తిరుగుతూ గడపి రాత్రి ఇంటికి చేరాడు.

వాకిట్లో తండ్రి ఈజీఛైర్‌లో పడుకుని తల నిమురు కుంటూ ఏవో ఆలోచిస్తున్నాడు. కొడుకు అతన్ని పలక రించలేదు. అతను కొడుకుని పలకరించలేదు. రామం తీక్షణంగా లోపలికెళ్ళిపోయాడు. శంకరయ్యకు అన్నం పెట్టి రామం కోసం నిరీక్షిస్తోంది శాంత.

భోజనం ముందు మౌనంగా ఉండి లేచాడు రామం. శాంత కూడా అన్నం తిని పనంతా పూర్తి చేసుకుని చెల్లెలు ప్రక్కకెళ్ళి పడుకుంది. సుశీల నిద్రపోతోంది. అమా యకమైన ఆ మొహంలోకి చూస్తూ, రాబోయే సవతి తల్లి పట్ల తా మెట్లా వ్యవహరించాలో అర్థం చేసుకోలేక, అందువల్ల చాలా బాధలుంటయ్యన్న భ్రమతో బాధగా నిట్టూర్చింది శాంత. సుశీల మరీ అమాయకురాలు. అడవి గోడు పిల్ల. ఆ అమ్మాయిని గూర్చిన ప్రతి విషయమూ కూడా ఇంకొకరు గమనిస్తే తప్ప నోరు విప్పి ఏదీ చెప్పేదికాదు. తల్లి బతికున్న రోజుల్లో, అన్నిటినీ జాగ్రత్తగా పరిశీలిస్తూ ఆ సుశీలను రక్షించవలసిన బాధ్య తంతా ఆమే భరించేది. ఆ బాధ్యత మాతృశ్రీ అనంతరం శాంత మీద పడ్డది. జ్వరమొస్తే ఆ బాధ ఎలాంటిదో చెప్పటం తెలీదు సుశీలకు. ఆకలేస్తే అన్నం తినాలని తోచేదికాదు. చిన్న చిన్న కథలు వ్రాస్తూండేది. అందు లోనే తన్మయత్వం పొందేది. పదమూడేళ్ళ సుశీలలోని ఆ పరధ్యానం ఎందువల్ల? చదువులో కన్పించేవి ఆమె తెలివి తేటలన్నీకూడా. అటువంటి సుశీలకు కష్టమన్పించింది. అయినా నోరు విప్పి మాట్లాడేందుకు వీలులేదు—

రామం సరాసరి తండ్రి దగ్గరకు వెళ్ళాడు. "నువ్వు పెళ్ళిచేసుకోటం నాకిష్టం లేదు." అన్నాడు పిడుగు పడ్డట్టు. "నువ్వు కనుక చేసుకున్నావంటే నేను ఈ ఇంట్లోంచే లేచిపోతాను." జవాబుకోసం ఎదురు చూడకుండా అంధకా రంలోకి మాయమయ్యాడు.

శంకరయ్య ఏ మాత్రం ఆశ్చర్యాన్ని వెళ్ళగక్కలేదు. చూస్తూ ఊరుకున్నాడు. వధువు కూడా దొరికింది. ఇవన్నీ జరిగాకే ఆయన రామంతో అసలు సంగతి చెప్పాడు.

ఊళ్ళో అంతా చెప్పుకున్నారు. 'ఏంచేస్తాడు లేక పోతే?' అన్నారు కొంతమంది. వెంకయ్యలా మూతి విరిచినవాళ్ళూ ఉన్నారు. అతన్ని చూచి జాలిపడ్డవాళ్లూ వున్నారు కొద్దిమంది. "మనిషిలో దౌర్బల్యం ఇంతే చేస్తుంది" అనుకున్నారు.

శంకరయ్య దౌర్బల్య హృదయుడంటే ఒప్పుకోవచ్చు గానీ, మరీ అంత నీచానికి ఒడిగట్టేవాడని అనుకోటానికి వీల్లేదు. అయినా అనాదినుంచీ వస్తున్న ఈ మళ్ళీపెళ్ళిని తను కూడా చేసుకోవాలన్న కోరిక, మొదటి భార్య పోయి నప్పట్నుంచీ అతనికున్నది. అందువల్ల కల్గే సాధక బాధ కాలూ ఆయనకు తెలుసు. ఇప్పుడాయన తన సంగతి ఆలోచించుకోటంలోనే ఉన్నాడు. కాని పిల్లల విషయ మాలోచించలేకపోతున్నాడు. ఆయన తన దౌర్బల్యాన్ని విషయంలో వెల్లడి చేసినట్లు కొడుకు రామం అతన్ని తిరస్కార భావంతో మాట్లాడాడు. కాని శంకరయ్య అన్నిటికీ అవును, కాదు, అన్నట్లుగా జవాబు చెప్తూ, ముక్తసరిగా ఊరుకున్నాడు. కొడుకు ఎదుట తన గాంభీ ర్యాన్ని మాత్రం పోగొట్టుకోలేదు. ఈ పెళ్ళి జరిగేదే, అని తెలిసి ఉండీ రామం అతనితో అన్ని విధాలా పోట్లాడా డంటే మనస్సులో ఉన్న అక్కసునంతా వెళ్ళబోసు కుందుకే!

అసలు రామానికి ఒళ్ళు మంటపుట్టించేది- తన తల్లి జబ్బుతో మంచానపడి మరణవేదన పొందుతూంటే, శంకరయ్యపడ్డ బాధ ఇంతా అంతా కాదు. పైగా కోర్టుకెళ్ళ టంకూడా మానేసి, ఇంట్లో ఉండి అహోరాత్రులూ ఆమెను బ్రతికించుకుందుకు కృషి చేసేవాడు. కాని ఆ కృషికి ఫలం దక్కలేదు. ఆనాడు ఆమెకోసం అంత ఆత్రుత చూపించిన వాడు ఈనాడామె చావగానే ఇంకో పెళ్ళికెందుకు ఒడిగ ట్టాలి?— ఇదీ అతని ప్రశ్న. ఇందులో ఎంతవరకు సమంజసమున్నది అతనికి తెలీదు. ఆలోచించుకునే ఓర్పులేదు. కాని ఆ పెళ్ళి మాన్పించటం మాత్రమే అతని ప్రధాన లక్ష్యం. అదే సాగలేదు. పెళ్ళైపోయింది. నెల సిన వెండ్రుకలతో పెళ్ళి పీటలమీద కూర్చున్న తండ్రిని చూస్తే రామానికి మహా విరక్తి కల్గింది. శాంతా, సుశీల ఇద్దరూ నిస్పృహగా పనులు చేసుకుంటున్నారు. సుశీలకు

ఎప్పుడూ నిస్పృహే! అది ఆమెకు స్వతహాగా వచ్చిన గుణం. అంతా జాలిగా రామం, శాంతా, సుశీలలను పరామర్శించారు. రామం గంభీరంగా ఊరుకున్నాడు. అమ్మలక్కలు చమత్కారంగా ఎత్తిపొడిస్తే, శాంతకూడా చమత్కారంగానే జవాబు చెప్తూ లేని నవ్వు తెచ్చుకుంటు న్నది.... అంతాచూస్తూ, మండిపోతూ, తన్ను తాను తమాయించుకు కూచున్నాడు రామం.

౨

"శాంతా! మీ నాన్న భోజనానికొస్తున్నారు, పీట వేసి కంచం పెట్టమ్మా!" అంది మృదువుగా కమల. వయస్సు ముప్ఫై ఏళ్ళుంటయ్. మరీ అంత కురూపి కాదు. కొంచెం పళ్ళెత్తు. మరీ నలుపు కాకపోయినా, నలుపు రంగులోనే లెక్క. తల్లితండ్రులు లేక, అన్నల ప్రాపున బతుకుతున్న కమల. అన్నల ఆదాయం తక్కువ అవటం వల్లా, వాళ్ళకు సేవ చేస్తూ న్నంతకాలం తనను అశ్రద్ధచేస్తూ, చివరికి పెళ్ళిమాట వచ్చే సరికి శంకరయ్యా లాంటి వాళ్ళే రావటం, వచ్చినవాళ్లందరిలోనూ శంకరయ్యే కొంచెం అన్నిటిలోకీ నయం అనిపించటంవల్ల చివరికి అతనికిచ్చి కమలకు పెళ్ళిచేయటం, ఇతివృత్తం కమలకథ.

శాంత నెమ్మదిగా లేచి తండ్రి భోజనానికి అన్నీ అమర్చింది. కమల వచ్చిన నాలుగు నెలల్లో ఆ గృహ పరిస్థితి మారిపోయింది. మళ్ళీ అన్నీ యథాప్రకారంగా ఆనందం గానే గడిచిపోతున్నవి. ఇంతకుముందు శంకరయ్య భార్య చేసే పనులన్నీ కొన్నాళ్ళు శాంత ఆధిపత్యంలో శిథిలా లయినయ్. ఇప్పుడు మళ్ళీ అవి తలెత్తినయ్. సుశీలను బళ్ళో చేర్పించారు.

కమల మంచిదే! కాని ఆమెకు వ్యక్తులమెప్పే, తన చేతలకంటే గొప్పసత్యాన్ని నిరూపించేట్లు కన్పించేది. అందువల్ల ఆమె నలుగురున్నప్పుడు సవితిపిల్లలను మరింత ప్రేమగా చూసేది. ఇది రామానికి అసహ్యం. తండ్రితో పాటు భోజనానికి రావటమంటే కోపం. అతని కున్నకోపం చాలారోజులకు ముందే దిగజారిపోయింది. ఇంకా ఏమూ లన్నా దానిప్రభావం ప్రజ్వలిస్తోందంటే అదేమంత ప్రమా దకారికాదు. అయినా రామం తనతండ్రి ఎదుట తనకోప మంతా పోయినట్లు ప్రవర్తించటానికి ఇష్టపడేవాడు కాదు. అది తన గాంభీర్యానికే, పరువుకే నష్టమని అందువల్ల బెట్టు సరిగా ప్రవర్తించేవాడు. అన్నానికొచ్చినా ఎక్కువమాట్లా డేవాడుకాడు. తనకు కావలసినవేనా ఒకటిరెండు మాట్ల కంటే ఎక్కువసార్లు అడగటం తటస్థపడేదికాదు. ఒకవేళ కమల అతను అడిగింది పొరపాటున వినిపించుకోక పోతే, - అంతే! అడిగేవాడుకాదు. అట్లాగేతిని లేచిపోయే వాడు. అతని ప్రవర్తనంతా కనిపెట్టి కమల ఒకనాడు రామంతో అన్నది. "కేవలం నీ ఆరోగ్యమైనా చూసుకోకపోతే పనిసాగదు రామం! నీకు కోపముంటే ఉండనీ! అది ఎవరి మీద ఉన్నదో వారి మీద దాన్ని ప్రయోగించవద్దని నేననను. కాని నీచదువుకి భంగం కల్గ వచ్చు. చాలా చిక్కిపోయి అట్లా నీరసంగా ఉంటే ఏమి చదువుతావు? ...." ఇంకా ఏదో చెప్పబోతున్నది. మేడ మెట్లెక్కుతూ రామం అన్న ఈ మాటలు కమలకు విని పించినయ్. "నిన్నగాక మొన్న ఒచ్చిన వాళ్ళకు పరుల ఆరోగ్యంమీద ఇంత శ్రద్ధ కలిగిందంటే, అది గొప్ప కోసమైనా అయుండాలి; లేకపోతే వాస్తవికతకు దూరమై నదాన్ని దగ్గరగా చేయడానికైనా అయుండాలి.... అయినా నాకు ఇటువంటి మాటలు ...." ఆతర్వాత మాటలు కమలకు వినిపించలేదు. నిశ్చేష్టురాలైపోయింది. రామం లో, శంకరయ్య రెండో పెళ్ళి విషయమై ఇంత కోపముం టుందని ఆమె అనుకోలేదు. ఆమె కొన్ని కథల్లో 'సవతి తల్లి' అంటే ఎంత ప్రేమగా చూసినా, పిల్లలకు కష్టంగానే ఉంటుది." అని చదివినప్పుడు "రచయిత వాస్తవికతకు దూరంగా రాశాడుకాబోలు; ప్రేమగా చూస్తూంటే ఆ ప్రేమను వాళ్ళెందుకు స్వీకరించలేదు?" అని ప్రశ్నించు కునేది. ఇవన్నీ విద్యాహీన అయిన కమల చిన్నతనపు సందేహాలు. ఆమె దేన్నీ వివరంగా, తరిచి తరిచి ఆలో చించలేకపోయేది. ఆలోచన పూర్తిగా కొనసాగించు కుండే ఉపాయంకూడా తెలియదామెకు— ఇప్పుడామె ప్రశ్నకు ఆమే సమాధానం చెప్పుకునే రోజు వచ్చింది. అయినా కమల, రామం యొక్క ఈ మాటల్లో, అతని సంబంధ మైన ఒక సత్యాన్ని కూడా విస్పష్టీకరించుకుంది. — రామం పైపైకి అనేయగలడనే కాని, అతను శంకరయ్య ఎంత దౌర్బల్య హృదయుడని భావించాడో, అంత కంటే దౌర్బల్యం అతనిలో దాగి దాగి అతనిచేత అను కోని ప్రవర్తనలకు పురి గొల్పుతుందని భావించింది. ఈ భావం ఆమెలోకి, ఆ క్షణాన రావటమే ఆశ్చర్యం! కమల అతని ప్రవర్తనయొక్క నిజస్వరూపాన్ని తెలుసు కొనగలిగింది.

దొడ్లో శాంత రామం తిన్న కంచం కడుగుతున్నది.

కమల ప్రశాంతంగా అన్నది శాంతతో.

“శాంతా ! మీ అన్నయ్యను, మీనాన్న పెళ్ళి చేసుకో వటం ఇష్టంలేదను కుంటాను” — మొహం బాధాకలిత మైఉన్నా, అత్యంత సహజంగా ఉన్నయ్ మాటలు. శాంతకు సిగ్గనిపించింది. తలవంచుకుని చేతిలో కంచాన్ని రుద్దుతూ “ఊహూఁ” అని మాత్రం అనగల్గింది. కమల ఏమి మాట్లాడలేదు.. మెల్లగా అక్కణ్ణుంచి వెళ్ళిపో యింది.

శాంతకు తెలుసు రామం కోపం ఎలాంటిదో ? — ఆమెకు తన తల్లి బాగా జ్ఞాపకం. ఆమె కప్పుడు పని చేసేప్పి, ఆవిడ పోయి రెండేళ్ళయింది. అటువంటప్పుడు అర్ధాంతరంలో వచ్చిన ఈ కమలను “పిన్నీ” అని పిలవా లన్నా, ఆమె ప్రేమను స్వీకరించాలన్నా కష్టంగానేఉంది. కాని ఏమిచేయగలదు? ఇప్పటి వరకూ ఆమె గట్టిగా మాట్లాడగా ఎవరూ వినలేదు.

వచ్చి నాలుగునెలలే అయినా కమల ఆయింటి పరిస్థితి నంతా గ్రహించింది. రామంలోని దౌర్బల్యం గ్రహించటం మొదట ఆమెకు కష్టసాధ్యమే అయినా, కనుక్కొనే సమయ మొచ్చేసరికి ఇట్టే అంతా అర్థమై పోయింది.

పొద్దున్న పదిగంటలయే సరికి తాంబూలమూ, సూటూ, బూటూ అన్నీ సింగారించి కోర్టుకు హాజరయేవాడు శంకరయ్య. రామంకూడా తొమ్మిది గంటలకల్లా, “నేనేం తక్కువ వాణ్ణా?” అన్నట్లు పూల రంగడిలా కాలేజీకి పోయే వాడు. కాని కమలకనిపిస్తే ధుమ ధుమ లాడుతున్నట్లు నటించినా లోలోపల పశ్చాత్తాప పడేవాడు. ఒకనాడు రామం కాలేజీకిపోతుండగా, కమల విస్తరిపారేసి లోపలికొస్తూ, అతనికి కన్పించింది. తనకు ఆమె మీద కోపమనీ, దౌర్బల్యానికి తాను లొంగేవాడు కాడనీ నిరూపించడాని కన్నట్లు ‘ఉఁ’ అంటూ లోపలికి పోబోతున్నాడు రామం. అతని విసుగు కమల గ్రహించింది “మరేం ఫరవాలేదు రామం ! ముత్తైదువువెదురొస్తే మంచిశకునమే !” అంది నవ్వుతూ,

రామం తడబడ్తూ నుంచున్నాడు.

కమల నవ్వుతూ “ఏదో మర్చిపోయి నట్టున్నావు; అందుకేనా లోపలికెళ్ళటం?” — నవ్వు ఆపేసి తీక్ష్ణంగా అంది. “రామం: నీకు సవితితల్లిననే అనుకో. అయినా నేను నిన్నేమీ హీనంగా చూడటం లేదుగా ! పోనీ మీ అమ్మను గూర్చి అసహ్యించు కుంటున్నా నంటే అది శాంతకు తెలుసు. — ఏదీ లేనప్పుడు నీకు ఎవరిమీద, ఎందుకు ఆ ధుమ ధుమ ! సరే, ఇదిచెప్పు. అన్నీ జరిగాక నీకా ధుమ ధుమ ఎంతమాత్రం తోడ్పడుతుందో చెప్పు చూద్దాం—”

రామం మాట్లాళ్ళేదు. త్వరగా కాలేజీకెళ్ళిపోయాడు. చాలా ఆశ్చర్య పోయాడు కాని, దాన్ని బైటికి కన్పించ నివ్వలేదు. — కమల ఎప్పుడూ ఇట్లామాట్లాళ్ళేదు మరి!

3

“శాంతకు ఒకచక్కటి సంబంధ మొచ్చిందిరా ! ” అన్నాడు శంకరయ్య.

“ఎక్కడ? ” అన్నాడు రామం. కొన్నిరోజుల్నుంచీ అతని ధుమ ధుమమంతా తగ్గిపోయింది. అప్పు డప్పుడు రేగుతూంటుంది. అంతే ! !

అతని సహజమైన కంఠస్వరం విన్న శంకరయ్యకు కూడా ఎందుకో ఆనందం పెల్లుబికి వచ్చింది.

“పిల్లవాడు ఎం. బి. బి. ఎస్., చదువు తున్నాడట. ఎనిమిదివేల కట్నం .... చదువై పోగానే ఇంగ్లండు వెళ్తాడట. మంచి ఆస్తిపరుడు. తల్లివుంది. తండ్రి నాలు గుసంవత్సరాల క్రితం పోయాడట” గుక్క త్రిప్పుకో కుండా చెప్తూన్న అతన్ని, రామం తన సంకుచితత్వంతో ఆపేశాడు. “అంతడబ్బా? ఏదీ?” అన్నాడు.

“ఏం మంచి సంబంధమేగా!” అన్నాడు శంకరయ్య.

“అవునులే ! అయినా అంత కట్నం ....”

“ఏముందిలేరా ! ఏదోపిల్ల సుఖ పడుతుంది. అంత కంటే ఏంకావాలి మనకు? ఇంతకీ ఆడబ్బంతా ఎవరో వీధిన పోయేవాడికి కాదుగా ఇచ్చేది ! మనపిల్ల సుఖపడ టానికేనాయను ! ” అని కొంచెంసేపాగి “రెండెకరాల పొలమమ్మితే దగ్గర దగ్గర రూ2000 లకు పైగా వస్తుంది. బ్యాంకులో ఆరువేలున్నయ్యి. పెళ్ళిఖర్చులకి వాటికి ఇంకో ఎకరంకూడా అమ్మితేతప్ప పని జరుగదు” అన్నాడు.

ఇద్దరిమధ్యా నిశ్శబ్దత ఆవరించింది. శంకరయ్యే మాట్లాడాడు. “నీపెళ్ళికూడా అయిపోతే తేలికరా నాకు !”

“చూద్దాంలే — అయినా నాకిప్పుడు పెళ్ళేమిటి?”

అన్నాడు రామం, శంకరయ్యను కించపరిచటాని కన్నట్లు. కాని శంకరయ్య అదేమీ గమనించకుండా తనధోరణిలోనే మాట్లాడటం మొదలు పెట్టాడు.

"ఇక్కడ ఒకసంబంధ మున్నది .... " అంటూ. "ఎవరికి?" అన్నాడు రామం. "నీకేనురా" అన్నాడు శంకరయ్య. "ఏం? మాలతి ఉండగా ఇంకో సంబంధమెందుకూ? " అన్నాడు తీక్షణంగా రామం.

శంకరయ్య అప్పటికేమీ మాట్లాడలేదు. ఆనందంగా అంతాకలసి కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేశారు. కమల రామాన్నిచూసి లోలోపల నవ్వుకున్నది. జాలిగానూ ప్రేమగానూ. ఇంతకీ ఆశ్చర్యమేమిటంటే కమలను రామం పూర్వమెంత అసహ్యించుకున్నా, కమల మాత్రం అతన్ని అభిమానంగా చూసేది. కమలకు అతన్నిచూస్తే పుత్రప్రేమ పెల్లుబికి వచ్చేది. రామం అందగాడు. నవ్వినా, కోప మొచ్చినా అతనిమొహం ఎంతో బాగుంటుంది. నుదుటి మధ్యఉన్న పుచ్చ అతనికింకోవిధంగా అందాన్ని కూర్చేది. స్త్రీ కుండవలసిన సుకుమారత్వమంతా అతని కుండేది. అంత మాత్రాన అతన్ని స్త్రీతో పోల్చి అందాన్ని అధ్వాన్నంచేస్తూన్నట్లు భావించకూడదు—మొత్తం మీద అతను చాలా అందగాడు — ఇదేనిజం ! !

ఈమధ్య శంకరయ్యకు కొంచెం ప్రాక్టీసుకూడా ఎక్కువైంది. రామం బి. ఎ. చదువుతున్నాడు. ఆతర్వాత ఎం. ఎస్. సి. యో లేకపోతే ఎం. ఏ. అది తర్వాత చేయబోయే నిర్ణయం కాబట్టి ఆర్థికంగానైనా, మరేవిధంగాను అందుకు బాధపడటం అనవసరం; శాంత పెళ్ళి అయిపోతున్నది. ఒక పెద్ద బండను తలమీదినుంచి తీసినట్లుగా సంతోషించాడు శంకరయ్య. శంకరయ్య మొదటి భార్య ఉండగా ఆయింటి కెటువంటి కళవచ్చిందో, అదే మళ్లీ కమల రాగానే ప్రతిబింబించింది. ఇంతకీ శాంత పెళ్ళివిషయంమీద కమల పట్టుబట్టకపోతే శంకరయ్య కట్నం ఇవ్వలేనంటూ, అంతమంచి సంబంధమూ వదులుకునేవాడే. కాని కమల అన్నది. "డబ్బా ఖర్చు కాకూడదు, మంచి సంబంధం దొరకాలంటారు ఎట్లా?"

"అబ్బే. అంతంత మంచివి మనకెక్కడొస్తయ్యేలే !" అన్నాడు పెదిమవిరుస్తూ. "అయితే ఒక్కపిల్ల పెళ్ళికే నెత్తిన గుడ్డేసుకో మన్నావా ఏం? " అన్నాడు మళ్ళీ.

"అయితే మీ అంతవాణ్ణిచ్చి కట్టండి. ఏం పోయింది? మీరందుకు మార్గదర్శకులేగా !" అంది కమల పకపక నవ్వుతూ.

శంకరయ్యను ఆమె అప్పుడప్పుడు అట్లాగే హాస్యం చేస్తూండేది. ఆమె అట్లా అన్నప్పుడల్లా శంకరయ్య గంభీరంగా మొహం పెట్టి, స్నిగ్ధహాసంతో అక్కడ్నుంచి వెళ్ళిపోయేవాడు. కాని ఇప్పుడు కృతజ్ఞత తెల్పుతూ అన్నాడు "నువ్వే లేకపోతే నిజంగా డబ్బు చూసి అంత పనీ చేసేవాణ్ణే! నువ్వింత చేస్తున్నా రామం నీ విషయంలో చాలా తీవ్రంగా ఉంటున్నాడు. కాని ఈ దెబ్బతో వాడికి నీమీద అభిమానం కల్గి తీరుతుంది" అంటూ వెళ్ళిపోయాడు. కమల మంచితనం ఆ గృహాన్ని మళ్ళీ ఆనందమనే వెల్గుతో ప్రకాశింప జేసింది.

ఈలోగా రామం మేనమామ ఉత్తరం రాశాడు. 'మాలతి పెళ్ళి విషయం.... .... రామానికిష్టమో కాదో తెల్పమంటూ !' రామం చదివాడు ఆ ఉత్తరాన్ని.

క్రిందటి ఎండాకాలంలో తన తండ్రి రెండో పెళ్ళికి వచ్చింది మాలతి. మరీ అందమైనది కాకపోయినా ఫరవా లేదనిపిస్తుంది. శాంతకన్నా పెద్దది. చదువుకుంటున్నది. పెద్దంటే ఎంతో కాదు, ఆరు నెలలు- శాంతా, మాలతీల మధ్య వార. మామయ్యకు ఒక్కతే కూతురు. కాబట్టే బతికిపోయాడు. లేకపోతే వంద రూపాయల జీతంతో అంతమంది ఏమి తింటారు?

శంకరయ్య రామాన్ని అడిగాడు.

"మాలతిని చేసుకుంటాను" అన్నాడు రామం.

"మాలతినా !" అన్నాడు శంకరయ్య పూడిపోయిన గొంతుతో.

"ఏం"

"నేనూ ఆడపిల్లలు గలవాణ్ణిరా రామం ! బుద్ధిమంతుడైన కొడుకైతే తండ్రి కష్టసుఖాల్ని గమనించిపోతాడు. నా కూతురు పెళ్ళికి నా రక్తం ధారపోసినట్లు, నా శక్తికి మించిన కట్నాలిస్తున్నాను. అట్లాగే నీ పెళ్ళికి కూడా ఏదో కొంత వస్తే దాంతో సురి పెళ్ళి చేసెయ్య వచ్చని నా ఆలోచన. అయితే, మాలతిని చేసుకుంటే మామయ్య ఏమిస్తాడు చెప్పు?"

"రెండు వేలిస్తానని రాశాడుగా !" అన్నాడు రామం.

"నేను ఎనిమిది వేలూనూ, వాడు రెండు వేలూనా?"

రామం శంకరయ్యను దౌర్బల్య పరుడుగా భావించుకుని అసహ్యించుకున్నాడు. లేకపోతే ఏమిటి? "నేను ఎనిమిది వేలూను, వాడు రెండు వేలూనా?" అని పసి పిల్లలు

ఒంటరేసుకుని ఆటలాడుకుంటున్నట్లు తీక్షణంగా అన్నాడు రామం "ఇదేం ఆటా. రెండు వేలూ, ఎనిమిది వేలూ అనటానికి? అయినా మామయ్య పరిస్థితిని పరిశీలించకుండా అట్లా మాట్లాడితే ఎట్లా? వంద రూపాయలు జీతం. తల్లి క్షయరోగి. తీసుక తీసుక చావటం తప్ప ఫలితం కన్పించకపోయె! అందులో 'శాంతా వాళ్ళకుమల్లే చదువు మాన్పించి ఇంట్లో కూర్చోపెట్టావా మాలతిని?' అంటే అది స్కూల్ ఫైనల్ చదువుతోంది చక్కగా. మరి అంతకంటే ఎక్కువ చేసేవాళ్ళు ఆస్థితిలో ఎవరుంటారెం?"

"సరే ........ ప్చ్, అయితే మరి పెళ్ళికి మిగిలిందంతా అమ్మితే అయేట్లు! లేకపోతే ......." శంకరయ్య ఈ మాటలు స్వగతానికి సంబంధించినవే అయినా రామానికి హఠాత్తుగా కోపం ముంచుకొచ్చింది.

"నువ్వు ఎవరిష్టంతో రెండోపెళ్ళి చేసుకున్నావు? నాయిష్టం— నేను మాలతినే చేసుకుంటాను" అన్నాడు.

శంకరయ్య కూడా ఈసారి మండి పడ్డాడు.

"చేసుకో. ఎవరు వద్దన్నారు? నా కష్టాలకోసం నాలో నేను ఏడవటానికైనా అధికారంలేదూ? పుట్టావులే సుపుత్రుడివి! దయచెయ్. అవతలికి" అన్నాడు.

రామం పెంకెగా జవాబిచ్చాడు.

"పోతా పోతా — ఎందుకు పోనూ?"

"అదే ఏదో త్వరగా కానిమ్మంటున్నాను. సంపాదించి పెట్టుంటే తెలియటంలా......" అంతకంటే ఇంకా ఏమని మందలించాలో అతనికి అర్థం కాలేదు. రామం నిశ్చలంగా మేడమీదికెళ్ళాడు. కాని మనసేమిటోగా ఉంది. ఇక్కడివక్కడ అక్కడివిక్కడ సర్దటం మొదలు పెట్టాడు. అయినా, అతనికి ఆపని మనసులోని కలతను బైటికినెట్టి ఆస్థానాన్నే శాంతి స్థాపన చెయ్యలేక పోయింది. రామం విసుగ్గా మంచంమీద పడి దొర్లటం మొదలు పెట్టాడు. తను తొందరపడి తండ్రిని అసహ్యంగా మాట్లాడాననుకున్నాడు. ఈ మాట కమల విన్నదేమోనని మరీ బాధపడ్డాడు. మొట్ట మొదట్లో రామానికి కమలమీద ఎంత అసహ్యం కల్గేదో, ఇప్పుడు అంత గౌరవం. మిగతా విషయాలెట్లాఉన్నా, కమల అందరికీ అనుకూలంగా అందంగా సంసారాన్ని నడిపిస్తోంది. అప్పుడప్పుడు అందరికీ కల్గేమనో వికారాలే ఆమెకూ కల్గుతూంటయ్. అంతేకాని నీచ శ్రేణి చేర్చ దగిందికాదు. ఆమె ధనవంతుడి కూతురై పుడితే ఈ రెండో పెళ్ళి బాధ ఉండేది కాదేమో? ఎంతమందికి ముప్పై ఏళ్ళకి పెళ్ళి కావటంలేదు? కానీ ఆ అయే విధానాల్లో కూడా కొన్ని రకాలున్నయ్యి. చదువుకుంటున్న ఆడది, కేవలం చదువు కోసమే పెళ్ళి మానుకున్నదీ- అంటే దిగులేమీ లేదు. డబ్బును చూపి, ఏమీ లేకుండా కూడా, అంటే అందమూ చందమూ ఉన్నా అయినా పెళ్ళంటూ కాకపోదు; కాని తర్వాత గతిమీద పంచ ప్రాణాలూ పెట్టుకుని బాధ పడాల్సి వస్తే రావచ్చు. ధనం లేకుండా అందం ఉంటే ధనమున్న కామోద్రేకికి ఆహారం అవుతుంది పాపం ఆ స్త్రీ! ఎవరైనా అంతే లెండి; అయినా ఇదొక రకం!!—.

అప్పుడే ఎప్పుడు నిద్ర పట్టిందో అతనికే తెలీదు. మెలకువ కల్గే సరికి అర్ధరాత్రి! వెన్నెల తప్ప అతనికేమీ కన్పించలేదు. రామం మెల్లగా లేచి ఆరు బయటకొచ్చి పిట్టగోడనానుకుని నుంచున్నాడు.

వెన్నెలరాత్రి! మాలతి ప్రక్కన ఉన్నట్లు భావించుకున్నాడు. ఆకాశంలో మబ్బులమధ్య తర్లి ప్రేమపూరిత దృక్కులు తనపై ప్రసరించి, ఆశీర్వదించి, ఆనందింపజేసి తరలి పోతున్నట్లు అనుకున్నాడు. దేశంలో ఆడపిల్లలను భారంగా చూసే తల్లితండ్రు లెంతమంది? అని హఠాత్తుగా, అసందర్భంగా తన్ను తాను ప్రశ్నించుకున్నాడు— మామయ్యతల్లి మాలతికి పెళ్ళి కాలేదని ఒకటే సణుగుతున్నా, మామయ్య మాలతిని స్కూల్ ఫైనల్ వరకైనా చదివించాలని వాదించాడు. అనుకున్న అతని అభిప్రాయం సఫలీకృతమైంది. అయినా పెళ్లికాని పిల్లను చదువు మాన్పించేవాడుకాడు మామయ్య. ముందుచూపు గలవాడు. అందుకే ఇప్పుడు మాలతి కాలేజీలో చేరింది. ఇప్పుడు మామయ్య ఆమె పెళ్లి విషయం రాసేడు. అంతకుముందు మామయ్య రామానికే ఉత్తరం రాస్తే "నా చదువు పూర్తయిన తర్వాత మాలతినే చేసుకుంటాను. నువ్వేమీ దిగులు పడవద్దు." అని తండ్రికి తెలియకుండానే స్వతంత్రించి జవాబు రాశాడు రామం. దాని ఫలితం నిన్నటి మామయ్య ఉత్తరం.

రామం ఆలోచిస్తూనే గడిపేశాడు ఆ రాత్రంతా. ఎందుకో అర్థం కాని ఆవేదన పుట్టింది. తన తల్లే బతికుంటే, పేదవాడు మామయ్యను కాదని ఇంకో సంబంధం స్థిరపరచటానికి ప్రయత్నించేదేనా? అంతగా డబ్బు లేదనుకుంటే తన ఒంటిమీద నగలైనా అమ్మిచ్చేది!—

[ఇంకావుంది]

# చిట్టిబాబు తిరిగివచ్చాడు

మూలం : రవీంద్రనాథ్.

అనువాదం : శ్రీ వైకుంఠరావు.

రాయచరణ్, బాబుల ఇంట్లో నౌకరుగా కుదిరినప్పటికి పన్నెండేళ్ళవాడు. వాడి స్వగ్రామము యశోహర పూర్ జిల్లాలో. పొడవైన జుట్టు, పెద్ద పెద్ద కళ్ళు, నల్లని చామనఛాయ, సన్నంగా పొడవుగా ఉండేవాడు. రాయి చరణ్ కాయస్థుడు. బాబులజాతి కూడా అదేను. బాబు గారికి ఒక సంవత్సరము వయస్సు గల కుమారుడొకడుం డేవాడు. ఆ పిల్లవాణ్ణి ఆడించడమూ, పిల్లవాడి సంరక్షణా రాయిచరణుని ముఖ్యమైన పనులు.

పిల్లవాడు పెద్దయి రాయిచరణ్ చంక దిగి స్కూలుకు వెళ్ళాడు. స్కూల్ వదిలి కాలేజీకి వెళ్ళాడు. కాలేజీ వదిలి మునసిఫ్ అయినాడు. రాయచరణ్ ఇంకా నౌకరు గానే ఉన్నాడు. బాబుగారికి భార్య కాపురానికివచ్చి ఇంటికి యజమానురాలు అయింది. రాయిచరణుని బాబుగారిమీద నుంచే అధికారము చాలా వరకు తగ్గి పోయింది. యజమానురాలివల్ల రాయిచరణ్ అధికారము తగ్గిపోయిందినిజమే, కాని కొత్త అధికారమొకటి వాడి పనికి కలియ బట్టి వాని పూర్వపు అధికారానికేమీ కొరత కలగ లేదు. అనుకూల్ బాబుగారికి ఈ మధ్య పుత్రసంతానము కలిగింది. రాయిచరణ్ కేవలము స్వప్రయత్నము వల్లనే రాత్రిం బగళ్ళు కనిపెట్టుకొని ఆ పిల్లవాణ్ణి పూర్తిగా తన ఆధీనములోకి తెచ్చుకున్నాడు.

అత్యుత్సాహముతో పిల్లవాణ్ణి ఊచేవాడు. రెండు చేతులతో పట్టుకొని బహు నేర్పుతో ఆకాశము మీదికి ఎగర వేసేవాడు. తల దగ్గర తలనుంచి మిక్కిలి చమత్కా రముగా ఆడించేవాడు. జవాబుకు ఎదురు చూడకుండా లెక్కలేని అసందర్భ ప్రశ్నలు కుర్రవాణ్ణి అడుగుతుండే వాడు. ప్రొద్దున్న మొదలు సాయంకాలము వరకు ఈలా చేస్తుండబట్టి రాయచరణ్ కనపడేటప్పటికి పిల్లవాడికి ఒళ్లు పులకరించిపోయేది.

పిల్లవాడు పాకురుకుంటూ జాగ్రత్తగా గడప దాటు తుండేవాడు. ఎవరైనా పట్టుకోడానిక్కి వచ్చినట్లైతే పక పక నవ్వుతూ గబ గబ పాకురుకుంటూ వెళ్ళి ఎవ్వరికీ దొరకకుండా దాగోడానికి ప్రయత్నిస్తుండేవాడు. పిల్లవాడి అసాధారణ చతురతా, ఆలోచనా శక్తీ చూచి రాయిచరణ్ ఆశ్చర్యపడేవాడు. తల్లి వద్దకు వెళ్ళి, బహు గర్వముతో "అమ్మా! నీ కొడుకు పెద్దవాడయాక జడ్జి అవుతాడు. నెలకు ఐదు వేలు జీతము సంపాదిస్తాడు" అని చెప్పే వాడు. పృధ్విపైని ఇంకే నరశిశువైనా అంత చిన్న వయస్సులో గుమ్మము దాటడము మొదలైన పనులు చేస్తూ అటువంటి అసంభవ చతురత కనపరచగలడని రాయిచరణుకి ఊహాతీతము. అయితే భవిష్యత్ జడ్జీగారు ఆ పనులు చేయడములో మాత్రము ఆశ్చర్యమేమీలేదు.

చివరకు పిల్లవాడు ఇటూ అటూ జోగిపోతూ చొట్టి నడక నడుచుకుంటూ, అమ్మను 'అమ్మా' అని పిలవడమూ, అత్తను 'అత్తా' అనడము, రాయిచరణ్‌ని "చన్నా" అని పిలవడము ప్రారంభించేసరికి, ఆశాతీతమైన ఈ వృత్తాం తము ఎవడు కనబడితే వాడి ముందర చాటేవాడు రాయిచరణ్.

అన్నిటికంటె ఆశ్చర్యకరమైన సంగతి ఏమిటి అంటె, అమ్మను'అమ్మ' అనేవాడు,అత్తను 'అత్త' అనేవాడు. నన్ను మాత్రము 'చన్న' అనేవాడు. ఈబుద్ధి పిల్లవాడి బుర్రలో ఎలా దూరిందో చెప్పడము నిజముగా కష్టమే. వయస్సు వచ్చిన మానవుడికి కూడా ఇటువంటి మనుష్యాతీతమైన శక్తి కనబడదు. కనబడినా అటువంటివాడు భవిష్యత్తులో జడ్జీ అవబోతున్నాడంటే సందేహించని వాడు ఉండడు.

మరి కొన్నాళ్లకు రాయిచరణ్ నోట్లో తాడు పెట్టుకొని గుర్రము అయేవాడు. పైల్వాన్ వేషము వేసుకొని కుర్ర వాడితో కుస్తీ పడుతుండ వలసివచ్చేది. కుస్తీలో చివరకు రాయిచరణ్ వీగి కిందపడాలి లేకపోతే గొప్ప ప్రమాదము జరిగేది.

ఆ రోజులలో అనుకూల్‌బాబుకి పద్మానదీ తీరాన ఉన్న జిల్లాకి బదిలీ అయిపోయింది. అనుకూల్‌బాబు పిల్లవాడి

రోజుకు ఒక రోజుమంటి కంబళ్లలో కాని తీసుకువెళ్లాడు. సాహెబ్‌వాళ్లా, తలుపు జరిపోసి, చేతికి బంగారు మురుగులా పెట్టి రాయిచరణ్ పిల్లవాణ్ణి రోజూ రెండు పూటలా షికారు తీసుక వెళ్లేవాడు.

వర్షాకాలము వచ్చింది, వానలు ప్రారంభమైనవి. ఆకలి గొన్న పద్మానది. తోటలనూ గ్రామాలనూ ఒక్కొక్క గుటకలో మింగేస్తూ వచ్చింది. ఇసుక తిన్నెల మీదను ఉండే రెల్లు పొదలూ, చెట్లూ అన్నీ మునిగిపోయినవి. నదిఒడ్డు విరిగి పడటమువల్ల అప్పుడుండే దుబ్బు దుబ్బు శబ్దమూ, ఏటి గట్టునా నాలుగు వైపులనుండి ప్రతిధ్వనిస్తున్నవి. చుప్పులుగా కూడి వడిగా పరుగెత్తుతున్న నీటినురుగే ప్రవాహము యొక్క వేగాన్ని తెలియచేస్తున్నది.

రెండో పూట మేఘము కాసింది. కాని వర్షము కురిసే జాడలేదు. వినోద ప్రియుడైన రాయిచరణుని చిట్టి ప్రభువు ఇంట్లో ఉండటానికి ఎంత మాత్రము ఇష్టపడలేదు. బండి ఎక్కి కూర్చున్నాడు. రాయిచరణ్ బండిని మెల్లిగా తోసుకొనివచ్చి ధాన్యపు చేల ఎదుట నదిఒడ్డున నిలబెట్టాడు. నదిలో ఒక్క నావలేదు. ఏ పొలములోనూ ఒక్క మనిషిలేడు. ఏటి అవతల జనవిహీనమైన ఇసుక తిన్నెల వెనుక నిశ్శబ్దదీప్తి బహు ఆడంబరముగా సూర్యాస్తమయము జరగబోతున్నట్లు మేఘాల సందులోనుంచి కనబడుతున్నది. పిల్లవాడు హఠాత్తుగా "చన్నా 'ఫు-ఫు'" అంటూ ముందుమైపు వేలు చూపించాడు.

ఆ దగ్గరగానే నీటి మధ్యను బురద జాగాలో పెద్ద కదంబ వృక్షము ఉన్నది. దానికి మీది భాగములో రెండు మూడు పువ్వులు పూసి ఉన్నవి. ఆ పువ్వులు పిల్లవాడి దృష్టిని ఆకర్షించాయి. రాయిచరణ్ నాలుగు రోజుల క్రితము కదంబ పువ్వులలో పుల్లను దూర్చి చిన్న బండి తయారుచేసి పిల్లవాడికిచ్చాడు. పిల్లవాడు అదిచూచి చాలా సరదా పడి రోజంతా దానిని లాగుతూ ఆడుకున్నాడు. ఆనాళ రాయిచరణ్ లగాము నోట పెట్టుకొని గుర్రము కావడము అవసరము లేకపోయింది. గుర్రము పదవినుంచి గుర్రపువాడి పదవికి ఉన్నతి కలిగింది.

రాయిచరణ్‌కి ఆబురదలోనుంచి వెళ్ళి పువ్వులు తెంచి తీసుకురాబుద్ధి పుట్టలేదు. పిల్లవాణ్ణి మరిపించాలని ప్రయత్నించాడు "అదిగో— అదిగో చూడు ఎంత పెద్ద రెక్కలో— అదిగోటి ఎగిరి పోయింది— రావే పక్షీ రావే!" తమాషాదిరి నానారకాల కేకలు వేస్తూ అది చెప్పి ఇది చెప్పి మరిపించ ప్రయత్నము చేస్తూ గబ గబ బండి తోసుకు వెళ్ళాడు.

కాని భవిష్యత్ జడ్జీగారిని ఇంత సులభముగా మరిపింప ప్రయత్నించడము వృథా. అందులో, ఆసమయములో ముఖ్యముగా అక్కడ ఎటువైపు చూచినా పిల్లవాని దృష్టిని ఆకర్షించగల వస్తువేదీ కానరాలేదు— ఎక్కడా లేని ఊహాపక్షిమాట చెపుతూ పసివాళ్ళను అట్టే సేపు పట్టి ఉంచలేము.

రాయిచరణ్, పిల్లవాడితో "నీవు బండిలో కూర్చొని ఉండు, నేను చట్టున వెళ్ళి పువ్వులు తెంపి తెస్తా"నని చెప్పి మోకాళ్ళమీదకి బట్ట ఎత్తుకొని నీళ్ళల్లోకి దిగి ఆచెట్టువైపు వెళ్ళాడు. వెళుతూ వెళుతూ "జాగ్రత్తబాబూ, బండి దిగి నీళ్ళదగ్గరికి రాకు" అంటూ మరీ వెళ్ళాడు. రాయిచరణ్ నీళ్ళదగ్గరికి వెళ్ళవద్దన్నాడు కనుక పిల్లవాడి మనస్సు కదంబ పువ్వులవైపునుండి నీళ్ళవైపు పరుగెత్తింది. నీళ్లు పెద్ద కల కిల శబ్దముతో పరుగెత్తుతున్నవి. లక్ష మంది కుర్రవాళ్ళ ప్రవాహము అల్లరి చేస్తూ, నవ్వుతూ రాయిచరణ్ చేతులలోనుంచి తప్పించుకొని వద్దని నిషేధించిన స్థలానికి పరుగెత్తు తున్నదని ఆ పిల్లవాడికి అనిపించింది, కాబోలు!

అటువంటి దృష్టాంతము వల్ల మానవశిశువైన ఆ కుర్రవాడి మనస్సు చంచలమవడములో ఆశ్చర్యమేముంది? పిల్లవాడు మెల్లిగా బండి దిగి నీళ్ళదగ్గరికి వచ్చాడు. పొడుగు రెల్లు కాడ ఒకటి తీసి దానిని గేలపు దువ్వగా భావించి చేపలు పట్టడం మొదలు పెట్టాడు. ఆ తుంటరి జలరాశి, అస్పష్ట కలరవముతో ఆ బాలుణ్ణి ఆహ్వానించింది.

ఒకమారు దబ్బుమని శబ్దమయింది. వర్షకాలములో పద్మానదీ తీరాన అటువంటి శబ్దాలు ఎన్నో! రాయిచరణ్ ఒడినిండా కదంబ పువ్వులు కోసి నవ్వు ముఖముతో తిరిగి వచ్చి చూచేసరికి బండిలో ఎవ్వరూ లేరు. నలు దిక్కులా చూచాడు. ఎక్కడా ఎవరిజాడా లేదు.

ఒక్క నిమిషములో రాయిచరణ్ దేహములోని రక్తమంతా గడ్డ కట్టిపోయింది. ప్రపంచమంతా పొగ కమ్మేసింది— బద్దలైపోతున్న గుండెలోనుంచి పెద్ద కేకలు

## చిట్టిబాబు తిరిగివచ్చాడు

బయటికి వచ్చినవి– "బాబూ— చిట్టిబాబూ– నా బంగారు తండ్రివి నా నాయనవు!"

కాని 'చన్న' అంటూ ఎవరూ జబాబు చెప్పలేదు. నవ్వుతున్న అల్లరి పిల్లవాడి కంఠము వినబడలేదు. పద్మ మాత్రము పూర్వము రీతిని కల కల శబ్దము చేస్తూ పరిగెత్తుతున్నది. ఇటువంటి అతి సామాన్య సంఘటనల విషయమై ఆలోచించడానికి దానికేమీ వ్యవధి లేనట్టుగా ప్రవహించుకు పోతున్నది.

సాయంకాలము అయిపోయింది. గాబరాపడి తల్లి నాలుగు వైపులకూ మనుష్యులను పంపింది. లాంతర్లు పట్టుకొని నదిఒడ్డుకు మనుష్యులు వచ్చిచూచారు– రాయిచరణ్ భగ్న కంఠముతో 'బాబూ, చిట్టిబాబూ' అని కేకలు వేసుకుంటూ తుపానుగాలి మాదిరి తిరుగుతున్నాడు. చివరకు ఇంటికివచ్చి మతిపోయిన వాడిలాగు అమ్మగారి పాదాలదగ్గిర కూలబడ్డాడు. ఎంత అడిగినా ఒక్కటే జబాబు– "తెలియదమ్మా!"

ఇది పద్మానది పని అని అందరూ పోల్చుకున్నారు. కాని ఊరి అవతల ఒక ఎరకలవాళ్ల జట్టు ఉండెను– వాళ్ళ పని అయి ఉండ వచ్చునని కూడా అనుమానించారు. రాయిచరణ్ మాత్రము ఆ పనిచేసి ఉండ కూడదా అని తల్లి మనస్సులో గటి సందేహము ఉండెను– ఆమె రాయిచరణ్‌ని పిలిచి "నీకు ఎంత డబ్బు కావాలంటే అంత ఇస్తాను నా బిడ్డని నాకిచ్చేయి" అని బహూ దీనముగా బ్రతిమాలుకొన్నది కూడాను. అది విని రాయిచరణ్ దుఃఖముతో తల బాదుకొన్నాడు– గృహిణి వాణ్ణి అక్కడనుంచి పొమ్మన్నది.

ఈ పిచ్చి భ్రమను భార్య మనస్సులోనుండి తొలగించాలని అనుకూల్ బాబు చాలా ప్రయత్నిచాడు "వాడు మన అబ్బాయిని దొంగలించి ఏమిచేసుకుంటాడు." అని కూడా ఆమె నడిగాడు. "ఏమీ! అబ్బాయి ఒంటిమీద ఉన్న బంగారము చాలదూ?" అని భార్య జబాబు చెప్పింది.

రాయిచరణ్ స్వగ్రామము వెళ్ళిపోయినాడు. వాడికి సంతానము ఇంతకాలమూ లేదు. కలుగుతుందని ఆశకూడా వదులుకున్నాడు. కాని పెద్ద వయస్సులో భార్య ఒక పిల్లవాణ్ణి కని అక్కడితో సంసారలీల చాలించుకున్నది.

ఈ పిల్లవాడిమీద రాయిచరణ్‌కి ద్వేషముగా ఉండెను. దొంగతనముగా ఆ పోయిన పిల్లవాడి స్థానాన్ని ఆక్రమించుదామని వచ్చినట్లు రాయిచరణ్ ఊహకు తట్టింది. బాబుగారికి ఉండే ఒక్క బిడ్డణ్ణి నీట్లో ముంచేసి తాను పుత్రసుఖాన్ని అనుభవించడము కంటె ఘోరపాతకము ఉండదని వాడికి తోచింది. రాయిచరణ్‌కి ఒక విధవ అక్క ఉండబట్టిగాని, లేకుంటే ఆ పిల్లవాడికి పృథ్వియొక్క గాలి అనుభవించే అదృష్టము ఆట్టేకాలము ఉండేదికాదు. అన్నిటికంటే వింతఅయిన సంగతి ఏమిటి అంటే, ఈ కుర్రవాడుకూడా గడపదాటేవాడు. వద్దన్న పనులు చేయడములో చతురత కనపరిచేవాడు. అంతేకాదు పిల్లవాడి కంఠస్వరమూ, వాడి నవ్వూ ఏడుపూ కూడా ఆ మాయమైన పిల్లవాడి వలెనే ఉండేవి. ఒకొక్కనాడు పిల్లవాడి కంఠము వినబడగానే రాయిచరణ్ గుండె గుభేల్‌మనేది– రాయిచరణ్ కనబడక పోవడమువల్ల ఆ చిట్టిబాబు ఏడుస్తూ వచ్చాడని వాడికి తోచేది.

రాయిచరణ్ అక్క పిల్లవాడికి 'ఫేల్‌నా' అని పేరు పెట్టిది. కొన్నాళ్ళకి పిల్లవాడు అత్తను 'అత్తా' అని పిలువడము ప్రారంభించాడు. "పిల్లవాడు నన్ను వదలలేక మళ్ళీ నాయింటికి వచ్చా"డని రాయిచరణ్‌కి అప్పుడు గట్టి నమ్మకము కలిగింది.

ఈ నమ్మకానికి అనుగుణ్యముగా కొన్ని ప్రమాణాలు కూడా వాడికి స్పష్టముగా కనబడ్డవి. మొదటిది ఏమిటి అంటె ఆ పిల్లవాడు వెళ్ళిపోయిన కొద్ది రోజులలోనే ఈ పిల్లవాడు జన్మించాడు. రెండవది ఇంతకాలమూ లేనిది ఇప్పుడు తన భార్యకు పుత్రసంతానము కలగడము ఆమె గుణాలవల్ల కానేరదు. మూడవది, ఈ అబ్బాయికూడా పాకురుతున్నాడు, వంకరటింకరగా నడుస్తున్నాడు. అత్తను 'అత్తా' అని పిలుస్తున్నాడు. ఈ లక్షణాలు ఉంటే ముందుకు జజ్ అయి తీరాలి. అటువంటి లక్షణాలు ఈ పిల్లవాడిలో అనేకము కనపడుతున్నవి.

అప్పుడు అమ్మగారుచేసిన ఆ ఘోరనింద వాడికి జ్ఞాపకము వచ్చింది. "తల్లి హృదయము నిజము చెప్పేస్తుంది కదా! నేను పిల్లవాణ్ణి అపహరించానని అమ్మగారు అన్నా" రని తనలో ఆశ్చర్యపడుతూ అన్నాడు రాయిచరణ్. ఇన్నాళ్లూ పిల్లడి విషయమై శ్రద్ధపుచ్చుకోక పోయినందుకు చాలా పరితపించి, అప్పటినుండి పిల్లవాడి ఆధీనములోకి వచ్చి వాడినౌకరు అయినాడు.

అప్పటినుంచి ఆ పిల్లవాణ్ణి పెద్దయింటి పిల్లవాణ్ణి చూచినట్టుగా చూచేవాడు. సాటిన్ చొక్కా కుట్టించాడు, జరీటోపీ కొన్నాడు, చనిపోయిన భార్య నగ చెరిపించి

పిల్లవాడికి ఉపచారాలు చేయించాడు. ఆ గ్రామంలో ఉండే ఏ పిల్లవాడిగానీ ఈ పిల్లవాణ్ణి ఆడనిచ్చేవాడుకాడు. పిల్లవాడి ఒడలు జట్టు రానొక్కడే: ఊర్లో పిల్లవాళ్ళు ఈ కుర్రవాణ్ణి అవకాశము చిక్కినప్పుడల్లా నవాబుల ఉన్నాడు అని ఎగతాళి చేసేవారు. రాయిచరణుని ఈ పిచ్చి వాలకము చూసి ఊర్లోవాళ్ళు ఆశ్చర్యపడేవారు.

ఫేల్నాకి స్కూలులో వేసే వయస్సు వచ్చేసరికి రాయిచరణ్ తన సొమ్మంతా అమ్మేసి ఆ సొమ్ము పట్టుకొని పిల్లవాడితో కలకత్తా వచ్చాడు. అక్కడ బహు కష్టము మీద ఉద్యోగమొకటి సంపాదించుకొని కుర్రవాణ్ణి స్కూలులో ప్రవేశపెట్టాడు. తాను సాధ్యమైనంత తక్కువతో గడుపుకొని పిల్లవాడి భోజనానికి, బట్టకీ, చదువుకూ ఎటువంటి లోటూ లేకుండా చూసేవాడు. "నామీద ఉండే ప్రేమవల్లకదా నాయనా నాయింటికి వచ్చావు. నీకేమీ లోటు ఉండనీయను బాబూ" అని రాయిచరణ్ తన మనస్సులో అనేవాడు.

ఈమాదిరి పన్నెండేళ్ళు గడిచిపోయినయ్. పిల్లవాడి చదువుసంధ్యలు బాగా జరుగుతున్నవి. చూడడానికికూడా చక్కగా ఉండేవాడు. పుష్టిగా, చామనఛాయ, నిగ నిగ లాడే ఒళ్ళు. అందముగా జుట్టు దువ్వుకొనేవాడు. సుకుమారి. కుర్రవాడు తండ్రిని తండ్రిగా భావించేవాడుకాడు. రాయిచరణ్ పిల్లవాణ్ణి తండ్రిహృదయముతో ప్రేమించే వాడు కాని నౌకరులాగు సేవ చేసేవాడు. రాయిచరణ్ చేసిన తప్పు ఏమిటి అంటే, తాను తండ్రి అన్నమాట రహస్యముగా ఉంచాడు. ఎవ్వరికీ తెలియనివ్వలేదు. ఫేల్నా హాస్టల్ లో ఉండేవాడు. హాస్టల్ పిల్లవాళ్ళు రాయి చరణుని పల్లెటూరి తరహాని చూచి పరిహాసము చేస్తుండే వాళ్లు. రాయిచరణ్ దగ్గర లేనప్పుడు ఫేల్నా కూడా వాళ్ళందరితో కలిసి తండ్రిని ఎగతాళి చేయలేదని చెప్ప లేము. రాయిచరణుని అమాయకత్వము చూచి విద్యార్థు లందరికీ అనురాగముగా ఉండేది. ఫేల్నాకి కూడా అను రాగముగానే ఉండేది, గాని అతని అనురాగములో కొంత అనుగ్రహము లేకపోలేదు.

రాయిచరణ్ ముసలివాడైపోతున్నాడు, యజమాని రోజూ ఏదో తప్పు పట్టుతూఉన్నాడు. వాడి దేహస్థితి కూడా బాగులేదు. మునుపటివలె పని చేయలేకుండా ఉన్నాడు. చెప్పినది మరచిపోతుంటాడు. కాని నిండు జీతము ఇస్తూఉండే యజమాని నౌకరి ముసలితనాన్ని లెక్కిస్తూ కూర్చోడు. ఇవతల రాయిచరణ్ ఆస్తి అమ్మి తెచ్చిన డబ్బు అంతా అయిపోవచ్చింది. నరదాకి లోటు వచ్చిందని ఆనరదాకి లోటువచ్చిందని ఫేల్నా రోజూ మూలగడము ఆరంభించాడు.

3

ఇట్లా ఉంటూఉండగా రాయిచరణ్ హఠాత్తుగా ఒక నాడు నౌకరీ విడిచిపెట్టేసి ఫేల్నా దగ్గరికి వచ్చి. "నేను నాలుగురోజులు ఇంటికివెళ్లి వస్తాను," అని చెప్పి కొన్ని రూపాయలు పిల్లవాడి చేతులో పెట్టాడు. అక్కడనుంచి 'బారాసాత్' అనుకూల్‌బాబుగారింటికి వచ్చాడు. అనుకూల్ బాబుగారు ఇప్పుడు ఇక్కడ మున్‌సిఫ్‌గా ఉన్నారు.

అనుకూల్‌బాబుకి మరి సంతానము కలగలేదు. కొడుకు పోయిన దుఃఖము భార్యను ఇప్పటికీ బాధిస్తున్నది.

ఒకనాడు సాయంకాలము అనుకూల్‌బాబు ఆఫీసు నుంచి ఇంటికివచ్చి విశ్రాంతి తీసుకుంటున్నారు. భార్య ఒక బావాజీవద్దిర పుత్రసంతానము కోసమని ఆశీర్వాదము పొంది మూలిక ఒకటి కొంటున్నది. ఆ సమయములో అంగణములో "అమ్మగారికి జయమౌగాక!" అని ఎవరో చేస్తున్న దీవన వినబడ్డది.

"ఎవరది?" అని బాబుగారు అడిగారు.

"నేను బాబూ రాయిచరణ్," అని అంటూ ప్రణామము చేశాడు రాయిచరణ్.

ముసలివాణ్ణి చూడగానే అనుకూల్‌బాబుగారి మనస్సు కరిగిపోయింది. వాడెక్కడ ఉన్నది, ఏమిచేస్తున్నది ఎట్లా గున్నది తెలుసుకోగోరి నూరు ప్రశ్నలు వేశారు అనుకూల్ బాబు. "తిరిగి నాదగ్గర ఉంటావా"? అని అడిగారు.

రాయిచరణ్ నిరుత్సాహముగానవ్వి. "అమ్మగారి దర్శనము చేస్తాను." అని అన్నాడు.

రాయిచరణ్‌ని తీసుకొని అనుకూల్‌బాబు అంతఃపురము లోకి వచ్చారు. రాయిచరణ్ని చూచి అమ్మగారు అట్టే ప్రసన్నురాలు కాలేదు. కాని రాయిచరణ్ అది గమనించక ఇద్దరివంకా చూస్తూ చేతులు జోడించి ఇట్లా అన్నాడు— "మీ అబ్బాయిగారిని దొంగిలించినది నేనే. పద్మా కాదూ మరి ఎవరూగాదు, ఆ కృతఘ్నుడైన అధముణ్ణి నేనే!"

"ఏమిటిరా నీవంటుండేది? ఏడీ అబ్బాయి?" అని అను కూల్‌బాబుగారడిగారు.

"నాదగ్గిరే ఉన్నాడు బాబూ, ఎల్లుండి తీసుకువస్తాను."

# చిట్టిబాబు తిరిగివచ్చాడు

ఆనాడు ఆదివారము, ఆఫీసు లేదు. భార్యా భర్తలిద్దరూ ఉదయమునుండి ఆత్రతగా దారివైపుచూస్తూ కూర్చున్నారు. సుమారు పదిఘంటలు అయిఉంటుంది, రాయిచరణ్ ఫేల్‌నాని తీసుకొని వచ్చి ఎదుట నిలుచున్నాడు.

అనుకూల్‌బాబుగారి భార్య ఏమీ ప్రశ్న వేయలేదు. ఆలోచించలేదు. కుర్రవాణ్ణి ఒళ్ళో కూర్చోపెట్టుకొని, చేతితో పిల్లవానిని నిమురి ముద్దు పెట్టుకొని, ఎంత చూచినా తనివి తీరదన్నట్టుగా పిల్లవాడి ముఖము చూస్తూ, కొంచెము నవ్వింది. కళ్ళనీళ్లు పెట్టుకొన్నది. ఆమె మనస్సులో గొప్ప ఆందోళన పుట్టింది. కుర్రవాడు నిజముగా అందముగా, చక్కని దుస్తులు వేసుకొని ఉన్నాడు. దరిద్రుల ఇంట పుట్టినవాడిలాగు లేనే లేదు. పిల్లవాడి నమ్రత, మర్యాద, నాజూకుతనము చూచి అనుకూల్‌బాబుగారి మనసులో కూడా ఆదరమూ అనురాగమూ పుట్టినవి

అయినా ఎటువంటి తత్తరపాటు లేకుండా, "నీవు చెప్పిన దానికి రుజువేమైనా ఉన్నదా?" అని అనుకూల్ బాబుగారడిగారు.

"ఇటువంటి పనులకు రుజువెట్లా ఉంటుంది బాబూ? మీ అబ్బాయిని నేను దొంగలించినట్లు భగవంతుడు తప్ప వేరెవ్వరూ ఎరుగరు."

పిల్లవాణ్ణి చూడగానే భార్య చేస్తున్న ముద్దూ ఆదరమూ చూచి, ఆమె మనోభావాన్ని ఊహించి, ఆపిల్లవాడు తమ కుమారుడే అనడానికి ప్రమాణము చూపించమని రాయిచరణ్‌ని అడగడము అట్టే వివేకమైన పనికాదని అనుకూల్‌బాబుగారు నిశ్చయించుకున్నారు. ఏలాగో తన భార్యకు నమ్మకము కలిగితే చాలునని అనుకున్నాడు. అంతేకాదు, రాయిచరణ్‌కు అంత మంచి కుర్రవాడు ఎట్లాదొరుకుతాడు? అదిగాక రాయిచరణ్ తమను వృథాగా ఎందుకు మోస పుచ్చుతాడూ?

పిల్లవాడితో మాట్లాడగా మరి కొన్ని సంగతులు స్పష్టమైనవి — చిన్నప్పటి నుండి పిల్లవాడు రాయ్‌చరణ్ ఇంట్లోనే ఉన్నాడట. పిల్లవాడు రాయ్‌చరణ్ తన తండ్రి అనుకొనే వాడట. కాని రాయ్‌చరణ్ మాత్రము పిల్లవాడితో తండ్రి వ్యవహరించినట్లు ఎన్నడూ వ్యవహరించలేదట, నౌకరు మాదిరి ప్రవర్తిస్తుండే వాడట.

అనుకూల్ బాబు సందేహాన్ని మనస్సులో నుంచి తొలగించుకొని "కాని మానీడ మరి నీవు తొక్కడానికి వీలులేదు రాయిచరణ్" అని అన్నాడు.

"ఈ ముసలి కాలములో నేనుమరి ఎక్కడికి పోగలను బాబూ?" అని అన్నాడు రాయిచరణ్.

"పోనీ ఉండనీ పాపం! మన అబ్బాయి పుణ్యము వల్ల వాడు బ్రతకనీ నేను వాణ్ణి క్షమించాను." అని భార్య అన్నది.

"వాడు చేసిన పనికి క్షమాపణ లేదు." అని న్యాయ పారాయణుడైన అనుకూల్‌బాబు అన్నాడు.

రాయిచరణ్ బాబుగారి పాదాలు పట్టుకొని, "నేను చేయలేదు బాబూ, భగవంతుడు చేశాడు," అని అన్నాడు.

రాయిచరణ్ తన తప్పును భగవంతుడిమీద పెట్ట ప్రయత్నిస్తుండడము చూచి అనుకూల్‌బాబుకి మరీ చికాకు వేసి, "నీలాంటి విశ్వాస ఘాతకుణ్ణి నమ్మడము తప్పు," అని అన్నాడు.

బాబుగారి పాదాలు వదిలి, "నేను విశ్వాస ఘాతకుణ్ణి కాను బాబూ," అని అన్నాడు.

"నీవు కాకపోతే మరి ఎవరు?"

"నా అదృష్టము!"

ఇటువంటి సమాధానముతో చదువుకున్న బుద్ధిమంతులెవరూ సంతోషించరు.

"ప్రపంచములో నాకు ఇంకెవ్వరూ లేరుబాబూ." అన్నాడు రాయిచరణ్.

తాను మునసబుగారి పిల్లవాణ్ణి అనీ రాయిచరణ్ అన్యాయముగా తనను ఇంతకాలమూ మోసపుచ్చాడని తెలియగానే ఫేల్‌నాకి కొంచెము కోపము వచ్చింది. అయినా ఉదారభావముతో కుర్రవాడు తండ్రితో ఇలాగు అన్నాడు-

"వాణ్ణి క్షమించు నాన్నా, మనిఇంట్లో ఉండనియ్యవద్దు గాని ప్రతినెలా వాడికి జీతము మాత్రము పంపించేస్తుండు నాన్నా."

అటుపైని రాయ్‌చరణ్ మరేమీ అనలేదు. కుమారుడి వైపు ఒకమారు చూచి అందరికి నమస్కారము చేసి ద్వారములోనుంచి బయటికి వెళ్ళి-పృథ్వి పైనుండే లెక్కలేని జనులలో అదృశ్యమైపోయినాడు. నెలాఖరుకు. అనుకూల్‌బాబు రాయిచరణ్ ఇంటి విలాసానికి కొన్ని రూపాయలు పించినీ రూపముగా పంపాడు. ఆ రూపాయలు తిరిగి వచ్చేశాయి. ఇంట్లోఎవరూ లేరట.



అవనీంద్రావనతయై అలరారు **ఆంధ్ర రాష్ట్ర మాతకు** అష్ట పుష్ప సుమమాల

—— : ౦ : ——

శ్రీయుతమై తనర్చెడిని; శ్రేయము భూ ప్రజ కంది మన్నెడిన్ !
న్యాయము మీఁకన్నెపుడు నాయకులెల్లరఁ జూచుచుండెడిన్ !
సాయము; యోగ్య వర్తనలఁ, జక్కఁగఁ జేసి జనంబు గ్రాలెడిన్ !
శ్రీయును, గౌరవోన్నతియు, స్వేచ్ఛయు; రాష్ట్రమునందు నిల్చెడిన్ :

ఎన్నోయేండ్ల తపః ఫలంబిదిగ ఇంకెన్నాళ్ళ సద్భావనల్,
విన్నాణంబుఁగఁ గూడ, నెందరో మహావేత్తల్ స్వరాష్ట్రంబుకై
కన్నుల్మూయగ; కృంగిపోగ, జనముల్ గాఢవ్యథన్ చెందగన్,
కన్నామాంధ్రుల మీస్వరాష్ట్ర ప్రతిభన్ కన్నార, గానేటికిన్.

ఆంధ్రుల వీరకేసరి మహాప్రతిభావతుఁడా ప్రకాశమే,
ఆంధ్రుల వీరవిక్రమము వారని దీప్తులనంది మిన్నునన్,
సాంద్రప్రదీప్త మన్ననల సాగి మెలంగఁగ రాష్ట్రస్వేచ్ఛకై;
ఆంధ్రుల మేళవించి తుదకందఁగఁ జేసెను ఆంధ్రరాష్ట్రమున్.

నామ ప్రసిద్ధినందకయె; నాణ్యపు దేశసుసేవఁ జేయుచున్
నామముగా స్వరాష్ట్రనిధి చక్కఁగ నందఁగఁ జేయుకోర్కెమై
నీమమునంది ప్రాణముల, నీతికి హారతిగానొసంగి; శ్రీ
రాములు శ్రేష్ఠియెంత నుతిరాజ విరాజ పథాన నిల్చెనో?

ఎంత స్వరాజ్యమందిన నదెంతసుభంకరమైన దైన, నా
వంత స్వరాష్ట్ర సౌఖ్యరమ మానసమందు రమింపఁజేయదే?
సుంత తలంపుకొండికను; సోదరులార ! యటంచు "స్వామి" యీ
వంతతకీర్తి యాంధ్రులకు, చక్కనిరాష్ట్ర సుఖంబుకూర్చెఁగా.

జ్ఞానసహిష్ణులున్, బుధులు, శ్రద్ధగ బోధలనూని కార్యముల్
మానముగాఁగఁ జేయుదు రమానము శ్రీయుత సీతరాముడీ
ధ్యానము విద్యనేర్చెడి విధాయక బాలుర యందుఁజూపి లో
నానిన వారి రాష్ట్ర మతినందముగాఁ వెలయించి కూర్చెఁగా !

జండాజాతికి జీవకర్ర సమతా । సఖ్యంబు సత్కీర్తి కా
దండంబందున, ప్రేమ, శాంతి, సుఖమున్। ధర్మంబు; దేశప్రియా
కాండంబందు సమాన గౌరవ ద్యుతుల్ । గాంచన్ సుయోగంబు; కో
దండంబెట్టులో రాముకట్లు మనదౌ । ధర్మావలంబియ్యదే !

రాష్ట్రజనైక్యదీప్తి; జిగి । రాజిల వెల్గు పసిండిజ్యోతి, స్వా
రాష్ట్రమహోత్సవారతి; వి । రాజిల స్వప్రజకిచ్చురక్తి; యీ
రాష్ట్రసుభోత్సవంబు; నిత । రంబు స్వతంత్ర సుఖంకరంబు; స
ద్రాష్ట్రమునై వెలింగెడి ని । రంతర దివ్యప్రకాశ కీర్తితో !

—పద్మశ్రీ

# అభాగిని

* శ్రీమతి నాయని స్వప్నకుమారి *

అప్పుడే డిస్పెన్సరి నుండి వచ్చాడు రామారావు.

"రామూ మీ మామయ్య ఉత్తరం వ్రాశాడురా నిన్ను రమ్మని. కమల యొక్క సంవత్సరీకం ఇక్కడ కాకుండా అక్కడ చేయాలని ఆయన ఉద్దేశ్యమట. నీతో మాట్లాడాలని రమ్మని వ్రాశాడురా !" అన్నది తల్లి. తల్లి మాటలు వినీ విననట్లు నటిస్తూ మామగారి వద్దనుండి వచ్చిన కవరు తీసి చదివాడు. రామూ తల్లి మళ్ళీ అన్నది. "యేమంటావురాపోయేటట్లేనా?" రామారావు ఆమాటలు చెవిన వెయ్యలేదు. పిచ్చిపట్టినట్లు "కమలా" అని అరిచాడు ఆవేశంగా! తల్లిఅదిరిపడి "అదేం రామూ ఆ కేక" అంటూ కొడుకు ముఖము చూచింది. రామారావు కళ్ళలోనసీళ్ళు తళ తళా మెరసినయి. ఇంకేమన్నా అంటే ఆవేశ పడతాడని తెలిసి మాట్లాడకుండా అక్కణ్ణుంచి లేచిపోయింది.

రామారావుకు ఆ ఉత్తరం చూడగానే రెండు సంవత్సరాల క్రిందట గడచిన జీవితమంతా సినీమాలో బొమ్మల్లాగా కళ్ళయెదుట తిరిగింది. మనస్సేమీ బాగుండలేదు. లేచి మేడమీద తన గదిలోనికి పోయాడు. మనశ్శాంతికోసం రేడియో ట్యూన్ చేశాడు. లాభంలేకపోయింది. రేడియో ఆపి పిట్టగోడ ఆనుకుని నిలబడ్డాడు, మళ్లీ ఉత్తరం చదివాడు.

కమల, రామూ మేనత్త కూతురు. ఆ అమ్మాయికి తల్లి లేదు. తండ్రి చాలా గారాబంగా పెంచాడు. పల్లెటూరిలో ఉండడంచేత చదువేమంత రాదు. కాని పల్లెటూరి చదువు చదివింది. చాలా తెలివైనది. కమలను రామూకిచ్చి చేయాలని తండ్రి చాలా ఉబలాట పడ్డాడు.

రామూ కాలేజిలో చదువుకునే రోజుల్లో ఒక అమ్మాయిని ప్రేమించాడు. ఆ అమ్మాయి "నీరా" రామూ క్లాస్ మేట్. చాలా చక్కనిది. కాని ఆ అమ్మాయి తన్ను ప్రేమించిందో లేదో రామూ తెలుసుకోలేకపోయాడు. అయినా ఆశలన్నీ ఆ అమ్మాయిమీద పెట్టుకున్నాడు. ఇటువంటి పరిస్థితుల్లో కమలనిచ్చి వివాహం చేయాలని తల్లి దండ్రులకున్న పట్టుదలకు రామూ లొంగలేదు. రామూ నాన్నగారయితే నాచెల్లెలు చిట్టచివరి కోరిక తన కూతురుని నా కోడలుగా చేసుకోమని చెప్పి వాగ్దానము తీసుకొని మరీ చనిపోయింది. తీర్చక తప్పదన్నారు. రామూ నీరా యొక్క విషయం చెప్పాడు. తల్లీ తండ్రీ నవ్వి "మన కులమా స్థలమా' అదిగాక ఆ అమ్మాయి నిన్ను అంగీకరించిందో లేదో తెలియదు. ఆ అమ్మాయి ఒప్పుకున్నా మేము వప్పుకోవద్దా! కమల మేనత్త కూతురు. మనకూ వాళ్ళకూ ఇష్టం. అందకత్తె. పెద్దచదువు చదుకోలేదన్న లోపమేగాని, గుణానికి, బుద్ధికి ఆ అమ్మాయిని మించిన వారెవ్వరూ లే"రన్నారు. కాని రామూ మనస్సంగీకరించలేదు. రామూ నాన్నగారికి కోపంకూడా వచ్చింది— "డాక్టరు చదవాలని అనుకుంటున్నావు, దానికి డబ్బు కావాలిగా! నీవు గనుక కమలను చేసుకోకపోయినట్టయితే నీ సంబధం వదులుకోవలసి వస్తుంది. మాకు కొడుకు పుట్టనేలేదనుకుంటా"మని నిక్కచ్చిగా చెప్పాడు. ఇంట్లో ఆరోజంతా ఒకరభసయింది. ఇటు తల్లికీ తండ్రికీ, అటు భవిష్యత్తుకూ చెడి కూర్చోవడం తెలివితక్కువని గ్రహించాడు. రామూ మనస్సు కమలను చేసుకోమని చెప్పింది. కాని యేమనస్సయితే కమలను చేసుకోమని చెప్పిందో ఆ మనస్సే కమలను ప్రేమించలేకపోయింది. రామూ ప్రేమతో ప్రమేయం లేదనుకున్నాడు. ఒక నిశ్చయానికి రామూ వచ్చాడు. కమలను చూడ్డానికి తల్లీ దండ్రితో మరునాడే వాళ్ళ ఊరు బయలుదేరారు.

అదొక పల్లెటూరు. రామారావు మామయ్య కరణం. కరణానికి తగ్గ హోదా. బస్తీలలో ఉండే మేడలు కాకపోయినా పూరిండ్లు, పెంకుటిండ్లు ఆ పల్లెకు చాలా శోభను కూర్చాయి. రామూ మామయ్య యిల్లు ఒక పెంకుటిల్లు. చుట్టూ ముళ్ళకంచెలతో కట్టిన ప్రహరి. లోపల చిన్న చిన్న మొక్కలతో ఒక తోట. రామూ వాళ్ళను చూడగానే వాళ్ళ మామయ్య చాలా గాబరా పడ్డాడు. ఆ పల్లెటూరిలో బస్తీలనుండి వచ్చిన వారికి సౌకర్యం చెయ్యాలంటె చాలా కష్టం కాని అనుభవశాలి కనుక తనకు తాను సంబాళించుకున్నాడు.

ఇంట్లో సందడిగా ఉన్నది. ఎంత సందడిగా ఉన్నా ఆ యింట్లో మేనత్త లేని లోపం కనబడుతూనే ఉన్నది. ఇంటికి ఇల్లాలు శోభ. ఇల్లాలితోనే ఆ యింటి కళాకాంతులు కూడా పోతాయి. రామూ వాళ్ళంతా బయట

పంచాలో కూర్చున్నారు. రామూ కమలను చూచాడు. ఆ అమ్మాయి అందముగానే ఉన్నది, కాని అతని మనస్సులో స్థిరంగా నిలచిన నీరా ఇంకా అందగత్తె అని పించింది రామూకు. అందుకే అతని హృదయంలో కమలకు స్థానం ఇవ్వలేకపోయాడు. అయినా తల్లి తండ్రుల ఆజ్ఞకు బద్ధుడయ్యాడు.

పెళ్ళి పూర్తయింది. రామూరావు వివాహం చాలా వైభవంగా జరిగింది. తన చెల్లెలు మాట తీర్చానని రామూ నాన్న చాలా సంతోషించాడు. రామూ కాకినాడలో ప్రాక్టీసు పెట్టాడు, వివాహమైన వెంటనే కమలను కాకినాడకు తెచ్చి వప్పజెప్పి వెళ్ళిపోయాడు కమల తండ్రి. ప్రాక్టీసు బాగా సాగుతూంది. పల్లెటూరిలో చిన్న చిన్న పెంకుటిండ్లలో అలవాటుపడిన కమల ఆ పెద్ద భవంతి చూచి చాలా ఆశ్చర్యపడింది. అత్తా, మామా, తనూ, భర్తా తప్ప ఇంకెవరూ లేరు. భర్త యెప్పుడూ కోర్టుల పనిలో మునిగి తేలుతూ ఉండేవాడు అత్తా మామా పెద్దవారు గనుక కృష్ణా, రామా అంటూ ఒక మూల కూర్చునేవారు. వంటపని అంతా కమలే చూచేది. ఎంతమంది నౌకర్లున్నా తన వాళ్లకు తను సేవ చేయడంలో ఆవిడకు తృప్తి. ఇంక భర్త తన విషయం పట్టించుకునేవాడే కాదు. తనక్కడ ఉంటే అసలు రానేరాడు. తనతో అసలు మాట్లాడడు. ఎన్ని భోగ భాగ్యాలుంటె ఏంలాభం? సతికి పతే దైవమని కమల ఉగ్గుతో నేర్చుకుంది. అటువంటి పతే మాట్లాడ కుండా ఉంటే సతికెంత కష్టం !

"నేనేమైనా అపరాధం చేశానా !" అని తనకు తాను ప్రశ్నించుకునేది. తను బావను వివాహం చేసుకుంటా ననడం తప్పా ! తన తప్పు తనకు చెప్పి శిక్ష విధిస్తే సుల భంగా అనుభవించేదేమో! కాని భర్త ముభావంగా, మాట్లాడ కుండా ఉండడ సహించ లేకపోయింది. కాని ఆవిడేమి చేయకలదు ! తనలో తాను ఈ విషయం ఆలోచిస్తూ కుమిలిపోయేది.

ఆ రోజు మటుకు కమల విషయంలో చాలా ఘటన జరిగింది. చాకలివాడు ఇస్త్రీ గుడ్డలు తెచ్చాడు. అత్తగారు పద్దు చూచి "కమలా బావ గుడ్డలు బావ పెట్టెలో సర్దమ్మా" అంటూ చెప్పి పోయింది. అత్తగారి మాట కాదనడం కమల నేర్చుకోలేదు. కాని భర్త గదికి వెళ్ళడం భయం. అటువైపు తనెప్పుడూ వెళ్ళలేదు. అత్తమ్మ ఒకటికి మూడుసార్లు చెప్పేటప్పటికి ఆ పని ఆవిడకు చేయక తప్పిందికాదు. ఆ రోజు కమల భర్త ఇంట్లో లేడు. బట్టలు తీసుకుని మేడపైకి పోయి, తలుపు తెరచి అన్నీ సరిగ్గా సర్ది మామూలుగా గొళ్ళెం పెట్టి వచ్చేసింది కమల.

మరునాడు ప్రొద్దున్న మామూలుగా రామూ స్నానం చేసి బట్టలు తీద్దామని పెట్టె తీస్తే అన్నీ సర్ది ఉన్నవి. "అమ్మా ఎవరమ్మా నా పెట్టె సర్దిందని" అనుమానంగా అడిగాడు. వంటింట్లో కాఫీ ఫలహారాలు చేస్తున్న కమల ఈ మాటలు విని అదరిపడింది. "ఎవరేమిట్రా కమల సర్దింది" అన్న తల్లి మాటలు విని ఉగ్రుడై "ఆవిడను నా గదిలోనికి యెవరు రమ్మన్నారమ్మా ! నీ కెన్నిసార్లు చెప్పినా అంతే" అన్నాడు విసురుగా ! తల్లికి కోపం వచ్చింది. "నీ గదిలోకి రావడానికి, నీతో మాట్లాడ్డానికి, నీ సేవ చెయ్యడానికి కాకపోతే దాని నీ వెందుకు పెళ్లి చేసుకుంది." అంటూ అరిచింది. "మీరు చేసుకోమన్నారు గనుక చేసుకున్నాను. నాకు కమలతో అవసరం లేదు. కావాలంటె మనవర్తి క్రింద డబ్బు పంపిస్తాను. వాళ్ళ నాన్నవద్దకుం పవండి" అంటూ దురుసుగా లేచిపోయాడు రామూ !. కమల కళ్ళల్లో నీళ్ళు నిండినయి. తల్లిముఖం దిగాలు పడిపోయింది.

అంత విసురుగా వెళ్లి మేడపైన గదిలో కూర్చుని ఆలోచింపసాగాడు రామూ. "కమలనెందుకు ప్రేమించ లేకపోతున్నాను. నీరానెందుకు మరువలేకున్నాను. కమల యేమపకారం చేసింది. తనను పెళ్లి చేసుకోవడం ఆవిడ తప్పా? తన స్థితిగతులన్నీ చెప్పేఉంటె కమల తన్ని వివాహం చేసుకోవడానికి వప్పుకునేదా?"— ఈరోజు తను చేసిన పనికి తనమీదే అతనికి అసహ్యమేసింది. కమలను ప్రేమించాలని నిశ్చయం చేసుకుని క్రిందకి దిగి వచ్చాడు. ఇల్లంతా చూచాడు. కమల యెక్కడా కనిపించలేదు. ఏం చెయ్యడానికి తోచక షికారు బయలుదేరాడు. పార్కులో కూర్చుని రేడియో వింటున్న రామూకు ఎవరో భుజం మీద చెయ్యి వేసినట్లనిపించింది. పాత స్నేహితుడు ! అతనే నీరా అన్న మోహన్. "మోహన్ నీ వెప్పుడొచ్చావు కాకినాడ" కంటూ భుజం తట్టాడు. "నిన్ననే వచ్చాను. ఇక్కడ నీరా పని చేస్తున్నది. అమ్మ, నాన్నా అంతా ఇక్కడే ఉంటున్నారు" అని మోహన్ అనగానే రామూ మనస్సు మళ్ళీ కలత పడ్డది. కమలను ప్రేమిద్దా మనుకున్న ఊహ నిలువనేలేదు. నీరాను చూడాలన్న కుతూహలం కలిగింది. కమల జీవితం ఇందుకే నాశన

మయింది. రామూ, మోహన్ చాలాసేపు మాట్లాడుకున్నారు. కొంతసేపు గడచిన జీవితాన్ని గురించి మాట్లాడారు. రామూ నీరాను చూడాలన్న తన కాంక్షను మోహనుకి చెప్పాడు. అతను ఎటూ తేల్చక ముభావంగా సమాధానమిచ్చాడు. ఇద్దరు స్నేహితులు సినిమా చూచుకుని ఎవరింటి దారి వాళ్ళు పట్టారు.

రామూ ఇంటికి వచ్చేటప్పటికి 11 గంటలయింది. పిక్చరు చాలా పెద్దది. ఎప్పుడూ ఇంట్లో తల్లిదండ్రులకు చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళేవాడుకాదు. ఆవేళ స్నేహితుని బలవంతాన వెళ్ళాడు తలుపు దగ్గరగా వేయడం వల్ల ఎవరినీ పిలువవలసిన అవసరం లేకుండా పోయింది. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉన్నది. కమల గది తప్ప తక్కిన భాగమంతా చీకటిగా ఉన్నది. ఏమిచేస్తున్నదో చూడాలన్న ఆశ కలిగింది. నేరుగా డైనింగ్ హాలుకు దారితీశాడు. టేబిల్ మీద అన్నీ సర్ది ఉన్నవి. మాట్లాడకుండా అన్నీ పెట్టుకు తిని చక్కా లేచాడు.

మరునాడు నీరాను కలుసుకుని మాట్లాడి ఇంటికి తిరిగి వచ్చేప్పటికి రాత్రి 8 గంటలు. పంచలో మామగారు మంచం మీద కూర్చుని ఉన్నారు. ఆయన్ని చూడగానే రామూ కొంత వెనక్కి తగ్గాడు, తనకుతాను సర్దుకుని "అంతా కులాసా మామయ్యా" అని అడిగాడు. "అంతా కులాసా నాయనా! అమ్మాయి కమలను తీసుకెళదామని వచ్చాను. వచ్చే వారం మీ అత్తగారి తిథి. పెండ్లయిన తరువాత కూతురూ, అల్లుడూ కూడా యింట్లో ఉండి తిథి జరిపితే ఇల్లు నిండుగా ఉంటుందన్న కోరిక" అని అన్నాడు మామగారు ప్రాధేయపడుతున్నట్లు.

"కమలను తీసుకెళ్ళండి నేను రాను. హాస్పటల్ లో పని చాలా వుంది. మీరేమీ అనుకోకండి త్వరలో నాకు వీలు దొరకగానే నేనూ వస్తాను" అని ఎంతో వినయంగా చెప్పాడు.

కమలకసలు ఇష్టం లేదు భర్తను విడిచి వెళ్ళడం. "పుట్టింటికి వెళ్తే మళ్ళీ తిరిగి అత్తింటికి రాగలమా అన్న శంక కలిగింది. వెళ్లకుండా ఉండడం సాధ్యమా! కన్న తండ్రి ప్రేమతో రమ్మని పిలిస్తే! చిన్నప్పట్నుంచి తల్లి లేక పోయినా తనే తల్లిగా పెంచిన తండ్రి పిలిస్తే పోకుండా ఉండడమా!" అని కన్నీరుతో కిటికీ పట్టుకుని ఆలోచిస్తున్నది. ఇంతలో "కమలా" అని అంటూ అత్తగారువచ్చింది.

"ఇంకా ఆలశ్యం చేస్తున్నావేమే. బండి సిద్ధంగా ఉన్నది. మీ నాన్నగారు తయారుగా ఉన్నారు. వెళ్ళిరా!" అన్నారు.

కమల కళ్ళలో నీళ్ళు మెఱసెయ్.

"అదేమిటి యేడుస్తున్నావు. శుభమా అంటు వెళ్తూ విచారం దేనికి" అని అత్తగారు మందలించింది.

పైట చెరగుతో కళ్ళ నీరు తుడుచుకుని అత్తగారికి నమస్కరించి బండి దగ్గరకొచ్చి నిలబడింది.

"బావను కూడా అడిగి శలవ తీసుకురామ్మా" అన్నాడు తండ్రి.

భర్త దగ్గరనుండి ఏ విధంగా సమాధానమొస్తుందో తనకు తెలుసు. తండ్రి మాటలు విని విన నట్లుగా కన్నీళ్లతో ఆ నిర్భాగ్యురాలు కదిలింది.

కమల పుట్టింటికి వెళ్ళి రెండు నెలలు గడచినయ్. ఇంత వరకూ రామూ వెళ్ళి తీసుకుని రాలేదు. ఆమె వ్రాస్తే ఉత్తరానికైనా సమాధానమివ్వలా! ఒకరోజున మామయ్య వద్దనుండి ఉత్తరం వచ్చింది. "అందులో కమలకు జ్వరంగా ఉన్నదని, వైద్యులంతా మనోవ్యాధని చెప్పారని" ఉన్నది. నీ కోసం కలవరిస్తుంది రమ్మని వ్రాశారు. ఆ ఉత్తరాన్ని చింపి చిత్తుకాగితాల బుట్టలోనికి చేర్చాడు రామూ. అట్లాగే చాలా ఉత్తరాలు వచ్చినయ్. రామూ చలించలేదు.

ఆ రోజు ఆసుపత్రి వర్క్ అయిపోయింది. ఇంటి దగ్గర తీరిగ్గా కూర్చుని ఆలోచిస్తున్నాడు. ఇంతలో తలుపు త్రోసుకుని "హల్లో రామూ" అంటూ నీరా లోపలికి ప్రవేశించింది. చిన్ననాటి ప్రేయసిని చూడగానే చెదరిన ఆశలన్నీ తిరిగి దగ్గరగా చేరుకున్నాయి.

"వచ్చావా!" అని అప్రయత్నంగా అనేశాడు. అతనిలో రక్తం హోరుమని ప్రవహించింది.

"అట్లా ఉన్నావేం అనారోగ్యంగా ఉన్నదా?" అని ప్రశ్నించింది నీరా.

"అబ్బే యేమీలేదు" అని అంటూ తనకు తాను సర్దుకున్నాడు.

క్షణం సేపు వారిద్దరి మధ్య నిశ్శబ్దంగా కాలం గడిచింది.

"ఏం యిలా వచ్చావేం నీరా" అని అడిగాడు.

"ఏం లేదు రామూ రేపు సాయంత్రం మా చర్చిలో నా పెండ్లి. నిన్ను ఆహ్వానించడానికి వచ్చాను. ఇదిగో ఆహ్వానం. తప్పకుండా వస్తావుగా!" అంటూ రామూ చేతికందించింది నీరా ఆహ్వాన పత్రికని.

ఆ పిచ్చివాడు ఇదంతా కలగా భావించాడు. "నీకా పెండ్లి నీరా" అని అప్రయత్నంగా అనేశాడు. నీరాకు ఆ మాటలు వినపడలేదు. అవి రామూ గొంతులోనే కొట్టుకున్నాయ్.

"చాలా మంది స్నేహితుల్ని పిలవాలి తప్పక వస్తావుగా" అంటూ వెళ్ళిపోయింది నీరా!

తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. తనదనుకున్న నీరా పరాయిదయిపోతుంది. నీరామీద చాలా కోపం వచ్చింది. ఆహ్వానాన్ని ముక్కలు ముక్కలుగా చించి వేశాడు— లోపల యేముందో నయినా చూడకుండా ఆమె నమ్ముకున్నందుకు తనను అన్యాయం చేస్తుందనుకోలేదు. తన్ను గౌరవించి తనే భర్త కావాలని కోరుకుంటుందనుకున్నాడు. ఇంతలో "వైరు సార్" అంటూ పోస్టుమాన్ వచ్చాడు. లేచి వెళ్ళి వైరందుకున్నాడు రామూ. అది కమల తండ్రి ఇచ్చిన వైరు. రామూ ఇప్పటికి కళ్ళు తెరచాడు. తన్ను నమ్ముకున్న కమలకు తనే ఆ స్థితిని కలుగచేసినట్లు గ్రహించాడు. తనే దైవమని తలంచిన కమలకు యేమిలోపం. అందం, చందం అన్నీ ఉన్నవి. కాని చదువు తక్కువ. తను యెన్ని మాటలన్నా అన్నీ భరించి తన మాట కెదురాడకుండా నడచింది. వెళ్ళేటప్పుడు కన్నీళ్ళతో శలవు అడగాలనుకున్నది. అప్పుడు తనెంత తిరస్కార భావం ప్రదర్శించాడు. శలవు అడగలేక అడగకుండానే బండెక్కినది. అప్పుడైనా పల్లెత్తుమాట అనలేదు. అటువంటి సుగుణశీలను తను కాలదన్నుకున్నాడు. ఈ పాపానికి ప్రాయశ్చిత్తం ఉన్నదా? జరిగిపోయిన తన చర్యలన్నీ ఒక్కసారి మెదడులో గిర గిరా తిరిగినయ్. కళ్ళవెంట నీరు కాల్వలు కట్టింది. చావు మంచం మీద ఉన్న కమల ఇంతకూ తనకు దక్కుతుందా?

అప్పటికప్పుడు బయలుదేరాడు. రైల్లో అంతా కమల గురించి ఆలోచిస్తున్నాడు. మరునాడు తొమ్మిది గంటలకు ఆ ఊరు చేరాడు. మామయ్య ఇల్లు చేరేసరికి ఇంట్లో నుండి రోదన ధ్వని వినపడింది. ఒక్క ఉరుకున ఇంట్లోకి వెళ్ళాడు. అప్పటికే అంతా అయిపోయింది. శవాన్ని క్రిందకు దించారు. ఆ దృశ్యాన్ని చూడలేకపోయాడు. "తన భార్య కమల క్రింద పడుకున్నదా?" అతని మనస్సు మనస్సులో లేదు. కమలా అని అరుస్తూ ఆ శవముమీద పడి పిచ్చివాడికి మల్లె యేడవడం మొదలు పెట్టాడు.

అల్లుడు రావడం చూడగానే మామయ్యకు చాలా కోపం వచ్చింది. తనబిడ్డమీదపడి "నన్నుక్షమించవా కమలా!" అని అడుగుతున్న అల్లుణ్ని చూడగానే తన ముద్దుబిడ్డ కడసారి మాటలు జ్ఞాపకానికొచ్చాయి. — "ఆయన చాలా మంచివారునాన్న. ఆయనకు నన్ను చేసుకోవడం ఇష్టంలేదు. తప్పంతా నీదే. నేను ఆయనతో సుఖపడలేను. ఆయన అనుమతి లేకుండా నన్నిచ్చి పెండ్లి చేశారు. తల్లి దండ్రుల ఆజ్ఞ దాటలేక ఆయన నన్నుచేసుకున్నారు. ఇప్పుడు నాస్థితిచూచి విచారించి యేంలాభం లేదు, నేను బ్రతికిఉండగా ఆయన ఈ గడప త్రొక్కరు. నేను చచ్చిపోయిన తరువాత నా శవాన్ని చూచి చాలా పశ్చాత్తాపపడతారని నాదృఢ విశ్వాసం. నేను పోయిన తరువాత ఆయన ఇక్కడికి వస్తేమటుకు ఆయన్ని అగౌరవపరచకు. నాన్నా ఇదే నాకడసారి కోరిక. తెలిసిందా" అంటూ కన్నుమూసింది తనగారాబు కూతురు,

తనకూతురు కోరిక ప్రకారం తన లోపాన్ని తనలోనే అంతమొందించుకుని "చూడునాయనా! జరిగిపోయిన దాన్ని గురించి విచారించి లాభంలేదు. చేతులు కాలిన తర్వాత ఆకులుపట్టుకుంటె యేం లాభంచెప్పు. మించిపోయిన తరువాత వచ్చావు. దాని శవాన్నయినా చూడగలిగావు. బ్రతికుండగా దాని మంచితనం తెలుసుకోలేక పోయావు. చచ్చినతరువాత మంచితనాన్ని తలుచుకుని విచారపడితే మాత్రం చచ్చినవాళ్ళు బ్రతికివస్తారా చెప్పు. బాగా చదువుకున్నవాడివి. ఏదోతెలియక తప్పుపనిచేశావు, ఇప్పుడు పశ్చాత్తాపపడి ఏంలాభం? అది చచ్చిపోవడమే మేలని తోస్తుంది నామటుకు. చిన్నతనంలో తల్లిని పోగొట్టుకుంది. నన్నే తల్లిగా నమ్మి నాచేతుల్లోనే పెరిగి పెద్దదయింది. నిన్ను వివాహం చేసుకుని సుఖపడదామనుకుంది. కాని దానికి సుఖించేయోగంలేదు. చేసుకున్న భర్త తిరస్కరిస్తే, యేముఖం పెట్టుకుని ఈ ప్రపంచంలో అందరి చేత వేలుపెట్టి చూపించుకోకుండా యేమని బ్రతుకుతుంది. నాకూతురు చచ్చిపోయింది. నాబిడ్డ పోయినందుకు నేను విచారించను నాయనా! ఇకనైనా కళ్ళువిప్పి లోకాన్ని

(తరువాయి 73-వ పేజీలో)




సామాన్యంగా మన దేశంలో సంపాదించటమనేది మగవాళ్ళ బాధ్యతై పోయింది. వాస్తవంగా ఎంత రెండు చేతులా, విరివిగా సంపాదించినప్పటికీ సంపాగించటంలో చూపించిన నేర్పరితనాన్ని, మెలుకువనీ, దాచివుంచడంలో చూపించకపోతే, సంపాదనయొక్క విలువ ఏముంటుంది ? సంపాదించింది దాచి పెట్టాలనే ఆరాటం చాలా మందికి జాస్తిగా ఉన్నా ఏకొద్ది మందికో తప్ప మగవాళ్ళల్లో నిలవ చేయటం సాధ్యంకాదు. మా కుటుంబాలలో వున్న కిటుకేమిటంటే సంపాదించటం మగవాళ్ళ వంతైనప్పటికీ దాచి వుంచడం విషయంలో మా ఆడవాళ్ళు ప్రత్యేకమైన అధికారాన్ని వినియోగించుకొని భద్రపరుస్తారు. అక్కడ మగవాళ్ళు ఒకవిధమైనబాని సత్వాన్ని అనుభవానికి తెచ్చుకోవాల్సిందే! ఈ ఆచారం మా కుటుంబాలలో అనాది నుంచీ వస్తూండటం వల్ల ఊళ్ళోవాళ్ళు "ఆడపెత్తనం" అని మా కుటుంబాలను గేలి చేయటం అమల్లో వుంది కానీ అందుకు మామగవాళ్ళు అంతగా చింతిల్లేవారుకాదు. ఆఒక్క విషయంలో మినహాయించి సాంఘిక వ్యవహారాదులలో మగవాళ్ళదే పెత్తనం అధికారం. సంపాదించే విషయంలో ఆడవాళ్ళు మా మగవాళ్ళకు సలహాలివ్వటం కూడా కద్దు. అంతటితో తృప్తి చెందని వాళ్ళు తమసలహాలను పాటించేట్టు ఒత్తిడి పెట్టటం కొత్త కాదు. కాని మళ్ళీ ఒక న్యాయం ఉంది. ఆసంపాదించటం అక్రమంగానూ అధర్మంగానూ, - ఎదుటి వాళ్ళకు అపకారం చేస్తూ, అంటే గిట్టదు. అది కేవలం పాపంతో కూడుకున్నది కనుక మా వాళ్ళు ఆదారుణానికి పాల్పడరు. ధర్మంగా వొచ్చే ఆదాయంలో ఖర్చు తగ్గించుకొంటే అదిఒక రకమైన సంపాదన అనిపించుకోకుండాపోదు. చూడండి ఈ నిండు యవ్వనంలో వున్న యువకుడికి అందమైన స్త్రీని చూస్తే నరాలలో కలిగే జ్వరంలాంటిదే - మధ్యవయస్కులైనవాళ్ళకీ, అంతకు పైవయస్కులకే ధనాన్ని చూస్తే నరాలలోజ్వరం బయలు దేరుతుంది. తృప్తికి మితం వుండదు ఎట్లానైనా, ఏపని చేసైనా, ధర్మా ధర్మాలు, నీతి అవినీతులు త్యజించి — మోసాన్ని, అసూయనీ పెంచుకొని, సంపాదించాలి ! గమ్మత్తేమిటంటే; ఈ ఆశయంతో సంపాదిస్తూనే, తాము ధర్మంగా సంపాదిస్తున్నామనే గుడ్డినమ్మకానికి చాలామంది గురిఅవుతూ చాటుకుంటారు. శరీరం ఎట్లా అశాశ్వితమైనదో చివరకు డబ్బుకూడా అల్లాంటిదేననీ, పోతూ పోతూ కట్టుకుపోయేది ఏమీ ఉండదనీ తెలిసికూడా వంచనచేస్తూ బీదవాళ్ళ కడుపుల్ని తుప్పకత్తులతో కెలుకుతూ - సంపాదించడం మానరు, ఈ మనుష్యులు. మా తాత తండ్రిది నూటయాభై ఎకరాల నిక్షేపమైనభూమి. అటువంటిది మా తాత పంచుకొనేప్పటికి యాభైఎకరాలు వచ్చింది. ఒద్పుతో సామర్థ్యంతో మా తాత దాన్ని తండ్రి హయాములో ఉన్న ఆస్తితో జతపరిచాడు. మా తాతకు ఏడుగురు మగపిల్లలు, ఇద్దరు అడపిల్లలు. భాగాలు పంచుకొనేటప్పటికి ఇరవై ఎకరాలు వచ్చింది. మా నాన్న ఎందువల్లనో సంపాయించ లేకపోయాడు. మళ్ళీ ఇప్పుడు మేము ఏడుగురు అన్నదమ్ములం. రేపు నాలుగేళ్ళు పోయిన తరువాత భాగాలు పంచుకొంటే — ఒక్కొక్కరికి రెండెకరాలకు మించిరాదు. ఇట్లా గొప్పఆస్తులు కూడా తరతరాలుగా తరిగిపోతూంటవి. అప్పట్లో మా వూళ్ళో శివరామయ్యకు తండ్రులు

"సులోచన"

సంపాదించిందీ తాతలు సంపాదించిందీ, ముత్తాతలు సంపాదించిందీ, అంతా అంటే, పిల్లలు లేకపోవటం మూలాన మూడువందల ఎకరాలభూమి, లక్షరూపాయల ధనమూ ఉండేదిట. శివరామయ్య పోకిరీగా తిరిగి చాలావరకు ఆస్తిని ధ్వంసపరిచాడు. అతని కొడుకు సినిమాలు తీసేవాళ్ళతో తిరిగి మిగిలిన ఆస్తినంతా ఖర్చు చేశాడు. సంపాదించటం సంవత్సరం పట్టితే ఆ సంపాదించిన ఖర్చు చేయటం అయిదు రోజులు పట్టదు.

మా ఉష కొత్తగా కాపురానికి వెళ్ళింది. మా ఉషను కాపురానికి పంపించటంలో మా అత్తయ్యా, మామయ్యలు తీసుకున్న శ్రద్ధ, చేసిన ఆర్భాటం – నిజంగా వాళ్ళకు ఉషమీద వున్న నిసలైన ప్రేమ, అభిమానం ప్రకారం పట్టిచూస్తే 'ప్చ్' అనిపించక తప్పదు. తాహతుకు తగినట్టు ఏమీ చెయ్యలేదు. అందుకు బలమైన కారణం ఏమిటంటే, అనవసరంగా ఆర్భాటాలకు డబ్బు ఖర్చు పెట్టటం దేనికని? ఈఅభిప్రాయం వాళ్ళలో మొదట్నుంచి ఉన్నది. ప్రతి విషయంలోనూ ఈ అభిప్రాయాన్ని మనస్సులో పెట్టుకొనే వాళ్ళు ఉషని పదహారేళ్ళ వరకూ ప్రాణప్రదంగా పెంచి, అయిదెకరాల పొలం పదివేల కట్నంతో ఒక ఇరవై ఎకరాల వాడికి, ఇంజనీరింగ్ ప్యాసైన వాడికి ఇచ్చి పెళ్ళి చేశారు. కాని పెళ్ళి కాస్త ఆర్భాటంగానే చేయవలసి వొచ్చి, చేశారు, ఆవతల వాళ్ళవొత్తిడి వల్ల.

కాపురానికి వెళ్ళిన నెలరోజులకే కాంతారావుకు విజయవాడలో ఉద్యోగమైంది. నెలకు రెండువందల యాభై రూపాయలు. ఉష అదృష్టమని మావాళ్ళు అనుకొంటే మా అబ్బాయి అదృష్టమని వాళ్ళ వాళ్ళు అనుకున్నారు. మా అత్తయ్యా, మామయ్యా వాళ్ళు తమ అల్లుడికి అయిన పెద్ద ఉద్యోగాన్ని గురించి ఊళ్ళో చెప్పుకోలేక సతమతమయ్యారు. ఉషభర్త దగ్గరే ఉంటూన్నది, విజయవాడలో ఉష కొడుకు కాపురాన్ని సరిదిద్దటానికి కాంతారావు తల్లి కూడాఅక్కడే ఉంటున్నది. ఆవిడ కోడల్ని తనక్రింద పనిమనిషిగా చేసుకోవటానికి ఎక్కువ రోజులు పట్టలేదంటే అందుకు కారణం మా ఉష మెత్తదనం వల్లనే. మా అత్తయ్యా, మామయ్యలు, ఆమెను అట్లా తయారు చేశారు. పిల్ల తమకు ఎదురు చెప్పకుండా వుండటానికి ఎంత మెలకువగా పెంచాలో అంత మెలకువగా పెంచారు.

కాంతరావు తల్లి ఒక గీటుగీచి ఆ గీటు దాటగూడదని కోడల్ని శాసించింది. సరేనన్నది, మా ఉష. ఆ గీటు దాటగూడదనటంలోని ముఖ్యసారాంశ మేమిటంటే ఏపరిస్థితులోనైనా రాగికానీని, వెండి రూపాయిగా చూసుకోవాలని. ఇట్లా చూసుకోవటం ఉషకి కంటకంగా తోచలేదు. ఆ విద్య ఆమెకు మా అత్తయ్యా, మామయ్యల దగ్గర నేర్చుకున్నదే! పైపెచ్చు ఉష తన చాకచక్యాన్ని ప్రదర్శించి మెప్పును కూడా పొందవచ్చు.

కాంతారావు అసమర్థుడుకాడు. పెత్తనం తల్లికి వొప్పజెప్పడంలో తను దాస్యాన్ని కోరుతున్నట్టు అతను భావించలేదు. సంపాదించటం తనవంతు. దాచిపెట్టటం తల్లివంతు ఏనెల జీతం ఆనెల రెండో తారీఖు పదిరూపాయలు తన ఖర్చుకు అట్టేపెట్టుకుని తల్లికి ఇచ్చేవాడు. తల్లి మురుసుకొనేది.

ఉషకు గర్భం వొచ్చింది. ఏడో నెలరాగానే మా అత్తయ్య తనఇంటికి తీసుకు వొచ్చింది, పురుడు పోయటానికి. పదో నెలని ఉషకు మగపిల్లవాడు కలిగాడు. కాంతారావూ, తల్లీ చూడటానికి వచ్చారు. పోలికలు ఎక్కువ భాగం తండ్రివే. బారసాల అవీ బాగానే చేశారు. శివనారాయణ అని పేరు పెట్టారు. అది కాంతారావు తాత పేరు.

మూడో నెలరాగానే ఉష విజయవాడ వచ్చింది. తోడుగా మా అత్తయ్య కూడా వచ్చి, నెలరోజులు వుండి పోయింది.

* * *

ఉద్యోగంలో నాలుగైదు సంవత్సరాల సర్వీసు సంపాదించేప్పటికి కాంతారావులో చాలా మార్పులు వొచ్చాయి అతని జీవితంలో ఆమార్పులు కలుగటానికి కేవలం పరిస్థితులేకారణమని అతను తృప్తి పడటానికి భావించినా, అవి అంత బలవత్తరమైనది కావు. నిజానికి కాంతారావు పరిస్థితుల వారసుడు కొనక్కర్లేదు. సహజం అతనిలో రేగినభయమే అట్లా చేసింది. ముగ్గురు పిల్లలు. రాను రాను సంసారం ఎదిగి [illegible]గాన్నది, మరి అందుకు తగినట్లుగా

సంపాదన ఉండొద్దూ! లంచాలు తీసుకోవటం ఆరంభించాడు. అధర్మ సంపాదన. ఇట్లా సంపాదించటం వంశంలో కొత్త. తల్లీ, భార్యా మొదట్లో అడ్డుచెప్పినా కొన్ని కారణాలవల్ల తలవొగ్గవలసి వొచ్చింది. వేలకువేలు సంపాదిస్తున్నాడు, కాంతారావు.

భర్త ఎంత సంపాదిస్తున్నా మా ఉష ప్రవర్తనలో ఏమీ మార్పురాలేదు. కాంతారావు తల్లి పెట్టని ఉక్కుగోడై అడ్డుతగిలింది. అంచాత ఉష ఉద్యోగస్థుని భార్యగా ఎన్నడూ అగుపించదు. ఆమెను చూసిన వాళ్ళకు మొదటగా తట్టే అనుమాన మేమిటంటే, కేవలం పిల్లల్ని కనటానికి జన్మ ఎత్తిందా? ఏటా ఒకకాన్పు. ఆమెలో అందం పిల్లలు కలిగిన కొందికీ హరించి పోతూన్నాది. చివరకు మిగిలేది – ఆ ఆస్తిపంజరమేమో! అనిపించక మానదు. జీవితంలో ఏగాఢ సన్నివేశానికి నోచుకోని మా ఉష లాంటి ఆడవాళ్ళని చూస్తుంటే 'ఆడజన్మ' సార్థకత – వంటగది పొగలో కళ్ళు నులుము కోవటంతోనూ, అసహ్యాన్ని తొలగించుకొని పిల్లలకు వెట్టిచాకిరీ చేయటంతోనూ తలకనూనె రాచుకోలేని తీరికలేని పనులు చేయటంతోనూ, క్రమేపే భర్తకు అనందానిచ్చే యంత్రంగా తయారుకావం టతోమా, అనుక్షణమూ వ్యక్తిత్వాన్ని చంపుకొంటూ బానిసగా వ్యవహరించటంతోనూ, సరిపోతుందా ? అనుపిస్తూంటుంది. జాలితలచక మానలేం.

కాంతారావు సంపాదన అట్లా వుండగా మా అత్తయ్యా మామయ్యల సంపాదనకూడా గణించ తగ్గది. మా అత్తయ్య గేద పాడిమీద నెలకు ఎట్లాలేదన్నా యాభై రూపాయలు వెనక వేస్తుంది. కోళ్ళు పెంచి, గుడ్లు అమ్ముతూ కొంత, పిడకలు చేసి బ్రాహ్మలకు అమ్ముతూ కొంత, అలగా వాళ్ళకి బియ్యం అమ్ముతూ కొంత మొత్తానికి చాలా సంపాదిస్తుంది. ఇక మామయ్య సంపాదన అంతా ఇంతాఅని చెప్పటానికి లేదు. ఊళ్ళో వడ్లమరలోనూ, సినిమా హాల్లోనూ, కట్టెల అడితిలోనూ, భాగాలు ఉన్నాయి. అంతేకాక ఆయన ప్రత్యేక దృష్టితో చేసే వ్యాపారాలు కూడా మరికొన్ని ఉన్నాయి. ధాన్యం, అపరాలు, కొద్దిగా పసుపు వ్యాపారాలేకాక చాటుగా బంగారం వ్యాపారంకూడా ఉంది. ఆచివరివ్యాపారం విషయం అందరికీ తెలియదు. ఇంతసంపాదనా వేలసంఖ్యలోకి వెళుతోంది ఈ అస్తంతా రేపు మా ఉషకు పెట్టవలసిందేగా!

సంపాదించే వాడిమీద లోకానికి రెండు కళ్ళూ ఉంటాయి. కాని వీటిచూపులువేరు ఒకచూపు అసూయ, కల్మషంతోనూ; మరోచూపు గౌరవం, అభిమానంతోనూ కూడుకొని వుంటుంది. ఆ మొదటి చూపుకు బెదరకుండా వుండేసామర్థ్యం కావాలి. అదిఉన్నరోజే సంపాదన పూర్తి చేయ గలుగుతాడు.

కాంతారావు లంచాలు విరివిగా తీసుకుంటున్నాడనే వాదం ప్రచారంలో ఉంది. అతను పై అంతస్థుకు తనతోటి వాళ్లు పోయినంత త్వరగా పోక పోవటానికి కారణం అదే. తనప్రవర్తనలోనిదుర్మార్గం కాంతారావుకు తేట తెల్లమైనా, ఉద్యోగరీత్యా అది కలిగించే ప్రతిబంధకం విపరీతమేయైనా— అతను చింతిల్లటం లేదు. డబ్బు సంపాదించటమే కావల్సింది. ఏ అంతస్థులో నుండైతేనేం?

"అబ్బాయీ! ఎన్నాళ్లుండా అక్కడేనా. పైకి పోయే అవకాశంలేదా?" అన్నాడు మామయ్య ఒకసారి ఉద్యోగాన్ని గురించి కాంతారావుతో.

"నా ప్రయోజకత్వం అధికారులకు నచ్చలేదు" అన్నాడు కాంతారావు.

మామయ్య మనస్సు చివుక్కుమంది. మళ్ళీ ఉద్యోగంలోని హెచ్చుతగ్గుల్ని గురించి మాట్లాడలేదు.

* * *

కాంతారావుకు వెంట్రుకలు నెరుస్తున్నాయి. మా ఉష ఇప్పుడు ఏడుగురు పిల్లల తల్లి అయింది. మామయ్య సంపాదన ఆగిపోయింది. సంపాదించింది చూసుకుంటూ మంచంలో పడి తీసుకుంటున్నాడు. ఇద్దరు పిల్లలు మా అత్తయ్య పెంపకంలో ఉన్నారు. కాంతారావు తండ్రి చనిపోయాడు. కాంతారావు తనఊళ్ళో పదెకరాల పొలం అదనంగా కొన్నాడు. ఉద్యోగం చేసే బస్తీలో అద్దెకొంపలో యీవన పడలేక, పదివేలు పెట్టి ఒక డాబా కొన్నాడు.

కాంతారావు సంపాదన తగ్గలేదు. పిల్లలు ఎదిగారు. ఒకడు స్కూలుఫైనలు పరీక్షకు కూచున్నాడు. పెద్దమ్మాయి

ఫిఫ్తుఫారం చదువుతూంది. రెండోవాడు థర్డుఫారం, మూడోవాడు సెకండుఫారం, రెండో అమ్మాయి అయిదో క్లాసు చదువుతూన్నది. ఆ పిల్లల్ని ఎంత కట్టుదిట్టంతో, భయ భక్తులతో పెంచుతున్నారంటే— ఒక్కడూ తలెత్తి మాట్లాడటానికి వీల్లేదు. కాంతారావు తల్లి ఎంత ముసలిదైనప్పటికీ పెత్తనం ఆవిడదే. ఆవిడ మాట జవదాటే వాళ్ళు లేరు.

మామయ్యకు అవసానదశ వచ్చింది. బంధుసమూహాపు మధ్య ఒకరోజున ప్రాణాలు విడిచాడు. పోతూ పోతూ చాలా మిగిల్చి వెళ్ళాడు మామయ్య, అత్తయ్య ఒక్కర్తే వుండలేక ఇంటిని నెలకు పాతిక రూపాయలకు హైస్కూలు హెడ్ మాస్టరుకు అద్దెకిచ్చి ఉష దగ్గర ఉంటూన్నది.

పెద్దవాడు స్కూలు ఫైనలు ప్యాసయ్యాడు. కాలేజీలో చేరాడు. పెద్ద అమ్మాయి ఫిఫ్తుఫారం ప్యాసు కావటం జరిగింది కానీ ఇకముందు చదవటానికి లేకపోయింది. కారణం ఏమిటంటే పెద్దమనిషయింది. అటువంటి పిల్లను చదివించటానికి కాంతారావూ, ఉషా అభిప్రాయాలు అవతలగా వుంచి కాంతారావు తల్లికి ఇష్టం లేకపోయింది. మా అత్తయ్య ఏమీ చెప్పలేదు. పెద్దవాడు, శివన్నారాయణలో కాలేజీలో చేరనాక కొన్ని మార్పులు జరిగాయి. ఆ మార్పులు వాడిలో కలగటానికి కారణం, తాను బ్రతుకుతున్నది బావిలో తాబేలు బ్రతుకని తెలుసుకోవటం వల్ల- ముఖ్యంగా సిగిరెట్లు త్రాగటం, దొంగతనంగా డబ్బులు మిగుల్చుకొని అధికంగా సినిమాలు చూడటం సాగిస్తున్నాడు. ఈ విషయం కాంతారావు కంటె కాంతారావు తల్లి కనిపెట్టి కాంతారావుకు చెప్పింది, ఒకటికి నాలుగు.

తన కళ్లెదుట పిల్లవాడు చెడిపోవటం ఆయనకు పట్టరాని కోపం వచ్చింది. చావచితక కొట్టాడు, ప్రేం బెత్తం తీసుకొని. మా ఉష గుడ్లలో నీళ్లు కుక్కుకొని వూరుకుంది.

మరినాలుగు సంవత్సరాలకు కాంతారావు తల్లి గతించింది. పెత్తనం ఎవరి చేతుల్లోకి పోవాలి అన్న సమస్య బయలుదేరింది. కాంతారావుకు తను పెత్తనం వహించటం బాగుండక, భార్యకిద్దామనుకున్నాడు. అట్లానే ఇచ్చి చూశాడు కాని సంపాదన వెనుకబడే ఉపాయాలు తెలిసి పొదుపుగా. వాడినాకూడా, ఆవిడ పెత్తనాన్ని సాగనివ్వలేదు. పిల్లలు మాటిమాటికీ కాస్త కూకూ స్తకూ, దానికినీ, దీనికనీ- డబ్బులివ్వమని వేధించ సాగారు. ఆ విషయం కాంతారావు కనిపెట్టి తాను లాక్కున్నాడు.

* * *

కాంతారావు తన పెత్తనంలో చాలా విరివిగా సంపాదించాడు. ఉద్యోగంలో రిటైర్డు అయినాడు. శివన్నారాయణ యం. బి., బిస్.. చదువుతున్నాడు. పెద్ద పిల్లకు ఇద్దరు పిల్లలుకూడాను, మొగుడుకు బ్యాంకులో పని. రెండోపిల్ల పెళ్ళీడుకు తయారుగా ఉంది. రెండోవాడు కాలేజీలో చదువుతున్నాడు.

కాంతారావుకు ఏమాత్రం శాంతి లేకుండాఉంది. చాలా సంపాదించాడు. ఇన్నాళ్లూ సంపాదించాలనే ఆరాటంతో జీవించాడు. దాన్ని భద్రపరిచేందుకు చింతలేదు. ఇప్పుడు ఆ చింతకూడా ఏర్పడింది. సంసారం చాల పెద్దదైంది. సాధ్యమైనంతవరకు నేర్పుగా ఖర్చు తగ్గించుకొని డబ్బు నిలవ చేయాలి. ఫించను వస్తూవుంది.

ఒక రోజు ఉదయం కాఫీ త్రాగి కుర్చీలో కూర్చు ఆలోచనలో పడిపోయాడు, కాంతారావు.

తనకిప్పుడు వందెకరాల ఆస్తి ఉంది. ఈ ఆస్తిని సంపాదించటంతోనే తన జీవితకాలమూ, సౌఖ్యము హరించి పోయినయ్. ఇంత ఆస్తికీ కుడిభుజాలుగా వున్న వియ్యంకుడూ, వియ్యపురాలూ, తనతల్లీ చనిపోయారు. కాని వాళ్ళు తమతో ఏమన్నా తీసుకెళ్లారా? రేపు తనగతీ అంతే! ఇంత ఆస్తి సంపాదించామనే గర్వం, ఆనందం మిగులుతుంది చావబోయేటప్పుడు.

కాని ఇంత సంపాదించినా రేపు తను చచ్చినతరువాత కొడుకులు పంచుకుంటే ఎంత వస్తుంది? మనిషికి పదెకరాలు కంటె రాదు. సక్రమంగా పంచుకుంటారో లేదో. ఎన్ని పోట్లాటలు జరుగుతాయో. ఇదంతా యింత సంపాదించటం వల్లనేగా. వెధవది ఎంత సంపాదించి మట్టుకు తనకు శాంతి యేది? ఎకరం ఆస్తి లేని కుటుంబం ఎంత నిశ్చింతగా బ్రతుకుతోంది? ఇంకా తనలో సంపాదించాలనే ఆరాటం చావలేదు. సంపాదించటంతోనే తన జీవితకాలం ముగుస్తుంది.

## సంపాదన

కాని అనుభవించే ఆనందం ఏది? తనలో ఈ సంపాదించా లనే ఆరాటం లేకపోతే తన జీవితం సౌఖ్యాన్ని రుచిచూసే దేమో! ఈ సంపాదనకు అంతం ఎక్కడ? చావులో.

పిల్ల ఏడుపు విని ఉలిక్కిపడి లేచాడు ఆలోచననుంచి. భార్య అయిదో పిల్లను కొడుతూంది.

"ఎందుకే అట్లా చావచితక కొడతావు?" అన్నాడు కాంతారావు.

"చూడండి బజారుకెళ్ళి అరణాల దారపు వుండ తీసు కురమ్మని అర్ధరూపాయి యిస్తే మిగిలిన బేడ పారేసి వచ్చింది" అన్నది మా ఉష.

"ఇంకా నాలుగు బాదు. బేడ పారేయటమా? కాస్త లేదూ దానికి అప్పుడే డబ్బు మీద అంత నిర్లక్ష్యమా!" అన్నాడు కాంతారావు కోపంగా. వెంటనే నాలుక కొరు క్కున్నాడు. ఏం బేడ పారేస్తే?



## అభాగిని

(౬౮-వ పేజీనుండి)

చూడు. నీకునచ్చిన పిల్లను పెండ్లి చేసుకుని సుఖపడు" అని ఒదార్చాడు మామ రామూను.

ఆపదిరోజులు అక్కడేఉండి కమలదినం పూర్తిచేసు కుని ఇంటికితిరిగి వచ్చాడు. రామూ తల్లీ దండ్రీ మళ్లీ పెళ్లి చేసుకోమన్నారు. కాని అతనిమనస్సు ఒప్పుకోలేదు "బ్రతికినన్నాళ్ళు సుఖపెట్టలేదు. చచ్చిపోయిన తరువాత కూడా ఆమె మనస్సుకు అశాంతి కలిగించలేను నాన్న" అంటూ యేడ్చాడు. అప్పటినుండి ఇంట్లో పెళ్ళిమాట యెత్తడానికే భయం.

ఈ కథంతా సంవత్సరం క్రిందజరిగింది. మామగారు వ్రాసిన ఉత్తరంచూచి అంతాతల్చుకుని యేడుస్తున్నాడు రామూ! ఇంతలో వెనకనుంచి తనభుజం తట్టినట్లు గ్రహించి వెనక్కి తిరిగిచూచాడు. పదినెలలు మోసికన్న తల్లి కనపడింది. ఆమాతృశ్రీని చూచి "అమ్మా" అంటూ యేడ్చాడు.

"ఏడిస్తే యేమన్నా మనకోసంవస్తారా చెప్పు నాయనా! జీవి అన్నతరవాత చచ్చితీరాల్సిందేగా! కొంచెం ముందు వెనుక అంతే. ఇదంతా మర్చిపోయి సంవత్సరీకానికి మీమామయ్యా ఊరికి బయలుదేరునాయనా. కండ్లుతుడు చుకో తప్పు "అని చెప్పింది మాతృశ్రీ.

ఆమాటలువిని రామూ కండ్లు తుడుచుకుని అక్క ణ్నుంచి వెళ్ళిపోయాడు.

★





ప్రస్తుతం ఇండియాలో పని చేస్తున్న ముగ్గురు న్యూజీలండ్ నర్సులు. వీరు కొలంబో ప్లాన్ క్రింద మన దేశానికొచ్చారు. పైపటంలో వారు న్యూజీలండ్‌లోనున్న సిలోనీస్ డెంటల్ నర్సు. ట్రైనీలతో సంప్రదిస్తున్నారు.



# నిరుద్యోగం

★

శ్రీమతి వై. సీతాదేవి

ఎక్కడ చూసు నిరుద్యోగ సమస్యే. ఎవరినోట విన్నా నిరుద్యోగమన్న మాటే. ఈ నిరుద్యోగు లెవరు? బీదలేనా నిరుద్యోగులు ; వాళ్ళకెందుకీ చదువులు. వాళ్ళు చదువుకొని ఏమి ప్రయోజనం. పాపం తల్లి దండ్రులు ఇండ్లు వాకిళ్ళు గూడా అమ్ముకొని బిడ్డలకు చదువు చెప్పించుకున్నవారున్నారు. ఎందుకలా చేయటం! ఏదో పెద్ద ఆశకోసమే.... బిడ్డ చదివి గొప్పవాడై గొప్ప ఉద్యోగి అవుతాడనే. చదుకున్న వాళ్ళగతే యిలా వున్నది. ఇక చదువు లేనివాళ్ళ సంగతి ఆలోచించనవ సరంలేదు. చదువుకున్న వాడికన్నా చదువు రాని వాడి పనే కొంత మెరుగేమో?. మనకు ఎలాగూ చదువులేదు. మన జీవితంలో యిక వేరే ఆశేలేదనుకుంటాడు. చిన్న పనికైనా తలొగ్గుతాడు. లేకపోతే ముష్టికైనా బయలు దేరతాడు. అది వేరే సమస్య. ఇక కొంచెం చదువుకున్న వాడి సంగతి ఆలోచించటానిక్కూలేదు. వాడెప్పుడు ఏదో వక ఆశ కోసమే ప్రయత్నిస్తుంటాడు. వాడి ఆశలు ఫలించవు, సరికదా వాడి జీవితం గూడ అంధకారంలో మునిగిపోవల సిందే. ప్రతి వక్కరు చదవాల్సిందే. చదువు ముఖ్యావసర మనే నినాదాలిస్తుంటారు మన పెద్దలంతా: ఎందుకు చదువులు. చదువుకొని ఏమి చేయటం. తిండిలేని తర్వాతని మాత్రం ఆలోచించరు— మన పెద్దలకు ఆలోచించా ల్సిన అవసరమేమున్నది—. వాళ్ళకు డబ్బు వున్నది. వాళ్ళ బిడ్డలు చదువుకొని వూరికే ఇంట్లో కూర్చున్నా నష్ట మేమీలేదు. ఏమిటో ఎంత ఆలోచించినా మనస్సు తెగటం లేదు. ప్రతి వక్కరు చదవాలి, చదువు అవసరమని బల్ల గుద్దే కన్నా చదువుకున్న వార్కి మాత్రం పనులు చూపి స్తుంటే మిగతావారు వకరు చెప్పకుండానే చదువుకోటాన్కి ప్రయత్నిస్తారు. అసలు బీదవాళ్ళకు చదువు అవసరమా అన వసరమా! అన్న సమస్యతో నేనాలోచిస్తూ కూర్చున్నాను. ఇంతలో బయట ఎవరో "అమ్మా, అమ్మా" అంటూ పిలచినట్లుగా ఉన్నది. సరి అని నెమ్మదిగా లేచి వెళ్లాను విసుగ్గా. ఎవరో వక వ్యక్తి. పాపం చూట్టాని ఎన్నాళ్లనుండో అన్నం లేని మనిషిలాగున్నాడు. సరిగా మాటే రావటం లేదు. వయస్సు మాత్రం ఎక్కువ వున్నట్లు కనబడదు. పాపం ఎందుకు వచ్చాడో ఏమో కనుక్కోవాలనే ఆదుర్దా నాలో ఎక్కువయ్యింది. "ఏమి పనిమీద వచ్చావు, ఎవరు కావా" లన్నాను. "అమ్మా పనిమీదనే వచ్చాను. అయ్య వున్నారా?" లేరు అని బదులుచెప్పా. వణుకు తున్న చేతితో జేబులో నున్న కాగితం తీసి నా చేతికిచ్చాడు. ఆత్రుతగా చూసాను, "ఇతను చాలామంచివాడని, చదువుకున్నవాడని, నిరుద్యోగిగానుండి భార్య బిడ్డల్ని పోషించలేని స్థితిలోనున్నా డని ఏదైనా పని చూపించగోర్తానని" ఎవరో వక లెటరు వ్రాసి యిచ్చారు. చూసాను. దీర్ఘంగా ఆలోచించాను. ఏమి చెప్పాలో తోచిందికాదు. కొంచెం సేపు ఆలోచించి "అయ్య లేరు— వచ్చిన తర్వాత యీ లెటరు చూపిస్తాను. ఆదివారం వచ్చారంటే ఇంటి దగ్గరే వుంటారు రమ్మన" మని చెప్పాను. "అమ్మా మీకు దణ్ణం పెడ్తాను. ఎలాగైనా అయ్యగార్కి చెప్పి నాకేదైనా పని యిప్పించాలి. లేకుంటే బ్రతక లే"నన్నాడు. సరి చెప్తానులే వెళ్ళమని తలుపు మూసి లోపల్కివచ్చి అలాపండుకున్నాను. మనస్సంతా కలవరంగా నున్నది. కన్ను మూశాను... కలవరంలోగూడా యీ నిరుద్యోగుల్నే చూచాను ఎలాగైనా బాబుకి చెప్పి వక పని యిచ్చేటట్లు ప్రయత్నించాలను కున్నాను. సాయంకాలం ఆఫీసునుండి వచ్చారు— ఇంటికి వచ్చీరాగానే "వుత్తరాలు వచ్చాయా లేక ఎవరైనా వచ్చా" రాని అడగటం మా వారికి మామూలు.... ఆరోజు గూడా అలాగే అడిగారు. ఎవరో వచ్చారని ఆ కాగితం తీసుకు వెళ్ళి చూపించాను. చదువుకొని అలా పెట్టి యింకా ఏమిటి కబుర్లన్నారు. "ఏమున్నాయి కబుర్లు.... పాపం వాడికి పని లేదట. చాలా అవస్థపడ్తున్నాడట. ఏదైనా వకపని యిప్పించండి వాడి" కన్నాను. విసుగ్గా "ఆఫీసుకు వెళ్ళినా యిదే సమస్య.... ఇంటికి వచ్చినా యిదే సమస్యా వేరే నాకేమి పనిలేదనుకున్నావా? ఇలాంటి వాళ్ళు ఎందరో" అంటూ స్నానానిక్కి వెళ్ళిపోయారు. నిజముగా యిలాంటి వాళ్ళు ఎందరో.... ఎవరికని పని చూపించటం. మనస్సంతా ఆలోచనతో నిండిపోయింది. కలం తీసాను— నా వూహాలు అతి జోరుగా పరుగులెడుతున్నాయి. ప్రతి వక్కర్కి చదువు అవసరం— కాని బీదవాడు చదివా డంటె వాడెన్నో కష్ట సుఖాలకు గురియై యుంటాడు.... వాడు చదువు మీదనే ఆశ పెట్టుకొని వుంటాడు—వాడు ఆధారపడేదే చదువు మీద. వాడేకాదు. వాడిని కని పెంచిన తల్లి దండ్రులు గూడా వాడి మీదే ఆశ పెట్టుకుంటారు.

వాడు నిరుద్యోగిగా ఎంతకాలం గడపగలడు. వాడి జీవితం గడిచేదెలాగు? వున్న నాలుగు డబ్బులు చదువు కోసం కర్చు పెట్టుకున్న వాడి గతేమికాను? అలాంటి వాడికే పని చూపించాలి, వాడే పైకి వచ్చేటట్లుగ చూడాలి. అలా చేసేదెవరు? వాడు బీదని, వాడు కష్టపడ్తున్న విషయం ఎవరికి కావాలి. ఏపని కాళీగా నున్నా వాళ్ళ వాళ్ళ నెవరినో తీసుకువచ్చి ఆ పనిలో ప్రవేశపెడ్తుంటారు. వాడికి కావల్సిన క్వాలిఫికేషన్ వున్నా లేకపోయినా ఇలాంటి వాళ్ళ మీద ప్రభుత్వం తగుచర్య తీసుకోవాలి.. వీలున్నంత వరకు బీదలకే పనులు చూపించాలి.. ఎప్పుడైతే వాళ్ళకు పనులు కల్పించి పైకి తీసుకు వస్తుందో ప్రభుత్వం అప్పుడే ప్రతివక్కరు చదువుకోగల్గుతారు. అప్పుడే చదువు విలువ తెలుసుకోగల్గుతారు— ధనికులు చదివినా వార్కి పని లేకున్నా ఏదో విధంగా డబ్బు సంపాదించాలని చూస్తారు—. ధనికులు చదివేది ఎక్కువ డబ్బు ఆర్జించడాన్కి. బీదవారు చదివేదికేవలం వారి పొట్టకోసం, కుటుంబపోషణ కోసమే. ధనం ఆర్జించే వారికి పని ముందు చూపటమా ? లేక పొట్ట పోసుకునే వారికి ముందు చూపటమా?. అన్నిటికీ పైగా యీ రికమన్‌డేషన్.... గొప్పవార్కి యింకొక గొప్పవాడు రికమెండు చేసాడంటే యిక ఆ పని అయిపోయినట్లే. బీదవార్కి ఎవరు రికమెండు చేసేది? అలాంటి వారికి చేసినా మన గౌరవ మర్యాదలకు లోటనుకుంటారు పెద్దలు—. ప్రభుత్వం యిలాంటి వాళ్ళ మీద చర్య తీసుకోక పోవటమే యిందుకు కారణం. ఈ రికమెండేషన్ పద్ధతే వుండగూడదు.. క్వాలిఫికేషన్స్‌ను బట్టి, తర్వాత వారి స్థితి గతులను బట్టి ముందు వారికి పని కల్పించాలి ప్రభుత్వం.. అప్పుడే యీ నిరుద్యోగసమస్య కొంత వరకు బాగుపడ్తుంది.. దీనితో దేశం బాగుపడ్తుంది. దేశంతో బాటు ప్రజలు బాగుపడ్తారు.. ఈ ఆలోచనతో నా కలం అతి జోరుగా నడుస్తున్నది. ఇంతలో పోస్టుమాన్ పిలుపు నా చెవిన బడి కలం అలా వదలేసి బయటకు వెళ్ళి ఆ వుత్తరాలు అందుకున్నాను—. "ఎవరికో ఉద్యోగం కావాలని, మీరు రికమెండు చేసారంటే పని అయిపోతుందని, తప్పక చేస్తారని ఆశిస్తున్నా" నని వ్రాసారు.. ఆ వుద్యోగం కావల్సిందెవరికో తెలుసా?. వాళ్ళ నాన్నగారు వాళ్ళ ఊళ్ళో పెద్ద షావుకారు— ఎలాగో కొంత డబ్బు ఖర్చు పెట్టి కొడుకుని బియ్యే ప్యాసు చేయించాడు. ఇప్పుడు పెద్ద వుద్యోగం కావాలట. దానికోసం రికమెండేషన్ కావాలట. వీడికెందుకో వుద్యోగం. ఎంతో కష్టపడి బియ్యే ప్యాసయిన నిరుద్యోగులు ఎంతో మంది వున్నారు.. దినం మన యింటికి ఎంతమంది రావటం లేదు.. వాళ్ళ విషయం ఏమి కాను.. ఆ వుత్తరం అలాగే చింపివేద్దామనుకున్నాను.. కాని మా వార్కి కోపం వస్తుందని అలాగే టేబుల్ మీద పెట్టాను—. కలం పుచ్చుకున్నాను.. ఏదో వ్రాయబోయాను—. ఇంతలో మా వారు రావటం.. ఇక కలం నడిచిందికాదు.. కలం అలా వదిలేసి మా వారివైపు చూస్తూ కూర్చున్నాను.. ఉత్తరాలన్నీ తీసి చదువుకొని, "చూడు మనవాడికి వుద్యోగం కావాలట" అంటూ ఆ కవరు అలా పెట్టారు— నాకు ఆ మాట వినేసరికి భలే కోపం వచ్చి "మనవాడూ లేడు తనవాడూ లేడు. వాడికి రికమెండు చేయటాన్కి వీల్లేదు.. ఇంతకన్నా పెద్ద డిగ్రీలు పెట్టుకొని చిన్న పనైనా చాలని మీ దగ్గర్కి ఎంతమంది రావటంలేదు.. ముందు వాళ్ళ విషయం ఆలోచించండి.. కావాలంటే గట్టిగా వాళ్ళకే రికమెండు చెయ్యం" డన్నాను—. మా వారు నవ్వుకుంటూ 'అలాగే' నన్నారు—. అబ్బా కొంత వరకు మనశ్శాంతిగా నున్నది—. ★

# "మ్యూసింగ్స్"

★

'జనమంచి'

వర్షా రిప్వరేనిని సీమం నింపాలేనా! అవిగో ఉరుములు నోరు తెరచి మెరుపుల మాటలేవో పల్కుతున్నాయి! ఏవీ నా పుష్పాలు! ఎక్కడ దాగారు. నా విరి కన్నెలను! మంచు తెరల్లో మునిగి పోయాయా? చంద్ర గాడ్పులలో ఎండిపోయాయా? ఏవీ నా పూకన్నెల చేలాంచలాల రాయని పిలుపులు! ఈ తనువుకి సోకడం లేదేం!

అదిగో ప్రాక్ ప్రాంగణ ద్వారః కవాటం తెరచి తొంగి చూస్తున్నాడు పవన తనూజుడు. రావోయీ! తుషారధరా! రావోయీ! మెదరు గుబురు పొదలలో చేరి పరిమళపూరించు. కదంబాలు కందళిత హృదయాలతో నీ కీర్తనలో నర్తన మొనరిస్తాయి!

అరెరే! ఏమిటీ పుష్ప సమూహం? ఏమిటీ తన్మయ నర్తనకేళి! ఎక్కడ దాగొని దోబూచిలాడుతున్నారింత వరకూ! పచ్చిక తివాచీ పూరివిప్పి పరచుకుంది! రండి! రండి! నర్తించండి! ................ మీరంతా ఇంతవరకూ ఏలోకాల రంగు హంగుల హొయలులో సౌందర్యాన్ని దిద్దుకుంటున్నారు! ఆ లోకం పేరేమిటి. ఎంత సౌందర్యపిపాస! నన్నుకూడా తీసుకుపోతారా మీతో వచ్చేస్తాను? మీ హృదయం— అటువంటి పరిమళ భరితమైనది కావాలి? మీతో చేరి ఈ మానవత్వం పోగొట్టుకోవాలని వుంది! నన్ను భూమి పట్టుకునుందా? లేక నేను భూమిని పట్టుకున్నానా? ఈ జగత్తంతా నాకపరిచితము! నేను అపరిచితుణ్ణి! పూలూ! మీరు ఇట్టే వస్తారు, ఇట్టే మాయమౌతారు! ఎందుకు నన్నిలావుంచి ఆశను ఎగసనతోస్తారు? నీలిమాకాశం చూసి రంగు మార్చుకుంటారు. అరుణారుణ కాంతులు చూసి తరుణ యవ్వనంతో తనువులు మర్చిపోతారు. మెదవాల్చి గుండెలోతుల్లో, ఏదో పోగొట్టుకున్న దానికై నిరంతరాన్వేషణ సాగిస్తాను. నన్నెందుకు మీరు వదలి వెళ్ళిపోతారు? జాలిలేదు! నాచుట్టూరా కవాటాలు బంధించి వున్నాయి. నన్నుకూడా ఆ లోక ఆహ్వానానికి అతిథిగా తీసుకుపోరూ!

ఆ వెచ్చని వెల్తురే ఆ గాలే, ఆకాశమే, ఆవర్షమే, ఆతుషారమే నన్నూ తాకుతూంది. కాని ఇదేమిటి! పులకరింతల బదులు ఈ తిమ్మెర లేమిటి! పరమేశ్వరుడు ప్రాణికోటికంతటికీ ఒకే జీవామృతం చిలికాడే! పచ్చికలో పరుగిడే జీవధార నాలో నా నాళాలలో ప్రవహించదా! పిల్లతెమ్మరలో పట్టీలు కొడుతూ తేటిజంటలు, పూలౌ సంగుతూన్న మధు విందు నారగిస్తున్నాయి. మానవుని హృదయం ప్రేమమధు భరితమన్నారు! అంతా మిథ్య!

సృష్ట్యాదిలో మనం ఆపద్బాంధవులము. ఆదిలో అన వరతమూ అనుకోని అన్యోన్యంతో కలసిమెలసి ఉండే వాళ్ళము. అప్పుడు మీకుండే ముగ్ధ హృదయమే నాకూ వుండేది. కాని, ఈ పరిణామంలో వాతావరణ సమర్దింపులో నా హృదయం చివికి చితికి పోయింది. మీరు నన్ను గుర్తుపట్టలేరు కదూ ఇప్పుడు! ప్రథమ ప్రభాతంనాటి ఆనందం ఇప్పుడు లేదు. ఆనాడేకదూ మనం ఒకరికొకరం ఆశ్చర్యంతో చూసుకున్నాము? ఆనాడేకదూ చూపుమేర కనపడే సృష్టి వైచిత్రినంతా కని విస్తుపోయాము. ఆనాడే కదూ అంబర పథాల్లో వర్తులనృత్యం చేస్తున్న తారకల మైత్రి కోసం ఊర్ధ్వంలోకి చూస్తూ, ఆకాశపుటంచులు పట్టుకు పైకెళ్ళేందుకు పరుగెత్తాము. ప్రకృతికాంత సౌందర్యాన్ని చూసి మురిసిపోయి గొంతు విప్పాము; అదే మొదటిసారి మన గొంతులోని తీపి శ్రవః పేయమని తెలుసుకున్నాము.

విరి చేడియలారా! పలుకరించరేమి! చిన్ననాటి స్నేహం వాత్సల్యం మర్చిపోయారా! ........ కాదు! కాదు ... నేనే మారిపోయాను! నేనే మనమొదటి భాష మర్చిపోయాను. నేనే మీ వాతావరణంనుండి దూరమై పోయాను. ఇప్పుడు అమానుషమైన కాంక్ష నాలో చెలరేగింది! ఈ కాంక్షనే మేము నాగరికత అంటున్నాము! ఈ నాగరికత పరుగుల్లో నశించిపోతూన్నది మేమే. ఈ కాంక్ష, ఈ నాగరికత అశనిపాతమైంది! రాను రాను ఆత్మఘాతమైంది! నన్ను ద్వేషిస్తున్నారు కదూ మీరు! మానవ వాతావరణానికి దూరంగా వుండాలనే మీనిశ్చయము! మీకుపరిణామంలేదు! మీరప్పుడే పూర్ణాకృతి చెందారు! అందుకే మీరు పరమేశ్వరుని అనుంగుబిడ్డలు! అందుకే లాలనతో ఆయన మిమ్ములను మూర్ధంమీద పెట్టుకుని ఆదరిస్తాడు. మీతోపాటు కలసిమెలసి ఆడుతూ పాడుతూంటాడు .... నాకు పునరవతరణం కల్గించరూ!

నా అపరాధమేమిటి! నన్ను పతితుణ్ణిగా పరిగణిస్తున్నారా? నాకీప్రవాస మెంతకాలం? మీ లోకంలో నాకు తావులేదా? మీలోకపు బాటనంటి రానా? మీదిపూల బాటా! ఔను! నాకఠిన పాదశిలల క్రిందపడి నలిగి రాలిపోతారు!

# లోకము: నాకము: నాటిక:

• శ్రీ పా. పద్మరాజుగారు •

పాత్రలు:—

కవి.

సామ్యవాది.

భోగి.

త్యాగి.

## మొదటి రంగం.

స్థలం: భూమి. తెల్లటి తెర మూడు ప్రక్కలా మూసి ఉంటుంది. తెల్లటి గుడ్డతో కప్పిన రెండు తిన్నెలు ఇటూ అటూ ఉంటాయి. ఎడమప్రక్క మూలలో ఒక చిన్న మార్గం ఉంటుంది. కొన్ని మెట్లు ప్రేక్షకులకు కనిపిస్తుంటాయి. ఆ చీలికలోనించి నీలి రంగు కాంతి కనిపిస్తుంది.

ప్రవేశం: కవి కుడిప్రక్కనించి, సామ్యవాది ఎడమప్రక్కనించి ప్రవేశం. స్థలం మొదట గ్రుడ్డి వెలుతురుగా ఉంటుంది. క్రమంగా కాంతి వస్తుంది. ఇద్దరూ ఒకరి వెనక ఒకరు వెతుక్కుంటూరు.

సామ్యవాది: ఏమిటి?

కవి: ఏమిటి?

సా: ఎందుకు?

క: ఎందుకు?

సా: ఎవరు నువ్వు?

క: నువ్వెవరు?

సా: (వెలుగు పూర్తిగా వస్తుంది) ఓహో! కవిగారా?

క: తమరా! సామ్యవాదిగారా.

(ఇద్దరూ కూర్చుంటారు)

సా: తిరిగి తిరిగి అలసిపోయాను.

క: కాని కావలసింది దొరకలేదు.

సా: ఈ అన్వేషణలో ఒక చిత్రముంది. మనకి కావలసింది కొద్ది ప్రయత్నంలో దొరికిపోతున్నట్లు అనిపిస్తుంది. కాని ఆ కనబడే చోటుండే అది, మనం దగ్గరా వచ్చిన కొద్దీ అల్లా దూరంగా జరిగిపోతుంటుంది. ఒక్కొక్కప్పుడు ఈ అన్వేషణ అంతా నిష్ఫలమనిపిస్తుంది.

క: అన్వేషణకి ఫలం అన్వేషణే అంటారు.

సా: మీతో చిక్కు ఇదే. మీకు కావలసిందేమిటో మీకు తెలియదు. కాని దేనికోసమో మీరు వెతుక్కుంటూ ఉంటారు.

క: నువ్వు దేన్ని అన్వేషిస్తున్నావో నీకుమాత్రం స్పష్టంగా తెలుసా?

సా: ఆ. సమానత్వం నా ఆశయం.

క: మీ రష్యాలో సాధిం చేరుగా కొంతవరకు.

సా: అది ఆర్థిక సమానత్వం. భౌతికమయినది. నేను అన్వేషిస్తున్నది మానసిక సమానత్వం.

క: నువ్వూ నేనూ, బలేరకమయిన తిండి తినడం, బలే రకమయిన భోగాలు అనుభవించడం, అంతవరకూ సమానత్వం బాగానే ఉంది. కాని నువ్వూ నేనూ బలేలాగ ఆలోచించడం ప్రారంభిస్తే, ఇద్దరం కలిసి ఆత్మహత్య చేసుకోడం మంచిది. ఇద్దరి విషయంలోనే ఆ సమానత్వం దుర్భరమయిపోతే ఇంక లోకం అంతటిలోనూ అందరు మనుష్యులూ బలేలాగ ఊహించడం ప్రారంభిస్తే ......బాబో! నేను మాత్రం ఆ లోకంలో బ్రతకలేను.

సా: మీ కెంతసేపూ, మీ సొంత సుఖాలూ, వాటికోసం పాకులాడ్డం తప్ప, సంఘం ఎలా ముక్తి పొందాలనే చింత ఎక్కడా కనపడదు. కళారాధకులంతా వట్టి స్వార్థపరులు.

క: ఎవరి సుఖం వారు చూసుకోగలిగితే అదే సంఘానికి ముక్తి.

సా: సమాజానికీ, వ్యక్తికీ, ఘర్షణ రాకండా ఉండేటంత వరకూ అది బాగానే ఉంటుంది. బలే పుల్లమ్మని నువ్వూ

'నేనూ ప్రేమిస్తున్నాననుకో. అప్పుడు మీరు ఇద్దరి సుఖమూ ఎల్లా సాధ్యపడుతుంది?

క : ఫరవాలేదులే. నేను పుష్పక్కని కేవలం నీకు వదిలి పెట్టి, నా దారిని నేను పోతాను.

సా : అప్పటికొస్తే నేను ప్రేమను జయించి చాలా కాలమయింది. మొన్న నువ్వు పద్యాలు రాసిన ఆమె నీతో పెళ్ళాడిందటగా?

క : ఎవరినో ఒకరిని చూసేసరికి ఆమె మొదట్లో దేవతలా కనిపిస్తుంది. కొత్త పరిచయం ఏర్పడిన తరవాత పట్టి 'పెంకి' మామూలు స్త్రీ అయి ఊరుకుంటుంది.

సా : అంత మాత్రానికి అన్వేషణ ఎందుకు? ఆ క్షణానికి నీభార్య ఆవిడే అనుకుంటే సరిపోతుందిగా? అప్పుడు ఏ తగాదా ఉండదు.

క : నా భార్య యెడల నాకు అనురాగము లేదనుకోకు. అనంతమయిన ప్రేమను నా హృదయంలో ఇముడ్చుకున్నాను. కనక నేను నా భార్యనుకూడా అమితంగా ప్రేమించ గలుగుతాను.

సా : పాపం, నీ భార్యకి తెలియాలి ఆ సంగతి.

క : ప్రేమంటే ఏమిటో అనుకుని భయపడి పెళ్ళే మానేసే నీలాంటి వాళ్ళకి నా సమస్య బోధపడ్డం కష్టం. నా భార్య కనుబొమలు ఎవరో దివ్యశిల్పి చెక్కినట్లు అనిపిస్తాయి. వాటిలో అంచీ అందకుండా ఒక రమ్యత్వం గోచరిస్తుంది. ఆ కనుబొమల మీద ఎన్నో పద్యాలు వ్రాశాను. కాని నేనా కనుబొమల గురించి గాఢంగా ఆలోచిస్తుంటే మా ఆవిడ వచ్చి ఇంట్లో ఉప్పూ, పప్పూ, లేవు అంటుంది. గాలిలో ఎగురుతున్న వాడిని రెక్కలు కొట్టేసినట్లు ఢభీమని నేలమీద పడిపోతాను.

సా : ఆ కనుబొమల సంగతే ఆలోచిస్తున్నట్లు ఆవిడకి తెలియదేమో పాపం!

క : తెలిసినా అంతేనోయి. ఏం లాభంలేదు. అదీగాక మా పక్కింట్లో ఉన్న లక్ష్మీదేవి చెవులు శ్రీకారాల్లా ఉంటాయన్నాను ఒకరోజుని. ఆవేళ నాకూ మా ఆవిడకీ కూడా భోజనాలు లేవు. ఎక్కడెక్కడ సౌందర్యం ఉన్నా నా హృదయం అటు పరుగెత్తక మానదు.

సా : ఏదో ఒక స్థిరమయిన లక్ష్యం లేకుండా ఇటూ అటూ మనసు పరుగెత్తుకుపోతుంటే ఇంక నీ అన్వేషణ అంతా దేనికోసం?

క : చెప్పమంటావా?

'క్షణే క్షణే యన్నవతాముపైతి
తదేవరూపం రమణీయతాయాః'

క్షణ క్షణానికీ కొత్తదిగా కనిపించే ఏదో ఒక స్వరూపం ఉంది. దానిపేరే రమణీయత. ప్రతి జీవ వస్తువులోనూ ఉన్న సౌందర్య ఛాయలన్నీ కరిగి మలిచిన ఒకమూర్తి.

సా : అది అసలు లోకంలో లేదు. అయినా ఏదన్నా ఒక స్వరూపం దొరికిందనుకో, అది క్షణ క్షణానికీ కొత్తగా ఎల్లా కనపడుతుంది. దొరికినతరువాత కొద్ది క్షణాలకల్లా అది పాతదయిపోతుంది.

క : లేదు లేదు. ఎప్పుడు చూస్తున్నా లేత మామిడి చిగురు కొత్తగా ఎందుకు కనిపిస్తుంది? అవి ముదిరి ఎండి ఎందుకుపోవాలి? వసంతం ఎల్లకాలం ఎందుకు ఉండదు? వెంటనే గ్రీష్మంవచ్చి లోకాన్ని శోకంలో ఎందుకు ముంచాలి? యౌవ్వనం, ప్రేమ ఎందుకు శాశ్వతంగా ఉండవు? ముసలితనం, ద్వేషం బయలుదేరి లోకాన్ని అసహ్యంగా ఎందుకు చెయ్యాలి?

సా : నా సమస్య వీటి అన్నిటికీ అవతలది. ఈ లోకంలో రకరకాల విభేదాలున్నాయి. అభిరుచుల్లో, ఆశయాల్లో భోగ భాగ్యాల్లో, ధనసంపదలలో, అన్నీ ప్రతివారూ సమంగా పంచుకోవాలి. ఆర్థిక వ్యవస్థలు మార్చడంవల్ల ఒకరకమయిన సమానత్వం వస్తుంది. కాని హృదయాలూ, భావాలూ, బుద్ధి, బలం, వీటిలో విభేధాలూ, ఎల్లాగ మార్చడం? వ్యక్తియొక్క ప్రత్యేకతను, వైశిష్ట్యాన్ని ఎల్లాగ రూపుమాపడం? సర్వసమానత్వాన్ని ఎల్లాగ సాధించడం?

(భోగి చటుక్కుని ప్రవేశించి, కవి వీపుమీదనించి ఒక తెల్లటి ఈకను తీసి తన్మయత్వంతో దాన్ని చూస్తూ ముందరికి వస్తాడు)

భోగి : దొరికింది...... (కళ్ళు మూసుకుంటాడు) నీకోసం నేను ఎంత దూరం తిరిగి వెతికాను! (కళ్ళుమూసు

కునే ఆ ఈగను ముంజేతిమీద వ్రాసుకుంటాడు. క్రమంగా నవ్వుపోయి నిస్పృహా ముఖం మీద ఆవరిస్తుంది.) కాదు కాదు. పొరబడ్డాను. (నిట్టూర్చి ఒక తిన్నెమీద కూర్చుంటాడు.)

క : ఏం దొరికింది? ఏంకాదు?

భో: హంసతూలిక.

సా : ఈలోకంలో హంసలే లేందే హంస తూలికలు ఎక్కడుంటాయి?

భో: ఆవిషయంలో భోగి నడగండి. ఈ తూలికల విషయం మీకేం తెలుసు? హంసలు లేకపోయినా హంసతూలికలున్నాయి.

క : పోనీ ఉంటే ఉన్నాయి. అవి నీకెందుకు?

భో: స్పర్శసుఖం అనుభవించడానికి.

సా : ఇంకేమీ నీకు కనబడలేదా ఏమిటి? మెత్తగా ఉండేవి.

భో : అనేకం ఉన్నాయి. ఒక్కొక్క వస్తువు ఒక్కొక్క రకంగా స్పర్శకు నచ్చుతుంది. నా చర్మం ఎంత సున్నితమయిందో తెలుసా? నేను కళ్ళుమూసుకుంటాను. నా చేతికి ఏదన్నా తాకించండి, అది నేను చెప్పేస్తాను. నా నాలుక రకరకాల రుచులను చవిచూసింది, నా ముక్కు కొన్నివేల సుగంధాలను వాసనచూసింది.

క : అయితే ఇంకా ఎందుకు వెతకడం?

భో : నా అనుభవంలోనికిరానివి ఇంకా కొన్ని ఉన్నాయి. హంసతూలికలు అతి మెత్తగా ఉంటాయంటారు. అమృతం అద్భుతంగా ఉంటుందంటారు. పొందామరల వాసన మనస్సుని మైమరపిస్తుందంటారు.

సా : రకరకాల స్పర్శలూ, సుగంధాలూ, రుచులు తెలిసినవాడికి, కొన్ని అనుభవంలో లేకపోతే మటుకు నష్టం ఏమిటి?

భో : ప్రతి ఇంద్రియానుభూతికి ఒక అవధి ఉంది. ఆ అవధి ముట్టేసరికి ఇంక ఇంద్రియం దివ్యత్వాన్ని పొందుతుంది. హంస తూలికలు స్పృశించిన తరువాత స్పర్శేంద్రియం ఇంక ఉండవలసిన పనిలేదు. అదీ నా ఆశయం.

క : అనుభవం మనస్సుది. నీ ఇంద్రియాలకిల్లా దక్కుతుంది?

భో : మనస్సంటే ఏమిటి? తెలుసుకునే శక్తి. అది అన్ని ఇంద్రియాలకీ సంపకమయిపోయి ఉంటుంది.

సా : మనస్సంటే శరీరంలాగే కొన్ని రసాయనిక పదార్థాల పరిణామంవల్ల వచ్చేశక్తి.

భో : ఈ లోకంలో మరమ్మత్తు చెయ్యడానికి చాలా ఉన్నాయి. లేకపోతే ఈలోకం వాస యోగ్యంగా ఉండదు. మోటుగా కంటికి బాధకలిగించే ఈ ఎండ తీక్షణకాంతిపోయి వెన్నెలలాంటి చల్లని వెలుగు లోకాన్ని ఆవరించాలి. గట్టిగా కాలకి దగిలి స్పర్శకు బాధ కలిగించే పాషాణాలుపోయి గాలిలాగ మెత్తగా ఉండే పదార్థం అంతటా నిండి ఉండాలి. కుళ్ళు దుర్వాసనలు పోయి చుట్టూ సుగంధాలు వ్యాపించాలి. అపుడు మానవుడు శరీరాన్ని మరిచిపోయి దివ్యత్వాన్ని పొందుతాడు.

త్యాగి : (ప్రవేశిస్తూ) అదుగో స్వర్గసోపాన మార్గం. ఆ నీలి వెలుగు చల్లగా ఆహ్వానిస్తుంది. (అందరూ అటు చూస్తారు.) నాకంలో ఎవరికి కావలసినవి వారికి దొరుకుతాయి.

భో : నువ్వెందుకు పోతున్నావు స్వర్గానికి?

త్యా: సర్వసంగ పరిత్యాగం కోసం.

క : త్యాగమే నీ ఆదర్శమయితే నువ్వు స్వర్గానికెందుకు? ఇక్కడే త్యజించవచ్చునుగా అన్న.

త్యా: ఈలోకంలో దేన్ని నేను త్యజించను? త్యజించడానికి నాకు అందుబాటులో సుఖం ఉందా? అందం ఉందా? అన్నీ అందుబాటులో ఉండగా త్యజించడంలో ఆనందం ఉంది. అంతేగాని ఏమీ లేకపోతే ఇంక దాన్ని త్యజించడం?

సా : అన్నీ వదలిపెట్టదల్చుకున్నవాడికి, ఈ విషయమయి అంత పట్టుదల ఉండకూడదు. అన్నీ సంపాదించుకోడం ఎందుకు? తరువాత త్యజించడం ఎందుకు?

త్యా: వెర్రివాడా! సంయమం, త్యాగం వీటికి అర్థం నీకు తెలియదు. నీకు లేనిసుఖాన్ని నువ్వు ఎల్లా త్యజించగలవు? త్యజించానను కని నువ్వుపొందే సంతృప్తి ఏమిటి? అన్నీ సమృద్ధిగా ఉండాలి నీచుట్టూ. అప్పుడు నువ్వు

వాటిని త్యజించాలి. కాళిదాసు, జేవర్షులను గురించి ఏమన్నాడో తెలుసా?

"ప్రాణానామ నిలేన వృత్తి రుచితా
సత్కల్ప వృక్షావనే"

కల్పవృక్షం ఉండే అడిగినదల్లా ఇవ్వడానికి. ఆ పక్క కూచుని వాయు గాలిని భుజించి ప్రాణాలు నిలుపుకుంటారు.

"తామేకాంచన పద్మరేణుకపిశే
ధర్మాభిషేక క్రియా"

కాంచన పద్మరేణుక పిశమయిన నీటిలో ధర్మనిర్వహణంకోసం స్నానం చేస్తారు.

"ధ్యానం రత్న శిలాతలేషు"- రత్నశిలావేదికల మీద కూర్చుని ధ్యానం చేస్తారు.

"విభుధస్త్రీ సన్నిధౌ సమయం"— అప్సరస స్త్రీలు చుట్టూ ఉండగా వారు సంయమిస్తారు.
"యత్కాంక్షంతి తపోభిరన్యమున యస్త్మిన్ తపస్యంతమ్"

ఇతర మునులు వేటికోసం తపస్సు చేస్తారో అవన్నీ చుట్టూ ఉండగా వాటి మధ్య కూర్చుని తపస్సు చేస్తారు.

పా : నా ఆశయ సాఫల్యానికి స్వర్గమే సరి అయిన చోటు. స్వర్గవాసులు ఐహిక వాంఛలను త్యజించారు. అంచేత భావ సామ్యతకోసం అక్కడ విప్లవం తీసుకురావచ్చు. నేను స్వర్గానికి వెడతాను.

భో : హంసలు స్వర్గంలో ఉంటాయి. అక్కడే దొరుకుతాయి నాకు హంసతూలికలు.

క : "అదీ స్వర్గధామం
అదీ పరమగమ్యం"
మీ కులదైవము— మాధవదేవుడు
ఏవీలునెప్పుడు ఆనానమ్ముండు— నదీస్వర్గ—
(మెట్లు ఎక్కి వెళ్ళిపోతారు.)

సా : ఆకలిదప్పుల ఆర్తిని జయించి
పరమ సామ్యతకు ప్రాణులెగబ్రాకు—నదీ—
(నిష్క్రమణం)

భో : ఈ ఇంద్రియములు— ఏ యనుభూతిని పొంది దివ్య పరిపూర్ణత నందును— అదీ స్వర్గధామం.
(నిష్క్రమణం)

త్యా : సర్వహృదయ వాంఛాపరిపూర్తికి సాధనములతో సంయమించుటయే—అదీ స్వర్గధామం.
(నిష్క్రమణం)

తెర.

## రెండవ రంగం

స్థలం : స్వర్గం. నీలి వెలుగు. కుడిప్రక్కకి క్రిందికి మెట్లు. అందులోనించి తెల్లటి వెలుగు కనిపిస్తుంటుంది. మధ్య ఒక తిన్నె. త్యాగి దానిమీద కూర్చుని ధ్యానం చేసుకుంటూ ఉంటాడు. కళ్ళు తెరుచుకుని సామ్యవాది ప్రవేశం.

సా : ఏమి స్వామీ ! కళ్ళు తెరుచుకుని తపస్సు చేస్తున్నారు?

త్యా : ఈలోకంలో కంటిరెప్పలు మూత పడవుగా?

సా : పోనీ నే వెళ్ళిపోతాను. మీ ధ్యానం చెడిపోతుంది.

త్యా : (లేస్తూ) ఈ లోకంలో ధ్యానం చెయ్యడానికి వేరే ఒక చోట ఏకాంతంగా కూర్చోవలసిన అవసరంలేదు. చుట్టూ ఎవరున్నాసరే. ఎంత గొడవగా ఉన్నాసరే మనస్సు నిశ్చలంగా ఉంటుంది, కదలదు.

సా : అయితే నీకు సంతృప్తిగానే ఉన్నట్టుంది ఈలోకం.

త్యా : అసలు మనస్సు, హృదయం ఉన్నాయో లేవో అనుమానంగా ఉంది. మనస్సు నిశ్చలంగా ఉంది. ఏకాగ్రత కాదు. వట్టి శూన్యం. చుట్టూ రకరకాల చైతన్యం ఉన్నప్పుడు, భూలోకంలో ఒకచోట కూర్చుని ప్రయత్నించి మనస్సులో ఏకాగ్రత సాధించడం అదొక ఆనందంగా ఉండేది. ఇక్కడకు వచ్చిన దగ్గరనించి ప్రయత్నంలేదు, ఆనందంలేదు.

సా : ఆ కల్పవృక్షం, కాంచనపద్మాలూ, రత్న శిలాతలాలూ, విభుధస్త్రీలు, ఇవన్నీ ఉన్నాయిగా నువ్వు అనుకున్నట్టు—

త్యా : కాని అవి నన్ను ఆకర్షించడంలేదు. నాకు కోరిక ఉంటేను—కల్పవృక్షం. కోరిక లేనపుడు కల్పవృక్షం

ఉందని కూడా జ్ఞాపకముండదు. విబుధస్త్రీలున్నారు. రత్నశిలాతలాలున్నాయి. కాని నాకు మనస్సు కదలిక లేదు.

సా : నువ్వుకోరేది అదేగా!

త్యా: కాదు. నేను కోరేది సచేతనమయిన ప్రశాంతి. అదీ తపస్సంటూ. అచేతనమయిన మనస్సులో ప్రశాంతి యొక్క అనుభవం ఎల్లా ఉంటుంది? మనస్సు అనుభవించనిదే ఇంక దేనికోసం తపస్సు?

సా : అసలు నీ ఆశయంలోనే లోపం ఉంది. ముక్కు మూసుకుని కూర్చునేవాడికి ఇంక మనస్సులో చైతన్యం ఉంటే ఏం? లేకపోతే ఏం?

త్యా: నీ విప్లవం సంగతిచెప్పు — ఏమయిందో. ఈ అప్సరసస్త్రీలనీ, దేవతల్నీ కూడగట్టావా? ఇంద్రుడికి ఉద్వాసన ఇచ్చావా?

సా : (నిరుత్సాహంగా కూర్చుని) వీళ్ళందరూ పట్టి కర్ర బొమ్మల్లా ఉన్నారు. నేనే భావసామ్య సిద్ధాంతం బోధిద్దామని రంభని నిలబెట్టాను. నేను చెప్పిందంతావిని ఊర్వసివైపు తిరిగి అర్థంలేని చిరునవ్వు నవ్వింది. ఇంద్రుడితో ముఖాముఖీని మాట్లాడాను. నేను రాక్షస పక్షం వాడి ననుకొని కొద్దికాలం ఎక్కడో తను పోయి తల దాచుకుంటాననీ, నాకు ఆయాసం వచ్చాదాకా కావలిస్తే తన సింహాసనం అధిష్ఠించమనీ అన్నాడు.

త్యా: అయితే ఇంకేం? తక్షణం ఇంద్రత్వం పుచ్చుకుని సామ్యవాదం అమలులో పెట్టలేకపోయావా?

సా : లాభంలేదు. ఎంచేతంటే వీళ్ళకి ఏసమస్యా ఉన్నట్టు తోచదు. అంచేత మనంచెప్పే సిద్ధాంతాలేవీ వీళ్ళకసలు అర్థంకావు. ఇంకా ఉప్పూ, కారం తినే మానవులు మనం. మనం ఏం చెప్పినా ఉత్సాహమో, కోపమో, అసహ్యమో, ఏదో ఒక ఉద్రేకము వాళ్ళల్లో కలుగుతుంది. అన్నిటికీ ఒకటే ఉద్రేకం ఈ దేవతల్లో. వెర్రి చిరునవ్వొకటి నీమీద పారేసి అల్లా పోతూంటారు. పోనీ ఆ చిరునవ్వులో కాస్త కొంటెతనంగాని, అదనం ఆనందంగానీ కనబడదు. అట్టబొమ్మ నవ్వినట్టుగా ఉంటుంది. ఇంక వాళ్ళని ఎట్లా జయించడం?

త్యా: నా ఆశయంలో ఏదో దోషం ఉందన్నావు. నీ ఆశయంలోనూ, ఏదో పెద్ద దోషముందని నాకు తోస్తుంది. నా ఆశయం, నా వ్యక్తికి సంబంధించినది. అంచేత ఏదన్నా కష్టనిష్టూరాలుంటే అవి నేనే అనుభవించాలి. నీ ఆశయం సంఘానికి చెందినది. నువ్వు మార్చడానికి వీలుగా సంఘం లేదంటే అది నీ ఆశయంలో దోషం కాని సంఘానిదికాదు.

సా : ఇంత నిశ్చితనమయిన సంతృప్తి ఈ దేవతలకు ఉంటుందని నేను మొదట్లో అనుకోలేదు. అసలు అసంతృప్తి ఉంటేనేగాని సామాజిక విప్లవం రాదు.

త్యా: అసంతృప్తి లేకపోతే అది నువ్వు కలిగించాలి.

సా : ఆ అసంతృప్తి నాలోనే నశించి పోతోంది.

భో : (దీనంగా మెల్లగా ప్రవేశిస్తాడు) నమస్కారం.

సా : మానవత్వం నిలుపు కోడానికి ఆఖరు ప్రయత్నంలాగ ఉందేమిటి?

భో : మానవత్వంపోయి చాలాసేపు అయింది.

త్యా: నీ హంసతూలికలు దొరకలేదా?

భో : కావలసినన్ని దొరికాయి. ఒక పెద్ద పర్వతమంత పెద్ద గుట్టపేర్చి దానిమీద విశ్రమించాను — విశ్రమించడం ఏమిటి? పొరపాటుని ఆమాటలు నోటికి వస్తాయి అలవాటు కొద్దీ. అసలు శరీరానికి ఇక్కడ అలసట లేదుగా... సరే వాటిమీద పడుకున్నాను.

సా : నువ్వు కోరినది అదేగా?

భో : (అతన్ని చూసి నవ్వి) ఆ మెత్తదనం నాకు తెలుస్తేగా? శరీరానికి స్పర్శజ్ఞానం పోయింది. నీటిలోకి దిగి పొందామరలు కోశాను. ముక్కుదగ్గర పెట్టుకున్నాను. అసలు ఉచ్ఛ్వాస నిశ్వాసలు లేవుగా... ఇంక వాటి సుగంధం ఎల్లా తెలుస్తుంది? అమృతం రుచి చూశాను.

సా : ఏం జరిగింది?

భో : అన్ని ఇంద్రియ జ్ఞానాలూ నశించిపోయాయి, రుచి లేదు, చూపులేదు, శ్రవణసుఖంలేదు. అలసటలేదు. బుద్ధి మాత్రం మిగిలింది. అది శరీరాన్నంతనీ ఆవరించింది. చెవులు, కళ్ళు, ముక్కు, చర్మం వీటిమధ్య పరిత్వం లేకుండా బుద్ధి అన్నిటినీ తెలుసుకుంటుంది.

త్యా: అయితే అది నేను సేవించి చూడాలి.

సా : నా ఆశయం సంక్షుముక్తి. అందరికీ అందుబాటులో లేని అమృతం నేను సేవించను. ఆ సుఖం నాకు వద్దు.

భో : వద్దు. అది సుఖం అనుకుంటున్నారు కాబోలు. భూలోకంలో ఉన్నప్పుడు సుఖం అంటే స్పష్టంగా తెలిసేది. ఇప్పుడు ఆ జ్ఞానం పోయింది.

త్యా: అప్పుడూ తెలియదు. అసలు సుఖం అంటే ఏమిటో.

భో : నువ్వు అనుకునే సుఖం ఏమిటో నాకు తెలియదు. కాని ఎండలో తిరిగి తిరిగి వచ్చి నీడలో కూర్చుని, మెత్తని దిండుమీద మేనువాల్చి, చల్లటి పానీయం సేవించి, చల్లని గాలిని అనుభవించి, సుఖంగా ఉందని అనుకునేవాడిని. కొత్త కొత్త రుచులు, కొత్త కొత్త సుగంధాలూ, కొత్త కొత్త దృశ్యాలూ అన్నిటిలో నాకు అనుభవమయ్యేది. ఇప్పుడేవి ఆసుఖాలు?

సా : మనమసలు ఇక్కడికి రావడం పొరబాటు.

త్యా: మనకి దొరికేదాకా ఏదో కావాలని వాంఛిస్తూంటాం. అది దొరికిన తరవాత దానిమీద అసంతృప్తి బయలుదేరుతుంది. మనం స్వర్గంలోకి కోరి వచ్చాం. తీరా వచ్చింతరవాత స్వర్గం అంటే అసహ్యం పుడుతోంది. మనకి ఇంకా ఏం కావాలి?

భో : నాకు హంసతూలికలు అక్కర్లేదు. అనుభవించగల్గిన నా శరీరం మళ్ళీ నాకు కావాలి.

సా : రకరకాల ఉద్రేకాలతో కూడిన మానవ సమాజం నాకు కావాలి.

త్యా: నాకు ఆ రెండూ కావాలి. వాటిమధ్య అసలు సంయమానికి అర్థం ఉంది.

సా : కవి కనిపించడేం?

భో : అతను మొత్తం మీద కులాసాగానే కాలక్షేపం చేస్తున్నట్టుంది. చిత్రం ఏమంటే అతనితో అప్సరసలు ఉత్సాహంగా మాట్లాడుతున్నారు. ఇంద్రుడు కూడా అక్కడే ఉన్నాడు. అతను మాత్రం విషాదంగా నవ్వుతాడు.

సా : ఇది చిత్రంగా ఉందే. ఈ వ్యక్తులకు ఉద్రేకాలున్నాయా?

త్యా: కవికి కావలసినవి మాత్రం ఇక్కడ ఉన్నాయి. నిత్య వసంతం, వెన్నెలలాగ ప్రశాంతమయిన వెలుగు, ముదిరిపోని, వాడిపోని ప్రకృతి, యౌవ్వనందాటి పెరగని ప్రాణులు.

క : (హడావిడిగా వస్తూ) మనం జయించాం. మనం జయించాం.

భో : మనమంటే ఎవరు?

క : మానవులం.

సా : అదంత పెద్ద విజయంగా నాకు తోచటంలేదు. మానవుల ఆదర్శం దేవతలవడంకాదు.

క : ఎవరన్నారు అల్లాగ?

త్యా: నీ నిత్యవసంతంలోనించీ, నీ నిత్యయౌవ్వనంలోనించీ నువ్వింకా తేరుకోలేదు. అంచేత నీ కసలు సమస్య బోధపడ్డంలేదు.

క : ఆవిషయం నేను ఈ స్వర్గంలో అడుగుపెట్టిన తక్షణం గ్రహించాను. ఏమిటీ నిత్యవసంతం? ఇదసలు ఎందుకు నాకు? నిత్యమూ మారుతూ ఉండే ప్రకృతి లేకపోతే కవి అసలు ఎల్లా బ్రతుకుతాడు? ఆకులు వాడిపోయి రాలిపోవాలి. మళ్ళీ కొత్త ఆకులు తళ తళ మెరుస్తూ పుట్టుకురావాలి. చీకటి పడాలి. మళ్ళీ ఉదయాన్నే లేత సూర్యుడు ఎర్రగా తూర్పుని ఉదయించాలి. గాడుపు వెయ్యాలి. తరవాత పైరుగాలి తిరగాలి.

సా : అయితే నిత్యయౌవ్వనాన్ని చూశా నువ్వు మురుస్తున్నది?

క : ఈ నిత్యయౌవ్వనానికి వయస్సు కొన్నికోట్ల సంవత్సరాలు. అరవయి యేళ్ళనుదాటి ఒక స్వరూపంలో ఉండకూడదు. యౌవనం 40 సంవత్సరాలతో గడిచిపోవాలి. ముసలితనంలో గడిచిన యౌవ్వనాన్ని గురించి ఆనందంగా తల్చుకోవాలి. అదీ జీవిత చరమలక్ష్యం.

త్యా: అయితే ఇంకేమిటి మనం సాధించిన విజయం?

క : నేను దేవతలను మానవులుగా మారుస్తున్నాను.

భో : నిజంగానే?

సా : ఏంచేశావు?

క : వాళ్ళల్లో అసంతృప్తి రేకెత్తింపజేశాను.

త్యా: ఎల్లాగ?

క : ఈ లోకంలో ఉన్న పెద్ద ఆపత్తు నాకు ఇక్కడ అడుగు పెట్టడంతోటే తెలిసింది. అది సంతృప్తి. ఈ జీవులు మార్పులు ఎరగరు. మామూలుగా మానవులు ఏవి సుఖంగా ఉన్నాయనుకుంటారో, అవన్నీ ఇక్కడ సేకరించి పెట్టుకున్నారు. కాని పాపం వీరికి సుఖం అంటే ఏమిటో తెలియదు. వసంతం, అమృతం, యౌవ్వనం, సౌందర్యం, ఇవన్నీ భూలోకంలో జర, మృత్యువు ఎండ, వాన, వీటిమధ్య ఉన్నప్పుడే వాటి అందం. అవన్నీ వేరుచేసి ఒక స్వర్గాన్ని నిర్మించడం ఆత్మహత్య. స్వర్గవాసులు పాపం అనుభవించలేరు.

సా : ఈ సిద్ధాంతాలన్నీ వాళ్ళకి తెలియవు.

భో : అయితే ఏంచేశావు?

క : రంభను చూసి అన్నాను. నీ ముక్కు ఆ తామర పువ్వు రంగుగా ఉంటే ఎంత బాగుంటును అన్నాను. అయితే ఎల్లా అవుతుంది అని అడిగింది. లేత తామర పువ్వు రంగుపూసి సరస్సులో ప్రతి బింబం చూసుకో మన్నాను. అల్లా చూసుకుంటూ చాలాసేపు కూర్చుంది. మేనక వచ్చి సేసెల్లా ఉంటే బాగుంటానని అడిగింది. అక్కడ ఒక సుందరిని చూపిస్తాను. అల్లా నీ కళ్ళు ఉంటే బాగుంటుంది అన్నాను. ఎల్లాగ అక్కడికి వెళ్ళడం అంది. నీకు గట్టి కోరిక ఉంటే ఇట్టే వెళ్ళ వచ్చును అన్నాను. ఇంకా ఎందరో నాచుట్టూ చేరారు. భూలోకాన్ని గురించి అడగడం ప్రారంభించారు. మన ఋతువులు, రాత్రి, పగలు, ప్రకృతి, జర, మృత్యువు అన్నీ వర్ణించాను. అందరికళ్ళల్లోనూ చటుక్కున ఆవేదన రేకెత్తింది.

భో : అయితే ఇప్పుడేం చేయదల్చుకున్నావు?

క : దేవతలనందరినీ భూలోకంలోకి తీసుకుపోతాను. ఈ అప్సరస స్త్రీలందరూనూ నాకింక మన వెంకమ్మ లోనూ, సుబ్బమ్మలోనూ, పుల్లమ్మలోనూ కనిపిస్తారు. నా భార్యలో మట్టుకు ఊర్వశిని ఆవేశింపచేస్తాను.

తెర.



కుమారి. కె. సి. అన్నపూర్ణ, బి. ఏ. (ఆనర్సు) మద్రాసు.

ఈమె ఆంధ్రమహిళాసభలో యావజ్జీవ సభ్యురాలు. సభలో కమిటీ మెంబర్‌గా కూడా పని చేశారు. చార్లట్స్‌విల్‌లో నున్న వర్జినియా యూనివర్సిటీవారీమెకు 1700 డాలర్ల స్కాలర్షిప్ నిచ్చి, వుడ్రోలవిల్సన్ స్కూల్ ఆఫ్ ఫారిన్ అఫేర్స్‌లో చదవడానికాహ్వానించారు. ఈమె 10-8-53 న మద్రాసు నుండి బొంబాయికి బయలు దేరారు. అక్కడనుండి "జల అజాద్" నావలో లండన్‌కు వెళ్ళి, లండన్‌నుండి విమానంమీద న్యూయార్క్ సెప్టెంబర్ 14న చేరారు. అక్కడనుండి 18 సెప్టెంబర్‌న చార్లట్స్‌విల్ చేరారు. ఈమె ఇప్పుడు ఆ యూనివర్సిటీలో ఇంటర్నేషనల్ ఎకనమిక్స్ (అంతర్జాతీయ ఆర్థిక శాస్త్రము) చదివి డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ డిగ్రీకి కృషి చేయుచున్నారు.

—:o:—

# ఆంధ్ర మహిళాసభ వివిధ శాఖలు

పారిశ్రామిక నూతన భవనములో పనులు ప్రారంభించుటకు ఆహ్వానింపబడిన ఆంధ్రరాష్ట్ర గవర్నరు శ్రీ త్రివేదిగారికి, వారి సతీమణి కుసుమ త్రివేదిగార్కి గౌరవ వందనమీయ సిద్ధముగా నున్న విద్యార్థినీ బృందము.



గౌరవ సభలో ఉపన్యశించుచున్న శ్రీ త్రివేదిగారు.

శ్రీమతి కుసుమత్రివేది, డాక్టరు మంత్రి ఎమ్. వి. కృష్ణారావుగారు, మద్రాసు మంత్రి శ్రీ వెంకటస్వామి నాయుడుగారు వేదికపై ఆశీనులై యున్నారు.

రంగు అద్దకపు తరగతి, ఇక్కడ రంగులు వేయుట, రంగులు తీయుట, పువ్వులు అద్దుట, స్ప్రే, స్క్రీన్ అద్దకములు నేర్పబడును.



ఆంధ్ర మహిళా ప్రెస్ పనివారు.

# ఆంధ్ర మహిళాసభ నర్సింగ్ హోమ్

ది. 17-8-1952 న నర్సింగ్‌హోమ్‌లో పని ప్రారంభించబడ్డది. ఉచితవైద్యశాల ఆనాటి నుండి పనిచేయుచున్నది. రమారమి 10000 రోగులు, స్త్రీలు, పిల్లలు ఇక్కడ వైద్యపరీక్షను, మందును ఇప్పటి వరకూ ఇక్కడ పుచ్చుకొన్నారు.

ది. 1-7-1953 నుండి, ఇక్కడ ఆగ్జలియరీ నర్సులకు తర్ఫీదు జరుగుచున్నది. 12 మంది యిందు శిక్షితులగుచున్నారు. వీరి శిక్షణ రెండు సంవత్సరముల పరిమితిగలది. అఖిలభారత నర్సింగ్ కౌన్సిల్‌వారు తయారుచేసిన విద్యా ప్రణాళిక ఆధారంగా, దేశంలోనున్న నర్సుల కొరతను తీర్చుటకుగాను ఇటువంటి శిక్షణ అవసరమన్న ఆలోచనతో, యీ క్రొత్త విధానం ఇచ్చట ప్రప్రథమంగా ప్రారంభించడమైనది.

ది. 1-8-1953- ఇందు ప్రసూతి వైద్యం కూడా ప్రారంభించినారు. మాసమునకు రూ 50/- లకు తక్కువ ఆదాయంగల యువతులకు ఇక్కడ ఉచితంగానే చికిత్స చేయబడును. చాలామంది బీదయువతులు ఇక్కడ యీ సదుపాయాన్ని ఉపయోగించుకొనుచున్నారు. విద్యార్థినులకు ఒక వసతి గృహము, డాక్టరుకు, నర్సులకు ఆవరణలోనే నివసించడానికి సౌకర్యంగా వసతి స్థలం, ఇంకా ఇలాంటి ఏర్పాట్లు జరుగాలి. జరుపడానికి ప్రయత్నాలు జరుగుచున్నవి.



నర్సింగ్ విద్యార్థినులకు క్లాసులు జరుగుచున్నవి.




ఉదకమండలోని ఆంధ్ర మహిళాసభ నర్సింగ్ హోమ్ భవనములు

# మహిళా సభ
## త్యాగరాయనగర్

ఆర్గనైజర్లు : శ్రీమతి ఎ. లక్షలమ్మ.
,, పి. శకుంతలమ్మ.
,, టి. అహల్య.

ది 2-8-'53 న శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు యీ సభకు ప్రారంభోత్సవమును జరిపిరి.



శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారికి స్వాగతమిచ్చుచున్న దృశ్యము.
శ్రీమతులు లక్షలమ్మగారు, శకుంతలమ్మగారు, స్వర్ణమ్మగారు, స్వాగతమిచ్చుచున్న నిర్వాహక సభ్యురాండ్రు.



ప్రారంభ సభలో అధ్యక్షులు, శ్రీమతి సత్యశ్రీనివాసన్‌గారు.
ఉపన్యాసకులు
శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు,
శ్రీమతి లక్షలమ్మగారు.

# మహిళా సభ

త్యాగరాయనగర్ మహిళా సభలో ది 2–10–1953, గాంధీ జయంతినాడు శ్రీమతి బి. డి. వి. రామస్వామి నాయుడు, పతాకావిష్కరణ జేసినారు, శ్రీమతి బెన్నూరి కృష్ణవేణమ్మగారు (ఆంధ్ర మహిళా సభ అమ్మమ్మగారు) అధ్యక్షత వహించినారు.



పతాకావిష్కరణ దృశ్యం.



అమ్మమ్మగారు ఉపన్యసిస్తున్నారు.
శ్రీమతి బి. డి. వి. రామస్వామి నాయుడు
ప్రక్కన కూర్చుని ఉన్నారు.

ఈ మహిళా సభలో, పిల్లలు, పెద్దలు, ఆంధ్రులు, తమిళులు అందఱూ సభ్యురాండ్రుకావచ్చు. (స్త్రీలు, బాలికలు). ఇక్కడ, ఆంధ్ర మెట్రిక్, ఇ.ఎస్.ఎల్.సి., హిందీ, కర్ణాటిక్ సంగీతం (వీణ, గాత్రం)లలో శిక్షణ యీయబడును. వివరములకు,

ఎ. లక్షలమ్మ,
5, తణికాచలం చెట్టి వీధి,
మద్రాసు 17.

# కుజుడు

రచన:

శ్రీ వసంతరావు వేంకట్రావు

ఈ రచనకు ముఖ్యాధారం 'గెరార్డ్ డి వాకూవేర్స్' వ్రాసిన 'మార్స్' అను వ్యాసం. అది 1953 మే "సయింటిఫిక్"లో ప్రచురింప బడింది. చంద్రునిలోకి, కుజునిలోకి మానవుడు ప్రయాణమౌతున్నాడు. రాకెట్లలో అంతర్గ్రహయానం చేయడానికి విశేషంగా శ్రమిస్తున్నాడు. చంద్ర కుజలోకాలను, ఒకవేళ చేరుకో గలిగినప్పటికి అచ్చట జీవించగలడా అన్నదే పెద్ద ప్రశ్న. భూవాతావరణ పరిస్థితులు చాలా ప్రత్యేకమైనవి. చంద్రునిలో వాతావరణమే లేదు. కుజునిలో స్వల్పంగా నుంది. అచ్చటి తాపక్రమాలలో మార్పు విపరీతంగా జరుగుతూంది. అంతర్గ్రహయానం విజయవంతంగా సాధించినప్పటికి పరలోక వాసంలోగల కష్టాలను ముందుగా తెలిసికొంటే వాటిని ప్రతి ఘటించడానికిని తయారు కావచ్చు.

—:o:—

సౌరకుటుంబ మందున్న నవగ్రహాలలోను కుజగ్రహం మొదటినుండి ప్రత్యేక పరిశీలనకు గురి అయింది. దానికి కారణం లేకపోలేదు. మనభూమిపై నున్న జీవం వంటి జీవం ఇతర గ్రహాలలో ఇంత వరకు కనిపించలేదని గ్రహాల పరిశీలనవలన తెలియవచ్చింది. జీవోద్భవానికి జీవాభ్యుదయానికీ అనుకూల శీతోష్ణ పరిస్థితులు అవసరమేమో అనిపిస్తూంది. సూర్యునికి దూరంగా పోతూన్నకొద్దీ సూర్యరశ్మి తీవ్రత తగ్గుతుంది. అందుచేత, సూర్యునికి దగ్గరగా నున్న గ్రహాలకంటె దూరంగానున్న గ్రహాలకు లభ్యమయే వేడి, వెలుగు కూడా తక్కువగా నుంటాయి. జీవవికాసానికి అనుకూలమైన సమ శీతోష్ణ మండలంలో భూమి చరిస్తుందనుకొంటే, భూమికిరువైపుల నున్న శుక్ర కుజ గ్రహాలలోనే, ఎప్పుడైనా, జీవం మనగల అవకాశముంది. భూమికంటె శుక్రగ్రహం సూర్యునికి దగ్గరగానుంది; అందుచేత, భూమికంటె శుక్రునికే ఎక్కువ తేజోష్ణాలు లభిస్తాయి. భూమికంటె సూర్యునికి దూరంగానున్న కుజగ్రహంపై పడు ఎండవేడిమి తక్కువగా నుంటుంది. గ్రహాలన్నీ ఒకేసారి పుట్టి, పుట్టినప్పుడు మండుతున్న గోళాలుగా నుండి క్రమేణ చల్లారేయనుకొంటే, భూమి కంటె కుజుడు వేగంగా చల్లారడంచేత, ఇప్పుడు భూమిలోనున్న శీతోష్ణస్థితి పూర్వ మొకప్పుడు కుజునిలో నుండేదనడానికి సందేహంలేదు. ఆకాలంలో కుజగ్రహం జీవాస్పదమై యుండవచ్చును, కాని, కాలగమనంతో కుజుడు చల్లారుతుండగా శీతోష్ణస్థితి మారిపోయి, జీవానుకూల పరిస్థితులు సన్నగిల్లడం సహజం. జీవనస్పర్థ (Struggle for existence) సహజలక్షణంగా గలజీవం శీతోష్ణ విపర్యయాలను ప్రతిఘటిస్తూ వర్ధిల్లడానికే ప్రయత్నిస్తుంది. అందుచేత పూర్వమెప్పుడైనా కుజునిలో జీవోద్భవమైయుంటే, ఆజీవం ఆత్మరక్షణకై నేటి వరకు ప్రయత్నిస్తునే ఉంటుంది.

మనకంటె సూర్యునికి దగ్గరగానున్న శుక్రునిలో ప్రస్తుతం జీవంలేక పోయినప్పటికి మునుముందు జనించే అవకాశముంది. ఏమంటే, భూమికంటె సూర్యునికి దగ్గరగా నున్నశుక్రుడు, పరిమాణంలోకూడా, రమారమి. భూమిని పోలిఉంద. సూర్యసామీప్యంచేత శుక్రునిలో తాపక్రమం భూమిలోకంటె ఎక్కువగా నుండాలి. అందుచేత, భూమిలో మనమెరిగిన జీవంవంటి జీవం ఒక్క కుజునిలోతప్ప మరేగ్రహంలోను మనగల అవకాశమేలేదు. అదే కుజుని ప్రత్యేకత; విజ్ఞానులు తీవ్రంగా కుజుని పరిశీలించడానికి కూడా అదే కారణం.

ఆకాశంలో మనకతిదగ్గరగానున్న మూర్తి చంద్రుడు. చంద్రుని తరువాత, అధమం 15 సంవత్సరాల కొకసారైనా మన కతిదగ్గరగా వచ్చే గ్రహం కుజుడు. మన కత్యంత సమీపంగా నున్నప్పుడు కుజునిదూరం 3½ కోట్లమైళ్లు. కుజగోళవ్యాసం 4200 మైళ్ళు; భూగోళపు నిడివిలో సుమారు సగం. కుజుని బరువు భూభారంలో పదియవవంతు. దానిదినం —అంటే ఆత్మప్రదక్షిణానికి పట్టేకాలం 24½గంటలు; అనగా, సుమారు మనదినంతో సమానం. సూర్యుని చుట్టు ఒకప్రదక్షిణం చేయడానికి పట్టేకాలం 687 రోజులు; అదే కుజలోకంలో సంవత్సర ప్రమాణం. కుజలోకంలో ఋతువులున్నాయి. ధ్రువాలవద్ద తెల్లటిటోపీలు ఏర్పడుతూం




[చిత్ర వివరణ: 1956లో భూమికి సమీపతమంగా 3½ కోట్ల మైళ్ల దూరంలోనుండు కుజునిస్థానం]

అయితే, ఈ ధ్రువాల వద్దనున్న పదార్థమేమి టో తెలిసికోడానికి తీవ్ర మైన పరిశోధనలు చేసిన వారిలో చికాగో విశ్వ విద్యాలయ భూగోళ శాస్త్ర జ్ఞుడైన గెరార్డ్. పి. కుయిపర్ ఒకరు. కుజుని యొక్క పరకోణ(Infra-red) వర్ణపటాన్ని తీసి దానిని పరిశీలించి, ధ్రువాల వద్దనున్న పదార్థం నీరు గడ్డ కట్టగా ఏర్పడిన మంచుకంటె వేరొండు కాజాలదని, అతను నిర్ణయించేడు. కాని, అవి పెద్దమంచు కొండలను కొనడాని కవకాశంలేదు. శీతకాలంలో పొగమంచు వలె వ్యాపించి, వేసవి ప్రవేశింపగానే సూర్యుని వేడిమికిఅవివిడిపోతాయి.

డడం, మాయమౌతూండడం కనిపిస్తుంది. శీతాకాలాంతంలో ఈ టోపీలు సుమారు 40 లక్షల చదరపుమైళ్ళ ప్రదేశాన్ని ఆక్రమిస్తాయి. తరువాత క్రమంగా అది బ్రద్దలై మాయంకా ప్రారంభిస్తుంది. కాని వేసవిలోనైతం పూర్తిగా మాయంకాక, దేదీప్యమానంగా ధ్రువంవద్ద తెల్లటి మచ్చ కనిపిస్తునే ఉంటుంది.

వేసవి సమాప్తంకాగానే విరళ మేఘాలు గోచరిస్తాయి. అవి ధ్రువప్రాంతాలనే కాక, క్రింది భాగాలను సైతం కొంతవరకాక్రమిస్తాయి. ఆమేఘాలక్రింద టోపీఏర్పడుతునే ఉంటుంది. క్రమంగా మేఘాలు విచ్ఛిన్నమై టోపీ ఉజ్జ్వలంగా కనిపిస్తుంది.

ఈ చక్రీయక్రమంలో మార్పులు ఏడాదివెంబడి ఏడాదిని జరుగుతునే ఉంటాయి. కాని, వాటి వైశాల్యం నియతంగా నుండదు. అది ఏటేటా మారుతుంది. సూర్యుని మచ్చల 11 సంవత్సరాల చక్రాన్ని ఈ మార్పులు అనుగమిస్తాయని కొందరి మతం.

మన భూమిలో మూడు వంతులు నీరు ఒకవంతు మాత్రమే నేల ఉంటే, కుజునిలో మూడువంతులు నేల ఉన్నట్లు విజ్ఞానులు నిర్ణయించ కలిగేరు. ఆభాగమంతా ఎర్రఎర్రగాను, పసుపుపచ్చగాను కనిపిస్తుంది. పెద్ద ఎడారులు కుజతలాన్ని వ్యాపించియున్నాయని ఆంగ్ల భూగోళజ్ఞుడైన సర్ జాన్ హెర్షెల్ మొదట ప్రతిపాదించాడు. తరువాతి పరిశోధనా ఫలితాలు ఆ భావాన్ని బలపరిచేయి. ధూళి తుపానులు మన ఎడారులలో చెలరేగినప్పుడు పైకెగసిన ధూళిమేఘమట్లు క్రమ్మిన విధంగానే కుజలోకంలో సైతం రంగురంగుల ధూళిమేఘాలు అప్పుడప్పుడు కనిపించి మాయ మౌతుంటాయి. వివిధ పరిశోధనల మూలంగా లెమొనైట్, ఫెల్‌సైట్ మొదలైన ఖనిజాలు, ఇసుక కుజతలం పైనున్నట్లు రుజువయింది. అందుచేత కుజునిలో అధికభాగం ఎడారులని నిర్వివాదంగా చెప్పవచ్చును.

భూమి కున్నట్లే కుజునికి వాతావరణముంది. కుజ వాతావరణంలో ఉదజని, హీలియం వాయువులుండ డానికి అవకాశంలేదు. ఏమంటే, కుజుని భారం భూభారం కంటె

తక్కువకావడంచేత, తేలికైన ఈ రెండు వాయువులను పట్టి ఉంచగల బలం కుజునికి లేదు; ఆ వాయువులలోని అణువులు సహజమైన నిరంతర సంక్షోభంలో చాలకాలం పూర్వమే, కుజునినుండి పలాయన మొంది ఉండాలి. ఆమ్లజనిని కనుగొనడానికై మౌంటువిల్సన్ అబ్జర్వేట రీలో చేసిన పరిశోధనలన్నీ, ఇంతవరకు, నిష్ఫలమ య్యేయి. రవ్వంత ఆమ్లజనైనా — అంటే మన వాతావర ణంలో నున్నదానిలో సహస్రాంశమైనా — కుజవాతావర ణంలో కనిపించలేదు. ఇక, ఓజోన్ వంటి వాయువులు స్వేచ్ఛగా ఉండే అవకాశంలేదని రసాయనికంగా నిర్ణ యించవచ్చును. నిష్కర్షగా కుజునిలో నున్నదని చెప్ప గల వాయువు కార్బన్ డై ఆక్సైడ్ (బొగ్గుపులుసువాయువు) భూమిలోనున్న కార్బన్‌డై ఆక్సైడ్‌కి రెండింతలైనా కుజ వాతావరణంలో నున్నట్లు వర్ణపటమాన పద్ధతులపై కుయిపర్ విజ్ఞాని నిర్ణయించేడు.

నీటి ఆవిరిని గురించి ఇదమిద్ధమని చెప్పలేమంటారు విజ్ఞానులు. కాని, కుజవాతావరణంలో నీటి ఆవిరి ఎక్కువ గానే ఉన్నదని వర్ణపటమాపనం వల్ల 1908 లో విజ్ఞాని స్లిఫర్ నిర్ణయించేడు. 1937 వ సంవత్సరంనుండి మౌంట్‌విల్సన్ విజ్ఞానులు కుజుని సూక్ష్మంగా పరిశీలిస్తు న్నారు. మన వాతవరణంలో నున్న నీటి ఆవిరిలో నూరవ భాగంకంటె కుజునిలో పొడగట్టలేదని వారి నిర్ణయం. అదే సమంజసమేమో! భూమిలో కంటె కుజునిలో నేలభాగం ఎక్కువకావడం చేత కుజ వాతావరణంలో సాపేక్షంగా నీటి ఆవిరి స్వల్పమంటే ఆశ్చర్యానికేమీలేదు. ఏమైనప్ప టికి, కుజునిలో చాలాభాగం నీరులేక బీడువారిందనీ, కుజ గ్రహం శుష్కావస్థలో నుందనీ విజ్ఞానులలో చాలామంది అభిప్రాయ పడుతున్నారు.

అయితే, కుజవాతావరణంలో ప్రధానంగా నున్న వాయువు వేమిటి? ఎక్కువ బరువు కలిగి జగత్తులో అద నంగా వ్యాపించి, రసాయనికంగా జడమైనదై, వర్ణపట మాపకాలకు దొరకని లక్షణాలు గల వాయువై యుండాలి. అట్టి వాయువులలో ముఖ్యమైనది నత్రజని. మన వాతా వరణంలోనే ఐదింట నాలుగుపాళ్ళు నత్రజని ఉంది. అదే కుజ వాతావరణంలో సైతం ఎక్కువగా వ్యాపించి ఉండాలి. దానితో పాటు కార్బన్‌డై ఆక్సైడు, పొటేసియం యొక్క రేడియోధార్మిక ఐసొటోపు విచ్ఛిన్న మైనపుడు జనించు ఆరాను కొద్దిగా కలిసి ఉండవచ్చు.

కుజ వాతావరణ భౌతిక నిర్మాణాన్ని తెలిసికోడానికై రంగురంగుల ఫిల్టరులతో కుజుని ఛాయాచిత్రాలు తీసేరు. వాటివల్ల తెలియవచ్చిన విషయాలలో ఒకటేమనగా. కుజ వాతావరణం హ్రస్వతరంగ దైర్ఘ్యంగల నీలం, నీలలోహితం, అతినీలలోహితం మొదలైన కిరణాలకు పారదర్శకం కాదని. కాని, అప్పుడప్పుడు మాత్రం నీల కాంతిలో కుజతలం స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది. ఆ వాతావరణంలో సూక్ష్మకణరూపంలో ద్రవ్యం తేలుతూ ఉండవచ్చు. అది సాధారణంగా నీలకాంతిని హరిస్తుంది. అప్పుడప్పుడాకణ సమూహం చెదరిపోవచ్చు; అప్పుడు నీలకాంతి కుజునినుండి వెలువడుతుంది. అయితే. ఆకణా లెట్టివో నిర్దిష్టంగా చెప్పలేము. అవి కార్బన్‌డైఆక్సైడ్ యొక్క సూక్ష్మ స్ఫటికాలు కావచ్చు; లేదా, మన మేఘాలలో తేలియాడు మంచు స్ఫటికాల వంటివైనా కావచ్చు.

కుజునిలో ప్రధానంగా మూడురకాల మేఘాలున్నాయి: నీల మేఘాలు, పసుపు పచ్చటి మేఘాలు, తెల్లటి మేఘాలు. నీల మేఘాల సంగతి స్పష్టంగా తెలియదు. పసుపు ఎరుపు కాంతులలో మాత్రమే పసుపు పచ్చటి మేఘాలు కని పిస్తాయి. ఎడారులలో దుమారం రేగినప్పుడేర్పడు ధూళి మేఘాలు కావచ్చునది. సూక్ష్మమైన మంచు స్ఫటికాలతో ఏర్పడినవి తెల్లమేఘాలు కావచ్చు. ఈ భావానికి బల మిచ్చే సందర్భమొకటి లేకపోలేదు. సూర్యునికి కుజుడు మిక్కిలి దూరంగా నున్నప్పుడే తెల్లమేఘాలు ఎక్కువగా ఏర్పడుతాయని స్పష్టమైంది. అట్టి సమయంలో సూర్యరశ్మి ప్రభావం తగ్గి, నీటిఆవిరి మంచుస్ఫటికాలుగా ఘనీభవించ డానికి అనుకూల పరిస్థితు లేర్పడతాయి. ఈ మేఘాలు సుమారు 20 మైళ్ళ ఎత్తువరకు పైకెగయగలవు.

మన వాతావరణ ప్రేషాన్ని సామాన్యంగా, 76 సెంటి మీటర్లులేక 30 అంగుళాల పాదరసపుటెత్తు నిరూపిస్తుంది. దానిమూలంగా ప్రతి చదరపుటంగుళం సుమారు 5 వీశల బరువును మోస్తుంది. కుజ వాతావరణ ప్రేషం 6 సెంటి మీటర్లు లేక సుమారు 2½ అంగుళాల పాదరసపు టెత్తు ఉండవచ్చునని 1907 వ సంవత్సరంలో విజ్ఞాని లొవెల్ ఊహించేడు. అంటే, కుజతలంలో ప్రతి చదరపు టంగు ళాన్ని అరవీశ కంటె తక్కువ బలంతోనే అచ్చటి వాతా వరణం నొక్కుతూంది. ఈ విషయ సత్యాన్ని కుజపరిశీల కులలో చాలామంది స్థిర పరుస్తున్నారు.

కుజవాతావరణ తాపక్రమాన్ని తెలుసుకొనే అవకాశం చాలాకాలం వరకు కలిగింది కాదు. కాని 25, 30 ఏండ్ల క్రిందట సున్నితమైన తాపక్రమాపకాల నుపయోగించి కుజ తాపక్రమాన్ని కొందరు విజ్ఞానులు కనుగొన్నారు. మన భూమియొక్క సగటు తాపక్రమం రమారమి 60డి. ఫారన్ హైట్; కుజ వాతావరణపు సగటు తాపక్రమం 0డి. కంటె సుమారు 40డి. ఫారన్ హీట్ తక్కువ. ఆ తాపక్రమం వద్ద పాదరసం గడ్డకట్టి ఘనీభవిస్తుంది. వేసవికాలంలో సూర్యునికి కుజుడతి సమీపంగా నున్నప్పుడు మధ్యాహ్న తాపక్రమం 70డి. ఫా॥ వరకుంటుంది. నల్లటి ప్రదేశాలలో అది 80డి. ఫా॥ వరకు వెళ్ళవచ్చును. సూర్యుని కతి దూరంగా నున్న సమయంలో మధ్యాహ్న తాపక్రమం నీరు ఘనీభవించు తాపక్రమం అంటే 32డి ఫా॥- కంటె ఎక్కువుండదు. రాత్రివేళలందు వాతావరణం బాగా చల్లారి తాపక్రమం 70డి. ఫా॥ వరకు తగ్గవచ్చును. దైనందిన తాపక్రమంలో ఇంతవ్యత్యాసముండడానికి కుజునిలో వాతావరణ అల్పత్వం ముఖ్యకారణం. పగటిపూట సంపాదించిన సౌరవేడిమిని భద్రపరచగల సామర్ధ్యం కుజవాతావరణానికిలేదు. అందుచేత, దీర్ఘరాత్రులందు ధ్రువాల వద్ద తాపక్రమం 0డి. ఫా॥ కి 150డి. తక్కువగా కృశిస్తుంది. అంటే, గరిష్ఠ కనిష్ఠ తాపక్రమాల వ్యత్యాసం కుజ, లోకంలో 250డి. ఫా॥ వరకుంటుంది.

కుజలోకంలో ధ్రువాలవద్దనున్న టోపీలు,ఎడారులుకలిసి ఐదింట నాలుగు భాగాలు కుజ తలాన్ని ఆక్రమిస్తాయి. మిగిలిన ఐదవవంతు భాగంలో నల్లటి ప్రదేశాలు, వివిధ ఆకారాలలో నున్నాయి. అవి నిత్యం అదే విధంగా నుంటూన్నప్పటికి, కొన్నిటి ఆకారాలు మాత్రం అప్పుడప్పుడు మారుతుంటాయి. నల్లటి ప్రదేశాన్ని ఆనుకొనియున్న తెల్ల కుజభాగం ఒకప్పుడు నల్లవారి, అదేవిధంగా కొన్నినెలలు, ఏండ్లు కూడ ఉంటుంది. దానికి కారణం తెలియదు. కాని, ఒక ఊహఏమిటంటే, వృక్షవికాశానికనుకూలమైనప్పుడు, ఏదోవిధమైన మొక్కలు ఆ తెల్లని ప్రదేశాలలో పెరుగుతాయని, అది పెరుగుతూన్నంత వరకాభాగం నల్లగా కనిపిస్తుందని, అవి నశించగానే నలుపు కూడ పోతుందని కొందరు విజ్ఞానుల ఉద్దేశం.

ఈ నల్లటి ప్రదేశాలలో కాలాను సారంగా మార్పులు వాటిల్లు తున్నాయా? విజ్ఞానులు కనిపెట్టి నప్పటినుండి, కుజలోకంలో వృక్షసంతతి వర్ధిల్లుతున్నదన్న భావం బలంకాజొచ్చింది. నల్లభాగాలు కేవలం నల్లగానుండక, వేర్వేరు కాలాలలో వేర్వేరుఛాయలను ప్రదర్శిస్తాయి; ఒకప్పుడు నీలంగాను, ఒకప్పుడు ఆకుపచ్చగాను మరొకప్పుడు ధూళి వర్ణంగాను ఉంటాయి. అంతేకాక, ఈ మార్పులకు ధ్రువాలవద్ద టోపీలు వైశాల్యంలో వాటిల్లు మార్పులకు సంబంధ మున్నట్లుంది. ఐనప్పటికి కుజునిలో నున్న స్వల్ప వాతావరణ ప్రేషంచేతను, అత్యల్ప నీటి పరిమాణం చేతను ఈ మార్పులకు కారణం వ్యవసాయం అనడానికి అంతగా అవకాశంలేదు.

ఇట్టి నల్లటి మచ్చలేమైయుండవచ్చునో ముందుగా నిర్ణయించాలి. అవి సముద్రాలుకాని సరస్సులుకాని కావు. జలాశయాలైతే ఒకప్పుడైనా అవి సూర్యరశ్మిని ప్రతిబింబించి ఉజ్వలంగా కనిపించాలి. అవి వృక్షసమూహాలతో నిండిన అడవుల వంటివనుకొందామంటే పరశోణ కాంతిని అవి పరావర్తించవు; మనవృక్ష సంతతి పరశోణ కాంతిని మిక్కుటంగా పరావర్తిస్తుంది. అంతేకాక వృక్షానికి జీవమైన క్లోరొఫిల్ అను పదార్థం వాటిలో నున్నట్లు కనిపించదు. కాబట్టి, పెద్దవృక్షాలకు కుజునిలో తావులేదు. కాని, చిన్న మొక్కలు, ఎట్టి వాతావరణ వ్యత్యాసాలనైనా భరించగల మొండి జాతికి చెందినవి, కుజునిలో పెరుగుతూండ వచ్చును. అట్టిమొక్కలు కాల క్రమంగా జనించి, పెరిగి నశిస్తూండ వచ్చును.

అన్నిటి కంటె ముఖ్యమైనవి కుజునిలో "కాలువలు." 1877 వ సంవత్సరంలో కుజుని శ్రద్ధగా పరిశీలించిన విజ్ఞాని షియాపరెల్లి, కుజతలంపై సన్నటిగీతను చూచి కుజలోక జీవులచే నిర్మింపబడిన కాల్వలు కావచ్చు నని అభిప్రాయపడ్డాడు. అప్పుడు విజ్ఞానలోకంలో కలవరం బయలుదేరింది. ముందొకసారి సూచించినట్లు, అనుకూల భౌతికావస్థలచేతనే గ్రహాలలో జీవం పుట్టకలిగితే, అట్టి అవస్థలు పూర్వమెప్పుడో కుజునిలో ఉండాలనీ, ఆ సమయంలో జీవం పుట్టియున్నట్లయితే, అది, ఏదోవిధంగా వర్ధిల్లడానికే ప్రయత్నిస్తూ ఉంటుందని భావిస్తూన్న విజ్ఞానులు, ఈ కాలువలను జీవుల నిర్మాణ శక్తికి తార్కాణంగా గ్రహించేరు. భౌతిక విపర్యయాలను ప్రతిఘటిస్తూన్న మేధావులైన జీవుల, వాతావరణ తాపక్రమం తగ్గుతూంటే నేలలో బొరియలుచేసికొని, కుజతలం క్రింద నివాసమేర్పచుకొన్నారనీ, వ్యవసాయానుకూల కాలంలో పైకి వచ్చి గింజలు పండించు కొన్నారనీ ఒకవాదముంది.

అందుచేత షియాపరెల్లి ప్రకటించిన విషయాన్ని మహానందంగా ఆమోదించేరు.

కాని, ఆ భావం అట్టేకాలం మనలేదు. ఏండ్లతరబడి శ్రద్ధగా సూక్ష్మంగా కుజుని పరిశోధించిన విజ్ఞానులు 'కాలువలు' కనబడలేదని నిష్కర్షగా చెప్పేరు. పరిశోధనా సామర్థ్యాన్ని ఎక్కువ చేసినకొద్దీ ఋజురేఖలుగా నను కొన్నవి చిందరవందరగా నున్నట్లు స్పష్ట మైయింది. దీని విషయమై ఒక ప్రయోగం కూడ చేసేరు. వంకర గీతలతో తయారుచేసిన ఒక పటాన్ని చాలదూరంగా నుంచి దాని ప్రతికృతిని వ్రాయమనగా. అందరూ సరళ రేఖలతో చిత్రాలను నిర్మించేరు. అదే విధంగా షియాపరెల్లి చూచిన 'కాలువలు' ఊహా జనితమని కొందరి అభిప్రాయం. లొవెన్ అబ్జర్వేటరీ డైరక్టరైన ఇ. సి. స్లిఫర్ వంటి ఖగోళజ్ఞులు కుజునిలో నున్నవి కాలువలే అను భావాన్ని విశ్వసించు వారును ఉన్నారు.

ఇంత వరకు నిజం తేలలేదు. కాని 1956 వ సంవత్సరంలో భూమికి రాగలిగినంత దగ్గరగా కుజగోళం వస్తుంది. అప్పుడు మౌంట్ విల్సన్ అబ్జర్వేటరీలోని 100 అంగుళాల దూరదర్శినితో కుజుని నిర్విరామంగా పరీక్షించడానికేర్పాట్లు జరుగు తున్నాయి. ఆ కాలంలో వాతావరణం కూడా అనుకూలించి కుజుని స్పష్టంగా చూపెట్టిన పక్షమందు కుజునిలో కాలువలున్నాయో లేవో నిర్ణయించడానికి అవకాశం కలుగుతుంది.

కుజులోకంలో జీవముందా లేదా అను ప్రశ్నకు సరియైన సమాధాన మింతవరకు రాలేదు. ఎట్టి దూరదర్శినితో పరిశీలించి నప్పటికి జీవులు గోచరింపరు. కాని, జీవులచే నిర్మింపబడి విస్తార వ్యాప్తిచెందిన పెద్ద నిర్మాణాల ఉనికిని కనిపెట్ట కలిగితే జీవ వికాసానికి వాటిని తార్కాణాలుగా భావించడానికి అభ్యంతరముండదు. అందుచేతనే 1956 వ సంవత్సరానికై విజ్ఞానులు నిరీక్షిస్తున్నారు.






# ఊహలు

శ్రీ ఎల్. ఎం. బాబు

అమ్మా! అమ్మా ! నే
ఆడే బొమ్మా మీద
అక్కా చెల్లీ నీవూ
అన్నా పాపా బేబీ
అంతా కలిసి ఆనందంగా
ఆకాశానికి ఎగిరి వెళ్ళితే—

ఎలాగుంటుందంటావమ్మా ?
నీవెలాగుంటుందంటావమ్మా ?

రాజూ, రమా, రెక్కల చివర
రాధా, రమణా రెక్కల మధ్య
లక్ష్మి లలితా రెక్కల మొదట
విమలా కమలా రెక్కల ముందు
బాలా అందరి మధ్యలో నీవు
బాతూ పైని కూర్చొని ఉండగ
ఆకాశానికి ఎగిరి వెళ్ళితే —

ఎలాగుంటుందంటావమ్మా ?
నీవెలాగుంటుందంటావమ్మా ?

తోటలు బాటలు ఎన్నో చూస్తూ
పేటలు కోటలు అన్నీ చూస్తూ
నదులూ సంద్రము వరుసగ దాటి
అడవులు కొండలు అన్నీదాటి
అకస వీధిని ఆనందంగా
చంద్రుని యింటికి ఎగిరి వెళ్ళితే -

ఎలాగుంటుందంటావమ్మా ?
నీ వెలాగుంటుందంటావమ్మా ?

ఎండా వేడికి తాళాలేక
ఎదురూ గాలికి వేగాలేక
బాలలమంతా భయపడుతుంటే
బుజ్జగించి పైటా చెంగును
మాపై కప్పి ఆకాశానికి
తీసుకు వెడితే —

ఎలాగుంటుందంటావమ్మా ?
నీ వెలాగుంటుందంటావమ్మా?

ఏడూరంగుల బాటా మీదుగ
పాడూ కొంటు ఆడూ కొంటు
మేఘూ బాలల బొమ్మా కొలువులు
ఆనందంగా చూచుట కొరకు
ఆకాశానికి ఎగిరి వెళ్ళితే —

ఎలాగుంటుందంటావమ్మా ?
నీ వెలాగుంటుందంటావమ్మా ?

తళతళ లాడే తారా బాలలు
కళకళ లాడే నవ్వుల బాలలు
మిలమిల మెరిసే మెరపూ బాలలు
వెన్నెల వీధిలో ఎదురూ వచ్చి

విందుకు రండని ఆహ్వానించి
పాటలు పాడి నాట్యంచేస్తే —

ఎలాగుంటుందంటావమ్మా ?
నీ వెలాగుంటుందంటావమ్మా ?

మేఘాలను వరుసగ పేర్చీ
మేడలవలె గోడలు పెట్టీ
బొమ్మారిల్లను చక్కగ కట్టీ

బొమ్మా లన్నియు అందులో ఉంచి
సన్నని కుంచెతో రంగులు వేసీ
చక్కని చుక్కల జతగా జేరి
పాటలు పాడి ఆటలు ఆడితే —

ఎలాగుంటుందంటావమ్మా ?
నీ వెలాగుంటుందంటావమ్మా



# మంచి అమ్మ — మామిడమ్మ

శ్రీ. బి. వి. నరసింహారావు.

అమ్మలాగఅగుపిస్తుం
దామామిడి చెట్టు నాకు,
కొమ్మ కొమ్మ నందముగా
కోటిచిన్న బిడ్డలతో॥

అటుకదలదు, ఇటుకదలదు
ఆయాసం బసలెరుగదు,
ప్రక్కల కెంతో దూరము
పరచుక నిలుచుండి, ఎపుడు ॥అ॥

కన్నబిడ్డ లందరినీ
కడు గారా బమునబెంచి
జగతి జనుల పాలజేసి
వగవక తానొకపైనిలు॥చ॥

ఎండబడిన వారందరి
నెంతొప్రేమ చేరబిలిచి
నీడనొసగి, సేదదేర్చి
నిర్మలమతి నిలిచి యుండు॥అ॥

కన్నబిడ్డ లందరెదిగి
మిన్నునంటు వృక్షములుగ
తరతరాల నిలిచి, సేవ
తప్పక చేయాలనుకొని॥అ॥

కనికరమెరుగని లోకము
కట్టెలకై, బొగ్గులకై
పట్టితనను బాధిస్తే
పాపం, ఏమనుకోదూ॥అ॥

బ్రతుకంతయు సేవకొరకె
బాగుగ నర్పించు తల్లి
మృతినందియు సేవకొరకె
మేనొసగెడు కల్పవల్లి ॥అ॥

త్యాగము, ఓరిమి, ప్రేమయు
బాగుగ నెరిగిన తల్లీ.
అంచితముగ పేరుగన్న
మంచిఅమ్మ — మామిడమ్మ. ॥అ॥



# ఎండుమెరపకాయలు —
# పచ్చిమెరపకాయలు

వు. రామమోహన్.

కారం— కారం— కారం.

"వచ్చా(న్రోయ్ మళ్ళీ. నన్నువద్దన్నా నేను వస్తూనే వుంటా. నాతో మీకనవసరపు పనులున్నా, నన్ను మాత్రం మీరు ఉపయోగించకుండా మాత్రం ఉండలేరు. నాచరిత్ర హిందూదేశ చరిత్రలోనేగాక, ప్రతిఉష్ణమండల ప్రదేశపు చరిత్రలన్నిటిలోను మొదటిరకంగా మెరుపు కలిగిస్తూ ఉంటా........ నేను ఎఱ్ఱగా, తలబిరుసుతో ఉంటా. అందుకే నేను క్రిందభాగం సన్నగా వున్నా తొడిమ దగ్గర లావుగా ఉంటా. నేను టోపీదానునని అంటారు. నాకునేనే 'తొడిమ' అనే టోపీను పెట్టుకున్నా గానీ మీకందరకు మాత్రం టోపీవేయను. ఏమంటే నేను 'Danger' దానినని ఎరుపురంగు కలిగియుండి చెపుతూంటా. నా సవితి పచ్చిమెరపకాయ మాత్రం నిజంగా టోపీదానే. ఈ విషయం మీకు కనబడుతూనే వుందిగా ........ మళ్ళీవున్న మాట అంటే వుడుకెక్కువ. నా వుపయోగం మీకందరికి తెలిసియున్నప్పటికి, వంశమర్యాదని బట్టి పరిచయం చేసుకుంటున్నాను. అంతేకాని 'స్వంతడబ్బా' వాయించుకొనేందుకు మటుకుకాదు. నాజాతి పచ్చిమెరపకాయ అల్లా కాదు. యేమీ యెరుగని దానివలె బెల్లంకొట్టిన రాయిలాగ కదలకకూర్చుండి తడి గుడ్డలతో గొంతుకలు కోస్తుంది. అటువంటి దాన్ని నమ్మొద్దని మీకు వేరే చెప్పనక్కరలేదు.

"నాపైన చేయివేస్తేచాలు. గలగలమంటూ 'లోకోపకారం' కోసం కారంగా తయారవుతాను. మీ కంత కష్టం లేకుండానే ఒక్కదెబ్బకే కారముగా తయారవుతాను. నేనూ పచ్చిమెరప కాయతోపాటు మొదట స్నేహం చేస్తూ వచ్చాను. పుట్టుకనుంచి అన్యోన్యంగా వుండి పెరిగాము. కాని ఏంలాభం? దానిపద్ధతి నాకుబాగుండక, దాని పాపం పండిన తరువాత నేను తయారయ్యాను దాన్ని రూపు మాపడానికి. ఈ విషయంలో భగవంతుణ్ణే నే నన విషయం మీకు స్ఫురించక మానదంటాను. ఏమంటే 'పాపం' పండితేనేగాని భగవంతుడు పుట్టడు కాబట్టి. మామిడి కాయతో బాటు నన్ను జతపరచి ప్రతి సంవత్సరము మహాశ్రద్ధగా నాసేవ చేస్తూ వుంటారు.

"'దిక్కు లేనివారికి దేవుడే దిక్కని' నన్ను ఏ 'ఆధరవు' ఆధారంగా లేకపోతే నన్నుపయోగిస్తూ వుంటారు. కాబట్టి నేను భగవద్వంశ కలిగినదాన్నే. నన్ను మరిగిన నాభక్తులను నేనెన్నివిధాలుగానో రక్షిస్తూవుంటా. 'చద్ది - అన్నం - ఆవకాయ' అని నాకు పెట్టిందీ పేరు పూర్వాచారంలోకూడా. పాశ్చాత్యులను మన దేశంలోనికి రానీయకుండా చేయగలను. బ్రిటిషు వారిని ఓడెక్కించి పంపాలంటే మీరంత శ్రమపడ్డారు గాని, నన్ను జతపరచి వారికి విందులు ఏర్పాటుచేసినట్లైయితే యెక్కడుండేవారో తెలిసేది. నాకు సవితిగా 'తీపి' వచ్చి పాడుచేసింది వాళ్ళని 'స్వీట్' అంటూ దేవాలయాలైన కాఫీ హోటల్సులో తయారై, 'టీ' పార్టీలకు వస్తూ వాళ్ళని యిన్నాళ్ళు వుంచింది.

"కారం షడ్రసోపేతాల్లో ఒకటి యని పండితులందరు ఒప్పుకొన్న విషయమే. కాబట్టి నావుపయోగం వంట. విధానాల్లోనేగాక, 'రుచి' పదార్థాల్లో కూడా పరిపూర్తిగా. వుందన్నమాట. అంతేకాదు. నేను దేశభక్తుణ్ణి అని దృఢపరచు కొన్నాను. పూర్వం శతృవులపై నన్నుపయోగించి వాళ్ళకళ్ళల్లో 'కారం' వెదజల్లి అనేక కార్యాలు సాధించు కొన్నారు.

"యింతకీ చెప్పవచ్చిందేమంటే 'జ్ఞానిహుతాశనుండు' అన్నట్లు నాజ్ఞాని పచ్చిమెరపకాయ నాకుపోటీగా నిలస్తూ వుంటుంది. చివరకదే నీల్గి చస్తుంది. 'ఏమిలేనివిస్తరి యెగిరెగిరి పడుతుంది. అన్నివున్న విస్తరి అణగి అణగి యుంటుం'దని మీకు తెలుసు. పచ్చిమెరపకాయ ఖరీదులో కూడా చాలాయెక్కువే. పైగా శాశ్వతంగా నిలవనూలేదు. మాయిద్దరి తేడా చెప్పాలంటే 'జైన-బౌద్ధ' మతాలు వుపమానంగా సరిపోతాయి. నేను బౌద్ధ మతాన్ని - బౌద్ధ మతం త్వరగా వ్యాపించిందంటే కారణం ఏమిటి? దాని సూత్రాలు చాలా సులువుగాబట్టి, అల్లాగే నన్నుపయోగిం

చటం కూడా చాలా సులువు. నేను ఖరీదు తక్కువ. శ్రమ కూడ నాకోసం పడక్కర్లేదు. మన్నిక కలిగి యుంటాను.

"తీపి తినేవాడికంతం చాలా సున్నితంగా, మృదువుగా వుంటుందంటారు. ఈ పుసూడు మియావారి కాలంలో పుసూడు మంటూ చెప్పే బోధనలు ఎవరికి వినపడతాయి? గట్టిగా అరిస్తే నీరసంతో అన్నంలేక అలమటించే వారికి కూడా వినపడుతాయి. కాబట్టి 'కారం' తినేవారు కావాలని వేరే చెప్పాలా? భక్తుల మనుకొనేవారు 'మీ ఉప్పు-కారం' తింటున్న మేము ద్రోహం చేస్తామా అంటారు. కాని మీ తీపి తినే మేంచేస్తామా అంటారా? ఈ ప్రకారంగా నాకు పోటీలు రావటం యేమీ దాగుండలేదు.

"ఒక పులివిస్తరాకు కోసం ఏదైనా కుక్క వెడితే దానివెనకాలే మరోకొన్ని కుక్కలు వెంటడతాయి. అవి పోట్లాడు కొని దాన్ని కాస్తా చింపుతాయి. అట్లాగే బుద్ధిమంతులు మానవులుకూడా ఒక ప్రతిభకోసం వంతులు పడి నానాగం చేసుకొంటారు. యీ పాడుబుద్ధి చాలా నీచప్ర జాద్యం. అల్లాగే నావిషయంలో కూడా జ్ఞాతిగా పచ్చిమిర్చి సవితిగా తీపి చేరి నానావిధాల గడ్డి తినిపిస్తున్నాయి 'ఎవరి ధర్మంవారు నెరవేర్చుకొంటే పేచీ – పూచీలురావ' న్నాడు ఒకపెద్ద వేదాంతి. మరి మావాధలు ఎలా తీరుతాయో?

శలవు"

మీ అభిమాని

"ఎండుమెరపకాయ"



# ★ తండ్రిని మించిన కొడుకు ★

• నిష్టల బ్రహ్మాజీ •

పూర్వం పార్వతీపురం పరిసరాల్లో ఒక షావుకారు వుండేవాడు. అతనిపేరు కనకయ్య. కనకయ్యకు మొదట్లో పెద్ద ఆస్థి పాస్థులేమీ లేవు. చిన్న కిరాణా దుకాణం పెట్టుకుని పప్పూ వుప్పూ అమ్ముకుంటూ వుండేవాడు. కాని కనకయ్యకు వర్తకంలో అఖండమైన ప్రజ్ఞ వుండేది. తన దుకాణం దాటి యెవర్నీ వూరికనే పైకి పోనిచ్చేవాడుకాదు. కమ్మగా కబుర్లు చెప్పేవాడు. నమ్మకంగా లాభం లాగేవాడు. కానీకి కొన్న వస్తువ అణా చెప్పేవాడు. వాళ్ళు కాదూ పోదూ అంటే, "అంతకంటె తక్కువ కిస్తే మేం బ్రతకడం యెలాగ బాబయ్యా! కొనుబడి ధరే మూడుకానులండీ! అదైనా మీకు కనక యిచ్చేద్దామనుకుంటున్నాను, మూడు కాన్లకే తీసుకోండి, ఇంకొకళ్ళకయితే ధస్తే ఈ ధరకే యివ్వను. మరెవ్వరి చెవిలోనూ వూదకండేం, వాళ్ళంతా నామీద పడిపోస్తారు." అనేవాడు. తర్రాయి బుర్రాయి తాటికాయనేవాడు. మొత్తంమీద యెలాగో ఒకలాగ వాళ్ళని ఆధరకే ఒప్పించేవాడు. వాళ్ళు ఒకటి కావాలంటే తను నాలుగు తీసుకోమని సలహా యిచ్చేవాడు. మర్నాటివరకూ ఆలోచిస్తే మంచిసరుకు చెల్లిపోతుందనేవాడు. వాళ్ళు నసిగినట్లయినా బలవంతం చేసి కనీసం రెండయినా కట్టబెట్టేవాడు.

ఇలా కొన్నాళ్ళవరకూ కంటికి కునుకు లేకుండా కష్టించాడు. ఎలాగైతేనేం క్రమంగా కిరాణా దుకాణానికితోడు ఘనమైన బట్టల దుకాణం కూడా లేవదీసేడు. దాంతో నక్కనడుం తొక్కేడు. నాలుగు లక్షలరూపాయలు ఆర్జించి పోసుకున్నాడు, రెండు మేడలు కట్టుకున్నాడు. ఆవూళ్ళో కల్లా ఘరానా వర్తకుడనిపించుకున్నాడు. కాలిమీద కాలేసుకుని హాయిగా కాలం వెళ్ళబుచ్చుతున్నాడు.

ఇది యిలా ఉండగా ఒకసారి అతను శ్రీకాకుళం వెళ్ళవలసి వచ్చింది. శ్రీకాకుళం అక్కడికి యాభై మైళ్ళ దూరంలో వుంది. ఉదయం బయ

ద్దేరి వెళ్ళి, రాత్రికి యింటికి వచ్చేద్దామను కున్నాడు కనకయ్య. కాని తీరా అతనూ బండీలో అడుగు పెడుతూ వుండేసరికి అతని కొడుకు దండయ్య బండరాగాలు పెడుతూ కాళ్ళల్లో పడ్డాడు.

దండయ్యంటే కనకయ్యకు వూరంత అభిమానం. ముద్దుగా వాణ్ణి "దండూ" అని పిలుస్తూవుంటాడు. వాడిమీద ఈగనైనా వాల నివ్వడు. అందుచేతనే పదేళ్ళు పైబడ్డాకాని దండయ్య ముద్దులు కురుస్తూ ప్రతీదానికీ పేచీ పెడుతూ వుంటాడు. "నేనూ వస్తాను తీసు కెళ్ళూ" అంటూ మొండిపట్టు పట్టాడు.

రావొద్దన్నాడు కనకయ్య. దండయ్య విన లేదు. భయపెట్టేడు, బ్రతిమాలేడు. కాని లాభంలేకపోయింది. చివరకు యెలాగైతేనేం కొడుకుని కూడా వెంటేసుకుని వెళ్ళేడు. అను కున్నకంటె ఆలస్యంగానే వెళ్ళేరు. కనకయ్య వూళ్ళో పని చూసుకోడానికి వెళ్ళేడు. దండయ్య వూరిమీద తిరగడానికి వెళ్ళేడు. సాయంత్రానికి కనకయ్య పని పూర్తికాలేదు. మర్నాటి ఉదయం వరకు అక్కడే మకాం చేయ వలసి వచ్చింది. దండయ్య చంకలు గుద్దు కున్నాడు. కాని కనకయ్యకు మాత్రం కాళ్ళూ చేతులూ ఆడలేదు.

అక్కడ వుండిపోతే భోజనం మాట ఏమిటా అని తలక్రిందులయ్యాడు. ఆవూళ్ళో తనకు తెలుసున్నవాళ్ళెవరూ లేరు; డబ్బు దండగ లేకుండా కడుపు నింపుకుందామంటే. పూట కూళ్ళ యింటికి వెళ్తే డబ్బు ఖర్చయిపోతుంది. మానేద్దామంటే తనకేం బాధలేదు. కడుపులో కాళ్ళు పెట్టుకుని ముసుగు తన్నేస్తాడు. కాని తన పీకకి చుట్టుకున్న గుంటవెధవో? వాడి మాటేంచేయడం? ఆలోచించగా, ఆలోచించగా చివరకు అంతు దొరికింది కనకయ్యకు.

వెంటనే కొడుకుని పిలిచాడు. వాడిచేతిలో ఒక కానీ పెట్టి "ఒరేయ్! ఈ రాత్రికి మనం యిక్కడే వుండిపోవాలి. అందుచాత ఈ కానీ యిచ్చి ఏదయినా కొనుక్కొని తినేసి రారా" అన్నాడు.

చూశారా! నాలుగులక్షల రూపాయల ఆసిపరుడైన షావుకారు కొడుక్కి ఒక కానీయిచ్చి యేదైనా కొనుక్కొని తినమన్నాడు. ఎంత పిసినారో అర్థమైందా మీకు? అప్పుడే కథ పూర్తికాలేదు సుమండి! ఆ కుర్రాడు అప్పుడేం చేశాడో తెలుసా! కిక్కురుమనకుండా తండ్రి యిచ్చిన కానీ తీసుకుని బజార్లో ఒక మిఠాయి దుకాణం దగ్గరకి వెళ్ళేడు. దుకాణం వాడి చేతికి కానీ యిచ్చి "మిఠాయి కావాలి" అన్నాడు.

ఆరోజుల్లో అన్నీ చౌక కనుక దుకాణం వాడు ఒక మిఠాయి వుండ యిచ్చాడు. కాని కుర్రవాడికి యిది సంతృప్తి నివ్వలేదు. రెండు వుండలైనా తింటే కాని కడుపు నిండదను కున్నాడు. "కానీకి రెండు మిఠాయి వుండలియ్య వా?" అనడిగాడు.

"కిట్టదు" అన్నాడు దుకాణదారుడు.

"అయితే మిఠాయి నాకు అక్ఖర్లేదు" అని యిచ్చేసి తిరిగి కాని తీసుకుని పక్కనున్న పళ్ళ దుకాణానికి వెళ్ళేడు. దుకాణం వాడి చేతికి కానీ యిచ్చి నారింజపళ్ళు యిమ్మన్నాడు. దుకాణంవాడు రెండు నారింజపళ్ళు యిచ్చాడు. ఇది కూడా ఆ అబ్బాయికి సంతృప్తిగా లేకపోయింది.

# తండ్రిని మించిన కొడుకు

"ఏమయ్యా! కానీకి మూడు పళ్ళు యియ్యవా?" అన్నాడు.

"ఊహుఁ. యివ్వరు" అన్నాడు దుకాణం వాడు.

"మూడు పళ్ళయినా ఇవ్వకపోతే యెందుకు? రెండు పళ్ళు నాకేం సరిపోతాయి" అన్నాడు.

దుకాణం వాడికి కొంచెం చిరాకు వేసింది. "చాలకపోతే మా వూరి పక్కనించి నాగావళి నిరాటంకంగా నిండుగా ప్రవహిస్తోంది. వెళ్లి కడుపు నింపుకో" అన్నాడు. ఈమాట వినగానే పట్టరాని సంతోషం వచ్చింది దండయ్యకు. పళ్ళు తిరిగి యిచ్చేసి, "నాపళ్ళు నాకిచ్చెయ్యి. త్వరగా" అంటూ దుకాణంవాణ్ణి తొందర చేసేడు. దుకాణంవాడు కోపంతో కొర కొర లాడుతూ కానీ గిరవాటేశాడు. దండయ్య వెనక్కి తిరిగి చూడకుండా ఏటిదగ్గిరకి దౌడు తీశాడు. కడుపునిండా మంచినీళ్ళు యెక్కించేశాడు. కడుపు చేత్తో తడుముకుంటూ వెళ్ళి తండ్రికి కానీ యిచ్చేశాడు.

కనకయ్య ఆశ్చర్యపోయాడు. "ఏంరా, దండూ! కొనుక్కొమ్మని నీకు కానీ యిస్తే యేదీ కొనుక్కొని తినలేదేం? చాలలేదా?" అని అడిగాడు కొడుకుని. అప్పుడు దండయ్య యిలా చెప్పేడు.

"అదికాదు నాన్నా! కానీకి మిఠాయి కొనుక్కుందామంటే ఒక్క వుండకంటె యెక్కువ యియ్యనన్నాడు. పోనీ పళ్ళు కొనుక్కుందామని వెళ్ళి నారింజ పళ్ళు యిమ్మంటే కానీకి రెండు పళ్ళుకంటె యెక్కువ యియ్యనన్నాడు. రెండు పళ్ళతో కడుపు నిండదు మూడు యియ్యమంటే నాగావళి ఏటి నీళ్ళు త్రాగి నింపుకో మన్నాడు. ఆమాత్రం దానికి కానీ కూడా దండుగ చేయడమెందుకని యేకంగా మంచినీళ్ళతోనే కడుపు నిండేసుకున్నాను."

ఈ మాట వినగానే తన కొడుకు తనను మించినవాడయ్యాడు కదా అని పరమానంద భరితుడయ్యాడు కనకయ్య.



# పిలుపు

శ్రీమతి అయ్యగారి రాఘవమ్మ.

తెల్లగులాబి పూలనదె తెన్గువనావళి తావులీనెనో
చెల్లి: అదే: కనుంగొనుము చేరవపోయక కోసికొందమీ
యెల్లి తెనుంగు తల్లి కెదురేఁగి పదంబుల మ్రొక్కి కొందమా
చల్లని తల్లి వేడుకతో చక్కగ పీఠమలంకరించెడిన్:

బొమ్మలాటలందు బుజ్జాయితనములో
తెనుగుతల్లి పూజ తెలియదేమొ!
మరతువేమొనమ్మ: బిరబిరరమ్మింక
దీక్షనున్న తల్లి దీవెనంద:

తెలుగు కుమారిని తొలుత దీపించిన
కవిరాజు పదములఁగాంచికూర్చి
తిక్కనార్యుని మంచి తెల్లని ముత్యాల
జాతీయ సరులను జతగఁగూర్చి
పోతనార్యుని మంచి పూవులకవితలో
తావుననీనెడి దండలల్లి
శ్రీనాథకవిరాజు చెన్నారు పదముల
రతనాల పతకాల జతలగూర్చి

మాతపట్టాభిషేకాన మహితస్ఫూర్తి
హారముల నర్పించి యానందమొప్ప
భవ్యవైతాళికుల నాందిపాటపాడి
చెల్లెలా: హారతులనివ్వ చేరరమ్ము.



# గ్రీకు సంస్కృతి

శ్రీమతి డా॥ వి. యశోదాదేవి, యమ్. ఏ., యత్. లిట్., డి. లిట్.,

సంస్కృతి అనగా జీవిత విధానము; జాతియొక్క గొప్పసంస్కృతిని జాతీయ ఆత్మయన వచ్చును. ఒక్కొక్కజాతి సర్వస్వము జాతీయ సంస్కృతిలో యిమిడి యుండును. ఈ సంస్కృతి జాతియొక్క వివిధ విషయములందును ప్రతిబింబించును. జాతీయత — అనగా వాఙ్మయము, నాగరికత, సభ్యత, కళలు — సంస్కృతిలో లీనమగును. ప్రాచీన గ్రీకుసంస్కృతి ప్రాచ్యపాశ్చాత్య ఖండములలో శాశ్వత ముద్రలవిరచించినది. ఇప్పటికిని ఆ సంస్కృతి ఛాయలు అంతర్వాహినులుగ గానవగుచున్నవి.

మధ్యధరాసముద్ర తీరమున బాల్కను దేశములలో నొకటి గ్రీసు ద్వీపకల్పము. గ్రీకులు ఆర్యులలో నొక శాఖవారు. అనేక శతాబ్దములకు పూర్వమే గ్రీకులు యీజియనుల పురములు, ద్వీపములలో ప్రవేశించిరి. క్రీ. పూ. 960 ప్రాంతమున గ్రీకు సంస్కృతి వుదయించు చుండెను. గ్రీకుతత్వజ్ఞులు జనులకు తార్కిక చర్చా పద్ధతి నలవరచుచుండిరి. గ్రీకులలో కవులు, గాయకులు నుండిరి; సాంఘిక సమావేశములలో వీరిగానము ముఖ్యమయ్యెను. గ్రీకులు ఏషియా మైనరులో ట్రాయ్‌నగరమును ముట్టడించి కొల్లగొన్నవిధము ఇలియడ్ కావ్యమందును, అచటి నుండి తమ స్వంతద్వీపమునకు వచ్చునపుడు వారియను భవములు ఒడిస్సీకావ్యమందును వర్ణితములు. క్రీ. పూ. 7, 8 వ శతాబ్దములలో గ్రీకులు అక్షరమాలను నేర్చికొన్న పిదప యీ రెండు ఇతిహాసకావ్యములు వ్రాయబడెను. ఇవి హోమరు అను అంధకవి రచించెనందురు. ఈ కావ్యముల వలన గ్రీకులు తాము ఒకేజాతి వారమను భావము గల్గి, యేకభాష, యేకవాఙ్మయము, ఆచారవ్యవహారము యుద్ధములందు ఏకాదర్శము, అన్యోన్యత, సంఘీభావము వృద్ధి జెందెను.

గ్రీసులోను, ఆప్రాంతపు ద్వీపములందును క్రొత్తపురములు నిర్మితమయ్యెను; వానిలో ముఖ్యమైనవి - ఏథెన్సు, స్పార్టా, కారిన్త్, థీబ్సు. సామోస్, మైతిటాన్ నల్లసముద్ర తీరమునను, ఇటలీ, సిసిలీలలోగూడ గ్రీకునగరము లేర్పడెను. ఇటలీదేశపు పాదభాగము మగ్నాగ్రీషియా యని పిల్వబడుచుండెను. ఫ్రాన్సులోని మార్సెల్సు, అంతకు పూర్వమచట నున్న ఫసీషను పురమును, గ్రీకులు కట్టినవే. గ్రీకునగరములు కొండలోయలందును, ద్వీపములందును చెదరియుండెను. గ్రీకులు వారిచరిత్రారంభ కాలము నాటికి చిన్న చిన్న భిన్నరాజ్యములలో నుండిరి. వీరిలో కొంత జాతిభేదముండెను. కొన్ని రాజ్యములలో ప్రజా పరిపాలన పద్ధతి, మరికొన్నిటిలో ఎన్నికరాజులు, వంశ పారంపర్య రాజులు, నిరంకుశ ప్రభువులు పాలించుచుండిరి.

గ్రీకు రాజ్యములు విడిగానుండుటకు పర్వతమయమైన అచటి భౌతికస్థితి కారణము. పౌరులు పరస్పరాభిమానులై యేకకార్య పరులైనను, ఆ నగరములు ఏకరాజ్యములో కలిసిపోవు ధోరణిలేకుండెను. వ్యాపారము వృద్ధియైన కొలది ఆ యాపురముల వారు సంధులు, సమాఖ్యలుచేసి కొనసాగిరి. రక్షణార్థము చిన్న పురములు పెద్దనగరముల నాశ్రయించెను. నాలుగేండ్ల కొకపరి ఒలింపియాలో జరుపబడుచుండిన పోటీ ఆటలు గ్రీకు రాజ్యము లన్నిటికి సంఘీభావము కల్గించెను. యుద్ధములలో అనాగరికత, క్రూరత తగ్గెను వ్యాయామ వినోదములకు వచ్చిపోవు యాత్రికులకు ప్రమాదము లేకుండ యుద్ధవిరామ ముండెను. ఒలింపిక్ ఆటలలో పాల్గొనుట వలన ఏకసంస్కృతి భావము క్రమముగ హెచ్చెను. గ్రీకు రాజ్యములు, వానికి సంబంధించిన ఎపిరస్, మాసిడోనియా రాజ్యములును ఆటల పోటీలలో పాల్గొను చుండెను.

క్రీ. పూ. 7, 6 వ శతాబ్దములలో గ్రీకుల వ్యాపారము ప్రాబల్యము హెచ్చి, వారి నాగరికత చక్కబడెను. వారికి గొప్పదేవాలయములుండెను; కాని గురువులకు సర్వాధికారము లేదు. దైవాంశ రాజపద్ధతివల్లగలుగు ఆడంబరము గ్రీకులలో లేదు. వారి ప్రజాప్రభుత్వమున కులీన కుటుంబముల ప్రభుత్వమే. సామాన్యసభలలో ప్రతిపౌరుడు సార్వజనిక విషయముల చర్చలలో పాల్గొను హక్కుగల్గియుండెను, కాని నేటి ప్రజాప్రభుత్వములలోవలె గ్రీకు ప్రజారాజ్యములలో ప్రతి మానవునకు హక్కులులేవు. వేలకొలది బానిసలు రాజ్యాంగ విషయము లందెట్టి ప్రసక్తియులేక యుండిరి. కాని గ్రీకు జనుల మనోభావము

లంపును, పరిపాలనా క్రమమందును నూతన స్వేచ్ఛ యుండెను. ప్రజలు తమ్ము పాలించుకొను పద్ధతిని గ్రీకులే ప్రారంభించిరి.

యుద్ధములు వెనుకబడునప్పటికి గ్రీకులలో విచక్షణ జ్ఞానముగల్గెను. జ్ఞానము నార్జించుచు యితరులకు బోధించి గ్రంథస్థము చేయుచు గ్రీకులు ప్రాణి స్వభావమును గూర్చి చర్చించు చుండిరి. క్రీ. పూ. 6 వ శతాబ్దములో బాబిలనులో జీసను, మైలిటసులో అనగ్జిమాండరు, ఎఫిసస్‌లో హీరాక్లిటస్, ప్రపంచ స్వభావము, యుత్పత్తి, భవిష్యత్తుల గూర్చి స్వతంత్రముగ విమర్శించిరి. ఇదేకాలములో భరత వర్షంలో బుద్ధభగవానుడు, చైనాలో కన్ఫూషియస్, లోత్సే యవతరించిరి. గ్రీసులో ఏథెన్సు మొదలు, ఆసియా చివర నున్న శాంత మహాసముద్రము వరకు అంతటను మానవుల మనస్సులలో నూతన వికాసము గల్గెను.

అలగ్జాండరుతో భారతదేశమునకు వచ్చిన గ్రీకులు కొన్ని విషయముల దెలిసికొని వెళ్ళిరి. మన పూరాతన సంస్కృత గ్రంథములలో గ్రీకులు యవనులుగను, గ్రీకు లిపి 'యవనాని' గను చెప్పబడినవి. వైశాలి మొదలగు ప్రజాతంత్ర రాజ్యములు ఉత్తర హిందూ దేశమున నుండెను. గ్రీకుల వైజ్ఞానిక భావములు కొంతవరకు భారతీయములే. సింధుప్రాంత మందలి తక్షశిల, గాంధార మందలి పుష్కలావతి యందుగల భారతీయ విజ్ఞాన పరిశోధనాలయముల నుండి యవనగణిత, తత్వశాస్త్రీయులు నూతన రహస్యములు గ్రహించిరి.

ప్రథమ చరిత్ర గ్రంథమును రచించిన హెరొడటస్, క్రీ. పూ. 484 ప్రాంతమున హెలికార్నసస్‌లో జన్మించి, సరియగు వివరములకై బాబిలను, యీజిప్టుల దర్శించి, పారశీకుల నుండి గ్రీకు పట్నములు స్వతంత్రములైన ఘట్టము విరళముగను, రసవంతముగను వర్ణించెను. గ్రీకులు తమ నాగరికత విశిష్టమైనదని యెరిగినవారై విదేశీయులను మోటు అనాగరిక విదేశీయులని పిల్చుచుండిరి. పర్షియను దాడుల తదనంతరము 150 సం॥ లు గ్రీకు నాగరికత యత్యుత్తమ దశయందుండెను. గ్రీకుల జ్ఞానవికాసము, నిర్మాణకౌశలము వృద్ధియయ్యెను. వీనికి ముఖ్యస్థానమైన ఏథెన్సు నగరమును ముప్పది సంవత్సరములు (క్రీ. పూ. 466 – 428) పెరిక్లిస్ పాలించెను. పారశీకులచే నిర్మూలితమైన ఏథెన్సును యితడు పునరుద్ధరించెను. ఇప్పటికిని శిధిలరూపమున గతవైభవమును చాటుచున్న చక్కని భవనములు యితడు కట్టించినవే. పెరిక్లిస్ కవులను, నాటకకర్తలను, తత్వశాస్త్రజ్ఞులను ప్రోత్సహించెను. అనగ్జాగొరసు సూర్యునకు నక్షత్రములకు వైజ్ఞానిక వివరణల నారంభించెను. అయిశ్చిలస్, సొఫోకల్స్, యూరిపిడస్, లు గ్రీకు నాటక సాహిత్యమును పున్నతదశకు దెచ్చిరి. పెలప్పనీసను యుద్ధముల వల్ల గ్రీసులో శాంతిలేకున్నను, రాజకీయ వాతావరణము జీకట్లు క్రమ్మియున్నను, బుద్ధివికాసమునకు చురుకు గల్గి ఏథెన్సులో జ్ఞానాభివృద్ధియగుచునే యుండెను.

పెరిక్లిస్‌కు పూర్వమే మనో స్వాతంత్ర్య ప్రియులగు గ్రీకుల సంస్థలు చర్చాశక్తికి ప్రాముఖ్యము నిచ్చెను. తీర్పు నిచ్చుయధికారము ప్రజానాయకులదై యుండెను. వాదశక్తి, వక్తృత్వము, ముఖ్యలక్షణములై యుండెను. సోఫిస్టులు అను తర్కవాదులు యువకులకు యీ పై కళల నేర్పుచుండిరి. వాగ్ధోరణితోబాటు విషయజ్ఞాన మభివృద్ధి నొందెను. వాదములయుక్తి, ప్రామాణ్యము, ఆలోచనా పద్ధతులు, శైలి - వానిగూర్చి తీవ్రముగ విమర్శన జరిగెను. సోఫిస్టుల వాదముల విమర్శించి పెరిక్లిస్ తర్వాత ఏథెన్సులో నున్న సోక్రటీస్ ప్రసిద్ధినందెను. జనులమనముల కలవర పర్చెనను నేరముపై క్రీ. పూ. 399 లో సోక్రటీసుకు మరణశిక్ష విధించి, మిత్రసమక్షమున స్వగృహమున విషము ద్రావించి చంపిరి. కాని ప్రజల మనము లందు కలవరముపోలేదు. సోక్రటీసు శిష్యుల మూలమున అతనిబోధలు వ్యాప్తినందెను. వారిలో ముఖ్యుడగు ప్లాటో (క్రీ. పూ. 427 - 347) కళాలయములో, తత్వశాస్త్రము బోధించెను. ఇతడు నరుల మనఃప్రవృత్తుల మూలసూత్రములను, రాజకీయ సంస్థలను విమర్శించెను. ఆదర్శసంఘ పద్ధతిని గూర్చి యితడు 'వుటోపియా'ను రచించెను. జనులకు యిందువల్ల నూతన ధైర్యసాహసములు గల్గెను. "మీకు తగుధైర్య సాహసములున్నచో చాలావరకుమీకున్న సాంఘిక, రాజకీయ బాధలన్నియు మీరు స్వయముగ వారింప వీలగునవే. మీసామర్ధ్యమును మీరెరుగరు గాని మీరు నిశ్చితులై, కార్యవీరులైనచో ఇంతకన్న చక్కగా మీరు జీవింపవచ్చు" నని ప్లాటో జనులకు విశదపర్చెను. ప్రజాస్వతంత్రత క్రింద కులీనుల పాలనను సూచించు 'రిపబ్లిక్' గ్రంథమును ప్లాటో అంతకు పూర్వమే రచించెను. రాజ్యమునకు న్యాయనిబంధనల నిర్ణయింప "చట్టములు" అను గ్రంథము వ్రాసెను, ప్లాటో అనంతర మతనిశిష్యుడు

అరిస్టాటిల్ తార్కిక. రాజకీయపద్ధతుల విమర్శింపసాగెను. ఇతడు అలగ్జాండరుకు కొంతకాలము వుపాధ్యాయుడుగ, నుండెను. అనుమాన పద్ధతుల గూర్చి అరిస్టాటిల్ రచించిన గ్రంధము తర్కశాస్త్రమును వుచ్చదశకుదెచ్చెను. ప్లాటోవలె పుటోఫియాల రచింపక యితడు శాస్త్రీయజ్ఞానమును క్రమ పద్ధతిని సంపాదింప దొడగి, యదార్ధ పరిస్థితుల గ్రహింత బరిశోధకుల బంపెను. జీవప్రకృతి చరిత్రము, రాజ్యాంగ శాస్త్రము గూడ అరిస్టాటిలే ప్రారంభించెను. ఇతని శిష్యులు లిసియంవద్ద 158 వేర్వేరు రాజ్యముల రాజ్యాంగ నిర్మాణ మును బరీక్షించి, వాని తారతమ్యమును చర్చించిరి క్రీ. పూ. 4 వ శతాబ్దములో జీవిత సమస్యను గూర్చి కట్టుదిట్టముగు విమర్శ యీవిధముగ వచ్చెను. క్రమపద్ధతులపై స్వతంత్ర చర్చలు ప్రారంభమయ్యెను.

అలగ్జాండరుకు పూర్వమే పారశీక రాజ్యములందు గ్రీకులు వర్తకులుగను, శిల్పులుగను, పుద్యోగస్తులుగను, జీతపుయోధులుగ నుండిరి. అలగ్జాండరు సామ్రాజ్యములో గ్రీకుల వేషభాషలు, సంస్కృతి బాగుగ వ్యాపించెను. వానిచిహ్నములు మధ్యఆసియా, హిందూదేశపు యీశాన్య భాగములందు గన్పట్టుచున్నవి. భారతీయ కళాసాంప్రదా యమున గ్రీకు స్పర్శగన్పడును. వేయేండ్లు గ్రీకుసంస్కృ తికి ఏథెన్సు ముఖ్యస్థానముగ నుండెను. తర్వాత అలగ్జాండ రుచే స్థాపితమైన అలగ్జాండ్రియా విజ్ఞానకృషికి కేంద్రమై యుండెను. ఇచట గ్రీకుసేనానియగు టాలమీయాస్థాన మున గ్రీకుభాషనే మాట్లాడుచుండిరి. టాలమీ అరిస్టాటిల్ భావముల గ్రహించిన వాడైనందున విజ్ఞాన పరిశోధనల సమర్ధతతో నిర్వహించెను. ★



— కుమారి తెలికిచర్ల ప్రభ

★

ఈమె శ్రీమతి తెలికిచర్ల వసుందరాదేవి,
శ్రీ తెలికిచర్ల కృష్ణమూర్తిగార్ల కుమార్తె.
శ్రీ ఆదిపూడి సోమనాధరావుగారి దౌహిత్రి.
1953 మార్చిలో మద్రాసు యూనివర్సిటీకో రాజ కీయ శాస్త్రము (పాలిటిక్స్)లో బి. ఎ. (ఆనర్స్) పరీక్షలో ఫస్టుక్లాసుతో యూనివర్సిటీ ఫస్టుగా పాసయింది ప్రస్తుతం డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ డిగ్రీకి రిసర్చి చేస్తున్నది. ఈమె సంగీతం నృత్యం బాగా నేర్చుకున్నది. ఆంధ్రమహిళాసభ ఉత్సవాలలో ...ల్గొంటూ ఉంటుంది.

★

# విస్మృత కవయిత్రి - బాలపాపాంబ.

శ్రీ నిడుదవోలు వెంకటరావు, ఎమ్.ఎ.

ఆంధ్ర వీరశైవ వాఙ్మయమున నెన్నిక గన్న యక్ష గానములలో నొకటియగు 'అక్క మహాదేవి చరిత్ర' ను రచియించిన ప్రశస్తాంధ్ర కవయిత్రి బాలపాపాంబ. ఈ యక్షగానము రమారమి యరువది యేండ్ల క్రిందటనే ముద్రితమైనను, వీరశైవ వాఙ్మయమును గూర్చి గాని, సరియగు పరిశ్రమ జరుగక పోవుటచే నీ కవయిత్రి చరిత్రము మనకెఱుకపడలేదు.

అక్క మహాదేవి చరిత్రమున నీ యక్షగానమునకు 'అక్క మహాదేవి బోధోల్లాసము' అని పేరు కూడ కలదు. ఈ అక్క మహాదేవి, వీరశైవ మతప్రవర్తకులగు, బసవేశ్వరునికి, అల్లమ ప్రభువునకు సమకాలికురాలైన మహా శివభక్తురాలు. మన తెనుగు దేశమున వీరశైవ మతమున నీమెకంతగా వ్యాప్తి లేదు గాని, కన్నడ దేశమున నీమెను గూర్చి యనేక గ్రంథములు, గాథలు గలవు. ఈమె కన్నడ భాషలో చెప్పిన కొన్ని వచనములు గూడ ముద్రితమైయున్నవి. తెనుగున వీర శైవ గ్రంథములలో 'ప్రభులింగలీల' అను నల్లమప్రభు చరిత్రమున నీమె ప్రస్తావన గలదు. ఇట్టి పరమపవిత్రురాలి జీవితమును యక్షగాన రూపమున గానము చేసిన కవయిత్రి బాలపాపాంబ.

ఈమె తన యక్షగానము చివర నీ క్రింది వివరించిన యంశములను తెల్పినది.

వంశము--- బ్రహ్మ వంశమున

జంగమేశ్వరుఁడు - భార్య పాపాంబ

వీరభోజుడు, దక్షిణామూర్తి, సిద్ధప్ప, మల్లమ, కనకమ్మ, నాగమ, రుద్రమ

(వీర వసంతుఁడు. - కామాక్షమ్మ భార్య

బాలపాపాంబ - (గ్రంథకర్త్రి))

కవయిత్రి— "అష్టయోగాది విద్యాప్రవీణుఁడగు వీర వసంత వసుమతీశునకు

ప్రథమపుత్రిక బాలపాపాంబ యనఁగ
నధికతేజంబున నప్పుడుద్భవించ
సంగీతసాహిత్య సరసలక్షణల.

రంగు మించినయట్టి రమణిదానగుచు
నలభద్రకాళి నా యాత్మలోపలను
బలికించు నేరీతిఁ బలికెదననుచు
నవనిలో యక్ష గానావళికెల్ల
రవళిమించిన శిరో రత్నమోయనఁగ
మంగళప్రదమగు మహాదేవి చరిత
యింగితజ్ఞానియై యీ కృతిఁజేసె."

పైని యుదాహరించిన విషయములను బట్టి యీమె జంగమ కులమున జన్మించినదనియు, వీరవసంత వసుమతీసునికి తనయ యనియు, సంగీత సాహిత్య విద్యా విశారద యనియు, భద్రకాళి భక్తురాలనియు;

యక్ష గానావళికెల్ల శిరోరత్నమనదగిన యీ యక్క మహాదేవి చరిత్ర రచియించెననియు, మనకు స్పష్టమగు చున్నది.

వీరవసంతుని తొలి పేరు వీరభోజుఁడు. గ్రంథాంతమున తండ్రిని గూర్చి యిట్లు మంగళాశాసనము చెప్పినది.

> "ఇమ్ముగ భోజుండిమ్మననెప్పుడు
> కొమ్మనివరములు నెమ్మదినొసగు
> అష్టభోగములు, ఆయుర్వృద్ధియు
> ఇష్టభోజునకు నిరవుగ నొసఁగుఁ
> ధనధాన్యము పుత్ర శ్రీవిభవము
> నొనరగ భోజున కొసగెను ప్రభువుఁ"

ఈమె కాలము క్రీ. శ. 1600 ప్రాంతము. పైని చెప్పిన వీరవసంత వసుమతీశుని బట్టి యీమె కాలము నిర్ణయింపనగును. ఈ వీర వసంత వసుమతీశుండే కాలజ్ఞానము మున్నగు శైవ గ్రంథములయందు పేర్గాంచిన "వీరభోగవసంతరాయడు." ఈతడు క్రీ. శ. 1565లో జన్మించి 99 యేండ్లు జీవించి 1664లో లింగైక్యము జెందినట్లుగా నీతని ప్రశంసగల గ్రంథములు తెలుపుచున్నవి. బాలపాపాంబ యీతని తనయ కాబట్టి ఈమె క్రీ. శ. 1600 ప్రాంతమున విలసిల్లి యుండవచ్చును.

ఈమె కృతులీ యక్షగానము తక్క వేఱొకటి కానరాలేదు. అయిన నిది యొకటియే యీమె కవితా సామర్థ్యము వ్యక్త పఱుప జాలినది. గ్రంథరచనమునను సరించి చూడగా నీమె యోగశాస్త్రమునందు ప్రత్యేక ప్రవేశముగల విదుషీమణియని తెలియగలదు. ఈమె నివాస స్థలము కూడలిసంగమక్షేత్రమని చెప్పవచ్చును.

గ్రంథాంతమున ద్విపదలో,

> "అనియిట్లు శ్రీ కాశికాధీశు పేర
> నెనయంగఁగుంభ కొణేశ్వరు పేర
> మమ్మేలు శ్రీశైల మల్లేశు పేర
> సమ్మతిఁగూడలి సఁగయ్య పేర"

అని శ్రీ కాశీవిశ్వనాధుని, కుంభకోణేశ్వరుని, శ్రీశైల మల్లేశ్వరుని, కూడలిసంగయ్యను స్తుతించినది. వీర వసంతుని నివాసస్థలము కూడ కూడలిసంగమ మని తెలియుచున్నది.

## అక్క మహాదేవి చరిత్రము.

ఈ యక్షగానమందలి కథయిది. ఈమె మహాదేవి యంశమున జనించినదిగాన నాపేరు ధరించినది. ఉడుతడి అను పురమును విమలుడను శైవగృహస్థుడుండెను. ఆతని భార్య సుందరి. వారికి మహాదేవి యంశమున అక్కమ జన్మించెను. ఆమె దినదిన ప్రవర్ధమానయై యౌవనవతి యయ్యెను. ఆమె యొకనాడు రాజ వీధిలో తన సౌధమున నుండగా నా పురమేలు రాజామెను చూచి మోహించి, యామెను పెండ్లియాడ దలచి తన పరిచారకల మూలమున నామె తండ్రికి తన మనోరథము తెలియ జేసెను. తండ్రియు అక్కమనే స్వయముగా నడుగ మని చెప్పెను. అక్కమ రాజుగారినే తన వద్దకు రమ్మనమనియు, తానే స్వయముగా మాటలాడెదనని కబురంపెను. రాజును నలంకృతుడై యామె యొద్దకు వచ్చెను.

అక్క మహాదేవి తనమాట నాతడు పాటించిన నాతని పెండ్లి యాడుదుననియు, నెప్పుడైన తప్పిన తత్‌క్షణమే తపస్సు చేయుటకు వెళ్ళిపోయెదననియు స్పష్టముగా తన యభిప్రాయము చెప్పెను. రాజు అట్లే చేసెదనని చెప్పెను. ఆమె నమ్మలేదు. రాజు ప్రమాణము చేసెను. అంతనామె రాజును ముందటి వెడలుమని యా వెనుక తాను వచ్చెదనని చెప్పెను. రాజట్లే వెడలిపోయెను. అంత యక్కమహాదేవి సర్వాలంకృతయై, పల్లకిలోనెక్కి, జగన్మోహిని రూపు దాల్చినట్లు రాజు వద్ద నిలిచెను. రాజామెను వచ్చి మోహముచే పట్ట బోయెను. ఆమె రాజును 'నీవు శివభక్తుడవుకమ్ము అప్పుడు నేను వశ్యురాలనగుదును' అని నివారించెను. కాని రాజు జైనుడు. ఆతడు శివభక్తిని తిరస్కరించుటయేగాక శివుని నిందించెను. రాజు తనమాట తప్పెనని యామె తపస్సునకు బోయెను. ఆమె అల్లమప్రభువును వెదకుచు తన

ఈ వీరవసంత రాయుని గూర్చి, మైసూరి దొరతనమువారు ప్రకటించిన 1932 సంవత్సరపు నార్షశాఖా నివేదిక చూడనగును. ఆచారిత్రక విషయము లన్నిటిని తెలుపుటకిట తావులేదు. గాన విరమించితిని.

పట్నము యోగినీ వేషముతో వచ్చెను. అచ్చట తన వారందఱామెను వేళాకోళము చేసిరి. ఆమె అక్కడ నుండి కదలి కల్యాణపురము ప్రవేశించెను. అక్కడ బసవన, అల్లమప్రభువు లామెకు స్వాగతమిచ్చిరి. ఆమె శివభక్తి భావన కాశ్చర్య భరితులైరి. అంత నామె భక్తి పరీక్షింపదలచి అల్లమ యీ చింపిరి వేషమేమి యని ప్రశ్నించెను. దానికామె యిట్లు ప్రత్యుత్తరము చెప్పినది.

పరతత్త్వనిధియైన పరమేశ్వరుని సతికి
మఱికోకలేల పల్కుబునెంచి చూడఁ—
తను మానధనము సంగతము విడచిన నాకు
మనసిజుని తోటి మొగమాటమేమిటికి
అకలంక తేజుఁడగు సకలేశ్వరునిభక్తు
లకునేల నన్నునొకలాగు చూడగనూ
సుకృత దుష్కృతములకు చొరక నిర్గుణవ్యక్తి
వికృతి బొందిన నాకు వేషమేమిటికి.

అని ప్రత్యుత్తర మిచ్చెను. అల్లమప్రభువును నానంద పరవశుడై యామెకు శివయోగమును నిట్లుపదేశించెను.

"తొమ్మిది త్రోవలు తొడరి బంధించి
యిమ్మగా బ్రహ్మాండ మింతయునాత్మ
లోనుండఁ జూచుచు లూనతలేక,
మానకంతట పరమానందమునను
నొగి నిష్ఠ ప్రాణసంయుక్తి షడంగ
మగునందు లింగైక్యమారూఢిఁ దెలిసి
అంత నంతఃకరణాది తత్త్వముల
యంతున హృదయ పద్మాంతంబునందు
స్థిరమైన హంసను జీవునిబట్టి
మఱి మనస్సున నన్నిమారుతంబులను
వెడలించి సమరస విధిని చేమించి
ముడుగ కాత్మధ్యానముననను తా మెలఁగి
తనుతరంబుగ నచేతన తత్త్వమునను
కనుబొమల్ ముడివడగాను భ్రూమధ్య
ద్విదళంబు నడుమ దేదీప్య బ్రహ్మంబు
సదమ లోక్తిని గని సంభ్రమం బొదవ
ఘనత రోంకారంబు కర్ణాంతరమున
వినబడు మదిలోని వేడుకతోడ
ననియిట్లు యోగసమాధినిఁ దెలిసి
వనజాయతాక్షిని వదలక పిలిచి
సిద్ధాసనంబున స్థిరముగ నిలిపి
హస్తమస్తక యోగ మలవడజేసె"

ఈ యుపదేశమును పొంది యక్కమహాదేవి తపస్సు చేసి, శివభక్తిని లోకమున ప్రతిష్ఠించి, మహాభక్తురాలై శివైక్యమును జెందెను.

ఈ యక్షగానమున, జంపెలు, రచ్చతేపలు, ఏకతాళి, మొదలగు దేశి పదరచనలు, జోలపాటలు మంగళహారతులు మొదలగు పాటలును గలవు. ఇవియన్నియు బాల పాపాంబ సంగీత సాహిత్య విద్యను ప్రదర్శించును. ఈ గ్రంథమున పై నుదాహరించిన పంక్తులను బట్టి బాల పాపాంబ పవిత్రజీవితమును, యోగనష్టాపరత్వమును నెఱుక పడుచున్నది. వేగమాంబకు ముందుగా నీమె యోగమార్గము నుపదేశించినది. ఈ యక్షగానమును ససిగా పునర్ముద్రితమైన, యాంధ్రకవయిత్రులలో బాల పాపాంబ యుత్కృష్ఠస్థానము తేటపడగలదు. ఆమె వ్రాసిన మంగళహారతితో నీవ్యాసము ముగించు చున్నాను.

### మంగళహారతి

పసిఁడి పళ్లెరములో పంచదళ పద్మమున
పంచరత్న ప్రభలు భాసిల్లగా
విశదముగఁ బాడెదరు విశ్వేశ్వనంబుచే
శశివదన మహాదేవి సరసి చెలఁగి—
జయమగళం సదాశుభమగళం.
ప్రభునిఁ బట్టెదననుచుఁ బంతమున శివునికరుణ
ప్రభవించ వసుధలోపల జనించి
విభవంబుతో జైన విభునినగరముఁజొచ్చి
సభసమ్మతింప నాసమయమునను—
జయమగళం సదాశుభమగళం.
వానిభ్రమియించి నిర్వాణ వృత్తిని ఘోర
కాననంబుల ఘనకాల మందు
సానువుల యందునా సరసుఁ డల్లమవిభుని
పూనివెదకిన యట్టిపూబోణికి—
జయమంగళం సదాశుభమగళం.
వెదకుచుండెడివేళ వీరు డల్లమగురుడు
మదిలోన తెలిసపుడు మమతతోడ
సదమలాకృతితోడ సరగఁబ్రత్యక్షమై
నుదయార్క భావమునుండి యపుడు—
జయమంగళం సదాశుభమంగళం.
మోదమున శాంభవీ ముద్రోపదేశంబు
ఆదిగా నీకొసగి నటుల యికను
మేదినీ జన జనములాదిగాఁ బొగడఁగను
నీవయను మమ్మేలు నీరజాక్షి—
జయమంగళం సదాశుభమంగళం.



(16-వ పేజీలో తరువాయి—)

ఆరోపించి మహమ్మద్ అలీ దానిని రద్దు చేయించాడు. సరిహద్దురాష్ట్రం, సింధురాష్ట్రం, పశ్చిమపంజాబ్ మొదలైన చోట్లలోనల్లా లీగ్ ప్రతికూలురను అణిచివేయ ప్రయత్నించాడు. దేశంలో పెరిగిపోతున్న అశాంతిని చూసి, గవర్నర్ జనరల్ గులాం మహమ్మద్ అవాంతర పరిస్థితిని ప్రకటించి దేశవిభజనకు ముందు ఏర్పాటయిన రాజ్యాంగపరిషత్తును రద్దు చేయించాడు. కేంద్ర మంత్రివర్గంలో డా॥ ఖాన్ సాహెబ్‌వంటి ఇతరులకూ, ఇద్దరు సేనానులకూ స్థానం ఇప్పించాడు. ఇండియాతో సత్సంబంధాలను నెలకొల్పుకొనటం తమ ఉద్దేశమని ప్రకటించాడు. ఖాన్ సాహేబ్ నాయకత్వాన కాశ్మీర్‌మీద ఇండియాలో చర్చించటానికి పాకిస్థాన్ మంత్రులు రానున్నారని వార్తలు వస్తున్నవి.

ఈ నవంబరులోనే అమెరికన్ కాంగ్రెసు ఎన్నికలు జరిగి, డెమాక్రాట్‌లు మెజారిటీగా వచ్చారు. కాశ్మీర్‌లో ఇండియా విధానం వేలు పెట్టి తప్పు ఎంచటానికి వీలు లేదని ఆపార్టీ ప్రముఖులు బౌల్స్ వంటివాళ్ళు చెపుతుండటం ఒక విశేషం, రిపబ్లికన్‌ల ఓటమి అమెరికా స్వదేశ రాజకీయాల్లోకూడా మంచిదేనని చెప్పారు. దానివల్ల అక్కడ మెకార్ధీ విధానం కొంతవరకయినా అంతరించిపోతుంది.

చైనా మీద విరోధంతో అమెరికా ఆగ్నేయాసియా ఒప్పందం ఒకటి ఏర్పాటు చేసింది. అందులో పాకిస్థాన్ మినహా, ఆప్రాంత దేశాల్లో చెప్పుకోతగ్గది ఒక్కటీ చేరలేదు. పశ్చిమ జర్మనీని సాయుధం చేయటానికి పశ్చిమ రాజ్యాలు పారిస్, లండన్ ఒప్పందాలను కుదుర్చుకున్నవి. వీటిని నివారించటానికి రష్యాచేస్తున్న ప్రయత్నాలు కలిసి రావటంలేదు.

మధ్యప్రాచ్యంలో పశ్చిమరాజ్యాలకు కాలం అనుకూలంగా వున్నది. పర్షియా నూనె సమస్య వాటికి అనుకూలంగా పరిష్కారం అయింది. ఈజిప్టు నుంచి బ్రిటిష్ సేనలు వెళ్ళిపోబోతున్నా, అవసరమయితే తిరిగి వచ్చేందుకు వీలుగా ఒప్పందం కుదిరింది. ఇరాక్ టర్కీతో సహా మధ్యప్రాచ్య ఒప్పందం ఏర్పడాలన్న అభిప్రాయం వెల్లడించింది కాని, దాని సాఫల్యంపట్ల బ్రిటిష్ విదేశాంగ మంత్రే సందేహం వెల్లడించారు.

ఈ సంవత్సరంలో అంతర్జాతీయ రాజకీయాల్లో చెప్పుకోతగ్గ మరొక్క విషయం దక్షిణ అమెరికా ఖండంలోనే పశ్చిమరాజ్యాల విముఖత బయలుదేరటం. బ్రిటిష్ గయానాలో అభ్యుదయ ప్రభుత్వం ఏర్పడితే, బ్రిటన్ సాయుధ బలంతో దిగలాగించవలసివచ్చింది. అమెరికా పెట్టుబడిదార్లనూ, గుత్తవ్యాపారస్తులను ప్రతిఘటించి సోషలిజం వైపుకు నడుద్దామని గ్వాటెమాలా ప్రయత్నించగా, అమెరికా తన తాబేదార్లచేత దండయాత్ర జరిపించి, బాహాటంగా ఆప్రభుత్వాన్ని కూలదోయించవలసివచ్చింది. అమెరికా వ్యాపార వలస విధానాలను అర్జంటీనావంటి దక్షిణ అమెరికా దేశాలు గట్టిగా ప్రతిఘటిస్తున్నవి. ఇవి గ్వాటెమాలా మాదిరి సోషలిస్టుగా మారకపోయినా, అమెరికా, బ్రిటన్ల పెత్తనానికి స్వస్తి చెప్పటానికి ఏక్షణంలోనయినా ప్రయత్నించవచ్చు. ఇదే జరిగితే, ఆదేశాలు ప్రపంచంలో తమకు గల అగ్రస్థానం నుంచి కిందికి పడిపోకతప్పదు.



# పరిచయము

ఆంగ్ల వాఙ్మయములో పరిచయము :

<u>శ్రీ చార్లెసు డికెన్సు</u>

1 డేవిడ్ కాపర్‌ఫీల్డు.
2 ఆలివరు ట్విస్టు
3 నికలస్ నికల్‌బి
4 పిక్‌విక్ పేపర్లు.
5 రెండు నగరాలకథ.
6 గ్రేటు ఎక్సుపెక్టేషన్సు.

మిస్ జేను ఆస్టిను :— (స్త్రీరచయిత)

1 ప్రయిడ్ అండ్ ప్రిజుడిసు
2 సెన్సు అండ్ సెన్సుబిలిటీ
3 మాన్సుఫీల్డుపార్కు
4 ఎమ్మా.

పర్లబక్ :— స్త్రీ రచయిత

1 దీ గుడ్‌ఎర్తు
2 పెవిలియన్ ఆఫ్‌వుమను
3 డ్రాగన్ సీడు.
4 అమ్మ.
5 ది పేట్రియాట్
6 మిగిలిన దేవుండ్లు.

## మతములతో పరిచయము.

| | | |
|---|---|---|
| మతము | ... | మతగ్రంథము |
| హిందూమతము | .... | భగవద్గీత. |
| ఇస్లాంమతము | .... | ఖురానెషరీఫ్ |
| క్రైస్తవమతము | .... | బైబిలు |
| బౌద్ధమతము | .... | ధమ్మపాద. |
| సిక్కుమతము | .... | ఆది గ్రంథము. |

## మతశాస్త్రులతో పరిచయము :—

1 అనాశ్రితః కర్మ ఫలం
కార్యం కర్మ కరోతియః
ససన్న్యాసీచ యోగీచ
ననిరగ్నిర్న చాక్రియః

ఫలము ఆశించ కుండా తన ధర్మమును నెరవేర్చు వాడే నిజమైన విరాగి - సర్వసంగ పరిత్యాగి - భగవద్గీత
(అ 6. శ్లో.)

2 వల్ - వజ్ను - యౌ - ను ఇ - జినిల్ - హఖ కీఖ - ఫమ్స - సఖులత్ - మనో - జీనుహూ - ఫఉలా ఇక - హుముల్ - ముష్‌ఫ్‌లి - హూన్.

తాత్పర్యము :— తీర్పు దినమునందు మానవుల కర్మలు తూచబడును. భక్తిపూర్వకముగ జేసిన కర్మలు బరువు గలవిగా నుండును. మరియు ఆదినమున కర్మల తూనిక నిత్యముగా జరుగును.

ఖురాన్

3 ధర్మము దానము రహస్యముగా చేయవలయును. దైవప్రార్ధనయు అంతే. అప్పుడే భగవంతుడు నిన్ను మెచ్చి బహిరంగముగా ప్రతిఫలము నివ్వగలదు.

— బైబిలు
సేంటు మేత్యూ

4 మనస్సే మానవ గుణమును త్రిజగములలో నిర్ణయించ గలదు.

ధమ్మపాద — 37 అ.

## ఇది అరవముకాదు

ఫైలాటాలిక్ —
ఫైలోజాయిక్ —
ఫోనోటిక్ —
ఫెమనిస్టు —

## ఇది మళయాళముకాదు.

ఫీబాలజీ —
సైకాలజీ —
ఫైలాలజీ —
ఫైలోగ్రైయినీ — ఫైలోగోఫీ

## ఇది కన్నడముకాదు

ఫైలో మేటిక్ —
ఫైలో మ్యూజికల్ —
ఫైలో పొలిమిక్ —
ఫైలో ఫొజెనిటిక్ —

# పరిచయము

ఇవి :—మనము నేర్చుకొనక తప్పని పదజాలము.

1 ఫైలాటాలిక్ — తపాల బిళ్లలమోజు.
2 ఫైలోజోయిక్ — భాషల మీదిమోజు
3 ఫోనోటిక్సు — శబ్దముల విద్య
4 ఫెమనిస్టు — స్త్రీలకు పురుషులతో పాటు సమాన హక్కులుండవలెననువారు
5 ఫీజాలజీ — నరముల శాస్త్రము
6 సైకాలజీ — మానసిక శాస్త్రము
7 ఫైలాలజీ — భాషల శాస్త్రము. భాషా తత్వ పరిశీలన.
8 ఫైలోగైయినీ — స్త్రీలమీద మోజు
9 ఫ్రినాలజీ — పుర్రెశాస్త్రము
10 ఫైలోమేటిక్ — విద్యమీద మోజు
11 ఫైలోమ్యూసికల్ — సంగీతముమీద మోజు
12 ఫైలోపొలోమిక్ — తర్కముమీద మోజు
13 ఫైలోఫోజెనిటిక్ — పిల్లలమీద మోజు

## మేధావుల పోకడలు

"పతనమైన గౌరవాన్ని తిరిగిరాబెట్టు కొనుట దుష్కరము"

మొపాసా —

ఐహిక ఫలకాంక్షతోగాని యాముష్మిక ఫలకాంక్షతో గాని భగవంతుని భజించుట మంచిదే. కాని యంతకంటె నిర్హేతుకముగా భగవంతుని భజించుట మేలు. ........

వివేకానంద.

సుఖాలన్నీ ఒకేతీరు. దుఖాలన్ని అన్నిరకాలు. విధాలునూ

టాల్‌స్టాయ్.

"విజయము సాధించగలవాడే క్షమించ గలుగుతాడు"

తుకారాముడు.




శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ

## చారుదత్త

'నాటకాంతం సాహిత్యమన్నారు' సాహిత్యంయొక్క పరిపూర్ణ పరిణామం నాటకంతో పొందుతుందన్న మాట. అనుచేత నంటే మానవ సంఘంలోని వివిధ వ్యక్తుల స్వభావములను గ్రహించి తదుచిత పదజాలముతో ఒక నాటకమునందు వచ్చు పాత్రలను సృష్టించుట కష్ట సాధ్యము. ఇది యొక కళ. ఇది యందరికిని సులభ సాధ్యమగునది కాదు.

కవి సంఘములో సామాన్య మానవుడై జీవిస్తూ తనను కల్పించే సమస్యలకు వుత్తేజితుడై తన మనోగత భావములను వ్యక్తపరుచుటకు తగిన పదజాలమును యేర్పరుచుచూ సాహిత్యమును సృష్టించును. తన భావములను తన భాషతో వ్యక్తపరచుట యొక యెత్తు. వివిధవ్యక్తులకు మనోగత భావములను వెల్లడించుచూ ఆయా పాత్రములకు తగిన భాషను వుపయోగించి పాత్రలను సృష్టించుట కష్టము కాదా?

ఈ కవయిత్రి యాంధ్రపాఠక లోకమునకు చిరపరిచితురాలే. ఈమె దేవి భాగవతము, కాదంబిని, దేవుడు, సప్తశతి, మున్నగు వుత్తమ గ్రంథముల ననుసరించి స్వతంత్రరచనలు సాగించినారు. అనువాద సాహిత్యము అన్నిటికన్న కష్టముతో గూడిన పని, దీనికి ప్రతిభా, సామర్థ్యము మిక్కిలి యవసరము.

ప్రస్తుత నాటకమయిన చారుదత్తమునకు మూలము భాసునిది. భాసుడు చారుదత్తునిగాని, వసంతసేననుగాని మైత్రేయునిగాని సృష్టించునప్పుడు ఆయా పాత్రముల కనుగుణమైన భాషను సంస్కృతమున వాడియున్నారు. అందు యాతడు సృషించిన పాత్రముల మనోగతభావములు, శీలము. ప్రస్ఫుటముగ ప్రకటిత మైనవి. చారుదత్తుడు ధీరశాంతుడైన బ్రాహ్మణ కులమునకు జెందిన కథానాయకుడు, తన గుణ సంపద చేతను, శాంతస్వభావము చేతను, విధివశమున ప్రాప్తించిన యిక్కట్టుల నెన్నియో నెదుర్కొని, గుణహీనులను గుణవంతులుగా మార్చి తనకపకార మొనర్చిన వారలను గూడ క్షమించి విడిచి పుచ్చిన యుదారహృదయుడు. అట్టి నాయకునిగాని, అట్టి నాయక పాత్రకుపకరించు వుపపాత్రలు గాని, రుక్మిణమ్మగారు రచించిన చారుదత్తము నందు కానవచ్చుట లేదు. అయినప్పటికిని వున్నతమయిన యీమె సాహిత్య కృషి పాఠకుల ప్రశంశలనందుకో తగి యున్నది.

డి. సుందరీ . కరం.

## పూ ప పిం దె లు

రచన : లవణంగారు

ప్రకాశకులు : తెలుగు బాల రచయితల సంఘం.

దొరకుస్థలం ; నాస్తిక ప్రచురణాలయం పటమట. కృష్ణా జిల్లా

వెల : 0—4—0

ఇందలి పాటలు పిల్లలకు సులభంగా అర్థమయ్యే భాషలో రచింప బడినవి. ఒక్కొక్కపాట, ఒక్కొక్క ఆశయంతో వ్రాయబడి ఉన్నది. ఒకటి దేశభక్తి యల పరుచుటకు, వేరొకటి దేశచరిత్ర గరపుటకు, మరొకటి భూగోళశాస్త్రపాఠం, ఇంకొకటి చిన్నకథ.... ఈవిధంగా పాటలతోనే పిల్లలకు ఎంతో ఆనందం చేకూర్చేలా ఉంది. తమ బాలలు ఈ పాటలు పాడు కుంటూంటే పెద్దలకు ఆనందం చేకూర్చేలా ఉంది.

పిల్లలు, పెద్దలు అందరూ తప్పక చదువవలసిన పుస్తకము.



Edited by Mrs. K. Lakshmi Raghuram, B.A.,
Printed & Published by Mrs. A. C. Krishna Rao, M.A., L.T.,
at the Andhra Mahila Press, Mylapore, Madras 4.



శివరావుకమిటీ, ఆంధ్ర మహిళాసభను చూచుటకువచ్చిన సందర్భంలో తీసిన ఛాయాచిత్రం.





ఆంధ్ర మహిళా సభ నృత్యశాఖ :
రతీ మన్మధుల నృత్యంలో
కుమారి దువ్వూరి రాధ,
గొల్లకోట శ్రీమణి.

అతి త్వరలో!





ఈస్టిండియా వారి

పక్కింటి అమ్మాయి




అంజలి · రేలంగి ·

డైరెక్టర్ · సి. పుల్లయ్య

# ఆంధ్రమహిళ

సంపుటి 10 :: డిశంబరు '53 :: సంచిక 8




వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే.,బి.యెల్.,
సంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే.,యెల్.టి.,

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్,
మద్రాసు—4

...త్సరచందా :: ఆరు రూపాయలు.




సంపుటి 10 :: డిశంబరు '53 :: సంచిక 8

# కర్తవ్యం

———:o:———

"ఏలమల దపించు గ్రామసీమలకు( చెండు- జీవితానందమయ ఝురీజీవనముల" ("Bring the flood tide of life's joy to the arid villages") ఇదే మన కర్తవ్యం. ఇదే మహాత్మాగాంధి కలలు గాంచిన రామరాజ్యం. ఈ ఆశయసిద్ధికే ప్రభుత్వోద్యోగులు, ప్రజలు ప్రయత్నించవలసియుంది. రాళ్ళసీమ అయిన రాయలసీమను మరల రత్నాలసీమగా మార్చవలసియుంది. అన్నదాతయైన ఆంధ్రమాతను అష్టైశ్వర్య సంశోభిగా జేయవలసియుంది. ఈ సందిగ్ధ సమయంలో ప్రభుత్వభారం వహించే పెద్దలకు, వారికి పూర్తి సహకారాన్నిచ్చి తోడ్పడ వలసిన ప్రజలకు "ఆంధ్ర మహిళ" అందిచ్చే సందేశంకూడ యిదే.

40 ఏళ్ళుగా అలజడి జరిపి ఆంధ్రరాష్ట్రమతల్లిని విడిపించుకున్నారు- ఆమె బిడ్డలు (ఉమ్మడి కుటుంబంలో ఆమెకు అన్యాయం జరుగుతుందనీ— వేరుపరచి ఆమెను సర్వాంగశోభితురాలునిగా చేసి, భారతమాత బిడ్డల్లోనికల్లా అల్లారుబిడ్డగా ముస్తాబుచేయాలనీను.) ఈ ఆశయసిద్ధికే అక్షరాలా ఆంధ్రులదైన చెన్నపట్టణాన్ని ధారబోసేం. బళ్లారి ప్రాంతంలో తోటి సోదర-సోదరీమణుల్ని విడుచుకున్నాం. తెలంగాణాలోని తెలుగు బిడ్డల్ని అట్లే ఉంచేం. ఇలా అనేక త్యాగాలు చేసేం. ఆఖరుకు అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాముల్ని అఖండ బలిగా సమర్పించేం 'మన ఆంధ్ర రాష్ట్రం' అంటూ ఒక ఆకారంలోకి తెచ్చుకోడానికి.

ఆవెనుక చర్చించి- చర్చించి దేశసేవలో ఆరి-తేరి-పండి- ఫలించిన శ్రీ ప్రకాశంగార్ని ప్రధానామాత్యులుగా అన్నదమ్ముల సమైక్యభావంతో, నియమించుకున్నాం. ప్రస్తుత రాజధాని ఒకటి కావాలని చర్చించి అదీ స్థిరపర్చుకున్నాం. అన్నివర్గాలవారి సాకారసానుభూతుల్నీ పొందగల చక్కటి మంత్రివర్గాన్ని ఏర్పరచుకున్నాం. విజయనామ సంవత్సర బాద్రపద బహుళ నవమి గురువారంనాడు శుభముహూర్తం పెట్టుకొని ఆంధ్రరాష్ట్రమంతటా రాష్ట్ర జన్మదినోత్సవాలు జరుపుకున్నాం. మొన్ననే కార్తీక కృష్ణ తదియ సోమవారం ప్రప్రధమంగా ఆంధ్ర శాసనసభ సమావేశం, ప్రమాణ స్వీకరణం, అధ్యక్ష- ఉపాధ్యక్షుల ఎన్నికలు, ఇత్యాది కార్యకలాపాలన్నీ ఆంధ్రంలో జరుపుకుని ఆంధ్రుల చిరకాల వాంఛ నెరవేరినట్లే ఆనందించేం.

ఐతే ఈ ఆనందాతిశయాల్లో ముఖ్య కర్తవ్యాన్నీ, మనం ఏ ఆశయాలతో రాష్ట్రం కావాలన్నామో, ఆ గమ్యస్థానాన్ని మరచిపోరాదు. ఈ ఆశయసిద్ధికి ఆంధ్రులంతా ఒక్క కుటుంబంలోని వారుగా ఐక్యమత్యంతో ప్రవర్తించి, తోటి రాష్ట్రాలన్నిటిమెప్పూ పొందవలసియుంది. వారికి మార్గదర్శకులం కావలిసియుంది.

ఆంధ్రమాతకు అపూర్వమైన సహజసంపదలున్నాయి. ఆంధ్రరాష్ట్రం అన్నప్రదాత అన్నారందరూ. ఈమధ్య అన్నపూర్ణ యింటిలో అన్ని సిరిసంపదలూ ఉన్నాయి. ఆంధ్రమాతకు పుష్కలమైన పాడి—పంటలు సౌభాగ్యం, నిత్య

పుష్కరిణులైన నదీ నదాల సౌందర్యం, అంచనావేయని అటవీ— ఖనిజసంపదలు, ఇత్యాది ప్రకృతి సిద్ధమైన లక్ష్మీ సంపదలెన్నైనా ఉన్నాయి. వీటికన్నిటికీమించిన రత్నాలు, 2 కోట్ల పైచిలుకు మానవ బలగం ఉంది. ఈ దైవ ప్రసాదిత ప్రకృతి సంపదల్ని పూర్తిగా సద్వినియోగం చేసుకుంటే, ఆంధ్ర బిడ్డలు భారతావని కంతటికీ ముద్దుబిడ్డ లౌతారు.

ఇందుకే మనం అలజడి చేసింది, త్యాగాలుగావించింది, ఆంధ్రరాష్ట్రమని యేర్పరచుకొన్నదీని. పల్లెపల్లెలా వాడవాడలా ఈ సందేశం వ్యాపించాలి. రాష్ట్రమంతటా శాంతి— భద్రతలు, సౌహార్ధం— సమరసభావాలు హెచ్చించాలి. అన్యోన్యసహకారంతో అనేక ఘనకార్యాలు సాధించవచ్చు. ప్రజలందరికీ పాడి—పంటలు, కూడు—గుడ్డలు, విద్య—వినోదాలు, వసతి— వాణిజ్యసౌకర్యాలు కలిగించాలి. అన్ని ప్రాంతాలవారినీ సంతృప్తిపరచటానికి మనమింకా విశేష ప్రేమ- సేవ— త్యాగ— సౌహార్ధభావాలు అలవరచుకోవాలి. కలిసి కట్టుగా రాష్ట్ర క్షేమం కోసరం, మనం ఏర్పరచు కొన్న ఆశయసిద్ధికోసరం కృషిచేయడం నేర్చుకోవాలి. అంతా ఐకమత్యంతో కృషిచేస్తే సాధించలేనిదేమీలేదు. పరిష్కరించలేని సమస్యే ఉండదు.

"సర్వేజనో సుఖినోభవంతు" అని పెద్దలు ఆశీర్వదిస్తారు. తదాస్తు— అని "ఆంధ్ర మహిళ" కూడ అంటూయుంది.

"దేశానర్థము వాపి దేశహితమర్థిం గూర్పగ న్మండలా
ధీశత్వాద్యధికార ధూర్వహులుగా నేర్పడ్డ ధన్యాత్మకుల్
దేశస్తుల్యమ దేశవృద్ధి మది నుద్దేశించి కావించు నా
దేశక్షేమ విధాన యత్నములు సిద్ధింబొందఁ దోడయ్యెడున్."



# చిన్న మొత్తాలు నిల్వచేసే ఉద్యమంలో స్త్రీల తోడ్పాటు

నవంబరు 24 న: ఢిల్లీలో, చిన్న మొత్తాలు కూడబెట్టే అలవాటును స్త్రీలలో వ్యాపింపచేయడానికి తీసుకొన్న చర్య లనుగూర్చి స్మాల్ సేవింగ్స్ కేంద్ర సలహాసంఘంవారు ఈ వేళ చర్చించారు. సలహాసంఘం అధ్యక్షురాలు శ్రీమతి హానా సేన్ అగ్రాసనాధిపత్యం వహించింది.

శ్రీమతి దుర్గాబాయ్ దేశముఖ్ మాట్లాడుతూ ఇది వరలో స్త్రీలు ఐచ్ఛిక సంక్షేమ కార్యకలాపాల్లో పాల్గొంటూ వచ్చారని, ఇప్పుడు చిన్న మొత్తాలను కూడ బెట్టే ఉద్యమానికి తోడ్పడడంవల్ల వారి కార్యకలాపాలు ఆర్థిక రంగంలోకి విస్తరించాయని అన్నారు.

శ్రీమతి హానా సేన్ మాట్లాడుతూ గతమాసం ఈ ఉద్యమం ప్రారంభమయినప్పటినుండి నేషనల్ సేవింగ్స్ కమిషనరు ఏజంటుగా పని చేయడానికి 37 రిజిస్టర్డు సంక్షేమ సంస్థలనుంచి దరఖాస్తులు వచ్చాయి. వీటిలో 9 సంస్థలకు నేషనల్ కమిషనరు అనుమతి యిచ్చాడు. తక్కిన దరఖాస్తులు విచారణలో వున్నాయి అని అన్నారు.

నేషనల్ సేవింగ్స్ కమిషనరు సహాయంతో ప్రచార కులను తర్ఫీదు చేయడం అత్యవసరమని సంఘం వారు భావించారు. ఒక మాసం లోపుగా యిట్టి శిక్షణ ప్రారంభించాలని నిర్ణయించారు.

ఈ కృషికి భారత ప్రభుత్వ ఆర్థికశాఖ సంపూర్ణంగా తోడ్పడుతుందని ఆ శాఖ డిప్యూటీమంత్రి గుహాగారు వాగ్దానం చేశారు.





# రాజకీయాలు

* శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు. *

అక్టోబర్ నాలుగోవారం మొదలుకుని నవంబర్ మూడోవారంవరకూ జాతీయ, అంతర్జాతీయ రాజకీయ సంఘటనల్లో ముఖ్యమైనవి ఇవి — పాకిస్థాన్‌తో సైనిక ఒప్పందం చేసుకునేందుకు అమెరికా బాహాటంగా సంప్రదింపులు ప్రారంభించటం. పశ్చిమరాజ్యాల సామ్రాజ్య వాదాన్ని నెహ్రూ, సుకర్నో ప్రభృతులు నిరసించటం, కొరియాలో యుద్ధఖైదీల సమస్యల్లో అభివృద్ధి లేకపోవటం, అగ్రనాయక సమావేశం విషయమై ప్రయత్నాలు, భారత రాజ్యాంగంలో సవరణలు చేసేవిషయమై నెహ్రూ సమాలోచనలు జరపటం, ఆంధ్రరాజకీయాల్లో అస్థిరత్వం మరింత పెరిగిపోవటం.

* * *

కమ్యూనిస్టుదేశాల చుట్టూ తనసైనిక స్థావరాలతోనింపివేసి లొంగదీసుకు రావాలని అమెరికా చేస్తున్న ప్రయత్నాలు ఈ నెలలో మరొక అడుగుముందుకు సాగిన తమ సేనలకు అమెరికా ఆయుధాలు సప్లయిచేస్తే, తన భూభాగంలో అమెరికాకు యుద్ధ స్థావరాలు ఇవ్వటానికి పాకిస్థాన్ సిద్ధంగా ఉన్నదనీ, ఈవిషయమై వాషింగ్టన్‌లో సంప్రదింపులు జరుపుతున్నవనీ వార్తలు వచ్చినవి. ఆయుధ సహాయం విషయంలో సంప్రదింపులు జరుగుతున్నమాట నిజమే కాని, స్థావరాల విషయమై చర్చించటంలేదని అమెరికన్ అధికారులు ప్రకటించారు. ఈ సంప్రదింపుల పట్ల ప్రధానినెహ్రూ నవంబర్ 15 వ తేదీన ఢిల్లీ విలేఖరులతో మాట్లాడుతూ ఇండియా ఎంతో ఆందోళనపడుతున్నట్లు తెలియజేసారు.

పాక్ — అమెరికన్ సంప్రదింపులు యావత్తు దక్షిణాసియా పరిస్థితులను, ముఖ్యంగా ఇండియా—పాకిస్థాన్‌ల సంబంధాలనూ తలకిందులు జేయగలవని నెహ్రూ హెచ్చరించారు. ఈ విషయమై తాము విదేశీ రాయబారులతో కూడా సంప్రదించి ఉన్నామనీ, పాకిస్థాన్ తాను ఆక్రమించుకుని ఉన్న కాశ్మీర్ భూభాగంలో అమెరికాకు స్థావరాలివ్వటానికి వీలులేదనీ ప్రకటించారు. కాశ్మీర్‌నాయకులంతా పాకిస్థాన్‌ను విమర్శిస్తూ, వాళ్ళఆటలను సాగనిచ్చేదిలేదని స్పష్టపరిచారు. ఈ ప్రకటనలకు పాకిస్థాన్ అధికారులు, పత్రికలు మండిపడటం జరిగింది. నెహ్రూ హెచ్చరికను మనసులో పెట్టుకుని ఇండియాలో భయోన్మాదాలు వ్యాపిస్తున్నవనే అభిప్రాయాన్ని ఐసెన్‌హోవర్ వెల్లడించారు.

నార్వే. డెన్మార్క్, పశ్చిమజర్మనీలు మొదలుకుని దక్షిణకొరియావరకూ అమెరికన్లు, వాళ్ళఆశ్రితులు కమ్యూనిస్టుదేశాల చుట్టూ యుద్ధ స్థావరాలను ఏర్పాటు చేశారు. అయితే మధ్యప్రాచ్యంలోను, దక్షిణాసియాలోను ఈ శ్రేణికి తగినబలం లభించలేదు. ముస్లిం దేశమయిన టర్కీనిచూపి అరబ్‌రాజ్యాలను రక్షణవ్యవస్థలోకి లాగాలని అమెరికా ప్రయత్నించింది కాని, ప్రత్యక్షంగా తమను దోచుకుంటున్న పశ్చిమరాజ్యాలతో చేయికలపటానికి అవి అంగీకరించలేదు. ఈవార, అమెరికా, బ్రిటన్లు పర్షియాలో విజయం సాధించినవి. ఇంక గిల్గిట్ మొదలైనవి సంపాదించటానికి పాకిస్థాన్‌తో బాహాటంగా సంప్రదింపులు మొదలుపెట్టినవి. దీనికి చైనా, రష్యాలు ఊరుకోవు. అప్పుడు కాశ్మీర్ మరొక కొరియా అవుతుంది. అదీకాక, ఇండియా, పాకిస్థాన్ల సంబంధాలే అంతంత మాత్రంగా ఉన్నప్పుడు అమెరికా జోక్యం మరింత ప్రమాదకరం.

ఉత్తర, దక్షిణ అమెరికా ఖండాలు రెండింటిలోనూ ఇతరుల జోక్యాన్ని సహించలేదని 'మనోసిద్ధాంతా'న్ని అనుసరిస్తున్న అమెరికా, ఎక్కడో కొరియాలో యుద్ధం

జరిగితే అమాంతంగా అందులోకి దూకిన అమెరికా, చైనాకు ఫార్మోజా ఇస్తామని ప్రెసిడెంట్ రూజ్వెల్ట్ చేసుకున్న ఒప్పందాన్ని భగ్నపరచిన అమెరికా, తన పొరుగు దేశంలో గూడుపుఠానీలకు ఆందోళన పడిన ఇండియాను ఆక్షేపించటం ఎట్లా ఉన్నదో వేరే చెప్పనవసరంలేదు.

* * *

అయితే అమెరికా ఆలోచనలు బ్రిటన్‌కే నచ్చటంలేదు. తాము పాకిస్థానుకు కావలసిన ఆయుధా లివ్వటానికి ఎప్పుడూ సిద్ధంగానే ఉన్నామనీ, ఇప్పుడావిషయమై సంప్రదింపులు ఆశ్చర్యకరంగా ఉన్నవనీ బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధులు సూచించారు. పాకిస్థాన్‌ను బలపరచటానికి బ్రిటన్ సంసిద్ధత మితిమీరిపోతున్నదని భారత ప్రధాని లోగడ హెచ్చరించే ఉన్నారు.

పండిత నెహ్రూ ఢిల్లీ విలేఖరుల సమావేశంలో మరొక హెచ్చరికకూడా చేశారు. సామ్రాజ్యవాదుల్లో దురాశ పెరిగిపోతున్నదనీ, వలసలకు స్వపరిపాలన ఇవ్వాలనీ గత యుద్ధానంతరం ఏర్పడ్డ అభిప్రాయాలు అంతరించిపోయినవనీ ఆయన అన్నారు. గయానా, కెన్యా, మధ్యఆఫ్రికా, సూడాన్, మలయా, ఇండోచైనాలలోనూ, ఇండియాలోని ఫ్రెంచి పోర్చుగీస్ స్థావరాలలోను ఇది స్పష్టపడుతున్నది.

ఇండోనీషియా అధ్యక్షుడు డా॥ సుకర్నో నవంబర్ 10 వ తేదీన జకర్తాలో మాట్లాడుతూ, ఇండోనీషియాలో తిరుగుబాటు జరుపుతున్న దారుల్ ఇస్లాం వాదులు ఇండోనీషియాను కమ్యూనిస్టేతర ముఠాలోకి లాగటానికి ప్రయత్నిస్తున్నారని బహిరంగంగా ఆరోపించారు. కమ్యూనిస్టేతర ముఠాలోకి లాగటం దేనికంటే, మరొక యుద్ధాన్ని తీసుకువచ్చి ఆ గంద్రగోళంలో అధికారం సంపాదించాలని వాళ్లు ఉద్దేశిస్తున్నారని సుకర్నో అన్నారు. పశ్చిమ రాజ్యాలు తయారుచేస్తున్న కమ్యూనిస్టేతర వర్గపు లక్ష్యాన్ని వివరించటానికి ఇంతకు మించి చెప్పటం అనవసరం.

♦ ♦ ♦

పశ్చిమరాజ్యాలు తమ వలసలను ఇంకా గట్టిగా తమ చేతి కిందకు తెచ్చుకొనటం, తమ మాట వినని ఇండోనీషియా, పర్షియా, బర్మా మొదలైన దేశాల్లో తిరుగుబాట్లు ప్రోత్సహించటం, ఇండియా క్షేమానికి విరుద్ధంగా పాకిస్థాన్‌ను తయారుచేస్తున్నవి. ఇంతేకాక, తమ 'రక్షణ'కు అప్పగించబడ్డ 'రక్షిత' దేశాలను, మైనర్ల ఆస్తులను దిగమింగే గార్డియన్లమాదిరి, భక్షించటానికి పూనుకున్నవి. దక్షిణాఫ్రికా నైరుతి ఆఫ్రికానూ, బ్రిటన్ పశ్చిమాఫ్రికాలోని టోగోలాండ్‌నూ ఈవిధంగా భుక్తం చేసుకో జూస్తున్నవి. బ్రిటన్ గోల్డ్‌కోస్ట్ ప్రభుత్వం చేత ఈపని చేయిస్తున్నట్లు టోగోలాండ్ ప్రజా ప్రతినిధులిద్దరు సమితి ధర్మకర్తృత్వ సంఘానికి ఫిర్యాదు చేశారు. దీనిమీద జరిగిన చర్చలో భారత ప్రతినిధి శ్రీమతి లక్ష్మీమీనన్ మాట్లాడుతూ ఈనాడు పాలక రాజ్యాలు తమకు అప్పగించబడ్డ 'రక్షిత' రాజ్యాలను భక్షిస్తూ ఉంటే ఐక్యరాజ్య సమితి ఉపేక్షించి ఊరుకుంటున్నదని ఆఫ్రికా, ఆసియా ప్రజలు భావిస్తున్నారని వెల్లడించింది.

స్వపరిపాలన లేని దేశాల విషయమై ఈమె మరొక పాలక దేశం— అమెరికా—తో సంఘర్షణకు దిగవలసి వచ్చింది. అమెరికా ఆగ్నేయాంతరంలో ఉన్న పోర్టోరికో ద్వీపం విషయంలో ఈ సంఘర్షణ వచ్చింది.

ఈ ద్వీపం జనాభా 19 లక్షల్లో అత్యధిక సంఖ్యాకులు స్పానిష్ జాతీయులు. అమెరికా పాలన కింద చాలా సం॥ల నుంచీ ఉన్నప్పటికీ జనాభాలో చదువురాని వాళ్లు 100931 మంది వరకూ ఉన్నారు. ఉన్న చెరకుతోటలు ముప్పాతిక మువ్వీసం ఎక్కువమంది జనం అమెరికన్ నగరాల్లో చాకిరీచేసి పొట్టపోసుకుంటారు. 1946 లో స్పానిష్‌ను ప్రభుత్వ భాషగాచేస్తూ శాసనసభ తీర్మానించగా ప్రెసిడెంట్ ట్రూమన్ దానిని తోసిపారేశారు. భూసంస్కరణల చట్టం ఒకటి 1946 లో ప్రవేశపెట్టటం జరిగింది కాని అంత ప్రయోజనకారి కానందువల్ల అమెరికాలోనూ, బయటా కూడా విమర్శించబడ్డది.

అసంతృప్తులయిన పోర్టోరికో ప్రజలిద్దరు 1950 నవంబర్ 15 తేదీన ట్రూమన్‌ను హత్యచేయ ప్రయత్నించి విఫలులయినారు. 1951 జూలై 25 న 'అంతరంగిక స్వపరిపాలన'తో 'పోర్టోరికో కామన్వెల్తు' ఏర్పాటయింది.

ఇది ఇప్పుడు స్వపరిపాలనగల దేశం అయింది గనుక దీనివిషయమై అమెరికా ప్రభుత్వం సమితికి చేయక్కర లేదని సమితి ఉప సంఘంలో ప్రతిపాదనరాగా భారత

ప్రతినిధి ప్రతిఘటించింది. దీనిమీద అమెరికా ప్రతినిధికి ఆక్రోశం కలిగి 'ఇండియా కింద అండమాన్, నికోబార్ దీవులు లేవా?' అని విమర్శించింది.

*　　*　　*

కొరియా యుద్ధఖైదీలకు నచ్చచెప్పటంలో అభిప్రాయ భేదాలు వచ్చి కార్యక్రమం నిల్చిపోయింది. రాజకీయసమావేశపు ఏర్పాట్లపై చర్చ జరుపుతున్న ఉభయ ప్రతినిధులకు సమాధానం కుదరటంలేదు. గడువులోపల ఒప్పందం కుదరకపోతే కొత్తయుద్ధ విరమణ ఒప్పందం చేసుకోవటం అవసరమని ప్రధాని నెహ్రూ సూచించగా అమెరికా ప్రతిఘటించింది. బ్రిటన్ ప్రక్కతాళం వేస్తున్నది.

అంతర్జాతీయ వైరుధ్యాలను పరిష్కరించటానికి అగ్రరాజ్యాలు సమావేశంకావాలని ఇండియామొదలైన దేశాలు సూచించినవి. కమ్యూనిస్టు చైనాతోసహా ముందు అయిదు అగ్రరాజ్యాలు కలుసుకుని ముఖ్యసమస్యలను చర్చించాలనీ, ఆపైనమిగిలిన నాలుగుదేశాలు జర్మనీ సమస్యను చర్చించాలనీ రష్యాచేసిన ప్రతిపాదనను పశ్చిమరాజ్యాలు నిరాకరిస్తూ, ముందు జర్మనీ సమస్యను చర్చించాలని సూచించినవి. మూడుపశ్చిమరాజ్యాల నాయకులు డిసెంబర్ మొదట్లో బెర్ముడాలో కలుసుకోబోతున్నారు.

అయితే బ్రిటన్, ఫ్రాన్సులకు మాత్రం రష్యాతో సంప్రదించాలన్న సంకల్పం బలంగాఉన్నది. తాను సోవియట్ ప్రధానిని కలుసుకునేందుకు చర్చిల్ ఉద్దేశిస్తున్నట్లు తెలుస్తున్నది.

*　　*　　*

ప్రజా స్వామ్యాన్ని గురించి ధర్మపన్నాలు చెప్పే బ్రిటన్ సూడాన్‌లు అన్యాయానికి ఒడిగడుతున్నది. సుడాన్ భవిష్యత్తును నిర్ణయించటానికి మొదటి మెట్టుగా ఏర్పాటయే తాత్కాలిక పార్లమెంటు ఎన్నికల్లో చాలా అక్రమాలు జరిపిస్తున్నది. పైపెచ్చు ఈజిప్టు మీద దురారోపణలు చేస్తున్నది. ఈ ఎన్నికల ఏర్పాట్లకు ప్రత్యేకంగా పిలిపించబడ్డ భారత ఎన్నికల కమీషనర్ సుకుమారసేన్ ఈ ఎన్నికలు ఒక ఫార్సుగా ఉన్నవని అన్నారంటే, వేరే చెప్ప నవసరంలేదు.

*　　*　　*

భారత దేశంలో 'బి' 'సి' తరగతి రాష్ట్రాలను రద్దుచేయటం, రాజప్రముఖ్ పదవులను రద్దుచేయటం, ఆస్తిని ప్రభుత్వం జాతీయం చేసేటప్పుడు పరిహారం ఇవ్వాలన్న నియమాన్ని తొలగించటం మొదలైన సవరణలను భారత రాజ్యాంగంలో చేయాలని పండితనెహ్రూ ఉద్దేశిస్తున్నట్లూ, ఆవిషయమై వివిధరాష్ట్రాల ముఖ్య మంత్రులను, రాజ్యాంగ నిపుణులను సలహా కోరినట్లు తెలుస్తున్నది. రాజప్రముఖ్‌లు తమ భరణాను తగ్గించుకోవాలని నెహ్రూ ఇంతకుముందే కోరియున్నారు.

*　　*　　*

ఆంధ్రమంత్రివర్గం కృషిక్‌పార్టీ ప్రతినిధి లచ్చన్నగారికి స్థానం ఇచ్చింది. రాజధాని విషయంలో తమవైఖరి మారలేదని ఆయన ప్రకటించటంవల్ల, ఆయన నియామకం కాంగ్రెసుపై కృషిక్‌పార్టీకి లభించిన విజయమనే చెప్పవలసివుంటుంది. ఆర్థికమంత్రి విశ్వనాథంగారు ఆంధ్రప్రభుత్వంలో ఉండవీలులేదనీ, అది కాంగ్రెసు ప్రభుత్వమేకాని మిశ్రమ ప్రభుత్వం కాదనీ ప్రజాసోషలిస్టుపార్టీ అఖిలభారత, ఆంధ్రరాష్ట్ర కార్యవర్గాలు నిర్ణయించినవి. పార్టీకో, పదవికో రాజీనామా ఇవ్వాలని ఆయనకు స్పష్టపరచినవి. ఇందువల్ల మంత్రివర్గపరిస్థితి మరింత అస్థిరమయిపోయింది.

రాజధాని కర్నూలులోనే ఉంచటమా, లేక గుంటూరు విజయవాడ ప్రాంతానికి మార్చటమా అన్న విషయమై నవంబర్ నాలుగో వారంలో ఆంధ్ర శాసనసభ చర్చించబోతున్నది. అయితే కమ్యూనిస్టేతర పార్టీల వైఖరిని చూస్తే ఆంధ్రరాష్ట్రాభివృద్ధికి గొప్ప అపకారం జరిగేట్టు కనిపిస్తున్నది. 1955 ఏప్రిల్ నాటికి శాశ్వత రాజధాని గుంటూరు కర్నూల్‌లో ఉండాలని ప్రజాసోషలిస్టులు, 1955 అక్టోబరునాటికి ఉండాలని ఇతరులు వాదిస్తున్నట్లు తెలుస్తున్నది. ఈలోపల కార్యాలయాలన్నీ అక్కడికి క్రమంగా జేరాలని కూడా చెప్పబడుతున్నదట.

ఈవార్తలు నిజమే అయితే ఆంధ్రరాష్ట్రంలో మరి రెండు సం॥ల పాటు శాంతి అనేది ఉండకుండా పోతుంది. నిలకడగా రాజధాని అనేది లేకుండా పోయి, అన్నిటి అభివృద్ధికీ ఆటంకం కలుగుతుంది. కర్నూలుకు విమానాశ్రయం ఇస్తారా అని పార్లమెంటులో ఒక ఆంధ్రసభ్యుడు అడగ్గా, శాశ్వతరాజధాని నిర్ణయంమీద అది ఆధారపడి ఉంటుందని కేంద్ర మంత్రి ఇచ్చిన జవాబు రాబోయే పరిస్థితులను స్పష్టంగా తెలియజేస్తున్నది.

మంచో, చెడో ఇప్పుడే రాజధాని తేల్చుకొనటం మంచిది. అది ఆంధ్రప్రజ లందరికీ మంచిది. కాబోయే రాజధాని అభివృద్ధికీ మంచిది. అట్లాకాకుండా ప్రస్తుతానికి బలం లేదని రెండు సం॥లు వాయిదా వేయ ప్రయత్నించటం చాలా అపచారమే అవుతుంది. 'మేము ఇప్పుడు నిర్ణయించింది తాత్కాలిక రాజధానినే. శాశ్వత రాజధానిని తరువాత నిర్ణయించుకుందాం' అని కళా వెంకట్రావుగారు సర్కార్ కాంగ్రెస్ వాదులను సంతృప్తిపరచ ప్రయత్నిస్తున్నారు. కర్నూలునుంచి రాజధాని మారిస్తే రాయలసీమలోకూడా కాంగ్రెసు అంతరిస్తుందని అక్కడి వాళ్ళు హెచ్చరిస్తున్నారు. ఈపరిస్థితులన్నిటినీచూస్తే ఒక గడువులోపల రాజధానిని నిర్ణయించాలని కేంద్రం ఆదేశించటం తప్పని సరి అయేట్లు కనిపిస్తున్నది.

ఆంధ్రరాష్ట్రానికి ఉన్న ఏకైక ఆస్తి వరిపంట. అయినప్పటికీ బడ్జట్ లోటు భర్తీచేయటానికి ఆంధ్ర ప్రభుత్వం ఆఎగుమతులమీద 'సెస్' వసూలు చేయ వీలు లేదని కేంద్ర ఆహార మంత్రి కిద్వాయ్‌గారు పార్లమెంటులో స్పష్టపరచారు. మద్రాసు జిల్లాలతో ఆంధ్రజిల్లాలను కలిపే 'జోన్'లను కొనసాగించే ఉద్దేశంకూడా ఆయన వెల్లడించారు. ఆంధ్రని ఎదుర్కొనే సమస్యలకు ఇవి మచ్చుతునకలు.



# అఖిలాంధ్రసాహిత్య సమ్మేళన మహాసభా పచురణము

అమ్మా !

భారతదేశములోని ప్రముఖ దేశభాషాసాహిత్యము లన్నింటిని సమ్మేళనపఱచి తద్వారా భారతదేశ కళ్యాణము నుత్తమమును ఉన్నతమును నగు మార్గములలో సాధించుటకై మన భారత ప్రభుత్వము అఖిల భారత సాహిత్య పరిషత్తు నొకదానిని స్థాపించదలచినదని యిదివఱకె మనమందరము పత్రికాముఖమున చదివియున్నాము.

ఆపరిషత్తునందు మన ఆంధ్ర సాహిత్యముకూడా ప్రాతినిధ్యము బొందవలెనన్నను, ఆ పరిషత్తుమూలమున కలుగు ప్రయోజనమును మన ఆంధ్రదేశముకూడా సమగ్రముగా బొందవలెనన్నను మన ప్రాంతమునందు కూడా సమగ్ర ప్రాతినిధ్యముకల ఒక కేంద్రసంస్థ యేర్పడి పనిచేయవలసి యున్నది. అట్టి సంస్థ వేర్పాటుచేయుటకై పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరు నగరమున ఒక ఆహ్వానసంఘ మేర్పడి నిర్విరామకృషి సలుపుచున్నది. అఖిలాంధ్ర సాహిత్య సమ్మేళన మహాసభలు జనవరి మొదటివారమున జరుగనున్నవి.

ఆ సభలయందు విశాలాంధ్రము నందలి అన్ని ప్రాంతముల కవులు, పండితులు, కవయిత్రులు, విదుషీమణులు, రచయితలు, రచయిత్రులు పాల్గొని సభా కార్యక్రమములను విజయాన్తములుగా నిర్వహించుటకై తోడ్పడ గోరుచున్నాము. సభా కార్యక్రమములందు దేశదేశములందని ప్రముఖు లెందరో పాల్గొన నున్నారు.

ఆ సభలయందు నృత్య, నాటక ప్రదర్శనములు, చిత్రకళా ప్రదర్శనము, గ్రంథ ప్రదర్శనము మున్నగు ప్రదర్శనము లెన్నో ఆకర్షణీయముగను, విజ్ఞానప్రదముగను నిర్వహింప బడనున్నవి.

కావున సాహితీవేత్తలును, కళోపాసినులును అగు మహనీయురాంఢ్రండఱును ఆ సభలయనిందు పాల్గొని మాకు తోడ్పడ గోరుచున్నాము.

సభకు ప్రతినిధి రుసుము మూడురూపాయిలు మాత్రమే.

సభా సమయమునజరుగు ప్రదర్శనములలో ప్రదర్శించుటకై తాము చిత్రించిన చిత్రపటములను, తమ రచించిన గ్రంథములను డిసెంబరు 10 తేదీలోపుగా నాకుపంపి సోదరీమణులెల్లరు సహకరింప గోరెదము.

స్త్రీల శాఖకు సంబంధించిన వివరములు తెలియగోరువారు నాకు వ్రాసిన బడయగలరు.

ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ
అఖిలాంధ్ర సాహిత్య సమ్మేళన మహాసభ స్త్రీలశాఖ



అనువాదం: శ్రీమతి మాణిక్యవల్లి

(గత సంచిక తరువాయి)

—:o:—

## మొదటి రంగం.

స్థలం: ఉదయసాగర తీరం. సమయం: వెన్నెలరాత్రి

(అమరసింహారాణా కళ్ళుమూసుకుని ఒక వేదికపై కూర్చుని వుంటాడు. ఉదయసాగర కెరటాలధ్వని. దూరాన స్త్రీలు 'హోలీ' ఆడుకుంటూన్న సందడి)

రా: (కళ్ళు తెరచి) వాళ్ళు హోలీ ఆటలో నిమగ్నులై వున్నారు. ఇప్పుడు భూకంపం వచ్చినా, పృథ్వి దడదడలాడినా వారు గమనించరు. ఏం ప్రపంచకం! పరమేశ్వరు డిలాటి వినోదాలతోటే మనుష్యుల్ని మరిపిస్తున్నాడు! లేకపోతే యీ యెడారిలో యెవరుంటారు? ఈ ప్రపంచమే పెద్ద మోసం! అదుగో మానసి!

(మానసి ప్రవేశిస్తుంది)

మానసి: ఇంకా యిక్కడే వున్నారా, నాన్నగారూ? చలిగా వుంది లోపలికి రండి.

రా: వస్తాను కానీ, మానసీ—

మా: ఏమిటి నాన్నగారూ?

రా: ప్రపంచం పెద్ద మోసం సుమా!

మా: ఎంచేత?

రా: అది మానవుల్ని రకరకాల కోరికలతో కట్టివేసి, వారు దైవత్వాన్ని పొందకుండ నిలవరిస్తుంది.

మా: అది అంత చెడ్డదనుకోనండి నేను.

రా: ఏమో! చూడు, యీ వెన్నెల రాత్రి, కెరటాల మధురధ్వని, శీతల వాయువు యెంత అనుభవ యోగ్యమైనవి! కాని క్షుద్ర భావ సంయుతమైన యీ ప్రపంచం వాటిని అనుభవించనిస్తుందా? ఈ మాయదారి లోకానికి దూరంగా పోతానమ్మా నేను.

మా: నాన్నగారూ, అది 'మాయ' యే అనుకోండి. అయినా మిక్కిలి మనోహరమైనది సుమండీ! సుందరాతి సుందరమైన ప్రకృతికి మనమంటే యెంత దయ! గ్రీష్మం భీషణమైనదే. కాని చూడండీ: దాని తరువాత శీతలవారి పూరమైన వర్షఋతువు ప్రవేశించి యెండ వేడిమిచే బెండు పడిన పృథ్విని సేద దీరుస్తుంది. అలాగే అతి శీతలమైన శిశిరం తరువాత మనోజ్ఞమైన వసంతం వచ్చి, మందసుగంధ వాయువులతో హాయి చేకూర్చి సురభి కుసుమాలచే పూజచేస్తుంది. దైనందిన జీవితంలోనూ అంతే. పగటి శ్రమను రాత్రి అపనయిస్తుంది. తల్లిలా ఒడిలో వేసుకుని నిద్రపుచ్చుతుంది. ఇక్కడ దాని దయకు అంతమే లేదు.

రా: ఎక్కడ వుంది?

మా: మానవుల వూహా ప్రపంచంలో. నాన్నగారూ, ఈ సరోవరం చూస్తున్నారు కాదూ?

రా: ఆఁ.

మా: దానిపై వెన్నెల ప్రసరిస్తోంది కాదూ?

రా: అవునమ్మా.

మా: నాన్నగారూ, మనం కని వినే యీ వెన్నెల వెలుగుల్ని కాని ఆ తరంగ దీవళిని కాని మనం పట్టుకోగలమా! ఈ కాంతి అంధకారంలో లీనమైనప్పుడు ఈ సౌందర్య సంగీతాలు యేమవుతాయంటారు?

రా: నువ్వు చెప్పమ్మా!

మా: సరిగ్గా చెప్పలేను కాని నాన్నగారూ, అవి నశించవనడం నిశ్చయం. విరహుల స్మృతిలో, కవుల కలల్లో, తల్లి ప్రేమలో, భక్తుల భక్తిలో, మానవుల అనుకంపలో అవి దర్శనమిస్తాయి. ప్రకృతిలో రాశీభూతమైవున్న యీ కాంతి సుగంధ ఝుంకార నృత్యాలు మానవుల హృదయ సౌందర్యంలో ప్రతిఫలిస్తాయి. లేకపోతే యీ ప్రకృతి సౌందర్యానికి సార్థకత యెక్కడిది?

రా: మానవులలో అసలు ఆత్మత్వమన్నది వుందంటావా? ఎవరైనా ఒక కబళం తినబోతుంటే ప్రపంచంలో అందరి కళ్ళూ దానిమీదే వుంటాయి. ఆ ముద్ద తిన్నవారు తమను వంచించారనే వారి వుద్దేశం. అబ్బా! ఈ అసూయా ద్వేషాల కంతులేదు!

మా: అది ప్రజల మనోదౌర్బల్యం నాన్నగారూ! దాని వల్లనే మానవులలో సానుభూతి అవసరమవుతోంది. ఆ దౌర్బల్యమే లేనినాడు వారు తమ అనుకంప నెవరిపై చూపుతారు, ఎవరినుద్ధరించి ఆనందిస్తారు? ప్రపంచం దీనమైనది నాన్నగారూ, దాని నుద్ధరించాలి కాని అధమమైనపని ఒదిలిపెడతారా?

రా: నువ్వు చెప్పేది నిజమేనేమో. కాని నేనిప్పుడేమీ ఆలోచించే స్థితిలో లేను.

(తెరలో) మానసీ! — మానసీ!

మా: వస్తున్నానమ్మా! మీరు రండి నాన్నగారూ, పొద్దుపోయింది. (వెడుతుంది)

రా: ఇక్కడ స్వర్గం ప్రత్యక్షమయినట్టుంది. చక్కని గాలి, నిర్మలమైన ఆకాశం, ప్రశాంతమైన ప్రకృతి. ఉదయ సాగర తరంగ మధుర సంగీత ద్వితీయమైన యీ ప్రశాంత ప్రకృతి సౌందర్యపు నిగ్గు. జలక్రీడావసర తనిజ హృదయానందములైన తరుణ రాయంచల సుందరమందహాస రుచులే ఆ చిరు తరంగాలు. వాయుసంచలితములైన వృక్షపత్రాలు భరతనాట్య భంగిమను వెలయిస్తున్నాయి. ఇక్కడ జడపదార్థాలు కూడా సౌందర్యోపాసన చేస్తున్నాయి.

(రాణి వస్తుంది)

రాణి: మహారాజా!

రా: ఉండు, రాణీ! మాట్లాడించకు! (కలలో నుండి మేల్కొన్నట్లు లేచి) ఊఁ! ఏమిటది?

రా: ఏముంది? ఈ రోజుల్లో పిల్లలు తల్లిదండ్రుల మాట వినడంలేదు, ఆవేళ గోవిందసింహాజీకొడుకూ, కూతురూ తండ్రి కాస్త కూకలేసేడని యిల్లు విడిచి పోయారు. రేపు—

రా: అబ్బా! ఆ పాడు ప్రపంచం గొడవ నాతో చెప్పకు!

రా: ఈ కలియుగపు ఆడపిల్లల కేమొచ్చిందో! మా చిన్నతనంలో యిలా యెరుగుదుమా?

రా: అది సత్యయుగంలే, రాణీ! అదీగాక తల్లుల కాలం సత్యయుగమయితే పిల్లల కాలం కలియుగం. ఇది శాశ్వత సత్యం. సరి! ఈ గొడవకేం కాని యిప్పుడు మన కర్తవ్యమేమిటి?

రా: మానసికి పెళ్ళి చేస్తే యిప్పుడు చెయ్యాలి. లేకపోతే యింక ఆ ఆశ ఒదులుకోవలిసిందే.

రా: అంతే జరుగుతుందేమో. మానసి జన్మ ఆశయం వివాహం కాదని నా అభిప్రాయం.

రా: రామ! రామ! ఇదేం వరసండీ! మేలుకునే కలగంటున్నారా?

రా: ఆఁ! నువ్వేదీ చెయ్యడం లేదుగా!

రా: సరే కాని! జోధపురంనుంచి అరుణుడు యింకా రాలేదేమంటారు?

రా: అయ్యో! వెర్రిదానా! ఏనాడో ఆయనవచ్చాడు!

రా: మరి చెప్పారు కారేం! ముహూర్తం నిశ్చయమయిందా?

రా : వాళ్ళ మన సంబంధం అక్కర్లేదుట!

రా : కారణం?

రా : మహారాజుకు కోపం వచ్చింది.

రా : ఎందుకు?

రా : యుద్ధంలో మనం జయించినందుకు! మొగలాయీలు జయించనందుకు!

రా : బాగానే వుంది! ఇంక పెళ్ళి పెళ్ళే!

రా : అంటే! మానసి పెళ్ళి కోసం పుట్టలేదు.

రా : బాగుంది!

రా : రాణీ! ఈ పరిణయ ప్రస్తావనలు, యుద్ధాలు, నా రాజ్యం, చివరికి మన వివాహం, జీవితం— అన్నీ అబద్ధాలే!

రా : సరి సరి!

రా : చూశావ్, మహారాజు ఆగ్రావెళ్ళారుట.

రా : ఎందుకంటారు?

రా : చక్రవర్తి చెవి కొరికి మేవాడ్‌పై దండయాత్ర జరిపించడానికి.

రా : మళ్ళీనా?— నువ్వుతారేమిటి! ఇదేమన్నా శుభ వార్తా?

రా : కాదూ మరి! నే నానందిస్తున్నాను. నువ్వూ ఆనందించు?

రా : సరె! నాకింకా పిచ్చెత్త లేదు మరి!

రా : రాణీ—

రా : ఏమయినా సరే యిప్పుడే పెళ్ళి అయి తీరాలి.

రా : ఎలాగ?

రా : జోధపురంపై దండెత్తండి.

రా : రాణీ! ఇన్నాళ్ళకు క్షత్రియ స్త్రీ ననిపించుకున్నావు! కాని రాణీ ప్రస్తుతం మనం దుర్బలులం.

రా : అయితే యీ అవమానం మ్రింగి ఊరుకుంటారా?

రా : లేకపోతే ఏడవాలి కూచుని! ఇంక మిగిలినదల్లా సర్వనాశనమే! జాతిలో యింత క్షుద్రత్వం గూడు కట్టుకొన్నప్పుడు దానిని పరమేశ్వరుడైనా రక్షించ లేడు. ఇంక మనుష్యుల మాట చెప్పాలా!— పద.

రా : ఇంతకీ వారికి మీరు చేసిన అపరాధ మేమిటి?

రా : నే నాయన జాతివాణ్ణి కావడమే! ఒక ప్రయాణీకుని తప్పువల్ల నావ అంతా మునిగి పోతుంది!— పద.

(రాణి వెళ్ళి పోతుంది)

రా : అబ్బా! ఆకాశమెంత నల్లగా వుందో!

(రాణా వెళ్ళిపోతాడు. మానసి వస్తుంది.)

మానసి : అజయసింహుడు విదేశం వెళ్ళాడు! వెళ్ళేముందు ఒక్కసారి చూడ్డానికయినా రాలేదు! పోనీ యిలా దూరదేశం వెడుతున్నానని— కాదు!కాదు! "శాశ్వతంగా సెలవు తీసుకుంటున్నా"నని ఒక చిన్న చీటైనా పంపకూడదూ! అజయ్! అజయ్! అబ్బే, నువ్వు కఠినుడవు, నీకోసం విచారించను! ఏమిటిది? చంద్ర కాంతి క్షీణించిపోయింది! ఉదయసాగర గర్భం అధార్తగా మలినమైపోయింది! ప్రకృతి సౌందర్య జ్యోత్స్న ఏమయిపోయింది!

## రెండవ రంగం

స్థలం : మేవాడ్ సమీప ప్రాంతం, మహాబత్‌ఖాడేరా,

సమయం : ఉదయం.

(మహాబత్ ఖాన్, షాహజాదా పరవేజ్, గజసింహుడు నిల్చుని మాట్లాడుకుంటూవుంటారు)

మహాబత్ ఖా: షాహజాదా సాహెబ్! ఇంక మీరాలస్యం చెయ్యొద్దు. ఈ లక్ష సైన్యంతో వెళ్ళి చిత్తూరు కోటను ముట్టడించండి.

షా : మంచిది (వెడతాడు)

మ : (గజసింహునితో) మీరు మేవాడ్ గ్రామాలన్నింటినీ వరసపెట్టి కాల్చండి. అడ్డు వచ్చిన వారిని ముక్కలు చేసేయండి. ఈ పనికి మీరే తగినవారు. స్త్రీల జోలికి మాత్రం పోకూడదు సుమండీ, మరిచిపోయేరు!

గ : బలే అవకాశం! రాజపుత్రుల నామరూపాలుండ నివ్వను!

మ : నాకు తెలుసులెండి! పుత్రుల్ని తోటి రసపుత్రులు ద్వేషించినంతగా మహమ్మదీయులు ద్వేషించరు. తోటి సోదరుల్ని కష్టాలపాలు చెయ్యడమంటే హిందువులకి పండగ! ఆవిషయం హిందూస్థాన్ పురాణ గ్రంథాలు చదివి తెలుసుకున్నాను. రాజపుత్రజాతి ధ్వంసం మీ

చేతిలో జరిగినంత పరిపూర్ణంగా మరొక చేతిలో జరగదు. అందుకే మిమ్మల్ని నియోగిస్తు! తెలిసిందా! ఇంక వెళ్ళి పని ప్రారంభించండి.

గ : మంచిది! (వెడతాడు)

మ : హిందూ! రాజపుత్రా! మేవాడ్! జాగ్రత్త! ఇది రెండు రాజ్యాలమధ్య పోరాటం కాదు, రెండు మతాల మధ్య పోరాటం! చూద్దాం యేది జయిస్తుందో.

(తెర)

## మూడవ రంగం

స్థలం: ఉదయపుర రాజమందిరం. సమయం: రాత్రి.

(అమరసింహుడు, సత్యవతి)

రా : ఈసారి సమరానికి మహాబత్ ఖా వచ్చాడా?

సత్య: అవును, మహారాజ్! వారితో సుమారు లక్ష సైన్యముంది.

రా : నాకెప్పుడో తెలుసు, సత్యవతీ!

స : ఏమని?

రా : మిగతా రాజపుటానా గతే మేవాడ్‌కూ పడుతుందని! ఇంక ఏమీ ఆశ లేదు. తల ఒంచుకుంటూవేం, సత్యవతీ? మనకి సంతోష సమయం!

స : ఎలాగ! మహారాజ్!

రా : ఇంక మన తల్లి కష్టాలు గట్టెక్కుతాయి! లేకపోతే మృత్యుశయ్యపై ఉండి యెంత కాలం యమయాతననుభవిస్తుంది చెప్పు సత్యవతీ, మేవాడ్?

స : మహారాజు యుద్ధం చేయరా?

రా : ఎంతమాట! అసలు మనకున్న పనల్లా అదొక్కటే! మహావిప్లవం సత్యవతీ! అన్నదమ్ముల మధ్య పోరాటం! ఆ తమాషాని అఖండ భారతదేశం గమనిస్తుంది!

స : మహాబత్ ఖాతో గజసింహుడుకూడా వచ్చాడుట.

రా: అయితే వారు మన ఆహ్వానం మన్నించారన్నమాట! భేష్!

స : ఆ కులకళంకి—

రా : ఎంతమాట!— అతడు పరమ భక్తుడు. "ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా" అని యింతకాలంగా యేకేశ్వరత్వాన్ని విశ్వసించని మనమే కులకళంకితులం! గజసింహా! ఆహా: ఏమి అద్భుతనామం! జన్మశత్రువుల పైన గజకేసరుల్ని కలుపుతోంది!

స : చివరికి రాజపుత్రులతోటి యుద్ధం చేయవలసి వచ్చింది!

రా : లేకపోతే యజ్ఞ వినాశం పూర్తి కావద్దూ? శివుడి దగ్గిరకి నంది, భృంగి చేరకపోతే పని పూర్తయేదెట్లా? శాస్త్రం మాట యెప్పుడూ అబద్ధం కాదు.

స : హా! హతభాగ్య మేవాడ్! (కళ్ళు తుడుచుకుంటుంది)

రా : విధి బలీయం సత్యవతీ. స్వసంతానం ద్వారానే సర్వనాశం కావాలని బ్రహ్మ భారత దేశం మొహాన మూడు పంక్తులా వ్రాసి పెట్టాడు. తక్షశిలను జ్ఞాపకం తెచ్చుకో. జయచంద్రుని చరిత్రను స్మరించు; మానసింహ, శక్తిసింహుల్ని చూడు; మహాబత్ ఖా, గజసింహుల్ని ఆ వరుసలోనే నిలబెట్టి పరికించు; నే చెప్పిన మాట ప్రతి అక్షరం నిజమని తేలడం లేదూ? లలాట లిఖితం తప్పదు సత్యవతీ! పద, నే సమరసన్నాహంలో వుంటాను!

(సత్యవతి వెళ్ళిపోతుంది)

ఇప్పుడర్థమయింది. ఒక జాతి పతనానికి ఆ జాతిలో కల దోష దౌర్బల్యాలే మూల కారణం. పరులెంత ప్రయత్నించినా సర్వసద్గుణ వంతుడైన వ్యక్తిని వలెనే జాతినీ అణగద్రొక్కలేరు. జాతికి నిజమైన శత్రువులు జాతిద్రోహులే!

(సశేషం)



# పెద్దలసుద్ది:

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు.

[కబీరుదాసునిచే వ్రాయబడిన ద్విపదలను శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారిచే తెలుగున అనువదింపబడినవి. అవి కొన్ని నవంబరు నెలలో ప్రచురించడమైనవి. మరికొన్ని యీ సంచికలో.]

ప్రభుడ దినము నిను గొలుచు ఫలమిటేనె?
ఇంతి సుతులు సాకటమాటి యీల్గు చుండ్రి
ఏముదిననింత సౌఖ్యలకింతయిడను
పట్టెడోగిరమిడు మది పదియువేలు॥

సాధు జననమ్ము ప్రశ్నింప జనదు సుమ్ము
జ్ఞానపరిమితినెంచనే గానియెపుడు
కత్తి పదునెఱిగి విలువకట్టదగునా
ఒరపసందుజూచి విలువనుంచదగునా॥

మంచితనమును బిల్మాఱు కించపఱచి
ఎంచి చెడుగునె కైకొందురేల నరులు?
అగును గానుగ పిప్పినె అందుకొనుచు
రసమునంతను బోద్రోచి యెసగుగాదె?॥

కుసుమ గర్భాన సౌరభ మొసగియుండు
నీదు హృదయాన నీశుండు నిండియుండు
నాభిగల గంధమెఱుగక నట్టనడవి
వెదకు మృగమట్లు వీశుని వెదకెదేల?॥

అంచ, కొంగయు, మానసహ్రదమునందు
ఏకరీతిని వసియించు స్వేచ్ఛమెయిని
హంస తాగొను ముత్య మాహారముగను
కొంగ పొంచుండి చేపలన్ కొసరి తినును॥

మదిగల దురభిమానమ్ము మట్టుపరచి
చక్కనౌరు మదితన మది జల్లబఱచు
పథ్య వచనమ్ము పలుకంగ వలయునెపుడు
పెరలు! రసమొడిసినతేనె పెరలెకాదె॥

ధరణి నీరైన బుట్టుమ తనకు సుంత
పరుల కీగలడంటదా - పాలనహహ
తనదు మది నిలుపగలేక వనటగుందు
పరుల దరియింపజేయగ బాసలాడు॥

పాలనమ్మంగ వాడల వలయు దిరుగ
సురను గొనమనుజుడ తానె తిరుగు కూడ
పాట్లు బడియు ఋతము చెల్లుబడియెకాదు
చెల్లుబడియగు నన్నృతము చెలగి ధరణి॥

యోజనశతము నంచున్న 'సాజనుండు*'
హృదయసన్నిధి మున్నప్లై యెంచజనును
కపటియంగణ మందుండుగాని, వాని
సంద్రమావల నున్నప్లై చనుమజూడ॥

కుజన సంఘమునందలి సుజను బోధ
కడలి యుప్పున మంచి నీర్కాఱముబోలు
శిష్టమైత్రి జెఱచునొక్క దుష్టమాట (పలుకు)
చిన్న ఉపుగల్లు పాలను చెఱుపజాలు॥

వెఱ్ఱిమనస! తొందరయేల వినుము సుంత
అదను నందప్ప కార్యమ్ము కుదురుపడదు
తోడిపోసిన నీరెంతొ తోటమాలి
ఋతువుగాక ఫలింపవు వృక్షవితతి॥

కాంతియొక కొంతబోలిన, గాజుపూస!
మింతువజ్రమున్ నేనంచు మిడిసిపడెడు
మణిని దలదాల్చు క్రయవేళ మన్ననమెయి
నిన్ను గన్గొని వ్యాపారి నేల విడుచు
నిదియ కాదటేపూస! నీబ్రదుకు తుదకు॥

చిన్నవారి మన్నించుచు సేగియెడల
దొడ్డవారి నుతించుచు దొడ్డపనుల
సమత మీరగ వర్తింప జాలవేని
బ్రదుకు వృథయంచు తలపుమో వయసుకాడ॥

చావుపొసగిన నొకపరి చావవలయు
జన్మబంధముల్ తెగిపడు చక్కమెఱయ
అన్యులవమతి సల్పజ ఘన్యవృత్తి
నూరుమారులు చత్తువేమోయినరుడ?॥

అడుగుటన్నది కడు నీచమరయవేమి
అడుగుకంటెను మఱి చచ్చుటదియు మేలు
అడుగులకొలది నీబ్రదుకిక కడలబడును
గురుల యుపదేశమిదియెప్డు మఱువ జనదు॥

(సశేషం)

* 'సాజనుండు' హిందీ భాష ప్రయోగమునుబట్టి వాడబడినది.

## ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహానిచ్చుటకు, సభ తరపున కొందఱు యువతులు నియమింపబడుదురు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని వివరములు తెలిసికొనవచ్చును,

ఇంకొక విషయము— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయెడల సభకు 1¼% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

సభలో టి. జి. హైమావతిగారు, దీనినిగూర్చిన వివరములన్నీ మీకు తెలుపగలరు.

అ. చన్నఘంటమ్మ,
కార్యదర్శిని.

---

### మద్రాసు సంగీతకళాశాల - గోపాలపురం

## ముత్తుస్వామి దీక్షితులవారి ఉత్సవము.

22-11-53 తేదీన మద్రాసు సంగీత కళాశాలవారు సంగీతకళానిధి ప్రొఫెసర్ అండ్ డాక్టరు శ్రీ ద్వారం వెంకటస్వామి నాయుడుగారి అధ్యక్షతన, పాఠశాల విద్యార్థినుల వీణాగానముతో శ్రీముత్తుస్వామి దీక్షితులువారి ఉత్సవము జయప్రదముగా జరిపిరి.

శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడుగారు ఉపన్యసిస్తూ "శ్రీ దీక్షితులువారి కృతులయొక్క వైశిష్టతను పొగిడి. విద్యార్థ విద్యార్థినులందరు తేలికపాటలను నేర్చుకొనక శ్రీ త్యాగయ్య, ముత్తుస్వామి, శ్రీ శ్యామశాస్త్రి, శ్రీ క్షేత్రయ్యగార్ల కృతులను అభ్యసింపవలె" నని ఉద్బోధించిరి. తదుపరి శ్రీ నాయుడుగారు, తమ కుమార్తె మంగతాయారు, వారి శిష్యులయిన శ్రీ మర్ల కేశవరావుగార్లతో ఫిడేలుపై కొన్నికృతులు వాయించి ప్రేక్షకుల నానందపరచిరి.

శ్రీ దీక్షితులవారి పఠమును శ్రీ బాలు బ్రదర్సువారు చిత్రించి కళాశాలకు బహూకరించిరి.

శ్రీ యన్. సి. పార్థసారథిగారి వందనసమర్పణములతో ఉత్సవము ముగిసెను.



# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

శ్రీమతి కె. యమ్. సౌందర్యవల్లి

---

### కీర్తన—15

రాగం జగన్మోహిని, రూపకతాళం.

ఆ. స గ మ ప ని స — అ. స ని ప మ గ రి స.

ప॥ భజన సేయవే మనసా ॥భ॥

అ॥ సుజన వందిత త్యాగరాజుని ॥భ॥

చ॥ ధ్యానవందనా ర్చనలతో, దాసభావ మంది దినము
భానువంశ తిలకు రాము, నామామృత మానుగురుని ॥భ॥

| | 0-2 | 1-4 | 0-2 | 1-4 |
|---|---|---|---|---|
| ప॥ | సా సా | సా సా గా మా | పా ; | ప మ గ మ గ రి స ని̣ |
| | భ జ | న సే — య | వే | మ . న . . స . . |
| | సా సా | సా సా గా మా | ప ని స ని | ప మ గ మ గ రి స ని̣ |
| | భ జ | న సే . య | వే . . . | మ . న . . స . . |
| | సా సా | సా సా గా మా పా | | |
| | భ జ | న సే . య వే॥ | | |
| అ॥ప॥ | ; మ గ | మా పా నీ సా సా | స ని ప ని | ప మ గ మ గ రి స ని̣ |
| | సు జ | న వం . ది త | త్యా. . . | గ . రా . . జు ని . |
| | సా సా॥ | | | |
| | భ జ॥ | | | |
| చ॥ | ; పా | పా పా ; మా | మా ; | మా మ గ ప మ గా |
| | ధ్యా | న వం ద | నా | ర్చ న . ల . తో |
| | ; మా | మా మ గ రీ సా | సా గా | మా పా పా పా |
| | దా | స భా . . వ | మం . | ది ది న ము |
| | ; మ గ | మా పా నీ పా | పా సా | నీ సా ; సా |
| | భా . | ను వం . శ | తి ల | కు రా . ము |
| | సా సా | సా నీ పా పా | స ని ప ని | ప మ గ మ గ రి స ని̣ |
| | నా | మా . మృ త | మా. . . | ను . గు . రు . ని . |
| | పా సా | | | |
| | భ జ | | | |

# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తన

## కీర్తన-16

రాగం హంసధ్వని, ఆదితాళం.

ఆ. స రి గ ప ని స — అ. స ని ప గ రి స

ప॥ దినకరవంశ సుధాంబుధి చంద్రుని
దినము భజించిన ఘనుడే ! ॥దిన॥

అ॥ ఘనమగు భీమభవాబ్ధిని దాటగా
మనకనువగు సన్మార్గము జూపగా ॥దినకర॥

చ॥ మధుర మధురమగు మంజులరవముచే
విధి విహితముదైన. వేదవాక్కులచే
బుధులు పామరులు పొగడు కవనముచే
పృథివి త్యాగరాజు, పాడి కృతులచే ॥దినకర॥

| | 0-2 | 1-4 | 1-4 |
|---|---|---|---|
| ప॥ | ; సా సా స సా స రి స, ని పా పా | సా , ని పా పా | ప గ ని ప గ రి సా . |
| | ది న క ర వ ం . . . శ సు | ధా ం , బు ధి | చ ం . . ద్రు ని |
| | ; ప గా ప నీ సా నీ గా పా | సా . నీ సా ; | ; ; ; ; ॥ సా |
| | ది న ము భ జి ం చి న | ఘ ను డే ॥ | |
| అ॥ప॥ | : స రి స ని ప పా ప ని సా రీ రీ | స రి గ ప గ రి సా | రి ప ని ప నీ సా |
| | ఘ . న . మ గు భీ . మ భ | వా . . . బ్ధి , ని | దా . . . ట గ |
| | ; స గా రి సా ; స ని పా రీ | ; సా , ని పా | పా ; ని గ పా |
| | మ న క ను వ . గు స | న్మా ర్గ ము | జూ ప . గా |
| | ని, ॥సా॥ | | |
| | . ॥ది॥ | | |
| చ॥ | ; పా గా పా పా ప ప నీ పా | ; సా ని ప పా | గా గా ప గా రి |
| | మ ధు ర మ ధు ర మ గు | మ ం జు ల | ర వ ము చే . |
| | ; గా పా గా రి రి గ రీ స సా | ; పా గ పా . | ; నీ గ పా . |
| | వి ధి వి హి త ము దై . న | వే ద వా | క్కు ల చే . |

అ. ప. వలె.
బుధులు పామరులు పొగడు కవనముచే
పృథివి త్యాగరాజు పాడి కృతులచే ॥దిన॥



# ఇష్టార్థసిద్ధి

శ్రీమతి కె. రాజమ్మ, బి. ఎస్. సి.

"విజయా, విజయా"

"ఇదుగో, వస్తున్నానే, అమ్మా" అంటూ మేడ మెట్లు దిగి వస్తూన్న విజయలక్ష్మిని చూచి అక్కడే నిల్చుంది సావిత్రమ్మ. ఆ కొత్త పసుపు రంగు చీర కట్టుకుని వస్తూంటే, లక్ష్మీదేవే వస్తున్నట్టనుపించింది తల్లికి.

"ఏమే, ఎందుకే పిలిచావు?"

"మీ నాన్నగారు పిలిచారమ్మా. ముందుగదిలో వున్నారు. వెళ్ళి కనుక్కో" అని తన పనిమీద వెళ్ళి పోయింది.

రామచంద్రరావుగారు, ఒక ఉత్తరాన్ని చేత్తో పట్టుకుని గదిలో ఇటూ అటూ పచార్లు చేస్తూండగా, ఎదురుగా వచ్చి నిల్చున్న కూతుర్ని చూచి "రామ్మా, ఇదుగో బందరు నుండీ ఉత్తరం వచ్చింది చూడు" అని తన చేతిలో వున్న ఉత్తరాన్ని విజయ చేతికి ఇచ్చారు.

దాన్ని విప్పి చదువుతున్న కూతురి మొహంలో కన పడ్డ మార్పులను చూచి "చూచావా అమ్మా, మొగ పిల్లలను కన్నవాళ్ళంటే ఎక్కడలేని పొగరు వస్తుంది. వారు వచ్చి నిన్ను చూచి పోయినారు, ఇప్పుడు యిం కొక ఏడాది వరకూ కొడుకు పెండ్లి మాట మానుకున్నా మంటే, చిత్రంగా వుంది! ఇప్పుడు అనుకున్నారా యీ మాట? వీరు అనుకున్నంత కట్నాలూ, కానుకలూ ఇవ్వ లేకపోతే ఇదే జవాబా! వీరిండ్లలోనూ ఆడపిల్ల లుండ రా?" కోపంలో ఆయనకి మాటలు వేగంగా వచ్చాయి.

విజయ కూడా ఆ ఉత్తరం చూచి చాలా బాధపడ్డది. తను కట్టుకున్న గాలి మేడలు ఎదటనే కూలిపోయినవి. కాని దానికంటె ఎక్కువగా తండ్రి తను చేసిన ప్రయత్నాలు విఫలమైనందుకు దుఃఖిస్తున్నాడు. చాలా బాధని పించింది.

"పోనిలెండి, నాన్నగారూ, చదువుకున్నవాళ్ళే ఇలా చేస్తే, మిగతావాళ్ళను అనడంలో ప్రయోజనం ఏమిటి? మీరు ఇంక కొంతకాలం ఈ విషయమే తలపెట్టవద్దు" అని అక్కడినుంచి లేచి లోపలికి వెళ్ళిపోయింది.

రెండవ రోజున భోంచేసే టప్పుడు "నాన్నగారూ, నేటి పత్రికలో మన యింటిదగ్గరున్న స్కూలుకు ఒక ఉపాధ్యాయిని కావాలని చూచాను. నేను దానికి ప్రయత్నిం చనా? ఇంట్లో ప్రొద్దు పోకుండావుంది" అన్నది విజయ.

"నీకు ఎందుకమ్మా ఈ ఆలోచన తట్టింది?"

"ఇంట్లో యేం తోచడంలేదు. దగ్గరే వున్నది గదా బడి. యెప్పుడు వద్దనుకుంటే అప్పుడే మానుకోవచ్చు. మీరు సరి అంటే ప్రయత్నిస్తాను"

"విజయా, నేను చెప్పేది విను. నీవు పనిలో చేరడం నాకు ఇష్టంలేదు."

"నాతో చదువుకున్న వారిలో కొందరు పిల్లలు పనుల్లో చేరారు. నేను చదువు పూర్తిచేసి ఒక యేడాదిగా ఇంట్లో వుంటున్నానుగదా, పనిలో చేరితే తప్పేముంది?"

"తప్పు అని కాదు. కొందరు చేరారంటే వారి తల్లి దండ్రులు దానికి ఒప్పుకున్నారు. నాకు ఆడవాళ్ళు పనుల్లో చేరడం ఇష్టంలేదు, సంపాదన అని మొదలుపెట్టగానే పిల్లలకి ఎక్కడలేని స్వాతంత్ర్యం వచ్చి, మన మెందుకు ఇంకొకరు చెప్పినమాట వింటూ బతకాలి అన్న మనోభావం రాగానే వారిప్రకృతి మారిపోతుంది. నీలాంటి

వాళ్ళు పెండ్లయేవరకూ పనిలో చేరుదాం అని చేరి, స్వేచ్ఛగా వుండి అలవాటై, పెండ్లి కాగానే భర్త చెప్పు చేతల్లో వుండి, అతనిస్తేనే కానీ డబ్బు లేకపోతే లేదన్న పరిస్థితి రాగానే చాలా కష్టపడతారు. అదీగాక మొగ వానికి తన భార్య తన మీదే ఆధారపడి, తను సంపాదించి తెచ్చిన డబ్బులే సంతోషంతో ఇద్దరికీ ఖర్చుపెట్టి, తన భార్యను సంతోష పెడుతున్నానన్న భావం అతనికి ఎంతో ఆత్మగౌరవాన్నిస్తుంది. అదే అతనికి సంతృప్తి. అతని సంతోషమే సంసారం యొక్క బలం. ఇదే మన హిందూ కుటుంబాల్లో వున్న అందం. పాశ్చాత్య దేశాల్లోలాగ భార్యాభర్తలిద్దరూ సంపాదిస్తూంటే ఒకరు యెక్కువ, ఒకరు తక్కువ యేమని వాదం వచ్చి కుటుంబమే చెదరి పోతుందని నా నమ్మకం"

"అయితే అమ్మాయిని ఇంతవరకూ చదివించింది వృథాయే కదండీ" అన్నది సావిత్రమ్మ. ఆమె సాధార ణంగా తండ్రీ కుమార్తెల సంభాషణలలో జోరబడదు.

"చదువు ఎన్నటికీ వృథాగాదు. చదువుకుంటాననిసరదా పడ్డది గనుక బి. ఏ. పూర్తి చేయించా. ఇక చదువు చాలించి హిందూ స్త్రీకి కావలసిన ఇంటి పనులు నేర్చు కోమన్నా. విజయా, నీ చదువు డబ్బు సంపాదించేందుకు కాక, నీ పిల్లలనూ, నీ సంసారాన్నీ చక్కదిద్దుకుందుకు ఉపయోగించుకో. నీవు తెచ్చే డబ్బు కంటే, నీ పిల్లలు పెద్దవారై, మంచివారన్న పేరు తెచ్చుకున్నప్పుడు కలిగే ఆనందాన్నే ఎక్కువగా యెంచాలి. కాబట్టి ఉద్యోగం సంగతి మర్చిపో. కల్యాణం వచ్చినా, కక్కు వచ్చినా ఆగదంటారు. పెండ్లి కాగానే నీ సంసారాన్ని నేర్పుతో నడిపే విధానాన్ని నేర్చుకొని వుండు. ఇదే నా కోరిక" అని తమ అభిప్రాయాలన్నీ వెలిబుచ్చారు రామచంద్ర రావుగారు.

విజయకు ఏం జెప్పాలో తోచలేదు. ఎప్పుడూ నాన్న గారు ఇంతే. ఉద్యోగం మాట వింటే ఉపన్యాసం ఇస్తారు. ఇంట్లో కూర్చుని అనుభవించేవాళ్ళకి తెలుస్తుంది దాని బాధ. స్నేహితుల ఇండ్లకు పోవడానికి, తనతో చదువు కున్న వార్లో కొందరు పనుల్లో చేరారు, కొందరు అత్త వారిండ్లకు వెళ్ళిపోయారు. కొందరు భర్త, పిల్లలు అంటూ ఆధోరణిలో మాట్లాడుతూవుంటే, తానేం చేయ గలదు? అందుకే వాళ్ళ ఇండ్లకు పోవడం తగ్గించింది. ప్రొద్దున ఆఫీసుకు పోతే సాయంత్రం అలిసి ఇంటికి వస్తారు తండ్రి. ఇంట్లో పనులు లేకపోతే రామాయణమో, భారతమో చేతపట్టుకుని కూర్చుంటుంది తల్లి. తనతో పెరుగుతూన్న అక్కయ్య వసంత, మద్రాసులో కాపరం. ఇలా తనతో మాట్లాడే వారుకూడా లేరు. ఎంతసేపని కుట్లూ, ఇంటిపనులు వుంటాయి? తన పరిస్థితిని అర్థం చేసుకోలేదని నాన్నమీద కోపం వచ్చినా, చేసేదేమీ లేక యేడ్చేది విజయ.

నాటితో ఉద్యోగం మాట మానింది విజయ. ఇది జరిగిన నెల రోజుల వరకూ విజయ తండ్రి చెప్పినట్లే ఇంట్లో పనులన్నీ నేర్చుకుంది. ఒక రోజున సాయంత్రం తండ్రి ఇంటికి రాగానే మద్రాసు నుంచి వసంతక్కయ్య వ్రాసిన ఉత్తరం ఇచ్చి "డిశంబరుకి వాళ్ళవూరు రమ్మని వ్రాసింది నాన్నా" అన్నది.

"దానికేం. వెళ్ళిరా. సంగీతాలు, నాటకాలు, సభలు అంటూ ఈ నెలరోజులు చాలా బాగుంటుంది. వెళ్ళి అక్కయ్యతో బాటు రెండు నెలలుండిరా" అన్నారు. ఇది వినగానే చాలా సంతోషమైంది విజయకు, సరదాగా వుండి రావచ్చు గదా అని.

మద్రాసు స్టేషనులో వసంత, మురారి, వారి కొడుకు ఆనందతో సహా వచ్చి, విజయను ఎదుర్కొన్నారు. మురారికి మద్రాసులో ఏదో కంపెనీలో మేనేజరు పని. ఏదో వచ్చిన దాంట్లో సుఖంగా కాలం గడుపు తున్నారు.

విజయ మద్రాసు వచ్చి కలలాగ పదిరోజులు గడిచి పోయినై. అక్కడి సంగీతాలకీ, నాటకాలకీ, హాజ రైయారు విజయ, వసంత, మురారిలు. ఒక రోజున సాయంత్రం మురారి బజారుకెళ్ళాడు. వసంత ఆనంద్‌కు వేరే బట్టలు వేస్తూంది. విజయ ముందు గదిలో యేదో పుస్తకం చదువుతూ కూర్చునప్పుడు వీధి తలుపు తట్టిన చప్పుడైతే "విజయా యెవరో చూడమ్మా" అని వసంత అన్నది. విజయ లేచి తలుపు తెరచి బైట వున్న మనిషిని చూచి ఉలిక్కి బడ్డది. ఆ బైట నిలుచున్న మనిషి కూడా విజయను చూచి అలాగే నిల్చుండిపోయాడు. వెంటనే నిబ్బరించుకున్న విజయ "యెవరు కావాలి?" అని అడిగింది.

"మురారి వున్నారా?." "లేరు. ఇప్పుడే బజార్కి వెళ్లారు."

# ఇష్టార్ధసిద్ధి

"అయితే కుమారు వచ్చాడని చెప్పండి. రేపు మళ్ళీ వస్తా" అని వెళ్ళిపోయాడు.

లోపలకు వస్తూన్న విజయను చూచి "ఏం అలా వున్నావు విజయా? ఎవరు వచ్చింది?" అని అడిగింది అక్క.

"ఎవరో బావకోసం వచ్చారు. కుమారట. రేపు వస్తానన్నారు" ఆ వచ్చిన కుమారు బందరునుండి పెండ్లి చూపులకు వచ్చిన అతనేనని ఎలాచెప్పగలదు అక్కయ్యతో?

మురారి ఇంటికి రాగానే కుమారు వచ్చిన సంగతి చెప్పారు. "అరెరే! అతను వచ్చే సరికి ఇంట్లో లేక పోయానే!" అనుకున్నాడు. "ఎవరండీ అతను" అడిగింది వసంత. "ఆ, మనవాడే. బందరట. నెల రోజుల బట్టి నా అసిస్టెంటుగా పని చేస్తున్నాడు. చాలా మంచివాడు."

రెండవ రోజున సాయంత్రం మురారి ఇంట్లోనే వున్నాడు. వసంత విజయ లిద్దరూ బట్టల షాపుకి వెళ్లారు. చెప్పిన ప్రకారం కుమారు వచ్చాడు. ఏదో అదీ ఇదీ మాట్లాడుతూ కూర్చున్నారు. ఇంతట్లో వసంత, విజయ ఇంటికి రాగానే మురారి "నా భార్య, మరదలు. అక్కయ్యను చూడడాన్కి వచ్చింది." అంటూ కుమారుకు వసంత, విజయల్ని పరిచయం చేశాడు. చిరునవ్వుతో విజయను చూస్తూన్న కుమారు. "నమస్కారం" అని లోపలికి వెళ్ళిపోతున్న విజయను చూచి ఆశ్చర్యపోయాడు. "ఇతనికి కట్నం ముఖ్యమే గాని, ఇంకేం అక్కరలేదు" అనుకుంటూ తన గదిలోకి వెళ్ళిపోయింది. విజయ.

విజయని మద్రాసులో చూస్తానని కలలో కూడా అను కోలేదు. మురారి కోసం వాళ్ళ ఇంటికి వెళ్ళినప్పుడు ఎదురు చూడని ఆ సన్నివేశంలో ఏం మాట్లాడాలో తోచక వెంటనే వచ్చాశాడు. కానీ మరొక రోజు మురారి ఎదు రుగా మాట్లాడుదామని ముందురోజునుంచి అనుకుంటున్న అతనికి విజయ ప్రవర్తన చూచి చాలా బాధ కలిగింది. ఆ పెండ్లి చూపులనాడు, విజయ యొక్క విద్య, సంగీత జ్ఞానం, వినయం చూచి తను పెండ్లియాడితే విజయనే నని అప్పుడే నిర్ణయించుకున్నాడు. తను వెంటనే పని ప్రయత్నంలో మద్రాసుకు వచ్చేసి నందున తరవాత జరిగిన సంగతులు తెలియవు గనుక, ప్రతి రోజూ తండ్రి దగ్గరనుండి ఉత్తరానికి ఎదురుచూస్తు న్నాడు. పోనీ విజయకు ఇష్టంలేదేమో అనుకుంటే, ఆవిడ తనను చూచినప్పుడు ఆమె కళ్ళలో కనపడ్డ సమ్మతం, ఆనందం, ఎలా కాదనగలడు?

విజయ సరిగ్గా మాట్లాడక వెళ్ళిపోవడం చూచి మురారి కూడా ఆశ్చర్యపోయాడు. ఎప్పుడూ అందరి తోనూ కలసి సరదాగా మాట్లాడే మనిషి నేడు ఇలా ఎందుకు చేసిందా అనుకున్నాడు.

ఆనంద్ పుట్టిన పండుగ రోజున మురారి కుమార్ని భోజనాన్కి పిలిచాడు. ఆనాడు కూడా విజయ వడ్డనప్పుడు కానీ, తరువాత కానీ తల యెత్తి అయినా కుమారు చూడలేదు. ఇది గమనించి అతని మనస్సు చివుక్కుమన్నది దీనికే ఒకసారి ఆవిడనే అడిగి తెలుసుకొంటే సరిపోతు దని సమయం కొరకు వేచియున్నాడు. ఇప్పుడు మురా ఇంటికి తరచు వస్తూన్న కుమారుకి తను వేచియున్న సమయం కొద్ది రోజులలోనే దొరికింది.

ఆరోజు మురారి, వసంత ఇంట్లో లేరు. ఆనందాన్ని ఆడిస్తూ విజయ ఒక్కతే కూర్చునుంది. కుమార్ ఆ సందర్భాన్ని ఉపయోగించదలచి "ఏం విజయ! నన్ను ఎప్పుడూ చూడనిదానివలె నటిస్తున్నావు?"

బదులేమీ రాలేదు. "పెద్దవాళ్ళు వుత్తరాలు జరుగు తుండాలి. ఇంకా కొద్ది రోజులలోనే తాంబూలాలు తీస కుంటారనుకున్నాను. నీకు ఇష్టంలేదా?" అన్నాడు కుమార్

"నా ఇష్టాయిష్టాలతో ఇప్పుడు పనిలేదు. ఉత్తరాల కూడా మానుకున్నారు!"

"ఆఁ! ఎందుకని?"

"మీరు కోరిన డబ్బు ఇవ్వడాన్కి మా నాన్నగార సమ్మతించలేదు. నేనుకూడా ఒద్దన్నాను. అందుకని వీ వాళ్లు మానుకున్నారు."

"డబ్బా! ఎవరడిగారు?"

"ఏం తెలియని వారివలె అడుగుతున్నారే! మీనాన్న గారే నెల క్రితం మా నాన్నగారిస్తానన్న ఐదు వేల కట్నం చాలదని కబురంపారు. వేలకు వేలు డబ్బు లాగడాన్కి ముందు వెనుక చూడని విద్యావంతులుకూడా వుంటారని నేననుకోలేదు"

"ఇదంతా కొత్తగా వింటున్నాను. నేను మా నాన్న గారితో కట్నం మాటే ఎత్తవద్దన్నాను. ఎందుకా ఇంకా ఉత్తరం రాలేదనుకున్నాను. ఇదా సంగతి!"

"అయితే మీకు కట్నం తీసుకోవడం అసమ్మతమేనా!"

"ఆ, ఎప్పటికీ నాకా ఆలోచనే లేదు. మొన్న నీవు

# ఇష్టార్ధసిద్ధి

'నమస్తే' అని వెళ్ళిపోగానే ఆశ్చర్యపోయా. ఇప్పుడంతా అర్ధమౌతూంది. ఇప్పుడేం చేద్దాం?"

"చేయడాన్కేముంది! మీ నాన్నగార్కి కట్నం ఆశ వుంది. నేను మా నాన్నగారిని కట్నమే ఇవ్వకూడ దంటున్నాను. ఈ సమస్య పరిహారమయ్యే దారే లేదు!"

"లేదని వూరికే వుండడమా! మురారితో కలిసి ఆలోచిద్దాం!" అంటూండగానే మురారి, వసంత ఇంట్లోకి వచ్చారు.

కుమార్‌ని చూడగానే "ఎంతసేపయిందోయ్ నీవు వచ్చి?" అంటూ ప్రక్కన కూర్చున్నాడు మురారి. "ఇప్పుడే వచ్చాను. మీరు ఇంట్లో లేరంటే కొంత సేపు చూసిపోదామని కూర్చున్నాను. మీతో మాట్లాడాలి" అంటూ కుమార్ విజయ వేపు చూడడం, విజయ సమ్మతి తెలియజేస్తూ తల వూపడం చూచి మురారి, వసంతా ఇద్దరూ నిర్ఘాంత పోయారు. నాకు మర్యాదకైనా ఒక మాట మాట్లాడని విజయ నేడు ఎంతో చనువుతో ప్రవర్తిస్తూందేనని. కుమార్ చెప్పిన సంగతులు విన్నాక వారిద్దరూ ఆశ్చర్య చకితులయ్యారు.

"అమ్మ దొంగా! ఇదంతా మాకు తెలియకుండానే జరిపారన్నమాట!" అని విజయని వేళాకోళాలు చేస్తూ "అయితే ఇప్పుడు ఏం చేయాలని మీ ఆలోచన?" అని ప్రశ్నించాడు మురారి.

"మీరు నాకు సహాయం చేస్తానంటే ఈపని అనుకూలంగా ముగించగలను. నేను రేపే మా నాన్నకి వుత్తరం వ్రాస్తాను. నాతో పనిచేసే శ్రీ మురారి యొక్క మరదల్ని పెండ్లి చేసుకోడానికి నిశ్చయించానని. దానిపైన యేం జరుగుతుందో చూద్దాం" అన్నాడు.

సరే నని ఒప్పుకున్నారు మిగతా వారు.

కొడుకు దగ్గరనుండి వచ్చిన ఉత్తరాన్ని చూడగానే బందరులో రంగారావు గాబరాతో యెవరో, యేకులమో అని భయపడుతూ, స్వయంగానే విచారించి వస్తే మంచిదని తిరుగుబండిలోనే బయలుదేరి మద్రాసు చేరుకున్నారు.

తన వుత్తరాన్కి వెంటనే వచ్చిన తండ్రిని చూచి కొంత భయపడ్డా, ఇదీ ఒకవిధాన మంచిదే అనుకున్నాడు కుమార్. కుశల ప్రశ్నలు కాగానే ముఖ్యవిషయాన్కి వచ్చారు రంగారావుగారు.

"ఏం కుమార్! ఏమిటి నీవు వ్రాసిన సంగతి! నిజమేనా?"

"అవును నాన్నగారూ. నిజంగానే వ్రాశాను. మురారి మా మేనేజరు. మనవాళ్ళే. గౌరవంగల కుటుంబమే. ఇంతకీ నాకు పిల్ల నచ్చింది గనుక చేసుకోదల్చుకున్నాను"

"పెద్దవాళ్ళెవరూ లేనట్టే నువ్వే అంతా నిశ్చయించుకున్నట్టున్నావే? నేనూ, మీ తల్లీ వున్నసంగతే మర్చిపోయావా?"

"లేదు నాన్నగారూ! ఇన్ని రోజులూ మీ మీద భారం వదలి నేను ఊరుకున్నందుకు ఏం జరిగింది? మీరు ముందు చూచిన రామచంద్రరావుగారి సంబంధం ఏమయింది? నేను కట్నం తీసుకోకూడదని ఎంత చెప్పినా మీరు ఐదువేల రూపాయిలు కూడా చాలదని కబురంపారటగా?"

"వారే ఇస్తామన్నారు ఐదువేలు. నేనేం ఇంతని అడగ లేదు. యెవరాచెప్పింది?"

"అయిదు వేల రూపాయలు! వారు యెన్నేళ్ళు కష్టపడి సంపాదించిందో? మీకు ఎందుకు అంత డబ్బు? నా చదువుకు ఖర్చుపెట్టిందన్నారానీ అంటారేమో. నన్ను మీరు చదివించినట్టే వారు వారి కూతుర్నికూడా చదివించారుగదా బి.ఏ. దాకా. వారికి మాత్రం డబ్బు ఖర్చు కాలేదంటారా? ఈ పెండ్లితో వారికి కూతురి బాధ్యత తీరిపోతుందా? వాళ్ళ గోళ్ళమీద కొట్టి లాక్కున్న డబ్బు మనకేం సంతోషాన్ని ఇవ్వదు. అందుకనే నే నిప్పుడు చెప్పిన అమ్మాయిని ఒక దమ్మిడీకూడా కట్నం లేకుండా పెండ్లి చేసుకో దల్చుకున్నాను."

"నిన్ను ఇంతా పెంచి పెద్దవాణ్ణి చేసినందుకు మంచి మర్యాదే ఇచ్చావులే!"

"నాన్నగారూ. ఈ విషయంలో మట్టుకు మీరు బాధ్యతంతా నామీద వదలాలి. ఇంకే విషయంలోనైనా మీ మాట కాదంటే ఒట్టు!"

"ఒట్లకేంలే! అయితే ఇప్పుడు నీ ఇష్టం వచ్చినట్టు జరగాలి అంటావు. అంతేనా? కానీ, నీవే మిగతా విషయాలు మాట్లాడి మమ్మల్ని రమ్మని వ్రాస్తే ఆ వేళకు వస్తాము. నేను ఇప్పుడే వూరికి వెళ్ళిపోతా," అంటూ

# ఇష్టార్థసిద్ధి

సంచీని చేతబుచ్చుకుని లేచాడు. ఆ వేళకు సరిగ్గా లోపలకు వచ్చిన మురారిని చూచి, కుమారు.

"ఈయనే నాన్నగారూ. నేను చెప్పిన మురారి" అంటూ పరిచయం చేసాడు.

"నమస్కారం" అని మురారి అన్నా, బదులేమీచెప్పక, ధుమ ధుమలాడే మొహంతో నిల్చున్నారు రంగారావుగారు.

కుమారు మొహం చూచి సంగతంతా తెలిసింది అని గ్రహించి, "మిమ్మల్ని ఇలా కలుసు కోవడం చాలా సంతోషం, నేనే మీవూరు రావాలనుకున్నాను. మీరు అంగీకరిస్తే నా మరదల్ని మీ కుమారునకు ఇచ్చి వివాహం చేయ నిశ్చయించాము. పెద్దలు మీరు ఆశీర్వదించాలి" అన్నాడు మురారి.

"హుం. పెద్దలు! పెద్దలని మీరేం మర్యాదించారు? అంతా కుదుర్చుకున్నాక నాకు తెలియజేసి. అంగీకరించాలట! ముందుకు కూడా మీరే అన్ని విషయాలు మాట్లాడి లగ్నం ఎప్పుడో తెలియజేస్తే వస్తాము. అదీ వాడి తల్లి యేడుస్తుంది గనుకనూ," అంటూ తను లొంగిపోయానని తెలిపాడు.

"అమ్మాయిని మీరు కూడా ఒకసారి చూస్తారా?" మురారి అడిగాడు మర్యాదగా.

"నేను చూడడం ఎందుకు? ముఖ్యమైనవాడే ఒప్పుకున్నాడుగా! నా అభిప్రాయం అనవసరం" అన్నారు.

వాళ్ళిద్దరూ ఎంత చెప్పినా వినక ఆనాడె బయలుదేరి బందరు వెళ్ళిపోయారు రంగారావు.

జరిగినదంతా మామగార్కి వుత్తరం వ్రాశాడు మురారి. రామచంద్రరావు వీరు పన్నిన పన్నాగాన్కి ఎంతో ఆశ్చర్యపోయారు. పెద్ద వాళ్ళని కాదని, వారు కార్యాన్ని ఇంత వరకూ సాధించారని ఖేదపడ్డా, చివరకి విజయ తను అన్నట్లే కట్నం లేకుండా మొగుణ్ణి సంపాయించినందుకు చాలా సంతోష పడ్డారు.

పెండ్లినాడు కోపంతో యెవరితోనూ మాట్లాడకుండా ఇటూ అటూ పచారు చేస్తూన్న రంగారావుగారు ఎదురుగా వచ్చి నిల్చున్న రామచంద్రరావుగార్ని చూడగానే నిర్ఘాంతపోయాడు. 'ఇతనెక్కడ వచ్చాడా?' అని.

"క్షమించాలి. ఇంతవరకూ ఎవరమ్మాయి అః తెలియపరచని తప్పంతా మీ అబ్బాయిదే. చిన్నవాళ్ళు వాళ్ళేదో తామే ముందు నిల్చుని ఇంత వరకూ తెచ్చారు మనం పెద్దవాళ్ళం వున్నసంగతికూడా మర్చిపోయినట్టు ప్రవర్తించారు. మనమే వార్ని క్షమించి వూరుకోవాలి' అని రామచంద్రరావు అన్న మాటలు విని అక్కడే కుర్చీలో కూల బడ్డారు రంగారావు.

'నాడే ఒప్పుకుంటే ఐదు వేలన్నా చేతిలో పడేవి. ఆశకుపోతే అదే సంబంధం అసలే కట్నం లేకుండా చేసుకోవలసి వచ్చిందే' అని దుఃఖించారు రంగారావు.

కుమారు, విజయ ఇద్దరూ వారు పొందిన విజయాన్కి ఎంతో సంతోషించారు. ★

## ★ స్వప్నవాసి ★

అనువాదం: శ్రీ ఆర్. సోమసుందర్.

నా స్వప్నాంబరమున తేలిపోవు సంధ్యా మేఘం నీవు.

ప్రేమాభిలాషలతో సదా నిన్ను చిత్రింతును; నిన్నలంకరింతును.

నా యనంత స్వప్నలోకవాసా! నీవు నా వాడవు... నీవు నా వాడవు!

నా సాంధ్యగానాలమూర్తీ! నా హృదయాకాంక్ష ప్రదీప్తితో నీ చరణ కమలాలు అరుణ రాగమును పొందినాయి.

నా వేదనా మదిరాస్వాదనంతో నీ అధరములు అత్యంత మధురతను బడసినాయి.

నా వివిక్త స్వప్నవాసా! నీవు నా వాడవు... నీవు నా వాడవు!

నా నిరావలోకనాగాధ సంచారి! నా కోర్కె నీడ నీ నేత్రములను నైల్యమ్మొసర్చింది.

ప్రేమైకమూర్తీ! నా గానజాలమందు నిన్ను పట్టి బంధించినాను.

నా అమర స్వప్నవాసా! నీవు నా వాడవు... నీవు నా వాడవు! ★

[రవీంద్రుని "తోటమాలి"నుండి.]

# ఇల్లరికం

శ్రీ కె. శశాంక్.

[వెనుకటిగాథ :— తన తండ్రికి ఏభై ఏళ్ళు నిండి, తనకుమించిన పిల్లలుండగా, మళ్లీ పెళ్ళేమిటని రామం మనస్సులో కలవరం పుట్టింది. ఒకనాడు తండ్రితో "నాన్నా నీవు పెళ్లి చేసుకోడం నా కిష్టంలేదు" అని నిర్మొగమాటంగా చెప్పేడు రామం. శంకరయ్య, బలే గట్టివాడు, ఎవరెన్ని అడ్డు చెప్పినా "నేను పెళ్లి ఆడితీరతా"నని జబాబిస్తాడు. ఆఖరికి కమల అనే యువతిని పెళ్లి చేసుకుంటాడు.

కమల కాపురానికొస్తుంది. ఇంతకుముందు శంకరయ్య మొదటి భార్య చేసిన పనులు, కుమార్తె శాంత ఆధిపత్యంలో శిధిలాలయి, యిప్పుడు కమల ఆధిపత్యంలో లలలెత్తినయ్. కమల స్వతహాగా మంచిదే కాని, ప్రశస్తల మెప్పుకోరే వ్యక్తి. అందుచే నలుగురూ వున్నప్పుడు సవితి పిల్లల్ని బాగా చూచేది. ఇవన్నీ రామానికి కిట్టేవి కావు. కమల ఆ యింటికి కొత్త అయినా ఆయింటి సంగతినంతా యిట్టే గ్రహించింది.

శంకరయ్య కట్నం యిచ్చి కూతురు పెండ్లి చేసి, కొడుక్కి డబ్బున్న పిల్లని చేద్దామని ఆశించాడు. కాని రామం డబ్బులేని మేనమామ కూతురు మాలతినే చేసుకుంటానంటాడు. దానికిష్టపడక తన మాట వినకపోతే ఇంట్లోంచి పొమ్మని తండ్రి అంటాడు. రామం, తండ్రి నెదిరించానని పశ్చాత్తాపపడి తన తప్పును తను తెలుసుకుంటాడు. కాని ఏమీ చేయలేక, మామయ్య దగ్గరనుంచి వచ్చిన వుత్తరానికి అంతకుముందు తను చేసిన వాగ్దానమే కారణం అనుకుంటూ, "అమ్మ వుంటే పేదవాడు మామయ్య కూతుర్ని కాదని ఇంకో సంబంధం స్థిరపరచడానికి ప్రయత్నించేదేనా? అంతగా డబ్బులేకపోతే ఒంటిమీద నగలేనా అమ్మిచ్చేది!" అని విచారంతో ఆ రాత్రంతా గడిపేడు రామం. ఇక చదవండి.]

౪

శంకరయ్య ఆనాడేదో రామంతో. అతని పెళ్ళిని గూర్చి అన్నాడు కాని ప్రస్తుతం దానికి ప్రాముఖ్య మిచ్చే దృష్టితో అడగలేదు. శాంత పెళ్ళి పనుల్లో నిమగ్నుడయ్యాడు అతను. పెళ్ళి ఇంకా మూడు నెలలుందనగా అప్పట్నుంచీ హడావుడి ప్రారంభించాడు గొప్పగా చేయాలంటూ. కానీ రామం హృదయంలో మాత్రం మాలతి అనుక్షణమూ మెసలటం ప్రారంభించింది. ఏపనైనా గుట్టు చప్పుడు కాకుండా చేసెయ్య గలడు శంకరయ్య. తన పెళ్ళి విషయంలో కూడా రామానికి స్వాతంత్ర్య మివ్వడా? అంటే అతను అంతవరకూ పోలేదు. అయినా రామం అనాలోచనాపరుడు. తెలియనివాడు తెలియనట్లూరుకున్నా, లేకపోతే కొంచెం ఆలోచించి పని చేసినా బాగుంటుంది. రామం అట్లా కాదు. ప్రతి దానికీ అనవసరమైన ఆవేశం చూపించటం, చివరికి ఆచరణలో కొచ్చేసరికి మెత్తబడటం అతని స్వభావం— లేకపోతే ఆచరించితీరాలని పట్టు బడితే అవమానం తప్ప మరేమీ లభించనట్లుగా చేసేవాడు పనులు.

తర్వాత రెండు రోజుల వరకూ రామం ఇంటికి రాలేదు. ఎక్కడికి పోయినాడో అని శంకరయ్య అందర్నీ పరామర్శించాడు. ఎవ్వరూ తమకు తెలియదన్నారు. చివరికి సుశీల చెప్పింది. విజయవాడ వెళ్ళాడు—అని.

శంకరయ్య, రామం విజయవాడ వెళ్ళిన పనిని త్వరగానే ఊహించుకోగల్గాడు.

మూడో రోజు మధ్యాహ్నం దిగాడు రామం. శంకరయ్య ఏమీ తెలియనట్లు "ఎక్కడికెళ్ళావురా?" అన్నాడు.

"విజయవాడకు...." అన్నాడు రామం ముక్తసరిగా.

"చెప్పలేదేం? చెప్తే ఏదైనా........ అయినా రామం! జరగబోయేదేదో తెలుసుకోకుండానే నువ్వు తొందర పడి ప్రవర్తిస్తున్నావు! మామయ్యేమన్నాడు?" అన్నాడు శంకరయ్య.

"నువ్వేవిషయ మడుగుతున్నావు?"

"నాకు తెలుసు. నువ్వక్కడికి ఎందుకు వెళ్ళావో?

నాకు తెలియచెప్పాలా దాక్షత !—— రామం; నువ్వు చాలా పొరపాటు పడుతున్నావు ! నీ పెళ్ళి విషయంలో కూడా నిన్ను నా ఆజ్ఞకు కట్టుబడి ఉండమని నేను అనను.... అయినా నిన్ను నే నేవిషయంలో కట్టి పెట్టి ఉంచానో చెప్పు !"

రామం నిరుత్తరుడై నాడు. నిజమే. శంకరయ్య తనకే విషయంలో అడ్డు పెట్టాడో అతనికి అర్థం కాలేదు. అడిగిన డబ్బు లేదనకుండా ఇస్తాడు. చేస్తానన్న మంచి పనిని ఒద్దనడు. కాని చూడటానికి గంభీరంగా కనిపిస్తూ లోపల ఉన్న ఆ మంచిని బైటికి కన్పించనిచ్చేవాడుకాదు. ఇంకా ఆశ్చర్యం ! శంకరయ్య పైపైకి గంభీరంగా— ఏదో ఊర్కుండేవాడు కాని, లోలోపల రామాన్ని చూస్తే అతనికి భయం !—— రామానికీ అంతే ! ఇద్దరూ ఒకళ్ళ కొకళ్ళు తెలియకుండా, ఛాకరికొకరు చూస్తే భయపడే వాళ్ళు !—— మళ్ళీ ఇద్దరూ ఏదో ఒక విషయం మీద భయమంతా మర్చిపోయి తీవ్రంగా మాట్లాడు కుండేవాళ్లు——

రామం మాట్లాడకుండా మేడపైకి వెళ్ళిపోయాడు. మాలతిని పెళ్ళి చేసుకోవటానికి "నాన్న ఇష్టపడటం లేదు." అని చెప్పాడు రామం మామయ్యతో బెజవాడకెళ్లి.

మామయ్య నిట్టూర్పు విడిచి అన్నాడు. "నువ్వేం చేస్తావులే నాయనా !....సరే ! నేను ఇంకో సంబంధం చూసుకుంటాను."

రామం తెల్లబోయాడు. అసలు తను వచ్చింది కేవలం ఆ మాట చెప్పటానికే కాదు. మాలతినే చేసుకుంటానని ఒకనాడు మామయ్యకు తాను ప్రమాణం చేసేడు. ఆ ప్రతిజ్ఞా భంగం కాకూడదు. తాను ప్రతిజ్ఞా పాలకుడిలా ప్రవర్తించి తీరాలని అతని పట్టుదల. అందువల్ల తండ్రి నోటినుంచి ఎప్పుడైతే "మాలతిని చేసుకోవటం నా కిష్టం లేదు" అన్న భావంతో మాట వచ్చిందో, అప్పుడే తొందర పడితే తప్ప లాభం లేదనుకున్న రామం, మామయ్య సలహాతో మాలతిని తండ్రికి చెప్పకుండానే చేసుకుందా మనుకున్నాడు.—— తర్వాత గతి తర్వాతే నంటూ ! ! కానీ మామయ్య అట్లా అంటాడని కలలో కూడా అనుకోని రామం, ఇప్పుడేవిధంగా మాట్లాడాలో ప్రాక్టీస్ చేసుకో లేదు. తను అనుకున్న దాంట్లో పీసమైనా తప్పుగా నడవ దనుకున్నాడు. మరిప్పుడు ఏమంటాడు? పైగా అనవర్థ తతో కొంచెం కోపం తెచ్చుకున్నాడు.

"ఏం నాకిష్టమే !" అన్నాడు సందేహిస్తూ చివరికి.

మామయ్య జాలిగా అతని మొహం చూసి, కొంచెం తటపటాయించి అన్నాడు. "నాకు తెలుసు బాబూ ! కాని ఎవరికి ఎవరు రాసిపెట్టారో, వాళ్ళతో తప్ప జరగటానికి వీల్లేదు. నేను నీ మీద కోప్పడను, నువ్వు మీ నాన్న చెప్పినట్టే విను. లేకపోతే ఈ ఒక్క మాలతివల్ల మీ కుటుంబం వేర్లు పడాల్సివస్తే పై లోకంలో అక్కయ్య ఆత్మకు శాంతి ఉంటుందా? అక్కయ్య బతికుండగా నన్ను ఆవిడ ఎంతో ప్రేమతో ఆదరించేది. ఆ ప్రేమకు ఫలితంగా ఆవిడ కుటుంబాన్ని చిక్కులలో పెట్టలేను బాబూ ! చిన్నతనం ఇంకా నీకు ! నేను పెదవాణ్ణినీ, కష్టం లేకుండా మాలతిని చేసుకుని నన్నుద్ధరిద్దామను కుంటున్నావు. కాని ఏమి లాభం? మీరు అనవసరంగా అల్లరిపాలవాల్సొస్తుంది."

రామానికి కోపం వచ్చింది.

"నేను ఇప్పుడు ఇంక గుంటూరు వెళ్తున్నాను" అన్నాడు సాధింపుతో. మామయ్య అతన్ని జాగ్రత్తగా పరిశీలించాడు. తర్వాత అతి సహజంగా నవ్వుతూ మృదువుగా అన్నాడు. "ఏమిటిబాబూ ! కోపమా?- మాలతిని చేసుకోవాలని ఉందా? అయితే.... ఆలోచించు రామం ! చూడు, నేను ద్రోహినౌతాను. కేవలం నా కూతురి పెళ్ళికోసం మిమ్మల్ని కష్టపెట్టటం బాగుండదు. నీ మనస్సులో మాటను దాచకుండా చెప్పు ! దాన్ని బట్టి ఆలోచించుదాం."

"ఆలోచనేమిటి?.... అసలు నేను నిజంగానే ఆలో చించకుండా ఒచ్చాను ఇక్కడికి. నేను మాలతిని చేసు కోను........" అన్నాడు కోపంగా రామం.... మామయ్య మృదుమధురపు పలుకులు అతన్ని అవమానపరుస్తున్నట్టు భావించాడు. ఆ యింట్లో అంతా తన దౌర్బల్యాన్ని చూసి ఏహ్య భావంతో చూస్తున్నారని భ్రమ పడ్డాడు. ఇంక అక్కడ ఉండాలని అతనికి అనిపించలేదు.

వెంటనే గుంటూరు కొచ్చేశాడు. రామం కోపంగా అన్న మాటలకు మామయ్య ఒక్క బాధాపూరితమైన చిన్న నవ్వును తప్ప మొహంలో ఇంకే భావమూ పొడగట్ట నీయలేదు——;

గుంటూరు కొచ్చిన ఆ రోజు రాత్రి ఈ విషయం మీద అతని మనస్సు అనేక ఆలోచనలకు దారితీసింది.

అసలు అట్లా అడగకూడదేమో? అయినా చదువుకుంటున్న వాడికి పెళ్ళిమీద ఇంత యావ ఏమిటీ? అనుకున్నాడు.

శంకరయ్య ఊర్కే నోటివెంట తన పెళ్ళి విషయమై మాలతి మీద అయిష్టపు మాట రానిచ్చాడో లేదో?—అప్పుడే ఇంత తాపత్రయమేమిటి? ఎంతో ఆదుర్దాతో, ఏదో మించిపోయినట్లు స్వయంగా మామయ్య దగ్గరికి పోయి అట్లా అడగటమన్న తన దౌర్బల్యమే, మామయ్య మాలతిని తనకివ్వనన్నట్లు మాట్లాడటానికి సగం కారణమై ఉంటుందనుకున్నాడు. మాలతి తన మాటలు విని తన నెలా అర్థం చేసుకుందో? "చిన్న నాటి మాలతా ఏం? అర్థం చేసుకోలేకపోవటానికి. అబ్బో! వాళ్ళెక్కడ. ఇంటర్ చదువబోతున్నది. నేనేమో వెధవ బి. ఎ.నాయె! అసలే నా చదువుని చూసి అసహ్యించుకుని ఉంటుంది. అందులో ఇంకి నా మాటలు విని ఇంకా ఎంత అసహ్యించుకుని ఉంటుందో? అసహ్యించుకోదూ? ఛీ! ఎవ్వరూ అక్కరలుకారు లోకంలో." అనుకుంటూ తన దౌర్బల్యాన్ని కప్పిపుచ్చుకోటానికి మాలతినీ, మాలతి చదువునీ ఎన్నో మాట్లు తనలో తను విమర్శించుకున్నాడు తీవ్రంగా........ ఎంత పేదవాడైనా మామయ్య మాలతి కేవిషయంలోనూ లోపం చెయ్యలేదు. ఆమె నొక సంపూర్ణ వ్యక్తిగా తయారు చేయాలని భావించాడు. ఇంట్లో ఊరికే కూర్చోట మెందుకని డబ్బు సంగతి చూడకుండా ఆమెను కాలేజీలో చేర్పించాడు.... నిజంగా మాలతి హృదయం ఎంతో పవిత్రమైనది.... సంస్కారం కలది.... అలాంటి మాలతిని తన చేతులారా వదులుకున్నాడు!!—.

రామం ఆలోచనలేమో సాగిపోతున్నాయ్, గాని "మాలతిని వదులుకోవటమా?" అన్న అతని సమస్య అట్లాగే పరిష్కార మార్గాన్ని వెతుక్కుంటూ అసమగ్రమంగా ఉండిపోయింది. చివరికి "మించి పోనిదాన్ని మించిపోయినట్లుగా పోయి పనిని చేతులారా చెడగొట్టుకున్నాను" అనుకుంటూ తన్నుతాను నిగ్రహించుకున్నాడు రామం.

౩

వేసవికాలం వచ్చింది, శాంత పెళ్ళిదగబ పడ్డది. వరుడు సూర్యప్రకాశం. బుద్ధిమంతుడే! తండ్రిలేదు. తల్లిమాత్రం భూములీ్ని వాటినీ చూసుకుంటూ. ఉన్న ఒక్కకొడుక్కీ ఇంతచదువు చెప్పించాలని ఆరాటపడింది. అట్లాగే ప్రకాశం కూడా తల్లిని చాలాప్రేమగా చూస్తూ ఆవిడచెప్పి నట్లల్లా వినేవాడు. మొదట్లో శాంతను చూసినప్పుడు పేరుబాగాలేదనీ, చదువులేదనీ అన్నాడు. కాని శాంత అందం అతన్ని ఆకర్షించిందనటంలో తప్పులేదు. ఇంత వరకూ అతనికి వచ్చిన సంబంధాల్లో స్థితిఎట్లా ఉన్నా, మర్యాదలోనూ, అందంలోనూ శాంత లాంటి వాళ్ళు ఎవ్వరూ కన్పించలేదు తల్లికి. అందువల్ల సూర్యప్రకాశం అందరికీకూడా "ఆలోచించి చెప్తాను" అని సమాధానం చెప్తూవచ్చాడు. ఇప్పుడు శాంతని చూడగానే ప్రకాశం తల్లి ఏఅభ్యంతరమూ చెప్పలేదు. ప్రకాశం అన్నాడు.

"చూసి చూసి చదువు లేనమ్మాయిని ఇష్టపడ్డా వేమిటమ్మా?"

తల్లి నిరుత్సాహ పడింది.

"అదేమిట్రా? చదువు కావాలంటే మనం చెప్పించు కోలేమా? అయినా ఆ అమ్మాయి థరుడుఫారం వరకు చది వించట. పెళ్లి అయినాక ఇంకాఏవో మెట్రిక్యులేషన్లూ అవీ ఉన్నాయిగా ........ పిల్లలుగలవాళ్ళు వాళ్ళేం చదువు చెప్పిస్తారు? మనమే చెప్పించు కుందాం ........ అయినా నీకిష్టం లేకపోతే చెప్పు నాయనా! ఆ తర్వాత మళ్ళీ...." అంది యుక్తిగా.

ప్రకాశమూ అదే ఆలోచనతో ఉన్నాడు. కోమలి అయిన శాంతను తల్చుకుంటూ అతనుపెళ్ళికి అంగీకరించాడు—

పెళ్లి అయిపోయింది. ప్రథమకార్య నిర్వహణలో శంకరయ్య అనేకవిధాలుగా లోటుపాట్లకుగురైనా, కమలా, ప్రకాశంతల్లీ ఓర్పుగా సద్దుకుపోయారు. అంతా శంకరయ్య పెళ్ళిబాగా చేశాడంటూ పొగిడారు. అల్లుడి హోదాకు లోపం రాకుండా డిన్నర్లూ, పార్టీలు చేశాడు ఊళ్ళో.

ప్రకాశంలో ధనవంతుడనీ, "అందరి కంటే అతీతుణ్ణి" అన్నభావం ఉండటంవల్ల మనిషిలో కొంచెం నీలుగు కన్పిస్తూంటుంది. ఎం. బి., బి. ఎస్., అయిపోయిన వెంటనే ఇంగ్లండు పోవాలనుకున్నందు వల్ల ఏనిమిదివేల కట్నం తీసుకోవలసి వచ్చిందని అన్నాడు.

మూణ్ణిద్రల కెళ్ళింది శాంత. మళ్ళీతిరిగి వచ్చిన మర్నాడు శంకరయ్యకు తేలుకుట్టి హఠాత్తుగా మరణిం

చాడు "మొన్న పెళ్ళేమిటి? ఇవాళ కష్టమేమిటి?" అంటూ వాళ్ళమీద సానుభూతి చూపించాడు. కమల అప్పటికి గర్భవతి. ఒక్క మాటుగా అనుకోని ఆపద వచ్చిపడే సరికి రామం నిశ్చేష్టుడైపోయాడు. అతనికి ఏటూతోచటంలేదు. ఇంట్లో పరిస్థితులు : ఇటు ప్రకాశాన్ని మూణ్ణిద్రలకు తీసుకొచ్చినమర్నాడు తండ్రిపోవటంతో, ఎంతైనా కొత్తల్లుడు, భయభక్తులతో మెలగకపోతే ప్రళయకాల రుద్రుడౌతాడేమో:— కాని ప్రకాశం సహృదయంతో వాళ్ళదుఃఖంలో పాలు పంచుకున్నాడు.

కర్మకాండ అంతాపూర్తయింది. కుటుంబ భారమంతా అతనిమీదే పడింది. బి. ఎ. కి ఈరోజుల్లో విలువేమిటి? ఇంకా చదువు కుందామంటే డబ్బులేదు. ఆస్తి అమ్మదామంటే, తిని చదువుకుందేన్ని రోజులు? ఇంట్లో ఎవరు సంపాదించి పెట్టేట్టు? రామాని కిప్పుడిప్పుడు తెలిసివస్తోంది. తన పెళ్ళికి తండ్రి డబ్బుకాంక్షించాడంటే అతని తప్పేమీ లేదు. కుటుంబరక్షణ కోసం, అతను ఆత్మీయతను కూడా లక్ష్యపెట్టని స్థితిలోకి వచ్చాడు- బి. ఎ. ప్యాసైనట్లు తెలిసింది. సరే! ఇది ఒకందుకు నయమే ! అనుకుంటూ ఉద్యోగాన్వేషణ ప్రారంభించాడు. చివరకు తండ్రిదర్జాయే ఒక విధంగా అతనికి తోడ్పడింది. మద్రాస్‌లో ఒకలాయర్, శంకరయ్య అంటే అత్యాదరంగా ప్రవర్తించేవాడు. తన తండ్రి మరణానికి అమితంగా విచారం వెలిబుచ్చుతూ ఉత్తరం వ్రాశాడు.

ఆ లాయర్ ఒకప్పుడు గుంటూరు కొచ్చాడు. అప్పుడు వాళ్ళింట్లోనే ఉన్నాడు. శంకరయ్య ఆస్తిఏమీ మిగల్చలేకపోయినా హోదాలో తనపిల్లలకుగానీ, తనకుగానీ, ఏమీ లోపం జరగనిచ్చేవాడు కాదు.

రామం ఉద్యోగం కోసం మద్రాస్ వెళ్ళి ఒకమాటు ఆ లాయర్‌ని కూడా కలిశాడు. లాయర్ రామాన్ని చాలా ఆదరించాడు. ఎంత ధనవంతుడైనా, అతనిలో కొంచెమైనా గర్వంలేదు. మఱి ఆడాళ్ళకేమైనా ఉందేమో?

లాయర్‌కి ఒక్కతే కూతురు చాలాకాలానికి పుట్టింది. పదిహేనేళ్ళుంటయ్. అందంగా, నాజూకుగా ఉంటుంది. గారాబు కూతురు కావటంవల్ల, ఇల్లరికానికి వచ్చే అల్లుణ్ణి అన్వేషిస్తున్నారు లాయర్ దంపతులు.

రామం వెళ్ళేసరికి లాయర్ రామ్‌ప్రసాద్‌గారు కూతుర్ని పిలుస్తున్నారు.

"శశీ! శశీ!" అన్నాడాయన. సన్నగా, నాజూగ్గా సాక్షాత్కరించింది శశి. ఆయన శశితో ఒక్కమాట మాట్లాడాడో లేదో రామం వచ్చాడు. ఉద్యోగం కోసం వచ్చిన రామం ఆమాట ఈమాట మాట్లాడి అసలు సంగతి బయటపెట్టాడు. రామ్‌ప్రసాద్ మృదువుగా అన్నాడు "రేపు, ఎల్లుండిలోగా నాకుతెలిసిన వాళ్ళదగ్గఱ కనుక్కుని చెప్తాను ........ నువ్వు అంత వఱకు ఇక్కడే ఉండు"

"ఆ. ఎందుకండి? నేనున్నచోట బాగానేఉంది. అన్నీ బాగానే ఉన్నయ్"

"ఫరవాలేదు. నేనూ ఆమాటకొస్తే గుంటూరు కొచ్చినప్పుడల్లా లాడ్జిలో ఉండలేక పోయేవాణ్ణనా? మీనాన్న మాట తీసేయలేకపోయేవాణ్ణి. కాబట్టి ఈపెద్దవాడిమాట కూడా అంత త్వరగా యిదిచేయకు." అన్నాడు నవ్వుతూ రామ్‌ప్రసాద్.

మూడోరోజున ఆయన రామంతో కలకత్తాలో తన స్నేహితుడైన ఒకఆఫీసర్ ఒకఉద్యోగ మిప్పించగల నంటూ హామీఇచ్చాడని "అంతదూరం వెళ్తావా" అని అడిగారు.

"అవును. అదే ఆలోచన. ఇంటినంతా నేనేచూసు కోవాలి. మఱినేను అక్కడికి వెళ్ళిపోతే ఇక్కడ వాళ్ళేమయేట్లు?"

"అయినా బి. ఎ, చదివినవాళ్ళ కింతమాత్రం ఉద్యోగం దొఱకటం కష్టమోయ్! మొదలవటమే 300 రూపాయలతో అంటే ముమ్ముందింకా ఎంత అభివృద్ధి ఉంటుందోచూడు" రామం ఆమాటలువిని చిన్నబుచ్చుకున్నాడు. నిజమే ఆయన అన్నది! బి. ఎ. చదివినవాళ్ళకు, వెంటనే ఇంత మాత్రం ఉద్యోగం ఎవరికొచ్చింది? ఈయనఏదో దేవుడల్లే అడ్డుపడ్డాడు కాబట్టికాని!!

"అవును ఎట్లాగో సద్దుకోవచ్చులెండి? వెళ్తాను. మఱి ఎప్పుడు వెళ్ళాలో ఏమిటో? ఉద్యోగం స్థిరమైనదేనా?" అన్నాడు.

"అవును. ప్రస్తుతం నేను ఆయనను కనుక్కున్నది ఏదైనా ఖాళీఉద్యోగం విషయం మాత్రమే! మిగిలినవి కూడా వివరంగా తెలుస్తయ్యిలే! నువ్వింక దాన్ని గూర్చి ఏమీ బెంగపెట్టు కోనక్కర్లేదు."

"మీరు నాకోసం ఇంతత్వరలో, ఇంతగొప్ప సహాయం చేస్తారనినేను ఆశించలేదండి. మీకు నాకృతజ్ఞత నెట్లాతెలియ పరచుకోవాలో అర్థంకావటంలేదు మఱి."

(తరువాయి 44—వ పేజీలో)

## క థా ని క :



• శ్రీ ఆయపిళ్ళ సత్యనారాయణమూర్తి •

చిన్న గాలివాన— తిరిగి కాస్సేపటికి అనుకూల పరిస్థితుల్లో చల్లబడటం— ఆయింటి రివాజని కొద్ది కాలం నుండి అనుభవంగల ఆ ఇరుగు పొరుగు యిళ్లకు అందరకూ తెలిసిందే.

చూడబోతే- ఇద్దరే వ్యక్తులు.... పైవాళ్ళా అనుకుంటే- అలాగూ కాదు.... స్వయానా భార్యాభర్తలు....

ఒకర్ని వొకరు చూసుకుని, నచ్చుకుని మరీ పెళ్ళి చేసుకున్న కొత్త పెండ్లి జంట!—

ఇలాటి యిద్దరిమధ్యా యీ గాలివానకు ఆ ఇరుగు పొరుగు అమ్మలక్కలకు అర్థం కాలేదు— సరికదా— వీరి ప్రవర్తన వారికి పిచ్చాపాటీలో పిట్టకథలయి కూచున్నయ్.

వారు ఎట్టా— ఎందుకు పోట్లాడుకున్నదీ- అసలు సంగతి ఎవ్వరికీ తెలియదు—

ఆ అమ్మాయి ఎప్పుడన్నా వొకళ్ళ ఇళ్ళకు వెళ్ళడము గాని, ఒకరితో మంచి చెడ్డలు చెప్పుకోవడముగాని చేయదాయను.

ఇంక వీళ్ళకూ ఆయింటి ప్రవేశానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫల మయ్యాయి.

ఒకనాడు వారిద్దరూ ఎందుకో తగువులాడు కున్నారని- మొగుడు ఖర్రున ఆఫీసుకు వెళ్ళిపోయాడని ఆ పొరిగింటి అమ్మాయి తన అమ్మతో చెప్పింది—

ఆయింటి పరిచయానికి ఇదే అదననుకుని పొరుగావిడ అతి చనువుగా వారింటికి వెళ్ళింది.

తగూలాడుకున్న చిహ్నాలేమీ ఆమెకు ఆయింటిలో కనిపించలేదు— మొగుడితో దెబ్బలాడింతర్వాత ఏ యిల్లాలయినా, పెరటి చీడీమీదగాని— వంటింటి ద్వారం దగ్గరగాని, నడి సావిట్లోగాని చీర చెరుగు పరుచుకుని పడుకోవాలి— అధమం— మంచంమీదనన్నా బోర్లాపడిఉండాలి.... ఛ-ఛ!- ఆపిల్ల అట్టాటివేమీ చెయ్యలేదు— సరికదా— తనకేమీ కాదన్నట్టు— పడకకుర్చీ మీద కూచుని హాయిగా పుస్తకం చదువుకుంటూంది.

పొరుగావిడ ఇది చూచి మహా ఆశాభంగం పడ్డది.

పొరుగావిణ్ణి చూచి ఆ అమ్మాయి తనకెదురుగానున్న బెంచీచూపి "కూచోండి పుల్లమ్మత్తా!" అంది నవ్వుతూ.

పుల్లమ్మ కూచుందేగాని ఆ అమ్మాయిని ఎలా పరిచయం చేసుకోవలెనో, ఎక్కడ తను ఉపోద్ఘాతం ఆరంభించాలో తోచలేదు.

ఆ అమ్మాయే తిరిగి ప్రశ్నించింది. "ఏం పుల్లమ్మత్త యిట్లా వచ్చావు?"

పుల్లమ్మ తేరుకుంది—

"ఏమిలేదమ్మాయీ! ఊరికేనె వచ్చాను.... మరంతె నువ్వు అలా నీరసంగా వున్నావేమమ్మా!"

"నేనా? ... నాకేమి?.... బాగానే వున్నానే!...."

పుల్లమ్మ ఆ విషయం మరేమీ మాట్లాడలేకపోయింది. "మొగుడు ఆఫీసుకు వెళ్ళిపోయాడమ్మా?" అని అడిగింది.

"టైము అయిందిగదమటండీ.... వెళ్ళారు!"

"భోజనాలయినాయా అప్పుడేనూ?"

"అయినాయండీ!"....

పుల్లమ్మకు ఏ విషయంలోనూ అమ్మాజీ పట్టుబడలేదు. ఇంకా ఏమి మాట్లాడితే ఏమి పొరపాటోనని మెల్లిగాలేచి "వెడతానమ్మా.... చక్కా నువ్వేసయం త్వరగా పనులన్నీ తెముల్చుకున్నావు. ఇంకా మా యింట పొయ్యిలో నిప్పన్నా వేయలేదు." అంది.

"ఊఁ" అనేసి అమ్మాజీ గ్రంథ పఠనానికి పూనుకుంది.

పుల్లమ్మ వెళ్ళిందేగాని వాళ్ళంతా మండింది!... అమ్మాజీ స్థానంలో మరో ఆడదే వున్నట్టయితే- వెళ్ళిపోటానికి లేచిన పుల్లమ్మను చూసి— "కూచోవమ్మా వెడుదువుగాని" అని అనదూ!....

అమ్మాజీ మాటవరసకన్నా అలా అనలేదు....

ఇట్లాంటి ఆశాభంగం పొందినవారే ఆ అమ్మలక్కలందరూ కూడ- అందువల్లనే అమ్మాజీ యింటి గుట్టు కనుక్కొందికిగాని, వాళ్ళ వ్యవహారాల్లో జోక్యం చేసుకుందికి గాని ఎవరికీ సాధ్య పడలేదు.

అందువల్లనే అమ్మాజీ యింటి వ్యవహారం వీరి నోటికి ఊహాగానమయిపోయింది.

అమ్మాజీ చదువు కున్నదనీ, అందువల్ల ఆమెకు మహా గర్వమని, మొగుడు వచ్చినా కుర్చీలోనుండి లేవదనీ, అతని మాట వినదనీ, ప్రతీదానికి అతగాణ్ణి సాధిస్తుందనీ- ఇట్లానే పిట్టకథలల్లుతూ, వాటికి చిలువలూ, పలువలూ పెంచి వన్నెలూ, చిన్నెలూ చేసి, ఆమె మీద చెప్పుకుని, ఆమె స్త్రీత్వానికి లోపం చూపించి సంతోష పడుతూ వుండటం ఆ ఆడసమూహానికి అలవాటయి పోయింది.

ఈ ఆడవారి సమావేశములో ఒకనాడు ఓ పూర్వ సువాసిని అందికదా— "అసలు అతగాడికి బుద్ధి చెప్ప వద్దటమ్మా?" అని అడిగింది.

"ఎట్లాగమ్మా! ఏమయినా చదువుకున్న స్త్రీ కదా!" అన్నది మరొకామె. "ఆఁ చదువుకుంటే మట్టుకు- దానికి నాలుగు రెట్లు చదివేడటగా అతగాడు. అమాత్రం అదు పులో వుంచుకోలేడూ!" అని ఖండించింది మరొకర్తి.

ఇట్లా వీరందరూ కూడి ఆ సమావేశంలో - అసలు అమ్మాజీ మొగుడు ఎంత చదువుకున్నా ఏమీ చేతకాని వాడని తేల్చేశారు. దీనికి ఓనాడు వారికి ఋజువు కూడ దొరికి పోయింది.

ఆ రోజు అమ్మాజీ మొగుడు ఇంటికి వచ్చేసరికి తలుపులు తాళాలు వెసివున్నై.

చీకటి పడేవరకూ అలా గుమ్మం మీద కూర్చుండి పోయాడు దారిలో కొన్న పత్రిక పేజీలు తిరగవేస్తూ.

పొరుగింటావిడ అడిగింది కూడానూ. "అమ్మాజీ ఎక్కడికి వెళ్ళిందీ?" అని.

"మీటింగుకు కాబోలండీ!" అని జవాబిచ్చాడు.

"అలాగా. నీతో చెప్పి వెళ్ళలేదుటోయ్."

"చెప్పింది లెండి!"

ఎదరింటావిడ ఇదంతా వింది. అయినా పుల్లమ్మను అడిగింది తన గుమ్మంలోనుండే "ఏమిటి పుల్లమ్మ వాదినా?" అని.

పుల్లమ్మ తన గుమ్మంలోనుంచి కేక వేసింది. "ఆఁ ఏమిలేదూ. అమ్మాజీ మీటింగుకి వెళ్ళిందట. యింకా రాలేదు...."

"అయ్యో పాపం!.... తాళంచెవి నీచేతికిచ్చినా బాగుండిపోనూ."

"అదే నేనూ అంట! తాళంచెవి నా కిచ్చెస్తే నే నిచ్చాయనూ.... పాపం సాయంత్రం అనగా వచ్చి అలాగే కూర్చున్నాడు...." అన్నది పుల్లమ్మ సానుభూతి ప్రకటిస్తో.

"అట్లా తాళంచెవ్వి యివ్వని మనిషి వేళకు వచ్చేయెద్దు టమ్మా— ఎంత మీటింగులయినానూ.... మగవాడు వీధి గుమ్మంలో ఎంతసేపని కూచుంటాడు.... మరీ రోజులు మితి మీరిపోతున్నాయి" అని ఎదురింటావిడ అమ్మాజీని దుయ్యబట్టింది.

వీథులో ఆడవాళ్ళందరూ ఎవరి గుమ్మాల్లో వాళ్ళు నించుని ఒకరితో మరొకరు 'వైపులెస్'లో ఈ విషయాన్ని ముచ్చటిస్తూనె వున్నారు.... మధ్య అమ్మాజీ మొగుడు ఆ సంభాషణ తనది కానట్టు వూరుకుని పుస్తకములో పేజీలు తిరగవేస్తూనె వున్నాడు.

అమ్మాజీ వచ్చి జట్కాబండి దిగింది.

అమ్మాజీ రాగానె దాని మొగుడు దేహ శుద్ధి చేస్తాడని, కనీసం నాలుగు ముక్కలూ అమ్మాజీమీద రోడ్డుమీదనె దులిపేసి, తరువాత ఇంటికి తీసికెళ్ళి నాలుగు తగల నిస్తాడని, అంతతో దానిపొంక కొంత వరకూ అణుగుతుందని అందరు ఆడవాళ్ళు అనుకున్నారు. అలా అయితే వాళ్ళకు కొంతవరకూ మనశ్శాంతి వుండేది.

అయితేనేం. పాపం!.... ఇలా ఏమీ జరగలేదు.

అమ్మాజీ మొగుడు లేచి, నవ్వుతూ వెళ్ళి ఆమె చేతిలో సంచీ తను అందుకుని, జట్కా వానికి డబ్బులిచ్చి నల్లగా ఇంట్లోకి దారి తీశాడు. వెర్రి నాగమ్మలాగ!.

ఇది చూచిన ఆడంగులు ఛీ! ఛీ! అనేశారు. కొందరు అమ్మాజీ మొగుడు వొట్టి చేతకానివాడని, కొందరు అట్లాంటి వాణ్ణి కట్టుకున్నందుకు అమ్మాజీ అదృష్టం ఫలించిందని అనేసుకున్నారు....

పరిస్థితు లిల్లా వుండగా—

అమ్మాజీకి ఓనాడు వొంట్లో సుస్తీ చేసింది. ఇంట్లో చాకిరీకని వాళ్ళ అమ్మమ్మ వచ్చింది.

ఆ వీధి ఆడంగులందరూ అమ్మమ్మను తమ వీధి పురాణానికి ఆహ్వానించి అగ్ర తాంబూలం యిచ్చారు.

రెండు రోజులయింతర్వాత మామూలుగా అమ్మమ్మ పిచ్చాపాటీకి వచ్చింతర్వాత ఆడంగులు ఇంటి భోగట్టా పైకి లాగారు.

అమాయకురాలు అమ్మమ్మ యేం చెబుతుంది.

"ఏమోనర్రా నాకూ అది తెలియదు.... ఊరికే ఏదో మాటా మాటా అనుకుంటారు. సరి మాటలు మానుకుంటారు..... తరువాత చిన్న పిల్లలల్లె అన్నీ మరిచిపోతారు—"

"దేని గురించి అల్లా వాదించుకుని మాటలు మానుకుంటారేం?" అని నిలదీసి అడిగింది ఓ ఆవిడ.

"కారణం ఏమీ వుండదమ్మా! ఏవో దేశంలో భోగట్టాల గురించి— ఒకరు నంది అంటె— కాదు పంది అని మరొకరు ఖండిస్తారు గట్టిగా— ఇగ్లీషులో కూడ వాదించుకుంటారు— తరువాత మాటలు ముడుస్తారు. యింతే!— ఇట్లాగే ఓరోజు దేముళ్ల గురించి— ఎవరో నాయకుల గురించి— ఏమని చెప్పనూ ఏదో విషయం గురించి వొకరు దక్షిణధృవం రెండోవారు ఉత్తరధృవం! ఎందుకర్రా ఆ అక్కరలేని వాదనలూ అంటే— ఇద్దరూ కూడ ఒకటయి ఊరుకోవే అంటారు నన్ను"

అమ్మమ్మ చెప్పింది వాళ్ళకు సబబుగా కనిపించలేదు. అసలు వ్యవహారం— ఇంకా వుంటుందని వాళ్ళంతా అనుకున్నారు.

వాళ్ళు అనుకున్నట్టుగానె ఆవాళ వాళ్ళింటి రభస వీధి పడ్డది— ఏమయ్యిందీ అంటె—

అమ్మాజీ మొగుడు తలుపులు తీసుకుని వీధిలోకి విసురుగా వెళ్ళిపోయాడు.

అమ్మాజీ కేక వేసింది—

"ఇదిగో! భోంచేసి వెళ్ళిపోరూ?.... నామాట వినరు కదూ!" అని ఎంత పిలిచినా వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు అమ్మాజీ మొగుడు.

అమ్మాజీకి అలుక వచ్చి ధబాలున తలుపులు వేసి గదిలోకి పరుగెత్తి మంచం మీద బోర్లా పడుక్కుని వెక్కి వెక్కి ఏడ్చింది....

అమ్మమ్మ ఎంత చెప్పినా వినలేదు.... ఏడుపు మానలేదు.... మంచం మీదనుండి లేవనేలేదు.

ఇలాంటి విడ్డూరం కోసం కాచుకు కూచున్న అమ్మలక్కలందరూ ఆ వాళ వాళ్ళింటనె వున్నారు.... మంచి శాస్తే అయ్యిందిలే అని అంతా సంతోషించారు. అయినా అసలు దెబ్బలాటకు నాంది ప్రస్తావన లెట్లా వచ్చాయో— ఏమిటోనని వారందరూ అట్లానె అతగాని రాకకు కాచుకుని కూచున్నారు.

ఆ సాయంత్రం నీరసంగా యింటికి తిరిగి వచ్చాడు అమ్మాజీ మొగుడు. వస్తూనె అమ్మాజీ ఉదయం నుంచి అల్లానె పడి వున్నదని తెలుసుకుని మహా యిదయ్యాడు.

"ఎందుకల్లా పడుకున్నదీ?" అని అమ్మమ్మనడిగాడు.

"నీవు తింటే తినకుండా వెళ్ళి పోయావటగా దాని మాట వినిపించుకోకుండా"

"అది నా మాటవిన్నది కనుకనా?"

వీధి సావిట్లో ఆడంగులంతా గుస గుస లాడు కున్నారు. రాము అనుకున్నది నిజమేనని, ఆమె అతగాని మాట వినటం లేదనిన్నీ.... ఏం చేస్తాడు పాపం!.... తనంత మనిషిని కొట్టుకుంటాడా యేం? తను తిండి మానుకుని వెళ్ళిపోయాడు పాపం!

అమ్మమ్మ తిరిగి అన్నది.

"అది నీమాట ఏం వినలేదురా?"

"తను అన్నం తిన నన్నది కదూ! నేను ఎంత చెప్పినా ససేమిరా అన్నది"

"సహించలేదు కాబోలు"

"అబ్బాలు.... రోజూ నాపంక్తినే కూచుని తినేది కదా! ఇవాళ బొత్తిగా కూచుండటములేదు.... మరి నాకు ఎట్లా సహిస్తుందేం?" అని అమ్మాజీ మొగుడు చిన్న పిల్లడల్లే ఒళ్ళూ పైనా సిగ్గు విడిచినట్లే అంతా చెప్పేశాడు.

అమ్మమ్మ నవ్వింది.

"దానికి వొంట్లో బాగులేదురా. నీకు కాస్తంతయినా గ్రహింపు జ్ఞానం లేదురా వెర్రినాగమ్మ!"

అమ్మాజీ మొగుడు వెర్ర మొహం వేశాడు. ఇదేదీ అర్థం కాక నిజంగానె తనకు గ్రహించే జ్ఞానం సూన్యం అనుకున్నాడు. అమ్మమ్మ చెప్పింది— "నీ గురించే బెంగ పెట్టుకుంది. తను ఎట్లా చెప్పుకుంటుంది వెర్రిపిల్ల! వొంటో నలతగా వుందట!"—

అర్థం అయీ అవకుండా వుంది అమ్మాజీ మొగుడికి—

అమ్మమ్మ తిరిగి చెప్పింది.

"జంకవోదక గదిలోకి వెళ్లు!.... అమ్మాజీకి నెలతప్పింది!"

సావిట్లోనుండి నవ్వులు గొల్లున వినిపించాయి.

అమ్మాజీ మొగుడు ఛంగునెగిరి గదిలో మంచం మీద పడ్డాడు.




# చిలుక కథ

రచన : రవీంద్రనాథఠాకుర్.      అనువాదం : వైకుంఠరావు.

అనగా అనగా ఒక చిలుక. అది మూర్ఖురాలు; చదువు లేదు; కాని దానికి పాటలు వచ్చేవి. అది ఎగరగలిగేది, గంతులు వేసేది, కాని నియమానియమ జ్ఞానం మాత్రం ఉండేదికాదు.

రాజుగారొకనాడు దానిని చూచి, "ఇటువంటి పక్షివల్ల లాభ మేమిటి, వనంలో ఉండే పళ్ళను తినేస్తుంది, మనకు తినడానికి పళ్ళు లేకుండా అంతేనా?" అని అన్నారు.

మంత్రిని పిలిపించి "పక్షికి విద్య నేర్పించాలి" అని ఆజ్ఞ ఇచ్చారు.

పక్షికి విద్య చెప్పించే భారం రాజుగారి మేనల్లుళ్ళ మీద పడ్డది.

దేశంలో ఉండే పండితులందరు సభచేసి, "ఆ జీవుని అవిద్యకు కారణ మేమయి యుండును?" అనే విషయాన్ని గురించి వాదనలు జరిపారు.

చిట్ట చివరకు నిర్ణయించ బడ్డ సిద్ధాంతం ఇది— పక్షులు మామూలు కర్ర పుల్లలతోను, ఎండి రాలియున్న ఆకులతోను గూళ్ళను కట్టు కొనుచున్నవి; అట్టి గూళ్ళలో విద్యకు జ్ఞానమునకు తావు వుండదు. కనుక అన్నిటి కంటె మొదట చేయవలసినది సరియైన పంజర నిర్మాణము.

రాజ పండితులు దక్షిణలు, బహుమానాలు అందుకొని బహు ఆనందంతో ఇళ్ళకు వెళ్ళారు.

కంసాళ్ళు వచ్చారు. బంగారు పంజరం చేయడం మొదలు పెట్టి బహు అద్భుతమైన పంజరం ఒకటి తయారు చేశారు. అది చూడడానికని దేశ దేశాల నుండి జనం వచ్చి చూచి ఆశ్చర్య పోయారు; "విద్య అంటే ఇదీ!" అన్నారు కొందరు; "విద్య రాకపోతే రాకపోయింది అద్భుతమైన పంజరం మిగులుతుంది కదా!" అన్నారు మరి కొందరు. "అదృష్టం అంటారు దీనికే!" అన్నారు అందరూ. సంచులను రూపాయిలతో నింపుకొని అత్యానందంతో ఇళ్ళకు పోయారు కంసాళ్లు.

పండితులు కూర్చున్నారు విద్య నేర్పడానికి. "ఏ నాలుగు పుస్తకాలతోనో గడపుకోవలసిన వ్యవహారం కా"దన్నారు.

దేశంలో ఉండే లేఖకు లందరినీ పిలిపించారు మేనల్లుళ్ళు. శాస్త్రాలలో నుండి, పూర్వ గ్రంథాలలో నుండి ఎత్తి వ్రాయడం ప్రారంభించారు లేఖకులు. వ్రాసిన వాటి నకళ్లు తిరిగి వ్రాశారు. అన్నీ కలిసి పర్వత ప్రమాణం అయినవి. పండితులు, లేఖకులు పారితోషికా లందుకొని బహుమానాలతో ఒళ్లు నింపుకొని ఇల్లు చేరుకున్నారు. వాళ్ళకుండే సంసార బాధలన్నీ తొలిగిపోయినవి.

బహు ధన వ్యయం చేసి తయారు చేయించిన పంజరం అది. అది కాపాడే పూచీ అల్లుళ్ళమీద పడ్డది. వాళ్ళు అతి జాగ్రత్తగా ఉండవలసి వచ్చింది. పంజరం మరమత్తు నిమిత్తం ఏర్పాట్లు జరిగాయి. రోజూ ఏదో పని ఉండేది. ఆదికాక, దానిని కడిగించడం, తుడిపించడం దానికి మెరుగు పెట్టించడం ఉండనే ఉన్నది. ఎల్లప్పుడూ సందడిగా ఉండేది. పనిచేసేవాళ్ళు చాలామంది, వాళ్ళచేత పని చేయించేవాళ్ళు కూడా అనేకులు. నౌకర్లు, లాస్కర్లు, సూపర్ వైజర్లకు లెక్కలేదు. మాసం అయేసరికి

సందులు సందులు బటువాడా అయిపోయేవి. వీళ్ళూ, వీళ్ళ పిన తల్లుల బిడ్డలూ, పిన తండ్రుల బిడ్డలు, మేన మామ బిడ్డలూ చక్కని ఇల్లు కట్టించుకొని హాయిగా కాలం గడుపుకుంటున్నారు.

మనకు అవసరమైన వస్తువులు ప్రపంచంలో సమృద్ధిగా దొరకవు. కాని తప్పులు పట్టేవాళ్ళు మాత్రం లోకంలో లెక్క లేనంతమంది.— "పంజర వైభవానికి లోటు లేదు కాని, పక్షి సంగతి ఎవ్వరూ కనుక్కుంటు న్నట్టులే"దని ఆ తప్పులు పట్టేవాళ్లల్లో కొందరు అనడం ప్రారంభించారు.

ఈ మాట రాజుగారి చెవిలో పడ్డది. అల్లుళ్ళకు కబురు పంపి ఏమిటి సమాచారమని అడిగారు.

"నిజం తెలుసుకోవాలంటె కంసాళ్ళను, లేఖకులను, పండితులను పిలిపించండి. మరామత్తు చేస్తున్నవాళ్ళను, పై తనిఖీదార్లను పిలిపించండి. తిండికి లేనివాళ్ళు పర నింద చేసుకుంటూ తిరుగు తుంటారు. మీరు విన్న దాని రహస్యం అంతే" అని అల్లుళ్ళు జవాబు చెప్పారు.

రాజుగారికి సందేహనివారణ అయింది, సంతోషించి అల్లుళ్ళ మెడల్లో బంగారు హారాలు వేయించారు.

శిక్షణ బహుతీవ్రంగా జరుగుతున్నదని నమ్మారు రాజు గారు; ఒకనాడు స్వయంగా చూచివద్దామని బుద్ధిపుట్టి శిక్షా విభాగపు అధిపతులతోను, మంత్రులతోను, మిత్రులతోనూ బయలు దేరారు.

రాజుగారు శిక్షామందిర ద్వారందగ్గరకు వచ్చేసరికి బాజా బజంత్రీలు, నగారా ఢంకాలు వాయించడం మొదలు పెట్టారు. పండితులు తలలుఊపుతూ పిలకలు ఆడించు కొని ఉచ్చస్వరాలతో మంత్ర పఠనం చేస్తున్నారు. అల్లుళ్ల మంత్రులు గుమస్తాలు, నౌకర్లు, కంసాళ్ళు, లేఖకులు, వాళ్ళ పినతండ్రి కొడుకులు పెత్తల్లి కొడుకులు జయ ధ్వనులు చేస్తున్నారు.

అల్లుడు రాజుగారిదగ్గరికి వచ్చి, "చూచారా మహా రాజా?" అనిఅన్నాడు. "ఏమిటి ఈశబ్దం! అమితాశ్చర్యంగా ఉన్నదే!" అన్నారు రాజుగారు. "శబ్దంమాత్రమే కాదు మహారాజా, దాని అర్థమేమీ తక్కువకాదు" అన్నాడు అల్లుడు. ఆనందించి రాజుగారు ఏనుగెక్కి తవ ప్రాసాదానికి వెళ్ళిపోబోతున్నారు. ఆసమయంలో చెట్టు వెనుకను దాకొని కిట్టనివాడెవడో, "పక్షిని చూచారా మహారాజా?" అని అడిగాడు.

రాజుగారు ఉలిక్కిపడి, "అన్నట్టు! మరచిపోయినాను పక్షిని చూడనేలేదే!" అన్నారు.

రాజుగారు ముఖంత్రిప్పారు, "పిట్టకు విద్యరావడానికి మీరేమేమిటి చేస్తున్నారో నాకు కొంచెము కనపరచండి" అని పండితులను అడిగారు.

రాజుగారు ఏర్పాట్లన్నీ చూచారు, చూచి సంతోషించారు. అనేకరకాల ఏర్పాట్లు, వాటిఅన్నిటి మధ్యను పక్షి కనపడనేలేదు, కనపడక పోయినా విచారించవలసిన పని లేదు— ఏర్పాట్లు అంత బ్రహ్మాండమైనవి! ఏవిషయం లోనూ ఎటువంటి లోపమూ కానరాలేదు. గ్రంథరాశులలో నుండి పుట తరువాత పుట చించి ఆపుటలను కలం మూతితో పిట్టనోట్లో కుక్కుతున్నారు. పంజరంలో నీళ్ళు లేవు, పిట్టకు ఆహారంలేదు, చిలుక పాడుటలేదు సరేసరి. ఆరు బయటికి వచ్చేపాటి సుద్దైనా లేదు. చూచే వాళ్ళకు ఒళ్ళు పులకరించేది.

పక్షి ప్రాణంలేనట్టుగా బుద్ధిగా మర్యాదగా నడుచుకుం టున్నట్టు కనబడుతున్నది. విద్యాదాన ప్రయత్నం సఫల మవస్తున్నదని అధికార్ల మనస్సులలో ఆశకలిగింది. కాని స్వభావ దోషమువల్ల సూర్యోదయం అయ్యేసరికి పక్షి వెలుతురువైపు చూస్తుండేది. అక్రమంగా రెక్కలుకొట్టు కొనేది. ఒకొక్కనాడు వాడిన మూతితో పంజరం కడ్డీలు కొరక ప్రయత్నించేది కూడాను. కొత్వాల్ ఒకనాడు ఇది కనిపెట్టి పిట్ట పొగరుపోతు తనాన్ని గురించి అధికార్లకు తెలియచేశాడు. శిక్షావిభాగం తెలివి తెచ్చుకున్నారు. కమ్మర్లు వచ్చారు ఆయుధాలతో. ఇనపగొలుసు చేసి పిట్ట కాలికి సంకెళ్ళు వేశారు. పిట్ట రెక్కలుకూడా కత్తిరించేశారు.

పిట్ట ఆచరణచూచి రాజుగారి మేనల్లుడు సిగ్గుతో తల వాల్చు కున్నాడు "ఈరాజ్యంలో పక్షులకు బుద్ధి లేకపోవడం ఒక్కటే కాదు, వాటికి కృతజ్ఞతయినాలేదు మహారాజా," అన్నాడు.

పండితులకు రోషం వచ్చింది. ఒకచేతిలో తలనూ రెండోచేతితో బెత్తూ పట్టుకొనివచ్చి శిక్షావిధానం అతి తీవ్రంగా ఆచరణలో పెట్టడం ప్రారంభించారు.

కమ్మర్ల తెలివితేటలకు అందరూ మెచ్చుకున్నారు. వాళ్ళభార్యల మెడలు ఆభరణాలతో నిండాయి. కొత్వాల్‌కి రాజుగారు బిరుదుఇచ్చారు.

పక్షి చచ్చిపోయింది — ఎప్పుడు చచ్చిపోయిందో ఎవరూ ఎరుగరు. సదాతప్పులు పట్టుతుండే దౌర్భాగ్యులెవరో పిట్ట చచ్చిపోయిందని చాటడం మొదలుపెట్టారు. రాజుగారు అల్లుణ్ణి పిలిపించి దాని నిజమేమిటి అని అడిగారు.

"చదువు పూర్తి అయింది మహారాజా" అని అల్లుడన్నాడు.

"మునుపటిలాగు ఇంకా గంతులు వేస్తున్నదా?"

"అన్యాయం! తమరువచ్చి చూడండి," అని జవాబు చెప్పాడు అల్లుడు.

"ఇంకా ఎగిరిపోబోతున్నదా?"

"లేదు"

"ఇంకా పాటలు పాడుతున్నదా?"

"లేదు"

"తిండికోసం అరుస్తున్నదా?"

"లేదు"

"పిట్టను ఒకసారి ఇక్కడికి తీసుకురండి, చూస్తాను" అన్నారు రాజుగారు. పిట్టవచ్చింది. కొత్వాల్, నౌకర్లు మొదలైన వాళ్ళందరూ కూడా దానితోవచ్చారు. రాజుగారు పక్షిని నొక్కిచూచారు. పిట్ట నోటివెంట శబ్దంలేదు, దాని కడుపులోనుండి మాత్రం కాగితాల పెళపెళ మాత్రం వినబడ్డది.

బయట వసంతఋతు ప్రారంభంలో వీచే దక్షిణపు గాలికి కదులుతున్న చెట్ల చిగుళ్ళ మధురారవం ముకుళిత వనప్రదేశాన్ని సజీవం చేస్తున్నది.



# తెనుగు తల్లి

శ్రీ కన్నెకంటి వీరభద్రా చార్యులు

అనుఁగుచెల్లెల! పసిఁడిగద్దియ
నలరుచున్నది- అమ్మ యదిగో!
వినయ మొప్పఁగఁజేర జని దీ
వెనల నందుమురా!

పిలుచుచున్నది చెల్లెలా! నీ
లలిత విజ్ఞానంబు గొప్పది
విలువఁజేరిచి తెలుగుతల్లిని
నిలుపుకొను మమ్మా!

తెలుఁగుశీలము నేడునీలో
నిలుచియున్నది నిక్కువమ్ముగ
తెలుగు లక్ష్మిని చక్కదనములఁ
దీర్చి దిద్దుమురా!

నీవులేనిది తెలుగుతల్లికి
జీవమేలేదంచు చాటిరి
పావనాత్ములు— సోదరీ! నీ
భాగ్యమయ్యదిరా!

తెలుఁగు వెలుఁగుల నెల్లకాలము
నిలుపఁజాలిన తెలివితేటల
గలవు నీలో- ఆంధ్రలక్ష్మికి
బలముఁ గూర్చుమురా!

హారతుల నిడుమమ్మ మన బం
గారుతల్లికి సుగుణవల్లికి
కోరికలు నెరవేరు కాలము
కూడి వచ్చినది!



# ఉలవలు తిన్న బ్రాహ్మణుడు

• శ్రీమతి ఎ. సీతాదేవి •

అనగా అనగా ఒక ఊళ్ళో ఒక బ్రాహ్మణుడు భార్యా ఉండేవారు. ఆ బ్రాహ్మణుడు చాలా అమాయకుడు. భార్య గయ్యాళిగంప. ఆ ఊరిలోనే రాజుగారి కోటలో పురాణం చెపుతుండేవాడు. సంవత్సరమునకు ఒకసారి బ్రాహ్మణుడు ఏదికోరితే అది ఇవ్వటం మామూలురాజుగార్కి. సంవత్సరం తిరిగి వచ్చింది. రాజుగారు బ్రాహ్మణుని పిలిచి "నీకు ధాన్యమా, ధనమా, బంగారమా, దినుసులా? ఏవి కావలయు" నని అడిగెను. బ్రాహ్మణుకి దినుసులు అంటే నోరు వూరింది. వులవలు తినాలని చాలా రోజులనుండి వున్నది. అవి తినుటకు ఇదే సమయమని వెంటనే నాకు "వులవలు కావలయు" నని అడిగాడు. రాజుగారు సరేనని "మీరు వెళ్ళండి. నేను బండితో ఇంటికి పంపెద" నని చెప్పి రాజుగారు రెండుఎడ్ల బండితో గరిసెడు వులవలు పంపెను. బ్రాహ్మణుడి భార్య ఇది చూచి ఆశ్చర్యపడి "ఇది ఏమి" టని భర్తను అడిగెను. అప్పుడు భార్యతో బ్రాహ్మణుడు "నాకు వులవలు వుక్కించి నవి తినాలని వున్నది. రాజుగారు ధనమూ, ధాన్యమూ, బంగారం, దినుసులు వీటిలో ఏమి కావాలో కోరుకో మన్నారు. నాకు వులవలు తినాలని వుంది అందు చేత వులవలు అడిగే" నని చెప్పేడు.

బ్రాహ్మణుని భార్య "సరే" నని వీడికి తగిన శాస్తి చేయాలని ఆ రోజే కుంచెడు వులవలు నానపోసి అవి వేయించి అందులో శేరుకు ఎక్కువ కారం పోసింది. భర్తను పిలిచింది. పిలిచిందే తడవుగా వెళ్ళి విస్తరి ముందర కూర్చున్నాడు. బ్రాహ్మణుని భార్య విస్తరి నిండా వులవలు పోసి చిన్న గ్లాసుతో నీళ్ళు పెట్టింది. ఆతురతో చేతినిండా తీసుకుని నోట్లో వేసుకున్నాడు. నోరు అంతా ఒకటే మంట. తాగుదామంటే గ్లాసులో నీళ్ళులేవు! నీళ్ళు భార్యను అడిగేడు. "ఇంట్లో నీళ్ళు లేవు ఏమీ లేవు అవి అన్నీ తింటావా! తినవా!" అని చీపురుకట్ట పట్టుకుంది. బ్రాహ్మణుడు భార్యచేత దెబ్బలు తినాలేమో అన్న భయం చేత ఒకటే పరుగు తీశాడు. నోరు మంటకు ఓర్చలేక ఒక చెరువులో బుర్ర వంచుకు కూర్చున్నాడు.

రాత్రి 12 గంటలయింది. కొందరు దొంగలు రాజుగారి కోటలో కన్నం వేసి ఆ చెరువు దగ్గరకే వచ్చి కొబ్బరి కాయ కొట్టటానికి రాయికోసం వెదుకుతున్నారు. పాపం! బ్రాహ్మణుడి తల సిమ్మెంటు రాయికి మల్లే వున్నది. అది చూచి రాయే అనుకుని దొంగలు కొబ్బరికాయ కొట్టడానికి రాయి దొరికిందన్న సంతోషంతో కొబ్బరికాయతో గట్టిగా ఒక దెబ్బ కొట్టేరు. పాపం బ్రాహ్మణుడు భార్యే కొడు తున్నాదని "తింటానో తింటానో" అని కేకలు వేశాడు. బ్రాహ్మణుడు అరవటం తోనే దొంగలు రాక్షసో, భూతమో అనుకుని రాజుగారి కోటలో దొంగిలించిన ధనమూ, నగలూ అన్నీ చెరువు గట్టున వదలి పారిపోయినారు. పాపం బ్రాహ్మణుడు వులవలు తినుటకు ఇంటికెళ్ళాలని లేచి చెరువు గట్టు మీదకు వచ్చే సరికి నగలూ, ధనమూ కన పడినాయి. బ్రాహ్మణుడు నాలుగు దిక్కులా ఒకమారు చూచి ఎవ్వరూ లేకపోవుట చూసి అవి అన్నియు గామం చాలో మూట కట్టుకుని మూట మోయలేక మోయలేక మెల్లిగా ఇల్లు చేరాడు. తలుపు తట్టి మెల్లిగా భార్యను పిలిచేడు. చీపురుకట్టతోసహావచ్చి తలుపు తెరచిందిభార్య. బ్రాహ్మణుడు భార్యతో "నన్ను కొట్టకే నీకు కావలసిన నగలూ, డబ్బూ తీసుకు వచ్చా" నని చెప్పేడు. వెంటనే చీపురుకట్ట తలుపు మూలను పెట్టి "ఏవీ నా నగలూ, డబ్బూనూ" అని ఆతురతో మూట విప్పేసరికి రత్నాలూ, కెంపులూ, రూపాయల సంచులూ ఉండడంచూచి సంతోషంతోఅవిఅన్నీ పెట్టుకుంది. తనుతినుటకు కొద్దిగా కారం వేసి వేయించుకొన్న వులవలు తీసుకుని వచ్చి "నిన్న కారం ఎక్కువ అయినది. ఇవిగో ఇప్పుడే వేయించి మీకోసం ఎదురు చూస్తుంటే, ఇంతలో మీరే వచ్చారు" అని ఎంతో ప్రేమ వున్న దానిలా చెప్పింది. ఆ మరునటి రోజునుండి మోయలేని నగలు పెట్టుకుని భర్తకు పంచభక్ష పరమా న్నములతో వులవలుకూడావేయించి బ్రాహ్మణుడిని సంతోష పెట్టేది. భార్య ఇంత ప్రేమతో చూచుటకు కారణం 'వులవలే కదా!' అని బ్రాహ్మణుడు సంతోషించాడు. కథ కంచికీ మన మింటికి.






## ౧

జానికమ్మ, సీతారామయ్య మొదటినుంచి బాగా అనుకూలంగా ఉండేవాళ్ళు. ప్రతి చిన్న కుటుంబ విషయాన్నీ భార్యతో ఆలోచించి చేసే అలవాటు ఆయనకు. ఆమెకు గృహ విషయాల్లో బాగా స్వతంత్రం ఉండేది. ఇరుగు పొరుగు వారికి చిన్న చిన్న అప్పులివ్వటం మొదలుకొని దానధర్మాలు చెయ్యటంవరకు ఆమె మాటకు అడ్డులేదు. అట్లని తనకు తెలియని విషయాల్లో ఆమె కల్పించుకొనేదికాదు. ఏ సందర్భంలోనూ భార్యను తిట్టడం, కొట్టడం ఆయన ఎరుగడు. భార్యలను తిట్టడం, కొట్టడం పురుష లక్షణంగా చెలామణీ చేస్తున్న ఆవూళ్ళో వాళ్ళకు ఈ దంపతులను చూస్తే ఈర్ష్యగా వుండి 'ఆమె ఆజ్ఞ లేనిదే ఏపనీ చెయ్యలేడు' అని చాటుగా ఆక్షేపణ చేస్తూవుండేవాళ్ళు. ఇది తెలిసినా ఆయన చలించలేదు.

సీతారామయ్యకు భూవసతి బాగాఉంది. అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు ఎవరూ లేరు. కొంత రొఖ్ఖం నిల్వ ఉంది. దుర్వ్యసనాలేమీ లేనందున దుర్వ్యయం ఏమీ లేదు. ఉన్నవూళ్ళో, చుట్టుపట్లా మంచి పలుకుబడి సంపాదించాడు. వారికి ఇద్దరు కుమార్తెలు: శాంతా, సీతా. కొడుకులు లేరన్న కొరత ఆయనకు మనస్సులో ఉండేది. కొంతకాలం అది బెంగగా పట్టుకొంది. కానీ, కాలంగడిచేకొద్దీ ఆబెంగను వదిలించుకోగలిగాడు.

జానికమ్మ తమ్ముడు వెంకట్రంగయ్య కంటె శాంత కొన్ని రోజులు మాత్రం పెద్దది. అందుచేత శాంత వెంకట్రంగయ్యకు భార్య కాలేకపోయింది. ఆ అదృష్టం సీతకు పట్టింది. సీత భూమిమీద పడ్డప్పటినుంచి వెంకట్రంగయ్య భార్య అని వ్యవహరింపబడేది. సీత అమ్మకు గారాబం. అమ్మమ్మ మంగమ్మకు బంగారం. సీతకు ఎనిమిదేండ్లు వచ్చినా తల్లి ఎత్తుకొని తిరిగేది. పదేండ్లు వచ్చినా కూతురు ఎత్తుకొమ్మని మారాంచేసేది. జానికమ్మకు తన తమ్మునికిచ్చి చేసుకొంటానన్న ఉద్దేశ్యంతో మనస్సులో సీతమీద ప్రేమ ఎక్కువ కాజొచ్చింది.

శాంతకు పెండ్లియీడు వచ్చినా అప్రకురాలుగా కనబడేది. తల్లిదగ్గరకూడా చనువు తగ్గిపోయింది. కారణం— సీత తల్లివద్ద అతిగారాబాన్ని సాగించుకొంటూ శాంతయొక్క ప్రతి చిన్న కోరికకూ అడ్డంగా వచ్చి నిర్భాగ్ని ఫలితాన్ని తానే అనుభవించేది. శేషం మాత్రమే శాంతకు. క్రమంగా శాంతకు చిన్నతనము నుంచే కోరికలను తగ్గించుకోవడమూ, మొండిపట్టు పట్టక పోడమూ అలవాటైంది. కొంతకాలం గడచాక సీతారామయ్య యీ పరిస్థితిని గమనిస్తూ వచ్చాడు. వెంకట్రంగయ్యకంటే కొన్నిరోజులు వెనకపుట్టివుంటే, శాంత భాగ్యచక్రం ఎలాతిరిగేదో!

## ౨

మంగమ్మది బాగా స్వార్థ దృష్టి. ఇతరులు మంచి స్థితికి వస్తే ఆమెకు ఈర్ష్య పుట్టి 'కొత్త భాగ్యవంతులు.... ఈ చిగిరింత ఎంత కాలంలే' అనేది. ఇతరులు కష్ట స్థితిలో వున్నప్పుడు "పాపం పండింది. దేవుడు లేడూ?"

అనేది: తనకు అవసరం వస్తే ఎంత పిసినిగొట్టునైనా 'రాయన మంత్రి ఖాస్కారా!' అని సంబోధించేది. ఎంత కురూపి నైనా 'నవ మన్మథా' అని పిల్చేది. అప్పుడే కడుపునిండా తిని వస్తూ సందె కవళం అడుక్కునేవాడితో "ఇంకా భోజనాలు కాలేదు మాకే, అప్పుడే నీ కెక్కడిది?" అని రోజూ మామూలుగా అనేది. ఇంట్లో గాదెనిండా ధాన్యం వుండగా "ఒక్క గింజలేదు. వెళ్ళు. ఊఁ" అని గద్దించి పంపటం ఆమె అలవాటు. పైగా "ఎద్దల్లె వున్నావే, చాకిరీ చేసుకోరాదూ?" అని కఠినంగా ప్రశ్నించేది. "అమ్మా, నేను గుడ్డివాణ్ణి, కళ్ళుంటే చాకిరీ ఎందుకు చేసుకోనమ్మా? అడుక్కోటం ముచ్చటా తల్లీ?" అని భిక్షకుని జవాబు. అందుకు ఆమె "కళ్ళెందుకు లేవు? మహ చక్కగా ఉన్నాయి. ఈ దొంగ వేషాలు నా ముందుకాదు" అనేది.

"మంచి తల్లివేనమ్మా" అని అనుకొంటూ వెళ్ళేవాడు. వాడి వెంట ప్రతి యింటికీ వెళ్ళి "పొగరుబోతు వెధవ. కళ్ళు బాగానే ఉన్నై. వీడిది దొంగ చెయ్యి. జాగ్రత్త" అని హెచ్చరించి ఒక్క గింజ కూడ దొరక్కుండా చేసేది. తనకు గిట్టని వాళ్ళను ఉదారులనైనా, సత్యవంతులనైనా అబద్ధాలు కల్పించి ప్రచారం చేసి నోటికి వచ్చినట్లు తిట్టేది. కఠినంగా ప్రవర్తించేది. చాలా మందికి మంగమ్మతో వ్యవహారం అంటేనే భయం. కానీ మంగమ్మ మాత్రం రోజులో చాలా భాగం తీరికగా అందరి యిళ్ళూ తిరుగుతూ 'ఈపి లేనిచోట ఈపి' ని పుట్టించేది.

తన తెలివితేటల వల్ల ఆశ్రయించి తన ఏకైక పుత్రుడు వెంకట్రంగయ్యకు పదిహేనేండ్ల వయస్సులోనే ఉద్యోగాన్ని సంపాదించిపెట్టింది. 'ఉద్యోగమ్ పురుషలక్షణమ్' అని ఆమెకు తెలుసు: అందువల్లే, కంట్రాక్టరు శెట్టిగారి వద్ద గుమస్తాగా కుదిరాడు వెంకట్రంగయ్య. వయస్సులో చిన్నవాడైనా సంభాషణలో మెలకువలు కొద్ది కాలంలోనే తెలుసుకున్నాడు. చదువు తక్కువే అయినా మంచి మాటకారి ఐనాడు. శెట్టిగారు గొప్ప భూస్వామీ, ధనవంతుడూ అయినందువల్ల గ్రామస్థులందరు ప్రతి చిన్న పనికి, పెద్ద పనికి అతనిని ఆశ్రయించ వలసి వచ్చేది. 'దేవుడు వర మిచ్చినా పూజారి వరమియ్య'డని సామెత. షాహుకారు దర్శనం వెంకట్రంగయ్య ద్వారా కావలసిందే. కనుక ముందుగా అతనినే ఆశ్రయించవలసివచ్చేది. కొద్ది కాలంలోనే వెంకట్రంగయ్య పైకి తియ్యగా మాట్లాడుతూ, లేని ఆశలను కల్పించి, తన చుట్టూ ప్రదక్షిణం త్రిప్పుకొంటూ వాళ్ళ వల్ల అనేక లాభాలు పొందటంలోనూ, వారి చేత విపరీతమైన వెట్టి చాకిరీ చేయించుకోవడంలోనూ అఖండుడైనాడు. అమాయకులను బాగా వంచిస్తున్నాడు ఉద్యోగులకు నమస్కార బాణాలు వేస్తున్నాడు: వారికి 'సరపరాలు' చేస్తున్నాడు. ఉద్యోగుల ప్రాపకం సంపాదించకలిగాడు: ఇంకేం? వారికి లంచాలు తినిపిస్తూ తన వంతు 'కమిషన్' మూట కడుతున్నాడు. 'కమిషన్' ఎంతో, లంచం ఎంతో, అసలు ఖర్చు ఎంతో ఆశ్రితులకు అంతు పట్టడంలేదు. గ్రామంలోని ప్రతి చిన్న వ్యవహారంలోను తలదూరుస్తూ చివరకు తీర్పరై కూర్చుంటున్న వెంకట్రంగయ్య ద్వారా తప్ప ఏ పనైనా ఎట్లా నెరవేరుతుంది? కనుక తియ్యని మాటలు చెప్పే వెంగట్రంగయ్య చుట్టూ అమాయకులు ఎప్పుడూ గుమిగూడి వుండక తప్పటం లేదు. పాపం: బీదలే నష్టం పొందేవాళ్ళు. లాభం పొందే వాళ్ళు డబ్బున్నవాళ్ళూ, వెంకట్రంగయ మాత్రమే!

ఇక వెంకట్రంగయ్య బాహ్య వేషం— పూర్వాచార్య పద్ధతిలో ఉండేది. జుట్టు ముడీ, పెద్ద బొట్టూ, జోడూ, వ్రేళ్ళకు రెండు పుంగరాలు, చెవులకు అంటు జోడూ, బిళ్ళ గోచీ ధోతీ, ఖండువా వల్లెవాటూ, చేతిలో గొడుగూ, కాళ్ళకు చెప్పులూ— సాయంత్రం అయీ కాక మునుపే మూడు సెల్సు గల బేటరీ లైటూ! ఇంత చక్కని వేషంతో వున్నా అతనికి నిజమైన ఆస్తిక దృష్టీ, నైతిక దృష్టీ లేవు. ఈ వేషంవల్ల అతనికి లాభం ఉన్నది కనుకనే ఈ వేషంలో ఉంటున్నాడు. పూర్వం ఎవరో వరదకు కొట్టుకుపోవటంలో గూడా లాభాన్నే చూచుకొన్నాడట!

తనకుమారుని తెలివి తేటలను చూచుకొని మంగమ్మ గర్వపడేది. జానికమ్మ తన తమ్ముని వేష భాషలు చూచి ముగ్ధురాలయ్యేది. సీతారామయ్య వెంకట్రంగయ్యను చూచి తెలివిగలవాడు, బుద్ధిమంతుడు అని అభిప్రాయ పడ్డాడు. భార్య కోరిక ప్రకారం సీతనిచ్చి వివాహం చెయ్యడానికి అంగీకరించాడు.

వెంకట్రంగయ్యది పాదరసంవంటి సూక్ష్మబుద్ధి! ఆలోచనలో పడ్డాడు ... సీత తనది. అక్కకు తనంటే ఎంతో అభిమానం.... సీతారామయ్య సిరి అంతా తన

ఇంటికి ప్రవహిస్తుంది.... వెంటనే వివాహం చేసుకోవాలి ఈ ఊహలు అతనికి నూత్నోత్సాహాన్ని కలిగించాయి. వెంటనే పెండ్లి చేసు కోవాలన్న తన కోరికను తల్లి ద్వారా ప్రకటించాడు.

## 3

ఒకనాడు సీతారామయ్య భార్యతో మామూలు స్నేహ స్వరంతో ప్రస్తావించాడు— "సీతను నీ కోరిక ప్రకారం నీ తమ్ముడికిచ్చి చేద్దాం. ఇక శాంత విషయంలోనే ఏమీ తోచకుండా ఉంది. ఎప్పుడు బలహీనంగా కనబడుతూ ఉంటుంది. కన్న తల్లి దండ్రులం మనముందే ఎడ మొహంగా, భయంభయంగా తిరుగుతుందే, ఇక క్రొత్త



చోట ఎలా బ్రతుకుతుందో! తిండి దగ్గర కూడా ఏదైనా కావలసి వచ్చినా మళ్ళీ అడగకుండానే లేచిపోతుంటుందని నీవు అంటూఉండేదానివి. నాకు ఒక ఆలోచన తోచింది ఆ విధంగా చేస్తే బాగుంటుందనిపిస్తున్నది. వినయం గలవాణ్ణిగా ఈడూ జోడూ చూచి పెద్ద చదువూ, స్థితి లేకపోయినాసరే— మన యిట్టివద్దనే వుండే ఏర్పాటుతో సంబంధం చూద్దామనుకుంటున్నాను. నీయిష్టం ఏలా వుందో చెప్పు'' అని.

ఆనాటి నుంచి జానికమ్మకు రాత్రింబవళ్ళు యిదే ఆలోచన! పుట్టింటికి పోయి అమ్మను, తమ్ముణ్ణి సలహా అడిగింది. అంతావిని, ఎంత తెలివితక్కువ దానవే అన్నట్లుగా చూచి, మంగమ్మ అన్నది— "పిచ్చిదానా, పరాయివాడు మనవాడౌతాడా? సూదిగా వచ్చి దబ్బనంగా తేల్తాడు. నీ మేలుకోరి చెబుతున్నాను— అల్లుణ్ణితెచ్చి యింట వుంచుకోడానికి సుతరామూ వొప్పుకోవద్దూ."

వెం. రం: వేరే కొంపకు తిప్పలు తెచ్చుకో నవసరం లేదు. వచ్చిన వాడు మన మాటల్లో ఉంటాడని నమ్మకం ఏమిటి? ముందు చెడు తలచి తర్వాత మంచి తలవాలని శాస్త్రం. ముందు బరాసాతో చేసిన ఇలాంటి వ్యవహారా లెన్నో నా దగ్గరకు వచ్చాయి, అలాంటి వాటివల్ల అనేక చిక్కులు— ముఖ్యంగా నీకు ఏర్పడుతాయి. బాగా ఆలోచించుకో అక్కయ్యా.

జా: (శ్రద్ధగా విని) ఔను తమ్ముడూ, నాకూ యిష్టం లేదు. అన్నివిధాల కావలసినవాడివి నువ్వుండగా ఇంకొకరు ఎవరో పరాయివాళ్ళు నాయింట్లో ఉండటం యెందు కని నా వుద్దేశ్యం. మనస్సులో ఉన్నదే సోదికిపోయినా వస్తుందట! నామనస్సులో ఉన్నదే మీరుచెప్పారు.

వాళ్ళుచెప్పింది ఆమె మనస్సుకు బాగా నాటింది. జానికమ్మ ముఖంలోతెలివి చిందులు త్రొక్కింది! మంగమ్మ తనవాడిలో కూర్చున్న సీతబుగ్గపుణికి అన్నది "మాసీత ముఖంలో లక్ష్మీకళ తాండవమాడుతోంది! నలుపైతేనేం?"

వెంకట్రంగయ్య గర్వంతో సీతవంక చూచాడు.

మం: (హేళనగా) శాంతా! ఎవర్ని చేసుకొంటావే?

వెం. రం: (వేళాకోళంగా) వాళ్ళ నాయన ఒకపండితుణ్ణి తెచ్చి యింట్లోప్రతిష్ట చెయ్యబోతూంటే, ఎవర్ని ఎవర్ని అని అడుగుతావేంటే అమ్మా?

మం: (నవ్వు ఆపుకోలేక అస్పష్టంగా చెబుతూ) పండితుడంటే చెబుతాను. పూర్వం లెక్కల్లో గొప్పపండితు డుండేవాట్ట. ఆయనను గొఱ్ఱెలకాచే గొల్లవాడు పిడికిలి నిండా ఇసకతీసుకొని 'ఇదెంత' అని అడిగాట్ట! ఎంతసీ చెప్పలేక ఆపండితుడు వెఱ్ఱిమొగంవేశాట్ట - తెలివితక్కువ వాడు కాకపోతే, పిడికెడు ఇసక అని చెప్పకూడదూ? అనుకుంటాంగానీ, చదువుకోగానే లాభంఏమిటి? తెలివి ప్రధానంగాని.

అందరు గొల్లున నవ్వారు. శాంతకేమీబోధపడలేదు. మనస్సుకు కష్టమనిపించింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. తనను వెక్కి రిస్తున్నారని మాత్రం తెలిసింది. 'అమ్మకూడ

వెక్కిరిస్తుందే' అని ఆశ్చర్యపడ్డది మనస్సులో. తల వంచుకొని అవతలకు వెళ్ళింది.

అసలు సంగతేమిటంటే వెంకట్రంగయ్యకూ, మంగమ్మకూ చదువుకున్న వాళ్ళంటే ద్వేషం. కారణం— అతనికి వచ్చిన చదువు చాలాతక్కువ. అందువల్ల చదువు కున్న వాళ్ళనుచూస్తే ఈర్ష్యగా ఉండేది. ఇప్పుడుతాను చదువుకున్నవాళ్ళల్లో తెలివితక్కువ వాళ్ళను తనచుట్టూ కార్యార్థులుగా తిరుగుతూండడం చూస్తున్నాడు. చదువు కున్న వాళ్ళు, ముఖ్యంగా పెద్దచదువులు చదివినవాళ్ళు అబ ద్ధాలాడలేరనీ, ధైర్యంచేసి పెద్దపెద్ద లంచాలు పట్టలేరనీ అతని నమ్మకం! చదువుకొన్న మాత్రాన తెలివి వస్తుం దంటే అతను ఒప్పుకోడు. పెద్దచదువులు చదివిన కాలేజీ ప్రొఫెసరొకాయన, అన్న పెటిన మల్లగుల్లాలు పడలేక తనవంతు ఆస్తినికూడా అన్నకే వదిలిపెట్టి వెళ్ళి స్వంత సంపాదనలో బ్రతుకుతూండటం అతనుచూచాడు. ఇప్పుడు ఆ పిత్రార్జితాన్నంతా అన్న ఒక్కడే అనుభవిస్తున్నాడు దర్జాగా! తమ్ముడు నెత్తినగుడ్డ వేసుకొని వెళ్ళాడు! అని అతని అభిప్రాయం. తెలివిప్రధానం. చదువుకాదు అని రాయిగుద్ది చెప్పగలడతను! వాళ్ళ అమ్మకు గర్వకా రణం ఏమిటంటే పిల్లవాణ్ణి తెలివిగలవాణ్ణిగా చేశాననీ, చదువులు చెప్పించి తెలివి తక్కువవాణ్ణి చెయ్యలేదనీ! వెంకట్రంగయ్య ప్రారంభించాడు - "చదువుకున్నవాళ్ళను చాలామందిని చూస్తున్నానుగా — వాళ్ళుప్రతిపనికీ, మీనం మేషం లెక్కపెడ్తూ కూర్చుంటారు. మీనం మేషంలెక్క పెడితే పనులౌతాయా? ఉద్యోగస్థుల్లో కొందరు పెద్దచదు వులు చదివినవాళ్ళు, కొందరు కొద్దిగా చదువుకున్నవాళ్ళూ వస్తుంటారు. బాగా చదువుకున్న వాళ్ళు అబద్ధమాడవలసి వస్తే ఆడలేరు. ఒకపని ధైర్యంగా చెయ్యలేరు. చదువు తక్కువవాళ్ళే వెనకా, ముందూ చూడకుండా ధైర్యంగా పనిచేస్తారు, డబ్బూసంపాదిస్తారు. చదువు కొన్నవాళ్ళు జీతండబ్బులు తప్ప ఎగ్రని ఏగానీచూడలేరు." తనతెలివికి తానే లోలోపల సంతోషించాడు.

మం : (బలపరుస్తూ) బి. ఏ. చదివిన రామారావుకు నెలకు ఆ అంపైరాళ్ళేగాగతి? మనవాడిసంగతి మనం చెప్పుకోకూడదుగానీ — అల్లాంటి అంవైలు రెండో మూడో సంపాదిస్తున్నాడు. షాహుకారు ఇచ్చేది ఇరవై రూపాయలే ఐనా.

అమ్మా, తమ్ముడూ చెబుతున్న విషయాలను బట్టి తన భర్త చేస్తున్న ప్రయత్నం నెరవేరకుండా వుంటే బాగుండు ననిపించిందామెకు.

ఇంటికి వచ్చాక జానకమ్మ భర్తతో అన్నది— "ఇల్లరికం వద్దు. ఏమీ వద్దు. లోకంతోపాటు ఏ అయ్య చేతిలోనో పెట్టి దండం పెట్టండి, చాలు."

సీతారామయ్య కట్టుకొన్న ఊహాసౌధం ఈపెద్ద తుఫాను దెబ్బకు మొదలంట ఊగిపోయింది. ఆయన భార్యతో నచ్చ జెప్పి తన వైపుకు త్రిప్పుకో ప్రయత్నిం చాడు. కానీ, ఆమె ఏవిధంగాను ఈ విషయంలో భర్త అభిప్రాయాన్ని అంగీకరించ తలచుకోలేదు. ఆయనచెప్పే ప్రతిమాటనూ తల్లీ, తమ్ముడూ కలిగించిన అభిప్రాయాన్ని మనస్సులో వుంచుకొని, విచక్షణా రహితంగా ఖండిం చటం మొదలు పెట్టింది. సీతారామయ్యకు ఆశాభంగం కలిగింది.

....కొన్నిరోజులు గడిచాక మళ్ళీభార్యతో వివాహ విషయాన్ని కదిపిచూచాడు. జానికమ్మ ఏమాత్రమూ తన అభిప్రాయాన్ని మార్చుకోలేదు. తనతో ఆమెయిక ఏకీ భవించటం అసంభవం అనుకున్నాడు. అత్తగారి విషయంలో తనభార్య మనస్సును త్రిప్పి ఉంటుందని సందేహపడ్డాడు.

సీ. రా: నేను ఎన్నివిధాల చెప్పినా నీవుతెలుసుకోడం లేదు. శాంత, సీత-ఇద్దరిక్షేమం మనంకోరుకోవలసిందే. సీతవిషయం అన్నివిధాల తృప్తిగానే ఉంది. శాంతకు ఎక్కడా సరైన సంబంధం దొరకలేదు. పైగా అశక్తు రాలుగా కనపడుతోంది కనుక, దాని సుఖాన్నికూడా ఆలో చించవలసిందే. నీవు ఇద్దర్నిగురించీ న్యాయంగా ఆలో చించవలసిందే. నీవు బాగాఆలోచించు — వాళ్ళిద్దరిలో ఏఒక్కరు సుఖపడక పోయినా మన సంసారంలో సుఖం నామరూపాలు లేకుండాపోతుంది. ఎవరన్నా నీకు చెడ్డ సలహా యిచ్చివుంటే వినడం మంచిదికాదు.

జా: (ఉద్రేకంతో) నాకేమీ పక్షపాతబుద్ధిలేదు. అను కుంటే అనుకోండి. మావాళ్ళు నాకేదో సలహాయిచ్చారనే కదా మీ అనుమానం? మావాళ్ళను మీరేమీ అనవద్దు. మీయిష్టంవచ్చినట్లు చెయ్యండి. ఎవరిఅదృష్టం ఎలావుంటే అలాజరుగుతుంది.

జానికమ్మకు కళ్ళనీళ్ళు బొటబొటాపొర్లాయి. ఆమె అన్న మాటలన్నింటినీ విని ఖండువా పైమీదవేసుకొని ఆయన ఎక్కడికో వెళ్ళాడు.

రోజులు గడుస్తున్నాయి. భర్త తనతో మనస్సువిప్పి మునుపటి మాదిరిగా మాట్లాడటంలేదు. తానూ ఆయనతో మునుపటి మాదిరిగా స్వతంత్రించి ఏవిషయాన్నీ చెప్పలేక పోతున్నది. ఇంట్లో పూర్వంలాగు నవ్వులు, సరస సంభాషణలూలేవు. భర్త తన అభిప్రాయాన్ని మార్చుకోడని ఆమెకు నమ్మకం కలిగింది. తనమనస్సులో ఏర్పడిన ఈ సీతమీది ప్రత్యేకాభిమానం తొలగించు కోలేనంత బలంగా నాటుకుపోయింది. అమ్మా, తమ్ముడూ చెప్పినట్లు ఆయనకే శాంతమీద పక్షపాత బుద్ధి ఉందేమో ! అమ్మా, తమ్ముడూ ఏమిచెప్పినా తన క్షేమంకోరేగా. శాంతను చూచినప్పుడు తన మనస్సు ఏమీ బాగుండటంలేదు. కోపంకూడ వస్తోంది. భర్త తనతో కఠినంగా మాట్లాడి నందుకు ఆమెకు ద్వేషం కలిగింది.

ప్రతి పనికీ సీతనే పిలుస్తోంది. శాంతను పిలవటం లేదు. సీత కోపంతో, "అన్ని పనులూ నాకే చెబుతావే మమ్మా ? అక్కకు ఒక్క పనికూడ చెప్పవూ" అని గునుస్తోంది.

౨

ఇరవై రెండేండ్ల వయస్సుగల రఘును గురించి విని సీతారామయ్య ఆ ఊరికి వెళ్ళాడు. రఘుకు తల్లి దండ్రులు లేరు, అన్న రామారావు వద్దనే ఉంటున్నాడు. ఆ ఇద్దరికీ కలిసి ఒక పాత యిల్లూ, ఆరెకరాల మెట్టభూమి మాత్రం ఉన్నాయి. భారత భాగవతాదులను చదివి అర్థం చేసుకోగల మాత్రం చదివాడు. రూపము, వినయమూ, దైవ భక్తీ ఉన్నాయి, వ్యవసాయము తెలుసు. కష్టమైన పని చెయ్యటంలో శరీరాన్ని దాచుకోటం ఎరుగడు. కల్లా, కపటమూ తెలియని మనస్సు. బాహ్య వేషము కూడ సౌజన్యాన్నీ, నిరాడంబరతనూ వ్యక్త పరిచేట్లు ఉంటాయి. లాల్చీ, ఖండువా, సాదాపంచా, క్రాపు.

రామారావుతో సీతారామయ్య అన్ని సంగతులు ముచ్చటించాడు. తన మనస్సులోని అభిప్రాయాన్ని చెప్పాడు. అన్నదమ్ములు పరస్పరము ఆలోచించుకొని వెంటనే నిర్ణయానికి వచ్చారు. తన తమ్ముడు వివాహానికి యిష్ట పడ్డాడనీ, సీతారామయ్యగారి ఇంట్లో వుండడానికి కూడ అంగీకరించాడనీ చెప్పినప్పుడు ఆయన పొందిన ఆనందానికి మేరలేదు.

సీతారామయ్యతో మాట్లాడిన తర్వాత, చెప్పిన సంగతులన్నీ విన్నాక రఘుకు ఆయన యందు ఎంతో గౌరవమూ, నమ్మకమూ ఏర్పడ్డాయి. ఆయనవంటి సత్పురుషుని నమ్ముకొని ఉండడముతో తన జీవితం ఒడుదుడుకులు లేకుండా ప్రశాంతంగా గడచిపోతుందన్న నమ్మకం అతనికి కలిగింది. తన వంతు ఆస్తిని కూడ అన్ననే అనుభవిస్తూ ఉండమని చెప్పి సీతారామయ్యతో బయలుదేరాడు రఘు.

వివాహాలు ఆడంబరంగా జరిగాయి. బంధువులకు బాగా సత్కారాలు జరిగాయి. యాచకులు తృప్తితో ఆశీర్వదించారు. రఘు బుద్ధిమంతుడైనా ఏమీ లేనివాడనీ, వెంకట్రంగయ్య 'చిచింద్రీ' వంటి వాడనీ పెండ్లికి వచ్చిన పెద్దలు అభిప్రాయపడ్డారు. సూక్ష్మగ్రాహులు పెద్ద అల్లుడంటే అత్తగారికి ఇష్టం తక్కువనీ గ్రహించారు !

ఆ నాటినుంచి రఘు అత్తగారి ఇంట్లోనే వుంటూ వ్యవసాయపు పనులన్నీ చూస్తున్నాడు. డబ్బు సంబంధమేమీ పెట్టుకోలేదు. తన పనేమో, తానేమో. పగలల్లా కష్టించి వచ్చేవాడు. అప్పుడప్పుడు అత్తగారు తగినంత ఆదరణ చూపడం లేదని మనస్సుకు తోచేది. ఐనా ఆ విషయానికి ప్రాముఖ్యత నివ్వలేదు. మామగారి ఆదరణ అనే చల్లని నీడలో ఇతరులు పెట్టే చిక్కులను లక్ష్య పెట్టడం వెఱ్ఱితనమని అనుకున్నాడు మామగారు చూపే దయకు కృతజ్ఞతగా తన శరీరాన్ని దాచుకోకుండా శ్రమ చేస్తున్నాడు. శాంత చూపుతున్న భయ భక్తులకు రఘు ముగ్ధుడైనాడు.

సీత కూడా అత్తవారింటికి చాలా వస్తు సముదాయంతో పోయింది. సంవత్సరాలు ఒకటి వెంట ఒకటిగా దొర్లి పోతున్నాయి.

[సశేషం]

కథానిక

# సానుభూతి

శ్రీమతి నాయని కృష్ణకుమారి

కాశేశ్వర్రావు కళ్ళింకా నవ్వుతూనే ఉన్నయ్. చుట్టూ అదొక రకపు వాతావరణం! శ్మశానాల్లో చితి మండుతున్నప్పుడుండాల్సిన వాతావరణం! సానుభూతి వాక్యాలూ, గుణగణనలూ గాలిలో కరిగి ఆవిరై అక్కడ చేరిన ప్రతివాడి హృదయాన్ని కొలిచి గీరలు పెడుతున్నయ్. కాశేశ్వర్రావు చచ్చిపోయినందుకు అక్కడ ఏడుస్తున్న వాళ్ళెవరూ లేరు. ఏడవటానికి అతగాడికి భార్యా, పిల్లలూ, తల్లీ తండ్రీ యిట్లాంటి బంధువర్గ మేమీలేదు — ఒకవేళ ఉండి ఏడ్చినా ఆ విచారముద్ర మనుష్యులమీద ఎంత సేపని పనిచెయ్యగలదు? లోకంలో మనిషితో మనిషి కున్న సంబంధమే విచిత్రమైంది. ఎదురుగుండా ముక్కున ఆకాస్త ఊపిరితో తిరుగుతున్నంత సేపూ అందరు ఆప్యాయంగా "మాట్లాడుతారు, నీవులేందే మేంమాత్రం ఎందుకూ" అని ముఖం గంభీరంగా పెట్టి నిజమేనేమో అన్నట్లు చెప్తారు. కాని చివరికి ఆలోకంనుంచి ఆహ్వానం వచ్చి వెళ్ళిపోయిననాడు అతనెవరో వీళ్ళెవరో! మనుష్యుల నాలుకలు తాటిపట్టలా, మరేమన్నానా?

కాశేశ్వర్రావు విషయంలో బ్రతికి నన్నాళ్ళూ అంత అప్యాయత చూపించినవాళ్లేరు. ఈపీడ ఎప్పుడు పోతుందా అని తిట్టుకున్నవాళ్ళు చాలామంది. కాని వాళ్ళే యిప్పుడు కాశేశ్వర్రావు సగం మూసిన కళ్ళతో చలనం లేకుండా నవ్వుతూంటే, వాడు వినడం లేదుకదా అని సానుభూతి వాక్యాలు పలుకుతున్నారు. వాళ్ళయిష్టం వచ్చినట్లు జాలి నంతా ఒలకబోసి పెద్దరికాన్ని ప్రదర్శించు కుంటున్నారు.

"పాపం! ముక్కుకుసూటిగా పోయే వ్యక్తిరా! ఆసూటి దన్నాని లోకం హర్షించలేకపోయింది గాని!" ఒక డన్నాడు. వాడికి ఈ లోకానికి ఏమీ సంబంధం లేనట్లు. వాడీ లోకంనుంచి పూర్తిగా వేరై మడిగట్టుకుని కూర్చున్న ఒక మహావ్యక్తి అయినట్లు! — కాశేశ్వర్రావే బ్రతికి ఉంటే యీమనిషి ఇట్లా తన్ను గురించి జాలి ఒలక బోస్తున్నందుకు చీదరించి మోహాన ఉమ్మి వేశేవాడు.

"వాడి తత్త్వమేఅంత! — నేనెన్ని సార్లు చెప్పే వాణ్ణి? చెప్పినప్పుడల్లా విని మనస్సు మార్చుకునేవాడు. మళ్ళీ తర్వాత వాడివాలకం వాడిదే! ఎవరో చెడు సావాసాలు పట్టిగాని లేకపోతే కాశేశ్వర్రావు నాచేతుల్లో మైనం తిరిగినట్లు తిరిగేవాడు! —" ఈమాటలు అనంతమూర్తి అంటుంటే, అతడి కళ్ళు కాశేశ్వర్రావు శవంవేపు తేరి చూడనైనా లేకపోయినయ్ — చూడటానికి వాటికి తాహతు, లేదనిచూస్తూ ఉన్నవాళ్ళకు తెలిసినా తెలియక పోయినా ఆకళ్ళకు తెలుసు. తెలుసుకునే శక్తేఉంటే ఆ శవానికీ తెలిసేది.

అనంతమూర్తీ కాశేశ్వర్రావూ లోకందృష్టిలో స్నేహితులనే చెప్పాలి. కాశేశ్వర్రావు దృష్టిలో మాత్రం స్నేహితులనే పదానికి అర్ధమేలేదు. "స్నేహమంటే ఏమిటోయ్! ఒకడికి రెండోవాడి సహాయం కావలసివస్తే స్నేహమనే రంగుపూసుకు వస్తాడు. కళ్ళుజిగేలు మనిపించే ఆరంగు వెనక, అంతా అసహ్యంగా బూజూ, మసకా! నాతో ఈతలకాయ నొప్పి మాటలు చెప్పకండి!" అని గసిరేవాడు. వాడట్లా కుంచబద్దలు కొట్టినట్లు అంటాడని మిత్రులకంద రికీకోపం! అనంతమూర్తి కాకోపం మరింత హెచ్చు స్థాయిలోకి వెళ్ళేది. అయినా అసమర్థుడి కోపానికి విలువేమిటి?

ఒకరోజున అనంతమూర్తి వచ్చాడు. కాశేశ్వర్రావు ఆ స్నేహితుడు కాని స్నేహిణ్ణి కూర్చోపెట్టి కుశలా లడిగాడు.

"ఏమిటోయ్ ఎండవేళ ఇటుపడివచ్చావ్? —" బయట ఎండ ఇళ్ళంటిస్తున్నట్లు, పెంకులు టప టపలాడిస్తున్నట్లు, రాజ్యం చేస్తున్నది. అనంతమూర్తి మొహంకూడా బయటి ఎండలాగే ధుమ ధుమలాడి పొగలు రేగాలనుకుంది - కాని రేగలేదు. అనంతమూర్తి వెంటనే నోరు మెదపలేక పోయాడు. కాశేశ్వర్రావు మళ్ళీ అడగలేదు. అట్లా అడ

గడం అతని స్వభావమేనాకాదు. కోపంతో మండిపోతున్నా ననుకునే అనంతమూర్తి అతని దగ్గర చేతగాని దద్దమ్మలా అనిపించాడు. కొన్ని నిముషాలు గడిచినయ్. "నీతో మహాచెడ్డచిక్కొచ్చి పడిపోయిందోయ్—" మనస్సులో ఉన్న ఉక్రోషమంతా పుక్కిటికి వచ్చి నీళ్ళుగా మారినట్లూ, అది నమలడానికి పంటి కిందికి రాక అవస్థ పడుతున్నట్లూ అనంతమూర్తి మొహం వికృత మైంది.

"ఏం !" — తాపీగా అన్నాడు కాశేశ్వర్రావు. "నన్ను గురించి అందరితో ఏమో చెప్తున్నావట !" — బాగా కసిరాననుకున్నాడు అనంతమూర్తి. వీడికి సహజంగా నటించడమైనా చేతగాదనుకున్నాడు కాశేశ్వర్రావు.

"నేను పిరికివాణ్ణా? ఆత్మగౌరవం లేనివాణ్ణా? ఎంత సేపూ నాబాగుకోసం పాకులాడే వాణ్ణా? ఇంకా" —

"ఛట్ !"— కాశేశ్వర్రావు గొంతు ఉరిమింది. అనంతమూర్తి ఆగిపోయాడు.

"ఈమాట అడగడానికి ఇంతదూరం ఎండలో పడి వచ్చావా?"

"కాదనుకో" —నసిగాడు —"ఆ నందికేశ్వర్రావుతో నీకెప్పుడు స్నేహం కలిసింది? —"

"ఏం!"

"వాడే చెప్పాడు — వాడుత్త వెధవ !"

"నీకంటేనా?" కాశేశ్వర్రావుగొంతు తుపాకిగుండులా దూసుకు వచ్చింది. దనికి అనంతమూర్తి కేంజవాబు చెప్పాలోతెలియలేదు. నందికేశ్వరరావు పరమదుర్మార్గుడు, లుచ్చా. కాస్తో కూస్తో చాటుగా తాగుతాడట ! లోకంలో మనిషి కుండాల్సిన అవగుణాలన్నీ వాడి కున్నాయని అందరూ అనుకుంటారు, తనకూ వాడికీ పోలికేమిటి? తాను వాడి కంటే లక్ష రెట్లు మేలని తెలిసే కాశేశ్వర్రావు ప్రశ్న కేం జవాబు చెప్పాలో తెలియలేదు. పైపెచ్చు కళ్ళల్లో నీళ్ళు తిరిగి తల దించుకున్నాడు.

వీపు మీద టప్ మని బోలు అరచెయ్యి సీమ టపా కాయలా పేలింది. అనంతమూర్తి తలెత్తి చూచాడు. కాశేశ్వర్రావు నవ్వుతున్నాడు. మొహం మొహం మీద పెట్టి తన రెండు కళ్ళల్లోకి చూపుల్ని సూదుల్లా గుచ్చు తున్నాడు.

"నువ్వు పిరికివాడివి కాదట్రా భాయీ !" ఇంకోదెబ్బ పడ్డది వీపుమీద. అనంతమూర్తి మాట్లాళ్ళేదు.

"చచ్చు నాగన్నలు ! గట్టిగా నోరు విప్పి మాట్లాడ్డం తెలీదు. మనస్సుకు ఇష్టం లేని విమర్శ వస్తున్నా అడ్డు కోడం తెలీదు. కన్నీళ్ళు మాన మర్యాదల్ని కాపాడ తాయిరా? పై పెచ్చు పొగొడ్తయే నందికేశ్వర్రావు దగ్గర గురుకుల వాసం చేసి నేర్చుకో ! తన మీద మాట పడ నీయడు. తన హుందా తనం మాసిపోనీయడు— వాడు తాగినా, తందనా లాడినా, వాడిలా లోకమంతా తయా రైతే !...." ఇంకా కాశేశ్వర్రావు అర్థోక్తిలోనే ఉన్నాడు. "లోకమంతా రౌడీలగుంపౌతుంది" అన్నాడు అనంతమూర్తి ధైర్యం తెచ్చుకుని.

"ఏడ్చావ్ !" ఉరిమాడు కాశేశ్వర్రావు. అతను మాట్లాడి తేనే అనంతమూర్తి గుండెల్లో రక్తం గూడు కట్టింది. "నీలాంటి వెధవలకంటే అట్లాంటి రౌడీలు నయం!"

ఆమాటలకు మరొకరైతే కాశేశ్వర్రావును చంపి తను చచ్చేవాడు. అనంతమూర్తి ఏమీ చెయ్యలేదు. ఆఖరుకు కూర్చున్న చోటినుంచి ఒక్క అడుగైనా కదల్లేదు. కొన్ని నిముషాలు వాళ్ళిద్దరిమధ్యా దీనంగా చచ్చి పోయినయ్.

"ఇక పోతానురా!"— అనంతమూర్తి పెదిమలు నిర్జీవంగా కదిలినయ్.

"వచ్చిన పనేదో ఏడు!"

"ఏంలేదు పది రూపాయలు అప్పు పుడుతుందేమో ననీ!" అనంతమూర్తి నసిగాడు.

"అప్పు!" కాశేశ్వర్రావు నరాల్లో రక్తం ఘోషించింది. ఇట్లాంటి పదిరూపాయలు అప్పుల కిందే కట్టుకునుంటే అనంతమూర్తిని తాకట్టుపెట్టినా కాశేశ్వర్రావు బాకీ తీరేది కాదు.

విసురుగా పదిరూపాయలనోటు అనంతమూర్తి కాళ్ళ దగ్గర పడ్డది. అది కాబోయే యజమాని దీనత్వం అర్థి నట్లే రెప రెపలాడింది. అనంతమూర్తి మొహంలో తృప్తి మెరిసింది. కాశేశ్వర్రావు మనస్సులో అసహ్యం మెరసింది. బయట ఎండ ధుమ ధుమలాడుతూంది. వేడిగాలి రివ్వుమని లోపలికి దూసుకునివచ్చి తలుపుల్ని ఫెడీలు ఫెడీలుమని కొట్టింది—

ఆ కాశేశ్వర్రావు చచ్చిపోయినా అతని అరమూసిన కళ్ళు నవ్వుతూనే ఉన్నయ్. ఆ అనంతమూర్తి సానుభూతి ప్రకటిస్తున్నా అతనిమనస్సు ఆనాటి పదిరూపాయిల కాయి తంలా రెపరెప లాడుతూనేఉంది. ★

(౨౭౮-వ పేజీ తరువాయి)

ప్రసాద్ చిరునవ్వునవ్వాడు. "నిజమా? నీకు నేను అంతగొప్ప సహాయం చేశానా? .... మీనాన్న నాకుచేసిన దాన్లో ఇదిఏపాటిది రామ్?" అన్నాడు కృతజ్ఞతాభావం ఉట్టి పడుతూన్న కళ్ళతో.

"మానాన్నా? మీకేమ సహాయం చేశాడు?" అన్నాడు రాము ఆశ్చర్యంతో.

ప్రసాద్ జవాబు చెప్పలేదు. తర్వాత కొంచెముండి అన్నాడు "నేనూ, మీనాన్నా 'లా' చదివేరోజులు. మా మేనత్తవాళ్ళు నాకుకావలసిన డబ్బు పంపే వారుకారు. మీనాన్న మాలాంటివాళ్ళకోసమే ట్యూషన్లూ అవీ చెప్పి ఆ డబ్బు మాకోసమిచ్చేవాడు. మేము ఆ పనికి అభిమాన పడేవాళ్ళం. కాని నాకిప్పుడు తెలిసివస్తోంది; తోటివారికి సహాయంచేయుటలో ఇప్పుడు పేరుపొందినవాళ్ళందరి లోనూ మీనాన్న ఏమీ తీసిపోడు. అయితే ఆయన అనామకుడిగానే ఉండిపోయాడు........."

రామునికి ఆశ్చర్యం కల్గింది. కేవలం రెండోపెళ్ళి చేసుకున్నందుకే తను తండ్రిని తిరస్కరించాడు; ఆయనలో అదొక పెద్దతప్పుగా భావించాడు, కాని శంకరయ్యలో సముద్ర గర్భాన రత్నాల్లా ఆయన హృదయంలో ఉన్న ఉత్తమత్వాన్ని ఇప్పుడు చూడగల్గాడు అతను. ఇంకా ఎందరి కేవిధంగా సహాయం చేశాడో? అందుకే బహుశః తండ్రి సంపాదనలో దమ్మిడీ అయినా మిగలక పోవటం, అయిఉంటుంది.

రామ్ మాట్లాడలేదు. స్వర్గీయుడైన తండ్రి ఇంకా న్నాళ్ళు బతికుంటే అందరూ అభివృద్ధి కొచ్చినట్లు తాను ఇంకా పెద్ద చదువులు చదివి ఉండగల ననుకొన్నాడు. అయితే ఆ 'గీత' లేదుగా అతనికి!!—

(ఇంకావుంది)





# ★ ఉష ★

*   *   *

నాటిక

*   *   *

శ్రీ పి. సత్యనారాయణ

## మొదటి దృశ్యం

స్థలం : చంద్రయ్యగారి ఇల్లు.
కాలం: ఉదయం 8 గం॥

(చంద్రయ్యగారు నట్టింట్లో మనుమణ్ణి ముద్దాడుతూ వుంటాడు.)

చంద్రయ్య : మురళీ! అమ్మను పిలువ్.

మురళి : (తాతగారి వీపుమీద రెండుచేతుల్తో దరువేస్తూ) అమ్మా ! తాత రమ్మంటున్నాడే !
(లోపల్నుంచి 'వస్తున్నాం' అని కేక వినబడుతుంది.)
తాతా ! మరీ అమ్మ ఏడుస్తోందేం?

చ : ఆడవాళ్ళంతా కానీకొక సారి కన్నీరు కారుస్తారు

ము: మరి నువ్వో?

చ : సరేగాని, సంక్రాంతి పండక్కి నిన్నూ, మీ నాన్ననీ, మీ అమ్మనీ తీసుకొస్తాం. ఇదుగో పది రూపాయల కాగితం (పది రూపాయల కాగితాన్ని మనుమడి జేబులో పెట్తాడు.) మురళీ ! ఈ డబ్బుతో ఏం కొను క్కుంటావ్?

ము: మరే...... మరే...... పిసిక తోలు.

చ : అంటే?

ము: (వెక్కిరిస్తూ) అంటే డామ్మన మోగేది. దాంతో మా నాన్నని కొలుస్తా. ఊఁ !

చ : ఛ వెధవాయ్ !

ము : లేకపోతే మా అమ్మని కొట్టాడేఁ?

చ : నీకెందుకురా?

ము: నాకెందుకా? మా అమ్మని కొడ్తుంటే నే వూరుకోను.

చ : ఒరేయి ! సుబ్బా ! పెట్టెగిట్టె బండిలో సర్దావుట్రా?

సు : (లోపల్నుంచి) సర్దాను బాబయ్యా.

చ : అమ్మాయ్ ! ఉషా !

ఉష : (లోపల్నుంచి) వస్తున్నా, నాన్నా !

చ : త్వరగా కానివ్వు. బండికి టైమవుతోంది. మురళీ ! పోయి అమ్మను తీసుకురా. (మురళి గబగబా లోనికి ఉడాయిస్తాడు. చంద్రయ్య కుర్చీలో కూర్చుని విచారిస్తుంటాడు.) ఆడపిల్లని ఓ అయ్యచేతిలో పెట్టింతరువాత దాని జీవితము ఆ అయ్యా చేతిలోని పువ్వు లాంటిది. నలిపి పారవేసినా, లేదా దాన్ని ఆప్యాయంగా చూచుకున్నా ఇతరులు అనే పనేలేదు. బ్రహ్మరాత ఎలావుంటే అలా జరిగి తీరాల్సిందే !

(మురళి, ఉష, సుభద్రమ్మ ప్రవేశం.)

ము: తాతయ్యా ! తాతయ్యా !

చ : (ఉలిక్కిపడి) ఆఁ ! ఏమిట్రా?

ము: చూడు. అమ్మ ఏడుస్తోంది.

చ : (కుర్చీలోనుంచి లేచి కూతుర్ని సమీపించి కన్నీరు తుడుస్తూ) ఉషా ! కన్నీరు కార్చకు. ఒక్కగా నొక్క బిడ్డవని అరచేతుల్లో పెంచాం; పెద్ద జేశాం, విద్యా గంధాన్ని పూయించాం. ఏరీ కోరీ బ్రహ్మరాక్షసి కంట గట్టాం. చదువుకున్న అల్లుడని సంబర పడ్డాం. ఉన్న సంసారమని ఉబలాట పడ్డాం. ఈమూ జోడూ

కుదిరిందని వేడుక పొందాం. మీ సౌఖ్యాన్ని ఆశించాం...... ఈ ఆశలతో, ఈ సంబరాలతో మా తనం తెల్లవారు తుందని భ్రమ జెందాం... కాని ఇలా...

—(కన్నీరు కార్చసాగాడు)

సు: అచ్చటా ముచ్చటా, మాటా మంచీ, రాకపోకలు లేవాయె, మాతోనే లోకం తెల్లవారింది. తెల్లవారితే ఏమో, ప్రొద్దు గ్రుంకితే ఏమో అని కోటి దేవుళ్ళకి మ్రొక్కడమైంది. (కన్నీరు తుడుచుకుంటూ) ఏమోలే, దాని కడుపు పండింది కదా అని అనుకుంటే, ఏదీ? కష్టాలు గట్టెక్కే కాలం దొర్లి రాదాయె.

చ: కన్న ప్రేమకొద్దీ చూచుకుందా మన్నా కఱవైపోయావ్. నిన్ను చూద్దామని కాలు వెళ్లగించుకుని వస్తే నన్ను నానా మాటలు అంటాడు. కష్ట నిష్ఠూరాల్ని త్రవ్వి పోసుకోడానికైనా నోచుకోలేదు.

ఉ: నాన్నా! ఎలా వ్రాసుంటే అలా జరక్కమానదు. నాగురించి మీరు తహ తహ లాడవద్దు. పెళ్ళయిన నాడే ఉష చనిపోయిందనుకోండి. బూరుగు మ్రాను పడిందని అనుకొని జీవితశేషాన్ని గడపండి. వృద్ధాప్యంలో మీకు పరిచర్యలు చేయడానికూడ నోచుకోలేకపోయాను.

(పాలేరు ప్రవేశం)

పా: బాబుగారూ! బజార్లో బండి నిలబడుంది. ఇంకేటి జాగు? సిట్టి బాబుగారూ! రండి బండెక్కిత్తా. ఊం! అహైలు.

(పాలేరు మురళిని చంకెత్తుకుని వీధిలోకి నడుస్తాడు.)

చ: ఉషా! ఏనాటికైనా పొట్ల గొడ్డు సాధువుగా మారుతుంది. ఓర్పుండాలి కాలం మారుస్తుంది—ఈ రోజువరకు 'మంచి' అనిపించుకున్నావ్—పేరు నిలుపు—పుట్టింటికి, మెట్టింటికి ఉషారాణివై ప్రకాశించు—మనసు నిలువక చెప్తున్నా గాని, అంతా నీకు తెలుసు.

ఉ: తెలియకేం నాన్నా? తెలియబట్టే అల్లరి పాలైపోయే సంసారాన్ని గుప్పెట్లో పట్టి తెస్తున్నా. తాపులకు వీపుజూపి లోకానికి నగుమోము చూపించా—బ్రతికుండగా భర్తకి, లోకానికి చీకటి బొమ్మనైనా, తర్వాత తరాలుగా చెప్పుకుంటారు—నాన్నా! అమ్మా!—నేటితో పుట్టింటికీ నాకూ.........

చ: (కోపంగా) అమ్మాయ్! ఏమ్మాటలవి?... పద టైమైంది. ఏదీ ఆ సంచి ఇలా ఇవ్వు (అని సంచి చేత బట్టి వీధిలోకి నడుస్తాడు.)

సు: కని పెంచాం గాని రాతలు మేం రాయలేదుగా తల్లీ; అంతా దైవాధీనం—అబ్బాయి జాగ్రత్త. యాదమరిచి ఉండేవ్. ఆ అడివి మనిషి వాణ్ణి చెయ్యి జేసుకుంటాడేమో. లేకుంటే వాణ్ణి ఇక్కడే ఉంచరాదూ.

ఉ: వద్దమ్మా వద్దు. ఆయన క్లబ్బుల్లో నడిఝామువరకూ కేరింతలు కొడుతూ వుంటే ఆ లంకంటి ఇంట్లో మురళి నాప్రక్కలోవుండి 'అమ్మా' అని అంటే కష్టాల్ని, బాధని మరచిపోతా.

పా: (వీధిలోనుంచి బిగ్గరగా) సిట్టెమ్మ గోరూ! టయమ్ బారయిందండోయ్! పేశనకి పొయ్యేసరికి పొద్దెక్కుద్ది బండి అందదు.

ఉ: పాలేరు కూడ తొందరపడుతున్నాడు. వెళ్ళొస్తా నమ్మా! ఆయువుంటే ఎప్పుడైనా 'అమ్మ, నాన్న' అని అనుకుంటా.

సు: ఏం ఫర్వాలేదు... నేనూ బండిదాకా వస్తా పద.

(ఉష ఇల్లంతా ఓసారి కలియజూచి కన్నీటితో వీడ్కోలు చెప్పింది. తల్లివెనక కూతురు తడబడే అడుగులతో వీధిలోకి నడిచింది.)

## రెండవ దృశ్యం.

స్థలం : జయరాం ఇల్లు
కాలం : రాత్రి 1 గం.

[ఉష, మురళి, ఒక మంచం మీద నిద్రిస్తుంటారు. మంచానికి దగ్గరలో ఒక దీపం గాలికి రెపరెప లాడుతూంది. వీధివాకిటి తలుపు తట్టుతూ అఱుస్తూంటాడు జయరాం]

జయరాం : తలుపూ — మత్తెక్కి గుఱ్ఱు పెడుతున్నారు. ఊఁ ! తీస్తారా? తియ్యరూ? లోపలెవరైనా ఉన్నారా లేదా?

ఉ : (మెల్లగాలేచి వెళ్ళి తలుపు గడియతీస్తాడు) నాన్నా! అంటూ మురళి

జ : నాన్నా ! దున్నా ! (ప్రవేశం)ఏంర్రా కుర్రకుంకా! (మురళిర జుట్టు పుచ్చుకుని రెంపూపులూపి) పిలుస్తుంటే మాట్లాడరేం? దొంగ తొత్తుకొడకా ! ఊఁ !

(మురళిని గొంతు పుచ్చుకుని పైకెత్తుతాడు.)

ము: అ..........మ్మా ! ......అమ్మా !

ఉ : (తుళ్ళిపడిలేచి భర్తను సమీపించి అతని పాదాల్ని స్పృశించి) అయ్యో ! వాణ్ణి చంపకండి. మీ కక్షంతా నామీద తీర్చుకోనండి. పసివాడిమీదా మీ ప్రతాపం!

జ : (మురళిని క్రింద దింపి) ఏమే ! ప్రొద్దున తన్నింది గుర్తులేదూ? జామున్నర పిలిస్తేగాని తలుపుతీయిస్తావ్? నిన్ను హూనంజేస్తా ...... మానాన్న కేం జెప్తావ్? (పళ్ళు నూరుతూ జుట్టు లంకించుకుని రెంపూపు లూపి) ఊఁ ! పలుకూ.

ఉ : నేనేమీ ఎఱుగను. రోజూ కళ్ళారా చూస్తున్న మనిషికి చెప్పాలా? అబ్బా ! బాధ. వదలండి. చంప కండి.

జ : చంపేస్తా — మొగుడు మాట వినవూ? — గుట్టూ రట్టూ అంతా నీయబ్బకి మాయబ్బకి చెప్పి ఏం చేస్తావ్?— నావిలాసాలకు, విషయోపభోగాలకు అం తరాయం గల్గించడానికి నీ వెన్ని పన్నాగాలు పన్నినా నీకు చిక్కే వాణ్ణికాను.— పద. ఊఁ! నడువ్. ప్రక్క ల్విరగొట్టా. నీమెళ్ళో తాళి కట్టినందుకు నీమీద నాకధికారం వుంది — ఎలాగైతే నేం కన్నావ్ గడు గ్గాయిని. ఊఁ! గడపదాటు. (ఉషను బయటికి నెట్టి తలుపు బిగిస్తాడు)

ము: అమ్మా : అమ్మా ! (ఏడుస్తాడు)

జ : పిసికతోలు కొంటావ్రుట్రా? పిసికతోలు కొన మన్నాడూ తాతయ్యా? ఓరి కొసవాయ్ ! — కాళ్ళు పుచ్చుకుని గోడకేసి కొట్టా.— మీ అమ్మ మాటలువిని నీ ఇష్టమొచ్చినట్లు ప్రేలుతావుట్రా? (చంపలు ఛెళ్ళున వాయిస్తాడు)

ఉ : (తలుపుకొట్టూ) ఏమండోయ్ ! వాణ్ణి చంపకండి— రామరామ. పసివాణ్ణి చంపకండి. కన్నకొడుకుని దయా దాక్షిణ్యాలు వదలి చేతులారా ప్రాణాలు తియ్యకండి —మురళీ ! మురళీ !

ము: (బిగ్గరగా) అమ్మా !

(లోపల్నుంచి కర్రపోటు వేసుకుంటూ జయరాం తండ్రి భద్రయ్య ప్రవేశం)

భ : ఒరేయ్ ! నువ్వు మనిషివా? దున్నపోతువా? పసి వాణ్ణి చావబాత్తున్నావా? ఒళ్ళు పొగరెక్కి మన్ను మిన్ను గానక ప్రవర్తిస్తున్నావ్. ముందువాణ్ణి వదులు లేకుంటే నిన్నూ వాడితో పండబెట్టా. అంతటితో ఈ అల్లరి సంసారం, నావంశం అంతరించిందను కుంటా — ఊఁ ! వదులు.

జ : నువ్వు అడ్డంరాకు. వచ్చావా పండబెడతా. వీణ్ని చంపుకుంటా. వీడు నాకొడుకు. నాఇష్టం. నీకేం?

భ : నువ్వూ నాకొడుకువే. నిన్నూచంపుతా. నీమీదనాకూ అధికారం వుంది — అప్రాచ్యుడా ! ఆపిల్లని బయటికి నెట్టి బజారుపాలు జెయ్యాలని నీ పన్నాగం— వినరా. ఆపిల్ల ఎలా మొత్తు కుంటుందో. అలా చూస్తావేఁ? వదులూ. ఊఁ !

జ : (తలత్రిప్పుతూ) ఉహూఁ !

భ : వదలవూ? వదలవూ? (చేతికర్రతో జయరాం నెత్తిన ఒక్కపెట్టు పెట్టాడు)

జ : అమ్మబాబోయ్ ! (మురళిని వదిలిపెట్టి తండ్రిమీద కురికి ఱొమ్ముకన రెండు కుమ్ములు కుమ్మాడు. భద్రయ్య స్పృహ లేకుండా పడిపోయాడు. వెక్కి వెక్కి ఏడుస్తూ మురళితలుపు గడియ తీసాడు. ఉష ఆదుర్దాగా మామ దగ్గఱకు వెళ్ళింది)

ఉ : మురళీ ! నీళ్ళు ! నీళ్లు.

ము: (నీళ్ళు తెచ్చి ఉష కందిస్తాడు)

ఉ : (భద్రయ్యగారి మొహం మీద నీళ్ళు చల్లి) మాఁవగారూ!

జ : (వెక్కిరిస్తూ) మాఁవగారూ! తరలండి బయటికి— మీరంతా ఒకటి. నా కొంపలో వద్దని ఎన్నిసార్లు జెప్పినా సిగ్గులేదు. ఛీ! కుక్కకన్నా కనాకష్టం— లే అక్కణ్ణుంచి. నీ కొడుకు నీవు హాయిగా బాహ్య ప్రపంచంలో విహరించండి. లేకుంటే నీ యబ్బ ప్రక్కలో దాగండి. (జుట్టు చేతబట్టి బడబడా బయటి కీడుస్తాడు ఉషని)

ము: అమ్మా! అమ్మా! నాన్నా! తాతయ్యా! (తాత దగ్గర పడిఉన్న కర్రతో జయరాంని ఒక్క దెబ్బవేసి) చావు నాన్నా చావు.

జ : ఒరేయ్ రా నువ్వూను. నన్ను బ్రతకనివ్వరు. ఇదంతా కుట్ర. మీరెన్ని పన్నినా ఇది వినే ఘటంకాదు. రంకు ముండ నా కెందుకు?... పదరా పద. (మురళిని విసరి బైట పారేస్తాడు)

(భద్రయ్య కొంచం తెప్పరిల్లి లేచి కర్ర చేత్తో పుచ్చుకుని వడకుతూ ఉంటాడు).

భ : ఎన్నాళ్ళని బ్రతికి కళ్ళారా ఈ ఘోరకృత్యాలను చూచేది?... ఆస్తి అంతా అప్పులపాలు; వంశం అప్ర తిష్ఠపాలు; సంసారం రట్టుపాలు. ఒరేయ్: పండంటి సంసారాన్ని బజారు పాలు చేశావ్. ఆ పిల్ల సాధ్వి కాబట్టి నీకు ఆడింది ఆట పాడింది పాటగా ఉంది. కొట్టినా, తిట్టినా నీ కొంపలో పెట్టి చాకిరి చేస్తూంది. ఆ పిల్లని నెత్తిన పెట్టుకుని పూజించాల్సింది బదులు రంకులు కట్టి, చావచితకొట్టి, ఈ అపరాత్రివేళ బయిటికి నెట్టావ్. నీకు నల్లముంతతో నీళ్ళు పుట్టె ట్రా? చిన్నా పెద్దా అని విచారింపక నన్నే కొట్టావ్?

జ : (పిడికిలి జూపి) నా ముందు లెక్చరు దంచక పోయి నీ కుక్కి మంచానికి మొరపెట్టుకో. నీ పొగడ్తల్ని, తెగడ్తల్ని వినే దద్దమ్మల్లేరు. కోడల్ని వెనకేసుకొస్తున్నావ్... ఏకి కోరి ముడిపెట్టావ్. నన్ను నాశనం చేశావ్. నేటితో బంధాలు పటాపంచలైనాయి. వాడు నా కొడుక్కాదు; అది నా పెళ్లాం కాదు. థూ!

భ : పూర్వజన్మ దుష్కృతం కొద్దీ అవతరించావు. 'ఛీ' అని లోకం అంటుంటే సిగ్గులేదూ!

## మూడవ దృశ్యం

(అదే రాత్రి. కోడి కూసినవేళ మురళిని వెంటబెట్టుకుని నడుస్తోంది. సమీపంలో చిన్న పూరి గుడిసె. గుడిసెలో నుంచి దీపం కనిపిస్తూంది)

ఉ : మురళీ!

ము: ఏంటమ్మా?

ఉ : మనపాలేరు ఇల్లేది?

ము: ఇదేనమ్మా. అప్పుడప్పుడు పాలేరు నన్ను వాళ్ళింటికి తీసుకువెళ్తుండేవాడు. ఇదే.

ఉ : అయితే మెల్లగా పిలువ్.

ము: ఓ రాములూ! రాములూ!

రా: (గుడిసెలోనుండి) ఆఁ! ఆఁ! ఓరు? ఓరయ్యా? వత్తా వుండు. (కళ్ళు నులుముకుంటూ బయటికి వచ్చి) ఆఁ! మీరా! అద్దమరేత్రికాడ ఏం పనిమీద ఒచ్చిన్రండి? దొరగారూళ్ళో వుండారా?

గంగి : (లోపల్నుంచి) ఓరుమావా? ఓరు? (గుడిసె నుండి బయటకు వచ్చి) ఉసమ్మగోరూ, చిట్టిదొరగోరా! ... అమ్మగోరూ! ఎప్పుడిటు రాలేదే!

ఉ : (గద్గదికంగా) కాని ఈ రోజున రావలసి వచ్చింది. నాకర్మ ఇలానడిపిస్తోంది.

రా: అసులుంఏజరిగిందో రవంత సెవినేత్తివాంటే ఈణంలో దానికిరుగుడు సెప్తా.

ఉ : ఏమీలేదు, అందులో క్రొత్తదనం ఏముంది?

రా : కొట్టిండా! గంగి! బుడ్డెత్తుకురా. (గంగి గుడిసెలోకి వెల్తుంది) ఈయన సదువు నట్టుబండలుగానూ! సంసారం చెయ్యటం తెలియని సదుకు తగలెయ్యానా? ఓనాడు కాకపోయినా, ఓనాడన్నా బుద్ధి తెచ్చుకుని సుగంగా సంసారం జేసుకోవచ్చు.

ఉ: అదంతా నా పూర్వజన్మ సుకృతం కొద్దీ అలా రోజులు దొర్లి వస్తున్నాయి.

రా: (గంగి బుడ్డి తెచ్చి రాములు కిస్తుంది) యనక ఏంకో జేసాం. అదిప్పు డనభగిత్తున్నాం అనంటే ఒప్పుకోను. (దీపం వెలుగులో ఉష వంటిమీది వాతల్ని జూచి) అమ్మ బాబోయ్! ఇయన్నీ వాతలే!

ఉ: అవన్నీ నా రాతలు. ఇంతకాలం ......

గం: మా తల్లివి నువ్వాగాబట్టి ఆయనతో సంసారం చేసవ్. నేనుగిన అయినట్టయితే .........

రా: ఆఁ! నువ్వయితే మొగుడి మొగాన పేడకళ్ళాపి జల్లి పుట్టింటికి దౌడుతీసే దానివి -- జయరాంగోరికి ఇంత వయసొచ్చినా సంసార గోసీద్రం తెలీదాయె.

ఉ: (విసుగ్గా) ఇవన్నీ ఎందుకు రాములు? కులానికి తక్కువ వాడివైనా గుణానికి తక్కువగాదు. ఇక్కట్లలో రపంతసాయం చేస్తావని వచ్చా ... వీణ్ణి రెండు మూడురోజులు నీదగ్గరే వుంచుకో -- పుట్టింటికి వెళ్తున్నా. (ఏడుస్తూ) మురళీ! రాములు దగ్గరే వుండు -- రాములూ! వాడిప్రాణం నీచేతిలో పెడుతున్నా. గంగీ, వాడు బెంగపెట్టు కుంటాడేమో, అప్పుడప్పుడు వాళ్ళ తాతగారి వద్దకు తీసికెళ్ళండి. సరేనా?

రా: (జాలిగా) మీమాటలు నా కర్థం గావటంల్లేదు. బతుకంటే మీకు చాకిరింపు పుట్టించనుకుంటా.

గం: అమ్మగోరూ! టేశనదాకా మీ పాలేరు వత్తాడులెండి. అపరేత్రికాడ ఎట్టా పోతారు?

ఉ: పిచ్చిదాన! నా కేంభయం? ప్రాణభీతిలేదు. లోకాన్ని చూచి కొంచెం భయపడుతున్నా. నాకుతోడు రావద్దు. మురళీ, వెళ్తున్నా. రాములూ! అబ్బాయి భద్రం. గంగీ నావిషయం ఎవ్వరికీ చెప్పొద్దు (మెల్లగా అడుగులు వేసుకుంటూ వెనక్కి తిరిగిచూస్తూ వెక్కి వెక్కి ఏడుస్తూ తమస్సులో లీనమైంది)

రా: (నిట్టూర్చి) మానసస్తురాలు. కొట్టినా తిట్టినా కుంయ్ మనకుండా పడరాని పాట్లుపడింది. ఆ అడివి మనిసిని మంచి దోవలో పెట్టాలని సతమత మాతుంది. కట్టం పలించదాయె. వద్దన్నా కద్దన్నా, రంకు గట్టినా, ఎన్నన్నా కన్నతండ్రికైనా పలానిది కట్టమని చెప్పుకుని ఎఱగని ఇల్లాలు.

గం: లేనోళ్ళు గుట్టుగా సంసారం సక్కబెట్టు కుంటుంటే, అన్నీ తెలిసి అగ్గానంలో మునిగి పండంటి సంసారాన్ని పాడు జేసుకునే వాళ్ళని ఏమనాలి? —— మావా! ఇంకా పొద్దుంది. పడుకుందాం. సిట్టిబాబూ! నాదగ్గరే పండుకో.

ము: నాకు భయంవేస్తుంది. మా అమ్మ పోయింది.

రా: యాడికెళ్లింది బాబూ. వచ్చుద్దిలే. రా పడుకుందాం. రాయె గంగీ!

## నాల్గవ దృశ్యం

స్థలం: జయరాం ఇల్లు.

కాలం: ఉదయం 7 గం.

(జయరాం నిద్ర మంచం మీద కూర్చుని వుంటాడు. అతని కెదురుగా గోడనానుకుని కూర్చుని వుంటాడు భద్రయ్య)

భ: ఆ పిల్లని తడిగుడ్డతో గొంతు కోశావ్. వేళకాని వేళలో ఇంట్లోనుంచి వెళ్ళగొట్టావ్. ఏమై పోయిందో ఏనుయ్యో గొయ్యో చూచుకునుంటుంది -- అంతా మాటగట్టుకున్నావ్ —— ఇప్పుడనుభవిస్తున్నావ్. దినం గడిస్తే సరని మురియకు; తనం గడవాలి -- చదివావ్. ఎందుకు? బండెడు చాకిరిచేసి పండులాంటి సంసారాన్ని గుట్టుగా చేసు కుంటున్నారు ఆ రాములు, గంగి. వాళ్ళనుచూచి బుద్ధి తెచ్చుకోశా. 'మంచి' అనిపించు కోవడం చాలానాళ్ళు పడుతుంది 'చెడు' అని పించు కొనడం క్షణం పట్టదు. విలాసాలకు, ఉంపుడుగత్తెలకు, త్రాగుడికి, నీ కళారాధనకు కట్నంతాలూకూ 20 వేలు, నాకష్టార్జితం 50 వేలు దేశానికి ధారపోశావ్. థూ! ఇకనైనా...

జ: చాలించు నీ ధర్మోపన్యాసం. ప్రపంచం ఎలా నడుస్తుందో నీకేం తెలుసు? గువ్వలా గొణిగితే సరా! -- మర్యాదగల సంబంధం, మంచిపిల్ల, అని ముడిపెట్టావ్. మంచి మర్యాద లెవరిక్కావాలి? డబ్బు, అంతం, కళారాధన కావాలి. ఈ త్రయాన్ని మించి ఈ పెధవ ప్రపంచంలో ఏదీలేదు. అయినా నీకుచెప్పినా ఏం లాభం? చెవిటి వాడి చెవిలో శంఖం వూదినట్లే!

భ: వెనక పుట్టిన కొమ్ములు ముందు పుట్టిన చెవుల్ని వెక్కిరించినట్లుంది నీ వాగ్ధోరణి. నీవుచెప్పిన త్రయం

నిన్ను ఈగతికి తెచ్చినయ్__ ఆ పిల్లగూడ కట్నం తెచ్చిందిగా! ఏదీ? ఏంజేశావ్? ఆగభోగాలకు, అంకమ్మ తిరునాళ్ళకు హారతి కర్పూరంలా హరించుకు పోయింది. ఇక నువ్వూ, నేను, ఆపిల్ల, పసితూన, కట్టు బట్టలతో పెద్దలుకట్టిన కొంపలో మిగిలాం.

జ: మిగిలారు నన్ను పీక్కుతింటానికి. మిమ్మల్నెవరు పోషిస్తారు?

భ: (కర్ర నేలమీద కొట్టి) నువ్వే. ఇంకెవరు? పెంచి, పెద్దజేసి, కష్టార్జితాన్ని ధార పోసినందుకు నన్నూ, పుస్తె కట్టించుకునని, కష్టసుఖాలకు లోనైనందుకు ఆపిల్లని, కన్నందుకు ఆ పసివాణ్ణి, పోషించాలి. ఏం అలా చూస్తావ్? అంతాతిని ఆకాశాన్ని చూపిస్తున్నావ్; గుద్దు పాశంతో మమ్మల్ని పోషిస్తున్నావ్. మానసాకిని పడిచావలసి వచ్చింది....

జ: చావు. చస్తే కొంత భారం తగ్గుతుంది.

భ: దానికొఅకే నేనూ చూస్తున్నా. ఏదీ? దొర్లి రావడం లేదు. (కళ్ళు మూసుకుని) అబ్బా! ఆకలి కడుపు మండు తోంది. నిన్నా మొన్నా పస్తు. ముసలితనంలో ఇలా పస్తు లుండడానికే నాడు నానా అగచాట్లూపడి సంపా యించా. ఏదీ? అంతాభ్రమ__ అమ్మా! ఆ రాములు దగ్గఅకి పోతా. తిన్న విశ్వాసం చూపుతాడేమో. (లేచి తూలుతూ కర్రపోటు వేసికొంటూ బయటికి నడుస్తాడు)

జ: ఛీ! ముసలిపీనుగు. కోడలంటే మహాప్రేమ. ఈ సైతాన్లు మూడూ విరగడైతే ఇంకహాయి. లోకపు చూపులో బికారినైనా, గాలిపటంలా శూన్యంలో విహరిస్తా. స్వేచ్ఛ! ఆనందం! అంతే. మగవాడికి పెళ్ళాం ఒక గుదికొయ్యలాంటిది. ఆ కొయ్య కాస్తా విరిగింది. ఇకహాయి. టైమ్ 7 గం 20 ని.__ గడియారం. దానిముఖాన రెండుముళ్ళు. వాటి పరస్పర సంబంధం? పెద్దముల్లు తిరుగుతుంటే చాలదూ? మరి గంటలు నిమిషాలతో కాలాన్ని గణింప వచ్చుగా. అలాంటిదే సంసారంలోని భార్యాభర్తలు. ఇదంతా శుద్ధ వెట్టి. వెట్టి వెధవలు బుజ్జితిరిగే వేదాంతం చెప్తారు. ఎవడిక్కా వాలి?.........ఆఁ! ఎవరు? అడుగుల చప్పుడు. (ఉష ప్రవేశం. జుట్టువిరియ బోసుకున్నది. చేతిలో చిన్నకత్తి. కత్తి కనపడకుండ పమిటె మాటున దాచింది. మొత్తం మీద భయంకరంగా వుంది. వచ్చి జయరాంకి ముఖాముఖి నిలిచింది. జయరాం వెఱ్ఱిగా చూస్తుం టాడు)

జ: (పళ్ళుకొఱుకుతూ) ఎందుకు దాపురించావ్ మళ్ళీ?

ఉ: (ఉఱిమి చూస్తుంది)

జ: డబ్బు లేనప్పుడు నీయబ్బ గాడిక్కా డెవడు పోషిస్తాడు? అంతఃపుర కాంతల్లా కాలు కదపకుండా తిందామని వచ్చావ్!

ఉ: డబ్బున్నప్పుడు సుఖంగా పెట్టావ్! ఇప్పుడు పెడ తావ్! కట్టుకున్న పెళ్ళానికి, కన్నకొడుక్కి ఇంత ఆర్జించి పెట్టడం చాతకానివాడివి నీవూ మగవాడివే! నీచదువు బూడిదలో పోసిన పన్నీరు__ పదేళ్ళ నుండి నాతో యీకొంపలో కాపురం చేస్తున్నావ్. ఏనా డైనా నాతో హృదయం విప్పి మాట్లాడావ్? నీ విలా సాలు, నీ కుంటెనగత్తెలు, నీ కళారాధన, నీ టీకుటాకు లేగాని, పెళ్ళాం ఏమైందని, తండ్రి ఏమైనాడని ఎన్న డైనా విచారించావ్? ఇప్పుడైనా విచారిస్తు న్నావా? ఇక విచారిస్తావా? నీ పాదాలక్రింద బడి పుట్టింటిని మరచా. నువ్వునాతో సరళంగా వుంటే అదేచాలని శతవిధాల యత్నించా. ఏంలాభం? __ నీవు ఆడించినట్లు ఆడా. నా నగలు, ఆఖరుకి తాళిని గూడ అమ్మి నీ కళారాధనా దావాగ్ని తీర్చా. ఎన్ని తీర్చినా నన్ను రాతికి రంగానికి రానియ్య కున్నావ్. ఇరుగు పొరుగు అమ్మలక్కలు సినీమాలనీ, అవనీ, ఇవనీ దొడు తీస్తుంటే నీ చీకటి కొంపలో జీవితపు లోతుపాతుల్ని గమనిస్తూ ఈరోజువరకూ కాలాన్ని దొర్లించా. అలిని, కన్న బిడ్డని చంపి ఏంచేద్దామని? అలాచూస్తావేఁ? నీ హృదయంమీద చేయివేసుకుని ఒక్కసారి గతాన్ని త్రిప్పిచూడు. ఆఖరుసారిగా ప్రాధేయ పడుతున్నా. ఇకనైనా ఆలిబిడ్డలగతి నాలోచించు. మా అమ్మ గారింటికి పోదాం. అక్కడే సుఖంగా ఉందాం.

జ: అయిందా నీ గంభీరోపన్యాసం? ఏ అండజూచుకుని తెగించి ఈ కసాయివాని సమక్షాన కారాలుమిరియాలు నూరుతున్నావ్? నీ వేషానికి, నీ బొబ్బరింపుకి దడిచి దాసోహ మంటా ననుకున్నావ్. ఆడదాని చెప్పు చేతల్లో ఉండేవాడు మగవాడుగాదు. నీవునాకు భార్యవుగా వచ్చిననాడే నాజీవిత ఫలకాన్ని బ్రద్దలు

చేశావ్. ఆ ఫలకం మీది నా ఆశలు, ఆదర్శాలు నీటి మీది వ్రాతలైనయ్. కాని విషయోప భోగాభిలాష ఇంకా తీరలా— డబ్బు, డబ్బు. దానితో నేవుంది లోకం.

ఉ : నా మహదాశయమే నాకండగా నిలిచింది. నీ సుఖాల కోసం భార్యాపిల్లల్ని గొంతుగోస్తావా? ఇదేనా నీ కర్తవ్యం? నీకేనా ఆశలు, ఆదర్శాలు, విలాసాలు, స్వేచ్ఛ? నేను మానసిని గానా?

జ : (వెకిలిగా నవ్వి) అవును, ఈనాటినుండి స్వేచ్ఛా వాయువుల్ని పీల్చు. బాహ్య ప్రపంచాన్ని నీ హస్త ద్వయంతో కౌగలించుకో. వెళ్ళు. నీ జీవితఫలకాన్ని త్రిప్పి వ్రాసుకో. ఊం! వెళ్ళు.

ఉ : నీచదివిన చదువంతా నాకు పీడో్క్కలివ్వడాన్కి పనికి వచ్చింది. మంచిది. తెచ్చినదంతా ముక్కు పుడకతో సహా తెగనమ్మి తుట్టతుదకు విరాగివై బిచ్చమెత్తు కొండని బొచ్చెలిచ్చి పంపుతున్నావ్. ఇదేనా నీమగ తనం! ఇన్నాళ్ళూ సహించా. ఇకమాత్రం .........

జ : సహింపక ఉరిబెట్టుకుంటావ్.

ఉ : కాదు. (కత్తి చూపిస్తూ) ఇదుగో (జయరాంను సమీపిస్తుంది)

జ : (వెనక్కి నడుస్తూ వణకుచూ) నన్నే! చం... పుతావా?

ఉ : బాగా ఆలోచించుకోనండి. తరువాత లబలబ లాడితే ఏం ప్రయోజనం? (నవ్వుతుంది.)

జ : ఉషా! చంపకు. నిరాయుధుణ్ణి; నీకు భర్తను గదూ? ఇన్నాళ్ళూ అణగి మణగి నేడు విజృంభించావ్ చంపకు.

ఉ : ఈనాటితో ఉష విముక్తినందుతుంది. ఇదిగో (కత్తిని జయరాం చేతిలో పెట్టుంది) ఇప్పుడు మీరుసాయుధులు. ఈ బాకుతో మీకోపాన్ని తీర్చుకోనండి.

జ : (కత్తిని విసరి క్రిందగొట్టి) భయాన్ని విడిచావ్. నీలో ఏదో శక్తి ప్రవేశించింది. వెళ్ళు. మంచి వాణ్ణెవణ్ణో కట్టుకో, సుఖపడు, వెళ్ళు.

ఉ : (క్రిందబడిన కత్తిని చేతబూని పొడుచు కొనడానికి సిద్ధంగా వుంటుంది)

జ : *(భయంగా) ఉషా! నామాటవిను. చచ్చిపోకు.

ఉ : (గంభీరంగా) బ్రతికి వుంటే లోకపు కట్టు కథల్లో నాయకినౌతా, నీకు ప్రతిబంధకమౌతా. నీ తాపుల మూలాన మొద్దుబారినదీశరీరం. మనస్సు మాత్రం మొద్దు బారలేదు. చచ్చిపోతే నీకు స్వేచ్ఛ? లోకానికి కథలు చెప్పుకునే శ్రమ తప్పుతుంది. ఛీ! పాడు బ్రతుకు; అందు లోనూ ఆడబ్రతుకు. (కత్తితో పొడుచుకుని నేల కొరుగుతుంది)

జ : ఉషా! ఉషా! (ఉషముఖం మీదికి వంగి) ఇంతసాహసానికి బూనుకుంటావని కలలోనైనా తలంచలేదు— ఛీ! అఘము నొడిగట్టుకున్నా. చివరికి నిన్నే చంపుకున్నా.

(రాములు, మురళి, భద్రయ్య ప్రవేశం)

రా : అయ్యబాబోయ్! ఖూనీ! ఖూనీ! దయాదాక్షిణ్యం ఒదిలి మాతల్లిని చంపావ్? (జయరాంను ఈవలకు లాగి పీక నొక్కబోతాడు)

ఉ : రాములూ! ఆగు! ఆయన్ని వదలు... నేనే పొడుచుకున్నా. (రాములు జయరాంని వదలి ఉష ముఖంలోకి విచారంగా చూస్తుంటాడు)

జ : (ఉష పాదాల్ని స్పృశించి) ఉషా! నాతప్పుల్ని మర్చిపో. నన్ను క్షమించు. (కన్నీరు కార్చసాగాడు)

ఉ : తప్పు. కాళ్ళు ముట్టకండి. నాన్నా! మురళీ! ఇలారా (మురళి భయపడుతూ జయరాం దగ్గఱకువచ్చి తిక మకలు పడుతూంటాడు.)

జ : బాబూ! అమ్మ ఏదో చెబుతుంది విను.

ఉ : మురళీ! (చిరునవ్వుతో) ఇదుగో మీనాన్న పూర్వపు నాన్నగాదు. మారారు.

(మురళి ఏడుస్తూ తండ్రిని కౌగలించు కుంటాడు).

జ : (కళ్ళు తుడుచుకుంటూ) ఉషా! క్షమించు. మఱచి మన్నించు. అంధకారంలో తడుములాడే నన్ను జూచి కనికరించి ఉషా రాణివై వెలసినావు. ఇప్పు డిప్పుడే ప్రపంచంలో వుండే వస్తువు లవగతమౌతున్నాయ్. నాకోసం నిన్ను బలిజేశా.

ఉ : నా యానందాని కవధిలేదు. నా మహదాశయం నెరవేరింది. (రొప్పుతుంది)

జ : నాన్నా! నాన్నా! నన్ను క్షమించు. గతాన్ని కలగా మరువు. (భద్రయ్యగారి కాళ్ళమీద పడతాడు)

భ : (దీనంగా) ఈనాటికి తెలుసుకున్నావు. క్రూరత్వాన్ని విడిచావు— నా హృదయావేదన తగ్గింది. కాని, అటు చూడు. ఉష స్త్రీ మూర్తి. తన జీవితాన్ని నీకు బలి చేసింది. చూడు తన కోరిక నెరవేరించవని, తన ఆశయం సిద్ధించిందని నగు మోముతో ఎలా మృత్యువు నాహ్వానిస్తోందో. ఆడదంటే అణగి మణగిన అనంతశక్తి— దావాగ్ని.

ఉ : మురళీ! నా జయ...రాం! ఇన్నాళ్ళకు...నోరారా పిలుచుకున్నా. (అస్పష్టంగా మాట్లాడుతూ అసువులు బాసింది ఉష. అంతా గొల్లుమన్నారు)

భ : (కన్నీరు తుడుచుకుంటూ) సాధ్వి అనంతశక్తి— కన్నుమూసింది. జోహార్!! (సమాప్తి)




# అమృతాంజనము

గాని,

" యథాయథా...............కాశీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగు చున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

# అల్లికలు

[కళ లన్నిటిలోను అల్లిక అనేదొక కళ. సాధారణంగా ప్రతి ఒక్కరు సులభంగా నేర్చుకో గలిగినది అల్లిక. స్త్రీలు చక్కగ తమ గృహములను ఈ అల్లికలతో అలంకరించుకో వచ్చును. ఉత్తర భారతంలో చలి ఎక్కువగనుక ప్రతిఒక్కరు విధిగా, అల్లిక నేర్చుకొని, తమకు కావలసిన దుస్తులు తామే అల్లుకుంటారు. ప్రతి స్త్రీ విధిగా అల్లిక నేర్చి ఉండాలి. మా "ఆంధ్ర మహిళ"లో అల్లికల శీర్షికను ప్రారంభించి, స్త్రీల కుపయుక్తమగు దుస్తుల తయారింపునుగూర్చి నెలవారుగా ప్రకటించగలమని మా చదువరుల కెరింగించుటకు ఆనందించుచున్నాము.]

అల్లిక అనే పదం వినే సరికి అందరికీ లేసులు అల్లుట జ్ఞప్తికి వస్తుంది. నిట్టింగు కూడా అల్లికలో చేరినదే. లేసు అల్లుట కంటే నిట్టింగు చేయుట సులభము. పిన్నలూ, పెద్దలు అంతా కండ్లకు శ్రమ లేకుండా అల్లుకొనేవి నిట్టింగు. చూచుటకు ముచ్చటగాను, ఎంతో త్వరగాను స్వెట్టర్లు, చోళీలు, పిల్లలకు టోపీలు, మేజోళ్లు, సమ్మర్ సూట్లు, జంపర్లు యింకా యిటువంటి వెన్నో వేసవికాలం, శీతాకాలం, వర్షాకాలం మూడు కాలాలకు పనికి వచ్చునట్లు అల్లుకోవచ్చును.

స్త్రీలకు ముఖ్యంగా చదువు కంటే కుట్ల మీద మోజుగా వుంటుంది. ఎంబ్రాయిడరీ మొదలగునవి, నేర్పు, ఓర్పు ఉపయోగించి చేయవలసిన పనులు. నిట్టింగు అలా కాకుండా కొద్దిగా ఓర్పు వుంటే చాలు ఎన్నో రకరకాలైన నమూనాలు అల్లుకోవచ్చును.

నిట్టింగు అనేక రకములుగా చేయవచ్చును. సర్వసామాన్యముగా అంతా ఉపయోగించు సాంకేతిక పదావళి. ని: నిట్టు; ప: పర్ల్; స్టి: స్టిచ్; స్లి: స్లిప్;

గా. స్టి: గార్టరుస్టిచ్; పా. స్లి. స్టి. ఓ: పాస్. స్లిప్. స్టిచ్ ఓవర్; స్టా.స్టి: స్టాకింగు స్టిచ్.

నిట్: ఈ కుట్టు నిట్టింగంతకూ ఆధారము. సూదిమీద మనకు కావలసినన్ని కుట్లు లెక్కపెట్టుకొని వేసిన తరువాత, ఆ సూది ఎడమ చేతితో పట్టుకొని, రెండవ సూదిని కుడి చేతితో పట్టుకొని, కుడిచేతిలోని సూది కొనను, ఎడమ చేతిలోని సూది మీద నున్న కుట్లలో మొదటి కుట్టు ముందు భాగములో దూర్చి వెనుకకు తీసి అప్పుడు సూది మీద దారం వేసి తీయవలెను. (ఊలు ఎప్పుడు వెనుకగా వుంచవలెను.)

పర్ల్: ఇది కూడా నిట్ వలె ఆధార భూతమైనదే; నిట్టు చేయటానికి సూదులు ఏమాదిరిగా పట్టు కుంటామో అదే మాదిరిగా పట్టుకొని, కుడిచేతిలోని సూది కొనను ఎడమ చేతిలోని సూది మీద మొట్ట మొదటి కుట్టు ముందు భాగములో దూర్చి ముందుకు తీసి (ఊలు ఎప్పుడూ ముందుగా వుంచవలెను.) అప్పుడు సూదిమీద ధారం వేసి రెండు సూదుల మధ్యనుండి తీయ వలెను.

స్లిప్: నిట్ లేక పర్ల్ కూడ వేయకుండా ఎడమచేతి సూది మీద స్టిచ్‌ని మామూలుగా కుడిచేతిలోని సూది మీదకు, సూదిమీద ధారం వేయకుండా మార్చవలెను.

గా. స్టి: గార్టరు స్టిచ్. ప్రతీ వరుసా నిట్ (మామూలు కుట్టు) చేస్తే అది గార్టరు స్టిచ్.

స్టాకింగు స్టిచ్: ఒక వరుస నిట్, మరియొక వరుస పర్ల్ కలసి స్టాకింగు స్టిచ్.

పాస్. స్లిప్. స్టిచ్. ఓవర్: ఒక కుట్టు నిట్ చేయకుండా కుడిచేతిలో సూది మీదకు మార్చి, తరువాత కుట్టును నిట్ చేసి మొట్ట మొదట మార్చిన కుట్టును రెండవ కుట్టు మీద నుండి ఎడమచేతి వైపుకు సూది కొనతో తప్పించవలెను.

## నిట్టింగు ప్రారంభించునపుడు తెలిసికొనవలసిన కొన్ని ముఖ్య పద్ధతులు.



I. కాస్టింగు ఆన్ :—(బొటన వ్రేలు పద్ధతి) నిట్టింగునకు ముఖ్యము సూదిమీద (గొలుసు) జారుముడి వేయుట మొట్ట మొదట సూదిమీద వేసే వరుసకు కాస్టింగు ఆన్ అంటారు. ఇది తరువాత అల్లేటటువంటి దానికంతకూ ఆధారంగా వుంటుంది. సర్వసామాన్యంగా బొటన వ్రేలు పద్ధతి నుపయోగిస్తారు. ఇది ఎడమచేతి బొటన వ్రేలు మీద దారం వేసి ఒక సూదినుపయోగించి వేస్తారు.

1.వ. పటము : కాస్టింగు ఆన్‌లో బొటన వ్రేలు పద్ధతిలో మొదటి పద్ధతిని చూపించుచున్నది. ఒక గజము ఊలు ఒక చివరి భాగమున విడిచి, జారుముడి వేయవలెను. ఆ ముడిని కుడిచేతిలో నున్న సూదికి మార్చి వూలు చివరి భాగమును ఎడమ బొటనవ్రేలు మీదుగా చుట్టి బంతినుండి వచ్చు వూలు కుడిచేతి వైపుగా వుంచవలెను.

2. ఎడమచేతి వ్రేలు మీదుగా వేసిన గొలుసులో సూదిని మార్చవలెను. ఊలు చివరి భాగమును (పటములో చూపిన ప్రకారం) ఎడమ చేతి వ్రేళ్ళ మధ్య గట్టిగా బిగించి వుంచవలెను.

3. బంతి నుండి ఊలును ఉపయోగించుచు ఎడమ చేతిలోని ఊలు చివరి భాగమును యింకా గట్టిగా పట్టుకొని చివరిభాగమును చుట్టవలెను. పైవిధముగా చుట్టిన గొలుసువేసిన సూదిని, బొటన వ్రేలుతో ఏర్పరచిన గొలుసులోనుండి తీసి బొటన వ్రేలుమీద వూలును జారు విడువవలెను.

4. ఈవిధముగా మనకు ఎన్ని కుట్లు కావలసిన అన్ని లెక్క పెట్టివేసుకొని ఆతరువాత రెండవసూది కూడ ఉపయోగించి యధాప్రకారం అల్లికను మొదలుపెట్ట వచ్చును.

II. కాస్టింగ్ ఆన్ : (రెండు సూదులతో వేసెడి పద్ధతి) ఒక సూదిని ఉపయోగించి, బొటనవ్రేలు నుపయోగించి వేసే పద్ధతికి బదులుగా రెండు సూదులుపయోగించి కూడా వేయవచ్చును. కాని రెండు సూదు లుపయోగించి వేసిన చివర సాగుటకు వీలు లేకుండ పిల్లల బట్టలకు అట్టే గట్టి పట్టు నివ్వజాలదు.

5. రెండు సూదులుపయోగించి వేయుటలో మొదటి పద్ధతి : ఊలు చివరభాగము, ఒక జారుముడివేసి (బొటనవ్రేలు పద్ధతి మాదిరిగా ఊలు చివరిభాగ మున ఎక్కువగా నుంచనవుసరములేదు) దానిలో రెండు సూదులు పటములో చూపిన మాదిరిగా ఎడమ చేతిలోని నూదిని పైగా వుంచి కుడిచేతిలోని సూదిని క్రిందుగా వుంచవలెను.

6. తరువాత బంతి నుండి వచ్చు ఊలును సూదుల రెండిటి మధ్యనుండి (పటములో చూపిన మాదిరిగా) తీయవలెను.

7. కుడిచేతిలోని సూది నుపయోగించి ఆ ఊలు మడ తను రెండు సూదులకు చుట్టుకొని ఉన్న జారుముడి లోనుండి తీయవలెను. అప్పుడు రెండు సూదులమీద రెండు జారు ముళ్లు ఏర్పడును.

8. కుడిచేతిలోని సూదిమీద జారు ముడిని ఎడమచేతి లోని సూదిమీదకు మార్చవలెను. ఇదే విధముగా ఎన్నికుట్లు కావలసిన అన్ని లెక్కచూచుకొని వేసు కోవలెను.

III. కాస్టింగ్ఆన్ : (మరియొకపద్ధతి) ముందు చెప్పిన పద్ధతి కాస్టింగు ఆన్ కంటె ఇది గట్టిగాను, బింకము గానుండి బలమైన అంచు ఏర్పడును. మొట్టమొదట రెండు సూదులతో కాస్టింగుఆన్ చేసే పద్ధతి ప్రకారము అల్లి, ఎడమచేతిలోని సూదిమీద రెండు కుట్లు ఉన్నప్పుడు, కుడి చేతిలోని సూది ఆ రెండిటి మధ్య 9-వ పటములో చూపిన మాదిరిగా మార్చవలెను. తరువాత మామూలుగా కాస్టింగుఆన్ చేసేటట్లు చేస్తూ, కాని సూదకొన ప్రతికుట్టు లూప్‌లో గ్రుచ్చకుండా, రెండు కుట్లకు మధ్యలో గ్రుచిచ అల్లుచుండవలెను.

మేజోళ్లు మొదలగునవి వేసేటప్పుడు ఇంకా గట్టిగా వుండుటకు ఈ పటములో చూపినట్లు బొటనవ్రేలు పద్ధతిలో మనకు కావలసినన్ని కుట్లు వేసికొని, వాటిని మూడు భాగములుగా మూడు సూదులమీద వేసి 10-వ పటములో చూపిన మాదిరిగా నాల్గవ సూదితో మొదటి వరుస ప్రారంభించవలెను.




---

# నాగాయుత సత్వుడు

• శ్రీమతి వల్లూరు సత్యవాణి •

"బిగ్గరగా చదువు చెల్లాయి ఆ పద్యం—" అన్నది విజయ తన గదిలోంచి ఆత్రంగా.

'అబ్బ! నీ కెందుకే ఈ గొడవ' అంటూ పద్యం చదవడం మానింది చెల్లాయి.

'కాదు చెల్లాయి. నీవా పద్యం పాడుతూ వుంటే ఎన్నో విషయాలు కండ్లకు గట్టాయి. ఏవో ఆలోచనలు మనస్సులో కలుగుతున్నాయి. చదువు చెల్లీ ఆ పద్యం.' అన్నది చెల్లిని సమీపించి విచారంగా.

'తప్పక చదువుతా. కాదు పాడతా విను ఆ పద్యం' అని ఇలా శ్రావ్యంగా పాడుతుంది.

ఉ. వేడుక నొక్కరుండు శత వీరకుమారులతోడఁ జల్లుఁబో
రాడి జయించి యందఱ ననంతపరిశ్రమ పారవశ్యముం
గూడి ప్రమాణకోటి ననఘుండు సమీరణ నందనుండు మే
యాడక నిద్రవోయె శిశిరానిలముల్ పయి వీచుచుండఁగ౯.

'ఆం. భా. ఆది. ఆ. 5_170,'

"ఎంత మంచి పద్యం. మహాకవి నన్నయ. ఈ పద్యార్థం నీకు తెలుసా. ప్రమాణకోటి అంటే ఏం చెప్పింది మీ ఉపాధ్యాయిని చెల్లాయి" అని ప్రేమగా అడిగింది విజయ.

'ఏం చెప్పలేదక్కా! నీకు తెలుసా. నాకు చెప్పవూ' అంటూ అక్క చేయి పట్టుకుంది జాలిగా చూస్తూ, చెల్లాయి. చెల్లాయిని చేతితో నిమురుతూ విజయ! ఇక్కడ మంచి కథవుంది సంస్కృతంలో. నన్నయ్య గారు ఆ కథ అనువాదం చేయకుండా వదిలేశారు. ఇలా చాలా కథలు వదిలేశారమ్మా....

'చెప్పవక్కా....'

"విషతల్లి"- ప్రమాణకోట్యాం - గంగాయాం ప్రదేశవిశేషే! అని వ్యాఖ్యలో ఉంది. అంటే గంగ యందలి నొకా నొక ప్రదేశం. ఈప్రమాణ కోటిలో శూలాలు పాతించి భీమునకు విషాన్నము పెట్టించి, సర్పపాశాలచే కట్టించి ఆనీట ద్రోశాడు దుర్యోధనుడు. దైవ వశాన భీముడా శూలాల మీదపడక తొలగి పడ్డాడు. వెంటనే లేచి సర్పాలను నలియ జిమ్మగా గొన్ని చచ్చి, మిగిలినవి నాగలోకానికి బోయి వాసుకి మొదలగు నాగులతో చెప్పి వానిని దీసుకొని వచ్చాయి. అందులో ఆర్యకుడనే నాగుడున్నాడు. (ఆర్యకుని కూతురు కుమారుడు శూరుడు. శూరునికూతురు కుంతి. కుంతి కుమారుడు భీముడు.) ఆర్యకుడు తన దౌహిత్ర దౌహిత్ర దౌహిత్రుడగు భీముని చూచి కౌగలించుకొన్నాడు. అంత వాసుకి మొదలైన నాగులు భీముని యందు ప్రీతి గలవారయి, అతని కనేక ధనము లీయ వచ్చారు. అప్పుడు ఆర్యకుడు "వీనికి ధనములచే ప్రయోజనం లేదు, నూఱేనుగుల బలంగల రసమొక కుండలో వుంది. ఆ రసాన్ని ఇతడు త్రాగినంత యీయండి" అని చెప్పాడు. అంత వారా రస మీయగా భీముడు తూర్పు మొఖంగా కూర్చుని ఎనిమిది కుండల రసం త్రాగి సుఖంగా నిద్రించి ఎనిమిదవనాడు మేల్కొన్నాడు. పిమ్మట ఆ నాగులు నీవు పదివేల యేన్గుల బలంగల వాడవై ఘోర వైరుల నిర్జిస్తావని ఆశీర్వదించి, వస్త్ర మాల్యాదులు కట్టనిచ్చి, పైకి దీసుకొని వచ్చి పూర్వం వారాడుక్కొన్న ఉద్యానవనంలో దింపి పోయారు.

'అబ్బ. ఎంతపనిచేశారు!' తర్వాత ఏమయిందక్కా!!"

తరువాత పదివేల యేనుగుల బలంగలవాడై కౌరవులనందరనూ జయించాడు. అందుకనే భీముణ్ణి నాగాయుత సత్వుడంటారు. తెలిసిందా చెల్లాయి!!

'తెలిసిందక్కా!! ఎలాతెలుసక్కా నీకు యీకథలు"

'విన్నానమ్మా! అని కుంగిపోయింది.

'రోజూనాకూ చెప్తుతావా; ఈకథలు"

'ఆ. నీవు వింటానంటే అల్లాగే... ఇంతకంటె నాకు సంతోషమేముంది చెల్లాయి.' అని మౌనం వహించింది విజయ.



Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 24-A, Luz Church Rd., Madras 4

# ఆంధ్రమహిళ



JANUARY '54 ANDHRA MAHILA ANNAS 8



వీణాపల్లవపాణి

చిత్రకారుడు : శ్రీ కూచి భాగేశ్వర శర


Jewellery
FOR
SMART WOMEN
DIAMONDS
JEWELLERY
SILVERWARE.







JVZ-1T6



# ఆంధ్రమహిళ

సంపుటి 10 :: జనవరి '54 :: సంచిక 9

ముఖచిత్రం: "గౌరీశంకర్" (అభ్యుదయ చిత్రకళా ప్రదర్శనములోని ఒక త్రివర్ణ చిత్రము)
చిత్రకారుడు: శ్రీ ఎల్. ఎం. బాబూ.




వ్యవస్థాపకురాలు: శ్రీమతి దుర్గాబాయి, యం.యే.,బి.యెల్.,
సంపాదకురాలు: శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే.,యెల్.టి.,

ఆంధ్రమహిళా సభ, మైలాపూర్,
మద్రాసు—4

సంవత్సరచందా :: ఆరు రూపాయలు.


## చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-
### ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహానిచ్చుటకు, సభ తరపున కొందఱు యువతులు నియమింపబడుదురు. ఈ ఉద్యమంలో ఒక ప్రత్యేక ప్రతినిధిగా వ్యవహరించి, ధనము వసూలు చేయుటకు భారత ప్రభుత్వమువారు, ఆంధ్ర మహిళాసభకు అధికారమిచ్చియున్నారు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని అన్ని వివరములు తెలిసికొనవచ్చును,

ఇంకొక విషయము— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయడల సభకు 1¼% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

ఉత్సాహ వంతులైన సోదరీమణులు, యింత వరకూ సభద్వారా నిల్వ సర్టిఫికెట్లు తీసుకున్న మొత్తము రమారమి రూ. 20000/- ఇందు మూలముగా సభకు వచ్చిన కమీషను రూ. 250/- ఇంకా పెక్కుమంది సోదరీమణులు యీవిధముగా సభద్వారా సర్టిఫికెట్లుకొని సహాయ పడవలెనని కోరుచున్నాను.

అ. చన్నఘంటమ్మ
కార్యదర్శిని.

### ఆంధ్ర మహిళాసభ

## మాతా శిశు సంరక్షణశాఖ

# క్రొత్త వార్డుకు శంకుస్థాపన

———: :———

1954– జనవరి, 24-వ తేదీన, మదరాసు గవర్నరు శ్రీ శ్రీప్రకాశగారు, ఆంధ్ర మహిళాసభ నర్సింగ్ హోమ్ ఆవరణలో క్రొత్త వార్డుకు శంకుస్థాపన జేయుటకు అంగీకరించియున్నారు.

ఇందు ప్రస్తుతము 20 మందికి ప్రసూతి చికిత్సకు ఏర్పాటులున్నవి. నిర్మింపనున్న క్రొత్త భవనములో మరియొక 20 మందికి చికిత్సచేయుటకు ఏర్పాట్లు జరుగును.

ప్రస్తుతము ఇక్కడ ఉచిత వైద్యశాఖలో ప్రతిదినము రమారమి 40 మంది రోగులకు మందులీయబడు చున్నవి. గత ఆగస్టు నుండి, ఇక్కడ ప్రసవ వైద్యశాఖలో కూడ పనిజరుగుచున్నది. అనేకమంది బీద యువతులు ఇక్కడ ఉచితముగా చికిత్సను పొందుచున్నారు.

ఇందు గత జూలై నుంచి భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ననుసరించి, సంక్షిప్త నర్స్ ఎయిడ్-మంత్రసాని పనులలో 12 గురికి శిక్షణ యివ్వబడుచున్నది. తిరిగి జూలై నాటికి మరియొక 12 గురు యువతులు యీ నర్సెయిడ్ తర్ఫీదునకై జేర్చుకొనబడుదురు. ఈకారణముగా, ప్రస్తుత భవనములు విస్తృతము గావలసిన అవశ్యకతను గుర్తించి, భారతప్రభుత్వ ఆరోగ్యశాఖవారు నూతనభవనముల నిర్మాణానికీ, అందుకు సమకూర్చ వలసిన పరికరములు మున్నగువానికీ రూ. 1, 48, 000 లు, గ్రాంటుగా యిచ్చియున్నారు. ఈ విత్తము ఆధారముగా, సహృదయుల సహకారాన్ని కాంక్షిస్తూ, మహిళాసభ నిర్వాహకులు, ప్రస్తుత నిర్మాణానికి పూను కొన్నారు.

శంకుస్థాపన ఉత్సవసమయానిక్కి ఆంధ్రమహిళాసభ వ్యవస్థాపక కార్యదర్శిని శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు శ్రీ చింతామన్ దేశ్‌ముఖ్‌గారు కూడా, ఆస్ట్రేలియా పర్యటన ముగించి, మదరాసుకు వచ్చెదరు.

ఆ సందర్భములో సభవిద్యార్థినుల, సభ్యురాండ్ర, నృత్య, సంగీత ప్రదర్శనములు ఏర్పాటుచేయ బడును.

సభ్యురాండ్రు, మిత్రులు, సహృదయులు, అందఱూ యీ నిర్మాణ ప్రయత్నమునకు అన్నివిధములా సహకరించి, ఉత్సవమునకు వేంచేయ వలసినదిగా కోరుచున్నాము. ప్రత్యేక ఆహ్వాన పత్రములు సకాలములో పంపబడును.

అ. చన్నఘంటమ్మ,

ఆర్. కమలాబాయి,

సంయుక్త కార్యదర్శినులు.



సంపుటి 10 :: జనవరి '54 :: సంచిక 9

# ప్లానింగు - ప్రజల సహకారం

———:o:———

ఒక గృహం నిర్మించాలంటేనే కొంత ప్లానింగు, కొందరి తోడ్పాటు కావాలిగదా! ఒక దేశాన్ని సర్వతోముఖంగా పునరుద్ధరించాలంటే ఎంత ప్లానింగు, ఎంతమంది సహకారం కావాలో ఆలోచించండి. ప్రజలంతా ఆ ప్లానింగు యొక్క ఆవశ్యకత, ఆశయం అర్థం చేసుకొని, తమ ప్రభుత్వానికి పూర్తి సహకారాన్నిచ్చి కలసికట్టుగా కృషి చేస్తేనే, ఏ స్కీమైనా జయప్రదమౌతుంది.

భారత దేశం ఒకప్పుడు "శ్రీలుపొంగిన జీవగడ్డ- పాలు పారిన భాగ్యసీమ"యై ప్రపంచానికంతటికీ, సర్వవిషయాల్లోనూ తలమానికమై వర్ధిల్లింది. కాని, అనేక కారణాలవల్ల పరిస్థితులు మారేయి. వ్యవసాయమే ముఖ్య వృత్తిగాగల దేశంలోనే కూటికి, గుడ్డకు కరువేర్పడింది. విదేశాలకు వినికిడిబోసిన తక్షశిల వంటి విద్యాసంస్థలు వెలసిన దేశంలోని ప్రజలు, విద్యాగంధం లేనివారయ్యేరు. కాలగర్భంలో ఎన్నాళ్ళయినా తుప్పు పట్టనటువంటి అశోక స్తంభం కరిగించి పోసిన దేశంలో, పరిశ్రమలు తుప్పుపట్టి నశించేయి. ఏనాడో ఓడల్ని నిర్మించి, విదేశ వ్యాపారం విరివిగా సాగించిన దేశం- విదేశస్థులు తమ సరుకులు గుమ్మరించడానిక్కి చక్కటి అంగడిగా తయారైపోయింది. వేదశాఖలు, అమర కావ్యాలు, ఆరోగ్యసూత్రాలు, చతుష్షష్టికళలు- విద్యలు, వీరగాథలకు బుట్టినిల్లు ఐన మనదేశం, ప్రపంచబోధకులైన వివేకానంద- గాంధిమహాత్ములకు కన్నతల్లియైన మనదేశం, ఇప్పుడు ఇతరదేశాల్లో చాలా వెనక్కు బడిపోయింది. మచ్చుకు చూడండి: మనదేశ ప్రజల సగటు ఆయుర్దాయం 32 సం॥రాలు, విదేశస్థుల్ది 60-70 ఏళ్ళు ఐతేను! మన ప్రజలు సగటు రాబడి రోజుకు ఆ-రు-పై-స-లు, విదేశాల్లో 5-8 రూ-పా-య-లు! మనలో విద్యావంతులు నూటికి 12-13 గ్గురు (దాంట్లో స్త్రీలు నూటికి ఒకపాలు) విదేశాల్లో నూటికి నూరు మంది చదువరులైతే! మాతా శిశువుల మరణాల విషయం చూచినా మరేవిషయంలో చూచినా ఈ శోచనీయస్థితే బోధపడుతుంది. ఇందుచేత ప్రపంచ దేశాల్లో మన పేరు ప్రతిష్టలు నిలబెట్టుకోవాలన్నా, మళ్ళీ మార్గదర్శకులం కావాలన్నా, దేశ పునరుద్ధరణకు, ప్లానింగులు- పథకాలు ముఖ్యావసరం.

ఈ ప్లానింగు 1938 లోనే జాతీయ కాంగ్రెస్ ప్రారంభం చేసింది: ఒక కమిటీని నెహ్రూ ఆధిపత్యంక్రింద యేర్పరచింది. దేశంలోనున్న దైవప్రసాదిత ప్రకృతి సంపదల్ని వీలైనంతవరకు సద్వినియోగంలోకి తెచ్చి- దేశ

# ప్లానింగు-ప్రజల సహకారం

దారిద్రయాన్ని దూరం చేయాలని. దానివెంట 'బొంబాయి ప్లాను', 'బిర్లా ప్లాను'లు వచ్చేయి. వీటిని పెట్టుబడిదార్ల పథకాలన్నారు. ఆవెనుక 'అగర్వాలా- ప్లాను'. ఇది గాంధీ తత్వాన్ని అనుసరించిందన్నారు. ఏదీ కూడా పూర్తిగా ప్రజామోదాన్ని పొందలేదు. ఆఖరుకు ప్రత్యేకవేత్తలంతా కలిసి, దేశమంతా తిరిగి అసంఖ్యాక ప్రజల్ని సంప్రదించి తయారు గావించిన సమగ్రమైన జాతీయ పునరుద్ధరణ పథకం "పంచవర్ష ప్రణాళిక" రూపంలో తయారై, నమోనాలు జూలై 1951 లో ప్రకటితమయ్యేయి. ఈ పథకాల ఆశయం:- దేశ సంపదల్ని (భూసంపద, పశు సంపద, నదీ సంపద, వన సంపద, ఖనిజ సంపద, జన సంపద వగైరాల్ని) సద్వినియోగంలోకి తెచ్చి, ప్రజా సందోహాలకు తిండి, గుడ్డ, వసతి, రవాణా, విద్య, వైద్యం యిత్యాది సౌకర్యాలన్నిటిని కల్పించి, మళ్ళీ దేశాన్ని సిరి-సంపదలతో, ఆయు-రారోగ్యాలతో, గృహపరిశ్రమలు- లలిత కళలతో అలరారేటట్లు చేయాలని.

ఐతే ఈ బ్రహ్మాండమైన పథకాలకు, (36 కోట్ల జనాభాకు 'పోషణా'- 'పనీ'- పైన చెప్పిన 'సౌకర్యాలూ' కల్పించడానికి) కోట్ల కొద్దీ ధనం కావాలి, యంత్రాలు కావాలి, ఎందరెందరో సాంకేతిక నిపుణులు కావాలి.

ఈ పరిస్థితుల్లో ఫోర్డు ఫౌండేషన్ ధర్మసంస్థ, కొంత సహాయం చేస్తానంది, అమెరికా ప్రభుత్వం కొంత డబ్బూ- నిపుణుల్నీ యిస్తానంది. ఇవన్నీకూడా భేషరతుగానుమండి! అందుకే రాజనీతి కోవిదుడైన మన నెహ్రూ ప్రధాని వీటిని స్వీకరించేడు. ఇదే "ఇండో- యు. యస్. టెక్నికల్-కోఆపరేషన్- అగ్రిమెంటు" దీని ప్రకారం 15 భారీస్కీములు నిర్వహణకై మనకు కావలసిన సాంకేతిక నిపుణుల్నీ, 8 కోట్ల- 83½ లక్షల డాలర్ల (అంటే 42 కోట్ల- 23 లక్షల రూ॥ల) ధన సహాయాన్నీ అమెరికా ప్రభుత్వం యివ్వడానికీ, దానికి భారత ప్రభుత్వం 71 కోట్ల 75 లక్షల రూ॥లు చేర్చి పంచవర్ష ప్రణాళిక అమలు జరపడానికి వెచ్చించడం. ఇదీ యేర్పాటు.

ఇలా దేశమొత్తానికంతటికీ ఉపకరించే జాతీయ ప్రణాళికలు ప్రకటించి అమలు జరుపుతుంటే, ప్రజలు ఆబాలగోపాలం, వీటినిగురించి తెలుసుకొని, దేశ పునర్నిర్మాణానికి తమ పూర్తి సహకారాన్నిచ్చి, శక్తివంచన లేకుండా కృషి చేయవలసిన విధి అందరిదీయైయుంది. ఈ సందర్భంలో స్త్రీజనాభ్యుదయానికై కృషిచేసే స్త్రీల సంస్థలకు 50 కోట్ల రూ॥లు ధన సహాయం చేస్తామనీ, ఈ పంచవర్ష ప్రణాళికను పాఠశాలల్లో పాఠ్యగ్రంథంగా చేయబోతున్నామనీ ప్లానింగుకమిషను మెంబరైన శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు ఇటీవల విశాఖపట్నం వచ్చిన సందర్భంలో ప్రకటించడం ఎంతైనా ముదావహం. ఈ ప్రబోధం స్త్రీలకు- స్త్రీల సంస్థలకు- విద్యాలయాలకు మాత్రమే గాదు. గ్రామ గ్రామాల్లోను- మూల మూలల్లోను కృషిచేస్తూ ఎందరో మహానుభావులు, మహిళా మణులు ఉన్నారు. పేరు ప్రఖ్యాతులకు భయపడుతూ, గీతలో చెప్పిన నిష్కామకర్మ గావిస్తూ.

"Full many a gem of purest ray serene,
The dark unfathomed caves of ocean bear" అని ఒక మహాకవి చెప్పినట్లు

> "రిక్కల నీసడించెడి మరీచుల- దిక్కులగ్రక్కు- రత్నముల్
> లెక్కకుమీరి, సంద్రములలేవా- మనుష్యుల దృక్పథంబులన్
> దక్క ! ........................................
> .................................................."

ఇలాగ మనమెరుకకు రాని మణులెందరో ఉన్నారు. వారికి కూడ ఈ సందేశం అందాలనీ, వారంతా పూర్తిగా తోడ్పడి,ప్రజలు- ప్రభుత్వం, పెద్దలు- పిన్నలు, స్త్రీలు- పురుషులు ఈ జాతీయకార్యకలాపంలో పాల్గొని, దీన్ని దిగ్విజయంగా నెరవేర్చాలనీ యీ ప్రబోధం.





అఖిల భారత మహిళా ఆహార కౌన్సిల్ మూడవ వార్షిక సమావేశము ఈ నెల 11-వ తేదీన మద్రాసులో రాజాజీ హాలులో జరిగినది. మద్రాసు గవర్నరు శ్రీ శ్రీప్రకాశ గారు సమావేశమును ప్రారంభించిరి. శ్రీమతి లీలావతీ మున్షీ అధ్యక్షత వహించిరి.

పైపటములో శ్రీమతి లీలావతీ మున్షీ, శ్రీమతి పంజాబ్ రావ్ దేశ్ ముఖ్ గార్లు ఆహ్వానసంఘ సభ్యురాలు.

శ్రీమతులు లీలావతీ మున్షీ, సుశీలానాయర్, విమలా దేశ్ ముఖ్, ఇంకా ఇతర ప్రతినిధులు ఆంధ్ర మహిళా సభచే నడుపబడుచున్న వివిధశాఖలను చూచిరి.



# రాజకీయాలు

• శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు.

నవంబరు నాలుగోవారం మొదలుకుని డిసెంబరు మూడో వారం వరకూ జాతీయ, అంతర్జాతీయ రాజకీయ రంగాల్లో నడిచిన ప్రముఖ సంఘటనలివి: ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదుల దుస్తంత్రాలు మరీ విచ్చలవిడిగా చెలరేగటం, భారత ప్రభుత్వం దేశంలో రాష్ట్రాల పునర్నిర్మాణ సమస్యను పరిశీలించటానికి ప్రత్యేక సంఘాన్ని నెలకొల్పటం, ఆంధ్ర రాజధాని విషయం అనిశ్చితంగా తయారుకావటం.

* * *

ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్య వాదుల దుస్తంత్రాలు అంత కంతకూ బాహాట మయిపోతున్నవి. ఇంత వరకూ ప్రజాస్వామ్యం పేరుతో చెపుతున్న ధర్మ పన్నాలు సాగి రాకపోయే టప్పటికి దబాయింపులకూ దౌర్జన్యాలకూ అవి వెనకాడటం లేదు. 'స్వతంత్ర' దేశాలమని స్వోత్కర్షగా చెప్పుకుంటున్న ఈ సామ్రాజ్య దేశాలు, నిజమయిన స్వతంత్ర విధానాన్ని అనుసరిస్తున్న ఆసియా, మధ్య ప్రాచ్య దేశాల సానుభూతిని పోగొట్టుకుంటున్నవి. అంతే కాదు. తమ దురాశతో, దురహంకారంతో వాటిని శత్రువులుగా కూడా మార్చుకుంటున్నవి.

గత యుద్ధం ముగిసీ ముగియక ముందునుంచీ బ్రిటన్ ఎన్ని దేశాల ప్రజలతో పోరాడిందో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. సయాం దేశాన్ని ఆక్రమించి, దాదాపుగా దానిని తమ వలసగా మార్చుకుంటూ ఒక ఒప్పందాన్ని బ్రిటిష్ సేనాని మౌంట్ బాటన్ బలవంతాన చేయించాడు. కాని అమెరికా తానే అక్కడ తిష్ట వేసే ఉద్దేశంతో దానిని పడగొట్టింది. చివరకు అమెరికా మనిషీ, నియంతా అయిన మార్షల్ సంగ్రాం అధికారంలోకి వచ్చాడు.

తరువాత బ్రిటన్ ఇండోనీషియాలో చొచ్చి వారిని ప్రతిష్ఠించటానికి జాతీయ వాదులమీద యుద్ధం సాగించింది. ఈ దురంతాన్ని ఇండోనీషియా ప్రజలు ఈ నాటికీ మరిచిపోకుండా, బ్రిటిష్ దురాక్రమణ దినవార్షికోత్సవాలు జరుపుకుంటూ ఉన్నారు. ఆ సమయంలోనే బ్రిటన్, అమెరికా సాయంతో ఫ్రాన్సును ఇండోచైనాలో తిరిగి ప్రతిష్ఠించింది. అప్పుడు రగుల్కొన్న యుద్ధం ఈ నాటికీ చల్లారలేదు.

ఆ మీదట మలయాలో తన వలస దోపిడి విధానాన్ని యథేచ్ఛగా సాగించేనిమిత్తం దేశమంతటినీ సైనిక శిబిరంగా మార్చివేసింది. విప్లవ కారులతో సహకరిస్తున్నారన్న అనుమానం మీద గ్రామాలకు గ్రామాలను ఖాళీ చేయించటం, అరణ్య సంపదను నాశనం చేయించటం సాగించింది. ఆ తరవాత చైనా ప్రజలు చాంగ్ కైషెక్ నియంతృత్వాన్ని నిర్మూలిస్తుండగా, వారిని హడల గొట్టటానికి యాంగ్‌సీ నదిలోకి యుద్ధ నౌకలను పంపి దౌర్జన్యం చేసింది. కాని అది సాగలేదు. ఆ సమయంలోనే తన కీలుబొమ్మలుగా ఉన్న అరబ్ రాజ్యాల పక్షంలో జేరి ఇజ్రేల్ మీదికి యుద్ధ విమానాలను పంపింది. కాని అక్కడ కూడా ఆట సాగలేదు.

సూయజ్ ప్రాంతం, సుడాన్‌ల విషయంలో ఈజిప్టుతో వివాదానికి దిగి సైనిక చర్యలకు కూడా వెనకాడలేదు. నూనె సంపదలను దోచుకునేందుకు వీలు లేదన్న పర్షియా నీయకులను హత్యలు చేయించి, తిరుగుబాట్లు జరిపించి కూలదోసింది. పర్షియా ఆర్థిక వ్యవస్థను దివాలా తీయించింది. ఏడెన్ పరిసరాల్లో ఉన్న లాహేజ్ అనే చిన్న

రాజ్యపు సుల్తానుతో గిల్లి కజ్జా పెట్టుకొని సైన్యంతో దానిని ఆక్రమించింది. లిబియా ప్రజలతో నిర్వ సంఘర్షణలు జరిపి చివరకు ఒక కీలుబొమ్మ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది.

ఐక్య రాజ్య సమితిలో జాతీయోద్యమాలను ప్రతిఘటించి సామ్రాజ్య దేశాలను బలపరిచింది. దక్షిణాఫ్రికా జాతి వివక్షత విధానాన్ని సమర్థించింది. ధర్మ కర్తృత్వం సెరప మని నానాజాతిసమితి అప్పగించిన నైఋతి ఆఫ్రికాను దక్షిణాఫ్రికా కలిపివేసుకుంటుంటే మద్దతు చేసి, అదే పద్ధతిలో పశ్చిమాఫ్రికాలో తనకు అప్పగించబడ్డ ప్రాంతా లను భుక్తం చేసుకొన ప్రయత్నిస్తున్నది.

ఆఫ్రికన్ ఒమంగ్ వాటో జాతి నాయకుడు సెరెత్సేఖామాను దేశం నుంచి బహిష్కరించింది. ఆ తరవాత కెన్యాలో కికుయూ జాతి ప్రజలపై రాక్షస చర్యలు ప్రారంభించింది. ఆఫ్రికన్ ప్రజల ఇష్టాన్ని ధిక్కరించి న్యాసాలాండ్, ఉత్తర, దక్షిణ రొడీషియాలను మధ్య ఆఫ్రికన్ ఫెడరేషన్‌గా ఏర్పాటు చేసి, తెల్ల జాతి అధికా రాన్ని నెలకొల్పింది. ఇట్లాగే చేసిన వాగ్దానాలను భగ్న పరచి తూర్పు ఆఫ్రికా ఫెడరేషన్ ఏర్పాటు చేస్తుందేమో నన్న భయంతో, తమ ప్రాంతానికి స్వాతంత్ర్యం ఇచ్చేందుకు తేదీని నిర్ణయించమని అడిగినందుకు యుగాండా వలస రాజ్యం లోని బుగాండా ప్రాంత అధిపతిని ఈ నెలలోనే దేశం నుంచి బహిష్కరించింది.

బ్రిటిష్ అధికారులు నడిపించిన ఎన్నికల్లోనే, క్రమ బద్ధంగా ఎన్నిక అయిన బ్రిటిష్ గయానా మంత్రివర్గాన్ని తొలగించి, రాజ్యాంగం రద్దు చేసిన సంగతి అందరికీ తెలిసే ఉన్నది. కాశ్మీర్ వ్యవహారంలో పాకిస్తాన్‌కు మద్దతు చేయటమేకాక, అక్కడికి సైనిక సలహాదార్లను పంపి, ప్రధాని నెహ్రూ బహిరంగంగా ఆక్షేపించే వరకూ కుతంత్రాలు జరిపింది.

ఈ అన్నింట్లోనూ బ్రిటన్ మూల సూత్రం ఒకటే. బలహీనుడిని దోచుకోవటమే అది. అందితే జుట్టు అందక పోతే కాళ్ళు పట్టుకుని వాళ్ళను నేలకు కొట్టటమే పనిగా వ్యవహరిస్తున్నది. దాని కోసం సేనలను ఉరికించటం మొదలుకుని బూటకపు స్వాతంత్ర్యాలతో కీలుబొమ్మ ప్రభుత్వాలను నెలకొల్పటం వరకూ, ఖడ్గ మృగపు తోలుతో చేసిన కొరడాలతో జనాన్ని బాదటం మొదలు కుని, కుట్రలు జరపటం, రాజకీయ నాయకుల్ని హత్యలు చేయించటం వరకూ వీలయిన మార్గాన్నల్లా బ్రిటన్ అను సరిస్తున్నది.

* * *

అమెరికా ఈ విస్తరణ కాంక్షలో బ్రిటనుకు తీసి పోలేదు. అయితే బ్రిటనుకు సామ, దాన, భేద, దండో పాయాలు నాలుగూ తెలియగా అమెరికాకు దాన, దండో పాయాలు మాత్రమే తెలుసు. తమ మాట వింటే డాలర్లు కురిపిస్తానంటుంది. (ఇందులో కూడా అసలు ఉద్దేశం తన సరుకులకు మార్కెట్లను సంపాదించటమే) వినకపోతే దండో పాయాన్ని ప్రయోగించ ప్రయత్నిస్తుంది. కమ్యూనిస్టుల్ని అధికారంలోకి రానియ్యని పద్ధతిమీద పశ్చిమ యూరప్‌కు మార్షల్ పథకం పేరుతో ఇటువంటి సహాయం చేసింది. కమ్యూనిస్టుల్ని అభిమానిస్తే దానిని బంద్ చేస్తానని స్పష్ట పరిచింది. లోగడ ఇటలీ ఎన్నికల ముందు ఇటలీలోని అమెరికన్ రాయబారి ఇటలీ ప్రజలను వామపక్ష అభ్యర్థు లను ఎన్నుకుంటే అమెరికన్ సహాయం ఉండదని అతి కచ్చి తంగా చెప్పివేసింది. అట్లాగే యూరప్ సైన్యం ఏర్పా టుకు అంగీకరించకపోతే యూరప్ దేశాలకు తాము అధిక సహాయం చేసే వీలు లేదని, యూరప్ రక్షణ ఏర్పాట్లన్ని టినీ మార్చి వేసుకోవలసి వుంటుందనీ అమెరికా విదేశాంగ మంత్రి డలెస్ ఈ నెలలోనే పారిస్‌లో స్పష్టపరిచారు.

ఈజిప్టు సూయజ్ సమస్యవల్ల పశ్చిమ రాజ్యాలమీద అసంతృప్తి కలిగి, ఇండియా మోస్తరు నిజమయిన తటస్థ విధా నాన్నే అనుసరించాలని కోరుతున్నట్లూ కమ్యూనిస్టు చైనాను గుర్తించాలని ఉద్దేశిస్తున్నట్లూ తెలుస్తున్నది. అయితే కైరోలోని అమెరికన్ రాయబారికూడా ఇటలీలో అమెరికన్ రాయబారి చేసినట్లుగా, ఈజిప్టు చైనాను గుర్తిస్తే అమెరికన్ సహాయం ఉండబోదని హెచ్చరించి నట్లు తెలుస్తున్నది.

అమెరికా, బ్రిటన్‌తో కలిసి కాశ్మీర్ సమస్యపై ఒప్పందానికి రావలసిందని ఇండియాను ఒత్తిడి చేసింది.

మొదటినుంచీ పాకిస్థాన్‌ను బలపరచిన ఆదేశాలు ఉద్దేశంలో ఒప్పందం అంటేఏమిటో అంతా ఊహించుకోవచ్చు. కాని ఇండియా లొంగక పోయేటప్పటికి, షేక్ అబ్దుల్లాను కూడగట్టుకుని మొత్తం కాశ్మీర్‌నే కబళించాలని ప్రయత్నించింది. కాని కాశ్మీర్ ప్రజల జాగ్రత్త వల్ల అదీ సాగక పోయేటప్పటికి, సరాసరి పాకిస్థాన్‌తో సైనిక ఒప్పందమే చేసుకునేందుకు సంప్రదింపులు మొదలు పెట్టింది. ఇండియాను ధిక్కరించి ఒప్పందమే అమెరికన్,అధికారవర్గాలు చేసుకో దలచినట్లు గట్టిగానే తెలియవచ్చింది.

కమ్యూనిస్టు దేశాలతో వ్యాపారం జరిపితే తనసహాయం ఉండదని పశ్చిమ యూరప్ దేశాలనేకాక సింహళాన్ని కూడా హెచ్చరించినట్లు లోగడ వార్తలు వచ్చినవి.

♦ ♦ ♦

బ్రిటన్, అమెరికాల వంటి పశ్చిమరాజ్యాల పరపెంపా పద్ధతి వాటి ఆర్థిక వ్యవస్థను పట్టి వచ్చింది. దానిలోఉన్న లోపాలవల్ల సంక్షోభం రాకుండా ఉండాలంటే విదేశీ మార్కెట్లు, చౌకగా ముడిపదార్థాలు దొరకాలి. వీటి కోసం రాజకీయ ప్రాబల్యం అవసరమవుతుంది. కమ్యూనిస్టు వ్యవస్థ వీటికిపూర్తి భిన్నంగా ఉంటుంది కనుక దానిని నిర్మూలించటం ముఖ్యావసరం అయింది. ప్రత్యక్షంగా వలస దేశాలు అమెరికాకు లేవుకనుక, కమ్యూనిజాన్ని నిర్మూలించటమే అమెరికా పాలకులకు ప్రధాన సమస్య అయింది. వలసలు ఉన్న బ్రిటన్ ఫ్రాన్సులకు మాత్రం తమ వలసలను తాము దోచుకునేందుకు అడ్డు పడకపోతే కమ్యూనిస్టు దేశాలతో వ్యాపారం జరపాలనే ఉన్నది.

అమెరికాకు మిగిలిన దేశాలకు ఉన్న ఈ తేడావల్ల వాటికి సంఘర్షణ వస్తున్నది. చైనాను గుర్తించాలని రష్యాతో సమాధాన పడాలనీ బ్రిటన్ చెప్పగా అమెరికా త్రోసివేసింది. స్పెయిన్‌లోని ఫ్రాంకో నియంతృత్వాన్ని బలపరచవద్దని బ్రిటన్, ఫ్రాన్సును కోరగా అమెరికా అంగీకరించలేదు. అందువల్ల అవే స్పెయిన్ పట్ల తమ వైఖరిని మార్చుకొనటమేకాక చేయి కలపటానికి కూడా ఒప్పుకోవలసి వచ్చింది.

ఫ్రాన్స్ ఇప్పుడు మరొక చిక్కులో పడ్డది. సైనిక శక్తితో ఇండోచైనాను అదుపులో ఉంచలేకపోయింది. ఆ యుద్ధ భారం ఫ్రాన్సును కుంగదీస్తున్నది. ఈ సమయంలో సరిగ్గా అదునుచూసి, వియత్నాం స్వాతంత్ర్యోద్యమ నాయకుడు డా॥ హోషిమిన్ రాజీ సంప్రదింపులకు సుముఖత తెలియజేశారు. ఇంతవరకూ బెట్టుగా ఉన్న ఫ్రెంచి అధికారులు, "జాతీయ" వియత్నాం పక్షానికి చెందిన బావ్‌దాయ్ ప్రభృతులు దీనికి అంగీకారం ప్రదర్శించారు. అయితే వియత్మిన్‌లు గెలిస్తే తన వ్యూహమంతా దెబ్బతింటుందని భయపడుతున్న అమెరికా దీనిని తీవ్రంగా ప్రతిఘటిస్తున్నది. ఇండోచైనా పోతే మలయాలో నిలవలేమని భయపడుతున్న బ్రిటన్ అధికారులు హోషిమిన్ రాజీ సూచనలు బూటకాలని చెప్పి ఫ్రాన్సు మనస్సును విరిచి వేయాలని మహాతాపత్రయ పడుతున్నారు.

ఆసియా, మధ్యప్రాచ్య దేశాలు అంతకంతకూ పశ్చిమ రాజ్య వ్యతిరేకులుగా తయారవుతున్నారు. అమెరికా—పాకిస్థాన్ ఒప్పందాన్ని ఆఫ్ఘనిస్థాన్ తీవ్రంగా నిరసించింది. ఇండియాలో ఉన్న యావన్మంది రాజకీయపక్షాలూ అమెరికాను నిరసిస్తున్నవి. సింహళం అధికార వర్గాలు కూడా ఆందోళన వ్యక్తం చేశారు. కొమింటాంగ్ గొరిల్లాల వ్యవహారంతో బర్మాకు పశ్చిమ రాజ్యాలమీద అసంతృప్తి పెరిగిపోతున్నది. సింహళం, ఇండోనేషియాలు చైనాలో వ్యాపారం ఒప్పందాలు చేసుకున్నవి. ఇండోనేషియా రష్యాతో రాయబార సంబంధాలు ఏర్పరుచుకునేందుకు అంగీకరించింది. ఇండోచైనా స్వాతంత్ర్య పోరాటాన్ని ఇండోనీషియా ప్రభుత్వం సమర్థిస్తున్నదని ఆర్థికమంత్రి ఆజ్‌ద్రీన్ 20 వ తేదీన జకర్తాలో ప్రకటించారు. ఇండోచైనా వ్యవహారంలో ఇండోనీషియా శ్రద్ధ తీసుకుని హోషిమిన్‌తో బావ్‌దాయ్‌కి రాజీ కుదిర్చే అవకాశం కూడా కనిపిస్తున్నది.

ఆత్మరక్షణావసరాలకోసం సోవియట్ వ్యవస్థలో ఏర్పడ్డ నిర్బంధాలు సోవియట్ వ్యవస్థ అసలు లక్షణాలుకావనీ, అవకాశం దొరకగానే అవి తొలగించబడతవనీ సోవియట్ రష్యా మరొకసారి నిరూపించింది. సోవియట్ పౌరులు విదేశీయులను వివాహం చేసుకోరాదన్న నిషేధం డిసెంబర్ 2 న తొలగించబడ్డది.

## రా జ కీ యా లు

భారత ప్రభుత్వం దేశంలో రాష్ట్రాలను భాష మొదలైన సూత్రాల ననుసరించి పునర్విభజన చేసే విషయమై పరిశీలించటానికి డిసెంబరు 22 వ తేదీన ఒక కమిషన్‌ను ఏర్పాటుచేసింది. విశాలాంధ్ర నిర్మాణానికి ఇది దారి తీస్తుందని ఆశించవచ్చు.

అయితే ప్రభుత్వం ఇప్పటివరకూ హిందూ న్యాయ శాస్త్ర సవరణ మాత్రం చేయలేదు. కనీసం ప్రత్యేక భాగాలుకూడా శాసనాలు కాలేదు. దీనికి అఖిల భారత మహిళాసభవారు తీవ్ర నిరసన తెలియజేశారు.

ఆంధ్ర శాసనసభ నవంబర్ చివరి వారంలో వారం రోజులు చర్చ జరిపి రాజధాని విషయంలో ఏ నిర్ణయమూ చేయకుండానే వదిలివేసింది. కాంగ్రెసు నాయకులు గుంటూరు- విజయవాడ వాదుల్లో చీలికలు తెచ్చేందుకు, విశాఖపట్నంలో రాజధాని పెడతామని ప్రతిపాదన చేయటంవల్ల ఈ అనిశ్చిత పరిస్థితి ఏర్పడ్డది. మళ్ళా డిసెంబరు నెలాఖరు సమావేశంలో కూడా ఈ సమస్య వచ్చే అవకాశం లేకపోలేదు.

తెలంగాణా ఆంధ్రతో కలిసి విశాలాంధ్ర ఏర్పడటానికి తెలంగాణాలో కొంత ప్రాతికూల్యత కనిపిస్తున్నది. పైనూరు ఆంధ్ర ప్రాంతాల్లో విశాలాంధ్రోద్యమం మొట్ట మొదటిసారిగా ప్రారంభమయింది.

మద్రాసు జిల్లాలతో ఆంధ్ర జిల్లాలను కలిపి ఆహార జోన్‌లు ఉండనక్కరలేదని కేంద్రం అంగీకరించింది. ఆంధ్ర ప్రభుత్వం బియ్యం వ్యాపారాన్ని తానే నిర్వహించి ఆ లాభాలను తీసుకునేందుకు నిశ్చయించింది. అయితే ప్రభుత్వ బాధ్యత లాభాలు తీసుకోటంతోనే సరిపోదు. అసలు రాష్ట్ర ప్రజలకు చౌకగా ఆహారం లభించేట్లు చేయవలసిన బాధ్యతకూడా తనకు ఉన్నదని గుర్తించాలి. ★





శ్రీమతి ఎలినార్ రూస్‌వెల్టు
శ్రీమతి విజయలక్ష్మి పండిట్.




మూలం: ద్విజేంద్రలాల్ రాయి. అనువాదం : శ్రీమతి మాణిక్యవల్లి.

(గత సంచిక తరువాయి)

(గోవింద సింహుడు ప్రవేశిస్తాడు)

గో : (ఉద్వేగంతో) మహారాజ్, మహబత్ ఖా నిస్సహాయులైన గ్రామీణుల యిళ్ళకు నిప్పంటిస్తున్నాడు.

రా : ఉచితంగానే వుంది !

గో : అదేమన్నమాట మహారాజ్ ! దీనికి మనం పూర్తిగా ప్రతీకారం చేస్తాం.

రా : తప్పకుండాను. లేకపోతే మేవాడ్ నాశనం పూర్తి కావద్దూ?

గో : తప్పకుండా యుద్ధం చేస్తారా? మహారాజ్ !

రా : మనకి మిగిలి ఉన్న పని అదొక్కటే ! మన సైన్యం అయిదు వేలు కాదూ? చాలు, చావడానికది చాలు !

గో : రాణాజీ ! (తల వంచుకుంటాడు)

రా : గోవిందసింహజీ, మీరు తల వంచుకోడమా? అబ్బే, తలెత్తండి. మేల్కొండి. ఇది సంతోష సమయం. ఇంటింటా తూర్యారవాలతో రక్త వర్ణ పతాకం యెగుర వేసి ఉత్సవం చేసుకోమనండి. మేవాడ్ దుర్గంపై జాతీయ కేతనాన్నెగురవేసి తనివితీరా చూడండి. తర వాత మళ్ళీ దాన్ని చూసే భాగ్యముండదు !

గో : మహారాజ్, మొగలుల నెదుర్కొంటాం; ప్రాణా లర్పిస్తాం. కాని అప్పటికీ తల్లిని రక్షించుకోలేవేమో అని విచారంగా వుంది.

రా : అందుకు విచారమెందుకు? అందరి తల్లి వలెనే మన తల్లీ మరణిస్తుంది. చిరకాలం మని పోబోతున్న మన తల్లితో పాటు మనమూ పోదాం.

గో : అలాగే కానీయండి మహారాజ్.

రా : రాణా అంతే ! గోవింద సింహజీ ఆఖరు సారి కౌగ లించుకోనివ్వండి (కౌగలించుకొని) సరే, యింక మృత్యు దేవత పిలుపు కెదురుచూస్తూ వుండండి!

(గోవిందసింహుడు వెడతాడు, రాణీ వస్తుంది)

రా : రాణీ, పండుగ చేసుకో! పూర్తిగా ఆనందించు !

రా : మానసి పెళ్ళి స్థిరపడిందా?

రా : మానసికి కాదు మేవాడ్ కు స్థిరపడింది !

రా : సరి సరి !

రా : మేవాడ్ ను 'వినాశ' రావుగారి కిచ్చి పెళ్ళి చేస్తా మిప్పుడు.

రా : అంటే?

రా : తెలీదూ? బ్రహ్మాండమైన అర్థంలే ! అన్నదమ్ముల మధ్య పోరాటం. పండుగ చేసుకో. పెళ్ళి— వినా శంతో ! ధ్వంసంతో !

(వెళ్ళి పోతాడు)

రాణి : వారికి పూర్తిగా మతి పోయింది. నే మొదటినుండీ

భయపడుతూనే ఉన్నాను. ఇంట్లో అందరికీ మతిపోయింది! నేనేం చెయ్యను?

(మానసి వస్తుంది.)

మా: అమ్మా! నాన్నగారు పిచ్చెత్తినట్టు తిరుగుతున్నారేం?

రా: ఏం చెప్పను? వారికి మతిపోయింది! వెళ్ళి చూస్తానుండు (వెడుతుంది)

మా: ఆ మహాబత్ ఖా రసపుత్రుడు! ఆ గజసింహుడూ రసపుత్రుడే! ఎందుకో యింత పరస్పర ద్వేషాసూయలు! హా, అధమజాతీ! నీకు పతనం కంటె దిక్కేముంది? అన్నదమ్ములే పోరాడుకుంటే యింక రక్షించగల వారెవరు?

## నాలుగవ రంగం

స్థలం: మేవాడ్ లో ఓ పల్లెదారి. సమయం: సాయంకాలం.

(సత్యవతి, అరుణసింహులు నడుస్తూ వుంటారు)

సత్య: అరుణా!

అరు: ఏమమ్మా!

స: నడవడం కష్టంగా వుందా?

అ: లేదమ్మా.

స: ఈవాళకి ఈ వూళ్ళో ఆగుదాం.

అ: ఎందుకమ్మా?

స: గ్రామీణులకు బోధచేయాలి.

అ: ఏమని?

స: సమరానికి సంసిద్ధులుకమ్మని. మేవాడ్ వీరవంశం అంతరించింది. కాబట్టి కొత్తగా వీర కులాన్ని సృష్టించాలి. దేవతార్చనకి నూతన యత్నం చేసుకోవాలి. పద, చీకటిపడుతోంది. (వెడతారు)

(కొందరు గ్రామీణులు వస్తారు)

మొదటి గ్రా: ఇంత పెద్దదేశమూ ఈమాటు పోయినట్టే.

రెం. గ్రా: ఈసారి మహాబత్ ఖా వచ్చాడు. ఇంక ఆశలేదు.

మూ. గ్రా: మహాబత్ ఖాను యుదం చేతవునా?

నా. గ్రా: పోవోస్! ఆయన యుద్ధమెప్పుడు నేర్చుకున్నాడు! ఆవేళ నడుస్తుండగా నే చూళ్ళే దేమిటి?

రెం. గ్రా: బాగుంది! ఎవరో ఒకరు నడుస్తుండగా అందరూ చూస్తారు. అందుచేత వారికి యుద్ధం చేత కాదని సిద్ధాంతమా?

నా. గ్రా: నువ్వు గొప్ప ధర్మవేత్తవులే మరి!

మొ. గ్రా: ఊరికి నిప్పంటుకున్నట్టుంది, చూడండి!

అందరూ: ఎక్కడెక్కడ!

మొ. గ్రా: అదుగో పొగ.

నా. గ్రా: పొగ కాదు మేఘాలోయ్!

రెం. గ్రా: మేఘాలెక్కడైనా కిందినుంచి పైకి లేస్తాయా? సుళ్లు తిరుగుతాయా?

నా. గ్రా: లేకపోతే దుమ్ము రేగుతోందేమో!

రెం. గ్రా: అవునమ్మా, నిజమే! దుమ్ము నల్లగా వుంటుంది కదూ!

నా. గ్రా: అరె! నువ్వు పెద్ద జగడాలమారిగా వున్నావే!

మొ. గ్రా: అదుగో, మనుష్యుల గోల! వినిపించడం లేదూ?

నా. గ్రా: ఆఁ! వాళ్ళు పాడుకుంటున్నారేమో! లేకపోతే గాడిదలు కూస్తున్నాయో!

రెం. గ్రా: రెండింటికి ధ్వని ఒలాగే వుంటుందికదూ! పాండేజీ!

మొ. గ్రా: అదుగో జనం నెత్తీనోరూ మొత్తుకుంటూ వస్తున్నారు.

మూ. గ్రా: తుపాకులు పేలుస్తూ వాళ్ళ వెంబడి సైనికులు కూడా ఒస్తున్నారు.

(తెరలో) "శరణు! శరణు! రక్షించండి! రక్షించండి!"

మొ. గ్రా: అయ్యయ్యో! పాపం—

(కళ్యాణి, అజయసింహుడు వస్తారు)

అజయ: (గ్రామీణులతో) సోదరులారా! ఊరికే నుంచుని చూస్తారేం? వీళ్ళకు కాస్త తోడుపడండి.

అందరూ: సరి సరి! మే మేం చెయ్యం!

# మేవాడ్ పతనం

అజయ : మరి యీ అత్యాచారం చూస్తూ వూరుకుంటారా?

నా.గ్రా : లేకపోతే వాళ్ళతోపాటు చావమంటారా? వాళ్ళిలా ఒస్తున్నారు పదండన్నా పరుగెడదాం!

కళ్యాణి : పారిపోయినంత మాత్రాన్న ప్రాణం దక్కుతుందా! అందరి వంతూ వస్తుంది. మీ యిళ్ళకూ నిప్పంటిస్తారు.

మొ.గ్రా : ప్చ్, అంటించినప్పుడు చూసుకుందాం! ఆయువున్నన్నాళ్ళేవళ్ళూ చావరు. అరుగో వాళ్ళు! పరుగెత్తండి, పరుగు. (గ్రామీణులందరూ పారిపోతారు)

అజయ : హాహాకారాలు మరీ సమీస్తున్నాయి. అవిగో తుపాకి శబ్దాలు! కల్యాణీ, నువ్వోపక్కకి తప్పుకో, నే వాళ్ళ కడ్డుపడతాను.

కళ్యాణి : మంచిది. శక్తి వంచన లేకుండా తోడ్పడు.

(కొంచం దూరంగా వెడుతుంది)

అజయ : కల్యాణీ! వీళ్ళని రక్షించగలనో లేదో చెప్పలేను కాని ఆ ప్రయత్నంలో ప్రాణత్యాగం చేస్తాను! ఇవాళ మానసి దగ్గర నేర్చుకున్న మహా మంత్రాన్ని ఆచరణలో పెడతాను! అదుగో వాళ్ళు ఒస్తున్నారు.

(ఒర నుండి కత్తి తీస్తాడు)

(రోజుతూ పరుగెడుతున్న ప్రజలు ఖడ్గ హస్తులై వారిని తరుముతున్న మొగలు సైనికులు ప్రవేశిస్తారు)

ప్రజలు : శరణు! మహారాజా శరణు! (అజయ సింహుని కాళ్లపై పడతారు)

అజయ : (సైనికులతో) ఖబడ్‌దార్!

మొ. సై : ఆఁ! (కత్తి ఎత్తుతాడు)

(అజయుడు అతడిని తెగవేస్తాడు. మిగతా సైనికులు అజయుణ్ణి చుట్టుముడతారు. వారందరినీ అతడు కూల నేస్తాడు. పిదప మరికొందరు సైనికులు ఒస్తారు)

అజయ : కల్యాణీ, యింక లాభంలేదు! నువ్వు పారిపో!

కల్యాణి : అయ్యయో! అన్నయ్యా నిన్నీస్థితిలో ఒదిలి పోనా?

(కల్యాణి ముందుకొస్తుంది. ఈలోగా మొగలు సిపాయి గుండు తగిలి అజయుడు నేలకొరుగుతాడు)

కల్యాణి : (పరిగెత్తి) అన్నయ్యా! అన్నయ్యా!

రెం. సై : అదెవరు? పట్టుకోండి.

మూ. సై : ఒద్దయ్యోయ్! ఆడవాళ్ళ జోలికి వెళ్ళొద్దని సేనాని చెప్పలేదూ?

అజయ : కల్యాణీ...... నిన్ను... పరమేశ్వరుడు... రక్షి... స్తా... డు!......

(కొట్టుకుని మరణిస్తాడు)

కల్యాణి : అన్నయ్యా! అన్నయ్యా! ఎక్కడికి వెడతావు!

(మృత దేహంపై పడిపోతుంది)

నా. సై : ఎక్కడికి వెడతాడు? ఎప్పుడో ఒకప్పుడందరూ వెళ్ళే చోటికే!

కల్యాణి : (ఊరడిల్లి) ఊహుఁ, నే విచారించను! (అజయుని కళేబరాన్నుద్దేశించి) క్షత్రియవీరా! నువ్వు నీ కర్తవ్యాన్ని నెరవేర్చుకున్నావు. దీనరక్షణకై ప్రాణమిచ్చావు! వాళ్ళో? పిశాచంబంట్లు! రక్తపిపాసులైన హింసా పశువులు! నిరపరాధుల యిళ్ళకు చిచ్చుపెట్టి, నిర్దోషుల్ని హతమారుస్తున్నారు. హాఁ! పరమేశ్వరా! వాళ్ళకి నరకములోనైనా చోటు దొరకదు!

మొ. సై : ఇందులో మాతొప్పేవుంది? మేం మా సేనాని చెప్పినట్టు చేస్తున్నాం.

కల్యాణి : మీ సేనాధిపతి యెవరు?

రెం. సై : తెలీదూ? మహాబత్ ఖా సాహెబ్.

కల్యాణి : వారి ఆజ్ఞా యిది? అసంభవం!

నా. సై : పదండిరా, పోదాం.

కల్యాణి : మీతో నేనూ వస్తానుండండి.

మొ. సై : ఎక్కడికమ్మాయ్?

కల్యాణి : మీ సేనాధిపతి దగ్గిరికి.

రెం. సై : సరి సరి! నిన్ను వెంబడి తీసుకెళ్ళి మేమంతా–

మూ. సై : లేనిపోని కష్టాలు తెచ్చిపెట్టుకోమా?

నా. సై : కష్టమేముందోయ్. ఆవిడ్ని మన మేం బలవంతం పెట్టలేదుగా. ఆవిడే వస్తానంటుంది కనక తీసుకెడదాం.

మొ. సై : అయితే సరే.

కల్యాణి : పదండి.

## అయిదవ రంగం

స్థలం : ఉదయపుర రాజసభ. సమయం : ఉదయం.

రఘుపత్ : మహారాజ్, ప్రస్తుతం యుద్ధం తలపెట్టి లాభంలేదు.

రాణా : అదేమన్నమాట, రఘుపత్ ! కష్టమో, నిష్ఠూరమో యిప్పుడు యుద్ధం చేసే తీరాలి. సైన్యం సిద్ధంగా వుందా?

కేశవ : అసలు సేన యేదీ? మహారాజ్ ! అంతా పోగు చేస్తే అయిదు వేలుంటుందేమో !

రాణా : ఓం! చాలు ! అది వారి లక్ష సైన్యంతో సమానం!

జయ : నన్నడిగితే యిప్పుడు సంధి ఉత్తమం.

రాణా : ఉహుం ! లాభంలేదు. మొగలులు సంధి కాహ్వానించినప్పుడు ఒప్పుకుందామంటే ఒక్కరూ వినిపించుకో లేదు. ఇప్పుడు మనకై మనం ప్రార్థించి సంధి చేసుకోవడమా? కల్ల !

కేశవ : కాని—

రాణా : అబ్బే, లాభంలేదు ! ఎవ్వరు యేం చెప్పినా లాభంలేదు ! ఇప్పుడు రణమే శరణ్యం. సమరాంగణానికి ప్రాణార్పణ చేయవలసిందే. ఏం! గోవిందసింహాజీ?

గోవిం : అంతే, మహారాజ్ ! బొందిలో ప్రాణముండగా అభిమానం ఒదులుకోలేం !

రాణా : సెహభాష్! గోవిందసింహాజీ !

రఘు : మహారాజ్ !—

రాణా : ఒక్కటే మహారాజ్ ! నాకున్న కోరికల్లా యుద్ధమే ! సైన్యం సిద్ధంచేసి, జాతీయ పతాకాన్ని ప్రతిష్ఠించి, రణభేరీ మోగించండి! పదండి ! పదండి !

(అందరూ వెళ్ళిపోతారు)

మేవాడ్ ! సౌందర్యఖనీ ! ఎంత దగ్ధం నీ యాకృతి ! ఈ నీ మనోహరాకారాన్ని యిన్నాళ్ళూ గుర్తించలేక పోతినే ! జీర్ణవస్త్రవై, ధూళి ధూసరగాత్రవై, వికీర్ణ—కేశవైన నిన్ను వింధ్యభూమికి తీసుకుపోతున్నాను. తల్లీ ! సౌభాగ్య సూర్యుని కిరణ తేజః పుంజాలచే మాకళ్ళు ఎకట్లు కమ్ముడంవల్ల యిన్నాళ్లూ నీ నిజస్వరూపం గోచరించ లేదు. ఇప్పుడా కాంతిమూర్తి అస్తమించినందున నీ దివ్యాకారపు అపూర్వాద్భుత జ్యోతి ద్యోతకమవుతోంది. అబ్బా ! ఏమి తేజస్సు ! ఏమి నీలిమ ! ఏమి మహిమ !

(తెర)

## ఆరవ రంగం

స్థలం : మహాబత్ ఖా డేరా. సమయం : ఉదయం.

(మహాబత్ ఖా, గజసింహులు నిల్చుని వుంటారు)

గజ : సైన్యంతో రాణా వచ్చారా?

మ : మరే పాపం ! తిగిరి మాత్రం ఒక్కరూ వెళ్లారు ! వారి అయిదు వేలలోను నాలుగు వేలు మైదానంలోనే ఆఖరయ్యాయి.

గ : విచిత్రం ! ఈ సేనాసముద్రాన్నెదిరించడానికి ఆ గోంత సైన్యాన్ని తీసుకొచ్చారా?

మ : విచిత్రమే ! ఇప్పుడు నాకో బాధ పట్టుకుంది.

గ : ఏమిటది?

మ : ఈ బృహత్సైన్యాన్ని యెదిరించడానికి అంత స్వల్ప బలగంతో వచ్చినవారు ప్రాణానికి తెగించే వచ్చేరనేది నిర్వివాదం. వెనకా ముందూ చూసుకోకుండా దేశం కోసం ఆత్మత్యాగం చేసే శక్తి ఒక్క రాజపుత్రులకే వుంది. విమతినైనా నేనూ ఆ వంశీయుణ్ణే, ఆ అమర సింహుని సోదరుడినే.

గ : బాగు ! బాగు !

మ : మీరూ రసపుత్రులే. ఆలోచించండి ! మీరు యేం చేయగల సమర్థులో, యేం చేశారో ! చేసిన పనికి మీరు తీసుకెళ్ళి పొట్టలో పెట్టుకోవాలి. నేనంటారా? నాదారి వేరు ! ప్రస్తుతం రసపుత్రుణ్ణి కానని సమాధానం చెప్పుకోవచ్చు.

గ : ఇంతకీ రాణా చచ్చిపోలేదన్నమాట ! పట్టుబడనూ లేదూ?

మ : అవి శతృలోకం ఆలోచించవలసిన విషయాలు.

గ : సరే ! నాకు సెలవిస్తారా

మ : అవశ్యం ! వెళ్ళిరండి !

(గజసింహుడు వెళతాడు)

# స్వర్గీయ శ్రీమతి రాయసము రత్నమ్మగారు

• శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ •

అవి మేముగుంటూరులో అయిదవాంధ్ర మహిళాసభను జయప్రదముగా జరుపవలెనని పట్టుదలగా కృషిచేస్తున్న రోజులు. "ఏమండీ! మనం ఫలానాచోటికి వెళ్ళితే చాలా ఆలస్యం అవుతుందేమో? బాబుగారు కోపంచేస్తారేమో"నని రాయసము రత్నమ్మగారితో అన్నాం. అందులకు శ్రీరత్నమ్మగారు చిన్న మందహాసంచేసి "మీబాబుగారు యిందుకు గూడా కోపంచేస్తారంటే అది వారికీ మర్యాదగాదు నాకూ మర్యాదగాదు. ఆలస్యమైతే అయింది పోదాంపదండి" అన్నారు. ఆవొక్క వాక్యంలోనూ ఆమె భర్తగారైన రాయసము వెంకటశివుడు పంతులుగారు మహాసంస్కర్తయిన వీరేశలింగం పంతులుగారి ముఖ్య శిష్యులలై యుండటము వారి అనుమతిని వారెన్నో ఇట్టి ప్రజాహిత కార్యాలకు చేయూతఇచ్చి ఉండడమూ, వెంకటశివుడు పంతులుగారు ఆదినుండీ స్త్రీ విద్యాభిమానులై యుండి రత్నమ్మగారిట్టి స్త్రీజనాభ్యుదయ కార్యాలు చేయడానికి ప్రోత్సహించి ఉండడమూ, స్త్రీల నిమిత్తమై వారు జనానా అను ఒక మాసపత్రికను కూడా నడిపి యుండటమూ మొదలైన విషయాలెన్నో నినదించాయి. అయితే పదండి అని మేముగూడ నవ్వుచూ ఆమెగారితోకలిసి మహిళా సభ పనిమీదవెళ్ళాము. పెద్దవారైన రత్నమ్మగార్ని వెంట బెట్టుకునివెళితే ఎక్కడకువెళ్ళినా మాకెంతో అండగాను, నిండుగాను ఉండేది. వారిచ్చే సలహాలుగూడా అమూల్యంగా ఉండేవి.

ఆరోజులలో గుంటూరులో వయోవృద్ధులైన నలుగురు మహిళామతల్లులు ఆపట్టణంలోని మహిళా సంస్థలకేగాక యావదాంధ్ర మహిళా సంస్థలకే అగ్రగణ్యులుగా ఉంటూ ఉండేవారు. ఆవూరిలో ఆనలుగురు నాల్గుసంస్థలను నిర్వహిస్తూ ఉండేవారు. వారిలో మొదటివారు ఏకా రత్నమ్మగారు. ఈమె 'స్త్రీసనాతన ధర్మమండలి' అను స్త్రీసమాజమును స్థాపించి తద్వారా పురాణాలు, భజనలు వేదాంత విచారణలు, ఉపన్యాసాలు పండువులు, పబ్బాలు సాగిస్తూ ఉండేవారు. అయితే వారికలాపమంతా సనాతనంగా జరుగుతూ ఉండేవి. (ఈమండలి ఈనెలలోనే 49 వ వార్షికోత్సవం జరుపుకున్నది) ఈమండలి పక్షాన ఒక ఎలిమెంటరీ పాఠశాలగూడా ఉండేది. రెండవవారు ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు. వీరికృషి జాతీయంగాను, సంస్కరణ భావయుతంగాను ఉండేది. వీరు భర్తగారితో కలిసి వెనుక వితంతు వివాహాది సంస్కరణ కార్యములు నిర్వహించినదే కాక 'శారదానికేతన' మనే గొప్ప స్త్రీ విద్యాపీఠమును స్థాపించి, ఆసంస్థద్వారా జాతీయవిద్యకు ప్రోత్సాహమిస్తూ ఉండేవారు. మూడవవారు రాయసము రత్నమ్మగారు అఖిలభారత మహిళాసంఘమునకు అనుబంధంగా గుంటూరులో శ్రీ కజిన్సుసతి స్థాపించిన మహిళా సంఘమును, వీరు నిర్వహిస్తూ ఉండేవారు. వీరి కార్యక్రమ మంతా అఖిలభారత మహిళా సంఘమువారి నియమావళి ననుసరించీ, సూచనల ననుసరించీ జరుగుతూ ఉండేవి. నాల్గవవారు బొడ్డుపల్లి బాలాత్రిపుర సుందరమ్మగారు. వీరు మహాలక్ష్మీపఠనమను గ్రంథాలయమును స్థాపించి స్త్రీలలో గ్రంథ పత్రికాదులను చదివేఆసక్తి పెంపొందింపచేయడమే కాక యీపఠనమందిరము పక్షమున సంగీత తరగతులు, హిందీ తరగతులు, భజనలు పూజలు, ఉపన్యాసములు, మొదలైనవెన్నో జరుపుతూ ఉండేవారు. ఈవిధంగా ఈ మహిళామతల్లులు నల్వురూ నాల్గుసంస్థలు వేర్వేరుగా నడుపుతున్నా ఏదైనా ఒకమహిళాసభగాని, ఒకమహోత్సవముగాని జరుపవలసివస్తే నలువురూ ఏకమై జైగీయమానంగా జరుపుతూ ఉండేవారు. అఖిలభారత మహిళాసభ పక్షాన రాష్ట్రసభలు, జిల్లాసభలు, తాలూకాసభలు ఏవిజరుపవలసి వచ్చినా రత్నమ్మగారు వీరినందర్నీ కూడగట్టుకొని గుంటూరులోగాని, తదితరతాలూకా పట్నములలో గాని ఎక్కడజరిగినా తాము హాజరై ఆసభలను చక్కగా జరిపిస్తూ ఉండేవారు.

మహిళోద్యమ మంటే శ్రీరత్నమ్మగారికి ఎనలేని ప్రేమ. మహిళాసభలంటే ఎంతదూరమైనా ఆమెకు భారమనిపించేదికాదు. ఆర్థికంగా స్త్రీలనుభవిస్తున్న దైన్యం ఆమెకెంతో కష్టంగా ఉండేది. సాధారణంగా మహిళా సభల్లో స్త్రీల ఆస్తిహక్కులను గురించే ఆమె ఎక్కువగా మాట్లాడుతూ ఉండేవారు. ఆమె మాట్లాడే ప్రతిమాటలోను ఆస్తిహక్కులు లేనందువల్ల స్త్రీలు అనుభవిస్తున్న కష్టాలకు ఆమె ఎంతవేదన పడుతున్నదీ ప్రస్ఫుట మవుతూ ఉండేది. అఖిలభారత మహిళాసంఘము భారత మహిళల సర్వకష్టములను నివారించి సర్వసౌఖ్యములను సమకూర్చే కల్పవృక్షంగా భావిస్తూ ఆసంఘంచేసే ప్రతితీర్మానమును

# స్వర్గీయ శ్రీమతి రాయసము రత్నమ్మగారు

ఆచరణలో పెట్టడానికి ఆమె దీక్షతో కృషిచేస్తూ ఉండేవారు.

రత్నమ్మగారి భర్తగారైన శ్రీ రాయసము వెంకట శివుడుపంతులుగారు వీరేశలింగం పంతులుగారి ప్రియ శిష్యులు. వీరేశలింగం పంతులుగారి సాహచర్యమువల్ల వెంకట శివుడుగారికి గూడా స్త్రీలు అభ్యుదయము చెందని దేశానికి అభ్యుదయము లేదను విషయము గాఢముగా హృదయమున నాటుకొనిపోయింది. కావుననేవారు స్త్రీల నిమిత్తము 'జనానా' పత్రికను 13 సంవత్సరములు అవిచ్ఛిన్నంగా నడిపారు. స్త్రీలలో విద్య అంతగా వ్యాప్తం లేని రోజులలో వీరేశలింగంపంతులుగారి 'సతీహితబోధిని' పత్రిక, వెంకట శివుడుపంతులుగారి జనానా పత్రిక స్త్రీలల్లో ప్రబోధం కలిగించడానికి అమోఘంగా కృషిచేసినాయి. స్త్రీలు సభలకు వెళ్ళుట అత్యంత ఆక్షేపణీయముగా భావించబడే ఆరోజుల్లో 1857 సంవత్సరం జూన్ నెలలో ఏలూరునందు శ్రీ వీరేశలింగం పంతులుగారి అధ్యక్షతను జరిగిన సంఘసంస్కరణ మహాసభకు శ్రీమతి రాయసము రత్నమ్మగారు వెళ్ళిఉండిరి. ఆమెతో ఆసభకు హాజరైన మరియిద్దరు స్త్రీలలో ఒకరు వీరేశలింగం పంతులుగారి సతీరత్నమైన రాజ్యలక్ష్మమ్మగారు, రెండవవారు సత్తిరాజు కామేశ్వరరావుగారి సతీమణి. లక్ష్మీ సరస్వతీ పార్వతులవలె ఈ ముగ్గురు సోదరీ మణులు ప్రజల ఆక్షేపణలకు జంకక ఆనాడు మహిళోద్యమములో పాల్గొనిన ఫలితముగానే నేడు మహిళోద్యమములో పాల్గొనడమేగాదు మహిళా సభలు జరపడమేగాదు, మహిళా పత్రికలు నడపడమేగాదు మహిళా సంస్థలు నిర్వహించడమేగాదు, ఒకటేమిటి సమస్త మహిళాభ్యుదయ కార్యములను అవలీలగా మనం నిర్వహించే సౌలభ్యం ఏర్పడ్డది.

ప్రజాహిత కార్యములను నిర్వహించు విషయములో, సేకరింపబడిన ప్రజాధనము విషయములో రత్నమ్మగారు అత్యంత జాగరూకతగా ఉండేవారు. ఎందరినో అర్థించి, ఎంతో కష్టపడి తెచ్చిన చందా దనము ఒక పైసయినను వ్యర్థముగా పోవుటకు ఆమె అంగీకరించేవారు కారు. అందులో ఏదైనా లోపం వచ్చిన ఆమె సహించేవారుకారు. ఒకనాడు మహిళాసభ రశీదు పుస్తకాలను ఎవరికో యిస్తూ రత్నమ్మగారు "రశీదు పుస్తకాలంటే ఏమనుకున్నారో అవీ డబ్బుతో సమానమైనవే. రశీదైనా ఉండాలి, రశీదు తాలూకు డబ్బైనా ఉండాలి. డబ్బు కర్చయి, రశీదు లేకపోతే ఆడబ్బుకు మనమే బాధ్యులం కావలవస్తుంది. చాలా మంది రశీదు పుస్తకాలు అజాగ్రత్తగా చూస్తారు. అది నాకు గిట్టదు. రశీదు పుస్తకం జాగ్రత్త" అన్నారు. వారి హితబోధ నాకెంతో గౌరవాన్ని కలుగజేసింది. గురూపదేశంగా మనస్సుకు హత్తింది. చందావిషయాల్లోనేగాదు సొంత విషయములోగూడ ఆదాయ వ్యయములపట్ల ఆమె కడు జాగరూకతగా ఉండేవారు. అవసరమెంతో అంతే గాని, అనవసరమైన డాబుదర్పాలకు సొమ్ము దూబరా చేయడము ఆమెకు గిట్టదు. ఆమె చాలా నిరాడంబరజీవి. నిరాకరణోద్యమానికి ముందు ఆమె సామాన్యమైన నేత చీరెలు ధరించేవారు. పిమ్మట ఖద్దరు ధరించేవారు. వెంకటశివుడు పంతులుగారు హైస్కూలు మేష్టరుగాను, కాలేజీ లెక్చరరుగాను, వెంకటగిరి రాజావారి (నెల్లూరు) కళాశాలకు ప్రిన్సిపాలుగాను పనిచేశారు. తరువాత ఉద్యోగ విరామమంది విశ్రాంతి తీసుకుంటున్నారు. ఏపరిస్థితుల లోను రత్నమ్మగారు ఒకవిధంగానే ఉన్నారు. పాశ్చాత్య నాగరికత చేతను, అధికార దర్పంచేతను, ఆకర్షితులై క్షణ క్షణానికి స్త్రీలు మారిపోవుచున్న కాలంలో ఆమెలో ఎట్టిమార్పు కనిపించేదిగాదు. ఆమె ప్రయాణాల్లో సూటుకేసు, హోల్డాలు, కాఫీ ఫ్లాస్కులు కనిపించేవికావు. మామూలు గుడ్డల మూటే, మూడవ తరగతి ప్రయాణమే.

అట్లా అని డబ్బు ఖర్చుపెట్టని పిసినారిగాదు. ప్రతి సత్కార్యానికి ఆమె ధర్మము చేస్తూనే ఉండేవారు. ఒకమారు నేనూ, రత్నమ్మగారు కొండా పార్వతీదేవిగారి యింట కలుసుకున్నాము. ప్రస్తావ వశంగా రత్నమ్మగారు "ఆసమాజానికో వందరూపాయలిచ్చాను. ఈ సమాజానికో వందరూపాయలిచ్చాను, ఈ విద్యాపీఠానికి వెయ్యి రూపాయలిస్తానన్నాను. ఆ విద్యా సంస్థ సాగితే దానికీ యివ్వాలనే ఉన్నదంటూ" చెప్పుకువచ్చారు. "అయితే మా మండలికి గూడా ఒక వందరూపాయలివ్వకూడదూ" అన్నాను నేను నవ్వుతూ. "అడిగితే మీకు మాత్రం యివ్వనన్నానా" అన్నారు రత్నమ్మగారు. "అయితే మా మండలి భవన ఆవరణచుట్టూ గోడ కట్టించబోతున్నాము అప్పుడడుగుతా ఉండండీ" అన్నాను నేను. "అడగండీ" అన్నారు రత్నమ్మగారు. తరువాత కొన్నాళ్ళకు మేము కాంపౌండు గోడను కట్టించబోతూ రత్నమ్మగారికి ఒక ఉత్తరం వ్రాశాను ఆషామాషీగా, నేనడిగినది వారిస్తారో లేదో అనుకుంటూనే. కాని తక్షణమే వచ్చేసింది వారివద్ద

# స్వర్గీయ శ్రీమతి రాయసము రత్నమ్మగారు

నుంచి నూరు రూపాయల మనియార్డరు. స్త్రీ సంస్థలపై వారికున్న అభిమానమునకు నాకెంతో ఆశ్చర్యం కలిగించింది.

గుంటూరులో వెంకటశివుడు దంపతులు కట్టించిన శాంతినిలయము అనే మందిరము వారికి స్త్రీ సంస్థలయెడ గల ఆదరాభిమానములకు ఒక చిహ్నమని చెప్పవచ్చును. 'శాంతినిలయమును' వారు కట్టి స్త్రీల ఉపయోగముల నిమిత్తం వినియోగించవలనదిగా పురపాలక సంఘానికి ఒప్పగించారు. ఆ మందిరంలోనే అఖిలభారత మహిళా సంఘము, మహాలక్ష్మీ పఠన మందిరము ఉంటూ ఉన్నవి.

సుమారు ముప్పది సంవత్సరములుపైగా గుంటూరులో నివసించే రత్నమ్మగారు స్త్రీల నిమిత్తమై చేసిన సేవ అంతా విశేషభాగం గుంటూరులోనే చేశారు. వారు కట్టించిన శాంతి నిలయం గూడా గుంటూరులోనే నిర్మించి మహిళోపయోగం నిమిత్తం సమర్పించారు. కనుక గుంటూరు మహిళలు 1949 సంవత్సరంలో రత్నమ్మగారికి సన్మానం జరిపి, వారి ఛాయా చిత్రమును శాంతి నిలయంతో ఆవిష్కరింపచేసి, ఆ ఆవిష్కరించే భాగ్యం నాకు ప్రసాదించారు. కొండా పార్వతీదేవిగారు పంగులూరి రాజ్యలక్ష్మమ్మగారు మున్నగు సోదరీమణులు రత్నమ్మగారు గుంటూరులో స్త్రీల నిమిత్తమై చేసిన పలువిధ సేవలను ఎంతగానో ప్రశంసించారు.

రత్నమ్మగారికిసంతతి లేదు. కానివారెప్పుడు ఒంటరిగా ఉన్నది చూడలేదు. వెంకట శివుడు రత్నమ్మగార్ల యిరువైపుల బంధువులు వారి యింట యెప్పుడు ఉండేవారు. ముఖ్యముగా అబంధువుల బిడ్డలు ఆడపిల్లలు మొగపిల్లలూ గూడా వారి పోషణలో ఉండి చదువుకుంటూ ఉండేవారు. ఇతర విద్యార్థులకు విద్యార్థినులకుగూడా సహాయం చేస్తూ ఉండేవారు. వారి సహాయంవల్ల చదువుకొని పైకి వచ్చిన వారు వారి బంధువులలోనే కాకుండా ఇతరులలోగూడా చాలామంది ఉన్నారు. ఆమె ఒకసారి మా బాపట్ల వచ్చినప్పుడు ఒక ఉద్యోగస్థుని యింటికి వెళ్ళి చూచి వచ్చారు. వారిని 'మీరెరుగుదురా' అని నే నడగగా అతను మా యింట్లోనే ఉండి చదువుకున్నాడని ఆమెగారు చెప్పారు.

ఇటీవల నేను రాజమండ్రీ వెళ్ళినప్పుడు వారి యింటి వద్ద ఉండగా ఒక బ్రాహ్మణుడు వారి యింటికి వచ్చాడు. ఆయన మాట్లాడి వెళ్ళిన తరువాత ఆయన పురాణం శాస్త్రిల్లుగారని ఆయనకు ఆరువందలుపెట్టి నివాసస్థలం కొని యిచ్చామనీ రత్నమ్మగారు నాతో చెప్పారు. తాము స్థలం కొని యివ్వడమే కాకుండా ఎవరితోనో మాట్లాడి కలప సప్లయి చేయిస్తాననిగూడా రత్నమ్మగారు ఆయనతో చెప్పగా నేను విన్నాను. స్వహస్తముల, పరహస్తముల గూడా రత్నమ్మగారు ఇతరులకు సహాయం చేస్తూ ఉంటారు కాబోలునని నాకు అనిపించింది. ఆ వృద్ధ దంపతులు చేసిన అనేక ధర్మముల వివరాలు మనకు తెలియకపోవచ్చును. కాని వారు అనేకం చేశారనేది స్పష్టమే.

రత్నమ్మగారిలో స్వజాత్యభిమానం అత్యధికం. ఇటీవల వీరు ఒక పిల్లవానిని (వెంకట శివుడుగారి అన్న మనుమనిని) దత్తత చేసుకున్నారట. మద్రాసులో ఉండగా ఆ పిల్లవాడు ఒక తమిళ బాలికను వరించి వివాహమాడ నిశ్చయించుకున్నాడట. ఆ అమ్మాయి గూడా అతనిని ప్రేమించిందిట. బంధువర్గమంతా ఈ వివాహం వల్లగాదన్నారట. కాని రత్నమ్మగారు ఆ పిల్ల మనస్సు నెఱిగి ఆమెను అన్యాయం చేయడం ధర్మం గదని పట్టుపట్టి వెంకటశివుడుగారికి నచ్చజెప్పి పరస్పరం ప్రేమించుకున్న ఆ యువతీ యువకులకు వివాహం జరిపించారట. రాజమండ్రీలో ఒక మిత్రురాలు నాకీ విషయం చెప్పి రత్నమ్మగారిని ప్రశంసించారు.

రత్నమ్మగారి పుట్టింటి వారిది తూర్పుగోదావరిజిల్లా వెలిచేటివారి ఆడపడుచు. వెంకటశివుడుగారిది పశ్చిమ గోదావరిజిల్లా. రత్నమ్మగారి జననం ఈశ్వర సంవత్సర చైత్రశుద్ధ దశమి. ఈ 1953 అక్టోబరు 13 వ తేదీని ఆమె స్వర్గస్థులైనారు. చనిపోవునప్పటికి వారి వయస్సు 74 సంవత్సరాలు. చిరకాలం సంస్కరణోద్యమంలో ఎంత సంబంధం కలిగిఉన్నా రత్నమ్మగారిలో పూర్వాచారపరాయణత్వం పోలేదు. ఆచారవ్యవహారాల్లో, కట్టుబొట్టు సాంప్రదాయాల్లో వ్రతోపవాసాల్లో ఆమె సనాతనంగానే ఉండేవారు. వీరు ఒకప్పుడు నవనాగరికంగా ఉండేవారని విన్నాను. కాని నేను చూచిన ముప్పదేండ్లనుండి ఆమె పూర్వపద్ధతిగానే ఉన్నారు.

ఏవూరిలో ఉంచే ఆ వూరిలోనే ఆమె స్త్రీ సంఘసేవ ఏమరక చేస్తూ ఉండేవారు. వారు గుంటూరు వదలి రాజమండ్రీలో కాపురం పెట్టిన తర్వాత అచ్చటి స్త్రీలతో

# స్వర్గీయ శ్రీమతి రాయసము రత్నమ్మగారు

కలిసి మహిళాసంఘ కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉండే వారు. గుంటూరులో నేను రత్నమ్మగార్ని కలుసుకొన్నప్పుడు రాజమంద్రీలో ఒక సభను ఏర్పాటుచేస్తాను మీ నిమిత్తంగా మీరు తప్పకుండా రావలెనన్నారు. నా నిమిత్తం సభ యెందుకు, రానంటే వచ్చితీరాలి అన్నారు. ఒకమాటు రమ్మని వ్రాస్తే నాకు వీలుకాదన్నాను. కొన్ని నెలలైన తరువాత మళ్ళీ వ్రాశారు. పెద్దవారి మాట శిరసావహించి వారు రమ్మన్న ప్రకారం వెళ్లాను, వెళ్ళి చూద్దును గదా అక్కడ సభ ఏర్పాటేలేదు. మళ్ళీ బండి ఎక్కుదామనిపించింది. అయితే రత్నమ్మగారు ఒప్పుకుంటారా, ఉదయమే లేచి ఎక్కడెక్కడికెళ్లారో, ఏపే ఏర్పాట్లు చేశారో ఏమో జరాభారం పైగప్పి, నడుము వంగిపోయి కదలలేకుండా ఉన్న రత్నమ్మగారు అనుకున్న ప్రకారంగా సభను జరిపించారు. వారి సామర్థ్యానికి, కార్యదీక్షకు స్త్రీజనాభ్యుదయ చింతకు నాకు ఆశ్చర్యమైపోయింది. ఆ సభలో ముగ్గురు పిల్లలు కాస్సేపు చక్కగా బుర్రకథ చెప్పారు. ఆ బాలికలకు ఆదుర్తి భాస్కరమ్మగారు ఏవో బహూకరణలు గూడా చేశారు. కాని రత్నమ్మగారు అంతటితో తృప్తిపొందక ఈ బాలికలకు నేను 12 రూ॥లు బహూకరిస్తున్నా నన్నారు. స్త్రీల యెడలను బాలికల యెడల వారికి గల వాత్సల్యాభిమానాలట్టివి.

రత్నమ్మగారికి మొగమాటమన్నది అసలే లేదు. ఏవరియందైనా ఏదైనా లోపం కనిపిస్తే కుండ బద్దలుకొట్టినట్లు ముఖాన్నే అనేసేవారు. అది కొందటికి వెగటుగా కనిపించేది. కాని సమకోమలమైన ఆ హృదయంలో ఆ మందలింపబడిన వారి శ్రేయస్సు గర్భితమై ఉండేది. అన్యాయంగా, అక్రమంగా అనవసరంగా ఎవరినీ ఏమీ చేయక మంచి ఎక్కడ ఉన్నా గ్రహించే గుణ గ్రహణ పారీణత వారికున్నప్పుడు వారి వాక్పారుష్యం లోపమే గాదు.

రత్నమ్మగారు ప్రత్యేకంగా ఒక సంస్థను స్థాపించక పోయినను, ప్రతి సంస్థకు, ప్రతి సంస్కారానికి, ఆమె యిచ్చిన చేయూత, చేసిన సేవ మరువరానిది, ఆదర్శప్రాయమైనది.

శ్రీ వెంకటశివుడు పంతులుగారు శ్రీవీరేశలింగంపంతులు గారి శిష్యులైనందుకు ఆదినుంచీ స్త్రీ విద్యాభిమానులై తమ జనానా పత్రిక ద్వారా, తమ గ్రంథరచనల ద్వారా చేసిన అమూల్య కృషియేగాక తమ సతీమణియైన రత్నమ్మగారు సంఘసేవ చేయడానికి దాన ధర్మాదులు చేయడానికి సంపూర్ణమైన అవకాశ మొసగి కృతకృత్యులైనారు సంఘసేవ పరాయణియైన శ్రీమతి రత్నమ్మగారు 13-10-53 తేదీని స్వర్గస్థులైనారన్న వార్త ఆంధ్ర మహిళా లోకమునకు తీరని విచారమును కలిగించినమాట వాస్తవము. అయినను నిండు వార్ధక్యముచే లేవలేని పరిస్థితి వచ్చేవఱకు స్వసంఘ సేవ జేసి పుట్టెడు పసుపు కుంకుముతో భర్త చేతిమీదుగా దాటిపోయిన శ్రీమతి రత్నమ్మగారు ధన్యురాలు. పరమాత్మ వారి ఆత్మకు శాంతి ప్రసాదించుగాక!



"మానవంతులు నీచకార్యములనెప్పుడు చేయరు. నీచులను సేవింపరు. అట్టియవస్థయందును ధనమునకు లొంగి నీచకృత్యములనాచరింపరు. ప్రతి స్వల్ప విషయమునకైన సంతృప్తినందుదురు. తమ సత్త్వమునకును గుణమగు కార్యము నాచరించుటకు గడగుదురు. మానవంతు లుదాత్తమయిన ప్రకృతిగలవారు. ఎల్లవేళల దాని కనుగుణముగనే ప్రవర్తించురుదు."



కథానిక :

# కన్న కడుపు

* శ్రీమతి వి. సీతారామమ్మ *

అది ఒక గాఢాంధకారమైనరాత్రి. ఆకాశము చిల్లులు పడ్డదేమోన్నట్లు భోరున వర్షం. మధ్య మధ్యలో చెవులు చిల్లులు పడేట్లు ఉరుములు మెరుపుల శబ్దాలు, వీధుల వెంబడి నీరు కాలువలుగట్టి పారుతున్నాయి. రోడ్డు ప్రక్కనే ఒకచెట్టు క్రింద నాలుగు తాటాకులతో నిర్మించుకొన్న ఒక పంచలో ప్రసవ వేదన పడుతూంది ఒక బీద ఇల్లాలు. ప్రక్కనే అంధుడైన భర్త జబ్బుతో మూల్గుతూ ఒకమూల వొదిగి వున్నాడు. నాల్గువైపుల నుండి నీరు కారుతోంది. ఇటు ఆకలికీ అటు చలికీ గజగజ వణకి పోతున్నారు. పాపం ఆ ఇల్లాలు అచ్చటే ప్రసవించింది. బిడ్డ కెవ్వుమని అరుస్తూంది. .... తండ్రి చేతులతో తడుముతూ బిడ్డను తిలకిస్తున్నాడు. తల్లికి పుత్రోదయమైనందుకు సంతోషం, తనస్థితిని తలంచుకొని మరోవైపు దుఃఖం పెళ్ళగించుకొని వస్తూంది. ఏం జేస్తుంది! వాళ్ళజానెడు పొట్టకు పిడికెడు అన్నందొరకని ఈ కాలంలో ఈ చంటిపాప నెలా సాకను? .... అందులో ఆ ప్రళయంలో ఆ చెట్టుక్రింద పంచలోనా! ఆలోచించింది .... పొత్తిగుడ్డల్తో బిడ్డను చుట్టుకొంది. వానకు తడవనీకుండా ఒక తాటాకు పైన పట్టుకొని పోతూంది. ఎక్కడికో! భర్త అరుస్తున్నాడు ఎక్కడికి పోయేదని? .... ఆమాటలనే వినిపించుకోకుండా బయలుదేరి వెళ్తూంది. ఒక పెద్దభవనం ఎదురైంది. అచ్చట ఆగింది .... పాపను హృదయానికి హత్తుకొని భోరున విలపిస్తూంది మాతృహృదయం. ఆ పసికందును తీసుకువెళ్ళి ఆ భవనం వాకిట, తలుపు దగ్గరగా పరుండబెట్టి ఏమిజరుగుతుందో అని దూరంగావచ్చి ఆవానలోనే తడుస్తూ ప్రహరీ గోడవద్ద పొంచి చూస్తూ నిలుచుని వుంది. వర్షం అంతకంతకూ ఎక్కువౌతుందే కాని తగ్గేసూచనలు కనుపించడం లేదు. వర్షపు తుప్పరలు తనపై పడేకొద్దీ ఆ పసికందు గొంతు చిల్లులు పడేట్లు కెవ్వునకేకలు పెడుతున్నాడు. తల్లి అలాగే తనబిడ్డకి ఏమి విపత్తు వాటిల్లుతుందో అని చూస్తూ నిలుచుని వుంది.

అదొక పెద్ద ధనికుని బంగళా. వారికెంతో ఆస్థి వుంది. వాన్ని అనుభవించేందుకు, ముద్దు మురిపెములు తీర్చేందుకు ఒక్క కొడుకైనా లేడు. ఎన్నెన్నో పూజలుచేశారు. వారి కోర్కె ఫలించలేదు. ఆ రాత్రి భార్యా భర్తలు ఇంకా నిదురించలేదు. ఎక్కడనుండో చంటిబిడ్డ ఏడ్పుధ్వని వినవచ్చింది. ఆమేడ అంతా వెదికారు. ఏమీ గోచరించలేదు. వెదకి వెదకి చివరకు వాకిటితలుపు తెరవగనే పాపం పొత్తిగుడ్డ పేలికల్లో ఒక మొగశిశువు వాకిట పండబెట్టి వుంది. చుట్టుప్రక్కల చూచారు. ఎవ్వరూ కనుపించలేదు. సంతోషంతో దైవప్రసాదమని బిడ్డనెత్తుకొని లోనికెళ్ళారు. ఇదంతా చూస్తున్న మాతృహృదయం రెండు ఆనంద భాష్పాలు రాలుస్తూ తన కుటీరానికి తిరిగి వెళ్ళిపోయింది. ఇంకేముంది పంచ నేలకూలిపోయివుంది. పెద్ద చెట్టు కొమ్మ విరిగి పడివుంది.

అయ్యో! నా భర్త ఏమైనాడు. "ఏమండీ! ఏమండీ?" అంటూ వెతుక్కుంది. ప్రక్కగనే కొమ్మక్రింద పడి వున్నాడు. "ఏమండీ! ఏమండీ" అంటూ పైనబడి నిమిరింది. ఇంకేముంది. శరీరం చల్లగా కొయ్యబారి పోయి వుంది. కెవ్వున కేకవేసి భర్తపై కూలిపోయింది.

* * *

పిల్లాడు ఎంతో గారాబంగా పెరుగుతున్నాడు, ధనికుని మేడలో .... ప్రతిదినం ఒక బిచ్చగత్తె వచ్చి నిలుస్తుంది మేడక్రింద బిక్షానికి. పైనుండి చిన్న పిల్లవాని చేతుల్తో వేయిస్తుంటారు బిక్షం. పాపం ఆ బిచ్చగత్తె పిల్లవాడ్ని చూస్తూ, ఆనందంతో మురిసిపోతూ కారుతున్న కన్నీటిని తుడుచుకొంటూ వెళ్తూంటుంది. ఎక్కడెక్కడో బిక్షాటన చేస్తూ ఆమేడ చుట్టుప్రక్కలే సంచరిస్తూ వుంటుంది ఆ బిచ్చగత్తె. ఈలా కొన్నిఏండ్లు గడచాయి. పిల్లవాడు పెరిగి పెద్దవాడయ్యాడు. అంతా ధనికుల పిల్లలతోటి సావాసం. కార్లో పిల్లాడు స్కూల్‌కి వెళ్తూంటే, బిచ్చగత్తె గేటువద్ద కాచుకొనివుండి "బాబూ" అనేది. బిచ్చగత్తెను చూచి ఒక అణా విసరివేసేవాడు. పాపం ఆ బిచ్చగత్తె పిల్లాడిని చూచి మురిసిపోతూ అణాను ముద్దెట్టుకొనేది. ఇది మామూలైంది. ఇలా హైస్కూల్ చదువు పూర్తికావచ్చింది. పిల్లాడు రమేష్ కాలేజిలోకి వచ్చాడు. ధనికుల పిల్లలతోటి సావాసం .... ఖర్చులు ఎక్కువయ్యాయి.

గోపి అనే స్నేహితుడొకడు దొరికాడు రమేష్‌కి. వాని స్నేహిత ప్రభావం వేశ్యల యిండ్లవరకు తీసుకు వెళ్ళింది. అంతేకాదు "సీత" అనే వేశ్యవల్లో పడ్డాడు. ఇక తనంత టదే అలవాటైంది త్రాగుడు. రమేష్ పూర్తిగా చెడి పోయాడు. రాత్రుళ్లు ఒక్కొక్కప్పుడు పన్నెండు గంటలవరకు యింటికి వచ్చేదిలేదు. బిచ్చగత్తె ప్రతిదినం రమేష్ యింటికి వచ్చేంతవరకూ ఎంతరాతైనా సరే గేటు వద్దనే కాచుకొనివుండి రమేష్ లోనికి వెళ్ళగనే తనూ తన గుడిశెలోనికి వెళ్తూండేది. రమేష్ ఈలాచెడిపోవడం చూచి ఆమె హృదయం ఎంతో తల్లడిల్లింది. కాని ఏమని మంద లిస్తుంది. తనొక బిచ్చగత్తె. ఈలాగే తన హృదయం పరి పరి విధాల కుళ్ళుతూండేది. కొద్దికాలానికి రమేష్‌ను పెంచి పెద్దచేసిన వారిరువురూ చనిపోయారు. ఆస్తికంతా రమేష్ పెద్దఅయ్యాడు. ఇక తనమట్టూ స్నేహితుల మయం. త్రాగుడు, జూదంతో, ఆస్తినంతా కరిగిస్తున్నారు. ఇటు వేశ్య సీత, గోపి యిద్దరూకలసి రమేష్ ఆస్తినంతా కొల్ల గొట్టేశారు. చివరకు అప్పుల్లోగూడ దింపారు. సీత మీద మోజుతో అప్పులుగూడా చేశాడు. బిచ్చగత్తెకు ఈ విష యాలన్నీ తెలిసేకొద్దీ హృదయం పరిపరివిధాల తపించి పోతూంది తనబిడ్డ చర్యలకి. సుఖంగా బ్రతకాలని వాళ్ళ యింటిలో వదిలిందే గాని, ఈలా చెడిపొయ్యేందుకా? .... ఎంతగానో దుఃఖించింది. అప్పులవాళ్లు ఇంటినికాస్తా ఆక్రమించు కున్నారు. రమేష్‌ని బైటకు గెంటేశారు. ఎక్కడున్నారు, తన స్నేహితులంతా ! ఒక్కరూ ఇప్పుడు పలుకరించడమైనాలేదు. ఇక మిగిలిందల్లా వేశ్యేనని సీత యింటికి బయలుదేరాడు రమేష్. అచ్చట గోపి కౌగిళ్లో సరస సల్లాపాలాడుతోంది తనది అనుకొన్న సీత .... ఆ దృశ్యాన్ని చూచేసరికి రమేష్‌కి కండ్లు చీకట్లుక్రమ్మాయి. సీత యింత వ్యభిచారి అని అనుకోలేదు. మందలించ బోయాడు. కాని తననే మందలించి బాగాకొట్టి రోడ్డుపైకి గెంటేశారు. బిచ్చగత్తె బిడ్డను వెతుక్కొంటూ ఏమి విపత్తు వాటిల్లుతుందోనని నిద్రకూడా లేకుండా తిరుగుతోంది. వేశ్య యింటివైపు రాగానే రోడ్డుపై పడివున్నాడు రమేష్ స్పృహతప్పి .... అమాంతంగాపోయి బిడ్డను కౌగలించు కొని తొడపై పండబెట్టుకొని ఎన్నెన్నో శైత్యోపచారాలు చేస్తూవుంది.

"అమ్మా ........ అ....మ్మా" అంటూ రమేష్ మూల్గుతూంటే. "ఏం . నా....న్నా" అంటూ ఆ మాతృ హృదయం పొంగిపొరలి వచ్చే దుఃఖాన్ని ఆపుకొంటూ బిడ్డను నిమురుతూంది. వేడికన్నీటి బొట్లు రమేష్‌పై పడ్డాయి. కండ్లు తెరచిచూచాడు.

"ఆ ! .... ఎవరు? .... నీవా ! .... బిచ్చగత్తెవు?" అన్నాడు ఆశ్చర్యంగా !

"అవున్నాయనా ! .... నేనే .... బిచ్చగత్తెను రా నాయనా .... మాయింట్లో వుందువుగాని రా !"

"వొద్దమ్మా .... అమ్మైనా అన్నావ్, నీవైనామేలు. ఇంతగా నా ఆస్తినంతా తిన్న స్నేహితుల్లో ఒక్కడైనా ఈమాట అనలేకపోయాడు. ఏంచేయను? తల్లిదండ్రులు పోయారు ఇక ఈలోకంలో నాకేంపనుంది .... ఇల్లులేదు వాకిలీలేదు .... నాకింక దిక్కెవరున్నారు .... ఎక్కడైనా దూకిచావనైనా చస్తే హాయిగా వుంటుంది .... నన్ను పోనీమ్మా" అని రమేష్ అంటుంటే తల్లికండ్లనుండి నీళ్లు కారిపోతున్నాయి.

"ఏంటమ్మా ! నా కష్టాలకు నువ్వెందు కీలా దుఃఖించ డం?" అన్నాడు రమేష్.

"లేదు నాయనా కష్టాలంటే ఏమిటో కష్టపడేవారికే తెలుస్తుంది. నాతో రా నాయనా. నన్నే మీ అమ్మ అనుకో. నా బిడ్డమాదిరి చూచుకొంటాను, నీ కేకష్టం లేదు రా నాయనా" అంది.

"సరేనమ్మా నీ యిష్టం. ఆపదలో తల్లిమాదిరి కాపాడావమ్మా" అంటూ ఆమె వెంబడి నడచి వెళ్ళాడు. ఒక గుడిసెలోకి తీసుకు వెళ్ళింది. చింపిరి వస్త్రాలు, కుండ బొచ్చెలు చూస్తూ అయోమయంగా కూర్చున్నాడు రమేష్. ఎక్కడెక్కడో కష్టపడి అంట్లు దొమి, బియ్యం దంచి మున్నగు పనులు చేసి ఇన్ని నూకలు తెచ్చి వేళకు రమేష్‌కి వండి పెడ్తూంది. తనను యింట్లో పండబెట్టి ఆమె యీ వయస్సులో అలా కష్టపడడం చూసి సహించ లేకపోయాడు. ఒకే ఆలోచనతో మనస్సు కలతజెంది పోయింది. ఏమైనాసరే సీతా గోప్ విషయాన్ని తేల్చా ల్సిందని బయలుదేరాడు ఒకరాత్రి. నిద్రలో ప్రక్కన తడిమి చూడగా రమేష్ కనిపించలేదు. కంగారుగా లేచి వెతికింది. చీకట్లో పోతున్నాడు. ఆ నీడ వెంబడి తనూ వెంబడించింది. సందులు, గొందులు తిరిగి ఒక యింటి ముందు ఆగాడు. చుట్టుప్రక్కల చూచాడు. ఎవ్వరూ కను

పించలేదు. తలుపు నెట్టుకుని లోనికి వెళ్ళాడు. లోన గోపి కౌగిట్లో వాలి వుంది సీత. పోయిన పోవడం గోపి చెంప ఫెళ్ళున వాగిపోయింది. ఇద్దరూ కలియబడ్డారు. మొలనుండి కత్తి తీశాడు రమేష్. అడ్డుగా వచ్చిన సీతను పొడిచాడు. సీత నేల కూలింది, రక్తం కారి పోతూంది. రమేష్‌కి కండ్లు చీకట్లు కమ్మాయి. మిద్దెపై నుండి దూకి ఎటో వెళ్ళిపోయాడు. గోపి పోలీసుకు ఫోన్ చేసి అచ్చటవుంటే తనకూ అపాయం వస్తుందని తలుపు తెరుచుకొని పారిపోయాడు. బైట పొంచి వున్న బిచ్చగత్తెకు ఏమీ అర్థంకాలేదు. పైన జరుగుతున్న చప్పుడు విని భయపడింది. రమేష్‌కి ఏమైనా ప్రమాదం వాటిల్లిందేమో అని తలుపు నెట్టుకొని లోనికి వెళ్ళింది, గుండె నీరైపోయింది లోని దృశ్యాన్నిచూచి. సీత శవం అచ్చట పడివుంది. ఇదంతా కొడుకు పనేనని అర్థమైంది. పోయి ఆ కత్తిని పూడతీయ బోతూవుంది, ఇంతలోగా పోలీసులు వచ్చి పట్టుకున్నారు.

మరుసటి దినం కోర్టులో విచారణ. బిచ్చగత్తె బోనులో నిలుచుని వుంది.

"నీవేనా సీతను పొడిచి చంపింది" అని జడ్జి ప్రశ్నించాడు.

"ఆ నేనే, నేనే చంపాను" అని ఆమె సమాధానం.

"ఎందుకు చంపాల్సి వచ్చింది?"

"కాదు.... ఆమె కాదు.... నేను చంపింది. నేను.... ఆమె నిర్దోషి.... ఆమెను వదలండి.... ఆమె నిర్దోషి" అని అరుస్తూ, పరుగెత్తుతూ లోనికి వచ్చాడు పిచ్చివాడిలా రమేష్, అందరూ నివ్వెరపోయారు.

"కాదు బాబూ.... నామీద అభిమానంతో చెప్తున్నాడు. ఆయనకాదు ... నేనే చంపింది నేనే" అని బోనులోంచి అరచి చెపుతూంది బిచ్చగత్తె.

రమేష్‌కి కండ్లవెంబడి నీరు కారుతున్నాయి. బిచ్చగత్తె తన కొరకు చూపిన త్యాగానికి.

"నీ వెవరు? ఎందుకలా చేశావ్" అని మరల, జడ్జి ప్రశ్నించాడు.

"చనిపోయే ముందైనా నాకథ అందరికీ చెప్తాను"అని తను బిడ్డను కనడం, అచ్చట వదలడం, నాశనం చేసిన వేశ్యను తానే చంపి తన కసి తీర్చుకున్నానని చెప్పింది.

"హత్యానేరం తనే చేసినట్లు ఒప్పుకొంది గనుక వురిశిక్ష విధించా"లని తీర్పు చెప్పారు, కోర్టువారంతా లేచి వెళ్తున్నారు. రమేష్ "అమ్మా.... అమ్మా...." అంటూ వెళ్ళి అమ్మను కౌగలించుకొన్నాడు. కొడుకును ఆపలేని దుఃఖంతో కౌగలించుకొని తల నిమురుతూంది తల్లి ...

"నేను చేసిన నేరానికి నీకు వురిశిక్షా.... అమ్మా" తల్లి కౌగిట్లో వాలిపోయాడు రమేష్. పోలీసులు తల్లీ బిడ్డల్ని వేరుచేసి తల్లిని తీసుకు వెళుతున్నారు "అమ్మా.... అమ్మా...." అంటూ పిచ్చివాడిలా అరుస్తూ గుడ్డలు చింపుకొంటున్నాడు రమేష్, తల్లి మౌనంగా పోలీసులతో వెళ్తూంది వురి కంబం వద్దకు.



# ఇల్లరికం

శ్రీ కె. శశాంక్.

[జరిగినగాథ :— మాటవరుసగా తండ్రి తన పెళ్ళినిగూర్చి ప్రస్తావిస్తే, దాన్ని పురస్కరించుకుని వివిధ భావాలు మనసులో పొడగడ్తూండే రామం అనాలోచితంగా విజయవాడ వెళ్ళి మామయ్యతో తన పెళ్ళిని గూర్చి ఎత్తాడు. బావమఱది అభిప్రాయాన్ని తెలుసుకున్న మామయ్య రామంతో, మాలతికి వేరే సంబంధం చూసు కుంటానంటాడు. కాని రామం మాలతిని చేసుకోవటం తన కిష్టమేనని అన్నప్పుడు, మామయ్య, ఏకీభావంలేని తండ్రీ కొడుకుల అభిప్రాయాలు చివటికి కుటుంబాన్ని అల్లరిపాలు చేయటానికి దారితీస్తయ్యేమోననీ, అందువల్ల ఆలోచించ మనీ అంటాడు అతనితో. ఈ మృదుమధుర సమాధానం రామానికి విషంలో పోసినట్లయింది. అవమానంతో పీడింప బడ్డాడు. తను, తన పెళ్ళికోసం కేవలం అర్థించటానికే అక్కడికి వచ్చినట్లుగా భావించి, మామయ్యతో, తన దౌర్బ ల్యం కప్పిపుచ్చుకుంటూ, కఠినంగా, తను నిజంగా ఆలోచించకుండానే వచ్చినట్లూ, మాలతిని తను చేసుకోననీ చెప్పి వచ్చేస్తాడు. ఇది తెలిసిన శంకరయ్య అతని అనాలోచితపు పనికి కోప్పడతాడు. ఇది యిలా ఉండగానే, శాంత పెళ్ళికావటం జరిగిపోతుంది. మూణ్ణిద్రల కెళ్ళిన శాంత మళ్ళీ గుంటూరుకొచ్చిన మర్నాడు శంకరయ్య హఠాత్తుగా తేలుకుట్టి మరణించాడు. అంతటితో కుటుంబ భారమంతా రామం మీద పడ్డది. ఒక ప్రక్క కుటుంబ నిర్వహణ,—మఱొకప్రక్క ధనాభావం,— ఏమిచేయటానికీ పాలుపోని రామానికిప్పుడు అర్థమైంది; తన తండ్రి తన పెళ్ళిద్వారా ధనాన్నెందుకు కాంక్షించాడో.

కష్టాల్లో సుఖాలన్నట్లు రామం బి. ఏ. పాసయ్యాడు. తండ్రికి చిరపరిచితుడైన రామప్రసాదనే లాయర్ దగ్గఱ కెళ్ళి ఉద్యోగవిషయమై అర్థించాడు. లాయర్ చాలామంచివాడు. రామానికి రెండురోజుల్లో ఏదో ఒకమాట చెప్పేస్తానని ప్రమాణం చేస్తాడు. అన్నట్లుగానే ఆయన అతనికి కలకత్తాలో తన స్నేహితుడిద్వారా ఉద్యోగ మిప్పించగలనంటాడు. మాటల సందర్భాన విద్యార్థి దశలో తనకు శంకరయ్య చేసిన సహాయాన్ని రామంతో చెప్పగా, రామం ఆశ్చర్య పోతాడు. సముద్రగర్భాన్న రత్నాల్లా తన తండ్రి హృదయంలోని ఉత్తమత్వాన్ని చూడగల్గాడప్పుడే రామం— ఆతండ్రి మరణానికే అప్పుడతని చింత.— ఇక చదవండి.]

౨౪

రామం కలకత్తాకు ప్రయాణమైనాడు. వెళ్ళినవెంటనే కృతజ్ఞతాభావం ఉట్టి పడుతూన్న తన లేఖను రామ్ ప్రసాద్‌గారి కందించాడు. ఆయన భార్య ఆయన నడి గింది—"ఆ అబ్బాయి ఎవరండీ?" అని.

"నా స్నేహితుడి కొడుకు. పాపం! ఆయన పోయి నాడు. కుటుంబ భారమంతా అతని మీదే పడింది. అయినా అదృష్టంలే. తొందరలోనే మూడు వందల రూపాల జీతగాడైనాడు" అన్నాడాయన.

"పిల్లవాడు బాగున్నాడండీ!" అంది ఆవిడ.

"అవును.— ఏం? అట్లా అంటున్నావు"

"మన శశినిస్తే ఇల్లరికానికొస్తాడేమో"

"సరే! ఆలోచించక ఆలోచించక ఇదే అనాలి!— బి. ఎ. చదివినవాడికేమిటి పోదూ!" అన్నాడాయన అసంతృప్తిగా.

"ఈ కాలంలో ఇల్లరికానికొచ్చేవాళ్ళెవరండీ! ఒక్కగానొక్కతె. దాన్ని వదిలి పెట్టటమంటే నాకు చావటం మేలు" అన్నదావిడ విచారంగా.

"ఇల్లరికానికి నేను చస్తే ఒప్పుకోను. అట్లాచేస్తే శశి అతన్ని గౌరవంగా చూడటం నేర్చుకోలేదు. ఆడ పిల్లలకు అత్తవారిల్లే అలంకారం."

"మీదంతా....... అదోరకం! ఇంతపెద్దలాయరై, రేపో ఎల్లుండో జడ్జీకూడాకాబోతూ ఈ పూర్వాచార మేమిటీ?" అందా ముసలిముత్తైదువ.

"ఆహా. నువ్వు నవనాగరికంగా వెలిగి పోతున్నావు కదూ!" అన్నాడాయన నవ్వుతూ.

"సరే! నా అందానికేమొచ్చె గానీ దాని విషయం చెప్పండి. దాన్ని వదిలిపెట్టి ఉండటం నాకుచేతకాదు." అన్నదావిడ.

"నీకేమీచేతకాదు. ........"

"అబ్బ! కనుక్కోరాదూ?"

"సవితి తల్లినీ, చెల్లెళ్ళనూ అందర్నీ వదిలిపెట్టి యిక్కడికి రమ్మంటే వస్తాడా ఏం?"

"మఱి కలకత్తావఱకూ ఎట్లా పోయాడూ?"

"ఏమో మనకు తెలీదు. అయినా ఉద్యోగం కోసం పరాయిదేశం పోవటం, యావజ్జీవం పెళ్ళాన్నంటి పెట్టుకుని అత్తవారింట్లో ఉండటం ఒకటేనా? ...."

భార్య గొంతులో వెలక్కాయ పడింది. ఆవిడ అప్పటికేమీ మాట్లాడలేదు. కానీ (రామంవంటి అందగాడు తన కల్లుడైననాడే తనకు నిజమైన ఆనందం.) అనుకుందావిడ. కేవలం అతనిలో అందాన్ని మాత్రమే ఆమెచూడలేదు. గుణంకూడా ఉన్నదతనికి. అందగాళ్ళయితే ఎంతమంది లేరు? కాని మంచి గుణం వుంటుందా అందరికీ? —

సంవత్సరం గడిచిపోయింది. రామం ఉద్యోగం స్థిర పడింది. ఇంటికి మాటయాభై పంపుతూ తను మిగిలింది వాడుకునేవాడు. నెలవల్లో కసులకు పుట్టిన ఆడపిల్లను చూడటానికీ, ఒక్కమాటు విశ్రాంతిగానూ ఉంటుం దన్నట్లు రామం గుంటూరు కొచ్చాడు. అటునుంచి రామప్రసాద్‌గారికి సుముఖంగా కృతజ్ఞత తెల్పటానికి మెడ్రాస్ కొచ్చాడు. రామప్రసాద్‌గారు రామం హృదయంలోంచి పెల్లుబికి వస్తున్న కృతజ్ఞతకు ఎంతో ఆనందితుడైనాడు; భార్య అభిప్రాయం అతనిలో కూడా ఒక్కమాటు తలెత్తి మళ్ళీ అణిగిపోయింది....

ఆనాడు, ఆయనా, రామం ఇద్దరూ భోజనం చేస్తున్నారు. లాయర్‌గారి భార్య ఉత్కంఠతో అతనివేపు చూసి, చూసి, చివఱికి "నాయనా! నీకు పెళ్ళైందా?" అన్నది ఏమీ తెలియనట్లు.

"లేదండి" అన్నాడు ముక్తసరిగా రామం.

"మా కాలంలో మాకు పదమూడేళ్ళకే అయిపోయేది. ఒకవేళ అట్లా కాకపోతే మగవాణ్ణీ, ఆడదాన్నీ కూడా తిట్టి పోసేవారు" అన్నదావిడ.

"ఇప్పుడు కాలం మారింది కదండి!" అన్నాడు రామం ఆమెను లక్షించి నవ్వుతూ.

"ఏమి మారటమో నాయనా! ఛస్తున్నాం ఈ చదువులతో" అంది ఆవిడ.

"మీకు పుట్టినప్పట్నుంచీ పిల్లలకు సంబంధాలు స్థిర పరచటంలో ఉన్న ఆత్రం మరెవ్వరికీ లేదు" అన్నాడు అలాగే నవ్వుతూ మళ్ళీ. రామప్రసాద్ గ్లాసులో నీళ్ళు తృప్తిగా తాగి అన్నాడు. "నిజం చెప్పావోయ్! అట్లా బుద్ధిచెప్పు మా ఆవిడకు.—" భార్యా రత్నం చుర చుర చూసింది— వెంటనే ఆవిడ రామం వైపు తిరిగి, "మాకూ ఒక ఆడపిల్ల ఉన్నది నాయనా!" అంది.

ఏమనాలో రామానికి అర్థం కాక మాట్లాడకుండా ఊరుకున్నాడు. తన మాటలతో అతన్ని పరీక్షిస్తున్న విధంగా ఆవిడ మళ్ళీ "నీకు చెల్లెళ్లున్నారా నాయనా!" అంది.

"ఉన్నారు. ఒకమ్మాయికి క్రిందటి సంవత్సరమే మా నాన్నగారే పెళ్ళిచేసి పోయారు.- ఇంక ఒక్కతే వుంది."

"మీ సవితి తల్లి కెవరైనా ఉన్నారా?"

"ఆ, మా నాన్నగారు పోయేసమయాన మా పిన్ని కడుపుతో వుంది. నాలుగు నెలలు క్రిందటే ఒక అమ్మాయి పుట్టింది" అన్నాడు రామం.

"బంధువుల్లో మేనరికా లున్నాయా నీకు?"

"ఆ" అన్నాడు రామం.

మునలిలాయర్ పెళ్లాం కొంచెం నిరుత్సాహ పడింది. అయినా ఆగకుండా అంది. "ఏదో ముసలిదాన్ని నాయనా! ఇవన్నీ అడుగుతున్నందుకేమీ అనుకోకేం? ఇంతకీ నీ వంటి బుద్ధిమంతుణ్ణి చూడగానే ఏదో కోరిక పుట్టింది. నువ్వు మా అమ్మాయిని ఎప్పుడూ చూడలేదా?"

"లేదు. ఎందుకు?"

రామ్‌ప్రసాద్ నవ్వారు. "చూడు!- చూడు నాటకం!—

ఇంకా ఏమి చేస్తుందో!" తమాషాగా, ఎంతో తృప్తిగా అన్నారాయన ఆ మాటలు.

భార్య ఆ మాటలు విని ఇంకా ఉత్సాహంగా, రామం ప్రశ్నకు జవాబు చెప్పకుండా, "శశీ! ఓ శశీ! ఇటురామ్మా!" అంటూ పిల్చింది.

"ఏమిటే?" అంటూ మారాం చేస్తూ వచ్చింది శశి! "ఎంత నాజూకు; ఎంత చక్కదనం!" అనుకున్నాడు రామం మనసులో తర్వాత.

శశితోనూ ఆవిడ ఏమీ మాట్లాకుండా "ఇదుగో! నాయనా! ఇదే మా అమ్మాయి!" అంది రామంతో.

రామ్‌ప్రసాద్ గట్టిగా నవ్వుతూ అన్నాడు. "భూలోకం స్వర్గలోకంగానూ, స్వర్గలోకం భూలోకంగానూ మారట మంటే యిదే!.... సరే! అదెందుకుగానీ ... చూడ వోయ్ రామం! ప్రశ్నిస్తున్న కంఠం స్త్రీదో, పురుషుడిదో గుర్తింపలేని చిన్మయత్వంలో మునిగింది మా భార్యా త్నరం ..." ఆయన ఈ మాటలనటానికేమీ సంకోచించలేదు. చాలా సహజంగా అనేసాడు.

శశీ, రామ్‌ల చూపులు కలిశాయి. రామం తల దించేసుకున్నాడు. ఇప్పుడు తెలిసింది తనకి, ఇందాకట్నుంచీ లా పాయింట్స్‌తో తనను ఆ ముసలావిడ ఎందుకంతగా వేధించిందో— ఆ పిల్లను స్వయంగా ఎందుకు పిలిపించి తనకు చూపించిందో?— వెంటనే అతని దృష్టిపథంలో మాలతి దృగ్గోచరమైంది. వ్యాకులపాటుతో భోజనం ముగించి, తనకోసం నిర్ణయింపబడ్డ గదిలోకెళ్ళిపోయాడు. మామయ్యను తానొకప్పుడు వెళ్ళి భార్యా భిక్ష కోరి, అతనిచేత తిరస్కరింపబడ్డా, అతనికి ఆశపోలేదు........ "మామయ్య మాలతిని తన కివ్వనన్నాడు. కోపంతోకాదు. తన కుటుంబం ఒకవేళ తండ్రి అభిప్రాయభేదంతో బయట పడాల్సి వస్తుందేమోనన్న దూరాలోచనతో అన్నాడామాట. కాని ఇప్పుడు అతని తండ్రి లేడు. కాబట్టి తన నడ్డగించే వాళ్లు లేకపోవచ్చు!! లేరు!! అందువల్ల తను మాలతిని చేసుకుంటేనే? మళ్ళీ మామయ్యనెలా అడగాలో అర్థం కాలేదు. అందులో కోపంగాకూడా మాట్లాడి వచ్చాడా యను!.... ఒకప్పుడు బెట్టుసరితన మన్నది లేకుండా "మాలతిని నాకియ్యి" అనిఅడిగి, అతనిచేత మంచిగానో, చెడ్డగానో, ఎట్లాగైతేనేం? "ఇవ్వను" అని అనిపించుకుని, ఇప్పుడు మళ్ళీపోయి అడిగితే ఏమనుకుంటాడు? ఒకవేళ అతనే స్వయంగా రాస్తే అప్పుడు మాలతిని చేసుకోవచ్చు" ననుకున్నాడు రామం. "కానీ శశినెందుకు చేసుకోకూడదు?" — అయాచితంగా లభిస్తున్న ఈ మ్రాని పండును త్రోసిపుచ్చగల సాహసంగానీ, త్యాగంగానీ అతనిలోలేదు. ధనంలోగానీ, అందంలోగానీ శశేపై చెయ్యి!! మరి గుణంలో ఏమో? అదీతెలుసుకోగల అవకాశం అతనికిలేదు. — అయినా అదీమంచిదేఅయి ఉంటుందనుకున్నాడు. "రామ్‌ప్రసాద్‌గారి ఉదారగుణాల్లో ఏకొంచెమైనా ఆమెకు సంక్రమించి ఉండకూడదా?" అనుకున్నాడు రామం. — కానీ ఈసారిమాత్రం బెట్టుగా ప్రవర్తించాలనుకున్నాడు.

తెల్లవారుఝామున తోటలో మొక్కల్ని జాగ్రత్తగా పరిశీలిస్తూ రామ్‌ప్రసాద్‌గారు కన్పించారు. రామానికి నిద్ర లేచేసరికి.

రామం బద్ధకంగా మళ్ళీకళ్ళుమూసాడు. రామ్‌ప్రసాద్‌గారు రామాన్నిచూసి "ఇంకా బద్ధకం తీరలేదటోయ్!" అన్నారు నవ్వుతూ. రామం ఒళ్ళువిరుస్తూ లేచి కూర్చుని నవ్వి "ఏదో! ఇంకాతెల్లవారలేదుగదా! అని" అన్నాడు. రామ్‌ప్రసాద్ నొచ్చుకుంటూ "అరె! లేచావేం? పడుకో. పడుకో" అన్నారు.

రామం లేచాడు. ఆయనతోపాటు తోటలో తిరగటం మొదలుపెట్టాడు. మాటల్లో ఆయన అన్నారు. "శశిని నీకిద్దామని అనుకుంటున్నాం రామ్!"

"నాకా?—" అన్నాడు రామం.

"అవును. ఏం? అయితే ఇల్లరికానికి రాగలవా?" అన్నాడాయన.

"ఉహు?— అయినా ............"

"నువ్వు మిగతావిషయాలకేమీ చింతించవద్దు. ఉద్యోగంమానితే ఎట్లా అని ఆలోచిస్తున్నావా?— బి. యల్, చదివి నాతోపాటు ప్రాక్టీసుపెడుదువుగాని."

"మాపరిస్థితులు మీకుతెలుసు నన్ను ........"

"సరే!— కాని సందేహనివారణ కాకముందే వదిలి పెట్టటం నాకిష్టంలేదు. ఇల్లరికానికి ఒచ్చినా అల్లుళ్ళు బుద్ధిమంతులై నీలా ఉంటారని నాకాశలేదు. అందుకే ఇంతగా అడుగుతున్నాను. ........ నువ్వు మళ్ళీచదువుప్రారంభిస్తే

౬

మాటల సందర్భంలో, ఒకనాడు కమల బాధ్యతాయు తంగా, రామం వివాహాన్ని గూర్చి అతనికి సూచించింది.

రామం అన్నాడు ఏదో మర్చిపోయినట్లుగా. "ఆ.... రామ్‌ప్రసాద్‌గారు నన్ను ఒక విషయాన్ని గూర్చి రాయ మన్నారు. నీతో కూడా సంప్రదించి రాస్తానన్నాను. ఆయనకొక కూతురుంది— ఇల్లరికానికి పోవాలిట మరి!"

"ఓహో! నీ కిస్తామన్నారా? మరి మాలతి?"

రామం కొంచెం బాధగా పూర్వం జరిగినదాన్నంతా చెప్పి అన్నాడు. "మళ్ళీ పోయి ఎట్లా అడగాలో నాకు అర్థం కావటంలేదు. మరి మామయ్యేమో మళ్ళీ దాని ప్రసకి తీసుకురాలేదు. అటువంటప్పుడు మళ్ళీ మన మడి గితే లేకితనంగా ఉంటుందేమో?—"

"అవును...." అని దీర్ఘంగా నిట్టూర్చింది కమల. "శాంత ఉత్తరం రాసింది. మెట్రిక్ పాసైందిట. ఈ సంవత్సరంతో అతని చదువు పూర్తవుతుంది. ఆ తర్వాత భార్యతో పాటు ఇంగ్లండు ప్రయాణానికి సిద్ధమవుతాడుట." అంది.

"అహ....ఏం? నీ అభిప్రాయం చెప్పుమరి! — ఆయనకేమీ రాయక పోతే ఏమన్నా అనుకోడు?"

"నీ యిష్టం రామం. చెసుకుందేది నువ్వు కానీ. నేను కాదుగా. మరి నీ యిష్టమేమిటో?" అంది ఒళ్ళో పసి పాపను ఆడిస్తూ.

"ఇది మంచి సంబంధం అవునా కాదా? పోనీ నువ్వు అదైనా చెప్పకూడదూ?" అన్నాడు రామం జాలిగా.

"నేను నిజంగా మనస్ఫూర్తిగానే చెప్తున్నాను రామం! నువ్వు ఇల్లరికానికి వెళ్ళటానికి బాధ పడుతున్నావా?— మే మేమీ ఆర్థికంగా బాధ పడము. ఎట్లాగో సరిపుచ్చ గలను ఇంటి అద్దెతో......."

"ఆ, చెప్పటం మర్చిపోయాను. ఆర్థికంగా మనకేమీ బాధ ఉండదు. కట్నం ఐదు వేలిస్తానన్నాడు. అది మీరు వాడుకుంటూ ఉంటే, నేను బి. యల్. చదివి ఆయనతో కలిసి ప్రాక్టీస్ చేస్తూ నీకు కావసిన డబ్బు పంపుతూ ఉంటాను.... ఇంక సూర్య ప్రకాశ్‌తో మన మేమాత్రమూ తీసిపోము కూడా!"అన్నాడు.

"అవును...." అంది కమల. అతనికిప్పుడు హోదా మీదికి దృష్టి పోతోందని తెలుసుకున్నది కమల. తుచ్ఛ మైన బాహ్యాడంబరాల కోసం లాయరు కూతుర్ని వరించ బోతున్న రామాన్ని చూసి కమల లోలోపల అతని నీచ దౌర్బల్యానికి అసహ్యించుకున్నది. అటువంటప్పుడు శంకరయ్య రెండోపెళ్ళి చేసుకొన్నంత మాత్రాన అతన్ని గడ్డిపోచకన్నా హీనం చేసి మాట్లాడిన వాడు— అసహా యుడు— రామం ఏ విధంగానూ శంకరయ్య వంటి నివురుగప్పిన నిప్పుకణికను విమర్శించటానికి తగడని నిర్ణయంచేసింది. మాలతి సౌహార్ద్రత ఆమెకు తెలుసు. అలాటి ఆమె జగ జగాల్లో, యుగ యుగాల్లో, ఏసముద్రగ ర్భాన్ని చీల్చి వెదకినా లభిస్తుందా? అని కమల అభిప్రాయ పడింది మాలతిని గూర్చి— సరే! రామానికి వచ్చే పాడు కోపానికి తానే బాధ్యురాలవటం ఎందుకు?— అని ఆమె అతని యిష్టాను సారమే కానిమ్మన్నది. కాని ఒక పక్క చేతులో నాలుగు వేళ్ళు నిలవలేక, కేవలం బానిసత్వపు పదవిలో, వంద గలగలమనే గాజు రాళ్ళను జేబులో వేసు కొని ఆకాశ శిఖరాన్నందుకొన్నట్లు ఆనందంగా వచ్చే రామం మేనమామ ముందు గతేమిటి? తమ వంశంలో పెళ్ళి కాని పిల్లలుంటే తమ సంఘం సహిస్తుందా? వెలివెయ్యట మన్నది లేకపోయినా అంత జరిగినట్లు విమర్శిస్తారు. అందుకేగా కమల ఈ రెండోపెళ్ళి వాడి ప్రాపున పడి సుమారు రెండు సంవత్సరాల్లోకే వైధవ్యానికి గురి అయింది!!— దీర్ఘంగా, బాధగా నిట్టూర్చింది కమల!— కమల దృష్టిపథంలో మాలతి సాక్షాత్కరించింది. ఒక నాడు రామం మాలతిని అండగా ఉంచుకుని, ఆమె పేద రాలు కాబట్టి, తనామెను కట్నం లేకుండా పెళ్ళి చేసుకుని, "ఒక పేద యువతిని కన్నె చెరనుంచి తప్పించాడు" అని పేరు పొందటం కోసం ఆత్రపడి అసహ్యంగా మాలతిని కోరాడు. కాని.... ఈ నాడు తన అభ్యుదయం కోసం, స్వార్థం కోసం, తన భోగాలకోసం లాయర్ కూతుర్ని చేసుకోటానికి యిష్టపడుతున్నాడన్న అతని భావం తెలియగానే కమల హృదయం జుగుప్సా భరిత మైపోయింది.

"ఏం? మరి నీ అభిప్రాయం సరిగా చెప్పు! మెడ్రాస్‌కి తీసికెళ్ళి ఆ అమ్మాయిని కూడా చూపిస్తాను" అన్నాడు రామం.

"పిన్నీ!" అనైనా పిలవలేదు! కమల అంతా

మనసులోనే దాచుకుని ప్రేమపూరితంగా అన్నది. "కాదు బాబూ! నీకు నచ్చితే నాకు నచ్చినట్లే! నీకు చెప్పించుకో వాల్సిన వయస్సు కాదు. నాకు తెలుసు. మంచి చెడ్డల్ని నీ విషయంలో నువ్వే నిర్ణయించావు. అవన్నీ నాకు బాగానే ఉన్నాయి. మరి యింక నీ హృదయపూర్వకమైన అంగీకారమే కావలసింది! నువ్వు సుఖంగా ఉండాలని ఆశీర్వదిస్తున్నాను."

రామ్ కృతజ్ఞతాభావం ఉట్టిపడ్తున్న కళ్ళతో ఆమెవైపు దృష్టి సారించాడు.

"ఉత్తరం రాయమన్నావా?" అన్నాడు మళ్ళీ.

"ఉహూ ఇప్పుడువద్దు. ఆయనే "నామాటనేంచేశావు?" అనో, ఏదోరాస్తే అప్పుడురాద్దుగానివి - అంతవరకూ నువ్వేమీ రాయవద్దు" అంది కమల పసిపిల్లను భుజంమీద పడుకో బెట్టుకుంటూ.

రామానికి ఆమెసలహా చక్కగాతోచింది -ఆనందంగా అందుకంగీకరించాడు.

౭

"ఏమిటండీ! మీరుమరీ అలాఅయిపోతారేం? అసలు ఆడపిల్లలకు పెళ్ళి కావటమంటే ఎంతకష్టం?"

"మళ్ళీరామానికే రాస్తాను" అన్నాడు నిస్పృహగా మామయ్య.

"ఛ. ఒద్దు. మొదట మనం మనచేతులార పాడుచేసుకున్నాం .... అతనంతట అతనొచ్చి అడిగితే ఇవ్వలేదుగానీ, ఇప్పుడు మనమిస్తామంటే ఒప్పుకుంటాడా? ఆత్మాభిమానమన్నా ఉండద్దూ? .... అయినా మనదీ తప్పేలెండి. మన్నుద్ధరించటానికొచ్చిన వాళ్ళని కూడా తిరస్కరించి పంపేశాం .... ఈవిషయంమీద అతనికి మనమీద కోపం కల్గిఉండవచ్చు" అంది అత్తయ్య.

పాపం! రామంయొక్క దౌర్బల్యాన్నికూడా మంచిగానే అర్థంచేసుకున్నారు వాళ్ళు. లోకంలో ఇలాటి అమాయకులెంతమంది ఉంటారు? అందుకే పెద్దలన్నారు. "తోటిమనిషిలోని మంచిని గ్రహించటమే మనలోని మంచి" అని .... అయినా దీన్ని పాటించేవాళ్ళూ ఎక్కువమందిలేరు! ఆతక్కువమంది దీన్ని క్రమంగా పాటించలేరు. అయినా ఇది స్వతహాగా మనిషికిరావలసిన ఒక గుణం. అలవాటు చేసుకుంటే అలవడుతుకొన్నవాళ్ళు చాలా తక్కువమంది. ....

"అప్పుడు నేను ఏదురభిప్రాయంతోనూ ఇవ్వననలేదు. మనవల్ల వాళ్ళు వేర్పడాల్సివస్తే?" అన్నాడు మామయ్య.

"సరే మీయిష్టం రాసి ప్రయత్నించండి" అంది అత్తయ్య శాంతంగా.

ఇంట్లో లోలోపల ఎంత గాలిదుమారం రేగుతున్నా ఏమీజరుగనట్లు ప్రశాంతంగా జీవనంచేయగల్గే మహత్తర శక్తి అత్తయ్యలోకెవరు ప్రవేశపెట్టారు? - అదే వారి జీవితంలో తృప్తి. కష్టించి సంపాదించాలన్న దిగులూలేదు. మాలతి భారం తాము మోయలేమన్న భయమూలేదు వారికి. కాని మాలతి, తనపట్ల తల్లిదండ్రులు తమబాధ్యతను సరిగా గుర్తించలేదని అనుకుంటుందేమోనని వారిబెంగ!! ప్రపంచంలో వారు ఏదైనాసహించగలరు. కాని తమబిడ్డ తమ నపార్థం చేసుకునే సమయం వచ్చిందంటే మాత్రం వాళ్ళు క్రుంగిపోతారు. ఇదినిజం!!

ఆనాడు రామానికి ఉత్తరం రాయాలని కూర్చున్నాడు మామయ్య. — "నిష్కాముడివైన నువ్వు నాదగ్గర్నుంచి ధనాన్నేమాత్రమూ ఆశించలేదు. కానీ ఆనాడు నువ్వు...." రాస్తున్నాడు. వాకిట్లో "పోష్టు" అన్నకేక విన్పించింది. తొట్రుపాటుతో లేచి దాన్ని తీసుకున్నాడాయన. బుక్ పోస్ట్! రామం పెళ్ళిశుభలేఖ! మెడ్రాస్‌లో ప్రసిద్ధుడైన ఒకలాయర్ కూతురు! మామయ్యకు తలగిఱ్ఱున తిరిగింది. "నువ్వు నిష్కాముడివి ...." అని తను రాస్తున్న ఉత్తరంలోని ఆమాటనుచూసి, ఆగదిలోని గోడసైతం తనను పరిహసిస్తున్నట్లు భావించాడు, "నిష్కాముడు! అహాహ్హాహ్హా" వికటాట్టహాసం చేస్తూ ఏదో అశరీర వాణి అతి నిర్లక్ష్యంగా అతన్నిదూసుకు పోయినట్లు, అతని సర్వశక్తులూ వశం తప్పిపోతాయా అనిపించిందాక్షణాన.

కల్లాకపటం తెలియని మేనమామ నిలువునా నీరయ్యాడు. ఎవరితోనూ చెప్పనైనాలేదే? - మేనమామ అని తనతో ముందుగా ఏమాటాచెప్పలేదే? - ఇట్లాకూడా జరుగుతుందా? రామం ఆనాడు అంతగా ఫీలౌతూ, తను మాలతినే చేసుకుంటాననీ, తనతండ్రి యిష్టా యిష్టాలతో తనకుపనిలేదనీ చెప్పిన ఆమాటలకర్థం? కేవలం తన ప్రమాణం అబద్ధంలేదనీ, తను అమాయకంగా ఒచ్చి అడిగినా మామయ్య తనకు మాలతి నివ్వటాని కొప్పుకోలేదనీ అంతా అనుకోటానికేనా? తనమీద తప్పురుద్ది తాను ఈగురుతర బాధ్యతనుంచి విముక్తి పొందటానికేనా? - లోకులకేంతెలుస్తుంది? తను రామానికి మాలతిని యివ్వక

[తరువాయి 37-వ పేజీలో]

# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

శ్రీమతి కె. యమ్. సౌందర్యవల్లి

## కీర్తన—17

రాగం సరస్వతి — రూపక తాళం.

ప॥ నవరసయుత భావముతో, నవనవ కీర్తనములతో
స్తవముసేయు త్యాగరాజుని, సన్నుతింపవే, మనసా ॥సన్ను॥

అ॥ రవికులభవుడగు రాముని, భవజలధి తరించుటకై ॥నవ॥

చ॥ కవిమానవ తతిచేసిన, కలుషంబులడంపగా
లలితమగు సునాదసుధచే, సులభమార్గము జూపగోరి ॥నవ॥

| 0-2 | 1-4 | 0-2 | 1-4 |
|---|---|---|---|
| ప॥ : ద స | నీ దా పా పా | పా ప మ | రీ మా పా ; |
| న ర | ర స యు త | భా . . | వ ము తో |
| ; రి మ | పా దా సా ; | సా సా | దా నీ ద ప మా |
| న వ | న వ కీ | ర్త న | ము ల తో . . |
| ; ద స | రీ దా సా రీ | సా ; | దా నీ ద పా మ |
| స్త వ | ము సే . యు | త్యా | గ రా జు ని . |
| ; సీ | దా పా రీ మా | పా ; | ; దా నీ ద ప |
| స | న్నుతిం ప | వే | మ న సా , |
| మ , నీ | దా పా రీ మా | పా ; | ; ; ; ; |
| . స | న్నుతిం ప | వే ; | ; ; ; ; |
| అ॥ప॥ ; ప ద | సా సా రీ రీ | సా సా | సా ద నీ ద ద ప |
| ర వి | కు ల భ వు | డ గు | రా . ము ని . . |
| మ, ప ద | సా సా రీ ప మ | రి స సా | ద నీ ద ప మా , |
| . ర వి | కు ల భ వు | డ గు రా | . ము ని . . |
| ; ద రి | సా సా నీ దా | ప ద సా | ద రి స నీ ద ప ; |
| భ వ | జ ల ధి త | రిం . | చు ట . . కై . . |
| మ ప (దస) | | | |
| . . (నవ) | | | |
| చ॥ ; ద స | నీ ; దా దా | దా దా | దా ; నీ దా |
| క వి | మా న వ | త తి | చే సి న |
| ; ని ద | పా మ/ రీ, మ | పా ; | ద స నీ, దా , |
| క లు | షం . బు ల | డం | ప . గా . |

అ. ప. వలె
లలితమగు సునాదసుధచే
సులభ మార్గము జూపగోరి ॥నవ॥

# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తన

## కీర్తన—18

రాగం భైరవి— ఆదితాళం.

ఆ. సరిగమపదనిస —— అ. సనిదపమగరిస

ప॥ గానసుధా రస పానము చేసిన
మానిత గుణధుర్యా, త్యాగవర్యా ॥గాన॥

అ॥ జానకీ నాధుని చరణకమలముల
మానస పథమున మానక నిల్పగా ॥గాన॥

చ॥ పలుకులు హరిగుణ పఠన కీర్తనలంద
తలపులు శ్రీరఘూద్వహుని కథలయంద
వలపులు ధరణీ జావరుని సేవలయంద
నిలిపి శుభములంద, నేర్చిన బుధవంద్య ॥గాన॥

| 0-2 | 1-4 | 1-4 |
|---|---|---|
| ప॥ ; ద నీ స సా స ని రి స ని ద దా | పా దా నీ ద ప | ప ప మ గ రీ సా |
| గా . న సు ధా . . . . ర . | స పా . న ము | చే . . . సి న |
| ; రి గ మా మా; పా పా ద మ | పా ; పా ; | మ ప ద ని ద నీ, |
| మా. ని త గు ణ ధు . | ర్యా; త్యా | గ వ . ర్యా . . |
| ; స రి గ రీ రీ రి స ని దా పా | ; రి నీ ద పా | మ ప ద ప ప మ గా రీ |
| . గా . న సు ధా. . . ర స | పా . న ము | చే- - - - - - సి |
| సా, రి గ మ మా ; పా పా ద మ | పా ; ; ; | ; ; ; ; |
| న మా . ని త గు ణ ధు | - ర్య ; ; ; | ; ; ; ; |
| అ॥ప॥ ; ప మా ప దా దా నీ సా సా | ; రి మ గ రి స స | స ని రి స ని ద |
| జా . న కీ నా . ధు ని | చ . ర . ణ క | మ - ల - - ముల |
| ; దా ని స సా స ని రి స ని ద పా | ; దా నీ ద ప | ప ద ద ప మ ప ద ని॥ |
| మా . న స ప . ద . . మున | మా . న క | ని - - - - ల్ప గా - |
| ; స రీ గ రీ | | |
| (గా. న సు) | | |
| చ॥ ; దా నీ దా. పా ద ప ద మ ప ద | నీ దా ని స సా | ప నీ రి స ని దా |
| ప లు కు లు హ రి . గు ణ | . ప ఠ న కీ | ర్త న లం. . దా |
| పా, ద నీ దా పా ప ప మ గ రీ | సా రి గా మ. మా | ప పా ద, నీ ద |
| . త ల పు లు శ్రీ . . . ర | ఘూ ద్వ హు ని క | ధ ల యం . ద |
| పా, | | |

అ. ప. వలె

వలపులు ధరణీ జావరుని సేవలయంద
నిలిపి శుభములంద నేర్చిన బుధవంద్య ॥గాన॥




# అమృతాంజనము

గాని,

" యధాయధా..................కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగు
చున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే
నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

పెద్ద కథ

# అనుమానం

శ్రీమతి జి. లక్ష్మీరాజ్యం

"ఇంత ప్రొద్దు కూకేదాక ఎక్కడ మంత్రాంగం చేస్తున్నావ్?"

"మంత్రాంగం ఏమిటండీ... మరీను! ప్రక్కింటి పార్వతమ్మగారింట్లో మంగళవారం నోమంటే పేరంటానికి వెళ్ళాను. ముత్తయిదువులు రావటం కొంచెం ఆలస్యమయింది..."

"నోర్ముయ్యి! పేరంటానికి వెళ్ళావా? పెద్దగంగలో స్నానానికి వెళ్ళావా!... వాళ్లింటికి వెళ్ళవద్దని మొన్ననేగా చెప్పాను. వాళ్ళ గుమాస్తా మాధవరావు మంచివెధవ కాదని, వాళ్ళింట ఛాయలకేపోవద్దని చెప్తున్నా నా... ఆవెధవ ఎనిమిదింటిదాక అక్కడే పడి కొంగచూపులు చూస్తూ కూర్చుంటాడు. అప్రతిష్ట తెస్తావాయేమె...?"

"నేను రాననే చెప్పానండీ. ఇంటిల్లిపాదీవచ్చి బ్రతిమాలి బామాలి తీసుకుపోయారు... ఇక వెళ్ళనులెండి. అన్నంలోకి ఏమిచెయ్యమన్నారు?"

"ఏదో తగలెయ్యి- నాకాకలిలేదు"

"ఈమాత్రం దానికి అంతగా యిదవుతారెందుకండి? వాళ్ళ కుటుంబం అటువంటిది కాదండి. ఆ గుమాస్తాతో మనకెందుకు?"

"ఆఁ! నీకు తెలిసేడుస్తు. నా బొంద- నీకామాత్రం తెలివితేటలుంటే నాకీమనస్సులో బాధ ఎందుకు. నీది చవిటి బుర్రకాబట్టే నా యీ గోల. ఆ కూతుర్కి ఇంకా పెళ్ళి పెటాకులు లేవు. ఆ కోడల్ని నానా అల్లరి పెట్టారు ఇంట్లో. కూతురొకజాణ. అది గేటుదగ్గరేగాని ఇంట్లో నుంచోదు. పెళ్ళయినా, కాపరంచేసే ఘటంగాలేదు..."

"ఆ గొడవంతా మనకెందుకులెండి- స్నానం చెయ్యండి. చిన్నవాటికి కూడ తీవ్రంగా వ్యాకులపడటం ఎందుకు?"

ఈ సంభాషణయ్యాక అన్నం దగ్గర కూర్చున్నాడన్న మాటేగాని సుందరాన్కి ముద్ద సరిగా పోనేపోలేదు.

మామూలుగా పది గంటలకే నిద్రపోయేవాడు. పన్నెండయినా కునుకే రాలేదు సుందరానికి. బుర్ర అంతా వేడెక్కి పోతోంది ఆలోచనలతో. ఆలోచనే వద్దని ఎన్నిమార్లు అనుకున్నా పరుగు పరుగుతో మరి నాలుగు ఉపఆలోచన్లని వెంటబెట్టుకు వస్తున్నాయి. ఎంత ఆలోచించినా, ఎంతగా న్యాయాపరిశీలన చేసినా, ఎన్ని ప్రశ్నలు వేసుకొని జవాబులు చెప్పుకున్నా, ఎటువంటి సంఘటనలు గుర్తుతెచ్చుకున్నా, తన భార్య వనజ ఎటువంటిదో తేలలేదు. 'అమాయకురాలా, లోకం సంగతి బాగా తెలిసిందేనా, వేరే అభిరుచులున్నాయా, తాను చెప్పింది ఒప్పుకుందే- ఇక వాళ్ళింట్కి వెళ్ళనందే- తనంటే ఎంత ప్రేమగావుంటుంది! సమస్తమైన సౌఖ్యాలని చేకూరుస్తుందే- చక్కగా అలంకరించుకొని నవ్వుతూ లక్ష్మీదేవిలా పల్కరిస్తుందే తను వచ్చేటప్పటికి. తాను నిద్రపోయేవరకు పాదసేవ కూడా చేస్తుందే- ఇంట్లో వున్నంతసేపు కిలకిలా నవ్వుతో ఆనందాన్ని మూర్తీభవింపజేస్తుందే. తానేమంత అందగాడని అంత ప్రేమ కనుపరుస్తుంది? ముఖం నలుపు, నుదురుమీద పెద్ద మచ్చ- నోరు సిగరెట్టుకంపు- కాని వీటిని ఏమాత్రం గుర్తించినట్లుండవే- ఎందుకీ అనుమానం అన్యాయంగా. రెండేండ్లన్నా కాపురం చెయ్యకముందే అలాంటి బుద్ధులు పుట్టాయా? ఛా- పాడు అనుమానం- వనజ సాత్వికురాలు- ధార్మికురాలు- అమాయకురాలు- ఇదేం ఆలోచన? ఆఫీసులో వచ్చే నిద్ర ఇప్పుడు రాకూడదూ' అని ఎవ్వో భావాలు పరుగెత్తుతున్నాయి సుందరం మనస్సులో. ఎంత ప్రయత్నించినా కళ్ళు మూతపడటం లేదు- ఆలోచన్లు యింకా తిరుగు ముఖం పట్టలేదు.

'ప్రక్కింటి ప్లీడరు ధర్మారావుగారి గుమాస్తా మాధవరావు వొత్తి పోకిరీ, వెధవ పోకూ వీడూను. అయినా వాడిని అనటం ఎందుకు? దేవుడు అందం ఇచ్చాడు. ఇస్తే మటుకు ఇంత అదిరిపాటా? లాల్చీలు, నల్లద్దాల కళ్ళజోడు, పెద్ద యాక్టరు మాదిరి తయారవ్వుతాడు. ఎంత నికారుసైన ఆడదైనా కనీసం రెండుసార్లయినా వాడిని చూసి తీరుతుంది కంటబడితే. వాడి వేషం, వాడి చూపూ చూస్తుంటే ఆడవాళ్ళంటే వెంటబడే ముఖం లాగానేవుంది. అందుకనే వనజను వాళ్ళింటికి తరచు పోవద్దంటాను. నేనంటమే గాని వనజ అడపా దడపా వెళ్తూనేవుంటుంది. వనజ మాత్రం ఆడదికాదా? కళ్ళు లేవా? అందులో అందంగల వాడిని చూడాలని ఆశకూడ ఒకమూల వుండొచ్చు... వాడు మట్టుకు కొట్టుకు గాడిదలాగా కట్టు మోసుకుపోతూ మా వంటయింట్లో వరకు గ్రద్దమాదిరి చూపు సారిస్తూ పోతాడు. మొన్న పిలిచి వ్యంగంగా నాలుగు రాల్దిద్దామనుకున్నా - కాకపోయినా వాడిని అనడం దేనికి? దీనికి బుద్ధివక్రత పొందకుండావుంటే బాగానే వుంటుంది. వాళ్ళ గడప త్రొక్కవద్దంటే వింటేనా? పేరంటం, గీరంటం. ఏదో వంక, ఆ వెధవనిచూసి ముసి ముసి నవ్వులు నవ్వేందుకు. ఏమైనా వనజలో కూడ కొంత వుండొచ్చు. అందుకనే కాబోలు నన్ను మభ్యపెట్టటానికి సినిమాలో యాక్టు చేస్తున్నట్లు నామీద ప్రేమ వలకపోస్తుంది. గడుసు బుర్ర వనజ. నిన్న మట్టుకు నిన్న నాకు అన్నం కంచంలో బెట్టి గోడ దగ్గర కబుర్లకి పోయింది. బహుశః ఆవెధవే వచ్చి వుంటాడు అక్కడికి. 'నెయ్యి నెయ్యి' అని అరిస్తే అప్పుడొచ్చి 'పిన్నిగారు పిలిస్తే మాట్లాడుతున్నా' అని సర్ది చెప్పింది. పిన్నిగారా — పిడకగారా నిజం నిలకడమీద తెలియకపోతుందా !... నా గౌరవాన్ని గోతిపాలు చేస్తుందా ఇది. నా ప్రాణం వుండగా సహించను. నిజంగా మా ఆరుకొలనుల్లో మా వంశం అంటే ఎంతో యిదవుతారు వూరంతా. వనజని ఇప్పుడే అదుపాజ్ఞల్లో పెట్టాలి. లేకపోతే వంశనాశనం... చూద్దాం. కచ్చితంగా ఏవిషయం తెలుసుకోకుండా ఎందుకు ఈ అనుమానం?'

గోడ గడియారం ఒంటి గంట కొట్టింది. సుందరం ఇంక ఆలోచించలేకపోయాడు. క్రమక్రమంగా నిద్ర ఆవహించింది.

తర్వాత మంగళవారంనాడు ఏదో సాకుచెప్పి పేరంటానికి వెళ్ళలేదు వనజ. ఆపైది ఆఖరువారం. మామూలుగా పిలిచి వెళ్ళారు. మళ్ళా మధ్యాహ్నం కబుర్లు చెప్పుకునేందుకు వచ్చిన పార్వతమ్మ, కూతురు చాల యిదిగా చెప్పారు. కోడలు చాలా ప్రాధేయపడింది "ఆఖరువారం కూడా రారా" అని. రాకపోయేందుకు కారణం నిజం చెప్పితే వూరూ వాడా పాక్కిపోతుంది. పేరంటం మానితే పొరుగు పొత్తు పోతుంది. వీలు చూసుకుని వస్తానని ఒప్పుకుంది.

సుందరం బి. ఏ. ప్యాసయినా కొన్ని విషయాల్లో మూర్ఖపు పట్టు గలవాడు. అందులో భార్యమీద అనుమానం తగిలితే మగవాడు మహిషం అయిపోతాడు ఆ ఉద్రేకంలో. వనజకు రెండు విధాల పెద్ద చిక్కొచ్చింది. అయిదుగంటలు దాటితేగాని భర్త యింటికి రాడనే ధైర్యంతో నాలుగు గంటలకి వెళ్ళి వెంటనే వాయనం పుచ్చుకొని వచ్చేద్దామని నిశ్చయం చేసుకుంది వనజ.

ఆఫీసుకు వెళ్ళాడేగాని సుందరం మనస్సంతా ఇంటి దగ్గరే వుంది. తన భార్య పార్వతమ్మగారింటికి వెళ్తుందేమో ఆవెధవని చూసేందుకనే అనుమానం లోపల బాధపెట్తోంది. అయినా చూద్దాం అని నాలుగు గంటలకే పర్మిషన్ తీసుకొని ఇంటి ముఖం పట్టాడు సుందరం. అనుమానం చెవులో దూరిన ఈగలాంటిది.

అప్పుడే ఇల్లు తాళం వేసి వనజ పేరంటానికి వెళ్ళింది. ఇంటికి వచ్చి తాళం వేసి ఉండటం చూసాడు సుందరం. ఉగ్రమూర్తి అయ్యాడు. వనజ మీద ప్రళయకోపం వచ్చింది. తన దగ్గర రెండో తాళపు చెవి ఉన్నప్పటికీ తాను వచ్చినట్లు తెలియచెయ్యాలనిన్నీ, అక్కడ ఆ మాధవరావు వున్నాడేమో చూద్దామని పార్వతమ్మగారింటికి వెళ్ళాడు చకచకా సుందరం. వసార్లోనుంచి పార్వతమ్మ కూతురు గౌరి చక్కగా సింగారించుకొని "ఏం మామయ్యగారూ, ఎప్పుడూ లేంది ఇలా వచ్చారు. అత్తయ్యగారి కోసమా? కాసేపు ముత్తయిదువులతో సరదాగా కూర్చోకూడదా?" అని నవ్వుతూ అంటుంటే సుందరాన్కి కోపం శాంతించి, తాపం ఉపశమించింది. గౌరి వంటరిగా వుంటే ఎన్నో మాటలు మాట్లాడాలనిపించింది సుందరాన్కి. ఇంతలోకి మూలగా వ్రాసుకుంటున్న మాధవరావు లేచివచ్చి "ఇలా

కుర్చీలో కూర్చోండి" అన్నాడు సవినయంగానే. కాని సుందరాన్కి వళ్ళు మండింది. దాంతో మళ్ళా వనజమీద కోపం పేట్రేగింది. 'మీ అత్తయ్యని తాళపు చెవి ఇవ్వ మను' అన్నాడు గౌరితో. తాళపు చెవి తెచ్చి యిచ్చింది. వెంటనే ఇంటికి వెళ్ళిపోయాడు. డ్రస్సు మార్చుకొని వచ్చి తాళపు చెవి మళ్ళా గౌరికే ఇచ్చి వెళ్ళాడు చాలా కోపంగా.

తాను చేసింది భర్త చెప్పిందాన్కి వ్యతిరేకంగావున్నా తప్పుమాత్రం కాదని వనజకు బాగా తెలుసు. పేరంటం అయ్యాక ఇంటికి వచ్చి వంటవండి భర్తకోసం నిరీక్షిస్తోంది. తనమీద సుందరాన్కి ఎందుకో అంత అనుమానం అని వనజకు సందేహం. ఆఫీసునుంచి పెందలకడే రావటంకూడా సి. ఐ. డీ. ఉద్యోగానికే అని వనజకు తెలుసు. ఇటువంటి నిమ్న మనస్తత్వం చూసి వనజ చాలా అసహ్యించుకుంది. దీనిని బట్టి సుందరం మనస్సులోనే అటువంటి చెడ్డభావాలు న్నాయేమోనని వనజ అనుకుంటుంది. తన ఆఫీసు తాళపు చెవుల రింగులో ఇంటి తాళపు చెవి వున్నప్పటికీ పార్వతమ్మ గారింటికి ఎందుకు రావాలి భర్త? వచ్చి గౌరితో బాతాఖానీ ఎందుక్కి? తన్నే పిలవమనకూడదా? పోని మళ్ళా ముస్తాబయి రావటమే పైగా తన మీద అనుమాన పడటం ఎందుకు? అనవసరంగా— ఇలా ఏవేవో ఆలోచించుకుంటూ కూర్చుంది వనజ. ఆ ఆలోచనలతోనే కునుకువచ్చింది. గడపమీద తల పెట్టుకొని పడుకుంది.

రాత్రి పదిన్నరయాక తిరిగి వచ్చాడు సుందరం. సుందరం కాళ్ళు త్రిప్పటకన్న బుర్రలో ఆలోచనల త్రిప్పట ఎక్కువగావుంది. వనజ తలుపు తీసింది. ఇద్దరికి ఒకరిమీద ఒకరికి ఎక్కువ కోపంగా నేవుంది. ఇద్దరు కాసేపు మౌనంగా వున్నారు.

వనజే ధైర్యంతో "ఇంత ప్రొద్దుపోయాదాకా ఎక్కడున్నారు?" అని ప్రశ్నించింది లోలోపల కోపంతో. ఈ ప్రశ్న అగ్గిమీద గుగ్గిలం మాదిరి అయింది సుందరాన్కి. వెంటనే "నోర్ముయ్! సిగ్గులేక ఆడదానివి నీవు తిరగొచ్చు, ఎదురు ప్రశ్న వేస్తున్నావే సిగ్గులేక" అన్నాడు అక్కసుతో సుందరం.

వనజకు హృదయవేగం జాస్తి అయి "ఎక్కడికి పోయానవండి, అలా కసురుతారు. ప్రక్కింటికి పసుపు కుంకానికి పోయానేనా తప్పు?" అంది.

"బుద్ధిలేకపోతే సరి వంకలు" అన్నాడు.

"నాదేం వంక కాదు. నాకేంత గతేం. మీదగ్గర తాళపు చెవి వున్నా ఆవంక పెట్టుకొని మీరే వచ్చారు అక్కడికి" అని తీవ్రంగానే చెప్తోంది.

"ఛా! నువ్వంటే నువ్వంటావు. ఆ వెధవని చూసేందుకుపోయి" అన్నాడు దొంగని కనిపెట్టినవాడి మాదిరి ధైర్యంతో.

వనజ ఆత్మాభిమానం దెబ్బతింది. వెంటనే "మమ్మాటికి కాదు. ఆమాటకొస్తే ముస్తాబయి మీరేవచ్చారు ఆసింగారిని చూసేందుకు" అంది దెబ్బకు దెబ్బ యిచ్చినట్లు.

సుందరాన్కి పట్టరాని ఉక్రోషంతో చెప్పరాని కోపం వచ్చింది. తీవ్రంగా ముందుకు వెళ్ళి వనజ చెంపమీద చాచి ఒక దెబ్బ వేశాడు. వనజ గోడమీద పడింది ఏడుస్తూ. సుందరం గదిలోకి వెళ్ళిపోయాడు.

వనజ దుఃఖిస్తూ కొంతసేపు అక్కడే వుంది. వనజకు ఎప్పుడూ లేనిది ఆనాడు సుందరంమీద మొదట్లో కోపం వచ్చి ఎదిరించి జవాబు చెప్పింది. ఎదిరించటం తనదే తప్పు అనుకొని పశ్చాత్తాప పడింది. కాని లోలోన రగుల్తున్న క్రోధాగ్ని మాత్రం తనను ఏమాత్రం భర్తకు లోను చెయ్యలేదు. ఇంతకీ తన తప్పు ఏమని తనను కొట్టినట్లు? వనజకు అర్థంకాలేదు. తన ఇర్వైమూడేళ్ళ అనుభవంలోను దెబ్బ తిని ఎరగదు. ఇలా ఎన్నో ఆలోచించుకుంది. స్త్రీకి భర్త మీద త్వరగా జాలికలుగుతుంది. అది స్త్రీ హృదయం తీరు. భర్తకు అన్నం పెట్టవలసిన ధర్మం తనది. వనజ హృదయం జాలితో నిండిపోయి భర్త దగ్గరకు వెళ్ళింది. సుందరం పడుకున్న గదిలోకి వెళ్ళి నెమ్మదిగా జంకుతూ "లెండి, అన్నం తిని పడుకుందురుగాని" అన్నది వనజ.

సుందరాన్కి యీమాటలు కయ్యానికి కాలుదువ్వినట్లున్నాయి. తనకు అన్నం పెట్టేది యిదిమాత్రమేనా అనుకున్నాడు ఆ కోపావేశంలో. "నీవు మింగు పోయి. నాకేం వద్దు పాడుకూడు. పెద్ద ప్రేమ విరగబడ్డట్లు పిలుస్తున్నావ్" అని చీదరించాడు.

# అనుమానం

ఈమాటలు ఈటెల పోటుల మాదిరి గ్రుచ్చుకున్నాయి వనజకు. తన హృదయం ఓర్చుకోలేకపోయింది. తనను హింసించినా, తూలనాడినా క్రోధాన్ని గ్రుంగదీసుకువచ్చి జాలితో కోరితే పురుష హృదయం అది గ్రహించలేకపోయినందుకు వనజలోని జాలి, శాంతి మాయమయ్యాయి తాత్కాలికంగా. ప్రతీకారంగా జవాబు ఇవ్వమని హృదయం స్పందిస్తోంది. "అవును— నన్ను చాపకొట్టి మంచంమీద మహారాజులాగా శయనించే మీకుంది సామీద ప్రేమ— నిజమే రెండు మూడేళ్ళయ్ సంసారం చేస్తున్నారు పాడు కాకపోతే ఏమిటి?" అని అనేసింది.

తన పురుషత్వానికే చెంపపెట్టనిపించాయి సుందరానికి యీమాటలు. "ఛీ! అవతలకి ఫో!" అని గదిమాడు సుందరం లేచి గభాలున కూర్చొని.

ఆమె ఆత్మగౌరవం దెబ్బతింది యీమాటలికి "ఎక్కడికి పొమ్మంటారు? పొమ్మంటే పోతాను— మీరే సుఖపడండి బాగా—"

సుందరం రౌద్రమూర్తి అయ్యాడు. పట్టరాని కోపంతో లేచివచ్చి వనజను ఒక తన్ను తన్నాడు. ఆమె క్రింద పడింది. జుట్టు పీకాడు, చెంపలమీద కొట్టాడు, నెత్తిమీద మొట్టాడు, వీపుమీద గుద్దాడు. కొట్టి కొట్టి విసిగిపోయి "ఛీ! ఫో! నా మొహం చూడక" అని కసిరి గదిలోంచి నెట్టివేసి పోయి పడుకున్నాడు.

చాలాసేపు బాధతో వెక్కి వెక్కి ఏడ్చింది వనజ. ఆయింట్లో ఒక్క క్షణం వుండటం నీచమనుకుంది. అర్థంలేని అనుమానంతో కారణంలేని కలహం తెచ్చి చావ చితక బాది పొమ్మన్న తర్వాతకూడా ఎందుకు వుండటం. పుట్టిల్లు కాకినాడకు బయలు దేరింది. తన దగ్గరవున్న కొద్ది పైకం, ఒక సంచిలో కొన్ని బట్టలు తీసుకొని సరాసరి స్టేషనుకు బయలుదేరింది. ఆత్మహత్య గూర్చి వనజకు గుర్తు వచ్చినా అది చాలా చెడ్డది అనుకుంది. తనకు నెల తప్పిన మాట గుర్తుకు వచ్చి ఆ ప్రయత్నం మహాపరాధం అనుకుంది. ఎలా జరుగనున్నదో అలా అవుతుందని ధైర్యం వహించింది.

సుందరం తన భార్య ఏమయిందీ తెలుసుకోవాలనుకో లేదు. తనకు ఇంత కోపం తెప్పించి ఇంత గొడవ చేయించిన దానిని బుజ్జగించేదేమిటి అని లోలోన స్మరించుకుంటూ నిద్రపోయాడు.

* * *

విశాఖపట్నం నుంచి వనజ కాకినాడ చేరుకుంది. ఆమె రాక తల్లి శాయమ్మకీ, తండ్రి సీతాపతికీ చాలా ఆశ్చర్యం కలిగించింది. తమ్ముడు గోపాలానికి సంబరం ఎక్కువైంది. వారం క్రిందట అమ్మాయి నొకమారు పంపమని వ్రాస్తే ఇప్పుడు కాదని జవాబు వ్రాసిన సుందరం యిలా పంపాడంటే ఏదో అనుమానంగానేవుంది ఆ తలిదండ్రులికి. వనజ సర్ది చెప్పింది.

శాయమ్మ చాలా సార్లు అడిగినా చెప్పలేదు వనజ అసలు విషయం. ఎంత కాలం అలా దాచగలదు. ఒకనాడు అంతా చెప్పింది పొర్లి పొర్లి వచ్చే దుఃఖంతో. శాయమ్మ చాలా విచారించింది. సీతాపతి ఆత్మాభిమానంతో తాండవ మూర్తి అయ్యాడు సుందరంమీద.

వనజ వచ్చి అప్పుడే నెలకావస్తోంది. వాడ అంతా ఎవ్వో రహస్యాలు చెలరేగాయి. చిలవలు పలవలు అల్లి రకరకాల కథలు చెప్పుకోవటం ప్రారంభించారు అమ్మలక్కలు వనజనుగురించి.

ఈ గొడవంతా చూస్తే వనజకు చాలా విచారం కలిగింది. దానికితోడు తల్లి శాయమ్మకి ఇది చాలా చిన్నతనంగా వున్నట్లు గ్రహించింది. కాని గత్యంతరంలేదు. పైగా ఇప్పుడు మూడో నెల. తిరిగి భర్త దగ్గరకు పోతే తప్పక తృణీకరించటమేగాక నీచపరుస్తాడు నలుగురిలో.

సీతాపతికి మాత్రం వనజ అంటే పంచప్రాణాలు. స్త్రీ కాబట్టి శాయమ్మ ఇరుగు పొరుగు మాటల్లో క్రుంగిపోతోంది. సీతాపతి ఒక మాటు అల్లుడి దగ్గరకు వెళ్దామా అనుకున్నాడు. అయినా ముందుగా ఒక ఉత్తరం వ్రాశాడు. దానికి జవాబే లేదు. దానితో సీతాపతి అల్లుడిదే తప్పు అని తేల్చుకున్నాడు. శాయమ్మ భర్తతో "ఆడపిల్లని కన్న వాళ్ళం మనమే తగ్గి ఉండాలండి. ఒకమాటు విశాఖపట్నం పోయి అమ్మాయి నీళ్ళుపోసుకున్న సంగతి అవ్వీ ఇవ్వీ చెప్పి రాకూడదండీ" అన్నది.

"సిగ్గుండే మాట్లాడుతున్నావుటే— అమ్మాయి తలమీద బాదిపి చూశావా. అయినా వాడు నన్ను మాత్రం ఆదరిస్తాడని నమ్మకం ఏదీ— కాకపోయినా నాబిడ్డదేంతప్పుంట"

# అనుమానం

భర్తకు మరీ కోపం వస్తుందేమోనని జంకుతూ జంకుతూ శాయమ్మ "అదికాదండి- మనం మెదలకుండా వూరుకుంటే (నెమ్మదిగా) రెండో పెళ్ళి చేసుకుంటాడేమో" అన్నది.

నిజంగానే మండిపడ్డాడీమాటవిని. "చేసుకోనీ- నా బిడ్డ నాకు బరువా- కావలిస్తే దానిపేర అయిదెకరాలు రాసిస్తాను. బంగారంలా బ్రతుకుతుంది, పుట్టే పండువంటి కొడుకును పెట్టుకొని. అమ్మాయిచేత వ్రాయించాను, నేనూ వ్రాశాను ఉత్తరాలు- జవాబు వ్రాస్తేగా- బెల్లం కొట్టిన రాయి మాదిరి" అని గర్జించాడు శితాపతి కోపంతో. కొంచెం ఆగి "నా బిడ్డ బంగారం వంటిది. నిప్పుమాదిరి, మా తల్లిని అనుమానిస్తాడా. వీడి చదువు వ్యర్థం గాను, గేదెలను మలేనే తెలివికూడాలేదు" అని హూంకరించాడు.

శాయమ్మ మారుమాట్లాడలేదు. ప్రక్కగదిలో వుండి ఈ సంభాషణ అంతా వింటున్న వనజ మనస్సులో పెద్ద తుపాను చెలరేగింది. అనేక ఆలోచనలు దొర్లిపోయాయి. అనేక దుఃఖపాత్రల ముందున్న తెర మాదిరి వుంది ఆమె వదనం. గంభీరం ఉట్టిపడుతోంది ఆముఖ కవళికలో. వనజ ప్రస్తుతం జ్ఞానా జ్ఞానవిచక్షణ కలది. ఆత్మాభిమానం విషయంలో ముమ్మూర్తులా తండ్రినే పోలింది. తన తల్లిని కూడా మెప్పించాలని ప్రయత్నించింది, కాని తన భర్త జవాబు వ్రాయందే తానేంచేస్తుంది.

ఆరాత్రి పడుకున్నా వనజకు నిద్రలేదు. తన భావి జీవిత కార్యక్రమాన్నిగూర్చి ఆలోచిస్తోంది. ప్రసూతి అయిన నెల పిమ్మట ఆయింటిలో ఉండకూడదని నిశ్చయించుకుంది. తనమూలాన తన తల్లిదండ్రులకు చిన్నతనంగా వుండటం ఆమె భరించలేకుండావుంది. ఎక్కడికి పోవటమూ అనేది ఆమెకు పెద్ద సమస్యగా లేదు. మహానగరాలు, పట్టణాలు పల్లెసీమలు వుండే విశాల దేశంలో ఎక్కడైనా దివరకు భిక్షాటనం చేసుకునైనా జీవించవచ్చు అనుకుంది.

(సశేషం)

---

# ఇల్లరికం

(29-వ పేజీ తరువాయి)

పోవటానికి కారణం ఎంతో సౌమ్యమైనదని వారూహించ గలరా? ఊహించినా నమ్మగలరా? అవును, నమ్మలేరు. సాత్వికులు ప్రపంచంలో అరుదుగనే భావిస్తారు; మళ్ళీ 'మంచివాళ్ళు లేకపోలేదు' అంటారు. కాని ఆమంచి వాళ్ళలోనే నేడు తనను జమకట్టటానికి వాళ్ళు వీసమైనా అంగీకరించరు — ప్రపంచంలో, అంతవఱకెందుకు? తన ఆత్మీయులలోకూడా తన అమాయకత్వానికి విలువ లేదన్నమాట ! అన్నాడు. తను "వాళ్ళకుటుంబ మేమైపో తేనేం? నాబాధ్యత తీరుతుందిగదా!" అని పరువుకూ, ప్రేమకూ తిలోదకాలిచ్చి, "ముందుగతి ముందేఉంది" అని సాహసించి మాలతిని అతనికిచ్చేస్తే ఈనాడు తనూ మనుష్యుణ్ణనిపించుకుంటూ తిరగగలేవాడేమో? - మామయ్య మనస్సు ఒక్క సారిగా మారిపోయింది. సాత్వికుడు మామయ్య క్షణంలో బండరాయిలా మారాడు. పెళ్ళికి పోగూడదనుకున్నాడు. తిట్టూ రామానికుత్తరం రాయాలను కున్నాడు. అనుకోవటంతోనే ఆగిపోయింది. కానీ రాద్దా మనుకుంటే ఒక్కటీ జ్ఞాపకంరాలేదు. స్వర్గీయురాలైన అక్కను తల్చుకుని చిన్నపిల్లవాడిలా ఒంటరిగా కన్నీరు కార్చాడు.

(సశేషం)

"గొప్ప బుద్ధిశాలియైనను, అనేకవిధ శాస్త్రసారమెరింగినవాడైనను, గొప్ప కులమందు జన్మించిన వాడైనను, మఠాధిపతియైనను, గొప్పవాడైనను, విషయవాసన యుండినచో నిశ్చయముగా బద్ధుడగును. ఎట్లన? మహా పరాక్రమముగల సింహమైనను గూడా సంకిళ్ళచే బంధింపబడినచో, ఎట్లు దుఃఖమునకు కారణమగునో ఆలాగున విషయవాసన యనుపసంకిళ్ళచే నెవరికైనను దుఃఖమే కలుగును."



# నలిగిన హృదయం

శ్రీ కొంపల్లి బ్రహ్మానందరావు

స్వర్ణను తీసుకురావాలని వెంకమాంబ పట్టుపట్టి కొడుకు రామాన్ని పంపింది. మొదట్లో రామం వెళ్ళనని పట్టుపట్టాడు. కాని, తల్లి దుఃఖాన్ని చూసి 'ఊ' అనక తప్పిందిగాదు. మనస్ఫూర్తిగా రామం తన సోదర్ని పుట్టింటికి తీసుకురావటానికి వెళ్ళలేకపోయాడెందుకంటే స్వర్ణను క్షేమసమాచారములను అడిగి తెలుసుకునే వ్యక్తి ఒక్కడూలేడు వాళ్ళింటో; కట్టుకున్న భర్తకు లోకువయిపోయింది తన అక్క. ఆ సమయంలో ఇంక ఇతర మనుష్యుల సంగతేమిటి? అత్త తనఅక్కను దూషించని దినం గాని, చెయ్యి చేసుకోని దినం గాని లేదు. ఆడపిల్ల, చిన్న వయస్సులో ఉన్నపిల్ల, తనకూతురులాంటిపిల్ల అనే ఉదార స్వభావం కూడాలేదు ఆ అత్తగార్కి. కనీసం ఒకప్పుడు తనుకూడా ఒక అత్తింటి కోడలుగదా అని ఆలోచనకూడ లేకపోయింది ఆవిడకు. ఇంక ఆడబిడ్డ సంగతి చెప్పాల్సొస్తే అది పాఠకులకు వదిలివేయ వచ్చునేమో! ఆవిడ ప్రవర్తన చెప్పకుండానే గ్రహించ కల్గితేనే ఎక్కువగా అర్ధమవుతుంది. ఒక్కమాట! ఒదినమీద చాడీలు చెప్పి గాని తను భోజనానిక్కూర్చోదు!

రామం కంకిపాడులో దిగేటప్పటికి తెల్లారి ఐదుగంటలయింది. పల్లెలో అప్పుడే సందడిపూర్తిగా అంతరించింది. ఎవరి పనులలోవారు నిమగ్నులై ఉన్నారు. మగకుర్రాళ్ళు అప్పుడే ఒకచోట గుమిగూడారు. ఎవరికి చేతనయిన తేగల్గిన, ఎండుపేళ్లను వారు విరుచుకొచ్చారు వృక్షాల నుండి. దొరికిన ఎండుటాకులు పేర్చారు. చిన్నవయస్కులు తమ తమ ఇండ్లలోనుంచి చాటుగా పేళ్లను తీసుకొచ్చారు. అంతాఉమ్మడిగా మంట వేసుకున్నారు. వారివారి ఆనందం ఆచలిమంట ముందర చూడముచ్చటగా ఉంది. వేకువజామున లేచిన ముఖాలతో వారి కుతూహలం చూడ రమ్యంగా ఉంది.

ఊరి మధ్యలోకి వచ్చాడు రామం. శుభ్రంగా అలికిన గృహాలు, సన్నటి వెల్లబారలు ఆ ఎర్రరంగు మట్టిగోడల మీద చూస్తూంటే రామం కళ్లు జిగేలుమన్నాయి. "నిజంగా ఆ తెల్లగీతలు ఎంతశోభనిచ్చాయి ఆగోడకి!! ఎంత సిమెంటు కాంక్రీటు ఇల్లయినా అంత అందాన్ని చేకూర్చిందా తన బస్తీలో. అంత వినోదాన్నిచ్చేప్రదేశం పల్లెలే గదా! బస్తీలు ఏకోశకు వస్తాయ్!" అనుకున్నాడు రామం.

మరి కొంతదూరం సాగాడు. ముగ్గుల డబ్బాలతో ఇంటింటా ఆడపిల్లలు ఊగుతుంటే ఎంతో చూడముచ్చటగా ఉంది. మరోపనంటూలేక, ఎంతో హుషారుతో, చెదిరిన తల వెంట్రుకలతో గుమ్మాల ముందు రకరకాలయిన ముగ్గులను గీస్తూఉంటే రామంకు కదిలిరాబుద్ధవలేదు. ఎంత అందాన్ని ఇస్తాయి ఆ ముగ్గులు? రంగు రంగులతో అలంకరించాలని, ప్రత్యేకంగా ఇతరదేశాలనుండి దిగుమతి జేసుకుని; చివరకు పేడపూసినట్లు ఎంత అద్వానంగా తయారయాయి తన బస్తీ ఇండ్లు? ఏంతో ఉపేక్షతో ఎన్నో ఆలోచనలతో, ఎంతో చాకచక్యంతో, ఎంతో జాగ్రత్తను వహించి, ఆ పిల్లలు ముగ్గులు పెట్టూన్న ఆ గృహాలు మట్టి గృహాలు అయినప్పటికీ ఆ బస్తీ ఇండ్ల ముందు ప్రముఖ స్థానం అలంకరించ గలవనడానికి సందేహంలేదు.

పండగ పూటయినా తమ బాధ్యత మానకుండా భుజాన బరువును వహించి నడిచిపోతున్న ఆ రైతులను చూసేసరికి రామం అదొకలాగు చలించాడు. రైతుపని ఎంత హాయి! అతడు కష్టించి పనిచేస్తేనేగదా జనం భూమి మీద నివసించ కల్గేది. ఎంతటి దయార్ద్ర హృదయుడు. మరో చీకు లేకుండా తను చేయవలసినపని చేసుకుపోతున్నాడు గదా! ఈరోజుల్లో ప్రజాసేవ అంటూ చేయకల్గితే అతడే గదా!

రామం ఓగుమ్మం ముందు ఆగాడు. తను వెళ్ళవలసిన గృహం అదే. తన అక్కఇల్లు అదే! కాదు — కాదు తనఅక్క భర్తగారి ఇల్లు అదే. లోపలికి అడుగు పెట్టడం రామానికి ఇష్టంలేక పోయింది. వెనుతిర్గి వెళదామనుకొని బయలుద్దేరాడు. కాని తను వచ్చినపని వేరే ఉంది. అంతవరకు వచ్చి అక్కను కలసికోకుండావెళ్ళటం ఏదోలా అనిపించింది.

వెనక్కు తిరిగి గడపలో అడుగుపెట్టాడు. ప్రధమంగా ఎదురయింది తన అక్కగారి ఆడబిడ్డ. తననుజూసి విసురుగా లోపలికి పోయింది. ఆవిడ తరువాత కిటికీలోంచి

అత్తగారి దర్శనమయింది. ఎదురుగా వచ్చాడు బావగారు.

"అక్కయ్య ఎక్కడుంది? " అని అడిగాడు రామం.

"ఎందుకూ?" అని అడిగాడు కోపంతో బావగారు.

"పండక్కి ఇంటికి తీసుకుపోవటాన్కి"

"నీళ్ళకు పోయింది చెరువుగట్టుకు"

అలానే నిలబడి చూస్తున్నాడు రామం. అక్క ఎంత సేపటికీరాలేదు. బావమరిది వచ్చాడు. కనీసం కూర్చోమని కూడా అనలేదు సరి గదా! మర్యాదకూడ చేయలేదు బావగారు. అందుకు రామం ఆశ్చర్య పడలేదెందు కంటే దారిపొడుగునా తను అనుకున్నదే అది. తను రావటం బావకు ఏమాత్రం ఇష్టం ఉండదని తెలుసు రామాన్కి.

ఊరంతా పండుగ సరదాలతో నిండిపోయి ఉంటే తన అక్కగారిల్లు ఎలాఉందో చూశాడు రామం. గొప్ప వ్యత్యాసం కనిపెట్టాడు. అందుకు కారణం తన అక్క అయిఉండదు, అత్తగారు మాత్రమే అయిఉండాలి. మరో సహకారం లేకుండా ఎంతభారం వహించ కల్గుతుంది తన అక్క? ఎన్నిపనులు చేయకల్గుతుందీ !

"ఏంరా? ఎప్పుడు వచ్చావు?" అని అడిగిందాకా తను తన ఆలోచనల్ని త్యజించలేక పోయాడు రామం.

"ఇప్పుడే అక్కా వచ్చింది"

లోపలనుంచి కేక వినబడింది "తీరిగ్గా మాట్లాడ వచ్చును గాని, నీళ్ళు పట్టుకురావే త్వరగా" అని అత్తగారు అంది.

స్వర్ణ తమ్ముడితో మరేమీ మాట్లాడకుండా అడుగు తరువాతఅడుగు బరువుగా వేస్తూ లోపలికి పోయింది. అక్కతోబాటు రామంకూడా లోపలికిపోయి ముందు వసారాలో క్రింద పరిచియున్న పాత చాపమీద చతికిల బడ్డాడు.

అక్క, ఇంట్లో తమ్ముడికి జరిగిన అవమానంను గురించి బాధపడ్తున్నట్లు కనిపెట్టాడు రామం.

తాను సమయాన్కి ఇంట్లో లేకపోతే తమ్ముడితో ఆమాత్రం మాట్లాడే వ్యక్తిగాని, కనీసం కూర్చోమనిచెప్పే వ్యక్తిగాని లేకపోయారు ఆ ఇంట్లో. ఎందుకు తనవారు అంటే వాళ్ళకి అంత కసి? దీనికి జవాబు ఒక్కటే దొరి కిందామెకు. క్రిందటి పండక్కి సరిగ్గా చూడలేదనేనెపం. చేతనయితే తను కొనుక్కోవాలి, అంతేగాని తండ్రిమీద అధికారం చలాయించి అవీ, ఇవీ కొనివ్వమని వేధిస్తే ఎక్కడనుంచి తేగలడు. మిగిలిన కుమార్తెల సంగతి ఆలోచించవద్దూ. ఇంటి పెద్దల్లుడు గదా అని అప్పటికే తండ్రి అన్ని హంగులూ గౌరవముగా జరిపించాడు. ఆమాత్రం ఇంగితజ్ఞానం అక్కరలేదా పురుషుడికి?

తను ఆలోచించుకుంటున్న వ్యక్తి తనభర్తే అని మనస్సులో ఎవరో చెప్తున్నట్లు తోచింది స్వర్ణకు. తను ఇక్కడికి వచ్చిన తరువాత తండ్రయినా తల్లయినా, భర్తయినా ఆ ఇంట్లోనే. ఇంక తనకు ఏవిధమైనటువంటి సంబంధంలేదు తన పుట్టింటి వారితో.

అత్తగార్ని తృప్తిపర్చి తమ్ముడి చెంతకు వచ్చింది. కొద్దిసేపు మాత్రమే అతనితో మాట్లాడి పంపివేయాలను కుంది. ఎందుకంటే తను చేయవలసిన పనులు చాలా ఉన్నయ్ అత్తగారి దృష్టిలో.

"అమ్మ కులాసాగాఉందా?" అని అడిగింది స్వర్ణ ఏదో బాధను మింగుకుంటూ.

"కులాసాగానే ఉన్నది అక్కా! పండక్కి ఇంటికి తీసుకురమ్మని పంపింది"

"తమ్ముడూ! రావటాన్కి వీలుండదు" అని దించు కున్న ముఖంతో అంది.

"ఎందుకూ?"

ఆప్రశ్న వస్తుందని స్వర్ణ అంతకు పూర్వమే అను కుంది. అటువంటి ప్రశ్న అడగటం తనకు ఇష్టంలేదు. ఎందుకంటే జవాబు ఏమిఇవ్వాలో తెలియదు కనుక.

"వీలుండదని చెప్పు తమ్ముడూ"

"బావ వద్దంటాడా?"

స్వర్ణ మాట్లాడకుండా తలవంచుకొని, కాలిబొటనవ్రేలు నేలకురాస్తూ నిలుచుంది.

"అయితే బావను నేనే అడిగిచూస్తాను" అన్నాడు రామం చలించినట్లు.

"వద్దులేరా" ...గ్గింది స్వర్ణ కష్టంగా.

"అత్తగార్ని అడిగితే ...... "

స్వర్ణ పరిస్థితి అర్థంచేసుకున్నాడు రామం. భర్తకు, అత్తకు లోబడిపోయింది తనసోదరి. అక్కను పంప

టాన్కి ఎవ్వరికీ ఇష్టం ఉండదనుకున్నాడు. స్వయంగా తానే బావను, అక్కను పంపించవలసిందని కోరమని తల్లి చెప్పిన మాటలు రామానికి జ్ఞప్తి వచ్చాయ్. తేల్చుకుని గాని వదలకూడదని నిశ్చయానికి వచ్చాడు.

ముందు గదిలోకి తొంగిచూశాడు బావకోసం. బావ, అత్తగారు కాఫీలో నిమగ్నులై యున్నారు. రామం వాళ్ళ ఆనంద సమయానికి ఎదురుపోవడం ఇష్టంలేక పూర్తయిం దాకా ఇవతలగా వచ్చి నిలబడ్డాడు. మరికొంత సేపటికి బావ వెలుపలికి వచ్చాడు.

"పండక్కి అక్కను, నిన్ను తీసుకురమ్మని అమ్మ పంపింది బావా" అని అన్నాడు రామం.

"నాకు రావటాన్కి వీలుండదు. ఇంక దాని సంగ తంటావా దాన్నే అడుగు" అని ముభావంగా అన్నాడు.

"అక్క నిన్ను అడగమంది బావా"

"నన్ను అడగటం దేనికి? దాని ఇష్టం! అమ్మ ఇష్టం!" అని ఇంకో షరతు కలిపి తల్లిమీద వేశాడు భారం.

ఇంతలో అత్తగారు బయటికి వచ్చింది.

"ఏం నాయినా పండక్కి తీసుకు పోవటాన్కి వచ్చావా?"

"అవునండి. బావను, అక్కను పంపిస్తే చాలా సంతోషం"

"ఆ- పోదూ!! ఆ పండక్కి పెట్టారూ! ఇంక ఈ పండక్కి పెట్టారు"

రామానికి తలకొట్టినట్టయింది మరో సమయంలో అయితే ఆవిడ్ని కొట్టబోయేవాడే రామం! కాని తను తొందర పడకూడదనుకున్నాడు. తన మీద కోపం అక్క మీద చూపుతుందని రామం కోపాగ్నిని అణుచుకున్నాడు.

"ఈ మారు తప్పకుండా వాళ్ళను పంపాలి మీరు!" అని దీనంగా అడిగాడు రామం.

"ఇంట్లో ఇంత చాకిరీ ఉంది గదా! పండగ మాకు కూడా ఉందిగా!"

"పోనీ అక్కను పంపితే——"

"ఏమో నాయనా దాని ఇష్టం. అయినా వాడ్ని విడిచి అది పుట్టింట్లో పండగ చేసుకుంటే సమంజసంగా ఉంటుందా?"

అర్థమయింది రామంకి. తన కొడుకుని పంపక పోగా కోడల్ని పంపటాన్కి కూడా ఇష్టపడటంలేదు అత్తగారు.

మళ్ళీ రామం అక్కనడిగాడు. ఏలాగయినా రమ్మని. అక్క మాట్లాడ లేదు.

"నువ్వే అడిగి చూడవే అక్కా" అని తిరిగి అడిగాడు రామం.

"లాభంలేదు తమ్ముడూ! ఈఇంట్లో అగ్నితప్ప నీళ్లులేవు"

"పోనీ చెప్ప కుండా వచ్చెయ్ అక్కా!"

రామం తెలివి తక్కువ తనాన్కి స్వర్ణ నొచ్చు కుంది. తనింట్లో తనకు జరిగిన అమర్యాద, తన కోరిక చెల్లించక పోవటం మొదలయిన పరిస్థితులు రామాన్ని అలాగు అనమని ప్రోత్సహించి ఉంటయ్. లేక పోతే అలా తొందర పడి మాట జారే మనిషి కాడు రామం. తన అక్క జీవితం ఆ ఇంట్లో ఉందని తెలుసుకో లేని అజ్ఞాని కాదు తన తమ్ముడు. ఇప్పుడు చెప్ప కుండా పుట్టింటికి వెళితే ఇంక తనకి పుట్టగతులుంటాయా ఈ ఇంట్లో! సంఘం ఊరుకుంటుందా?

"ఏమంటావ్ అక్కా!" అని అడిగాడు రామం కంది పోయిన మొహంతో.

"నేను రానురా" అని నిక్కచ్చిగా చెప్పింది స్వర్ణ.

"ఏం ఎందుకని?"

"నాకు ఇష్టంలేదు."

రామం అక్కతో మరో మాట మాట్లాడ కుండా వచ్చినదారిపట్టాడు. "తనింట్లో పూర్వం తృప్తిగా పండగ జరిపించలేదని తన అక్క కూడా మనస్సులో పెట్టుకుంది. పరిస్థితులు తెలిసి కూడా అక్క అలా బాధ పడింది అంటే రామం అక్క మీద విసుక్కున్నాడు. తనలాంటి ఆడ పిల్లలకు ఇంకా వివాహం చెయ్యాలి కదా అని ఆలోచించలేదు అక్క. ఇంటికి వచ్చి వేడుకొన్నా తన కోరిక చెల్లించక పోయారు." అని ఆలోచించుకుంటూ వెళిపోయాడు రామం.

రామం చేసిన హఠాత్తు చర్య స్వర్ణను బాధ పెట్టింది. తమ్ముడ్ని బాధ పెట్టినందుకు చింతిల్లింది స్వర్ణ. తను అనుకున్నది ఒకటైతే దైవం చేసింది మరొకటి అయింది. ఇంత మందికి ఇష్టం లేకుండా తను పండక్కి పుట్టింటికి పోవటం తనకు సమంజసంగా లేదని గ్రహించి, స్వర్ణ తమ్మునితో రానన్నది. కాని తమ్ముడు అనుకున్న భావం మరొకటి. దృష్టిలోంచి పోయిందాకా తమ్ముడ్ని చూసి, నలిగినహృదయంతో మళ్ళీ తన మామూలు దిన చర్యల్లో నిమగ్నురాలైంది ఆ ఇంటి కోడలు స్వర్ణ. ★

# బాలానందం

## శక్తికి మించిన యుక్తి

• శ్రీ టి. వి. నరసింహారావు •

బాలలూ! యుక్తికి మించినది మరిఏదీ లేదుకదూ! అందు వలననే "శక్తికి మించినది యుక్తి" అను ఆర్యోక్తి లోకోక్తి అయినది. దానికి ఉదాహరణముగా మీకొక చక్కని కథను చెప్తాను వినండి.

పూర్వము ఒక ఊరిలో సుబ్బయ్య అనే వర్తకుడు ఉంటేవాడు. అతను చాలా తెలివైనవాడు. కాని ఏం లాభం! వట్టి పిరికిపంద. అతనింటికి ప్రక్కగనే ఆ ఊరి మునసబుగారి ఇల్లు. దానికి పదిగజాలదూరాన ఒకగుడి. మునసబుగారి పేరు ఎవ్వరికీ తెలియదు. అందుచే ప్రతి వారును మునసబు బాబు అని పిలచెడివారు. ఆయన చాల ఉదారమైన బుద్ధికలవాడు.

అవి వేసవికాలపురోజులు. సుబ్బయ్యకు దొంగలభయం వలన ప్రతిరోజూ ఆరుగంటలకే కొట్టు మూసివేసి లాంతరు పట్టుకొని ఇల్లంతా ఒకసారి చూచు చుండెడివాడు. అప్పుడు భార్య గర్భవతి. అలవాటు ప్రకారము సుబ్బయ్య కొట్టు మూసేసి లాంతరు పట్టుకొని ఇల్లంతా వెదకు చుండెను. ధాన్యపు గాదెవద్దకు వచ్చుసరికి అతనికి ఒక మనిషి కూర్చుండుట కనబడెను. సుబ్బయ్యకు భయము కలిగినది. కాని ధైర్యము తెచ్చుకొని ఏదో ఆలోచించు కొనుచు ఏమియునెఱుగని వానివలె ఇంటిలోనికి పోయి భార్యను పిలిచెను.

భార్యా భర్తలిద్దరూ ఉయ్యాలమంచముపై కూర్చుని ప్రసంగము నారంభించిరి. పాపము! గాదె మూలనున్న దొంగ తనను చూడలేదని సంతోషించెను. భార్యా భర్తలిద్దరూ మొగపిల్లవాడే కలుగునని అనుకొను చుండిరి, ఇంతలో సుబ్బయ్య "మనవాడికి ఏపేరు నామకరణము చేయడం" అని అడిగెను. ఆమె తండ్రి పేరని చెప్పెను. సుబ్బయ్య ఒప్పుకోలేదు. మళ్లీ సుబ్బయ్య అన్నాడు, "పోనీ ఎవ్వరిపేరూ వద్దు మన మునసబు బాబు పేరుంచుదాము" సరేనంటే సరే ననుకున్నారు భార్యా భర్తలిరువురు. సుబ్బయ్య మళ్ళీ అన్నాడు "మనవాడు పెరిగి ఎనిమిదిదేళ్ళవాడయి ఆడుకొనడానికి పోతే ఏమని పిలుస్తావు" అని. ఆమెకు వళ్ళుమండి "ఏమిటండీ ఇదంతాను," ఆలులేదు చూలులేదు, కొడుకుపేరు సోమ లింగం "అన్నట్లుంది మీవేషము. చాలులెద్దురూ" అని కసిరింది. కాని సుబ్బయ్య ఊరుకున్నాడా! మళ్ళా ప్రశ్న వేసాడు, ఆమె 'మునసబు బాబు' అని పిలచింది. "మునసబు బాబు గారింటివరకు వెళ్ళితే" అని మళ్ళా అడిగాడు. మునసబుబాబు అని కొంచెం గట్టిగా పిలచింది. "ఆగుడివరకు వెళ్ళితే" అని అడిగాడు. 'మునసబుబాబు' అని యింకా గట్టిగా పిలచింది. ఇదంతా చల్లగాలికి వీధిలో కూర్చుని మాట్లాడుచున్న మునసబు, మరికొంతమంది విని పరుగెత్తుకొనివచ్చి లోపలికిపోయి దొంగను పట్టి శిక్షించి సుబ్బయ్యను రక్షించి అతని తెలివికి సంతోషించారు.

చూశారా! బాలలూ! సుబ్బయ్య ఎంత తెలివైనవాడో. శక్తిచే చేయ లేని పని యుక్తిచే చేయవచ్చు.



# వెర్రి వెంగళాయి

పూర్వం రామాపురంలో పోలయ్యా అనే కాపు వాడొకడుండేవాడు. అతని భార్య చుక్కమ్మ ఒక కొడుకుని కని పురుట్లోనే యీ లోకం విడిచి పోయింది. పోలయ్య వుట్టి వెఱ్ఱి వెంగళాయి. అంత వెఱ్ఱివాడు ఈలోకంలోనే వుండడనిపిస్తుంది. దైవవశాత్తూ ఆబిడ్డని యిప్పటిదాకా చాలా జాగ్రత్తగా పెంచుకొచ్చాడు.

ఒక వేసవి కాలంనాటి ఉదయం పోలయ్యా పొలం వెళ్ళి గొడ్డలి పొలం గట్టుమీద పెట్టి మధ్యాహ్నం ఒంటి గంటదాకా పొలంపని చేసుకుని, గట్టు మీదికి ఒచ్చి గొడ్డలిని ముట్టుకోనేసరిక్కి అతని చెయ్యి చురుక్కుమని కాలింది. కారణం ఏమిటంటారా! అవి వేసవి ఎండ లవడంచే చేతి గొడ్డలి వేడెక్కింది.

గొడ్డలిముట్టుకుంటే చెయ్యి కాలడంచేత గొడ్డలికి జ్వరం వొచ్చిందనీ—తక్షణం వైద్యం చేయించక పోతే చచ్చిపోతుందనీ భయపడి, గబగబావెళ్ళి ఆవూరి డాక్టరి గారికి గొడ్డలి సంగతి చెప్పాడు. అదివిని డాక్టరుగారు వేళా కోళంగా, "త్రాడుకట్టి గొడ్డల్ని నీటిలో ముంచి అరగంట పోయాక యివతలికితీస్తే జ్వరం తగ్గుతుంది" అని చెప్పారు.

అదివిని పోలయ్యా ఆలాగేచేసి గొడ్డలి చల్ల బడటంచే మహానందం పొందాడు.

ఒక వారం రోజులు గడిచాయి. ఒకనాడు పోలయ్యా కొడుక్కు జ్వరం ఒచ్చింది. జ్వరం వచ్చిన మనిషిని డాక్టర్ దగ్గిరికి తీసుకెళ్ళడాన్కి బదులు తన యిష్టమొచ్చినట్లు గొడ్డలికిచేసినట్లు ఆ పసిబిడ్డకి కూడాచేశాడు. ఇంకేముంది ఆ బిడ్డడు చనిపోయాడు. ఆ సంగతివిని పోలయ్య బోరున ఏడ్వసాగాడు. అది చూసి పోలయ్యాని అందరూ ఎందుకేడుస్తున్నావని అడిగితే డాక్టర్ యిదివఱకు గొడ్డలికి చెప్పినవైద్యం పిల్లవానిమీద తను ప్రయోగించిన సంగతి చెప్పాడు.

అది విని అందరూ పోలయ్య వెఱ్ఱి తనానికి చాలా ఖేధపడ్డారు!

రచన : చేబ్రోలు సూర్యారావు.

# మా మేష్టారు

భానూ సీనూ
నేనూ మధూ
కూర్చున్నాం
పాఠాలు ముందర.
మేష్టారేవో
చెప్తు చుండగా
కొండలోంచి గాలి
పుదు తుందాండీ
అన్నది భానోజీ.
ఏదేముడు మంచివాడు
అడిగాడు మధుకృష్ణ.

కొండలోంచి గాలి
పుడుతుందేమో,
మంచిదేముడు వున్నాడేమో
మీ బుఱ్ఱలో
పుట్టేది సూన్యం.
అన్నీ యక్షప్రశ్నలే
అన్నారు మా మేష్టారు.

మేష్టారంటే
ఎప్పుడు యింతే
చలాకిగా మాట్లాడుతారు.

పాఠాలు చదువుతే
కోపం ఎందు?
యక్ష ప్రశ్నలట
మేము వేస్తున్నాం
మా మేష్టారు
మంచి వారు
కులాసాగా
కబుర్లు చెబుతూ
ఆడుతు పాడుచు
పాఠాల్ చెప్పును
మా పిల్లలకి.
చదువు చెప్పుచు
ఆయన కూడా
మాతో కలయును.
ఏరీ ! ఏరీ ! ఆ మాష్టారు
మా మేష్టారు!

"రాజేశ్వర్"

# హరిదాసు

* శ్రీమతి ఇ. సుందరమ్మ *

అనగా అనగా ఒక ఊరిలో ఒక హరిదాసు వుండేవాడు. అతడు చాలా అమాయకుడు. అతడు ప్రతి దినము ఉదయంకాలకృత్యములు తీర్చుకొని ఆయవారమునకు వెళ్లుచుండెడివాడు. కాని హరిదాసును వర్ణించవలయునన్న చాలా చిత్రముగా ఉంటుంది. దాసు తల నున్నగా బాగా పెద్దతాటికాయలా ఉంటుంది. పెద్ద గుమ్మిడికాయంత బొజ్జ. కాళ్ళు, చేతులూ కురచగా ఉండును. ఇంక తను కాల కృత్యములు తీర్చుకొనిన తరువాత ముక్కునుంచి గుండు వరకు చక్కగా తెల్లటి నామములు రెండు, మధ్య ఎఱ్ఱగా నామము ఒకటిపెట్టును. కాయ వస్త్రములు ధరించును. చిన్న బిళ్ళగోచితో పంచ కట్టు, మెడలో రుద్రాక్షలు, సుభ్రముగాతోమినఒక రాగిచెంబు, ఒక కట్ట, చంకలో బియ్యం వేసుకొనుటకు ఒక సంచి, చిన్న కరతాళములు. వీటితో హరిదాసుగారు బయలుదేరే అలవాటు. హరిదాసు గ్రామమునకు, పై గ్రామమునకు మధ్య కొంచెము మైదానము గలదు. ఈ మధ్య మైదానములో రోజూ ఒక గేదె మేయుచుండెడిది. ఆగేదె కొమ్ములు రెండు గుండ్రముగా చుట్టుకొని యుండును. ఈ దాసుకు ఆ గెదె కొమ్ములు చూచినదే ఒక సందేహము కలిగెను. ఏమన" నా గుండు పెద్దదా ! లేక గేదె కొమ్ము రంధ్రము పెద్దదా" యని. ఈ సంకోచము వల్ల అతను ఇంటికి పోయి భోజనము చేసి పండుకొని ఇదే ఆలోచన. అతను ప్రతి నిత్యము పోవు సమయమునకే గేదె వచ్చియుండును. ఇక దానిని చూచినదె, "నా గుండు పెద్దదా గేదె కొమ్ము రంధ్రము పెద్దదా" అన్న సందేహముచే గంటా గంటన్నర నిలబడుచుండెడివాడు. తనకు స్పృహ వచ్చిన తరువాత బిక్షకు పోయెడివాడు. ఇంతలో ఒక ఆలోచన వచ్చినది. ఏలాగైనా ఒకసారి నా గుండును ఆ కొమ్ము రంధ్రములో పెట్టి చూచుకొనవలయునని ఆ రాత్రి తీర్మానించుకొనెను. మరునాడు త్వరగా లేచి తన పనులన్నీ తీర్చుకొని, తన సామానులు తీసుకొని బయలుదేరి త్వరగా ఆ మైదానము చేరెను. గేదె అస్థలములో మేయుచుండెను. ఇంక హరిదాసుకు చెప్పలేనంత సంతోషము కలిగెను. త్వర త్వరగా అ ప్రక్క ఈ ప్రక్క ఎవ్వరు లేరుకదా అని ఒకసారి కలయ చూచెను. ఎవ్వరు కనుపించలేదు. ఇంక తన చేతికర్ర, చెంబు, సంచి, కరతాళములు అన్నీ తీసి ఒక స్థలములో పెట్టి మెల్లగా గేదె వద్దకు పోయెను. గేదె తల వంచుకొని మేయుచుండెను. హరిదాసు మెల్లగా వచ్చి తన తలను కొమ్ము రంధ్రములో దూర్చెను. ఇంక తన తల బయటికి రాలేకపోయెను. గేదె బెదరి ఒకే పరుగు తీయసాగెను. ఇక హరిదాసు ఏమి చేయలేక పోయెను. దాసు మోకాళ్ళు రక్తముతో ఈడ్చుకొని పోవుచుండెను. ఆ సమయములో ఇద్దరు ఆ దారిని పోవుచు ఇది చూచి ఏమీ తోచక పరుగెత్తుకుంటూ వచ్చి ఆ గేదెను పట్టి దాసు తలను మెల్లగా తీసివేసిరి. అప్పుడు దాసు బెదరి తన వస్తువులు కూడా మరచి ఒకే పరుగుతో ఇల్లు చేరి ఇంట్లో పడిపోయెను. ఆ ఇద్దరు హరిదాసు సామానులన్నీ తీసుకొని దాసు ఇంటికిపోయి కాళ్ళు చేతులూ వాచియుండుట చూచి "ఎందువల్ల ఇట్లుజరిగినది" అని తెలియనట్లు అడుగగా, దాసు "తనయొక్క గుండు పెద్దదా, దానికొమ్ము రంధ్రము పెద్దదా అనే సంకోచము చేత ఈపని చేసితిని" అనిచెప్పెను. వారు చెప్పరాని నవ్వుతో, "ఇప్పుడేది పెద్దదైన నీకేమిలాభము, ఇప్పుడు నీ గుండేగాక కాళ్ళు చేతులుకూడ విరగగొట్టు కొంటివి. ఇక మీదట ఇటువంటి పనులు చేయవద్ద"ని చెప్పివారు వెడలిపోయిరి. ఇంక హరిదాసు చిక్కు తీరిపోయినది గాని, కాళ్ళు చేతుల బాధచే ఒక వారమువరకు భిక్షకుపోక ఇంటిలోనే వుండి నెమ్మదించిన పిమ్మట బిక్షకు పోవ నారంభించెను. కాని అచ్చట గేదె వుండగాకూడా దాసు దాని వైపు చూడకుండా తలను మరొకవైపు త్రిప్పుకొని బిక్షకు పోవుచుండెను. అప్పటినుండి ఇప్పటివరకు దాసు ఏ ఆలోచనా లేక తనపనులలో నిమగ్నుడై యుండెను.

# "మంచి బాలుడు"

* ధవళమూర్తి కుమార్ *

వస్తున్నాదొకవీధి చివరగా
అరువదియేడుల ముసిలిదియొకతె
జనసంచారము లేని బాటలో
మెల్ల మెల్లగా అడుగులువేస్తూ.

ప్రొద్దుగుంకగనె చీకటంతయు
ప్రదేశమంతా అలుముటచేతను
కండ్లు కనపడక యా అవ్వమాత్రము
వణకుతు, మూల్గుతు వచ్చుచుండెను.

దారిన పోయే యిద్దరు మనుజులు
అవ్వనుజూచి ససహ్యించుకుని
"ఛో....ఛో.... అవ్వా నీవెందుకు" అని
నిర్దయతోను వెడలిపోయిరి.

చిమ్మచీకటులు వ్యాపించుటచే
కన్నులులేని యవ్వ యొక్కతె
చేతికర్రను నేలకు రాస్తూ
నిలుచుండెను దారితెలియక.

అంత బాలుండొకడది చూచి
"అయ్యో అవ్వ"ని మెల్లగ నరచి
సమీపించి తన కథేమిటో అని
అవ్వనడుగగ నిట్లని పలికె.

"కన్నులులేవు నాయన నాకు
దారితెలియక వెతకుచుంటిని
గమ్యస్థానము చేరు తలపుతొ
తప్పటడుగులు వేయుచుంటిని."

అనగా బాలుడు "అయ్యో"అనుచు
చెంతకుజేరి చేయూతిచ్చి
"అవ్వా పద నీయింటికి" అంచు
సంతోషంబున సాగెను బాలుడు.



# దోబూచులు

"శ్రీ చైతన్య"

ఈపూల తోటలో నెవరేగినారు?
తరుల చాటున దాగి పరువెత్తినారు
లేగులాబుల తావి లేపు చున్నారు
మల్లెపూ పొదలలో మసలు చున్నారు

మొక్కలన్ని విఱుగ ద్రొక్కు చున్నారు
కనులుమూసెడి బాల కనుపించు నెవరు?
కోలాహలము తోడి బాలకు లెవరు?
పిల్లల కోసమై వెదకున దెవరు?

చిన్ని సీతా! నీవు చిలిపివైనావు
కృష్ణమ్మా నెందుకే గిల్లుచున్నావు?
ముద్దు శాంతా! కొట్టవద్దు చెల్లెలిని
కొట్టగా మీఅమ్మ కొట్టునే నిన్ను.

తొంగి చూచెడిపద్మ! దొంగవైనావు
ధనలక్ష్మి కలమేల దాచు చున్నావు?
సూర్యుడస్తాద్రిపై జొచ్చినాడదుగో
బాలునాటల నాపి సరగపోవుదము.






[జరిగినగాథ :—సీతారామయ్య చాలా ఆస్తిపరుడు. శాంత, సీత యిద్దరు కుమార్తెలు. కుమార్లు లేరని విచారించేవాడతను. కాని భార్యాభర్తలు ఎంతో అన్యోన్యంగా వుండేవారు. వీరి ఆనందాన్ని చూచి ఆవూళ్ళో వాళు సహించలేకపోయేవారు.

జానికమ్మ తమ్ముడు వెంకట్రంగయ్య. అతనికి తన కూతురు సీతనిచ్చి పెండ్లిచేయాలన్నతలంపుతో పెద్ద కూతురు శాంతకన్నా సీతనే అభిమానంగా చూచేది సీతారామయ్య భార్య జానికమ్మ.

జానికమ్మ తల్లి మంగమ్మ. స్వార్థపరురాలు, పరులపచ్చ కిట్టదు. పెట్టినవారికి పెళ్లి, పెట్టనివారికి శ్రాద్ధం పెట్టేరకం. ఎంగిలిచెయ్యి కాకి కూడా దులపదు. తన జాణతనంవల్ల పదిహేనేండ్లకొడుక్కి ఆవూరి కంట్రాక్టరు శెట్టిగారివద్ద ఉద్యోగం సంపాదించింది. తల్లిగుణాలే గనుక వెంకట్రంగయ్య తన చాకచక్యంవల్ల త్వరగా పైకి రాగలిగాడు. తమ్మునికి సీతనిద్దామని భార్య కోరగానే సీతారామయ్య అందుకు అంగీకరించాడు. శాంతకు పెళ్ళిచేసి అల్లుడ్ని ఇల్లరికంగా పెట్టుకుందామని తనవుద్దేశాన్ని భార్యకు తెలిపాడు. కాని జానికమ్మ ఆమె తల్లి, తమ్ముని ప్రోద్బలంవల్ల భర్త వుద్దేశానినంగీకరించలేదు. దాంతో భార్యాభర్తలకు మనస్పర్ధ లేర్పడ్డాయి.

శాంత పెళ్ళి ప్రయత్నంలో రఘు అనే అబ్బాయిని చూడడానికి సీతారామయ్య వెళతాడు. రఘు అన్న, రామారావు సీతారామయ్య సంబంధానికి ఒప్పుకుంటాడు. రఘు సీతారామయ్యతో బయలుదేరి వెళుతాడు.

వివాహాలు సలక్షణంగా జరుగుతాయి. ఆనాటినుంచీ రఘు అత్తవారింట్లోనే వుండి, భూములూ అవీ చూచుకుంటూంటాడు. సీతకూడా అత్తవారిటికి చాలా వస్తుసముదాయంతో బయలుదేరి వెళ్లింది. సంవత్సరాలు దొర్లిపోతున్నాయ్. ఇంకచదవండి]

## ౬

శాంతకు వెంట వెంట యిద్దరు ఆడ పిల్లలు కలిగారు. ఆమె శరీరం మరింత దుర్బలమయింది. పిల్లల చాకిరీతో ఆమెకు కాలం గడిచిపోతోంది. తాత వేయి కళ్ళతో పిల్లల్ని కనిపెట్టుకుని ఉండేవాడు. ఆయనకు పిల్లలంటే ఎంతో ప్రేమ. పిల్లలకు ఎన్నో నగలు, ఎన్నో దుస్తులు, ఎన్నో ఆటవస్తులు; డబ్బుపెత్తనం చూచుకొంటూ, త్యాగరాజకీర్తనలు పాడుకొంటూ తృప్తితో ఆనందంగా కాలాన్ని గడుపుతున్నాడు. ఇంత సుఖంగాను మిగిలిన జీవితమంతాగడిస్తే ఎంత బాగుండుననిపించిందాయనకు!

ఇంటిపనులతోను, పిల్లలతోను కాలక్షేపం చేస్తున్న జానికమ్మకు, మంగమ్మ, సీతకు సంతానం కలుగలేదన్న కొరతను వేలుపెట్టి చూపించింది. ఇది బెంగగా పట్టుకొని ఆనాటినుండి జానికమ్మను వేధిస్తున్నది. సీతకు సంతానాన్ని ప్రసాదించమని వేయి దేవుళ్ళకు మ్రొక్కుకుంది. ఒకరోజు ఆమె మనస్సుకు చిత్రంగా, ఇక సీతకు సంతానం కలుగదేమోనన్న భయం కలిగింది. మళ్ళీ 'ఛీ, ఇదేమిటి' అనుకొని నవ్వుకుంది. ఆమె ఇప్పుడు మునుపటంత సంతోషాన్ని పొందలేకపోతోంది. తన మనస్సు సరిగ్గా ఉండటం లేదనిపించిందామెకు. భర్తకూ తనకూ విరిగిన మనస్సులు మళ్ళీ కలియనేలేదు. తన మనస్సు

బాగా మొరటు బారినట్లు తనకు తెలుస్తూనే ఉంది. భర్త విషయంలో మునుపటంత శ్రద్ధాభక్తులను తాను చూపలేక పోతోంది. చాకిరీతో నడుములు విరిగిపోతున్నట్లనిపించే దామెకు. క్రమంగా విశ్రాంతి, నిద్ర తగ్గిపోయాయి.

రఘు మంచివాడే అయినా అప్పుడప్పుడు తనకు అతని మనస్సును నొప్పించాలనిపించేది. అతనిని రెండు మూడు సాధింపు మాటలని చూచేది. 'రోషం లేనివాడికి మోసంలేదట! ఎంత రోషం లేనివాడూ! అతనికి మామగారంటే ఎంతో గౌరవం. బొనుమరి! తా నెవరూ ఈ ఇంట్లో?' ఈ ఆలోచనలలో ఆమె రక్తం ఉడుకెత్తి పోయేది. ఈవిధంగా ఆమెకు సాధింపు అలవాటై పోయింది. శాంతీ, సుఖమూ ఆమెకు క్రమంగా దూరమై పోయాయి. చివరకు పిల్లల్నికూడ విసుక్కుంటోంది. వాళ్ళకు కీడు జరగాలని మనస్సులో లేకపోయినా, ప్రతి చిన్న అల్లరికీ వాళ్ళని తిట్టకుండా ఉండలేకపోతోంది. తన ప్రవర్తన తనకే బాగుండలేదు.

........శాంతకు మూడవ కాన్పు సుఖంగా జరిగింది. సీతారామయ్యకు దౌహిత్రుడు కలిగాడు. తాత ఎంతో సంబరపడ్డాడు.

౭

సీత కాపురానికి వచ్చి పదేండ్లయినా యింకా పిల్లల్ని కనలేదు. శాంతకు అప్పుడే ముగ్గురు సంతానం కలిగారు. తాత తన ప్రేమనంతా ఆ పిల్లల మీద ఒలకపోసుకుంటు న్నాడు. ఈవిషయం జ్ఞాపకానికి వచ్చినప్పుడల్లా మంగమ్మకు వళ్ళు మండి ఏదో ఒకమిషపెట్టి కోడల్ని రాచి రంపాన పెట్టేది. కొంతకాలం అలాగే వోర్చింది పాపం సీత. ఇక వోర్చుకోలేక మాటకు మాట బదులు చెప్పడం మొదలు పెట్టింది. తీరిక సమయం ఎక్కువగా ఉండేది గనుక అత్తా కోడలు వాగ్యుద్ధం చేసేవారు. మొదట మొదట గెలుపులన్నీ అత్తగారివే. జయాపజయాలు దైవా ధీనములన్నట్లు క్రమ క్రమంగా జయలక్ష్మి సీతతో సావా సం చేసుకొంది. వెంకట్రంగయ్య ఇంటివద్ద ఉండడు. ఏవో ఒకవేళకు వచ్చి భోజనం చేసి వెళ్ళేవాడు, రాత్రిళ్లూ అంతే. వచ్చినప్పుడు తల్లీ, భార్యా కలహిస్తూవుంటే ఇద్దర్నీ తిట్టేవాడు. అప్పుడప్పుడు సీతకు దెబ్బలు తగిలేవి కూడా. సీత కళ్ల నీళ్ళు కుక్కుకునేది. ఇల్లిల్లూ తిరిగే మంగమ్మ ప్రతీ యింటికీ వెళ్ళి సీతమీద ఉన్నవీ లేనివీ చెప్పేది. ఆమాటలు నమ్మి ఇరుగు పొరుగు స్త్రీలు సీత చెడ్డదిగా భావించేవారు.

వెంకట్రంగయ్య కంట్రాక్టరుగారినీ, ఇంకా యితరు లనూ ఆశ్రయించి కొన్ని స్థానిక గౌరవోద్యోగాలు సంపా దించినందున అమాయకులైన స్త్రీ పురుషులు కార్యసాధ నకై ఆశ్రయించవలసి వచ్చేది. అమాయిక స్త్రీలను వంచించి, మొగమాటపెట్టి నైతికమార్గంనుంచి తొలగించే వాడు. సీత ఈసంగతులు తెలిసికొని గొల్లున ఏడ్చేది. ఒక సారి తారసిల్లి "ఎందుకు నన్నీవిధంగా అన్యాయం చెయ్యడం?" అని అడిగింది. దానితో రెచ్చిపోయి తీవ్రంగా తిట్టి, కొట్టాడు. ఆదెబ్బతో ఆమెకు భర్త అంటే సింహస్వప్నమైంది. భర్త వేళాపాళా లేకుండా అధికారుల్ని విందులకు, భోజనాలకు పిలుచుకువచ్చేవాడు. నడుము విరిగేటట్టు వండి వార్చిపెట్టేది సీత. చివరకు ఏ స్వల్పకార ణానికో ఆమెకు తిట్లు తప్పేవికావు.

వెంకట్రంగయ్య తనకున్న హోదాల సంబంధంతో సంస్థల ధనాన్ని ఉపయోగించుకొని ప్రాణంమీదికి వచ్చే సరికి "నీమెళ్ళో గొలుసు ఇలా ఇవ్వు. అవసరం కలి గింది, కొద్దిరోజుల్లో మళ్ళీ మన వస్తువు మనకు వస్తుందిలే" అని చెయ్యి జాపేవాడు. సీత ఒకటి రెండు సార్లు ఏమీ అనలేక వెంటనే యిచ్చింది. వస్తువులు మళ్లీ రాలేదు. నగలతో మెరిసిపోతూవుండే సీత మెడ బోసి కావడంతో ఇరుగు పొరుగు అమ్మలక్కలు గుసగుసలు ప్రారంభించేవారు. సీతకు అవమానంగా తోచేది. ఇవ్వటం ఏమాత్రమూ యిష్టంలేకపోయినా, ఇవ్వక తప్పటంలేదు. ఈవిధంగా నగలన్నీ మాయమైపోయాయి. ఇవ్వకుండా ఉండడానికీ, ఏదైన జవాబు చెప్పటానికీ మునుపటంత ధైర్యం ఆమెకిప్పుడులేదు.

ఒకసారి తండ్రి కూతుర్ని చూడడానికి వచ్చాడు. వంటినిండా నగలతో తాను పంపిన సీత ఒక్క నగ లేకుండా మోడువలె ఉండడం చూచి ఆశ్చర్యపోయాడు. అల్లుడు ఎప్పుడూ చాలామంది మనుష్యుల మధ్య మాట్లా డుతూ ఉండేవాడు. కష్టసుఖాల ప్రస్తావనకే అవకాశమివ్వ డంలేదు. భోజనానికి వచ్చినప్పుడు అవకాశాన్ని చిక్కిం చుకొని "అమ్మాయిని ఒకసారి పిలుచుకవెడదామని వచ్చాను" అన్నాడు.

"తీసుకువెళ్ళి వారం రోజులనాటికి మళ్ళీ పంపండి. చూస్తూనే ఉన్నారుగదా— క్షణం తీరికలేదు. మా యిల్లు రామనందాడి. వచ్చేవాళ్లూ, పోయేవాళ్లూ, అధికార్లు ఎందరో వస్తూంటారు. వండడం, వార్చడం అమ్మ ఒక్కతే చెయ్యలేదు. ఎంత త్వరగా పంపితే అంత మంచిది." అన్నాడు వెంకట్రంగయ్య.

ఆలోచిస్తూ సీతారామయ్య "అలాగే" అన్నాడు. ఆయన యింటికి చేరగానే చేసిన మొదటి పని కంసాలిని పిలిపించి సీతకు నగలు వారం రోజుల్లో తయారు చేసి తెచ్చి యివ్యమని చెప్పడం.

సీతకు అక్క కాపురాన్ని చూస్తూవుంటే నోరూరు తోంది. దోసపండ్లంటి పిల్లలు, ధర్మరాజువంటి భర్త. అక్కకేం? అక్క చాల సుఖపడుతోంది. తన కష్టం ఎవ రికీతెలియదు. అమ్మకు తన తల్లి అంటేనూ, తమ్ము డంటేనూ చాల అభిమానం. వాళ్ళని గురించి వున్న దున్నట్లుగా చెబితే ఏమినమ్ముతుందో అనుకొంటూ ఒక రోజు తల్లితో వాస్తవ స్థితినంతా పూసగ్రుచ్చినట్లు ఏడుస్తూ చెప్పింది. అంతా విని జానికమ్మ వెంటనే జవాబిచ్చింది—

"ఇబ్బందులెవరికైనా వస్తాయి. నగలిస్తే తప్పులేదులే అమ్మా. ఇలాంటి పరిస్థితు లప్పుడప్పుడు వస్తూంటాయి. మెసలిక చూచుకొని మళ్ళీ చేయిస్తాడులే. అమ్మమ్మ నిన్నెందుకంటుందే పిచ్చిదానా? నీవంటే ప్రాణాలు విడు స్తుందే! నీకంటే దానికి కావలసిన వాళ్ళెవరయినా ఉన్నారా నీవే చెప్పు? వాళ్ళ మనస్సు నీకింకా తెలియ లేదన్నమాట. నీకింకా చిన్నతనం. సంసారంలోని కష్ట సుఖాలు నీకింకా బాగా అనుభవంకాలేదు."

సీత : నగలు రావటం, పోవడం— కష్టసుఖాల మాటా నేను కాదనటం లేదమ్మా. స్వభావాల సంగతి నేననటం—

జా : (మాటకు అడ్డంవచ్చి) నీవు చెప్పేది నాకు తెలుసునులేవే. సంసారమన్నాక అనేక లోటుపాట్లు, కష్ట నిష్ఠూరాలు ఉంటాయి. ఏ లోపంవున్నా, ఏ కష్టమొచ్చినా అల్లరిపాలు కాగూడదు. 'రోగం రట్టు సంసారంగుట్టు' అన్నారు. ఇల్లాలు అన్నాక అన్నీ ఓర్చుకోవాలి తల్లీ.

సీత : (దిగాలుగా క్రిందికిచూస్తూ) ఐతే ఎలాగే?

జా : (చనువుతో గదుముతూ) ఇటు చూడు సీతా, నేను పెద్దదానిని. ఎవ్వరితోనూ చివరకి (సన్నగొంతుతో) నాన్నగారితో కూడ ఏమీ అనవద్దు. నేను అక్కడికి వచ్చి అన్నీ సరిచేసి వస్తాను.

సీత ఏమీ మాట్లాడలేదు. మౌనంతో, విచారంతో కూర్చుంది, కాలి బొటనవ్రేలితో నేలనురాస్తూ.

....నగలు వచ్చాయి. క్రొత్తచీరలు, రవికలు వచ్చాయి. సీతారామయ్య తనకు సమృద్ధిగా పండే కందులు, పెసలు, మినుములు, మిరపకాయలు బస్తాల నిండా నింపి బండిలో వేయించాడు. మనస్సులో దేవునీ, తన అదృష్టాన్నీ నిందించుకుంటూ, అందరివద్ద సెలవు తీసుకొని అత్త వారింటికి ప్రయాణమైంది సీత. తల్లి చాలాసేపు కూతురితో గుసగుసలాడింది. ఐనా సీత ముఖంలో సంతోషం కలగ లేదు. బండి కదలబోతూవుండగా తండ్రీ, కూతురూవచ్చి ఒకరి ప్రక్కగా ఒకరు కూర్చున్నారు. ఎద్దులతోబాటు గంటలూ, మువ్వలూ కదిలి మ్రోగాయి.

కొంతదూరం పోయాక తండ్రి కూతుర్ని ప్రేమతో "అమ్మలూ, నీకు అక్కడ సుఖంగా ఉందా? ఏదైన లోపం వుంటే చెప్పు. వాళ్ళు నిన్ను ప్రేమతో చూస్తూ ఉంటారా? ఏమైనా అంటుంటారా?" అని అడిగాడు.

సీతకు భర్త, అత్తగార్లనుగురించి చెప్పడానికి భయం అడ్డం వచ్చింది. చెప్పవలెనని ప్రయత్నించగా గొంతు పెగల్లేదు. ఈ పదేండ్లుగా అత్త భర్తగార్ల దండనతో ఎంత పిరికితనం పట్టుకొంది తనకు! గద్గదకంఠంతో "బాగానే చూస్తున్నారు" "బాగా చూడకపోవడానికి వాళ్ళేమయినా పరాయివాళ్లా?" అని మళ్ళీ అంది. అమ్మ అంటున్నదానినిబట్టి ప్రయత్నపూర్వకంగా, సీతారామయ్య ఎంత గ్రుచ్చి గ్రుచ్చి అడిగినా అంతకు మినహా ఏమీ చెప్పలేదు. పాపం! సాహసించలేకపోయింది.

తండ్రి కూతుర్ని అత్తవారింటి వద్ద దిగవిడిచి వెళ్ళాడు.

౨

కొన్నిరోజులు గడిచాక ఒక అర్ధరాత్రి సమయం జట్కావచ్చి సీతారామయ్యగారి వాకిటిముందు నిల్చింది. వెంకట్రంగయ్యా, మరొక మనిషీ వచ్చి తలుపు తట్టారు. సీతారామయ్య తలుపు తీసి వారిని ఇంట్లోకి పిలుచుక వెళ్ళాడు. అందరూ కూర్చున్నాక పెద్దమనిషి చెప్పటం మొదలుపెట్టాడు "మీకు తెలుసుననుకుంటా.... మన వెంకట్రంగయ్యగారు స్థానిక సహకార బేంకి కార్యదర్శి— వెంటనే సర్దగలనుగదా అని బేంకి తాలూకు రెండువేల రూపాయలను స్వంతఅవసరానికి ఉపయోగపెట్టుకున్నారు. కానీ, పైకాన్ని వెంటనే సర్దవలసివచ్చింది. వారికి పైక మేమీ అందలేదు ఇబ్బంది ఎవరికైనా వచ్చేదే అనుకోండి. ఈ అవసరాన్ని మీరు గడపని ఎడల ఆయన చిక్కుల్లో పడవలసివస్తుంది. ఆ పైకం అందినవెంటనే మీకు సర్దు తారు" అని వెంకట్రంగయ్యవైపు తిరిగి చూచాడు.

"ఈ అవసరానికి అందిలేదన్న మాటే గాని వారం రోజుల్లోసర్దేస్తాను" అని వెంకట్రరంగయ్య అన్నాడు.

ఆ చీకటిలోనే సీతారామయ్య ఖండువాపై మీద వేసు కొని ఎక్కడికో వెళ్ళాడు. ఉదయం తొమ్మిది గంటలకు పైకంతో యింటికి వచ్చాడు. పెద్దమనిషి చేతికి పైకాన్ని లెక్కబెట్టి యిచ్చి మౌనంగా నిల్చున్నాడు.

'మీకు చాలా శ్రమకలిగించాం. క్షమించండి నమస్కారం. సెలవు' అన్నాడు పెద్దమనిషి.

వెంకట్రంగయ్య వచ్చినప్పటి నుంచి అక్కగారితో ఒకటే గుసగుస. బావగారు పైకాన్ని పెద్దమనిషి చేతి కిస్తూండగా అక్కగారి వద్ద సెలవు తీసికొని వచ్చి నిలు చున్నాడు. పైకాన్ని పెద్దమనిషి వెంకట్రంగయ్య చేతి కివ్వగా జేబులోంచి పర్సును తీసి పైకాన్ని అందులో కుక్కి షర్టు జేబులో పెట్టుకొని కోటుగుండీలు పెట్టుకొని మామగారివద్ద సెలవు తీసుకొన్నాడు. ఇద్దరూ జట్కా ఎక్కారు. జట్కా వేగంగా సాగిపోయింది.

ఇలాంటి సంఘటనలు ఎన్నో జరిగాయి. మళ్ళీ సీత మెడ బోసి అయింది. సీతారామయ్య మళ్ళీ నగలు చేయించి పెట్టాడు. మౌనంగా సీతారామయ్య అన్నీ సహిస్తూనే ఉన్నాడు. మనస్సులో మాత్రం వెంకట్రంగయ్య అంటే అసహ్యంవేసిందాయనకు. పిల్లలతో ఆడుకొం టూన్నప్పుడు మాత్రం మనస్సు కులాసాగా ఉండేది. ఇతర సమయాల్లో ఆయనకు సీతదే దిగులైంది. సీత సుఖ పడటం లేదని ఆయన గ్రహించాడు. ఆ మాట భార్యతో అంటే వేరే కలహ కారణం అవసరం లేదు. ఎన్నో సార్లు వెంకట్రంగయ్య వల్ల ధన నష్టం ఔతోంది. దీనివల్ల పుణ్యమూ, పురుషార్థమూ లేవు. తనకోసం రాత్రింబవళ్లు కష్టించే రఘుకు ఇంత వరకు ఏమీ ధన సహాయం చెయ్య లేదు. భార్య స్వభావంలో చెడ్డమార్పు ఏర్పడింది. అస్త మానం ఎందుకో ఒకందుకు ఎవర్నో ఒకర్ని సాధిస్తూ ఉంటుంది. తల్లీ, తమ్ముడూ వేసిన వలలో పడి రఘును, శాంతను సహజ ప్రేమతో చూడలేకపోతోంది. తన మనస్సును నొప్పించాలని ప్రయత్నిస్తోంది. తనవిషయంలో ఉపేక్ష వహిస్తోంది. ముందు ముందైనా పరిస్థితులు చక్క బడేట్టు లేవు. ఈ విధంగా నిస్పృహ కలుగుతోంది ఆయనకు.

ఒక రోజు జానికమ్మ మధ్యాహ్న భోజన సమయంలో భర్తతో "నేను మా అమ్మగారి ఇంటికి వెళ్ళివస్తాను. రేపు దశమి. బాగుంటుంది పంపండి" అన్నది.

"అలాగే వెళ్ళు. మళ్ళీ త్వరగారా. అమ్మాయి పిల్లలతో అవస్థ పడలేదు" అన్నాడు సీతారామయ్య.

"అవస్థ అంటే ఎల్లా? లోకంలో అందరూ పడు తున్న అవస్థేనా? మనకేనా యీ అవస్థ? అందరి పిల్లల్నీ, అమ్మమ్మలూ, తాతాలే పెంచుతున్నారా? కూతుళ్ళనూ, అల్లుళ్ళనూ మామలే పోషిస్తున్నారా? అలికి అన్నం పెట్టడం ఊరికి ఉపకార మన్నారుట!" అంది జానికమ్మ.

తల వంచుకొని భోజనం చేస్తున్న సీతారామయ్య తల ఎత్తి భార్య ముఖంలోకి చూచి "ఏమిటీ ధోరణీ?" అని ప్రశ్నించాడు.

వెంటనే తల దించుకొని "నాకు ఒంట్లో ఏమీ బాగుం డటం లేదు. వెంకట్రంగయ్యతో చెప్పి ఏ వైద్యుడి దగ్గర నైనా కొంత కాలం మందు తింటాను" అంది జానికమ్మ.

"ఇష్టమైతే వైద్యం ఇక్కడుండే చేయించుకో వచ్చు. ఐనా నీ యిష్టం" అంటూ ఇంకా తినవలసిన మజ్జిగఅన్నాన్ని అయిష్టంగా అవతలికి నెట్టాడు. సీతారామయ్య.

మర్నాడే జానికమ్మ ప్రయాణం. వెళ్ళే సమయంలో జానికమ్మని శాంత కాగలించుకొని ఏడుస్తూ "త్వరగా రావే అమ్మా. ఒంటరిగా యీ పిల్లలతో వేగలేను. నాన్నకు వేళకు సరిగా భోజనం అమరదు. నీ మనుమడూ, మనుమరాళ్ళూ నీకోసం దిగులు పడతారు. వెంటనైనా తీసుకువెళ్ళవే" అన్నది.

"ఏం వద్దు— ఏమీ దిగులుపడరు అంది జానికమ్మ.

పిల్లలందరు అమ్మమ్మ కంటే ముందుగా ప్రయాణమై వచ్చి బండిలో కూర్చున్నారు. పిల్లల్ని బ్రతిమాలుతూ, కోప్పడుతూ, ఏవో ఆశలు పెడుతూ ఎలాగో దించారు. అమ్మమ్మవేపు చేతులు జాపుతూ బాబు ఏడుస్తున్నాడు. శాంత పిల్లవాణ్ణి తెచ్చి "ఒక సారి ఎత్తుకోవే, పాపం చేతులు జాచి, చూడవే ఏలా ఏడుస్తున్నాడో! మళ్ళీ ఎన్నాళ్ళకో మనుమణ్ణి ఎత్తుకొనేది" అన్నది.

"నీ కేమైనా పిచ్చా ఏం? చాటుకు తీసుకుపో. వేషాలు మరీ." అని గద్దించింది, జానికమ్మ. తాత తనను

బండి వేపుకు లాగుతున్న మనుమరాండ్రను గట్టిగా పట్టుకొని ఊగుతున్నాడు. శాంత చెక్కిళ్ళ వెంట కన్నీళ్ళు దొర్లుతున్నాయి. పిల్లలు ఏడుస్తున్నారు. సీతారామయ్య విచార భారంతో కృంగుతున్నట్లు కనపడ్డాడు.

నవధాన్యాలతో నిండిన బండి సాగిపోయింది. ఆమె వెళ్ళిన తర్వాత యిల్లు వెలితిగా కనపడ్డది. అందరి ముఖాల్లో దిగులు తాండవించింది. ఇంట్లో వున్న దైవ విగ్రహానికి ఎదురుగా కూర్చొని ధ్యాన ప్రయత్నం చేస్తున్నాడు సీతారామయ్య. ఆలోచనగా కూర్చొని స్థన్యాన్ని యిస్తున్నది బాబుకు తల్లి.

ఊళ్ళో అందరూ "ఏం జరిగిందేమిటి?" అని గుస గుసగా ప్రశ్నించుకున్నారు. గుస గుసగా జవాబులు కూడా చెప్పుకున్నారు కల్పనా శక్తిని బట్టి.

౯

నాల్గు నెలలైనా జానికమ్మ భర్తకు జాబు వ్రాయించలేదు. ఆనోటా ఆనోటా విన్న దాన్ని బట్టి సీతారామయ్యకు కొన్ని సంగతులు తెలిశాయి. జానికమ్మ ఆరోగ్యం ఇంకా చెడిపోయిందిట. రోజూ గుండెల్లో మంట వస్తూందట. వెంకట్రంగయ్య అందరితోను మామగారు, పెద్ద కూతురూ, అల్లుడూ అంటే పక్షపాత బుద్ధి గలవాడనీ, భార్యకు సరిగా వైద్యం చేయించనందువల్ల తనే ఆమెకు వైద్యం చేయిస్తూన్నాననీ చెబుతూ ఎన్నెన్నో దుర్భాషలాడినట్లు తెలిసి, సీతారామయ్య మనస్సుకు కష్టం కలిగింది. వెంటనే బయలుదేరాడు. ప్రయాణ శ్రమతో అల్లుని యింటికి వచ్చాడు. మంగమ్మ గాని, వెంకట్రంగయ్య గాని సరైన ఆదరణ చూపలేదు. సీత మాత్రం ఎంతో సంబర పడుతూ "నాన్న వచ్చాడు" అంటూ కాళ్ళకు నీళ్ళు తెచ్చి యిచ్చింది. మజ్జిగ దాహం తెచ్చి యిచ్చింది. మంచం మీద పక్క వేసి "కాస్సేపు పండుకో నాన్నా. బాగా ఎండ దెబ్బ తిన్నట్టున్నావే?" అన్నది.

"ఔనమ్మా! అబ్బా! ఏమి యెండ, ఏమి ఎండ!" అంటూ మంచంమీద పడుకొని దగ్గరగా నిల్చొన్న సీతవైపొక సారీ, దూరంగా గోడకు ఆనుకొని నిల్చొన్న భార్యవైపొక సారీ చూచాడు. సీత మెడలో మంగళ సూత్రం తప్ప ఆభరణాలేమీ లేవు. చూచి ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు. భార్యను చూచి మనస్సులో 'గ్రహం ఆవహించిన మనిషిలా ఎంత మారిపోయింది! ఏమిటిది భగవంతుడా? నన్ను అన్ని విధాలా పరీక్షించదలచుకొన్నావా? సరేగానీ' అనుకున్నాడు. పైకి అడిగాడు—"ఏమి జబ్బని చెప్పారు? ఏమన్నా సుగుణంగా ఉందా? ఇక్కడ యింకా ఎంత కాలం ఉండాలి? ఒక్క జాబన్నా వ్రాశారు కారేం?" అని అడిగాడు సీతారామయ్య.

జా : నయం కావటానికేనా యీ జబ్బులూ, ఈ బుద్ధులూ?

"ఏమిటీ? బుద్ధులా?" అని గ్రుచ్చి అడిగాడు విసుగుతో సీతారామయ్య.

అమ్మ మనస్సు మారిపోయిందిలే నాన్నా. ఆమె పరిస్థితి మునుపటి మాదిరిగా లేదు. జీర్ణకోశంలోనో, పేగులలోనో వ్రణం ఏర్పడుతున్నదట. విశ్రాంతి, మన శ్శాంతీ అవసరమని డాక్టరు చెప్పాడు. ఈ రెండూ లేక పోవటమే ఈ జబ్బు రావటానికి కారణం అన్నాడు. జబ్బు ప్రమాదస్థితికి రాకుండా ప్రయత్నిస్తున్నాట్ట. ఆపరేషన్ కూడా అవసరం వుండొచ్చునన్నాడు. ఈ సంగతులన్నీ నీకు జాబు వ్రాస్తానని చెబితే అమ్మ "ఏం వద్దు, ఏం వద్దు" అంటూ వ్రాయనివ్వలేదు. అని సీతంది.

"మందు తీసుకువెళ్ళి ఇంటి వద్ద వుండి తింటూ ఉండటానికి డాక్టరు వొప్పుకోలేదా?" అని సీతారామయ్య అడిగాడు.

"కొంతకాలం ఆ విధంగా చెయ్యవచ్చునని డాక్టరు అన్నాడు. అందుకు అమ్మే వొప్పుకోలేదు. అక్కడ వుంటే ఆమెకు సరిగా ఉండదట." అంది సీత.

"ఇక కర్తవ్య మేమిటి?" అని సీత వైపు, జానికమ్మ వైపు చూచాడు సీతారామయ్య. జానికమ్మ దూరంగా కూర్చున్న తల్లివైపు చూస్తూ "దేవుడు నా ముఖాన ఎట్లా వ్రాసివుంటే అట్లా జరుగుతుంది." అని నెమ్మదిగా నడుస్తూ వెళ్ళి తల్లి ప్రక్కనే కూర్చున్నది. మంగమ్మ తన నుదుటి మీద వ్రేలు పెట్టి గీచుకొంటూ "నుదుటన్ వ్రాసిన వ్రాతకన్న గలదా నూరేండ్లు చింతించినన్" అని అన్నది.

"ఈ వేదాంతమే మన కొంపలు తీస్తున్నది" అని నిరాశతో కళ్ళు మూసుకొని ప్రయత్న పూర్వకంగా నిద్రపోయాడు, సీతారామయ్య.

డాక్టరుతో అన్ని సంగతులు మాట్లాడిన తర్వాత మర్నాడు ఉదయమే యింటికి ప్రయాణమైనాడు సీతా రామయ్య. ఇంకొక రోజైనా ఉండమని సీత బ్రతిమా లింది. సరేనని ఉన్నాడు. ఆ మర్రోజు ఉదయమే ప్రయాణ మౌతూ ఒక వంద రూపాయల నోటును సీత చేతికిచ్చి "ఇది మీ అమ్మ కివ్వమ్మా. నేను డాక్టరుకు యాభై రూపాయలిచ్చాను. అన్ని సంగతులు మాట్లాడాను. అవసర మైతే జాబు వ్రాయి. డబ్బు పంపుతాను. డాక్టరుకు ఎంత ఇవ్వవలసి వచ్చినా నేనే యిస్తాను. వెంకట్రంగయ్య ఏమైనా ఇస్తాడేమో ఏమీ ఇవ్వవద్దను. అక్కడికి వస్తే మీ అమ్మకు ఏమీ సుఖం వుండదన్నదిగదా. రోగికి ఇష్టం వచ్చిన చోట ఉండడమే మంచిదని డాక్టరన్నాడు. ఈ వంద రూపాయలు (ఇస్తూ) నువ్వు తీసుకో. ఆపరేషన్ నాటికి అందరం వస్తాం."

సీత తన తండ్రి పాదాలనుండి దృష్టిని మరల్చుకొని తండ్రి చేతిలోని పైకాన్ని అందుకొంటూ ఆయన ముఖం లోకి చూచింది. "ఎంత మారిపోయాడు నాన్న? వృద్ధా ప్యమూ, విచారభారమూ రెండూ కలిసి ఒక్కసారే చుట్టు ముట్టుతున్నాయి. విశాల ఫాలభాగాన్ని ముడుతలు ఆక్ర మించాయి. ఆ పెద్ద పెద్ద కళ్ళల్లో అశ్రువులు సుళ్ళు తిరుగుతున్నాయి. పొరలి వచ్చే దుఃఖాన్ని గాద్గద్యం ధ్వని స్తోంది." అనుకున్నది.

అక్కడ ఇతరు లెవ్వరూ లేరు. తండ్రిని కూతురు "నాన్నా, ఏమిటి అదీ, నీ పిచ్చిగానీ" అని చనవుతో గదమినట్లుగా కసిరింది. మళ్ళీ అనునయంగా ఆశ్చర్యాన్ని ప్రకటించే స్వరంతో "అది సరేగాని నాన్నా, అల్లుడుగారు నీతో మాట్లాడినట్లు లేదే" అన్నది.

"లేదమ్మా, అత్తగారు మాట్లాడలేదు. మీ అమ్మకూడా సరిగా మాట్లాడలేదు. మీ అమ్మ స్థితి చూస్తే నా గుండె పగిలిపోతోంది. "ఎంత ఓర్పూ, ప్రేమా గల మనిషి! సంతోషంతో కల కలలాడే ఆ ముఖం మొట మొటలా డుతూ ఏ విధంగా మారిందో. ఈ విధంగా మారటానికి కారణం యిప్పుడు గ్రహించాను. వీరి స్వభావాలు తెలుసు కోకుండా, పై పై వేషభాషలు చూచి, ఐనవాళ్ళని భ్రమ పడి ఎంత అపకారం చేశానే తల్లీ నీకు" అని వణకు తున్న స్వరంతో "పోయివస్తా నమ్మడూ" అని లేని గంభీ రతను తెచ్చి పెట్టుకొని బయలుదేరాడు సీతారామయ్య.

వాకిలివరకు తండ్రిని అనుసరిస్తున్న కూతురు నెమ్మదిగా అంటోంది— "నాన్నా, నీ కిప్పుడు తెలిసిందా నేను కష్ట పడుతున్నదీ, సుఖ పడుతున్నదీను? నా అదృష్టానికి నిన్ను నిందించుకోవద్దు. నువ్వేమైనా తెలిసి చేశావా? అమ్మ ఇప్పుడు స్వయంగా చూసి తెలుసుకున్నది. మొదట నేను చెబితే నమ్మక నన్నే కోప్పడ్డది. ఇప్పుడు వారి స్వభావాన్ని మార్చలేకా, నా కష్టాన్ని చూడలేకా మధ్య నలిగి చస్తోంది. "నా కర్మం నాది. నీకెందుకు నీవు వెళ్ళవే" అంటే, 'నేనే నీ గొంతు కోశాను' అని కుమిలి, కుమిలి ఏడుస్తోంది."

"ఉండు అమ్మడూ ఉండు. వెళ్ళివస్తాను" అని తండ్రి కూతుర్ని ఆపి దుఃఖంతో నిండిన హృదయాన్ని చేతితో పట్టుకొని అడుగులు తడబడుతుండగా వేగంగా నడుస్తూ వెళ్ళాడు.

సీత దుఃఖాన్ని ఆపుకోలేక పడక గదిలోకి పరుగెత్తు కొంటూ వెళ్ళి పక్కమీద పడి కన్నీళ్ళతో దిండును తడు పుతూ వెక్కి వెక్కి ఏడుస్తోంది.

(సశేషం)

"విషమునకును, విషయమునకును, బహు దూరమైన తారతమ్యము గలదు. విషము, తిను వానిని మాత్రము చంపును గాని, విషయమును స్మరించిన వెంటనే హననము చేయును. అనగా కాలకూట విషమునకంటె విషయవాంఛ మహా క్రూరమైన విషమని చెప్పాచున్నది."



# 'శూన్యం లో ఎంకి'

శ్రీ సి. రా మ కృ ష్ణా జీ.

వర్షధారలతో భూమ్యాకాశాలు ఏకమయ్యాయి. నిశీథంతో విశ్వమానవ ప్రపంచం నిండిపోయింది. తళుకు తళుకు మనే మెరుపులలో వర్షధారలు మిరుమిట్లు గొలుపు తున్నాయ్. ఉరుముల ధ్వనులతో చెవులు చిల్లులు పడుతున్నాయ్. ఈ తాత్కాలికమైన వెలుతురును ఆధారం చేసుకొని ఎంకడు యిల్లు చేరుకున్నాడు. తలుపు కొట్టబోతూండగా గోడకూలిన శబ్దంతో, 'అమ్మో' అన్న, బాధతో కూడిన, తన ఎంకి గొంతు విన్నాడు. ఆవేశంతో తలుపును గట్టిగా నెట్టాడు. గడ విరిగింది. పిల్లలు గొల్లుమన్నారు. తలుపులు తెరచుకున్నాయ్. పాకపై నుండే కప్పు చాలా భాగం ఎగిరిపోయింది. ఇల్లంతా చీకటిమయం. శబ్దాన్ని ఆధారంగా చేసుకొని గోడ పడిన తావుకు వెళ్ళాడు. మెరుపుల వెలుతురులో మూల్గుతున్న మగువను చూచాడు. ఎంకి మీద పడిన రాళ్ళు, మట్టి తొలగించాడు. ఎంకి మూల్గుడుతోబాటు నలుగురాడ పిల్లలు, కొడుకు ఏడ్పు హెచ్చించారు. ఎంకి తన ఐదు గురు బిడ్డలను ఎంకని చేతిలో పెట్టి ప్రాణాలు విడచింది. వర్షం తగ్గుతూంది. హోరు గాలి శ్రుతి రెచ్చుతూంది. వీనితో పాటు ఉరుములు, మెరుపుల విషయం చెప్ప నలవికాదు.

తెల్లవారింది. తుఫాను తగ్గలేదు. ఎంకి శవం తనకు తొందరగా అంత్య క్రియలు సలుపమని తొందర చేస్తూంది. ఆ గాలివానలోనే ఎంకడు తోటివారికి ఈ విషాద సంఘట నను తెలిపాడు. గాలివాన ఉధృతం తగ్గలేదు. ఎలాగైతే నేం, ఎంకిని భూ సాపితం చేశాడు.

మూడు రోజులకు గాలివాన దూకుడు తగ్గింది. కోత లకు సిద్ధంగా వున్న ఎంకని కౌలుపొలంలోని పంట ఎంకి వలె మన్నుపాలయింది. "ఎంకని అదృష్టం ఎంకితోనే ఎడబాటయింది" అని లోకులు అన్నారు. ఎంకడు ఎంకి కర్మకాండాదులను ఉన్నదానిలోనే బాగా జరిపాడు. నాల్గు సంవత్సరముల కడపటి కూతురు "నాయనా! అమ్మేడ కెల్లింది?" అని అడుగుతూంటే, ఎంకని హృదయాంత రాళం తరుక్కు పోతూంది.

ఎంకడు, ఉన్నవూరు కాదని, ఊరు విడిచి పోవ సన్నద్ధు డయ్యాడు. తోటివాళ్ళు, "ఈ కసు గాయలతో ఏడ బోతావేరా! తాన బలం లేకోకొండా ఏం సేత్తావేం!" అన్నారు. "ఎంకి లేని ఈ పాలెంలో నిముసం కూడా గడపలే" నన్నాడు. బంధు మిత్రుల వద్ద శలవు పుచ్చు కున్నాడు. "నీ కర్మం" అన్నారు వాళ్ళు లోలోపల.

పాలెం సివారు గ్రామంలోని బడి పంతులుతో, తన కొడుకు చేత పని చేయించుకొని, ఇంత ముద్దపెట్టి, చదువు చెప్పమని బతిమాలి ప్రవేశపెట్టాడు. విడువలేక విడువలేక కొడుకుని వదలి, తనయుని కూడ తననుండి దూరం చేసుకొంటూన్నందుకు తనను తానే దూషించు కొంటూ, విధిలేక, పోనీ వాడయినా చదువుకొని పరీక్షలు ప్యాసైతే కలకటేరు చేస్తాడని వూహించి, పొంగి పొరలు తున్న విషాదాన్ని, ఆనంద తరంగాలుగా మార్చుకొని ముసి ముసి నవ్వుతో తన నలుగురు కూతుళ్ళను వెంట పెట్టుకొని బయలుదేరాడు.

ప్రక్కన వున్న పట్టణానికి వెళ్ళి, మిల్లులో నౌకరుగా చేరాలని నిశ్చయించుకొన్నాడు. చిన్నపిల్ల "అమ్మ కాడికా నాయనా"! అంది. "అ.........వు.........నే" అని గద్గద కంఠంతో పిల్లను సంతృప్తి పరచాడు. తన వద్ద నున్న కడపటి కొద్ది అణాలతో బియ్యం తెచ్చి జావచేసి ఆ పిల్లలకు పంచాడు. ఆ మజిలీలో చిన్నదాన్ని చంకన వేసుకొని మళ్ళీ పిల్లలతో ప్రయాణం పూర్తి చేయ వూనాడు.

ప్రయాణం కొంత దూరం సాగింది. సూర్యుడస్త మించాడు. "మేము నడవలేం బాబయ్యా, యీ చీకట్లో," అంది పెద్దపిల్ల. తన పిల్లలు తన ఎదుట ఇట్టి దురవస్థల పాలగుట సహించలేకపోయాడు. చేసేదిలేక, అవల చెరువుగట్టుపై నున్న చెట్టు క్రింద తలపైనున్న కండువా తీసి పరచాడు. భుజాన వున్న కొద్దిపాటి సామా నుల సంచి తలల క్రిందకమర్చాడు. ఎంకని గుండెల మీద నాలుగేండ్ల సీత బల్లిలా హత్తుకొని పోయింది. కొంచెమెడంగా ముగ్గురు ఆడపిల్లలు పడుకొన్నారు.

పక్షులు కిల కిల శబ్దం మొదలు పెట్టాయి, "రామీ! లచ్చీ! పారతీ! లేండే తెల్లార్తోంది" అన్నాడు. సమా

ధానం లేదు. అలసిపోయిన వాళ్ళను లేపడమెందు కను కున్నాడు. బాగా తెల్లవారింది. పిల్లల కవతల పాము కుబుసము చూచాడు, గొల్లుమన్నాడు. ఎంకని ఏడ్పుకు చిన్నపిల్ల లేచి "రామీ! గంజే" అని అక్కమీద పడి ఏడ్చింది. అక్కడే వున్న స్మశాన వాటికకు ముప్వురనీ చేరవేశాడు. చిన్నపిల్ల ఆకలి అని గోడు మొదలు పెట్టింది. బలవంతాన్న, చెరువులోని నీళ్ళు త్రాగించాడు, సీత చేత. పిచ్చివాని వలె పిల్లతో పట్టణం వైపు పయనం ప్రారంభించాడు. మధ్యాహ్నానికి పట్టణం చేరాడు. బిడ్డ ఏడుపు ఎక్కువయింది. "కూనకై కాస్త గంజి పొయ్యం డమ్మా" అని ఒక యింటామెను అర్థించాడు. "నిజంగా బిడ్డ కోసమే అయితే, ఏ అనాధ శరణాలయంలోనో ఆ పిల్లను చేర్చక పోయావా!" అంది ఆ యిల్లాలు.

మంచి సలహాయే ఇచ్చిందని ఆ యింటావిడను మదిలో మరీ మరీ ఆశీర్వదించాడు. అనాధ శరణాలయం కనుక్కొని, తన స్థితి గతులను శరణాలయాధి పతికి చెప్పుకొని, అచ్చట తన కడపటి కూతుర్ని చేర్చాడు. తన పొట్ట కొరకు, కూలిచేయ నిశ్చయించి, మిల్లుయజమానికి తన జీవిత గాథ నంతా చెప్పుకొని, కూలిపని యిప్పించమని ఏడ్చాడు. "ఇదొక తంతు. మిల్లులోని సామానులు ఎత్తుకొని పోవడానికి చాలా సులువే కని పెట్టావే. దొంగ వెధవా!" అన్నాడు యజమాని. ఎంకడు, నిరాశ నిస్పృహలతో బయటికి వచ్చాడు.

ఎక్కడికి వెళ్ళాలో, ఏం చేయాలో తోచదు. మతి లేనట్లు వీధులన్నీ తిరిగాడు. ఆకలి బాధకు తాళ లేక పోయాడు. ఎన్ని నీళ్ళు త్రాగినా కడుపులో మంట చల్లారలేదు. "తిండి దొరకనప్పుడు నీళ్ళు మాత్రం ఎందుకు త్రాగాలి" అని అనుకున్నాడు. పట్టణంలో వుంటే లాభం లేదనుకొని, ఏదైనా ఒక పల్లెటూరు చేరుకుందా మని రోడ్డు పట్టుకుని ప్రయాణం సాగించాడు. ఎక్కడికి వెళ్ళాలో, ఏ దారిగుండా పోవాలో అతనికి తెలియదు. నడవగా, నడవగా చీకటి పడింది. ఆ కారునల్లని కాళ రాత్రిలో అలాగే ముందుకు పోసాగాడు. ఆయాసాన్ని కాళ్ళ నొప్పిని లెక్క చేయకూడదని నిశ్చయించు కున్నాడు.........

అప్పటికెంత రాత్రయిందో అతనికే తెలియదు. ఇక నడువలేననుకొని రోడ్డు ప్రక్కన వున్న ఒక ఈతచెట్టు దగ్గర కూలబడిపోయాడు. జీవితంలో బాధ తప్ప యింకేమీ లేదనుకున్నాడు. 'తన మెదడులో వున్నది ఏదైనా ఒక ఆలోచనా లేక శూన్యత్వమా' అనిపించింది. అలా ఆలోచించి లాభం లేదనుకున్నాడు. 'ఏమిటిదంతా! చాలా తమాషాగా వుందే! "చావు బ్రతుకుల సంధ్యా కాలం" అంటారు ఇదే కాబోలు?' అనుకున్నాడు. అతనికి కళ్ళ ముందు ఒక దివ్యజ్యోతి వెలిగినట్లయింది. దూరాన తన ఎంకి ముప్వురు కూతుళ్ళతో దర్శన మిచ్చింది. మరొక ప్రక్కన కొడుకూ, సీత కళ్ళ ముందుకు వచ్చినట్లయింది. "ఎంకీ" అని గట్టిగా అరిచాడు. ఎంకి తన భర్తను "రమ్మ"ని పిలిచింది. ఆశతో, ఆదుర్దాతో, చేతులు చాపుతూ ఆహ్వానించింది. ఆమె ఆలింగనలో శాశ్వత మైన శాంతి పొందాడు వెంకడు.

"బాటసారి కళేబరంతో
శాత వాయువు ఆడుకొంటూంది....
విడిన మబ్బుల నడుమనుండీ
వేగుజుక్క వెక్కిరించింది."



---

జీవుడొక్క పర్యాయము జన్మమెత్తుకొనును. జీవుని పూర్వ పరిణామమును ననుసరించి, తత్ భవిష్యదవసరమునుబట్టి విశ్వ ప్రకృతియొక్క మూలవస్తువులనుండి మనఃప్రాణ శరీర ములొ కొక్కతూరి ఏర్పడుచున్నవి.

# అల్లికలు — జంపర్

క్రిందటి నెల అల్లికల శీర్షికలో నిట్టింగు కుపయోగించు సంకేతిక పదావళి తెలుపడమైనది. ఇప్పుడు సాధారణమైన జంపర్ అల్లు పద్ధతిని గూర్చి తెలుపు చున్నాము.

జంపరు అల్లుటకు కావలసిన పరికరములు: 7 ఔన్సుల 3 పేట్లఊలు, నెం 9, సూదులురెండు. నెం 12, సూదులు రెండు. ఆరు బొత్తాములు.

కొలతలు : — పొడవు : 19 ½ అంగుళములు. ఛాతీ : 34 అంగుళములు. (ఒక అంగుళమునకు 7 కుట్లు వచ్చునట్లు అల్లవలెను.)

నెం. 12. సూదులతో 99 కుట్లు కాస్టింగాన్ చేయవలెను. తరువాత నమూనా ఈ క్రింది విధముగా అల్లవలెను.

1. వరుస: ని 4.* ప 1. ని4. స్టారు దగ్గరనుండి చివర వరకూ అదేవిధంగా తిరిగిఅల్లుచుండవలెను.

2. వరుస: మొదటి నుండి చివరవరకూ నిట్టు.

(ఈరెండు వరుసలూ కలసి నమూనా ఏర్పడును.)

పై విధముగా 4½ అం॥ వెడల్పుగువరకూవేసి తరవాత 9.వ నెంబరు సూదిమీదకు మార్చవలెను. అప్పుడు పైమాదిరిగా అల్లుతూ ప్రతి 7.వ వరుస రెండుచివర్ల ఒక్కొక్కవైపు ఒక్కొక్క కుట్టు చొప్పున హెచ్చు చేయుచూ, తరువాత ప్రతి 6. వ. వరుసలో కూడా ఇదేమాదిరిగా హెచ్చు చేయుచూ సూదిమీద 119 కుట్లగువరకు అల్లవలెను. ఇదే మాదిరిగా అల్లుతూ, అల్లినదంతా 12 అం॥ వెడల్పు అగు వరకూ అల్లవలెను.

చంకదగ్గర ఆకారమేర్పడుటకు : 12 అం॥ వెడల్పు అల్లిన తరువాత రెండు వరుసలలో మొట్ట మొదటి 7 కుట్లు కాస్టాఫ్ చేయవలెను. అప్పుడు ఒక వరుస విడిచి మరియొక వరుసలో ఒక్కొక్క వైపు ఒక్కొక్క కుట్టు చొప్పున రెండు చివర్లను తగ్గించుచూ సూదిమీద 95 కుట్లు మిగులువరకూ అల్లవలెను. ఈమాదిరిగా వేరేఏమీ ఆకారం లేకుండా అల్లినదంతా 17 అం॥ వెడల్పగు వరకూ వేసి ఆఖరి వరుస నిట్టువేసి పూర్తిచేయవలెను.



మెడకు ఆకార మేర్పరచుటకు : తరువాత వరుసలో 44 కుట్లవరకూ నమూనాఅల్లి తరువాత 7 కుట్లు వదులుగా కాస్టాఫ్‌చేసి, మిగిలిన కుట్లను నమూనా అల్లవలెను. చివరి 44 కుట్లుతో అల్లుట ప్రారంభించి (మిగిలిన 44 కుట్లును వేరేసూదిమీదకు మార్చవలెను) నమూనా వేయుచూ మెడవైపు అంచుదగ్గర ప్రతి వరుసలో ఒక్కొక్క కుట్టు తగ్గించుచూ సూదిమీద 32 కుట్లు వచ్చువరకూ అల్లవలెను. 32 కుట్లు మిగిలిన తరువాత ఆకారమేమీ లేకుండా అల్లినదంతా 19 ½ అం॥ వెడల్పగు వరకూ చంకవైపు ముగింపు వచ్చేటట్లు చూచి అల్లవలెను.

భుజముల ఆకారము తేల్చుటకు : తరువాత వరుస మొదటి 8 కుట్లు కాస్టాఫ్‌చేసి మిగిలినకుట్లు నమూనావేయవలెను. తరువాత వరుసకూడా పూర్తిగా నమూనా వేయవలెను. ఇదేవిధముగా చివరి రెండు వరుసలు రెండుసార్లు తిరిగి వేయవలెను. మిగిలిన కుట్లన్నీ కాస్టాఫ్ చేయవలెను. అప్పుడు రెండవ భుజమువైపు మిగిలిన 44 కుట్ల వరుసలో మెడవైపు చివర ఊలునుచేర్చి మొదటివైపు అల్లిన మాదిరిగా అల్లవలెను. (ఇప్పటి వరకూ అల్లినది జంపర్ ముందుభాగము)

జంపర్ వెనుక భాగము అల్లుట : ముందువైపు అల్లిన మాదిరిగా చంక ఆకారము పూర్తిఅగు వరకూవేసి, తరువాత 95 కుట్లతో 13½ అం॥ వెడల్పగు వరకూ అల్లి, ఆఖరి వరుస నిట్టు అల్లి ముగించవలెను. వెనుకబొత్తా

ములు పెట్టుకొనుటకు వెనుక భాగమును తరువాత వరుస 52 కుట్లు నమూనావేసి, మిగిలిన కుట్లను వేరే సూదిమీదకు మార్చి, మొదటవేసిన 52 కుట్లతో నమూనా వేయుచూ 1 అం॥ వెడల్పు అగువరకూ అల్లి, బొత్తాములు పెట్టు కునేవైపు చివర ముగించవలెను. తరువాత వరుస బొత్తాము కాళీ ఏర్పడుటకు ని 4. (ఊలు ముందుకువేసి) ని 2 (ఒకేసారి) వేసి, చివరవరకూ నమూనాఅల్లి పూర్తి చేయవలెను. అల్లినదంతా 19 ½ అం॥ వెడల్పగు వరకూ ప్రతిఅంగుళముకు ఒక్కొక్క కాళీ (బొత్తాము వచ్చునట్లు మరి నాలుగు కాళీలు అల్లి బొత్తాము పెట్టుకొనేవైపు ముగింపు వచ్చు నట్లుచూచుకొని అల్లవలెను.

మెడ భుజములు ఆకారము లేర్పరుచుటకు :—

1. వరుస : మొదటి 16 కుట్లు కాస్టాఫ్ చేసి తరువాత నమూనా అల్లవలెను.

2. వరుస : మొదటి 8 కుట్లు కాస్టాఫ్‌చేసి తరువాత చివరి రెండు కుట్లవరకు నమూనా అల్లవలెను. ఆ ఆఖరి రెండు కుట్లు ని 2. (ఒకేసారి)

3. వరుస : ని 2. (ఒకేసారి) మిగిలినది నమూనా అల్లవలెను. ఆఖరు రెండు (2, 3) వరుసలు చివరవరకూ రెండుసార్లు తిరిగి అల్లవలెను.

6. వరుస : 8 కుట్లు కాస్టాఫ్ చేసి, మిగిలిన కుట్లు నమూనా అల్లవలెను.

7. వరుస : చివరవరకూ నమూనా

మిగిలిన కుట్లన్నీ కాస్టాఫ్ చేయవలెను.

రెండవవైపు మిగిలిన 43 కుట్లలో బొత్తాములు పెట్టు కునేవైపు చివర ఊలునుచేర్చి 9 కుట్లను కాస్టాఫ్ చేయ వలెను,

మొట్ట మొదటినుండి అల్లినది 19½ అం. వెడల్పగువరకూ అల్లి బొత్తాము పెట్టుకునే వైపు పూర్తి అగునట్లు చూచుకొని అల్లవలెను. భుజములు, మెడ ఆకారము తేల్చుటకు మొట్ట మొదట ముందు భాగమునకు అల్లిన మాదిరిగానే అల్లవలెను,

చేతులు : 12 వ. నెంబరు సూదులతో 79 కుట్లువేయ వలెను. మొట్ట మొదట అల్లిన మాదిరిగనే నమూనా అల్లుచూ 1 అం॥ వెడల్పగువరకూ వేసి తరువాత వరుస ఒక్కొక్క ప్రక్క ఒక్కొక్క కుట్టుచొప్పున రెండు ప్రక్కలా హెచ్చుచేసి, తరువాత ప్రతి 6. వ. వరుసలో కూడా అదేవిధముగా హెచ్చుచేయుచూ 2. అం॥ వెడల్పగు వరకూ అల్లవలెను.

చేతికి పైభాగము ఆకారము తేల్చుటకు : ప్రతి వరుస రెండు వైపులా ఒక్కొక్క వైపు ఒక్కొక్క కుట్టు చొప్పున తగ్గించుచూ సూదిమీద 65 కుట్లుండు వరకూ తగ్గించవలెను. తరువాత ఒక వరుస విడిచి మరి యొక వరుస చొప్పున అదేవిధముగా ఒక్కొక్క వైపు ఒక్కొక్క కుట్టు చొప్పున రెండు వైపులా తగ్గించుచూ సూదిమీద 23 కుట్లుండు వరకూ అల్లవలెను. మిగిలిన 23 కుట్లు కాస్టాఫ్ చేయవలెను.

మెడపట్టీ : భుజములు రెండూ కలిపి కుట్టిన తరువాత అల్లికను మంచివైపు మనవైపుంచుకొని 12. నెంబరు సూదులతో బొత్తాములు పెట్టుకునే వైపు మొదలిడి భుజము వరకూ మెడ వెనుకవైపు 25 కుట్లు నిట్టు అల్లి; భుజముదగ్గరనుండి రెండవభుజమువరకూ ఎదుటి భాగము మెడ పట్టీకి 53 కుట్లు నిట్టుఅల్లి తరువాత రెండవ భుజము నుండి బొత్తాములు పెట్టుకునే వైపు చివరవరకూ మెడ వెనుక 25 కుట్లు నిట్టు అల్లవలెను.

తరువాత 5 వరుసలు గార్టరు స్టిచ్ చేయవలెను. ఈ 5 వరుసలలో 3. వ వరుసలో, ముందు మనము బొత్తాములు పెట్టుకొనుట కేర్పరచిన మాదిరిగా ఆరవ బొత్తాము పెట్టుకొనుటకు అదేవరుసలో వచ్చేటట్లు చూచి అల్లుకొనవలెను. తరువాత కాస్టాఫ్ చేయవలెను.

అన్ని భాగములు తిరుగవైపు పైకిఉంచి, తడిగుడ్డ వేసి, ఇస్త్రీచేయవలెను. తరువాత జంపర్ ప్రక్కలు చేతులు కలిపి కుట్టి; బొత్తాములు కూడా కుట్టవలెను.



# గోదావరి వరదబాధితులకు గృహనిర్మాణం

# మహిళా సంఘాలు, మద్రాసు

——: :——

మద్రాసులో నున్న మహిళలందరు కలిసి, గోదావరి వరద బాధితుల సహాయనిమిత్తార్థమై సొమ్ము వసూలుచేసి వారికి ఇండ్లు కట్టించు నుద్దేశ్యముతో మద్రాసునందు వేరు వేరు ప్రాంతములలో (టి. నగరు, అడయారు, జార్జిటౌను, ట్రిప్లికేను, మైలాపూరు. రాయపేట, కీల్‌పాక్) మహిళా సంఘాలు స్థాపించి ఈ సొమ్ము వసూలు చేయుటకు ప్రారంభించిరి.

12—12—53 తేదీ శనివారం సాయంత్రము 5 గం॥ లకు ఈ కమిటీలన్నీ శ్రీమతి రమణమ్మా చంద్రారెడ్డిగారి ఆధిపత్యమున ఆంధ్రమహిళాసభా భవనములో సమావేశమైరి. శ్రీమతి సావిత్రీ రామకృష్ణగారి ప్రార్థనతో సభ ప్రారంభమైనది. ఇప్పటికి వసూలయిన మొత్తం సొమ్ము 8, 800 రూ. లతో రాజమహేంద్రవరములో తగుస్థలములుచూచి, స్వయముగా యిండ్లు కట్టుటకు నిర్ణయించిరి. అందుకుగాను శ్రీమతి కె. రామసుబ్బమ్మా కోటిరెడ్డి (అఖిలభారత ఆంధ్రరాష్ట్రి మహిళాసభ ప్రెసిడెంటు) శ్రీమతి. సి. చంద్రమతిగారు, (మాజీ ప్రెసిడెంటు ఐ. డబ్లియు. సి. ఆంధ్రరాష్ట్రి మహిళా సంఘం) శ్రీ. ఎ. వివేకానందాదేవి బి. ఎ. (రాజమండ్రి మున్సిపల్ కౌన్సిలర్, ఎ. ఐ. డబ్లియు. సి. ఆంధ్రరాష్ట మహిళాసభ తూర్పు గోదావరి జిల్లా కార్యదర్శిని) గార్లను కమిటీగా నిర్ణయించడమైనది. రు. 100. కి. ఒక తాటాకు యిల్లు తయారగును. 100 రు ఇచ్చిన వారిపేర ఆ యిల్లు కట్టుటకుగాను, 100 యిండ్లు కట్టి ఆ కాలనీకి "మద్రాసుమహిళా కాలనీ" అని పేరు పెట్టుటకుగాను నిర్ణయించిరి. ప్రెసిడెంటు శ్రీమతి రమణమ్మా చంద్రారెడ్డిగారు ఇపట్పి వరకు టి. నగరు కమిటీవారు రూ 3300 లు. అడయారు కమిటీవారు రూ3660 లు. జార్జిటౌను కమిటీవారు రూ. 1700. లు వసూలు చేసినట్లు తెలుపుతూ, టి. నగరు కమిటీ ట్రెజరరు శ్రీమతి కమలమ్మా సూర్యారావు, కార్యదర్శిని శ్రీమతి ఎమ్. లక్ష్మీకాంతం కొండలరావు, అడయారు కమిటీ ట్రెజరరు ముత్యాల రాణీ రాజ్యలక్ష్మమ్మ కార్యదర్శిని శ్రీమతి విశాలక్ష్మీ రామనాధన్, జార్జిటౌన్ కార్యదర్శిని శ్రీమతి సతీతులసి కె. వి. స్వామి, ట్రెజరర్ శ్రీమతిధనలక్ష్మీ సి. ఎస్. మూర్తిగార్లను ప్రశంసించుచూ వారు చేసిన సేవ శ్లాఘ్యనీయమని నుడివిరి. శ్రీమతి చంద్రమతిగారు ఉపన్యసిస్తూ "పై సంఘాలవారు కొద్ది కాలములో పని మొదలుపెట్టి, ఉత్సాహముతో, ఇటి పనులలో అంతరాయము కలుగకుండ, వాటి నన్నిటిని నిర్వర్తించి, తదుపరి, నిధి వసూలుకై బయదేరి చక్కగ వారి కర్తవ్యములను నిర్వర్తించిరి. ముఖ్యముగ అందరికన్నా, చాల అలస్యముగ నిధి వసూలు జేయుట మొదలిడి, ఎక్కువ మొత్తమును వసూలు చేసిన టి. నగరు, అడయారు జార్జిటౌను కమిటీ వారు ప్రశంశనీయులు" అని నుడివి, అన్ని కమిటీలవారికి సభవారి తరుపున అభివందనములర్పించిరి. జనగణ మనతో సభ ముగిసినది.



స్వీకారం

జీవితం

(సాంఘిక నాటకము)

రచయిత: మర్నూరు సత్యనారాయణ.

వెల రూ 1–8–0

వివరాలకు: మర్నూరు సత్యనారాయణ.

ఆంధ్రనాటక సాహిత్య సమం. జంషెడ్పురము.

* * *

సతి చాలాంత్రపు శేషమాంబ జీవిత చరిత్ర.

రచయిత: విద్వాన్ దువ్వూరి సూర్యనారాయాణశాస్త్రి.
కాకినాడ.

ఈశావాస్యోపనిషత్తు, వేదాంత డిండిమము

కృతికర్త:- 'కవిశేఖర' పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి.

దొరకుచోటు: పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి (పండితుడు)
మహారాజా సంస్కృత కళాశాల, విజయనగరము.
రాపర్తి కన్నయ్యపంతులు, విజినిగిరి, కొత్తా ంపోష్టు,
శృంగవరపుకోటతాలూకా. (విశాఖజిల్లా)
ఈశావాస్యోపనిషత్తు వెల: రూ 2–8–0
వేదాంతడిండిమము వెల: అ. 0–6–0

* * *

గండకి

లేక

(సాలగ్రామ జననము)

హరికథ

రచన : — లింగంగుంట సీతారామయ్య.

దొరకుచోటు : నూతలపాడు (పోష్టు)

(గుంటూరు జిల్లా) వెల :– అ. 0–8–0





సారథీవారి "అంతామనవాళ్ళే"లో కాలేజీ విద్యార్థినులచే "అల్లీముతా" ప్రదర్శన.

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు. |
| పారిశ్రామిక విద్యాలయము (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) | : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చు కూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము. |
| వస్త్రములపై అద్దకపుపని మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత- | : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభలో నడుపబడుచున్నవి. |
| టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ | : స్త్రీలకు మైపు,—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ. |
| మహిళా మందిరము | : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక. |
| నిర్మలాదేవి గ్రంథాలయము | : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము. |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ, శిశువుల, సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్‌ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. |
| ముద్రణశాఖ | : ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు మొదలైనవి వుచితంగా నేర్పబడును. |

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

Edited, Printed & Published for the Andhra Mahila Sabha Luz, Madras 4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 24-A, Luz Church Rd., Madras 4

# ఆంధ్రమహిళ



FEBRUARY '54 ANDHRA MAHILA ANNAS 8

# ఆంధ్ర మహిళా సభ నర్సింగ్ హోమ్



శిశుపులశాఖ భవనపు శంకుస్థాపన ఉత్సవానికి వేంచేసిన దేశ్‌ముఖ్ దంపతులకు స్వాగతం.



మదరాసు గవర్నరు శ్రీ శ్రీ ప్రకాశగారికి స్వాగతము.

# రాజీ

నా ప్రాణం...

కనులవిందు వీనులవిందు
కావించే కమనీయ
చిత్రం...

# జెమిని

నిర్మాణం

జనవరి 30 వ తేదిన
ఆంధ్రదేశమంతటా
విడుదల కానున్నది



ఆంధ్ర దేశమంతటా
దిగ్విజయంగా
నడుస్తున్నది.

# అంతా మనవాళ్లే!

దర్శకత్వం... తాపీ చాణక్య
పర్యవేక్షణ... ప్రసాద్



CH. E. PRASAD

ఆంధ్రా : దీ ప్రీమియర్ ఫిల్మ్స్ లిమిటెడ్, విజయవాడ.
సీడెడ్ : నవయుగ ఫిల్మ్స్ విజయవాడ.
హైదరాబాద్ : సుందర్ పిక్చర్సు సర్క్యూట్, సికందరాబాద్.
వివరాలకు : దీ సారథీ ఫిల్మ్స్ లిమిటెడ్, మద్రాసు 17.

# ఆంధ్రమహిళ

సంపుటి 10 :: ఫిబ్రవరి '54 :: సంచిక 10

ముఖచిత్రం : శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారు
మద్రాసు గవర్నరు శ్రీ శ్రీ ప్రకాశగార్ని ఆహ్వానిస్తున్న దృశ్యం.



వ్యవస్థాపకురాలు : శ్రీమతి దుర్గాబాయి, యం.యే.,బి.యెల్.,
సంపాదకురాలు : శ్రీమతి చన్నఘంటమ్మ, యం.యే.,యెల్.టి.,

ఆంధ్ర మహిళా సభ, మైలాపూర్,
మద్రాసు—4

సంవత్సరచందా :: ఆరు రూపాయలు.

## కృతజ్ఞత

శ్రీమతి కె. పి. పంకజంగారు ఆంధ్ర మహిళా సభకు 100/— రూపాయిలు విరాళమిచ్చి యావజ్జీవ సభ్యురాలుగా చేరిరి. డాక్టరు అవధానిదంపతులు ఆంధ్ర మహిళా సభ నర్సింగు హోమ్ శిశు పోషణాలయమునకు రూ 200/— విరాళముగానిచ్చిరి. వీరికి మా కృతజ్ఞతలు.

ఆంధ్ర మహిళా సభ.




సంపుటి 10 :: ఫిబ్రవరి '54 :: సంచిక 10

# చరిత్ర నేర్పే గుణపాఠాలు

—:o:—

ప్రపంచంలో జరిగే సంఘటనల యదార్ధగాధే 'చరిత్ర' గనుక, భారతాది గ్రంథాలనుండి అనేక గుణపాఠాలు నేర్చుకున్నట్లే వ్యక్తులూ, దేశాలూకూడ 'చరిత్ర' నుండి అన్నింటికంటె గొప్ప గుణపాఠాలు నేర్చుకోడాన్కి వీలుంది.

ఇతరదేశాల్ని జయించి, రోమన్ సామ్రాజ్యం స్థాపించాలన్న రోమన్ కాగడా, కాలగర్భంలో కలిసి పోయింది. జయించడాన్కి ఇంకా దేశాలుంటే చూపించండి అని వెతుకులాడిన ఫ్రెంచి దీపం, నెపోలియన్, యుద్ధరంగం దాటగానే కొడిగట్టింది. పరదేశాల్ని కలుపుకొని నాగరిక జ్యోతి అని చెప్పుకున్న గ్రీకు సామ్రాజ్యం, ఏమయిందో అందరికీ ద్యోతకమయ్యేవుంది. మన కళ్ళతోటే చూసేం. కైజరూ ఆవెనుక హిట్లరూ అంటించిన జర్మన్ తోలుతూటాలూ, ప్రక్కను ముసోలినీ వెలిగించి పడేసిన తారాచువ్వలూ- ఇటు రష్యామీద- అటు ఆఫ్రికామీద పడి, కొంత చీత్కారం కలిగించినా, ఆఖరుకు ఆత్మనసింపుతో, తమ్ము తామే కాల్చుకోడంతో, కడముట్టేయి. జపాన్ కొరియాల అట్టహాసం, పగటి దీపాల్లాగ ఎలా వెలవెలబోయేయోకూడా చూసేం. వీటన్నిటి గుణపాఠం:— "పోరునష్టం"; పరులపై దాడితీసి, దురాక్రమణ సాగించాలనీ, అన్యుల్ని అదుపులో ఉంచుకోవాలనీ, ఇతరుల్ని కొల్లగొట్టి, తామే బాగుపడాలనీ, ఇలా అన్యాయంగా జరిగించే హింసాకాండలు— ఆఖరుకు ఆత్మవినాశనంతో విఫలమై పోతాయి అన్నదేగద?

భారతచరిత్ర నాగరికతజ్యోతి గమనించండి: పరదేశాల్ని జయించాలన్న ప్రయాసకు ఎన్నడూ పోలేదు; అసలు ఆ తలంపే ఆదేశానికి గిట్టదు. పరమతద్వేషణ అంతకంటేనూలేదు, సరికదా అందర్నీ ఆత్మసోదరుల్లా ఆదరించి, ఆఖరుకు తనపై ఎన్నో దండయాత్రలు సాగించి, ఎన్నెన్నేళ్ళో తనపై ప్రభుత్వం సాగించిన వారినైనా అహింసాత్మకంగా, అపూర్వ సహనం- ఓర్పుభావాలతో ఆదరించి, వారి మానసిక దృక్పథంమార్చి, నిశ్చలజ్యోతిలాగ ఎన్నిశతాబ్దాలైనా ఆరిపోకుండా నిల్చి వెలిగి, ఐహికాముష్మిక- సుఖ- జీవనాలకు సులభపంథాలు చూపిస్తూ, దయ- శాంతి- సత్యం అనే అఖండ ప్రభలతో అందరికీ మార్గదర్శకమౌతూవుంది. దీని గుణపాఠం: "పొందులాభం"; అహింస, ప్రేమ, సహనం, ఇలా అందరి శుభం ఆకాంక్షించే చల్లటిజ్యోతి అమరత్వమంది, విజయవంతమై విరాజిల్లుతుంది అన్నదేగద?

అందుకేగద మన బుద్ధిని అహింసాతత్వం అందరికీ నచ్చి, సిలోన్- జావా- సుమెత్రావంటి దేశాలకు వ్యాపించి నిల్చిఉంది. అందుకేగద రామకృష్ణ- వివేకానంద మహామహులు బోధించిన విశ్వమానవ సౌభ్రాతృత్వమూ సహనభావాలతో భారతదేశం పరదేశాల్లో ఎంతో పలుకుబడి సంపాదించుకుంది. అందుకేగద శతాబ్దాలపాటు జరిగిన

దండయాత్రలకూ, పరపీడనలకూ తట్టుకొని సజీవమై నిల్చి (ఉభయుల్నీ నాశనంజేసే భౌతిక యుద్ధంతో ప్రమేయం లేకుండా) అందర్నీ సముద్ధరించే నైతిక బలంతో విజయం సాధించింది- భారతజాతి- బాపూజీ అడుగుజాడల్లో నడిచి. అందుకేగద అన్నివైపులా యుద్ధాలు- అపనమ్మకాలూ అలుముకుంటున్నా, ఆదేశాలమధ్య అపూర్వ నిశ్చయంతో తటస్థ భావంతో నిల్చియుండి ప్రశాంతంగా ప్రేమ- శాంతి- సమరసభావాలు బోధిస్తున్న నెహ్రూప్రధాని- విజయలక్ష్మల యొక్క రాజనీతీ-మానవత్వమూ సర్వజనుల్నీ ఆకర్షిస్తూ శుభప్రదమైన మార్గాన్నిచూపే ఆశాజ్యోతులు ప్రసరిస్తూయుంట.

ఐతే ఇంకా మన సహనతత్వాన్ని పూర్తిగా పరీక్షించడానికా అన్నట్లు పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఇందుకు మనమంతాకూడా ఐకమత్యంతో తట్టుకొని, ఇలాంటి పరీక్షలకు ఆగి, అందర్నీ శాంతి పథంలోకి తెచ్చి, దిగ్విజయం సాధించవలసియుంది, శతాబ్దాలపాటు పరులచే కొల్లగొట్టుకోబడి పరాధీనమైన గృహాన్ని, అహింసాత్మక పోరాటం సాగించి, (ఆరేళ్ళ క్రితం స్వతంత్రం సంపాదించుకొని) సరిదిద్దుకొంటున్నాం. ఉమ్మడి కుటుంబంలో చిన్న తమ్ముడు దుడుకుతనానికి దిగి, విడివడతానన్నాడు. వద్దని చెప్పిన సుద్దులు వమ్మైతే, ఆస్తి పంపకాలు జరిగేయి. మిగిలిన కొంపను సరిదిద్దుకొని, ప్రజలందరికీ కూడు- గుడ్డ- జీవనోపాధి కల్పించాలని ప్రణాళికలు తయారు చేసుకొని చక్కగా సాగిపోతున్నాం. ఆహారసమస్య అదుపులోకి వస్తూవుంది. ప్రజలు శాంతి స్థిరత్వ భావంలో పడుతున్నారు. ఇంకా ఎంతో కృషి జరుగవలసియుంది ప్రజాభ్యుదయానికి- స్త్రీజనాభ్యుదయానికి- బాలబాలికల సముద్ధరణకుగూడ.

ఇంతట్లోనే- పైనుంచితెచ్చి- తన భాగంలో మందుగుండు సామగ్రి నిలవేస్తానంటున్నాడు- చిన్నతమ్ముడు, వద్దుసుమా. అది నీకేమోసం- నీతో పోకుండా చుట్టుప్రక్కల కొంపలన్నిటికీ అగ్ని ప్రమాదం తెస్తుంది అంటే. నువ్వెవరవు అడగడాన్కి- అంటూ తన చర్యల్లోని అఘాయిత్యాన్ని అవగాహన చేసుకోవడంలేదు అతడు. కొరివెట్టి తలగోక్కుంటుంటే ఎల్లరం ఎట్లా చూస్తూ ఊరుకుంటాం! నీతోనూ, నీకొంప భాగంతోనూ, చల్లారదుసుమా అని అరటిపండు వొలిచి చూపించినట్లు చూపిస్తున్నా- అదిగో- ఇదిగో అని వికటాట్టహాస- ప్రకటనలోకి దిగుతున్నాడు- తెలివితక్కువ తమ్మన్న! "పెద్దన్న, పెద్దవాడైపోతున్నాట్ట- పదుగురులోనూ పలుకుబడి సంపాదించుకొని"- అందుకట తమ్ముడు కొంపకు అగ్గి ముట్టించడం! తెలిసినవారు చెప్పింది వినిపించుకో, చరిత్రనేర్పే గుణపాఠాలు చూచుకో, "చరిత్ర చర్విత చరణం" అన్నమాట సార్థక్యంలోకితేకుసుమా- ఇటీవల వరకు ఈ కొంపలో అన్యోన్య మనస్పర్ధలుపెంచి, పరరాజన్యులు మనకు (పిల్లుల రొట్టె తగవు, కోతితీర్చిన కథ చందాన్ని) న్యాయం తీర్చిపెడితే ఈ తగులాటం వదల్చుకొని బయట బడ్డానికి ఇంతకాలం పట్టింది, చూడనే చూచేవుగదా, అంటుంటే- అతనికి పెద్దల సుద్దులు సుతరాము నచ్చడంలేదు. చిన్నపిల్లవానికి వేలంవెర్రిపెట్టి- అతనికొంపకూ, ప్రక్క కొంపలకూ అల్లరి తేకండనీ, ప్రపంచ శాంతికి భంగం తేవద్దనీ, అతన్ని లేవదీస్తున్న ప్రజల్ని హెచ్చరిస్తే, అదీ వారికి (తమ ఆటం బాంబుల స్వాతిశయంలో) వినబడ్డంలేదు. ప్రపంచశాంతి స్థాపనే మా ఆశయంకూడా అని ప్రగల్భాలు కొడుతూ ఇదేమిచర్య? అంటే- మన చిన్నతమ్ముడు కోరితేనే సహాయానికి వస్తున్నారట- అంతేనట- వారు యిచ్చే మిలటరీ సహాయంయొక్క అంతరార్థం. గమనించేరా ఈ నటన, రాజనీతి!

ఇలాంటప్పుడు ఏమిటి గత్యంతరం? అన్నదే యిప్పుడు భారత సోదర- సోదరీమణుల్నీ, ఇరుగు పొరుగు దేశాలవార్నీ అందర్నీ అలజడి చేస్తున్న సమస్య.

ఐతేమాత్రం భయమెందుకు? ఏకగ్రను నిప్పంటే అదే కాలుతుంది- హింసాకాండకు మృత్యువుందికాని, అహింసావిధానానికెప్పుడూ అమరత్వమే. తమ స్వాతంత్ర్యాన్ని కాపాడుకుందుకు- శాంతి భద్రతలు నిలబెట్టడాన్కి- భారతీయులు ఆబాలగోపాలం సర్వవేళలా సంసిద్ధులే. ప్రేమ- ఓర్పు- సహనం ఇవి వారికి సహజ సంపదలు, ప్రేమ విజయమే వారు ఆకాంక్షించేదిగాని, దౌర్జన్య విధానంగాదు. భారతీయులు తమ తత్వ ప్రభావాన్ని ఇంకా పూర్తిగా ప్రకటించడాన్కి- ఇదీ ఒక గొప్ప అవకాశం అన్న భావంతోటే వారు దీన్ని ఎదుర్కొని నిలుస్తారు. కొల్లబడిపోయిన కొంపలో (ఉన్నవారిని సముద్ధరించుకుంటుంటే) మళ్ళీ ఇలాంటి సమస్యలు వచ్చిపడ్డా, వారు ఇసుమాత్రం చలించరు,

# చరిత్ర నేర్పే గుణపాఠాలు

అందరూ ఐకమత్యంతో ప్రవర్తిస్తూ— "అడ్డంకుల్ని అధిగమించి, వాటినే సోపాన పరంపరలుగా వినియోగించుకొని, దిగ్విజయానికి సాగిపోవడమే ఉత్తమ పద్ధతి" అని వారికి జ్ఞాపకముంది. తప్పటడుగులువేసే చిన్నతమ్ముణ్ణి, అతన్ని కీలుబొమ్మగా ఉపయోగించుకొని ప్రపంచశాంతికే అఘాయిత్యం తలపెట్టిన పెద్దల్నీకూడ పరిపూర్ణ ప్రేమభావంతో పాటించగలరు. దౌర్జన్యమును ప్రేమచేతనే జయించగలరు. తప్పనిసరియైతే ఆటంబాంబుల్నికూడా అచంచల విశ్వాసంతో ఎదుర్కొని (విశ్వామిత్రుని బాణాలకు వశిష్టుడి దండం నేర్పిన గుణపాఠమే నేర్పగలమని)— వినాశకరమైన భౌతిక శక్తులు- శుభప్రదమైన ఆత్మశక్తిముందూ నైతిక బలంముందూ నిరర్థకమని ఋజువుచేయగలరు. ఇది 'చరిత్ర' మళ్ళీ నేర్పబోయే మూడవ గుణపాఠం. ఇదే దేశకల్యాణానికి, లోకకల్యాణానికి, ఇటీవల కల్యాణిలో జరిగిన 59వ అఖిలభారత కాంగ్రెస్ మహాసభలో నెహ్రూ- విజయలక్ష్మిలు యిచ్చిన అపూర్వ సందేశంకూడ. దీన్ని భారతీయులు ఆబాలగోపాలం ఏకగ్రీవంగా ఆమోదించేరు. అక్షరాలా ఆచరణలోబెట్టి చూపించగలరు.





[illegible]వుల శాఖ భవనానికి మదరాసు గవర్నరు శ్రీ శ్రీప్రకాశగారు
పునాది ప్రతిష్ఠ చేసినప్పటి దృశ్యము.

# ఆంధ్ర మహిళా సభ

## నర్సింగ్ హోమ్ శిశువులశాఖ శంకుస్థాపన సందర్భమున

# కార్యదర్శిని నివేదిక

———:o:———

అడయారులోని ఆంధ్ర మహిళాసభ నర్సిగ్ హోమ్ ఆవరణలో శిశువులశాఖకు, నర్సుల వసతిగృహానికి శంకుస్థాపన మద్రాసు గవర్నరు శ్రీ శ్రీప్రకాశగారిచే ఆదివారం (24–1–54) సాయంకాలం 6 గం॥కు జరుపబడింది. కార్యక్రమం సాయంకాలం 4–20 గం॥ లకు పూజ, వేదపారాయణలతో ప్రారంభమైనది. సరిగా 6 గం॥ లకు శ్రీ శ్రీ ప్రకాశగారు శంకుస్థాపన గావించేరు. కుమారి గిడుగు భారతి ప్రార్థనగీతం పాడింది.

ఈ కార్యక్రమంలో భారతదేశ ఆర్థికమంత్రి శ్రీ చింతామణి దేశ్‌ముఖ్, వారిసతీమణి శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్, ఇంకా మద్రాసు మంత్రులు, ఆంధ్ర రాష్ట్ర మంత్రులు, అనేకమంది పురప్రముఖులు, మహిళామణులు, బాల బాలికలు పాల్గొన్నారు.

మహిళా సభ కార్యదర్శిని శ్రీమతి చన్నఘంటమ్మ గారు శ్రీ గవర్నరుగారికి, సభికులకు స్వాగతమిస్తూ, ఈ సభ 1940 సం॥ లో శ్రీమతి దుర్గాబాయిగారిచే స్థాపించబడి, స్త్రీల సర్వతోముఖాభి వృద్ధికి కృషిచేస్తూ, అనేక శాకోప శాఖలుగా వృద్ధిచెందుతూ ఉందని చెప్పేరు. అయాశాఖల వివరాలు, వాటిల్లో జరుగుతున్న కార్యక్రమామూ ఇలా వివరంగా తెలియపరచేరు. "ఏ ఘనకార్యమైనా సాధించాలంటే ముఖ్యంగా, సమర్థత - కార్యదీక్ష గల సిబ్బంది కావాలి. అందుచేత యీసభ (కేవలం స్త్రీల వినోద కాలక్షేపానికి కాకుండా) స్త్రీజాతి భావిపురోభి వృద్ధికి ఉపకరించే నిస్వార్థులైన సేవకా బృందాన్ని తయారు చేయాలనే ఆశయంతో కృషిచేస్తూవుంది. శ్రీమతి దుర్గాబాయిగారి ఉత్సాహ పూరితమైన నిరంతర కార్యదీక్షా పరత్వంవల్లా, వారికి చేదోడు వాదోడుగా కృషి సల్పిన కొందరి సోదరీమణుల సహకారంవల్లా 1946 సం॥ లో, దేశసేవా పరులైన దాతలిచ్చిన ఆర్థికస్థోమతవల్లా, విద్యామందిరం, వసతిగృహం, పారిశ్రామికశాఖ స్థాపించ గలిగేరు. ఈ సంస్థయొక్క కార్యక్రమం, సాధించిన కృషి పరికించి 1949 వ సం॥ లో ఇండియా గవర్నమెంటు, రాష్ట్రప్రభుత్వం కూడ ధన సహాయం చేసేరు. దీనితో ఇంకా సభలో కొన్నినూతన శాఖలు ప్రారంభించ డానికి వీలయింది.

<u>మహిళా విద్యాలయం</u> :– 1940 సం॥ లో ఈ సంస్థ స్వల్ప విద్యార్థినులతో ప్రారంభమయింది. ఇప్పుడు 1953 సం॥ నాటికి 150 మంది బాలికలు వివిధశాఖల్లోను తర్ఫీదు పొందుతున్నారు. 1940 సం॥ నుండి 1953 సం॥ వరకు కాశీ ఇంటరు పరీక్షకు వెళ్ళిన బాలికలు 85 గురు. అందులో కృతార్థులైనవారు 74 గురు. వారిలో పల్వురు కాలేజీల్లో చేరి పట్టభద్రులయ్యేరు. కాశీ మెట్రిక్యులేషన్ పరీక్షకు వెళ్ళినవారు 340 మంది. అందులో ప్యాసయిన వారు 300 మంది. హిందీ అన్ని తరగతుల పరీక్షలకు వెళ్ళిన వారి సంఖ్య 270. విశారద డిగ్రీ పొందిన వారు 20 మంది. 1954 వ సం॥ మార్చి నెల్లో కాశీ మెట్రిక్యులేషన్‌కు 30 మంది, ఇంటరు పరీక్షకు 4 గురు వెళ్ళుతున్నారు. ఈ సంవత్సర మేనెల ఆంధ్రా మెట్రిక్ పరీక్షకు 6 గురిని, ఇ. ఎస్. ఎల్. సి. పరీక్షకు 16 మందిని పంపబోతున్నారు.

<u>మల్లమ్మదేవి హాస్టల్</u> :– ఈ వసతి గృహంలో 75 గురు విద్యార్థినులు వుంటున్నారు. దాంట్లో ఎక్కువ మంది ఈ సభశాఖల్లోను, కొందరు ఇతర కాలేజీల్లోను చదివేవారు వున్నారు. సగం మంది విద్యార్థినులకు ఉచిత వసతి సదుపాయం, మరి సగంమందికి ఉచిత భోజన సదుపాయం కూడ ఉంది. వీరి ఖర్చులు, కొందరు దాతలిచ్చే విరాళాల నుండి భరిస్తారు. ఈ సంస్థలో యుండే ముఖ్య విశేషం ఏమిటంటే కుల - మత - వర్ణ విభేదాలు లేకుండా విద్యార్థినులంతా కలిసి మెలిసి ఒక్క కుటుంబంలోని వారుగా మెలగడం.

<u>పారిశ్రామిక శాఖ</u> :– గృహ పరిశ్రమల్ని అభి వృద్ధి చేయాలన్న ఆశయంతో 1941వ సం॥లో ఈ శాఖ ప్రారం

భింప బడింది. ఇందులో అనేకమంది బీద బాలికలు, అనాధస్త్రీలు తమకు ఆర్ధికంగా తోడ్పడే కుట్టు, ఎంబ్రాయిడరీ, నిట్టింగు, నేతవగైరా పరిశ్రమలల్లో తర్ఫీదు పొంచు తున్నారు. వీరందరికీ కూడా ఉచితంగా తర్ఫీదు నిస్తూ, ఇ. ఎస్. ఎల్. సి. పరీక్షకు, గవర్నమెంటు టెక్నికల్ పరీక్షకు కూడా పంపుతున్నారు. ఆ పరీక్షల్లో కృతార్థులైనవారు ఎలిమెంటరీ, సెకండరీ పాఠశాలలో వృత్తి విద్యలు నేర్పే టీచర్లుగా పనిచేయవచ్చు. 1953 సం॥ వరకు 200 మంది అన్ని తరగతుల్లోను సిక్షణపొంది, 86 గురు కుట్టు పనిలో డిప్లమాపొందేరు. 40 మంది ఎంబ్రాయిడరీ, నేతపనులలో ఉత్తీర్ణులయ్యేరు. ప్రస్తుతం 86 గురు విద్యార్థినులున్నారు. ఇందులో 36 గురు డిశంబరు పరీక్షలకు హాజరయ్యేరు.

ఆంధ్ర మహిళా ప్రెస్సు :— మహిళాసభ వారిచే స్వంతంగా స్థాపించ బడిన ఈ శాఖలో విద్యార్థినులకు అచ్చు కూర్పు, బైండింగు, ప్రూఫ్‌రీడింగు, తెలుగు, తమిళ, ఇంగ్లీషు భాషలలో తర్ఫీదు యిస్తున్నారు. మహిళాసభవారిచే 10 సంవత్సరాలుగా ప్రచురించబడుతున్న 'ఆంధ్రమహిళ' సచిత్ర మాస పత్రిక ముద్రణ ఇప్పుడు ఈ ప్రెస్సులోనే జరుగుతున్నది.

భారతప్రభుత్వ పునరావాస శాఖవారిచే, మూడుసంవత్సరాలనుండి, మహిళాసభ ఆధిపత్యంక్రింద అద్దకం, మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత నేర్పబడుతున్నాయి. గత రెండేళ్ళలోను 24 గురు విద్యార్థినులు తర్ఫీదు పొందేరు. దాంట్లో 80 మంది విద్యార్థినులకు ఉచితంగా తర్ఫీదు యివ్వడాన్కి సౌకర్యాలున్నాయి. ప్రస్తుతం 67 గురు స్త్రీలున్నారు. భారత ప్రభుత్వం నలభై ఒక్కరికి, సభవారు ఆరుగురికి విద్యార్థివేతనాలిస్తారు. మల్లమ్మదేవి హాస్టల్‌లో 21 మంది భోజనఖర్చుకు, కొంత సహాయం పొందుతున్నారు.

నర్సింగ్‌హోమ్ :— 1947 సం॥లో శిశు సంరక్షణ శాఖగా ప్రారంభింపబడి, ఇప్పుడు మాతాశిశు సంరక్షణ శాఖ అయింది. ఇందు ప్రస్తుతం 20 మందికి ఉచిత ప్రసూతి చికిత్సకు వలసిన ఏర్పాట్లున్నాయి. ఇప్పుడు నిర్మింపబడే క్రొత్త భవనంలో మరొక 20 మందికి చికిత్స చేయబడుతుంది. ప్రస్తుతం ఇక్కడ ఉచిత వైద్య శాఖలో కూడ పనిజరుగుతుంది. ఈ నర్సింగ్‌హోమ్‌లో గత జూలైనుంచి భారతప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ననుసరించి, సంక్షిప్త - నర్స్ ఎయిడ్ - మంత్రసాని పనులలో 12 గురికి శిక్షణ యిస్తున్నారు. తిరిగి జూలై నాటికి మరొక 12 గుర్ని యీ నర్సెయిడ్ తర్ఫీదుకు జేర్చుకొంటారు. నర్సింగుహోమ్ నిర్మించడాన్కి భారత ప్రభుత్వం రూ 80,000 లు, ఏటేటా అయ్యే ఖర్చులకు మరొక రూ 15,000 లు ఏటేట ఐదు సంవత్సరాలవరకు గ్రాంటు యిచ్చేరు. ఇప్పుడు శిశు సంరక్షణశాఖ, నర్సుల హాస్టలు కట్టడాలకు మరొక రూ 1,48,000 లు గ్రాంటు యిచ్చేరు" అని విశదీకరిస్తూ శ్రీమతి చన్నఘంటమ్మగారు మహిళాసభ సర్వతోముఖాభివృద్ధికి భారత ప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వం యిస్తున్న సహకారానికి కృతజ్ఞత తెలియ పరచారు. సంస్థ జయప్రదంగా జరగడాన్కి కారణం పురస్త్రీలంతా యిస్తున్న ఉత్సాహ ప్రోత్సాహాలేనని ముచ్చటించేరు.

ఆతర్వాత డాక్టరు పావనాబాయిగారు నర్సింగ్‌హోమ్ కార్యక్రమాన్ని ఈవిధంగా సమీక్షించేరు.

ఉచిత వైద్యశాఖ :— ఉదయము 7-30 నుండి 11 వరకు, సాయంకాలం 4 నుండి 6 గం॥ వరకు, ఇందు రోగులు పరీక్షచేయబడుదురు. రోగ నివారణకు మందులు ఉచితముగా యీయబడును.

సెప్టెంబరు 1952 నుండి డిసెంబరు 1953 వరకూ, 10824 గురు రోగులు, సాధారణ వ్యాధులకు ఇక్కడ ఔషధము పుచ్చుకొనిరి. జూలై 1953 నుండి నర్సుల ట్రయినింగు, ఆగస్టు నుండి ప్రసూతి శాఖ ఇక్కడ ప్రారంభమైనది. బీదవారికి ఉచితముగా ప్రసూతి చికిత్స చేయబడుచున్నది.

ఆ పిమ్మట మద్రాసు గవర్నరు శ్రీ శ్రీ ప్రకాశ గారు మాట్లాడుతూ శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు చేస్తున్న బహుముఖమైన దేశ సేవను గురించి కొనియాడేరు. ఆమె దేశస్వాతంత్ర్య పోరాటంలో చూపిన ధైర్య స్థైర్యాలను, కార్య దీక్షను గురించి చెబుతూ, స్త్రీ జనోద్ధరణకై స్థాపించిన మహిళాసభ చేస్తున్న కృషి అమోఘమని ఉద్ఘాటించేరు. ఈ సంస్థ 'ఆంధ్ర మహిళాసభ' అని వ్యవహరింపబడుతున్నా, అన్నిప్రాంతాలవారూ వచ్చి యిందులో తర్ఫీదు పొందటం చాలా ముదావహం అని కొనియాడేరు.

ఆ పిమ్మట మహిళాసభ విద్యార్థినులు నృత్య, గాన ప్రదర్శనాలతో సభికులను రంజింపజేసేరు. ముఖ్యంగా మధురానగరి గాధ. నృత్య నాటిక గాజులబేహారీ, అద్భుతంగా నటించేరని అంతా ప్రశంసించేరు. కార్య దర్శిని వందన సమర్పణతో సభ ముగిసింది.

శ్రీమతి కె. సుగుణమణి.





# రాజకీయాలు

• శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు •

డిసెంబర్ నాలుగో వారం మొదలుకుని జనవరి నాలుగో వారం వరకూ జాతీయ అంతర్జాతీయ రాజకీయాల్లో నడిచిన ప్రధాన సంఘటనలు ఇవి_ కొరియా యుద్ధ ఖైదీలను తటస్థ సంఘం వారిని బందీలుగా పట్టుకున్న పక్షాలకు అప్పగించటం, ఆగ్నేయాసియా ప్రధానుల సభ ఒకటి జరపాలని సింహళ ప్రధాని ప్రతిపాదించటం, సిడ్నీలో కామన్వెల్తు ఆర్థిక మంత్రుల సమావేశం, ఆంధ్ర హైకోర్టును విశాఖపట్నానికి తరలించడానికి మంత్రి వర్గం నిశ్చయించటం.

* * *

జనవరి 22 వ తేదీ అర్ధరాత్రితో కొరియా యుద్ధ ఖైదీలమీద భారత సేనల కాపలా ముగిసిపోయింది. యుద్ధ విరమణ ఒప్పందం ప్రకారం సెప్టెంబర్ 23 వ తేదీ మొదలుకుని 90 రోజుల పాటు ఖైదీలకు తిరిగి స్వదేశాలకు రావలసిందని స్వపక్షాల వాళ్ళు నచ్చచెప్పాలనీ, ఆ తరవాత కూడ స్వదేశాలకు వెళ్ళనివాళ్ళ భవిష్యత్తును నిర్ణయించే నిమిత్తం కొరియా రాజకీయ సభకు మరి 30 రోజులు గడువు ఇవ్వాలనీ, అప్పటికీ సమస్య పరిష్కారం కాకపోతే, జనవరి 22 వ తేదీ అర్ధరాత్రి దాటిన వెంటనే ఖైదీలను విడుదల చేయాలనీ ఉభయ పక్షాలూ అంగీకరించి ఉన్నవి. దాని ప్రకారం ఖైదీలపై భారత సేనల కాపలా తటస్థ సంఘపు అధికారం 22 వ తేదీ అర్ధరాత్రితో ముగిసిపోయినవి. ఈ కారణం వల్ల భారత సేనలు 20 వ తేదీన మిత్ర రాజ్యాల ఖైదీలను వారికి అప్పగించినవి. 22 అర్ధరాత్రి కమ్యూనిస్టు అభిమానులయిన ఖైదీలను వారి ఇష్టం వచ్చిన చర్య తీసుకోవచ్చునని చెప్పి కాపలా ఎత్తివేసినవి.

ఖైదీలను విడుదల చేయటానికి యుద్ధ విరమణ ఒప్పందంలో నిర్దేశించిన గడువు పూర్తి అయిన మాటనిజమే కాని, ఒప్పందంలోని ఇతర అంశాలు మాత్రం పూర్తిగా అమలు జరగలేదు. ఖైదీలకు స్వదేశాల వాళ్ళు తిరిగి రమ్మని నచ్చ చెప్పటానికి చేయబడ్డ ఏర్పాటు మొత్తం 90 రోజుల్లో కొద్ది కాలం మాత్రమే సాగింది. మొత్తం ఖైదీల్లో 100 కి 15 వంతులు మాత్రమే నచ్చచెప్పించుకోనటం జరిగింది. దీనికి మించిన కారణాలు దక్షిణ కొరియన్లు, మిత్ర రాజ్యాధికారులు ఖైదీలలో చేసిన దుష్ప్రచారం, వాళ్ళు స్వదేశాలకు పోకుండా భయపెట్టటానికి ఖైదీల శిబిరాల్లో రౌడీ ముఠాలను ఏర్పాటు చేయటం మొదలైనవని తటస్థ సంఘం కచ్చితంగా తేల్చి చెప్పింది. ఖైదీలమీద బల ప్రయోగం చేసి వారిని హిత బోధకు హాజరు పరచాలని కూడా ఇండియా అభిప్రాయపడ్డది కాని, తటస్థ సంఘంలో నుంచి స్విట్జర్లాండ్ నిష్క్రమిస్తానని అనటం వల్ల అది సాగలేదు. అదీకాక, ఉన్న గడువులో కొంతభాగం నచ్చచెప్పే గుడారాల ఏర్పాటుకనే మిషతో మిత్ర పక్షాల వాళ్ళు నష్టపరిచారు.

ఈ కారణంవల్ల, జనవరి 22 వ తేదీన ఖైదీలను విడిచి పెట్టటం యుద్ధవిరమణ ఒప్పందాన్ని వ్యతిరేకించటమే అవుతుందని ఇండియా ఉభయపక్షాలకు తెలియజేసింది. దానికి మిత్రరాజ్యాలు అంగీకరించలేదు. అందువల్ల ఖైదీలను ఆ యా పక్షాలకు అప్పగిస్తూ, వీరిని విడుదల చేయటం అక్రమమవుతుందనీ, వేరే ఒప్పందం జరిగేవరకూ వారిని విడుదల చేయకూడదనీ తటస్థ సంఘం గట్టి హెచ్చరిక చేసింది. ఒప్పదం అమలు జరక్కపోవటానికి మిత్రరాజ్యాలు బాధ్య

లన్నప్పుడూ, ఖైదీలపై బలప్రయోగం చేయాలన్నప్పుడూ ప్రతిఘటించిన స్విట్జర్లాండు, స్వీడన్ లుకూడా ఈ హెచ్చరికను సమర్ధించినవి.

* * *

22 వ తేదీకి ముందుగానే ఐక్యరాజ్య సమితి ఏర్పాటు చేస్తే ఖైదీల విడుదల కాకుండానే సమస్యను చర్చించే వీలుంటుందని రష్యా సమితికి సూచించింది. ఫిబ్రవరి సమావేశం, జరగాలని సూచిస్తూ, జనవరి నాటికే దానికి జవాబు అన్ని దేశాలు ఇవ్వాలని సమితి అధ్యక్షురాలు విజయలక్ష్మి పండిట్ ప్రతిపాదించింది. కాని ఏదోవిధంగా ఖైదీలను విడుదల చేయించాలని ఉద్దేశిస్తున్న పశ్చిమ రాజ్యాలు జవాబు గడువును పొడిగించేట్లు చేసినది.

రాజకీయ సమావేశం జరిపేఏర్పాట్లను గురించి పాన్ ముంజాన్‌లో చర్చలు జరుపుతున్న అమెరికన్ ప్రతినిధి డీన్ ఖైదీలకు నచ్చచెప్పే గడువు ముగిసి పోబోతున్న దనగా, ఒక చిలిపి సాకుతో సంప్రదింపులను నిలిపివేసి అమెరికా వెళ్ళిపోయినాడు. కిందటి జూన్‌లో సింగ్మన్‌రీ 27 వేలమంది ఖైదీలను విడుదల చేయటంలో మిత్ర రాజ్యాల లాలూచీ ఉన్నదని కమ్యూనిస్టులు ఆరోపించటమే దీనికి కారణమని ఆయన చెప్పాడు. కాని అదే సమావేశంలోనే, కమ్యూనిస్టులు ఎంతోమంది ఖైదీలను పట్టుకున్నప్పటికీ, కొద్దిమందినే అప్పగిస్తున్నారని ఆరోపణ చేయటానికి ఆయన వెనకాడలేదు.

♦ ♦ ♦

తటస్థ సంఘం అంతగట్టిగా ఏకగ్రీవంగా హెచ్చరించినప్పటికీ మిత్రరాజ్యాలు ఖైదీలను విడుదల చేసినవి. 2 వేల మంది చైనావాళ్ళు ఫార్మోజాకు పంపబడ్డారు. మిగిలిన వాళ్ళను దక్షిణకొరియన్, మిత్రరాజ్య సైన్యాల్లో జేర్చుకునేందుకు తగిన ఏర్పాట్లను చేస్తున్నామని మిత్రరాజ్య సైనికాధికారులు లోగడ అనేకసార్లు ప్రకటించి ఉన్నారు.

మొత్తానికి ఈ కొరియా ఖైదీల సమస్య అమెరికా ఉద్దేశించినట్లుగా తేలిపోయింది. ఖైదీలు స్వదేశాలకు పోదలచటంలేదని అమెరికా వర్గం వాదించటంలో ప్రధానోద్దేశ్యం వారందరినీ తమసైన్యాల్లో జేర్చుకునేందుకేనని కమ్యూనిస్టులు మొదటి నుంచీ చెపుతునే ఉన్నారు. సింగ్మన్‌రీ 27 వేల మందిని మొదట విడుదల చేయటం, మిగిలిన వాళ్ళు స్వేచ్ఛగా స్వదేశాలకు వెళ్ళే వీలులేకుండా మిత్ర రాజ్యాధికారులు ఖైదీలను రెచ్చగొట్టటం, వేరే ఒప్పందాన్ని చేసుకునేందుకు నిరాకరించటం, సమితి సమావేశం కాకుండా అడ్డగించటం, సంప్రదింపులను నిలిపివేయటం, విడుదల చేయటం అక్రమమని తటస్థ సంఘం చెపుతున్నా ఖైదీలను విడుదల చేయటం, ఇవన్నీ కమ్యూనిస్టుల ఆరోపణయదార్ధమేనని నిరూపించినవి.

ఎట్లాగైనా శాంతి కావాలని కమ్యూనిస్టులకు వున్న తొందర వల్లను, తటస్థ సంఘపు అనైక్యత వల్లనూ అమెరికా నైఖరి గెలిచింది.

* * *

ఖైదీల విడుదల కావటం వల్ల కొత్త అంతర్జాతీయ సూత్రం స్థాపించబడ్డదని అమెరికా చెపుతున్నది, కమ్యూనిస్టు ఖైదీలకు కమ్యూనిస్టు పద్ధతి నచ్చక వారు వెళ్ళలేదని ప్రచారం చేయాలని ప్రయత్నించింది. కాని అదేమీ ఫలించలేదు. తటస్థ సంఘం తగుమాత్రం బలప్రయోగం చేసి ఖైదీ శిబిరాల నుంచి దౌర్జన్య వాదులను తొలగించి ఉంటే, ఖైదీలలో అత్యధిక సంఖ్యాకులు స్వదేశాలకు వెళ్ళి ఉండేవాళ్ళని అక్కడి సంఘటలన్నీ నిరూపించినవి. ఈ నేరస్థ ఖైదీలను ఇండియా విచారించటానికి వీలు లేకుండా మిత్ర రాజ్యాలు ఎన్నో ఆటంకాలు కలిగించినవి కూడా. అక్కడ కమ్యూనిస్టు అభిమానులుగా మారిన మిత్ర రాజ్య సైనికుల్లో బహు కొద్దిమంది మాత్రమే స్వదేశాలకు తిరిగి వచ్చారు. వారిని భయపెట్టి ఉంచే ప్రయత్నాలేమీ కనిపించలేదని తటస్థ సంఘం చెప్పి ఉన్నది.

కమ్యూనిస్టు నిరంకుశత్వం ఆ ప్రజలు భరించలేకుండా ఉన్నారని నిరూపించటానికి ప్రజాస్వామ్యం పేరుతో అమెరికన్లు, దక్షిణ కొరియన్లు జరిపిన ఘాతుకాలనూ, వాటిని బ్రిటన్ మొదలైన దేశాలు సమర్ధించటాన్నీ ప్రపంచ ప్రజలు_ ముఖ్యంగా ఆసియా ప్రజలు_ మరిచిపోలేరు.

* * *

ఆగ్నేయాసియా దేశాల ప్రధానులు ఒకసారి సమావేశమై ఆ ప్రాంతమంతటికీ సంబంధించిన సమస్యలను చర్చిం

చాలని సింహళ ప్రధాని కొటేలవాల ప్రతిపాదించగా ఇండియా, బర్మా, ఇండొనీషియాలు సుముఖతను సూచించినవి. పాకీస్థాన్ కూడా దీనికి అంగీకరించవచ్చును. అంతా ఒప్పుకుంటే ఈ సభ ఈ సం॥ ఏప్రిల్, మే నెలల్లో కొలంబోలో జరుగుతుంది. ఇందులో ఏయే అంశాలు చర్చిస్తారో నిర్ణయం కానప్పటికీ, ఆసియాలో సామ్రాజ్య దేశాలు అనుసరిస్తున్న విధానం తప్పకుండా చర్చకు వస్తుందని చెప్పటానికి అనేక సూచనలు కనిపిస్తున్నవి. యుద్ధ నౌకలతో ఆసియాను బెదిరించే రోజులు పోయినవని సింహళ ప్రధాని స్పష్టంగా ప్రకటించారు.

పాకీస్థాన్‌కు అమెరికా సైనిక సహాయం చేసే విషయమై ఈ సభ చర్చిస్తుందో లేదో తెలియదు కాని ఆ ప్రతిపాదన వచ్చిన వెంటనే ఈ సమావేశ ప్రతిపాదన రావటం మాత్రం గమనించ తగిన విషయం.

ఆగ్నేయాసియా దేశాలు ఏకం కావటం మాత్రం సామ్రాజ్య దేశాలకు గిట్టదు. అగ్నేయాసియా దేశాలు కలిసి నిలబడి ఇండొనీషియా స్వాతంత్ర్యానికి కారణం కావటం, ఐక్యరాజ్య సమితిలో ఇండియా ఆసియా-అరబ్ రాజ్యాలను కూడగట్టినది మొదలు సామ్రాజ్య దేశాలకు కలుగుతున్న ఇబ్బందులు వాటికి ఇది గిట్టకపోవటానికి కారణమయింది. అందుకని ఈ వర్గాన్ని చీలదీయాలనీ, పాకీస్థాన్‌కు ఏదో పెత్తనం అంటగట్టాలనీ అమెరికా ప్రయత్నిస్తున్నది. పాక్-అమెరికన్ సైనిక ఒప్పందం వల్ల పాకీస్థాన్ పలుకుబడి పెరుగుతుందనీ, ఆ ఒప్పందానికి ఇండియా ప్రతిఘటించటం తన నాయకత్వం పోతుందని భయపడటమేననీ అమెరికన్ పత్రికలు బాహాటంగా వ్రాస్తున్నవి.

పశ్చిమ రాజ్యాల ప్రాబల్యాన్ని నిరసిస్తున్న సింహళ ప్రధాని తన దేశంలో బ్రిటిష్ వారికి ఇచ్చిన ట్రింకోమలీ నౌకాశ్రయంలోనుంచి వారిని సాగనంపటానికి మొదట ప్రయత్నించటం అవసరం.

*   *   *

సింహళ భారతీయుల సమస్యపై ఇండియా, సింహళాలు ఒక ఒప్పందం కుదుర్చుకున్నవి. అక్కడ స్థిరపడ్డ భారతీయులు సింహళ పౌర హక్కుల కోసం పెట్టుకున్న దరఖాస్తులను ఉదారంగా పరిశీలించటానికి సింహళం ఒప్పుకున్నది. మిగిలిన వాళ్ళు కోరుకుంటే భారత పౌరహక్కుల నివ్వటానికి భారతప్రభుత్వం ఒప్పుకున్నది. వాళ్ళు ఎక్కడ ఉండేదీ తేల్చుకునేందుకు 10 సం॥ల గడువు ఇవ్వబడిది. భారత పౌరస్వత్వం తీసుకున్నప్పటికీ వారు సింహళం విడిచి రానక్కర్లేదు. భారతీయ పౌరులుగానే అక్కడ ఉండవచ్చును. ఎవ్వరినీ బలవంతాన ఇండియాకు పంపివేయటం జరగదు. ఈ సమస్య సౌమ్యంగా పరిష్కరించాలంటే ఇంతకు మించి చేయ గలిగింది కనిపించదు.

*   *   *

ఈ నెల మొదటి వారంలో కామన్వెల్తు ఆర్థిక మంత్రులు సిడ్నీలో సమావేశమై వివిధ సమస్యలూ చర్చించారు. ప్రపంచ వ్యాపారంలో కొంత అస్థిమిత పరిస్థితి రాబోతున్నదనీ, దానిని కామన్వెల్తు దేశాలు జాగ్రత్తగా ఎదుర్కోవాలనీ ఆ సభ హెచ్చరించింది. అంతే కాకుండా స్టర్లింగ్ (బ్రిటిష్ ద్రవ్యం) ద్రవ్య మానాన్ని ప్రమాణంగా పెట్టుకుని విదేశాలతో లావాదేవీలు జరుపుతున్న కామన్వెల్తు దేశాలకు లండన్ మార్కెట్లు డబ్బు లభింపజేసే విషయమై కొన్ని నిర్బంధాలు కూడా విధించబడ్డవి. కామన్వెల్తు అంతటికీ ఉపయోగించే అభివృద్ధి పథకాలకు ద్రవ్య సహాయం చేయటానికీ ప్రాధాన్యత ఇవ్వబడుతుందని ప్రకటించ బడ్డది.

ఈ సమస్యపై కామన్వెల్తులోని ఆసియా దేశాలకూ, బ్రిటన్, న్యూజీలాండ్ వర్గానికీ అభిప్రాయ భేదాలు వచ్చినట్లు తెలిసింది. కామన్వెల్తు దేశాల్లో ముందు ఏ దేశానికి ఆ దేశాన్ని ఆర్థికంగా బలపరిచే పథకాలకే ప్రాధాన్యత ఇవ్వాల కాని, మొత్తం స్టర్లింగ్ ప్రాంతపు మేలును ప్రధానంగా భావించరాదని సింహళ ఆర్థిక మంత్రి ప్రభృతులు వాదించినట్లు తెలియ వచ్చింది. సింహళం తన కాళ్ళమీద నిలబడాలంటే బియ్యాపు పంట పెరగాలి కనుక, బియ్యాపు ఉత్పత్తి మొత్తం స్టర్లింగ్ ప్రాంతానికి లాభించక పోయినప్పటికీ, దానికి కామన్వెల్తు దేశాలు సాయపడాలని ఆయన కోరినట్లు తెలుస్తున్నది.

సిడ్నీ సభలో మరొక విశేషం జరిగింది. అమెరికా విదేశాలకు చేస్తున్న సహాయాలవల్ల దాని ఆర్థిక పరిస్థితి కొంత తగ్గిపోతున్నదనీ, కామన్వెల్తు దేశాల బంగారు నిలవలను అమెరికాకు ఇచ్చి, ఆదేశపు ఆర్థిక పరిస్థితిని బలపరచాలనీ బ్రిటిష్ ప్రతినిధి ప్రతిపాదించారు. దానిని మిగిలిన దేశాలన్నీ-కెనడాతో సహా- ప్రతిఘటించినవి. నిజంగా బ్రిటన్ ఉద్దేశమే అదో, లేక అమెరికా ఆ ప్రతిపాదన చేస్తే కామన్వెల్తు దేశాలు ఒప్పుకోటం లేదని చెప్పి ఎగవేయటానికి బ్రిటన్ వేసిన ఎత్తో, ఊహించుకోవలసిందే.

* * *

ఆంధ్ర ప్రభుత్వం హైకోర్టును తాత్కాలికంగా విశాఖపట్నానికి మార్చటానికి నిశ్చయించింది. దీనికోసం వచ్చే ఎసెంబ్లీ సమావేశంలో ప్రతిపాదన చేస్తుంది. ఇప్పుడు హైకోర్టును విశాఖపట్నానికి తరలిస్తే విశాలాంధ్ర ఏర్పడినప్పుడు రాజధాని నిర్ణయ సమస్య చాలా తేలిక అవుతుందని విశ్వనాథంగారు వ్యాఖ్యానించారు. అయితే ఆ ప్రాంతం వాడే అయిన పి. వి. జి. రాజుగారు మటుకు హైకోర్టు, రాజధాని రెండూ గుంటూరు, బెజవాడ ప్రాంతాల్లోనే ఉండాలని అంటున్నారు.

మళ్ళీ ఈ నెల ఎసెంబ్లీ రాజధానిని కర్నూలు నుంచి తర్లించే విషయమై చర్చించింది. గుంటూరు బెజవాడ ప్రాంతాన్ని బలపరిచే వాళ్ళ నుంచి విశాఖపట్నం, తూర్పు గోదావరి వాళ్ళను ప్రభుత్వ పక్షంవాళ్ళు సులభంగా విడదీయకలిగారు. 20 మంది తటస్థులుగా ఉండగా, 5 వోట్ల మెజారిటీలో (70-65) రాజధానిని ప్రస్తుతానికి కదిలించ రాదని తీర్మానించబడ్డది.

మళ్ళీ వచ్చే నెలలో జరిగే సమావేశంలో కూడా ఈ సమస్య వస్తుంది. అప్పుడు విశాఖ గోదావరి వాళ్ళను చీల దీయటానికి విశాఖలో హైకోర్టు ప్రతిపాదన చేయబడ్డది. శ్రీ బాగ్ ఒప్పందం ప్రకారం రాజధాని, హైకోర్టు, యూనివర్సిటీ ఒక్క చోట ఉండకూడదే, మరి యూనివర్సిటీ ఉన్న విశాఖలో హైకోర్టు పెట్టటానికి ఎట్లా ఒప్పుకుంటున్నారు అని ఎవరయినా అడిగితే జవాబివ్వటానికి వీలుగా, రాయలసీమ కోసం తిరుపతిలో ప్రత్యేక యూనివర్సిటీని స్థాపించటానికి కూడా ప్రభుత్వం అంగీకరించింది. రాయలసీమకు యూనివర్సిటీ ఉంటే అంతా సంతోషిస్తారు కాని, హైకోర్టు, రాజధానుల తగాదా సందర్భంలో దానిని ఇరికించటం మంచిది కాదు.

ఎదటి వాళ్ళను ఏవో వాగ్దానాలతో చీలదీసి, కర్నూలులో రాజధానిని నిలుపుకోవాలని ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. నెమ్మదిగా భవనా లన్నిటినీ కూడా నిర్మిద్దామని ఎత్తులు వేస్తున్నది. ఒకసారి భవనాలు నిర్మిస్తే రాజధానిని కదలకుండా ఉంచవచ్చునని ఆశిస్తున్నది. అది జరుగుతుందన్న భయంతోనే ప్రత్యర్థులు దానిని ఎట్లాగయినా అడ్డగించాలని చూస్తున్నారు. ప్రత్యర్థుల ప్రతిఘటనకు అసలు కారణం ఇదేగాని, కర్నూలు అభివృద్ధిని అడ్డగిద్దామని కాదు.

* * *

సం॥ల తరబడిగా ఆంధ్ర ప్రాంతంలో ఉన్న మద్య నిషేధాన్ని రద్దు చేయాలన్న ఆందోళన ఎక్కువ కాగా ప్రభుత్వం ఆసమస్య పరిశీలనకు కొంత రామూర్తిగారి అధ్యక్షతన ఒక విచారణ సంఘాన్ని ఏర్పాటు చేసింది. మద్య నిషేధాన్ని రద్దు చేయాలనేవారంతా అది సరిగా నడవటం లేదనో, డబ్బు రావటం లేదనో చెపుతారు. కాని అది ఎవరి మేలుకోసం ఉద్దేశించబడ్డదో మాత్రం గుర్తించుకోరు. తాగుబోతుల సంసారాలు పడే బాధలను నివారించటమే మద్యనిషేధానికి ప్రధానోద్దేశంగా అది మొదలయింది.

కాబట్టి విచారణ సంఘానికి తాగుబోతుల కుటుంబాల అభిప్రాయాలు తెలియాలి. దీనికోసం స్త్రీల సంఘాలు కృషి చేసి, వారందరినీ కలుపుకుని వాళ్ళ అభిప్రాయాలను విచారణ సంఘం దృష్టిలోకి తీసుకుని రావాలి. దీనిని వాళ్ళు నెరవేర్చలేకపోతే బీద స్త్రీల పట్ల తమ బాధ్యతను నెరవేర్చని వారవుతారు.



ఫోన్ : 86961.

# ఆంధ్ర మహిళా సభ
## పారిశ్రామిక విద్యాలయము

కుట్టు హయ్యర్ గ్రేడ్‌కు 12 గురు .... లోయర్ గ్రేడ్‌కు 13 గురు

ఎంబ్రాయిడరీ లోయర్ గ్రేడ్ 11 గురు.

విద్యార్థినులు డిశంబరు 1953 లో జరిగిన గవర్నమెంటు పరీక్షలు వ్రాసిరి.

జనవరి నుండి క్రొత్త క్లాసులు ప్రారంభమైనవి. కుట్టు హయ్యర్, లోయర్ పరీక్షలకు, ఎంబ్రాయిడరీ లోయర్ పరీక్షకు, శిక్షణ ప్రారంభమైనది.

పై తరగతులకు క్రొత్త విద్యార్థినుల ప్రవేశము జరుగుచున్నది.

జేరదలచువారు వెంటనే జేరవచ్చును.

ఆంధ్ర మహిళా సభ, మైలాపూరు.

అ. చన్నఘంటమ్మ, కరెస్పాండెంటు.

## చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-
### ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

—:o:—

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహానిచ్చుటకు, సభ తరపున కొందఱు యువతులు నియమింపబడుదురు. ఈ ఉద్యమంలో ఒక ప్రత్యేక ప్రతినిధిగా వ్యవహరించి, ధనము వసూలు చేయుటకు భారత ప్రభుత్వమువారు, ఆంధ్ర మహిళాసభకు అధికారమిచ్చియున్నారు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని అన్ని వివరములు తెలిసికొనవచ్చును,

ఇంకొక విషయము— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయడల సభకు 1¼% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

ఉత్సాహ వంతులైన సోదరీమణులు, యింత వరకూ సభద్వారా నిల్వ సర్టిఫికెట్లు తీసుకున్న మొత్తము రమారమి రూ. 20000/- ఇందు మూలముగా సభకు వచ్చిన కమీషను రూ. 250/- ఇంకా పెక్కుమంది సోదరీమణులు యీవిధముగా సభద్వారా సర్టిఫికెట్లుకొని సహాయ పడవలెనని కోరుచున్నాను.

అ. చన్నఘంటమ్మ.

# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

శ్రీమతి కె. యమ్. సౌందర్యవల్లి

కీర్తన-19

"నామసుధారస"

రాగం అఠాణ — ఆదితాళం.

ఆ. సరిమపనిస అ. సనిదాపమపగారిస.

ప॥ నామసుధారస పానముసేయగా
భూమిపై నవతరించెను గురువుగా ॥నామ॥

అ॥ స్వామిరాఘవుని సన్నుతిసేయగా
ప్రేమసుమంబుల పూజలొనర్పగా ॥నా॥

చ॥ రాగ భావగతులన్నియు నెరిగి
రాగ లోభ మోహాదుల దొరగి
భాగవతాగ్రేసరుడన పెరిగి
త్యాగరాజనామంబున బరగి ॥నామ॥

| 0-2 | 1-4 | 1-4 |
|---|---|---|
| ప॥ ; పా మ గ మా పా ; పా పా | పా ; పా పా | పా , ని మ , పా |
| నా మ . సు ధా ర స | పా న ము | సే య . గా |
| ; మ పా సా సా సా , ని ద దా | . ద ప దా నీ సా | గ గ రి స ని ప ని ని |
| భూ . మి పై న వ . త | రిం . . చె ను | గు . రు . వు . గా . |
| పమ ॥పా॥ | | |
| . . ॥నా॥ | | |
| అ॥ప॥ ; ప మ ప సా ; సా సా సా , | ; గా మా రి స | సా ని రి స ని దా |
| స్వా . మి రా ఘ వు ని | స . న్ను తి | సే . య . గ . |
| ; దా ద దా ; దా ద ని సా , | ; ని సా రి సా | ని పా పా ని ని ప |
| ప్రే మ సు మం బు . ల | పూ . జ లొ | న . ర్ప గా . , |
| మ, ॥పామ॥ | | |
| . ॥నామ॥ | | |
| చ॥ ; దా ద దా ; ద దా దా ; | ; పా దా ని స | స ని రి స నీ ప , |
| రా గ భా . వ గ తు | ల . న్ని యు | నె - రి - గి . |
| ; మ ద ప ప మ రీ మ స రీ సా , | ; రీ మా ప ప | ప ప ద ద నీ ప , |
| రా - గ లో . . భ మో . . | హా - దు ల | దొ . ర . గి . |

అ. ప. వలె

భాగవతాగ్రేసరుడన పెరిగి

త్యాగరాజ నామంబున బరగి ॥నామ॥

# శ్రీ త్యాగగురుస్తుతి కీర్తనలు

## కీర్తన – 20

### "సమాను లెవరయ్యా"

రాగం పంతువరాళి. ఆదితాళం

ఆ॥ సరిగమపదనిస — అ॥ సనిదపమగరిస

ప॥ సమాను లెవరయ్యా, నీకుసరి ॥సమా॥

అ॥ అమానుషంబగు ఆనందముతో
రమాధవునిగని రాగామృతముగ్రోల ॥స॥

చ॥ ప్రభాకరాన్వయ పతిన్ భజింపగ
ప్రభాతమున సుప్రభాతము బాడి
సుభావ పూరిత కృతుల రచించి
ప్రభావము దెలిపి పరగు త్యాగగురు ॥సమా॥

---

| 0-2 | 1-4 | 1-4 |
|---|---|---|
| ప॥ సా స ని దా పా పా పా మ ప ద ప | దా ; ; గా | మా పా దా నీ |
| స మా - - ను లె వ ర . . . | య్యా నీ | - కు స రి |
| సా స ని దా పా పా పా మా ప ద ప ద | ప మ గా రీ ; | సా ; ; ; |
| స మా . - ను లె వ ర . . . . | య్యా. . . | . . . . |
| అ॥ప॥ సా నీ దా నీ సా ; రీ సా | సా ; సా ; | స రి గ రి స సా ని |
| అ మా . ను షం బ గు | ఆ నం | ద ము . తో - - - |
| రీ సా నీ దా పా దా నీ ; | దా ని ద ప పా మ | గా మా పా దా॥ |
| ర మా ధ వు ని గ ని | రా . గా . . మృ | త ము గ్రో ల ॥స॥ |
| చ॥ పా పా దా పా ; పా మా ; | పా ద నీ ద నీ | స ని రి స ని ద పా |
| ప్ర భా క రా న్వ య | ప తిన్ . భ | జిం - - - ప గ |
| దా పా ; మా గా రీ గా ; | పా పా దా పా | దా నీ దా పా |
| ప్ర భా త ము న సు | ప్ర భా త ము | బా . డి . |

అ. ప. వలె

సుభావ పూరిత కృతుల రచించి
ప్రభావము దెలిపి, పరగు త్యాగగురు ॥సమా॥



# బంధము

శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్.

"ఎక్కడికి ప్రయాణము" అని ప్రశ్న. "అరవిందాశ్రమానికి" అని జవాబు. ఈ ప్రశ్నకి ఈ జవాబు వచ్చినప్పుడు ఇంటిల్లపాదీ భయపడతారు. అంటే ఇహ ఎన్నో టపాకాయలు పేలుతవన్నమాట! ఇల్లంతా కాస్సేపు నిశబ్దంగావుంది.

"అరవిందాశ్రమానికెందుకులే. నీవే ఓ స్వాములారై మన తోటమూలలోవున్న చింతచెట్టు క్రింద ఓ ఆశ్రమము ఏర్పాటు చెయ్యి. అన్నివిధాలా లాభదాయకంగా వుంటుంది" అని సలహా....'నిజమే! వ్యాపార రీత్యా ఆలోచిస్తే మంచి లాభాలే పొందవచ్చు. కాని పిల్లికి చెలగాటము ఎలుకకు ప్రాణపోకట' మన్నట్లు — సలహా ఇచ్చినవారికి అంతా హాస్యముగా, వినోదంగా వుండవచ్చు. వారికేమి తెలుస్తుంది నా బాధ. బాధ్యతా రహితమైన మాటలు ఏవో మాట్లాడుతారు. ఉదయమునుండి రాత్రివరకు ఇంటి పనులతో సతమతమై ఓ క్షణము విశ్రాంతి లేకుండా విరగపడుతూవుంటే ఆశ్రమము అవలంభించాలట! ఎవరికైనా వళ్లుమండదూ ఈ పరిస్థితుల్లో? పైగా ఎండాకాలము కూడానూ. మార్చినెల. అప్పుడే ఎండలు చాలా తీవ్ర రూపము దాల్చినవెందుకో ఈసంవత్సరము. వళ్ళు చిటపట మంటోంది. పిల్లలకు పరీక్షల రోజులు. ఒకరు ఆర్కిమెడిస్ ప్రిన్సిపిల్ ఒప్పచెపుతాము వినమంటే, ఇంకొకరు భర్తృహరి పద్యాలు వినమంటూ చేతిలోకి పెన్సిల్ను చెక్కమని అందిచారు. పరీక్షలప్పుడు పారేస్తే చిన్న బుచ్చుకుంటారని వూరుకున్నాను కాని, లేకపోతే అపెన్సిల్నను తోటలోకి గిరవాటు వేసేదాన్నే. ఈ పెన్సిల్ను పాతాలవ్యవహారము ముగించుకొని అజంతాలోని ఆశ్రమము వ్యవహారమునకు వద్దామనుకున్నా గాని, నేను పుట్టిన రౌద్రనామ సంవత్సరదోషము వల్ల, బ్రహ్మగారు మనకుపోసిన ఎక్కువడోసు రౌద్రము దూసుకు వచ్చింది. "ఆ ఆశ్రమాలే ఆరంభిస్తాను. మీకేమి హాయిగా ఫానుక్రింద కుర్చీలో కూర్చుని ఊళ్ళోవాళ్ళకి సలహాలిస్తూ వుండచ్చు" అని అన్నాను.

"ఊళ్ళోవాళ్ళ కెందుకిస్తాను. ఇంట్లోవాళ్ళకే సలహాలిచ్చేది. నీవుకూడా ఫానుక్రింద కూర్చోరాదూ? గొడవ చేయకుండా" అని మాచౌదరిగారు సెలవిచ్చారు ....

"అవును కూర్చుంటే కుదురుతుంది అన్నీ బాగానే! పైగా గొడవకూడానా! అందరి ఇళ్ళల్లో భర్తలూ తమభార్యలని ఈలాగే కూర్చోమని సలహాలిస్తారట - మా స్నేహితులు చెప్పారులెండి - మరి ఎందుకు కూర్చోరో అందరికీ తెలిసిన విషయమేగా?"

పిల్లలు పుస్తకాలు అందుకొని పెన్సిల్ను పుచ్చుకొని "బాగావచ్చినవా అమ్మా?" అన్నారు. "ఎక్కడొచ్చింది 'నలరవిదేని చేదిరుగు నాఘసకర్మము వంద్యమేకదా' అన్న పాదము ఆ 'నలవ'కులాల భంగి పద్యములో ఎగరగొట్టా"వన్నాను. "పెద్ద శ్రుతిలో సుజనపద్ధతి ఆరంభము నా ఆఫీసుకు టైమైంది, టెలిఫోనులో మిమ్మలను ఎవరో పిలుస్తున్నారు అమ్మగారు, నాకు ఇడ్లీ వద్దు బ్రెడ్డు కావాలి, బట్టలుతికే సబ్బు అయిపోయిందండీ, కారులో పెట్రోలు లేదు, నాకూడా బస్సుకు చిల్లర కావాలి" వగైరా వగైరా, ఈ శతావధానము ముగించుకొనేటప్పటికి గడియారము టంగ్ టంగ్ మని పదకొండు కొట్టింది. పడక కుర్చీలో వ్రాలి 'ఆశ్రమపు' సంగతి మళ్లీ ఆలోచించా. "తీరా పరీక్షలప్పుడు నేను ఆశ్రమానికి వెళితే పాపము పిల్లలు ఇబ్బంది పడిపోరూ. ఛీ! అయినా ఆశ్రమాలకు వెళ్ళటమేమిటి. బుద్ధిగడ్డితింటున్నట్లుంది! (అదే ఎవరన్నా అంటే వూరుకోమనుకోండి!) పిల్లలు పరీక్షలు ముగించిన తరువాత శలవల్లో ఈసారి మద్రాసుకు. ఈబాదరబందీని వదిలించుకొని ఒక పదిహేను రోజులైనా విశ్రాంతి తీసుకోవాలి. పిల్లలకు కులాసాగావుంటుంది ఎక్కడికైనా వెళితే. వూటీకో, బెంగుళూరో వెళితే బాగుండేటట్టుగావుంది. అబ్బే! చల్లగా వుంటాయని ఆసపడి ఈవూళ్లు వెళితే నాకు విశ్రాంతి ఎక్కడ? స్వర్గానికి వెళ్లినా తెడ్డేనా అన్నట్లు అక్కడికి వెళ్ళి మళ్లీ ఇల్లూ, పిల్లలూ, వంటా, నౌకర్లు రభస తప్పదుగా. ఎక్కడికి వెళ్ళితే హాయిగా పనిచేయకుండా కూర్చోవచ్చోనని ఆలోచించి - అమ్మగారింటికి వెళితే బాగుండుననుకొని, మళ్ళీ ఎండలు తలచుకొని భయపడి వూరుకొన్నాను"

ఆనాడు సాయింకాలము తండ్రీ పిల్లలూ ఏదో గుసగుసలాడుతున్నారు. వరండాలో కూర్చుని నన్నుచూడగానే అదోవిధంగా నవ్వారు "[illegible]"

అన్నాను. "ఏమీలేదు అమ్మా! మేమంతా ఒక ప్లానువేసుకున్నాము శెలవలకి" అన్నారు. "ఇంకా పరీక్షలు ఆరంభమన్నా కాలేదు అప్పుడే శెలవలు సంగతి ఆలోచిస్తున్నారా బోయి చదువుకోండి" అనగానే "అమ్మో! పరీక్ష"లనుకుంటూ పరుగెత్తారు పుస్తకాల దగ్గిరకు.

"ఏమిటి మీప్లాను?" అన్నాను.

"నేను మనవూరు వెళ్ళాలి. చాలాపనులున్నవి. అక్కడకు పిల్లలూ వస్తామంటున్నారు. ఎట్లాగయినా వీలుచేసుకొని ఈసారి నీవుకూడా బయలుదేరితే అందరమూ వెళ్ళి ఒక నెల రోజులుండి వద్దాము" అని అన్నారు. 'రోగి కోరిందే వైద్యుడు చెప్పా'డని మనస్సులో అనుకొని "సరే" నన్నాను.

రాత్రి పడుకుంటే నిద్రపట్టలేదు. ఆ కోపములో, ఆ విసుగులో ఉదయము ఎక్కడికైనా వెళ్ళితే బాగుండునను కున్నాను. గాని ఎక్కడికి వెళ్ళేది? ఇల్లువొదలి వెళ్ళాలంటే సామాన్యమైనపనా? గొడ్లు గోదా, తోటాగీటా అన్నీ చెడి బోవూ మళ్ళీ తిరిగి వచ్చేలోపల! పైగా 'సరే' నని ఒప్పుకున్నానే మాచౌదరిగారితో. మళ్ళీనేను రానంటే "ఇదుగో మీ ఆడవాళ్ళకున్న బుద్దేఇది, కాస్సేపుకోమాట" అని కోప్పడరూ! "రేపుచూద్దాములే" అని అనుకుంటూ నిద్రబోయాను. నాజీవితంలో చిత్రంగా నిద్రే నాసమస్య లెన్నిటినో పరిష్కారము చేస్తుంది.

* * *

పిల్లల పరీక్షలైపోయిన తెల్లవారే స్వగ్రామమునకు కారులో ప్రయాణము.

ఇంకా చీకటుండగనే స్నానపానాదులు ముగించుకొని, కారులో సామానులు సర్దుకొని బయలు దేరినాము. నెల్లూరువరకు ప్రయాణము హాయిగానేవుంది. అక్కడనుంచే మేము ఒక్కొక్కమైలు ముందుకు పోతున్నకొద్దీ వేడిమి ఒక్కొక్క డిగ్రీ హెచ్చుతున్నట్లు తోచింది. ఒంగోలు దగ్గర ఒకమామిడి తోటలో ఆగి భోజనాలు ముగించి అరగంటసేపు విశ్రమించి తిరిగి ప్రయాణము సాగించాము. చిలకలూరుపేట సమీపము చేరేటప్పటికి ఎండలు నిప్పులుచెరుగుతున్నవి.

"కారు కొంచెము ఆపండి" అన్నాను.

"ఎందుకు?"

"పనుంది కాస్త ఆపాలి" ........ గానుగ చెట్లుక్రింద కారు ఆగింది. కారులోనుంచి నేను దిగాను.

"మీరుదిగరా" అన్నాను కారులోనివాళ్ళతో "ఈఎండలో మేము దిగము" అని ఒకరు జవాబు "ఓయి!" అని మరొకరి కేక. "ఎందుకు అట్లాకేకలేస్తా" రని గద్దించాను. "చూడు పైన ఏముందో" అని అందరూ ఏక కంఠముతో అరుపు. చెవులు మూసుకొని పైకి చూతునుకదా ఓపెద్దకోతి చెట్టుకొమ్మమీద కూర్చునివుంది. అక్కడికి ఒక ఇరువై గజాల దూరాన ఒక కాలవవున్నది. ఆకాలువలో నీళ్ళు ఎండాకాలమైనా ప్రవహిస్తూనే వున్నవి. ఆకాలవలోని చల్లటినీళ్ళతో ముఖము కాళ్ళు కడుక్కుంటే ఎండ తాపం తగ్గుతుందనే నేను కారు అక్కడ ఆపమన్నాను. ఒక టవలు, లోటా తీసుకొని నేను ఆకాలువ దగ్గిరకు వెళ్ళడము చూచి "అమ్మా! అక్కడ కోతులున్నయ్" అని పిల్లలుకేక లేశారు. "ఏమీ ఫరవాలేదులే వాళ్ళు అమ్మ చుట్టాలే" అని పిల్లలకు ఓకొత్త వార్త. "కోతులు నన్నేమి చేస్తవిలే" నని నేను వెళ్ళి కాలువలో దిగపోయాను. లోతుగా వున్నట్లు తోచింది. అందుకని ఇంకాకొంచెము ముందుకు పోయి నీళ్ళలో బండలు కనపడితే ఆబండమీదకు దాటి నీళ్ళు అందుకుని ఆ చల్లటి నీళ్ళతో ముఖము, కాళ్ళు చేతులు కడుక్కుంటే ఎంతో ప్రాణానికి హాయనిపించింది. ఇంతలోకే కారులోంచి మళ్ళీ కోలాహలము. అందరూ హడావిడిగా చేతులూపుతున్నారు రమ్మనమని. వెనక్కి తిరిగి చూతునుగదా ఓకోతి మెల్లగా దగ్గరకువచ్చి నీళ్ళలోకి చూస్తూవుంది. నేను టవలుతో తుడుచుకుంటూ గానుగచెట్టు సమీపించాను.

"ఎంతసేపు కాలువదగ్గిర- కూర్చో కూర్చో- వాగులో దిగి కోతుల్ని పలకరించుతూ మార్గ మధ్యలో మజిలీలు చేస్తూవుంటే మనము మనవూరు చేరేటప్పటికి చీకటి బడుతుం" దని విసుక్కున్నారు - మమ్ములను సురక్షితంగా చేర్చవలసిన బాధ్యతగల మా చౌదరిగారు. ఎంతహాయిగా వుందిక్కడ- ఆకాలువ- ఆవనము- అంటూకూర్చున్నాను. కారు బయలుదేరింది. "ఏం! వనవాసమ్మీద కోరిక పుట్టుతుందా" అన్నారు. "వనవాసాలు కోరుకోకుండా మునుపు ఆ రామయ్య సీతమ్మకి బుద్ధివచ్చేట్టు చేశాడుగా" అన్నాను. ఎండల్లో మాది గుంటూరు మూడుగంటలకి చేరాము.

అక్కడ ఐస్‌క్రీములు వేసి శరీరాలు కొంత చల్లబరుచుకున్న తర్వాత అయిదు గంటలకల్లా స్వగ్రామము చేరాము.

ఇహ నావిశ్రాంతి కార్యక్రమము ఆరంభించాలని నిశ్చయించుకున్నాను. అనుకొనటమేమిటి, పత్రికలలో ప్రకటించటము మినహా, పుట్టింటా - అత్తింటా బంధువులందరికీ తెలియ చేయించాము మనము విశ్రాంతి తీసుకోబోతున్నామని.

ఉదయము కాఫీ తెచ్చిఇస్తేనే నిద్రనుంచి లేద్దాము. భోజనానికి, స్నానానికి అన్నీ ఆయత్త పరచి కబురు వచ్చే వరకు కూర్చున్న చోటునుంచి లేవద్దని నిశ్చయించుకొన్నాను. పిల్లలకు - సెలవుల్లో పనులు నేర్చుకోవాలని చెప్పేశాను. కాని ఇదివరలోనే అందరికీ ultimatum ఇవ్వబట్టి పాపము అమ్మను తిప్పలు పెట్టవద్దు, మేము తలదువ్వుతాము, మేము బొట్టు పెడుతామని పిల్లల పనులన్నీ అందరూ అందుకున్నారు.

మొదటిరోజు ఉదయము కాఫీ వచ్చేవరకూ లేవలేదు. "అబ్బ ! ఎన్నాళ్ళకు నేనులేవకుండా కాఫీయే నాదగ్గరకు రావట"మని సంతోషించి- అమృతము త్రాగినట్లు ఆకాఫీని ఎంతో ఆప్యాయంగా త్రాగాను. 'అల్పసంతోషివి' అన్నది ముసలమ్మ. అల్పమో, స్వల్పమో ఈవిధంగా పదిహేను రోజులు గడుపదలచాను.

రెండోరోజు నిద్దరరాలేదు. తెల్లవారుఝామున కోడి కూసినప్పట్నుంచీ నిద్దర మెలుకువే. లేగదూడలు 'అంబా' అని అరుస్తూవుంటే జీతగాళ్ళకు లేచి పాలు పితగక తప్పిందిగాదు. ఇంట్లో పొయ్యివూదుట, చిమ్ముట కళ్ళాపు జల్లుట మొదలగు పనుల అలజడులు బయలుదేరినవి. కాళ్ళు చేతులు బాగానేవుండి నిద్ర రాకుండా మంచము పట్టుకు ఆలా పరుండటము నాకేమీ బాగుండలేదు. పైగా పెద్దవాళ్ళు లేచి పనులు యథావిధిగా చేసుకుంటూంటే, చిన్నదాన్ని నేను సోమరితనముగా వుండటము ఏమీ బాగాలేదు. పెద్దవాళ్ళు నన్ను నిందించక పోయినా నేను చేస్తున్నపని నాకు నచ్చనిపించలేదు నా విశ్రాంతి నాకు మెల్లగా బాధగా వుండటముఆరంభించింది. నాల్గురోజులయేటప్పటికి 'విశ్రాంతి' భరించరానిదైనది. పోనీ ఏదైనా పని చేద్దామా అంటే అక్కడ నాకేమీ పనిచేయటానికి కుదరలేదు. అంతా క్రొత్తే. ఇహ ఇంటికి వెళ్ళుదామన్నాను. "ఏం ! ఇంటిమీద గాలిమళ్ళిందా" అని అందరూ నవ్వారు.

అక్కడ పనులు తొందర తొందరగా ముగించుకున్నాము. నాకు విశ్రాంతి విసుగుపుట్టినట్లే పిల్లలకు పరీక్షా ఫలితాల ఆరాటము ఎక్కువైంది. ఫలితాలు తెలియగానే సీట్ల అన్వేషణ ఆరభించాలిగా.—

రేపు ప్రయాణమన్నాము "వీల్లేదు రేపు అష్టమి ఎల్లుండి నవమి" అన్నారు చిన్నబాబాయి. "అప్పుడే బయలుదేరుతున్నారేమి? విశ్రాంతి తీసుకొన్నావా? వంట్లో సులువేనా" అన్నారు బుగ్గమీసాల సుబ్బయ్య మామ. "ఆ కులాసాగానే వుంద"ని జవాబిచ్చాను. దశమిరోజు ప్రయాణము నిశ్చయింపబడ్డది. సురక్షితముగా ఇల్లుచేరాము. తాళము తీసి 'అబ్బ! ఎన్నాళ్ళకి' అని సోఫాలో కూలబడ్డాను.

"విశ్రాంతి చాలిందా" అన్నారు తపాలా చూచుకుంటూ మా చౌదరిగారు.

"ఆఁ" అన్నాను క్లుప్తంగా.

"దైవమెంతటి చిత్రపు బంధముతో స్త్రీని గృహానికి బంధించాడో" నని ఆలోచించటము మొదలు బెట్టాను మొదటి సారిగా !

★



# స్వతంత్ర భారతము

• శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ *

సీ॥ నిను బానిసగ నొనర్చిన వారిపుడు నీకు
అగ్గలమ్ముగ కాన్క లంపినారు
నిను జూచి గేలిసేసిన వారిపుడు నీకు
భక్తి బ్రహ్మరథమ్ము పట్టినారు
బైరాగియని నీకుమారుని దిట్టిన వా
రిపు డాతనికి జోతలెత్తినారు
రవి యస్తమించని రాజ్యాధి పులు నేడు
శాంతి భిక్షకు చేయి సాచినారు

కొడుకు లోకమాటమీదనే నడుచు కొనిన
గోపురము తలదన్ను నీకాపురమ్ము
దేశదేశాలు నీముందు తీసికట్టు
నీ నవోదయమునకు తల్లీ! నమోస్తు.

మ॥ తిమిరమ్మెల్లను విచ్చిపోయి నది
గాంధీతాత సత్యాగ్రహో
ద్యమ భానూదయ నవ్యదీధితులతో
ఆదివ్య తేజస్వి తే
జము రాజిల్లు స్వతంత్రభారత మహా
సౌధమ్ములో శాంతి-స
త్యము- ధర్మమ్ము- అహింసయున్
నిలుపవయ్యా! భారతీనందనా!

మ॥ మన జాతీయత దిద్ది తీర్చినమహా
మాన్యుల్ స్వతంత్రార్థమై
తనువుల్ వీడిన వీరశేఖరులు
స్వార్థ త్యాగులుగా జూపి పో
యిన దారిన్ జరియించి దిద్దుకొను
మోయీ! దేశ సౌభాగ్యమున్
విను- నీబుద్ధి బలమ్ము- నీయనుజులన్
దేశమ్ము లగ్గింపగా

ఉ॥ నీదిపుడు స్వతంత్రభువి; నీ హృద
యమ్మున ధర్మభావ భా
నూదయమై అహింస సకలోర్వికి
[illegible] శాంతిని గూర్చునాడు; నీ
ఆదర వాహినుల్ శ్రితజనావళిపై
ప్రసరించునాడు; నీ
పాదయుగమ్ము చెంత తల వంచును
రా! సకల ప్రపంచముల్గా

ఉ॥ ప్రాణము లొడ్డియైన శరణార్థుల
గాచెడి దేశమందు ని
ద్రాణువుగా నశించునటరా! కరుణా
తరుణీ లలామ; మా
త్రాణము దీర్చికో తలతువేని
మహాత్ముని ఆశయమ్ములన్
రాణకుదెచ్చికీర్తిగొనరా! నవ
భారత సృష్టికర్తవై.

చ॥ పొడిపొడి మాటలన్ పలుకబోకుము;
లేని తనమ్ము లేకముం
దడుగును వేయుమోయి! భరతాంబ
ప్రతిష్ఠను విల్వ; నీవు నీ
నడుము బిగించి దీక్షగొనినన్ మన
రాజ్యము రామరాజ్యమై
గడగడలాడి కూలి పడగావలె;
స్వార్థపిశాచి దుర్గముల్.

చ॥ నినుగని పెంచినట్లు జననిన్గా
సుఖపెట్టని నాడు; నీదు జీ
వనము వనమ్మురా! బ్రతుకుపై
మమకారము కన్న జన్మభూ
మిని మనసార గొల్చుట సుమీ-
నరజాతికి ఖ్యాతిదెచ్చు దీ
నిని మరువంగబోకు గమనింపుము
దేశ సుఖమ్ము సోదరా!

శా॥ ఏయూరన్గా గనుగొన్న ఆర్తనినదంబే
"అన్నమో రామచం
ద్రా!" యంచున్గా విలపించువారి
గనుమయ్యా! గుండియల్ బ్రద్దలౌ
ఆ యాలపము లాలకించిన--
సహాధ్యాయాళి వస్తుండగా
నీయింటన్ పరమాన్నముల్ దినుటకున్
నీయాత్మయెట్లొప్పునో!



పెద్దకథ

# అనుమానం

శ్రీమతి జి. లక్ష్మీరాజ్యం

[జరిగినగాథ :— సుందరం వట్టి అనుమానం మనిషి. సుందరం భార్య వనజ గడసరి, భయభక్తులుగల మనిషి. కారణం లేకుండా భార్యపై అనుమానపడి ప్రక్కింటికి వెళ్ళద్దంటాడు సుందరం. కాని ఆఫీసులో కూర్చున్నప్పుడు, అనవసరంగా భార్యపై అనుమాన పడుతున్నానని తనలో తనే తర్కించుకుంటాడు. ఒక రోజు ప్రక్కింట్లో పేరంటానికి పిలుస్తే వెళ్ళింది వనజ. అనుమానంకొద్దీ పనికట్టుకొని తాళం మిషపై ప్రక్కింటి కొస్తాడు. అక్కడ ఆ యింటివారమ్మాయి గౌరితో మంతనాలాడ్డం వనజ గ్రహిస్తుంది. ఇంటికి రాగానే సుందరం కోపంగా వనజను దండిస్తే అదును దొరికిందని తనూ భర్తను ఎదిరిస్తుంది. తనమాట కెదురు చెప్పిందనే కోపంకొద్దీ యింట్లోంచి పొమ్మని బైటికి గెంటేస్తాడు వనజని.

అర్ధరాత్రి ఎక్కడికి వెళుతుంది? పైగా గర్భిణీస్త్రీ! ఆత్మహత్య చేసుకోకూడదని, తిన్నగా పుట్టింటికి చేరుకుంటుంది. అనుకోని కూతురి ఆగమనానికి తల్లిదండ్రులు ఆశ్చర్యపోతారు. కాని వున్నసంగతి వనజ చెప్పక దాస్తుంది. కొన్నిరోజులయాక సంగతంతా చెపుతుంది. తండ్రి అల్లునిపై మండిపడి, కూతురే కొడుకని తలుస్తానంటాడు. కాని లోకం వనజ రాకనుగురించి గుసగుసలాడుతున్నదని తల్లి మనోవ్యధ చెందుతుంది. తనవల్ల తల్లిదండ్రులు అవమానపడుతున్నారని, ప్రసవమైన తరువాత ఏలాగైనా అచ్చటినుంచి పోవాలని నిశ్చయించుకుంటుంది. తన భావి జీవితం గురించి ఆలోచిస్తూ "యింత విశాల ప్రపంచంలో బతకడానికే చోటులేదా? ఇన్ని మహానగరాలు, పల్లెలు ఉన్నాయి. చివరకు భిక్షాటన అయినా చేసుకొని బతకవచ్చ"ని నిర్ణయించుకుంటుంది. ఇక చదవండి]

వనజ సుఖప్రసూతై ఇరవై రోజులు దాటింది. మగబిడ్డ. దబ్బపండువంటి శరీరం, బొద్దుగా వున్న వొళ్ళు చాలా ముద్దొస్తున్నాడు. వనజ తనకార్యక్రమానికి నాందిగ తన చేతి గాజులమ్మించి డబ్బు జాగ్రర్త చేసుకుంది.

అనాడే వనజ ప్రయాణం కావలసి యుంది. తనకి తప్ప మరెవ్వరికీ తెలియదు. తెలియకూడదు. చాలా భయంగానే వుంది వనజకి. కాని ధైర్యాన్ని చిక్కబట్టుకొంది. కుటుంబగౌరవాన్ని కాపాడి, తన మానాన్ని, ప్రాణంతో సమమైన పసిపాపని కాపాడుకోవాలి. భవిష్యత్తులో ఇదే వనజ ఆదర్శం. కొద్ది బట్టలుమాత్రం ఒకసంచిలో జాగ్రత్త చేసుకున్నది.

"నాన్నగారికి — కుమార్తెగా, భార్యగా, తల్లిగా నాధర్మం నాకు బాగా తెలుసుననుకుంటాను. విధివ్రాత ప్రకారం ఆధర్మాన్ని నిర్వహించేందుకే మీదగ్గర శెలవు తీసుకుంటున్నా: ఎక్కడో జీవించే వుంటాను. అన్యధా భావించకండి. సమాజం అగౌరవం చూపిస్తున్నా మీరు ఆదరించినందుకు వేవేలవందనాలు.

మీ కుమార్తె వనజ"

అని చీటీ వ్రాసి టేబిలుమీదపెట్టి ఎవ్వరికీ తెలియకుండా వెళ్ళిపోయింది కొడుకును తీసుకొని —

మదరాసు మెయిలు మహాజోరుగా పోతోంది. స్త్రీల పెట్టిలో వనజ కూచొని తన చిన్నారిని చూస్తూ భావిజీవిత స్థితినిగూర్చి ఎవ్వో కలలుకంటోంది.

ఎలూరుస్టేషను వచ్చింది. ఎవ్వరో ఒకామె చాలా సామానులతో ఆపెట్టిలో ఎక్కింది. వనజ పాపకు పరచిన ప్రక్కను తీసివేసి ఆమెకూర్చొనేందుకు జాగాయిచ్చింది. ఆమె వనజవైపు కృతజ్ఞతా పూర్వకంగా చూసింది. వనజను చూసిన వెంటనే ఆమెకు ఎందుకో గొప్ప అభిమానం ఏర్పడింది. వనజ చేతిలోని బిడ్డే కారణం కావచ్చు. పైగా వనజ ముఖంలో నృత్యం చేస్తున్న భావసంచయాన్ని ఆమె

# అనుమానం

గ్రహించగలిగి వుండాలి. అందాలు చిందే ఆబిడ్డని చూస్తుంటే బిడ్డలులేని ఆమె 'ఆబిడ్డ - నా పాప అయితే ఈపాటికి ఎన్నిసార్లు పాప పాలబుగ్గల్లోవున్న అమృతాన్ని ఆస్వాదించేదాన్నో' అనుకుంటూ వనజను పలకరించకుండా వుండలేకపోయింది. ఆమె సంస్కారముగల స్త్రీ. విద్యావంతురాలు. ఆదరణ ఆమెకు బాల్యంనుంచీ వున్నదే.

"ఏవూరు వెళ్తున్నారు" అంది ఆమె నెమ్మదిగా.

"మదరాసు" అని వనజ జవాబిచ్చింది బరువైన హృదయంతో.

"మేమూ అక్కడికే లెండి ... ఎక్కడినుంచి వస్తున్నారు" అన్నదామె.

"కాకినాడనుంచి" అని తలపైకెత్తి ఆమెవంక చూసింది తన కథంతా చెప్తున్నట్లు.

"చంటిపాపతో ప్రయాణం చేస్తున్నారు. మగవారు కూడావస్తున్నారా వెంట" అని కుతూహలంతో ప్రశ్నించిందామె. చిరునవ్వు తొణికిసలాడింది వనజ పెదవుల మీద, పాప వంకచూస్తూ "ఆ... వీడే మగవాడు" అన్నది.

ఇద్దరూకలిసి పాపవంకచూసి నవ్వుకున్నారు. కాని వనజ నవ్వు క్షణంలో మాయమై పోయింది. పాపను ఆమె తీసుకొని తనివితీరా ముద్దులాడుతూ ముల్లోక సౌఖ్యాల్లో మునిగి తేలుతూన్నట్లు భావించి ఆమె తెలియకుండానే "ఈ పాపని నాకు ఇవ్వకూడదు, మీకు పుత్రదాన ఫలం ఉంటుంది- ఈ పాప తమ్ముణ్ణి కనవచ్చు మీరు" అన్నది బిక్షకోరే ఆమెవలె.

"తప్పకుండా తీసుకోండి- అంతకన్న మహోపకారం నాకేంకావాలి. కాని పసి పాపని పెంచే దాదిగా నన్ను మీతో తీసుకు వెళ్ళండి" అన్నది వనజ గంభీరమైన భావం ప్రకటిస్తూ.

"ఆ !- ఎంతమాటన్నారు. నన్ను పరిహాసం చేస్తున్నారు. గొప్ప వంశపు కళలు ఉట్టిపడుతున్నాయి మీ కళ్ళల్లో- దాది అంటారా" అన్నది కొంచెం విచారం చూపిస్తూ.

"వంశము గొప్పది కావచ్చు. మనస్సు మహత్తరమైనది కావచ్చు, కాని కాలం కఠోరమైందయితేనో?" అన్నది వనజ.

"చాలా బాగా అడిగారు- ఆ సమస్యానే నేను వ్రాసిన స్క్రిప్టుకి ఆధారంగా తీసుకున్నాను" అన్నది ఆమె.

"సినీమా కథ వ్రాశారా- పేరేమిటి, ఫిలుమ్ తీస్తారన్న మాట!" అని ప్రశ్నించింది వనజ.

"అవును. మావారే ప్రొడ్యూసరు. డైరెక్టరూకూడా. కథ నేనే వ్రాశాను... పేరు 'అనుమానం' అని పెడదామనుకుంటున్నాము" అని చెప్పింది ఆమె.

వీరి సంభాషణలో ఒకరి పూర్వోత్తరాలు ఒకరు తెలుసుకున్నారు. ఆమె పేరు కళ్యాణి. వనజయొక్క గత చరిత్ర విని కళ్యాణి చాలా బాధపడింది. కాని ముందు తన యింట పాప కెవ్వుమన్నది వినపిస్తుందనుకొని సంతోషించింది కళ్యాణి. కాకతాళీయంగా ఈగొప్ప సహాయానికి కృతజ్ఞతను తెలియజేసుకుంది వనజ.

వనజలో మాతృత్వం మూర్తీభవిస్తూంది. అంత చిన్న వయస్సులో అంత గంభీర్యం ఉండటం చాలా అరుదు. వనజ మనఃపూర్వకంగా అంగీకరిస్తే ఆమెను తన సినిమాలో నాయకిగా ప్రవేశపెట్టి వెండి తెరమీద మాతృత్వాన్ని అమోఘంగా ప్రకటించగల అవకాశం ఇవ్వాలని కళ్యాణి లోలోపల అనుకుంది. కాని దీనిలో ఆమె స్వార్థం మాత్రం లేదు. ఫిలిం రంగానికి పవిత్రతనాపాదించాలని మాత్రమే ఆమె వాంఛ. సమయం చూసి నొప్పించకుండా ఒప్పించాలనుకుంది కళ్యాణి.

వారు చాలా హాయిగా ప్రయాణం చేశారు. కళ్యాణి భర్త వనజ సంగతి తెలుసుకొని పుత్రుని ఇచ్చిన దేవతగా కొనియాడారు. అవును బిడ్డలు లేనివారి బాధ తీరినది. అందరు కళ్యాణిగారి భవనానికి వెళ్ళారు.

* * *

కళ్యాణి ఇంట్లో వనజ చాలా కలివిడిగా వుంటోంది. కళ్యాణితో ఏర్పడిన ఆదర్శమైత్రి వలన కళ్యాణి కోరికను కాదనలేకపోయింది. సినిమాలో నటించాలని, డబ్బుతో తులతూగాలని వనజకు ఏమాత్రం ఇష్టంలేదు. కళ్యాణి చేసిన ఉపకారం గుర్తుంచుకుంది వనజ. అందువలనే నాయకి పాత్ర వహించేందుకు అంగీకరించింది. అదికాక ఆపాత్రలో చాలా ప్రత్యేకత గోచరించింది వనజకు. తన యదార్థ జీవిత

గతికి ఆ పాత్రకి దగ్గర సంబంధం చూడకలిగింది. నటన ఇదివరకు తెలియకపోయినా సులభంగా గ్రహించే శక్తి గలది వనజ.

ఫిలిం దాదాపు పూర్తయిపోయినట్లే. వనజ చాలా గంభీరంగా, ఆదర్శంగా నటించింది. వనజయొక్క ప్రత్యుపకార బుద్ధిని కళ్యాణి కొనియాడింది. రిలీజుకు సిద్ధంగా వుంది ఫిలిం. పేరు 'అనుమానం' అనే ఖాయం చేశారు. వనజకు కళ్యాణి కొంత డబ్బు ముట్టజెప్పింది వద్దన్నా.

అయితే వనజకు మానసికంగా మహత్తర పరిణామం వచ్చింది. ఆమెకు భావిజీవితానికి ఎట్టి ఆదర్శం, ప్రయోజనం కనిపించలేదు. భర్త ఎడబాటుగా ఇతరచోట ఉండటం లోకం కళంకం ఆపాదించేందుకే. తన వంశానికి బీజంగా కొడుకు కేశవ భాగ్యవంతులపంచ చేరగలిగాడు. కేశవ ఎక్కడున్నా తనకొడుకే. ఇంకా తాను ఎందుకు జీవించి ఉండాలో అర్థం కాలేదు. కాని తన భర్తకి కొంత ఆర్థిక సహాయం చేసి భర్త పాదాల దగ్గరే ప్రాణం విడిచి శీలవతి నని రుజువుచేసుకోవాలని ఆమె నిశ్చయించుకొంది.

ఇంక వెళ్ళిపోతాను అనే భావాన్ని కళ్యాణితో సూచాయగా చెపుతూనే ఉంది. 'కేశవ' నీకొడుకే యని ఎన్నోసార్లు చెప్పింది వనజ కళ్యాణితో. కళ్యాణికి కేశవ అంటే అమిత ప్రేమ. తమ ఫిలిం కంపెనీకి 'కేశవ పిక్చర్సు' అని పేరు పెట్టారు.

వనజ తన వుద్దేశాన్ని ఖాయం చేసుకుంది. ఆరాత్రే విశాఖపట్నం వెళ్ళేందుకు నిశ్చయించుకుంది. పగలల్లా కేశవను వదలలేదు. చాటుగా ముద్దాడి ఏడ్చింది. కడసారి తను కన్న కేశవను చూసి ఒక చీటీ దగ్గర పడేసి వెళ్ళిపోయింది వనజ. కళ్యాణి పనిమీద వెళ్ళి తొమ్మిదింటికి తిరిగి వచ్చింది. కేశవ దగ్గర వనజ లేదు— ఒక చీటీ ఉంది. "సోదరీ! నీ మేలు తీర్చుకోలేను. కేశవ నీబిడ్డ. నా జీవితానికి భావిలో ప్రయోజనంలేదు. అందుకని వెళ్ళిపోతున్నా. చెప్పకుండా వెళ్ళటం మీరు ఆటంకం పెడతారనే. క్షమిస్తావుకదూ! కేశవ కళ్యాణి దంపతులకు ముద్దుబిడ్డ.

కృతజ్ఞురాలు వనజ"

కళ్యాణి, ఆమె భర్త ఇది చూసి చాలా విచారించారు. కేశవను ఒళ్ళోకి తీసుకొని ఒకమారు కన్నీరు కార్చారు.

వనజ విశాఖపట్నంలో దిగింది. కళ్యాణి యిచ్చిన సొమ్ము తాలూకు మూడువేల రూపాయలకు తన భర్తపేర చెక్కువ్రాసి, ఒక ఉత్తరం కూడా పెట్టి కవరు అంటించింది. తన అంతిమ యాత్రకి కావలసిన సన్నాహాలు చేసే వుంచింది.

బాగా చీకటి పడిన తర్వాత ఇంటికి బయలుదేరింది. తలుపు లోపల గడియ వేసివుంది. లోపలనుంచి ఎవ్వో మాటలు వినిపిస్తున్నాయ్, తన భర్త, మరెవరో స్త్రీ బహుశః రెండో భార్య అయి వుండవచ్చు. వనజ తలుపు దగ్గర నుంచున్నది.

"అదే మండీ. 'అనుమానం' సినిమా అని తీసుకొని వెళ్ళి సగంలోనే ఇంటికి లాక్కొచ్చారు" అంది ఆ స్త్రీ.

"పోనిస్తూ పాడు ఫిలిం— తలనొప్పిగా వుంది" అన్నాడు సుందరం.

"అవును, అలాగే నొప్పిగా వుంటుంది. అనుమానం వున్న భార్యను శీలవతి అని రుజువు చేస్తుంటే నామర్దా కాదూ, అనుమానం పడ్డ మగధీరులికి" అన్నది ఆ స్త్రీ చలోక్తిగా.

"మహా పెద్ద క్రిటుక్కులాగా చెప్పొచ్చావుకాని" అన్నాడు.

"ఆహా! ఎంతబాగా యాక్టు చేసిందండీ. ఆమెలో మాతృత్వం ఎలా మూర్తీభవించిందో!" అని పొగడుతోంది.

"ఆ సోది మానెయ్యి" అని గద్దించాడు సుందరం.

వనజ తలుపు తట్టింది గబగబా పెద్ద శబ్దం చేస్తూ. సుందరం, ఆ స్త్రీ పరుగున వెళ్ళి తలుపు తీశారు... వనజ గభాలున సుందరం కాళ్ళమీద ఆ కవరు పడేసి తల పెట్టింది. ఒక్కమారు పైకిచూసి శాశ్వత నిద్ర కుపక్రమించింది— ఆమె ప్రక్కనే పగిలిన చిన్న సీసా వుంది, దానిమీద 'విషం' అని వుంది.

(సమాప్తం.)




# అమృతాంజనము

గాని,

" యథాయథా................రాశీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగుచున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

# ఇల్లరికం

శ్రీ కె. శశాంక్.

(గత సంచిక తరువాయి)

౮

రోజులు గడిచాయి. పెళ్ళి దగ్గరకొచ్చింది. మామయ్య అత్తయ్య నిరాశగా ఉన్నారు. కాని మాలతి మాత్రం కళ కళ్ళాడుతూ తిరుగుతోంది. మఱి ఆగంభీర హృదయం లోని ప్రవాహాలేమిటో?

మామయ్య ఆనాడేదో ఆఫీసుపని చూసుకుంటున్నాడు. మాలతి మెల్లగావచ్చి తనొచ్చినట్లు సూచనగా కొంచెం దగ్గింది.

"ఏం అమ్మా?" అన్నాడు మామయ్య తలెత్తిచూసి.

"ఏమీలేదు."

జాలిగా ఆమె వైపుచూసి మళ్ళీ తనపని చూసుకోటం మొదలు పెట్టాడు.

"నాన్నా! —"

"ఏమిటమ్మా?"

"రామంబావ పెళ్ళికి మనం వెళ్ళటంలే? "

మామయ్య రామంమీద కోపం చూపిస్తూ అన్నాడు. "ఒద్దమ్మా! ఇంతవఱకూ ఆత్మీయులుగదాఅని అనుకున్నాం. కానీ మొదట్నించీ నన్ను నమ్మించి, ఆమధ్య మళ్ళా పోట్లాటపెట్టుకుని, — సమయానికి నేనుత్తరం రాసానో లేదో అప్పుడే గుట్టుచప్పుడు కాకుండా అంతా నిశ్చయించుకుని, తప్పదన్నట్లు శుభలేఖ పంపించాడు. ఒక్కగా నొక్క మేనమామనూ — కంటన్నా పడ్డాడా? ఆనాడు తండ్రి ఒప్పుకోలేదన్నాడు, ఆయనపోగానే మళ్ళా అడిగితే యివ్వనంటామా? పోనీ అభిమాన మనుకుంటూ ఉన్నట్లయితే, నేను రాయబోయానుగా!! ఇంతకూ సమయం మించి పోయిందమ్మా! — ఎవరైనా పిల్చారా ఏమన్నానా-మనమేం అంతనీచంగా లేము! ఒక్క పిల్లను ప్రేమగా పెంచుకోగల శక్తి నాకుఉంది. వాళ్ళులేదని భావించినా....!"

మాలతి కళ్ళల్లో నీళ్ళు తిరిగినయ్. 'ఒక్క పిల్లను ప్రేమగా పెంచుకోగలం' అన్నమాటలోని యదార్థ సత్యం ఆమెకు తెలుసు. అందుకే తన తల్లి దండ్రులు ఈనాడు తన్నుగూర్చి పడుతున్న బాధలో ఒకవిధంగా పాలు పంచుకోలేకుండా ఉండలేక పోయింది. మెల్లగా తండ్రి దగ్గరకు వచ్చి నుంచుని గాద్గదికంగా అంది. "నాన్నా! నాపెళ్ళికి ఇంతబాధ పడ్తావెందుకూ? నేను నిన్ను అందుకోసం ఒత్తిడి చేస్తున్నానా?"

"అంతవఱకూ రావాలా తల్లీ! మాబాధ్యత!" అన్నాడు చెయ్యి తిప్పుతూ. కొంచెంసేపాగి మళ్ళీ అన్నాడు "నేనునిన్నుగూర్చి బాధపడటం లేదమ్మా" — "ఒచ్చే కన్నీటిని నిగ్రహించుకుంటూ మనసులో అనుకున్నాడు. 'అక్కయ్యా! చూడవమ్మా! ఇటువంటి రత్నాన్ని ఒద్దంటూ తిరస్కరించాడు నీకొడుకు!' వెంటనే మళ్ళీ మనసులో యిట్లా అనుకున్నందుకు ద్రోహిలా తలవంచుకున్నాడు మామయ్య.

"కాదు. నాన్నా నాదగ్గఱ దాస్తున్నావు నువ్వు!"

"లేదమ్మా! అంతటి వాణ్ణికాను. నీతో ఏదీ చెప్పకుండా ఉన్నానా నేను? - మొన్ననే ఒకళ్ళకి ఉత్తరం రాసాను"

"ఎందుకు? "

"సంబంధం చూస్తున్నాను "

"నాన్నా! నేను ఎవర్నీ చేసుకోను " మాలతి అనుకోకుండా తన కంఠంలో కాఠిన్యత కనపర్చింది.

మామయ్య అలాగే బొమ్మలా కూర్చుండి పోయాడు. మాలతి నోటమాట లేకుండా అప్రయత్నంగా అశ్రువులు కార్చుతూ కంపిస్తూ నుంచున్నది. చాలాసేపు అట్లాగే నిశ్శబ్దంగా గడిచి పోయింది. మాలతి తల్లి వచ్చింది.

"ఇదేమిటే? తంద్రీకూతుళ్ళిలా కూర్చుండిపోయారు?" అంది విస్మయంతో.

తొట్రుపాటుతో కళ్ళు తుడుచుకుని అక్కడి నుంచి వెళ్ళి పోయింది మాలతి.

౯

"శుభస్య శీఘ్రం" అన్నారు పెద్దలు! ఇంతకీ రాసిపెటి ఉండాలిగానండి. ఎంత సేపు ఏమనైనా? పుట్టి నప్పట్నుంచీ భార్యా భర్తల దృష్టితో, రామాన్నీ, మాలతినీ చూస్తూ, వాళ్ళల్లో అదోరకమైన భావాన్ని పెంపొందింప జేసిన ప్పుడు — ఈనాడు రామం - పురుషుడు కొబట్టి ఇంకో రిని చేసుకో గల్గినా — అతడు కఠిన హృదయుడు కాగల్గినా- స్త్రీ హృదయం! మాలతి సున్నితమైన మనసు తన రామం బావమీది ప్రేమను త్యజించ గల్గా లంటే ఎంతబాధకు గురి అవుతుంది? కానిమాలతి సుచరిత. ఆమెలో తప్పు పట్టాల్సిన అగత్య మేమీ కన్పించదు. ఆమె తన పదమూడవఏటే తన సర్వస్వాన్ని, అంతా అను కుంటున్న మాటల్నిబట్టి, అతడే తన ప్రాణాధికుడంటూ రామాని కర్పించేసింది. రామం శాసనం ఆమెమీద చండ శాసనంగా పనిచేసేది. రామం ఆజ్ఞల్ని శిరసావహించటం ఆమె పరమావధి. ఇవే ఆమె రామాన్ని గూర్చి కన్న కలలు!! తను దాసిగా, రామం తన ప్రభువుగా అంతే ఆమె కోరింది. శారీరకంగా గానీ, మానసికంగా గానీ రామాన్ని ఆమె ప్రతిగా ఏమీకోరలేదు. అందుకే నిశ్చింత ఆమెకు!! —

బుధవారం పొద్దున్నే మద్రాసులో సుప్రసిద్ధ న్యాయ వాది రామ్ ప్రసాద్‌గారింట్లో సంతోషకోలాహలం ప్రారంభ మైంది. పెళ్ళి కేవలం మంత్రాలు చదవటం తప్పితే, మిగిలినదంతా ఆధునికంగానే జరిగి పోయింది. రామం అదే కోరాడు. తాను ఆధునికులందరికీ ఏమాత్రం తీసిపో కూడదని అతని అభిప్రాయం. నిజానికి అతను అలాగే ఉంటాడు. రామాన్ని చూసి ఒక్క ఆస్తిలేదన్న విషయం తప్ప ఇంకెవ్వరూ ఏవిధంగానూ బాధపడలేదు. రామం సరస సంభాషణ వాళ్ళను ఆలోచాన్నీకూడా మఱపింప జేసింది. అంతా బుద్ధిమంతుడు! మర్యాదస్తుడు అన్నారు.

అమాయకుడు మామయ్య అక్కసునంతా మర్చిపోయి తన స్వంతకొడుకులా రామాన్ని ఆదరించాడు. రామం కూడా ఆయనను ఎంతో గౌరవంగా చూసాడు. మాలతి చలోక్తిగా సహజంగా నవ్వుతూ అన్నది. "బావా! శశితో నువ్వే పరిచయం కల్గించాలి నాకు!"

"అహ అట్లాగా! నేనేం ఆడంగి ననుకున్నావా మాలతీ సిగ్గుపడటానికి?"

"భేష్ భేష్. అట్లాఉండాలి. — ఒకపరీక్షలో నెగ్గావు. రెండోది ఏమిటంటే"— మాలతి గట్టిగా నవ్వింది.

"ఏమిటమ్మా మరీను! నన్ను గోలచేసి చంపే స్తున్నావు మాలతీ!" అన్నాడు రామం నవ్వుతూ.

మామయ్య ఉలిక్కి పడ్డాడు .... "ఏమిటమ్మా! మరీను!" - "అమ్మా" అని చెల్లెలిలా సంబోధిస్తున్నాడు!! మాలతివైపు చూచాడు. ఒక్క నిమిషం మాత్రమే ఆమెలో ఒక చిత్రమైన మార్పు వచ్చింది. - తర్వాత మళ్ళీ గట్టిగా నవ్వుతూ "అయితే బావా! పరీక్షలో నెగ్గవు. మార్కులు రావు."

"పోనీలే. అయినా ఇంత పెంకెదానివేమిటి మాలతీ?"

మాలతి తలవూపుతూ నవ్వింది. రామం క్షణంసేపు బాధకు లోనయ్యాడు. మాట్లాడకుండా మెల్లగా లేచివెళ్ళి పోయాడు.

మానవుడికి గల నాల్గుదశల్లోను, ఒక్కొక్క విధంగా మారిపోయి, అతడు తన నిజసర్వాపాన్ని తెల్సుకోలేక పోతాడు. బాల్యం - ఏమీతెలియనిది. ఎంతో ఆనందంగానూ అంతకంటె చిన్నతనపు దుఃఖం - నాన్నకోప్పడితే, "ఛ! నేనూ మానాన్నంత వాణ్ణవుతే నన్ను నాన్న ఎమీఅనడు. పైగా నేనే అందర్నీ కోప్పడవచ్చు. ఎప్పుడు నాన్నంత వాణ్ణవుతానో?" అనుకుంటూనే కౌమారంలో అడుగు పెడ్తాడు, కష్టసుఖాలు కొన్ని తెలుస్తయ్. సున్నితమైన హృదయమవుతుందా దశలో. అందటి కష్టాలనూ తాను పాలు పంచుకోవాలని ఆత్రత పడ్తాడు. ఆత్రంతోనే యౌవనంలోకొస్తాడు. విలాసజీవితం ప్రారంభమవుతుంది. తన విలాసాలకే ఉన్న ఐశ్వర్యం చాలకపోతే తోటివారి కడగండ్లనెలా కంటాడు? తర్వాత పెళ్ళి-పిల్లలు - ఈగురు తర బాధ్యతను వార్ధక్యం వఱకూ చచ్చేంతవఱకూ మాన వుణ్ణి వెంటాడి, వెంటాడి అతని సహనాన్ని, సద్గుణాల్ని పీల్చి పిప్పిచేసి చివరకు మృత్యువు కొప్పజెప్తుంది. ఇలాటి బంధనాలను - అంటే విరక్తిపదంలా తోస్తుంది — కాని వీటిని సాధ్యమైనంత వఱకూ తెంచుకోవాలంటే మానవుడి హృదయం విశాలమైనదై ఉండాలి. బాల్యంనుంచీ సంకు

చిత్తాభిప్రాయాలకు తావులభించిన మానవుడు స్థిరచిత్తుడు కాలేడు - ఇటువంటి వారిలో రామం ఒకడు! !

## ౧౦

రామం సంసారిక జీవితం ప్రారంభమై యిప్పటికి నాలుగేళ్ళయింది. ఈ లోగా అతని కున్న ఓర్పంతా నశించింది. కాని అంతకు ముందు కమల బోధలతో శశి తనను హీనంగా చూసినా సహిస్తూవచ్చాడు. ఇంక సహించ లేననుకున్నాడు,

పొద్దున్నే లేచి కాఫీ తీసుకురమ్మని వంటవాణ్ణి కేకేసాడు. అతనికి బదులు శశి కాఫీ తీసుకొచ్చింది,

రామం తీసుకోలేదు.

"అక్కర్లేదు" అన్నాడు మొహం తిప్పుకుని.

"ఏం? ఎందుకు?" అంది కఠినంగా.

"ఒద్దంటున్నాను. అంతే."

"సరే!" అంటూ శశి అతని కెదురుగా ఉన్న సోఫాలో కొచ్చి కూర్చుని అతని మొహంలోకి చూస్తూ అంది. "మనసులో ఏదో పెట్టుకుని పైకి నన్నెందుకిట్లా వేదిస్తావు రామ్!"

"నేను నిన్నేమీ వేధించటం లేదు, చివరికి కోర్టు కెళ్లే ముందు నా బనియన్ దగ్గర్నుంచీ నేనే పెట్లోంచి తీసుకుని తొడుక్కోవాల్సొస్తున్నాను–" ఒకనాడు రామానికి తన బనియన్ త్వరగా కన్పించలేదు. దానికోసం తానే వెతుక్కోవాల్సి వచ్చింది. ఆనాడు శశి కెందుకో అతని మీద కోపమొచ్చి కిందికెళ్ళిపోయింది. అతను కోర్టు కెళ్ళేంత వరకూ పైకి రాలేదు.- అది హఠాత్తుగా జ్ఞాపకమొచ్చి విచారంగా ఆమెను సాధించాడు రామ్.

శశి నవ్వింది. "ఎప్పుడో ఒక మాటు అట్లా అయిందని ప్రతిరోజూ ఆ దోషం జరుగుతోందని నిందారోపనా చేస్తావా?"

"సరే అది వదిలిపెట్టు, నీకు నామీద నమ్మకం లేదు. అది నిజం.– సరే! నువ్వా కాఫీ పట్టుకుని నన్నెందుకు బాధ పెడ్తావు. నేను తాగను వెళ్ళు" అన్నాడు తీవ్రంగా.

శశి లేచి నుంచుంది. "సరే!" అంటూ కాఫీ కిందకు తీసికెళ్ళిపోయింది.

రామం లోలోపల మండి పడ్డాడు. పెళ్ళి చేసుకున్న ఆ ఒకటీ రెండు సంవత్సరాలు ఇల్లరికపుటల్లుడు రామం శశితో ఏమి సుఖపడ్డాడో? అంతే! తరువాత ఇద్దరికీ ఎడ మొహం, పెడమొహం అయింది. ఇందుకు కారణాలు శశి ఊహించిన వేమిటంటే మాలతి మెడ్రాస్‌లో యమ్ యస్ సి. చదువుతోంది. యమ్, యస్ సి. చదవటానికి డబ్బులేని మాలతి తండ్రిని ఒప్పించి, గొలుసు, ఇంకా ఏవో అమ్మి వాటితో నిరాటంకంగా చదువు సాగించింది. తల్లికీ, తండ్రికీ తన వివాహ విషయమై ఏ దిగులూ అక్కర్లేదనీ, స్వతంత్రంగా చదువుకుని బతగ్గలననీ వారిని నమ్మించింది. మామయ్యకు మాలతి మీద తీరని విశ్వాసం. అందుకే ఆమె అన్న ఆ మాటలకు ఏమీ జవాబివ్వకుండా కూతుర్ని యమ్. యస్ సి. చదువు కోసం మెడ్రాస్‌కి పంపాడు ఒంటరిగా. ఆమె అప్పుడప్పుడు శశినీ రామాన్నీ చూడ పోతూ చాలా చనువుగా- సహజంగా ప్రవర్తించేది. ఇక రెండోది ఏమిటంటే సుశి తన చదువు కోసం మెడ్రాస్ కొచ్చింది. రామం మొదట హాస్టల్లో ఉంచుతానంటే, రామ్ ప్రసాద్ అతన్ని మందలించాడు. "పరాయి ఇల్లనుకున్నావా ఏం?" అంటూ అందువల్ల తప్పని సరిగా ఆమెను వాళ్ళింట్లోనే ఉంచవలసి వచ్చింది. సుశి అయోమయం, శశికి వింతగానూ, అనాగరకంగానూ తోచేది. కాని సుశిలోని సౌమ్యత ఎవరు గుర్తిస్తారు? అప్పుడప్పుడు శశి హేళనగా అనేది. "ఇల్లరికం కాదు గానీ, అప్పుడే సహం కుటుంబం ఈ యిల్లాక్రమించింది. ఇక మీ పినతల్లిగారిని (కమల) కూడా ప్రవేశపెట్టు." అని. రామం ఈ మాటలకు మండిపడేవాడు, కాని రామ్‌ప్రసాద్ గారి మాటలకు ఎదురు చెప్పలేక ఊరుకునేవాడు. ఇహ ఇప్పుడతని ఆత్మాభిమానం దెబ్బ తిన్నది, సుశిని కాలేజీ హాస్టల్లో చేర్పించేశాడు.

ఒకనాడు రామం మామయ్యను అడిగి మాలతిని చేసుకోవటం తానెంత హీనమనుకున్నాడో, ఇల్లరికం అంతకంటే. నీచమని అతడప్పుడు భావించలేదు. ఇప్పుడు తెలిసి వస్తోంది. ఆనాడు కమలకు అందులోని మంచి చెడ్డల్ని గూర్చి చెప్పటానికైనా తాను అవకాశ మివ్వకుండా, తన యిష్టాన్ని కాదనగలదా? ఇంగ్లండు వెళ్ళిన సూర్యప్రకాశ్‌తోసరితూగాలన్న అతని ఆత్రాన్ని ఎవరాపగలరుమరి?—వాళ్ళు ఇంగ్లాండు కెళ్ళిపోయారు. వాళ్ళకేమిలోటులేదు.

# ఇల్లరికం

శాంత పేద కుటుంబంలోనుంచి వచ్చిందన్న నిరసనే లేదు సూర్యప్రకాశ్‌కి! మరి తను బీదవాడన్న నిరసన శశిలో ఉంది!— వాళ్ళిద్దరికీ మధ్య తారతమ్య మేమిటి? అతడు పురుషుడు.— కాబట్టి విశాల హృదయుడా?— శశి కూడా చదువుకున్నదేగా! పెద్ద వాళ్ళంటూ, వాళ్ళ అభిప్రాయాలు తెలుసుకోకుండా, తాను స్వేచ్ఛా విహారుడంటూ చేసిన ఈ పని అతని జీవితంలో ఒక మధుర ఘట్టాన్ని రసహీనంగా చేసేసింది.

ఒకనాడు రామం, శశి సినిమాకెళ్ళి వస్తున్నారు. గుంటూరులో రామం వాళ్ళింటి కెదురుగుండా ఉన్నవాళ్ళ అమ్మాయి మెడ్రాస్‌లో చదువుకోటానికి వచ్చిందిట. సినిమాహాల్లో రామానికి కన్పించింది. ఆమె అమాయకంగా రామాన్ని చిన్ననాటి స్నేహంతో పల్కరించింది. రామం కూడా చాల అభిమానంతో మాట్లాడి శశిని ఆమెకు పరిచయం చేశాడు. శశి అప్పుడు మాత్రం ఆమెతో బాగానే మాట్లాడి ఇంటికి రాగానే రామాన్ని అనాల్సిన నాలుగు అనేసింది. దాంతో రామానికీ రేగింది. అతను ఒకరి చేత మాట పడడు, ఇంతవరకూ తను శశిని నిర్మల భావంతో చూస్తున్నా, దాన్ని ఆమె గ్రహించకపోవటం ఇల్లరికపు మహాత్మ్య మనుకున్నాడు. శశి తల్లి తండ్రులకు వినిపించకుండా, రామం అత్తామామలకు వినిపించకుండా, ఇద్దరూ ఇష్టమొచ్చినంతసేపు కీచులాడుకున్నారు.

"నిన్ను చేసుకోవటం నా బుద్ధి తక్కువ" అంది చివరికి శశి. రామం ఉగ్రుడైపోయాడు. కాని తమాయించుకుని అన్నాడు. "అంతే, అయినా మొదట నిన్ను చూసినప్పుడు నీ హృదయమింత సంకుచితమైనదనుకోలేదు. వివేకానందుడు నిజమే చెప్పాడు పట్నవాసం, మానవుల హృదయాన్ని సంకుచిత పరుస్తుందని."—

"సరే ఉపమానాలు! శబ్దాలంకారాలూ తీసుకు రమ్మనలేదు నేను."

"నువ్వు చెప్పినట్లే చేయాలా? వాక్స్వాతంత్ర్యాన్ని కూడా అణిచిపెట్టి ఉంచగలదా ఏం ఇల్లరికం?" అన్నాడు వ్యంగ్యంగా.

శశి ఇంకా మండిపడ్డది.

"నేను నిన్ను అణచిపెట్టానా?"

"ఊహుఁ.... నీ యిష్టం. నీ మీద నాకు తీరని విశ్వాసం అంటున్నావు కదూ?" అన్నాడు కోపంతో కూడిన

"రామ్, డబ్బు చూసి ఇల్లరికానికొచ్చావు కదూ?"

"నువ్వే నిర్ణయించేసావుగా?'' అన్నాడు రామం, కోపాన్ని నిగ్రహించుకొంటూ.

"లేదు. నేను నిర్ణయించలేదు."

"లేకపోతే నన్నిట్లా అవమానపరచే దానివి కాదు శశీ!" అంటూ విసురుగా ఒకదిండూ, పరుపూ తీసుకుని అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు రామ్.

వీళ్ళిద్దరి ప్రవర్తనా చూసి ముసలి దంపతుల గుండెల్లో రాయి పడింది. ఇంతవరకూ ఇంకోరి చేత వేలెత్తి చూపించుకోకుండా మర్యాదగా బ్రతుకుతున్న వాళ్ళు, వీళ్ళిద్దరి మీదుగా ఎక్కడ బయట పడిపోగలమో అని భయపడసాగారు. రామ్‌ప్రసాద్ రామాన్ని పిల్చి అన్నాడు. "నాయనా! రామ్! శశి ఏదో చిన్న పిల్ల. దానికి మాట దుడుకుతనం నాయనా! ఇంతవరకూ ఏదో మర్యాదగా బ్రతుకుతున్నాం. ఇక ఇప్పుడు-ఏకారణంచేతనైతేనేం?.... లోకులుకాకులన్నారు.... కొంచెం జాగ్రత్తగా ఉండండి తండ్రీ!''

రామం ఆయన ఎదురుగుండా ఏమీ అనకుండా వెళ్ళిపోయాడు.

శశిని పిల్చి తల్లి బాగా చీవాట్లు పెట్టింది.

"నేను ఆయనతో కాపరం చేయలేనమ్మా!" అంది శశి తీక్షణంగా.

తల్లి కంగారు పడ్డది.

"ఏం? ఏం చేశాడు, అతన్ని గూర్చి నువ్వేమీ తెలుసుకోలేకపోయావే శశీ! కోర్టులో అతను మాట్లాడుతూంటే చూడాలిట! నాన్న చెప్పారు" అంటూ కూతురు కతని మీద అభిమానం కల్గించటానికి ప్రయత్నించింది.

ఏమి చేశాడో శశికీ తెలియదు. తల్లి మాటలు వినిపించకోకుండా ఆవేశంగా అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

రామ్‌ప్రసాద్‌గారి భార్య రామాన్ని పిల్చి అనునయ వాక్యాలు చెప్పి పంపింది. ఇందుకు కూడా రామం ఏమీ మాట్లాడలేదు. అతనికి జీవితం మీద విరక్తి పుట్టటం మొదలైంది. ఆనాడు సినిమా హాల్లో కన్పించిన అతని చిన్ననాటి స్నేహితురాలు నళిని వచ్చింది. ఎంత నిర్మలంగా ఉన్నదో? శశిని కూడా భగవంతుడెందుకట్లా పుట్టించలేదు? కేవలం తనను పరీక్షించటానికేనా?

# బాలానందం

## అప్పయ పంతులు

"రాజేశ్వర్"

కస్తూ రప్పయ పంతులు
విస్తారము డొలుచేసి వీరుల పిలిచెన్
పుస్తెలు తెగనమ్మించిన చస్తాడని తెలియక
కతారున చచ్చెన్.

ఇది విజయనగర సామ్రాజ్యమునకు చెందిన కథ. విజయనగర సామ్రాజ్యము మిక్కిలి పేరు పొందినది. ఈ కథ జరిగి సుమారు నూరు సంవత్సరములు పైబడి యుంటుంది.

ఆ రోజులలో యెవరు యెంత భూమిని దున్ను కొనగల శక్తి యుంటే అంత భూమిని దున్నుకొనేవారు. దున్నే వానిదే భూమి. భూమిని క్రమేపీ వరుసగా కొన్ని సంవత్సరములు దున్నుటవలన ఆ భూములు వారి స్వంతముగనే భావించేవారు. అయితే రాజు మట్టుకి దున్నే వాని దగ్గరనుండి కొంత పంటను పన్నుగా తీసుకొనే వాడు. ఆ పన్ను తీసుకొనుటకు నిర్ణయ మన్నది లేదు. రాజుగారి ఇష్టప్రకారము వసూలు చేయబడుతూ యుండేది. ఒక్కొక్కప్పుడు అందరికీ ఒకే మాదిరిగ పన్ను వసూలుచేయ బడుతూ యుండేది.

కస్తూరి అప్పయ పంతులు ఆనే నియోగి బ్రాహ్మణుడు విజయనగరరాజ్య కొలువులో ప్రధానోద్యోగులలో ఒకడు. ఇతడు తన తెలివి తేటలను చూపించి రాజ్యాన్ని సక్రమంగా నడిపించే ప్రధానాధి కారములన్నీ ఇతని చేతిలో యుండేవి. ఇతడు పన్నులు వసూలు చేయుటలో కొన్ని మార్పులు చేసాడు.

ఎక్కువ భూమిని దున్నేవాడు, తక్కువ భూమిని దున్నేవాడు, ఎక్కువ పంట పండించిన వాడు, తక్కువ పంటను పండించేవాడు అందరూ ఒకే మాదిరిగ పన్నులు చెల్లిస్తూ యుండుట వలన, ఖజానాకి కొంత సొమ్ము తరుగొచ్చింది. అంతే కాక తక్కువ భూమిని దున్నించేవాడూ తక్కువ పంట పండించేవాడూ పెద్ద రయితులాగునే పన్ను చెల్లించ వలసి యుండేది. దీని వలన బీద ప్రజలు చాలా అవస్థపడుతూ యుండేవారు. ధనికులు మరి కొంచెం ధనికులగుతూ యుండేవారు. అయితే రాజులు ఒకొక్కప్పుడు క్లిష్ట పరిస్థితులు యేర్పడుతే పన్నులు రద్దుచేసేవారు. అయినా ఇబ్బంది పడుతూ యుండవలసి యుండేది.

బుఱ్ఱలు మార్చడంలోనూ తెలివి చూపించడంలోనూ ఉద్యోగాన్ని చక్కగా నిర్వర్తించడంలోనూ నియోగి బ్రాహ్మణులు శిద్ధహస్తులు. అప్పయ్య పంతులు, పన్నులు విధానం ఏమీ బాగులేదని రాజ్యమంతటా పర్యటించి భూమిని కొలిపించాడు. ఎవరెవరు యెంత భూమి దున్నుచున్నది, అందు యెంత పంట పండు చున్నది, మొదలగు వివరములన్నీ సేకరించాడు. భూమిని బట్టి, పంటను బట్టి,

పన్నులు ఏర్పాటు చేసాడు. ఇతని యొక్క రెవెన్యూ పద్ధతికి రాజు సమ్మతించాడు. అప్పయ్య పంతులు రెవెన్యూ పద్ధతి వచ్చిన తరువాత పూర్వములాగున రాజుల చిత్తము ప్రకారము కాక ఇప్పుడు విధిగా చెల్లించవలసినదే.

అయితే పంటలు లేక, కరువులు వచ్చినపుడు కొంత తగ్గించ బడుతూ యుండేది. ఈ పద్ధతి వచ్చిన తరువాత ధనికులు పూర్వం లాగున కాక పంటను బట్టి పన్నులు చెల్లించుటవలన యెక్కువగనే చెల్లించవలసి యుండేది. అందు వలన ధనికులందరికి అప్పయ పంతులు మీద ఈర్ష్య జనించింది. ఎందు వలనంటే అతడు పుస్తయినా అమ్మించి పన్ను వసూలు చేసేవాడు. ఇంత అధికారం పొగరుగల అప్పయ పంతుల్ని అనుకోకుండానే అకస్మాత్తుగా కత్తితో పొడిచి చంపాసారు.

అతని మీద ఉర్ష్యతో పై పద్యం కట్టి చదువుతూ యుండేవారు. కాని తరువాత అప్పయ పంతుల్ని అనవసరముగా చంపినందుకు చాలా విచారించారు. రెవెన్యూ పద్ధతి అప్పయ పంతులు ప్రవేశ పెట్టి యుండకపోతే రాజులు చిత్తం వచ్చినట్లు పన్నులు వసూలు చేస్తూ యుండేవారు. చరిత్ర తిరగ వేస్తే మనకి అన్నీ విషాదాలే గోచరిస్తాయి.



# ఉల్లిపాయ - వెల్లుల్లిపాయ.

పులిపాక సూరి.

నేనే ఉల్లిపాయను. 'నీరుల్లిపాయను' అని పిలుస్తూ వుంటారు. నన్ను ప్రతిరోజూ సేవిస్తే వైద్యుడితో పని యుండదు. నా వుపయోగం మీకందరకూ బాగా తెలుసునా! నావంశాచార ప్రకారం నేనుకూడా చెపుతాను. బయలు దేరిందిరా పెద్ద ప్రగల్భాలకని నన్ను తిట్టడం భావ్యంకాదు.

క॥ ఉల్లిని దూషించినయా! గుల్లామును బట్టి ముక్కు-
గోయగ వలదా.
తల్లుండవలయు లేదా। ఉల్లిండగవలయు భోజనోత్సవ
వేళన్॥

అని పెద్దవారు నన్ను మెచ్చుకుంటూ వుంటారు. వుల్లి తల్లితో సమానమని. సైన్సుమేధావులు, నాలో గంధకము, ఎ, బి, సి విటమినులు, పొటాష్, సున్నము, ఇనుము, రాగి మొదలగు ఖనిజాలేగాక ఎక్కువ పాళ్ళు అల్యూమినం లోహము శరీరానికి వలసినంత వుందని నన్ను పదేపదే పొగడటం, ఉపయోగించు కోవటం ఎక్కువగా చేస్తూ వుంటారు.

నా ఆకారాన్ని దాల్చినంత మాత్రాన "వెల్లుల్లిపాయ" కూడా నాఅంత ఉపయోగి అవుతుందా? .... 'కనకపు సింహాసనమున శునకము కూర్చుండబెట్టి' అన్న పద్యం మీరు గుర్తుకు తెచ్చుకోండి. వెల్లుల్లిపాయ సంగతి మీకే బాగా తెలుస్తుంది.

"నీరుల్లిపాయ" అనే నాపేరులోని మొదటి రెండు అక్షరాలు మానవునకెంత అవుసరమో బాగా తెలుసు గదా... సరే ఇక ఉల్లిపాయ గురించి పద్యమే ఉందాయె. వూసరవిల్లి వేషాలు వేసే ఈ వెల్లుల్లిపాయ ఎంత తెల్లగా వుండి షోకు షోకులు అలంకారాలు కూర్చుకొన్నా ఏం లాభం చెప్పండి! దాని మొదటి రెండు అక్షరాలు 'వెల్లు' అని ఉండటం మూలానే చెపుతోంది, అది మనుష్యుల వెళ్ళగొట్టేస్తుందని. నాకు చుప్పనాతితనం కాదు సుమా... నేచెప్పేది. ఆమాటంటే అబ్బో- 'దీని గొప్ప కాలిందే మిటి' అంటారేమో. అందుక్కాదు. నేననేది నిజం ఎవరినైనా అడగండి. వెల్లుల్లిపాయ ముఖ్యంగా అంతా

# ఉల్లిపాయ - వెల్లుల్లిపాయ

వాడతగ్గ వస్తువేమో! ముఖ్యంగా మగవాళ్ళు వాడ గలరేమో?

దగ్గు, రొంప, రొమ్ముపడిశెము, మలబద్దాలు నేను పోగొట్టగలను. మూత్రపిండాలకు చురుకు కల్గిస్తాను. రక్తపిత్తము తగ్గును. చలవచేయును. నేను కొంచెం తెల్లగాయుంటాను. వెల్లుల్లిపాయను మాత్రం పోలను. నా తెలుపు నీరుల్లుదనంతో బలముచేకూర్చాలని. నేను కొంచెం తెల్లగా మారితే, పాపం వెల్లుల్లి పూర్తిగా తెల్ల బడి బలాన్ని పోగొట్టేదయింది. క్షయ హృద్రోగములు నశింపజేసి, చెమటను తగ్గిస్తాను. సుఖనిద్రపోవాలంటే రాత్రిపూట నన్ను సేవించండి. తెల్లనీరుల్లి ఎన నన్ను నేతిలో వేయించి పంచదార పాకంతో కలిపి తింటేచాలు. శగరోగంపోయి బలము కల్గుతుంది. ఉప్పుతో నన్ను నూరి దంతాలకు రుద్దితే చాలు— చీము, రక్తము కారటము లాంటి దంతపు జబ్బులు పోతాయి.

నా రసము నీరసమువారికి మంచిది. బెల్లంతో కలిపి తినిపిస్తేచాలు పిల్లలు బాగా ఎదుగుతారు. రసము పిండితే ముక్కునుండి కారే రక్తం ఆగుతుంది. ఉడికించి కడితే నెత్తురు గడ్డలు నశిస్తాయి. చక్రాలుగా తరిగి కల కండ పొడిచల్లి రాత్రి మంచులో వుంచి దానిలోనుండి వూరిన నీరు ప్రొద్దున త్రాగితే కోరింతదగ్గు, మూత్రము లోని సుద్ధకట్టు, కడుపుశగ నయమవుతుంది.

ఈ ప్రకారంగా వుల్లి తల్లితో సమానమంటూ అందరూ నన్ను పొగుడుతూవుంటే 'శ్రేయాంశి బహు విఘ్నాని' అన్నట్లు నన్ను గురించి అశుభాలు పలుకు తుంది మా వెల్లుల్లిపాయి. 'గురివింజ గింజ తన నలుపు ఎరగదుగానీ పగడానికి బెజ్జం వుందని ఆక్షేపించునట' అన్నది లోకోక్తేగా. ఈ వెల్లుల్లిపాయ నాకన్నా తెల్లగా వుండి బలంపోగొట్టే శక్తి, నాకన్న ఎక్కువ వాసన కల్గియుండి నీచమనే పదం సంపాదించింది. దానిమూలాన నన్ను సరిగా అర్థం చేసుకోక సతమత మవుతున్నారు సద్భావులుకూడా. ఏంచేస్తాం? విధి.

బ్రహ్మ నన్ను ముందు సృష్టిస్తే విశ్వామిత్ర రాజర్షిగారు తనకు గల్గిన సృష్టికర్త ప్రతిభ తెలియజేయటానికి దాన్ని సృష్టించారు. అంతేకానీ నాఅంత వుపయోగం దాని కెందుకుంటుందీ— నిజానికి.

ఒక రోజున కూరగాయలన్నీ సభచేశాయి. ఆ సభలో చేసిన తీర్మానం ప్రకారం ప్రతియేటా తలావకటీ రాజుగా వుండేఏర్పాటు చేశాయి. నన్నుమాత్రం రాజుగా వుంచని కారణంకి సమాధానం చెప్పాయికదా, 'నీవు వాసన ఎక్కువగనక నిన్నుచూస్తే పరమ నీచం, అసహ్యం పుడుతుంది. కాన నీవు రాచరికానికి తగవు' అని చెప్పాయి. సమయానికి కయ్యాలకు సాక్షాత్కరించే దేముడు నారదుడు ప్రత్యక్షమయ్యాడు. ఆరోజున ఆయన చేసిన పనికి మేమంతా ఆశ్చర్యపడ్డాము. మాఅందరినీ ఒక గదిలోకి పంపాడు. తలుపులు గట్టిగా బిగించాడు. గాలి ఏమాత్రం రావటంలేదు. ఎంత గోలపెట్టినా తలుపులు తీయలేదు. నెల గడచినతరువాత వచ్చి తీశాడు. ఇంకే ముంది.... వంకాయలు, దోసకాయలు, బీరకాయలు అన్నీ చావు ప్రాణాలతో ఉన్నవి. ఇంకా కుళ్ళి పుచ్చి పోయి వున్నవి. నేను మాత్రం బాగా వుండి మొక్కలు వేశాను. అప్పుడు నన్ను చూపించి "చూశారా! ప్రళయ మంతపనైనాసరే వుల్లిమాత్రం తొణకలేదు. కాబట్టి అటువంటిదానికి రాజరికంవిషయంలో ప్రధానస్థానమివ్వక మీరు చేసిన అసభ్యపు, అశాస్త్రీయ తీర్మానం చెల్లదు" అని నారదుడు నాకుకూడా ప్రధానస్థానం ఇప్పించాడు. నారదుడు చేసిన ఈ మహోపకారాన్ని మరువలేక సంతోష బాష్పాలు కారుస్తూ నేనుంటే, 'ఇట్టి అమూల్య వస్తువుని తిరస్కరిస్తున్నాము. దీనికి మంచి స్థానం ఇవ్వలేకపోతున్నా'మని నన్ను కోస్తున్నప్పుడల్లా మీరు కళ్ళ నీళ్ళు పెడతారు.

ఇకముందైనా నా ప్రతిభను, ఉపయోగాల్ని తెలుసు కొని చుప్పనాతితనం లేకుండా నా ప్రతిభను చూసి ఈర్ష్యను పొంది ఏడవకుండా నన్ను మీజతను చేర్చు కుంటే మీ మానవలోకాన్కి చల్లదనం పరమేశ్వరుడు చేకూరుస్తాడు.

శలవు

మీ- నీరుల్లిపాయ.



# దురాశ

శ్రీ వేమూరి సన్యాసిరావు.

ఒక గ్రామమున యిద్దరు బాలురు గలరు. వారు ఒక నాడు వూరివెలుపల మైదానములో ఆడుకొనుటకు బోయిరి. వారి చేతి నొక గిల్టు వుంగరము వుండెను. ఆడుకొనుచుండగా ఆ వుంగరము జారి పడిపోయెను. వారు దాని గురించి వెదకుచుండిరి. అట్లు వెదకుచుండగా ఆ దారి నొగ బ్రాహ్మణుడు ప్రక్క గ్రామము కార్యాంతరము మీద పోవుచుండెను. ఆ బ్రాహ్మణుడు ఆ బాలురు వెదకుచుండిన దగ్గరకు వచ్చి దేని గురించి వెదకుచున్నారని ప్రశ్నించెను. అందుకు వారు మా చేతి బంగారపు వుంగరము పడిపోయెను. కొంచెము సాయము చేయుడని బల్కిరి. అందు కాతడు నాకు పని యున్నది. పొరుగూరికి వెళ్ళవలెను. మీ వుంగరము వెదకుటకు కూర్చున్న నాకు పని పాడై పోవును. అని పల్కెను అందుకు వారు అయ్యో మీరు వృధాగా పోవలదు. ఆ వుంగరము మీకు గాని దొరికినచో దానిని మనముగ్గురము ఖరీదు తీసుకుని పంచుకుందుము అనిరి. అందులకా బ్రాహ్మడాశ పడి వుంగరము వెదక నారంభించెను. కొంత సేపటికి ఆ వుంగరమా బ్రాహ్మణునకు దొరకెను. అతడు వారలతో యిట్లనెను. దీని వెల యె"త అని అడిగెను. అందుకు వారు దాని ఖరీదు ముప్పది రూప్యములు మా వంతు మా కిచ్చి మీ వంతు మీరు తీసుకొండని పల్కిరి. అంత నా బ్రాహ్మడు తన దగ్గర నున్న సొమ్ములో చెరి పది రూపాయిలు వారికిచ్చి ఆ వుంగరము పట్టుకుని వేగరముగా యింటికి జని భార్యతో నీకు మంచి బహుమానము తెచ్చితినని చెప్పెను. అందులకామె ఏమి బహుమానము చూపుడనెను. అందుల కాతడు తన గావంచా చెంగున కట్టిన వుంగరమును విప్పి చూపించెను. అంత నామె ఆ వుంగరము చూచి నెత్తి నోరు మోదుకుని ఈ యిత్తడి వుంగరము మీ కెక్కడ దొరికినదని అడిగెను. అందుల కాతడు నిలువు గ్రుడ్లు వేసి చూచుచు కొంతసేపటికి తేరుకుని జరిగిన సంగతి చెప్పెను. చూచితిరా! దురాశ ఎంత పని చేసినదో. మీరు గూడ బ్రాహ్మణునివలె దురాశ పడకండి. క్షమించండి. కథ కంచికి మన మింటికి. ★

# దీప మెందుకు ?

రచన: కొంపల్లి కోటిలింగం.

అమావాశ్య రాత్రినాడు
అంధుడొకడు కర్రబట్టి
చేత దీపమొకటి బూని
తడుముకొనుచు పోవుచుండె.
దారిబోవు వాడొకడు
ఈ వింతచూచి నవ్వుకొనుచు
"తాతా యిది ఒకవింత
నీకుచూస్తే కళ్ళులేవు
కళ్ళున్న వాడివలె
దీపమొకటి పట్టావే
దీప సాయమున నీకు
త్రోవ తెలుస్తుందా మరి"
అన్నాడ తడిలాగ
కానితాత చిన్నబోక
మొగమున చిరునవ్వుదోప
చెప్పాడపు డిట్లు.
"దీపము పట్టింది నేను
నా కొరకై కాదు బాబు
కళ్ళుండీ లేనియట్లు
సంచరించు మీకొరకై.
చీకటిలో మీ లాటివారు
కళ్ళు కానక నాపై
పడకుండ కానుటకై
చేతపట్టితి నీ దీపం"
ఈ జవాబువిని అతండు
తననోటి దురదకెంతో
విచారించి యప్పుడు
సిగ్గుపడి వెడలిపోయె.





శ్రవ్య నాటిక :

# విజయ వాటిక

పాప : ఓ విజయ వాటికా ! ఓ కనక పేటికా !
ఓ శాద్వలాంకూర వరశాటికా !
ఓ హో విజయవాటికా !

విజయ : ఎవరది... నన్ను పలకరించే వారెవరు తల్లీ...?

పా : నేను. నీ పేరింటిదాన్ని– విజయ సంవత్సరాన్ని– నన్నింకా గుర్తుపట్టలేదా...?

వి : ఇప్పుడు పోల్చుకున్నానమ్మా ! మా తెలుగునాటికి వెలుగు తెచ్చినదానవు.

పా : ఈ వెలుగులో , నిన్నొక్కసారి ఆమూలనుంచి యీ మూలదాకా చూడాలని వచ్చాను.

వి : రా తల్లీ. ఈ దుర్గమ్మ కొండ మెట్లన్నీ ఒక్కొక్కటే యెక్కి నాతోరా– చూపిస్తాను. మల్లేశ్వరస్వామి జటాజూటంలో వికసించిన సుధాకరశరత్తులు దుర్గాదేవి మందహాసతటిత్తులు. ఈ యింద్రకీలాద్రే హిమాచలా గ్రంగా భావించి, అవతరించింది ఆదిశక్తి. ఆవిజయాంబిక అనుగ్రహంతో ఈ విజయవాటిక జన్మించింది. ఆ బీజశక్తి కటాక్షాల్లో యీ బీజవాటి జీవిస్తోంది. దశదిశలా అహర్నిశలూ జగజ్జనని పూజార్చనలు ప్రతిధ్వనిస్తాయి.

పా : అవన్నీ వింటూంటే నా వొళ్ళు పులకరిస్తోంది... విజయవాటికా ! ఈ తల్లినిగురించి నేను తెలుసుకోవాలమ్మా.

వి : అయితే, పదిమందీ చెప్పుకునే మాటలు విందాం– ఆ మండపం దగ్గరికి రా...

పా : అమ్మవారిని చూడ్డానికి యెంతమంది మూగారో...?

వి : చల్లనితల్లి– అందరినీ కన్నబిడ్డల్లాగ చేరదీస్తుంది... విను– అమ్మవారినిగురించీ, యీ గుడిగురించీ వారేదో చెపుతున్నారు...

పా : యెంత గొప్ప తల్లి. ఆమెలో అమ్మ కనిపిస్తోంది.

వి : లోకమాత... యెందరిపూజలు గ్రహించిందో ! యెన్ని వరాలు అనుగ్రహించిందో...? ఈ జగజ్జనని కటాక్షమే నా వైభవాని కాధారం. ఆమెకు తామసం లేదు– శాంతమూర్తి.

పా : అసలీ కొండమీద యెలా వెలిసిందమ్మా...?

వి : ఈ పర్వతరాజు ఇంద్రకీలుడు. ఏ ఘోరపాతకానికి దుష్ఫలితంగానో అతని హృదయాంతరంలో మహాగ్ని జ్వాల ప్రజ్వలించింది. ఇంద్రాయుధమైన వజ్రం దావానలకీలగా ఇంద్రకీలాద్రి నావరించింది. ఆ దహన బాధ ఉపశమించడానికి గిరిరాజు జగన్మాతను ప్రార్థించాడు.

ఇంద్రకీలాద్రి : ప్రణతు లంబాత్రయైక రూపిణికి నీకు
గిరిసుతా దేవిదుర్గ సోదరుడ నేను–
ఇంద్రకోపాగ్నికీల భరింపలేను–
శరణమంటి, నీ పావనచరణమంటి.

అది యేనాటిది పాప దుష్ఫలితమో– అగ్నిచ్ఛటాకీలయై
హృదయమ్ముఁ దహింపుచుండె– శుభదాత్రీ !
శైలపుత్రీ ! దయా
స్పదమౌ తావక దివ్యవీక్షణ సుధాసారమ్ము వర్షించి– నీ
పదముల్ నామకుటమ్ముపై నిలుపగా ప్రార్థింతు–
రక్షింపుమా !

వి : ఆ ప్రార్థనమాలకించింది దుర్గాదేవి ! ఈ గిరిమీద అవతరించింది. ఆ జగన్మాత అవతారంతో ఆర్యధర్మం పునరుద్ధారణమైంది.

పా : మళ్ళీ తలెత్తడమంటే...?

వి : అంతకుముందు ఈ చుట్టుపట్లన్నీ బౌద్ధానికీ జైనానికీ విహారారామాలుగా వుండేవని మనక్కనిపిస్తూనే వుందిగా. ప్రతి బౌద్ధచైత్యం– ప్రతి జైనవసతీ– ఒక విశ్వవిద్యాలయంగా– ఉచితవైద్యశాలగా– ఆరాధన మందిరంగా సుప్రసిద్ధమయింది. నేను బౌద్ధశిల్ప సరస్వతికి నృత్యరంగమయాను. ఈ పర్వతకందరాలు త్రిశరణాలతో ప్రతిధ్వనించాయి.

శ్రీ వింజమూరి శివరామారావు.

గొంతుకలు : బుద్ధం శరణం గచ్ఛామి-- సంఘం శరణం గచ్ఛామి-- ధర్మం శరణం గచ్ఛామి.

వి : ఆ తరువాత జైనులకు నేను నడుంచివసతి నయాను. ఉత్తరదక్షిణాలకి మధ్య కేంద్రమైన గొప్ప జైనమఠం స్థాపించారీ విజయవాటికలో. మహాపండితుడైన కవి భద్రాచార్యుడు జైనులకు నాయకుడై ఆ మతాన్ని విస్తరించాడు.

పా : అయితే, జైనులిప్పు డేమయారమ్మా...?

వి : వీరశైవాగ్ని కాహుతయారు. ఓరుగంటి ప్రభువులు, శైవమత ప్రచారకులు, సేనావాహినితో యిక్కడికి వచ్చి జైనమతాన్ని ధ్వంసం చేశారు. ఆ బీభత్సానికి కృష్ణవేణీ తరంగిణి యెంత దుఃఖించిందో...

కృష్ణ : శివశివా! దారుణమైన ప్రళయం కల్పించావా మహాదేవా? పరమధర్మమైన అహింసకి విరుద్ధంగా నీ భక్తులు విధ్వంసాని కుపక్రమిస్తే సహిస్తావా? ఫాల మందు దావానలమూ కంఠమందు హాలాహలమూ దాచి విశ్వ శ్రేయస్కరంగా శీతల చంద్రాంశువులూ పావనగంగాంబువులూ ప్రసాదించే కరుణా మూర్తివి. ఈ భయంకర మారణహోమాని కంగీకరించావా? సమస్త ప్రాణికోటినీ సమానంగా ఆదరించే భారతజాతి కింతపతనమా? నా వినీల వినిర్మల ప్రవాహం రక్త రంజితమయింది. పరమేశ్వరా! అనుగ్రహించవా? నీ రౌద్రమూర్తి నుపసంహరించు- జగత్పితవై శాంతినీ సౌఖ్యాన్నీ స్థాపించు-- కటాక్షించు.

గొ : ...ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః...

వి : దుర్గాదేవి అనుగ్రహించింది. దుష్టత్వాన్ని సంహరించి శిష్టత్వాన్ని సంస్థాపించింది. ఆర్య ధర్మాన్ని ఉద్ధరించింది విజయాంబిక.

పా : సరేగాని, యీతల్లిని కనకదుర్గ అని పిలుస్తారేం...

వి : బంగారుతల్లి. తా నడుగుపెట్టిన నేలంతా పసిడి చాలుగా మార్చింది. పిలిస్తే పలుకుతుంది. మనల్ని పలకరిస్తుంది. విను— గొర్రెలమందని మేపుకొనే ఆ గొల్లవాడు పిలిస్తే యెలా పలుకుతోందో...?

గొల్ల : ఓయమ్మో- దురగమ్మో... (ఓ) ... నీ కొండ కొచ్చినా- సూత్తుండావా? (ఆ) ... నానో కునుకు తీత్తాగానీ- ఓ తల్లోయ్ (ఓ) గొర్రెలు సెదిరిపోకుండా కనిపెట్టుసుమా... (ఆ) ... ఏటీ- ఈరాలు పచ్చగా మెరుత్తుండాయ్? సిత్తరం... ఓదురగమ్మో ... (ఓ) ఇయన్నీ బంరగామే నేంటి? అచ్చంగా బంగార మేనా...? (ఆ) ఒయమ్మో- నువ్వ బంగారుతల్లివి. నీ సొమ్ము నేను తాకనుగాని- నీకు పాలూ, పళ్ళూ యిత్తాలే. నా గొర్రెల్ని సూత్తుండమ్మో... (ఓ)... ఇయన్నీ పైడిరాలే... సిత్తరం ఇంక నాన్నిద్దరొత్తా- రచ్చించు తల్లీ (ఆ) యేటీ? అప్పుడే పొద్దుకుంకుతూం డాది. సల్లనితల్లి- గొర్రెల్నొ కాడికి సేర్చింది. ఇంటి కెల్తా.. మల్లీ పొద్దున్నే వొత్తానమ్మో దురగమ్మో..(ఓ)

వి : విన్నావా? బంగారుతల్లి-- ఓయని పలుకుతోంది.

పా : మరి బంగారు పేరెలా వచ్చిందమ్మా...?

వి : ఒకానొకప్పుడు నా శిరస్సు మీద కనకవర్షం కురిపించింది. అప్పుడీ విజయవాటికను- ధర్మాత్ముడైన మాధవవర్మ పరిపాలించేవాడు.

మంత్రి : శ్రీశ్రీశ్రీ పల్లవాన్వయరాజన్య- విజయవాటికా పురాధీశ్వర- ఆంధ్రజాతీయ ధర్మరక్షణశీల- మాధవవర్మ భూపాలా-- దిగ్విజయోస్తు.

రాజు : మహామంత్రికి అభివందనాలు.

మం : ప్రజానురంజకమైన మీ పరిపాలన చిరస్థాయిగా వర్ధిల్లాలి. మహారాజా! మీ ధర్మశీలానికి దేశమంతా గర్విస్తోంది.

రా : సంతోషం. మీ అందరి సహకారమే ఈ ప్రాభవానికి దోహదమిచ్చింది. మహామంత్రీ! దేశంలో యిప్పు డరిష్టాలేమీ లేవని భావిస్తున్నాం.

మం : ఏమీ లేవు మహారాజా! పాడిపంటలు నానాటికి పెరుగుతున్నాయి. తరుగు లేకుండా వర్తక వ్యాపారాలు సాగుతున్నాయి. ఎవరికీ యేలోటూ లేదు.

రా : అంతకన్నా మేం కోరేదేమీ లేదు. ప్రజలు ప్రశాంతిగా- బ్రతికి సైన్యాలు క్రమశిక్షణ పొంది-

భాండాగారాలు ధనసమృద్ధమైతే, దేశం నిరపాయంగా పురోగమిస్తుంది. మన ధనకోశాలు పరీక్షించారా మహామంత్రీ...?

మం: చిత్తం మహారాజా! మన యావద్ధనం ప్రజోపయుక్త కార్యాలకే వినియోగిస్తున్నాం. ఒక్క కాసైనా అనవసరంగా వ్యయం చేయడంలేదు.

రా: చెయ్యగూడదు. ప్రజల ధనం అదంతా. ప్రజల కోసమే ఉపయోగించాలి.

మం: ఒక్క మనవి మహారాజా! మొన్ననే పారశీకం నుంచి అశ్వవర్తకులు వచ్చారు. గొప్ప గొప్ప గుర్రాలు అమ్మకానికి తెచ్చారు.

రా: మన సైన్యంలో కావలసినంత అశ్వికదళం ఉన్నది కదూ...?

మం: ఉన్నది చాలు మహారాజా. కాని, యువరాజుగారు___

రా: కావాలన్నాడా? అతని కంటబడితే విడిచిపెట్టడు.

మం: ముచ్చటపడి నాలుగు మంచి గుర్రాలు తీసుకున్నారు.

రా: ఏడాదిక్రితం పదివేల మొహరీలు యిచ్చి పది గుర్రాలు కొన్నాడే?

మం: వాటి నడక తగ్గిపోయిందట.

రా: అతనికి తొందరెక్కువ. నెమ్మది పనికిరాదు.

మం: పడుచుదనం కదా ప్రభూ? తొందరగా పరుగెత్తే రోజులు.

రా: దానివల్లకలిగే చిక్కులు తెలుసుకోలేక పోతున్నాడు.

మం: ఏదేనా అనుభవంమీద గాని అర్థంకాదు. యువరాజుగారిప్పుడు నాలుగశ్వాలు తీసుకున్నారు. పది వేల బంగారు నాణేలు వర్తకులకు మనమియ్యాలి. ధనగారం నుంచి తీయించమని సెలవా?

రా: వద్దు. ప్రజలధనం మా స్వార్థాలకి వినియోగించ గూడదు. మా కోసం ప్రత్యేకించిన ధనంలోనుంచి తీయండి. ఆ సొమ్మంతా మళ్ళీ కూడబెట్టేవరకూ యువరాజు పొదుపుగా వాడుకోవడం నేర్చుకోవాలి. అనవసర వ్యయాలు మేం సహించం. యువరాజైనా సరే- మహారాణీయైనా సరే...

మం: ఎవరో యువతి___ న్యాయాన్నర్థిస్తోంది.

రా: వెంటనే విచారించాలి. ఆమెను ప్రవేశపెట్టించండి.

మం: చిత్తం. అదిగో మహారాజా- వచ్చింది.

యువతి: ఏలినవారికి దణ్ణం పెడుతున్నాను.

రా: ఎవరమ్మా నీవు? నీకేం కావాలి...?

యు: నన్ను తమరే కాపాడాలి. నేనో దిక్కుమాలిన దాన్ని మహారాజా!

రా: నీకెవరేమి కష్టం కలిగించారు...?

యు: ఒకరు కలిగించిందికాదు- చేతులారా చేసుకున్నాం మహారాజా! నా భర్త యువరాజుగారి కొలువు చేసుకునేవాడు. ఇప్పుడు బందీయైనాడు.

మం: ఎవరమ్మా అతను? నరసయ్యా?

యు: చిత్తం. ఆయనే. తప్పుచేశాడు... వేరే దారిలేక నా కోసం దొంగతనం చేశాడు. నా కోరిక తీర్చడం కోసం అయ్యో! నేనెంత పాపాత్మురాలిని. నా కోసం బ్రతికే ఆయన కాగతి పట్టించాను.

మం: ఏడవకు తల్లీ. జరిగిందంతా మహారాజుగారికి మనవి చేసుకో.

యు: ఏం చెప్పను మహారాజా! నాది నిరుపేద బ్రతుకు. ఆయన రెక్కలాడకపోతే, మాకు దారిలేదు, కాని నా పాడు కోరిక యిలా చేసింది. "పండగ వస్తోంది- కొత్త చీర కావా"లని పట్టుపట్టాను. ఆయన దగ్గర సొమ్మేమీ లేదని నాకు తెలుసు. ఎక్కడా బయలు పుట్టదనీ తెలుసు. కాని, చీర కావాలన్నాను. నే నేది కోరినా తీరుస్తారాయన. యెంత పాపాత్మురాలిని...?

మం: నీ చీర కోసం అతను దొంగతనం చేశాడా?

యు: అవును స్వామీ. నా కోరిక తీర్చడానికి తాను చెరలో పడ్డాడు. యువరాజుగారి గదిలో రెండు బంగారు నాణేలు దొంగతనం చేశాడు. కాపలావాడు

చూసి పట్టుకున్నాడు. ఆయన చెరలో పడ్డాడు. నా బ్రతుకు బైట పడింది మహారాజా! ఆయన లేకపోతే మాకు బ్రతుకే లేదు. కనికరించండి.

రా: దోషిని శిక్షించడం మా ధర్మం.

యు: నిజమే. ఆయన తప్పనిసరిగా చేసిన తప్పు- లేదన లేదు. ఇంకెప్పుడూ చెయ్యనని పూచీ యిస్తాం. కనికరించండి మహారాజా! పేదరికంవల్లగాని, యిది చెడ్డతనంతో చేసినపనికాదు. అయినా, తప్పే- క్షమించండి.

రా: నేరాన్ని క్షమించడానికి శాసనా లంగీకరించవు.

యు: శాసనాలకన్నా గొప్పవి దయా దాక్షిణ్యాలు. కరుణించడం కూడా ప్రభు ధర్మమే. మీరాయన్ని విడుదల చేయకపోతే యెన్ని బ్రతుకులో పాడైపోతాయి.

రా: ఏమైనా దోషి శిక్షననుభవించి తీరాలి. అది న్యాయ శాసనం.

యు: అంతేనా? ఆయన ఈ యొక్కసారే పొరపాటు చేశాడు. ఇంక చెయ్యడు. తమరాయన్ని విడిచిపెట్టకపోతే మాకు తిండిలేదు.

రా: మారాజ్యంలో యెవరికీ అన్నవస్త్రాలకి లోపంరాదు. నీ భర్త విడుదలై గడించుకునే పర్యంతం అతని జీతం నీ కిస్తాం.

యు: అయ్యో! ఆయన కోసంగాని- తిండికోసంకాదు మేం బ్రతికేది. దయ చూపించండి.

రా: దయకీ న్యాయానికీ చాలాదూరం. మేం ప్రభువులం. దోషుల్ని శిక్షిస్తాం. నేను మానవునిగా దీనార్తుల్ని పోషిస్తాను. నీ భర్త శిక్ష అనుభవించాలి. నీకు జీవనాధారం కల్పిస్తాం. ఇది మా నిర్ణయం.

యు: అయ్యో! మహారాజా...

మం: అమ్మా! యేలినవారి మాటకు తిరుగులేదు. నీవింక వెళ్ళవచ్చు.

రా: శివ శివా రాజ్యపాలన బహు కష్టం. ఈ కిరీట మింత భారమని భావించలేదు. ధరణీశ్వరు లదృష్టవంతులని లోకం భ్రమిస్తుంది కాని, యథార్థం గ్రహించలేదు. సామాన్య ప్రజలు పొందే సౌఖ్యం సామ్రాజ్యాధిపతులకు రాదు. ఏమా సందడి?...... మాకేమీ తోచడంలేదు. గుండె లూరికే కొట్టుకు పోతున్నాయి కళ్ళు తిరుగుతున్నాయి యేమిటది?

మం: యువరాజుగారు క్రొత్తగాకొన్న గుర్రాలు రథానికి పూన్చి, రాజవీధిలో వేగంగా తోలుతున్నారు. రాచబాట జనంతో కిక్కిరిసింది.

రా: ఎవరికేనా ప్రమాదం కలిగిందా?

మం: యువరాజుగారి కే ప్రమాదమూ లేదు. కాని, జన సమూహంలో—

రా: ఎవరో న్యాయాన్నర్థిస్తున్నారు.

మం: అదిగో— యిక్కడికే వస్తూంది— వృద్ధురాలు... మూర్తీభవించిన శోక దేవత. యేదో బరువుతో వచ్చింది. యెవరమ్మా నీవు...?

ముసలి: ఈ విజయవాటికలో నే నొక నిర్భాగ్యురాలిని.

మం: పెద్దగాలికి వూగిపోయే యెండిన చెట్టుకొమ్మలాగ వణకిపోతున్నావు. కూర్చో తల్లీ. ఇక్కడికెందుకు వచ్చావు...?

ము: ఇక్కడ న్యాయం విచారిస్తారని వచ్చాను. మాధవవర్మ మహారాజు ధర్మప్రభువనీ, ఈ సభాంగణం న్యాయ స్థానమనీ భావించి వచ్చాను.

రా: నీకెవరేనా అన్యాయం చేశారా తల్లీ.

ము: తీరని కష్టం కలిగించారు. నా బ్రతుకులో ఆరని చిచ్చు రగిలించారు. మహారాజా! నా కన్నకొడుకుని చంపారు.

రా: శివ శివా! ఎవరమ్మా హంతకులు...?

ము: యువరాజు. అధికార గర్వంతో ప్రజల్ని హింసించే రాక్షసుడు.

మం: తొందరపడకు తల్లీ. ఆ రథం క్రింద పడినవాడు నీ కొడుకా...?

ము: అవును. నా కొక్కడే కొడుకు. నన్ను గద్దెక్కించే వాడా వొక్కడూ లేకుండా పోయాడు. నేడో రేపో కన్నుమూసే నా గుండెలో పెద్ద మంట పెట్టాడు నీ

కొడుకు... మహారాజా! నా కొడుకుని తన పొట్టని పెట్టుకున్నాడు.

మం: అమ్మా, యువరాజు నకారణంగా నిందిస్తున్నావు.

ము: న్యాయాన్నర్థిస్తున్నాను. భాగ్యాలుంటే సుఖంగా జీవించమనండి. అధికారాలుంటే న్యాయంగా పరిపాలించమనండి. నిర్దోషుల్ని బాధించడమేనా రాజధర్మం.

మం: అది పొరపాటువల్ల జరిగింది.

ము: దానివల్ల నాకొంప కూలింది. ఈ శవాన్ని చూడండి— క్షణం క్రిందట చైతన్యంగల ప్రాణి— అయ్యో! నా ప్రాణాలన్నీ వాడిమీద పెట్టుకుని జీవిస్తున్నాను. వాడు ఏతప్పూ చేయలేదే— యెందుకు చావాలి? ఇంక మేమెలా బ్రతకం? నా మాటకేం...? ముసలిదాన్ని— వాడిదగ్గర కిప్పుడే పోతాను. నా కోడలేంకావాలి...? పిల్లలేమైపోతారు...? యువరాజుగారి కొత్తగుర్రాల ముచ్చట కిన్నిజీవాల్బలా...? ప్రజల ప్రాణాలంటే ప్రభువుల కంత నిర్లక్ష్యమా...?

రా: క్షమించు తల్లీ! నీ బాధ మేం గ్రహించాం.

ము: ఊహిస్తున్నావు మహారాజా! కాని, నీభావనకందని బాధ నాది. అబ్బా! నాకొడుకు నాకు లేడు— యింక రాడు...

రా: అనివార్యమైన విధి విధానం— యేం చేయం...?

ము: మీరేమీ చెయ్యరు. నాకు తెలుసు. రాజు కొడుకేంతప్పుచేసినా కాదనేవారుండరు. అక్కడ న్యాయాన్యాయాలు పుట్టవు.

రా: న్యాయాన్యాయాలు ప్రజలందరికీ సమానమే.

ము: అయితే, న్యాయం చేయించు. యువరాజు నరహంతకుడు. పొరపాటువల్ల కాదు— నిర్లక్ష్యంతో చేసిన పని యిది. పదిమందీ కేకలు పెడుతూన్నా వినకుండా అతివేగంగా రథం నడిపించాడు. దారిప్రక్కనున్న నా కొడుకు మీదికి తోలించాడు. దుర్గాంబ దీనికి సాక్ష్యం. నీవు ధర్మరాజువు. యువరాజు నేరం విచారించు.

రా: అధికృతులూ, ప్రాడ్వివాకులూ నేరాన్ని విచారిస్తారు. వారి తీర్మానం మేం శిరసావహిస్తాం.

మం: నీవిక వెళ్ళవచ్చునమ్మా—

ము: ఎక్కడికి వెళ్ళను? కొడుకును పోగొట్టుకున్న ముసలి దాని కేదీ చోటు? నాకింక బ్రతుకులేదు. ఈ కారు చీకట్లో నాకూపిరాడదు. నాకొడుకు దగ్గరికే వెళ్ళి పోతాను. నన్ను పిలుస్తున్నాడు.

మం: పాపం— ఆమెకు మనస్సు చెదిరిపోయింది.

ము: అదుగో— గొప్ప వెలుగులో నిలబడి, నా కన్నతండ్రి నాకోసం యెదురు చూస్తున్నాడు. దారికాని దారిలో ఒక్కడూ అల్లాడిపోతున్నాడు. నాయనా! వస్తున్నా అగు నాయనా... అబ్బా...

మం: అయ్యో ఈమె గుండె పగిలిపోయింది.

రా: మహామంత్రీ! న్యాయాధికారు లేంనిర్ణయించారు?

మం: శాసనానుసారంగా యువరాజు దోషి— హంతకునిగా పరిగణించారు. న్యాయానికి ప్రభువనీ, సామాన్యుడనీ భేదంలేదు.

రా: యథార్థం. శిక్షకూడా నిర్ణయించారా...?

మం: ప్రాణానికి ప్రాణమని శాస్త్రాలు విధించాయట.

రా: వారి న్యాయ బుద్ధిని గౌరవిస్తున్నాం.

మం: మహారాజా! వారి తీర్పును తమరు సవరించవచ్చు—

రా: ధర్మార్థమైన జీవితం మాది. న్యాయాన్నతిక్రమించమా...?

మం: యువరాజును క్షమించడం న్యాయం. మీ యేక పుత్రుడు.

రా: ఆ వృద్ధురాలికీ యేకపుత్రుడే!

మం: శివ శివా! మీకు పుత్రప్రేమ లేదా మహారాజా...?

రా: నా హృదయం పరీక్షించండి— యువరాజు నా ప్రాణానికి ప్రాణం. కాని, న్యాయపరిపాలన మా ప్రధాన కర్తవ్యం. దోషిని శిక్షించాలి.

మం: తమకు క్షమించే అధికారముంది.

రా: అధికారం దేశరక్షణకి— స్వార్థానిక్కాదు.

మం: ఏకపుత్ర వియోగవేదన తమకు దుర్భరం మహారాజా!

రా: భరిస్తాను. ప్రజాకోటిలో యువరాజుని భావించు

కుంటూ జీవిస్తాను. నాకు పుత్రునికన్నా దేశమే యెక్కువ. ప్రాణాలకన్నా ధర్మమెక్కువ. న్యాయం కోసం యే త్యాగమైనా చేస్తాను. న్యాయాధిపతుల నిర్ణయాన్నతిక్రమించను. నా పితృహృదయం శోకించనీ! ప్రభుధర్మం పరిపాలిస్తాను. మహామంత్రీ! ఈ సాయంకాలం హంతకుని శిరస్సు ఖండించమని మా ఆజ్ఞ.

మం : ఈ మహారాజు మూర్తీభవించిన ధర్మదేవత...

యు: అయ్యో అయ్యో! యువరాజు తల నరికేశారా?

మం : అపరాధిని దండించారు. మాధవవర్మ మహారాజు ధర్మమూర్తి. ఆ ప్రభువు న్యాయశీలానికి కృష్ణవేణి గర్విస్తోంది. దుర్గాంబ కటాక్షిస్తోంది.

యు: యెంత గొప్ప మహారాజు. పైనుంచి యేమిటీ జల్లు? యువరాజు నెత్తురా...? కాదు పసుప్పచ్చని పువ్వులు, పైడి రేకులు...

మం : ఓహో... స్వర్ణవర్షం... ధర్మదేవత హర్షం... విజయవాటికలో కనకవర్షం.

వి : అలా బంగారు వాన కురిపించిన గొప్పతల్లి కనకదుర్గ!

పా : అవును. బెజవాడ కనకదుర్గ చాలా గొప్పది. అమ్మా నాకు తెలియకడుగుతాను, నీ పేరు బెజవాడకదూ?

వి దుర్గాదేవి బీజశక్తి గనక నేను బీజవాటికను. విజయాంబి గనక నేను విజయవాటికను. బీజవాటి తెనుగులో బెజవాడయింది. పన్నెండు వందలేళ్ళ క్రితం విష్ణువర్ధన మహారాజు తామ్ర శాసనంలోనూ—ఆ తరువాత గుణగ విజయాదిత్యుడూ, అమ్మరాజూ, యుద్ధమల్లుడూ వ్రాయించిన శాసనాల్లోనూ నన్నెలా పిలిచారో విను.

శాసనం: స్వస్తిశ్రీ నృపాలకు శాత్యంతసత్వల సత్యత్రినేత్ర
విస్తరశ్రీ యుద్ధమల్లు డనవేద్య విఖ్యాత కీర్తి...
పర గంగ బెజవాడ కొమరు స్వామికి భక్తుడై
గుడియు
నిరుపమమతి నృపధామము డెత్తిచ్చె నెగిదీర్చె మఠమ్ము
జననుత చేట్రోలనుండి బెజవాడ జాత్రకు వచ్చి...
రమణతో బెజవాడ కెల్ల బెడగును రక్షయుంగాను.

వి : విన్నావా? ఎవరేమన్నా—ఆ దుర్గామాతదే పేరు. అంతా తల్లి చలవ.

పా : నిజమే. ఆ తల్లి చూపుల్లో ముత్యాలు కురుస్తాయట.

వి : ఉగాదిపాపా! ఇక్కడ నవరత్నాలు దొరుకుతాయమ్మా. ప్రతిశిలా అమూల్యమయిందే. విశ్వవిఖ్యాతమైన వజ్రాల కిది జన్మభూమి.

పా : అవును. కోహినూరు వజ్రం యిక్కడే పుట్టిందని విన్నాను.

వి : ఈ చుట్టు పట్లలోనే దొరికింది. కృష్ణానది రత్నవాహిని. ఆ వొడ్డునే యిసక తిప్పల్లో రంగు రంగుల రాళ్లు మెరిసిపోతున్నాయి. ఆ గొల్లవాడు విస్తుపోయి వాటివంక యెలా చూస్తున్నాడో...?

గొల్ల : యేటీ సిత్తరం—రాలు మెరుత్తుండాయ్. ఎర్రగా—ఆకుపచ్చగా... తెల్లగా... (నవ్వు) వోరమ్మోయ్ తల్లీ... ఈ యేటిగట్టు కొచ్చినావు?

కృష్ణ : కృష్ణానది—విజయవాటికా జీవనాస్వనను.

గొ : ఓయమ్మో... నేను దణ్ణమెడతానుగాని నా జోలికి రామోకు తల్లోయ్

కృ : భయపడకు... నీకేప్రమాదమూ రానీయను.

గొ : బలేమాట సెప్పావులే. అంత వొడిగా సుడుల్తో వొచ్చేత్తుండావే... కొండల కొండల్ని సీల్చుకుంటూ దూకుతుండావు... నానో లెక్కా...?

కృ : నా— జీవనాని కాటంకమైన బలగర్వోన్మత్తుల్ని మాత్రమే ఛేదిస్తాను. అమాయకుల్నీ, సాధువుల్నీ బాధించను.

గొ : బతికించావుతల్లీ. నీకు దణ్ణాలు. ఆ తూరుపు సంద్రం దొరగోరి కాడికేనా... బలేతొందరగా యెల్తుండావు?

కృ : నా స్వామి పాక్షసముద్రుడు ప్రణయగీతాలాలాపిస్తూ నిరీక్షిస్తున్నాడు. ఆ తరంగ మధుర సంగీతాహ్వానం ప్రభుని ఆజ్ఞగా శిరసావహిస్తాను. ప్రణయార్చనకే నా ప్రయాణోత్సాహం.

గొ : అందుకేనేంటి... అలా మెరిసి పోతుండావు? ఆ రంగు రాలేంటమ్మా...?

కృ : నవరత్నాలు. వజ్రవైఢూర్యాలూ— మరకత మాణిక్యాలూ— గోమేధికా పుష్పరాగాలూ— నా జనకుడైన

శైలరాజు సాగరేశ్వరునికి బహూకరిస్తున్నాడు. నేనీ కనకదుర్గాంబ పాద పూజకి భక్తితో సమర్పిస్తున్నాను

గొ : బలే బాగుండాయి. ఆ తెల్లరాయి సూణ్ణీ. శానా పెద్దదే... ఓయమ్మో- ఈ యెల్తురికి నా సూపులు సెదరిపోతుండాయి.

కృ : యావత్ ప్రపంచానికీ ఉజ్జ్వలమైన వజ్రం. దుర్గాదేవి పాద పూజలో, పవిత్రమై, నవ్యకాంతిచ్ఛటాక్రాంత సమస్తాశాంతమై- రాజాధిరాజకోటీరోన్నత కిరీటస్థగిత మాణిక్యకోటిమధ్య విరాజన్నాయకరత్నమై ప్రకాశించే అమూల్య వజ్రం.

గొ : యెంత గొప్పగా వుండాది! నువ్వు శానా గొప్ప దానివి తల్లీ?

కృ : ఇంతవరకూ నా ఘనత లోకం తెలుసుకోలేదు. నా శక్తిని దేశాని కుపయోగించుకునే విధానం ప్రజలు గ్రహించలేదు. అందుకే విచారిస్తూంటాను.

గొ : యెర్రిగొల్లోణ్ణి_ నాకేటి తెలుత్తాది నీ గోల! ఓ యమ్మో... నా గొర్రెల్ని సల్లగానూడు. నీక్కోకం, పసుపూ, పళ్ళూ, పువ్వులూ యిత్తా....యేటీ సిత్రం? ఓయమ్మో... కిట్టమ్మతల్లో ...ఇదంతా యేంటి...?

కృ : ఈ యానకట్లతో నా జీవనశక్తిని ప్రజలుపయోగించు కుంటున్నారు. ఊసర క్షేత్రాలు సస్యశ్యామలంగా వికసించాయి. ఈ వారధి ఉత్తర దక్షిణాల నేకంచేసి, ప్రయాణ సౌకర్యాలు కల్పించింది.

గొ : మాకోసం నువ్వు కట్టడ్డావా తల్లీ?

కృ : మీ యభ్యుదయానికి సహకరిస్తాను. నన్ను ధిక్కరిస్తే సహించను. చూడు- ఆ శాస్త్రజ్ఞులు నా శక్తిని ప్రతిఘటించి నశిస్తున్నారు.

పౌరుడు : శివ శివా! కొందరు దేశసేవాపరాయణులు ఆత్రంతో అప్రమత్తులై ప్రకృతి శక్తిని నిరోధించడానికి ప్రయత్నించారు. ప్రవాహగర్భంలో లీనమైపోయారు. విధివిధానా న్నతిక్రమించలేం. ఒక్క శతాబ్దంనుంచీ దేశానికి జీవనాధారంగా ప్రవహిస్తున్న కృష్ణాతరంగిణి దయాతరంగిణి. తన ప్రవాహాన్ని ప్రజోపయోగాని కంగీకరిస్తుంది. అప్రమత్తతను సహించదు. తల్లీ... కృష్ణవేణీ... కటాక్షించు.

కృ : జీవన సారణీధారలు మీ జీవనాధారలు. సుఖంగా అనుభవించండి. అహంకారాన్ని హరించే శాశక్తి మీ శ్రేయస్సుకి వినియోగిస్తాను. నిర్భయంగా జీవించండి.

గొ : అమ్మయ్యా. బతికించావుతల్లీ- సల్లని తల్లివి. దణ్ణాలు.

గొంతుకలు : వందనం - అభివందనం,

అందుకోనుమీ కృష్ణవేణీ... వందనం
సాగరేశ్వర మనోహారిణి
ఆగమోన్నత పథవిహారిణి
గౌతమీ ప్రియసోదరీ-నవ
జాతి రత్న మయోదరీ... వందనం
పావనీ- సకలాంధ్రజన సం
సేవితోత్తమ వాహినీ-
కనకదుర్గ కటాక్ష కరుణా
ఘన రసాంచిత జీవనీ... ... వందనం.

వి : ఆ నదీమతల్లికి వందనంచేసి- యిలారా- ఒక విచిత్రం చూపిస్తాను.

పా : ఏమిటది? జావ్విచెట్టే— అందులో వింతేముంది?

వి : ఎనిమిదివందల యేళ్ళక్రిందట జరిగినవింత— విను. కల్యాణకటకం రాజధానిగా కుంతలదేశాన్ని ఆరవ విక్ర మాదిత్యుడు పరిపాలించేవాడు. ఆ రాజు ఈ విజయ వాటికా మండలాన్ని జయించి, మహాప్రపంచ దండ నానక అనంతపాలయ ప్రభువును రాజప్రతినిధిగా నియమించినాడు. ఆసమయంలో శ్రీపతి పండితుడు యిక్కడే నివసించేవాడు. యువకుడైన గొప్ప విద్వాంసుడు, మంత్రశాస్త్ర పారంగతుడు. శైవగురువు. అనంతపాలయ ప్రభువుకీ పండితుడు గురువై మంత్రో పదేశం చేశాడు. అందుకు పౌరులు కోపగించారు.

శ్రీపతి : సీతా! చూడు గ్రామస్థులు నామీద ఆగ్రహించి నట్టున్నారు.

సీత : అసూయకి ఫలితం ఆగ్రహమే.

శ్రీ : అమాయకులు. ఈ శ్రీపతి పండితుని సాధించాలని వారి ప్రయత్నం.

సీ : మీ గొప్పతనం వారికి తెలియదు. అరుగో ఇక్కడికే వస్తున్నారు.

కరణం : ఏమయ్యా శ్రీపతీ, క్షేమం గావున్నావా?

శ్రీ : ఈ విజయవాటిక పండిత సంరక్షణి. కూర్చోండి... కరణంగారూ...

క : నేను కూర్చోడానికి రాలేదయ్యా. నీకొక్క మాట చెప్తాను విను. నువ్వెంత చదువుకున్నా వయస్సులో చిన్నవాడవే...

శ్రీ : పెద్దలు మీరు- నిజం చెప్పారు.

క : నీ కుర్రతనం పోగొట్టుకున్నావుకాదు...

శ్రీ : నే నేం చేశాను బాబుగారూ?

క : ఇంకేం చెయ్యాలయ్యా. మన వూరి పరువంతా తీసేశావే...

శ్రీ : నేనా? మీరేదో పొరపాటు పడుతున్నారు.

క : నామాట కడ్డు చెప్పకు. నీ పనేమీ బాగాలేదు. వూరి వారందరూ గట్టిగా చెప్పమన్నారు. నీ యాటలింక సాగనివ్వరు.

శ్రీ : మీ రనేదేమిటో నాకు తెలియడంలేదు.

క : అంత తెలివితక్కువ వాడనుకోలేదు. మన విజయవాటికను జయించిన శత్రువు- అనంతపాలయప్రభువు నాశ్రయించి, బ్రతకటం గొప్పతనమనుకున్నావా? మాటిమాటికీ నువ్వు కొండపల్లి వెళ్ళి ఆయన కొలువు చేసుకోవడం మన వూరివాళ్ళకి పరువుతక్కువకాదా...?

శ్రీ : ఏమీ కాదు. మనవూరు నిలబెట్టడానికే నేనీ పని చేస్తున్నాను. వారు మనల్నోడించారు. ఏ కీడేనా చేయగలరు. అటువంటి ముప్పు తప్పించడానికే నేను రాజగురువైనాను. విజయవాటికను కాపాడుతున్నాను.

క : చాలా గొప్పపని చేస్తున్నావుకదూ? ఇంతోటి మొనగాడవు బయల్దేరావు. ఇదిగో- అబ్బాయ్ చెప్తున్నాను ఇప్పటికేనా కళ్ళు తెరుచుకుని, నువ్వా రాజుకొలువుకి వెళ్ళడం మానెయ్. లేకపోతే మేమూరుకోం.

శ్రీ : ఊరుకోక యేం చేస్తారో కాస్త సెలవిస్తారా...?

క : అబ్బో... పొగరుబోత్తనం బాగా ముదిరిందే. రాజుగారి కూడా కూడా తిరుగుతున్నావని కాబోలు. ఓయ్ శ్రీపతీ- అటువంటివి మాదగ్గర సాగవు. తెలిసిందా...? మేం చెప్పినట్టు వింటేనే బాగుపడతావు.

శ్రీ : లేకపోతే, చెడిపోతాను- అంతేనా?

క : అంతో- యెంతో చూద్దుగాని. పెద్దవాణ్ణి- వచ్చి- నెమ్మదిగా చెపుతూంటే యింత తల బిరుసా. వూరందరిదీ వొకదారీ, నీదొక్కడిదీ వొకదారీ అయితే, ముందుకి రావుసుమా. మంచిగా చెపుతున్నాను. వినకపోతే రేప్పొద్దుటనుంచీ నీకీ వూళ్ళో నీళ్ళూ నిప్పులూ పుట్టవు- చూసుకో.

శ్రీ : అలాగేలెండి. యేం జరుగుతుందో నేనూ చూస్తాను. సెలవు. (కోడికూత)

సీ : ఏమండీ- యింకా నిద్దరేనా?

శ్రీ : మేలుకునే వున్నాను. బాగా తెల్లవారినట్టుంది.

సీ : చాలా పొద్దెక్కిందికూడాను. ఒక్కమాట చెప్పనా?

శ్రీ : నాకు తెలుసులే. వూరందరూ మనల్ని వెలివేశారు కదూ...?

సీ : అలానే కనిపిస్తూంది. ఎవరింటికెళ్ళినా ఈపూట నాకు నిప్పియ్యలేదు.

శ్రీ : వెర్రివాళ్ళు- వాళ్ళియ్యకపోతే మనకి నిప్పే లేకుండా పోతుందా?

సీ : యేదీ? ఎక్కణ్ణుంచేనా వస్తుందా?

శ్రీ : చూడు రప్పిస్తాను. నా మంత్రశక్తి వారికి చూపిస్తాను.

సీ : ఏమిటో... వూళ్ళో వాళ్ళతో లేనిపోని తగవు మనకెందుకు చెప్పండి?

శ్రీ : తగవు తెచ్చింది వారే- అనుభవిస్తారు. ఒక్క క్షణం నన్ను మాట్లాడించకు.

సీ : అమ్మో- మంటలు... యెన్నిమంటలో... మనింట్లోకే వస్తున్నాయి.

శ్రీ : భయంలేదు సీతా. అగ్నిహోత్రుణ్ణి మంత్రించి ఆహ్వానించాను. దయచేశాడు. అగ్ని స్తంభించింది. ఒక

తెల్లని వస్త్రం తీసుకురా. అందులో నిప్పునంతనీ మూటగట్టి- ఆ జువ్విచెట్టుకి వ్రేలాడగడతాను.

సీ : ఏమిటీ వింత? ఆమూట కాలిపోవడంలేదు. పెద్ద పెద్ద మంటలన్నీ అందులో యిమిడిపోయాయి.

శ్రీ : నాకు నిప్పియ్యనన్న యీ వూరివారి కింక నిప్పు దొరకదు.

సీ : అలాగైతే- పాపం వారందరికీ యిబ్బందికాదా?

శ్రీ : వారందరూ మన కిబ్బంది కలుగజేయలేదా?

సీ. : వారు తెలివితక్కువతనంవల్ల అలా చేశారనుకోండి.

శ్రీ : అలాగెందు కనుకోవాలి? నామీద కన్నెర్రకొద్దీ- నేనంటే కిట్టక- కసితీర్చుకోవాలని చేశారు. పొగరు బోతులు. నాపగ తీర్చుకుంటాను.

సీ : అలాగైతే, వూరందరూ యేంకావాలి? పసిపిల్లలూ, ముసలివారూ యెలా బ్రతుకుతారు. ఏ కొద్దిమందో చేసిన పొరపాటుకి అంతమందీ అల్లాడిపోవాలా? నా మాట వినండి. నిప్పుని విడిచిపెట్టండి. అరుగో కరణం గారు పరుగెత్తుకుంటూ పదిమందిని వెంటబెట్టుకుని వస్తున్నారు. కనికరించండి.

క : ఏం నాయనా.. శ్రీపతీ. ఇలా చేస్తావా?

శ్రీ : కేకలేయకండి కరణంగారూ. నే నేం చేశాను?

క : ఊరంతా చల్లారిపోయింది. ఎక్కడా నిప్పులేదు. ఎలా బ్రతకడం?

శ్రీ : కుర్రవాణ్ణి- మీ బ్రతుకుల్ని గురించి నేనేం చెప్ప గలను...?

క : అలాగనకు నాయనా. నీసంగతి మాకు తెలియక తప్పుచేశాం. పరాయివారి కొలువు చేస్తున్నావనే పొరుషం కొద్దీ నిన్ను వెలివేశాం. శ్రీపతీ నువ్వు మన వూరు మంచికోసమే అలా చేస్తున్నావని మాకిప్పుడు తెలిసింది. ఇంక నీమీద మాకు పగలేదు. నువ్వు మా వాడవు- గొప్పవాడవు.

శ్రీ : ఇప్పుడెంతేనా పొగుడుతారు- నాకు తెలుసు.

క : నువ్వలా గనుకోకు. నే న్నిజం చెపుతున్నాను. నిన్ను గురించి మొదట్లో పొరపాటు పడ్డాం- ఇప్పుడు దిద్దుకున్నాం. ఇదివరకు నిన్ను మేమన్న మాటలు మరచిపో. ఆమూట విప్పి, మాకు నిప్పియ్యి- లేకపోతే బ్రతకలేం. పెద్దవాణ్ణి వూరందరిమాటగా నిన్ను వేడు కుంటున్నాను.

శ్రీ : కరణంగారూ! మీరింతగా బ్రతిమాలనక్కరలేదు- నావల్ల యెవరికీ ఆపద రానియ్యను. నిప్పిస్తాను. కాని, మీరింకముందేనా జాగ్రత్తగా మసులుకోండి. మంచి తనాన్ని చేతకాని తనమనుకుంటే చిక్కుపడతారు. వెళ్ళండి.

(విజయ ప్రవేశం)

విజయ : ఆ జువ్విచెట్టు దగ్గర ఆవింత జరిగిందమ్మా...

పాప : అది నిజంగా వింతే- ఇటువంటి వింకా యేవేనా జరిగేయా?

వి : నా అనుభవాలు అనంతమైనవి- అతి చిత్రమైనవి. ఒకసారి శ్రీకృష్ణదేవరాయలు నా ప్రాంగణానికి వచ్చినప్పుడు-

కవి : శ్రీ వేంకట గిరివల్లభ సేవా పరతంత్రహృదయ- చిన్నమదేవీ
జీవిత నాయక- కవితా ప్రావీణ్య ఫణీశ- కృష్ణరాయమహీశా.

రాయలు : పెద్దనమహాకవీ! కళింగదేశ విజిగీషామనీ షతో జైత్రయాత్రాప్రారంభిసైన నాకీ విజయవాటిక విశ్రాంతి భవంతి నిర్మించినది. కృష్ణవేణీ తరంగసంగీత ములు స్వాగతగీతము లాలాపించినవి. హరివాసరోప వాసానంతరము శ్రీకాకుళాంధ్ర విష్ణువు నర్చింప-రాత్రి చతుర్థయామమున స్వప్నములో స్వామి ప్రత్యక్షమై వేంకటేశ్వరస్వామి శ్రీ పాదాంకితముగా భక్తిరస ప్రబంధ నిర్మాణమున కుపక్రమింపుమని - ఆజ్ఞాపించె.

క : మీజన్మ ధన్యము. కృష్ణదేవరాయా! రాజరాజువై దేశమును పాలింపుము. కవిరాజువై సరస్వతిని లాలింపుము.

రా: కృష్ణాతరంగిణీ శుభకాంక్షలూ విజయవాటికా సుకృతా వేశములూ మాకావ్యరచన కుద్బోధకములు. ఆముక్త మాల్యదకు నాందీపద్యము యిదిగో పఠించండి.

# వి జ య వా టి క

క : శ్రీకమనీయ హారమణి చెన్నుగతానును -
కౌస్తుభంబునం
దా కమమలా వధూటియు - ఉదారతతోప
పరస్పరాత్మలం
దా కవితంబులైన తమయాకృతు లచ్చత
పైకితోప - ఆ
స్తోకత నందుతో చెనన శోభిలు వేంకట
భర్త గొల్చెదన్.

వి : మహారాజులు నాదర్శనాన్న పేక్షించారు. నా ప్రజా సౌందర్యానికి ముగ్ధుడైనా ఓరుగంటి ప్రతాపరుద్రునికి కృష్ణాతట వనవాటికలు విహారోద్యానవనాలు.

పా: ఆయన మాచలదేవికోసం వచ్చారటకదూ ?

వి : ఆ వారాంగనా లావణ్యం విశ్వవిఖ్యాత మయింది. శ్రీనాధమహాకవి భావాల నుద్దేకించి, క్రీడాభిరామంలో కవిత సుద్బోధించింది -.

క : ప్రతాపరుద్ర ధరణిశోపాత గోష్ఠి ప్రతిష్ఠాపారీణయగు మాచల్దేవ శాసనమీ విజయవాటిక నలంకరించినది. కళా సుందరమీ మహాపురము.

నటులది దోరసముద్రము
విటులది దొరోర్గల్లు - కవిది వినుకొండ మహా
పుట భేదనము - ఈ త్రితయము
నిట గూరిచె బ్రహ్మ రసకులెల్లరు పొగడన్.

వి : కళలకూ కవితలకూ నేనాస్థాన సీమనిసుమా ...

పా : అవును. తెనుగునాటికి నట్టనడిమ నున్నావు. ఎన్ని రైలుదారులో కలిశాయిక్కడ.

వి : అందుకే పర్తిక వ్యాపారాలకీ పరిశ్రమ యంత్రా గారాలకీ కేంద్రాన్నయాను.

పా : ఇక్కడ చాలా పాఠశాలలూ కళాశాలలూకూడా వున్నాయి.

పా : అవును తల్లీ- కళలూ, విద్యలూ నన్నాశ్రయించి బ్రతుకుతున్నాయి. ఆ కృష్ణవేణీ సౌందర్యసృష్టి నాహ్వా నించి ఆకర్షిస్తుంది.

కృష్ణ : ఓయిలు, శిల్పవిద్యాచార్యులు. ఈ పర్వత కందాల్లో సుందర శిల్ప చిత్రాలు నిర్మించండి. శాశ్వతకీర్తి నార్జిం చండి. పురాణ ప్రసిద్ధమైన నాగవంశం విజయవాటికకు అవతరించిందే. నగరాల కాయకష్టంతో ఈ మహా నగరం అభ్యున్నతికోక దారి తీసింది.

కృ : విస్మృతమైన పురాతన చరిత్రను పరిశీలించి, యధా ర్థాన్ని ప్రకటించాలి. కొమర్రాజు లక్ష్మణరాయా ! ఆంధ్రావనిలో విజ్ఞాన చంద్రికలు ప్రసరించి చరిత్ర పరిశోధకులకు మార్గదర్శివిగా జీవించు.

కృ : ఓహో ! విజయవాటిక నాటక రంగస్థలమైంది. సంగీతానికూడా గురుపీఠ మాక్రమించిందే. పారుపల్లి రామకృష్ణయ్యా ! చరితార్థుడవు. కాశీనాథుని నాగేశ్వ రరాయా ! విశ్వదాతవు- దేశోద్ధారకుడవు- ఆశావ కాశాల్లో వికసించే నీ యశశ్చంద్రికల కామోదిస్తు న్నాను. వారెవరూ? నా సహోదరి గోదావరి పంపగా నన్ను దర్శించాలని వచ్చిన కవీశ్వరులూ- కళారాధకులూ అడివి బాపిరాజా ! నీ చిత్రకళార్చన కభినందనాలు. యువకుల్ని పురోగమించి వస్తూన్న ఆ వృద్ధకవి పండితుడు- చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి స్వాగతం. నా తీరమే నీకు విశ్రామాగారం, ఈ విజయవాటికలో ప్రథమాస్థానకవి సన్మానం స్వీకరించు.

వి : ఉగాదీ - విన్నావా - ? కనకదుర్గాంబ లనుగ్ర హంతో యీ విజయవాటిక దినదినాభి వృద్ధిగా విస్త రిస్తోంది. ఆ జగన్మాత పాదపూజతో నావారులు సుఖంగా జీవిస్తున్నారు.

పా: చల్లని తల్లివై అందరినీ కాపాడుతూండు - విజయ వాటికా. నీ పేరు పెంపులింకా పైకిరావాలి.

ఓవిజయవాటికా - ఓకృష్ణశాటికా
కనకదుర్గాంబికా ధనపేటికా
ఓహో విజయవాటికా -

(ఆలిండియా రేడియో విజయవాడవారి సౌజన్యంతో)

---

# విశ్వతరంగిణి

• రచన: "యస్" •

ఇదిగదుగో ! విశ్వతరంగిణి !
విమల సలిల ప్రవాహిని !
జగదావృత కాలకంటక ధారిణి !
విధుర జీవిత వికలదశని !

అశ్రాంత కాలాబ్ది కళ్యాణ ఖనిని !
నును వెచ్చని గుండెల సెలయేరులు
శౌర్యం విరగని శక్తి కడలి తరగలు
అంతం బొందిన వికలయాత్రలు
హసియించిన దానవ జాతరలు
ఈ విశ్వతరంగిణిలో సలిలాలు.

తెగిన హృది విపంచి తీవెలు
కురిపించిన కవోష్ణధారలు
గ్రీష్మించిన భవదాశాలతలు
వెసయించిన కాల శశ్మాన రేఖాళలు
ఈ జగన్మడుగులో వనమ్మాలికలు
తరతరాల తరియింపని తమస్సుల్లో —

నేల కొరిగిన శిధిలవాడల్లో —
ఎర్రాకలి స్వైర విహారాల్లో —
రగులుతున్న రుధిర కణాలతో
సహియింపని బ్రతుకు భారంతో
శాంతి చచ్చిన హృదయాలతో

శిధిలమైన శరీరాలతో
కొద్దిక్షణాలు బ్రతికేందుకు
అటమటించి అల్లాడుచు
సుళ్ళుతిరిగే అరుణ కాంతుల్లో

ఊగిసలాడే నగ్నాత్మలు
ఈ విశ్వతరంగిణిలో వల్లనీడలు
బంధించే కాలచక్రపు కత్తెరలు —
పరుగులెత్తే కాలకన్య నడకలు
విడిపోవని విలయ వింతతెరలు
ఊష్మించే నిర్ధనుల నికృషాలు
నిదురించిన ప్రపంచ కల్లోలాలు
ఈ ప్రపంచ స్రవంతిలో పవనాలు.

క్ష్మా చక్రపు సురసురలు
కాలసర్పపు బుసబుసలు
శిధిల శకలలాలు భగభగలు
శిలాహృదిల కణ కణలు
ప్రళయమేళనపు గణ గణలు
ఈ తరంగిణి కెరటాల ఘోషణం

శాంతి ఘోషణల కశ్మలాలు
నీతిమంతుల మత్సరాలు
రక్తిమయ దృశ్యాల రక్తవర్ణలాస్యాలు
జీర్ణించిన కాంక్షల మరణాభరణాలు
బండ గుండెల బలిపీఠాలు
ఈ ధాత్రిపలయ వారిగర్భంలో నాట్యాలు.

నవోదయ సంధ్యా కాంతులు
అసదృశ ప్రవాళరేఖలు
జగజ్జనతా మహోత్సవానికి
తూర్పున విడిచే యింద్రధనుస్సులు
ఈ శుభోదయ కిరణాగమన
మంగళము ముహూర్తం అవలోకిస్తావా?

రా ! మానవా ! రా !
ఈ తరంగ భంగ శిఖరాలమీద
అరుణామల కర కోమలాలతో
అజరామర రుచిరాధరాలతో
నయనోజ్జ్వల నయనోచ్ఛ్వరాలతో
శాంతిగీతి ఆలాపిస్తూ
నాట్యం చేస్తావా?

నీ నాట్యానికి లయకలిపి
వాయిస్తుందిలే అగ్నివీణ
దాటిపోకు పుణ్యకాలం
మరువబోకు మహోప్రపంచం

ప్రగూఢానంద పచ్చతోరణాల్లో
విగళిత పురాతనాచార శృంఖలాల్తో
మారణాయుధాభరణాలతో
నీవు నటిస్తుంటే
చూడాలని
ఈ విశ్వ శ్రీ అభిలాష
ఈ విశ్వ తరంగిణిని ఘోష !

రా ! మానవా ! రా !
హోరెత్తే యీతరంగిణి
పిలుస్తోంది నిన్ను !
ఇదిగదుగో ! విశ్వ తరంగిణి !




[వెనుకటిగాథ:— ఆస్థిపరులైన సీతారామయ్య, జానికమ్మలకు కుమార్తెలున్నా, పుత్రసంతానం కోసం చింతించేవారు. వారెంతో అన్యోన్యంగా వుండడం లోకులు ఓర్చలేకపోయేవారు. జానికమ్మ తమ్ముడు వెంకట్రంగయ్యకు తన చిన్నకూతురు సీతనిచ్చి పెండ్లి చేయాలన్న ఆశతో ఆమెను ప్రేమతో చూచేది. జానికమ్మ తల్లి లోభి, నెరజాణ. ఏలాగో తంటాలుపడి కొడుక్కి ఉద్యోగం యిప్పించింది. జానికమ్మ తన కోరికను భర్త కెరింగించగా అతనంగీకరిస్తాడు. గాని, శాంతకు వివాహం చేసి ఆ అల్లుడ్ని యిల్లరికం తెచ్చుకుందామంటాడు. తల్లి, తమ్ముని మంత్రాంగం వల్ల దానికి ఒప్పుకోదు జానికమ్మ. దాంతో ఇద్దరికీ మనస్పర్థలు వస్తాయ్. తనమాటపై పట్టుదలగల సీతారామయ్య రఘు అనే పిల్లవాని గుణగణాలు విని యిల్లరికానికై తనింటికి తీసుకువస్తాడు. ఇద్దరి కుమార్తెల వివాహాలు సలక్షణంగా చేసి, సీతను అత్తవారింటికి పంపిస్తాడు. రఘు భూములు చూసుకుంటూ అత్తవారింట్లో ఉంటాడు. ఈలా సంవత్సరాలు దొర్లిపోతున్నాయి.

శాంతకు సంతానం కలిగింది, సీతకు సంతానం లేదనే చింత ఒకవేపూ తనకూ భర్తకూ సఖ్యం కుదరలేదనే చింత మరోవేపుతో కుందుచూ వుండేది జానికమ్మ. సీత కాపురానికి వచ్చి 10 ఏళ్ళు అయినా కాన్పు లేదని, తాత తన ఆస్థినంతా శాంతపిల్లలకే పెడుతున్నాడన్న మిషచే సీతను నానా బాధలు పెట్టేది మంగమ్మ. వెంకట్రంగయ్య చేతకాని వ్యవహారాలు చేసి అప్పులపాలై భార్య వంటిపై నగలుకూడా అమ్మకొనే స్థితికి వస్తాడు. ఈపరిస్థితి చూసి సీతారామయ్య సీతను యింటికి తీసుకొనివెళ్తాడు. నిజ విషయం చెప్పేసరికి జానికమ్మ నమ్మలేక తనే స్వయంగా తమ్మునింటికివెళ్ళి చూడాలన్న అభిలాషతో, శరీర స్థితి బాగులేదని, మందు తినాలనీ చెప్పి తన పుట్టింటికి బయలుదేరుతుంది. కొన్నాళ్ళకు మనోవ్యాధితో మంచమెక్కింది జానికమ్మ తమ్మునింట్లో. జానికమ్మ సంగతే తెలియక సీతారామయ్య ఆమెను చూడ్డానికి వస్తాడు. పరిస్థితినంతా కనిపెట్టి తగిన వైద్యం చేయమని వైద్యునితో చెప్పి కొంత డబ్బు యిచ్చి, తిరిగియింటికి వెళ్తాతాడు. తండ్రి యెడబాటుకు నిస్సహాయ అయిన సీత దుఃఖిస్తూ గదిలోకి వెడుతుంది. ఇక చదవండి.]

## ౧౦

ఖర్చులకుగాను యిచ్చిన వంద రూపాయలను సీత తల్లి కిచ్చింది. జానికమ్మ తీసుకుపోయి వెంకట్రంగయ్య చేతి కిచ్చింది. మంగమ్మ ద్వారా తెలుసుకొని సీతకు తండ్రి యిచ్చిన వంద రూపాయలను కూడ అడిగి తీసుకొన్నాడు భర్త.

సీతకు వెంకట్రంగయ్య సంవత్సరానికి కావలసిన చీరెలను గూడ కొనియివ్వటం లేదు. అన్నీ తండ్రి యిచ్చినవే. సీతవల్ల భర్తకు ఎట్టినివేగానీ ఖర్చులేదు తిండితప్ప. ఒంట్లో బాగుండకపోతే మూలగడమూ, ఉపవాసమూ తప్ప ఖర్చేమీ లేదు.

జానికమ్మకుగాను తమ్ముడు యిప్పటికి డాక్టరుకు ఏమీ యివ్వలేదు. గ్రామ ప్రముఖులలో వెంకట్రంగయ్య కూడా ఒకడైనందున, తనది జిల్లాబోర్డు ఉద్యోగమైనందువల్ల అతనికి అనుకూలంగా ఉండకపోతే ఏదైనా అపకారం చెయ్యగలడనే భయంతో 'నీళ్ళ మందు' పోస్తున్నాడు. సీతారామయ్య వచ్చి కొంత పైకాన్ని యిచ్చి మాట్లాడి

వెళ్ళినప్పటినుంచి శ్రద్ధగా మందూ, ఇన్జెక్షన్లూ యిస్తు న్నాడు. జబ్బును తగ్గించ కలిగితే ఉన్నవారూ, మర్యా దస్తుడుగా కనబడిన సీతారామయ్యవల్ల మంచి ప్రతిఫలం ఉండగలదని బాగా ఆశ యేర్పడి ఎంతో శ్రద్ధతో తగిన మందు ఇస్తున్నాడు.

సీతారామయ్య వచ్చి వెళ్ళి అప్పుడే మూడు నెలలు గడిచాయి. జానికమ్మ ఆరోగ్యం మరీ చెడిపోయి భరించ లేని బాధలతో మూలుగుతూ మంచంలో పడివుంది. డాక్టరు ఆపరేషన్ చెయ్యాలని అన్నాడు. సీతారామయ్యకు కబురు చేశారు. శాంత, పిల్లలు, సీతారామయ్యా వచ్చారు వెంట డబ్బు కూడ తెచ్చాడు సీతారామయ్య. ఆయన డాక్టరుతో అన్ని సంగతులు మాట్లాడి అప్పటికైన మందుఖర్చు లన్నీ యిచ్చాడు. బాగా ఆశ పెట్టాడు కూడా. కనుక డాక్టరు అతి శ్రద్ధతో పని చేస్తున్నాడు. ఆ నాటికి రఘు కూడా వచ్చాడు.

ఆపరేషన్ జయప్రదంగా జరిగినట్లే అభిప్రాయపడ్డారు. అందరూ సంతోషంగానే ఉన్నారు. కాని మర్నాడు సాయంత్రానికి పరిస్థితి మారిపోయి ప్రమాదం ఏర్పడి జానికమ్మ చనిపోయింది మూడవనాటికి.

సీత, శాంత దుఃఖభారంతో తెలివితప్పి పడిపోయారు. వెంకట్రంగయ్య చాలా మంది మధ్య కూర్చొని డాక్టరుకూ తనకూ వున్న స్నేహాన్ని బట్టి చాల శ్రమపడి పని చేశా డనీ, కాని దేవుడు సరిగా చూడనప్పుడు ఆయన మాత్రం ఏమి చెయ్యగలడనీ చెబుతూ దాన్ని ఆధారంగా వైరాగ్య ప్రసంగం మొదలు పెట్టాడు. సీతారామయ్య డాక్టరుతోటీ, ఇతరులతోటీ మాట్లాడ వలసిన సంగతులన్నీ మాట్లాడి శాంతకూ, సీతకూ ధైర్యం చెబుతూ పిల్లల్ని సముదా యిస్తూ దుఃఖాన్ని దిగ మ్రింగుతూ విశ్రాంతి లేకుండా త్రొక్కులాడుతున్నాడు.

ఆపరేషన్ జయప్రదంగా జరిగిందన్న ధైర్యంతో వెళ్ళిన రఘుకు మరణవార్త అందజేయబడింది. రఘు వెంటనే బయలుదేరి వచ్చాడు. మామగారిని చూస్తూనే ఆపరాని దుఃఖంతో వెళ్ళి ఆయన రెండు పాదాలను గట్టిగా పట్టుకొని పెద్దగా రోదించాడు. సీతారామయ్య ధైర్యంగా దుఃఖాన్ని అణచుకొని "రఘూ, లే, ధైర్యం తెచ్చుకో, పిల్లల్ని దగ్గరకు పిల్చి సముదాయించుకో పో, నాయనా" అన్నాడు. రఘు లేచి కళ్ళు తుడుచుకుంటూ పిల్లల్ని దగ్గరకు తీసుకున్నాడు.

మంగమ్మ పెద్దగా "నీవు బ్రతికిన నాల్గునాళ్ళూ భర్త వల్ల గానీ, పిల్లలవల్ల గానీ సుఖపడలేదు. చివరకు భగవంతుడు ఎవర్నీ అన్యాయం చెయ్యలేదు— నిన్నే అన్యాయం చేశాడు. 'ఈ కత్తి కోతలకు ఒప్పుకోవద్దే తల్లీ' అని మొదటినుంచీ నేను మొత్తుకుంటూనే వున్నాను. ఐనా నామాటంటే ఎవరికిలక్ష్యం? తమ్ముడన్నా, నేనన్నా నీకు ఎంత ప్రాణమే తల్లీ! ఈ దరిద్రులకు నీ వెందుకు దక్కుతావు తల్లీ?" అని ఏడ్చింది.

జానికమ్మ మరణం అందరికీ విచారాన్ని కలిగించింది. కానీ, పసుపుకుంకుములతో పోయిన ఆమె చాలా అదృష్ట వంతురాలని అందరూ పొగిడారు. శాస్త్రీయకంగా అంత్య క్రియలు జరిగాయి.

ఒక మంచి రోజు ఉదయాన అందరు ఇంటికి ప్రయాణమైనారు. క్రిందటి రాత్రి ఝడివాన కురిసి వెలి సింది — తలకు మునిగినట్లుగా ప్రకృతి దేవత. జానికమ్మకు సంబంధించిన ఆశౌచమంతా నిన్నటితో తీరి పోయిందనేమో! గంటలూ, మువ్వలూ ఎద్దుల నడక ననుసరించి ఒకసారి నెమ్మదిగా, ఒకసారి పెద్దగా మ్రోగు తున్నాయి— యజమానురాలి మరణాన్ని గురించిన దుఃఖ గీతాన్ని పాడుతూనట్టు. రాత్రి స్నానమాడి శుభ్రంగా ఉన్న చెట్ల ఆకులను, పువ్వులను, మొగ్గలను బాల సూర్యుని బంగారు కిరణాలు శోభావంతంగా చేస్తున్నాయి: చెరువు బంగారు నీటితో నిండిపోయిఉంది: భూదేవి క్రిందటి రాత్రి వర్షానికి చల్లబడి వున్నందున ఉదయ భాస్కరుడు తన కిరణాలకు ఎంత పదును బెట్టినా అతని ఆటలు సాగటం లేదు.

సీతారామయ్య మనస్సును విచారం మింగతలచుకొంది నలభై ఏండ్ల క్రిందటి ఒక ఉదయసమయ సౌందర్య ఇవాళ తిరిగి జ్ఞాపకానికి వచ్చి ఈనాటి తనదుఃఖాన్ని యిన మడింపజేసింది. ఆయన తనవివాహమైన తరువాత పెండ్ కొడుకు వేషంలో, తలయెత్తనంత సిగ్గుబరువుతో పెండ్ కూతురి వేషంలోవున్న జానకితో, ఈదారినే రెండెడ్లబండ్ లోనే సపరివారంగా సంతోషంగా వెళ్ళాడు — ఇలాంటి అందమైన ఉదయాన్నే. ఆనాటినుండి ఎప్పుడు అత్తి వారింటికి వెళ్ళినా యిదేదారి. సీతను వెంకట్రంగయ్య కిచ్చి

వివాహం చెయ్యడంలో ఈదారికి మరల ప్రాముఖ్యత ఏర్పడ్డది. కానీ ఈదారిని నడుస్తూన్నప్పుడు ఉత్సాహం గానీ, సంతోషంగానీ ఉండటంలేదు. జానకి తనకు భార్య అయినప్పటినుంచీ, మరణించినంతవరకూ వివిధస్థితులలో జ్ఞాపకానికి వొచ్చింది. తనను ఆమె గాఢంగా ప్రేమించినప్పటి, హృదయపూర్వకంగా ఆదరించినప్పటి సంగతులు జ్ఞాపకానికి వచ్చి కృతజ్ఞతతో దుఃఖంతో బాష్పాలురాలాయి. మంగమ్మ, వెంట్రంగయ్య ఎలా జానకిని మాయాజాలంలో వేసుకొన్నారో ఈ మర్మగాథ లోకానికి ఎలా తెలుస్తుంది? ప్రపంచంలో ఎన్నో అసత్యవిషయాలు సత్యాలుగా నమ్మబడుతూండడం మామూలేనేమో! చరిత్ర ఎంతమంది త్యాగమూర్తులను, అన్యాయానికి బలి అయినవాళ్ళనూ గుర్తించకుండా వదలి వేసిందో! మాయ మర్మాలతో, స్వార్థంకోసం ఎందర్ని నాశనం, ద్రోహం చేసినవాళ్ళనూ చక్రవర్తులుగా, మహా పురుషులుగా చిత్రించిందో! యశస్సూ, అ పయశస్సూకూడా అన్యాయంగా ఎందరికి సంక్రమింప జేయబడ్డాయో! తాను శాంతయందు పక్షపాత బుద్ధి కలవాడన్నది కల్పితమూ, అన్యాయమూనూ. భార్యా వియోగం తీవ్రాఘాతమే అయినా చివరిదశలో ఏర్పడిన మనస్థితితో ఆమె జీవించివుంటే మాత్రం ఆమెకూ తనకూ కూడా శాంతీ, సుఖమూ ఉండవు. ఈ ఆలోచనలు ఆయనకు అత్యంత విచారాన్ని కలిగించాయి. కళ్ళుమూసుకొని ధ్యాన పరుడై కూర్చున్నాడు. ఆయనవృద్ధ జీర్ణ దేహం, భక్తివివశమైన భంగిమలో బండి కుదుపుకు ఊగుతూ సూర్యకాంతిలో మెరుస్తూ మనోహరంగా కనబడుతోంది. తండ్రి ఎక్కడపడిపోతాడో నన్నభయంతో శాంత ఆయనవైపే చూస్తోంది.

నడిచేటప్పుడు ఎంతో అందంగా వొరిగే ఎద్దుల మూపురాల వైపొకసారీ, ఆకాశంలో ఎగిరిపోతున్న పక్షుల రెక్కల తళతళలను — కళ్ళు చికిరించుకొని ఒకసారీ, బండికి ఇరువైపులా నోరుతెరుచుకొని బండిలోని ప్రయాణీకులను వింతగాచూచే విచిత్ర భంగిమతో, నున్న గ్రామీణుల వైపొకసారీ చూస్తూ ఎంతో సంతోషంలో గలగలా సంభాషిస్తూ ఒకచోట కుదిరికగా కూర్చోక పిల్లలు ప్రయాణ సుఖాన్ని అనుభవిస్తున్నారు.

మిట్ట మధ్యాహ్నమప్పుడు దారిలో వున్న గ్రామంలో ఆగి కొంత విశ్రాంతి తీసుకొని సాయంత్రం మళ్ళీబయలు దేరారు. ఇంటికి చేరేటప్పటికి బాగాచీకటి పడ్డది

## ౧౧

ఊరినుంచి వచ్చిన అయిదారు రోజులకే శాంతకు సన్నగా జ్వరం తగలడం మొదలు పెట్టింది. వారంగడిచి రెండవ వారం చివర వైద్యులు టైఫాయిడ్ జ్వరం అన్నారు. భార్యా వియోగం కలిగిన సీతారామయ్యను పరామర్శించడానికి రామారావు దంపతులు వచ్చారు. శాంతలేచి తిరిగేవరకూ సహాయంఉండమని సీతారామయ్య వాళ్ళను కోరాడు. సరేనని ఉన్నారు. రామారావు భార్య లక్ష్మి ఓర్పూ వినయవిధేయతలూ గలది. శాంతకు సర్వోపచారాలు చేస్తూ, పిల్లల్ని సముదాయిస్తూ, వేళమించకుండా వంటచేసి పెడ్తోంది.

రఘుకు బద్ధకంగా ఉండి జ్వరం తగులుతోంది. శాంతకు జ్వరం మూడవవారంలో ప్రమాదస్థితిని తెచ్చి పెట్టింది. అప్పుడప్పుడు తెలివి తప్పుతూ మళ్ళ యథాస్థితికి వస్తూంది. బాబు ఎవరూ చూడకుండా ఎప్పుడు వెళ్ళాడో వెళ్ళి, తల్లిపక్కలో పడుకొని ఉన్నాడు. లక్ష్మి వెదుక్కుంటూ వెళ్ళి తల్లి పక్కలోవున్న బాబును ఎత్తుకొని పోబోతుండగా శాంత వారించి కళ్ళనుండి అశ్రువులు రాల్తూ వుండగా అంది — "ఉండనీ అక్కా, ఎన్నో రోజులు బ్రతికేట్టులేను. బ్రతికిన కాస్సేపు చిట్టితండ్రి ముఖాన్ని చూస్తూ ఉండనీ"

అశ్రుజలపూర్ణ నయనాలతో, రుద్ధ కంఠంతో, ద్రవిస్తూన్న హృదయంతో లక్ష్మి అన్నది. "జ్వరం తగులు తున్నప్పుడు పిల్లల్ని దగ్గర పడుకోనివ్వ కూడదమ్మా. నువ్వు భయపడవద్దు చెల్లీ. జ్వరం ఏమి చేస్తుందమ్మా? ఇంకా రెండురోజులు ఆలశ్యంగా తగ్గుతుంది" అని పిల్లవానిని ఎత్తుకొని వెళ్ళింది.

నాల్గవవారం వచ్చింది. శాంతకు జ్వరం వస్తూనేఉంది, ఆమెస్థితి నీరసంగా భయాన్ని కలిగిస్తూ ఉండగా రఘుకు టైఫాయిడ్ రెండవవారం నిండవస్తోంది. క్షణ క్షణమూ రఘు "శాంతకు ఎలావుంది?" అని అడుగుతున్నాడు. నెమ్మదిగా వుందని డాక్టరు సలహా ప్రకారం ఎన్నిసార్లు చెప్పినా "ఎలావుంది?" అని పదేపదే అడుగుతున్నాడు. అది సంధి లక్షణ మనుకున్నారు.

* * *

డాక్టరు ఆమె మరణవార్తను రఘుకు తెలియనీయ వద్దని చెప్పిపోయాడు. ఎవ్వరూ అతని ముందు కన్నీరు పెట్టలేదు.

మూడవ వారం చివర జ్వరం విడిచింది. రెండు రోజులు గడిచాయి. ఇంకా పథ్యం పెట్టలేదు. పిల్లల్ని దగ్గరకు పిల్చి మాట్లాడి సంతోషించాడు. భార్యకు జ్వరం ఎలా వున్నదోనన్న సంగతి జ్ఞప్తికి వచ్చి పెద్దమ్మాయిని అడిగాడు. సంగతి తెలిసింది, దుఃఖంతో పక్కమీద వాలిపోయాడు.

సాయంకాలానికి నూటఐదు డిగ్రీల జ్వరం వచ్చింది. ఆ జ్వరం తగ్గక ప్రమాదస్థితికి పోయింది. భార్య చని పోయి పక్షమైనా కాలేదు; భర్త కూడా చనిపోయాడు.

## ౧౨

ఎటు చూచినా అంతా చీకటి. భూమ్యాకాశాలు తెలియటం లేదు. చాపమీద కూర్చొని రెండు అరచేతులను భూమి కానించి ముందుకు వంగి కళ్ళను మూసుకొన్నాడు సీతారామయ్య. కన్నీళ్ళు జల జలా రాలి ప్రవహిస్తూ ఉన్నాయి. గుండె పగిలిపోతుందేమో ననిపించింది ఆయనకు. తను మరణిస్తే ఈ పిల్లల గతి? ఇలాంటి తల్లి దండ్రులు లేని, దిక్కూ దిశా లేని పిల్లలెందరో! తాను చనిపోకూడదూ. బ్రతకాలి. సుఖదుఃఖాలను ఒకటిగా చేసుకోవాలి. పరమాత్మ స్వరూపులైన అనాధ శిశువులకు చేయగలిగినంత సేవ చేయ్యాలి, అని నిశ్చయించుకొని "రామారావ్, ఇటు రా నాయనా" అని కేక వేశాడు. రామారావు వచ్చి నిల్చున్నాడు,

"లక్ష్మిని కూడా పిలువు నాయనా" అని అన్నాడు సీతారామయ్య.

లక్ష్మిని పిల్చుకు వచ్చాడు, లక్ష్మి దగ్గరగా వచ్చి "ఎందుకు బాబూ" అన్నది,

"నేను చెప్పే మాటలను మీ రిద్దరూ శ్రద్ధగా విని బాగా ఆలోచించుకొని జవాబివ్వండి. తొందరేమీ లేదు. నెమ్మదిగానే మీ అభిప్రాయాన్ని తెల్పండి. ....దయామయుడైన భగవంతుడే నన్ను కత్తి పెట్టి పొడిచాడు నిలువునా దోపిడి ఐనాను. ఈ ముగ్గురు పసి పిల్లలు తల్లి దండ్రులు లేనివాళ్ళైనారు, ఆ పిల్లలకు తల్లి దండ్రులు లేని లోటును తీర్చ తగినవాళ్ళు మీరిద్దరే. వాళ్ళను కాపాడుకొంటూ, ఈ ముసలివాణ్ణి కనిపెట్టి చూస్తూ ఇక్కడే వుండవలసిందిగా మిమ్మల్ని కోరుతున్నాను, ఈ కోరిక నెరవేరితేనే నాకు మనశ్శాంతి. వెంకట్రంగయ్య నాకు దగ్గరివాడే. అయినా ఈ విషయంలో అతనిని నమ్మి ఈ పసికందులను అతని చేతులలో పెట్టలేను. కారణం—అతనిది స్వార్థ దృష్టి. అతని హృదయంలో సత్యానికీ, కరుణకూ స్థానం లేదు. మీ హృదయం దయతోటీ, సానుభూతి తోటీ నిండి వుండటం నేను చూస్తున్నాను. ఇది ముఖ స్తుతి చెయ్యటం కాదు. మీరు ఇంట్లోకి వెళ్ళి ఆలోచించుకొని రండి" అని కళ్ళు మూసుకొని చాపమీద వాలాడు సీతారామయ్య.

కొంతసేపటికి కాళ్ళచప్పుడు వినపడగా కళ్ళు తెరచి చూచాడు. కాళ్ళవైపు నిల్చొని వున్న రామారావు దంపతులను చూచి లేచి కూర్చున్నాడు.

"మీ వద్దనే వుండి మీకు సేవ చేస్తూ చిరంజీవులనే మా ఆశగా చూచుకొంటాము. మాకు మాత్రం వేరే కావలసినదేమీ లేదు– వాళ్ళను కాపాడుకొంటాము" అంది లక్ష్మి.

"సరిగ్గానే చెప్పింది" అన్నట్లుగా చూచాడు రామారావు, వృద్ధుని నేత్రాలలో తృప్తి తొణికిసలాడింది. కృతజ్ఞతా బాష్పాలు రాలాయి. పిల్లల్ని పిల్చి వ్రేలు చూపుతూ చెప్పాడు తాత— "అదిగో మీ అమ్మ. అడుగో మీ నాన్న"

ఆ నాటినుంచి పిల్లలు వారిద్దర్నీ, 'అమ్మా, నాన్నా' అని పిలుస్తున్నారు. క్రమంగా కన్న తల్లీ, తండ్రీ అని వీళ్ళనే భావించారు; కన్న తల్లినీ, తండ్రినీ మరచిపోయారు.

## ౧౩

మూడేండ్లు గడిచాయి. మంగమ్మ మంచాన పడ్డది. సీతకు రెండేండ్లుగా హిస్టీరియా ఫిట్లు వస్తున్నాయి. మంగమ్మ గుగ్గిలం పొగవేస్తూ భూతవైద్యం చేయించింది. శాంత తన కోడల్ని దయ్యమై పట్టిందని తిట్టి పోసేది. తన కోడల్ని పట్టిన దయ్యాన్ని వదిలించ కోడానికి భూతవైద్యులు చెప్పినట్లు, చెయ్యరాని పనులెన్నో చేయించింది; ఫిట్లు మాత్రం మామూలుగానే వస్తున్నాయి తరుచుగా.

వెంకట్రంగయ్యకు క్షణమైనా తీరిక లేదు. క్రిమినల్, సివిల్ మొదలుకొని ఎన్నికలు, భూతవైద్యాల వరకు

(58-వ పేజీ చూడండి)

# అల్లికలు — మఫ్లర్

కావలసినపరికరములు :— 4. ఔన్సుల ముదురురంగు ఊలు.

1. ఔ. లేతరంగు ఊలు. నెం. 10. సూదులు, 2.

మఫ్లర్ కొలతలు : 40 అంగుళముల పొడవు. 10. అంగుళములవెడల్పు.

ముదురురంగు ఊలుతో నెం. 10, సూదిమీద 80 కుట్లు వేయవలెను.

1. వ. వరుస :— ని. 4, * ప. 2, ని. 2; స్టార్ దగ్గరనుండి తిరిగి వేయుచూ చివర 4 కుట్లు నిట్టు అల్ల వలెను.

2. వ. వరుస :— ని. 4. * ప. 2, ని. 2; స్టార్ దగ్గరనుండి తిరిగి వేయుచూ చివర 4 కుట్లు నిట్టు అల్ల వలెను.

3. వ. వరుస :— ని. 4, * ని. 2, ప. 2; స్టార్ దగ్గరనుండి తిరిగి వేయుచూ చివర 4 కుట్లు నిట్టు అల్ల వలెను.

4. వ. వరుస :— 3. వ. వరుసవలె.

ఇదేవిధముగా $1\frac{1}{2}$ అం. అగువరకూ అల్లి రెండవ వరుసతోకాని, లేక నాలుగవ వరుసతోగాని ఆఖరగునట్లు అల్ల వలెను.

తరువాత వరుస :- ని. 4, తరువాత ప్రతి కుట్టులో రెండు సార్లు నిట్టు అల్లుచూ చిట్టచివర 4 కుట్లు నిట్టు అల్ల వలెను. (సూదిమీద 152 కుట్లు వచ్చును)

## రెండు రంగులతో అంచు అల్లు విధము:—

1. వ. వరుస :— ని. 4, ముదురు రంగుఊలు, * లేతరంగు ఊలు ని. 1, రెండు రంగుల ఊలు సూది ముందుకు వేసి, స్లిప్. 1 పర్ల్‌వైస్ (కుడి చేతిలోని సూది కొనను, పర్ల్ వేయుమాదిరి కుట్టు ముందుభాగము లోకి దూర్చ వలెను) రెండు రంగులు ఊలు వెనుకకు వేసి, లేతరంగు ఊలు ని. 1, రెండు రంగుల ఊలు ముందుకు వేసి, స్లి. 1. పర్ల్‌వైస్; ఊలు వెనుకకు వేసి, ముదురు రంగు ఊలు ని. 1. ఊలు ముందుకు వేసి స్లి. 1. పర్ల్‌వైస్; ఊలు వెనుకకు వేసి, ముదురు రంగుఊలు ని. 1. ఊలు ముందుకు వేసి, స్లి. 1. పర్ల్‌వైస్; ఊలు వెనుకకు వేసి, స్టార్ దగ్గర నుండి తిరిగి వేయుచూ చివర 4 కుట్లు నిట్టు అల్ల వలెను.

2. వ. వరుస :— ముదురు రంగు ఊలు ని. 4 * ముదురురంగు ఊలు ని. 1. ఊలు ముందుకు వేసి స్లి. 1. పర్ల్‌వైస్, ఊలు వెనుకకు వేసి లేతరంగు ఊలు ని. 1. ఊలు ముందుకువేసి స్లి. 1. పర్ల్‌వైస్, లేతరంగు ఊలు ని. 1. ఊలు ముందుకు వేసి స్లి. 1. పర్ల్‌వైస్, ఊలు వెనుకకు వేసి స్టార్ దగ్గరనుండి తిరిగి వేయుచూ ఆఖరి నాలుగు కుట్లు నిట్టు అల్లవలెను.

3 వ. వరుస :- 1 వ. వరుసవలె.
4 వ. వరుస :- 2 వ. వరుసవలె.
5 వ. వరుస :- 2 వ. వరుసవలె.
6 వ. వరుస :- 1 వ. వరుసవలె.
7 వ. వరుస :- 5 వ. వరుసవలె.
8 వ. వరుస :- 6 వ. వరుసవలె.

రెండు రంగుల ఊలుతో అల్లినది 3 అంగుళములు వెడల్పగువరకూ పై ఎనిమిది వరుసలు తిరిగి వేయుచూ, 4. వ. వరుసతోగాని, లేక 8 వ. వరుసతో గాని ముగియు నట్లు అల్ల వలెను. (మొట్ట మొదట నుండి అల్లినది $4\frac{1}{2}$ అంగుళములు పొడవు వచ్చును)

లేతరంగు ఊలు కత్తిరించి తీసివేసి, ముదురు రంగు ఊలుతో అల్ల వలెను.

* * తరువాత వరుస :- ని. 4, * ని. 1, ఊలు ముందుకు వేసి, స్లి. 1 పర్ల్‌వైస్. ఊలు వెనుకకు వేసి; స్టార్ దగ్గరనుండి తిరిగి వేయుచూ చిట్టచివర 4 కుట్లు నిట్టు అల్ల వలెను

తరువాత వరుస :- పై వరుస వలె అల్ల వలెను.

తరువాత వరుస :- ని. 4, * స్లి. 1. ఊలుముందుకు వేసి; ప. 1, ఊలు వెనుకకు వేసి, పా. స్లి. స్టి. ఓ; స్టార్ దగ్గరనుండి తిరిగి వేయుచూ చిట్ట చివర 4 కుట్లు నిట్టు అల్ల వలెను (అప్పుడు సూదిమీద 80 కుట్లు వచ్చును) * *

తరువాత మొట్ట మొదట ప్రారంభించినపుడు వేసిన 4 వరుసలు నమూనా వేయుచూ 35½ అంగుళముల పొడవగు వరకూ అల్లవలెను. ముగించునపుడు 2. వ వరుసతోగాని, లేక 4. వ. వరుసతోగాని పూర్తి అగునట్లు అల్ల వలెను.

తరువాత వరుస :— ని. 4 * తరువాత కుట్టులో నిట్టు రెండుసార్లు చేయుచూ, స్టార్ దగ్గరనుండి తిరిగివేయుచూ చిట్ట చివర 4 కుట్లు నిట్టు అల్ల వలెను. (అప్పుడు సూదిమీద 152 కుట్లు వచ్చును)

లేతరంగు ఊలు చేర్చి, మొట్టమొదట రెండు రంగుల ఊలు కలిపి అంచు అల్లుటకు అల్లిన 8 వరుసలు 3 అంగుళములు వెడల్పగు వరకూ అల్లి, ముగించునపుడు 4 వ. వరుసతో గాని లేక 8. వ. వరుసతో గాని పూర్తి అగునట్లు అల్లవలెను (మొట్ట మొదటనుండి 38½ అంగుళములు పొడవుండును) లేత రంగు ఊలు కత్తిరించితీసివేసి, ముదురురంగు ఊలుతో రెండు స్టార్స్ ( * * ) మొదలుకొని రెండు స్టార్స్ ( * * ) వరకు నున్న వరుసలను తిరిగి వేయవలెను. (అప్పుడు సూదిమీద 80 కుట్లుండును)

ముదురు రంగు ఊలుపయోగించి 1½ అంగుళములు మఫ్లర్ ప్రారంభించి నపుడు చేసిన మాదిరిగా వేసి తరువాత వదులుగా కాస్టాఫ్ చేయవలెను

మెక్ అప్ :— అల్లిన దంతను ఇస్త్రీచేసి రెండు చివర లందు లేతరంగు ఊలుతో కుచ్చు పెట్ట వలెను.



గ్రంథసమీక్ష :

## పుష్పాంజలి

శ్రీ సాహిత్యజ్యోత్స్న పరిషత్‌వారు ప్రప్రథమంగా ప్రచురించిన పుష్పగుచ్ఛమిది. ఇందు వివిధ ప్రసిద్ధ రచయితల గద్యపద్యాలను సేకరించి "పుష్పాంజలి" అని నామకరణమిడి, ఆంధ్రలోకానికి అందజేసేరు. ఇందులో శ్రీ అ. నాగభూషణరావు, (ఎమ్.ఆర్.బి.టి.) శ్రీ మహేంద్రాడ వేంకటజగన్నాథస్వామి, (ఆయుర్వేద విశారద) శ్రీ వసంతరావు వేంకటరావు, (ఎమ్.ఎస్,సి.) అత్యాడ వెంకటశాస్త్రి (విద్వాన్) మొదలైనవారి వ్యాస ప్రసంగములున్నాయి. సాహిత్యారాధకులంతా పరిషత్‌కు తగు ప్రోత్సాహ సహకారాలు యివ్వాలి.

ఈ ప్రచురణ వలయువారు శ్రీ సాహిత్యజ్యోత్స్న పరిషత్, బూరవెల్లి (వయా) ఆముదాలవలస, శ్రీకాకుళం జిల్లా అని వ్రాయాలి. వెల తెలియదు.

* * *

## స్వీకారము

### రెడ్లచరిత్రము, కల్పవల్లి.

ప ద్య కా వ్య ము.

గ్రంథకర్త : కొత్త భావయ్యచౌదరి.

దొరుకుచోటు : సంగం జాగర్లమూడిపోష్టు,

గుంటూరుజిల్లా.

రెడ్లచరిత్రము వెల : 0—8—0

కల్పవల్లి వెల : 1—0—0



సారధి వారి

# "అంతా మనవాళ్ళే"

రచన, సంభాషణలు — కొండేపూడి లక్ష్మీనారాయణ. పాటలు - తాపి, కొండేపూడి. సంగీతం - మాస్టరు వేణు. ఫొటోగ్రఫీ - కమల్ ఘోష్. విన్సెంటు. దర్శకుడు - తాపీ నిర్మాత - సి. వి. ఆర్. ప్రసాద్.

నటీనటులు - కృష్ణకుమారి, జమున, హేమలత, సూర్యకాంతం, ఎస్. వి. రంగారావు, సి. ఎస్. ఆర్. నరసింహారావు. పెరుమాళ్ళు మొదలగు వారు.

సత్యం తండ్రి కొద్దిరోజుల క్రిందట పోయాడు. తల్లి రత్తమ్మ, చెల్లెలు శారద. స్వగ్రామంలోనే ఉంటారు. సత్యం అక్క వరలక్ష్మి (పినతండ్రి కూతురు) గారింట్లో ఉండి చదువు కుంటుంటాడు. రత్తమ్మ మరిది చిదంబరం సత్యం శ్రేయస్సు కోరినవాడని నమ్మి ఆస్తిపాస్తులు చూడ టానికి పవర్నామా పట్టా ఇస్తుంది. సత్యం బావ జగన్నాధం.

భవానీ పురం జిల్లాకోఆపరేటివ్ స్టోర్సు ప్రెసిడెంటు. ఆయనకు తోడు స్టోర్సు డైరెక్టర్లు - ఆయన మామ చిదంబరం. హరిజన హాస్టలు మేనేజరు పూర్ణయ్య. మెడికలు షాపు ప్రొపయిటరు వైకుంఠం, మార్వాడీ సేటు, వీరందరూ లోకుల సొమ్ము దోచుకు తింటుంటారు. చిదంబరం సత్యం ఆస్తినంతా అమ్మి, ఇంకా అప్పులు కూడా చేసి కూతురుపేర పెద్ద మేడ కట్టిస్తాడు. అప్పుల వాళ్ళ వత్తిడికి తట్టుకోలేక చిదంబరం పరారీ అవుతాడు. ఆస్తిపోయిన సత్యం గత్యతరంలేక స్టోర్సులో గుమస్తాగా కుదురు తాడు. ఇక జగన్నాధం ముఠా నడిపిస్తున్న మోసాలు గ్రహిస్తాడు.

భవానీ పురంలోనే 'కాగడా' పత్రిక వెలువడు తూంటుంది. 'కాగడా' సంపాదకుడు. రావు ఊళ్ళో జరిగే అన్యాయాలు, మోసాలు, జంకులేకుండా తనపత్రిక ద్వారా బయట పెడుతూంటాడు. రావు కూతురు విమల. సత్యం క్లాసుమేట్సు. జగన్నాధం ముఠా వారు చేసే అక్ర మాలు కూడా 'కాగడా' లో పడుతూంటవి. ఇందుకు సత్యమే కారణమని వారు జగన్నాధంతో చాడీలు చెప్పటం సాగిస్తారు. కూతురు గిరిజ సత్యంపై చెప్పిన పితూరీవల్ల సత్యాన్ని ఇంట్లోంచి వెళ్ళగొడతాడు. జగన్నాధం అయిన వాళ్ళంతా తమకు చేసిన ద్రోహాలతో రత్తమ్మ, కృంగి, కృశించి పోతుంది. మందుకు పోయిన సత్యం తిరిగి వచ్చేలోగా తల్లి చనిపోవటం, చెల్లెలు తప్పిపోవడం జరుగుతవి. చివరకు రావు విమలలు సహాయంతో సత్యం చెల్లెలు శారదను కలుసుకోటం, జగన్నాధం ముఠావారి అక్రమాలను బయటపెట్టి పోలీసులకు వప్పజెప్పటంతో చిత్రం ముగించారు.

బంధుమిత్రులలో అంతా మనవాళ్ళవలెనే, మన శ్రేయోభిలాషుల వలెనే కన్పిస్తారు. కాని అందులో కొందరే అటువంటి వారని ఉద్బోధించే ఇతివృత్తంతో కొత్తపోక డలతో చిత్రంకథ కూర్చ బడింది. సంభాషణలలో వ్యం గ్యమూ, హాస్యమూ, మిశితమై బాగా రక్తి కట్టినవి. ఇందుకు కొండేపూడి లక్ష్మీనారాయణగారు అభినంద నీయులు. నటీనటులందరు తమతమ పాత్రలను సమర్థ తతో నిర్వహించారు. "పాడరా ఓ తెలుగువాడా" "అడే వారెవరూ, నిజాన్ని, అడ్డేవారెవరూ" అన్న రెండుపాటలు చాలా బాగున్నాయి. గిరిజ, వేశ్య వనజ చేసిన నృత్యాలు, అలీముఠా ప్రదర్శన (జగన్నాధం ముఠావారి అక్రమాలనీ హరిజన బాలికలు చేసిన ప్రదర్శన) ఇత్యాదులు చిత్రాన్ని పొడిగించటానికి తప్ప వేరొక విధంగా సహకరించ లేక పోయినవి. చిన్నలోపాలను మినహాయిస్తే సారధి వారి "అంతా మనవాళ్ళే" ఉత్తమ శ్రేణికి చెందిన చిత్రమనే చెప్పవచ్చు.

కుమారి ఎ. వి. రావు.



జెమినీవారి

# "రాజీ, నా ప్రాణం"

డైరక్టరు-: మహాదేవన్, మాటలు, పాటలు-: దేవులపల్లి కృష్ణశాస్త్రి, సంగీత దర్శకులు-: యస్. హనుమంతరావు, నృత్య దర్శకుడు-: రాయ్ చౌదరి.

నటీనటులు-: టి. ఆర్. రామచంద్రన్. శ్రీరంజని. శ్రీరామ్, ఎస్. వి. రంగారావు. జూనియర్ లక్ష్మిరాజ్యం, వెంకుమాంబ, సురభి కమల.

రామూ ఇల్లూ వాకిలీ లేనివాడు. పువ్వులమ్మే గుడ్డి పిల్ల రాజీ కారు క్రింద పడబోయే సమయంలో ఆమెను రక్షిస్తాడు. క్రమంగా ఒకరిమీద ఒకరికి గాఢమైన అనురాగం ఏర్పడుతుంది. రామూ ఒకనాడు గొప్ప కంటి వైద్యుడైన రఘునాథ్‌ను కలుసుకుంటాడు. రాజీ సంగతి అతనికి చెప్పి, అతని వల్ల రాజీకి తిరిగి చూపు రావటానికి అవకాశముందని తెలుసుకుంటాడు. కాని ఆపరేషన్‌కు వెయ్యి రూపాయిలవుతుందని డాక్టర్ అంటాడు. ప్రాణాలకు కూడా తెగించి రామూ శరభయ్య అనే గొప్ప ముష్టి యుద్ధవీరునితో పోటీ చేస్తాడు. ఉపాయముతో అతనిని జయించి వెయ్యి రూపాయిల బహుమతి పొందుతాడు. కాని తుంటరులాధనము నపహరిస్తారు. తరువాత తాగి ఒళ్ళు తెలియని ఒక ధనవంతునితో పరిచయము వల్ల అతని వద్ద వెయ్యి రూపాయిలు తీసుకొని రాజీకి ఆపరేషన్ చేయిస్తాడు. రాజీకి కళ్ళు వస్తాయి. ఈలోగా రామూపై చోరీ నేరం మోపబడటము వల్ల అతను ఆ సమయానికి జెయిలులో వుంటాడు. రాజీ రామూ కోసం వెతుకుతూ వుంటుంది. ఇంతలో ఆమె మేనత్త చనిపోవటం, ఇంటి యజమాని ఇల్లు ఖాళీ చెయ్యమని వత్తిడి చెయ్యటంతో ఆమె బ్రతుకు దుర్భరమై ఆత్మహత్య చేసుకో ప్రయత్నిస్తుంది. కాని డాక్టరు తల్లీ, చెల్లెలు ఆమెను రక్షించి డాక్టరు దగ్గర నర్సుగా నియమిస్తారు. డాక్టరుకు రాజీపై ప్రేమ కల్గుతుంది. రాజీ రామూను మరువలేదు. డాక్టరు తనకు చేసిన ఉపకారానికి కృతజ్ఞత చూపాలనుకుంటుంది. డాక్టరు తల్లి తన ఒక్క కొడుకుని కాపాడమని ప్రాధేయపడుతుంది. ఆమె మాట తోసివేయలేక రాజీ డాక్టరును వివాహమాడుతుంది. వారికి కల్గిన కుమారునకు 'రామూ' అని పేరు పెట్టుకుంటుంది. రామూ విడుదలై రాజీ సుఖంగా జీవించుతున్నదని తెలిసి సంతృప్తితో వెళ్ళిపోతాడు.

బీదవాడైన రామూను ఎవ్వరూ అర్థం చేసుకోరు. అతనికి మాట్లాడటానికైనా అవకాశమివ్వకుండా బైటికి గెంటించివేస్తారు. కాని అతని త్యాగము, అనురాగము ఎవ్వరూ గ్రహించరు. బీదవారిలోనైనా ఇంత గొప్ప గుణములు గలవారుండవచ్చని నిరూపించటమే ఈ చిత్రం యొక్క ముఖ్యోద్దేశము. రామూగా టి. ఆర్. రామచంద్రన్ ఉత్తమంగా నటించాడు. ముఖ్యంగా చివరి ఘట్టంలో అతని నటన ప్రశంసనీయం. రాజీగా శ్రీరంజని అతి సహజంగా నటించింది. త్రాగుబోతు ధనికుడుగా ఎస్. వి. రంగారావు అన్ని చిత్రాలలో వలెనే ప్రేక్షకుల మెప్పు నందుకోగలడు.

ముష్టి యుద్ధము, తాగిన ధనికుని ఆత్మహత్య, రూప పార్టీలో రామూ అవస్థ ఇటువంటి ఎన్నో వినోదాలు చిత్రంలో వున్నాయి. ఒకచోటనే పద్యగేయం ప్రవేశ పెట్టటం వల్ల ఆ సన్నివేశాలలో ప్రేక్షకులకు విసుగుదల పోయి ఉత్సుకత ప్రబలుతుంది. రాజీ మనస్సును అర్థం చేసుకునేందుకు కూడా ఉపకరిస్తుంది. నావికులు, పల్లెవారు చేసిన నృత్య ఘట్టంలో సెట్టింగులు బాగా వున్నవి. దర్శకుడు కే. జే. మహాదేవన్ గారు తమ ప్రతిభ చూపగల్గారు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు కొన్నిచోట్ల ప్రేక్షకులను రంజింప జేసే హాస్యంతో సంభాషణలు వ్రాశారు. మొత్తంమీద చిత్రం సంతృప్తికరంగానే వున్నది.

కుమారి ఎ. వి. రావు.



(48-వ పేజీ తరువాయి)

ఎన్ని రకాల వ్యవహారాలలో అతను తల దూర్చనిది లేదు. అన్యాయం గాని, అబద్ధం గాని, అవినీతి గాని, హింస గాని ఒక టేమిటి? కార్య సాధనకై ఎలాంటి పని నైనా చెయ్యటానికి వెనుకాడేవాడు కాడు. స్వపక్షాన్ని గెలిపించడమే అతని ప్రధాన లక్ష్యం. కనుక అతని మూలాన ఎందరో ఇల్లు వాకిలి పోగొట్టుకొన్నవాళ్లు లైనారు. అన్యాయంగా జైలులో పడి నరకబాధ ననుభవిం చారు. వాళ్ళ భార్యా బిడ్డలు పోషించేవాళ్ళు లేక కష్టాల పాలు దుర్మరణాల పాలైనారు.

రాత్రి పది గంటలు. కటిక చీకటి. వెంకట్రంగయ్య భోజనం చేసి ఖండువా పైన వేసికొని ఎక్కడికో బయలు దేరాడు. కొంత దూరం వెళ్ళాక ఒక సందులోంచి వెళ్లుతున్నాడు.

తనను ఎవ్వరో అనుసరించి వస్తున్నట్లు తోచి వెనుకకు తిరిగి చూడగా ఎవరో చేతిలో గట్టి కర్ర పట్టుకొని వస్తు న్నాడు. గఫూర్‌వలె దూకుడుగా నడుస్తున్నాడు. గఫూరే నేమో! వెంకట్రంగయ్యకు గఫూరుకు తాను చేసిన అన్యాయం జ్ఞాపకానికి వచ్చింది. గఫూర్‌కు వ్యతిరేకంగా తాను జమీన్ కేసు నడిపాడు. ఇంకా కొందరితో బాటు వాడికీ ఐదేండ్లు కఠిన శిక్ష పడ్డది. వాడు అప్పుడప్పుడు తప్పత్రాగి తన పేరెత్తి బూతులు తిడుతూ వెళ్లుతూండడం, అందరూ వినటం, తాను వినీ విననట్లు నటించడం జ్ఞాప కానికి వచ్చాయి. తాను కార్య సాధకుడుఅయినందున వాడు నిజంగా దోషి కాకపోయినా, నిజమైన దోషులు తన పక్షం వారైనందున వారిని తప్పించడం కోసం— తప్పిం చుకో శక్తి లేని గఫూర్‌కూ, యింకా కొందరికీ వ్యతి రేకంగా తప్పుడు సాక్ష్యం ఇచ్చాడు. తనది ఘరానా సాక్ష్యం కనుక ఆ దెబ్బతో వాళ్లు ఐదేండ్లు జైలుకు పోయారు. అందరిలోకీ వాడిది త్రాచుపగ, మళ్ళీ ఏ కేసులోనైనా ఇరికించి మళ్ళీ జైలుకు పంపాలి. అప్పటికి గాని వాడి తిక్క వదలదు, తన పరువు నిలవదు అని ఆలోచిస్తున్నాడు.

గఫూర్ త్రాగి ఉన్నాడు. తూగుతూ — "అరె! వెంకట్ రంగ .... యా .... అన్యాయం .... గా నాకీ జేల్‌కి పంపావు? ఈ ఐదేండ్లూ .... నాపిల్లల్ .... అన్యాయం ఐపోయార్‌రా .... నాఉసురు నీకీ - తగల్దూ అన్నవించూ" అనే మాటలతో దెబ్బమీదదెబ్బ, దెబ్బ మీదదెబ్బ గట్టిగాపడ్డాయి. తలపగిలి వెచ్చని నెత్తురుతో తలతడిసింది, వెంకట్రంగయ్యా స్పృహతప్పి కూలిపోయి కొంత సేపటికి మరణించాడు.

౧౪

మామూలుగానే కాలచక్రం తిరుగుతోంది. ఎప్పుడో మంగమ్మ రాలిపోయింది. తండ్రి పంచచేరింది సీత. ఆమెకు హిస్టీరియా ఫిట్లు యిప్పుడు రావటంలేదు.

ఎప్పుడూ అనాధ శిశువులను గురించే ఆలోచించే సీతారామయ్య అనాధశిశురక్షణాలయాన్ని స్థాపించి జిల్లా లోని తల్లితండ్రులూ, ఆస్థిపాస్తులూ లేని బాలురను దీక్షతో పిల్చుకవచ్చి పోషిస్తున్నాడు.

సీతారామయ్యలో గొప్పమార్పు జరిగింది. వృద్ధుడైనా మానసికంగా బాగాకోల్కొన్నాడు.

సేవాదృష్టి ఏర్పడింది. రామారావు దంపతులు ఆయ నను కనిపెట్టుకొని సేవచేస్తున్నారు. ఆయన ఆరోగ్యం బాగాఉంది. చాలాకాలం జీవించేలాగున్నాడు.

సీతారామయ్య మనుమళ్ళు మద్రాసు వైద్య కళా శాలలో చదువుతున్నారు. వారికి సహాయంగా కొంతకాలం సీత, కొంతకాలం లక్ష్మి ఉంటున్నారు. ఊరికే వుండడం ఎందుకని ప్రైవేటుగా కాశీవిశ్వ విద్యాలయ ప్రవేశపరీక్షకు చదువు తున్నారు. పెద్దమ్మాయి, చిన్నమ్మాయి, బాబు వాళ్ళకు చదువులో సహాయం చేస్తున్నారు.

సీతారామయ్య జిల్లాలోని అనాధశిశుసేకరణ పూర్తి కాగానే ఆంధ్ర రాష్ట్రంలో వుండే అనాధశిశువులనందర్నీ పోగుచెయ్యడం మొదలు పెట్టాడు. రాష్ట్రంలో ఉండే ధనవంతులైన ఉదారులందర్నీ యాచించి విరాళాలుసేక రించాడు. చాలా ఫండును పోగుచేసి బేంకిలో వేశాడు. భూవసతి, భవనాలు ఏర్పరిచాడు. బీదవిద్యార్థులకు ఉచిత విద్యాసౌకర్యాలతో ఒకఉన్నత పాఠశాలనుకూడా ఏర్పాటు చేశాడు. దానికి ప్రక్కగా బీదలకు ఉచిత వైద్య సౌక ర్యాలలో వైద్యశాలను ఏర్పాటు చేయాలని ఆలో చిస్తున్నాడు.

## ౧౫

బీదలకు ఉచిత వైద్యశాల ప్రారంభమైనది. విద్యాభ్యాసం పూర్తిచేసుకొనివచ్చి పెద్దమ్మాయీ, చిన్నమ్మాయీ సంస్థద్వారా సేవచెయ్యడం ప్రారంభించారు.

బీదలకు ఉచిత విద్యాదానం చేస్తున్న ఉన్నతపాఠశాల కళాశాలగా మారింది. బాబు చదువు పూర్తికాగానే అందులో ఆచార్యుడుగా పనిచేస్తున్నాడు. తన జీవితాన్నంతా సాహిత్య సేవలో గడుపవలెనని నిశ్చయించు కున్నాడు.

సీతా, లక్ష్మి నెమ్మదిగా 'బి. ఏ.' లైనారు. సేవా సంఘాల ద్వారా బహుముఖాలుగా సంఘసేవ చేస్తున్నారు.

సీతారామయ్య స్థాపించిన శిశు శరణాలయమూ, కళాశాలా, వైద్యశాలా భవనాలు విశాల మైదానప్రదేశంలో కన్నుల పండువుగా ఉన్నాయి. ఎందరో వచ్చిచూచి తోచిన సహాయంచేసి పోతుంటారు.

తనకు పదిలక్షలకుపైగా ఉన్న ఆస్థిలో మూడువంతుల ఆస్థిని ధర్మ సంస్థలకు వ్రాశాడు సీతారామయ్య. మిగిలిన ఆస్థిని రామారావు దంపతులు, ఇద్దరు మనుమరాళ్ళూ, మనుమడూ సమంగా సమిష్ఠిగా అనుభవించమని వ్రాసి యిచ్చాడు.

క్రమంగా ధర్మసంస్థల నిర్వహణబాధ్యతను స్వార్థ పరులు కాని వారి చేతుల్లో ఉంచాడు. సంస్థల ఆస్థినంతా వారికి స్వాధీన పరిచాడు. ధర్మ కర్తృత్వ సంఘంలో రామారావును ఒక సభ్యుడుగా నియమించాడు.

అది అతి పవిత్రమైన శ్రీ వైకుంఠ ఏకాదశిరోజు. బోసితాత, సీతారామయ్య వణకుతూ స్నాన ధ్యానాదులను నిర్వహించి, పాలూ పండ్లూ పుచ్చుకొని సుఖంగా పడుకొన్నాడు.

లేస్తూనే వణకుతూన్న శరీరంలో ఏదో అలజడిగా వుండటం గ్రహించి ఇంట్లోవున్న వారినందర్నీ పిల్చి చెప్పాడు — "నాకు దేహంలో ఏదోతెలియని వికారంగా ఉంది. ఇది బహుశా ప్రాణ ప్రయాణ సమయం కావచ్చు నని తోస్తోంది.

"మీరందరూ విద్యావంతులు. చెప్పవలసిన దేమీలేదు. తృప్తితోటీ, సంతోషంతోటీ చనిపోతున్నాను. విచారపడ వలసిందేమీలేదు. బీదవారిని, కులమత వివక్షత లేకుండా, ఆదరించి వారికి సేవ చేయుటే భగవత్సేవ, అని తెలుసు కున్నాను. అవిధంగా ఆచరించి మీ జీవితాలను కూడా సార్థకపరచు కోవలసిందిగా ఆశీర్వదిస్తున్నాను" అని మౌనంగా కళ్ళుమూసుకొని తూలిపోయాడు.

"హంస లేచిపోయింది. ఎంతమంచిచావు ఎంత పుణ్యాత్ముల కొస్తుంది ముక్కోటి నాడు మరణం, ఈ రోజు వైకుంఠ ద్వారాలు తెరచి ఉంటాయిట పుణ్యం చేసుకొన్నవాళ్ళ కోసం" అనుకుంటూ సీతారామయ్య యింటి ముందు క్రిక్కిరిసి ఉన్నారు ప్రజలు.

భజనలతో, మేళతాళాలతో, ఉత్సవంచేస్తూ, ఊరేగిస్తూ సీతారామయ్య భౌతిక దేహాన్ని ఆబాల గోపాలమూ సాదరంగా తీసుకువెళ్ళి అంత్య క్రియలు జరిపారు.

(స మా ప్తం)

---

# గ మ ని క

కారణాంతరాలవల్ల, "మేవాడ్ పతనం" సీరియల్ యీ సంచికలో ప్రచురించలేకపోయితిమని మా చదువరులకు తెలియ జేస్తున్నాము. వచ్చే సంచికలో యథాప్రకారముగా ప్రచురించగలమని ఆశిస్తున్నాము.

— సంపాదకురాలు.



ఉత్తమ
సంఘసేవా కార్యక్రమాల,
సాంఘిక సౌకర్యాల
నిమిత్తం

## వీటిపై పెట్టుబడి పెట్టండి

'భారత' భారతదేశాన్ని సుభిక్ష మొనర్చడానికి తోడ్పడే గొప్ప అభివృద్ధి ప్రణాళికల నిర్మాణకు ద్రవ్యసహాయం నిమిత్తం భారతదేశంలో సేకరింపబడుతున్న పెట్టుబడులను వృద్ధిచేయుడానికి ఎంత, స్వల్పమగు మొత్తమైనా అవసరమే.

**స్వల్పాదాయము అను** కూడబెట్టుకునే ప్రణాళిక సంపూర్ణ భద్రతతో పాటుగా వర్ధిల్లి విరాజిల్లుతున్నది.

**దీనివృద్ధికి కారణం** - ఇది ప్రస్ఫుటముగా కనిపిస్తున్న తక్షణావసరాన్ని తీర్చుతున్నది - ఇది మీ క్షేమానికి మీ దేశక్షేమానికి మీసొమ్ము వినియోగపడునట్లు చేస్తున్నది.

| | |
|---|---|
| నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేట్లు | రు. 100 పెట్టుబడికి 12 సంవత్సరాలలో రు. 150/- లభించగలదు. |
| పది సంవత్సరాల ట్రెజరీ సేవింగ్స్ డిపోజిట్లు | సాలీనా 3½% వడ్డీ చెల్లింపు: 10 సంవత్సరాలు మూలధనానికి భద్రత. |
| పోస్టు ఆఫీసు సేవింగ్సు బ్యాంకు డిపోజిట్లు | రు. 10, 000 వరకు డిపోజిట్లపై 2% వడ్డీ చేర్చబడుతుంది. (జాయింటు అక్కౌంట్ల విషయంలో రు. 20,000/- వరకు డిపోజిట్లపై) |

లభించే వడ్డీపై భారతీయ ఆదాయపు పన్ను ఉండదు.

భారతదేశ ప్రణాళిక ఒసగుతున్నది

## ఎక్కువ పాఠశాలలు - ఎక్కువ ఆసుపత్రులు ఎక్కువ రోడ్లు

ఇంకా ఇతర వివరాలకు, లేక/మరియు ఈ పెట్టుబడులను గురించిన నిబంధనలకై నేషనల్ సేవింగ్స్ కమిషనర్ పేరట గోర్టన్ కాజిల్, సిమ్లా-3 విలాసానికి గాని, మీ రాష్ట్రంలోని రీజినల్ నేషనల్ సేవింగ్స్ ఆఫీసరుకుగాని వ్రాయండి.

A.C. 512 T6

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్ మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు. |
| పారిశ్రామిక విద్యాలయము (గవర్న మెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) | : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చు కూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్న మెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము. |
| వస్త్రములపై అద్దకపుపని మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత- | : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభలో నడుపబడుచున్నవి. |
| టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ | : స్త్రీలకు మైపు,—గవర్న మెంట్ పరీక్షలకు శిక్షణ. |
| మహిళా మందిరము | : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక. |
| నిర్మలాదేవి గ్రంథాలయము | : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము. |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ, శిశువుల, సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. |
| ముద్రణశాఖ | : ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి వుచితంగా నేర్పబడును. |

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా జేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.

Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 24-A, Luz Church Rd., Madras

# ఆంధ్రమహిళ



MARCH '54 ANDHRA MAHILA ANNAS 8

# గమనిక

'ఆంధ్ర మహిళ' స్త్రీల సచిత్ర మాస పత్రిక. ఆంధ్ర లోకంతో సన్నిహితానుబంధం ఏర్పరచుకొని, మహిళా సంఘంలో నూతన ప్రబోధం కలిగించే ఆశయంతో ఆంధ్ర మహిళా సభ తరఫున "ఆంధ్ర మహిళ" పత్రిక 10 సం॥రములనుండి ప్రకాశితమగుచున్నది.

దీనియందు స్త్రీల మనోవికాసానికి తోడ్పడే వ్యాసములు, కథలు, నాటికలు, పిల్లలకు బాలానందం మొదలగు గద్య పద్యాత్మకములైన పలురకముల రచనలున్నవి. సాంఘిక రాజకీయ విషయములు, ప్రభుత్వము వారు దేశాభివృద్ధికై జరుపుచున్న సంక్షేమ కార్యక్రమాలు, స్త్రీలకుపయుక్తమైన గృహ పరిశ్రమలు మున్నగు వానిని గూర్చి మాసామాసముయిందు ప్రకటింపబడును.





చిన్నమాంబా విద్యామందిరము
ఆంధ్ర మహిళా సభ.

# ఆంధ్ర మహిళ

స్త్రీల విజ్ఞాన వికాశాల్ని పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాస పత్రిక

వ్యవస్థాపకురాలు :

## శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

యం.యే., బి.యెల్.,

సంపాదకురాలు :

## శ్రీమతి చన్నఘంటమ్మ

యెం.యే.,యెల్.టి.,

సంవత్సర చందా ఆరు రూపాయిలు.

ఆంధ్ర మహిళా సభవారిచే స్థాపించబడిన ముద్రణాలయములో
ముద్రితము.






వాహినీ చిత్రము

# పెద్దమనుషులు

రచన
డి.వి.నరసరాజు

నిర్మాత-దర్శకుడు
కే.వి. రెడ్డి B.Sc. (HONS)

మనిషికి ప్రాణంకంటె గూడ నీతిప్రధానం!
యీపరమసత్య నిరూపణే యీ చిత్రానికి
ప్రధాన లక్ష్యం!

# ఆంధ్రమహిళ

సంపుటి 10 :: మార్చి '54 :: సంచిక 11

ముఖచిత్రం :— కేంద్ర సంఘ సంక్షేమమండలి స్త్రీల సలహా సంఘ సభ్యురాండ్రు మదరాసునందలి ఆంధ్ర మహిళా సభను పరీక్షింప వచ్చిన సందర్భమున తీసిన ఛాయాచిత్రము.



సంపుటి 10 :: మార్చి '54 :: సంచిక 11

# ఆంధ్రులు ఆదర్శకులుకావాలి - వెనకడుగుతగదు.

ఆవేళ 1946 అక్టోబరు 1 వ తేదీ............

"మన చరిత్రలో ఒక చిరస్మరణీయమైన దినం. ఈరోజున మహాత్మా గాంధీ సూచించిన నిర్మాణ కార్యక్రమ అష్టాదశ సూత్రాల్లో ముఖ్యమైన 'మద్యపాన నిషేధం' ప్రారంభిస్తున్నాం. మద్యపాన నిషేధంవల్ల ప్రభుత్వాదాయానికి, పథక నిర్వహణానికి ప్రబలమైన చిక్కులున్నాయి- ఈ దురభ్యాస నిర్మూలనంవల్ల ప్రజలకు, ముఖ్యంగా పేద జనావళికి, సంప్రాప్తించే సాంఘిక- ఆర్థిక- నైతిక శ్రేయస్సుల కోసరం వీటి నెదుర్కోడానికి ప్రభుత్వం కృతనిశ్చయమైయుంది. ప్రజాసందోహాల స్థితిగతులు బాగు పరచి వారికి సేవజేయడమే ప్రభుత్వ ప్రధానోద్దేశ్యం. నేనట్టి ప్రజాసేవకుల్లో మొదటి వాణ్ణి. మద్యపానం మన ప్రజల్ని పీల్చి పిప్పిజేసింది. అసంఖ్యాక కుటుంబాల్ని కూలదోసింది. లక్షలాది గృహాల్లో నీతి-శాంతి- భద్రత- సౌఖ్యాల్ని పారదోలింది. ఇలాంటి మద్యపానాన్ని నిర్మూలించడం ప్రజాశ్రేయస్సుకు ప్రధానోపాయం. ఇది మా ప్రధాన కర్తవ్యం. ఇందుకు మన ప్రజల అందరి సహకారం కోరుతూ ప్రస్తుతం 8 జిల్లాల్లో మద్యపాన నిషేధం ప్రారంభిస్తున్నాం." అంటూ అప్పటి ఐక్య మద్రాసు రాష్ట్ర ప్రధానామాత్యులు శ్రీ శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు కడపలో ఈ త్రాగుడు నిర్మూలన కార్యక్రమం ప్రారంభించేరు. వారి అను నాయకులతో సహా ఎనమండుగురు మంత్రులు మొత్తం 8 జిల్లాల్లోను ఈ శుభ కార్యక్రమ ప్రారంభోత్సవం జరిపేరు.

'ఆంధ్రులు' అందరికీ ఆదర్శ పూర్వకమైన మహత్కార్యం జరిపేరని ప్రపంచమంతా హర్షించింది. ప్రజలంతా హర్షామోదాలు ప్రకటించేరు. పేదస్త్రీలు కైమోడ్పులిచ్చేరు. ముఖ్యంగా (మగవారు మగువల మంగళ సూత్రాలు సహా తాకట్టుపెట్టి- ఇల్లూ వొళ్లూ గుల్లచేసుకుంటూ తప్పతాగివచ్చి తందనాలు తొక్కుతూ- ఆలు బిడ్డల్ని చావమోదుతుంటే— "ఈ విషమ దశ కెవరుకారకులో- మా ఉసురెవరుపోసుకుంటారో- పరమాత్మా నీవేసాక్షి- నీవే దిక్కు" అని గోడు గోడుమని దైవానికి దీనాలాపాలు పెట్టడం నిత్య దినచర్యయైపోయిన) పేద జనావళి కుటుంబాలు రాష్ట్రమంతటా కృతజ్ఞతా పూర్వకమైన వందన సమర్పణలు గావించేయి. ఇలా అన్ని అంతస్థులవారు ఐక్యకంఠంతో 'విజయీభవ'- 'దిగ్విజయీభవ' అంటూ నరకాసుర మర్దనరీతిని కల్లు అంగళ్లుండేచోట్ల మధురాసుర విగ్రహాలు నిలబెట్టి చిచ్చు అంటించి, పీడ తొలగిందని ఆనందించిన పర్వదినం ఆ దినం. గాంధీజీ మొదలైన మహామహులంతా "తథాస్తు" అని ఆశీర్వదించి, "ప్రకాశం అంటే- ఏమిటనుకున్నారు!" అన్నట్లు ఇతర రాష్ట్ర ప్రభుత్వాల్ని చూచి కనుసౌజ్ఞ గావించిన రోజు ఆరోజు. "కేసరి యన నీకే సరి"యని ఆంధ్రులంతా సగర్వంగా అభినందించిన రోజు అది.

# ఆంధ్రులు ఆదర్శకులుకావాలి — వెనకడుగుతగదు.

ఈవేళ— ఇప్పటికి సుమారు 7½ సం॥రాలయిందని చెప్పొచ్చు- చరిత్రలో ఎన్నో ముఖ్యసంఘటనలు జరిగిపోయేయి. స్వరాజ్యం సాధించేం— స్వరాష్ట్రం కూడ సంపాదించేం. మళ్ళీ మన ప్రకాశంపంతులుగారే ప్రథమ మంత్రులు, ప్రధానమంత్రులునై ఆంధ్ర రాజ్యాంగనౌక చుక్కాని చేబట్టేరు.

ఇలాంటప్పుడు- ఆంధ్రులంటే అన్ని రాష్ట్రాలవారికీ ఆదర్శప్రాయులు, మార్గదర్శకులు కావలసిన సమయంలో మద్యపాన నిషేధం రద్దు చేద్దాం అన్న ఉద్దేశం కలగడమే అతి శోచనీయమైన విషయం. రాష్ట్రాదాయం కూడగట్టు కొందుకు పైన వర్ణించినట్లు అనాథ స్త్రీల ఆలాపనలతో, వారి మంగళసూత్రాల అమ్మకపు ధనంతో, అమాయకులైన వారి భర్తల ఆయుర్దాయమూ, నీతీ బాహాటంగా అంగట్లో పెట్టి అమ్మిన విక్రయధనంతో నిర్మాణకార్యాలు గావించ డానికి ఆంధ్ర నారీలోకం ఎంత మాత్రం అంగీకరించదు. ఇందుకొక కమిటీని నిర్మించడం, వారొక నివేదికను సమర్పించడం, ఇవన్నీకూడ హర్షించదగ్గ విషయాలుకావు; గర్వింపదగ్గ కార్యాలుగావు. ఇంకా కావాలంటే, మద్య పాన నిషేధము ఇంతవరకూ ఎందువల్ల సరిగా అమలు జరుగలేదు, ఖచ్చితంగా దానిని అమలు జరుపవలెనంటే ఏవిధమైన ఏర్పాట్లు కావాలి, ఇలాంటి విషయపరిశీలనకు కమిటీ నియమిస్తే, అందరూ హర్షించపచ్చు.

మద్యపాన నిషేధం మార్చరాదు. ఇది ఏ ఒక్క రాష్ట్రానికి మాత్రమే సంబంధించిందికాదు. యావద్భారతావనికి సంబంధించిన విషయమిది. చరిత్రలో ముందుకుసాగిపోవలసిన రోజుల్లో అది వెనుకడుగౌతుంది. మళ్ళీ పేదల కుటుంబాల్లో కార్చిచ్చు పెట్టినవాళ్ళమౌతాం అని మహిళా లోకమంతా ఏకగ్రీవంగా తన అసమ్మతిని తెల్పుతూవుంది. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ ప్రెసిడెంటూ, ప్రభుత్వ డిప్యూటీ చీఫ్‌మంత్రీ— ఇంగితమెరిగిన ప్రతీ ఆంధ్రుడూ దీన్ని ఖండిస్తున్నారు.

తల్లి, బిడ్డ శ్రేయస్సుకోరి, నేతిముద్ద తినబెడుతుంది. అమాయకపు బిడ్డ, దాన్ని కక్కివేసి, మట్టినే తింటుంది: అంతమాత్రంచేత తల్లి ఊరుకుంటే తన కర్తవ్యాన్ని నెరవేర్చినది కాగలదా? నయాన్నా- భయాన్నా మంచిదన్నదే నేర్పుతుంది, నానా పాట్లూపడి! అలాగే అమాయకపు ప్రజానీకం ప్రొహిబిషన్‌ను సరిగా జరగ నీయడం లేదన్నంత మాత్రంచేత, ప్రజాశ్రేయస్సే ప్రధాన కర్తవ్యంగా పెట్టుకొన్న ప్రభుత్వం, మద్యపాననిషేధం రద్దు చేయరాదు.

రాష్ట్రాదాయం సన్నగిల్లితే- దాన్ని కూడదీయడానికి- అనేక సాధనలున్నాయి. ఆర్థిక దురంధరులైన అమాత్యశేఖరులకు, దూరదృష్టిగల ప్రజా ప్రతినిధులకు- ఇతరోపాయాలెన్నో ఉన్నాయి. అడ్డంకులుంటే వాటిని అధిగమించడంలోనే- ప్రజాహితానికై తాము చేబూనిన సత్కార్యాన్ని సాధించడంలోనే- తమరాజనీతిని ప్రదర్శించాలి.

ప్రభుత్వాదాయపులోటు భర్తీచేయడానికి వేరు మార్గాలు అన్వేషించాలి. మద్యనిషేధం ఖచ్చితంగా అమలు జరిపే విధానాలాలోచించాలి. అప్పుడు బీదల కుటుంబాలూ చక్కబడతాయి. దేశపిత గాంధీజీ విడిచి వెళ్ళిన అడుగు జాడల్లో నడిచి— ఆంధ్రులు అందరికీ మార్గదర్శకులు ఔతారు. అంతేగాని మద్యపాన నిషేధం రద్దుపర్చటం- వెనకడుగు వేయడం వంటిదిగాన- ఇది ఎంతమాత్రం తగదని ఆంధ్ర మహిళాలోకం మళ్ళీ హెచ్చరిస్తూ ఉంది.



# అశ్రుతర్పణ

## కీ. శే. శ్రీమతి దువ్వూరి నరసమ్మగారు

మదరాసు హైకోర్టు ప్రముఖ న్యాయవాదులు, ఆంధ్ర ఎడ్వకేటు జనరలునైన శ్రీ దువ్వూరి నరసరాజుగారి ధర్మపత్ని, కాకినాడ వాస్తవ్యులు శ్రీ చావలి రామసోమయాజులుగారి కుమార్తె, ఆంధ్ర మహిళా సభ యావజ్జీవ సభ్యురాలు, ఆంధ్ర మహిళా సభ యావజ్జీవ ట్రస్టీ శ్రీమతి కందా మాణిక్యాంబగారి సహోదరియునైన శ్రీమతి నరసమ్మగారు జనవరి 5-వ తేదీన తమ 42-వ ఏట స్వర్గస్థులైరి.

శ్రీమతి నరసమ్మగారు ఆంధ్ర మహిళా సభ వ్యవస్థాపకులలో ఒకరని చెప్పాలి. ఆదినుండి, మహిళా సభయొక్క ప్రతి చిన్న కార్యకలాపములోనూ ఎక్కువైన శ్రద్ధజూపుచూ వాటి అభివృద్ధికి అడుగడుగునా ప్రోత్సాహమిచ్చిన వ్యక్తి యీమె. ఏ సందర్భములో ఏ విరాళానికని ఆమెను ఆశ్రయించినా ఔదార్యముతో నిర్వాహకులను తగురీతిని సంభావించెడి స్వభావము యీమెది. పోయిన ఆగస్టులో ఆంధ్ర మహిళా సభ ప్రసూతి కేంద్రములో పని ప్రారంభించినప్పుడు మంచాలు, ఉయ్యాలలు కొనునిమిత్తము, అడిగీ అడుగుట తోడనే రూ. 1000/-లు విరాళముగా నిచ్చిన దాత.

ఈమె కుమార్తెలు నృత్య విద్యనభ్యసించి, సభ తాలూకు ప్రతి ప్రదర్శనలోనూ చక్కగా పాల్గొనుచుందురు. ఇట్లా అనుక్షణమూ సభ పట్ల వీరు చూపిన బాంధవ్యము, అభిమానము ఎప్పటికీ మరపురానివి.

ఈమెకు 5 గురు కుమార్తెలు, ముగ్గురు కుమారులు - పండువంటి సంసారము, పసికూనలైన బిడ్డలను విడచి అకాలమృత్యువుకు బలికావడం మిక్కిలి శోచనీయమైన విషయం. ఆదర్శగృహిణి యైన ధర్మపత్నిని గోలుపోయిన శ్రీ నరసరాజుగారికి, పసితనములోనే మాతృ వియోగము కలిగిన వారిబిడ్డలకు 'ఆంధ్ర మహిళ' హృదయపూర్వక సానుభూతిని తెలుపుచున్నది.

# ఆంధ్ర మహిళా సభ

—:o:—

## హిందీ తరగతులు

ఎప్పటివలె ఆంధ్ర మహిళా సభలో హిందీ తరగతులు ప్రారంభించి యున్నాము. ప్రాథమిక, మధ్యమ తరగతులకు శిక్షణనిచ్చి, మొన్న జరిగిన ప్రాథమిక పరీక్షలకు ఐదుగురు విద్యార్థులను, మధ్యమిక పరీక్షలకు ఇరువురు విద్యార్థినులను పంపించియున్నాము.

తిరిగి ప్రాథమిక, మధ్యమిక పరీక్షలకు మహిళాసభలో శిక్షణ ప్రారంభమైనది. మార్చి 1–వ తేదీనుండి, ఆంధ్ర మహిళా సభ నర్సింగ్ హోమ్, అడయారునందు, మార్చి 8–వ తేదీ నుండి పారిశ్రామిక విద్యాలయ భవనములు, 7–ఎ రోజరీ చర్చిరోడ్డునందు, హిందీ తరగతులు, కుట్టు తరగతులు ప్రారంభమగును.

ప్రాథమిక తరగతికి శిక్షణ ఉచితము.

మధ్యమ తరగతికి మాసరుసుము రూ. 1–0–0.

కుట్టు తరగతికి మాస రుసుము రూ. 1–8–0.

ఏ తరగతులలో జేరువారైనా, ప్రవేశరుసుము రూ. 2–0–0, మాస చందా 1–0–0 తప్పక కట్టి తీరవలెను.

## సంగీతపు తరగతులు

కర్ణాటక సంగీతము వీణ, గాత్రములలో లోయర్ గ్రేడ్ పరీక్షలకు శిక్షణ, ఆంధ్ర మహిళా సభ లజ్ చర్చ్ రోడ్డు భవనములలో, ప్రారంభింప బడినది.

శిక్షణ మాసరుసుము రూ. 5–0–0. ప్రవేశ రుసుము రూ. 2–0–0. సభ్యత్వ రుసుము మాస మునకు రూ. 1–0–0.

మిగతా వివరములు సభకు మధ్యాహ్నం 3 గం॥ పైన వచ్చి తెలిసికోవచ్చును.

—అ. చన్నఘంటమ్మ.

---



# రాజకీయాలు

• శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు •

1954 జనవరి నాలుగో వారం మొదలుకుని ఫిబ్రవరి మూడో వారం వరకూ జరిగిన సంఘటనల్లో ఆంధ్రులకు అనుకూలమయిన ముఖ్యాంశాలు మూడు ఉన్నవి— (1) బెజవాడ దగ్గర కృష్ణానదికి రెగ్యులేటర్ - రోడ్ బ్రిడ్జి నిర్మాణానికి శంకుస్థాపన జరగటం. (2) నందికొండ దగ్గర కృష్ణానది మీద నిర్మించే ప్రాజక్టు విషయమై ఆంధ్ర, హైదరాబాద్ ప్రభుత్వాలకు సమాధానం కుదరటం. (3) హైదరాబాద్ నగరంతో సంస్థానంలోని తెలుగు ప్రాంతాలన్నిటిలోనూ తెలుగును అధికార భాషగా నిర్ణయిస్తూ హైదరాబాద్ ప్రభుత్వం ప్రకటించటం.

ఇంక భారత, అంతర్జాతీయ రంగాల్లో చెప్పుకోతగ్గ సంఘటనలు ఇవి— టర్కీ, పాకీస్థాన్‌లు రక్షణ సహాయ ఒప్పందం చేసుకునేందుకు నిశ్చయించటం, కొరియా, ఇండో-చైనా సమస్యలను చర్చించటానికి 5 అగ్రరాజ్యాలు ఏప్రిల్ లో సమావేశమయేందుకు అంగీకరించటం, తిరుక్కొచ్చి, పెప్సూ రాష్ట్రాల్లో ఎన్నికలు, బెంగాల్ లో ఉపాధ్యాయుల సమ్మె.

* * *

ఫిబ్రవరి 13 వ తేదీన ముఖ్యమంత్రి ప్రకాశంగారు కృష్ణానది మీద రెగ్యులేటర్ రోడ్డు బ్రిడ్జికి శంకుస్థాపన చేశారు. 4014 అడుగుల పొడుగుగల నిర్మాణం 1956 లో పూర్తి అవుతుంది. 295 లక్షలు ఖర్చవుతుంది. ప్రస్తుతం సాగయే 11 లక్షల ఎకరాలకు చాలిన నీరు దొరకటమే కాక, మరొక లక్ష ఎకరాలకు నీరు సప్లయి అవుతుంది. కిందటి సం॥ జరిగినట్లు ఆనకట్ట గండ్లు పడటం మొదలైన ప్రమాదాలు తప్పిపోతవి. గుంటూరు - బెజవాడ మధ్య ప్రాంతం అభివృద్ధి అయి, రెండూ కలిసే అవకాశం కూడా ఏర్పడవచ్చు.

ఇక్కడ కృష్ణా రెగ్యులేటర్‌తోపాటు అటు చిత్తూరు జిల్లాలో స్వర్ణముఖీనది ప్రాజక్టుకు కూడా శంకుస్థాపన జరిగింది. అది చిత్తూరు జిల్లా క్షామ నివారణకు కొంతవరకు తోడ్పడుతుంది.

కృష్ణానది మీద ఏ ప్రాజక్టు నిర్మించాలి అన్న విషయమై ఏర్పడ్డ అనిశ్చిత పరిస్థితి చాలా వరకు తొలిగిపోయిందని చెప్పవచ్చు. నందికొండ దగ్గర ప్రాజక్టు నిర్మించాలని హైదరాబాద్, ఆంధ్ర ప్రభుత్వాలకు అంగీకారం కుదరటమే కాక, ఆనకట్ట ఎత్తు విషయమై కూడా సమాధానం కుదిరినట్లు తెలుస్తున్నది. ఫిబ్రవరి నెలాఖరుకు ఈ విషయమై ఉభయ ప్రభుత్వాల నివేదికలూ కేంద్ర ప్రభుత్వానికి అందగలవు. ఈ నివేదికలను కేంద్రం పూర్తిగా ఆమోదించక్కరలేదని ప్లానింగు మంత్రి నందాగారు చెప్పటంవల్ల, ఆంధ్రులు చివరివరకూ జాగ్రత్తగా ఉండి, కృష్ణా-పెన్నార్ పెటకం తగలకుండా చూసుకోవలసిన అవసరం కనిపిస్తున్నది.

నందికొండ ప్రాజక్టు వల్ల నాగార్జునకొండ శిథిలాలు మునిగిపోవచ్చునని భయపడటం జరుగుతున్నది. అయితే ఆకారణం మీద కట్ట ఎత్తును తగ్గించటమో తలకుమించిన ఖర్చుతో కాలవలు మళ్లించటం మొదలైన పనులు చేసేదానికన్నా, ప్రాజక్టు పూర్తి అయే లోపల శిథిలాలప్రాంత పరిశోధనలన్నీ పూర్తి చేసుకోనటం మంచిది. అక్కడి పరిశోధనలు 30 ఏళ్ళ కింద ఉన్నట్లే ఇప్పుడు కూడా ఉన్నవన్న సంగతి గమనిస్తే, ఇటువంటి గండకత్తెర వ్యవహారంగా మార్చినప్పుడే, అక్కడ నిజంగా పని సాగుతుందని చెప్పవలసి వుంటుంది.

* * *

మార్చి 1వ తేదీ నుంచి హైద్రాబాద్, సికింద్రాబాద్ నగరాలతో సహా 9 తెలంగాణా జిల్లాలలోనూ, ప్రస్తుతం

కర్ణాటక, మరాత్వాడాలుగా ఉన్న జిల్లాలలోని 8 తెలుగు తాలూకాలలోనూ తెలుగే రాజభాషగా ఉంటుందని హైద్రాబాద్ ప్రభుత్వం ఫిబ్రవరి 17 వ తేదీన ప్రకటించింది. మరాత్వాడాలో మరాఠీ, కర్నాటక్‌లో కన్నడం అధికార భాషలుగా ఉంటవి. దీనివల్ల హైద్రాబాద్ తెలుగు ప్రాంతాలకు భద్రత ఏర్పడ్డదని చెప్పవచ్చు. ముఖ్యంగా హైద్రాబాద్ నగరం విషయంలో సందేహాలకుతావు లేకుండా పోతుంది. కర్నూల్లో జరిగే రాజధాని-హైకోర్టు భాగవతం మేళనాయకులు దీనిని దృష్టిలో పెట్టుకోవలసి వుంటుంది. ప్రాంతీయ భాషలకు ప్రాధాన్యత వచ్చింది కదా, ఇంక హైద్రాబాద్ విభజన ఎందుకు అని విభజనను ప్రతిఘటించేవాళ్ళకు వాదించే అవకాశాలు లేకపోలేదు.

ఇట్లాగే మైసూరులో తెలుగు ప్రాంతమయిన కోలార్ జిల్లా విషయమై జనాభా లెక్కల శాఖ వారు అది తెలుగు మెజారిటీ ప్రాంతమేనని తమ నివేదికలో స్పష్టంగా తెలియజేశారు. తమిళనాడులో జేరిన చంగల్పట్టు, సేలం, ఉత్తరార్కాట్ జిల్లాలలోని తెలుగు ప్రాంతాల విషయం, ఒరిస్సాలోని తెలుగు ప్రాంతాల విషయంకూడా తెలుగువాళ్ళు చూసుకోవలసి వున్నది. ఫిబ్రవరి 2 వ తేదీన మద్రాసులో సమావేశమయిన తమిళ నాయకులు చిత్తూరులోని తమిళ గ్రామాలకోసం ఆందోళన చేస్తే తమకు నష్టం ఎక్కువ అని అభిప్రాయపడి, 'ఉన్నతాధికారస్థాయి'లో నష్టపరిహారం చేసుకోనటం మంచిదని నిశ్చయించుకున్నట్లు తెలుస్తున్నది.

ఆంధ్ర ప్రభుత్వం ఈ విషయమై జాగ్రత్త పడాలి. సరిహద్దు సమస్యల ప్రత్యేకోద్యోగిని నియమించి పని ప్రారంభించటం సంతోషించదగ్గదే కాని, రాష్ట్ర పునర్విభజన సంఘం దగ్గరా, తమిళ నాయకులు ఉద్దేశిస్తున్న 'ఉన్నతాధికారస్థాయి' లోనూ కూడా పట్టుదలతో వ్యవహరించాలి.

* * *

ఆంధ్ర ప్రజల ఆర్థిక జీవితానికి సంబంధించిన సంఘటనలుకూడా కొన్ని ఈ నెలలో జరిగినవి. ఫిబ్రవరి 8 వ తేదీన గుంతకల్లులో చేనేత పారిశ్రామిక సహకార నిర్వహణ క్రింద నూలు మిల్లు ప్రారంభించబడ్డది. ఇది 20 వేల మర కదుళ్లతో పని చేసే అవకాశం వున్నది. రాష్ట్రంలోని చేనేత పారిశ్రామికులందరికీ కావలసిన నూలును ఇది సప్లయి చేయలేకపోయినప్పటికీ, తాను చౌకగా సప్లయి చేయటాన మొత్తం మీద నూలుధరల్ని తగ్గించవచ్చును. చేనేత పరిశ్రమ నిలబడాలంటే ఆసరుకులు ఏదోవిధంగా మిల్లులతో పోటీ చేయక తప్పదు. అది వస్తువుల నాణ్యతమీదనే కాక, వాటి ధరమీద కూడా చాలా వరకు ఆధారపడిఉంటుంది. ఎగుమతి పన్నులు, అమ్మకం పన్నులు తీసివేయటమేకాక చౌక నూలును వారికి ఇప్పించాలి.

ఆంధ్ర ప్రాంతపు ఎగుమతుల్లో ప్రధానమయిన పొగాకు వ్యాపారానికి ఈ ఏడు బాగా దెబ్బతగిలింది. ముఖ్యంగా నాసిరకం పొగాకు చాలా మిగిలిపోవటం జరిగింది. ఈ సమస్యను పరిష్కరించే నిమిత్తం సిగరెట్ల ఫ్యాక్టరీని పెట్టటం, విదేశాల్లో వ్యాపార వికాశాలను పెంచటం అవసరమని సూచించబడ్డది. అసలు నాసి రకాలను వీలయినంతవరకూ తగ్గించుకుని రావటమూ, సరుకు నాసిగా తిరగబారిపోకుండా మొదటినుంచీ శాస్త్రీయ పద్ధతులతో జాగ్రత్త తీసుకోనటమూ కూడా అవసరం.

బియ్యపు పంటలో ఆంధ్ర ప్రాంతం మిగులు రాష్ట్రంగా చెలామణీ అవుతున్నది. అయితే మద్రాసు రాష్ట్రానికి సప్లయి చేసే ధాన్యాన్ని సంపాదించటం కోసం ప్రభుత్వం నిర్బంధ ధాన్యసేకరణ పద్ధతిని పరిమితంగా ప్రవేశపెట్టవలసి వచ్చింది. నెలకు 400 మణుగులు, ఆపైన ధాన్యం కొనే లైసెన్సు వ్యాపారస్తులు తమ సరుకులో 40 వంతుల్ని మిగులు జిల్లాలో 10 ఎకరాలు అంతకుపైన ఉన్న ఆసాములు ఎకరానికి 2 బస్తాల చొప్పునా ప్రభుత్వం నిర్ణయించే ధరలకు ఇవ్వాలని నిర్దేశించబడ్డది.

మద్యనిషేధాన్ని ఉంచటమా, తీసివేయటమా అన్న విషయమై ఆంధ్ర ప్రభుత్వం నియమించిన విచారణ సంఘం ఫిబ్రవరి 17 వ తేదీన ప్రభుత్వానికి తన నివేదికను సమర్పించింది. ఈ నివేదికమీద శాసన సభ చర్చ జరగ్గలదని తెలుస్తున్నది. పూర్తి నిషేధం ఫలించలేదు కనుక, మద్యపానాన్ని క్రమబద్ధం చేసి కంట్రోలు చేయవలసిందని కమిటీ సూచించిందని తెలుస్తున్నది. అంటే ఈ 'మితపానం' అమితంగా మారకుండా రేషనింగ్ ప్రవేశపెట్టాలని సూచన చేసినట్లు

కూడా తెలుస్తున్నది. ఇల్లు గుల్ల అయినా తాగటమే ప్రధానంగా పెట్టుకునే వాళ్ళను ఈ రేషన్లు ఆపలేవని వెనక జనం అనుభవించిన రేషన్లు నిరూపిస్తున్నవి.

* * *

ఫిబ్రవరి 22 వ తేదీ నుంచి ఆంధ్ర శాసనసభ బడ్జెట్టు సమావేశం జరపబోతున్నది. బడ్జెట్‌లో లోటును భర్తీ చేయటానికి భూమి శిస్తును పెంచటం జరుగుతుందని తెలుస్తున్నది. అందులో తిరిగి రాజధాని రభస జరగవచ్చు. అది కాక హైకోర్టును జూన్ 26 నుంచీ విశాఖపట్నంలో ఏర్పాటు చేయాలని ప్రభుత్వం ప్రతిపాదించబోతున్నది. రాజధాని, హైకోర్టు ఒకచోట ఉండాలని నడింపల్లి నరసింహారావుగారూ, పి. వి. జి. రాజుగారూ హెచ్చరిస్తున్నారు. కర్నూల్లో రెండూ వుండాలి, లేదా హైకోర్టు గుంటూరు రావాలని నరసింహారావుగారు చెపుతుండగా, రెండూ గుంటూరు- బెజవాడ ప్రాంతంలోనే ఉండాలని రాజుగారు చెపుతున్నారు. మధ్యాంధ్ర ప్రాంతానికి కనీసం హైకోర్టునయినా ఇవ్వకపోతే అన్యాయమని కాశీశ్వరరావుగారు అంటున్నారు.

శాశ్వత రాజధాని తేలే వరకూ మద్రాసులోనే ఉంచమని హైకోర్టు ఆంధ్ర న్యాయవాదులు విజ్ఞప్తి చేసుకుంటున్నారు. అయితే అసలు ఫలితం కర్నూల్లో జరిగే అహోబిల రహస్యం మీద ఆధారపడి ఉంటుంది.

* * *

పాకిస్థాన్, టర్కీలు పరస్పర రక్షణ సహకార ఒప్పందం చేసుకునేందుకు నిశ్చయించినవని ఫిబ్రవరి 19 న అధికారరీత్యా ప్రకటించబడ్డది. మధ్యప్రాచ్య ముస్లిం రాజ్యాలతో ఒక కూటమిని ఏర్పరచాలని ఎదురుచూస్తున్న అమెరికా ఇంక పాకిస్థాన్‌తో కూడ సైనిక ఒప్పందం చేసుకుంటుందని అమెరికన్, బ్రిటిష్, కరాచీ రాజకీయ వర్గాలు సూచించారు. టర్కీతో అమెరికాకు ఇంతకుముందే సైనిక ఒప్పందం కుదిరి ఉన్నది. ఇది కేవలం ముస్లిం రాజ్యాల శ్రేయస్సుకోసమేనని పాకిస్థాన్ ప్రధాని ప్రచారం ప్రారంభించి, ఇతర ముస్లిం రాజ్యాలను కూడా ఆకర్షించ ప్రయత్నిస్తున్నారు. అంటే ఇండియా అభ్యంతరాలను లక్ష్యపెట్టకుండా అమెరికా దక్షిణాసియాను యుద్ధరంగంగా చేయటం ఖాయపడినట్లే.

కమ్యూనిస్టుల జోక్యం రాకుండా చేసుకోవాలంటే, ముందు అమెరికన్ ఆక్రమణను కోరి తెచ్చుకోనటం మంచిదని వాదించే వర్గాలు కొన్ని మన దేశంలో ఉన్నప్పటికీ, మొత్తంమీద యావద్భారతదేశమూ, పాకిస్థాన్‌లో ప్రభుత్వేతరపక్షాలూ, ఈజిప్టు నాయకులూ ఈ ప్రమాదంలో పడవద్దని యావత్తు ముస్లిం ప్రపంచాన్ని హెచ్చరిస్తున్నారు. ఇటీవల నేపాల్‌లో కూడా కొందరు విదేశీయులు అంతర్జాతీయ సంస్థల ప్రతినిధులన్న పేరుతో కుతంత్రాలు ప్రారంభించినట్లు ప్రధాని కోయిరాలా చేసిన హెచ్చరిక గమనించ తగ్గది.

* * *

జనవరి 25 నుంచీ అమెరికా, రష్యా, బ్రిటన్, ఫ్రాన్సుల విదేశాంగ మంత్రులు మూడు వారాలపాటు బెర్లిన్‌లో సమావేశాలు జరిపి, ఏప్రిల్ 26 వ తేదీన కొరియా సమస్యను చర్చించటానికి చైనాతోసహా అయిదు అగ్రరాజ్యాలు సమకూడాలని నిశ్చయించుకున్నారు. అందులో ఇండో- చైనా మొదలైన సమస్యలు కూడా చర్చించబడతవి. కొరియామీద చర్చ జరిపేటప్పుడు ఉత్తర, దక్షిణ కొరియాలు, ఇండో-చైనామీద చర్చించేటప్పుడు ఫ్రాన్స్ నెలకొల్పిన కీలుబొమ్మ ప్రభుత్వాలూ, కొన్ని ఆసియా దేశాలూ ఆహ్వానించబడతాయని తెలుస్తున్నది. దీనివల్ల కొరియాసభలో తటస్థదేశాలు- ముఖ్యంగా ఇండియా- పాల్గొనే అవకాశం తప్పిపోయిందని పూర్తిగా చెప్పటానికి వీలులేదు. యుద్ధ విరమణ ఒప్పందం ఖైదీల సమస్యవల్ల భగ్నమయిందని వాదించే చైనా, రష్యాలు ఆ సందర్భంలో సాక్ష్యమివ్వటానికి ఇండియాను పిలవగలవనే నమ్మవచ్చును.

ఇంతవరకూ కేవలం ప్రత్యర్థిగా మాత్రమే చైనాతో సంభాషణలు జరుపుతున్న అమెరికా ఈ నిర్ణయం వల్ల చైనాకు 5 అగ్రరాజ్యాల్లో స్థానం ఇవ్వక తప్పలేదు.

కొరియాలో ఖైదీలపరటా తటస్థ సంఘం ఫిబ్రవరి 21 అర్థరాత్రితో రద్దయిపోయింది. భారత సైనికులు తటస్థ దేశాలకు పోదలచిన ఖైదీలను వెంటబెట్టుకుని ఇండియాకు

# రాజకీయాలు

తిరిగి వస్తున్నారు. ఖైదీ శిబిరాల్లో హత్యానేరాలు చేసిన వారి విచారణకు మిత్రరాజ్యాధికారులు కానీ, సమితి కార్యదర్శి కానీ తోడ్పడనందువల్ల వారిని మిత్రరాజ్యాధి కారులకే ఇండియా అప్పగించవలసి వచ్చింది.

♦ ♦ ♦

చైనాతో సమావేశానికి అమెరికా ఒప్పుకోనటానికి ఫ్రాన్స్ ప్రోద్బలమే ప్రధాన కారణమని తెలుస్తున్నది. యుద్ధంతో ప్రాణం విసుగెత్తి పోయిన ఫ్రాన్స్ తన ప్రతిష్టకు భంగంరాని పద్ధతిలో కమ్యూనిస్టులతో రాజీ చేసుకుందామని ఉద్దేశించటం వల్ల అమెరికాను ఈ సమావేశానికి ఒప్పించింది.

ఇండోచైనా యుద్ధ రంగంలో ఫ్రాన్స్ నెగ్గ లేదని ఏనాడో తేలిపోయింది. అమెరికా సప్లయిలతో నాటకం సాగుతున్నది. అమెరికా భూసేనలను మాత్రం పంపదలచుకోలేదని ప్రకటించ బడ్డది. దక్షిణ కొరియా సేనలను పంపుతానని అన్నది కాని ఫ్రాన్స్‌కే అది వ్యర్థమని తోచింది.

ఇండోచైనాలో ఇండియా జోక్యం కలిగించుకుని కొరియాలో మోస్తరు యుద్ధవిరమణ జరింపించాలని ఐక్యరాజ్య సమితి వర్గాలు కొన్ని అభిప్రాయ పడుతున్నవి. ఫ్రాన్స్ వైఖరి దీనికి అనుకూలంగా ఉన్నట్లే కనిపిస్తున్నది. ప్రధాని నెహ్రూ ఇండోచైనా సమస్యపై త్వరలోనే ఒక ప్రకటన చేయబోతున్నారు.

* * *

బెర్లిన్ సభలో జర్మనీ సమస్యా పరిష్కారానికి కూడా ఫ్రాన్స్ ఒక ఉచితమయిన సూచన చేసింది. అఖిల జర్మనీ ఎన్నికలపై తనిఖీ చేసేందుకు ఒక తూర్పు జర్మన్ ప్రతినిధి, ఒక పశ్చిమ జర్మన్ ప్రతినిధి, ఒక తటస్థరాజ్య ప్రతినిధి పరిష్కార్ హోదాలోను పనిచేయాలని సూచించింది. కాని కొరియా తటస్థ సంఘ వ్యవహారాన్ని చూసివున్న ఇతర మంత్రులు ఏభయాలవల్లనో దీనికి అంగీకరించలేదు. జర్మనీ సమస్య, దానిమూలంగా ఆస్ట్రియా సమస్య తేలకుండానే ఉండిపోయినవి.

* * *

ఫిబ్రవరి మూడో వారంలో తిరువాన్కూర్ - కొచ్చిన్ రాష్ట్రంలోనూ, పాటియాలా - తూర్పు పంజాబ్ సమాఖ్యలోనూ, తిరిగీ కొత్త శాసన సభలకు ఎన్నికలు ప్రారంభమయినవి. ఈ తడవ ఎన్నికల ఫలితాలు అన్నిచోట్లా పోలింగ్ అయిన తరవాతనే ప్రకటించ బడతవి. రెండు రాష్ట్రాల్లోను పండితనెహ్రూ వంటి అతిరథ మహారథులు వెళ్ళి కాంగ్రెసు తరఫున ప్రచారం చేశారు.

♦ ♦ ♦

ఫిబ్రవరి నెల మొదటినుంచీ పశ్చిమ బెంగాల్‌లో సెకండరీ స్కూళ్ళ ఉపాధ్యాయులు ఎక్కువ జీతాల కోసం సమ్మె చేస్తున్నారు. సమ్మెకు సానుభూతిగా ప్రజలు సాగించిన ఉద్యమాలు తీవ్రరూపందాల్చి కాల్పులు జరిగే వరకూ వ్యవహారం సాగింది. కరువు భత్యం కొంత పెంచటానికి ముఖ్యమంత్రి అనుకూలత చూపిస్తున్నారు.

తిరుకొచ్చిలో ఉపాధ్యాయులు - ముఖ్యంగా కొచ్చిన్ ప్రాంతీయులు - తమ కష్టాలను కాంగ్రెసు నాయకులు గమనించక పోవటంవల్ల కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఎన్నికల్లో ప్రచారం చేస్తున్నారు. ప్రభుత్వ విద్యాసలహా సంఘం ప్రస్తుతం పాఠశాలల స్థాయి పడిపోవటానికి ఉపాధ్యాయుల 'కనిష్టి' జీతాలే కారణమని హెచ్చరించింది.






మూలం: ద్విజేంద్రలాల్‌రాయి. అనువాదం : శ్రీమతి మాణిక్యవల్లి.

[జరిగినగాథ :— 'మేవాడ్' రాణా అమరసింహుడు దేశంలో శాంతినీ, ప్రజల సౌఖ్యానందాలనూ కాపాడదలచి, మొగలాయిలతో సంధి చేసుకోదలుస్తాడు. అతని పెత్తండ్రి కూతురు సత్యవతి మెరుపు తీగలా వచ్చి, ఆ ప్రయత్నాన్ని మాన్పిస్తుంది. మొదటి యుద్ధంలో మేవాడ్ గెలుస్తుంది. ఢిల్లీ చక్రవర్తి ఆ అవమానంతో క్రుంగిపోయి యేవిధంగానైనా మహాబత్‌ఖాను మేవాడ్‌పై దండయాత్రకు పంపాలని ప్రయత్నిస్తూ వుంటాడు. ఈ లోపున అమరసింహరాణా మహాసేనాని గోవిందసింహుడు తన కూతురు కల్యాణి మతాంతరుడైన తన పతి మహాబత్‌ఖాను పూజిస్తోందన్న కోపంతో ఆమెను యిల్లు వెళ్ళ గొడతాడు. ఈ వార్తను తండ్రి ద్వారా తెలుసుకున్న మహాబత్‌ఖా ఉగ్రుడై, మొత్తం హిందూ జాతినే నాశనం చేస్తానని శపథం పట్టి, ఆ ఆశయ సాధనకనుగుణంగా మేవాడ్‌పై దండెత్తడానికి తన అనుకూలతను ఢిల్లీ చక్రవర్తికి తెలియచేస్తాడు. తరవాత గజసింహుని నాయకత్వాన మేవాడ్ గ్రామాలను తగలబెట్టించి, ప్రజలను నరికి, దేశాన్ని శ్మశానంగా మారుస్తాడు. అయితే యితడు జన్మతహా రసపుత్రుడూ మీదు మిక్కిలి అమర సింహుని పెత్తండ్రి కొడుకూ కావడాన నామ మాత్రమైన బలగంతో మొగలు సేనాపారావాన్ని యెదుర్కోడానికి వచ్చిన రసపుత్రుల సాహసానికి ముగ్ధుడౌతాడు. తాను ఆ వీర జాతికి చెందిన వాడనే అనే భావం జ్ఞాతమవుతుంది. మేవాడ్‌ను జయించినా, రాణా జోలికి పోడు; దుర్గ ప్రవేశం కూడ చేయడు. అది శత్రులోకం ఆలోచించవలసిన పని అని భావిస్తాడు. ఇక చదవండి.]

———: o :———

మ : అవిగో ! కాలిపోతూన్న వూళ్ళు ! జనం యెలా రోదిస్తున్నారో ! ఓ హిందువుల్లారా ! మామతం గొప్ప తలుచుకుని చావండి ! ఇప్పుడైనా మీ దర్పం, స్పర్థ అణిగాయా !

(సైనికులతో కళ్యాణి ప్రవేశిస్తుంది)

మ : (సైనికులతో) ఆవిడ యెవరు?

మొ. సై : మాకేం తెలియదు మహాప్రభో. దోవలో కలుసుకుని ఆవిడంతటావిడే వచ్చింది.

మ : (కల్యాణితో) నువ్వెవరు?

క : ఆ విషయం తెలుసుకుని ప్రయోజనంలేదు.

మ : అయితే యెందుకొచ్చినట్టు?

క : న్యాయార్థినై వచ్చాను!

మ : ఏవిషయంలో?

క : మీ సైనికులు మా అన్నయ్యను చంపేశారు !

మ : (సైనికులతో) అవునా?

మొ. సై : చిత్తగించండి మహాప్రభూ ! మేం ప్రజల్ని నరుకుతూంటే యీావిడ అన్న అడ్డొచ్చాడు. కొట్లాటలో చచ్చిపోయేడు.

మ : (కల్యాణితో) ఆమాట నిజమేనా?

క : నిజమేకాని వీళ్ళు నిష్కారణంగా ప్రజాహననం ప్రారంభించారు. ఆ నిర్దోషుల్ని రక్షించబోయిన మా అన్నయ్యను కూడా చంపేశారు.

మ : మీ అన్నగారు జోక్యం కలిగించుకుని వాళ్ళ మార్గాని కడ్డువచ్చినట్టేగా?

క : కావచ్చు కాని, వాళ్లది ధర్మ మార్గం కాదే!

మ : అది యేమార్గమైనా నా అనుజ్ఞానుసారం వర్తించారు. ఇందులో వాళ్ల తప్పేం లేదు. (సైనికులతో) మీరు వెళ్ళొచ్చు.

(సైనికులు వెడతారు)

క : అయితే యీ నరహత్యలన్నిటికీ కారకులు మీరా?

మ : అవును.

క : గృహదహనాలకీనా?

మ : ఆం.

క : నమ్మలేను. మీరంత నిష్ఠురులుకారు.

మ : నాగురించి నీకేం తెలుసు?

క : నా ఆరాధ్యదేవత స్వభావమే నాకు తెలియదా!

మ : నీమాటలు అర్థం కావటంలేదు.

క : నన్ను గుర్తించలేదా? ప్రభూ! సరిగా చూడండి, నేను కల్యాణిని.

మ : (స్ఫురణ నభినయించి) నువ్వా, కల్యాణీ, అయితే వీళ్ళు బలిగొన్నది మన అజయసింహుణ్ణా?

క :(నిట్టూర్చి) కష్టయాత్రలో నన్ననుసరించిన సోదరరత్నం. మీ ధ్యాననిమగ్ననై, మీ ప్రేమే ధృవతారగా నా జీవిత నౌకను, అనంత ప్రపంచ సాగరాన విడిచిననాడు, రక్షకత్వం వహించిన ఆప్తబాంధవుడు. నా రక్షణార్థం మీ దుష్ట కింకరులతో తలపడి ఒకసారి గాయపడగా, ఒక పూరిగుడిసెలో తల దాచుకుని సేవ చేసి తీర్చుకున్నాను. భిక్షాటన చేసి పోషించుకున్నాను. (గుడ్ల నీరు వొత్తుకొని) అలాంటి నా బహిః ప్రాణాన్ని అంతం చేశారు. అయ్యో! నాథా! ఇంక నే నెలా బ్రతకను!

మ : క్షమించు కల్యాణీ!

క : ఈ ప్రజా హననానికి నిజంగా మీ ఆనతే కారణం?

మ : ఆం! ఆ రాజపుత్రజాతి నాశనమే నా లక్ష్యం!

క : (చెవులు మూసుకుని) రామ! రామ! ఇంత కాలంగా నే పూజించి, ధ్యానిస్తున్న ఆరాధ్యదేవత— యీ ఘాతుకులా! నామీద మృత్యుదేవతకేనా దయరాదు గదా! ఒకేసారి సోదరుని, స్వామిని కోల్పోయానే! అభాగ్యను! శ్రీరామచంద్రా నా పాట్లు పగవాళ్లకు వద్దు (తల పట్టుకుంటుంది)

మ : నా చర్యకు కారణం తెలుసా—!

క : తెలియదు ప్రభో! తెలుసు కోవాలని కూడా లేదు. ఇంతవరకు మిమ్మల్ని దైవసమానంగా పూజిస్తున్నాను. ఈ క్షణాన్న నా భ్రమ తొలిగింది. ఇప్పటినుండి మీరు నాకు పరమ శత్రువులు. మొగలాయిల్ని మించిన శత్రువులు. అవును. వారికీ నాకూ ఎటువంటి సంబంధం లేదు. పైగా కాఫర్లను వధించాలని వారి ధర్మం చెబుతోంది. ఇంక మీరు, యీ దేశీయులు. మీ నాళాల్లో ప్రవహించేది స్వచ్ఛమైన రాజపుత్ర రక్తం. అయితే యేం! తుచ్ఛమైన ధనాని కాశించి విద్వేషపూరితులై స్వజాతి నాశనానికి పూనుకున్నారు. అయ్యో! నాథా! మీరు మొగలుల్ని కూడా మించిపోయారు గదా! వాళ్లు మేవాడ్ విజయాన్నే కాని సర్వనాశనాన్ని కోర లేదు. ప్రజల్ని చంపి, యిళ్ళు తగలబెట్టాలని వారు తలచ లేదు. మీరు చూడండి, ఆకలిగొన్న బెబ్బులుల్ని, మేకల మందపై తోలినట్టు మీ సైనికుల్ని ప్రజలపై ఒదిలారు. ఆకాశం నిర్దోషుల ఆర్తనాదాలతో ప్రతి ధ్వనిస్తోంది! అబ్బా! ఇలాంటి దేశద్రోహులికి శిక్ష యేమీ లేదుకాబోలు!

మ : కల్యాణీ, అసలు నిన్ను గురించిసుమా నే నస్త్రం చేతబట్టింది.

క : అసత్యం.

మ : కాదు, కల్యాణీ. మీ తండ్రి మహమ్మదీయుల్ని ద్వేషిస్తూ ఆ కారణాన నిన్నిల్లు వెళ్లగొట్టాడని విన్న క్షణంలో మేవాడ్‌కు విరుద్ధంగా కత్తిబట్టాను.

క : కావచ్చు. కాని యేధర్మ సూత్రం ప్రకారం ఒక్కని అపరాధానికై సర్వజాతి నాశనానికి పూనుకున్నారు !

మ : ఒక్క రావణుడి అత్యాచారం వల్ల లంకంతా ధ్వంసం కాలేదూ ! అదీగాక ముసల్మానుల మీద ద్వేషం ఒక్క మీ తండ్రికే కాదు, హిందువులందరికీ వుంది. పోతే దాన్ని మీ తండ్రి ఒక్కడూ వ్యక్తపరుస్తున్నాడు. కాబట్టి నేను హిందువులజాతి అహంకారానికి ప్రతీకారం చేస్తున్నాను.

క : కాని మొగలు సేనాధిపతీ, అది జన్మతహా ముస్లిమైన వాడు చేయవలసిన పని. హిందువులు మహమ్మదీయ వ్యతిరేకులని మతాంతరులయ్యేటప్పటికే మీకు తెలుసు. అయినప్పటికీ యిస్లాంను స్వీకరించారు. అంటే ప్రతీకారవసరాన్ని కొని తెచ్చుకున్నట్టే కదా ! మరి రేదో అన్యాయానికి ప్రతి చేస్తున్నామని తృప్తి పడటా లెందుకు? ప్రభూ ! ఈపనిని చేయించేది మీలో ఉన్న 'మహమ్మదీయత్వం' కాదు. అహంభావం— "నేను" అనే అహం.

మ : (లోలోపల) ఆఁ ! ఆమాట నిజమేనా?

క : వ్యక్తిగతమైన మీ ద్వేషంతో మేవాడ్ సర్వనాశనానికి పాల్పడ్డారు ! ఇదీ మీ ధర్మం ! శౌర్యం ! మానవత్వమూను ! ఈశ్వరా నే కట్టుకున్నవన్నీ వట్టి గాలి మేడలా !

మ : కల్యాణీ—

క : చాలు ! చాలు ! నాకళ్ల గంతలు విడ్డాయి. ఇంత వరకు పవిత్రమైన మన వివాహ సూత్రానికి విచ్ఛేదమే లేదని నమ్మాను. మనల్ని విడదీయగల శక్తి భూమండలం మీద లేదనుకున్నాను. అందుకే ఒకప్పుడు మహాగర్వంతో "ఆ పవిత్ర సూత్రాన్ని తెంచే శక్తి యెవరికుంది?" అని ప్రశ్నించుకున్నాను. కాని యిప్పుడు తెలిసింది జన్మలో మనం కలుసుకోలేమని.

శీత శైలము భాతి నా భ్రాత శవము
నిలిచి యున్నది మనమధ్య నిదియకాక
స్వీయ దేశీయ సోదర శోణజలధి
అధిగ మింపంగ రానట్టి అడ్డుమనకు.

(ఊర్ధ్వ ముఖియై) పరమేశ్వరా ! ఎంగిలి కాశించే నికృష్టుల్ని, స్వజాతి రక్త దాహులైన దుష్టుల్ని చూసి నప్పటికీ నీమీద విశ్వాసం మాత్రం సడలకుండా వుంది!

(వెళ్లి పోతుంది)

## మొదటి రంగం

స్థలం : ఉదయపురరాజ ప్రాసాదం. సమయం: రాత్రి,

(మానసి కూర్చుని ఉండగా రాణా ప్రవేశిస్తాడు.)

మానసి : యుద్ధంనుంచా రాక, నాన్నగారూ?

రాణా : అవునమ్మా. అబ్బా ! ఉష్ !

మా: ఏం జరిగిందేమిటి నాన్నగారూ?

రా: ఉండమ్మా, ఒక్కమాటు మాట్లాడించకు. అబ్బా ! ఆ అవస్థ అనుభవైక వేద్యమే !

మా: యుద్ధంలో—

రా: అబ్బే ! ఈసారి యుద్ధమే లేదు. రణాంగణంలో అగ్ని వర్షం కురిసింది. దానితో మన సేన భస్మీపటలమై పోయింది.

మా: అదేమిటి?

రా: ఏమో ! ఏమిటో ! నాకంతా అయోమయంగా వుంది. అది పిడుగుల వర్షమో ! ఏదైనా శాపఫలం ప్రచండాగ్ని రూపంలో ప్రత్యక్షమయిందో ! ఒక్క క్షణం కళ్ళు మూసుకున్నాను. అంతలో ఏదో తేజస్సుల మెఱుపులా దేహం మీదుగా దూసుకుపోయింది; హృదయం కంపించింది. కళ్ళు విప్పే సరికి నిద్ర నుండి మేల్కొన్నట్టయింది. ఆ రణ భూమిలో మృత దేహ పరంపర మధ్య యేకాకిగా నిల్చునిపోయాను. అబ్బా! యేమి దృశ్యము !

మా: ఇలా కాస్సేపు కూచోండి నాన్నగారూ. మీ మనస్సు కలత చెందింది; కాస్త వుపచారం చేస్తాను.

రా: ఒంటరిగా దొరికినా నన్నెవరూ యెదుర్కోలే రెందువల్లో !

మా: మీ రపజయ మంగీకరించారా?

రా: వాచ్యంగా అంగీకరించలేదనుకో. అంత మాత్రాన మనం విజేతలం కాము గదా! అది కఠినమైన నగ్న సత్యం. అయితే వాళ్ళు నన్నెందుకొదిలేసేరో! ఆ మహా స్మశానంలో మహాబత్ ఖా, గజసింహుల్ని యెలుగెత్తి పిలుస్తూ తిరిగాను. ఒక్కరూ రాలేదు! ఎంచేతో చెప్పగలవా, మానసీ?

మా: ప్రశాంతంగా వుండండి నాన్నగారూ. ఒక్క క్షణం యేమీ ఆలోచించకండి.

రా: నాకున్నదల్లా ఒక్కటే ఆలోచన. మహాబత్ ఖా గెలిచాడు. కాని విజయ గర్వంతో ఉదయపుర దుర్గ ప్రవేశానికి రాలేదెంచేతనో?

మా: నాన్నగారూ, మీరు గెలుపొంద లేదే అనుకోండి. దానికి విచార మెందుకు? రెండు పక్షాలలో ఏదో ఒకటి ఓడి పోవాలి కదా!

గా: బాగా చెప్పావమ్మా. ఎవరికో ఒకరికి ఓటమి తప్పదు. మరి అలాంటప్పుడు నాకు విషాదం దేనికి?— కాని వాళ్ళు నన్నెందుకు చంపలేదంటావు?

(రాణీ వస్తుంది)

రాణా: రాణీ, ఒక గొప్ప సమస్య పరిష్కరిస్తావా?

రాణి : చెప్పండి, చూదాం.

రాణా: వాళ్ళు నన్నెందుకు చంపలేదు?

(రాణి ప్రశ్నార్థకంగా మానసివైపు చూస్తుంది)

రాణా: విను. ఆకాళ రాత్రి శవపు గుట్టల మధ్య యేకాకిగా వున్నాను. అబ్బా! ఆ దృశ్యాన్ని నువ్వూహించనైనా లేవు. పైన ఆకాశాన లెక్కకి మించిన చుక్కలు, క్రింద పృథ్విపై లెక్కకి మించిన శవాలు; మధ్యలో కొన్ని మింగేస్తున్న కటిక చీకటి. ఇదంతా చూసిన మీదట నేనూ మృతజీవినే అనిపించింది. "సప్రాణసజాగరితమైన మృత్యువు" నేమో అనుకున్నాను. ఆస్థితిలో కూడ మహాబత్ ఖానును పిలిచాను; కత్తి ఝుళిపించాను. కాని పిలుపే ప్రతిధ్వనించింది; ఖడ్గం గాలిలో దూసుకు పోయింది. తరువాత (రుద్ధ కంఠంతో) రణ రంగాన్ని కలయచూశాను. నక్షత్ర కాంతిలో నా రాజ్య సువర్ణ సౌధం ప్రళయ భూకంపంవల్ల ధ్వంసమైనట్లు కనబడింది. (మంద స్వరంతో) ఆ మహా స్మశానంలో గాలి విగత జీవుల ప్రాణవాయువుతో బరువెక్కిపోయింది. నాకు ఊపిరి పీల్చుకోవడం కష్టమైపోయింది. నే విడిచిన గాలి కూడ బరువు వల్ల క్రింద పడిపోయింది. చీకటయి పోయిందిగాని వెతికితే అది కనబడి వుండేది.

రాణి: అయినదేదో అయింది. ఇహ మనస్సు పాడుచేసుకుని యేం లాభం? నేనైతే మొదటే చెప్పాను!

రాణా: చెప్పావు నిజమే. మేవాడ్ చనిపోయింది. మృత కాయాన్ని బుజాన వేసుకు తీసుకొచ్చాను. వచ్చి చూస్తావా?

(తెర)

## రెండవ రంగం

స్థలం: మేవాడ్ రాజాంతఃపురంలో ఒక చిన్న మార్గం.

సమయం: రాత్రి.

(ఇద్దరు దాసీలు ప్రవేశం)

మొ.దాసి: అయ్యో! పెద్ద కాలంలో గోవింద సింహాజీ, కెంత కష్టమొచ్చింది! ఒక్కగా నొక్క కొడుకు పాపం!

రెం.దాసి: వాళ్ళ కెలాగా తెలుస్తుందనుకో. అయినా ఆ చారిణీరాణి శవాన్ని యింటిదాకా తీసుకురావడ మెందుకు చెప్పు?

మొ.దా: ఆవిడన్నీ అలాంటి పన్లే చేస్తుంది; యింకేం పని లేదు కాబోలు! గోవింద సింహాజీ చూశారా?

రెం.దా: అబ్బే! ఆయన యింట్లో లేరు. చారిణీరాణి కొడుకుని పిలవడానికి వెళ్ళాడు. చూడ్డాని కొచ్చిన జనంతో దొడ్డి నిండి పోయింది. చారిణీరాణి శవం దగ్గిరుంది.

మొ.దా: చీకట్లోనే?

రెం. దా: దూరంగా ఓ గూట్లో చిన్న దీపం మినుకు మినుకు మంటోంది. ఎవరక్కడ?

మొ.దా: ఎక్కడ?

రెం. దా: అదుగో, అక్కడ!

మొ.దా: (చూసి) రాజకుమారి. చూడు యెలా మారి పోయారో! కళ్ళు వాచిపోయాయి; పైట నేల జీరాడుతోంది. పిడికిళ్ళు బిగుసుకుపోయాయి.

రెం. దా: ఇలా ఒస్తున్నారు. పద, మనం పోదాం.

(ఇద్దరూ ఒక ప్రక్కనుండి నిష్క్రమిస్తారు; మానసి మరో ప్రక్క నుండి ప్రవేశిస్తుంది.)

మానసి: వెళ్ళిపోయావా! అజయా! ఇంక కనిపించవా! మృత్యువు అజయుని సైతం కబళించిందే! ఒక్కసారి నన్ను కలుసుకుని యేమీ మాట్లాడనైనా మాట్లాడకుండా వెళ్ళిపోయాడు! నిజమే? అబ్బా, తల తిరిగి పోతోంది. కళ్ళు మసకలు కమ్మాయి. దేహం శగలు, పొగలు కమ్ముతోంది. కాళ్ళకు నేల తగలడంలేదు; పైన కొండ లేదు. భూమ్యాకాశాలు స్వస్థానాన్ని తప్పలేదు గదా? నే నెక్కడున్నానో! (కొంతసేపటి తరువాత మెల్లిగా) కఠినాత్మను! ఎన్నడూ నోటారా మాటాడిన పాపాన బోలేదు. ఆనాడు - నా ప్రేమాణువు నర్థించి, దీన దృక్కులు బరపిననాడు - నా కృపాపాంగానికై తపించి, సోషిల్లిపోయాడు. అయినప్పటికీ పాషాణంలా పలుకక పోతిని. అందుకే నా అజయసింహుడు కోపగించి వెళ్ళి పోయాడు. నా అభిమానం చూర్ణంచేసి నేలవేసి కాల రాసి పోయాడు! అజయ! నీ పదపద్మాలపై వ్రాలి నా హృదయం చించి నీకు చూపాలనుంది. అమ్మా! అయ్యో! సమయం మించిపోయింది! (తెర)

## మూడవ రంగం

స్థలం: గోవింద సింహుని యింటిపెరడు. సమయం: రాత్రి. (గాలి జోరుగా వీస్తూ వుంటుంది. అజయసింహుని శవం దగ్గర సత్యవతి శవవాహకులు నిల్చుని వుంటారు. గోవింద సింహుడు రెప్పవేయకుండ శవాన్ని చూస్తూవుంటాడు)

గో: ఇది మావాడి మృతదేహం! సత్యవతీ, యిదెక్కడ దొరికింది?

స: రోడ్డు ప్రక్కని.

గో: ఈ అవస్థకు కారణం!

స: ఆ చుట్టుపట్లు నున్నవారి నడిగితే నిస్సహాయులైన గ్రామాణుల్ని హత్యచేసే మహబత్ ఖా సైనికులు కల్యాణిని పట్టుకు తీసుకు పోయినట్టు తెలిసింది.

గో: తండ్రీ! అజయా! ఎంతపని చేశావు! నాపశ్చాత్తాపం వెల్లడించి క్షమాభిక్ష నేనా వేడుకోనిచ్చావు కావుగదా! కోపోన్మత్తుడినై కళ్ళుకానని సమయంలో నువ్వు యిల్లు విడిచావేకాని నేను నిన్నేమీ అనలేదే! అయ్యో! వెనక్కి యెందుకు పిలిచాను కాను! ఎందుకు వెళ్ళనిచ్చాను! అయ్యో! అజయా! నువ్వు నాకు ప్రాణాధికుడవే! క్షమాభిక్ష వేడుకునే అవకాశమైనా యిచ్చావుకావు గదా! ఏంత అభిమానం! — వీడు నీ ముసలి తండ్రి! - చూడు, అజయ్!

స: దుఃఖమెందుకు గోవిందసింహాజీ? అజయుడు దీన రక్షణకై ప్రాణమిచ్చాడు.

గో: నిజమే, సత్యవతీ! అజయుడు దీనరక్షణకై ప్రాణ మిచ్చాడు — నిస్సహాయుల కంఠగా బోయి కన్నుమూ శాడు. విచారం దేనికి! పదండి, యధావిధి దహన సంస్కారం జరుపుదాం.

(అజయసింహుని ముఖం కప్పుతాడు. శవవాహకులు కట్టెను యెత్తబోతారు)

గో: ఉండండి! ఉండండి! ఇంకోసారి చూడనివ్వండి. అయ్యో! నా సర్వస్వమా! నావృద్ధాప్యానికి బలం నీవే కదా! నిరాశాంధకారానికి జ్యోతివికదా! ప్రియపుత్రా! ఒక్కసారి — అబ్బే సంతాపం దేనికి? సత్యవతీ నువ్వు నిజం చెప్పేవు. అజయుడు దీనరక్షణకై ప్రాణమిచ్చాడు. మేవాడ్ భూమా! రాక్షసీ! ఇందర్ని తిన్నా యింకా నీకడుపు నిండలేదూ? నువు చూస్తే పోవడానికి సిద్ధమై కూచున్నావు; కాని అందర్నీ మింగితేకాని వెళ్ళేట్టు కన బడదు. అయ్యో! బంగారం లాంటి నా సంసారం మట్టి పాలయింది — ఛా, ఛా, అజయుడు — నా అజ యుడు - పోయాడని యెవరన్నారు? అదుగో! అదుగో నాకేసి చూస్తున్నాడు! బ్రతికేవున్నాడు! అజయా! (మృతదేహాన్ని సమీపిస్తాడు. సత్యవతి అడ్డంగా వెడుతుంది)

స : ఊరడిల్లండి, గోవింద సింహాజీ. ఎంతవిచారించీ పోయిన వార్ని తేలేం. ఇంక మీకొమారుడు లేడు.

గో : ఆఁ! ఆఁ! లేడూ? కొడుకులేడూ? నిజమే ! లేడు ! మర్చిపోతున్నాను — అజయా ! అజయ్ ! నా జీవిత సర్వస్వమా ! (చేతులతో ముఖం కప్పుకుంటాడు)

స : గోవింద సింహాజీ, మీరు వీరవర్యులు. ఇలా అధీరులు కావడం బాగాలేదు.

గో : ఏమిటీ ! కొంచం గట్టిగా చెప్పు సత్యవతీ, వినిపించడం లేదు. నాలోరేగిన భయంకర తుపానుముందు మరోటేం వినపడ్డంలేదు. అయ్యయ్యో ఓ ! ఓ ! ఓ ! (గుండెలు పట్టుకుంటాడు)

(కల్యాణి వస్తుంది)

క : నాన్నా గారూ ! నాన్న గారూ !

గో : ఎవరది? కల్యాణియా ! సర్వనాశనీ, చూడు యేం చేశాడో. రాక్షసీ! నా అజయుని నీపొట్టబెట్టుకున్నావు. ఇప్పుడు నాకు తెచ్చి అప్పగించు!

క : హా ! సోదరా ! సోదరా ! (కళేబరంపై ఒరుగుతుంది)

గో : లే! నా అజయుణ్ణి స్పృశించకు ! దూరంగా పో, రాక్షసీ ! (చేయిపట్టుకు లాగేస్తాడు)

క :( లేచి కూర్చుని) నిజమేనాన్న గారూ ! నేరాక్షసినే ! నన్ను చంపెయ్యండి ! నా పేరు 'కల్యాణి' అని యెవరు పెట్టారు? నేను మీగృహానికి అశుభ కళికను– మేవాడ్ పాలికి ధూమకేతువును – ప్రపంచానికి సర్వనాశనిని ! నన్ను ప్రపంచం నుండి వేరు చెయ్యండి; ఆ మరుక్షణం మీ కష్టాలన్నీ గట్టెక్కుతాయి. నన్ను చంపండి! చంపెయ్యండి!– (తండ్రి ప్రక్క తలవంచుకు కూర్చుంటుంది)

గో : అబ్బా ! ఏమిటీ బాధ ! యమబాధ ! పిశాచనృత్యం! అశక్యం ! జగదీశ్వరా ! ఇంక భరించలేను !

స : గోవింద సింహాజీ, విలపించి అధీరులు కావద్దు. మీ వీర పుత్రునికి ఉచితరీతిని అంత్యక్రియలు జరపండి. మీ తనయుడు దీన రక్షణకై ప్రాణమిచ్చాడు.

గో : నిజం చెప్పావమ్మా ! నిజం చెప్పావు ! నా బిడ్డ దీన రక్షణకై ప్రాణ మిచ్చాడు. ఇంక దుఃఖపిల్లను. (కళ్యాణితో) నన్ను క్షమించమ్మా ! ఈ నష్టం నాకు గర్వకారణ మయింది. కాని— (కన్నీటితో) సత్యవతీ! బహు వృద్ధుణ్ణి ! మరీ—

క : నాన్న గారూ—

గో : (కంపిత స్వరంతో) కల్యాణీ ! రా తల్లీ, రా! నేనా యింటినుండి వెళ్ళగొట్టాను, భర్తా పరిత్యజించాడు. తల్లిలేని అభాగినివి. ఇలా రా, తల్లీ రా ! సతీమతల్లి నవమాన పరిచాను ! అందుకు పరమేశ్వరుడు నన్నీ విధంగా శిక్షించాడు ! పదండి నిర్ణీత కర్మ జరపండి.

(కట్టెను యెత్తబోతూ వుంటారు. మానసి వేగముగా ప్రవేశిస్తుంది. జుట్టు విడి, చీర చెదిరి వుంటుంది)

మా: ఆగండి ! ఒక్కసారి నన్నుకూడా చూడ నివ్వండి.

స : రాజకుమారీ!

మా: అజయ్ ! ప్రియతమ్ ! స్వామీ !

స : అదెలాగ, రాజకుమారీ?

మా: వినండి మీరంతా. నాకు అజయసింహునితో వివాహ మెప్పుడో అయింది. ఇంతవరకూ ఆ సంగతి లోకానికే కాదు నాకూ తెలియదు ! మనస్సులో– హృదయంలో– ఆత్మలో నిశ్శబ్దంగా జరిగిపోయింది— ప్రియతమ్ ! ఎక్కడి కెడతావు ! ఒక్కసారి కళ్ళు విప్పి చూడవూ, నే వచ్చాను, చూడవూ ! ఇప్పుడు నేను ప్రగల్భనైన నీ గురువును కాను; దయామయి అయిన రాజకుమారినీ కాను; నీ ప్రేమ భిక్షు వేడుకునే దుర్బల స్త్రీని ! దీనతమ భిక్షుకి కంటెనూ దీనురాలిని ! అజయ్ ! నిన్నెంతగా ప్రేమిస్తున్నానో నీ జీవితకాలంలో చెప్పలేక పోయాను ! ఈ క్షణం వరకూ దాని లోతు నాకే తెలియ లేదు ! నన్ను క్షమించు !

స : అయ్యో ! సంతాపంలో రాజకుమారి సైతం చిత్తస్థైర్యం కోల్పోతోందే! — మానసీ, వూరడిల్లు! అజయుడు దీనరక్షణకై ప్రాణమిచ్చాడు—

మా: నిజమేనా? జీవితం యీ రకంగా అంతం కావాలి ప్రియ శిష్యా! గురు స్థానాన్ని నేడు సువ్వాక్రమించు కున్నావు! నీ కీర్తి కాంతులు స్వర్గాన్ని ముంచెత్తి ధరికి తిరిగి వస్తున్నాయి. అంతే! పోతే అలా పోవాలి! గోవిందసింహాజీ యిటువంటి తనయుని గన్న మీరు ధన్యులు! ఇటువంటి పతిని బడసిన నేను ధన్యను! ఇది గర్వ సమయం కాని దుఃఖ సమయం కాదు.

గో: (కంపిత స్వరంతో) రాజకుమారీ! అజయుడు దీన రక్షణకై ప్రాణమిచ్చాడు. విచార మెందుకు? (భగ్న స్వరంతో) దేశం కోసం- (ఇంక మాట్లాడలేకపోతాడు)

మా: వ్యర్థం! వ్యర్థం! వ్యర్థం! దుఃఖం పొంగిపొర్లి సాంత్వన వచనాన్ని ముంచేస్తోంది. భరించలేను! అజయ్! అజయ్!

క : అమ్మా! ఇదంతా యేమిటీ! అది స్వర్గమా! దేవతలా! మనుషులా! నే నెవరూ? ఊః (మూర్ఛపోతుంది)

స : కల్యాణీ! కల్యాణీ!

గో: పిల్ల చచ్చిపోయింది! పోనీ. అంతా యేకంగా పోవచ్చు! కొడుకూ, కూతురూ, నేనూ, మేవాడ్ అంతా కలిసి పోతాం! అదుగో! మేవాడ్— నా ప్రాణాధికమైన మేవాడ్— పోతోంది. మునిగి పోయింది! ఇదుగో నేనూ వస్తున్నాను.

(పరిగెడతాడు)

(తెర)

(సశేషం)



# చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-

## ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

———: o :———

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహానిచ్చుటకు, సభ తరపున కొందఱు యువతులు నియమింపబడుదురు. ఈ ఉద్యమంలో ఒక ప్రత్యేక ప్రతినిధిగా వ్యవహరించి, ధనము వసూలు చేయుటకు భారత ప్రభుత్వమువారు, ఆంధ్ర మహిళాసభకు అధికారమిచ్చియున్నారు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని అన్ని వివరములు తెలిసికొనవచ్చును,

ఇంకొక విషయము— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయడల సభకు 1¼% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

ఉత్సాహ వంతులైన సోదరీమణులు, యింత వరకూ సభద్వారా నిల్వ సర్టిఫికెట్లు తీసుకున్న మొత్తము రమారమి రూ. 22000/- ఇందు మూలముగా సభకు వచ్చిన కమీషను రూ. 275/- ఇంకా పెక్కుమంది సోదరీమణులు యీవిధముగా సభద్వారా సర్టిఫికెట్లుకొని సహాయ పడవలెనని కోరుచున్నాను.

అ. చన్నఘంటమ్మ,
కార్యదర్శిని.

---



పబ్లిక్ దినోత్సవ సందర్భంలో న్యూఢిల్లీలో జరిగిన ప్రదర్శనాల్లో
ఒక రమ్య ప్రదర్శనం "రాకుమారి సంఘమిత్ర యాత్ర"

# స్త్రీలు — ఉద్యోగాలు

స్త్రీలశక్తి సామర్థ్యాల్నీ, కార్యదీక్షాపరత్వాన్నీ, నిర్వహణ లోని నిపుణత్వాన్నీ గ్రహించిన అమెరికా దేశంలో, ఆ ప్రభుత్వం పురుషులతోబాటు స్త్రీలకుకూడ ప్రతి గవర్న మెంటుశాఖల్లోను ఉద్యోగాలిచ్చి, స్త్రీల పురోభి వృద్ధికి అన్ని అవకాశాల్నీ కల్పిస్తున్నారు, చూడండి!

వాషింగ్‌టన్:—1953 సం. లెక్కలను బట్టి ఉద్యోగాలు చేస్తున్న స్త్రీల సంఖ్య, 'రిపబ్లిక్ నేషనల్ కమిటీ' స్త్రీల శాఖ ఈ క్రిందివిధంగా ప్రచురించింది:

దేశ మొత్తంలోనున్న 48 సంస్థానాల్లోను. 3,072 జిల్లా లున్నాయి. ఈ జిల్లాలన్నిట్లోను 12,000 మంది ఆఫీసర్లుగా పనిచేస్తున్నారు. స్త్రీలు కలక్టర్లుగాను, కోశాధికార్లుగాను, రిజిష్ట్రార్లుగాను, రికార్డర్లుగాను, ఆడిటర్లుగాను, గుమస్తాలు గాను నియమించ బడుతున్నారు. కొద్దిమంది న్యాయాధి పతులుగాను, ఎడ్మినిస్ట్రేటర్లుగాను, కంట్రోలర్సుగాను కూడ వున్నారు.

ఈవిధంగా స్త్రీలకు అవకాశాలు యివ్వడం వల్ల వారి శక్తి సామర్థ్యాలు ప్రపంచానికి చక్కగా నిరూపించటానికి సావకాశం ఏర్పడింది. 20 మంది స్త్రీలు మేయర్సుగా పని చేస్తున్నారు. చాలామంది సిటీకౌన్సిలర్సుగా వున్నారు. విద్యాశాఖలో కూడ చాలమంది వున్నారు. 3,000 మండి 10,000 వరకు జనాభాలున్న పట్నాల్లో స్త్రీలు 800 వరకు గుమస్తాలుగా పనులు చేస్తున్నారు. 300 మంది ట్రెజరర్లుగా వున్నారు.

289 మంది 4 రాష్ట్రాల్లో శాసన సభల్లో మెంబర్లుగా వున్నారు. 1920 సం. లో స్త్రీలకు వోటింగు హక్కు వచ్చింది. రాష్ట్రాల్లో ఎన్నుకోబడ్డ సంఖ్య 31. వారిలో 6 గురు ప్రధాన కార్యదర్శులుగా వున్నారు. మరికొందరు ఆర్థికశాఖ, విద్యాశాఖ వగైరాల్లో వున్నారు. 5000 మంది స్త్రీల వరకు తదితర ఉద్యోగులుగా నియమింపబడి పని చేస్తున్నారు.

పెద్దపెద్ద పదవుల్లో స్త్రీలు ఆఫీసర్లుగా పనిచేయడమే గాక, విస్తారంగా విద్యాశాఖ, సాంఘికాభ్యుదయ శాఖల కమిటీల్లోను, ప్రజాసంస్థల్లోను, పారిశ్రామిక - ఆర్థిక - వ్యాపారాభివృద్ధి కార్యక్రమాల్లోను, సహాయపడుతున్నారు. అమెరికా సంయుక్త రాష్ట్ర కాంగ్రెసులో ఒక స్త్రీ సెనేటరుగాను, 11గురు ప్రతినిధులుగాను వున్నారు. ఇప్పుడు సుమారు 5 లక్షలమంది ఫెడరల్ గవర్న మెంటు సర్వీసులో ఉద్యోగులుగా వున్నారు. 1200 మంది పరి పాలక శాఖలో వున్నారు. అందులో ఒకరు ప్రెసిడెంటు గారి కేబినెట్‌లో మెంబరుగా నియమింప బడ్డారు. డిప్లొమాటిక్ సర్వీసులో ఇటలీ, స్విడ్జర్‌లాండ్ రాయబార్లుగా స్త్రీలనే నియమించేరు. ఇంకా 67 గురు స్త్రీలు అంతర్జాతీయ రాజకీయాల్లో పనిచేస్తున్నారు. ఇంతవరకు అమెరికా సంయుక్త రాష్ట్ర సుప్రీము కోర్టు మెంబరుగా స్త్రీలెవరూ లేకపోయినా, సుమారు 125 మంది స్త్రీలు న్యాయవాది వృత్తిలో పని చేస్తున్నారు. ఫెడరల్ కోర్టులో స్త్రీ న్యాయవాదులున్నారు. యు. స్. "టాక్సు" కోర్టులో ఒకస్త్రీ జడ్జి వున్నారు.

ఈ విధంగా పాశ్చాత్య దేశాల్లో స్త్రీలు పురుషులతో బాటు సరిసమానంగా అన్ని వృత్తులలోను చేరి పురుషుల కంటె ఎక్కువ నైపుణ్యాన్ని కనబరుస్తూ వున్నారు. ఇలాంటప్పుడు మన హిందూ దేశంలో విద్యాగంధం యెరిగిన ప్రజల సంఖ్య నూటికి 13 గురు. దాంట్లో స్త్రీ ఒక్కరు. ఈ చదువుకున్న స్త్రీలలో ఉద్యోగాలుచేసి రాజ్య భారం వహిస్తున్న వారి సంఖ్య వేళ్లపై లెక్క బెట్టొచ్చు. అందుచేత ప్రభుత్వాలు, ప్రజలు యీ విషయం గమనించి స్త్రీలకు విస్తార అవకాశాలివ్వాలనీ, ఇది ప్రజా సేవకూ, దేశాభ్యుదయానికి ఎంతైనా దోహద మౌతుందని 'ఆంధ్ర మహిళ' మళ్లా ప్రబోధిస్తూయుంది.



# పాకిస్తాను సోదరీమణులకు హైందవ నారీమణుల విజ్ఞప్తి

——: o :——

మన ఉభయ దేశాల చరిత్రలో ప్రస్తుతం ఏర్పడిన క్లిష్ట పరిస్థితుల వల్ల ఈ జాబు వ్రాస్తున్నాం. ఇటీవలవరకు మన మంతా ఏక దేశీయులంగా వుండడం వల్ల పాకిస్తాన్ సోదరీ మణులతో మాకు దగ్గర బాంధవ్యం ఏర్పడింది. మనమంతా మొన్నటి వరకు ఏక దేశీయులుగా నివసించడమే గాకుండా, భుజాలు కలుపుకొని దేశ స్వాతంత్ర్యానికై అహోరాత్రాలు పోరాడి అపూర్వ త్యాగాలు గావించేం. పరదేశీయులనుండి దాస్య విముక్తి పొందిన నాడు గాని మనకు శాంతి వుండదనీ, మన బిడ్డల్ని చక్కటి దేశ వీరులుగా తయారు చేయాలనీ కదా మనం స్వరాజ్యం కోరింది. ఎట్టకేలకు 200 సం॥లు తర్వాత బానిసత్వం నుండి ముక్తి పొందేం. ఇప్పుడిప్పుడే స్వేచ్ఛా వాయువు పీలుస్తున్నాం. ఈ సమరంలో స్త్రీలు కూడ ఎంతో ధైర్య సాహసాలు-కార్యదీక్ష వ్యక్త పరచేరు.

అందుచేత మన ఉభయ దేశాలు ఎంతో స్నేహ భావంతో, సహృదయతతో మెలిగిన నాడే మన దేశాల పురోభి వృద్ధికి దోహద మేర్పడుతుందని హిందూ సోదరీ మణులు గ్రహించేరు. మన ఉభయ దేశాల అభివృద్ధికి (ఆర్థిక విషయంలోనైతేనేమి, చారిత్రాత్మికంగా నైతేనేమి, సంస్కృతి విషయంలో నైతేనేమి, సర్వ విధాల కూడ) ఒకదానిపై మరొకటి ఆధారపడి ఉన్నాయి. మన ప్రధాన మంత్రుల సంప్రదింపులవల్ల మన యిరుదేశాలమధ్య ఉన్న తగాదాలను సరిదిద్దుకోవచ్చు. అంతేకాని ఇతర దేశాల వారిని పిలుచుకు రావడం కొరివితో తలగోకడం ఔతుంది. ఇటీవల వరకు పర రాజన్యులు మనలో అన్యోన్య మనస్పర్థలు పెంచి, కొంపకు పెట్టిన చిచ్చువల్లనేకదా మనమంతా అనేక కష్టాలకు పాల్పడవలసి వచ్చింది. ఆ చిచ్చు ఆర్పడానికి ఇంతకాలం పట్టింది. ఆ దావాగ్నిలో ఎంతమంది ఆప్తుల్ని, బిడ్డల్ని, భర్తల్ని కోల్పోయి కుమిలి పోతున్నారు? ఆ చరిత్రనే మళ్ళా చర్విత చరణం చేయవద్దు.

దేశాలమధ్య శాంతి సమరస భావాలు ఏర్పడాలి అంటే యుద్ధమన్న తలంపే చరిత్రలో తుడుచుకు పోవాలి. మీ ప్రభుత్వం అమెరికాను కోరుతున్న మిలటరీ సహాయం విషయం వినేసరికి మాకు వొడలు జలదరించింది. మీరు కోరే యీ మిలటరీ సహాయం మీ దేశాన్ని ఒక యుద్ధ రంగంగా మార్చడమేగాక, మీ ప్రజల సుఖజీవనానికే ముప్పు తెస్తుంది. మనమంతా కూడ, మాతృ హృదయంలో సర్వకాల సర్వావస్థలయందు మన బిడ్డలు ఆయురారోగ్యాభివృద్ధిగా వర్ధిల్లాలని ప్రార్థిస్తున్నాం. ఇటువంటి సమయంలో మళ్ళా యుద్ధ సన్నాహాలు తలపెట్టకండి. మన స్త్రీలు ఇండియాలో నున్నా, పాకీస్థాన్‌లో నున్నా ఈ మారణయత్నాలు చూస్తూ వూరుకోలేరు. మన పూర్వానుభవలావల్ల మనకు తెలుసు - పరదేశీయులు తెచ్చిపెట్టే అగచాట్లన్నీను. అందుచేత అమెరికా మిలటరీ సహాయం పాకీస్థాన్‌కు, హిందూ దేశానికి కూడ ఎటువంటి ప్రమాదాలు తెస్తుందో సువ్యక్తమవుతూనే వుంది గదా!

స్త్రీలు ఎప్పుడూ స్వాభావికంగా యుద్ధమంటే ఏవగించుకుంటారు. దానివల్ల ఎన్నికోట్ల అమూల్య జీవితాలను ఆహుతి చేయాలో, ఎంత ధనం అనవసరంగా నాశనం చెయ్యాలో వారికి తెలుసు. ఆ ధనమే సద్వినియోగ పరచినట్లయితే ప్రపంచ శాంతి-భద్రతలకు అనేక నూతన పంథాలు నిర్మించ వచ్చు. పాకీస్థాన్‌కు సహాయపడతామన్న పెద్దలకు తెలియదు— అచ్చటి స్త్రీలు వాంఛించేది 'వారి బిడ్డలకు కడుపునిండా కూడు- గుడ్డ- విద్య-ఆరోగ్యం ఆనందం-' అంతే కాని మెషీను గన్నులు- టాంకులు- బాంబులు కాదని! మన రెండు దేశాల్లోనుకూడ సరియైన ఆహారం- వైద్య సహాయం లేక అనేకమంది బిడ్డలు ప్రాణాలు కోల్పోతూ ఉంటే ఆ తల్లులు పొందే కడుపు శోకం ఎవరికి తెలుస్తుంది? యుద్ధమే తప్పనిసరియైయితే ఎన్నెన్నో క్లిష్ట పరిస్థితులకు తట్టుకుని పైటబడ్డ ఆ కొద్ది మంది బిడ్డలు కూడ యుద్ధరంగంలోకి ఈడ్చబడతారు.

అమెరికా మిలిటరీ సహాయంతో పాకీస్థాన్‌లో చక్కటి 'ఇండ్లు- స్కూళ్ళు- ఆస్పత్రుల'కు బదులు యుద్ధ సన్నాహాలు తయారుచేయవలసివస్తుంది. పాకీస్థాన్ యుద్ధ రంగంగా మార్చవద్దని మీ స్త్రీలంతా ఎదురు తిరిగిననాడు మీకు తోడ్పడడానికి మేమంతా సంసిద్ధులుగా వున్నాం. ప్రపంచంలో శాంతి నెలకొల్పిన నాడే మనమంతా నిశ్చింతగా జీవించగలం. మన స్త్రీలంతా గట్టిగా సంకల్పించి, యిలాంటి యుద్ధాలు అరికట్టి, మన భర్తల్ని, బిడల్ని, సోదరుల్ని కాపాడాలి.

స్త్రీలు ఎప్పుడూ దేశ కళ్యాణానికి తోడ్పడే వారేకాని, దేశ వినాశనానికి కారకులు కాకూడదు. అందుచేత మనమంతా ఐక్య కంఠంతో యీ యుద్ధోన్మత్తాన్ని అరికట్టి ప్రపంచ శాంతికి పాటుపడదాం.

ఇట్లు
హైందవ సోదరీమణులు.

# కేంద్ర సంఘ సంక్షేమ మండలి

## అధ్యక్షురాలుగా శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్ గారి నియామకము

దేశం మొత్తము మీద సంఘ సంక్షేమ కార్యక్రమాల అభివృద్ధికని, అందునిమగ్నమైన ప్రత్యేక సంస్థలకు ప్రోత్సాహమివ్వడానికని, కేంద్ర ప్రభుత్వమువారు ఒక కేంద్ర సంక్షేమమండలిని నియమించి, దాని నిమిత్తము 4 కోట్ల రూపాయలు వెచ్చించుటకు అనుమతి యిచ్చిరి. సేవాసంస్థల ప్రతినిధులు, కొందఱు ప్రభుత్వోద్యోగులు, మంత్రులు మున్నగువారు సభ్యులుగాగల యీ సలహా మండలికి, శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు అధ్యక్షురాలుగా మొదటినుండీ వ్యవహరిస్తూ ఉన్నారు. గత 6 మాసములలో యీ మండలి కార్యకలాపాలు ఎక్కువగా విస్తరించుటవల్ల, శ్రీమతి దుర్గాబాయిగారు దీనికి సంబంధించిన పరిపూర్ణభారాన్ని వహించుటకు వీలగునట్లుగా, తమ ప్లానింగ్ కమిషన్ సభ్యత్వాన్ని వదలి, యీ మండలియొక్క అధ్యక్ష పదవిని స్వీకరించారు.

### సలహా సంఘాలు.

ఈమండలి తరపున, కొన్ని సలహాసంఘాలు ఏర్పాటు చేయబడినవి. అందలి సభ్యురాండ్రు దేశ పర్యటన చేసి, సేవాసంస్థలను పరిశీలించి, వారు చేయుచున్న కృషి ఎంతటిది, ఆ కృషికి యీ మండలి ఏవిధమైన ప్రోత్సాహమివ్వదగును అను విషయములనుగూర్చి ప్రభుత్వమునకు నివేదికలు సమర్పించుచున్నారు. ఇటీవల పిల్లలకు, స్త్రీలకు సంబంధించిన సంక్షేమ సంస్థలను, యీ సలహా సంఘాల వారు పరీక్షించియున్నారు.

### స్త్రీల సలహాసంఘం.

స్త్రీలసంక్షేమంలో కృషి చేస్తున్న సంస్థలను పరీక్షించుటకు శ్రీమతి ప్రోభాబెనర్జీగారి ఆధ్వర్యాన్న ఒక సలహా సంఘం నియమింపబడ్డది. ఈ సంఘమునకు జెందిన

# మదరాసు సంగీత కళాశాల

## ఎనిమిదవ వార్షికోత్సవము

—: :—

గోపాలపురం మద్రాసు సంగీత కళాశాల 8. వ. వార్షికోత్సవం 14. తే. న. కళానిధి శ్రీ ముసిరి సుబ్రహ్మణ్యయ్యర్ గారి అధ్యక్షతన జయప్రదంగా జరిగింది.

కళాశాల ఆర్కెస్ట్రాతో వుత్సవము ప్రారంభించబడినది. తదుపరి కళాశాల విద్యార్థినులు "గ్రహభేదము—గోచరదృశ్యము" అను దానిని అతి నైపుణ్యముతో ప్రదర్శించి శంకరాభరణ స్వరమును ఆధారషడ్జమముగా తీసుకొని క్రొత్తరాగములను శాస్త్రబద్ధముగా చక్కగా పాడి ప్రేక్షకులను ఆనందపరవశులను చేసిరి. పిమ్మట వైస్ ప్రిన్సిపాల్ శ్రీమతి ద్వారకా పార్థసారథిగారు వార్షిక నివేదికను సమర్పించిరి. అధ్యక్షులు శ్రీ ముసిరి సుబ్రహ్మణ్యయ్యర్‌గారు వుపన్యసించుచూ "కళాశాల విద్యార్థినులకు ఇంత చక్కటి శిక్షణయిచ్చుచున్న ప్రిన్సిపాల్సు శ్రీ ఎన్. సి. పార్థసారథి, శ్రీమతి ద్వారకా పార్థసారథిగార్లు అభినందనీయు"లని ఉద్ఘాటించిరి. తదుపరి పెద్దలు పంపిన అభినందన పత్రములను చదివిరి. పిమ్మట గవర్నమెంటు పరీక్షలలో వుత్తీర్ణులయిన వారికి సర్టిఫికెట్లు, బహుమతులు పంచిపెట్టబడెను. తరువాత శ్రీ శ్యామశాస్త్రికిని శ్రీ బొబ్బిలి కేశవయ్యగారికిని జరిగిన సంగీత పోటీని నాటకంగా విద్యార్థినులచే ప్రదర్శింపబడెను. కళాశాల విద్యార్థిని కుమారి పి. వేదవతి వీణాగానముచే ప్రేక్షకులను సంతసింప చేసెను. కళాశాల ప్రిన్సిపాల్‌గారి వందన సమర్పణతో సభ ముగిసెను

---

శ్రీమతులు పెద్దాడ కామేశ్వరమ్మ, మన్‌మోహిన్ సైగాల్, పెరిన్‌మిస్త్రీ, సరళాదేవిగారలు, కార్యదర్శిని రంగనాయకమ్మగారితో ఫిబ్రవరి నెలలో దక్షిణాదిని పర్యటించినప్పుడు, ఆంధ్ర మహిళా సభకు కూడ వచ్చియున్నారు.





ప్రపంచములో అతి పురాతనమైనది స్పెయినులోని న్యాయస్థానం. క్రీ. శ.961 నుండి ప్రతి గురువారం కెతడ్రల్ వెలెన్సియాకు ఎదురుగా యిక్కడ తీర్పు జరుగుతూ వుంటుంది.



క్రీ॥ శ॥ 958 సం॥రములకు ముందు మొట్ట మొదట గాలిలో అతి వేగముగా వార్తలను పంపుట మొదలు పెట్టిరి. కైరో మత గురువు అజీజ్ (975 - 996) చెరిస్ పండ్ల కొరకు బాల్ బక్ నగరానికి 600 పావురములచే ఉత్తరవు పంపెను.



ఒక యుద్ధ విమానపు విలువ 1,000,000 డాలర్లు. అంటే 500,000 బుషెల్సు (17,619,150 లిటర్సు) గోధుమల విలువతో సమానము.

# నా ప్రథమ రచన

* శ్రీమతి కాంచనపల్లి కనకాంబ *

నాకైదారేండ్ల వయస్సునుండి, ఎవరైనను పాడినచో నాపాటలు మళ్ళీ పాడవలెననే ఆశక్తితో, చిలుక పలుకులవలె నేదో పాడుచుండుదానను. జన్మ స్థలమయిన గుంటూరులో మాయింటిలో ఒక భాగమున మా పిన తండ్రులు మేము ఉండువారము. పెద్దభాగము ప్రెస్సు వారి కద్దెకిచ్చితిమి. చిన్నప్పటి నుండి బడినుండి రాగానే పత్రికలు అచ్చగు చుండగా నది చదవడము, అక్కడికి వచ్చిన కవులు, పండితులు చెప్పుకొను కబుర్లు వినుట నా కాసక్తిగాను, అలవాటుగాను నుండెడిది. ఏదో పద్య ములను బట్టి పద్యములు చెప్పుచుండువానను. మా అమ్మమ్మ నన్ను జూచి తన తల్లి అలిమేలమ్మ వలె పాటలు పద్య ములు చెప్పెదనేమోనని నన్ననుచుండెడిది. ఈమె విష యము నాచే రచింపబడిన జీవయాత్రారంభమున

నిర్మలమతి మా యవ్వన
లర్మేలమ్మను తదీయ లలితవచస్స
ద్ధర్మము భజియించి కవిత
నర్మిలినాయమ్మవోలె హరి వినుపింతుఙ

అని చెప్పితిని. నేను పది యేండ్ల పిల్లగ నుండునపుడు 5 వ తరగతిలో ప్రథమురాలిగ వచ్చితిని. ఆ యేడే బహు మతులిచ్చు సందర్భమున నొక సంభాషణ ముగ్గురు చేసి నట్లు రచించి, మా హెడ్మాస్టరు కార్యక్రమములో చేర్చమని కోరితిని. అందు భగవంతుడు జగన్నాటక కర్త సూత్ర ధారుడు అని, జననము, మరణము, రెండు తెరలని, సూర్య చంద్రులు దివ్వెలని, మనుష్యులు, జంతువులు పాత్రలని మొదలుగా గల విషయము అది. అందారంభ మున నొక్కొక్క చరణము మొదటి అక్షరములు చేర్చిన కం. కనకమ్మ అగు.

1. కంజలోచనా భవభంజనాహరీ
2. కరము కనికరం, బీవరయవేమయా
3. నలిననాభనిఙ తలతునెదసదా
4. కమలనాభ నిన్నె మరివేడితి
5. మరచిపోకుమా నీ చరణదాసిని.

అనియు అందు కొన్ని గీత పద్యములను రచించితిని. దానిని బహుమతులిచ్చు గుంటూరుకలెక్టరు విని యానందిం చుచుండ, ఈ యమ్మాయియే యీ సంభాషణ వ్రాసినదని నన్ను చూపించిరి హెడ్మాష్టరు గారు. ఆమె కవిత్వమునకు ఒకటి, తరగతిలో ప్రథమము గనుక నింకొకటి యని రెండు బహుమతు లిచ్చిరి. పత్రికకు కూడ చిన్న పద్య ములను రచించి యీయ మొదలుపెట్టితిని. మా పెద్ద తండ్రి మంగు రామానుజ రావుగారు నెల్లూరు నుండి గుంటూరునకు వచ్చినపుడు, మా బావ పంగనామల రంగారావుగారు మా పెదతండ్రితో నన్ను చూపించి దీని కేదో కవిత్వ ధోరణి యున్నది, దీనిని మీరు చదివించిన గొప్పదగుననిరి.

ఆ మరునటి సంవత్సరము మా అమ్మమ్మ చనిపోగా మా అమ్మను, నన్ను నెల్లూరునకు మా పెదతండ్రి గారింటికి తీసికొని పోయిరి. మా బావగారికిని నెల్లూరులో ఉద్యోగ మయినందున మా అక్కతో నచ్చటికి విచ్చేసిరి. ఈ విషయము నా తోమాలియలో నిట్లు చెప్పితిని.

ఉ॥ ధీరుడు కొమ్మనార్యుని ప్రతిష్ఠను గీరితి
పేరు కొన్నగుం
టూరునబుట్టియుఙ జనకుడున్ చిననాడె చ
నంగవచ్చి నె
ల్లూర వసించినే జదువులుఙ బతకంబులు
సత్కవిత్వముఙ
బేరునుబెంపుగంటి నిటబెద్దలు నన్ను న
నుగ్రహింప మా
యూరిదియేయటంచు ముదమొందెద
కాంత యయోధ్య నుంబలెన్

ఉ॥ తానొక ధర్మవాదిగ బ్రథఙ బుర
మందున గన్నమంగురా
మానుజుడాప్తుడౌచు బ్రథమంబున
నఙ గవయిత్రిజేసివి

ద్యానిపుణుల్ కవుల్ యతులుదన్నొగి
ధన్యుని జేయవారి స
న్మానముచేసి చూపె నొక మార్గము
నాకును సాధుసేవకుఁ

శా॥ రంగారాయని బంగనాపకుల పా
రా వారకాకాసుదాం
శు గీర్తి ప్రియు భావుకుఁ ద
లతునే శుద్ధాంతరంగంబునం
దుంగావ్యమ్ములు పత్రికల్ చదువగా
నూల్కొల్పి నన్నింతదా
నింగా నేడు దివంబునుండి కనువా
నిఁ సాధు సన్మాన్యునిఁ॥

వెంటనే మా పెదతండ్రి నాకు అప్ప కవీయము, బాల వ్యాకరణము, ఆంధ్రనామ సంగ్రహము, అమరము, శబ్ద మంజరి మొదలగు వానినుండి ప్రతి దినము పాఠము లను జెప్పి వల్లింప జేసి లక్ష్య గ్రంథము క్రింద భారత మును జదివించిరి.

సంస్కృత కావ్య పాఠములు హయగ్రీవస్తవము, ముకుందమాల మొదలగు స్తోత్ర పాఠములను చెప్పిరి. ఛందస్సు సవ్యముగ నేర్చికొన్న తర్వాత రంగ శతకము నెల్లూరి రంగనాథునిపై చెప్పితిని. ఆ విషయమునే అంబాస్తవములో "పదియు రెండవ యేట పలికించితివి కదా ! నెల్లూరి శ్రీరంగనేత్రు మహిమ" అంటిని. రంగ శతకమే గ్రంథ రూపము దాల్చిన ప్రప్రథమ రచన

బాలను కవితాచతురత
జాలమున జ్ఞానమునకు శాలను నిన్నుఁ
జాలగ బొగడగ నేర్తునె
నాళీకదళాక్ష దురిత నాశన రంగా॥

పావనియంతటి వాడే
పావనుడగుటకును యేమొ భక్తిభజించెఁ
కైవల్యము మాకెటునిఁ
భావంబున నిల్పకాప్తబాంధవరంగా॥

ఒకపరి మా పెత్తండ్రి సేమమును గూర్చి వ్రాయుచు "మీ మనోశాంతికి భంగము లేదు కదా" యని వ్రాసితిని. దానిపై వారు నాకు "మీ మనోశాంతి యన రాదు సేమ మరయ మీ మనశ్శాంతి యన సంధిమేర నిలుచు. తెలిపి సంస్కృత సంధుల నిలుపవలయు" నని వ్రాసిరి.

నర్సాపురం పరీక్షలకు, విజ్ఞాన చంద్రికా పరీక్షలకు వెళ్ళి ప్రథమురాలిగా నందు కృతార్థతగాంచి 7 బంగారు పతక ములను, 216 రూప్యములను బహుమతులుగ పొందితిని. పరీక్షలలో జవాబులు పద్యములలో వ్రాయుచుండుదానను. పరీక్షాధికారులీవిషయమును పత్రికలలలో నన్ను ప్రశం సించిరి. నెల్లూరులో నా సమయమున నష్టావధానములు, శతావధానములు, ఆశుకవిత్వములు విరివిగా ప్రవర్తిల్లు చుండెడివి. తిరుపతి వెంకటకవులు, కొప్పరపు కవులు, కాశీ కృష్ణాచార్లగారు, వేలూరు శివరామశాస్త్రిగారు మొద లగువారందు ముఖ్యులు. సభలకు మాపెత్తండ్రి తమతో నన్ను తీసికొనిపోవుచుండెడివారు. అంతతో తృప్తి పొందక, పండితులను, కవులను ఇంటికిపిలిచి ఆతిథ్య మొసగి కవితాగోష్ఠి, పండితగోష్ఠి గావింపుచు వారిని సన్మానించువారు మాపెత్తండ్రి.

ఆశుకవిత్వ మలవరచుటకై ఇంటిలో పద్యములలోనే సంభాషింపవలెనను వారాయన. సమస్యలనిచ్చి పూరింప జేసిరి. విషయమిచ్చి పద్యములలో రచింప జేసిరి. హిందూ సుందరి, సావిత్రి మొదలగు పత్రికలకు వ్యాసములను, పద్యములను వ్రాయుచుండుదానను. ఒకసారి హిందూ సుందరిలో నొకరు యతిగణముల విషయము తప్పుగా వ్రాయుటచూచి సుందరికి "విరతి సాధుత్వమును దెల్ప విన్నవింతు, యతుల గౌరవింప ని నూత్నమతము నందు, దోసముగ నెంచబడకున్న దొలుత గణ నిబద్ధమైనది యది యకా పద్దెమగును. కరుణదెలుపుడు గణభంగకారణంబు" అని వ్రాసితిని. మాపెదతండ్రి దానినిజూచి నన్ను మంద లించిరి. కవిత్వము సద్వినియోగ పరచవలెగాని ఇతరుల తప్పులను ప్రకటింప రాదనిరి.

పులుగుర్త లక్ష్మీనరసమాంబ గారు, దామెర్ల సీతమ్మ గారు మొదలగు వారితో ఉత్తరప్రత్యుత్తరములు పద్య ములలోనే జరుగు చుండెడివి. ఒకసారి నేను సావిత్రికి పద్యముల పంపుట ఆలస్యమైనది. అప్పుడు పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు నాకొకలేఖ వ్రాసిరి. అందు "సోదరి చిన్నపత్రికని చూడరు ప్రీతినిదేటికమ్మమీ। యాదరణం నొందదగదా। యదియట్టులు కాదటన్నచో। నేదొక వ్యాస మేని మరియింపగు చిన్నకతేని పంపరా। దా దయమీర" అని వ్రాసిరి. ఇట్లే దామెర్ల సీతమ్మగారు మొదలగువారు

వ్రాయుచుండువారు. నేను ఇంటికి వ్రాయునపుడు "తాతగారికి నాదువందనములనుము, కడిగియమ్మమ్మకేమ్రొక్కులిడితి ననుము" అనుచు వ్రాయుచుండు దానను.

సం॥ 1912 లో అవ్వారి సుబ్రహ్మణ్యంగారు, రాయప్రోలు సుబ్బారావుగారు, సుబ్రహ్మణ్య కవులని నెల్లూరులో శతావధానములు చేయుటకు వచ్చినపుడు మేమాహ్వానింపగా మాయింటికి వచ్చిరి. వారితో మాపెత్తండ్రి "మా అమ్మాయికూడ ఆశువుగా కవిత్వము చెప్పగలదండీ" అని నుడివిరి. వెంటనేవారు నాతో "అమ్మా! మమ్ములను నేదేని విషయము చెప్పుమని పద్యరూపమున నడుగు" మనిరి. నేను వారితో నిట్లంటిని.

"మహినివేములవాడ భీమ కవివరుడు
అల్ల సానిపెద్దన చెప్పె ననగవింటి
చదివితినిగ్రంథములయందు చాటుధార
లెన్నియోగాని కననైతి తృప్తిదాన"

"కవితలక్షణయు తముగ కవులుసెప్ప
టరుదుగా నుండవారిలో నా శుకవిత
నియమ సహితంబుగా జెప్పనేర్తురీరు
వేడ్కఁగల్గెను మీనుడి వినగనేడు"

"తేటగా గొన్నిపద్యముల్ తెలుగునందు
భాషజెందినహైన్యంబు పరగ జూపి
కవిత జెప్పంగప్రార్థింతు కవులమిమ్ము
సాటిలేని మీకవిత కసాధ్యమేద్ది"

వారనేక పద్యములాశువుగ బహువేగముగ నుడివిరి. చివర పద్యముచే నన్నిట్లు ఆశీర్వదించిరి.

"కాంతయశులు సుబ్రహ్మణ్య కవిశశాంకు
లాదరంబున నిచ్చిన యాంధ్ర పద్య
రత్నమాలధరించి వినూత్నకాంతి
గాంచుమమ్మ కంచనపల్లి కనకమాంబ"

సభలలో చదువుటకు వ్యాసములుకూడ పద్యములలోనే రచించుచుండుదానను. ఉ: సమాజలాభములను గూర్చి.

"సౌధవీథీవిహారంబు సల్పమెట్లు
సాధనంబైన తెరగున సకలసౌఖ్య
సంపదోన్నతభువన సంచారమునకు
సతుల సంఘంబు సౌపానసరణిగాదె"

"కృత్యవర్గంబులెరిగించి కీడుబాపు
నిత్యకీర్తిప్రదంబగు నీతిదెలుప
సత్యనిష్ఠను బుట్టించు సకలధర్మ
మార్గముల జూపు సుజన సమాజ మరయ"

గౌతమబుద్ధ, పాండవోదంతము మొదలగు వచన రచనలు సాగించితిని. కాని పద్యరచనకే నామనసు మ్రొగ్గుచుండెడిది. కాశీయాత్ర చరిత్ర సీసమాలికగా రచించినదా సంవత్సరమే. పరిపూర్ణ కావ్యరూపము దాల్చినది రెండువేల పద్యములుగల జీవయాత్ర దాని పీఠికలో నేను,

"బాల్యంబుననెట్టెటొహరి! కల్యాణగుణముల
పలుకగలిగితి నవిసా
కల్యంబుగనేదిటగై, హల్యామృత పానకలన
బల్కెఁదభక్తిన్"

రంగశతకము రచించుకాలమున, వావిలికొలను సుబ్బారావుగారు, దుర్భా సుబ్రహ్మణ్యంగారు నా కవిత్వమును ఆదరమునవిని అందలి గుణదోషముల జెప్పుచుండెడివారు.

జీవయాత్రావిషయమునను. ఆస్థానకవి మహామహోపాధ్యాయ కృష్ణమూర్తిశాస్త్రిగారు, శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు, శతావధాని కాశీ కృష్ణాచార్లగారు, విమర్శకాగ్రేసర నాగపూడి కుప్పుసామయ్యగారు మొదలగు పండితులు నిర్దుష్టమని మెచ్చుకొనిరి.

"ఆపరితోషాద్విదుషాం నసాధుమన్యే ప్రయోగవిజ్ఞానమ్
బలవదపి శిక్షితానా మాత్మన్య ప్రత్యయంచేతః"

అని కాళిదాసన్నట్లు నాకును, జీవయాత్ర రచన తరువాత కొంత మనశ్శాంతి లభించినది. ఆత్మనిశ్చయము కలిగినది. ఆరంభమునుండి జీవయాత్ర వరకు నాప్రథమ రచనా వృత్తాంతమిది.

ప్రప్రథమ రచన రంగశతకము
ప్రథమ రచన జీవయాత్ర.

(రేడియో ప్రసారితం)





# ఐశ్వర్యోత్పాదిని

కేవలం ఒక్క జలబిందువును ఇంజనీరింగ్ విజ్ఞాన శాస్త్రం ద్వారా ఇతర జలబిందువులతో చేర్చినచో, అది దేశైశ్వర్యాభివృద్ధులను దారితీసే విద్యుదుత్పాదక యంత్రాలను నడపగలదు.

మీ రూపాయను నేషనల్ సేవింగ్స్‌పై పెట్టుబడిపెట్టి, దానిని ఇతర రూపాయలతో చేర్చినచో, అది అమూల్యమైన జలబిందువువలె ఐశ్వర్యప్రదమైన ఉత్పత్తిశక్తిగా మార్చగల విద్యుదుత్పాదక యంత్రాలను నిర్మించగలదు.

## సొమ్మును పొదుపుచేసి పెట్టుబడి పెట్టండి

హామీగల ఈక్రింది సెక్యూరిటీలపై:

| | |
|---|---|
| నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేట్లు | రు. 100/- పెట్టుబడికి 12 సంవత్సరాలలో రు. 150/- లభించగలదు |
| పది-సంవత్సరాల ట్రెజరీ సేవింగ్స్ డిపాజిట్లు | సాలీనా 3½% వడ్డీ చెల్లింపు: 10 సంవత్సరాలు మూలధనానికి భద్రత. |
| పోస్ట్ ఆఫీసు సేవింగ్స్ బ్యాంకు డిపాజిట్లు | రు. 10,000/- వరకు డిపాజిట్లపై 2% వడ్డీ చేర్చబడుతుంది. (జాయింట్ అకౌంట్ల విషయంలో రు. 20,000/- వరకు డిపాజిట్లపై) |

లభించే వడ్డీపై భారతీయ ఆదాయపు పన్ను ఉండదు.

ఎల్లరి సదుపాయానికై అధికకాంతి, అధికశక్తి.

## ఇండియా ఐశ్వర్యాభివృద్ధి ప్రణాళిక కొనసాగుటకు తోడ్పడండి

ఇంకా ఇతర వివరాలకు, లేక/మరియు పెట్టుబడులను గురించిన నిబంధనలకై నేషనల్ సేవింగ్స్ కమిషనర్ పేరట గోర్టన్ కాజిల్, సిమ్లా-3 విలాసానికి గాని, మీ రాష్ట్రంలోని రీజినల్ నేషనల్ సేవింగ్స్ ఆఫీసరుకు గాని వ్రాయండి.

A.C 615 TG

సంఘ సేవ

# "శలవుల్లో ఒకరోజు"

• శ్రీమతి డి. ఎస్. రాజేశ్వరీపట్నాయక్ •

"అమ్మగారండీ........ అమ్మొరండీ............"
తలుపు చప్పుడైంది. నిద్రాభంగమైన సునంద వులిక్కిపడి కండ్లు నులుపుకొంటూ గడియారం వైపు చూచింది. 4 గంటలు సూచిస్తోందాఘటికాయంత్రం. చీకటితెరలింకా మసక మసగ్గా దోబూచులాడుతున్నయ్. వీధి గుమ్మం మళ్ళీ తట్టిన చప్పుడు విని చప్పున వెళ్ళి తలుపు తీసింది. యెదురుగా తన సహాధ్యాయినులు సీతా, గీతా, సునీతా మృదుకంఠాలతో సుప్రభాతం చెప్పి "పెద్దమ్మగారండీ! శానా నిద్దరోతుండారే!" అంటూ హాస్యోక్తులతో చేతుల్లో వున్న పెట్టే బేడా క్రింద పడేసి పయాణాన్ని హెచ్చరించారు.

"అరే.... మొద్దునిద్ర పట్టేసిందర్రా! సరే, నాదే ఆలశ్యమన్నమాట. అయిదు నిమిషాల్లో వచ్చేస్తున్నా" నంటూ కాలకృత్యాలు తీర్చుకునేందుకు లోనికెళ్ళింది.

"ఇదేమిటోయ్, ఈ ప్రయాణ సన్నాహాలు! యిన్ని పెట్టెలెందుకూ?" అని దుస్తులేసుకుంటూ ప్రశ్నించింది సునంద.

"మరి టాక్సీలో పోతాంగదూ!" అన్నది గీత.

"మనం వెళ్ళబోయే చోటికి టాక్సీలు యెందుకమ్మా! ఖులాసాగా నడిచేపోదాం, ఏమంత పెద్దదూరమని, మూడు మైళ్ళేగా?" అన్నది సునంద. సరే నంటూ అత్యంతుత్సాహంగా తలలూపిన స్నేహితురాండ్రను జూచి ఎంతో వుప్పొంగిపోయింది సునందాదేవి—

ఆ తరుణ వయస్కులగు బాలికలు ప్రఫుల్లవదనాలతో కార్యదీక్షాపరులై పరిసర పల్లె ప్రాంతాలకు చరచరా ప్రయాణం సాగిస్తున్నారు. తెల తెలవారిపోతోంది. క్రమంగా తూర్పు దిశను ఉదయ భానుడు తన అరుణ కిరణాలను నలువైపులా ప్రసరిస్తూ ఉదయించాడు. సీత చేతిలో చీపురుకట్టతో, గీత చేతిలో గంపతో, సునీత చేతిలో ఫినాయిల్ టిన్నుతో, వూగిసలాడిస్తూ ఎంతో ఠీవిగా కార్యాసక్తులై ముందు నడుస్తున్నారు. వాళ్ళు కట్టుకున్న చీరెలు ఆకుపచ్చ, తెలుపు, ఎరుపు రంగుల్లో వున్నయ్యేమో వెనుకనున్న పైటచెంగులు మువ్వన్నె పతాకంలా ముచ్చట గొల్పుతూ ఆ ప్రభాత వీచికల్లో రెప రెప లాడుతున్నయ్. వెనుక నడుస్తున్న సునందాదేవికీదృశ్యం ఎంతో శోభాయమానమై అపూర్వమైన పవిత్రానుభూతులను రేకెత్తించుచున్నయ్. తరుణ వయస్కులగు ఆ ముగ్గురి బాలికలవెంట మూడు కోట్ల సోదర సోదరీ మణులు మహాత్ముడొసగిన కర్తవ్యసాధనకై జయ నినాదాలతో విశ్వ ప్రాంగణంలో పురోగమిస్తున్నట్లనుభూతులు కలుగ సాగినయ్. వాళ్ళపద నిక్షేపంలో సుదూరమైయున్న అనాగత భవిష్యత్తు ఉజ్వలరూపంలో తీర్చి చిత్రించగల దీక్షాశయాలు బహుముఖాల ముందడుగు వేస్తున్నట్లు ఊహా పథంలో వూగిసలాడిపోతోంది. దేశసేవకై సత్యాహింసలనే కఠిన నియమాలననుష్టించి విశ్వజనీయమైన ప్రేమ సౌహార్ద్రతలు ప్రతి హృదయంలో నింపి సంఘ జీవితంలో సమత్వాన్ని నెలకొల్పిననాడే దేశం సుభిక్షమై పటిష్టమై శోభాయమానంగా వెలుగొందగలదనుకొంటూ నడుస్తోంది సునంద—

చేరవలసిన గమ్యస్థానం దగ్గిరపడింది. 'వందేమాతరం' పాడుకొంటూ వూళ్ళోకి దారి తీశారు బాలికా త్రయం. గ్రామీణజీవితాన్నెరుగని సీతా, గీతా, సునీతా ఆ పల్లె వీధుల విస్తుబోయి చూస్తూ నడుస్తున్నారు. అనుభవశాలిని యగు సునంద పల్లె దుఃస్థితికి మథనపడుతూ, అడుగుల్లో అడుగు వేసుకుంటూ జీర్ణవసనాలతో మూర్తీభవించిన దరిద్రదేవతల్లా అగుపించే ముదుసలుల చిరునవ్వు మొహంతో పలుకరించి పరిచయం చేసుకొంటూ నడుస్తోంది. అది మాల వీధికి పోయేదారి. ఇండ్లముందర మురికి గుంటలు దుర్వాసన కొడుతున్నవి. ఓ ప్రక్క పందులు లట్ పట్ ధ్వనిచేస్తూ బురదనంతా అసహ్యంగా పైకి విరజిమ్ముతున్నయ్. ఆ మురికిగుంట సమీపంలో నగ్నదేహంతో ఓ కుర్రవాడు పందిపిల్లలను పట్టే చేష్టలో నిమగ్నుడై యున్నాడు. పొంగియున్న వాడి మొహంలో ఓ కంట్లో పువ్వువేసియున్నది.

## "శలవుల్లో ఒకరోజు"

ముక్కునుండి కారే తరళ పదార్థం అసహ్యంగా పెదాలపైకి దాడిచేస్తూ నోట్లోకి పోతోంది. ప్రక్కనే మంటిపెచ్చులూడి కూలిపడేందుకు సిద్ధంగాయున్న ఓ గుడిసె, మిట్ట పల్లాలుగ నున్న ఆగుడిసె అరుగుపై నులక మంచంలో ఒక వ్యక్తి ప్రగల్భాలతో గలాభా చేస్తూ దొర్లుతున్నాడు. వాడి కాళ్ళ వైపున చిన్న చిన్న కుక్కుట సంతానం పరుగు పందాలతో ఆడుకొంటున్నాయ్. క్రింద మూషిక రాజాలు గొప్పులు త్రవ్వి నిరాటంకంగా అంతః పురాలు నిర్మించుకుంటున్నయ్.

"ఏయ్, ఎవరాపడుకున్నది?"జంకుతూ, లేనిగాంభీర్యం తెచ్చుకొంటూ ప్రశ్నించింది గీతాదేవి— జవాబులేదు.... యెర్రగా చింతనిప్పుల్లా మెరిసేకళ్ళతో ఎన్నో ఆవాచ్యాలు ప్రేలుకుపోతున్నాడావ్యక్తి. జ్వర తీవ్రతచే బాధపడుచున్న రోగి గాబోలని దగ్గరకు వెళ్ళేందుకు రెండడుగులు ముందుకేసింది. అబ్బా!.... భరింపలేని దుర్వాసనకొట్టేస్తోంది, ఛీ....ఛీ.... కల్లువాసన! దడదడలాడే హృదయంతో గిర్రున పరుగు తీసింది సునంద దగ్గరకు— "అక్కా ఏమిటుపాయం?" వణికిపోతూ సునందహస్తాన్ని బలం కొద్దీ వూగించేస్తూ ప్రశ్నించింది గీత. జరిగిన సంఘటనను విన్న సునంద "రోగంతో ప్రలాపిస్తున్నాడేమో" అన్నది.

"అబ్బా! జ్వరమూలేదూ రోగమూలేదూ. త్రాగిన మత్తులో అసందర్భంగా ప్రేలుకుపోతున్నాడు"అన్నదిగీత.

"అలా అయితే ఫరవాలేదు. వాణ్ణి లేపకుండా ఆ యిల్లంతా సుభ్రం చేసెయ్యాలి, పద నేనూ వస్తాను, యింత భయమెందుకే వెర్రిదానా" అని పోత్సాహపరుస్తూ నడిచింది సునంద—

చెత్తా చెదారం తీసివేసి యిల్లంతా వూడ్చేసి, బురద ప్రదేశాల్లో గంపలకొద్దీ యిసకా, మన్నూ పోసి పరిసరమంతా సుభ్రపరిచారు సునందా, గీతా—. ఈ కోలాహలాన్ని సహించలేక గ్రామ సూకరాలు గర్జించుకొంటూ పరుగులు తీస్తున్నాయి. పరుగులు తీసే ఒకటి రెండు పందులను తరిమి తరిమి కొడుతూన్న సీతను జూచి సునంద నవ్వాపుకోలేకపోయింది. చేసైగ చేసి సీతను పిలిచి సుస్నేహస్వరంతో యిలా చెప్పింది—

"సీతా; ఒకటో రెండో పందులను తరిమి కొట్టేయగా నీకర్తవ్యం పూర్తయిందా? గూడెంలో ప్రతీ యింటికీవెళ్ళి 'మీరంతా ఐకమత్యంగాయుండి, ఇల్లూ, వళ్ళూ సుభ్రం చేసుకోవాలనీ, వీధుల్లోపందులు నివసించడంవల్ల గ్రామానికెంత హానికరమో, వాటివల్ల యిండ్ల ముందర యెంత అసహ్యకరంగా బురదగుంటలు మురుగుతున్నయో, ఆ మురికి ప్రదేశాల్లో యెన్ని రోగాలు కలిగే అవకాశమున్నదీ తత్ఫలితంగా తమ పసిబిడ్డల్లో చలిజ్వరాలూ, ఉదర పొట్టలూ, కంటిజబ్బులూ ఏవిధంగా విజృంభించి రోగాలకు గురి యగుచున్నారో వివరించి, పందులు నివసించేందుకు దూరంగా ఒక 'కొట్టం' ఏర్పరచుకోవాలనీ, అవి వీధుల్లో విహరించకుండా జాగ్రత్త పడాలనీ, వారికి తగు సలహాలతో బోధించి చెప్పాలి. ఒకటి రెండు పందులను దూరంగా తరిమేస్తే మాత్రం ఏం లాభం?" అని కార్యక్రమాన్ని సూచించింది సునంద—

తన అవివేకతను తలచుకొని సీత సిగ్గుతో తలవాల్చుకొని కర్తవ్య నిర్వహణకై నడిచి వెళ్ళింది.

"ఎబ్బే!....ఛీ ...ఛీ...." అన్న ఛీత్కార శబ్దం విని ప్రక్కకు తిరిగి చూచింది సునంద. దగ్గరలోనున్న మురికి గుంటలో నగ్నదేహంతో పొంగియున్న పొట్టా, గోగు కాడలవలె వ్రేళ్ళాడుతోన్న ముక్కును బురదచేతులతో మొహమంతా అసహ్యం చేసుకుంటూన్న ఓ కుర్రాణ్ణి సీత ఆదరంగా చేరదీసి సుభ్రపరుస్తోన్న దృశ్యాన్ని చూచి సునీత చేసిన ఛీత్కారమని గ్రహించిన సునంద, సునీతను జూచి "అరె! అదేమిటోయ్. సునీతా! అట్లా అసహ్యపడితే ఎట్లా? రేపు నీవు తల్లివి కాబోతే నీ బిడ్డల అసహ్య పరిస్థితులుచూస్తూ ఇఛ్ఛీ....ఛీ....ఛీ.... అని వూరుకుంటావా?" అనిచిన్నగా మందలించింది సునంద.

సునీతను చివాట్లేస్తూంటే సీత హృదయం వుప్పొంగిపోతోంది, అసహ్యం లేకుండా తన కర్తవ్యం చక్కగా నిర్వహించినందుకు! ఆ ఆనందాన్ని తట్టుకోలేక సునందను జూచి "ఈకుర్రవాణ్ణి డాక్టర్ ఖానాకు పంపించేద్దామా?"అంది ఎంతో గంభీరంగా మిగిలిన కర్తవ్యాన్ని పృచ్ఛించింది సీతాదేవి.

"వాడి తల్లిదండ్రులెవరో తెలియందే ఎట్లా తీసుకుపోగలం? వాకబు చేద్దాం" అని అక్కడ విచారిస్తే—ప్రక్కగుడిసెలో తాగి తందనాలాడిన వ్యక్తియే వాడి తండ్రియని తేలింది.

# "శలవుల్లో ఒక రోజు"

అప్పటికప్పుడే గూడెంలో నలువైపులా పని జరిగి పోతోంది. జీబుగానున్న చెట్లను చకచకా కోసి పారేసి చత్తనంతా గంపల్లో యెత్తి పారేస్తోంది గీత— చీపురుతో సుభ్రంగా తుడిచి ఫినాయిల్ జల్లుతోంది సునీత. ఆకులు రాలి, కుళ్ళి పసరు వాసన కొడుతూన్న నూతిని సుభ్రం చేయిస్తూ మందు కలుపుతోంది సునందాదేవి. చూస్తుండగా హరిజనవాడంతా పరిశుభ్రంగా కనిపిస్తోంది. పిల్లలకు స్నానం చేయించి తలలు దువ్వి, ప్రతిరోజూ యిట్లా సుభ్రంగా వుండాలని చెప్తూ, చిన్న చిన్న సబ్బుబిళ్ళలూ, దువ్వెనలూ కొంచెంగా పంచిపెట్టేరు సీతా, గీతా— అయినా సంఘ సేవికల మనస్సులకు సంతృప్తి లభించలేదు.

ఆ తాగుబోతు వ్యక్తి యింకా స్పృహలేకుండా పడి యున్నాడు. వీళ్ళ అధోగతికి ముఖ్యకారణం ఈ త్రాగుడు పిశాచమే! మద్యపాన నిషేధం అమల్లోకొచ్చినా మరి వీళ్ళకెట్లా మద్యం లభిస్తోందో! శాసనాలు చేస్తేమాత్రం లాభమేమిటి? మనుష్యుల్లో మార్పు రావాలిగాని! ప్రొహిబిషన్ సిబ్బందినే కన్ను గప్పిన వీళ్ళ మూర్ఖత్వానికీ, అజ్ఞానానికీ వ్యథాభరంతో ఆలోచిస్తోంది సునంద. పనులపై వెళ్ళిన హరిజనులొక్క రొక్కరే గూడెంలోకి చేరుకొని పరిసుభ్రంగా వున్న తమ నివాసాలనూ, తమ్ము ఆదరంగా పలుకరిస్తున్న ఆ అపరిచిత స్త్రీలనూ చూచి, గుస గుసలాడుతూ దిగ్భ్రాంతులై నిల్చుండిపోతున్నారు. అందరినీ పరిచయం చేసుకొని ఒకచోట సమావేశ పరచి సుస్నేహ స్వరంతో సునందాదేవి యిట్లా చెప్పింది—

"సోదరులారా! సంఘంలో మిమ్ము అంటరాని వారుగ భావించడానికి కారణం మీరు గుర్తించుకోలేక పోవు చున్నారు. మీ అసహ్య వాతావరణమే అంటరానితనాన్ని పురికొల్పింది. తాగి తందనాలాడుతూ తెచ్చుకునే కూలి రాళ్ళు దుర్వ్యయంచేసుకుంటూ భార్యా బిడ్డలను తినేందుకు గంజినీళ్ళయినా లేకుండాజేసి జీవచ్ఛవాలుగ హింసింప జేస్తున్నారు. తప్పత్రాగిన నిషాలో స్త్రీలపై చేయిజేసికొని ఒక్కోచోట ప్రాణహత్యలను చేయుటకు కూడా వెనుదీయని పరిస్థితులకు లోనవుతున్నారు. పైగా ఈ త్రాగుడు వల్ల మీకు కలిగిన లాభమేమిటి? రోగాలను భోగిస్తూ దారిద్ర్యదశ ననుభవించడమేగాని?—"సునంద ఆర్ద్రహృదయంతో చెప్పుకు పోతోంది.........

ఇంతలో ఒకహరిజనస్త్రీ దుర్వాసన కొడుతోన్న కొన్ని సారాబుడ్లు తెచ్చి "ఓ అమ్మగోర్లూ! ......... మారాజు తల్లులూ! ఈ చారాబుడ్డు మావోడుతాగింది సాలకనన్నో సుక్క ఏసుకోమని పాణం తీస్తుండడండి. కల్లుపాకలు పోయినప్పటినుండి పట్నానికి లగేజి బస్సులుకాడ బండి నడిపేనూనే (పెట్రోలు) కాఫీదుకాణాలకెల్లి ఆడపారేసిన గుండ ముద్దలు (డికాక్షన్ మడ్డి) డబ్బులిచ్చికొని రాత్రేళ అయన్నీ కషాయం మరగేసి బుడ్లకెత్తుతాడండి. అదేటో అదితాగి వోంతులు సేసుకుంటాడండి. నానేపైన అంతే కాలుతున్న బీడిముక్కతో నా ఒంటిని సురక లేస్తుండడండి.... గోడుగోడున ఏడుస్తూ ..... ఓ సదుగుకున్నమ్మోర్లు! యియ్యాల ఒక్కరోజు మీరొచ్చి కల్లు తాగమోకండని సెప్పెల్లిపోతారు. మరి తెల్లారితే ఈ నాగన్నలూరుకుంటారండీ తల్లులూ" అన్నది.

"అబ్బే! .... అలాకంట తడిపెట్టకూడదమ్మా, రోజూ మేము వస్తూంటాంగా, సరేనా .... యిటు చూడు (ఆమె చుబుకాన్ని పైకెత్తి కన్నీరు తుడుస్తూ) మనమందరం మనుష్యులమేగా, ఒకరి కష్టసుఖాలు మరొకరు చూచుకోపోతే మరెవరు చూస్తారు? చూడండీ మీయిల్లూ వాకిళ్ళూ యెంత అసహ్యంగా వుంచారో! మురికి గుంటల్లో పందులు దొర్లాడుతూ దుర్వాసన కొడుతూంటే అక్కడే మీ బిడ్డలు బురదలో ఆడుకొంటూ యెన్నిరోగాలను తెచ్చుకుంటున్నారో తెలుసు కున్నారా? వీధుల్లోనికి పందులను రానివ్వకుండా దూరంగా వాటికోసం ఒకకొట్టం నిర్మించుకొని, ప్రతిరోజూ యిల్లూ వళ్ళూ సుభ్రం చేసుకొని ఈ రోగాలు రాకుండా వుండేట్లు ప్రయత్నించండి. మీరు గాంధీ మహాత్ముని పేరు వినేవుంటారు. మీకు పైజాతులతో సమానత్వంకలుగ జేసేందుకై అంటరానితనమనే నీచాభిప్రాయాలను ఖండించి దేవాలయాల్లోనికి వెళ్ళి దేవుని దర్శించుకునేందుకు మీకు హక్కున్నదని అందరినీ వొప్పించి మీక్షేమం కోసం అహర్నిశలు ఎన్నో కష్టనిష్ఠురాల కోర్చి హరిజననిధి యనుపేరున జీవితాంతం ఎంతోధనాన్ని సేకరించి మీకై ఎంత కృషిచేశారో తెలుసుకున్నారా? అట్టి మహనీయుని ఆదేశప్రకారం దేశం నలుమూలల్లో మీజాతి నుద్ధరించేందుకై దేశనాయకులు ఎన్నోవిధాల పాటుబడుతూ మీకు జ్ఞానబోధ చేస్తూంటే మీరింకా యిలా అజ్ఞానదశలో కొట్టుమిట్టాడుతూ అసహ్య పరిస్థితులను వదలకుండా దేశానికే అపచారం చేస్తున్నారు. యికనైనా తాగుడుమాని వృథాగా ధనవ్యయం చేయకుండా కుటుంబాలను రక్షించుకొంటూ అందరూ ఐకమత్యంగావుండడం

నేర్చుకోండి. మీఖాళీ ప్రదేశాల్లో విరివిగ కూరగాయలు పండించి, మీరనుభవించగా మిగిలినవి పట్టణాలకుచేర్చి అమ్మకం చేయండి. అందువల్ల కొంతధనం సంపాదించు కొని వేణ్ణీళ్ళకు చన్నీళ్ళవలె మీరు తెచ్చుకునే కూలికిపై రాబడి కలిపి మీ దారిద్ర్యబాధ నివారించుకునేందుకు ప్రయత్నించి సుఖంగా జీవించండి. మీబిడ్డలను పాఠశాలలకు పంపి చదువనూ, వ్రాయనూ నేర్చుకునేందుకు అవకాశం కలిగించి బిడ్డలను అక్షరాస్యులను చేయండి" అని ప్రేమార్ధ కంఠంతో ప్రబోధించింది సునంద.

ప్రజల గుంపులో నుండి యెవరో పెద్దగొంతుతో "అమ్మగోరూ మీరుసెప్పిన మాటలు కాదనలేం గాని తల్లీ! మీకాడున్న మంచితనం అందరికాడుంటదా? మా(వు సర్కారోరున్న పట్నాల్లో సొరబడితే పెద్దపెద్ద కులాలోళ్ళు ఛీ .... ఛీ .... మని దూరంగా పోతుండారు. మీలాగ అరి మనుసులు మారదుగందా తల్లీ, మాకియన్నీ సెప్పినా లాభమేటి" అన్నాడు — ఆమాటలు వినగానే సునంద హృదయం పరితపించింది. నిజమే! .... యిన్నినాళ్ళ సంస్కారభావాలు ఈ విధమైన ప్రశ్నతో తారుమారయి పోతోంది. తమసంస్కార భావాలకు తగిలిన సవాలుని గ్రహించి శాంతంగా "మీరన్నమాటలో కొంత నిజంలేక పోలేదు. గాని వాళ్ళహృదయాలో కూడ రాను రాను మార్పు కలిగి తీరుతుంది. ఒకప్పుడు ఛీ .... ఛీ .... ఈ మాల గూడెంకి యెవరెళ్తారు? అని అసహ్యించుకునే మీగూడెంకి ఈవేళ మేమెందుకు రాగలిగాం? అలానే కొన్నాళ్ళకు, మీజీవితాల్లో క్రమశిక్షణల నలవరచుకొని చక్కని నడవడికను నేర్చుకొన్ననాడు, గతంలో మిమ్ము అసహ్యించుకున్నవాళ్ళందరూ మీలో కలసిమెలసి యుండగలరు. గాంధీ మహాత్ముని ఆదర్శాశయం ఫలించి తీరుతుంది. కాబట్టి మీరందరూ త్రాగుడు మానివేసి అన్యోన్యసహాయంతో ఆరోగ్య సౌభాగ్యాలను పెంపొందించుకొని దేశసౌష్టవానికి సహాయపడండి" అప్యాయంగా సమాధానం చెప్పింది సునంద.

తాగినవ్యక్తికి స్పృహవచ్చిందేమో, వాడువచ్చి "ఏటి చలవిత్తున్నారు దొరసానమ్మొగోరూ" అని వినయంగా చేతులుమోడ్చి నిలుచున్నాడు. వాణ్ణి సీత పోల్చుకొని "అరె! దానయ్యా ... నువ్వేనా ఫారెస్టు అఫీసు ఛప్రాసిగా పనిచేస్తూ పెద్దపెద్ద అయ్యగార్లదగ్గర తిరుగుతూ అన్ని విషయాలు తెలుసుకొంటూ నేర్చుకున్నది, తాగితందనాలాడటమేనా? యిదేం పాడుపని?" అన్నది.

"ఛెమించాలండమ్మొగోరూ, పేద కొంపలేపు మీపాదాలు పడినాయి. ఎంతపున్నెం సేసుకున్నా(వో యియ్యాల! నెలముప్పయి రోజులో యిరవైతొమ్మిది రోజులు అడవులో, కొండలో, ఎండనక, వాననక, శరీశారోగ్గెం రచ్చించుకోడానికి కూసింత తాగుడబ్బేసమైంది తల్లీ, మొదటిబే(వ వదల్లేక కాసింత సుక్కేసికుంటే శరీరానికి బలం కూడుకొత్తదని తాగేత్తానండమ్మగోరూ, ఆ తాగిన మైకాన నేనేటిసేసింది నాకేతెల్దు! రేత్తిరి ఫారెట్టు సాయిబుగారు కూత్తంత చలవు దయసేసిం(డు యియ్యాల తాగి తొంగున్నాను తల్లులూ, ఈ పాలి నాతప్పుకాయండి. మరి మాగూడెంవో(ల్లందరూ కూడ తాగరండమ్మగోర్లూ దైవతంసాచ్చి" అంటూ లెంపలేసుకున్నాడు.

శత కంఠాలొక్కుమ్మడి జయధ్వనులు కురిపించాయి. వాళ్ళ వుత్సాహోద్రేకాలు కాస్త చల్లారేక రోగిష్టులగు బిడ్డలకు హాస్పెటల్‌కి పంపే యేర్పాటుచేసి, సంతృప్తి హృదయాలతో సీతా, గీతా, సునీతా విజయహాసాలతో సునంద ననుసరించి తమ నివాసాల కనుసరించారు.

"ఎలావుందర్రా మన క్యాంపు?" నడుస్తూ చిరునవ్వుతో ప్రశ్నించింది, సునందాదేవి.

"సంఘసేవయనే మోహన మంత్రంలో ఎంతటి మహిమ వున్నదక్కాయ్" అన్న జవాబువిని లోలోనవారి నాశీర్వదించుకున్నది సునంద.

అలసిపోయిన ఆసహోధ్యాయినుల మొహాలో ఆనందం తొణికిసలాడుతూంటే "వందేమాతరం — మహాత్మాగాంధీకీజై" అనే విజయనాదం వారికంఠాల్లో వెలువడి ప్రతిధ్వనించింది.

ఎదురుగా పార్కులోనున్న "జాతిపిత" బాపూజీ శిలాప్రతిమ వదనంలో దరహాసవీచికలు వెన్నెల వెలుగుల్లా వెదజల్లు తున్నయ్!



# ఇల్లరికం

శ్రీ కె. శశాంక్.

(గత సంచిక తరువాయి)

## ౧౧

రామం ఆలోచిస్తున్నాడు. - ఆనాడే తను ఈ పైపై మెఱుగులకు భ్రమ పడకుండా ఉంటే, మాలతిని చేసుకుని శుభ్రంగా, హాయిగా ఉండేవాడు కాడూ? జీవితం రాను రాను ఇంత కష్టభూయిష్ఠ మౌతోందేం? - శశిచేత ఇన్ని మాటలూపడి, సహనంతో ఊరుకునీ, రామ్‌ప్రసాదుగారి చేతా, ఆయన భార్యచేతా బుద్ధిచెప్పించు కుండేవాడూ తానే అవుతూ. ఇంకా ఈపాడు యిల్లరికంపాలే బడాలా? రామానికి విపరీతమైన అసహ్యంపుట్టుకొచ్చింది. అతని కిప్పుడు హఠాత్తుగా "శశికి విడాకులిస్తే?" అని ఆలోచన కల్గింది.

కాని ఒకనాడు ఉద్యోగం కోసం సహృదయుడైన రామ్‌ప్రసాదుగారి ప్రాపుకోరి, అనుకోకుండా ఆయన కోరిక ప్రకారం సద్భావంతోకాక, ఏదో అందలాల నెక్కగలనన్న భావనంతో శశిని స్వీకరించి, ఇప్పుడుతానూ, నూతన ప్రపంచంలో మనిషినంటూ వ్యవహరించ గల తాహతు సంపాదించి, ఆ గౌరవమూ, మర్యాదా తనకు దక్కగానే, మామిడి పండును అంతాతిని టెంకను అవతలికి విసిరి పారవేసినట్లు, వాళ్ళనూ - అందులో ఇరవైరెండేళ్ళ నవ యౌవని శశిని అగాథంలోకి తోసిపోవటమన్నది అతనికి అసమంజసంగా తోచింది. ఈ ఆలోచనలతో అతను శశిని క్షమించటానికే నిశ్చయించుకున్నాడు.

రామ్, శశీ రేడియోదగ్గఱ కూర్చుని ఏదో చదువు కుంటున్నారు. ఆనాడు శశి ఏముహూర్తాన ఉందో "క్యారమ్స్ ఆడుదాం రామ్?" అంది. "సరే" అన్నాడు.

ఇద్దరూ ఆడుతున్నారు.

"మాలతి రెండు వారాలనుంచి మనింటికి రావటం లేదెందుకు?" అని అంది శశి.

"ఏమో?"

"మాలతిని చిన్నప్పుడు నీకిద్దామనుకున్నారా?"

"అవును"

"నీకూ యిష్టంగా ఉండేదా"

"అవన్నీ యిప్పుడు నువ్వడగచ్చా? తప్పుకాదూ?" అన్నాడు రామ్.

శశి నాలుక కొరుక్కున్నది. ఏమీ మాట్లాడలేదు. .... ఆడుతూ, ఆడుతూ, రామ్ కాయన్స్‌ని కొట్టటం చూసి నవ్వి "క్యారమ్స్ ఆడటం చేతకాదు; ఏమీ చేతకాదు చివరికి ప్రేమకూడా ఇంకోరు నేర్పాల్సి వస్తుందేమో?" అంది.

ఛలోక్తిగా అన్న ఆమె మాటలకు రామ్‌కూడా నవ్వాడు.

"నాకేమీ చేతకాదు శశీ! నిజం నువ్వు చెప్పింది—"

"ఘనులన్న మాట!" అంది మళ్ళా నవ్వుతూ.

రామ్ హఠాత్తుగా విచార సముద్రంలో మునిగిపోయాడు. పెళ్ళి కాక ముందు శశి ఎంత చలాకీగా ఉండేదో అతనికి తెలుసు. కాని పెళ్ళి అయినప్పట్నుంచీ ఆమె హృదయం సంకుచితమైపోయింది. ఇందుకు మరి తనేగా కారకుడు? భర్తకు భార్యా, భార్యకు భర్తా, ఇద్దరి మధ్యాఎవళ్ళ కెటువంటి అపోహ కల్గకుండా నమ్మకంగా జీవితం వెళ్ళబుచ్చగల్గేట్లు ప్రవర్తించవద్దూ? అట్లాకాకుండా మాలతి ఎదుట పక పక మంటూ,.... ఎవరి ఎదుటైనా, తాము ఎంతో ఆనందంగా ఉన్నట్లు నమ్మిస్తూ, చాటుగా పోట్లాట సాగించే వాళ్ళంటే అందుకు బాధ్యులు? శశి హృదయం అనుమానంతో నిండిపోయిందంటే తప్పేమీ లేదు. మాలతిని చూస్తూంటే అతని బుద్ధి తప్పకుండా అప్పుడప్పుడు చలించి తీరుతుంది!!— ఇంకెప్పుడూ తనలో నీచత్వానికి స్థానమివ్వకూడదనుకున్నాడు రామ్! ప్రేమగా "శశీ!" అని పిల్చాడు.

"ఏమిటి?" అంది బోర్డుమీద ఉన్న దృష్టిని అతని మీదకు త్రిప్పుతూ అమాయకంగా.

"ఎప్పుడూ ఇలాగే ఉండు శశీ ! నాకిదే ఆనందం !!" అన్నాడు పిపాసతో, బ్రతిమాలుతున్న స్వరంతో.

ఆడటం ఆపేసి, ప్రశాంతంగా, గంభీరంగా అంది శశి. "అవును. అట్లాగే ఉంటాను.... ఇంత వరకూ నేను మాలతిని అనుమానించేదాన్ని. కాని ఆ నిర్మలబుద్ధిగల ఆమె ప్రకృతి నాకు అర్థమైంది.... మాలతి సుచరిత. చలించమనన్ను క్షమించు రామ్ !—" కొంచెం సేపాగి మళ్ళీ అన్నది. "నేను భారతస్త్రీని. భర్త ఎట్లాఉన్నా, అతన్ని గౌరవంగాచూడటమే భారతస్త్రీల లక్ష్యం. దీన్ని ఆధునికులెంత నిరసించనీగాక!- రామ్! ఇకనుంచీ ఇదే నామార్గం"

రామ్ హృదయం ఆనందంతో నిండిపోయింది. "అదే నా జీవిత సార్థకత!" అన్నాడు ఆమెను అనునయిస్తూ. "శశీ! భార్యాభర్తలు ఒకరినొకరు అర్థంచేసుకోవాలి. విశ్వాస భరితం కావలసినవారి హృదయాల్లో ఏఒక్కరికది అలభ్యమైనా, అది స్వర్గధామంకాలేదు. ఇవి సామాన్యపు మాటలే!.... ...."

సుశి B. Sc. పాసైంది. రామం ఇష్టపడితే M. Sc. చదవాలని అనుకున్నది. ఈ మధ్య ఆమె ఒక జర్నలిస్టుగా కూడా తయారైంది. ఆమె వ్యాసాలూ, కథలూ అన్నీ పత్రికల్లో ప్రచురణలౌతూంటే, అందులోని ఆనందాన్ని ఆమె అనుభవించేది. మరెందులోనూ కూడా ఆమెకు ఆసక్తి ఉండేదికాదు. గుంటూరులో ఒక్కతె ఉన్న కమల ఎలాగో జీవితం సాగిస్తోంది. ఇప్పుడు ధనానికి ఇబ్బంది లేదు ఆవిడకు. రామం ఆవిడకు కావలసినంత పంపుతాడు. కాని ఆవిడ కూడా బాహ్య విషయాలు ఎక్కువగా పట్టించుకోవటం మానేసింది. ఆమె కూతురు లలితకు నాలుగేళ్ళు వెళ్ళి ఐదో ఏడు వచ్చింది. ఆ అమ్మాయిని బళ్ళో చేర్పించారు. చిన్నప్పట్నుంచీ జబ్బులలో నైతేనేం, మరెందువల్లయితేనేం, ఒళ్ళి మందమతిలా అయిపోతున్నది. ఈ అమ్మాయిని గూర్చే కమల దిగులు. మాటలు ముద్దముద్దగా మాట్లాడటం, నడక పరుగెత్తే విధంగానూ, చాల అందవికారంగా ఉండేది. తనే ఒకవేళ పోతే, ఈ అందవికారపు పిల్లను ఓర్పుగా ఎవరు భరిస్తారు? రామం భరించగలడు ! కాని అతనిలో అప్పుడప్పుడు రేగే కోపానికి ఒకప్పుడీ పసిపిల్లే గురి అవుతూండ వలసి వస్తుందనీ ఆమెకు తెలుసు. సుశి ! ! అదివి గోడుది ! తన శరీరస్థితే సరిగా చూసుకోలేనిది ! !— శాంత ! ! ఊహుఁ !— ఆమెకేవిధంగా ఉన్నా, "శాంత" అన్న పేరే బాగాలేదని ఆమె పేరు "ఉష"గా మార్చిన సూర్యప్రకాశ్ ఇలాంటి అమ్మాయిని తన యింట్లో ఉండటాన్ని సహించగలడా? అందులో ఇంగ్లాండుకి కూడా వెళ్ళి వచ్చారిద్దరూ !— నిజంగా అదృష్టమంటే శాంతదే ! !— ఆమెకు ఎటుపోయి, ఎటు వచ్చినా, మాలతే అన్నిటికీ, అందరికీ అండలా కన్పిస్తోంది. ఆమె తల్లితండ్రుల సౌమ్యత కూడా ఆమెకు తెలుసు.— అందుకే ఆమె ఆశ అంతా అందరి మీదా వెదజల్లుకోటానికి వీలు లేకుండా, ఒక్క మాలతి పైనే కేంద్రీకరించుకుంది.

ఇట్లాగే రెండు సంవత్సరాలు గడిచాయి. మాలతి మద్రాస్‌లోనే ఒక కాలేజీలో రెండున్నర సంవత్సరాల నుంచీ లెక్చరర్‌గా పని చేస్తోంది. సుశి M. Sc. పాసైంది. ఆమె అభిలాష ననుసరించే రామం ఆమెను పైకి తెచ్చాడు. మొత్తం మీద ఇదొక్కటే అతను చేసిన మంచి పనేమో??—

ఈ మధ్య అప్పుడప్పుడు, శశీ రామ్‌ల మధ్య జరిగే పోట్లాటల కంతేమీ లేకపోయినా, ఇద్దరూ సద్దు కుంటూనే గడిపారు....

ఒకనాడు అర్ధరాత్రి కమలకు ప్రమాదంగా ఉన్నదంటూ రామానికి టెలిగ్రాము వచ్చింది. కానీ రామ్ వచ్చే లోపుగానే ఆమె చనిపోవటం, చుట్టుప్రక్కలవారి దయా ధర్మాలవల్ల ఆమె దహన సంస్కారాలు కూడా ముగిసి పోవటం జరిగింది. లలిత !— పసిపిల్ల ! !

రామూ శశీ, ఇద్దరూ వెళ్ళి మిగిలిన కర్మకాండ అంతా పూర్తిచేసి, లలితను వెంటపెట్టుకుని, స్వంత ఇంటిని ఒకళ్ళకు అద్దెకిచ్చి, మద్రాస్ చేరుకున్నారు. తల్లి లేని పిల్ల కాబట్టి, కొన్ని రోజులు లలిత మాద్యాంన్ని ఎవరూ గుర్తించకుండా, జాలిగా అన్నీ చేయటం, మొదలు పెట్టారు. ఆ అమ్మాయిలో పెరుగుదల సూచనలు కూడా కన్పించకపోవటంతో మరీ అసహ్యంగా తయారైయింది.— కాలక్రమాన నలుగురిలో ఈ పిల్ల తనకు తలవంపులుగా ఉందంటూ శశి బాధపడటం మొదలు పెట్టింది. రామానికీ ఒక్కొక్కప్పుడలాగే అనిపించినా, కమల జ్ఞాపకం రావటంతోనే కృతజ్ఞతగా తలవంచేవాడు.

ఈ అమ్మాయివల్ల రామానికి శశి ఈసడింపు లెక్కువైనయ్. సుశి కూడా త్వరలోనే ఎక్కడన్నా లెక్చరర్ అవగానే, చెల్లెలు కొబట్టి పరిస్థితులను తెల్పి ఆమెకు ఒప్పగించుదామనుకున్నాడు.— అట్లాగే లలితను సుశికి ఒప్పజెప్పాడు. కాని ఆ అమ్మాయి వల్ల ఈ అమ్మాయికెందులోనూ అభ్యుదయం లేకపోగా, ఆ అమ్మాయి చేత అన్నం తినిపించటం కూడా సుశికి ఒక గండంలా తోచేది. "అమ్మా!" అని ఆ అమ్మాయి ఏడిస్తే, దాంతోపాటు సుశి కూడా, దాని బాధలో పాలు పంచుకుంటూ ఏడ్చేది. "తల్లి చచ్చిపోయిన వాళ్ళము" అనుకుంటూ భావ పూరితంగా ఆలోచిస్తూ కూర్చునేది. ఈ పరిస్థితులను కనిపెట్టి ఒకనాడు మాలతి అన్నది సుశితో "ఏమిటే! అది ఏడిస్తే దాంతోపాటు ఏడుస్తూ కూర్చుంటావేం? నీ భావాలూనూ నువ్వూ! దాన్ని ఓదార్చలా? లేకపోతే అట్లా నువ్వు ఏడిస్తే అది భయపడిపోదూ?"

సుశి విచారంగా లలితకేసి చూసి నవ్వింది. "గుండె తరుక్కుపోతుంది ఒదినా!" అంది. మాలతి కూడా ఆ అమ్మాయి స్వరూపమూ అదీ చూసి దుఃఖాన్ని గ్రహించుకుని "నువ్వా అడవి గోడుదానివి. ఇంక నీతోడు ఇది కూడానా? బావవాళ్ళింట్లో ఉన్నదాన్ని నువ్వు తీసుకు రావటం ఎందుకుచెప్పు? మహా బాధ్యత తెలిసినదానిలా!" అని అంది.

"నీ దగ్గర నాకు దాపరిక మేమీలేదు. ఎవరితోనూ చెప్పవద్దు" అని సుశి అంతా చెప్పింది.

మాలతి ఆశ్చర్యపడింది. అసలు శంకరయ్య పోయినప్పట్నుంచీ కూడా వీళ్ళు, ఒకళ్ళకొకళ్ళకు సంబంధం లేనట్లు ప్రవర్తించవలసి వచ్చింది. మధ్య తగాదాలూ ఏమీ లేకపోయినా, ఎదో ఒక గోచర శక్తి వీళ్ళను, ఎవరి దారివాళ్ళదే నన్నట్లు, ఒక్కొక్కళ్ళనీ దూర దూరంగా విసిరి పారేయటానికి ప్రయత్నిస్తోంది. లేకపోతే ఇంగ్లండు వెళ్ళొచ్చిన తర్వాత ఒక్కమాటు ఏం వచ్చిందో, అంతే!! మళ్ళీ ఇప్పటికి మూడేళ్ళ వరకూ ఇటు తిరిగి చూడనే లేదు ఉష!!— మాలతి హృదయానికి దెబ్బ తగిలింది, ఇంకొరిచేత మాట పడలేని రామం కూడా ఈ నాడు, ఆత్మాభిమానంతో ఏదీ ఎవరితోనూ చెప్పలేకపోతున్నాడు!!—

"నా దగ్గర ఉంచుకుంటాను సుశీ! నీ దగ్గర ఉంటే ఈ పిల్ల ఇహ ఎందుకూ పనికిరాదు" అంది మాలతి.

"నిజంగానా! నేనూ అదే అనుకుంటున్నాను ఒదినా! నాకు తెలుసు. నీలాటి వాళ్ళే ఇటువంటి వాటికి సమర్థులని.— మా పిన్ని ఋణం నేను ఈ విధంగానైనా తీర్చుకోటానికి ప్రయత్నిస్తాను. కన్న తల్లిలా ఆదరించేది ఒదినా!" అంది పసి పిల్లలా.

మాలతి చిన్న నవ్వు నవ్వింది. "నీకంటే ప్రపంచంలో అమాయకులంటూ ఎవరైనా ఉంటారేమో నాకు తెలియదు సుశీ!" అన్నట్నుంది ఆమె నవ్వు.

"ఈ పిల్ల మీద నీకు అసలేమీ బాధ్యత ఉన్నది ఒదినా? అవలీలగా అనేసావు?" అంది సుశి.

"మనిద్దరి మధ్యా ఏముంది మరి? చెప్పు చూద్దాం. ఏవో భావగర్భితంగా ఆలోచిస్తావుగా మరి!"

సుశి నవ్వింది. "ప్రేమ ఉంది" అన్నది. మాలతి కూడా నవ్వుతూ "బాగా చెప్పేశావు. అదే ఇదీను" అన్నది. "నీ అమాయకత్వాన్ని చూసి స్టూడెంట్స్ గోల చేయటం లేదు కద!" అంది.

"ఏమో! నేనేవీ వినిపించుకోను. నాకు తెలిసినంత మట్టుకూ వాళ్ళకి నేనంటే అభిమానమే!"

మాలతి భుజాలెగరేసి నవ్వింది.... తర్వాత కొంచెం సేపుండి ఆ అమ్మాయిని తీసుకుని ఇంటికెళ్ళిపోయింది. ఎటొచ్చీ కమల ఊహే నిజమైంది. కావలసిన వాళ్ళందర్నీ వదలి, ఆమె ఒక్క మాలతి మీదే ఆశ పెట్టుకున్న దంటే మాలతి స్త్రీ హృదయాన్ని నిరూపిస్తోందన్న మాట.

ఒకనాడు రామం లలితనుచూసి పోదామని సుశి రూమ్‌కొచ్చాడు. సుశి జరిగినదంతా చెప్పి "ఒక్క మాలతే అన్ని విధాలా మనల్ని కనిపెట్టుకుని ఉంటోం దన్నయ్యా! మరీ అనుకుంటే మనకంటే వయస్సు మించిందేమీ కాదు కాని మాలతి హృదయం ప్రేమ పూరితమైనది" అంది.

రామ్ నిట్టూర్పును అణచుకున్నాడు. అటునుంచి మాలతి దగ్గరకెళ్ళారిద్దరూ. లలిత బళ్ళో చదువుకుంటున్నది. బడి జీతం, బట్టలూ అన్నిటికీ సుశే డబ్బిస్తోంది

"నా దగ్గరే ఉంచుకుంటాను మాలతీ!" అన్నాడు అభిమానంతో రామం.

"ఎందుకు బావా! అయినా పాపం దీనికి ఏమి చేయాలి? ఉండనీలే!" అన్నది. మాలతి "నాన్న ఎల్లుండి ఒస్తున్నాడు"

"మామయ్యా?"

"అవును. ఊరికే వచ్చి చూసిపోదామని ఒస్తున్నాడు. ఈ సెలవలకు నేను అక్కడికి వెళ్ళను. అందుకని ఒక వారం రోజులు సెలవు పెట్టి చూడటానికి ఒస్తున్నాడు" అంది మాలతి.

రామ్ సందిగ్ధంలో పడ్డాడు. మామయ్య వచ్చి, లలితను చూసి ఏమనుకుంటాడు? తను మాలతిని చేసుకోకపోగా, ఆమెను ఒక బాధ్యతకు గురి చేసినందుకాయన కోప్పడడూ?

"లలితను నా దగ్గరే ఉంచుకుంటాను మాలతీ! ఇవాళ తీసికెల్తున్నాను"

మాలతి కంగారు పడ్డది.

"ఏం బావా? ఉంటే నాకేమీ కష్టం లేదు"

రామ్ నిజాన్ని ఎట్లా చెప్తాడు? తను సుశి కొప్పజెప్తే, సుశి ఆమె కొప్పజెప్పినందుకు సుశి మీద కోప్పడ్డాడు.

"నేనే తీసుకొచ్చాను బావా! సుశిమీద కోప్పడతా వెందుకూ? అది మొదట నాతో ఏమీ చెప్పలేదు. ఇది ఏడిస్తే, దాంతోపాటు అదీ ఏడుస్తుంది.—ఇక లలిత మరీ ఇదై పోదూ? అయినా నేను పరాయిదాన్ని కాదుగా బావా!" అంది మాలతి.

రామ్ ఇంకేమీ మాట్లాడలేదు. సుశి దీనంగా "ఒదినా! నేనే తీసికెళ్ళిపోతాను దీన్ని" అంది. సుశి మొహం చూసి మాలతి పక పక నవ్వింది.

"అక్కర్లేదు సుశీ! దీన్ని తీసుకుపోతే నామీద ఒట్టు" అనేసింది చప్పున.— వెంటనే రామాన్ని చూసి సిగ్గు పడ్డది. ఆ మాట అన్నందుకు రామం మరేమీ మాట్లాడ కుండా సుశితోపాటు వెళ్ళిపోయాడు.

౧౦

వికల మనస్కుడై రామ్ ఇంటి దారి పట్టాడు. కారులో కూర్చున్నా, అతనికి ముళ్ళమీద కూర్చునట్లు న్నది. ఈ ఇల్లరికం తన ఆత్మీయులందరినీ, తననుంచి వేరు చేసినట్లు బాధపడసాగాడు. తనూ, శశీ తప్ప అంతా ఒడుదుడుకులు లేకుండా హాయిగా ఉంటున్నారు. శశి తన నెందుకు నిర్లక్ష్యంగా చూస్తోంది?— రామ్‌కి తన మీద తనకే అసహ్యం వేసింది. కారును తిన్నగా బీచ్ రోడ్‌కి దారితీయించాడు....

సముద్ర తీరాన్న కూర్చుని రామ్ తనకు దాంపత్య సుఖం లేకపోయినందుకు రెండు వేడి కన్నీటి చుక్కల్ని సముద్రుడికి "ఇవే ముత్యాలు" అన్నట్లుగా అర్పించాడు. ఇంక ఈ జీవితమంతా ఇంతేనా?— అయినా శశి తన ననుమానించిందంటే తప్పేముంది? మాలతిని గూర్చి అతనికి లోలోపల బాధ రగుల్కొనేది. ఆమెను గూర్చి ఆలోచించకూడదని ఎన్నోమార్లు అనుకునేవాడు. కానీ అతనికి తెలియకుండానే అతనిలో, ఏమూలనుంచో మాలతికై ప్రేమ ప్రవాహం కొట్టుకొచ్చేది. మాలతి శశి కంటే అందమైనదేమీ కాదు. కాని మాలతిలో ఉన్న కోమలత్వం శశిలో ఎక్కడ ఉన్నదీ?— తన పక్కవాళ్ళ నెవర్ని చూసినా శశికి నిరసనే—

అట్లా ఆలోచిస్తూ అతనెంత సేపు కూర్చున్నాడో తెలీదు. అతన్ని వెతుక్కుంటూ ముసలి డ్రైవరు వచ్చాడు. "సెవెన్ తర్టీ ఆయెడ్తుసార్! ఇంటికాడ భయపడ్తూంటురు. రండిమీ!" అన్నాడు.

రామ్ మాట్లాడ కుండా లేచాడు.

"నువ్వింటికి వెళ్ళు. నేను తర్వాత వస్తానని చెప్పు" అన్నాడు.

"అదేందీ?" అన్నాడు డ్రైవర్.

"నువ్వెళ్ళవోయ్. అదేందీనూ, ఇదేందీ?— నేను తర్వాత వస్తానని చెప్పు వెళ్ళు."

డ్రైవర్ వెళ్ళిపోయాడు. రామ్ కాలినడకన సుశి రూమ్ చేరాడు.

"ఇదేమిటి అన్నయ్యా" అంది సుశి.

"ఏమీలేదు. హోటల్‌నించి కారేజి తెప్పించు" అన్నాడు. సుశి పని పిల్లను పిల్చి అన్నం తెప్పించింది. రామ్‌కు సయించకపోయినా కొంచెం తిని లేచాడు.

"ఏమీ తినలేదేమన్నయ్యా?"

"ఏమీలేదు సుశీ! బాగా నిద్ర వచ్చేస్తోంది పక్క వేయి. పడుకుంటాను"

సుశి పక్క వేసింది. రామ్ పడుకున్నాడు గానీ, నిద్ర పట్టలేదు. ఆవేదన అధికమౌతోంది.

"ఇంటికెళ్ళకుండా ఇటు వచ్చావేమన్నయ్యా?" అని ఆదుర్దాగా అడిగింది సుశి.

"ఊర్కే-నే"

సుశి మాట్లాళ్ళేదు.

పొద్దున్నే నిద్ర లేవగానే రామ్‌ప్రసాద్‌గారికొక ఉత్తరం రాసి పంపించాడు. అది చూసుకుని అయన రామ్ దగ్గరకొచ్చాడు. వాళ్ళను చూడగానే మొదట రామ్ కింకర్తవ్యతా మూఢుడై కొంచెం సేపు స్తబ్ధుడై ఉండి పోయినా తర్వాత అన్నాడు.

"శశికీ నాకూ ఇంక సంబంధం లేదు."

రామ్‌ప్రసాద్ గాద్గదికంగా అన్నాడు. "ఎట్లా నాయనా అట్లా అంటే? అది ఇంక ఏ పైనా తప్పులు చేసేట్లయితే మేము పూచీగా ఉంటాం. క్షమించు బాబూ!"

"బాబూ! మమ్మల్నీనాడు నలుగురిలో నవ్వుల పాలు చేస్తావా? శశికి నేనెన్ని మాట్లు బుద్ధి చెప్పినా అది దాని పద్ధతి మానుకోలేదు నాయనా! ఇకనుంచి అది ఏమీ అనదు నిన్ను. రా నాయనా!" అని అత్తగారన్నది.

"అవన్నీ ఎప్పుడో అయిపోయాయిలెండి. ఇల్లరిక మన్నంత మాత్రాన మనిషిని గడ్డిపోచకన్నా హీనంగా చూడటంమాత్రం అన్యాయం. ఈ అరేడు సంవత్సరాల నుంచీ నేను కాబట్టి ఊరుకున్నాను. ఇంక మా చెల్లెల్ని నేను దగ్గరుంచుకుందుకు కూడా వీల్లేనట్లుగా ఈసడిస్తూండే, నేనెవరిననుకున్నది?- శశినే రానివ్వండి, ఏమి జవాబు చెప్తుందో చూద్దాం" అన్నాడు రామ్.-

చాలాసేపు బ్రతిమాలిన తర్వాత లాభం లేదని తెలిసి, లాయర్ దంపతులు ఖిన్న వదనులై గడప దాటారు. వాళ్ళను కారుదాకా పంపించి వస్తూ "మీరేమీ బాధ పడ కండి. అన్నయ్య మనస్సు ఇట్టే మారిపోతుంది. నాలుగు రోజుల్లో అక్కడికి తిరిగి వచ్చేట్లు చెయ్యొచ్చు." అని సుశి అన్నది.

రామ్‌ప్రసాద్ ఒచ్చే కన్నీటిని నిగ్రహించుకుంటూ అంతాభగవంతుడిదే నన్నట్లు చెయ్యి ఊపి సుశి తల నిమి రాడు మెల్లగా. తర్వాత కారు సాగిపోయింది.

కాలేజీకెళ్ళే టైమ్ మించిపోయింది. సుశి లోపలి కెళ్ళే సరికి రామ్ గోడ ప్రక్కకు ముఖం త్రిప్పుకుని కన్నీరు తుడుచుకుంటున్నాడు. సుశి మాట్లాడకుండా స్నానం చేయటానికి వెళ్ళిపోయింది. "ఇది కథగా రాయ వచ్చు" అనుకుంది మనసులో.

## ౧౩

ఇది జరిగి వారం రోజులవస్తోంది. ఈ మధ్య మళ్ళీ రామ్‌ప్రసాద్‌గారు రామ్‌ని బతిమాలినా అతను తన పట్టు వదలేదు. శశికీ తనకూ సంబంధం లేదని పైకి అతను చాల మాట్లు అన్నాడే కానీ, అమెను గూర్చి అతను మధన పడసాగాడు. శశి స్వయంగా వచ్చి తన్ను క్షమించ మని అడిగితే అప్పుడు వెంటనే మళ్ళీ అమెను స్వీకరించు దామనుకున్నాడు.

ఆనాడు అతనికి ఒక కేసులో వెయ్యి రూపాయలు వచ్చినయ్. అవి జాగ్రత్తగా కవరులో పెట్టి, ఫ్యాన్ కిచ్చి, అదేమిటో అతనికి చెప్పకుండా, రామ్‌ప్రసాద్‌గారి కివ్వ మని పంపాడు. లోపల "బి. యల్. చదివించినందుకు" అని మాత్రమే రాశాడు.

రామ్‌ప్రసాద్‌గారు ఆశతో అది విప్పి చూసి, డబ్బూ! పైగా "బి. యల్. చదివించినందుకూ!" అని ఉండటం చూసి ఉగ్రులై పోయారు. వెంటనే ఒక కలం కాయితం తీసుకుని ఇట్లా రాశారు. "చేసిన అవమానం చాలక, మమ్మల్ని డబ్బు కాశపడేవాళ్ళకు మల్లే చూశావు. బి. యల్. కి ఇంకా తక్కువైందని తెలియలేదా? ఈ డబ్బు నా కక్కర్లేదు. ఎవరికో నా ప్రాపు కోరినవాళ్ళకు చదువు చెప్పించానని అనుకుంటాను. నేను అసహాయుడినని అనుకోకు. తాటాకు చప్పుళ్ళకు బెదిరే కుందేళ్ళను కాను. మంచి మూడ్‌లో ఉండగా నీ డబ్బు ఒచ్చింది. లేకపోతే ఈపాటి కది వేస్ట్‌పేపర్ బాస్కెట్‌లో పడి మూల్గు తూండేవే........" అని రాసి, కవర్‌లో పెట్టి ఫ్యాన్ కిస్తున్నారు. ఈలోగా శశి వచ్చింది.

"ఏమిటి నాన్నా అది?" అంది రామ్ ఫ్యాన్‌నిచూసి.

"మహాశయుడు బి. యల్. చదివించినందుకు డబ్బు పంపాడు. ఏమిటమ్మా ! వెధవ వ్యవహారంగా ఉందీ?"

శశి నాలుక కొరుక్కున్నది.

"ఆ డబ్బూ అవి నా చేతికివ్వండి. వారినేమీ అన వద్దు మీరు. నే నిప్పుడే వస్తా"

"ఎక్కడికెల్తావు?"

"నేనే ఆయన దగ్గరకెళ్ళి వస్తా, పద షణ్ముగం"

"నడిచి వస్తారా అమ్మగారూ?" అన్నాడు షణ్ముగం.

"అవును. పద బస్‌మీద పోదాం ఇద్దరమూ"

"నువ్వెందుకు శశీ అక్కడికి? ఇంకా నాలుగు మాటలు అని పంపటానికే అతను కనిపెట్టుకున్నప్పుడు—"

మాట మధ్యలో "నాకు తెలుసు నాన్నా ! పైకి అట్లా మాట్లాడినా ఆయన ఈ విషయంలో చాల బాధ పడ్తూం టారు. ఒకమాటు నేను వెళ్ళి వస్తా" అని శశి అంది.

"సరే !— చెప్తే వినవు. కారుమీదన్నా వెళ్ళు. డ్రైవరు వచ్చాడు"

"అక్కర్లేదు. బస్‌మీద పోయివస్తా."

"నువ్వు అన్నిటికీ ఇట్లా చేశావంటే నే నూరుకోను. కారు మీద వెళ్ళు." అంటూ విసురుగా ఆయన డ్రైవర్‌ని పిల్చి, "శశినీ, షణ్ముగాన్నీ కారెక్కించు, నేనూ వస్తాను తల్లీ !" అన్నాడు గాద్గదికంగా.

"ఒద్దు నాన్నా ! మళ్ళీ ఇప్పుడే రానూ?"

"సరే"

శశి హఠాత్తుగా వంగి అతని పాదాలకు నమస్కరిం చింది. "వస్తాను నాన్నా ! ఇంక నాకేమీ బాధ లేదు. వెళ్ళే పని అయి తీరుతుంది"

రామ్‌ప్రసాద్‌గారు కంగారు పడ్డారు.

"అతని దగ్గరకేకదమ్మా వెళ్ళటం?.... అఘాయిత్యా లేవీ తలపెట్టకమ్మా ! అసలే సహం చచ్చి వున్నాము."— శశి తల్లి వచ్చి అంతా విని "జాగ్రత్తమ్మా !" అని హెచ్చరించింది. కారు గేటుదాటి శరవేగంతో వెళ్ళి పోయింది.

రామ్ డ్రెస్ చేసుకుని ఎక్కడికో వెళ్ళటానికి సిద్ధంగా నుంచుని, షణ్ముగం కోసం కనిపెట్టుకుని ఉన్నాడు.

కారు దిగి షణ్ముగం వచ్చాడు.

"సార్ ! అమ్మగారు వచ్చారు" అన్నాడు సంతో షంగా. రామ్ ఉలిక్కి పడ్డాడు. ఏదో అడిగేంతలో శశి సాక్షాత్కరించింది. అతనికి దగ్గరగా వచ్చి తల వంచుకుని నుంచున్నది.

రామ్ కొంచెం సేపుండి "లోపలికిరా మాట్లాడు కుందాం" అన్నాడు— సుశి వచ్చి, శశిని చూసి "ఓహ్ ! ఒదినా ! రా రా !— ఒరేయ్ షణ్ముగం ఫ్లాస్క్ తీసుకు పోయి కాఫీ పట్టుకురారా ! రెండు ఫ్లాస్కులూ తీసుకుపో ! ఇవాళ కాఫీ ఎక్కువగా తాగేయాలనిపిస్తోంది" అంది గుక్క త్రిప్పకుండా.

శశి ఒద్దన్నట్లు సంజ్ఞ చేసింది సుశికేసి. సుశి గమనిం చలా. "అరె ! ఇక్కడే నుంచున్నావేం ఒదినా ! రా లోపలికిరా !"

రామ్ తల వంచుకుని లోపలికి దారి తీశాడు.

శశి పర్సులోనుంచి రామ్ పంపిన కవర్ తీసింది. మృదువుగా, అది అతని ముందుపెట్టి అన్నది. "అప్పుడే పరాయివాళ్ళ మైపోయామా చెప్పండి? ఏడెమిదేళ్ళు కలిసి ఉన్నామన్న మాటకూడా మరిచిపోయారా?"

రామ్ మాట్లాడకుండా ఆమెవైపు చూశాడు. శశి మళ్ళీ అన్నది. "నిన్న మాలతి అక్కయ్య వచ్చింది. స్వయంగా నేనిక్కడికి రాకపోవటంమూలాన మీరుఇంకా బాధపడుతున్నారని చెప్పింది. అంతకుముందు ఒద్దామన్నా ఒచ్చి ఏంమాట్లాడాలో తెలియలేదు. అక్కయ్య నా మార్గాన్ని సరిగా చూపింది. —నన్ను క్షమించండి.—"

"సుశి అక్కడలేదూ" "ఇవెందుకు తీసుకోలేదు?" అని రామ్ అన్నాడు.

శశి మందహాసం చేసింది.

"తీసుకుంటామా చెప్పండి? మీరు కోపంగా అట్లా పంపకుండా, ఏదో లాంఛనంగా పంపినట్లయితే మన మధ్య ఇక యింత గొడవనే ఉండేదికాదు,— నేను ఇక్కడికొచ్చి ఇన్ని మాటలు మాట్లాడకుండా కారెక్కిం చుకుపోయేదాన్నే"

రామ్‌కేమి మాట్లాడాలో తోచలేదు.

## ఇల్లరికం

"ఇంటికి పోదాం రండి. నేను చాలా తప్పు చేశాను. మాలతి అక్కయ్యే లేకపోతే ఇవాళకూడా ఇక్కడి కొచ్చేదాన్నికాదు. మాలతిని అప్పుడు లోలోపల అవమానించినందుకు సిగ్గుపడుతున్నాను...."— అని శశి అంది. ఇందుకూ రామ్ మాట్లాడలేదు.

"రారూ?"— శశి కంఠం గాద్గదికమైంది.

"ఉహుఁ" అన్నాడు రామ్.

"రారా?"

"నన్నిక ఇట్లాగే ఉండిపోనీ శశీ: నాజీవితానికి ఆనందమంటూ యేమీలేదు. అందని మ్రాని పండ్లకు ఆశించటం నాదే తప్పయింది. నేను రాను. వెళ్ళు. నువ్వు సుఖంగా ఉండాలని ఆశీర్వదిస్తున్నాను" అన్నాడు.

శశి అతని పాదాల దగ్గర కూలబడ్డది యేడుస్తూ.

"స్త్రీలందరిలోకీ తీసిపోయానా నేను? నాకు మీరు మొదట్నుంచీ ఆమాత్రమైనా విలువనివ్వలేదు. ఇది ఎవరి తప్పో చెప్పండి. వెళ్ళిపోతాను. కాని ఎక్కడికెళ్తానో అది మాత్రం ఊహించుకోండి. ఒకనాడు అన్నాను. 'నేను భారతస్త్రీని. భర్తను గౌరవంగా చూడటం మాత్రమే నేర్చుకుంటాన'ని. మీరు జ్ఞాపకముంచుకుని నాకు బుద్ధి చెప్పవలసినదిపోయి నలుగురిలో నవ్వులపాలై పోయేట్లు చేసుకున్నారు. ఇందులో నాబాధ్యత లేదని నేననను. కాని— ఇంత ప్రార్థించినా నన్ను క్షమించకుండా ఉండగలరని నేననుకోలేదు"

రామ్ మెల్లగా "శశీ!" అని పిల్చాడు. కన్నీళ్ళు తుడుచుకుని అతని వైపు ఆశగా చూసింది శశి. "లే! ఏడవకు" అన్నాడు రామ్.

వెలుగు కిరణాలు కిటికీలోంచి మెల్లగా ప్రసరిస్తున్నాయ్. చల్లని ఆ కిరణాల చాటున మూత్నోద్వాహం చేసుకున్నారిద్దరూ.

(సమాప్తం)




# అమృతాంజనము

గాని,

" యథాయథా................కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్పుజేయు పూనికతో పెరుఁగుచున్నప్పుడెల్లను నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే నా హృదయము మిక్కిలి పరితాపమొందుచున్నది సుమా !!!

# శ్రీ జయదేవ మహాకవి

• శ్రీమతి వంగల వాణీబాయి •

అష్ట పదులనీ- గీత గోవిందమనీ- వినని వారుండరు. అనేకులు వీటిని పాడేవారునూ ఉన్నారు. కాని- అసలు ఈ కవిత్వాన్ని రచించిన వారెవరు? వారు ఎక్కడి వారు? వారి జీవిత చరిత్ర ఏమి? తెల్సుకున్నారా?

జయదేవ మహా కవిని గురించిన కొద్ది వివరాలు తెల్సుకుందామా?

జయదేవకవి 1200 ల శతాబ్దమునాటివారు. వీరి జన్మస్థానము బెంగాలులో కిందు బిల్వమను గ్రామము. వీరు ఉరియ్యా బ్రాహ్మలు. వీరి తల్లితండ్రులు భోజరాజు, రమాదేవి. వీరు చాలా సాధారణ కుటుంబీకులు, కష్టజీవులై, నిత్యము భగవన్నామస్మరణ చేయుచు కాలము గడుపుచుండిరి.

జయదేవు పసితనమునుండియూ, వంటరిగా ఊరి బయట నది ఒడ్డున కూర్చుని, భగవధ్యానము చేయుట వాడుక యైపోయెను. అట్లే కూర్చొని కొన్నాళ్ళకు ప్రకృతి పైన పద్యాల నల్లనారంభించెను. మరి కొన్నాళ్ళకు వీరికి అనతి దూరముననే గల పూరీ- జగన్నాధ స్వామిపై ననేక పాటలు కట్ట నారంభించెను.

*  *  *

ఇదే సమయమందు వీరి ఊరనే, మరియొక బ్రాహ్మణ కుటుంబీకులుండిరి. వారికి బిడ్డలు బ్రతకని కారణమున- వారి మొదటి కన్యను పదునారవ యేట శ్రీ జగన్నాధ స్వామికి ఇస్తామని మ్రొక్కుకొని యుండిరి.

అట్లే, వారి అమ్మాయి యుక్త వయస్సుకు రాగానే తల్లితండ్రులు ఆ బాలికను, జగన్నాధ స్వామి కోవెలకు తోడ్కొని పోయి, ఆ ఆలయమందే వదలి, వారు తిర్గి వారి ఇండ్లకు పోయిరి.

ఆ బాలిక పద్మావతి మూడు రాత్రులు, మూడు పగళ్లు అట్లే జగన్నాధస్వామి చరణముల చెంత పడి యుండగా— ఆలయమందే నివసించు ఇతర బ్రాహ్మలు, పూజార్లు మొదలైన వారందరికీ ఒకనాటి రాత్రి- స్వప్నమందు జగన్నాధస్వామి కనబడి "ఈ అమాయకురాలైన భక్తురాలు- ఈ కన్యను- తోడ్కొనిపోయి ఊరి బయట భగవధ్యానములో నిమగ్నుడైయున్న- జయదేవు అను బాలకున కిచ్చి- వివాహము చేయవలసిన"దని ఆజ్ఞాపించి అంతర్ధానము నొందెను. వారునూ తెల్లవారే లేచి, వారి వారి స్వప్నమును ఒకరికొకరు తెలియబర్చుకోగా- అందరి స్వప్నము ఒకటిగా తెల్సుకొన్న వారై, "ఇది భగవదేచ్ఛ" అని గ్రహించి, వెంటనే ఆ బాలిక తల్లితండ్రుల వద్దకు పోయి తెల్పగా, వారునూ కడు సంతసంబున తమ పుత్రికను తోడ్కొని పోయి, ఆ బ్రాహ్మణ కుమారునికి జరిగిన వృత్తాంత మంతయూ తెల్పగా, అతడునూ నవ్వి, "నావంటి దరిద్ర బ్రహ్మచారియే మీకు అల్లుడుగా కాన్పించెనా? నాకే తినుటకు కడుపునిండా భోజనము, కట్టుటకు బట్ట లేక అవస్థ పడుచుండగా, ఒక పత్నియే లోటు ఆయెనా?" అని చెప్పగా- వారు అతని పల్కుల నేమాత్రము పాటింపక, పద్మావతిని అక్కడనే వదలి, వారి గృహమునకు పోయిరి.

*  *  *

ఇట్లు కొన్ని దినములు గడువగా, పద్మావతికి తన ఎడల గల అపార భక్తి శ్రద్ధలకునూ, ఆమెకు గల కంఠ మాధుర్యమునకునూ జయదేవు మిక్కిలి ప్రసన్నుడై, తుదకు ఆ బాలికను వివాహ మాడుటకు అంగీకరించెను.

*  *  *

ఈ విధముగా యిరువురునూ చేరి భగవన్నామ స్మరణ చేయుచూ, జయదేవులు భక్తిరసమైన కీర్తనల పాడుచుండ పద్మావతి నృత్యమునూ, అభినయమునూ దేవుని సాన్నిధ్యమున సల్పుచూ కాలము గడుపు చుండిరి.

కొన్నాళ్ళకు జయదేవుల కీర్తి చుట్టు ప్రక్కల అంతటా వ్యాపింప దొడగెను. బెంగాలులోనే అప్పటి మహారాజు అయిన లక్ష్మణసేన రాజు, జయదేవుని తమ ఆస్థానానికి పిలిపించుకుని అక్కడనే ఆస్థాన పండితులుగా చేసి కొనిరి.

ఈ కాలమందే జయదేవులు తమ సుప్రసిద్ధమైన, శ్రేష్ఠమైన, గీత గోవిందమును రచించెను.

# శ్రీ జయదేవ మహాకవి

జయదేవులు తమ 19 వ అష్టపది వ్రాయుచున్న సమయమందు- ఒకనాడు- ఒక చరణమునందు, రెండు- మూడు- పదములు మాత్రమే ఈ క్రింది విధముగా వ్రాసి

"స్మరగరళ ఖండమ్
మమ సిరసి మండనమ్
దేహి పదపల్లవ ముదరమ్"

అర్ధము = రాధతో, కృష్ణుని వాక్యములుగా—

"ఓ రాధా ! ప్రేమయనెడి గరళము
నా శిరము నావహించి యున్నది.
దీనికై నీ కోమలమైన (గులాబీ రేకుల వంటి)
చరణములనాన్చి- విషమును
క్రిందకు జారునట్లు చేయుము."

జయదేవులు దీనిని ఇట్లు అసంపూర్ణముగా వదలి-తనలో తాను- "రాధా కృష్ణుని శిరముపై చరణములు ఉంచవలెనని కోరుట భావ్యము కాదని" తలచి, అది అట్లే విడచి, తన పెరటి ఇంటిలోనికి.- తలంటి స్నాన మాచరించుటకు పోయెను........ ....

ఇంతలోనే, శ్రీమన్నారాయణుడే, కవి జయదేవుల రూపముదాల్చి- నూనె వంటితో- చిన్న గావంచా గుడ్డ మాత్రము ధరించి- పద్మావతి ఉన్న చోటికి వచ్చి- "నేను వ్రాయుచున్న పుస్తకమును తెమ్మని" కోరగా ఆమెయు తన భర్తయేనని తలంచినదై- తన భర్త సగము వ్రాసి విడిచిన తాటాకు గ్రంథమును తెచ్చి భగవానుడని తెలియకయే చేతి కందిచ్చెను.

*　　*　　*

జయదేవులు సగము వ్రాసివిడచిన పంక్తులను పూర్తిచేసి తిరుగ స్నానమునకు పోవువానివలె నటించి అదృశ్యుడయ్యెను. ఇంతలోనే నిజ జయదేవులు స్నానజపాది కృత్యముల పూర్తిగావించుకొని, తన గ్రంథముకడకు పోయి చూచి, తన కావ్యము పూర్తిగావింపబడి యుండుట గమనించి, అమిత ఆశ్చర్యమును చెందినవాడై, వడి, వడి పద్మావతి దగ్గరకు పరుగెత్తిపోయి "ఇది ఏమని?" అడుగ ఆమెయూ ఇదిఏమి తనభర్త ఇట్లడుగుచున్నా డని తలచి "ఏమి, ఇంతపరాకా? మీరేగదా నూనెవంటితోవచ్చి నన్ను గ్రంథము తెచ్చిఇవ్వమంటిరి! మీరుతప్ప మరి ఎవ్వరు వ్రాయగల్గుదురు? ఇవిగో మీనూనెచేతి మరకలు కూడ అంటినై చూడండి" అని, తనభర్త అట్లు అడిగినందుకు బాధను చెందినదానివలె జవాబిచ్చెను.

అంత, జయదేవులు అంతయూ గ్రహించినవాడై, లోకరక్షకుడైన - శ్రీజగన్నాథుడే వచ్చి తన పంక్తులను పూర్తిచేసియుండునని తెలిసికొని ఎంతయూ సంతసమును చెందినవాడై, తన భార్య పద్మావతికి శ్రీమన్నారాయణుని దర్శనభాగ్యము లభించినందుకు - ఆమె అదృష్టమునకెంతయూ కొనియాడి, ఆరోజుమొదలు తను వ్రాసిన ప్రతి గ్రంథమునూ ఆమెకే అంకితమిచ్చుటయేగాక - తన గేయ చరణముల - అంతమున "పద్మావతీరమణ జయదేవ" అని పూర్తిచేయ దొడగెను. (పద్మావతీ రమణ అనిన తానే పద్మావతి భర్తయని యర్ధము !)

ఇంకనూ పద్మావతి జయదేవులకు సంబంధించిన ఇటువంటి చిన్నచిన్న కథలనేకములు గలవు.

*　　*　　*

## గీతగోవిందమను — అష్టపదులు.

శృంగార మహాకావ్యములు. జయదేవులు వీటిని అచ్చ సంస్కృతభాషలో రచించిరి. మొత్తము 24 అష్టపదులు. ప్రతి అష్టపదిగీతమునందునూ - ఎనిమిది చరణములు గలవు. అందువల్లనే వీటికి అష్టపదులనే పేరు వాడుకలోనికి వచ్చినది.

జయదేవులు ప్రతి అష్టపదికినీ, రాగము, తాళము ఇచ్చియున్నప్పటికిన్నీ, అప్పటి రీతికిన్నీ - ప్రస్తుతపు రీతికిన్నీ, చాలామార్పులు గల్గినందువల్లను, వాటికి పైన స్వరములు - అనగా Notation ఇచ్చియుండ నందుననూ - వీటిని ఎవరికి తోచినట్లు వారు వేరువేరు రాగతాళములలో అమర్చి పాడుచున్నారు.

అష్టపదులు హిందూదేశ మంతటనూ పాడెదరు. ఈ పాటలలోని భావము పూర్తిగా శృంగారరసము, భక్తిరసముతో నిండినవై, ఎంతో యింపుగానుండును.

అష్టపదులు దేవాలయములలోనూ, గానసభలలోనూ, కూడ పాడెదరు.

అనేకులు అష్టపదులను ఇతరభాషలలోకి అనువాదము **(Translate)** చేసియుండిరి. **'Sir Edward Arnold'**

(తరువాయి 40 వ పేజీలో)

# మాతృప్రేమ — మాతృసేవ

"భాగి"

మనకండ్ల యెదుట ఉన్నదేవుని మహిమను గుర్తింపలేక "దేవుడెక్కడున్నాడు, ఎలావుంటాడు?"అని అంటారు. తల్లికంటే వేరేదైవం ఉన్నదా? ప్రపంచమంతటినీ, కడుపున బెట్టుకొని మోయుచున్నది తల్లికాక మరెవ్వరు? అందుచేతనేకాబోలు 'తల్లి ఋణము దీర్చుకొనుటకు దాతకైన తరముకా'దన్నారు పెద్దలు.

తల్లి ప్రేమతో సాటియైనది మరొకటి సృష్టిలో యెక్కడాలేదు. తనబిడ్డ భూమిమీద బడ్డది మొదలు దాని యోగక్షేమమునకై నిద్రాహారములను మానుకొని, ఎన్నో కష్టాలను సైతము లెక్కచేయక. కృషిచేయునది తల్లియే కదా! బిడ్డలు విద్యావంతులై, బుద్ధిమంతులైన ఎడల వారితోపాటు సంతోషించునది తల్లి. బిడ్డల భావిజీవితమంతా తల్లిపైనేకదా ఆధారపడి యున్నది? ఇక కుమార్తెల విషయములో మాత్రం ఆతల్లికి అశ్రద్దయా లేదు. "ఇల్లు చూచి ఇల్లాలిని చూడాలి" అన్నారు పెద్దలు. ఆవిధంగా తనకుమార్తెలను తన అదుపు ఆజ్ఞలలో పెట్టుకొని వారి వారి జీవితములలో సహాయపడు పలురకముల పనులన్ని యునేర్పి, వారిని ఒకఇంటివారినిచేసి వారుహాయిగా సంసారము గడుపుచుండ చూచి మురిసిపోవును. వెయ్యిపరీక్షలైనా పాసుకావచ్చుకాని, ఒకసంసారము నిర్వహించడానికి ఏంతో కష్టపడాలి. లేకుంటే సాగనే సాగదు. అందుకేకాబోలు "సంసారం సాగరం" అన్నారు. సాగరం అంటే సముద్రం. ఇక అందులో స్త్రీ ఒకనావ, వంటిది. తానొకతె కాకుండా తన్నాధారం చేసుకొన్న వాళ్ళందర్నీ కూడా ఒడ్డుకి చేరుస్తుంది, అటువంటి శక్తికలది స్త్రీమూర్తి.

నూటికి తొంభైమంది అభిప్రాయం ఏమిటంటే స్త్రీలకు చదువెందుకు? వారిపని పిల్లల్నికని, పెంచడం అని. కాని 'పెంచుతున్నది' అనేమాటలో బ్రహ్మాండమంతా ఇమిడిపోయిందన్న సంగతి తెలియదు పాపం. ఆ సంతానం, తనకూ, తనవారికీ, తనదేశానికీ పనికికొచ్చేటట్లు చేసుకోవడం మాత్రం సులభమా? కొన్నికొన్ని కుటుంబములలో యజమాని ఆరోగ్యవంతుడు కాకపోవడం వల్ల ఇక కుటుంబ పరిస్థితి అంతయూ ఆ మాతృదేవతపైనే ఆధారపడియుండును. అటువంటి సమయములలో తల్లికే చదువు రానియెడల ఆ కుటుంబపరిస్థితి, ఆమె, సంతానంగతి ఏమికావలెను?

దేశసేవకై పాటుపడి, పేరుప్రతిష్టలు తెచ్చుకోవలసిన అనేకమంది బాలురు అన్యాయంగా చెడుత్రోవలు త్రొక్కడం మనంచూస్తున్నాము. కారణం? సరియైన తల్లి శిక్షణలేక.

తమ ఆలోచనలకు వ్యతిరిక్తముగా సలహాయిచ్చుచున్న తల్లిని అనేకవిధముల హింసించిన బిడ్డలు ఎంతమంది లేరు? తిరిగి క్షణకాలంలో తమ తల్లియొక్క పవిత్రగుణములను జ్ఞప్తికితెచ్చుకొని, తమజీవితములను ఆనందమయంగా చేసుకొన్న వారెందరులేరు?

'శిశురక్షణా, శిశుపోషణా'అనియెన్నో వ్రాతలు చూస్తూ ఉన్నాము. ఐతేమాత్రం "ఎక్కడవున్నావు గొంగళీ అంటే వేసినచోటే ఉన్నా"నందిట. ఆవిధంగా మూర్ఖపు దారే కాని సరియైనదారి ఇంకాపడలేదు. కొందరు విద్యావంతులైన స్త్రీలు తమబిడ్డలను తాముపెంచుకొనలేక, లేక తమవంటి గొప్పఇంటివారు శిశువులను పెంచుకొనుటకు ఆయాలను పెట్టుకొనక తామే పిల్లలను పెంచుకొనుట ఏమిటి అనియో, పిల్లలను పూర్తిగా ఇంకొకరి స్వాధీనం చేసి, తమమీటింగులు, తమక్లబ్బులతో ఉల్లాసంగా కాలక్షేపంచేస్తూ పిల్లలు ఎటువంటి వాతావరణంలో పెరుగుచున్నదీ కనిపెట్టలేకపోవుచున్నారు. ఇటువంటి సందర్భములలో వారుచదువుకొని మాత్రం ఏంలాభం?

వారి విజ్ఞానమును ఆ విధంగానా ఉపయోగించుట? ఒక్కొక్క తల్లిని చూడండి, ఎంత ఓపికవంతురాలో బిడ్డ భుజించని యెడల, చంకన వేసుకొని, ఏ చందమామనో, ఏ పువ్వునో చూపి, బుజ్జగింపు మాటలు చెప్పుచు తినిపించును. ఇక మరియొక తెగవారు—పిల్లవాడు తింటాడా- తిన్నట్లు, లేదా, లేదు. అంతే, పైగా అబ్బ! మావాడు అసలు సరిగా భోజనం చెయ్యడండి అంటూ అందరి దగ్గరా, చివరకు డాక్టరు దగ్గిరా అదే మాట. ఇది సాధారణముగా నాగరకత చెందిన గృహములలోని శిశు రక్షణ.

## మాతృప్రేమ — మాతృసేవ

పుట్టుకచేత మనుష్యులంతా పశువులే అన్నారు. అయితే విద్య అంటూ ఒకటి వుండబట్టి ఆ పశుత్వాన్ని తమలో బాపుకొని పేరు తెచ్చుకొన్నవారు అనేకమంది. తల్లీ, దైవం, దేశం అంటూ భక్తివిశ్వాసాలు పుట్టించి, బిడ్డల్ని పెంచడం తల్లుల కర్తవ్యం. పిల్లవాని స్వభావమును గుర్తించి జాగరూకురాలై, వాడ్ని గొప్పవాడ్ని చెయ్యడాన్కి ప్రయత్నించడమే నిజమైన సంతాన రక్షణ. తన బిడ్డల ఎదుట అప్రస్తుత ప్రసంగం చెయ్యకుండుట, పిల్లవాని ఎదుటనే, వానిని ఎందుకు పనికిరాని మొద్దుఘటం అని, శుంఠ అని దూషించకుండుట ప్రతి తల్లియు గమనించ దగిన విషయం.

ఆడదానికా చదువు? అనే రోజులు పోయినవి. ఈ కాలమందు స్త్రీలకే చదువు ముఖ్యావసరము. కనుక ప్రతీ స్త్రీ, వీలైనంత వరకు విద్య నభ్యసించి గృహకృత్యములలో నేర్పు వహించి యుండి, పల్లెటూరి వారు అన్న యెడల వెధికరణం చెయ్యడం మాని, వారిని కూడ తమతోటి సోదరీమణులని గుర్తించి వారికి కూడా తగు రీతి సంఘములో మాతృదేవత యొక్క స్థానము, శిశు రక్షణ మున్నగు విషయములను నేర్పి దేశ సౌభాగ్యమునకై ఆశించవలెను.

'తల్లే దైవం, దైవమే తల్లి' అని వేదములలో చెప్ప బడినది. మాతృ భక్తికీ, దైవ భక్తికీ, ఏమీ భేదం లేదన్నారు. మాతృ భక్తి కలిగిన ధ్రువుడు మాతృదేవి ఆశీర్వచనము వలననే కదా పరమేశ్వరుని కండ్లారా చూడ కలిగినాడు. తల్లి దీవెనల పొందియేగా మార్కండేయుడు చిరంజీవి అయినాడు. అంతటి శక్తి వంతులైన తల్లి ప్రేమ, తల్లి మహిమలు వ్రాయవలెనన్న శక్యమా?



## శ్రీ జయదేవ మహాకవి

(38 వ పేజీ తరువాయి)

అనేప్రఖ్యాత ఇంగ్లీషుకవి - గీతగోవిందమును - ఇంగ్లీషులోకి Translate చేసి "The Indian song of songs" అని పేరుపెట్టిరి.

ఇప్పటికీ, ప్రతిసంవత్సరమూ, పూరీ జగన్నాధ ఆలయమందు శ్రీ జయదేవకవి జ్ఞాపకార్ధము భజనలు సల్పి, గీతగోవిందమును పఠించుచుందురు.

శ్రీ జయదేవస్వామి ఇంగ్లీషు తారీఖుల ప్రకారం సోమవారం డిసెంబరు 28 వ తేదీ 1153 సం॥ A. D. యందు పరమపదించినట్లు తెలియుచున్నది.

గీతగోవిందము మన భారతదేశమందు ఎప్పటికినీ అనంతకాలము, శాశ్వతముగా పాడబడుచునే యుండును.

(1) వీరిమొదటి అష్టపది విష్ణుభగవానుని దశావతారములను వర్ణింప బడియున్నది.

(2) విష్ణునికొనియాడు మంగళము.

(3) వసంతఋతువుయొక్క వర్ణనము (ఇదిసాదారణముగా వసంతరాగమందే పాడెదరు)

(4) మొ॥ చ॥ చెలికత్తెవచ్చి రాధతో కృష్ణుడు ఇతర గోపికాస్త్రీలతోనే, కాలము గడపుచున్నాడనియూ, ఇంక రాధను - మరచినాడనియూ చెప్పగా, రాధ అపారమైన దుఃఖమును ఘోషించు చున్నది.

2 చ॥ మరల 2 వ చరణములో శ్రీకృష్ణుడు తననే తప్ప మరియేఇతరస్త్రీలను అంతగా ప్రేమించి యుండ లేదని తెల్పికొన్నదై, రాధ, అపరిమిత ఆనందభరితయై, గర్వించుచున్న వర్ణనము.

3 చ॥ ఇందు శ్రీ కృష్ణుడు రాధకు దుఃఖము కలుగజేసినందుకు రాధను బ్రతిమాలుతూ క్షమాపణ కోరుట.

ఈవిధముగానే ప్రతి అష్టపదియూ, చక్కనిమాధుర్యమైన భావము, భక్తిగల్గి, చదివినకొలదీ మరియూ చదువవలెనను ఉత్సాహము మరింత కలుగజేయుచూ, అందరి మనములనూ ఆనందపరవశమున ఊపివేయు చున్నట్లుండును.

ఓం, జయదేవాయనమః






# పంజరం

డి. నాగేశ్వర్.

అనగనగా ఒక విశాలమైనతోట. ఆతోట రకరకాల చెట్లతో, చూచుటకు మనోహరంగా వుంది. మధ్య చిన్న తాటాకులపాకలో రామయ్య, అతనికూతురు మాలతి నివసిస్తున్నారు. మాలతి వయస్సు పదిసంవత్సరాలు. రోజంతా తోటలో ఆడుతూ, పక్షులతోకలసి పాడుతూ వుండేది.

రామయ్యకు మాలతి అంటే చాల ప్రేమ. ప్రతిదినము రకరకాల పండ్లు ఎన్నోతెచ్చి మాలతికిచ్చేవాడు. మాలతి తోటలోగల రంగు రంగుల పూలను కోసి, తలలో ముడుచుకునేది. కోయిలతో సమానంగా "కుహూ.... కుహూ...." అని పలికేది. చిలుకలు కొరికి క్రిందపడేసిన జామకాయల్ని, తనూ కొరికితింటూ వుండేది.

మాలతికి ఒంటరిగా వుండడంచేత ఏమీ తోచేదికాదు. చెట్లమీద గెంతుతూ, పండ్లను కాయలను కొటికి పారేస్తున్న రామచిలుకలతోకలసి ఆడుకోవాలనిపించింది. చెట్టుకొమ్మమీద చిలుక వ్రాలగానే, మాలతి గబ గబా వెళ్ళి పట్టుకునేందుకు ప్రయత్నించేది. దగ్గరకు రాగానే చిలుక తుర్రున యెగిరిపోయేది. మాలతి రెండురోజులు వరుసగా చిలుకలను పట్టుకునేందుకు ప్రయత్నించింది. కానిఫలితం శూన్యం.

ఆఖరికి విసుగెత్తి, ఏడుస్తూ యింట్లో కూర్చుంది. రామయ్య ఏవోపండ్లు పట్టుకుని యింటికిచేరాడు. పండ్లను మాలతి దగ్గరపెట్టి, "ఎందుకమ్మా! ఏడుస్తున్నావ్?" అని ఆమె కళ్ళను తుడుస్తూ అన్నాడు రామయ్య.

మాలతి పండ్లను దూరంగాజిమ్మి పెద్దగా ఏడ్వనారంభించింది. "ఎందుకమ్మా! అంతగా ఏడుస్తున్నావ్? చెప్పు ఏంజరిగింది? ...." అని రామయ్య ఆమెను ఓదార్చ ప్రయత్నించాడు.

"నాకుతోచటంలేదు .... చిలుకనుతెస్తే .... దాంతో ఊఁ...." అని మాలతి అనగానే .... "చిట్టితల్లీ! ఇంత మాత్రానికేనా యేడ్పు .... రేపు సాయంకాలము మంచి చిలుకను తెస్తానులే...." అని రామయ్య ఆమెను ఓదార్చేడు. "నాన్నా! నిజంగా తెస్తావుకదూ!" అంది మాలతి ఏడుపు తగ్గిస్తూ.

మర్నాడు సాయంకాలము మాలతి తండ్రి కోసము యెదురు చూస్తూంది. రామయ్య దూరంనుండి, ఏదో బుట్ట లాంటిది పట్టుకుని వస్తున్నాడు. మాలతి తండ్రి కెదురుగా పరుగు తీసింది.

"చిట్టితల్లీ! ఇది పంజరం. దీనిలో పక్షులను పెడితే, ఎక్కడికీ యెగిరిపోలేవు .... చూడు! ఒక్క చిలుకను తెస్తే. దానికి నీలాగే ఊసుపోదని రెండిటిని తెచ్చాను .... ఏం? బాగున్నాయా?" అని రామయ్య అనగానే, మాలతి సంతోషంతో పట్టుకుని "చాల బాగున్నాయి నాన్నా!" అని గెంతులేస్తూ, పాకలోకి దారితీసింది.

పాకలో వెదురుకి పంజరాన్ని వేలాడకట్టేడు రామయ్య. మాలతి రకరకాల కాయలు, పండ్లు తెచ్చి, ముక్కలుగా కోసి తీగెసందులనుంచి పంజరంలో పెట్టేది. చిలుకలు తినకపోవడం సరికదా! మాలతి చెయ్యిని ముక్కుతో

పొడవడానికి ప్రయత్నించేవి. రామయ్య చిన్న గిన్నెతో నీళ్ళుతెచ్చి, పంజరంలో పెట్టాడు.

చిలుకలు పండ్లను తినలేదు. రోజంతా పంజరపు తీగెలను కొఱుకుతున్నాయి. మాలతి ఎన్ని విధాలప్రయత్నించినా, అవి పాడలేదు.

"నాన్నా ! ఈచిలుకలు మంచివికావు. ఎప్పుడూతీగెల్ని కొఱకడమే ... ఆచెట్టుమీద చిలుకలుచూడు యెంతబాగా పాడుతున్నాయో !" అని మూతి విరచింది మాలతి.

"చిట్టితల్లీ : వాటిని పంజరంలో పెట్టి బంధిస్తే ఎలా ఉత్సాహంగా పాడుతాయి?" అని రామయ్య పంజరపు తలుపులు తెరచాడు. రెక్కలు టప టపా కొట్టుకుంటూ, తుర్రున చిలుకలు జామిచెట్టుమీద కెగిరి పోయాయి.

జామిచెట్టుమీద చిలుకలు పాడుతూ, ఆడుతూ, పలుకు జారిన జామికాయలు తింటున్నాయి. "చూడు చిట్టితల్లీ ! ఇప్పుడు చిలుకలు యెంత ఉత్సాహంగా వున్నాయో? స్వేచ్ఛగా వున్నప్పుడే వాటిలో ఆనందం, ఉత్సాహం, కలుగుతుంది ...." అని రామయ్య ఏవేవో అంటూ వుంటే, మాలతి తెల్ల మొహంతో జామిచెట్టు మీదికి చూస్తోంది.



# ఏది కష్టార్జితం?

పిళ్లా. సుబ్బారావ్ శాస్త్రి.

చంగయ్య ఒక పేదరైతు. కష్టపడి వళ్ళు వంచి పని చేసేవాడు. చంగయ్యకి పది మంది పిల్లలు. కాని చివరికి మిగిలినవాడు సీతన్న. సీతన్న ఒక్కడే బ్రతికి బాగుండడం మూలాన, వాడి తర్వాత వరుసగా తొమ్మిది మంది మరణించడం మూలాన చంగయ్య సీతన్నను ఎంతో గారాబంగా పెంచసాగాడు.

సీతన్నని ఐదవ ఏటనే వీధి బడిలో చదువ వేశాడు. కాని ఒక్కనాడయినా బడికి వెళ్ళినపాపాన్న పోతేనా !— సరికదా పొలం దున్నడమయినా నేర్చుకోలేదు.

ఒకనాడు చంగయ్య సీతన్నని పిలచి సాయంకాలం కల్లా మూడణాలు ఆర్జించి తెమ్మని పంపించేడు.

సీతన్న, చంగయ్య పొలానికి వెళ్ళిన తర్వాత తల్లి దగ్గర నానాఅల్లరీ పెట్టి మూడణాలు పుచ్చుకొని తండ్రి వచ్చిన తర్వాత తండ్రికి యిచ్చేడు. చంగయ్య ఆ మూడణాల్ని అక్కడే వున్న మురికి కాలువలో పడేశాడు. సీతన్న చూస్తూ వూరుకున్నాడు.

మర్నాడు తిరిగి తీసుకురమ్మని చెప్పాడు. ఆరోజు కూడా తల్లి నివ్వమని అడిగేడు. కాని తల్లిదగ్గర వుంటేగా;

సీతన్న ఆవూరి రైలు స్టేషన్‌కు బయలుదేరాడు. అక్కడవున్న వారందర్నీ అడిగాడు "కూలికావాలా బాబూ?" అంటూ.

చివరికొక పెద్దమనిషి ఒకపెట్టి, బెడ్డింగు నెత్తిమీద పెట్టి రెండుమైళ్ళదూరం తీసుకుపోయి రెండణాల డబ్బులు యిచ్చి పంపేడు. సీతన్న చెమట ఊడ్చుకుంటూ తిరిగి స్టేషన్‌కుపోయి సాయంకాలంకల్లా మూడణాలు సంపాదించాడు.

తండ్రి మామూలుగా మూడణాలు విసిరేశాడు. సీతన్న మామూలుగా వూరుకోక గబగబా పరిగెట్టి ఆగుంటలో దూకి మూడణాలు బైటకు తీసుకువచ్చి కడిగేశాడు.

"నాయనా ! యిదీ నీకష్టార్జితం ! తాను ఆర్జిస్తే కాని డబ్బు విలువతేలీదు !" అంటూ కుర్రవాడికి నీతి బోధించేడు చంగయ్య.



# బాలకవి

శ్రీ జూలూరి హనుమంతరావు

అమ్మ! రాతిరి నాకు కలవచ్చినాదే
కలలోన కనబడెనె యెన్నియో పూలు

ఒక్కొక్కపూవులో ఒక్కొక్క పాప
పాపలందఱు వింతగా పాడినారే

పాటలతో వీణలను వాయించినారే
వీణమీటగ ఒడలు పులకరించినది

ఇంతలోనే యెవరో "అమ్మ" వచ్చినది
వచ్చివీణను తీసికొని మీటినాది

పాపలందఱు వింతపడ వెక్కినారే
పడవతో మేఘాలలో తేలినారే

తేలితేలి పోయి కనబడరెవారు
వీణతో ఆ "అమ్మ" మాయమైనాది

ఈ రాతిరికికూడ కనబడుదురేమి?
నేనుకూడ వారితో పాడుతానే

నేనుకూడ వీణతో పాడుతానే
అనిచెప్పగా, తల్లి అనెను చిన్నారితో

"నీవుకూడ వారితో పాడుదువుకన్న!
ఆపాపలందఱూ భావాలురాచిన్న?"

ఆ "అమ్మ" యే సరస్వతి; స్వర్గభావాల
కూర్చుకొని పేరొందు కవివౌదువుర తండ్రి!"



# విశ్వాసం

శ్రీ ములకుట్ల సుబ్రహ్మణ్యం

అనగా అనగా ఒక ఊరు
ఉన్నాడందులో ఓ జమీందారు
వృద్ధాప్యం ఎక్కువ కాగా
దృష్టికి దోషం వచ్చింది.

ఎవ్వరు తనగతి చూచేవారు
ఎవరికి తనపై అభిమానం
వృద్ధాప్యం దుర్గతి అంటూ
ఖేదం పొందాడా వృద్ధు.

విశ్వాసానికి పెట్టిన పేరు
తోడుకి కట్టని కోట
మంచిది ఉంచండంటూ
కుక్కొకటిచ్చాడో బంటు.

గుడ్డి కుంటి విచక్షణలేవు
ఆవిటి చెవిటి మరిలేదు
కుక్క చూపదా అజ్ఞానం
అదేదానిలో విజ్ఞానం.

చేతికి తోడునీడగ ఉంటూ
ఉందా కుక్క జమీందారుకి
ఒక రోజున పోతుంటే
రోడ్డు దాటవలసొచ్చింది.

జన సమూహం, కార్లసందడి
రోడ్డంతా కిటకిట లాడగ
దారి చేసుకుంటూ ఆ కుక్క
వృద్ధుని తీసుకుపోతోంది.

ఇంతలోనె జబర్దస్తీగా
కారొకటి దూసుకు వచ్చింది
కుక్క కెవ్వుమని కేకేసి
వృద్ధుని వెనక్కి తోసింది.

ప్రజలంతాను గుమిగూడారు
అలజడి బాగా ఎక్కువాయెను
నిశ్శబ్దంగా ఒకరితొ ఒకరు
నడచుచు సాగిపోయారు.

కుక్కను మాత్రం వృద్ధుడు
వదలలేక పోయాడు
కుక్క మాత్రం వృద్ధును చూస్తూ
ఆఖరి శ్వాసను వదిలింది.

మానవుడైనా చేయని త్యాగం
కుక్క చేయగలిగింది.
ఇది కథగాదు నిజమంటూ
చాటండోయి బాలల్లారా!



# 'మోతీ యికరాదే!'

"రాణి"

శాంతకి ఎనిమిదో యేడు. వీధి బళ్ళో నాలుగో క్లాసు చదువుతోంది. ఆమె తండ్రి సీతారామయ్య ఆవూరి కరణం. పిల్లల్లో కల్లా తెలివైనది శాంత. ఊళ్ళోకల్లా ధనవంతుడు సీతారామయ్య. ప్రతి దినం ప్రక్క యింటిముందు ఆగడం అలవాటయింది శాంతకి. ఆ యింట్లోని ఒక సామాన్యపు జంతువు ఆమె నాకర్షించింది. ప్రతి రోజు కాసేపాగడం, దాన్ని చూడడం నిత్యకృత్య మైంది శాంతకు. అసలు విషయ మేమిటంటే ఒకనాడు శాంత బడినుండి వస్తుండగా, కుక్కపిల్ల ఒకటి ఆ యింటి అరుగు మీద ఆడుకుంటున్నది. అక్కడ ఎవరూ లేక పోవడం చూచి శాంత దాన్ని చప్పున చేతుల్లోకి తీసి కొంది. దాని తలమీద ముద్దు పెట్టుకుంది.

ఆనాటి నుండి ఆ కుక్కపిల్ల మీద అవాజ్యమైన ప్రేమ కలిగింది శాంతకి. అది తనకు కావాలనే తీవ్రమైన కాంక్ష ఆమెలో ప్రబలింది. తల్లి నడిగి తెప్పించుకొందామనే ఆలోచన కలిగింది, మెల్లిగా తల్లికి చెప్పింది. అంతా విని పార్వతమ్మ చీకాకు కనపఱచింది. "నీకెందుకే కుక్కపిల్ల, పిల్లిపిల్లానూ?" అని కసిరింది. దానితో శాంత నిస్పృహ చెందింది. కానీ, కుక్క మీద ఆశ మాత్రం వదులుకో లేకపోయింది.

వాళ్ళనడిగే తెచ్చుకోవాలన్న పౌరుషంతో మరుచటి రోజు వుదయం ఆ అరుగుమీదే ఒక పిల్లవాడు ఆ కుక్కతో ఆడుకుంటూండగా బెదురుతూ అడిగింది శాంత. "ఆ కుక్క నిస్తారండీ?" అని. ఆటలో మునిగివున్న శేఖరం తలయెత్తకుండా, నిర్లక్ష్యంగా, "ఇవ్వం" అన్నాడు. శాంత దిగులుతో యింటికి వచ్చింది. రెండు రోజులు బడికి కూడ పోలేదు. మూగబాధ ననుభవిస్తోంది. పార్వతమ్మ కర్థం కాలేదు కూతురు వ్యధ ఏమిటో. నెమ్మదిగా అడి గింది. జవాబు లేదు. గద్దించి అడిగింది. శాంత పెదవి కదలలేదు. ఈ విషయం సీతాలామయ్య వరకు వెళ్ళింది. ఆయన శాంతను పిలిచి, లాలిస్తూ అడిగాడు. ఈ లాలనతో శాంత దుఃఖం పైకుబికింది. బోరున ఏడ్చించి అసలు సంగతి చెప్పింది. "దీనికేనా యింత గొడవ పిచ్చితల్లీ" అన్నాడాయన.

మరునాడే కుక్కపిల్ల మోతీ శాంతతో ఆడుకుంటోంది. శాంత, మోతీని విడచి ఒక్క క్షణం వుండేదికాదు. దాన్ని వళ్ళో పెట్టుకుని, దాని చెవిలో ఏవో తియ్యని కబుర్లు చెప్తూండేది శాంత. దాని జూలును దువ్వుతూ, దాని నీలి కళ్ళలోకి చూస్తూ ఎంతో ఆనందించేది. మోతీ ఆ యింట్లో అడుగు పెట్టి ఆరు నెలలయింది. ఆనాడు జమాబందీ కోసం తాశీల్దారు వస్తున్నారు. సీతారామయ్య తోటనుండి లేత కొబ్బరికాయలు, మామిడి పళ్ళు, తెప్పిం చాడు. తాశీల్దారు వచ్చాడు. రెండు రోజులు గడచి పోయినాయి. లెక్కలు చూడడం పూర్తైంది. తాశీల్దారు గారికోసం బండి వచ్చింది. సీతారామయ్యకు పిలుపు వచ్చింది. తాశీల్దారు సీతారామయ్యతో "నీ దగ్గర వుంది చూశావు మోతీ నా కియ్యవయ్యా, మహా ముద్దుగా వున్నది" అని అన్నాడు. సీతారామయ్య నెత్తిమీద పిడుగు పడ్డట్టయింది.

ఇంట్లోకి వచ్చాడు. శాంతిలేదు. అధికారి మాటను ఎల్లా కాదనగలడు? ఒక సాధారణ కుక్కపిల్ల విషయంలో వెనుదీస్తే, తను నలుగురిలో అవమానం భరించాలి. ఇంత శ్రమ వృధా ఔతుంది. శాంతనెల్లాగైనా ఓదార్చ వచ్చు. ఈ ఆలోచనతో నిండిపోయింది కరణం గారి మనస్సు. మోతీ బండిలలో పట్నం వెళ్ళింది. శాంత యింటికి వచ్చింది. ఇల్లంతా గాలించింది. దొడ్డి నలు మూలలా వెతికింది. మోతీ ఏదీ? అందరినీ అడిగింది. జరిగిన విషయం చెప్పడానికి ఎవరూ సాహసించలేదు. ఆ రాత్రి శాంతకి విపరీతంగా జ్వరం వచ్చింది. వళ్ళు తెలియదు ఆమెకు. కలవరిస్తున్నది. "వస్తున్నా మోతీ పరుగెత్తవద్దు." ఇదే ధ్యాస. పార్వతమ్మ అమితంగా దుఃఖిస్తోంది. శాంత కలవరింతలు విన్నప్పుడల్లా ఆమె గుండెలు తరుక్కుపోతున్నవి. శాంతకి స్పృహ లేదు. ఒకరోజు గడిచింది. ఒక రాత్రివేళ శాంత లేచింది. "అమ్మా ! మోతీ వచ్చింది కదూ?" ఏమాత్రం సంకోచం లేదు ఆమె స్వరంలో. "వస్తుంది తల్లీ, మనిషినిపంపాను." శాంత వక్క క్షణం కూర్చుంది. ఆమె తల దిమ్మెక్కు తున్నది, గతం జ్ఞాపకం రాసాగింది. నిస్పృహతో "అమ్మా! నా మోతీ యికరాదే!" అని శాంత పడిపోయింది........



నాటిక:

# "గాలి — వాన"

• శ్రీమతి కె. రామలక్ష్మి •

ఇందులో వచ్చే పాత్రలు.

సువర్ణ: జమీందారీ కుటుంబంలో పుట్టి పెరిగిన నవయౌవని. అందకత్తె.

ప్రతాప్: తల్లీ తండ్రీ లేని ధనవంతుడు.

సుధారు: జమీందార్ కుమారుడు.

[దేవాలయం వెనుక తోటలో, ఒక మామిడి చెట్టు క్రింద]

సువర్ణ: ఏం ప్రతాప్, యింతాలస్యం చేసావేం? నే వచ్చి ఎంతసేపయిందనుకున్నావ్? యిప్పుడే...

ప్రతాప్: (ఆమె చేయి తన చేతుల్లోకి తీసుకుంటూ) ఎందుకా హడావిడి సువర్ణా? రాకుండా పోతాననుకున్నావా?

సువర్ణ: అదికాదు. ఇంత ఆలస్యం అయితే మనం యింకేం మాట్లాడుకుంటాం చెప్పు? అందుకు.

ప్ర: అమ్మ దొంగా. అసలాలోచన అదీ. ఏం రోజూ మాట్లాడుకుంటున్నాంగా!

సు: మరయితే ఎందుకొచ్చావ్? నడు పోదాం!

ప్ర: నీకోపం వస్తే ఎంతో బాగుంటావు సువర్ణా. అందుకే అలా అన్నాను. అంతేకాని నాకూ నిన్ను అస్తమానూ చూస్తూ కూర్చోవాలనే ఉంటుంది.

స: అయితే ఆ సిపాయీ ఉద్యోగం మానెయ్యకూడదూ. (ఎంతో ఆత్రంగా అతని చేతులు పట్టుకుంటుంది) యీ వూళ్ళోనే ఉండిపోకూడదూ!

ప్ర: పిచ్చిదానా! నాకలా వుండదనా నీ వూహ! ఏం లాభం! రోజంతా వున్నా ఒక్క యిలాంటప్పుడేగా మనిద్దరం రెండు గంటలసేపు కూర్చోగలిగేది? ఇదికూడా ఎప్పుడు మీవాళ్ళకి తెలుస్తే అప్పుడే బంద్. ఛీ... అదేమిటి కంటతడి పెడతావెందుకూ? (సువర్ణ అతని హృదయంమీద తల వాల్చి వెక్కి వెక్కి ఏడుస్తుంది. ఎలా ఓదార్చాలో తెలియనట్లు, ప్రతాప్, ఆమె రేగిన ముంగురులు సవరిస్తూ నూన్యంలోకి చూస్తూ వుంటాడు)

ప్ర: చూడు సువర్ణా! ధైర్యంగా వుంటే ఎంతటి కష్టాలైనా నెగ్గుకు రావచ్చు. యిలా అయితే మనం ఏం చెయ్యగలం?

సు: మరి నన్నేం చెయ్యమన్నావో చెప్పు? అటు అమ్మా నాన్నా - యిటు నువ్వూ నేనూ. నాన్నగారి సంగతి నీకు తెలుసు కదా? ఆయన కెంత తోస్తే అంత చేస్తారు. ఆయన స్నేహితుడెవరో ఉన్నాట్ట! నన్ను తాను చేసుకుందామా, కొడుక్కి ఇచ్చి చేద్దామా అని ఆలోచిస్తున్నాట్ట. ఇలాంటి మనుషుల మధ్య ఎలా బ్రతకమంటావో చెప్పు ప్రతాప్, చెప్పు? (ఉద్వేగంగా ఆనేసి వూరుకుంటుంది.)

ప్ర: నన్నేం చెయ్యమన్నావో చెప్పు. నీకే ధైర్యంవుంటే నే ఏమేనా చెయ్యకలను. ఆవేళ అలా ఉత్తరం మూలకంగా నన్ను తూలనాడితే, మీ అమ్మనైనా ఎదిరించి మాట్లాడ కలిగావా? ఏడుస్తూ కూర్చున్నావు. ఇంకా పైపెచ్చు నాకు లేఖ వ్రాయడం మానేశావు? నేనేం పాపం చేశానని నన్నిలా బాధపెడతావ్?

సు: ప్రతాప్, నా మీదెందుకా కోపం! ఎలా చెప్పు? నాన్న భస్మాసురుడు. తన్ను తనే నాశనం చేసుకున్నా తెలుసుకోలేని మనిషి! నిన్ను అలా లోకువగా మాట్లాడితే, నా హృదయం ఎలా దహించుకు పోయిందో తెలుసా ప్రతాప్. తెలిసే వుంటే అలా మాట్లాడవు.

ప్ర: నీ వాళ్ళకి నే దిక్కులేని వాణ్ణిగానే కనిపించాను. నాకు దిక్కులేకుండా చేసింది దేవుడైతే ఆ కోపం నామీద చూపుతారేం! తల్లీ తండ్రీ పోతే నే నేం చెయ్యను? కావలసినంత సిరి వదలి వెళ్ళారు. కాలక్షేపం కోసం సైన్యంలో చేరాను. (కొంచెం సేపు ఆలోచనలో మునిగిపోతాడు.)

సు : నువ్విలా కూర్చుండిపోతే ఎలా? కాలంతోపాటు మనం పరుగెత్తాలి. చూడు, అప్పుడే ఎంత చీకటి పడిందో. ఇక లక్ష్మికూడా వచ్చేస్తుంది. ఏమైనా మాట్లాడు ప్రతాప్. అలా అయిపోయారేం?

ప్ర : ఇంకేం అనమంటావ్? ఇంకో నెల వున్నాయి సెలవులు. ఆనెలా, ఈలా నా హృదయానికి తృప్తిగా ప్రతి సాయంత్రం నిన్ను రెండు గంటలసేపు చూడచ్చు అనుకున్నా. కాని నాలుగైదు రోజులుపోతే వర్షాలు!

సు : (అతని తల నిమురుతూ) అలా డిగాలు పడకు, చూడు నాకేసిచూసి ఓసారి నవ్వు, నీకోమంచి సంగతి చెప్తాను.

ప్ర : (ఎంతో ఆశగా) నిజంగానా?

సు : అవును ప్రతాప్! ఎంతోకాలం యీ ఎడబాటు నే భరించలేనేమో అనిపిస్తూంది. వెళ్ళిపోవాలనగానే అప్పుడే చూడు, నాగుండెలెలా కొట్టుకుంటున్నాయో!

ప్ర : ఏదీ మనకు తప్పదు వర్ణా. ఎక్కడికేనా పోయి హాయిగా పెండ్లాడుదాం అంటే, నీకు ధైర్యంలేదు. పోనీ రహస్యంగా పెళ్ళి చేసుకొని, కొన్నాళ్ళ తర్వాత చెప్తే, ఎలాటి తల్లి దండ్రులేనా క్షమిస్తారంటే, ఆలో చిస్తానంటావు. ఎన్నాళ్ళు? ఎన్నాళ్ళిలా తెలియని భారంతో బ్రతుకు గడపడం! నీకూ బాధగాలేదూ! మళ్ళీ నే వెళ్ళిపోతే, ఉత్తరాలేనా సరిగా రాసుకు నేందుకు దారి లేదు కదా?

సు : యివన్నీ చెప్పి నాకు దుఃఖం ఎక్కువ చెయ్యకు ప్రతాప్! అదిగో లక్ష్మి వచ్చేస్తూంది. ప్రతాప్ నా చెయ్యి ఒకసారి పట్టుకో. నాకో అభయ హస్తం యియ్యి ప్రతాప్......

లక్ష్మి : (నెమ్మదిగా) అమ్మా, బాగా చీకటి పడిపోయింది. ఇక లేస్తారా?

సు : ఏం లక్ష్మీ, అప్పుడే వచ్చేసేవ్. అసలీవాళ ప్రతాపే ఎంతో ఆలస్యంగా వచ్చాడు లక్ష్మీ. అప్పుడే...

ల : (చిన్న నవ్వు నవ్వుతూ) అలా గుళ్ళోకెళ్ళి, కొబ్బరి చెక్కా అదీ పట్టుకొస్తాను. మరి ఆలోపుగానేనా తయారవు.

(వెళ్ళిపోతుంది.)

సు : నిజంగా లక్ష్మిలేకుంటే ఏమయేదాన్నోకదూ ప్రతాప్. పాపం! నాన్నగారు ఎంత తిట్టినా నోరు విప్పలేదు! ఎందుకో దానికి అంత అభిమానం, నామీద!

ప్ర : ఎవరికుండదూ నీమీద! సువర్ణా, పోనీ, ఉత్తరాలేనా పెద్దవి రాస్తావా? చెప్పు.

సు : ఎంత పెద్ద ఉత్తరం అయినా, యిద్దరం ఇలా కూర్చు న్నట్లుంటుందా?... ప్రతాప్, ఎవరో వస్తున్నట్లుంది.

(పక్కనించి కర్ర ఊతగా, ఓ ముసలి ముష్టిది వస్తుంది. చెట్లు చాటుగా కూర్చున్న వీళ్ళని చూస్తుంది.)

ముష్టిది : అమ్మా! రతీ మన్మధుల్లా వున్నారు తల్లీ! వెయ్యేళ్ళు బ్రతకండి!

ప్ర : (నవ్వుతూ) ఆ అమ్మ నొక్కత్తినేనా దీవించేది? నేనేం చేసాను?

ము : అలాంటావేటయ్యా! అమ్మ ఒకటీ నువ్వు ఒకటీనా? ఇద్దరూ కలిసే ఒకటీ... పొద్దు పోయింది తల్లీ. చెట్లల్లో, పుట్టల్లో కూర్చోకండి.

(ప్రతాప్, ఆమె చేతిలో డబ్బులేస్తాడు. వెయ్యేళ్ళు బ్రతకండి అంటూనే ఆమె వెళ్ళిపోతుంది.)

సు : ప్రతాప్, ఏం చేద్దామో త్వరగా చెప్పు. లక్ష్మి తిరిగి వచ్చేస్తుంది.

ప్ర : నే చెప్పడానికేంలేదు సువర్ణా. ఆలోచించుకుని నువ్వే చెప్పు. నీకెప్పుడు ధైర్యంగా ఉంటే, ఆనాడు రహస్యంగా పెళ్ళి చేసేసుకుందాం! అదిగో లక్ష్మి వస్తూంది. లే, యింక, రేపు, ఎల్లుండీ పట్నం వెడతా కనిపించను.

సు : చూశావా? పోనీలే.

ప్ర : లేదులే, ఎల్లుండి సాయంత్రం శీఘ్రంగా వస్తే కబు రంపుతాను. సరేనా? ఏదీ ఓసారి యిలా చూడు. ఆ కళ్ళు చూడు చిలిపి కళ్ళు!

(సువర్ణ నవ్వుతూ, లక్ష్మికి ఎదురు వెడుతుంది. ప్రతాప్ అదే స్థలంలో కూర్చుని వాళ్ళని చూస్తూ వుంటాడు.)

## రెండవ రంగం

(కొంతకాలం గడిచాక)

(సువర్ణ యిల్లు. మేడమీది వరండాలో నిల్చుంటే, చుట్టూ తోటా, అదీ అందంగా కనిపిస్తుంది. మేడమీదే సువర్ణ గది. మేడకి వీధిలోంచీ, పెరటిలోంచీ కూడా మెట్లున్నాయి. పెరటి మెట్లమీద, మధ్యలో లక్ష్మి కూర్చుని వుంటుంది. గదిలో కిటికీలో కూర్చుని దీర్ఘంగా ఏదో చదివేస్తోంది సువర్ణ.)

సు : లక్ష్మీ, యిలారావే!

లక్ష్మి : (దూరం నుంచే) వస్తున్నానమ్మా, (వచ్చి సువర్ణ ప్రక్కగా నిల్చుంటుంది) ఏమమ్మా పిల్చావు?

సు : ఏం లేదు లక్ష్మీ, చూడు, ప్రతాప్ రాశాడూ... (గోళ్ళు కొరుక్కుంటూ వూరుకుంటుంది)

ల : చెప్పమ్మా, నాతో చెప్పడానికేం?

సు: నువ్వు నా ప్రాణానివే లక్ష్మీ, చూడు, ప్రతాప్ రాశాడు, వచ్చే శుక్రవారం నాడు, సరిగ్గా పదీ పదకొండు గంటల మధ్య పట్నంలో రహస్యంగా పెళ్ళి చేసుకుందాం అంటాడు. నే పూర్తిగా తన దానిగా అయితేనేకాని, కంటి నిండా నిద్రకూడా పట్టదంటాడు. లక్ష్మీ, అలా రహస్యంగా పెళ్ళి చేసుకొని, తర్వాత కొన్నాళ్ళకి అమ్మకీ, నాన్నకీ తెలిసినా క్షమిస్తారంటావా?

ల : పిచ్చిగాని, తమ పిల్ల సౌఖ్యం కంటె ఏం కావాలి తల్లికీ, తండ్రికీని. అయినా ప్రతాప్ బాబు కేంలోటు? లక్షణంగా ఆస్తి వుంది. సైన్యంలో బాగా ఆర్జిస్తున్నాడు రూపం వుంది, అన్నింటికంటేనూ. నువ్వే కదమ్మా అతనికి ప్రాణం. నువ్వు కాదంటే యే అఘాయిత్యం అయినా తలపెడితే!

సు: అలా అనకే లక్ష్మీ, నాకూ ప్రతాప్ ప్రాణమే. అతన్ని చూడలేకపోతే నాకు బ్రతుకేలేదు, నా ప్రాణానికీ వర్షాకాలం ఒకటి! (కంఠం దుఃఖంతో పూడుకుపోతుంది.)

ల : అలా బాధపడకు, యీ శుక్రవారం ఏమయినాసరే తెగించి, బయలుదేరు, అన్నీ సరిగ్గానే అవుతాయి!

సు : లక్ష్మీ, పట్నానికి ప్రయాణం అంటే మనిద్దరం పోగలమా? పదిహేను మైళ్ళన్నా వుందికదా? దారిలోనే యేం చిక్కులు పడతామో, అసలే వర్షాకాలం. భయంగావుంది లక్ష్మీ!

ల : భయందేనికీ? అడ్రసూ, అదీ సరిగా రాశాడు, టైం సరిగా చెప్పాడు, యింకేం, యేదో ఒంకని, ఎవరికీ తెలియకుండా యీ వూరు దాటించే బాధ్యత నాది. దేవుని దయవల్ల అంతా సవ్యంగా నడిచిపోవాలి!

సు : అయితే మనం కూడా సిద్ధమేనని రాసేయమంటావా?

ల : రాసెయ్యి తల్లీ. మనిషికి ముందు కావలసినది మానసిక సంతృప్తి. తర్వాతనే ఈ శారీరక సౌఖ్యాలన్నీ. ధైర్యంగా వుండు.

సు : (ఆనందంతో లక్ష్మిని దగ్గరగా తీసుకుంటూ) నువ్వుండబట్టి కాని, లక్ష్మీ లేకుంటే ఏమయిపోదునో!

## మూడవ రంగం

పట్నంలో ఒక మారుమూల యిల్లు. ప్రతాప్, అతని స్నేహితులైదారుగురూ, కూర్చుని చాలా సంతోషంతో మాట్లాడుకుంటూ, మధ్య మధ్య నవ్వుకుంటూ వుంటారు. సమయం వుదయం పదిగంటలవుతూ వుంటుంది. నిముషానికోమారేనా వీధిలోకి వచ్చి చూసి వెడుతూ వుంటాడు ప్రతాప్. బాగా మబ్బు పట్టింది. పెద్దగా వురుముతోంది కూడా. ఏదో అర్థంకాని ఆందోళన వ్యక్తమవుతూ వుంటుంది అతని ముఖంలో...

ప్రతాప్ : అప్పుడే పది దాటుతోంది. పాడు వర్షం! చూడు ఎలా పట్టిందో. పట్టపగలే కారు చీకట్లు కమ్ముకున్నాయి. ఎలాగో!

ఒక స్నేహితుడు: పరవాలేదోయ్. రోడ్డు సరాసరిగానే వుందిగా. సులభంగానే వచ్చేస్తారు.

ప్ర : అయినా, ఎందుకేనా మంచిది_ నే ఎదురెడితేనో!

స్నే: నువ్వూ అలా వెళ్ళగానే వాళ్ళూ వస్తే...

ప్ర : నేను త్వరగానే తిరిగి వచ్చేస్తాగా.

స్నే: ఒర్డోయ్ ప్రతాప్, యీ మబ్బూ అదీ చూస్తే, ఎక్కువయేలావుంది. గాలీ వానా పట్టుకుందీ అంటే మధ్యలో చిక్కుపడి పోతావ్.

ప్ర: (చిన్న నవ్వు నవ్వుతూ) భయం లేదోయ్, ఏమో నే వెడితేగాని వాళ్ళు రారని తోస్తోంది. బండే వుందిరా, యిప్పుడే వచ్చేస్తా.

(అంటూనే వీధిలోకి వచ్చి, మబ్బునీ, ఉరుములనికూడా లెక్కచెయ్యకుండా తన గుర్రపు సార్టులో బయలు దేరాడు.)

## నాలుగవ రంగం

పల్లెనీ, పట్టణాన్నీ కలిపే ఆ రహదారిమీద, ఆ గాలి వానలో ఒక బండి ప్రయాణం చేస్తూ వుంటుంది. బండి వాడు ఎంత అదమాయించినా గుఱ్ఱం ముందుకే సాగడం లేదు. బండిలో యిద్దరు స్త్రీ మూర్తులు చలికి బాగా కప్పుకొని ఒదిగి కూర్చుని వుంటారు.

సు: లక్ష్మీ, ఏపనిచేయడానికైనా దైవం కూడా అనుకూలంగా వుండాలి లక్ష్మీ! లేకుంటే, యీ వరం, యీ గాలీ ఏమిటి? పట్టపగలే కన్ను పొడుచుకున్నా కనపడ్డంలేదు.

ల: అలా అనుకుంటావేమిటమ్మా! నీహృదయానికి నచ్చిన వరుణ్ణి కట్టుకోబోతూ దైవం అనుకూలం కాదనుకోడ మేమిటి? అదుగో చూడు, దూరంగా ఏదో యిల్లు కనిపిస్తోంది. (బండి వానితో) ఆ యిల్లు కనిపిస్తోందే, అటువైపే తిన్నగాపోనీ, వర్షం తగ్గేదాకా అక్కడుండొచ్చు.

(కొన్ని నిమిషాల తర్వాత బండి వచ్చి ఒక యింటి ముందు ఆగుతుంది. లక్ష్మిని ఆసరాగా చేసుకుని, బాగా తలమీదికి ముసుగు లాక్కుని, సువర్ణ యిల్లు ప్రవేశిస్తుంది. పురోహితుడు ఒకడు అక్కడే ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్లు కూర్చుని వున్నవాడల్లా, వాళ్ళని చూసి, గభీలున లేస్తాడు)

పురో: రామ్మా, నీకోసం ఎంతో సేపటినుంచి ఎదురు చూస్తున్నాం. అంతా యిప్పుడే అటూ యిటూ పోయారు. కూర్చోండి వాళ్ళూ వచ్చేస్తారు. అందరి కంటే ముందే వెళ్ళిన ప్రతాపుడేనా వస్తే బాగుండును. నాపని త్వరగా ముగించేద్దును.

సు: (అయోమయంగా అనిపించి) ఏమిటి లక్ష్మీ, సర్గ్గా రావలసిన యింటికే వచ్చాం! ప్రతాపు యింతవర్షంలో ఎక్కడికి వెళ్ళాడో?

ల: (పురోహితునితో) అయ్యగారూ! ఎవరేనావుంటే పంపించి కొంచం శీఘ్రంగా కానివ్వండి. మళ్ళీ సాయంత్రానికి యిల్లు చేరుకోవాలి.

పు: అదేనమ్మా, నేనూ ఆలోచిస్తున్నా, ఒక్క ప్రతాపు వచ్చినా చాలు అంతా నేనే కానిచ్చేస్తాను... వుండండి, గుమ్మంలో చూస్తాను...

(దూరం నుంచే గుర్రం బండి బాగా చప్పుడు చేసుకుంటూ వస్తున్నట్టు వినిపిస్తుంది.)

పు: అదుగోనమ్మా, అతగాడే ముందుగా వస్తున్నాడు. ఇంకంతా సిద్ధం... నువ్విలా వచ్చి కూచో, అతనూ రాగానే మంగళసూత్రం కట్టించి, అయిందనిపిస్తాను.

(వీధిలో బండి ఆగుతుంది. ఒక యావనుడు, హడావిడిగా లోపలికి వచ్చేస్తాడు. గాఢంగా మబ్బులు కమ్మడం మూలాన్ని బాగా చీకటిగానేవుంది లోపల. "రావయ్యా త్వరగా. పాపం ఎంతో సేపటినుంచి కాచుకునివుంది" అన్నమాటలు విని ఆ పక్కగా పోతాడు)

పు: అంతా తరవాత వస్తారులేకాని, ముందు మంగళసూత్రం కట్టు...... ఓ పిల్లా, మీ అమ్మగార్ని సరిగ్గా కూచోపెట్టు, అరె! అలా పాలిపోయిందేం ఆవిడ ముఖం! కొంచం సేపుంటే స్మృతికూడా తప్పుతుందేమో!... త్వరగా రావయ్యా! (అని ఆ యువకుణ్ణి చెయ్యపట్టి తీసుకువచ్చి, సువర్ణ ప్రక్కగా కూర్చోపెడతాడు. ఆయువకునికి అంతా అయోమయంగావుంది కాని, అత్యాశ్చర్యం ఫలితంగా నిశ్చేష్టుడయిపోయాడు. మాంత్రికంగా ఏం చెప్పితే అదే చేస్తూ, ఒక్కమాట కూడా మాట్లాడలేకపోయాడు... కొంత తతంగం జరిపాక, పురోహితుడు మంగళసూత్రాలు చేతికిస్తూ) ఏమిటయ్యా ఆలోచిస్తావు? వూఁ కట్టు... పాపం! ఎంత అలసిపోయిందో పిల్ల!

(అంటూంటే, ఒకసారి నిట్టూర్చి, తటపటాయించి యువకుడు మంగళసూత్రం ఆమె మెళ్ళో కట్టేస్తాడు.

సు: (లేని ఓపికంతా తెచ్చుకుని, మైకం కమ్ముకొస్తూంటే బలవంతంగా కళ్ళు తెరుచుకుని) లక్ష్మీ! ఎంత మోసం! యితడు ప్రతాప్ కాడు లక్ష్మీ! (అంటూ స్మృతి తప్పి పడిపోతుంది.)

ల: (బాధగా) ఇప్పుడెలాగ? ఏమయ్యా, బ్రాహ్మడూ, వెనకాముందూ చూడకుండానే మంగళ సూత్రం కట్టిం చేసావు? (దుఃఖంలో ఆమె కంఠం పూడుకుపోతుంది.) (ఇదంతా చూచి యువకుడు నిర్విణ్ణుడై, రాయిలా నిల్చుండిపోతాడు. కొంచం సేపు ఆలోచించి...ఎలా హడావిడిగా ఒచ్చాడో అలాగే త్వరగా అవతలికి వెళ్ళిపోతాడు. అంతేకాదు, వీధిలోవున్న బండి ఎక్కి వెళ్ళిపోతాడు...లోపల లక్ష్మి, చన్నీళ్ళూ అవీ చల్లి సువర్ణ కి సేదతీరుస్తుంది.)

సు: లక్ష్మీ! ఏముఖంతో యింటికెళ్ళను లక్ష్మీ! (అంటూ లక్ష్మి బుజంమీద తలవాల్చి ఏడుస్తుంది.)

ల: (ఆమె తలనిమురుతూ) ఏం చేస్తాం తల్లీ, మనం ఒకటి తలిస్తే, దేవుడిలా తలిచాడు. యింతకీ, ఆ ఒచ్చినబ్బాయి పేరూ వూరేనా తెలుసుకోలేదు మనం...ఎలాగో ఓపిక తెచ్చుకో, మెల్లిగా, ఎలా ఒచ్చామో అలాగే యిల్లు చేరుకుందాం. లే...(సువర్ణ కళ్ల నీళ్ళు తుడ్చు కుంటూనే లేస్తుంది...లక్ష్మి, ఆమె మళ్ళీ వెనక్కైనా చూడకుండా వెళ్లిపోతారు. కొన్ని క్షణాలు గడిచాక, పురోహితుడు మాత్రం, తన పని అయినట్లు చేతులు దులుపుతూ, అంగవస్త్రం బుజానవేసుకుంటాడు పోవ డానికి. కాని అవతల ఏదో అలికిడివిని, కూర్చుంటాడు.)

ప్ర: ఛీ, పాడువర్షం. ఎంతో అలవాటున్న రోడ్డుమీద కూడా దారి తప్పి, యిన్ని గంటలు తంటాలుపడవలసి వచ్చింది. (అంటూ లోపలికి వస్తాడు.) ఏమయ్యా, ఎవరేనా వచ్చారా? మిగతావాళ్ళంతా ఏరీ?

పు: (భయం భయంగా) వచ్చి వెళ్ళారండి...

ప్ర: (ఆత్రంగా) ఎవరు? ఆడవాళ్ళా?

పు: అలా వింతగా అడుగుతావేమయ్యా! నాపని అయిం దనిపించాను. సమయానికి చక్కని కుర్రాడు కూడా వచ్చాడు. కాని అదేమిటో, ఆ పిల్ల మైకం వచ్చి పడి పోయింది. అతనూ వెళ్ళిపోయాడు.

ప్ర: (ఆవేశంతో) వాళ్ళిద్దరికీ పెళ్ళి చేసేసావా? (బాధగా) ఎంతపని చేసావయ్యా! నా సువర్ణని నాకు కాకుండా చేసావు! ఈ జీవితంలో ఆమె ముఖం మళ్ళీ ఎలా చూడను? నే మోసం చేశానని అనుకోదూ? నే నే మనను? నే నేమయితేనేం? (పిచ్చిగా అరుచుకుంటూ వెళ్ళిపోతాడు. పురోహితుడు ఏదో జ్ఞప్తికి వచ్చినట్టు హడావుడిగా వెళ్ళిపోతాడు.)

## ఐదవ రంగం

పై విచిత్ర సంఘటన జరిగిన కొన్ని రోజుల తర్వాత పల్లెటూరిలో సువర్ణ యిల్లు. ఒళ్ళు తెలియని జ్వరంతో మంచంమీద పడి వుంటుంది సువర్ణ. ఆమె ప్రక్కనే ఆమె తల్లి కూర్చుని, తన కూతురి బాధకి కంటతడి పెడుతూవుం టుంది. "అమ్మా, ప్రతాప్, లక్ష్మీ, యింకెలాగే" అంటూ సువర్ణ ఒళ్ళు తెలియని పరిస్థితిలోనే పైకే అనేస్తుంది. లక్ష్మి పక్కనే నిల్చుని, తన పమిటి చెంగుతో కళ్ళు వత్తుకుంటూ,)

లక్ష్మి: అమ్మగారూ, ప్రతాప్ బాబుగారిని పిలిపించండి. సువర్ణమ్మకి యిట్టే నయమవుతుంది.

తల్లి: ఏమో! లక్ష్మీ, యిన్నాళ్ళూ చులకనగా మాట్లాడి యిప్పుడు నే రమ్మంటే ప్రతాప్ వస్తాడా? అయినా కబురంపుతాలే. నువ్వు యిక్కడే వుండు. పిచ్చి తల్లి ఎలా అయిపోయిందో. (లేచి యింట్లోకి వెళ్ళిపోతుంది)

సు: లక్ష్మీ, నే చచ్చిపోతే బాగుండును లక్ష్మీ!...అమ్మా (మూల్గుతుంది.)

ల: అలా అనకమ్మా, రోజులు బాగుంటే అతనే మళ్ళీ వస్తాడు. అయినా (రహస్యం చెబుతున్నట్లు సువర్ణ చెవి దగ్గరగా వంగి) అమ్మగారు కబురంపుతామన్నారు.

సు: ఏమో! నాకు వస్తాడని నమ్మకంలేదు. మనం రాలే దనే అనుకున్నాడేమో ఆవేళ! (ఏడుస్తుంది)

(దూరం నుంచి లక్ష్మీ అని కేక వినిపిస్తుంది.)

ల : ఆ, వస్తున్నాను అమ్మగారూ, (సువర్ణతో) ఇందాకానే ప్రతాప్ బాబుకి కబురంపుతానన్నారు. ఏమైందీ వచ్చి చెపుతా. కళ్ళుమూసుకుని పడుకో తల్లీ. (అంటూ లోపలికి వెళ్ళిపోతుంది.)

* * *

తల్లి : లక్ష్మీ, యిప్పుడప్పుడే ఈసంగతి మాత్రం దానికి చెప్పకు. అసలే కళ్ళల్లో వున్నాయి దాని ప్రాణాలు!

ల : ఎంత దారుణం చేసాడమ్మా! అంత ప్రేమించానసే వాడు ఇలా ఎలా సమాధానం చెప్పగలిగాడని!

త : అలా అనకు లక్ష్మీ, ఏదో జరిగి వుండాలి. అతనూ దరిదాపు పిచ్చివాడిగా వుంటున్నాట్ట. అప్పన్న చెప్పాడు. అతన్ని చూస్తూంటే ఎంతో కాలం బ్రతికేలా కూడా లేడంటున్నాడు. ఇంతకీ మనపిల్ల అదృష్టం!

(లక్ష్మీ అని అతి హీన స్వరంతో సువర్ణ కేక వేస్తుంది)

ల : (దగ్గరగా వస్తూ) ఏమమ్మా పిలిచావు? ఏం కావాలి? కొంచం వేడిగా పాలు తాగుతావా? అదేమిటి ఏడుస్తావెందుకమ్మా?

సు : మీ మాటలు నాకు వినిపిస్తూనే వున్నాయి లక్ష్మీ... (ఏడుస్తుంది)

ల : అంతా నీమంచికే తల్లీ. అస్తమానూ అలా కంటతడి పెట్టకు. అయినా, కొంచం ఆలోచించుకో. ప్రతాప్, యింకెలాగూ నీకు భర్త కాడు. సూత్రం కట్టినందుకు అతను తిరిగి వస్తే అదృష్టవంతురాలివే!

సు : అలా జరగదు లక్ష్మీ. ఎప్పటికీ అలా జరగదు. నేను ప్రతాప్‌నైనా చేపట్టాలి, మృత్యువునైనా చేపట్టాలి. (ఆవేశంతో అనేసి, రెండు చేతులా ముఖం కప్పుకొని ఏడుస్తూంటుంది.)

## ఆఱవ రంగం

[కొన్ని మాసాలు గడచిన తరువాత. ఆ కొన్ని మాసాల్లోనూ ఎన్నో విపరీత పరిణామాలు రూపొందాయి. సువర్ణ తండ్రి మరణించాడు హఠాత్తుగా. తల్లికి సువర్ణే ప్రాణం అయింది. ప్రతాప్ జాడ తెలియకుండాపోయాడు. చాలా మంది నమ్మకం అతడు ఆత్మహత్య చేసుకున్నాడని. ఏమో! నిజమే కావచ్చు... సువర్ణ ఆరోగ్యం కోలుకుంది. తిరిగి కొంచం ధైర్యంగా లోకం వైపు చూడకల్గుతోంది. తిరిగి కొందరి యౌవనులకి ధైర్యం కల్గుతోంది. ఆమె దృష్టి తమపై ప్రసరిస్తుందని. అలాగే ఆమె దృష్టి సుధీర్ మీద పడింది. సుధీర్ జల్సా యువకుడు. తల్లికి ముద్దులకొడుకు. వారిది ప్రక్క పల్లెటూరే. జమీందారు. సువర్ణ యింటికి తరుచు వస్తూ పోతూ వుంటే, సువర్ణ తల్లికి కొంచం కొంచం హృదయం స్థిమిత పడుతోంది. సువర్ణ శోభతో తిరిగి కలకల్లాడుతుందని.]

ల : (దూరంగా వస్తున్న సుధీర్‌ని చూచి) అమ్మా, సుధీర్ బాబు ఈవాళ నడిచే వస్తున్నారు. కారు పాడైందో ఏమో! సువర్ణమ్మని కిందికి రమ్మనమన్నారా?

త : రమ్మనే. లేకుంటే నాతో కూర్చుని ఏం కబుర్లు చెప్తాడు? లక్ష్మీ, (ఆనందం ధ్వనించే కంఠంతో) మన సువర్ణ యితన్ని పెళ్ళి చేసుకుంటే!

ల : ఏమోనమ్మా, అంతా దైవాధీనం! మన సువర్ణమ్మ మటుకు సుధీర్ బాబుతో సరదాగానే వుంటున్నారు. నే ఆవిణ్ణే పిల్చుకొస్తాను. (వెళ్ళిపోతుంది)

త : రా, సుధీర్, అలా గుమ్మంలో నిల్చుండి పోయావేం? లోపలికి రా.

సుధీర్ : నమస్కారాలండీ, ... ఇవాళ చాలా పెద్ద పని మీద వచ్చాను. అమ్మ, ఇవాళ పదయినాసరే సువర్ణని తీసుకు రమ్మంది యింటికి. మీరు చెప్తే తప్పక బయలు దేరుతుంది. చెప్పండీ. (ప్రాధేయ పూర్వకంగా అడుగుతాడు.)

త : (చిన్న నవ్వు నవ్వుతూ) అదేమిటోయ్! నువ్వాడుగుతే ఎందుకు రానంటుంది? ఈవాళ అడిగి చూడు. తప్పకుండా వస్తుంది. లక్ష్మీ, సుధీర్ వచ్చాడు, కూర్చోవోయ్, వస్తుంది,

సుధీ : (లోపలికి పోయి కూర్చుంటాడు.) రా. సువర్ణా. యివాళ బాగా అలంకరించుకున్నావే! (చిన్న నవ్వు నవ్వుతాడు.)

సు : (వచ్చి కూర్చుంటూ) లక్ష్మీ లేదూ, నా ప్రాణం తీస్తుంది అప్పుడప్పుడు. (సిగ్గుతో ఆమె చెక్కిళ్ళు ఎర్ర బడ్డాయి) అయినా, ఎప్పుడూ ఏ గొడవా అక్కరలేని నీ దృష్టికి యిదే ఆనిందా అని ఆశ్చర్యంగావుంది !

సుధీ : (కొంచం తికమక పడుతున్నట్లు) అఁ ఏం లేదు. కాని, మా అమ్మ నిన్నోసారి రమ్మంది. వస్తావా?... నీకిష్టం వుంటే నేనే.

సు : (కొద్ది క్షణాలు రెప్పవాల్చకుండా అతన్నే చూస్తూ) నా కిష్టంలేదని ఎవరు చెప్పారు? అందుకే కబోలు లక్ష్మీ ముందే అన్నీ సిద్ధంచేసింది. యిప్పుడే పోదామా? కొంచం సేపుండా?

సుధీ : (ఆనందావేశంతో) సువర్ణా, నిజంగా నువ్వు దిగి వచ్చిన దేవతవి ! నా ముసలి తల్లికి యింతకంటే ఆనందం యింకేదీ యిచ్చి వుండదు !... ఆమె ఆత్రం కొద్దీ ఏమేనా అడిగేసినా ఏమీ అనుకోకు.

సు : (నవ్వుతూ) ఏం అడుగుతుందేమిటి? ఇంటి కోడ లు గా రమ్మంటుందా?

సుధీ : అంత ధైర్యంగా అడగడానికి నువ్వు ఏమాత్ర మేనా చనువిస్తేగా !

సు : ఎందుకివ్వలేదూ, మొన్న మా యింటికి వచ్చినా, ఏదో మాటొచ్చి, అలా కాదత్తయ్యా, అన్నాను. అంతే. ఆవిడకి ఎంతో ఆనందం అయిపోయింది. అయితే అమ్మతో చెప్పి బయలుదేరుదామా?

సుధీ : మహాప్రసాదం !

సు : పోదూ. మరీ అల్లరివాడివి అవుతున్నావు. (అమ్మా అంటూ కేక వేస్తూ బయటికి వెడుతుంది.) అమ్మా, సుధీర్ వాళ్ళ అమ్మ రమ్మన్నారట, పోయిరానా?

త : వెళ్ళు, దానికేం?

సు : మరి లక్ష్మి?

త : (నవ్వుతూ) సుధీర్ చాలడా నీకు సాయానికి? లక్ష్మి కూడా ఎందుకూ?

సు : (సిగ్గుతో) సరేలేమ్మా...... మరి పోయి రామా?

త : వెళ్ళి రండి తల్లీ.

సుధీ : మేం వెడతామండీ. మీ అమ్మాయిని తీసుకొచ్చి స్వయంగా అప్పచెప్పుతాను.

(ఏకాంతంగా రోడ్డుమీద నడిచి పోతూంటే సువర్ణకి ఏవేవో దివ్యానుభూతులు స్మృతి పథంలో మెదిలాయి. చిరునవ్వులు నవ్వుకుంది.)

సుధీ : ఎందుకూ అలా నవ్వుకుంటున్నావ్?

సు : ఏం లేదూ. మనిద్దరం యిలా వెడుతూంటే, ఎందుకో నవ్వొచ్చింది.

సుధీ : అమ్మ ఏమైనా అనుకుంటుందనా?

సు : ఏమనుకుంటుంది? ఆవిడకి కావలసింది అదేగా? (నవ్వుతుంది.)

సుధీ : సువర్ణా ఒకటి అడుగుతాను చెప్తావా?

సు : అడగకుండా కూడా చెప్పాలా?

సుధీ : నాకు నీమీద ఎంత మక్కువో తెలుసు. మా అమ్మకి నువ్వంటే ఎంత యిష్టమో తెలుసు. ఇక మీ అమ్మకి నే నంటే ఎంతో ఆప్యాయం అని నాకూ తెలుసు. మరి నీకు కూడా నా మీద ఏమాత్రమైనా అభిమానం ఉన్నట్టా? లేనట్టా?

సు : వుంటే ఏమిటి? లేకుంటే ఏమిటి?

సుధీ : వుంటే, మనిద్దరం పెళ్ళిచేసుకొని హాయిగా వుం డొచ్చు. లేకుంటే నాదారి నేను చూసుకుంటాను.

సు : ఏం చేస్తావేం?

సుధీ : దూర దేశాల్లో పని కల్పించుకొని వెళ్ళిపోతాను. నిన్ను చూసిన దగ్గరనుంచీ గాలి మేడలు కట్టడం ఆరంభించాను. అప్పుడు అవి గాలి మేడలుగానే వుండిపోతాయి.

సు : నాకు అభ్యంతరం లేదుకానీ, పెళ్ళికి ముందు ఒక రహస్యం నీకు చెప్పాలి. అది విన్నాక కూడా నీకు అభ్యంతరం లేకుంటే......

సుధీ : ఎప్పుడో ఎందుకూ, ఇప్పుడే చెప్పు సువర్ణా! అలా తోటలోకి నడు. అక్కడ చెప్పేద్దువుగాని. ఏ సంగతీ యిప్పుడే తేల్చేయి.

సు : సరే నడూ......

(తోటలో కూర్చున్న సువర్ణకి దుఃఖం కట్టలు తెగి రాసాగింది. ఎందుకో యిదంతా తెలియని సుధీర్, ఆందోళన పడసాగాడు.)

సు : నా జీవితంలో ఎవరూ, లక్ష్మీతప్ప, తెలుసుకోలేని రహస్యం ఇది. నాకు వివాహం అయింది సుధీర్.

సుధీ : నిజంగానా! వరుడెవరు?

సు : తెలియదు. అదంతా ఒక కలలోలా జరిగింది. (సువర్ణ తన గాథనంతా చెప్పింది. అది వింటూన్న సుధీర్ సంతోషానికి అడ్డులేదు.)

సుధీ : నే నెంత అదృష్టవంతుడ్ని సువర్ణా. ఆ వరుణ్ణి నేనే. దారీ తెన్నూ కానరాని ఆ అంధకారంలో, గాలివానలో నేను ఒక యింట్లోకి వెడితే, పురోహితుడు నాచేత సూత్రం కట్టించాడు. అక్కడ నా కళ్ళముందు నిల్చున్న కన్యని చూస్తే, అచేతనుణ్ణయి, వెనకా ముందూ ఆలోచించకుండా పుస్తె కట్టేశాను. తర్వాత కన్నెత్తి చూసిన, ఆమె స్మృతి తప్పి ఉంది. నే వడి వడిగా వెళ్ళిపోయాను. తర్వాత మళ్ళీ ఎప్పుడూ ప్రశాంతంగా కన్ను మూయ్యలేకపోయాను.

సు : (ఆవేశంతో) సుధీర్, నువ్వేనా? నిజంగానా?

సుధీ : అవును నేనే. యిప్పుడైనా నన్ను, నా తొందర పాటును క్షమించు. ఇప్పుడు ఎలాగా మనం భార్యా, భర్తలం అని తేలింది గనుక, నిజంగా అలా అయి పోదాం, అమ్మకి చెప్పేద్దాం. త్వరగా నడు... సువర్ణా యివాళ మనం నిజంగా జీవిస్తున్నాం... అవునా?

సు : నిజంగానే, నే తరవాత ఎంతగా వాపోయానో పేరేనా కనుక్కోలేదే అని.

ఆనందంతో నవ్వుకుంటూ వస్తున్న కొడుకునీ, సువర్ణనీ చూసి ముసలితల్లి ఉప్పొంగింది.

సుధీ : అమ్మా, యిన్నాళ్ళు మురిపించుకుంది సువర్ణ - నీదగ్గరికి రావడానికి. ఇదిగో! తీసుకు వచ్చాను. యింక వాళ్ళ యింటికి పంపించకు - యేం?

తల్లి : అలా అనకురా, మళ్ళీ రానంటుంది.

సుధీ : అవునా సువర్ణా?

సు : అలా అనకండీ! ఎందుకురానూ?

సుధీ : (సువర్ణకేసి చూస్తూ) అమ్మా! నీకో మంచి వార్త చెప్తాను, యేమిస్తావో మరి?

తల్లి : నేను నీకేం యివ్వగలనురా? చెప్పు!

సుధీ : సువర్ణ యిక నీయింటి కోడలు.

తల్లి : నిజంగానేనా, యేం సువర్ణా?

సు : (సిగ్గుతో తలవంచుకుంటుంది.)

తల్లి : అమ్మ దొంగా, యిన్నాళ్ళు దాచావు. మీ అమ్మకి తెలుసా?

సుధీ : తెలియదమ్మా, పోయి చెప్పాలి. నేవెళ్ళి ఆవిడను యిక్కడికి తీసుకొని వస్తాను. (సుధీర్ వెళ్ళిపోతాడు)

తల్లి : నీలాంటి కోడలు కావాలని నే కన్న కలలు ఫలించాయితల్లీ. వాడే నాకు ప్రాణం. వాడి ఆనందమే నాకు మనశ్శాంతి. వాడిని చూసుకొనే భారం యిక నీది. ఎక్కువ ఆలస్యం లేకుండా నే నిన్ను మాయింటికి తెచ్చుకొంటాను.

(సువర్ణ తల నిమురుతూ వుండగా తెరపడుతుంది.)



# స్త్రీలు — ఉద్యోగాలు

స్త్రీలశక్తి సామర్థ్యాల్నీ, కార్యదీక్షాపరత్వాన్నీ, నిర్వహణలోని నిపుణత్వాన్నీ గ్రహించిన అమెరికా దేశంలో, ఆ ప్రభుత్వం పురుషులతోబాటు స్త్రీలకుకూడ ప్రతీ గవర్నమెంటుశాఖల్లోను ఉద్యోగాలిచ్చి, స్త్రీల పురోభివృద్ధికి అన్ని అవకాశాల్నీ కల్పిస్తున్నారు, చూడండి:

వాషింగ్టన్:—1953 సం. లెక్కలను బట్టి ఉద్యోగాలు చేస్తున్న స్త్రీల సంఖ్య, 'రిపబ్లిక్ నేషనల్ కమిటీ' స్త్రీల శాఖ ఈ క్రిందివిధంగా ప్రచురించింది:

దేశ మొత్తంలోనున్న 48 సంస్థానాల్లోను. 3,072 జిల్లాలున్నాయి. ఈ జిల్లాలన్నిట్లోను 12,000 మంది ఆఫీసర్లుగా పనిచేస్తున్నారు. స్త్రీలు కలక్టర్లుగాను, కోశాధికార్లుగాను, రిజిష్ట్రార్లుగాను, రికార్డర్లుగాను, ఆడిటర్లుగాను, గుమస్తాలుగాను నియమించ బడుతున్నారు. కొద్దిమంది న్యాయాధిపతులుగాను, ఎడ్మినిస్ట్రేటర్లుగాను, కంట్రోలర్సుగాను కూడ వున్నారు.

ఈవిధంగా స్త్రీలకు అవకాశాలు యివ్వడం వల్ల వారి శక్తి సామర్థ్యాలు ప్రపంచానికి చక్కగా నిరూపించటానికి సావకాశం ఏర్పడింది. 20 మంది స్త్రీలు మేయర్సుగా పని చేస్తున్నారు. చాలామంది సిటీకౌన్సిలర్సుగా వున్నారు. విద్యాశాఖలో కూడ చాలమంది వున్నారు. 3,000 నుండి 10,000 వరకు జనాభాలున్న పట్నాల్లో స్త్రీలు 800 వరకు గుమస్తాలుగా పనులు చేస్తున్నారు. 300 మంది ట్రెజరర్లుగా వున్నారు.

289 మంది 4 రాష్ట్రాల్లో శాసన సభల్లో మెంబర్లుగా వున్నారు. 1920 సం. లో స్త్రీలకు వోటింగు హక్కు వచ్చింది. రాష్ట్రాల్లో ఎన్నుకోబడ్డ సంఖ్య 31. వారిలో 6 గురు ప్రధాన కార్యదర్శులుగా వున్నారు. మరికొందరు ఆర్థికశాఖ, విద్యాశాఖ వగైరాల్లో వున్నారు. 5000 మంది స్త్రీల వరకు తదితర ఉద్యోగులుగా నియమింపబడి పని చేస్తున్నారు.

పెద్దపెద్ద పదవుల్లో స్త్రీలు ఆఫీసర్లుగా పనిచేయడమే గాక, విస్తారంగా విద్యాశాఖ, సాంఘికాభ్యుదయ శాఖల కమిటీల్లోను, ప్రజాసంస్థల్లోను, పారిశ్రామిక - ఆర్థిక - వ్యాపారాభివృద్ధి కార్యక్రమాల్లోను, సహాయపడుతున్నారు. అమెరికా సంయుక్తరాష్ట్ర కాంగ్రెసులో ఒక స్త్రీ సెనేటరుగాను, 11గురుప్రతినిధులుగాను వున్నారు. ఇప్పుడు సుమారు 5 లక్షలమంది ఫెడరల్ గవర్నమెంటు సర్వీసులో ఉద్యోగులుగా వున్నారు. 1200 మంది పరి పాలక శాఖలో వున్నారు. అందులో ఒకరు ప్రెసిడెంటు గారి కేబినెట్ లో మెంబరుగా నియమింప బడ్డారు. డిప్లొమాటిక్ సర్వీసులో ఇటలీ, స్విడ్జర్లాండ్ రాయబార్లుగా స్త్రీలనే నియమించేరు. ఇంకా 67 గురు స్త్రీలు అంతర్జాతీయ రాజకీయాల్లో పనిచేస్తున్నారు. ఇంతవరకు అమెరికా సంయుక్తరాష్ట్ర సుప్రీము కోర్టు మెంబరుగా స్త్రీలెవరూ లేకపోయినా, సుమారు 125 మంది స్త్రీలు న్యాయవాది వృత్తిలో పని చేస్తున్నారు. ఫెడరల్ కోర్టులో స్త్రీ న్యాయవాదులున్నారు. యు. ఎస్. "టాక్సు" కోర్టులో ఒకస్త్రీ జడ్జీ వున్నారు.

ఈ విధంగా పాశ్చాత్య దేశాల్లో స్త్రీలు పురుషులతోబాటు సరిసమానంగా అన్ని వృత్తులలోను చేరి పురుషుల కంటె ఎక్కువ నైపుణ్యాన్ని కనబరుస్తూ వున్నారు. ఇలాంటప్పుడు మన హిందూ దేశంలో విద్యాగంధం యెరిగిన ప్రజల సంఖ్య నూటికి 13 గురు. దాంట్లో స్త్రీ ఒక్కరు. ఈ చదువుకున్న స్త్రీలలో ఉద్యోగాలుచేసి రాజ్యభారం వహిస్తున్న వారి సంఖ్య వేళ్లపై లెక్క బెట్టొచ్చు. అందుచేత ప్రభుత్వాలు, ప్రజలు యీ విషయం గమనించి స్త్రీలకు విస్తార అవకాశాలివ్వాలనీ, ఇది ప్రజా సేవకూ, దేశాభ్యుదయానికి ఎంతైనా దోహద మౌతుందని 'ఆంధ్ర మహిళ' మళ్లా ప్రబోధిస్తూయుంది.



# పాకిస్తాను సోదరీమణులకు హైందవ నారీమణుల విజ్ఞప్తి

——: o :——

మన ఉభయ దేశాల చరిత్రలో ప్రస్తుతం ఏర్పడిన క్లిష్ట పరిస్థితుల వల్ల ఈ జాబు వ్రాస్తున్నాం. ఇటీవలవరకు మన మంతా ఏక దేశీయులంగా వుండడం వల్ల పాకిస్తాన్ సోదరీ మణులతో మాకు దగ్గర బాంధవ్యం ఏర్పడింది. మనమంతా మొన్నటి వరకు ఏక దేశీయులుగా నివసించడమే గాకుండా, భుజాలు కలుపుకొని దేశ స్వాతంత్ర్యానికై అహోరాత్రాలు పోరాడి అపూర్వ త్యాగాలు గావించేం. పరదేశీయులనుండి దాస్య విముక్తి పొందిన నాడు గాని మనకు శాంతి వుండదనీ, మన బిడ్డల్ని చక్కటి దేశ వీరులుగా తయారు చెయ్యాలనీ కదా మనం స్వరాజ్యం కోరింది. ఎట్టకేలకు 200 సం॥ల తర్వాత బానిసత్వం నుండి ముక్తి పొందేం. ఇప్పుడిప్పుడే స్వేచ్ఛా వాయువు పీలుస్తున్నాం. ఈ సమయంలో స్త్రీలు కూడ ఎంతో ధైర్య సాహసాలు-కార్యదీక్ష వ్యక్త పరచేరు.

అందుచేత మన ఉభయ దేశాలు ఎంతో స్నేహ భావంతో, సహృదయతతో మెలిగిన నాడే మన దేశాల పురోభి వృద్ధికి దోహద మేర్పడుతుందని హిందూ సోదరీ మణులు గ్రహించేరు. మన ఉభయ దేశాల అభివృద్ధికి (ఆర్థిక విషయంలోనైతేనేమి, చారిత్రాత్మికంగా నైతేనేమి, సంస్కృతి విషయంలో నైతేనేమి, సర్వ విధాల కూడ) ఒకదానిపై మరొకటి ఆధారపడి ఉన్నాయి. మన ప్రధాన మంత్రుల సంప్రదింపులవల్ల మన యిరుదేశాలమధ్య ఉన్న తగాదాలను సరిదిద్దుకోవచ్చు. అంతేకాని ఇతర దేశాల వారిని పిలుచుకు రావడం కొరివితో తలగోకడం పౌతుంది. ఇటీవల వరకు పర రాజన్యులు మనలో అన్యోన్య మనస్పర్థలు పెంచి, కొంపకు పెట్టిన చిచ్చువల్లనేకదా మనమంతా అనేక కష్టాలకు పాల్పడవలసి వచ్చింది. ఆ చిచ్చు ఆర్పడానికి ఇంతకాలం పట్టింది. ఆ దావాగ్నిలో ఎంతమంది ఆప్తుల్ని, బిడ్డల్ని, భర్తల్ని కోల్పోయి కుమిలిపోతున్నారు? ఆ చరిత్రనే మళ్ళా చర్విత చరణం చేయవద్దు.

దేశాలమధ్య శాంతి సమరస భావాలు ఏర్పడాలి అంటే యుద్ధమన్న తలంపే చరిత్రలో తుడుచుకు పోవాలి. మీ ప్రభుత్వం అమెరికాను కోరుతున్న మిలటరీ సహాయం విషయం వినేసరికి మాకు వొడలు జలదరించింది. మీరు కోరే యీ మిలటరీ సహాయం మీ దేశాన్ని ఒక యుద్ధ రంగంగా మార్చడమేగాక, మీ ప్రజల సుఖజీవనానికే ముప్పు తెస్తుంది. మనమంతా కూడ, మాతృ హృదయంలో సర్వకాల సర్వావస్థలయందు మన బిడ్డలు ఆయురారోగ్యాభివృద్ధిగా వర్ధిల్లాలని ప్రార్థిస్తున్నాం. ఇటువంటి సమయంలో మళ్ళా యుద్ధ సన్నాహాలు తలపెట్టకండి. మన స్త్రీలు ఇండియాలో నున్నా, పాకిస్థాన్‌లో నున్నా ఈ మారణయత్నాలు చూస్తూ వూరుకోలేరు. మన పూర్వానుభవలావల్ల మనకు తెలుసు - పరదేశీయులు తెచ్చిపెట్టే అగచాట్లన్నీను. అందుచేత అమెరికా మిలటరీ సహాయం పాకిస్థాన్‌కు, హిందూ దేశానికీ కూడ ఎటువంటి ప్రమాదాలు తెస్తుందో సువ్యక్తమవుతూనే వుంది గదా!

స్త్రీలు ఎప్పుడూ స్వాభావికంగా యుద్ధమంటే ఏవగించుకుంటారు. దానివల్ల ఎన్నికోట్ల అమూల్య జీవితాలను ఆహూతి చేయాలో, ఎంత ధనం అనవసరంగా నాశనం చెయ్యాలో వారికి తెలుసు. ఆ ధనమే సద్వినియోగ పరచినట్లయితే ప్రపంచ శాంతి-భద్రతలకు అనేక నూతన పంథాలు నిర్మించ వచ్చు. పాకిస్థాన్‌కు సహాయపడతామన్న పెద్దలకు తెలియదు— అచ్చటి స్త్రీలు వాంఛించేది 'వారి బిడ్డలకు కడుపునిండా కూడు- గుడ్డ- విద్య-ఆరోగ్యం ఆనందం-' అంతే కాని మెషీను గన్నులు- టాంకులు- బాంబులు కాదని! మన రెండు దేశాల్లోనుకూడ సరియైన ఆహారం- వైద్య సహాయం లేక అనేకమంది బిడ్డలు ప్రాణాలు కోల్పోతూ ఉంటే ఆ తల్లులు పొందే కడుపు శోకం ఎవరికి తెలుస్తుంది? యుద్ధమే తప్పనిసరియైయితే ఎన్నెన్నో క్లిష్ట పరిస్థితులకు తట్టుకుని బైటబడ్డ ఆ కొద్ది మంది బిడ్డలు కూడ యుద్ధరంగంలోకి ఈడ్చబడతారు.

అమెరికా మిలిటరీ సహాయంతో పాకిస్థాన్‌లో చక్కటి 'ఇండ్లు- స్కూళ్ళు- ఆస్పత్రుల'కు బదులు యుద్ధ సన్నాహాలు తయారుచేయవలసివస్తుంది. పాకిస్థాన్ యుద్ధ రంగంగా మార్చవద్దని మీ స్త్రీలంతా ఎదురు తిరిగిననాడు మీకు తోడ్పడడానికి మేమంతా సంసిద్ధులుగా వున్నాం. ప్రపంచంలో శాంతి నెలకొల్పిన నాడే మనమంతా నిశ్చింతగా జీవించగలం. మన స్త్రీలంతా గట్టిగా సంకల్పించి, యిలాంటి యుద్ధాలు అరికట్టి, మన భర్తల్ని, బిడల్ని, సోదరుల్ని కాపాడాలి.

స్త్రీలు ఎప్పుడూ దేశ కళ్యాణానికి తోడ్పడే వారేకాని, దేశ వినాశనానికి కారకులు కాకూడదు. అందుచేత మన మంతా ఐక్య కంఠంతో యీ యుద్ధోన్మత్తాన్ని అరికట్టి ప్రపంచ శాంతికి పాటుపడదాం.

ఇట్లు

హైందవ సోదరీమణులు.

# కేంద్ర సంఘ సంక్షేమ మండలి

## అధ్యక్షురాలుగా శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ముఖ్ గారి నియామకము

దేశం మొత్తము మీద సంఘ సంక్షేమ కార్యక్రమాల అభివృద్ధికని, అందునిమగ్నమైన ప్రత్యేక సంస్థలకు ప్రోత్సాహమివ్వడానికని, కేంద్ర ప్రభుత్వమువారు ఒక కేంద్ర సంక్షేమమండలిని నియమించి, దాని నిమిత్తము 4 కోట్ల రూపాయలు వెచ్చించుటకు అనుమతి యిచ్చిరి. సేవాసంస్థల ప్రతినిధులు, కొందఱు ప్రభుత్వోద్యోగులు, మంత్రులు మున్నగువారు సభ్యులుగాగల యీ సలహా మండలికి, శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్‌గారు అధ్యక్షురాలుగా మొదటినుండీ వ్యవహరిస్తూ ఉన్నారు. గత 6 మాసములలో యీ మండలి కార్యకలాపాలు ఎక్కువగా విస్తరించుటవల్ల, శ్రీమతి దుర్గాబాయిగారు దీనికి సంబంధించిన పరిపూర్ణభారాన్ని వహించుటకు వీలగునట్లుగా, తమ ప్లానింగ్ కమిషన్ సభ్యత్వాన్ని వదలి, యీ మండలియొక్క అధ్యక్ష పదవిని స్వీకరించారు.

### సలహా సంఘాలు.

ఈమండలి తరపున, కొన్ని సలహాసంఘాలు ఏర్పాటు చేయబడినవి. అందలి సభ్యురాండ్రు దేశ పర్యటన చేసి, సేవాసంస్థలను పరిశీలించి, వారు చేయుచున్న కృషి ఎంతటిది, ఆ కృషికి యీ మండలి ఏవిధమైన ప్రోత్సాహమివ్వదగును అను విషయములనుగూర్చి ప్రభుత్వమునకు నివేదికలు సమర్పించుచున్నారు. ఇటీవల పిల్లలకు, స్త్రీలకు సంబంధించిన సంక్షేమ సంస్థలను, యీ సలహా సంఘాల వారు పరీక్షించియున్నారు.

### స్త్రీల సలహాసంఘం.

స్త్రీలసంక్షేమంలో కృషి చేస్తున్న సంస్థలను పరీక్షించుటకు శ్రీమతి ప్రోభాబెనర్జీగారి ఆధ్వర్యాన్న ఒక సలహా సంఘం నియమింపబడ్డది. ఈ సంఘమునకు జెందిన

# మదరాసు సంగీత కళాశాల

## ఎనిమిదవ వార్షికోత్సవము

—:—

గోపాలపురం మద్రాసు సంగీత కళాశాల 8. వ. వార్షికోత్సవం 14. తే. న. కళానిధి శ్రీ ముసిరి సుబ్రహ్మణ్యయ్యర్‌గారి అధ్యక్షతన జయప్రదంగా జరిగింది.

కళాశాల ఆర్కెస్ట్రాతో వుత్సవము ప్రారంభించబడినది. తదుపరి కళాశాల విద్యార్థినులు "గ్రహభేదము—గోచరదృశ్యము" అను దానిని అతి నైపుణ్యముతో ప్రదర్శించి శంకరాభరణ స్వరమును ఆధారషడ్జమముగా తీసుకొని క్రొత్తరాగములను శాస్త్రబద్ధముగా చక్కగా పాడి ప్రేక్షకులను ఆనందపరవశులను చేసిరి. పిమ్మట వైస్ ప్రిన్సిపాల్ శ్రీమతి ద్వారకా పార్థసారధిగారు వార్షిక నివేదికను సమర్పించిరి. అధ్యక్షులు శ్రీ ముసిరి సుబ్రహ్మణ్యయ్యర్‌గారు వుపన్యసించుచూ "కళాశాల విద్యార్థినులకు ఇంత చక్కటి శిక్షణయిచ్చుచున్న ప్రిన్సిపాల్సు శ్రీ ఎన్. సి. పార్థసారధి, శ్రీమతి ద్వారకా పార్థసారధిగార్లు అభినందనీయు"లని ఉద్ఘాటించిరి. తదుపరి పెద్దలు పంపిన అభినందన పత్రములను చదివిరి. పిమ్మట గవర్నమెంటు పరీక్షలలో వుత్తీర్ణులయిన వారికి సర్టిఫికెట్లు, బహుమతులు పంచిపెట్టబడెను. తరువాత శ్రీ శ్యామ శాస్త్రికిని శ్రీ బొబ్బిలి కేశవయ్యగారికిని జరిగిన సంగీత పోటీని నాటకంగా విద్యార్థినులచే ప్రదర్శింప బడెను. కళాశాల విద్యార్థిని కుమారి పి. వేదవతి వీణాగానముచే ప్రేక్షకులను సంతసింప చేసెను. కళాశాల ప్రిన్సిపాల్‌గారి వందన సమర్పణతో సభ ముగిసెను

---

శ్రీమతులు పెద్దాడ కామేశ్వరమ్మ, మన్‌మోహిన్ సైగాల్, పెరిన్‌మిస్త్రీ, సరళాదేవిగారలు, కార్యదర్శిని రంగనాయకమ్మగారితో ఫిబ్రవరి నెలలో దక్షిణాదిని పర్యటించినప్పుడు, ఆంధ్ర మహిళా సభకు కూడ వచ్చి యున్నారు.









ప్రపంచములో అతి పురాతనమైనది స్పెయినులోని న్యాయస్థానం. క్రీ. శ. 961 నుండి ప్రతి గురువారం కెతడ్రల్ వెలెన్సియాకు ఎదురుగా యిక్కడ తీర్పు జరుగుతూ వుంటుంది.

క్రీ॥ శ॥ 958 సం॥రములకు ముందు మొట్టమొదట గాలిలో అతి వేగముగా వార్తలను పంపుట మొదలు పెట్టిరి. కైరో మతగురువు అజీజ్ (975 - 996) చెరిస్ పండ్ల కొరకు బాల్ బక్ నగరానికి 600 పావురములచే ఉత్తరవు పంపెను.

ఒక యుద్ధ విమానపు విలువ 1,000,000 డాలర్లు. అంటే 500,000 బుషెల్సు (17,619,150 లిటర్సు) గోధుమల విలువతో సమానము.

మూలం : జార్జి యిలియట్.

# ఎప్పీ

అనువాదం : "శ్రీ శిల్పి"

సైలస్ మార్నర్ వంటి విచిత్ర వ్యక్తి ఆ దిక్కూ మొక్కూ లేని చంటి పిల్లను పెంచుతున్నాడూ అంటే అందరూ విడ్డూరంగా చెప్పుకోరూ! మార్నర్ అంత వరకూ తన ప్రాణ సమానంగా చూచుకొంటూ వచ్చినధనం వున్నట్లుండి అమాంతంగా మాయమయేసరికి ఒక్కసారిగా ఆ వూరందరికీ అతనంటే నాటుకుపోయి వున్న విరక్తి భావం పోయి జాలే కలిగింది. అందువల్ల అంటూ సొంటూ లేకుండా ఒంటరి జీవితం గడిపి మార్నర్ యీ రెండేళ్ళ పిల్లని యే విధంగా పెంచగలడా అన్న సందేహంతో అమ్మలక్కలు నలుగురూ నాల్గు విధాలుగా పిల్లల పెంపకం విషయంలో సలహాలిచ్చేరు. ఆ యిరుగు పొరుగు వారిలో ఆడంబరం అంటే యేమో యెరుగని డాలీ వింత్రాప్ మాటంటే మట్టుకు మార్నర్‌కి యెక్కడ లేని గురి.

మార్నర్ తనకు గాడ్ ఫ్రై పిల్ల ఖర్చుకుగాను యిచ్చిన రూ 8/- డాలీకి చూపి దానితో యేమేమి కొనవలసి వుంటుందో కనుక్కున్నాడు. డాలీకి యిటు చూస్తే అటు చిటుక్కున పెరిగే వయస్సులో పిల్లలకి బట్టలూ పాతలూ అంటూ డబ్బు తగలేయ వద్దనీ, తాను అయిదు సంవత్సరాల క్రితం తన ఎరన్‌కి తొడిగిన బట్టలే తెచ్చిస్తాననీ చెప్పింది. ఆ రోజే డాలీ ఆ బట్టల దొంతర తెచ్చి మార్నర్‌కి ఆ బుల్లి చొక్కాలను ఒక్కొక్కటీ చూపించింది. చాలా వరకు అవన్నీ మాసికలతో నిండి వున్నాయి కాని శుభ్రంగా వుతికిన వవడం వల్ల తెల్లటి మల్లెపూల్లా వున్నాయి. ఎప్పీకి సబ్బుతో రుద్ది చక్కగా స్నానం చేయించే సరికి మిల మిలా మెరుస్తూ క్రొత్త అందంతో బయట బడింది. డాలీ వళ్ళో కూర్చుని తన చిట్టి చేతులతో కాలిబొటన వేళ్ళందుకుంటూ తన్ని గురించి, తాను మహత్తర విషయమేదో కనిపెట్టివేసిన దానిలా చేతులు రెండూ కలిపి చప్పట్లు చేస్తూ "జిజ్... బుజ్... అత్త...త్త" అంటూంది. డాలి మురిసిపోతూ "దేవలోకంలో దేవతలు మాత్రం యింతకన్న అందంగా వుంటారని యెవరనగలరు? ఇటువంటి బంగారు బొమ్మ- చింకి పాతల్లో- ఆ దిక్కులేని తల్లి మంచంలో మరణం- ఏదో తెలియనిశక్తి యీ బిడ్డని నీ యింటికి దారి చూపటం- అన్నట్లు నీ తలుపు తెరిచే వుంది కదూ?" మార్నర్ ఆలోచనల మధ్యలో నుండి అన్నాడు. "ఆ... తెరిచే వుంది. నా ధనం అంతులేని చోటెక్కటికో మాయమైంది- యీ బిడ్డ అంతులేని యే చోటునుండో నా దగ్గరకు వచ్చింది." డాలీ తన స్వభావిక వాత్సల్యంతో "రాత్రి, పగలు నిద్ర, మెలకువలులా ఒకదాని పోక యింకోదాని రాక జరుగుతుంటాయి. అది ఆ విధంగా యెందుకు యే విధంగా జరుగుతుందో యెవరికి తెలుసు? మనమెన్ని తికమకలు పడ్డా యే మాయా చేయలేము. మనకి తెలీకుండానే యెన్నో వస్తూ పోతూ వున్నాయి. ఇతరులేమనుకున్నా యీ బిడ్డ నీకు పంపబడింది. కాబట్టి నీ రక్షణలోకి తీసుకోవడంలో మంచి పని చేసేవంటాను. ఎప్పీ పోషణ విషయంలో నాకు సాధ్యమైనంత నేను తోడుపడతాను." మార్నర్ డాలీ సహాయానికి అభినందించేడు. "నేనేం చేయాలో తెలియజేస్తే చాలు...కానీ..." అంటూ వంగి వంగి డాలీ చేతుల మీద తల జేరవేసి తన్ని దూరం నుంచి వింతగా చూస్తున్న ఎప్పీని చూస్తుంటే డాలీ మీద ఈర్ష్య పడకుండా వుండలేకపోయేడు. "ఎప్పీకి చేయవలసిన పనులన్నీ నేనే చేయాలి. లేకుంటే ఎప్పీ తన్ని లాలన పాలన చేసే వారినే ప్రేమిస్తుంది నా దగ్గర చనువుండదు. నేను ఆ పనులన్నీ నేర్చుకోగలను— నేర్చుకోగలను" అంటూ గొణిగేడు.

డాలీ ఎప్పీకి చొక్కా వేసే విధం అదీ చూపిస్తుంటే మార్నర్ అతి శ్రద్ధగా చూస్తూ తన రెండు కండ్లనీ ఎప్పీ ఆకర్షించే విధంగా ముఖంలోకి చూచేడు. ఎప్పీ అతని రెండు చేతుల్నీ తన చిట్టి చేతుల్లో బంధించి తన బుల్లి నోటితో అతని బుగ్గలు చీకుతుంది. డాలీ హాస్యంగా "ఎప్పీ నీదగ్గరకే వస్తుందట. నీవంటే నే ప్రేమ." అంది. ఎప్పీని తన దగ్గరకు తీసుకుంటూంటే మార్నర్‌లో ఎంత వుత్సాహం వుప్పొంగిపోతున్నట్లుగా అనిపించేంది. ఆలోచనా అనుభ

వాలు మిళితమైపోతున్నట్లున్నాయి. ఆ అనుభవాన్ని మాటల్లో పెట్టాలంటే 'తన ధనమే యిప్పుడు ఎప్పీగా మారి తనకి పూర్వం తృప్తిని యివ్వగలుగుతోందని మాత్రం చెప్ప గలిగేవాడు. డాలీ "నీవు నేత పనిలో వుంటే రోజు రోజుకూ కొంటెగా పెరిగే యీ ఎప్పీని యేం చేస్తావు? నీ పొయ్యి యెత్తుమీద వుండటం మంచిదే అంటుంది. కానీ గాజు సామానులు, కత్తెర లాంటివి దూరంగా వుంచాలి సుమా!" అని హెచ్చరించింది. మార్నర్ మంచి వుపాయం తట్టిన వాడిలా ఓ పొడవాటి దారంతో ఎప్పీని మగ్గానికి కట్టివేస్తానన్నాడు. డాలీ నలుగురు బిడ్డల తల్లి గాబట్టి కావలసినంత అనుభవం పిల్లల విషయంలో. "ఆ విధంగా పిల్లల్ని కట్టివేస్తే యిల్లు పీకి పందిర వేయరూ? మా యింట్లో వున్న చిన్న బండి, యెద్దు గుడ్డపీలికలూ అవీ తెస్తాను. ఎప్పీ వాటితో ఆడుకుంటూ కబుర్లు చెబుతుంది. నా నలుగురు పిల్లల్లో ఒకరయినా ఆడు పిల్లలు లేరు. లేకపోతే వాళ్లకు యెన్ని కుట్లూ, అల్లికలూ నేర్పేదాన్నో. అయినా యిప్పుడు ఎప్పీ వుందిగా. పెద్దదయితే అన్నీ నేర్పుతాను." అంటూ తన ధోరణిలో తాను చెప్పుకు పోతుంటే... "ఆ... ఆ ఎప్పీనాదీ. మరెవ్వరికీ ఎప్పీని చెందనివ్వను' అనేసాడు. "తండ్రిలా నీవు ఎప్పీని పెంచితే ఎప్పీ నీదే అవుతుంది. కాని ఎప్పీని రోజూ ప్రార్థనలకు తీసికెళ్ళి దేవునిలో మంచి నమ్మకం కుదిరించే బాధ్యత నీది" అని అతని ముఖ్య మయిన కర్తవ్యాన్ని యెత్తి చూపాలన్నట్లుగా అందించింది. ఈ మాటతో మార్నర్ ఆలోచనా సముద్రంలో పడ్డాడు. తాను యేనాడో వదిలివేసిన ప్రార్థనాలయం అవీ తల్లో సుళ్ళు తిరిగేయి. చివరికి జంకుతూనే అన్నాడు. "అది లేనిదే మానవుడు మంచివాడు కాలేడా?" అని డాలీ తిరిగి తనవేదాంతం మొదలు పెట్టడంతో "సరే సరే డాలీ మంచికి యేది చేయమన్నా చేస్తాను" అని వొప్పుకున్నాడు.

ఇది వరలో తన ధనానికంటే యే విధమైన పోషణా అవుసరం లేకపోయేది. ఎక్కడ పెడితే అక్కడ భద్రంగా వుండేది. మరి యిప్పుడు ఎప్పీ అంటేనో, లాలనా పాలనా అంటూ కావాలి. అందువల్ల మార్నర్ బాధ్యత యిదివరకటి గట్టుదాటి యెన్నో కోసులు ముందుకు పోవలసి వుంది. ఇదివరకు తన ధనం తాను పెంపొందడానికి గాను మార్నర్ని వూపిరి సలపకుండా ఆ నేత పనిలో నిమగ్నుడ్ని చేసేవాడు. మరి ఎప్పీయో! తన నూతనత్వంలో, ఆనందంలో పాలు పంచుకొమ్మంటుంది. రోజులతో పాటు ఎప్పీ తన ముద్దు మాటలతో చిలిపిగా పెరిగిపోతోంది. మార్నర్ నేసిన వున్ని కత్తిరతో కత్తిరించే ప్రజ్ఞ సంపాదించింది. ఒక్క రోజు మార్నర్కి తెలీకుండా యింటి వెనుకగా వున్న కొలను దిగ్గరకు పారిపోయి తన కాలు జోడుతో బక్కెటులో నీరు తోడేది. మార్నర్కి ఎప్పీ కనిపించకపోతే హృదయం తల్లడిల్లి పోయేది. అంతా గాలించగా చివరికి ఎప్పీ కనిపిస్తే అప్పుడు కుదుట పడేది. డాలీ అంది యిటు వంటి కొంటె పనులు చేస్తే ఎప్పీని శిక్షించకపోతే లాభం లేదని. మార్నర్ తన ముద్దుల పాపాయిని యేమని శిక్షిస్తాడు? కొట్టడం అంటే తన తరం కాని పని. నయాన భయాన మాటలతో బెదిరిస్తే లెక్క చేయదు. ఆ పని చేయటానికి తన గుండె వణికిపోతున్నా తప్పని సరిగా ఎప్పీని బొగ్గుల కొట్టులో పెట్టి జడిపించాలని చూచేడు. కాని ఎప్పీ అది కూడ ఆకతాయ తనంగానే తీసుకుంది. డాలీ "కొట్టటం చేతకాకపోతే కత్తెరా అవీ అందుబాటులో లేకుండా చూచుకోవాలి మరి" అంది.

మార్నర్ పనిమీద బయటకు వెళ్ళితే ఎప్పీని కూడ తన వెంట తీసికెళ్ళేవాడు. ఇంటి దగ్గర వుంచితే డాలీకి చనువై పోతుందని అతనికి యెక్కడ లేని భయం. ఆ బంగారు ఛాయతో, గిరిజాల జుట్టుతో ముద్దులు మూటగట్టే ఎప్పీ అంటే ఆ వూళ్ళో అందరికీ ప్రాణమే అయిపోయింది. ఇదివరకు మార్నర్ అంటే పిల్లలందరికీ సింహస్వప్నం. ఇప్పుడు పెద్దల దగ్గర నుండి పిల్లల వరకు ఆ భావం పూర్తిగా మాసిపోయింది. మార్నర్కి ప్రపంచానికి మధ్య పడి పోయిన వంతెన్ని ఎప్పీ తిరిగి సరి చేసింది. పూర్వం దేవ దూతలు వచ్చి మనుష్యులను దేవలోకానికి దార్లు చూపించే వారట. కాని మార్నర్కి రెక్కలున్న దేవదూతలకి బదులు ఎప్పీయే అనంత మయమయిన లోకంలోకి దారి చూపిస్తుంది.



# అల్లికలు — జెర్సీ

<u>కావలసిన పరికరములు :</u>

6 ఔన్సుల మూడుపేట్ల ఎఱుపు రంగు ఊలు.
1 ఔన్సు మూడుపేట్ల నీలి రంగు ఊలు.
నెం. 10. 12. సూదులు.

ఇరువైపులా సూదిగా నుండు కేబుల్ (Cable needle) సూది ఒకటి. 8. బొత్తాములు.

## వెనుక భాగము.

నెం. 12. సూదిమీద ఎఱుపు రంగు ఊలుతో జెర్సీ అడుగు భాగము చివర ఆరంభించుచూ 106 కుట్లు అల్లవలెను.

1. వ. వరుస: ని. 3, ప. 2, ని. 6, ప. 2, * ని. 5, ప. 2, ని. 6, ప. 2, స్టార్ దగ్గర నుండి తిరిగి వేయుచూ చిట్ట చివర మూడుకుట్లు నిట్టు అల్ల వలెను.

2. వ. వరుస: ప. 3, ని. 2, ప. 6, ని. 2 * ప. 5, ని. 2, ప. 6, ని. 2, స్టార్ దగ్గర నుండి తిరిగి వేయుచూ చిట్ట చివర 3 కుట్లు పర్ల్ అల్ల వలెను.

3. వ. వరుస: ని. 1, మే. 1 (ఊలును సూది ముందు భాగమునకు తీసి తరువాత కుట్టు అల్లుటకు ముందు సూదిమీద వేయుట మేక్. అంటే ఒక కుట్టు ఎక్కువ చేయుట) స్లి. 1, ని. 1, పా. స్లి. స్టి. ఓ, ప. 2. కేబుల్. 6. (అనగా ఈ ఆరు కుట్లలో మొట్ట మొదటి 3 కుట్లు కేబుల్ సూది మీదకు మార్చి, వెనుక వైపు ఉంచి, తరువాత 3 కుట్లు నిట్టు అల్లి అప్పుడు కేబుల్ సూదిమీద వెనుకకు తీసివుంచిన మూడుకుట్లు నిట్టు అల్లవలెను) ప. 2, * ని. 2 (ఒకేసారి) మే. 1, ని. 1, మే. 1, స్లి. 1, ని. 1, పా. స్లి. స్టి. ఓ, ప. 2, కేబుల్ 6, ప. 2 స్టార్ దగ్గర నుండి తిరిగి అల్లుచూ చివరి మూడు కుట్లు ని. 2. (ఒకేసారి) మే. 1, ని. 1.

4. వ. వరుస: రెండవ. వరుసవలె.

5. వ. వరుస: ఒకటవ వరుసవలె.

6. వ. వరుస: రెండవ వరుసవలె.

7. వ వరుస : ని. 1, మే. 1, స్లి. 1, పా. స్లి. స్టి. ఓ, ప. 2, ని. 6, ప. 2, * ని. 2 (ఒకేసారి) మే. 1, ని. 1, మే. 1, స్లి. 1, ని. 1, పా. స్లి. స్టి. ఓ, ప. 2, ని. 6, ప. 2, స్టార్ దగ్గర నుండి తిరిగి వేయుచూ చివరి మూడు కుట్లు ని. 2 (ఒకేసారి) మే. 1, ని. 1.

8. వ. వరుస:— ప. 3, ని. 2, ప. 6, ని. 2, * ప. 5, ని. 2, ప. 6, ని. 2, స్టార్ దగ్గర నుండి తిరిగి వేయుచూ చివరి మూడు కుట్లు పర్ల్ అల్ల వలెను.

ఈ ఎనిమిది వరుసలు కలిసి నమూనా ఏర్పడును. ఇదే విధముగా నాలుగు సార్లు (8 × 4) అల్ల వలెను.

తరువాత నెం. 10 సూదులమీదకు మార్చి రెండు నమూనాలు వేసిన తరువాత, ప్రతినమూనాలో 5, 6. వ. వరుసలలో ఒక్కొక్క కుట్టు చొప్పున హెచ్చు చేయుచూ అదే విధముగా 5 నమూనాలు (8 × 5) వేయవలెను. అప్పుడు సూదిమీద మొత్తము 126 కుట్లు వచ్చును. ఎక్కువ వచ్చిన కుట్లు అంచులయందు (చివర భాగము లందు) ని. 5, ప. 2, ని. 6, ప. 2 మంచివైపు (Right side) కు వచ్చునట్లు లేక నమూనాకు సరిపడు నట్లు చూచి అల్లవలెను.

ఇదే మాదిరిగా 13 వరుసలు అల్లి, మొట్ట మొదటి నుండి 16. వ. నమూనా ఆఖరి వరుస వచ్చు నట్లు ముగించ వలెను.

<u>చంక ఆకార మేర్పరచుటకు :</u> — తరువాత 2 వరుసల ప్రారంభములో నాలుగు కుట్లు చొప్పన కాస్టాఫ్ చేయ వలెను.

3. వ. వరుస :— 4 కుట్లు కాస్టాఫ్ చేసి, కుడి చేతి లోని సూదిమీద కుట్లను ఎడమ చేతిలోని సూది మీదకు మార్చ వలెను. * ని. 2 (ఒకేసారి) మే. 1, ని. 1, మే. 1, స్లి. 1, ని. 1, పా. స్లి. స్టి. ఓ, ప. 2.

తరువాత 3 వరుసల ప్రారంభములో 4 కుట్లు కాస్టాఫ్ చేయ వలెను. (102 కుట్లు)

పై విధముగా 64 వరుసలు (భుజముల వరకూ) అల్ల వలెను. (మొట్ట మొదట ప్రారంభించి నప్పటి సూది మీద కుట్ల కంటె ఇప్పుడు ఒక్కొక్క చివర రెండు కుట్లు తక్కువగా నుండును)

భుజముల ఆకార మేర్పరచుటకు : — తరువాత వరుసగా 6 వరుసల ప్రారంభములో 10 కుట్లు చొప్పున కాస్టాఫ్ చేయుచూ ఆరు వరుసలూ అల్లి. మిగిలిన కుట్లన్నీ 7. వ. వరుసలో కాస్టాఫ్ చేయవలెను.

## ఎదుటివైపు ఎడమప్రక్క భాగము.

ఊలుతో నెం 12 సూదులతో 61 కుట్లు అల్ల వలెను. 5 నమూనాలు (8 × 5) వెనుకవైపు వేసిన మాదిరిగా వేసి నెం. 10. సూదులమీదకు మార్చి మరి రెండు నమూనాలు వేయవలెను.

ఇదే విధముగా నమూనాలు వేయుచూ తరువాత నమూనాలలో ప్రతి 5, 6 వరుసలలో ప్రారంభములో ఒక్కొక్క కుట్టు చొప్పున హెచ్చు చేయవలెను. ఈ విధముగా హెచ్చు చేసిన వరుసలు 10 అగువరకూ అల్ల వలెను. (అప్పుడు సూదిమీద 71 కుట్లుండును). పై విధముగా 13 నమూనాలు వేయవలెను.

చంక ఆకార మేర్పరచుటకు : తరువాత వరుస ప్రారంభములో 4 కుట్లు కాస్టాఫ్ చేయవలెను.

తరువాత వరుస :— ని. 3, ప. 2, ని. 6, ప. 2 * ని. 5, ప. 2, ని. 6, ప. 2, స్టార్ దగ్గరనుండి తిరిగి వేయుచూ చిట్ట చివరి 3 కుట్లు నిట్టు అల్ల వలెను.

తరువాత వరుస :- ప్రారంభములో 4 కుట్లు కాస్టాఫ్ చేయవలెను. కుడి చేతిలోని సూదిమీద కుట్లను ఎడమచేతిలోని సూది మీదకు మార్చవలెను. * ని 2 (ఒకేసారి) మే. 1, ని. 1, మే. 1, స్లి. 1, ని. 1, పా. స్లి. స్టి. ఓ, ప. 2, కేబుల్ 6, ప. 2, స్టార్ దగ్గరనుండి తిరిగి వేయుచూ చిట్ట చివర 3 కుట్లు ని. 2 (ఒకేసారి) మే. 1, ని. 1, అల్లవలెను.

తరువాత వరుస :— ని. 3, ప. 2, ని. 6, ప. 2 *ని. 5, ప. 2, ని. 6, ప. 2; స్టార్ దగ్గర నుండి తిరిగి వేయుచూ చిట్ట చివర 3 కుట్లు నిట్టు అల్లవలెను.

తరువాత వరుస :- ప్రారంభములో 4 కుట్లు కాస్టాఫ్ చేయవలెను. (అప్పుడు సూదిమీద 59 కుట్లుండును)

ఇదే విధముగా 42 వరుసలు వేసి, నమునాలో 7. వ. వరుసతో ముగించుచూ 22 వ. నమూనా పూర్తిచేయ వలెను. మామూలు నమూనాలో కంటె చంక చివర భాగములో రెండు కుట్లు తక్కువ అగునట్లు అల్లవలెను.

మెడ ఆకార మేర్పరచుటకు:— తరువాత వరుస ప్రారంభములో 5 కుట్లు కాస్టాఫ్ చేసి మిగిలిన కుట్లు మామూలుగా నమూనా అల్లవలెను. తరువాత వరుస మామూలుగా నమూనా వేసి, దీని తరువాత వరుస ప్రారంభములో 5 కుట్లు కాస్టాఫ్ చేయవలెను.

తరువాత 4 వరుసలలో మెడవైపు భాగములో ఒక్కొక్క కుట్టు చొప్పున తగ్గించవలెను.

తరువాత వరుస (7. వ. నమూనా వరుస):— ని. 1 *ప. 2, ని. 6, ప. 2, ని. 2 (ఒకేసారి) మే. 1, ని. 1, మే. 1, స్లి. 1, ని. 1, పా. స్లి. స్టి. ఓ. స్టార్ దగ్గరనుండి తిరిగి వేయుచూ 14 కుట్లుండు వరకూ వేసి ప. 2, ని. 6, ప. 2, ని. 2, (ఒకేసారి) మే. 1, ని. 2 (ఒకేసారి)

ప్రతి వరుసలో ఒక్కొక్క కుట్టు చొప్పున మెడ వైపు తగ్గించుచూ తరువాత 14 వరుసలు అల్లవలెను. (30 కుట్లుండును). తరువాత వరుస మామూలుగా అల్ల వలెను.

భుజము ఆకార మేర్పరచుటకు:— తరువాత వరుస ప్రారంభములో 10 కుట్లు కాస్టాఫ్ చేయవలెను. తరువాత ఒక వరుస విడిచి మరియొక వరుసలో ఇదే మాదిరిగా కాస్టాఫ్ చేయుచూ ఇదే విధముగా రెండు సార్లు అల్లి ముగించవలెను.

మిగతా భాగపు అల్లికను గూర్చి వచ్చేనెల సంచికలో చూడండి.



Edited, Printed & Published for the Andhra Mahila Sabha, Luz, Madras 4
by Mrs. A. C. Krishna Rao, M.A., L.T., at the Andhra Mahila Press, 24-A, Luz Church Rd., Madras



1954 మార్చిలో జరిగిన కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్ పరీక్షకు ఉత్తీర్ణులైన
ఆంధ్ర మహిళా సభ విద్యార్థినులు.

# ఆంధ్ర మహిళ

వ్యవస్థాపకురాలు :

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్

ఎం.ఏ., బి.ఎల్.,

సంపాదకురాలు :

శ్రీమతి చన్న ఘంటమ్మ

ఎం.ఏ., ఎల్.టి.,

సంవత్సర చందా ఆరు రూపాయిలు

ఆంధ్ర మహిళా సభవారిచే స్థాపించబడిన ముద్రణాలయములో ముద్రితము.

# గమనిక

'ఆంధ్ర మహిళ' స్త్రీల సచిత్ర మాస పత్రిక. ఆంధ్ర లోకంతో సన్నిహితానుబంధం ఏర్పరచుకొని, మహిళా సంఘంలో నూతన ప్రబోధం కలిగించే ఆశయంతో ఆంధ్ర మహిళా సభ తరపున "ఆంధ్ర మహిళ" పత్రిక 10 సం॥రములనుండి ప్రకాశితమగుచున్నది.

దీనియందు స్త్రీల మనోవికాసానికి తోడ్పడే వ్యాసములు, కథలు, నాటికలు, పిల్లలకు బాలానందం మొదలగు గద్య పద్యాత్మకములైన పలురకముల రచనలున్నవి. సాంఘిక రాజకీయ విషయములు, ప్రభుత్వము వారు దేశాభివృద్ధికై జరుపుచున్న సంక్షేమ కార్యక్రమాలు, స్త్రీలకుపయుక్తమైన గృహ పరిశ్రమలు మున్నగు వానిని గూర్చి మాసామాసముయందు ప్రకటింపబడును.

వార్షిక సంచిక, తపాలా ఖర్చులతోసహా

## సంవత్సర చందా 6-0-0

సేవాసంస్థలకు, గ్రంథాలయములకు, కళాశాల, పాఠశాలలకు,

సంవత్సర చందా రూ. 4-8-0 మాత్రమే.

వివరములకు :

మేనేజరు
'ఆంధ్ర మహిళ'

ఆంధ్ర మహిళా సభ,
24-ఎ, లజ్ చర్చిరోడ్డు, మైలాపూర్, మద్రాసు 4.

# చిన్న మొత్తములలో నిల్వ సేకరణ-

## ఆంధ్ర మహిళా సభలో కార్యాలయము.

———:o:———

చిన్న మొత్తముల నిల్వలు ప్రోత్సాహించి, ప్రభుత్వమువారి పంచవర్ష ప్రణాళికకు తోడ్పడు స్త్రీల ఉద్యమములో ఆంధ్రమహిళాసభ సభ్యురాండ్రు ఎక్కువగా తోడ్పడవలెనని నిశ్చయింపబడినది. ఇందు కొరకై, ఆంధ్రమహిళా సభ ఆవరణలో ఒక ప్రత్యేకమైన కార్యాలయము ఏర్పరుపబడును. ఇందు దైనిక కార్యక్రమాన్ని నిర్ణయించి, స్త్రీ సామాన్యములో యీ ఉద్యమాన్ని గూర్చి ప్రచారం చేయుటకు, నిల్వచేయదలచినవారికి తగు సలహానిచ్చుటకు, సభ తరపున కొందఱు యువతులు నియమింపబడుదురు. ఈ ఉద్యమంలో ఒక ప్రత్యేక ప్రతినిధిగా వ్యవహరించి, ధనము వసూలు చేయుటకు భారత ప్రభుత్వమువారు, ఆంధ్ర మహిళాసభకు అధికారమిచ్చియున్నారు. సభకు వచ్చిగాని, పోస్టు ద్వారాగాని అన్ని వివరములు తెలిసికొనవచ్చును,

ఇంకొక విషయము—— మీరు కొనదలచిన సేవింగ్సు సర్టిఫికెట్లు సభ ద్వారా కొన్నయడల సభకు 1¼% కమీషను వచ్చును. ఈ కమీషను సభయొక్క కార్యకలాపాలకై వినియోగించుకోవచ్చును. అందువల్ల మీరు నిల్వ చేయదలచిన మొత్తమునకు సభద్వారా సర్టిఫికెట్లు కొన్నచో, సభకు కూడా సహాయము చేసినవారగుదురు.

ఉత్సాహ వంతులైన సోదరీమణులు, యింత వరకూ సభద్వారా నిల్వ సర్టిఫికెట్లు తీసుకున్న మొత్తము రమారమి రూ. 22000/- ఇందు మూలముగా సభకు వచ్చిన కమీషను రూ. 275/- ఇంకా పెక్కుమంది సోదరీమణులు యీవిధముగా సభద్వారా సర్టిఫికెట్లుకొని సహాయ పడవలెనని కోరుచున్నాను.

అ. చన్నఘంటమ్మ,
కార్యదర్శిని.

# ఆంధ్రమహిళ

సంపుటి 10 :: ఏప్రిల్ '54 :: సంచిక 12



ఇంకా బాలానందం, అల్లికలు, చిత్రసమీక్ష, గ్రంథసమీక్ష, కథలు మొదలైనవి.

సంవత్సర చందా :: ఆరు రూపాయలు.




సంపుటి 10 :: ఏప్రిల్ '54 :: సంచిక 12

# యుద్ధాలు అరికట్టాలంటే

———: o :———

" మీ దేశంలో జన్మించిన ఒక మహా వ్యక్తి ఉపదేశముల ననుసరించి, కొన్ని వినూత్నమైన ఆదర్శాలతో, ఒక అపూర్వమైన మార్గములో, మీరు స్వాతంత్ర్యం సంపాదించుకున్నారు. ఆ ఆదర్శాలు ఆధారంగా, ఆ ఉపదేశాల ఊతంగా, వర్తమానంలో ప్రపంచాన్ని గగ్గోలు పరచుచున్న తీవ్రసమస్యల నెదుర్కోడానికి, మీరేమైనా క్రొత్త విధానం చూపగలరా? మీదేశస్థులైన స్త్రీలు తమకు గల గొప్ప బాధ్యతలను గుర్తించినారా?" అని విదేశస్థులు తనను తరచు ప్రశ్నిస్తూవుంటారని ఐక్యరాజ్యసమితి అధ్యక్షురాలు, శ్రీమతి విజయలక్ష్మి, మొన్న మదరాసు నగర మహిళా సమాజాలు సమిష్టిగా సమర్పించిన స్వాగత పత్రానికి బదులు చెప్తూ ప్రసంగించినారు.

ఆమె సెలవిచ్చినట్లు రెండు ప్రపంచ సంగ్రామాలు మనకు నేర్పిన గుణపాఠం యుద్ధం యొక్క విఫలత్వమే. ఏ ఆదర్శాల ప్రమేయంతో, ఏ హక్కుల సంరక్షణనిమిత్తం, ఏ ఆశయాలు సిద్ధించాలని, యుద్ధాలు చేయబడుచున్నవో, ఆ ఆదర్శాలను, ఆ ఆశయాలను మట్టికలిపేటటువంటి ఆత్మహత్యా పూర్వకమైనది సంగ్రామ విధానం. అయినా మూడవ ప్రపంచ సంగ్రామ భయం ప్రపంచ ప్రజల నావహించియేయున్నది. ఆయుధ బలంలోగాని, ఆర్థిక బలంలోగాని, మరియొక యుద్ధాన్ని ఓర్చుకోగల సమర్థత ఏదేశానికీ లేదు. పోగా, ఈ యుద్ధాన్ని అరికట్టాలంటే, ఎవరి మటుకువారు పాశవ బలాన్ని పెంచుకుని, ఎదిరిని దూరంగా ఉంచాలని ఆలోచిస్తున్నారు. ఒక దేశాన్ని జూచి మరియొక దేశం భయపడ్తూ, ఒక రాజ్యాన్ని జూచి మరియొక రాజ్యం ఏవగించుకుంటూ, ఒక జాతిని జూచి మరియొక జాతి యీర్ష్య జెందుతూ, మానవ నిర్మితములైన మారణాయుధాలకు దాసులై, భయభ్రాంతులై, నిత్య సంగ్రామ భీతిలో మానవ విలువలను విస్మరించడం కేవలం అనాగరిక వ్యవస్థ. అడవిలోని జంతువులకు, యిట్టి వ్యవస్థలో జీవించే మానవులకు ఎంతమాత్రమూ భేదములేదు.

శాంతియుతమైన విప్లవముతో నిరాయుధులమై ఎదిరిని స్వాధీనము చేసికొన్న మన జాతి, సహనం, ప్రేమ, ఓర్పు, అనే నైతికమైన ఆయుధాల ప్రయోగంతో మానవ విలువలను తిరిగి రూపొందించి, విశ్వమానవ సౌభ్రాతృత్వానికి పునాది వేయగల క్రొత్త విధానాన్ని సూచించగలమా అని ప్రపంచ ప్రజ మనలను ఆశతో ప్రశ్నించడం అతి సహజం. క్రియాపూర్వకంగా యీ ప్రశ్నకు సమాధానమిచ్చే బాధ్యత మన కెంతైనా యున్నది.

## యుద్ధాలు అరికట్టాలంటే

"స్వాతంత్ర్య సమరంలో భారత స్త్రీలమైన మనం ఏకైక ఆశయంతో నిలచి, వెనుకంజవేయకుండా కృషి సల్పి యున్నాం. ఈనాడు స్వతంత్ర భారతంలోని స్త్రీలమైన మనం మన రాజ్యాంగం ప్రసాదించిన సమానత్వ హక్కులను దైనందిన క్రియా కలాపాల్లో అమలు జరుపుచూ, దేశాన్ని, జాతిని, ఛిన్నాభిన్నము చేయనున్న వైషమ్యాలను, విభేదాలను, ధిక్కరించవలసిన బాధ్యత మనపై నున్నది." అన్న శ్రీమతి విజయలక్ష్మిగారి హెచ్చరిక స్త్రీలందరూ పాటించవలసినది. శాంతి ప్రచారానికి సారథ్యం వహించవలసినది స్త్రీలే. వైషమ్యాలకు కారణభూతమైన దారిద్ర్యం, అవిద్య, ఆర్థిక విభేదాలు తొలగించడంలో స్త్రీలు, తమ తమ ప్రాంతాల్లో తగు విధంగా కృషిచేస్తూ, సత్ప్రచారం చేయడంవల్ల, శాంతి స్థాపనకు పునాదులు వేసినవారౌతారు. నశించిపోయిన మానవ విలువలు యీ విధంగా తిరిగి రూపొందగలవు. అప్పుడు భయంతో, యుద్ధాలతో ప్రమేయం లేకుండా, ప్రేమతో, స్నేహంతో, శాంతితో ప్రజలు జీవిస్తారు.



## దేశాభివృద్ధిని అరికట్టే

## అధిక సంతానం — అధిక జనాభా.

భారతదేశపు జనాభా సంవత్సరానికి 50 లక్షల చొప్పున అధిక మౌతూవున్నది. ఈ రీతిని పెంపొందే సంఖ్యను బట్టి చూస్తే, 1980 నాటికి మన జనాభా 52 కోట్లవుతుంది. ఈ తీరున వృద్ధి అయ్యే జనాభాకు ఆహార సమృద్ధి కలగాలంటే, ఒక్కొక్క సంవత్సరము, ఆ క్రితము సంవత్సరము కంటె 8 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు అధికంగా ఉత్పత్తి చేసుకోవాలి. ఇంత జనాభాకు తగిన వసతి, విద్య, ఆరోగ్యసౌకర్యాలు అధికం చేయాలి. ఏ దేశానికైనా, ఏ ప్రభుత్వానికైనా, యీవిధంగా వృద్ధి అయ్యే జనాభాకు, కనీస జీవితప్రమాణాల ననుసరించంగా ఆహారాది సౌకర్యాలు సమకూర్చాలంటే తీరని సమస్య.

మొన్న ప్రజాసభలో డాక్టరు గిద్వానీగారు ప్రవేశపెట్టిన తీర్మానాన్ని, ప్రభుత్వము శ్రద్ధగా పరిశీలించి, ప్లానింగ్ కమిషన్ వారి సూచనలననుసరించి, సంతాన నిరోధానికి ఒక ఉద్యమ రూపంగా ప్రజలలో చైతన్యం కలిగించడం అత్యవసరం.

గాలి, వెల్తురు చొరబడని ఇరుకుగుడిసెల్లో, దుర్గంధ భూయిష్ఠమైన మురికి పేటల్లో, ఎండకు, వానకు కాపులేని ఆరుబయట గట్లమీద, చెట్ల క్రింద నివాసం చేసే వేన వేల జనం, దిన దినం వృద్ధి అగుతూవున్న నిరుద్యోగ సమస్య, తిన తిండి, కట్ట గుడ్డ లేక, బిచ్చమెత్తుతున్న లక్షలాది ప్రజ—ఇవి అధిక జనాభాయొక్క ప్రత్యక్ష ఫలితాలు. ఏ సంఘ వ్యవస్థలోను, ఏ రాజకీయపక్ష సారథ్యములోనూ, ఎంతటి సుక్షేత్రములోనూకూడా, ఈ జనాభా వృద్ధితో సరిసమంగా పరుగులెత్తే ఉత్పత్తి అలవికానిది—

శ్రీమతి అనసూయాబాయి కాళేగారు వివరించినట్లు, ఏ నిర్మాణ కార్యక్రమమైనా ఈ అధిక సంతాన సమస్య మూలంగా క్రియా శూన్యంగా పరిణమిస్తుంది— సరియైన ప్రచారమూ, ప్రబోధమూ ఉన్నట్లయితే, ఎవరుగాని సంతాన నిరోధక అవశ్యకతను గుర్తింపని వారుండరు; ఉద్యమానికి అడ్డుతగిలే వారుండరు. విచక్షణ గల ప్రతీ వ్యక్తి ఈ ఉద్యమంలో ప్రభుత్వానికి తోడ్పడాలి.

అయితే, ఆరోగ్యమంత్రి శ్రీమతి అమృతకౌర్‌గారు సెలవిచ్చినట్లు, అధిక వ్యయముతో కూడుకొనని, ఆరోగ్యమునకు భంగముకాని, అక్రమ శీలాన్ని ప్రోత్సహించని, సహజమైన నిగ్రహంతో పరిమిత సంతానాన్ని బడయడం ప్రతివ్యక్తి అనుసరించవలసిన ఉత్తమ విధానం. ఈ విధానాన్ని ప్రోత్సహించే సాంఘిక వ్యవస్థను, తగుమైన సంస్కారముతో నిర్మాణముచేసి, బాల బాలికల వివాహ యోగ్యత వయస్సును పెంచి, ఉద్యోగమువలనగాని, మరి యే కృషివలనగాని, స్వార్జన యోగ్యతలేని యువతీ యువకులు వివాహము చేసుకొనరాదని ప్రబోధిస్తూ, క్రమంగా, యీ ఉద్యమం ప్రజాసామాన్యంలో ప్రవేశ పెట్టడం వల్ల తృప్తికరమైన ఫలితాలు సాధించవచ్చును. ★



మనిషిలోని మంచిచెడ్డలను
మనోరంజకంగా చిత్రించే
మహత్తర సాంఘిక చిత్రము!

# పెద్దమనుషులు

వాహినీ చిత్రము

నిర్మాత-దర్శకుడు
**కే.వి.రెడ్డి** B.Sc(HONS)

ఆంధ్రదేశమంతటా
దిగ్విజయముగా ప్రదర్శింపబడుచున్నది.



## ఆసియా యువతులకు

# శ్రీమతి విజయలక్ష్మి సందేశం.

"ఈరోజుల్లో యువతులు స్కూలల్లోనున్నా, ఆట స్థలాల్లోనున్నా, మరి యేయితర ప్రదేశాల్లోనున్నా పూర్వం కంటే ఎక్కువ శ్రద్ధ, మెలకువలతో, ప్రవర్తించవలసి యుంది. నేను నా జీవితమంతా రాజకీయాల్లోనే గడిపి నప్పటికీ- ప్రజల జీవితాల్ని బాగుపరచాలంటే ఎన్ని అడ్డంకుల్ని ఎదుర్కోవాలో నాకు బాగా తెలుసు. అందు లోనూ వెనకబడియున్న దేశాల్లో ఇది మరీ క్లిష్ట సమస్యగా పరిగణించవలసియుంది. అందుచేత మీరు మీ మీవిద్యా భ్యాసాల్ని ముగించినంత మాత్రాన్న మీబాధ్యత తీరిపోయిం దని అనుకోకూడదు. ఆతర్వాత దేశాభ్యుదయ కార్య క్రమాల్లో మీరంతా పాల్గొని మీతోటి సోదర సోదరీమణుల కొరకు పాటుపడాలి. ఆసియా ఖండం యొక్క- భావి భాగ్యోదయం మీవంటి యువతీ యువకులమీదే ఆధారపడి యుంది. మిగతా దేశాల్లోనున్న యువతీయువకులకంటె ఆసియాలో నున్నవారు ఎక్కువ బాధ్యత వహించి కృషి సల్పవలసియుంది.

"అందుచేత మీరంతా కూడా ఎటువంటి క్లిష్ట సమస్యనైనా సరే ఎదుర్కోగల శక్తి సామర్థ్యాలను సంపాదించుకోవాలి. మన హిందూ ధర్మం ఏమి బోధిస్తుంది అంటే స్త్రీ పురుషులిద్దరూ ఏకత్వానికి చెందిన రెండు అంగాలు. ఏ కార్యం సాధించాలన్నా ఈ రెండూ అవసరమే. ఏ ఒక్కర్ని విడదీసినా కార్యం పూర్తి కానేరదు. ప్రపంచంలో సర్వజనులు సుఖించాలీ అంటే స్త్రీ పురుషులిద్దరూ కూడా సరిసమానంగా కష్టసుఖాలను పంచుకుని, దేశ కల్యాణానికి పాటుపడిన్నాడే ప్రజలు సుఖపడతారు. కాబట్టి మీరంతా మీతండ్రులకు, సోదరులకు, ఆతర్వాత భర్తలకు పూర్తి సహకారాన్ని యివ్వాలని జ్ఞాపకముంచుకోండి.

"చాలాకాలం వరకు మన స్త్రీలు యీసంగతి గ్రహించక దేశస్వాతంత్ర్య పోరాటంలోకాని, దేశపునర్నిర్మాణ కార్య క్రమాల్లోకాని వారు తీసుకోవలసినంత బాధ్యత తీసుకో లేదు. అలా పురుషులకు సర్వవిధాలా మనం తోడ్పడి న్నాడే మన కర్తవ్యాన్ని నెరవేర్చిన వాళ్ళం, మనపూర్వపు టౌన్నత్యాన్ని, వారసత్వ గౌరవాన్ని నిలబెట్టిన వాళ్ళ మౌతాం."



పంజాబీ స్త్రీలు, 'డోలక్' వాయిద్యముతో పాడుచున్న దృశ్యం. సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజర్లు, స్త్రీలను, తమ గృహములు, పరిసరములు, పరిశుభ్రముగా నుంచుకొనవలెనని కోరుతూ వ్రాసిన పాటను వీరు పాడుచున్నారు.



# రాజకీయాలు

• శ్రీ గోళ్ళమూడి రామచంద్రరావు •

1954 ఫిబ్రవరి నాలుగో వారం మొదలుకొని మార్చి మూడో వారం వరకూ జాతీయ అంతర్జాతీయ రంగాల్లో నడిచిన ప్రధాన సంఘటనలు ఇవి— గుంటూరులో ఆంధ్ర హైకోర్టు స్థాపనకు శాసన సభ నిశ్చయించటం, తిరుక్కొచ్చిలో పి. ఎస్. పి. ప్రభుత్వ స్థాపన, తూర్పు పాకీస్థాన్‌లో ముస్లింలీగు ఓటమి, ఫ్రెంచి ఇండియా సోషలిస్టులకూ ఫ్రెంచి అధికారులకూ తగాదా రావటం, కాశ్మీర్‌లో అమెరికన్ ప్రతినిధులను తటస్థులుగా గుర్తించేది లేదని నెహ్రూ ప్రకటించటం, అఖిల అమెరికన్ రాజ్యాల సమాలోచనలు.

*　　　*　　　*

జులై 5 వ తేదీ నుంచి ఆంధ్ర హైకోర్టును గుంటూరులో నెలకొల్పాలని ఆంధ్ర శాసన సభ మార్చి 15 వ తేదీన ఒక్క వోటు మెజారిటీతో (67-66) తీర్మానించింది. ఆంధ్ర ప్రభుత్వం దీనికి ఆమోదించి ఏర్పాట్లను జరుపుతున్నది. విశాఖపట్టణానికి హైకోర్టును తీసుకుని వెళ్లాలని ప్రభుత్వం తీర్మానం ప్రతిపాదించగా, వావిలాల గోపాల కృష్ణయ్య, నడింపల్లి నరసింహారావుగార్లు విశాఖపట్టణానికి బదులు 'గుంటూరు' అని మార్చాలని సవరణ ప్రతిపాదించగా సవరణ ఒక్క వోటుతో నెగ్గింది. కాంగ్రెసులో ముగ్గురు, కె.ఎం.పి. సభ్యుడు ప్రగడ కోటయ్యగారు, ఒక్కరు మినహా కె. ఎల్.పి. సభ్యులు, పి.ఎస్.పి., కమ్యూనిస్టులు సవరణను బలపరిచారు.

రాష్ట్రం అంతటిలోకీ కోర్టు వ్యవహారాలు ఎక్కువగా వున్న జిల్లాలో హైకోర్టు ఏర్పాటు జరుగుతున్నందుకు సంతోషమే కాని, దానితో పాటుగా సేల్స్‌టాక్స్ ట్రిబ్యునల్, పారిశ్రామిక వివాదాల ట్రిబ్యునల్, రోడ్ ట్రాన్స్‌పోర్టు బోర్డు మొదలైన వివాద పరిష్కార సంస్థల్ని కూడా అక్కడే ఏర్పాటు చేసినప్పుడే దాని వల్ల పూర్తి సౌకర్యం అందరికీ లభిస్తుంది. హైకోర్టు ప్రధాన కార్యాలయం తాత్కాలికంగా గుంటూరులో నెలకొల్పాలని తీర్మానం చెప్పటం వల్ల రాజ్యాంగ రీత్యా ఆక్షేపణ చెప్పే వీలున్నదని కొందరు అభిప్రాయ పడుతున్నారు. కానీ ఆవిషయమై పేచీ వచ్చే సూచనలు కనిపించటం లేదు.

*　　　*　　　*

కిందటి నెలలో తిరువాన్కూరు-కొచ్చిన్, పెప్సూ రాష్ట్ర ఎసెంబ్లీలకు జరిగిన ఎన్నికల ఫలితంగా, తిరుకొచ్చిలో పి. ఎస్. పి. ప్రభుత్వము, పెప్సూలో కాంగ్రెస్ ప్రభుత్వము ఏర్పడ్డవి. తిరుకొచ్చి ఎసెంబ్లీలో 117 స్థానాలకూ కాంగ్రెస్ 45, కమ్యూనిస్టులు వారి సహచరులు కలిసి 40, పి ఎస్.పి. 19, తిరువాన్కూరు తమిళ కాంగ్రెస్ 12, స్వతంత్రులు 1 స్థానాలను సంపాదించారు. వెనకటి ఎసెంబ్లీలో తమిళ కాంగ్రెసుతోసహా యావత్తు ప్రతిపక్షాల విశ్వాసాన్ని పోగొట్టుకుని కాంగ్రెస్ ప్రభుత్వం కూలిపోయి వున్నందు వల్లనూ, ఈతడవ ఎన్నికల్లోకూడా ప్రతిపక్షాలన్నీ కలిసికట్టుగా కాంగ్రెసును ప్రతిఘటించటంవల్లనూ కాంగ్రెస్ తానే ప్రభుత్వాన్ని నెలకొల్పటానికి సాహసించలేక పోయింది. పి.ఎస్.పి. నాయకుడు తాణుపిళ్లై యునైటెడ్ ఫ్రంటుతో కలిసి మిశ్రమ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయటానికి సిద్ధపడగా పి.ఎస్.పి. అఖిల భారత నాయకులు అడ్డపడి మిశ్రమ ప్రభుత్వం నెల కొనకుండా చేశారు.

ఇద్దరి గుద్దులాట మూడవ వాడికి లాభమనే ఉద్దేశ్యంతో పి.ఎస్.పి. ఒక్కటే ప్రభుత్వం నెలకొల్పాలనీ, లేదా యితర పార్టీలు ఏర్పాటు చేస్తే ఆయా అంశాలను పట్టి ఆ

ప్రభుత్వంతో పి.ఎస్.పి. సహకరించటమో, సహాయనిరాకరణం చేయటమో నిశ్చయించాలనీ అఖిల భారత నాయకులు ఆదేశించారు. కాంగ్రెస్ తర్వాత పెద్ద పార్టీ అయిన యునైటెడ్ ఫ్రంటు ప్రభుత్వాన్ని ఏర్పాటుచేస్తానన్నప్పటికీ, కాంగ్రెస్ మంత్రుల సలహావల్లనో యేమో, రాజప్రముఖ్ తాణుపిళ్లై చేతనే మంత్రివర్గం ఏర్పాటు చేయించారు.

ఏపార్టీకీ కచ్చితమైన మెజారిటీ లేనప్పుడు, అందరికన్నా తక్కువ మంది వ్యతిరేకులనే కలిగి ఉన్న వ్యక్తి చేతనే ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయించటాన్ని ఎవ్వరూ ఆక్షేపించరు. కాని ముందు పెద్దపార్టీ నాయకులు అశక్తతను వెల్లడించినప్పుడే ఆచర్యను తీసుకోటం వుచితంగా వుండేది కాని, యునైటెడ్ ఫ్రంటును త్రోసివేసి ఈపని చేయటం మాత్రం వుచితంగా లేదు.

యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వాన్ని ఏర్పడకుండా చేసి, ఆరోవంతుకన్నా తక్కువ వున్న పార్టీచేత ప్రభుత్వాన్ని స్థాపింపజేసినందువల్ల అఖిల భారత పి.ఎస్.పి. నాయకులు తిరుకొచ్చిలో తమ పార్టీకి వుపకారంకన్నా అపకారమే ఎక్కువ చేశారు. రాష్ట్రపార్టీ మొదట ఎన్నికల్లో యునైటెడ్ ఫ్రంటుతో సహకరించటానికే వీళ్ళు చాలా పేచీలు పెట్టారు. తరవాత మిశ్రమ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయటానికి రాష్ట్రపార్టీ అడ్డుపడితే అడ్డగించారు. ఈ ప్రభుత్వానికి రోజులు బాగా ఉన్నంతవరకూ రాష్ట్రపార్టీ సభ్యులు ఈ నియమాలను గౌరవిస్తారు కాని, ఏకాస్త వ్యవహారం ప్రతికూలించినా వీళ్ళ నాయకత్వానికే స్వస్తి చెపుతారని చెప్పవలసివుంటుంది. అదీకాక, కాంగ్రెసూ, యునైటెడ్ ఫ్రంటూ కూడా ఏదో విధంగా ఈ పార్టీని అప్రతిష్ఠపాలు చేసి నామరూపాలు లేకుండా చేయ ప్రయత్నిస్తారు. అసలు ఈ పార్టీ మనుగడకు అఖిల భారత నాయకులే ప్రమాదకారులన్న అభిప్రాయం దేశంలో ప్రబలినా ఆశ్చర్యం వుండనక్కరలేదు.

పి.ఎస్.పి. అఖిల భారత నాయకులు రాజనీతిజ్ఞులయితే ముందు యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వాన్ని ఏర్పాటు కానిచ్చి, దానిసత్తువ ఏమిటో తెలుసుకునేవాళ్ళు. అందులో లోపాలు వుంటే దానిని కేరళ ప్రజల కళ్ళకు కనబడేట్లు చేసి, అక్కడ యునైటెడ్ ఫ్రంట్‌కు నిలవ నీడలేకుండా చేయప్రయత్నించి వుండేవాళ్ళు. క్రిందటి సారి ప్రభుత్వాన్ని నెలకొల్పిన కాంగ్రెస్ ఈ వుద్దేశ్యంతోనే యీ తడవ వెనక్కు తగ్గింది. కాని పి.ఎస్.పి. నాయకులకు యీ యింగితం లేకపోయింది.

పి.ఎస్.పి. ప్రభుత్వం తాను అనుకున్న పనులు చేయటానికీ, ప్రజాభిమానం సంపాదించటానికీ యీ కింద చెప్పిన ఆటంకాలు ఉన్నవి— 1. పంచవర్ష ప్రణాళిక పూర్తి చేయటానికి డబ్బు చాలనందువల్ల కేంద్రం ద్రవ్యోల్బణాను ప్రోత్సహించే చర్యలను తీసుకోన నిశ్చయించటం. 2. ప్రజాస్వామ్య దృష్టికన్నా ఎక్కువ సామ్రాజ్య వాదపు వైఖరిని ప్రదర్శిస్తున్న ఆంగ్లో- అమెరికన్ వర్గం దేశంలో అంతా నిరసిస్తుండగా, పి.ఎస్.పి. కేంద్ర నాయకులు అభిమానాన్ని ప్రదర్శిస్తూ (ముఖ్యంగా పాక్- అమెరికన్ సైనిక ఒప్పందం పట్ల పి. ఎస్. పి. కేంద్ర నాయకుల వైఖరి పార్టీలో అనేక రాజీనామాలకు కారణమయింది.)

*　　*　　*

తిరుకొచ్చిలో కాంగ్రెస్ వెనకటికన్నా ఒక్కస్థానాన్నీ, యునైటెడ్ ఫ్రంట్ వెనకటికన్నా 8 ఎక్కువ స్థానాలను సంపాదించుకున్నవి. కాంగ్రెస్‌కు వోటు చేసిన జనం దాదాపు కూడా పెరిగింది. మద్రాసులో మున్సిపాలిక వంతు స్థానాలు కాంగ్రెసుకు వచ్చినవి. పాకిస్థాన్‌తో సంబంధాలు చెడిపోవటం, అంతర్జాతీయంగా భారతదేశానికి యిటీవల పండిత నెహ్రూ సాధించిన పరువు ప్రతిష్ఠలు ఈ కాంగ్రెస్ విజయాలకు ముఖ్యకారణాలని చెప్పవచ్చు.

*　　*　　*

పంచవర్ష ప్రణాళిక పూర్తి కావటానికి ఇంకా 1200 కోట్ల రూపాయలు లోటుగా ఉన్నవి. అదీకాక యింకనుంచీ విదేశాలనుంచి వచ్చే సహాయం చాలా తగ్గిపోతుందని ప్రధాని నెహ్రూ హెచ్చరించి ఉన్నారు. సామ్రాజ్యవాదాన్ని ప్రపంచమంతటా ప్రతిఘటించటంలో ఇండియా అనుసరిస్తున్న వైఖరీ అమెరికాలో నెమ్మదిగా బయలు దేరుతున్న ఆర్థిక మాంద్యము దీనికి కారణాలుగా కనిపిస్తున్నవి. ఇందు మూలంగా ప్రణాళికను పూర్తి చేయటంకోసం లోటు ఖజానా పద్ధతిలో పెట్టుబడి పెట్టటానికి ఆర్థిక మంత్రి

నిశ్చయించారు. అంటే ప్రాజెక్టుల నిర్మాణానికి కొత్త నోట్లను అచ్చువేయటం, ట్రెజరీ బిల్లులను ఎక్కువగా జారీ చేయటం మొదలైన పద్ధతులు అనుసరించబడతవి. మామూలుగా నోట్లకు హామీగా వెండి, బంగారాలు ఉంచుతారు. ఈ పద్ధతిని పెట్టుబడి జరిగినప్పుడు నిర్మాణం జరిగే ప్రాజక్టులనే హామీగా తీసుకోవలసివుంటుంది. ఇది తాత్కాలింగా నయినా ద్రవ్యోల్బణకు – డబ్బు విలువ పడిపోవటానికి కారణమవుతుంది. డబ్బు విలువ పడిపోతే ధరలను అదుపులో ఉంచటం ప్రభుత్వానికి అసాధ్యమవుతుంది.

ఇదివరకు ద్రవ్యోల్బణను తొలగించటానికీ, దొంగ మార్కెట్ దార్లు సంపాదించిన సొమ్మును బయట పెట్టించడానికిగాను భారత ప్రభుత్వం వెయ్యి రూపాయలు మొదలైన పెద్ద నోట్లను రద్దు చేసింది. కాని ఏప్రిల్ 1 వ తేదీనుంచీ తిరిగి వెయ్యి, 5 వేలు, 10 వేల రూపాయల నోట్లను ప్రవేశపెట్ట నిశ్చయించింది.

భారత ప్రభుత్వ కొత్త బడ్జెట్ సబ్బులు, వక్కలు, కాలిజోళ్ళు, కళ్ళజోళ్ళ క్షేమములు, బట్టలు మొదలైన వాటిమీద పన్నులను హెచ్చించింది. కొత్త ఆంధ్ర బడ్జెట్ నీటి తీరువను పెంచింది. అభివృద్ధి పన్ను ప్రతిపాదించింది. ఆంధ్రలో నిర్మాణ కార్యక్రమాలకు డబ్బు రావాలంటే మద్యనిషేధాన్ని రద్దు చేయాలని వాదించబడుతున్నది కాని, ఇళ్ళదగ్గరా, చాటుమాటునా సారాయిని కాఫీ కాచుకున్నట్లు కాచుకుని తాగేందుకు అలవాటు పడ్డ జనానికి ప్రభుత్వ డిపోలలో తాగి ప్రభుత్వానికి డబ్బు ముట్టజెప్పాలన్న 'సద్బుద్ధి' ఎట్లాకలుగుతుందో మాత్రం ఎవ్వరూ చెప్పరు.

♦ ♦ ♦

పాకిస్థాన్‌లో వయోజన వోటింగు పద్ధతిమీద మొట్టమొదటి ఎన్నికలు తూర్పు పాకిస్థాన్‌లో జరిగినవి. ముస్లిం లీగ్ ఘోర పరాజయం పొందింది. యావన్మంది మంత్రులు ఓడిపోయినారు. ఫలితాలు తెలిసిన 200 పైచిల్లర స్థానాల్లో లీగుకు 7 మాత్రమే వచ్చినవి. యునైటెడ్ ఫ్రంట్ కచ్చితమయిన మెజారిటీని సాధించింది. యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం ఏర్పాటవుతుందని పాక్ ప్రధాని ప్రకటించారు.

ఈ యునైటెడ్ ఫ్రంట్ వామ పక్షాలకు సంబంధించింది కాదు. కాంగ్రెసు విధానాలకు నిరసించి, చీలిపోయిన కె.ఎం.పి., పి.ఎస్.పి.ల వలె, లీగ్ విధానాలు నచ్చని మాజీ లీగర్లూ, అమెరికాతో పాకిస్థాన్ చేసుకున్న సైనిక ఒప్పందం పాక్ స్వాతంత్ర్యానికి హానికరమని గుర్తించిన మాజీ లీగర్లూ, తూర్పు బెంగాల్ అభివృద్ధికి ఇండియాతో వర్తక సంబంధాలు బాగా అభివృద్ధి కావాలని భావించే అభ్యుదయ వాదులూ యిందులో ఉన్నారు. బెంగాలీ భాష పట్ల పాక్ ప్రభుత్వం చూపుతున్న నిరసన, మొత్తం పాకిస్థాన్ జనసంఖ్యలో సగానికి పైగా ఉన్న ఈ రాష్ట్రానికి కేంద్రంలో తగిన ప్రాతినిధ్యం లేకపోవటం అనే, అంశాలు కూడా ఫ్రంట్ గెలుపుకు కారణాలయినవి.

లీగ్ పరాజయాన్ని పట్టి పాక్ రాజ్యాంగ సభకే తిరిగి ఎన్నికలు జరగాలని ఫ్రంట్ నాయకులు వాదిస్తున్నారు. కానీ ఆ అవసరం లేదని కేంద్రప్రధాని నిరాకరించారు. ఏ విషయం ఎట్లా ఉన్నా, తూర్పు పాకిస్థాన్ రాష్ట్ర ప్రభుత్వం పాక్ - అమెరికన్ ఒప్పందానికి వ్యతిరేకత చూపుతున్నదని మాత్రం భావించ బడుతున్నది.

6 సం॥ల నుంచీ నిర్బంధంలో ఉన్న సరిహద్దు గాంధీ గఫార్ ఖాన్ ఈ నెల పాక్ రాజ్యాంగ పరిషత్ సమావేశానికి డిటెన్యు హోదాలోనే హాజరై ప్రత్యేక పఠాని స్థాన్ రాష్ట్రం ఏర్పడాలని కోరారు.

♦ ♦ ♦

ఇంతవరకూ ఫ్రెంచి ఇండియాలో ఫ్రెంచి పరిపాలనను సమర్థిస్తున్న సోషలిస్టులకు యిప్పుడు ఫ్రెంచి అధికారులతో వివాదాలు ఏర్పడ్డవి. ముఖ్యంగా సోషలిస్టు నాయకుడు గుబేర్‌కు గవర్నర్‌తో పడటంలేదు. దీనితో ఫ్రెంచి ఇండియా విడిగా ఉంటే దొంగ రవాణా వ్యాపారాల వల్ల బాగుపడుతున్న కొద్దిమంది ధనికులు మినహా యావన్మంది ప్రజలు ఫ్రెంచి పాలనకు విముఖులయినారు. ఫ్రెంచి ఇండియాలోని 8 బస్తీల పురపాలక సంఘాలు రెఫరెండం లేకుండానే ఫ్రెంచి ఇండియాను ఇండియాలో కలిపివేయాలని మార్చి 19 న తీర్మానించినవి. ఈ తీర్మానాన్ని మంత్రివర్గసభ్యులు ఆమోదించారు. ఎప్పుడయితే సోషలిస్టులు కూడా ఎదురు తిరిగారో, అప్పటి నుంచీ ఫ్రెంచి అధికారులు పోలీసులను ప్రయోగించి జనాన్ని హడలగొట్ట ప్రయత్నాలు సాగించారు. దీనికి భారత

ప్రభుత్వం నిరసన తెలియ జేసింది. ఏది ఎట్లా ఉన్నా, ప్రజలంతా పూర్తిగా ఎదురు తిరిగారు గనుక, ఫ్రాన్స్, చంద్రనగర్ నుంచి నిష్క్రమించినట్లే మిగిలిన ఫ్రెంచి ఇండియానుంచి కూడా త్వరలోనే వెళ్లిపోక తప్పేట్లులేదు.

*  *  *

పాకీస్థాన్‌కు సైనిక సహాయం చేయటానికి అమెరికా బాహాటంగా సన్నాహాలు చేస్తూ యిందువల్ల, కాశ్మీర్‌లో పాకీస్థాన్ దురాక్రమణను ఎదుర్కొంటున్న భారత దేశం ఆ ప్రాంతంలోని సమితి పరిశీలకుల్లో వున్న అమెరికన్లను తటస్థులుగా గుర్తించ నిరాకరించింది. భారత ప్రధాని పార్లమెంటులో ఈ అంశం తెలియజేశారు. ఇండియా అభ్యంతరాన్ని సమితి కార్యదర్శి లత్యూ పెడతాడో లేదో తెలియదు. నెహ్రూ ప్రకటనవార్త విన్న వెంటనే ఆయన అన్న ముక్క ఇది "అక్కడి అమెరికన్లు సమితి ప్రతినిధులుగానే వ్యవహరిస్తున్నారు కాని అమెరికా ప్రతినిధులుగా కాదు"

కాశ్మీర్ ప్రభుత్వం ఏనాడో సమితి పరిశీలకులు యావన్మంది పట్లనూ అనుమానం వెల్లడించి ఉన్నది. నేపాల్ ప్రధాని కోయిరాలా ప్రభృతులు అంతర్జాతీయ సంస్థల ప్రతినిధుల మన్న పేరుతో విదేశీయులు కుట్రలు పన్నుతున్నట్లు ఆరోపించి ఉన్నారు. కాశ్మీర్ ప్రభుత్వం ఏనాడో నిరాకరించి వున్న కాశ్మీర్ మధ్యవర్తి నిమిట్జ్ యింకా ఆ పదవిలో ఉన్నట్లే సమితి కార్యాలయం పరిగణిస్తున్నది.

*  *  *

కెనడా మినహా, ఉత్తర, దక్షిణ అమెరికా ఖండాల లోని రాజ్యాలన్నీ మార్చినెలలో కరాకస్ అనేచోట సమావేశం జరుపుతున్నవి. ఈ దేశాల్లో కమ్యూనిస్టులు వ్యాపిస్తున్నారన్న భయంతో వాళ్ళ మీద ఆయా ప్రభుత్వాలచేత కత్తి కట్టిద్దామన్న ఉద్దేశ్యంతో అమెరికా ఈ సభను ఏర్పాటు చేసింది. కమ్యూనిస్టు కార్యకలాపాలను నిరోధించాలన్న తీర్మానాన్ని అమెరికా ప్రతి పాదించగా దక్షిణ అమెరికా దేశాలన్నీ అసలు తమ దేశాల్లో అన్ని విదేశాల జోక్యాన్నీ నిరసించినవి. యూరప్ దేశాల వలస విధానాన్నీ, అమెరికా వ్యాపార విధానాన్నీ తీవ్రంగా నిరసించినవి - ముఖ్యంగా అర్జెంటీనా, బ్రెజిల్ దేశాలు అమెరికా వైఖరిని నిరసించినవి.

కమ్యూనిజం వ్యాప్తిని నిరోధించాలంటే తమ దేశాలు ఆర్థికంగా బలపడి, ప్రజల జీవిత పరిస్థితులు అభివృద్ధి చెందాలనీ, దానికి అమెరికా వైఖరి అనుకూలంగా లేదనీ అవి నిరసించినట్లు ఫ్రాన్స్ ప్రెస్ ఏజన్సీ విలేఖరి తెలియజేశాడు. తాము సప్లయి చేసే ముడి పదార్థాలకు అమెరికా అతి నికృష్ట మయిన ధరను యిచ్చి, తను పంపే సరుకులకు అత్యధిక ధరలను వసూలు చేస్తున్నదని ఆ దేశాల ప్రతినిధులు ఆరోపించారట.

గ్వాటిమాలా మినహా మిగిలిన దేశాలన్నీ కమ్యూనిస్టుల పై చర్య జరపాలన్న తీర్మానాన్ని ఆమోదించినవి. అప్పుడే గ్వాటిమాలా కమ్యూనిస్టు దేశమని బ్రిటన్ ప్రచారం ప్రారంభించింది. అయితే బ్రిటన్ ప్రచారానికి కారణం వేరే ఉన్నది. గ్వాటిమాలా తన సరిహద్దునే వున్న బ్రిటిష్ వలస హోండ్యురాస్ తనకు రావాలని వాదిస్తున్నది. అందువల్ల ఈ ప్రచారంతో దానిని పడగొట్టాలని బ్రిటన్ ప్రయత్నిస్తున్నది.

బ్రిటిష్ హోండ్యురాస్‌లో ఎన్నికలు జరగ బోతున్నవి. అక్కడ పీపుల్స్ పార్టీకి - గెలుపు తథ్యమని అంతా అనుకుంటున్నారు - ఈ పీపుల్స్ పార్టీకి గ్వాటిమాలా ప్రభుత్వంతో సంబంధం ఉన్నదని హోండ్యురాస్ బ్రిటిష్ గవర్నర్ బ్రిటిష్ ప్రభుత్వానికి ఫిర్యాదు చేయగా వాళ్ళొక 'విచారణ' జరపటానికి ఏర్పాట్లు చేశారు. గయానాలో ఏర్పడ్డ పీపుల్స్ పార్టీ ప్రభుత్వాన్ని కమ్యూనిస్టులని చెప్పి బ్రిటన్ సైనిక బలంతో కూలదీసిన సంగతి అంతా ఎరిగిన సంగతే.

ఈ విధంగా కమ్యూనిస్టుల సాకుతో బ్రిటన్ తన వలస విధానాన్నీ, అమెరికా తన వ్యాపారపు దోపిడినీ దక్షిణ అమెరికాలో సాగిస్తున్నది.

దక్షిణ అమెరికాలో పరోక్ష మార్గాల జరుపుతున్న దోపిడిని పోర్టోరికోలో బహిరంగంగానే అమెరికా జరుపు తున్నది. దీనికి నిరసన చెందిన పోర్టోరికన్ అతివాద దేశభక్తులు కొందరు మార్చినెలలో అమెరికన్ కాంగ్రెస్ భవనంలో ప్రవేశించి నలుగురు సభ్యులను తుపాకులతో కాల్చిగాయపరిచారు. లోగడ ట్రూమన్ అమెరికా ప్రెసిడెంటుగా ఉన్నప్పుడు పోర్టోరికన్ జాతీయ వాదులు ఆయన్ను హత్య చేయ ప్రయత్నించటం జరిగింది.



'రాగ్ వసంత్'

వసంతాగమ నృత్యం - ఇటీవల భారత ప్రభుత్వ విద్యాశాఖవారిచే, నేషనల్ మ్యూజియమ్‌లో ఉంచుటకై సేకరింప బడిన 'రాగ మాలా' చిత్రములలో నిదియొకటి. రసపుత్ర కాలమందలి ఋతు వర్ణన చిత్రములు, అప్పటి ఋతు వర్ణనకు సంబంధించిన జానపద గేయాల ననుకరించబడినవి.

# గండినే మొండి జీవనం

* శ్రీ కవికొండల వేంకటరావు *

ఊరుపేరు చెప్పినా, మనిషిపేరు చెప్పినా అంతా ఎగబడతారు తెలుసుకోడానికి. పేరులో అంత చమత్కారం వుంది. అయితే కథలో చమత్కారం వున్నప్పుడు పేరుతో నిమిత్తం లేదు. చదివేవానికి స్ఫురిస్తేచాలు. ఎక్కడ వుంది ఆవూరు, ఎవరా మనిషి అని:

కొన్ని కొన్ని చూపులు వరద వచ్చాక ఒకలాగుండేవి. వరద రానప్పుడొకలాగుండేవి. రెండింటికీ పోలిక లేక పోవచ్చు. కాని, వరద వస్తూవుంటే ఆ ఒడుదుడుకు సమయంలో సాక్షాత్కరించే దృశ్యమున్నదే, అది, మనం ఆకట్టుకోగలిగితే, తత్పూర్వమెలావున్నదో, తదనంతర మేలావున్నదో, నష్టమయిందిఏదో, పుష్టిగన్నదేదో అంతో ఇంతో గోచరింపునకు రాకమానదు— పూర్వజన్మసుకృత ముకుమల్లే.

ఏమా అని ఆలోచిస్తే, అయోమయంగా, అంధ కారంలో, ప్రకాశ మిసుమంతా లేని బాటను, పరమావధి కాసంతా కానబోని నిరాశతో నీరవంగా ఒక రమణీమణి తన చిటికెనవేలు పట్టుకొని, కూడా కూడా నడుస్తూవున్న, ఒక అయిదారేళ్ళ ఆడపిల్లతో, తల్లీ పిల్లా ఇరువురైనా ఒంటరితనమే అన్నట్టు, అడుగులు వేసుకుంటూ కోన సీమలో నడుస్తూ వున్నారు. సర్వసాధారణంగా, పగలెవ రైనా వారిద్దరూ అరికట్టేరేమోగాని, రాత్రిపూట ఎవర్నీ ఆపబోరనే అనుకోవాలి. అంత తొందర తొందరగా తల్లి అడుగులు వేస్తూ వుంది. తల్లితోబాటు పిల్లా నడుస్తూంది. చిటికెనవేలు విజ్జోడు చేసినప్పుడల్లా చీర చెఱగు పట్టు కుంటూ, చీర చెఱగు ముందుకు వైచుకొన్నప్పుడల్లా చిటికెనవ్రేలందుకుంటూ, అయోమయమైన బ్రతుకుతో, అంధకారబంధుర మైన బాటని వారు నడుస్తూ వున్నా, వారి అడుగు క్రింద నేలపదుగా గట్టిగా, నిబ్బరంగా, నీటుగా వున్నట్టుంది. తిన్నగా యేదో కడకు గొంపోయే టట్టు, ఎవరో వేసినట్టు వుంది. నేల కోతట్టు ప్రవహిస్తున్న కాలువ నీరు, ఓతట్టు మళ్ళీ గట్లంట బిలబిల మంటూ రొదగా వినవస్తూన్న నీరు. కాలవ దాటి ఆవలగట్టెక్కి చూదాం అంటే దాటించే పడవలేదు. ఈవల మళ్ళీ గట్లడ మడి పోదాం అంటే అంతా ఊడ్చిన పొలం. కాబట్టి కాలికి తగిలే నేల ఏదారికి తీస్తే ఆదారికే వెళ్లాలి ఆ తల్లీ పిల్లా యిరువురూకూడా !

వర్షాకాలం ఇంకా గడచిపోని గడ్డురోజులవి. ఏమైనా ప్రతిధ్వనిస్తే, కూలీలు పగలు పాడిన ఊడుపు పాటలకు చెందియుండాలిగాని కోయిల పాటలవి కానేరవు. ఏమైనా అంధకారాన్ని పోగొట్టే వెలుతురు కాపడితే, అది మేఘం మెరిసే మెరపుది కావాలికాని, కొఱవి దయ్యపు మంట కూడా కానేరదు. ఇహ లోకం అంతా నిదిరిస్తూవుందా అని అనిపించే వేళఅది. ఒక్క ప్రకృతి తప్పిస్తే—ప్రకృతి లోకూడా కొన్ని కొన్ని చెట్లయొక్క ఆకులు కనుమూసి నట్టు మూతలు పడి ఒందొంటిని హత్తుకుపోయి అదే నిదరలో పడ్డట్టున్నాయి. పంచ భూతాల్లోను నాదొక్క జలదేవత తప్ప తతిమ్మా దేవతలన్నీ ఏమైనాయా అనే మీమాంసలో పడితీరవలసిందే !

జలదేవత: ఆమె ఆపొద్దు ఎవరూ చూడకుండా, ఎవరూ వినకుండా చల్లగా సాక్షాత్కరింప సాగింది. తనపేరు తనకే తెలియదు అన్నదీమతల్లికి. మనమనుకునేం "గోదావరి" అని దానిని గూర్చి. కాని దానికది ఒఖ్ఖ తెలియని ఉత్తి జల ప్రవాహమే. నాసికాత్ర్యంబకమునుండి మహాసముద్రం దాకా ఒకటే జీవనంగలదై నిత్యచేతనంగల దవడంచేతను, అది జలదేవతగా మనముందు సాక్షాత్కరింప గలుగు తూవుంది. "గోదావరి"అన్నా అదే, "దక్షిణగంగ" అన్నా అదే, "అఖండగౌతమి" అన్నా అదే, "వృద్ధగౌతమి" అన్నా అదే, "వసిష్ఠ" అన్నా అదే, "వైనతేయము" అన్నా అదే, కోనసీమ పంటకాలవన్నా అదే, కొబ్బరి తోటను చుట్టివచ్చే అబ్బురపు టివల్ అన్నా అదే ! వెళ్ళిన కొద్దీ అంతా ఆ జలదేవత మయమై యొప్పె? ! అయితే, ఆదేవత, గట్లమధ్య నున్నంతసేపూ, ఎంతఎత్తు లేచినా, ఎంత ఉద్రుతం చూపించినా, ఎవరికీ ఏమీ ఫరవాలే. కట్టు బాటులోవున్న మనిషి జీవనంలాంటిది: ఏర్పాటుగా నేర్పుగా కాబడేని ! గట్లు తెగి విడివడిందా, అప్పుడు చూడాలి దాని వైఖరి, విలాసం, స్వేచ్ఛా, ఇచ్ఛా ! ఈ గట్లు తెగి గండి పడడం అనేది, రాత్రే జరిగేనో, పగలే జరిగేనో, పట్నానికే గొప్పతగ్గేనో, పల్లెటూరికే ముప్పు వాటిల్లేనో తెలుపనంతటి పరమరహస్యం !

ఒక్కనిమేషంలో ఏటిగట్టు తెగింది, నీరు ఈవల కాలవలోకి పడింది. అంతా తెప్పానాం తేలానాం అయి ఊరుకుంది. కనిపెట్టిన వాళ్ళులేరు. విని పించుకున్న

వాళ్ళూలేరు. ఎక్కడిది పడవలక్కడ కట్టడి పోయినాయి. ఒకమైలు ఎటుచూచినా నీటివేగమూ నీటిపఱపూ తప్ప మరొకటికానం. వేలకొద్ది సుడిగుండాలు, ఎక్కడ నుంచి వచ్చేను ఈ నీరంతా అని అనుకొనేలో మఱో అంతనీరు ప్రత్యక్షం. కాలవకీతట్టు తల్లీ పిల్లా నడుస్తూవున్న బాటే పారమన్నా తీరమన్నా! ఆతీరాన్నే వో కొంత దూరం తియ్యమామిడి చెట్లవరుసలు, ఓకొంతదూరం మీద కొబ్బరి మోకలు, ఓ కొంతదూరం ఊడలు దిగిన మఱ్ఱిచెట్లు, ఓ కొంతదూరం ముళ్ళతో బలిసిన తుమ్మచెట్లు, ఇలా రకరకాలు, కంచెగాకుండా, అంచుగాకుండా మించి వున్నాయి. మంచు తడిసున్నాయి. చీకట్లో అయినా అన్నీ మెఱుస్తూ వున్నాయి. మెఱుగుడు పురువుల్తో అన్నీ కీచు మంటున్నాయి. ఎదో పురుగు సంచారంతో, అన్నీ తిన్నందనం తప్పితే, తగిలేవీ తాకేవీ!

మఱి పిల్లా తల్లీ వేర్పాటు అయ్యే రోజులొచ్చాయా అని అనిపించింది అని అనుకోండి. ఆఘడియ ఆలాంటిది. కాని భగవంతుడు అలా వేర్పాటుగానిస్తాడా? పేగుమమత పోనిస్తాడా?

మఱి తల్లి తలపోసింది! కాలవ కాలవలా నిలవదని, తాము నడిచేదారి దారిలా వుండబోదని? —దాన్ని కూడా తెగ్గొట్టి పెద్ద కనీ వినని గండి ఆ ప్రాంతమందు పడి తీరు తుంది అని, తామెటు పోయినా తప్పేసూత్రం ఇఖలేదని.

ఆ నిరాశాలోచనలో ఆమె కాలి కింది కప్పుడే గౌతమీ జలం వచ్చేసినట్టు అయింది. పిల్లనట్టే బుజానికెక్కించు కుంది. బుజం మీద కెక్కిన పిల్ల ఊరుకోవచ్చునా? "అమ్మా! అమ్మా! ఎంతనీరో! అంతానీరేనేవ్!" అని అరుస్తూ, ఇంకా పై జూపు చూఱ గొందామని, తనకందే ఒక లేలేత మామిడి కొమ్మనందు కుంది. తల్లి కాళ్ళ క్రింద నీరులో గుండె ఝల్లుమనేలా వెల్లుపై విడగొట్టింది బాటను రెండు ముక్కలుగా. హద్దులేని దానిగా జేసింది అధ్యమంతాను. అటో మూడు ఫర్లాంగులు, ఇటో మూడు ఫర్లాంగులు బాటా ఆ నీటి చేతను దిగమ్రింగబడి చెట్ల వ్రేళ్ల మాత్రంగా, కొమ్మల మాత్రంగా నిలిపి తన చాయను చూపిస్తూవుంది.

అరెరే! తల్లి వెల్లువనే తారుమారు రూపం దాల్చింది. పిల్లమాత్రం పోలిక చెడకుండా, కొమ్మలో కోకిల పిట్టలా నీళ్ళమీద హంసకూనలా మీద మీద గపిస్తూవుంది, నీటమునిగే చెట్టుమీద! తల్లి పిల్లను మరచిపోయిందో లేదోగాని, పిల్ల మాత్రం తల్లిని మరచి అరవసాగింది. "వారా వీరా" అని. ఉదయించే సూర్యకిరణ మొక్కటే ఆపిల్లకు మరి తోడన్నట్టు తెల్లారింది!

తెల్లారి చూస్తే లోకం అంతా మరో రూపం! ఎక్కి చూచే ఏటిగట్టూలేదు. పడవలు నడాడే కాలవా లేదు. పంటా లేదు, వంటా లేదు. సస్యశాలిని సమస్తం సైకత సాంద్రంగా అయిపోయింది. రాజమార్గం, వస్తూపోతూ వుండే రాజమార్గంకు, బండ్ల రాయిడి తప్పి, గండ్లరాయిడి తగిలింది. పెద్ద గండి ఆచోట పడింది. అక్కడే పడింది. ఆ తల్లీ పిల్లా నడచేచోటనే పడింది. అంధకారాన్ని పడింది. అయోమయంగా పడింది.

అవితే గండిదా మొండి జీవనం, ఆమెదా మొండి జీవనం అన్నట్టు, తల్లి ఈతాలాడుతూ, పిల్ల ఎక్కి అరుస్తూ వున్న చెట్టు మొదటను కౌగలించుకుని కొన ప్రాణంతో వుంది!

పిల్ల "అమ్మా!" అంది లోకాన్ని ఆనవాలు పట్టినట్టు. తల్లి "బాగున్నావా? నా తల్లీ!" అంటూ ప్రాణం విడిచింది.



విజయనగరం, చిత్రకళాశాల విద్యార్థుల చిత్ర రచన.



' మధురానగరిలో '

చిత్రకారుడు : ద్వివేముల సోమనాథ శాస్త్రి.



' గాలిదెబ్బ '

చిత్రకారుడు : బి. సింహాచలం,



' తల్లీ బిడ్డా '

చిత్రకారుడు : కాకినీడి భాస్కరరావు,

కాలవాహినిలో కలసిపోయిన

# కజిన్సు సతి

శ్రీమతి కె. లక్ష్మీ రఘురామ్

ఏమి చిత్రము! ఎంతటి విచిత్ర జీవితము! అది స్వదేశము, ఇది మాతృదేశము. అది ఇంగ్లాండుకు సమీపమున నున్న చిన్న ద్వీపము, ఇది ఆసియా ఖండము లోని ద్వీపకల్పము. నడుమనున్నవి మూడు ఖండములు, నాల్గు మహా సముద్రములు మాత్రమే! అచ్చట బుట్టిన ఒక దంపతులను ఇచ్చటి దేశము మాతృదేవియై లాలించినది. వారు మాతృదేవికి ప్రేమాంజలి ఘటించుచూ భారతీ



యులలో లీనమైరి. ధన్యము వారి జీవితము. కృతజ్ఞులు భారతీయులు.

భర్త సుప్రసిద్ధ కవి. లోకమునకు ఆయన పేరు జేమ్సు హెచ్. కజిన్సు. ఆమెకు ఆయన 'జిమ్'. ఆమెకు నామకరణము చేసిన పేరు 'మార్గరెట్', 'గ్రెట్టా' భర్త పెట్టుకొనిన ముద్దు పేరు.

కజిన్స్ సతి ఐర్లండులో బాయిల్ (Boyle) అను చిన్న పట్టణములో 7 నవంబరు, 1878 న జన్మించినది. వాక్చాతుర్యము, సంగీతము, ధైర్యము ఉగ్గుపాలతో గుడిచినది. సంగీత విద్య నభ్యసించి అందు పట్టము పొందినది. ఇరువది రెండవ ఏట యీమెకు వివాహమైనది.

ఉన్నతాదర్శముల మాంగల్యమును డాక్టరు కజిన్సు సతి కంఠమున అలంకరించెను. బహు పవిత్రము వారి దాంపత్య జీవితము. భర్త శాఖాహారి. వివాహమునాటి నుండియు ఆమెయు శాఖాహారియయ్యెను. పతి నిర్బంధము చేయలేదు. ఉన్నతాదర్శముల అవరోహణలో దంపతులు దాటిన మొదటి మెట్టది. భర్త కవిత, భార్య గానము వారి ప్రేమకలాపములు. సతీపతులలో హెచ్చు తగ్గులు లేవు. ఇద్దరూ సమానులే. ఇద్దరూ ఏక మనస్కులే. ఆదర్శ ప్రాయము వారి దాంపత్యము.

వివాహానంతరము పది పదిహేను సంవత్సరములు ఆమె వారి స్వదేశములోనే వుండెను. అప్పుడు ఆమె భర్తతోపాటు సాహిత్య సభలయందు, శాసన సభలయందు, శాఖాహార సంఘముల యందు, స్త్రీల హక్కుల పోరాటము లందు ప్రత్యేక శ్రద్ధ తీసికొనుచుండెను. రెండు పర్యాయ ములీమె ఐర్లండు స్త్రీల హక్కుల పోరాటమున కారాగార మునకు వెళ్ళవలసి వచ్చెను.

ప్రపంచమంతటా అప్పుడు సంచలనము. ఒక చోట ప్రపంచ సంగ్రామపు గుసగుసలు. మరియొక చోట స్వరాజ్య పోరాటము. ఇంకొక యెడ స్త్రీల హక్కుల హాహాకారములు. అచ్చటచ్చట మత సంఘ సంస్కర్తల తీవ్ర ప్రచారములు. అప్పుడే భారతదేశము దీర్ఘ నిద్రనుండి మేల్కొను చున్నది. గాంధీ మహాత్ముడు స్వాతంత్ర్య దుంధుభినింకా మ్రోగించ లేదు. భారతీయులప్పుడే కళ్ళు నులుపుకొనుచున్నారు. ఇంతలోకే అనిబెసంటు సతి శంఖా రావము హోమ్ రూలు ఉద్యమము ఆరంభించి విజృ భించుచున్న తరుణము.

'ఎప్పుడు భారతదేశమేగు అదృష్టమున్నదో' యని ఆకశమున చుక్కలను పరిశీలించుచూ యున్న సమయ

ములో (1915) అనిబెసంటు సతి భారత దేశమునకు కజిన్సు దంపతులను రమ్మని ఆహ్వానము (ఆదేశమో!) బంపెను. తమ యదృష్టమే మహాదృష్టమను కొనుచూ వారు స్వదేశమును విడచి నూతన జీవితారంభమునకై వువ్విళ్ళూరుచూ పయనమై, సముద్రములు ఖండములు దాటి నవంబరు 1, 1915 న మద్రాసు చేరిరి.

అడయారులోని దివ్య జ్ఞాన సమాజము వారి నివాసము. అనిబెసెంటు సతి అప్పుడు దిగ్విజయముగా హోమ్‌రూలు ఉద్యమమును ఒక వంక, దివ్యజ్ఞాన మత ప్రచారము మరియొక వంక జరుపుచూ భారతీయుల స్వదేశాభిమానమును రెచ్చగొట్టి ద్విగుణీకృతము చేసెను. ఆమె యాజమాన్యమున భారతీయ దేశాభ్యుదయమునకు అనేక విధముల సభలు, సమావేశములు, విద్య, మత, కళ, రాజకీయ ప్రచారములు జరుగుచుండెను. ఆమెకు పలు దేశములలో శిష్యులుండిరి. భారత దేశమునను ఆమెకు శిష్య పరంపర లభించెను. ఆమె సేవాసహకారులలో కజిన్సు దంపతులు అగ్రగణ్యులు — నమ్మిన బంట్లు — చూచి రమ్మనిన కాల్చివచ్చు బంటు మన సోదరి కజిన్సు సతి.

కజిన్సు సతికి భారత దేశము మాతృదేశము. ఈ దేశమునే నిష్కళంక హృదయముతో ప్రేమించుచుండెను. భారతీయులను తన సోదరులవలెనే ఆదరించుచుండెను. వారికొరకు ఆమె చేసిన సేవ అపారము. నలుబది సంవత్సరముల స్వార్థరహిత నిష్కళంక సేవను వివరించిన పెక్కు గ్రంథములే కాగలవు.

కజిన్సు సతి మన దేశములో విద్యావ్యాపకములో, స్త్రీల హక్కుల పోరాటములో, స్వరాజ్య సమరములోని అద్వితీయమైన పాత్ర సాటిలేనిది.

మదనపల్లిలో దివ్యజ్ఞాన కళాశాలను కజిన్సు దంపతులు ఒక అద్భుతమైన విద్యా కేంద్రముగా తయారు చేసిరి. విద్యతో పాటు ఉత్తమ ఆదర్శములు గరపిరి. ముఖ్యముగా కజిన్సు సతి అచ్చటి విద్యార్థినుల యందు ప్రత్యేక శ్రద్ధ తీసికొనుచుండెను. వారికి దేశాభిమానము, మతాభిమానము, చిత్ర కళ, గాన గళ, ప్రకృతి సౌందర్యోపాసనల యందు ఉద్బోధముగావించెను. గృహాలంకరణము యందు, ఆరోగ్యవిధులయందు, పౌరధర్మములయందు ఉత్సాహము కలిగించునట్లు ప్రోత్సాహించు చుండెను. మన స్వదేశములోని వస్త్రములు, వస్త్రధారణ, ముగ్గులు, వంటలు, పండుగలు, ఉత్సవములు, పాటలు, ఆటల యందు మనము సగర్వముగా ఆనందించుటకు అనేక పరిస్థితులు అనుకూలపరచెను. ఆమెను విద్యార్థులెల్లరు ఎంతో ప్రేమతో, ఆదరముతో 'మమ్మి' (అంటే అమ్మా) యని పిలుచుచుండిరి. మన మతము, మన ఆచారములు, మన స్థితిగతులు చూచి విదేశీయులు హేళన, స్వదేశీయులు నిరసన చేయు రోజులలో ఈయమ మన మతమందు, మన దేవతలయందు, గుళ్ళయందు, తీర్థ క్షేత్రములయందు, వేదములయందు, మన సంస్కృతియందు, వేయేల, మన యందుండు ఉత్కృష్ఠ మెల్లను బహిర్గతము చేసి విద్యార్థులయందు స్వదేశాభిమానమును రెచ్చగొట్టెను. అంతట స్వదేశాభిమానము పడగలెత్తి నాట్యము చేయ నారంభించెను. ఏమి ఆశ్చర్యము! ఒక విదేశ నారి అపూర్వసేవ మన భరతమాత బడయ కలిగెను.

పూనా విశ్వవిద్యాలయమునకు 1916 లో కజిన్సు సతిని ఎన్నుకొనిరి. ఢిల్లీలోని స్త్రీల ఇర్విన్ కళాశాల ఈమె ప్రోత్సాహము వలననే స్థాపింపబడెను. ప్రస్తుతము మద్రాసున శ్రీ లేడీ వెంకట సుబ్బారావు సతి గారిచే నడిపింపబడుచున్న సేవాసదనము ముప్పది ఏండ్ల నాడు కజిన్సు సతియే స్థాపింప చేసెను. మంగుళూరు స్త్రీల పాఠశాలకు ఒక ఏడాది ప్రిన్సుపాలుగా కూడా నుండెను. మదనపల్లిలోని దివ్యజ్ఞాన కళాశాల ఆవరణములోనే 'కృష్ణా కాటేజి'లో కజిన్సు దంపతులు నివసించు చుండెడివారు. వారి నిత్య జీవితము భారతీయ సాంప్రదాయములకు అనుగుణముగా నుండెడిది గాని, విదేశీయుల టక్కుటిక్కు లెచ్చటా గానరావయ్యెను.

విద్యార్థులతోపాటు విద్యార్థినులు కళాశాలయందలి వివిధ కార్యక్రమములయందు పాల్గొననియడల ఆమె ఎంతయో అసంతృప్తి పడియెడిది. పురుషులతో పాటు స్త్రీలు అన్ని విషయములయందును పురోభివృద్ధి పొందవలయునని వాంఛించెడిది. అందుచేతనే ఆమె 1917 లో శ్రీ ఇ. ఎస్. మంటేగోకు స్త్రీలకు వోటింగు హక్కు కావలెనని కోరుచూ ఒక స్త్రీల "డెప్యుటేషను"కు నాయకత్వము వహించి, భారత స్త్రీలు అసెంబ్లీలలో పురుషలతో పాటు కూర్చొనుటకు హక్కులు సంపాదించి పెట్ట కలిగెను. 1920 లో అఖిల భారత మహిళా సభను నిర్మించి దానికి కార్యదర్శినిగా వుండి పూరూరు శ్రమయ

నక తిరిగి త్రిప్పలుబడి భారత మహిళలయందు నూత్న చైతన్యము కలిగింప దొడంగెను. అప్పటికి ఆరంభించిన శ్రీ గాంధీ మహాత్ముని ప్రచారములవలనను మహిళాభ్యుదయము వేవేగ ముందంజ వేయ జొచ్చెను. 1923 లో మొట్టమొదట భారత దేశములోని స్త్రీ మేజస్ట్రేటు పదవి నలంకరించిన సోదరి కజిన్సు సతియే!

ఈమె ఎల్లప్పుడూ ఖద్దరునే ధరించుచుండెడిది. అప్పుడప్పుడు మన వలె చీరను కట్టుకొని ఆమెను చూచిన వారి నందరినీ ఆనందింప చేయుచుండెడిది. నిత్యము నిరాడంబర జీవిత విధానమే ఆమెకు సంతృప్తికరముగా నుండెను. 1932–33 లలో సహాయ నిరాకరణోద్యమములో పాల్గొని వెల్లూరు కారాగారములో ఒక సంవత్సరము గడిపెను. హొడుదుడుకులకు అలవడిన ఆమె జీవితమునకు జైలులోని ప్రశాంతత భరించరానిదిగా యుండెను. కావున అచ్చట ఒక చిన్న విప్లవము ఆరంభించెను!

ఈమె 'ఆసియాలో స్త్రీల మేలుకొలుపు', 'నేటి భారతీయ స్త్రీలు', 'స్త్రీల పట్ల పురుషుల ధర్మములు', 'తూర్పు పశ్చిమ దేశములలో సంగీతము', 'స్వీయ చరిత్ర' మొదలగు పుస్తకములు రచించెను.

కజిన్సు సతి అరవింద రవీంద్రులను తన అధ్యాత్మిక గురువులు గను, గాంధీ మహాత్ముని రాజకీయ గురువుగను, సరోజిని కమలా దేవులను తన అనుంగు సోదరిలగను, శతసహస్ర విద్యార్థులను తన బిడ్డలగను, భారతీయుల గౌరవము తన గౌరవముగను, భారతీయుల కష్టసుఖములు తన కష్టసుఖములగను తలంచుచుండెడిది. ఆ పుణ్యశీల పది సంవత్సరముల నుండి పక్షవాతముచేత బాధపడుచూ 11-3-54 న ప్రాణమును విడచి పరలోక గతురాలయ్యెను. తిరిగి ఏ దేశమున ఏ కార్య సాధనకు ఏ తల్లి కడుపున బుట్టునో!

ఆమె ఆత్మకు శాంతి తథ్యము. ఆమె నిత్య సాంగత్యము కోల్పోయిన డాక్టరు కజిన్సును ఎవరు ఓదార్చ గలరు! కాలమే ఆయన హృదయమునకు తగిలిన గాయమును మాన్ప కలదేమో!

తమకు ధ్రువ తారయై వెలసిన సాధ్వి రాలిపోయినది. భారత మహిళల కృతాంజలే ఈమెయొక్క స్వార్థ రహిత నిష్కళంక సేవా ఫలము.

కాల వాహినిలో కలసిపోయినది కజిన్సు సతి. ★

---

# ఆంధ్ర మహిళా సభ

## సంగీతపు తరగతులు

కర్ణాటక సంగీతము వీణ, గాత్రములలో లోయర్ గ్రేడ్ పరీక్షలకు శిక్షణ, ఆంధ్ర మహిళా సభ లజ్ చర్చ్ రోడ్డు భవనములలో, ప్రారంభింప బడినది.

శిక్షణ మాసరుసుము రూ. 5-0-0.

ప్రవేశ రుసుము రూ. 2-0-0.

సభ్యత్వ రుసుము మాసమునకు రూ. 1-0-0.

మిగతా వివరములు సభకు మధ్యాహ్నం 3 గం॥ పైన వచ్చి తెలిసికొనవచ్చును.

## ఖాదీ విక్రయము

మద్రాసు గౌర్నమెంటు రూరల్ వెల్‌ఫేరు శాఖలో తయారయిన ఖద్దరు వస్త్రములు, ఆంధ్ర మహిళా సభ లజ్ చర్చి రోడ్డు కార్యాలయంలో విక్రయింప బడుతున్నవి.

చీరలు, ధోవతులు, దుప్పట్లు, చొక్కా, రవికె గుడ్డలు, ఇంకా అనేక రకములైనవి యిక్కడ దొరకును. రూపాయ విలువకు 3 అణాలు తగ్గించి విక్రయించవలసినదిగా వెల్‌ఫేరు శాఖవారు అనుమతి యిచ్చియున్నారు.

ఉదయము 10 గం॥ నుండి సాయంకాలం 6 గం॥ వరకు ఈ విక్రయ శాఖలో మీకు కావలసిన వస్తువులు దొరకును.

అ. చన్నఘంటమ్మ.

బిడ్డల లివరు అండు స్ప్లీను వ్యాధులకు

# పాత్రుడుగారి బాలసంజీవిని

డాక్టరు పిల్లా పాపయ్యపాత్రుడుగారి "బాలసంజీవిని" నిజముగ అమోఘమైనది. బిడ్డలకు సంభవించు లివరు అండు స్ప్లీను వ్యాధులలో ప్రథమ దశయందుగాని, కాంప్లికేటెడ్ స్థితియందుగాని తప్పకుండ గుణమిచ్చును. వైద్యవృత్తియందును నా స్నేహితులలోను బంధుకోటిలోను అనేకులు ఉపయోగించుటవల్లను "బాలసంజీవిని" యొక్క గుణాతిశయములు పరీక్షించుట కవకాశమేర్పడినది. బజారులోగల యితర లివరు ఔషధములుగూడ యిదివరలో వాడి చూచితినిగాని "బాలసంజీవిని" వాడిన పిమ్మట పైవాటినెల్ల విసర్జించి దీనినే హెచ్చుగ వాడుచున్నాను. అమోఘముగ నిట్టి మహౌషధమును ప్రజోపయోగమునకు వినియోగించుచున్నందుకు పిల్లావారి వంశము స్తుతిపాత్రమైనది.

డాక్టర్. ఎన్. రామనాధన్‌గారు L. M. P. కావేరిపాకం.

వివరములకు:

## డాక్టరు పిల్లా పాపయ్య పాత్రుడు & బ్రదర్సు,

నెం. 19, దక్షిణమాడావీధి, మైలాపూరు, మద్రాసు 4.

| కుంభకోణం బ్రాంచి: | తిరుచినాపల్లి బ్రాంచి: |
|---|---|
| నెం. 7 సారంగపాణి కోవిల్ తూర్పు వీధి. | నెం. 15 పుగళై పిళ్లై వీధి తెప్పకొలం. |

అన్ని మందుల షాపులలోను దొరకును.

# రీటా హెయిర్ టానిక్

# తల వెంట్రుకలను పెంచును



రీటా కుదుళ్లకు బలమునిచ్చి, నిగనిగలాడు నిడుపాటి వెంట్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్.

తల వెంట్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేను కొరకు, ఇంకను తల వెంట్రుకలకు సంబంధించిన సమస్త వ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేలకువేలువాడి గుణమును పొంది యున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు. రీటా హిందూదేశ మంతటా దొరకును.

వెల సీసా 15 అణాలు.




# RITA
## HAIR TONIC



ఐక్యరాజ్య సమితి అధ్యక్షురాలు, శ్రీమతి విజయలక్ష్మి.

అ మ ర జీ వి

# శ్రీ పొట్టి శ్రీరాములు వర్ధంత్యుత్సవము

## మదరాసు నగరములో బహిరంగ సభ.

———:o:———



మదరాసు నగరము, త్యాగరాయ నగరులోని హిందీ ప్రచారసభ ఆవరణలో, శ్రీ అమరజీవి పొట్టి శ్రీరాములు గారి జయంత్యుత్సవ సందర్భములో, మంగళవారము ది. 16-3-1954, సాయంకాలము 4 గంటలకు ఒక బ్రహ్మాండమైన బహిరంగ సభ జరిగినది. ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు సభకు అధ్యక్షత వహించిరి.

సభకు పూర్వము, అలంకరించిన ఉన్నత పీఠముపై, శ్రీ పొట్టి శ్రీరాములుగారి చిత్రపటము ఉంచబడినది.

ఈ బహిరంగ సభను ఏర్పాటుచేసిన శ్రీ పొట్టి శ్రీరాములు మిషనుకు అధ్యక్షులైన శ్రీ భాగవతుల లక్ష్మీనారాయణగారు, శ్రీ శ్రీరాములుగారి స్మారక నిధి నొకదానిని నెలకొల్పవలెనని సభికులకు విన్నవించిరి.

శ్రీ శ్రీరాములుగారు చేసిన త్యాగము అమోఘమైనదని, ఆయన చేసిన ప్రాణోత్సర్గము ఒక ధర్మబద్ధమైన లక్ష్యముగలదనియు, అవతరించిన ఆంధ్ర రాష్ట్రము అన్నివిధములా అభివృద్ధి చెందుటకు తోడ్పడుట వలననే, ఆంధ్రులు ఆ అమరజీవియెడల తమకు గల ఋణమును తీర్చుకొనగలరనియు, శ్రీ గోపాలరెడ్డిగారు, శ్రీ కళా వెంకట్రావుగారు, ఇంకా పలువురు ప్రముఖులు సభలో నొక్కి చెప్పిరి.

శ్రీ ప్రయాగ నరసింహశాస్త్రిగారిచే 'పొట్టి శ్రీరాములు' బుర్రకథ వినిపింపబడినది.



## ఉ ద య బా ల

* శ్రీ చక్రవర్తి రంగస్వామి *

తలనిండ పూలతో కనుల పండువుగ
పట్టు పరికిణి కట్టి పూలరవిక్క తొడిగి
నుదుట తిలకము దిద్ది సింగారములు చేసి
చిట్టితల్లీ నీవు విచ్చేసినావా?

ఇన్నిరంగుల గులాబీలు నీకెక్కడివె
ఇన్నిచేమంతులీ సంపెంగ లెక్కడివె
ఏది పాడుమమ్మా మరల కలకలారవగీతి
అందమనగా నీది ఆనందమననీది

తలిరు మెత్తని చిన్ని పాదాలతో నడచి
నిశ్శబ్దముగ నీవు సిగ్గు త్రోవల నుండ

చిరునవ్వు నవ్వుచూ ఠీవిగా నిల్చుచూ
ఆనందమయి బాల అవతరించవమ్మ.

హిమబిందు స్నానం చేశావా
ఒడలంత సుగంధం పూశావా
తియ్యని తేనెలు త్రాగావా
చిరుచేతులు పట్టుచు వచ్చావా.

తియ్యని పలుకుల చిలుకా రావే
కమ్మని పాటల కోకిల రావే
చక్కగ ఆడే నెమలీ రావే
పువ్వుల బంతులు రువ్వుతు రావే



## సంక్షేమ కార్యక్రమము

# మాతా శిశు సంక్షేమము - కేంద్ర ప్రభుత్వ కృషి

—:o:—

దేశమంతటా మాతా శిశు సంక్షేమ శాఖల అభివృద్ధికని, కేంద్ర ప్రభుత్వమువారు తయారు చేసిన ప్రణాళికను, అన్ని రాష్ట్ర ప్రభుత్వాలతయికీకి పంపించినట్లు శ్రీమతి రాజకుమారి అమృతకౌరుగారు ప్రజా సభలో సెలవిచ్చారు. వచ్చే రెండు సంవత్సరాలలో, యీ ప్రణాళిక అమలు నిమిత్తము, కేంద్ర ప్రభుత్వము రమారమి 50 లక్షల రూపాయలు వెచ్చించడానికి సిద్ధముగా వున్నారని కూడా ఆమె తెలియబఱచినారు.

ఈ ప్రణాళికను బట్టి, కొన్ని సంక్షేమ కేంద్రాలు నెలకొల్పబడును. ఒక్కొక్క కేంద్రములో ఒక హెల్త్ విజిటర్, నలుగురు మంత్రసానులు నియమింపబడతారు - 60000 జనాభాగల ప్రదేశము ఒక కేంద్రముగా ఏర్పరుప బడుతుంది.

ఈ కేంద్రాలలో సూలింతలకు, బాలింతలకు, తగిన సలహా, వైద్య సహాయము లభించడమే కాకుండా, యిందలి మంత్రసానులు, ఇంటింటా పరిశీలించి, వారి వారి యిండ్లలో ప్రసవ సమయములో తగిన సహాయము చేయుచుందురు.

ఒక్కొక్క కేంద్రము ప్రారంభించడానికి, అందుకు తగిన పరికరములు సిద్ధము చేయడానికి, కావలసిన ప్రారంభ ఖర్చు, సుమారు రూ. 2000/- కేంద్ర ప్రభుత్వము భరిస్తుందని, సిబ్బంది కనువగు వసతి, కేంద్రము నడపుటకు ఒక స్థలము, మున్నగు వానికగు ఖర్చంతా రాష్ట్ర ప్రభుత్వాలు భరించవలెనని ప్రణాళిక సూచిస్తుంది.

పైగా, ఒక్కొక్క కేంద్రము నడపుటకు, సంవత్సరమునకు రమారమి ఖర్చు 17 వేల రూపాయలనీ, వచ్చే రెండు సంవత్సరాలలో, మొదటి ఆరు మాసములు అయ్యే పూర్తి ఖర్చు, తరువాత పండ్రెండు మాసముల కగు వ్యయములో రెండు వంతులు, తరువాత ఆరు మాసముల కగు వ్యయములో సగము, కేంద్ర ప్రభుత్వము భరించ గలదని కూడా యీ ప్రణాళికలో సూచించబడినది.

అటు పైన యీ సంక్షేమ కేంద్రముల నిర్వహణ పూర్తి బాధ్యత రాష్ట్ర ప్రభుత్వాలే వహించవలసియుం టుందని కూడా, యీ ప్రణాళికలో సూచించబడినది.



## గూడూరు స్త్రీల గృహ పరిశ్రమల సహకార సంఘ 13-వ వార్షికోత్సవము.

పై సంఘం వారి 13 వ. వార్షికోత్సవాన్ని శ్రీ మహాత్మాజీ ఆదివాసి హాస్టల్ ఆవరణంలో శ్రీమతి సి. వి. లక్ష్మిరెడ్డి (అఖిల భారత మహిళాసభ ఆంధ్రశాఖ, నెల్లూరు కార్యదర్శిని) అధ్యక్షతన జయప్రదంగా జరిగింది. శ్రీమతి సుశీలాదేవి గారు (లేబరు వెల్‌ఫేర్ ఆఫీసరు) పతాకారోహణము గావించిరి. సభాధ్యక్షులు శ్రీమతి సి. వి. లక్ష్మి రెడ్డిగారు స్త్రీల కుటీరపరిశ్రమలను గూర్చి మాట్లాడుతూ వీటి కొనుగోలుకు ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించాలని సూచించారు. స్త్రీల పొదుపు వుద్యమము, కుటీరపరిశ్రమలు భారతదేశము యొక్క ఆర్థిక స్థోమతకు ముఖ్యమని తెల్పారు. శ్రీమతి జి. విమలాచౌదరి ఎమ్. ఎ. గారు మాట్లాడుతూ మిల్లులు రాక పూర్వం దేశంలో అందరూ చేనేత బట్ట వాడుతూ వున్నారని మిల్లులు వచ్చాక చేనేత పరిశ్రమలు కుటీర పరిశ్రమలు పడిపోయాయని అందువల్ల నిరుద్యోగ సమస్య ఎక్కువైనదని, ప్రతి ఒక్కరు చేనేత బట్ట వాడి వారిని ప్రోత్సహించాలని కుటీర పరిశ్రమలను ప్రతి స్త్రీ ప్రవేశపెట్టాలని కోరారు. తరువాత రాట్నం పోటీలు, మిషన్ కుట్టు, క్యారం బోర్డు, పోటీలలో గెలుపొందిన వారికి బహుమతులను, రాష్ట్రభాష హిందీ పరీక్షలలో పుత్తీర్ణులైన వారికి ప్రమాణ పత్రములను పంచిపెట్టారు. కుమారి తలుపూరి రాజ్యలక్ష్మి పాటకచ్చేరి కాగానే సంఘ ప్రెసిడెంటు శ్రీమతి నక్కా రంగనాయకమ్మగారి వందన సమర్పణతో సభ ముగిసింది. సబ్ కలెక్టరుగారు, సబ్ మేజిస్ట్రేటుగార్లు, వారి సతీమణులతో విచ్చేశారు. వస్తు ప్రదర్శనాన్ని చూచి సంతోషించిరి. తరచుగా యిటువంటి కుటీర వస్తు ప్రదర్శనాలను జరుపుతూ కుటీర పరిశ్రమలను అభివృద్ధిలోకి తెచ్చెదరని పుర ప్రజలు ఆశిస్తున్నారు.

నక్కా రంగనాయకమ్మ.

## కృతజ్ఞత

శ్రీమతి యరబాక రాజేశ్వరమ్మగారు ఆంధ్ర మహిళా సభకు 100 - రూపాయలు విరాళమిచ్చి యావజ్జీవ సభ్యురాలుగా చేరిరి. వీరికి మా కృతజ్ఞత.

ఆంధ్ర మహిళా సభ.

స్త్రీ శక్తి స్వరూపిణి.

# మహిళలు పూజనీయులు

* శ్రీమతి శ్రీధర జయలక్ష్మి *

పూర్వపు పద్ధతులలోను, ఇప్పటి పద్ధతులలోను, ప్రతి సామాన్యకుటుంబమునందు మామూలు నడవడికలలో అజగజాంతరం భేదములున్నవి. కావునదేశ సౌభాగ్యం పెంపొందాలంటే ప్రతి గృహములోనూ, ఆడపిల్లల విషయములో తలిదండ్రులు తమ శక్తికొలదీ సమస్త విద్యలయందు సంసార నిర్వహణకు కావలసిన కళలయందు ప్రవేశము కలిగించడం ముఖ్య కర్తవ్యం.

ఇప్పటికీ కొందరు పూర్వీకులు ఆడపిల్ల వీధిలోకి పోతే ముప్పు వాటిల్లునని నాలుగు గోడలమధ్య కూపస్థ మండూకము వలె అణగద్రొక్కి వుంచి, వారి భావి జీవితం నాశనం చేయడం చాలా శోచనీయం. అంటే, ప్రతి స్త్రీ గొప్ప డిగ్రీలు సంపాదించి పెద్ద ఉద్యోగములే చేయాలని కాదు.

స్త్రీ సంసార నౌక సారవంతముగా నడపగలందులకు.... పిల్లల పోషణ చక్కగా నిర్వర్తించుటకు, తన గృహమునందు ఆరోగ్య భాగ్యము పెంపొందింప చేయుటకు, మరియూ మన దేశమునందు అన్న వస్త్రములకు గల దురవస్థను గమనించి కొద్దో గొప్పో ప్రజా సేవకురాండ్రుగా కాగలందులకు తప్పక ప్రతి స్త్రీకి కొంత వరకు విద్య నేర్వ వలసిన ఆవశ్యకత వుంది.

స్త్రీ అంటే అర్థము చేసుకోజాలని పామరులు సామాన్యంగా 'ఆడదాని చేత ఏమవుతుందిలే' అని స్త్రీలను తృణప్రాయులుగా చూస్తున్నారు. స్త్రీ శక్తి స్వరూపిణి. దేవతల దగ్గరనుండి సామాన్య ప్రజల దాకా స్త్రీలకే అగ్రస్థానం వున్నట్లు నిరూపణ చూపగలము.

సాక్షాత్తు సాంబశివుడు అర్ధనారీశ్వరుడై, మరియు గంగను శిరమునందు ధరించి వుండుటలో అర్థమేమిటి? శ్రీరామచంద్రుడు సీతాదేవి చెంతలేని సమయమున చివరకు స్త్రీరూపముగల విగ్రహమును ప్రక్కన వుంచుకొని కూర్చోవలసిన పరిస్థితి యెందుకు కలిగినది? శ్రీకృష్ణుడు తన ఇద్దరు భార్యలను తృప్తిపరచుట కొరకై త్రాసునందు కూర్చొని తూగవలసిన గత్యంతర మేమిటి? దేవదానవుల యుద్ధమునందు అప్పుడు మోహినియే లేకపోయిన యేమై యుండవలసింది?

మరియు, ఆ కాలములోని పతివ్రతామతల్లుల ప్రభావం వ్రాయుట మొదలుపెట్టిన చాలా యున్నది. సుమతి శాపమున యేడు రాత్రులు ప్రొద్దు పొడవక గాఢాంధకారం ముంచుకొనిపోతే, పై లోకం నుండి దేవతలు దిగి వచ్చి ఆ సతిని పరీక్షించవలసి వచ్చినది; అనసూయ త్రిమూర్తులను అడ్డాలలో బిడ్డలుగా చేసి బుజ్జగించింది.

ఆ యుగముల మాట అటుండగా, ఈ కలియుగములో యెంతమంది వీరమాతలు చిరస్థాయిగా కీర్తి నిలుపుకో గలిగారో, మనము రోజూ పాఠశాలలలో పిల్లలకు కూడా పాఠముల మూలంగా విశదపరుస్తున్నాము. ఝాన్సీలక్ష్మీబాయి, మల్లమాంబ, రాణీపద్మిని, ఇటు వంటివారు భారత దేశమున వేల కొలది స్త్రీలు వెలిగించిన జ్యోతి ఇప్పటి వరకు నిత్య జ్యోతిగా వెలుగుచునే యున్నది.

మరియూ ఆదినుండీ, మహాఋషులు, రాజులు, సామాన్య గృహస్థులు ప్రక్కన భార్య లేనిదే యెలాటి శుభ కార్యములును చేయుటకు శాస్త్రరీత్యా అనర్హులని యెరుగుదుము. పురుషులే సర్వస్వతంత్రులైనప్పుడు ప్రతి విషయమునందు స్త్రీ తోడ్పాటు యెందుకొరకు నియమించిరి?

సర్వ సాధారణముగా తల్లి పోయిన బిడ్డలను చూస్తే ప్రతివారున్నూ పాపం తల్లి లేని బిడ్డలంటూ జాలి జూపుదురు, తండ్రి ఎంత ధనికుడు, పెద్దవాడైనా సరే.

'సంసారమే స్వర్గసీమ' అనునట్లు యే మనుష్యుడు అయినా సుశీల యగు భార్య లేనిదే సంపూర్ణమైన యిహ సుఖము పొందజాలడు. గృహమునకు శోభ గృహలక్ష్మియే. తల్లి ప్రేమకున్న మహిమ తండ్రి ప్రేమనందు ఎటు వంటి సందర్భములోనూ సరితూగుటలేదు.

వెయ్యి చెప్పనేల, భారతమాతకు జై అనిన్నీ వందే మాతరం అనిన్నీ ప్రతినోట జయజయా ధ్వానములు సలిపినట్లు, పొరబాటునైనా పితృ భూమికి జై అని గాని వందే పితరం అనిగాని పలుకులు యెక్కడా వినిపించవు. గనుకనే తప్పక స్త్రీలు పూజనీయులని, శక్తి సంపన్నులని, మనము విశ్వసిస్తూ, వారి బాధ్యతలు నిర్వహించుటకు అన్ని విధములా అవకాశమీయడం అత్యంతావశ్యకము.

# సంస్కృత భాషా కవయిత్రులు—
# గంగాదేవి

—శ్రీమతి కాంచనపల్లి కనకాంబ.

పూర్వకాలమున మన తెలుగు కవయిత్రుల కంటే సంస్కృత కవయిత్రులె చాలమంది యున్నట్లు తెలియుచున్నది. అన్ని శాస్త్రములు ఆభాషలో నుండుట చేతను, అన్ని దేశములవారు అన్ని భాషలవారు కూడ సంస్కృతము విధిగా నేర్చియుండుట చేతను, దాని కట్టి పూజ్యత అవసరము కలిగియుండెడిది. "తల్లి సంస్కృతం బదెల్ల భాషలకు" అన్నాడుగదా కేతన. ఆంధ్రమునం దనర్గళముగ కవిత్వము చెప్పనేర్చినను సంస్కృతమురానిదే యాంధ్రమునకు విలువ యుండెడిదికాదు. పండితులన్నను, కవులన్నను ఉభయభాషలలోనైననే గణన. ప్రాచీన కాలమునుండి ఉపనిషత్తులందు సైతము గొప్ప విద్యావతులు గార్గి, మైత్రేయి, మొదలగువారు ప్రసిద్ధి గన్నారు. ఇక పురాణయుగము, కావ్యయుగము సంగతి వేరే చెప్పవలెనా? కావ్యయుగములోనిదే మన గంగాదేవి. 10వ శతాబ్దములో రాజశేఖరకవి తన రచనలలో ఇందులేఖ, కుంతీదేవి, గౌరిక, ప్రకాశదత్త, మౌరిక ప్రభుదేవి మొదలగు కవయిత్రీమణుల నెందఱనో యుదహరించినాడు.

తరువాత కొన్నివందల సంవత్సరములకు గంగాదేవి సంస్కృతభాషా కవయిత్రులలో ప్రసిద్ధిగన్న రాజరమణీమణి. క్రీ. శ 1367 లో కాంచీపురము నేలిన వీరకంపరాయని భార్య. ఈ విదుషి తనభర్తయైన వీరకంపరాయల పరాక్రమము జాటు జైత్రయాత్ర రచించి తన కావ్యమునకు 'మధురావిజయ' మనుపేరిడెను. విజయనగరరాజుల చరిత్ర అంధకారబంధురముగనున్న సమయమున కొన్నివిషయములు తెలిసికొనుటకీగ్రంథము తోడ్పడుచున్నది. ఈ కృతినాయకుడు హరిహరరాయల సోదరుడైన బుక్కరాయని జ్యేష్ఠ కుమారుడు వీరకంపన. మధురపై వీరకంపనుడు దండెత్తి విజయము నొందుటయే మధురావిజయ కావ్యము నందలి యితివృత్తము. శైలి సరళము. మృదుమధురము. మహాకావ్యలక్షణము లన్నింటిని పాటించినది. ఇందలి యుపమానములు ఋతు వర్ణాదికములు మనోహరములు. ఇష్టదేవతా ప్రార్థనము క్రముగా గణపతి, పార్వతీపరమేశ్వరులు, సరస్వతి, క్రియాశక్తి. గురువులకు నమస్కారము. పూర్వ కవి స్మరణమున కాళిదాసు నిట్లు చక్కగ వర్ణించినది.

శ్లో॥ దాసతాం కాళిదాసస్య కవయః కే నబిభ్రతి
ఇదానీ మపిత స్వార్థా ముపజీవం త్యమీయత॥

వాల్మీకి, వ్యాస, కాళిదాస, బాణ, భారవి, దండి, భవభూతి, కర్ణామృతకవి, తిక్కయ అగస్త్య, గంగాధర, విశ్వనాథులను వర్ణించెను. ఈ తుదికవి విశ్వనాథకవియే యీమెకు విద్యాగురువై యుండును.

శ్లో॥ చిరం సవిజయీ భూయాత్ విశ్వనాథకవీశ్వరః
యస్య ప్రసాదాత్ సార్వజ్ఞం సముద్వేమాదృశీష్వపి॥
1 వ సర్గ 16 వ శ్లో.

తనవంటివారికి సర్వజ్ఞత్వము అతని యనుగ్రహమున గలిగెనని పేర్కొన్నది. కథారంభమున బుక్కభూపాలుని, అతని దేవేరి దేపాయిని వర్ణించినది. రాజు మూర్తీభవించిన ధర్మదేవత యని యతని ధీరోదాత్త లక్షణములు ప్రశంసించి విద్యానగరపరిపాలనా విధానమును వర్ణించినది. ద్వితీయ సర్గయందు దేపాయి గర్భము దాల్చుట దౌహృదీ లక్షణములు వర్ణింప బడినవి. దేపాయి తుంగభద్రా తీరమున నున్నను తామ్రపర్ణియందు స్నాన మాడ గోరినదట. గర్భస్థశిశువు తురుష్కులను జయింప మధురకేగు సూచనలు కాబోలును.

"సుదతి సవిధగతయు సులభావగాహయౌ
తుంగభద్రమెచ్చుస్రోవబోక
తలచెనాత్మ సైన్య దంతురితమౌ
తామ్ర పర్ణిలోన తానమాడ॥

దేపాయి కంపనుడను కుమారుని గనెనట. సంగ్రామ రంగంబున శత్రువులను గంపింప జేయువాడని తండ్రి కుమారునికి వీరకంపరాయడను నామకరణ మొనర్చెను.

తృతీయ సర్గమున కంపనుని విద్యాభ్యాసము, యౌవనము వర్ణింపబడినది. బుక్కరాజు కంపనునకు నంద్యరాజు కన్యయగు గంగాదేవి నిచ్చి వివాహము గావించెను. ఆ నూత్నదంపతులు లక్ష్మీనారాయణులవలె, పార్వతీపర

మేశ్వరులవలె, శచీపురందరులవలె నలరారు చుండిరి. బుక్క భూపాలుడు కుమారునొకమారు బిలిచి యైశ్వర్య యౌవనమదముల గూర్చి చక్కగ నుపదేశించెను. ఈ గురూపదేశము బాణభట్టు శుకనాసోపదేశమునకు సంగ్రహ ప్రతిబింబమువలె నున్నది. ఇందులకుదాహరణము-

శ్లో॥ గురూపదేశః కిల కథ్యతే బుధైః
అక్కరశం కించ నరత్నకుండలమ్
అమేచకం నూతన మంజనం సతా
మజాతగాత్ర క్షయ మద్భుతం తపః॥

గీ॥ గురుని యుపదేశమును జెప్పుదురు విబుధులు
రత్నకుండలమొంద కర్కశ మటంచు
నైల్యమెఱుగని నూత్నాంజనం బటంచు
తాప మొడలికి నిడని సత్తప మటంచు॥

తరువాత తుండీర మండలాధిపతి చంపరాయని మదమడచి కాంచీమండలము నాక్రమించి, క్రమముగా వన్య భూపాలురనడచి, మధురాప్రాంతముల తురుష్క లను జయింప వలెనని శ్రీరాముడు రాక్షస సంహార మొనర్చినట్లు దుష్టులను శిక్షింప దక్షిణదేశముపై దండ యాత్ర నడుపుమని యుపదేశించెను. కంపనుడు జైత్ర యాత్రకు కృతనిశ్చయుడయ్యెను.

చతుర్ధ సర్గమున కంపనుని జైత్రయాత్రా ప్రస్థానము వర్ణింపబడినది. చోళ, కేరళ, పాండ్య భూపతులు, వేత్ర త్వమూని ముందునడువ కంపనుడు క్రమముగా కర్ణాటము నతిక్రమించి కంటక కాననము దాటి పోయి చంప రాయనితోకి ఘోరయుద్ధమొనర్చెను. కోటను ముట్ట డించుట ద్వంద్వ యుద్ధము మొదలగువాని నీమె కన్నుల గట్టినట్లు వర్ణించెను. చంపరాయని యమపురి కంపి తుండీర మండలము స్వాధీనము చేసికొనెను.

పంచమ సర్గమున కంపనుడు దుష్ట నిగ్రహమునకై జన్మించిన మహా విష్ణువని భావించి మగధ, మాళవ. సింహళ, ద్రవిడ కేరళ రాజులాతని కొలిచిరి. రాజు రాజపత్నులతో వన విహారము, జలక్రీడ గావించెను. ఋతు వర్ణనము లిందు గలవు.

ఆరవ సర్గమున గూడ ఉత్సవాలతో రాజు వినోదిం చును. సప్తమ సర్గమున రాజు కోరికపై గంగాదేవి చంద్రోదయమును వర్ణించును. ఆమె వర్ణనలు చాల మనోహరములు. చంద్రుడు రక్తుడై పద్మినిని స్పృశించె గాని పద్మిని యతనియెడ విముఖురాలాయెను.

ఆ భావమిది.

"కరముల మాటి మాటికటుగా నిటుగా నొగిజొచ్చుచున్సుధా
కరుడతిరాగియై నళినికై వెడసేతలు చేసెగాని య
ప్పరమ పతివ్రతామణియు వానికి లోబడదయ్యె నద్దిరా!
తరుణుల సత్యమిట్టిదియ తప్పొనరించిన మంచి చేసినన్"

ఆమె కవిత్వముదాత్తమై భావములు కలది. తరువాత మధురా విజయమున కొంత గ్రంథపాఠ మున్నది. ఇట్టి చారిత్రాత్మకమైన కావ్యములు బహు స్వల్పములు. శ్రీకృష్ణ రాయలు రాజై కవి యగుట రాజ ధర్మములు, జైత్ర యాత్రలు, సమయాను సారముగ వర్ణించినట్లు ఈ కవిరాజ్ఞి తన కావ్యమును రచించినది.

అష్టమ సర్గమున శ్రీరంగ మధురాది క్షేత్రములెట్లు నాశన మొనరింపబడినవో కన్నుల గట్టినట్లు రసవంతముగ వర్ణించినది. ఒకానొక దివ్య యువతి కంప రాయనికి స్వప్నమున గోచరించి దివ్య ఖడ్గము నొకదానిని గూర్చి నుడువుచు, దానిని పూర్వము విశ్వకర్మ పినాకపాణికి రాక్షస సంహారార్థ మిచ్చెననియు, పాండ్యరాజు తపః ప్రభావమున నద్దానిని శివుని వలన బడసెననియు, ప్రకృ తము పాండ్యులు నిర్వీర్యులగుటచే అగస్త్య మహర్షి యామె ద్వారమున కంపనుని కనిపె ననియు, కృష్ణుడు కంసవధ గావించినట్లు, ఆ ఖడ్గమును బూని యవనాధిపతిని మధురలో సంహరింపుమని హెచ్చరించినట్లు వర్ణింప బడినది. తరువాత కంపనుని మధురా విజయమును గూర్చి కొన్ని శ్లోకములు గలవు. కంపరాయ తురుష్కుల యుద్ధ వర్ణనము విశేషముగా గలదు. కంపనుడు తురుష్కుల నోడించి మధురను జయించును. గంగాదేవి యిట్టి సరస కవిత నల్లి కవి రంజకముగా నీ గ్రంథమును సాగించి కవి లోకమందు కీర్తి గాంచినది. ఈమెకు సద్గుణములందు వలెనే సౌందర్యమునందును మిక్కిలి మక్కువకలదు.

శ్లో॥ నిర్దోషాప్యగుణావాణీ నవిద్వజ్జనరంజనీ
పతివ్రతాప్య రూపాస్త్రీ పరిణేత్రే నరోచతే॥

దోష రహితమైనను గుణములు లేని కావ్యము పండి తులకు సంతోషము కలుగ జేయదు. పతివ్రత యైనను రూపసంపద లేని స్త్రీ భర్తకు రుచింపదు కదా! అన్నది యొక చోట. విజయనగర మందలి కథ యగుటచే గంగాదేవి యాంధ్రమునందు గూడ పాండిత్యము, కవిత్వ శక్తి కలిగియుండి యుండవలెను—

—విజయవాడ రేడియోవారి సౌజన్యముతో.

# రాష్ట్ర పునర్నిర్మాణ కమిషన్

———: ౦ :———

భారత రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సమస్యపై సంపూర్ణమైన విచారణ జరపడానికి ఫజల్ ఆలీ ఆధ్వర్యాన్న ఒక సంఘం నియామకమైంది. ప్రభుత్వము తమకు అప్పగించిన కార్యమును త్వరితగతిని నిర్వర్తించుటకు ఈ సంఘ సభ్యులు తగుమైన విధమునుగూర్చి బాగుగా ఆలోచించిరి. అందు మీదట వారు ప్రశ్నలను ప్రకటించి వాటికి ప్రజల ప్రత్యుత్తరములను సేకరించుట అనవసరమనితలచి ఆపద్ధతిని విరమించుకొనుటకు నిశ్చయించికొనిరి. రాష్ట్రపునర్నిర్మాణ సమస్యయందు ఆసక్తిగల ప్రజలు, ప్రజాసంస్థలు కమిషన్‌వారికి ఉపయుక్తమని భావించిన విషయాలముపై తమ అభిప్రాయములను, సలహాలను లిఖితపూర్వకమైన విజ్ఞప్తుల ద్వారా సమర్పింపవలసినదిగా కమిషన్‌వారు కోరుచున్నారు. నిర్మాణాత్మకమైన సూచనలు ఏమైనా చేసే విషయంలో వాటిని రూఢిపరచుటకు చరిత్రనుండిన్ని లెక్కల రూపంగాను అవసరమైన వివరములను తెలియజేయవలెను, క్రొత్తగా ఒక రాష్ట్రమునుగాని రాష్ట్రములనుగాని ఏర్పరచవలసినదిగా కోరుసందర్భములో ఆయాసందర్భమును బట్టి వీలైనయెడల మ్యాపులను ఒకటో అంతకుమించో పంపవలెను.

ఇండియా ప్రభుత్వమువారి 1953 వ సం॥ డిసెంబరు 29 వ తేదిగల తీర్మానమునుబట్టి రాష్ట్ర పునర్నిర్మాణ కమీషన్ నియమింపబడిన విషయము తెలిసియేయున్నది. రాష్ట్ర పునర్నిర్మాణ విషయములో కమీషన్‌వారు దిగువ చెప్పియుండు విషయములను గమనికలో ఉంచుకొనవలసినదిగా ఆ తీర్మానములో పొందుపరచబడి యున్నది.

"ఒక ప్రదేశముయొక్క భాష, సంస్కృతి ఆ ప్రదేశమంపలి ప్రజల సర్వసాధారణ జీవన విధానమును తెలియజేయును. అందుచే అవి ప్రధానమనుటకు సందేహము లేదు. అయితే రాష్ట్రమును పునర్నిర్మాణము చేయుటలో ముఖ్యమైన ఇతర విషయములు కూడ గమనించవలసియున్నది. వీటిలో ఇండియాకు ఐక్యత రక్షణ, బలము చేకూర్చుట ఇండియాయొక్క భద్రతను కాపాడుట ప్రప్రథమమైనవి. ఇది ఎంత ముఖ్యమో ఆర్థికసంబంధమైన, పరిపాలనాసంబంధమైన విషయములు కూడ కేవలము ఒకొక్క రాజ్యము సందర్భములో కాకుండా దేశమంతటికి విషయములోను అంత ముఖ్యమైనది. ఆర్థిక, సాంస్కృతిక పురోభివృద్ధి కొరకై ఇండియా దేశము సక్రమమైన పథకమును ప్రవేశపెట్టినది. అట్టి జాతీయ పథకమును జయప్రదముగా నిర్వహించుటలో అడ్డుతగులు మార్పులు దేశ క్షేమమునకు హానికరము"

ఈ విషయములను దృష్టియందుంచుకొని ప్రజలు విజ్ఞప్తులను తయారు చేయవలసినదిగా కమిషన్‌వారి మనవి.

కమిషన్‌వారు నిర్వహించవలసిన బాధ్యత గురుతరమైనది. దీనిని నిర్వహించుటలో ప్రజలువారితో హృదయపూర్వకముగా సహకరించవలసినదని కోరుచున్నారు. అంతే కాకుండా పత్రికాముఖమున పంపు, ఈ విన్నపమును ఆదరించి తమకు తోడ్పడవలసినదిగా కోరుచున్నారు.

విజ్ఞప్తులు పంపదలచినవారు ఆరేసిప్రతులు తయారుచేసి ఈక్రింద చెప్పిన చిరునామాకు, 1954 వ సం॥ ఏప్రిలు 24 వ తేది లోగా అందునట్లు పంపవలెను.

రాష్ట్ర పునర్నిర్మాణ కమిషన్
కార్యదర్శి, న్యూఢిల్లీ.



# ఉత్ప్రేక్ష

"శ్రీరామ — శ్రీనాథ"

" .... — ఒక్కమాట — ....

శిశు పోషణ కూడా ఒక కళ. మనవాళ్ళు అందులో ముఖ్యంగా గృహిణులు ఈ కళా నిర్వహణలో తమ బాధ్యత గుర్తించకపోవుట చాల విషాదకరమైన విషయం. ఈ పరిస్థితులలో గృహ యజమానులుకూడ తగిన శ్రద్ధ, సహకారము చూపక పోవుట శోచనీయం. శాస్త్రజ్ఞానం లేని మాతృప్రేమ విషతుల్యమని, వ్యక్తుల మానసిక వికాసానికి సంరక్షణే కాకుండా వాతావరణం కూడా ప్రధాన పాత్ర వహిస్తుందని గుర్తించాలి. నేను ఆవుద్దేశంతోనే........" పేజీ తిరగేసేడు శ్రీపతి.

"ఏమండీ! .... మిమ్మల్ని కానట్టు వినిపించు కోరే మిటండీ .... ఎంతసేపూ చిన్నపిల్లల్లాగ కథలు చదువుతూ కూర్చోక పోతే చంటివాణ్ణి తియ్యకూడదూ ........" వంటింట్లోంచి వచ్చిన కేకకి త్రుళ్ళిపడ్డాడు శ్రీపతి. చదువు నాపి సంసారంలో కొచ్చాడు.

"ఎవరి పిల్లల్ని చూసినా ముచ్చటేస్తుంది .... నేనెంత తెస్తే యేం లాభం? .... ఇంట్లో సుఖంలేని తర్వాత" యథా ప్రకారం చీదరించుకున్నాడు.

".... పోనీలెండి. మీకు ఈ ముగ్గురు పిల్లలూ, నేనే కదా బరువైపోయాం" అంటూ చంటి పిల్లణ్ణి చరిచి కంట తడి పెట్టింది విమల. మరి తిరుగులేదు ఆ ప్రయోగానికి—

"ఏమైనా అంటేసరి - పిల్లల్ని బాదడం చేతనవును. మనిషికి స్వతహాగా నైనా పుట్టాలి, చూసైనా నేర్చుకోవాలి. నేనెంత చెప్పినా యేం ప్రయోజనం? ........ డాక్టరుగారి పిల్లల్ని చూడు. అన్నింటిలోనూ ఫస్టుమార్కులే. గంటకు నూరు పేజీలకి తక్కువ చదవరు. సంరక్షణంటే—"

"చాల్లెండి డాక్టరుగారి బడాయి మీరే చెప్పాలి .... ఎంతసేపూ మన పిల్లల్ని దుయ్యబట్టక పోతే చేతనైన సంరక్షణ చెయ్య కూడదూ ...." అని దెప్పి పొడిచింది విమల. తమాయించు కోలేక పోయేడు శ్రీపతి. ఆఫీసు గదిలోకి నిష్క్రమించేడు.

విమల డాక్టరుగారింటి కెళ్ళింది. నిజం తెలుసుకుంది. వాళ్ళ పిల్లల్ని చూస్తున్నంతసేపూ శ్రీపతి చెప్పిన మాటలే ప్రతిధ్వనించేయ్. 'తన పిల్లలు కూడా అలా ఎప్పు డుంటారు?' .... అనుకుంది.

".... మీ అన్నయ్య ఎప్పుడూ మీ పిల్లల గురించే చెపుతారండీ" అంది. అదో మాదిరిగా విమల.

"మీ పిల్లలకి కూడా తగిన సంరక్షణ వుంటే దొరల పిల్లల్లాగుంటారు .... వీణ్ణిచూసేరా? చేతివాడు" అంటూ పిల్లణ్ణి అందించింది కాంతమ్మ.

'వాళ్ళ చేతిలో మందులుంటాయి కాబట్టి చంటి పిల్ల డైనా చక్కగా వుంటాడు' అని మనసులో అనుకుంది విమల. "మా పిల్లల్ని కూడా మీ యింటికే పంపించేస్తా వదిన గారూ—"

"ఈ మాత్రానికి పిల్లల్ని పంపడం దేనికి! సరియైన మందులూ అవీ యిస్తే మీ పిల్లలూ పనస పండులా వుంటారు ...." అని సమాధాన పరచింది కాంతమ్మ.

"ఆ మందులేవో నాకేం తెలుస్తుంది?.... మగాళ్ళ కుండాలిగాని ఆబుద్ధి .... మీ అన్నయ్య దొత్తిగా చూడ్డం మానేసారు"

"ఈ భాగ్యానికి మగాళ్ళకూడా దేనికి? మనమే సరి పుచ్చుకోవాలి" అని ఒక మందుసీసా నందిస్తూ "ఇది మీపెద్ద వాడికి రోజూ వుదయం ఒక చెమ్చాడు యిస్తూ వుండండి బలం చేస్తుంది. మీ చంటివాడికి ఏపాలు పడతారు?...."

"ఏదో ఆవుపాలు వాడిక పెట్టేం లెండి" అంటూ సీసా నందుకుంది విమల.

"మీ తెలివికాని. - యిప్పుడు నిజమైన ఆవుపాలు ఎవ రిస్తున్నారు? గేదెపాలో, పిండిపాలో తప్ప ... మావాడికి మాత్రం యీపాలు పడుతున్నా" అని ఒక మెరుస్తున్న డబ్బా చూపించింది కాంతమ్మ.

"మీ అన్నయ్య గార్కి ఏం చెప్పినా మందమతే.... వీధిలో వస్తువ యింట్లోకి రాదు" అంది విమల. డబ్బా వైపు చూస్తూ.

"ఇప్పటి మగాళ్ళందరూ యింతే ఏడ్చారూ .... నే తెప్పిస్తాలెండి రేపు రెండు డబ్బాలు"

"ఏదో మీరుండబట్టి సరిపెట్టేరు. ఈ సీసాకి డబ్బాలకి రేపు సొమ్ము పంపిస్తా"

"నాకాభయంలేదండోయ్"అని అందుకుంది కాంతమ్మ.

* * *

"ప్రతినెలా సరిపోతున్న జీతం రెండు నెలల్నుంచీ ఎందుకు చాలడంలేదు" అంటూ ఆఫీసు రూమ్ విడిచేడు శ్రీపతి.

"నేనేం దాచుకోవడం లేదు! అప్పులవాళ్ళ చేత మాట నాకు సరదా అనుకున్నారేంటి?" ఏమూల నుంచో ఎదురు జవాబు.

"'మెలో,' 'ఓవల్టీన్,' 'కూటికూరా'—ఏమిటీ వేషం? ఎక్కడవివన్నీ? ?...." వంటగది పరిసరాల్లో శ్రీపతి కేక. నాలుగు డబ్బాలు తిరగబడ్డ చప్పుడు.

".... అవన్నీ మీరెందుకు తీస్తారు?...." బిరుసైన ప్రశ్న.

"అడిగే దానికి మొదట జవాబు చెప్పు .... ఇవన్నీ ఎక్కణ్ణుంచి వచ్చేయ్?...."

"బాగుంది వరుస .... మీరు తేకపోవడం సరికదా, నమ్మకస్థుల చేత తెప్పించుకోడం కూడా పొరపాటే నన్న మాట .... వాళ్ళ కొంతాన్ని ఈలాగే చూస్తున్నారా?"

"ఏదైనా మాటంటే ఏడవడం తెలుసు .... కొంపతీసి ఆ కొంతం అంటకడుతూందేమిటివన్నీ......."

"ఇంకానయం!.... ఆవిడ కాబట్టి వెనకా ముందూ సర్దు కుంటూంది"

"ఏడిశావ్!.... వాళ్ళ తమ్ముడి కొట్లో పాతసరుకు మరో పావలా యిచ్చి మనింట్లో చేరేస్తున్నావ్"

"మీ రెప్పుడూ కాంతమ్మని చూసి నేర్చుకోమని చెప్తూండేవారు......."

"బాగా నేర్చుకున్నావులే యింకచాలు"

"కాంతమ్మగారు సబ్బులు, మందులు తెప్పించేరట రమ్మంటున్నారు...." అని బంట్రోతు ప్రవేశించేడు.

"తెప్పించేరూ !.... అవి ఏశతాబ్దానివో అడగరావూ. వేగం నడిపించు...." చెయ్యి విసిరేడు శ్రీపతి.

★



నీలి తిమింగిలం ప్రపంచంలో మిక్కిలి పెద్ద జంతువు. దీని పొడుగు 100 అడుగులకు పైగా వుండును. ఇది ఒక సస్తనజాతి జంతువు. చేప మాత్రం కాదు. ఈ పెద్ద జంతువు తరుచుగా ఉత్తర అట్లాంటిక్‌లో ఉండును.

1953 సం॥రానికి 49 దేశాలు 93,000,000 డాలర్లవరకు 'యునైటెడ్ నేషన్సు హ్యూమానిటేరియన్ ప్రోగ్రామ్సు'కు ఖర్చు పెట్టడానికి నిశ్చయించేరు. కాని సోవియట్ బ్లాకు మాత్రము ఈ వినతిని లక్ష్య పెట్టలేదు.

ఐరోపా అడివి పందిని దాని దంతంతోనే చంపవచ్చు. దీని పైదంతం క్రిందదంతంతో రాసుకోవడంవల్ల ఎప్పుడూ అరిగిపోయి వుంటుంది. అడుగు దంతం ఒకవేళ విరిగిపోయినట్లయితే పైదంతం పుర్రిలోనుండి పైకి వచ్చేటంతగా వంకర తిరిగి పెరిగిపోతుంది!

# శాశ్వత క్యాలెండరు

## [ఏ తేదీకైనా వారము దెలుసు కొనుట]

• శ్రీ పోలాకి శ్రీనివాసరావు. •

గణింప వలసిన సంవత్సర సంఖ్య, ఆ సంవత్సరము నాటికి గడచిన లీపు సంవత్సరముల సంఖ్య, ఆ సంవత్సరములో గడచిన దినముల సంఖ్య మొత్తమును జేసి ఏడుచే భాగింపగా మిగిలిన సంఖ్యను 1 ఆదివారము, 2 సోమవారము, 3 మంగళవారము, 4 బుధవారము, 5 గురువారము, 6 శుక్రవారము, 7 శనివారము అని లెక్కింప వలెను.

ఉదాహరణ

1952 సం॥రం మేనెల 23 తేదీ ఏవారము?

గణింప వలసిన సం॥ర సంఖ్య 1952

గడచిన లీపు సం॥రముల సంఖ్య 487

గడచిన దినముల సంఖ్య:

జనవరి – ఫిబ్రవరి – మార్చి – ఏప్రిల్ – మే. } 143

31 + 29 + 31 + 30 + 22

మొత్తము 7) 2582 (368

7చే భాగింపుము. 21

482

42

62

56

శేషము. 6

శేషము 6 గనుక ఆదివారము నుండి లెక్కింపగా శుక్రవార మగుచున్నది.

1954 సం॥రం ఏప్రిల్ నెల 4 తేదీ ఏవారము?

గణింప వలసిన సం॥ర సంఖ్య 1954

గడచిన లీపు సం॥రముల సంఖ్య 488

గడచిన దినముల సంఖ్య:

జనవరి – ఫిబ్రవరి – మార్చి – ఏప్రిల్ } 93

31 + 28 + 31 + 3

మొత్తము 7) 2535 (362

7చే భాగింపుము. 21

435

42

15

14

శేషము. 1

శేషము 1 గనుక ఆదివార మగుచున్నది.

ఇట్లే ఏ సం॥రము, ఏ నెల, ఏ తారీఖునైన లెక్కింప వచ్చును.





మూలం: ద్విజేంద్రలాల్ రాయి. అనువాదం : శ్రీమతి మాణిక్యవల్లి.

(గత సంచిక తరువాయి)

## నాలుగవ రంగం

స్థలం: మేవాడ్ మహాబత్ ఖా డేరా. సమయం: సాయంత్రం.

(డేరా వెలుపలి ప్రదేశం. పర్వతాలకు బంగారు పోత పోస్తున్న అస్తమయ సూర్యుని తిలకిస్తున్న మహాబత్ ఖా)

మహా: సూర్యాస్తమయింది. ఇంక పోదాం.

(గజసింహుడు వస్తాడు)

గజ: ఖా సాహెబ్ !

మ: రండి! రండి!

గ: జయించారుకదా, ఉదయపుర ప్రవేశం చెయ్యాలేదేం?

మ: అది నేరమా?

గ: అబ్బే! వూరికే అడుగుతున్నాను. ఖా సాహెబ్, యీమాటు మేవాడ్ స్త్రీలు కూడ అస్త్రాలు పట్టే రట!— స్త్రీలు!

మ: ఆఁ! నిజమే?

గ: మీతో అబద్ధమాడతానా? ఈ సారి రణరంగం రమణీయంగా వుంటుంది!

మ: సాటి రసపుత్ర స్త్రీలను గురించి ఆవిధంగా మాట్లాడడానికి నోరెలా వచ్చింది? మీరు స్వచ్ఛమైన రసపుత్రులే! కాదు—

గ: ఖా సాహెబ్!—

మ: చాలు చాలు! వెళ్ళండి! మీ శౌర్యం దాచి అట్టే పెట్టుకోండి యెప్పటికైనా అవసరమొస్తుంది.

(గజసింహుడు వెడతాడు)

మ: హుఁ! ఇలాంటి అయోగ్యుల చేతిలో వుంది హిందూ ధర్మ పతాక! ఈ హిందువులు తమ దేశాన్ని వీడిపోవడమే కాదు; మనుష్యత్వాన్ని సైతం విడిచేశారు!

(ఒక సిపాయి వస్తాడు)

మ: ఏమిటి వార్తలు?

సై: షాహజాదా సైనికులతో వచ్చారు ప్రభూ!

మ: వచ్చేశారా? సరే వెళ్ళు. (సిపాయి వెడతాడు)

మ: క్రొత్త సేన అవసరమేముంది? మొగలు సైన్యంతో ఉదయపురంలో చొరబడ్డం యిష్టంలేక మానేశాను కాని సైన్యం లేక కాదు! సరే యిప్పుడాపని షాహజాదా... మొగలుడు... స్వయంగా చేసుకుంటాడు.

(గోవింద సింహుడు వస్తాడు)

మ: తమ రెవరు?

గో: మేవాడ్ సర్దారును!

మ: తమరొచ్చిన పని?

# మేవాడ్ పతనం

గో: చెబుతా, కాస్త వూపిరి తీసుకుని!

మ: మీ రాణా సంధిరాయబార మంపారా?

గో: సంధి కంటె చావు మేలు!

మ: మరి తమరొచ్చిన పని?

గో: ఈ లోకంతో నా కేం పని? నే పోవాలి. వీరస్వర్గం చేరగోవాలి. కయ్యానికీ, వియ్యానికీ సమానులు కావాలి. అందుకోసం నిన్ను వెతుక్కుంటూ వచ్చాను.

మ: (ఆశ్చర్యంతో తనలో తాను) మతి భ్రమణం కాదు కదా!

గో: కాదు! మహబత్, మతిభ్రమణం కాదు! (తీవ్ర స్వరంతో) ద్వంద యుద్ధంలో నిన్ను కడతేర్చడానికొచ్చాను. తెలుసా... హా! ఈశ్వరా! నన్ను నే మరచిపోతున్నాను! ఈ పండు టాకుకి జవసత్వాలెక్కడివి? పరవా లేదు, రా, మహాబత్. నిన్ను చంపలేను. కాని నే చనిపోగల్ను. నీ చేతిమీదుగా పోవాలి రా!

మ: ఏమి, వింత కోరిక!

గో: వింతేముంది? నా జీవితమే సమరం. స్వర్గీయ ప్రతాపసింహుని కొలువులో వుండి అనేక యుద్ధాలు చేశాను. నా కాయంపైగల గాయపు మచ్చలకు అంతులేదు. అంతిమ గాయం నీ కత్తి చెయ్యాలి!

మ: అందువల్ల మీకు కలిగే ప్రయోజనం?

గో: ఏముంది! నువ్వు జన్మచే హిందువుడవు; విశేషించి రాణా ప్రతాపుని సోదర పుత్రుడవు. నీ చేతుల్లో చావడం కాస్త గౌరవ ప్రదం!

మ: తమరు సాలుంబర్ ఠాకూర్ గోవిందసింహజీయా!

గో: ఆఁ! ఆఁ! ఆఁ! గుర్తించావా, మహాబత్ ఖాఁ? ఇప్పుడు తెలిసిందా నా కోరికకి కారణం? ఇదుగో, నువ్వు మేవాడ్‌ను జయించావు; అంతేకాదు ధ్వంసం చేశావు. కాని నిన్ను ఉదయపుర దుర్గంలో అడుగిడనివ్వను. నేను మేవాడ్ చివరి యోధుణ్ణి! నా గొంతులో ఊపిరున్నంత వరకూ రాజధానిని తేరి చూడలేవు, ఆత్మరక్షణ చేసుకో! (కత్తి ఝుళిపిస్తాడు)

మ: కాని, వీరవర్యా! నేనా రాజధానిని ప్రవేశించ దలచలేదు!

గో: నీ యిచ్ఛానిచ్ఛలతో నాకు పనిలేదు! తియ్ అస్త్రం, తియ్!

మ: తొందర—

గో: ఆహాఁ! ఇంకేం చెప్పొద్దు. నా గుండెలు మండిపోతున్నాయి. నా కొడుకూ, కూతురూ, లేని ప్రపంచం నాకక్కర్లేదు. అదీ గాక మేవాడ్ భూమి మొగలుల పాదవళితం కావడం చూసి సహించలేను. నువ్వు జయించి యిచ్చిన నా జన్మభూమిని వాళ్లు మెట్టక ముందే కన్ను మూయ్యాలి. మహాబత్ ఖాఁ! అల్లుడవయ్యా నా కడుపున చిచ్చు బెట్టావు; నా దేశీయుడవయ్యా పరులకు దాసుడ వయ్యావు; మా మతస్థుడవయి పుట్టి ముసల్మాను వయ్యావు; మా రాణాకు సోదరుడవయ్యా వారి శత్రుపక్షం చేరావు. అందుకే నీ చేతిలో చావాలనుంది! రా!

మ: (కత్తిదూసి) శాంతించండి. నేను తమ నెన్నటికీ చంపను.

గో: ఇంక రెండో మాట వినిపించుకోను. ఆత్మరక్షణ చేసుకో.

మ: గోవిందసింహజీ—

గో: ఊఁ! చంపు, నన్ను చంపెయ్—

మ: అబ్బే! నే నస్త్ర విసర్జన చేశాను.

గో: నే నూరుకోవద్దూ! నే నొచ్చిన పని అయి తీరాలి. తియ్! అస్త్రం తియ్!

(మహాబత్ ఖాపైకి పోవడానికి ప్రయత్నిస్తాడు. ఇంతలో గజసింహుడు వెనకగా వచ్చి తుపాకీ పేలుస్తాడు; గోవిందసింహుడు క్రిందపడిపోతాడు)

మ: అయ్యయ్యో! ఎంతపని చేశారు!

గ: చంపేశాను!

మ: వారెవరో తెలుసా?

గ: ఏమో? ఎవరో దొంగ కాబోలు!

గో: నేనేం దొంగను కాదు— మీరే దొంగలు. నేను మీలా ఒకరి దేశం దోచుకోడానికి రాలేదు. మహబత్ ఖా! ఇంక నువ్వు స్వేచ్ఛగా ఉదయపురం ప్రవేశించవచ్చు. వెళ్ళు! సీతల్లిని మొగలుల బానిసగా అప్పగించు! దానితో నీ కర్తవ్యం పూర్తవుతుంది. అజయా!— కల్యాణీ!—

(తెర)

## ఐదవ రంగం

స్థలం: ఉదయపుర దుర్గసమీపపు వీధి. సమయం: రాత్రి. (దుర్గ రక్షకునితో కొందరు నగరవాసులు మాట్లాడుతూ వుంటారు)

మొ. పౌ: ఏమోయ్! యివాళ మహారాజు దుర్గం విడిచి వెళ్ళారేం?

దుర్గ. ర: తెలీదు. కాని మహాబత్ ఖా యింక ముందు మేవాడ్‌కు విరుద్ధంగా కత్తి బట్టనని పాదుషాకు తెలియ జేశాట్ట. అంచేత యుద్ధానికి యువరాజు ఖుర్వ్వ మొచ్చాడు. ఆయన నిన్న మహారాజుకేదో కాయితం పంపాడు. పొద్దున్నే రాణాజీ గుర్రమెక్కి ఖుర్వ్వం డేరావెంపు వెళ్ళారు.

రెం పౌ: తరవాతేమయింది.

దు. ర: అది నాకు తెలియదు.

మూ పౌ: ఇంతవరకూ రాణాజీ రానేలేదా?

దు. ర: లేదు.

నాలు పౌ: వారితో యింకెవరెళ్ళారు?

దు. ర: ఎవరూ వెళ్ళలేదు; రాణాజీ ఒక్కరే వెళ్ళారు.

మొ పౌ: చూడు, ఎవరో వస్తున్నారు.

రెం పౌ: మన రాణాజీ యేమో?

మూ పౌ: అబ్బే! మన రాణాజీలా కనుపించదు.

నాలు పౌ: వేషం రాజ వేషమే. (దుర్గ రక్షకునితో) వారెవరో నీకు తెలుసా?

దు. ర: జోధపుర మహారాజు గజసింహుడు.

మొ పౌ: మహాబత్ ఖాతో యుద్ధానికొచ్చినాయనా?

దు. ర: మరే!

రెం పౌ: ఆయన రాజపుత్రుడే కదూ?

మూ పౌ: అంతేకాదు; రాజపుత్రుల శత్రువు కూడాను.

(గజసింహుడు సమీపిస్తాడు)

గజ: కోట ద్వారం మూసి వుందా?

దు.ర: చిత్తం.

గజ: ఈ కోట మా వశమయింది; తలుపు తెరువు.

దు.ర: మా ప్రభువాజ్ఞ లేనిదే తెరవలేను.

గజ: ఇప్పుడు మీ ప్రభువు అమరసింహుడు కాదోయ్, మేము!

దు.ర: అలాగా? నాకు తెలియదు లెండి! ఏమైనా రాణా అమరసింహాజీ ఆజ్ఞ లేనిదే కోట తలుపులు తియ్యలేను.

గజ: (తన సైనికులతో) కోట తాళాలు లాక్కోండి.

దు.ర: నే బతికుండగా ఆపని చెయ్యలేరు (ఒర నుండి కత్తి తీస్తాడు)

గజ: సరే! వీణ్ణి చంపండి.

మొ. పౌ. (రెండవ పౌరునితో) ఊరికే చూస్తావేం? ఊం! (పౌరులంతా గజసింహుని చుట్టుముడతారు. గజసింహుడు తన సైనికుల్ని పిలుస్తాడు. వాళ్ళు వచ్చి పౌరుల్ని చుట్టుముడుతుండగా పెక్కురు మొగలు సైనికులతో అమరసింహుడు వస్తాడు.)

రాణా: (సైనికులతో) ఆగండి! (మొగలు సైనికుల్ని చూసి రాజపుత్ర సైనికులు ఆగిపోతారు)

రా: (గజసింహునితో) తమ కిక్కడేం పని?

గ: మేమూ కోటలో ప్రవేశించాలి.

రా: ఓహో! రాజ అతిథియా! మంచిది యథోచితంగా సత్కరిస్తాను! మొగలాయీల జాగిలమా! ఇదే నీకు తగిన సత్కారం!

(ఒక్క దెబ్బతో గజసింహుణ్ణి నేలపై పడగొడతాడు)

రా: శూరా, దుర్గ ద్వారం తెరువు. (ద్వారం తెరిచిన మీదట మొగలు సైనికులతో) యింక మీరు వెళ్ళవచ్చు. (రాణా దుర్గంలో ప్రవేశించగా దుర్గ ద్వారం మూసుకొంటుంది)

(సశేషం)

# తెలుగువారి తొలి ఉగాది

శ్రీ కాశీభొట్ల సూర్యనారాయణశాస్త్రి

మేలుకో ఓ ఆంధ్రనారీ !
ఆలకింపుము ఆంధ్రభేరీ !!

దేవలోకములోని దేవులందఱు గూడి
దీవెనలు పలికిరీ కోటిగొంతులతోడ
కప్పురపు వీధిలో గుప్పించె పువ్వాన
రప్పించె రాష్ట్రమ్ము రామరాజ్యమువోలె ॥మేలు॥

తలచుకొమ్మా పూర్వశౌర్యం !
నిలుపవమ్మా ఆంధ్ర ధైర్యం !!

ఝాన్సిలక్ష్మిభాయి, మల్లమ్మ, రుద్రమ్మ
కన్నెఱుపు జాడల్లొ కదులు మోయమ్మ
చూపుమా ధీశక్తి - తెల్పుమా నిజభక్తి
తెప్పించు ఘనకీర్తి దేశమంతటలోన ॥మేలు॥

సమరమన్నది చాలతప్పు
అమరజీవుల నాత్మనిల్పు

సాటియౌ శ్రీరాముల్లోపై పోవుచే
గీటురాయిగ యెంచి దీటుగా పనిచేయి
యేటికాకన్నీరు - చాటు నీతెలివెల్ల
మేటియనిపించుకో మాతృభూమిలోన ॥మేలు॥

భావిసాధన లెంచిచూడూ !
సేవలందును చిత్తముంచూ !!

కంటికి రెప్పవై కాచు నీ దేశాన్ని
యింటిలో సోదరని యెంచు పరకాంతనీ
సఖ్యమందఱుగూడి - ముఖ్యమౌ పరసేవ
సౌఖ్యమొనగూర్చు మా సాటి మహిళలతోడ ॥మేలు॥

విజయ మొందెను ఆంధ్రరాజ్యం !
ఈ జయవర్షమే తొలి ఉగాది !!

ఉగాది మారుతం ఉల్లాసముగ వీచె
మేఘాల నిర్మలం త్యాగమై కన్పించె
చూడుమా గగనము - పాడుమా గీతికా
తోడుగా రానిమ్ము తోటివనితలగూడ ॥మేలు॥



# తెలుగుతల్లి

శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు

అనుఁగు చెల్లెల !— పసిఁడి గద్దియ
నలరు చున్నది — అమ్మ యదిగో !
వినయమొప్పఁగఁ జేరజని దీ
వెనల - నందుమురా !

పిలుచు చున్నది చెల్లెలా ! నీ
లలిత విజ్ఞానంబు గొప్పది
విలువఁ జేరిచి తెలుగు తల్లిని
నిలుపు కొనుమమ్మా !

తెలుఁగు శీలము నేడు నీలో
నిలచియున్నది నిక్కమమ్ముగ
తెలుగు లక్ష్మిని చక్కదనములఁ
దీర్చి దిద్దుమురా !

నీవు లేనిది తెలుగు తల్లికి
జీవమే లేదంచు చాటిరి
పావనాత్ములు - సోదరీ ! నీ
భాగ్యమయ్యెదిరా !

తెలుఁగు వెలుఁగుల నెల్లకాలము
నిలుపఁజాలిన తెలివి తేటల
గలవు నీలో — ఆంధ్ర లక్ష్మికి
బలముఁ గూర్చుమురా !

హారతుల నిడుమమ్మ మన బం
గారు తల్లికి సుగుణ వల్లికి
కోరికలు నెరవేరు కాలము
కూడి వచ్చినది !



# బాలానందం

## పేరాశ

• శ్రీ పిశ్కా సుబ్బారావ్ శాస్త్రి •

కాపవరంలో కామయ్య అనే ఒక కాపు వుండేవాడు. కామయ్య పెద్దమ్మ ముద్దు బిడ్డలలో ఒకడు. ఎన్ని వూళ్లు తిరిగినా, ఎందరికాళ్లు పట్టుకున్నా వుద్యోగం దొరకలేదు కామయ్యకు పాపం!

కామయ్య చివరికి విసిగి దేశాటనం చేయాలనుకున్నాడు. సరే బయలుదేరాడు. పెళ్లామా, పిల్లలా! ఎవరూ లేరు. తనపొట్ట పోషించుకుందికే కష్టంగా వున్నప్పుడు పెళ్లెలా చేసుకుంటాడు!

కొన్నాళ్లలా తిరిగి తిరిగి ఒక అడవి చేరుకున్నాడు. అది మండు వేసంగి కాబట్టి ఎక్కడా నీళ్ళు కనపడలేదు. నీళ్ళకోసం వెతుకుతూ వుండగా, ఒక సిద్ధుడు కనపడ్డాడు. కామయ్య సిద్ధుణ్ణిచూసి, గబగబా పోయి అతనికి ఎంతో భక్తితో నమస్కరించేడు.

ఆ సిద్ధుడు కామయ్యను దీవించి "నాయనా! నీ కేవిఁటి కావాలి?" అని అడిగాడు.

"మహాత్మా! నేను గర్భదరిద్రుణ్ణి. నాకు ధనం కలిగే మార్గం చూపించండి!" అని అన్నాడు వినయంగా కామయ్య.

"నాయనా! ఇదిగో యీ దండాన్ని తీసుకో! ఇది పట్టుకొని యిలాపో! ఇది ఎక్కడపడితే అక్కడ త్రవ్వి చూడు!" అంటూ దీవించి పంపేడు సిద్ధుడు.

కామయ్య దండాన్ని తీసుకు బయలుదేరాడు. అలా పోగా ఆదండం ఒకచోట చేయిజారి కిందపడింది. కామయ్య అక్కడ తవ్విచూశాడు. రాగి కనిపించింది. ఇంకాముం దుకుపోతే యేముంటుందో అని కామయ్య అనుకున్నాడు.

తిరిగి బయలుదేరాడు. కొంతదూరం పోయిన తర్వాత మళ్లీ దండం చేయిజారి క్రిందపడింది. కామయ్య ఆత్రుతగా అక్కడ తవ్వి చూశాడు. కళ్ళు జిగేలుమన్నాయి. వెండి మయం!! కామయ్య యింకా ముందుకు పోవాలను కున్నాడు.

కామయ్య దండం తిరిగి మరొకచోట పడింది. ఏవిట్రా అనుకుంటూ తవ్విచూశాడు. యింకేముంది? బంగారం!!! కామయ్యకు యీసారయినా సంతృప్తి కలుగలేదు. "మొదట రాగి, తర్వాత యేమో వెండి, యిప్పుడు బంగారం, యింకా ముందుకు పోతే మణులూ, రత్నాలు" అంటూ లొట్టలు వేయసాగాడు.

కామయ్య పేరాశతో బయలుదేరాడు ముందుకు.

కామయ్య అనుకున్నట్లు ఒక చోట తిరిగి చేతికర్ర జారి పడింది. అక్కడ తవ్వడం ప్రారంభించేడు. ఎంత తవ్వినా యేదీ కనిపించలేదు!! కాకపోగా, ఆ స్థలం అంతా కంపించ సాగింది!!!— కొంతసేపటికి భూమి బ్రద్దలయిపోయింది! అంతే కామయ్య పాతాళంలోకి పోయాడు!— పెద్ద పెద్ద కొండలకే లేదు దిక్కు! కామయ్య ఒకలెఖ్ఖా! తిరిగి అంతా సమానమయి పోయింది. మట్టిలో కలిసిపొయ్యాడు కామయ్య.

చూశారా! బాలలూ! పేరాశపరుడయిన కామయ్య గతి ఏమయిందో! అందుకే మన పెద్దలు 'పేరాశ' కూడ దంటారు!

---

# తొంభై తొమ్మిది చేసిన పని

• శ్రీ తెంజర్ల శివరామశాస్త్రి •

రామశాస్త్రిగారు మా ఊళ్ళోకల్లా ఇంగ్లీషులో గొప్ప పాండిత్యము సంపాదించిన వారు. ఊళ్ళో అందరూ ఆయనను "ఇంగ్లీషు పండిట్" అని పిలుస్తూ ఉంటారు. ఆయన మా స్కూలులో నాలుగేళ్ళనుంచి ఇంగ్లీషు మాష్టరుగ పని చేస్తున్నారు. రామారావు, ఆయన గారి ఏకైక పుత్రుడు. 5వ. ఫారం చదువుతున్నాడు. "పండిత పుత్రః శుంఠః;" అన్నట్లు రామారావు చదువులో ఉత్త శుంఠ. ఇతర విషయములలో ఉన్న తెలివి తేటలు చదువులో లేవు. అంతెందుకూ, ప్రతి తరగతిలోనూ మూడు, నాలుగుమార్లు దండయాత్ర కొట్టనిదే పైతరగతి లోకి వచ్చే వాడుకాడు. తల్లి తండ్రులంటే అసలు భయమే లేదు. అందులో రామశాస్త్రిగారు కొద్దిగ ముద్దు చేస్తూ ఉంటారేమో, నెత్తిమీదెక్కి కూర్చునేవాడు. అప్పుడప్పుడు ఇంట్లో చిన్న చిన్న దొంగతనాలు చేసి స్నేహితులను సినీమాలకూ, టీపార్టీలకూ తీసుకువెళ్ళేవాడు. "ఇంటి దొంగను ఈశ్వరుడైనా పట్టలే''డన్నట్లు రామారావు దొంగ తనాలు తల్లి తండ్రులు కనుక్కొనలేక పాపము ఇంట్లో దాసీమనిషినే కేకలువేసేవారు. ఇంక బళ్ళో మాష్టర్లను ఏడిపించడం రామారావుకు ఉగ్గుతో పెట్టిన విద్యయే. వంకాయనీ, బీరకాయనీ, కొమ్ముచెంబనీ వాళ్ళకు పేర్లు పెట్టేవాడు.

రామశాస్త్రిగారికిష్టము లేకపోయినప్పటికీ పాపము వీళ్ళనీ, వాళ్ళనీ ఆశ్రయించి, మార్కులు వేయించి కొడుకును 5 వ. ఫారం ప్యాసు చేయించారు. 5 వ. ఫారం మొదటిసారిలోనే ప్యాసు అయినందు వల్ల తాను ప్రధాన మంత్రి నెహ్రూగారికంటే గొప్పవాడయినట్లు గర్వించుతూ ఉండేవాడు. రామశాస్త్రిగారికి ఆ ఊళ్ళో మంచిపలుకు బడి వుండుట వల్ల కొడుకును 5 వ. ఫారం వరకు ప్యాసు చేయించారు. ఇంక ఆపైన ఎవరు ప్యాసు చేయించ గలరు ? అవి గవర్నమెంటు పరీక్షలాయె. అందుకని రామశాస్త్రిగారు రామారావుకు ఇంగ్లీషులో తాను ప్రైవేటు చెబుతూ, ఇంకా రెండు మూడు సబ్జక్టులలో ప్రైవేటు చెప్పించారు. కాని రామారావు ఏనాడూ ప్రైవేటుకు సరిగ్గా వెళ్ళేవాడుకాడు. చెట్లక్రింద, పార్కులోను, కూర్చుని ఇంటికి వెళ్ళేవాడు. స్కూలుఫైనలు పరీక్షలు దగ్గరకు వచ్చాయి. రామశాస్త్రిగారు కొడుకును చదివించి పరీక్షకు పంపినారు. శలవులలో జల్సాగా తిరిగాడు రామారావు. మరునాడు పరీక్షా ఫలితాలు ప్రకటించేరోజు. రామారావు పేపరు దొరక్కపోతుందేమోనని, ఆనాటి రాత్రే వెళ్ళి ప్లాటుఫారం మీద పడుకొన్నాడు. తెల్లవారింది. మైలు పెద్దచప్పుడు చేసుకొంటూ ప్లాటుఫారంమీదకువచ్చిఆగింది. విద్యార్థులు రైలు పెట్టెలన్నిటినీ చుట్టుముట్టేసారు. రామారావు జనంలోకి త్రోసుకొంటూ వెళ్ళి, పెద్ద ఘన కార్యము చేసినవాడిలాగ 0-2-0 పెట్టి పేపరు కొన్నాడు. ఆత్రంతో, ముఖము చాటంత చేసుకొని తన నంబరు కొరకు వెతికాడు. పాపము ఎంత వెతికినా అతని నంబరు కనపడలేదు. నంబరు కనపడకపోతే దాని అర్థము తెలుసుగా : కోపముతో పళ్ళు పటపట కొరుకుతూ పేపరు చించి చించి ముక్కలు చేశాడు, ప్రక్కవారు అడుగుతా రేమోనని. రామశాస్త్రిగారికి కొడుకు ఫలితము ఎప్పుడో తెలిసిపోయింది. రామారావు 20 లంఖణాలు చేసినవాడికి మల్లే అడుగులో అడుగు వేసుకొంటూ ఇంట్లో ప్రవేశించాడు. రామశాస్త్రిగారు అవమానము భరించలేక కొడుకును చావకొట్టారు. ఆయనకు నలుగురిలో తిరిగే ఆస్కారము లేకపోయింది. కొడుక్కు చదువు మాన్పించి ఎక్కడన్నా ఉద్యోగములో చేర్పిద్దామనుకొన్నారు రామశాస్త్రిగారు. కాని ఆయన భార్య ఊరుకొంటేగా : ఇంక ఒకటే పోరు మొదలుపెట్టింది. "ఈ రోజుల్లో బి.ఎ., ఎమ్.ఎ., డిగ్రీలు పొందినవాళ్ళే ఉద్యోగము దొరక్క ఛస్తుంటే, యింక వీడి సంగతేమి"టని. అందుకని రామారావును మళ్ళీ అక్టోబరు పరీక్షలో కూర్చునేందుకు దరఖాస్తు పెట్టించారు. ఇంగ్లీషు రామశాస్త్రిగారు చెపుతూ వచ్చారు. తెలుగు, సైన్సు, లెక్కలు, సోషల్ స్టడీస్ మొదలగు వాటన్నిటిలో పెద్ద పెద్ద డిగ్రీలు సంపాదించిన వారి వద్ద ప్రైవేటు చెప్పించారు, రామారావు ప్రైవేట్లకు సరిగ్గా వెళుతూనేవచ్చాడు. కాని మనస్సు చదువుమీద వుంటేగా : గోడమీద అంటించిన సినిమా స్టార్లమీద, ఇంట్లో చేసే వంటమీద మనసు వెళుతూండేది. రెండు నెలలలో అతని నంబరు పంపించారు గవర్నమెంటువారు. అతని నంబరు తొంభై తొమ్మిది

# తొంభై తొమ్మిది చేసిన పని

(99). పరీక్షలు దగ్గరకు వచ్చాయి. రామశాస్త్రిగారు సామ, దాన, భేద, దండోపాయములనుపయోగించి రామారావును పరీక్షకు పంపారు. అన్ని సబ్జక్టులలో ప్రైవేటు చెప్పించినా ఇంగ్లీషు, సైన్సు పరీక్షలు బాగా వ్రాయలేదు. రామశాస్త్రిగారు "బాగా వ్రాసేవురా?" అని ప్రశ్నించితే "బాగా వ్రాశా"నని బొంకాడు. తక్కిన పరీక్షలన్నీ సలక్షణముగ వ్రాసివచ్చాడు. శలవులలో అత్తయ్యగారింటికి వెళ్ళటానికి క్యాంపు వేసాడు. కాని రామశాస్త్రిగారు ఫలితములు వచ్చిన తరువాత వెళ్ళమన్నారు. చంద్రబింబమువలె ఉన్న మొహము కాస్తా మాడిపోయిన కాకరకాయకు మల్లే అయిపోయింది రామారావుకు. మళ్ళీ శనిఘాతములాగ పరీక్షాఫలితాలు ప్రకటించే రోజువచ్చింది. ఎవరికెంత కోపమొస్తేమటుకు పరీక్షాఫలితాలు ప్రకటింపబడుట ఆగుతాయా? మరునాడే మెయిలులో పేపర్లు వచ్చాయి. రామారావు మళ్ళీ జనములోకి కుస్తీ పట్టుకుంటూ వెళ్ళి పేపరుకోసము ప్రయత్నించాడు. కాని పేపర్లు అప్పటికే అయిపోయినవి. ప్రక్కనే పరీక్ష తప్పిన ఒక విద్యార్థి తన పేపరును 0-4-0 లకు అమ్ముతానని అరుస్తున్నాడు. రామారావు బ్లాకుమార్కెటు పేపరు కొని తన నంబరు "తొంభై తొమ్మిది" కొరకు వెతికాడు. ఆనందము! ఆశ్చర్యము! అతని నంబరు సువర్ణాక్షరములవలె ప్రకటింపబడియున్నది. ఇంక చూసుకొండీ! ఆ యింటిల్లిపాది ఆశ్చర్యము! ముఖ్యముగా రామారావు తనకు ప్రైవేట్లు చెప్పిన మాష్టర్లనే మర్చిపోయాడు ఆ ఆనందంలో. రామశాస్త్రిగారు మరునాడు ఊళ్ళో పెద్దలందరినీ టీపార్టీకి రమ్మని ఆహ్వానాలు పంపారు. రామారావుకు సరికొత్త "ట్వీడు - సూట్" కుట్టించారు.

మరునాడు టీపార్టీ పెద్ద బ్రహ్మాండంగా జరిగింది. పిల్చిన పెద్దలే కాకుండా, పిలవని చిన్నలుకూడా వచ్చారు టీ పార్టీకి. రామశాస్త్రిగారికి టీ పార్టీ వల్ల దాదాపు 250 రూపాయలు వదిలాయి. వదిలేత్తే ఏమిలెండి! ఆయన కొడుకు ఒకమారు తప్పి ప్యాసయినాడు! అతని జీవితములో రెండు మూడు మార్లు ఫైయిల్ కాకుండా ఎన్నడూ ప్యాసు కాలేదు. ఇపుడు పరమానందభరితము! తండ్రిగారికి. డబ్బు వదిలినా ఆయనేమీ అనుకోలేదు.

మరునాడు రామారావు క్రొత్త "లెనిన్ సూటు" తొడుక్కొని, అద్దం ముందు మేకప్ చేసుకుంటున్నాడు. అత్తయ్యగారింటికి ప్రయాణమయ్యాడు కూడాను! ఇంతలో వాకిట్లోంచి "టెలిగ్రాం సార్" అంటూ టెలిగ్రాం బంట్రోతు అరిచాడు. రామశాస్త్రిగారు ఆత్రంతో సంతకం పెట్టి టెలిగ్రాం తీసుకుని చదివారు. దాంట్లో ఇట్లా ఉంది. "నిన్నటి పరీక్షా ఫలితముల పత్రికలో 89 వ నంబరు (ఎనభై తొమ్మిది). ప్రకటించబోయి పొరబాటున 99 నంబరు (తొంభై తొమ్మిది) ప్రకటింపబడింది. తొంభై తొమ్మిదవ నంబరు విద్యార్ధి ప్యాసు కాలేదు" మరునాడు అన్ని వార్తా పత్రికలలో గూడ పైవిధముగానే వ్రాయబడియున్నది. రామశాస్త్రిగారికి నోటంట మాటరాలేదు. కొడుకు రామారావును పిలిచి టెలిగ్రాం చదువుకోమన్నారు. రామారావు చదువుతూండగా అప్రయత్నంగా టెలిగ్రాం చేతిలోంచి జారి క్రింద పడిపోయింది. రెండు కన్నీటి బిందువులు బొట బొట దాని మీద పడ్డాయి. రామశాస్త్రిగారి నోటినుంచి "ప్చ్....ప్చ్.... తొంభై తొమ్మిది ఎంత పని చేసింది! 250 రూపాయలు టీ పార్టీ క్రింద వదిలినాయే.... విధి దక్కినా ఫలం దక్కలేదు" అను మాటలు అప్రయత్నంగా వెలువడ్డాయి.



# జీవితం

శ్రీ కోనకిశోర్

జీవితమే ఒక ఆనందం
జీవితమే ఒక వైభోగం
నాలో నున్న నైరాశ్యం
నాలో నున్న అమాయకం
నాలో నున్న అంధకారం
జీవిత జ్యోతిలో మసిచేస్తాం ॥జీ॥

ధనము ఆశ కోరికలన్నీ
హేయమంచును నీటగల్పి

నీతి నియమం శాంతహింసలు
మధురమైన జీవితజ్యోతితో
వెలుగు బాటల పయనం చేసి
దివ్య క్షేత్రములు దర్శిస్తూ

నవ్యభూమిని చేరేద్దాం
దివ్య జ్యోతిని వెలిగిద్దాం
జీవితమే ఒక ఆనందం
జీవితమే ఒక వైభోగం।

# మాటకి మాట

* కుమారి కామేశ్వరి. *

పూర్వం 'అడిందె సూరకవి' అనే గొప్ప పండితు డుండేవాడు. ఆయన మంచి బాగా కవిత్వం చెప్పేవాడు. ఒకనాడు ఆయన ఒక తాటాకు గ్రంథాన్ని చంకలో పెట్టుకొని ఎక్కడికో వెడుతున్నాడు. త్రోవలో ఒక రాజు సూరకవికి ఎదురై "శాస్త్రులుగారూ! ఈవేళ వారం, తిథి, నక్షత్రం మొదలైనవి చెప్పండి" అని అడిగేడు. అప్పుడు సూరకవి "రాజా! తిథి, నక్షత్రాలు చెప్పటానికి యాయవారం బ్రాహ్మణ్ణి కాదు. పెద్ద పెద్ద పండితులు, కవులు నిర్ఘాంతపోయేటట్లు కవిత్వం చెప్పగల సూర కవిని" అని బదులు చెప్పేడు. అందుకారాజు నవ్వుతూ "కవిగారూ! మీరు పెద్ద కవినని చెప్పేరు. వారం, వర్జ్యం చెప్పడం చేతకాదుకదా. ఇంకెందుకు మీ పాండిత్యం" అంటూ హేళన చేసేడు. సూరకవి మన సులో యేదో తల్చుకొని మౌనంగా వెళ్ళిపోయేడు.

ఒకరోజు సూరకవి యథాప్రకారం వెడుతుంటే ఇది వరకు హేళన చేసినరాజు ఒక పెద్ద కత్తి పట్టుకుని, గబ గబ నడిచి వెళ్ళిపోతూ సూరకవికి ఎదురయాడు. సూరకవి ఆరాజుని దగ్గరగా పిల్చి "రాజా! ఈవేళ మా మంగలి రాలేదు. అందుచేత నీ కత్తితో కాస్త క్షవరం చేసిపెడతావా?" అని అడిగేసరికి ఆ రాజు తాడిపొడుగున ఎగుర్తూ "ఏమయ్యా! నీకేమయినా బుద్ధి, జ్ఞానం వున్నాయా? నేను మంగలిననుకున్నావా నీకు క్షవరం చేయటానికి" అని కోపంతో మండిపడ్డాడు. అందుకు సూరకవి నవ్వుతూ "రాజా! చేతిలో అంత పెద్ద కత్తి వున్నదికదా! ఆమాత్రం క్షవరం చేయలేవా? అయితే అంత కత్తి ఎందుకు?" అని ఎగతాళి చేసేసరికి ఆ రాజు తేలు కుట్టిన దొంగలాగయి కవిని క్షమాపణ కోరుకున్నాడు.

# వీరబల్ వినోదాలు

శ్రీ ఎ. ఆర్. కె. బి. ఆనందరావు.

ఒకసారి అక్బరు చక్రవర్తి తన దర్బారులోని ఉద్యో గులతో ఇంతవరకు కనీ, వినీ, ఎరుగ నటువంటి ఒక వార్త ను కల్పించిన వారికి ఒక బంగారు నాణాన్ని బహు మతిగా ఇస్తానని ప్రకటించాడు.

చక్రవర్తి నోటినుండి ఆమాటలు వెలువడ్డవో లేవో, వెంటనే, వీరబల్ లేచి "చక్రవర్తిగారు 'క్షమిస్తాను' అని అభయమిస్తే నేనే ఆ వార్తను కల్పించి చెప్తాను" అని చక్రవర్తిగారి హామీని కోరుకున్నాడు.

అక్బరు వెంటనే అభయమిస్తూ ఆ వార్తను తెల్పమనే సరికి, వీరబల్

"అయ్యా నేనొకసారి దేశ దేశాలు పర్యటన చేయు చున్నప్పుడు ఒక రాజ్యాన్ని చూచుట తటస్థించింది. ఆ రాజ్యాన్ని పాలించే రాజు వట్టి మూర్ఖుడు -ప్రజలపై అనేక పన్నులు విధించుచూ వారిని బాధించెడి వాడు. అందుచే ఆ దేశంలోని ప్రజలు ఇతరదేశాలకు వలస పోయారు. ఇప్పుడారాజ్యం జనసంచారం లేకుండా ఒక శ్మశాన వాటికగా మారిపోయింది. అయినప్పటికిని ఆ మూర్ఖపు రాజు తన పట్టు వదలలేదు" అంటూ వీరబల్ తన వార్తను అంతం చేశాడు.

వెంటనే అక్బరు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

"ఇంతకీ ఎవరు ఆ మూర్ఖపురాజు ........! " అని ప్రశ్నించాడు.

వీరబల్ తడుము కోకుండా "మీరే" నంటూ నిస్సం యంగా సమాధానం చెప్పేసరికి,

"ఆ .... నేనా ...." అని విభ్రాంతుడై అకబ్బ చక్రవర్తి కోపంతో వీరబల్ పై ఖడ్గం ఎత్తేసరికి, వీరబల్ అదంతా కల్పనేనని, అభయం సంగతి గుర్తు చేసేసరికి, అక్బరు కోపం అంతా ఒక నిముషంలో మంచుగడ్డ వలె కరిగి పోయింది. వీరబల్ బంగారు నాణాన్ని బహుమతి పొందాడు.

# కరుణ

"శ్రీ ఈరంకి"

సుబ్రహ్మణ్యంగారు సామాన్య కుటుంబీకుడు. దగ్గర దగ్గరగా పదెకరాల భూవసతి, నాలుగైదువేల రూపాయల రొఖ్ఖం ఉంది. ఇంక భార్య రెండు మూడు సంవత్సరాలకు పోతుందనగా కొత్త యిల్లు కట్టించేరు. ఇంట్లో ఒక్క బెడద తప్పితే మరేం లేదు. వద్దు వద్దంటే ఆయన భార్య పట్టుపట్టి తన తమ్ముడు ఉబ్బసపు వ్యాధితో బాధపడేవానికి, అతని వాటాకు వచ్చే ఆరెకరాల భూమికోసం ఆశపడి 10 సంవత్సరాల తన కూతురునిచ్చి పెళ్ళిచేసింది. పెళ్ళయి ఆరు మాసాలేనా కాకుండా ఆపిల్ల వైధవ్యం అనుభవించ వలసివచ్చింది. సుబ్రహ్మణ్యంగారికి ముగ్గురు ఆడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు. పెద్ద ఆడపిల్లలు ఇద్దరూ కాపరానికి వెళ్ళారు. మూడో పిల్ల కమలకి వైధవ్యం సంభవించింది. మిగతా కుర్రాళ్ళిద్దరూ చిన్న పిల్లలు. ఆ ఊళ్ళో ఉన్న బోర్డు స్కూల్లో చదువుకుంటున్నారు. ఇంట్లో పెద్దదిక్కు సుబ్రహ్మణ్యంగారి అక్కగారు వెంకమ్మగారు మాత్రమే.

వెంకమ్మగారు తమ్ముణ్ణి ఇంకో పెళ్ళి చేసుకోమని బలవంతం చేయడం మొదలు పెట్టింది. తనకి చేసుకుందామనే ఆశఉన్నా 'పిల్లనిచ్చే పెద్ద ఎవరా!' అనే సందేహం కొద్దీ అంతగా పట్టించుకునేవారు కారు సుబ్రహ్మణ్యంగారు. ఈ పరిస్థితిలో తికమక లాడుతున్న సుబ్రహ్మణ్యంగారికి కూతురు కమలయొక్క భావిజీవితపు సమస్య బోధపడక బాధపడుతున్నారు. హిందూ ధర్మశాస్త్రరీత్యా ఆలోచిస్తే కమలకి సంఘం బోధచేసేది, చప్పిడిపిండి, వీభూదిబుట్ట, దూది పింజి, గోవిందనామాలు. కమల యుక్తవయస్కురాలు. మానవులకు ఉండవలసిన కోర్కెలు ఆమెకుకూడ ఉంటాయనిగాని, ఆమెకూడ సర్వసౌఖ్యముల ననుభవించేటందుకు హక్కు కలదనిగాని ఏ సంఘం కూడ అంగీకరించనప్పుడు, కరుడు కట్టుకుపోయిన మూర్ఖుల సంఘంలో ఒకరయిన సుబ్రహ్మణ్యంగారికి మాత్రం ఏం ఆలోచన తట్టుతుంది!

ఈ విధంగా ఉండగా ఆ వూరి కరణంగారు ఒకసారి ఎవరో పెళ్ళి పెద్దని తీసుకువచ్చి సుబ్రహ్మణ్యంగారికి చూపించి, వారి వారి సాంప్రదాయాల్ని విమర్శించి, బహుబీద కుటుంబీకుడగుటచేత, సంసార భారం ఎక్కువగుట వల్ల పిల్లలికి పెండ్లిండ్లు చేయలేకుండా ఉన్నాడనే భావం వెలిబుచ్చేటట్లు చిన్న ఉపోద్ఘాతం ఒకటి చెప్పి, పిల్లని మన యింటికి తీసుకొనివచ్చి, మనమే ఖర్చులు భరించి పెళ్ళి చేసుకోవాలని సుబ్రహ్మణ్యంగారికి నచ్చచెప్పి, మొత్తానికేదో విధంగా పెండ్లి ఖాయపరచేడు. భార్యా వియోగం వల్ల చాలా రోజుల నుంచి బాధపడుతున్న సుబ్రహ్మణ్యంగారికి కాస్త పెళ్ళి, పిల్ల కబుర్లు చెప్పడంతోనే ఒళ్ళు పులకరించింది. మళ్ళీ నూతన వధూ సంగమం గుర్తుకొచ్చింది. ఆ మర్నాటినుంచి కాస్త తలకి రంగు రాయడం, మీసాలకి రంగేయడం, సిల్కు లాల్చీలు, జరీ ఖండువాలలోకి దిగింది ఆయన వ్యవహారం. మొత్తానికి వివాహం ఖాయపరచి వివాహం చేసేరు. సుబ్రహ్మణ్యంగారి రెండవ భార్య కాపరానికొచ్చింది. రోజులు గడుస్తున్నాయి. సుబ్రహ్మణ్యంగారి యింట్లో నెమ్మదిగా అగ్గి రగులుతోంది. కారణాలు మరేం లేవు. పిల్లలు సావిత్రమ్మగార్ని, (సుబ్రహ్మణ్యంగారిభార్యని) 'పిన్నీ' అని నోటారాపిలవటం లేదని, ముసలి వెంకమ్మగారు మడి కుదరక ఏ సరుకులు ముట్టుకోనివ్వటం లేదని, బాల వితంతువైన కమల వాళ్ళ మేనత్త వెంకమ్మగారి మాటలు చెవిని పెడుతుందికాని తనమాటలు ఈషన్మాత్రం వినిపించుకోటం లేదనీను. ఇంటి గుట్టుమాత్రం బయటికి రావడంలేదు. ఈవిధంగా గడుస్తున్నాయి రోజులు.

ఒకనాడు సుబ్రహ్మణ్యంగారి ఓవేలు విడిచిన చెల్లెలిగారి అబ్బాయి మాధవరావు వాళ్ళ మామయ్యని, పిల్లల్ని చూచేటందుకు, చిన్నతనంలో ఆరోపేట చూచిన కమల ఏం చేస్తూందో ఊహించుకొంటూ దారిలో కనిపించిన రకరకాల పువ్వులు, దవనం, మరువం మొదలయిన వన్నీ పట్టుకొని ప్రొద్దుట తొమ్మది గంటల బండిలో దిగేడు. మాధరావుకు తండ్రి చిన్నతనంలోనే పోవడంచేత వాళ్ళ తల్లి చిన్నమ్మగారు అన్నగారిఊళ్ళో హైస్కూలు ఉందనే కాపరం పెట్టి చదువు చెప్పించింది, కొడుక్కి. ఏదో

ఆస్తి దగ్గరదగ్గరగా పాతిక 30 ఎకరాలవరకూ ఉండడం వల్ల చిన్నమ్మగారు కొడుక్కి మద్రాసులో చదువు చెప్పిస్తోంది. సుబ్రహ్మణ్యంగారు రెండవ వివాహం చేసుకున్నారని చిన్నమ్మగార్కి కూడ తెలుసు. కాని పెళ్ళికి హాజరు కాలేదు. కమలకు తల్లి వల్ల జరిగిన మోసం కూడ వారికితెలుసు. ఇప్పుడు మాధవరావుకు ఇరవై మూడు సంవత్సరాల వయస్సు. బి.ఏ. రెండో సంవత్సరం పరీక్షలు అయాక సెలవలకి వాళ్ళ మామయ్యని, కమలని, పిలల్ని చూచేటందుకు సుబ్రహ్మణ్యంగారింటికివచ్చేడు. మాధవరావు వచ్చేసరికి సుబ్రహ్మణ్యంగారు ఇంట్లో లేరు. పొరుగూరు ఏదో వ్యాపకంమీద వెళ్ళారు. మాధవరావును చూచి సుబ్రహ్మణ్యంగారి భార్య ఈక్రొత్త కుర్రాడు ఎవరా అనుకొంది. వెంకమ్మగారి మాటలధోరణి, "బావ! బావ!" అనుకుంటూ పిల్లలు మీదపడడం, అక్కడే ఓరగా నిల్చుని వారు చెప్పుకుంటూన్న మాటలు వింటూన్న కమలని, చూస్తే వాళ్ళచుట్టమే అని భావించింది. కాస్సేపు పిచ్చాపాటి అయిన తరువాత వెంకమ్మగారు వంటహడావిడిలో లోపలికి వెళ్ళింది. పిల్లలు మాధవరావు తీసుకువచ్చిన బిస్కట్లు, పిప్పరమెంట్లు తీసుకొని వీధులో ఆడుకుందుకు పోయారు. మాధవరావు నడవలో కుర్చీలో కూర్చుని "కమలా!" అని కేకవేసేడు. ఆగోడ ప్రక్కనున్న కమల గుమ్మంలోకి వచ్చి బావకేసి చూసి బుర్రవంచింది. "నాన్నేడీ?" అని అడిగేడు. "ప్రక్క ఊరికి వెళ్ళేడు" అని సమాధానం చెప్పింది. ఇప్పుడు ఇదివరకటి కమల కాదు. తను చిన్నతనంలో చూసినప్పుడు బావతో ఎక్కువ పరిచయంగా ఉండేది. ఇప్పుడు ఏమోగాని క్రొత్తమనిషిని చూసినట్లు చూస్తోంది. "మీ పిన్నిగారేరీ?" అని మళ్ళీ ప్రశ్నించేడు. "దొడ్లో నీళ్ళోసుకొంటోంది" అని సమాధానమిచ్చింది. కాస్త ధైర్యం వచ్చి కుర్చీలోంచి లేచి బుర్ర వంచుకున్న కమలకు దగ్గరగా వచ్చి గెడ్డం క్రింద చెయ్యి పెట్టి బుర్రపైకెత్తి కమల కళ్ళలోకి చూసి "అలా ఉన్నావెందుకు?" అన్నాడు. అలాచూస్తుండగానే కమల కళ్ళల్లోంచి నీళ్ళు బొటబొట చెంపలమీదనుంచి జారి క్రింద పడ్డాయి. మాధవరావుకు కూడ తెలియకుండా కళ్ళలోనీళ్ళు తిరిగాయి. "ఏమిటిబావా! అది!" అని అడిగింది కమల. కళ్ళనీళ్ళు తుడుచుకొని వెనుకకు తిరిగి నెమ్మదిగా అడుగు లేసుకుంటూ వెళ్ళి కుర్చీలో కూలబడ్డాడు. తల తిరిగిపోతోంది. మనస్సు బాగులేదు. ఏమేమో ఆలోచనలు రైళ్ళమాదిరి మెదడులో పరుగెడుతున్నాయి. మాధవరావు చిన్నవాడయినా కమల కన్నీళ్ళ భావాన్ని గుర్తించగలిగేడు. కమల సంఘానికి, సంఘపు చేతిలో కీలుబొమ్మ అయిన తండ్రికి ఏం అపరాధం చేసిందో భోదపడలేదు. సంఘానికి తోడి మానవులు కష్టపడుతున్నారంటే సహాయంచేసే స్థోమతగాని, ఒకవేళ అట్టి స్థోమత ఉన్నప్పటికీ చేతకాని వారనీ, నిర్భాగ్యులనీ, దురదృష్ట వంతులనీ, వాళ్ళు నించున్నచోట నిప్పు, నీళ్ళు పుట్టవని గేలిచేసే స్వభావమే కాని, తోడిమానవులకు సహాయంచేసే ఊహ సంఘానికి లేదని గ్రహించేడు. పోనీ కమల తన చేతులో నైనా ఉంటే ఈపాటికి మరోపెళ్ళిచేసి హాయిగా కాపురం చేసుకోమని అత్తవారింటికి పంపించే వాడేమో! ఏ ఆలోచనా తోచక ప్రయాణపు బడలికచే చిన్నకునుకు తీశాడు. ఇంతలో పిల్లలిద్దరూ వీధిలోంచి పరుగెత్తుకొని వచ్చి మాధవరావు మీదపడ్డారు. కమల వచ్చి "అత్తయ్య అన్నానికి రమ్మంటోంది. నీళ్ళోసుకో బావా!" అంది. "బావా" అని తను ఎరగని పరాయి మగవాడిని సంబోధించడంతోనే ఆప్రక్కనే మసలుతూన్న సావిత్రమ్మగారి చెవిని పడిందామాట. ఆమెకు ఏదో చెప్పజాలని అసూయ ఒక్కసారిగా ఆవహించింది మనస్సులో.

భోజనాలయ్యాయి. మాధవరావు ప్రయాణపు బడలిక చేత వాకిట్లో మంచం వాల్చుకు నిద్రపోయాడు. మధ్యాహ్నం మూడు గంటలయింది. ఇంట్లో వెంకమ్మగారు, సావిత్రమ్మగారు దెబ్బలాడుకున్నంత హంగామా చేస్తున్నారు. మధ్యలో కుర్రాళ్ళు కూడ ఏవేవో సావిత్రమ్మను కేకలేస్తున్నారు. మాధవరావుకు మెళకువవచ్చి సంగతేమో తెలుసుకుందామని లోపలికి వెళ్ళాడు. ఎంత నించుని విన్నా సంగతి భోదపడలేదు. ఆఖరికి రభసలో "పువ్వులేనా పెట్టుకోనివ్వండి. ఇంకేమైనా చేయనీయండి" అంది సావిత్రమ్మ. సావిత్రమ్మ కమలకన్నా ఐదారు సంవత్సరాలు పెద్దదైనా పెళ్లి మాత్రం మొన్న మొన్ననే అయింది కాబట్టి, తన పునిస్త్రీ తనమంతా వెళ్ళగక్కి మాట్లాడుతోంది. సావిత్రమ్మ పదమూడో ఏట పెద్దమనిషయి ఇంట్లో ఇరవై నాలుగేళ్ళొచ్చేవరకూ కూర్చున్నా ఈ మధ్య పదకొండు సంవత్సరాల్లోజరిగిన సావిత్రమ్మపురాణ జీవితాన్ని ఏసంఘం వేలుపెట్టి చూపించలేకపోయినా, భర్త అంటే ఏమిటో తెలియని అవస్థలో సంఘం కమలని నిరోధించగలిగింది. నిజం కూడ అంతే. నానాటినుంచీ వస్తూన్న సంఘ ఆచారాన్ని వదులుకోలేరు. పోనీ సరి అయిన మార్గంలోనా నడిపించలేరు. చేతకాకో చేతనయ్యో చేసిన వివాహం

చెడిపోతే వితంతువని హేళన, నిరసన చూపడం పరిపాటు. పోనీ సంఘంలోని ప్రతి మానవుడిని దేవుని సాక్షిగా ప్రమాణం జేసి తన కుటుంబంలో ఏ దోషం లేదని చెప్పమంటే ఒక్కడికీ నోరాడదు. పోనీ ఏ వేద శాస్త్రంలో నయినా వితంతు వివాహం కలదా? అలా ఉన్న ఎడల ఏ పరిస్థితులలో స్త్రీని వితంతువని లెక్కలోకి తీసుకురావచ్చును? అని విమర్శించిన పెద్ద మనిషి ఉన్నాడా అంటే ఒక్కడూ సంఘంలోంచి బయటికి రాడు. అందరూ చేస్తున్నారు మేమూ చేస్తున్నాము అనే భావమే ప్రతి సంఘస్థుడికి. ఇందుకే వేమన్నగారు "తలలు బోడివైన తలపులు బోడివా?" అని అన్నారు.

మాధవరావు ఈసంగతంతా గ్రహించి, ఇదంతా మరేంకాదు పువ్వుల తగాయిదా అనుకున్నాడు. సాయంకాల మైంది. సుబ్రహ్మణ్యంగారు ఊరి నుండి వచ్చేరు. వచ్చీ రావడంతోనే మాధవరావు మామయ్యకు ఎదురు వెళ్ళాడు. సుబ్రహ్మణ్యంగారు మాధవరావుని చూచి "ఏరా! అబ్బాయి ఎప్పుడొచ్చావు?" అన్నారు. "ప్రొద్దుటే వచ్చేను మామయ్యా!" అని జవాబు చెప్పేడు మాధవరావు. "అమ్మ కులాసాగా వుందా?" అని ప్రశ్నించేరు సుబ్రహ్మణ్యంగారు. "ఆఁ" అని సమాధానం చెప్పేడు. ఇలా అనుకుంటూనే దొడ్లోకి కాళ్ళు కడుక్కునేందుకి వెళ్ళారు సుబ్రహ్మణ్యంగారు. ఇక మాధవరావు ఆలోచిస్తున్నాడు తదేకధ్యానంతో. ఇంతలో ఆయన మళ్ళీ వచ్చి "ఏరా! అబ్బాయి! ఏమిటి విశేషాలు?" అన్నాడు. "ఆ! ఏమున్నాయి మామయ్యా! ఈమధ్య అమ్మకి వంట్లో బాగుండటంలేదు. ఆమధ్య పదిహేనులంఖణాలు చేసింది. ఇంకా ఒంట్లో నీరసం తగ్గలేదు. ఏపనీ చేసుకో లేకుండా ఉంది. అందుచేత నాలుగురోజులుంచుకొని పంపించేస్తానని చెప్పి కమలని వెంటబెట్టుకు రమ్మంది" అని నెమ్మదిగా వేసేడు ప్లేటు. అసలు ఈడొచ్చిన పిల్ల ఇంట్లో ఉండడం వల్ల సుబ్రహ్మణ్యంగారికి ముళ్ళకంప ప్రక్కలో పెట్టుకు పడుకున్నట్లుంది. నాలుగురోజులు పీడేనా వదులుతుందనుకున్నారు ఆ అమాయకులు. "సరే! తీసుకెళ్ళరా! దానికేముంది!" అన్నారు. మరొకళ్ళింటికంటే ఆయన పంపకపోను. అక్కగారిమీద అభిమానం కొద్దీ సరే అన్నారు. కమలని పిలిచి వాళ్ళత్తయ్యకి ఒంట్లో సుస్తీగా ఉన్నట్లు తెలియజేసి, కాస్త నాలుగురోజులు చేతోడుగా ఉండిరమ్మని చెప్పేరు.

నాలుగురోజులు పోయిన తరువాత ఒకనాటి తెల్లవారు ఝామున నాలుగుగంటలకి కమలని, మాధవుని రైలు దాకా దిగవిడిచి వచ్చారు సుబ్రహ్మణ్యంగారు. రైలు చెన్నపట్నం వెళ్ళిపోతోంది. కొంతసేపయ్యాక మాధవరావు కమలతో "ఈమధ్య నేను పెళ్ళి చేసుకోబోతున్నాను కమలా!" అన్నాడు. "ఎవరిని?" అంది. "నిన్నే" అనేశాడు అదురూబెదురూ లేకుండా. ఇంత చులకనగా మాధవరావు మాట వదిలేసేడంటే పెద్దగా ఆశ్చర్య పడవలసిన అవసరం యేమీలేదు. కమలకి ఏమనాలో తెలియక ఒక సారి బుర్ర క్రిందకి దించి మళ్ళీ బావ కళ్ళల్లోకి చిరునవ్వు ముఖంతో చూచింది. మాధవరావు కమల కళ్ళల్లోకి చూసి "నన్ను చేసుకోవా?" అన్నాడు జాలిగా. "నాన్న చెయ్యడు బావా" అంది కమల. పాపం కమలకి నాన్నమీద అభిమానం చావలేదు. తన జీవితాన్ని నడిపేవాడు నాన్నే అనుకుంటోంది. "అయితే నీకు నన్ను చేసుకోవాలని ఉందా?" అన్నాడు మాధవరావు. "ఊ" అని బుర్రవంచుకుని సమాధానం చెప్పింది కమల. ఇంతలో మరో స్టేషనేదో వస్తూంటే ఇద్దరూ రైలుపెట్టెలోంచి బయటకు చూడ్డం మొదలెట్టారు. మధ్యాహ్నం పన్నెండు గంటలవేళకి రైలు మద్రాసు చేరింది. మాధవరావు టాక్సీని పిలిచి అందులోఎక్కి యిద్దరూ యిల్లు చేరేరు. అప్పటికి ఒంటిగంట కావస్తూంది. మాధవరావు తల్లి చిన్నమ్మగారు వీధి అరుగుమీద కూర్చుని, వీభూది చేతికిరాసుకుని దూది పింజతీసి ఒత్తులు చేస్తోంది. వాళ్ళగుమ్మంలో కారు ఆగగానే ఎవరో అనుకొంది. మాధవరావుని, కమలని చూడగానే సంతోషం, ఆశ్చర్యం పట్టలేక వుబ్బొంగిపోయింది. ఎంతో ఆదరంతో వారిని లోనికి తీసుకుపోయింది.

చిన్నమ్మగారు వంటకుపక్రమింపగా కమలే కలుగజేసుకుని వంట పూర్తిచేసింది. ఆమె కలుపుగోట్టు తనమునకు చిన్నమ్మగారు చాలసంతోషించింది. కమలామాధవులు కలిసి మెలిసి తిరుగుతూ ఎంతో ఆనందంగా వుండేవారు. ఇదంతా చూస్తూంటే చిన్నమ్మగారి మనస్సు పరిపరి విధాల పోయింది. వీళ్ళిద్దరినీ ఈవిధంగా ముదరబెడితే కొంప ముంచి నలుగురిలో నగుబాట్లు తెస్తారనుకొంది. చిన్నమ్మగారు పురాణ కాలపు మనిషి కావడం వల్ల ఏదో కొంత మనోవ్యధ పట్టింది. ఇదంతా ఏదో ఎబ్బెట్టుగా తోచింది. ఒకనాడు మాధరావుని దగ్గిరకు పిల్చి, తన నడవడిక బాగు లేదని, భర్త పోయిన పిల్లతో అంతలా

కలిసీ మెలసీ తిరుగుతే సంఘం హర్షించదనీ కొడుకుని అదమాయిస్తుంది. పాపం మాధవరావు తల్లికి ఏ జవాబు చెప్పకుండా చొక్కా తొడుక్కుని వీధిలోకి వెళ్లిపోయాడు. వీధిలోకి వెళ్లినవాడు మళ్ళీ సాయంకాలం వరకూ తిరిగి రాలేదు. ఇంటికివచ్చి చొక్కా విప్పి కాళ్ళు చేతులు కడుక్కొని లుంగీ కట్టుకుని వాకిట్లో మంచం వాల్చుకుని చల్లగాలికి పడుకున్నాడు. కమల అక్కడే గుమ్మం మెట్ల మీద వేళ్ళు నులుముకుంటూ కూర్చుంది. చిన్నమ్మగారు వచ్చి "మధ్యాహ్నం నుంచీ ఎక్కడికి వెళ్ళావురా అబ్బాయి!" అంది. మాధవరావు గోళ్ళు కొరుక్కుంటూ తన్ను కాదన్నట్లు మాట్లాడకుండా ఊరుకున్నాడు. చిన్నమ్మగారు వంటింట్లోకి వెళ్ళి అన్నానికి రమ్మని కమలని, మాధవరావుని పిలిచింది.

"నాకు ఆకలిలేదమ్మా" అన్నాడు మాధవరావు. ఆ మర్నాటి నుంచి సత్యాగ్రహం చేయడం మొదలెట్టాడు. తిండిలేకపోవటాన్ని ఒళ్ళు తెలియని జ్వరం వచ్చింది. లేవలేనంత అశక్తత సంభవిచింది మాధవరావుకి. చిన్నమ్మగారు కొడుకు దుస్థితి చూచి దిగులు పడింది. మాధవరావు దగ్గరకు వచ్చి అతని మంచంమీద కూర్చుని "అబ్బాయి!" అని లేపింది. "ఆ!" అన్నాడు నీరసంగా చూస్తూ. అక్కడే గోడ దగ్గర కమల నిలబడి ఉంది. "నాయనా! ఎన్నాళ్ళు ఈ విధంగా నన్నేడిపిస్తావురా?" అంది. "ఇంక ఒక్క రోజు" అన్నాడు. చిన్నమ్మగారి గుండెలమీద బండరాయి పడ్డట్టయింది. అతనన్న మాటలో ఎంత అర్థముందో గ్రహించింది. ఆవిడ మనస్సు కలత పడిపోయింది. ఇంక కొడుకు దక్కేఎత్తు లేదనుకొంది. "నన్నేం చెయ్యమన్నావురా నాయనా! నువ్వు ఏం చెయ్యమంటే అది చేస్తాను. చెప్పు బాబూ!" అంది. "అమ్మా" అన్నాడు జాలిగా చూస్తూ. "ఏం నాయనా!" అంది. "కమలని పెళ్ళి చేసుకుంటానమ్మా!" అన్నాడు. చిన్నమ్మగార్కి ఏమనాలో బోధ పడలేదు. తమ కళ్ళలోని దూలాలను వెతుక్కోలేక ఎదుటవారి కళ్ళలోని నలుసులను వెతికే కాకిమూక సంఘం, తన సనాతనధర్మం, మొదలైన పూర్వాచారాలన్నీ కళ్ళకి కట్టినట్లయ్యాయి. "అమ్మా" అన్నాడు మాధవరావు. "అలాగే చేసుకో నాయనా!" అంది ఆమాతృదేవికి ఏమనాలో బోధపడక. సంతోషాన్ని పట్టలేక, ముఖమేనా కడుక్కోకుండా కమల చేతి కాఫీని త్రాగేడు. కొడుకు కాస్త కాఫీ త్రాగిన తరువాత చిన్నమ్మగార్కి ప్రాణమొచ్చింది.

మళ్ళీ మాధవరావు దేహారోగ్యం సరైన మార్గంలోకి వచ్చేటందుకు వారంరోజులు పట్టింది. ఒకనాడు ప్రొద్దుటే మాధవరావు, కమల తలంటి నీళ్ళుపోసుకున్నారు. తరువాత మాధవరావు టాక్సీ తీసుకొచ్చాడు. తల్లి, కమల, తను టాక్సీలో రిజిష్ట్రారు ఆఫీసుకి వెళ్ళారు.

చిన్నమ్మగారు ఎక్కడికో అనుకొంది. కమలకి మాత్రం జావ చేసే పనంతా తెలుసు. సర్కారువారి సమక్షంలో కమల, మాధవరావుల వివాహం రిజిష్ట్రారు పౌరోహితుడుగారు చేసేసి, తమ రిజిష్టర్ల సాక్షిగా ఒక రసీదు తీసి మాధవరావు చేతులో పెట్టాడు. ఆ కాగితం తల్లికి చూపించి "పెళ్ళయి పోయిందమ్మా!" అన్నాడు. "ఇదేం పెళ్ళిరా? నాయనా!" అంది చిన్నమ్మగారు. "డబ్బు ఖర్చులేనటువంటి, ఎవరూ చెడగొట్టలేనటువంటి పెళ్ళి ఇదేనమ్మా!" అన్నాడు. అందరూ ఇల్లు చేరుకున్నారు. ఆనాటినుంచి చిన్నమ్మగారు కమల, మాధవరావులను విచ్చల విడిగా ఒదిలేసింది. కమల జీవితంలో నూతన శకారంభం మొదలిడింది. రోజులు, నెలలు గడిచిపోతున్నాయి. పిల్ల క్షేమ సమాచారాలు తెలియటం లేదని ఒకనాడు సుబ్రహ్మణ్యంగారు వాళ్ళ చెల్లెలయిన చిన్నమ్మగారింటికి మద్రాసుకు ఉత్తరమేనా వ్రాయకుండా వచ్చేశారు. గుమ్మంలో కమల పూర్ణగర్భంతో కనుపించింది. ఇంకేముంది! కళ్ళొదిలి చూడ్డం మొదలెట్టాడాయన. "రానాన్నా!" అంది కమల. "నాపరువు తీసేసేవే! దుర్మార్గురాలా!" అని మళ్ళీ అక్కడ నిలబడకుండా వెనుదిరిగి వెళ్ళిపోయాడు. ఇంతలో మాధవరావు ఇంట్లోంచి వచ్చేడు. వాళ్ళ నాన్న వెళ్ళిపోతూంటే చూస్తున్న కమలని చూసి "ఏమిటి కమలా! అలా చూస్తున్నావు?" అన్నాడు. "మానాన్న ఇక్కడికి వచ్చి నన్నుచూసి వెళ్ళిపోతున్నాడండీ!" అంది. "ఏడీ!" అని అటు చూసేడు మాధవరావు. అప్పటికే సుబ్రహ్మణ్యంగారు చాలా దూరం నడిచి వెళ్ళిపోయారు. "హూ! స్వార్థపరుడు. సంఘాన్ని వదిలిపెట్టలేక కన్న కూతుర్ని ఒదిలేడు" అన్నాడు. సుబ్రహ్మణ్యంగారు కనుచూపుమేర దాటి పోయేవరకూ వాళ్ళిద్దరూ అలాగే చూస్తూ నిలబడి తరువాత ఇంట్లోకి వచ్చేశారు. అటువెళ్ళిన సుబ్రహ్మణ్యంగారు ఇటు రానేలేదు. సంవత్సరాలు గడిచి పోతున్నాయి. ఇక ముందు కూడ రాడేమో!

---

# లఘువేదాంతము - లోకసంగ్రహము

• శ్రీమతి ఎమ్. వేదవల్లి తాయారమ్మ •

(శ్రీ సీతారామాంజనేయ సంవాదమువనుసరించి)

వేదాంతం పేరు చెప్పగానే మన దేశంలో అంతటా కనబడే దొంగ సన్యాసులు, బైరాగులు కొన్ని మతాలు కొందరు స్వాములవార్లూ జ్ఞాపకానికి వస్తారు. వేదాంతం లోకాంతంగా పరిణమింపజేసే వేదాంతులున్నారు. "అనిత్యాని శరీరాణి అందరి సొమ్ము మాకేరానీ" అన్నట్లు భోద చేసే గురువులు విశేషంగా నున్న యీ కాలంలో వేదాంతానికి విలువ కనుగొనడం చాలా కష్టం.

అసలు వేదాంతం అంటే ధర్మార్ధకామములను మూడు పురుషార్ధములను దెలుపు వేదముల కతీతమైనది. అనగా మోక్ష మార్గము నుపదేశించునది. వేదశిఖలు అనబడు ఉపనిషత్తులలో నీ విషయమంతా నిండియున్నది. ఆ యుపనిషత్సారమే శ్రీ కృష్ణ భగవానులు భారత యుద్ధారంభమున అర్జుననకుపదేశించిన భగవద్గీతలు. గీతలో శ్రీ భగవానుడుపదేశించిన 18 యోగములు కర్మ జ్ఞాన భక్తి యోగములను ప్రతిపాదించునవై యున్నవి.

జ్ఞాని యగువాడు తన్నుదా దెలుసుకొని పై మూడు యోగములలోనే యోగ మభ్యసించినను లోక సంగ్రహమునకే వినియోగించ వలెననియు, దాననే మోక్షప్రాప్తి కలుగుననియు గీతార్ధసారము. ఇతర వేదాంత గ్రంథములలో కర్మ సన్యాసము చేయుమనియే చెప్పబడినది. కర్మను వీడమని యే యోగమునందు చెప్పలేదు.

"నమే పార్థాస్తి కర్తవ్యం। త్రిషులోకేషు కించన
నానవాప్తమ వాప్తవ్యం। వర్తయే వచకర్మణి"

అనియు "ఉత్సీదేయురిమేలోకాః।నకుర్యాంకర్మచేదహమ్" అనియు భగవంతుడు తానెల్లప్పుడు కర్మ చేయుచుండు ననియు తాను కర్మాచరణ చేయనిచో నీలోకములన్నియు నుత్పన్నములగును, అనగా నశించు ననియు చెప్పియున్నారు. కాన తురీయమార్గమునందున్న వారైనను, తుర్యాతీతులైనను లోక సంగ్రహము కొరకు ఫలాపేక్ష రహితమగు కర్మ నాచరించియే తీరవలెను. జ్ఞానయోగము వలన ముముక్షువునకు పూర్వ సంచితములగు శుభా శుభ కర్మలన్నియు నశించును. "జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి భస్మసాత్కురుతే తథా" అని గీతా వాక్యము.

"ప్రారబ్ధం భోగతోనశ్యేత్ తత్వజ్ఞానేన సంచితమ్। ఆగామిద్వి విధం కర్మ। తద్వేష్య ప్రియవాదినోః" అని వాసుదేవ మననము. సంచిత ప్రారబ్ధ ఆగామి కర్మలలో కూడబెట్టిన సంచిత కర్మ తత్వజ్ఞానము వలన నశించును. ఆగామి యగు శుభాశుభ కర్మలు రెండును భక్తులగువారిని భూషించువారు శుభకర్మ ఫలితమును, వారిని నిందించిన వారు పాప కర్మ ఫలితమును పంచుకొందురని భావము. అందువల్ల జన్మరాహిత్యమునకై ప్రయత్నించుము, ముముక్షువున కేవిధమగు కర్మయు మిగులదని సిద్ధాంతము. కర్మ జ్ఞాన యోగములచే పరిశుద్ధమైన మనస్సు కలిగి, కర్మ బంధములు నశించిన యోగి భక్తి యోగమును అవిచ్ఛిన్నముగా నభ్యసించును. అవ్యభిచారమగు పరా భక్తి యోగము సిద్ధించిన వారికి పరమాత్మ సాక్షాత్కారమగుటయే గాక మోక్ష మరచేతిలోనుండును. "మోక్షసాధన సామగ్ర్యాం భక్తి రేవగరీయసి"అని శ్రీ శంకరాచార్యుని ప్రవచము. మోక్ష సాధనోపాయములన్నిటిలోను భక్తియే సర్వోత్కృష్టమైనది.

సీతారామాంజనేయ సంవాదమను వేదాంత గ్రంథమందు మోక్షమార్గమును, తారకయోగమనియు, సాంఖ్య యోగ మనియు, అమనస్క యోగమనియు, మూడు యోగములుగా విభజించి యున్నారు. ఇది మోక్ష ప్రతిపాదకమగు గ్రంథము. దీనిని పరశురామ, పంతుల లింగమూర్తి, గురుమూర్తి యను వారు తేట తెల్లమైన తెలుగు భాషలో పద్య గద్య రూపమున రచించినారు. తారక యోగము సీతామహాదేవియు, సాంఖ్య అమనస్క యోగములను శ్రీరామచంద్రమూర్తియు అంజనేయునకు ఉపదేశించునట్లు గ్రంథకర్త వ్రాసినారు.

"తారకంబు మనశ్శుద్ధి తారకంబు।
సాంఖ్య మాత్మస్వరూప విచారకంబు।
అనుభవజ్ఞానమ మనస్కమట్లుగాన।
నాద్య మెరిగింతు మొదల నీవవధరింపు।"

అని సీతాదేవి మూడు యోగముల స్వరూపమును వివరించినారు.

తారక యోగము మనస్సును పరిశుద్ధము చేయును. ముముక్షువు తనకనేక జన్మలనుండి అంటియున్న కర్మ

వాసనలను కర్మదోషములను ప్రప్రథమములలో పరిహరించుకొని మనః పారిశుధ్యము పొందవలెను. మనో నైర్మల్యములేనిదే పరమాత్మ స్వరూప సాక్షాత్కారము కలుగదు. తారకనామమనగా రామనామము. రాముడనగా ఆత్మారాముడు. సమస్త జీవులలో సాక్షి భూతమగు, పరమాత్మ స్వరూపము. "రమయతీతి రామః" రమింపజేయువాడు గాన రాముడనియు "రమంతే అస్మిన్నితి రామః" యోగులు అతనియందు రమింతురు, గాన రాముడనియు రామ శబ్దానికి వ్యుత్పత్తులు చెబుతారు.

"సత్యజ్ఞానానంద। ప్రత్యగభిన్నాత్మునందు బ్రహ్మాదిబుధుల్। నిత్యము రమించుచుండగ। కాత్యాయని రామపదముగలిగె పరునకున్" అని రామ నామమును వివరించినారు.

"శ్రీరామ రామరామేతి । రమేరామేమనోరమే
సహస్రనామతస్తుల్యం । రామనామవరాననే"

శ్రీరామ నామము వెయ్యి విష్ణునామములకు సమానమనియు, నీ శ్లోకమును జపించుటవలన వెయ్యి రామనామమును జపించుట సమానమని యీశ్వరుడు రామనామ మహాత్మ్యమును పార్వతికి తెలిపిరి.

ఇంతేకాకుండా రామనామము కామితార్థ ఫలప్రదాయిని "అబల శ్రీరామ రామ రామాఖ్యమంత్ర । మీప్సితంబుల నర్థులకిచ్చుచుండ । గాంచినెరిసిగ్గుపడుచుండు కల్పతరువు, కామధేనువునలఘుచింతామణియును" రామనామము కల్పవృక్షము కామధేనువు చింతామణివలె కోరిన కోర్కెలనెల్లదీర్చును. మరియు ఆదివ్యాధులను గూడ పోద్రోలును.

"నిఖిల రోగంబున నిర్మూలముగజేయు

భవభయంబులనెల్ల బారద్రోలు" ననియు "రామనామంబు ముక్తికి రాచబాట" అనియు నిర్ణయించినారు. మోక్షమార్గము లన్నిటిలోనే యొడిదుడుకులు లేకుండ గమ్యస్థానాన్ని చేర్చుటకు రామనామము కంటె మరొక సాధనంలేదు. గాఢవైరాగ్యంతో భగవంతునిమీద అత్యధికమైన భక్తినుంచుటవల్లనే మనో మాలిన్యము లన్నీ నశించి మనస్సు పరిశుద్ధ మవుతుంది. పరిశుద్ధాంతకరణము చక్కగా దున్ని పదునుచేసిన పొలము వంటిది. దానిలో నాటిన భక్తిబీజములు నిత్యోపాసనాది విధులనే దోహదములతో మొలకలెత్తి వృక్షాలై మోక్షప్రాప్తియను శాశ్వత ఫలములనిచ్చును.

భక్తిశూన్యమగు వైరాగ్యము నిష్ఫలము. "తారక యోగము తెలియగ । నేరక వేదాంతవాక్య నికురుంబము చేనూరక వాదించుచు జెడువారికి । మోక్షంబుగలదెవాయు కుమారా।" అని తారకయోగసిద్ధి కలుగనిదే శుష్కవేదాంత చర్చల వలన మోక్షము చేకూరదని ఘంటాపదంగా చెప్పినారు.

ఇంతేకాకుండా తారకయోగ సిద్ధికి రెండు మార్గములు వివరింప బడినవి.

(1) రామనామమును జపించుట. (2) యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధులను అష్టాంగ యోగము నభ్యసించుట. ఈ యష్టాంగ యోగమును సమాధి యోగమనియు నందురు. యోగియగువాడు నియమబద్ధమగు జీవితముతో నింద్రియములను జయించి యోగాసనము లభ్యసింప వలెను. మరియు ప్రాణాయామము చేత చిత్త నిరోధము చేసి పరమాత్మ ధ్యానమునందు మనస్సు నిలుప వలెను. అట్టి స్థితియే సమాధి స్థితి. ఈ ప్రకారముగా యోగి రామనామము జపించుచు సమాధి స్థితుడైన యెడల మనో మాలిన్యములు నశించి పై జెప్పిన తారకయోగ సిద్ధి కలుగును. "రాజయోగంబు ముక్తికి రాజపథము". మోక్షమార్గమున కిది చక్కని రాజమార్గము. ఆచరణ యోగ్యమైనది.

(2) సాంఖ్య యోగము.

"సాంఖ్యమాత్మ స్వరూప విచారకంబు" ఈ యోగమునందు తత్వముల సంఖ్య వివరింపబడినది. ఈ తత్వ సంఖ్యానీకము 24 తత్వములనియు 36 తత్వములనియు 96 తత్వములనియు గూడ తెలుపబడినది. వీనిలో ప్రధాన తత్వములు 24. అవి యేవన: పంచమహా భూతములు, పంచతన్మాత్రలు, శబ్దస్పర్శ రూప రసగంధములు, పంచ జ్ఞానేంద్రియములు, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణములు, పంచకర్మేంద్రియములు, వాక్పాణిపాదపాయూ పస్థలు, చిత్తము, బుద్ధి, మనస్సు, అహంకారమునను వానితో కలసి 24 తత్వములు. ఇవి త్రిగుణాత్మ మాయాశక్తిచేత కల్పింపబడినవి. జీవుడు ఈశ్వరుడునను రెండు తత్వములు పైవానితో కలసిన తత్వములు 26 వీనిని తెలిసికొనిన త్రిగుణా తీతులు పరమాత్మ సాక్షాత్కారమును బొందు చున్నారు. సృష్టికి మూలాధారములగు శుద్ధ సత్వ ప్రధాన

మగు మాయను, మలిన సత్వ ప్రధానమగు మాయను అతిక్రమించిన పరమ హంసలు జీవేశ్వరైక్య భావమున కర్తులగుచున్నారు. ఇది సాంఖ్య యోగ సిద్ధాంతము. ఈ యోగము యోగాభ్యాసులకు మాత్రమే ఆచరణయోగ్యము. చాలా కష్టతర మగు మార్గము. ఈ యోగ సాధనలలో దేని నాచరించుటకు ప్రారంభించినా సాధకునకు సాధన చతుష్టయ సంపత్తి అత్యావశ్యకము. ఈ సంపత్తి లేని వాడు మోక్ష పదవి నందుటకు అధికారి కాజాలడు.

ఈ నాలుగు సాధనము లెవ్వియన?

(1) నిత్యా నిత్య వస్తువివేకము (2) శమాదిషట్క సంపత్తి (3) ఇహాముత్రార్ధ ఫలభోగ విరాగము (4) ముముక్షుత్వము.

నిత్యానిత్య వస్తువివేకము :— బ్రహ్మ మొక్కడే సత్యమనియు, మాయాశక్తిచే కల్పింపబడిన యీ చరాచర ప్రపంచము మన దేహములు అనిత్యములని నిశ్చలమైన జ్ఞానము కలిగియుండుట.

ఇహాముత్రార్ధ ఫల భోగ విరాగము :— ఇహలోక మందలి సుఖభోగాదులందును, పరలోక భోగములందును ఆసక్తిలేక పోవుట.

శమాదిషట్కసంపత్తి :— శమము దమము, ఉపరతి తీక్ష శ్రద్ధ సమాధానమునను ఆరు సుగుణములను కలిగి యుండుట. శమమనగా అంతరింద్రియ నిగ్రహము. దమమన బహిరింద్రి యనిగ్రహము. ఉపరతి — విహిత మగు సకల కర్మలను జ్ఞానముచేత క్రమ క్రమముగా విడచుట. తితీక్ష శీతోష్ణ సుఖ దుఃఖాది ద్వంద్వములను సహించుట. శ్రద్ధ — గురువులయందును, శాస్త్రము లందును, ఈశ్వరునియందును విశ్వాసము కలిగియుండు.

సమాధానము : — శాస్త్రదృష్టమును గురూపదేశమును సమన్వయము చేసికొని ఆత్మనిశ్చయము చేసికొనుట.

"శాస్త్ర దృష్టం గురోర్వాక్యం।
తృతీయంబాత్మ నిశ్చయమ్"

అని ప్రమాణము. ముముక్షువిట్టి సాధన సంపత్తితో గూడినవాడై మోక్షమును బొందుటకు తారకసాంఖ్య. అమనస్కయోగము లభ్యసించవలెను. (3) అమనస్క యోగము :— అనగా మనోలయము, మనోవృత్తులను నాశముగావించి నిశ్చలమగుట. జీవాత్మ స్థూల సూక్ష్మ కారణ శరీరములతోగూడి మాయాబద్ధుడై యుండును. ఈ ప్రకృతి పురుషసంయోగము అనాది. జీవాత్మను తారక సాంఖ్యయోగములచేత పరిశుద్ధముచేసి అనాది సిద్ధమగు ప్రకృతి పురుషసంయోగమును విచ్ఛేదముచేసిన గాని జీవాత్మకు ఐక్యసంధానము కలుగదు. దీనికంతటికి మనస్సే ప్రధానము. "మనఏవ మనుష్యాణామ్ ః కారణంబంధ మోక్షయోః" అని గీతావాక్యము. జీవులకు బంధమునకు గాని మోక్షమునకు గాని మనస్సే కారణము. అట్టి బంధము నుండి జీవాత్మకు విముక్తి కలుగజేసి ఐక్యసంధానము కలిగించు మార్గములు అమనస్క యోగము నందు చెప్పబడినవి. ఇదియంతయు అనుభవజ్ఞానమే. ముముక్షువునకు చిట్ట చివరి భూమిక. ఆమీద చేయవలసిన దేమియు నుండదు.

ఈ సాంఖ్య అమనస్కయోగములు రెండు ఆచరించుట చాలా దుష్కరము. భక్తియోగముతో మిశ్రితమైన తారక యోగమే లోకసామాన్యమునకు ఆచరణ యోగ్యమును సులభ సాధ్యమునై యున్నది. ఈ భక్తియోగానికి సర్వ భూత సమత్వము మూలకందము. సమస్త భూతముల యందు పరమాత్మ అధిష్టించి యున్నందున అట్టి పరమాత్మ స్వరూప సాక్షాత్కారానికి సర్వభూతసమత్వమే ప్రధాన సాధనము. "మానవసేవయే మాధవసేవ" అను లోకోక్తి భక్తియోగసిద్ధాంతమునే ప్రతిపాదించుచున్నది. ఇది ముముక్షువునకు మోక్ష మార్గము లన్నింటిలోనికి సూక్ష్మమైనది. అట్టి భక్తియోగలక్షణాలను గీత 12 వ అధ్యాయంలో విశదీకరించారు.

ఇంతేకాక బ్రహ్మదేముడు, నారదమహర్షి, శుకమహర్షి సనకాదియోగులు మొదలుకొని ప్రహ్లాదుడు మున్నగు పరమ భాగవతోత్తము లందఱు భక్తిజ్ఞాన వైరాగ్యములలో భక్తియోగమునే బలపరచినారు. కేవలము శుష్కవేదాంతము లోక సంగ్రహము కానేరదు. సమాధియోగము జనసామాన్యానికి గృహస్థులకు చాలాదుర్ఘటము. సర్వ సంగ పరిత్యాగము గావించి అరణ్యములలో సమాధినిష్టులై యున్న యోగులకే అది సాధ్యముగాన అందరికి అందు బాటులోనున్నది, అందరిని తరింపజేయునది తారక యోగమే.

(ఆలిండియారేడియో విజయవాడ వారి సౌజన్యముతో)

# పలుకు బాట - తులసీదాసు

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు.

రాముడుండునెడల కాముండుగదియడు
కాముడుండకున్న రాముడుండు
రవియు, చంద్రముండు రహియింత్రె ఒక్కచో
తులసి పలుకు బాట తెలిసి చనుము॥

బాహిరంతరముల ప్రభల గోరెదవేని
రామనామ మనెడి రత్నదీప
శిఖఁబదిల పఱుపుము జిహ్వాగేహళియందు
తులసి పలుకు సరణిఁ దెలిసికొనుచు॥

ఎన్నొ యేండ్లు బ్రదికి యెంతొ తెలివినొంది
పిన్నవారిసుమంత ప్రేమ గనరు
ఏమి ఫలమొ తులసి యెఱిగింపు వేడెద
ఒజ్జపుచ్చకాయ ఉనికిగాక॥

సంఘసేవ యంచు సంస్కారమంచును
వెలయ పల్కుచుంద్రు వేదులెక్క
ఒరుల పచ్చజూచి యోర్వనేచాలరే
తులసి, వీరికింత తెలుపదగవె?

విదిత సత్యవాక్కు, విమలమౌ చిత్తమ్ము
కపటరహిత వృత్తిగలుగు భక్తు
మోసపుచ్చగలరె ముష్కర కలినైన
తులసి పలుకు బాట తెలిసి చనిన॥

బంధులున్నగాని బాధకేయగుదురు
సత్యపదవి కొరకు సాయపడరు
రాముకృపయె నీకు రక్షణయౌ నందెప్డు
తులసి పలుకు బాట తెలిసి చనుము॥

భార్య, సుతుడు, భుక్తి, వస్త్ర భోగములాది
పాపియింట నేనిఁబడయవచ్చు
సాధు సంగమమ్ము చక్రికృపయుగడు
దుర్లభములు రెండు తులసి వినుము॥

పరుల కొఱకె పూచి ఫలియించు సంతతము
సాధులనెడు నామ్ర శాఖ వితతి
ఎన్నిబాలఁ గొట్టె దన్ని ఫలములిచ్చు
తులసి పలుకు దెలిసి తెలివిగొనుము॥

సాధుజనుల, సురల బాధఁబాపుకొఱకె
మనుజతనువుఁ జరిత నను వు దాల్చి
బాధసైచు గృపను భగవానుడెప్పుడు
కలిని బాధదీరు దెలియనిదియు॥

దగను గొనియు దీనతగనని వానికి
జలదమొకడె సేయజాలు శాన్తి
ఆత్మమాని భక్తునార్తి దిప్పనొరులు
చాల రొక్కపరుడు స్వామిదప్ప॥

నీరుద్రచ్చి పూన్కినేయి బడయవచ్చు
పిండవచ్చు నిసుమునుండి నూనె
రాము భజనలేక బామువాటగరేము
తులసి పలుకు బాట తెలిసిచనుము ॥

వేషభాషల నెఱవేరు నట్టిపనుల
హానికలిగి తీరు నంత్యమందు
చిత్తశుద్ధితోడ సేసెడి పనులను
హానికలుగబోదు హరిసహాయమొదవు ॥

బ్రదుకు సుకమె యెల్లవారు నభిలషింత్రు
ప్రభుని కరుణలేక పడయగలరె?
ధనికి సుఖముకొల్ల యనుచుదలచువారిఁ
దులసి యజ్ఞులంచు పలికెవినుము ॥

చెఱువునీటినెల్ల చేపలే త్రాగిన
వానిబ్రదుకె బయట పడునుగాదె
కొంగతినునటంచు కొడిమెలేలతుదకు?
తులసి పలుకు బాట దెలిసిచనుము.

దీర్ఘరోగి, లోభిఁ, దీక్ష్ణవచస్కుని
నధికలోలుపు, మఱియధికకోపిఁ
బ్రాణమిత్రుడైన గాని, వానిచెలిమి
విడువుమంచు తులసి వెలయఁబలికె ॥



# ఏమిటీ?....

కుమారి పి. సులోచనాభాస్కర్.

సాయంకాలం వీధి దీపాలు వెలిగాయి. అంతగా చీకటి పడకపోయినా అట్టే వెల్తురు లేదనే చెప్పాలి. భాస్కర్ ఆఫీసునుంచి తిన్నగా రెండు మైళ్ళ చిల్లరగానున్న పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి రిపోర్టిచ్చి "యెంత వేగంగా గూటికి చేరుదామా" అన్న పక్షిలా తిరుగు ముఖం పట్టాడు. త్రోవలో చాలామంది స్నేహితులు యెదురయ్యారు, కాని పలకరిద్దామనుకుంటూనే వారిని దాటిపోతున్నాడు. కాస్త ఆయాసం తీర్చుకోమని ఆప్యాయంతో అడ్డగించి ఆహ్వానించిన వినాయకుణ్ణి కాదనలేకుండా భాస్కర్, గణేశ భవన్‌లో దూరి, బోడి చేతులతో యిచ్చిన కప్పు వేడి నీళ్ళను, కాలకోటి కషాయం లాగు గొంతుకలో పోసుకున్నాడు. మిగిలిన మూడోవంతు బాటను కాళ్ళతో వెనక్కి తన్నుకుంటూ యిల్లు చేరుకున్నాడు. మైలున్నర దూరంలో పోసుకు వచ్చిన వేడి నీళ్లు యిల్లు చేరుకునేసరికి ఖర్చయిపోయి యధాప్రకారం 'ఒరిజనాల్టీ' పైకి తన్నుకొచ్చింది. పిలవటానికి శక్తి చాలక 'టక్ టక్' మని తలుపు తట్టాడు. లోపలి నుంచి "ఎవరది?" అన్న ప్రశ్న వచ్చింది. జవాబు మరొక 'టక్'. సులోచన చికాకుగా వచ్చి తలుపు తీసి అలసిపోయిన అవతారాన్ని చూసి సానుభూతైనా చూపకుండా "చూడ సొంపొస్తున్నారు" అంది హేళనగా.

"అవును" అంటూ విసురుగా నీరసంతో లోపలకు అడుగు పెట్టాడు భాస్కర్. ఎక్కడ తూలిపోతాడోనని, సులోచన భాస్కర్ నడుం చుట్టూ తన చేతిని పెనవేసి తిన్నగా గదిలోకి తెచ్చి విడిచింది. సులోచన కాఫీ తేవటానికి వంటింటివైపు వెళ్ళింది. భాస్కర్ ఉస్సు మనుకుంటూ, నెక్‌పై వూడదీసి, లాల్చీని ఫేంటులోనుంచి పెరికి దండెముమీదకు విసిరివేశాడు. ఎదురుగా సులోచన కాఫీతో హాజరయింది. అంత అలసటలోనూ ఆనందం బలవంతంగా భాస్కర్ పెదవులమీదకు వొంగి వాలింది. భాస్కర్ వొక్కొక్క గుక్క చొప్పున కప్పులో ద్రావకాన్ని (అమృత మంటారు కొందరు) కడుపులోకి తోడుతున్నాడు.

"ఏమండీ! అంత డీలా అయి రాకపోతే, అర్ధో, పావలావో పారేసి యే రిక్షాలోనో రాలేకపోయారూ? బొత్తిగా జ్ఞానసూన్యులయిపోతున్నారేం రాను రాను" అంది సులోచన.

"ఊఁ!" అని దీర్ఘంగా మూల్గేడు భాస్కర్.

"తనకు తోచదు సరికదా! యింకొకరికి తోచింది వినటం మాని యిదేమిటి?"

"ఏమన్నాను?" అని ప్రశ్నించి చూసేడు భాస్కర్.

"మతి మరుపు కూడానా? యిటువంటి వాళ్ళను చూసి ఏడవాలో నవ్వాలో తెలీకుండావుంది. అసలు యింతకీ యీ సైకాలజీ పీపుల్‌ని చూస్తే...." అని వూరుకుంది సులోచన.

"నీ గోలేమిటి చెపుదూ?" అన్నాడు భాస్కర్.

"అవును గోలేలెండి, పోనీ పోలీస్ స్టేషన్‌కు రిపోర్టు యిచ్చి వచ్చారా?" అంది సులోచన దగ్గర కుర్చీలో కూలబడుతూ.

"అబ్బబ్బా! హాయిగా ఒక్కగడియ పార్కుకేనా పోతే బాగుండేది. పెద్దలు చెరబోతున్నట్టు పరుగెత్తుకు వచ్చినందుకు జరిగింది" అంటూ తలగడాకు జేరబడ్డాడు భాస్కర్.

"అంత చికాకు, డీలా అవకూడదనే నా సారాంశం. పువ్వులు తెస్తానన్నారు మర్చిపోయారు. పోన్లెండి కొంత న్యూసెన్సు తగ్గిపోయింది" అని పూర్తి చెయ్యకుండానే భాస్కర్ అడ్డు తగిలి,

"ఏం? తేలేదని నిందారోపణ చెయ్యగలవు కానీ, ఒక్కనాడయినా తెచ్చినప్పుడు సరదాగా పెట్టుకున్నావా?" అన్నాడు.

"అదే పొరపాటు. నాకు పువ్వులు పెట్టుకోవాలనే ఆపేక్షగాని, సరదాగాని లేదని మీకు తెల్సును. సింప్లీ వాటి అందాన్ని చూసి మెచ్చుకుంటాను, ఆనందిస్తాను, అందులో సౌఖ్యం అనుభవిస్తాను. అంతమాత్రాన తేకూడదా? వాటిని తలలో పెట్టుకుంటేనేకాని వీలులేదని ఏశాస్త్రమైనా చెప్పిందా?" అంది ఓటమి అంగీకరించలేక.

"డ్రాప్ దట్ మేటర్" అన్నాడు భాస్కర్.

"ఇంతకీ నే చెప్పేదేమిటంటే మానవులు, ఒడ్డున నిల్చుని పనుల్ని జరిపించాలంటాను. వ్యక్తి తానై యే కార్యంలోకైనా దూకి, మట్టిలో మట్టయి, తన్మయత్వంతో కార్యంలో లీనమవకూడదు. అదే మొన్న ఈమధ్య "ది బెస్టు అమెరికన్ స్టేజి యాక్టరు 'విలియమ్ కాక్రిచ్'" తనకు జరిగిన సన్మానసభలో పేర్కొన్నాడు. "అతడు నటించేటప్పుడు తానై యేపాత్రలోనూ లీనం కాలేదని, తనను వ్యక్తిగతంగా వేరే వుంచుకొని, ప్రేక్షకలోకంలోని విమర్శనలను స్టేజిమీదనుండే పరీక్షిస్తూ వుండేవాడినని వారిలో తన నటన ఎటువంటి భావాలను కల్గిస్తున్నదీ చూసి, వ్యక్తిగతంగా ఆనందించేవాడినని, తను చేస్తున్నది నటన అనే భావాన్ని గుర్తు దాటనిచ్చే వాడిని కాదని. ఏవ్యక్తి అయినా అలా చేసినవాడేఘను"డని పేర్కొన్నాడు. అది నాకెంతో నచ్చింది. కేవలం పాత్రలో లీనమయిపోతే గాని భావ ప్రకటన సాధ్యంకాదనే వాదులకు అతను అతీతుడు. లీనం కాకుండా లీనమయినట్టు భావ ప్రకటన చేసినవాడే నటుడు. అప్పుడు నటుడు క్లయిమాక్స్‌రీచ్ అయినట్టు. ఇంకో విషయంగూడా గమనించండి. 'కూచిపూడి భాగవతులు' నాట్య ప్రదర్శనచేస్తూ నరసింహావతార ఉగ్రరూపము కొరకు సహజ భీకరస్వరూప సృష్టి కోసమని, ఉపవాసనలు, మంత్రాలు చేసి కేవలం తనే నరసింహావతారమని లీనమై ఒకసారి కన్నకొడుకునే చీల్చి చంపేశారుట. అది కట్టుకథ అనడానికి సాధ్యపడదు కదా? అంతవరకు యెందుకు, రీసెన్‌ట్‌గా ఏం జరిగింది, ప్రసిద్ధ హిందీ విలన్ తార కులదీప్‌కౌర్‌ని రిహాల్సు చేస్తూ నటుడు పాత్ర లీనంలో ఆమె గుండెలలోకి అరంగుళం పోయేటట్టు కత్తితో పొడిచినట్టు పత్రికలలో చూసిందేకద!" అంటూ భాస్కర్ వైపు విజయంగా చూసింది సులోచన.

"ఊఁ" అన్నాడు భాస్కర్ ఆశక్తి చూపుతున్నట్టు.

"అపును యీ విషయం నే చెపితే నచ్చదు. ఇదే యే పెద్ద తత్త్వశాస్త్రవేత్తో గీసి పారేస్తే ఆప్యాయంగా ఒక పాండవులను చదివించి ఆ పుస్తకం కొని చదివి, చూడు సులోచనా! అథర్ యెంత సాధక బాధకాలకు లోనై స్టడీచేసి వ్రాసేడో అంటారు" అంటూ కుర్చీలో నుంచి లేచింది సులోచన.

"సరే! అయితే నేనయి యెందులో లీనమయిపోయానని నీ భ్రమ?" అన్నాడు భాస్కర్ కుతూహలంగా.

"పోలిస్‌స్టేషనుకు వెళ్ళి రిపోర్టిచ్చారు బాగుంది. అందుకు నేనెంతో సంతోషిస్తున్నాను. అక్కడ నుంచి 'స్ట్రెయిట్'గా రిక్షాలో వస్తే యింత 'డీలా' వుండక పోవునా! డిగ్నిటీగా కూడా వుండును. మళ్ళీ పెద్ద మేనేజరుగారు, యువకులు. అధమం మనస్సు మరే చికాకు చేయకుండా, యితర ఆలోచనలు లేకుండా బ్లాంకుగా వుండేది. అక్కడనుంచి నడిచి రావడం కష్ట మనిపిస్తుంది. దానికి నేను కాదనను. వెళ్ళిన పని ఎటువంటిది? రిస్టువాచీ పోయిందని రిపోర్టు యివ్వడానికి. అది మానసికంగా కష్టమయినది. ఆ కష్టాన్ని యీ కష్టం రెట్టిస్తుంది. అయ్యో యింత కష్టానికి లోనయిపోతున్నానే అనే భావాన్ని కల్గచేసుకుంటున్నారు. అందుకుగాను కష్టంలో లీనమయి మరింత కష్టాన్ని కల్పించుకుని తను వేరే వ్యక్తిగతంగా చేయవల్సిన పనులు మరచారు. దాని వల్ల ఒకటి వ్యక్తిత్వప్పనుల నాశనం, రెండవది స్వతహాగా కల్గిన కష్టానికి శాంతి లేకపోవడం, మూడవది దాన్ని వ్యక్తీకరించడానికి లీనమై కల్పించుకున్న కష్టం కల్సి తడిసి మోపిడయి కుంగతీసాయి. చక్కగా రిపోర్టు ఇవ్వడం, రిక్షాయెక్కి రావడం, అంతే! దానిగురించి అనవసర కలవరముండకూడదు. డ్యూటీ, డ్యూటీయే! అవసరంపడితే కాస్త హెచ్చిస్తాం కాని కేవలం లీనమయి పోవడమనేది యెన్నడూ చేయకూడని పని" అని ముగించింది సులోచన.

"అరె బాప్‌రే! ముగిసిందా లెక్చర్. నీ వుపన్యాసం వినటంలో యెంత హాయి వుందనుకున్నావ్? ఊక దంచితే యెంతలాభమో? రోల్సు రాయస్ కారువెనక పరుగెత్తితే యెంతసుఖమో...." అని భాస్కర్ ముగించకుండానే సులోచన ముఖం ముడుచుకుని రివ్వునలేచి వెళ్ళబోయింది. భాస్కర్ చటాలున చెయ్యి పట్టుకున్నాడు నవ్వుతూ.

"చాలా పనులున్నాయి వదలండి" అంది.

"ఉహూ!" అన్నాడు భాస్కర్ గట్టిగా చెయ్యి అదిమి పట్టుకుంటూ.

"ఆడదానిలా యింట్లో కూర్చోపోతే అలాగ పార్కులోకి పోకూడదూ?" అంటూ గింజుకుంది సులోచన చెయ్యి విడిపించుకుందికి.

"యేం? ఆడవాళ్ళు యింట్లో కూర్చుంటారా? డిగ్రీలు పుచ్చుకుని, ఉపన్యాసాలతో యింట్లో భర్తలను నోరు మెదపకుండా దంచేస్తారు" అన్నాడు భాస్కర్ సులోచన ముఖంలోకి చూస్తూ.

"అబ్బా! యేం మోటుదనం, యింత సిల్లీగా వుంటారేం?" అంది చిరుకోపంతో.

"సరే మగవాళ్ళలాగ నువ్వెందుకు బి. ఏ. వరకు చదివావు? సమానత్వం కావాలేమో? పద యిద్దరం కలిసి పిక్చర్‌కో, పార్కుకో పోదాం" అన్నాడు భాస్కర్ బుజ్జగిస్తూ.

"వంట్లో బాగాలేదు. నేనురాను" అంది.

"దారిలోనే డిస్పెన్సరీ" అన్నాడు హేళనగా.

"నేను రాను అంటే, యిదేం ఖర్మం" అంటూ విడిపించుకుని వంటింట్లోకి పారి పోయింది.

భాస్కర్ భార్య చిరు కోపానికి నవ్వుకుంటూ పచార్లు చేశాడు. మళ్ళీయేం తోచక మంచం మీద వాలేడు. సులోచన వుపన్యాసాలు యింకా చెవుల్లో గుంయిమని ప్రతిధ్వనిస్తున్నాయి. ప్రతీదీ ఆవేశంతో గంభీరంగా తడబడకుండా వుపన్యసిస్తుంది. అసలు తమ దాంపత్యానికి అదే కారణం. భాస్కర్ యీ ఆలోచనలతో చిన్నగా నవ్వుకున్నాడు. సులోచన అప్పుడే, నీటుగా డ్రస్ చేసుకుని వచ్చి, భాస్కర్ తనలో తను నవ్వుకోవటం చూసింది.

"కొంపదీసి, మెంటల్ డిసార్డర్ కాదుకద!" అంది కిలకిల నవ్వుతూ.

"అను యింకేమైనా అంటావ్" అంటూ ఆమెలో రెట్టించిన సౌందర్యం వైపు ఆశగా చూశాడు.

"యేం దిష్టికొడతారా?" అంది దూరంగా జరుగుతూ.

"యింకాఅను" అన్నాడు అమాయకంగా ముఖం పెడుతూ.

"యెంత అమాయకులండీ మీరు. పాపం! నోట్లో వెన్న పెడితే మింగలేరు, వేలు పెడితే కరవలేరు కదండీ? అవును మీరు రిస్ట్‌వాచ్ పారేసుకున్నారట. యెవరైనా ఓదార్చేరా పాపం" అంది వెటకారంగా సులోచన.

"ఆమాత్రం తెలీదనుకోకు, వెధవది యీనెల జీతంలో అటు వంటివి ఒకటికాదు, తొంభై కొని పారేస్తాను" అన్నాడు భాస్కర్ కోపం నటిస్తూ.

"నాకెందుకు?" అంది సులోచన దగ్గరగా వచ్చి భాస్కర్ భుజాలు పట్టుకుని.

"నువ్వనేది తెలుసు. అది మీవాళ్ళు నీకు కొని యిచ్చారు. బుద్ధి గడ్డితిని నేను వాడుతున్నాను. పోరపాట్లందరికీ వస్తాయి. కాలం కర్మం కూడి దొంగ వెధవ కొట్టేశాడు" అన్నాడు. భాస్కర్ విదలించుకుంటూ.

"నే నిప్పుడవన్నీ అన్నానా? మీరే తప్పుకుంటున్నారు" అంటూ విసురుగా లేవబోయింది.

భాస్కర్, సులోచనను అడ్డు పెట్టి.

"నిజం చెప్పు అది యెవరివల్ల పోయింది?"

"మీరెవరని అనుకుంటున్నారు" అంది.

"యింటిగలవాళ్ళబ్బాయే తీశాడు. అందుకేగా రిపోర్టిచ్చింది" అన్నాడు.

"మరయితే వేరే అడగాలా?" అంది.

"అదికాదు నేననేది, నీవల్లనా నావల్లనా? అని" అన్నాడు భాస్కర్.

"అదా సంగతి! నాకేం తెలుసు చెప్పడానికి? మీ బావగారి నడగండి?" అంది సులోచన కళ్ళు త్రిప్పుతూ.

మా "బావగారెవరు?" అన్నాడు ప్రశ్నగా.

"తెలీదేం? యింటి కొచ్చిన దగ్గర నుంచి అతని కోసం తహతహ లాడిపోతారే పేకాటకు నన్నుగూడ చంపేవారే"

"ఓహో! అదా నీ దెప్పిపొడుపు. అవును మీ సూర్యానారాయణ బాబుకొడుకు గురించేనా అనేది" అన్నాడు భాస్కర్.

"ఛీ! వాడెవడూ మధ్య మా పెదనాన్నవడాన్కి. వింటే నలుగురూ నవ్వుతారు" అంది సులోచన ఛీదరింపుగా.

"యేం? అన్నయ్యా! యివాళ బావగారిచేత ఒక వంద ఆటలుతోమించాలి యిందులో నీ చెయ్యి కలిస్తే అర

కప్పు కాఫీ లంచమిస్తాననడం తెలుసా?" అన్నాడు భాస్కర్ హేళనగా.

"మీవన్నీ అడ్డు బుకాయింపులే. రావోయ్ బావా! మీ చెల్లి ఒంటెత్తుమనిషి. నే లేకపోయినా పరవాలేదు, కావ లసిన పుస్తకాలు తీసుకొంటూ వుండవోయ్, అనడం బాగుందా?" అంది సులోచన మెరిసే కళ్ళతో.

"ఊ ....! యింక చాలిద్దాం. యెలాగో వెధవ యిద్దరినీ అన్యాయంచేసి కొట్టేశాడు. సరే యెక్కడికి పోగలడులే, రేపు యీపాటికి స్టేషన్‌లో నాలుగు తగలే సరికి మూడుచెరువుల నీళ్ళు త్రాగి మరీ తెస్తాడు" అన్నాడు భాస్కర్.

యింతలోకి వరండాలో నుంచి చిన్నగా దగ్గు విని పించి, సులోచనా భాస్కర్ లిద్దరూ అటువైపు చూశారు. సూర్యనారాయణమూర్తి గారు మెల్లగా గదిలోకి ప్రవే శించాడు. సులోచన చటాలున లేచి దూరంగా జరిగి నిల్చుంది.

"ఏం నాయనా? కులాసాగా వుంటున్నారా?" అన్నాడు సూర్యనారాయణమూర్తి.

"ఊ!" అన్నాడు యిష్టం లేకపోయినా.

"అబ్బా! దిన దినాన్కి వంట్లో యేం బాగుండటం లేదు, ముసలాడినయిపోతున్నాను. కూర్చోవమ్మా నిల్చుండి పోయావేం?" అంటూ సూర్యనారాయణమూర్తి అక్కడ కుర్చీలో చతికిల పడ్డాడు.

"ఇదిగో చూడు నాయనా! యీనెల యింటికి ఎలక్ట్రిక్ దీపాలు వేయిద్దామనుకుంటున్నాను. మొన్ననే అప్లి కేషన్ దాఖలు చేశాను. రెండు రోజులలో వచ్చి వైరింగ్ చేస్తారనుకుంటా. డాబామీద యీ భాగంవైపు రెండు గదులు వేయించదలిచాను, బాగుందా?" అన్నాడు సూర్యనారాయణమూర్తి.

"మధ్య మేమెవరం? అద్దెల వాళ్ళం" అన్నాడు భాస్కర్ చికాకుగా.

"అద్దె మరి పెంచలేమండి" అంది సులోచన.

"అబ్బె! బ్బె! మీకు బొత్తిగా లోకజ్ఞానంలేదు. జీవిత మంతా కొత్త. నాకేం అద్దె యెక్కువ వద్దు. మరి యేమిటీ ముసలాడిలా పేలుతున్నాడనుకునేరు. నేను చాలా తీవ్రంగా ఆలోచించాను. వెధవది డబ్బును మనం గడి స్తామకాని, మనల్నది గడించదు. యేం చెప్పమంటావు తల్లీ? పోయేకాలమప్పుడు నాకెందుకీ చిప్పు. యిప్పటికి సుమారు డెబ్బయి సంవత్సరాలుగా మాతరం వారి వూళ్ళో వుంటున్నారు బౌరా! అనిపించుకున్నారు...."

"యింతకీ మీరు...." అన్నాడు భాస్కర్.

"చెపుతూన్న గోలంతా అదే నాయనా! యింటా వంటా లేని యీపాడు బుద్ధులు మావాడికి ఎలా పుట్టిందీ నమ్మలే కుండా వున్నాను. ఉదయం నుంచీ బయటికి రాలేకుండా కుళ్ళి కుళ్ళి చచ్చేను. 'చల్ల కొచ్చి ముంతదాచడమేం?' నాకంతా తెల్సింది. వెంటనే రావడానికి వెధవ ఆత్మాభిమానం కాలి చచ్చింది. నాకు సుహ్వాకడివి, మావా డొకడు కాదు. వాడే నీతమ్ముడయితే యింత నిష్కర్షగా" అని కళ్ళు తుడుచుకున్నాడు.

"అలాగయినట్టయితే యింతవరకూ రాకుండానే వాడిని చంపెద్దును" అన్నాడు భాస్కర్ కోపంగా.

"ముసలాడిని, పదేపది. యిటూఅటూ కోర్టులంట, స్టేషన్‌లంట తిరగలేను. యివి చేతులుకావు కాళ్ళనుకో. వంశపారంపర్యంగా గడించి యిచ్చిన మాపెద్దల గౌరవ ప్రతిష్టలు నాశనం చెయ్యకు. వెధవ నడుగుదామంటే నిన్నటి నుంచీ అగుపించలేదు. యీనెల అద్దెలతో ఒకవేళ తియ్యక పోయినా కొత్తది కొని యిచ్చుకుంటాను. పోలీసులను యింటికి తెప్పించి వీధి కెక్కించకు. అటు పైన నీయిష్టం" అంటూ కళ్ళు తుడుచుకుని నిల్చున్నాడు సూర్యనారాయణమూర్తి.

"ఊరుకోండి పెదనాన్నగారూ! దానికే అంతయిదయి పోవాలా? నే వున్నాగా, రిపోర్టు తిప్పించేస్తాను. మీరు మాత్రం హాయిగా వుండండి" అని వోదార్చింది సులోచన.

"వాడొచ్చాక చీల్చి మరీ కనుక్కుంటాను తల్లీ!" అంటూ సూర్యనారాయణమూర్తి వెళ్ళిపోయాడు. భాస్కర్ అయోమయంగా సులోచన వైపు చూశాడు.

"ఏం మానవులండీ! యెంతచదివితే యేం? మీలో కాసంతయినా దయవుందా? పాపం ముసలాడు అంతబాధ పడుతుంటే ఒదార్చటం పోయి, మీరు కాబట్టి. మీ వాడని

వూరుకున్నారు, నేనే అదే మాతమ్ముడయితే మింగేస్తాను. సరికేస్తానంటారేం?"

"చాల్లే! అవన్నీ ఒకటోరకం దొంగవెధవ వేషాలు. పోనీ ఆ దయారసమేదో, యిద్దరి భాగాలు కలిపి నీలోనే వుంచేడు దేవుడు. ఎవరు పుణ్యం చేసినా యిద్దరం పంచుకోవల్సిందే" అన్నాడు భాస్కర్.

"అబ్బే! ప్రపంచంలో యింత నిర్దాక్షిణ్యులున్నారని యివాళ తెల్సింది" అంది లోచని.

"రేపు యింకొకటి, యెల్లుండి మరొకటి, అవతలనాడు మరోకొత్తది, తెలుస్తుంటాయి, అవే జీవితానుభవాలు. పెద్దలు ప్రతీదీ దానిమీద ఆధారంతోనే చెప్తారు, అందుకే జరుగుతాయి, రేపటి నుంచీ నువ్వొక పెద్ద" అన్నాడు భాస్కర్.

"మాటలకేంలెండి! చూశారా? అతను పెద్దలుగడించిన గౌరవ ప్రతిష్ఠల కోసం యెంత బాధపడ్డాడో?" అంది. సులోచన.

"వెధవ వాడి గౌరవం, నా గౌరవం, నడిబజారులో కట్టలు తెంచుకున్న గోదావరిలాగ పారుతున్నది" అన్నాడు భాస్కర్.

"తోడి మానవుడిని నమ్మలేని మీరు...." అని వూరుకుంది సులోచన.

"ఆత్మ విశ్వాసాలే లేని యీ రోజులలో తోడి మానవుడి మీద విశ్వాసం లేదని యేడుస్తావేం?" అన్నాడు భాస్కర్.

"మీతో మాట్లాడలేం! యెడ్డెం అంటే తెడ్డెం అంటారు. పోయింది నా వాచీ, పోనీలెండి, వాళ్ళని వీధి కెక్కించకండి. రిపోర్టు మీరు విత్‌డ్రా చేసుకోక పోయినా నే పోయి చేసి వస్తాను" అంటూ విసురుగా లోపలికి పోయింది సులోచన.

రాత్రల్లా మాటలు లేవు, ఆ తరువాత కూడా లేవు. భాస్కర్ మాత్రం రిపోర్టు విత్‌డ్రా చేసుకున్నాడు. ఆ సంగతి సులోచనకు చెప్పలేదు. కాని గ్రహించే ఉంటుంది. యిద్దరూ బింకంగానే వున్నారు. పెళ్ళయిన రెండు సంవత్సరాలకీ యిదే తను భార్యతో మాటలు మానే యడం. భాస్కర్‌కి చాలా కష్టం వేసింది. కప్పు పక్కకు విసిరి కేలండరు చూశాడు. గబ గబ బయలుదేరి, కాల కృత్యాలు తీర్చుకుని బట్టలు వేసుకున్నాడు. కాఫీ టేబిల్ మీద భాస్కర్ కోసం యెదురు చూస్తున్నది. నాలుగు గుక్కలలో ఖాళీ చేసి అటూ ఇటూ పచార్లు చేస్తూ ఆలోచించి ఆఖరుకు తెగించి గొంతుక సర్దుకుంటూ "లోచనీ! లోచనీ!" అని పిల్చాడు.

సులోచన వచ్చి, యింత వుదయాన్నే అతను తయారవడం చూసి ఆశ్చర్యపోయింది.

"పెట్లో ఆమూల, యీ మూల దాచిన దేమైనా వుంటే ఇయ్యి" అన్నాడు ముక్తసరిగా. ఎందుకని అడగాలను కుంది గాని మాట్లాడకుండా ఒక కవరు తెచ్చి యిచ్చి భాస్కర్ ముఖంలోకి ప్రశ్నగా మాత్రం జూసి వూరుకుంది.

"యివాళ ఇది తెలుసుకో! యిది పరువు నష్టపు దావా క్రింద జరీమానాగా పోతుంది. రిపోర్టు విత్‌డ్రా చేసుకుంటే ముసలాడు తెచ్చి పెట్టిన ముప్పు. బహుశా యివాళే అతను నీకు వాచ్ కొని యిచ్చేస్తాడనుకుంటా" అంటూ తిరిగి వెళ్ళబోయాడు. సులోచన చటాలున భాస్కర్ కోటు పట్టుకుని ఆపి.

"ఓ! ఎంత కన్నింగ్ ఫాక్స్? నిజంగా సెంచరీ ఫాక్స్. యిటువంటి వెధవల్ని వేస్టేజి లేకుండా వాళ్ళ గోతులు వాళ్ళనే లైనులో తప్పుకోమని, అందులో దించి, ఒకే ఒక బులెట్‌తో కాల్చి చంపెయ్యాలి" అంది కోపంతో భాస్కర్ కోటు కాలర్ నలుపుతూ.

"ఆ....ఆ....మెల్లిగా, యిది వింటే, నన్ను చంపనాలోచిస్తూన్నారని మరో కేసు తెలిసిందా?. అయినా నీ యెదట వున్నది నేను, నీ చేతిలో వున్నది నా కోటు కాలర్. టైమ్ లేదు త్వరగా వెళ్లా"లంటూ వెళ్లిపోయాడు భాస్కర్. వెళ్ళిన దిక్కే చూస్తూ సులోచన గట్టిగా వేడి నిట్టూర్పు విడిచింది.



# అల్లికలు — జెర్సీ

[గత సంచికలో జెర్సీ వెనుక భాగము, ఎదుటివైపు ఎడమ ప్రక్క భాగములు అల్లు విధము వ్రాయడమైనది. ఇప్పుడు ఎదుటివైపు కుడిప్రక్క భాగము, చేతులు, మెడ పట్టీ మొదలగునవి అల్లువిధము ఈ దిగువనీయబడినవి.]

## ఎదుటివైపు కుడిప్రక్క భాగము

12 వ. నెంబరు సూదులతో ఎఱుపు రంగు ఊలుతో 61 కుట్లు కాస్టాఫ్ చేయవలెను. వెనుకవైపు వేసిన మాదిరిగా 5 నమూనాలు వేసి, నెం. 10. సూదులమీదకు మార్చి మరి రెండు నమూనాలు వేయవలెను.

ఇదే విధముగా నమూనాలు వేయుచు తరువాత నమూనాలలో ప్రతి 5, 6 వరుసలలో చివర ఒక్కొక్క కుట్టు చొప్పున హెచ్చు చేయుచూ ఆ విధముగా హెచ్చుచేసిన వరుసలు 10 అగువరకూ అల్లవలెను (71 కుట్లు)

పై విధముగా 14 నమూనాలు వేసి 17. వ. నమూనాలో మొదటి వరుసతో ముగించవలెను.

చంక ఆకారమేర్పరచుట :— తరువాత వరుస ప్రారంభములో 4 కుట్లు కాస్టాఫ్ చేసి, ఒక వరుస విడిచి మరి యొక వరుసలో ఇదే మాదిరిగా కాస్టాఫ్ చేయుచూ అదే విధముగా రెండు సార్లు అల్లి ముగించవలెను. (59 కుట్లుండును.)

ఇదే విధముగా నమూనాలు వేయుచు 42. వరుసలు అల్లి ఆఖరి నమూనాలో 8. వ వరుసతో పూర్తి అగునట్లు అల్లవలెను. మామూలు నమూనాలో కంటె చంక చివర భాగములో రెండు కుట్లు తక్కువ అగునట్లు అల్లవలెను.

మెడ ఆకార మేర్పరచుట:— తరువాత వరుస మొట్ట మొదటి 5 కుట్లు కాస్టాఫ్ చేసి తరువాత వరుస మామూలుగా అల్లి, ఆ తరువాత వరుసలో కూడా మొట్ట మొదటి 5 కుట్లు కాస్టాఫ్ చేసి, తరువాత 3 వరుసలలో మెడవైపు భాగములో ఒక్కొక్క కుట్టు చొప్పున తగ్గించవలెను.




తరువాత వరుస(7. వ. నమూనా వరుస):— ని. 2 (ఒకేసారి) ని. 1, మే. 1, స్లి. 1, ని. 1, పా. స్లి. స్టి. ఓ. *ప. 2, స్లి. 1, ని. 1, పా. స్లి. స్టి. ఓ, స్టార్ దగ్గర నుండి తిరిగి వేయుచూ చిట్ట చివరి 11 కుట్లు ప. 2, ని. 6, ప. 2, ని. 1 అల్లవలెను. మెడవైపు ఒక్కొక్క కుట్టు చొప్పున తగ్గించుచూ 15 వరుసల వరకూ అదే విధముగా తగ్గించుచూ అల్లవలెను. (30 కుట్లు అగువరకు)

పై విధముగా అల్లిన తరువాత ఒక వరుస మామూలుగా అల్లి ఎడమవైపు ఎదుటి భాగము అల్లునపుడు భుజము ఆకారమేర్పరచుటకు అల్లిన మాదిరిగా అల్లవలెను.

## చే తు లు.

నెం. 12. సూదులతో ఎఱుపురంగు ఊలుతో 76 కుట్లు వేసి చేయి అడుగు భాగము (అంచు) ప్రారంభించవలెను.

మొదటి వరుస:—*ని. 1, ప. 1 స్టార్ దగ్గర నుండి చివర వరకూ అదే మాదిరిగా అల్లవలెను. (ఒక నిట్టు, ఒక పర్ల్ చొప్పున వేయుటకు రిబ్ అని పేరు.)

పై వరుస వలె మరి 10 వరుసలు వేయవలెను.

హెచ్చు చేయుట: తిరుగ వైపు (Wrong side):— మొట్టమొదటి నుండి రిబ్బు వేయుచూ, చిట్ట చివర ఒక్క కుట్టు పర్ల్ అల్లవలెను. సూదిమీద 91 కుట్లు వచ్చు వరకూ రెండు వైపుల ఒక్కొక్క వైపు ఒక్కొక్క కుట్టు చొప్పున హెచ్చు చేయుచూ అల్లవలెను.

ఇప్పటి వరకూ అల్లినదంతా నెంబరు. 10 సూదుల మీదకు మార్చి, ముందు వేసిన మాదిరిగా 6 నమూనాలు వేయవలెను.

చేయి పై భాగము ఆకారమేర్పరచుట:— తరువాత 14 వరుసలలో మొట్టమొదట, చిట్టచివర కూడా ఒక్కొక్క కుట్టు చొప్పున తగ్గించవలెను. (63 కుట్లు)

తరువాత వరుస:— ని. 2 (ఒకేసారి) మే. 1, స్లి. 1, ని. 1, పా. స్లి. స్టి. ఓ, ప. 2, ని. 6, ప. 2, *ని 2 (ఒకేసారి) మే. 1, ని. 1, మే. 1, స్లి 1, ని. 1, పా. స్లి. సి. ఓ., ప. 2, ని. 6, ప, 2 స్టార్ దగ్గరనుండి తిరిగి వేయుచూ చిట్ట చివర 4 కుట్లు ని. 2 (ఒకేసారి) మే. 1, ని. 2 (ఒకేసారి).

తరువాత 15 వరుసలలో మొట్టమొదట, చివర కూడా ఒక్కొక్క కుట్టు చొప్పున తగ్గించవలెను (31 కుట్లు)

తరువాత వరుస:— ని. 1, స్లి. 1, ని. 1, పా. స్లి స్టి. ఓ, ప. 2, ని. 6, ప. 2, ని. 2 (ఒకేసారి) మే. 1, ని. 1, మే. 1, స్లి. 1, ని. 1, పా. స్లి. స్టి. ఓ, ప. 2, ని. 6, ప. 2, ని. 2 (ఒకేసారి) ని.1.

తరువాత 4 వరుసలలో మొట్టమొదట, చివర కూడా ఒక్కొక్క కుట్టు చొప్పున తగ్గించవలెను. (21 కుట్లు) మిగిలిన కుట్లు కాస్టాఫ్ చేయవలెను,

అదే మాదిరిగా రెండవ చేయి కూడ అల్లవలెను.

## బొత్తాముల పట్టీ.

నెం. 12 సూదులతో నీలిరంగు ఊలుతో 12 కుట్లు అల్ల వలెను తరువాత 162 వరుసలు రిబ్ అల్లి కాస్టాఫ్ చేయ వలెను.

## బొత్తాము కాజాల పట్టీ.

నెం. 12. సూదులతో నీలిరంగు ఊలుతో 12 కుట్లు అల్లి, 4 వరుసలు రిబ్ అల్ల వలెను.

బొత్తాము కాజాకు మొదటి వరుస :— 5. రిబ్. రెండు కుట్లు కాస్టాఫ్ చేయవలెను 5. రిబ్

బొత్తాము కాజాకు రెండవ వరుస :— 5. రిబ్, రెండు కుట్లు కాస్టాఫ్ చేయవలెను 5. రిబ్.

20 వరుసలు రిబ్ అల్ల వలెను. ఈ పై 22 వరుసలు తిరిగి 6 సార్లు అల్ల వలెను. తరువాత మళ్ళీ బొత్తాము కాజాలకు అల్లే రెండు వరుసలు అల్లి, రిబ్ రెండు వరుసలు అల్లి కాస్టాఫ్ చేయవలెను.

## మెడపట్టీ

నెం. 10. సూదులతో 12 కుట్లు నీలిరంగు ఊలుతో అల్ల వలెను. రిబ్ 36 అంగుళములు లేక కావలసినంత పొడవు అల్లి, కాస్టాఫ్ చేయవలెను.

ముగింపు:— అంచులయందు తప్ప మిగిలిన భాగములన్నీ యిస్త్రీ చేయవలెను. చేతిపైపు నుండి ప్రారంభించి భుజములు కలిపి అల్ల వలెను. చేతులు, ప్రక్కలయందు కలిపి అల్ల వలెను. తరువాత బొత్తాముల పట్టీ, బొత్తాము కాజాల పట్టీ కూడ కలిపి అల్లి, మెడపట్టీ సరిగా మధ్యలో నుండు నట్లు చూచి, మధ్యనుండి ప్రారంభించి కలిపి అల్ల వలెను. అప్పుడిరువైపుల మిగిలిన చివర భాగములు జారుముడి లేక కావలసిన మాదిరిగా (పటములో వలె) వేయ వలెను.



## కస్తూర్బా మహిళా పాఠశాల

### పెద్దాపురం

శ్రీమతి బారు సరోజినీదేవిగారిచే స్థాపించ బడిన శ్రీ కస్తూర్బా మహిళాపాఠశాల అష్టమ వార్షికోత్సవము 10 — 3 — 54 వ తేదీని శ్రీమతి డాక్టర్ శకుంతలా బాపినీడుగారి అధ్యక్షతన పెద్దాపురం విక్టోరియా మెమోరియల్ క్లబ్‌లో జయప్రదముగా జరిగినది.

పాఠశాల విద్యార్థినులు 'గాజులబేహారి' నృత్యనాటిక, 'భ్రాంతి' నాటకము, మరియు నృత్యములుచేసి సభికుల నానందపరచిరి. శ్రీమతి శకుంతలాబాపినీడుగారు స్త్రీవిద్య గూర్చి ఉపన్యసించిరి. తరువాత శ్రీ మాగంటి బాపినీడు గారు విద్య, దాని ఆవశ్యకతను గురించి ఉపన్యసించి, బాలికల కృషికి సంతోషించి వారిని ప్రోత్సాహించిరి. విద్యార్థినులకు బహుమతులొసగబడెను. తరువాత సభ రామధున్‌తో ముగిసెను.





## వివేకానందుడు

జీవదయా పబ్లికేషన్సు, శ్రీ కర్రి అప్పారెడ్డి, గొల్లల మామిడాడ, తూర్పు గోదావరి జిల్లావారు ప్రచురించిన పద్యకావ్యం. వెల రూ 2-0-0. రచన : 'బాలసరస్వతి' బిరుదాంకితులు శ్రీ ఉండేల మాలకొండారెడ్డిగారు.

'దేశ గర్వము దీప్తి జెందగ, దేశ చరితము తేజరిల్లగ, దేశ మరసిన ధీరపురుషుల' వీరగాథలు ఎంత మంది రచించిన — ఎన్నిసార్లు చదివిన, తనివి తీరదు. హిందూ మతము యొక్క ఘనత సడలనున్నతరి, యద్దానిని సముద్ధరించి, ఖండఖండాంతరముల వ్యాపింప జేసిన మహనీయుడు వివేకానందుడు. వినినంతనే విద్యుచ్ఛక్తి ప్రవాహమువలె ఆపాదమస్తకమును స్పందింప జేసి, అనివార్యమగు చిత్త సంస్కారమును గల్గించునట్టి దాతని దివ్యవాణి. సర్వ మత సమన్వయము — విశ్వమానవ సౌభ్రాతృత్వముల జాటుచు మానవకోటికి శతాబ్దములపాటు సరిపడునట్టి ప్రబోధ సుధాకర మాతని సందేశము. ఇట్టి వానిని కథావస్తువుగా నెన్నుకొనుటయందే ఈ పిన్న కవి సామర్థ్యము గాననయ్యెడిని. "ఎల్లరు నిజసత్వ సమాన ఫలార్థులేగద !" కథా వస్తువునకెనయగు మధురగంభీర రసమయ పదాళిచే—

"ఓచిన్నారి తపస్వి ! వంగఋషి రాజోత్తంస ! నీమంగళ
శ్రీచారిత్ర్యము సంస్మరింప హృదయక్షేత్రాన భవ్యాశయ
ప్రాచుర్యమ్ములుతోచెఁబూ చెఁగవితారాజీవగేహమ్మునీ
యాచంద్రార్క యశోవధూటి కొక పువ్వందింతుఁగై
కొందువా !"

అను నాందీపద్య కుసుమముతో ప్రారంభించి, యింపగు మణి మయ పుష్పహారమును గూర్చి, శ్రీ వివేకానందునికే గాక, ఆంధ్ర భారతికే ఒక అమూల్యాలంకారముగా సమర్పించినాడీ "బాల సరస్వతి". ఆ బాలగోపాలము, స్త్రీలు - పురుషులు, కవులు — తత్వ వేత్తలు ఏక రీతిని పఠించి ఆనందించదగ్గ రీతి నున్నదీతని కవితా మాధుర్యము. ఆంధ్ర లోక మీ పిన్న వయస్కుని అభినందించుచున్నది; ఇంకను మున్ముందు ఈ కవి కలమున పూయనున్న కవితా గుచ్ఛముల కెదురు జూచుచున్నది. "శతమానం భవతి" అని ఆంధ్ర మహిళ ఆశీస్సులిచ్చుచున్నది.

## మనుస్మృతి

శ్రీ కనకమేడల వెంకటేశ్వరరావుగారి విరచితమైన గేయ కావ్యం. ధర్మ శాస్త్ర గ్రంథంగా కాకుండా హృదయానికి, మేధకూ జరిగే సంఘర్షణ సమన్వయం ఈ కావ్య లక్ష్యం. వెల రూ 0-12-0. వలయువారు కె. వెంకటేశ్వరరావు, 9 రండాల్సు రోడ్డు, మద్రాసు 7 కు వ్రాయవలెను.

## శ్రీరామానందలహరి

బాలకవి శ్రీ రత్నాకర బాలరాజుగారు, శివానందలహరి శ్లోకములందలి భావములు గ్రహించి, శ్రీరామ స్తోత్రపు పద్యములుగా నొనర్చినారు. చక్కటి శైలిలో భక్తిరసభూయిష్ఠమైన పద్యములు గలవు. వెల రూ 0-8-0 దొరుకుచోటు—రావుజీ ప్రెస్, భద్రిబిల్డింగ్సు, అనంతపురం.

## "క్షేత్రయ్యపదాభినయ ప్రచారసమితి"

విశాఖపట్నంలో శ్రీ విస్సా అప్పారావుగారు, శ్రీ వడ్డాది బాపిరాజుగారు తదితర ప్రభుతులు, కళాభిమానులు స్థాపించిన సమితి.

కూచిపూడి భాగవతులుకు పేరందిన మన నృత్య కళ అంతరించిపోతున్న దినాల్లో ఒక కళా నికేతనాన్ని స్థాపించి, కళారాధకులను సమావేశపరచి, శాస్త్రీయ నృత్యాన్ని ప్రచారంలోకి తీసుకు రావడం ఆశయంగా పెట్టుకుని స్థాపించబడ్డ సమితి యిది. ఆంధ్రులందరి యొక్క ఆదరాభిమానాలు కోరుతూంది.

కె. సుగుణమణి.



# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ, కాశీ విశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్మీడియెట్, ఇ.యస్.ఎల్.సి., పరీక్షలు. |
| పారిశ్రామిక విద్యాలయము (గవర్నమెంటువారిచే రికగ్నైజ్ చేయబడినది) | : కుట్టు, ఎంబ్రాయిడరీ, ఊలు, అల్లికలు, నూలు వడకుట. చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. బీద విద్యార్థినులకు ఉచితము. |
| వస్త్రములపై అద్దకపుపని మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత. | : భారత ప్రభుత్వ పునరావాసశాఖవారిచే ఆంధ్రమహిళా సభలో నడుపబడుచున్నవి. |
| టెక్నికల్ ఇన్స్టిట్యూట్ | : స్త్రీలకు టైపు,—గవర్నమెంట్ పరీక్షలకు శిక్షణ. |
| మహిళా మందిరము | : స్త్రీవిద్యార్థినులకు వసతిగృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యావ్యాప్తికై, స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాసపత్రిక. |
| నిర్మలాదేవి గ్రంథాలయము | : సభ్యురాండ్ర, విద్యార్థినుల ఉపయోగార్థము సేకరించిన తెలుగు, హిందీ, ఆంగ్ల గ్రంథ సముదాయము. |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ, శిశువుల, సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్యశాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్‌ఎయిడ్— మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. |
| ముద్రణాలయము | : ఆంధ్ర మహిళా సభవారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగు, ప్రూఫ్ రీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. |

క్రీడా, క్లబ్బుశాఖలు.

సభ్యురాండ్రుగా చేరి, యీ జాతీయ సంస్థను పోషించండి.